
సదాశివ సమారంభాం
గురు దక్షిణామూర్తి
గురు వేదవ్యాస మహర్షి
గురు శుక మహర్షి
గురు నారద మహర్షి
గురు వాల్మీకి మహర్షి
గురు శ్రీకృష్ణ
శంకరాచార్య మధ్యమాం
గురు దత్తాత్రేయ
గురు బాబాజీ
గురు గౌతమ బుద్ధ
గురు ఆదిశంకరాచార్య
గురు రామానుజాచార్యులు
గురు జ్ఞానేశ్వర్
గురు రవిదాస్
గురు కబీర్ దాస్
గురు చైతన్య మహా ప్రభువు
గురు నానక్
గురు రాఘవేంద్ర స్వామి
గురు వీరబ్రహ్మేంద్ర స్వామి
యోగి వేమన
అస్మదాచార్య పర్యంతాం
గురు త్రైలింగ స్వామి
గురు లాహిరి మహాశయ
గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి
గురు వివేకానంద
గురు సాయి బాబా
గురు అరబిందో
గురు రమణ మహర్షి
గురు యోగానంద
గురు భక్తివేదాంత ప్రభుపాద
గురు మళయాళస్వామి
గురు విద్యాప్రకాశానందగిరి
గురు చంద్రశేఖర పరమాచార్య
వందే గురుపరంపరాం..

నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి. కనుక తమవంతుగా భక్తి, జ్ఞాన, ధర్మ ప్రచారార్థం మహానుభావులైన శ్రీ చిన్న జీయర్ వెబ్ సైట్ వారు ఉచితంగా విలువైన మాసపత్రికలను ఆన్ లైన్ ద్వారా eBOOK(PDF) రూపంలో అందిస్తున్నారు.వారు చేస్తున్న జ్ఞాన యజ్ఞానికి సాయి రామ్ కూడా తమవంతుగా సహాయం చేసే కార్యక్రమంలో భాగంగా వారి గ్రంధాలను సాయి రామ్ ద్వారా కూడా అందచేస్తున్నాము, ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం చేసిన ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in),మైక్రోసాఫ్ట్ సైట్(http://www.microsoft.com) వారికి కూడా మేము ఋణపడివున్నాము. ఈ మాసపత్రికలు క్రొత్తవా లేక పాతవా? అని చూడకుండ, అందులోగల రత్నాలలాంటి విషయాలను తెలుసుకోవటానికి ప్రయత్నం చేయగలరు అని మనవిచేసుకొంటున్నాము..

ఈ మాసపత్రికలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) చిన్న జీయర్ వెబ్ సైట్: http://www.chinnajeeyar.org
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంధ వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.



**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాథ పాద సమర్పణమస్తు *

## చిన్న జీయర్ వారి వెబ్ సైట్

## http://www.chinnajeeyar.org



# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, ఐవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

శ్రీమతే రామానుజాయ నమః

# భక్తినివేదన

ఆధ్యాత్మిక మాసపత్రిక




వికృతి నామ సంవత్సరం పుష్యమాసము

సంపుటి 63 జనవరి 2011 సంచిక 10


వ్యవస్థాపకులు

పరమహంస పరివ్రాజకాచార్య

శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జీయరుస్వామివారు

సంపాదకులు :

శ్రీ ఉ.వే.శ్రీమాన్ T.P. శ్రీరామచంద్రాచార్యులు

## విషయ సూచిక



## పండుగలు - పంచాంగ వివరాలు

### జనవరి - 2011

4. శూన్యతిథి, పిండపితృయజ్ఞము, అమావాస్య
11. ఉత్తరాషాఢకార్తె
14. భోగి పండుగ, గోదాకళ్యాణం, మకర సంక్రమణం రా 11.37
15. మకర సంక్రాంతి, ఉదయాది ఉత్తరాయణ పుణ్యకాలము, స్మార్తానామేకాదశి
16. కనుమ, కూర్మద్వాదశి, వైష్ణవానామేకాదశి
17. శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ పెద్ద జీయరు స్వామివారి పరమపదోత్సవము
22. తిరుమళిశైయాళ్వార్ తిరునక్షత్రం
24. శ్రవణకార్తె
25. తిథిద్వయం, కూరత్తాళ్వాన్ తిరునక్షత్రం దేవాలయ గృహాదులయందు ప్రబంధ ఆరంభం
26. రిపబ్లిక్‌డే
28. అవమతిథి
29. స్మార్త ఏకాదశి
30. వైష్ణవానామేకాదశి, గోపాలాచార్యస్వామివారి తిరునక్షత్రం.

### ఫిబ్రవరి

1. కృష్ణాంగారక చతుర్దశి, మాసశివరాత్రి
2. పిండపితృయజ్ఞము, అమావాస్య
3. త్రిద్యుస్పృక్
6. ధనిష్ఠకార్తె
7. శూన్యతిథి
8. వసంతపంచమి
10. రథసప్తమి


Printed & Published by H.H. Tridandi Chinna Srimannarayana Ramanuja Jeeyar Swamiji on behalf of **Jeeyar Educational Trust** and Printed at **Sriman Printers & Processors** C/o JET, Sitanagaram-522 501, Guntur Dist., Andhrapradesh. **Published at** C/o JET, Sitanagaram-522 501 Guntur Dist, Andhrapradesh, Editor: Sri **T.P.Sriramachandracharya** S/o. Sri Sitaramacharyulu, No: 5-74, Ayodhya, Visakhapatnam-28, Andhrapradesh.

మీ సేవలో....

**భక్తినివేదన,** సీతానగరం - 522 501, గుంటూరు జిల్లా, ఆంధ్రప్రదేశ్. 08645 272929,

**చందావివరాలు:-** సంవత్సరచందా రూ.50*/- జీవితచందా రూ.500/-,
విదేశాలకు సంవత్సరచందా $ 30*/-

* క్రొత్తగా సంవత్సర చందాదారులుగా చేరువారు సభ్యత్వ నమోదు, రూ.30/-లు (విదేశాలకు $5) అదనంగా చెల్లించవలెను. ఆపై ప్రతి సంవత్సరం సకాలంలో వార్షిక చందా చెల్లించిన చాలు.

E-mail : jetsitanagaram@yahoo.com Internet : www.chinnajeeyar.org

D.T.P. & Design by : పరిశోధనాలయమ్,

ముద్రణ : శ్రీమాన్ ప్రింటర్స్ & ప్రోసెసర్స్, సీతానగరం

సంపాదకీయం

# అతిప్రేమలు - అస్థానశంకలు

పుంసాం మోహనరూపుడు శ్రీరామచంద్రుడు సర్వసత్త్వ మనోహరుడు. సామాన్య మానవులు జితేంద్రియులై తపశ్శాలులైన మహర్షులు, శూర్పణఖ వంటి రాక్షసస్త్రీలు అందరూ శ్రీరాముని అందానికి మోహపడినవారే.

ముక్కుచెవులు తెగి రక్తమోడుతూన్న శూర్పణఖ రాముని అందాన్ని మరవలేక 'పుండరీక విశాలాక్షౌ" అంటుంది. (రామలక్ష్మణులిద్దరినీ కలిపి) హనుమ 'సర్వ సత్త్వ మనోహరుడు, కమలపత్రాక్షుడు రాముడు' అంటాడు.

ఋషులు శ్రీరాముని పురుషమోహనమైన అందాన్ని చూచి మోహపడి మరుజన్మలో గోపికలుగా అవతరించినారంటాయి పురాణాలు.

ఇట్లాంటి రాముని లక్ష్మణస్వామి చూచి మోహపడడంలో ఆశ్చర్యం ఏముటుంది? ఆయన వెంట నడిచి సకల కైంకర్యములూ సమర్పించినాడు. ఆలిని, అయోధ్యను, తల్లిని విడిచి రామునివెంట అడవులకేగినాడు.

వీరి మాటలేమిగాని బోయజాతివాడు గుహుడు. శ్రీరాముడంటే ప్రాణం ఇచ్చేవాడు. ఎంత ప్రేమ వానికి శ్రీరామునిపై!

లక్ష్మణస్వామి శ్రీరాముని దక్షిణ బాహువుగా, బహిఃప్రాణముగా ప్రశంసింప బడినవాడు. అట్లాంటి ప్రేమమూర్తిని శంకిస్తాడు గుహుడు. అయోధ్యనుండి పదునాలుగేళ్ళ అరణ్యవాసానికి బయలువెడలి శృంగిబేరపుర ప్రాంతన ఆ రేయి విశ్రమించినాడు శ్రీరామచంద్రుడు.

సీతారాములు నిద్రిస్తున్నారు. శరచాపాసిపాణిగా హెచ్చరికతో కళ్ళలో వత్తులు వేసుకొని కాపలా కాస్తున్నాడు (సీతారాములకు) లక్ష్మణస్వామి. ఏ కాస్త ఏమరినా ఏమి జరిగిపోతుందో, అనుకొని జాగరూకుడై ఉన్నాడు.

ఇక గుహుడు. నగర బహిష్కారం కావించి వనవాసాలకు పంపాడు ఒక తమ్ముడు, అరణ్యంలోనయినా ఉండనీయక ఇక్కడకూడా ఇక్కట్లు తెచ్చిపెడతావా? ఇక్కడయినా సుఖంగా ఉండనీయవా? నువ్వు శ్రీరామునిపట్ల ఏదైనా ద్రోహం అంటూ తలపెట్టేవా? నీ పని సరి అనుకో అని లక్ష్మణుని గురించి మనసులో భావించి శరచాపాసిహస్తుడుగా గుహుడు స్వామి రక్షకు పూనుకొన్నాడు.

మిగిలిన వారు గుహుని శబరసైన్యం. ఆటవికుడు మన రాజు క్రూరుడు. భరతునితో దోస్తీ కలుపుకొని శ్రీరామునికి ఏమి ఇక్కట్లు తలపెట్టడని నమ్మకం ఏమిటి? అంచేత మనం కాస్త జాగరూకులమై పరిస్థితి విషమించి మన రాజు కాస్త ఏమైనా కీడు తలబెడితే రాజు అని కూడా చూడకుండా వేసేద్దాం. ఇది ఆటవికుల తలపు.

శ్రీరాముని అందానికి మోహపడటం మాత్రమే కాదు, ఆయనకు ఏమి యిక్కట్లు కలిగిస్తారో అని భయం, శంక. చూసీ చూడగానే శ్రీరాముని పట్ల కలిగిన ప్రేమ వీరిలోని అస్థానశంకలకు కారణమయింది. 'అతిస్నేహః పాపశంకీ" అన్నారు. ఈ ప్రేమాతిశయమే ఆ శంకాభయాలకు కారణం.

ఇంతకూ శ్రీరామచంద్రుని సౌందర్యం లోకసామాన్యమైనది కాదు. లోకోత్తరం. అస్థాన శంకా భయహేతువును. అట్లాంటి సౌందర్యాన్ని భావించగలగటం, దర్శించగలగటం జనిశ్రేణీతపఃఫలమే మరి!

- శ్రీరామచంద్రాచార్య

# శ్రీ కలివైరిసూరి వైభవము

**శ్రీ ఉ.వే. శ్రీమాన్ కె.టి. రామానుజాచార్యస్వామి - నెల్లూరు**

*(గత సంచిక తరువాయి)*

**తిరుమంగై ఆళ్వార్ - పెరియతిరుమొழி (బృహత్సూక్తి) 1-6-8**

**ఏవినార్ కలియార్ నలికవెన్నెన్మేల్ ఎజ్గనే వాழ்மాటివర్**
**కోవినార్ శెయ్యుమ్ కొడుమైమై మడిత్తేన్ కుఱుజ్గుడి నెడుజ్కడల్ వణ్ణా**
**పావినారిన్ శొల్ పన్మలర్ కొణ్డున్ పాతమే పరవినాన్ పణిన్దేన్**
**నావినాల్ వన్దున్తిరువడియడైందేన్ నైమిశారణి యత్తుళెన్దాయ్ ।**

***ప్రతిపదార్థము:*** **కురుంగుడి**=తిరుక్కురుంకుడి క్షేత్రమునందు స్వాన్నిధ్యము చేసియున్న; **నెడుం కడల్**=సుదీర్ఘమగు సముద్రమువంటి; **వణ్ణా**=వన్నె (వర్ణము) కలవాడా!; **నైమిశారణియత్తుళ్**=నైమిశారణ్యక్షేత్రమున వేంచేసియున్న; **ఎందాయ్**=మా స్వామీ; **కలియార్**=కలిగారు (కలియుగము); **నలిక**=బాధింపుము; **ఎన్ను**=అని; **ఎన్మేల్**=నాపైని; **ఇవర్**=పంచేంద్రియములను; **ఏవినార్**=ఆజ్ఞాపించినారు; **వాழ்మాఱు**= (ఆ ఇంద్రియములు) బ్రతికెడి విధము; **ఎంగనే**=ఎట్లుగాను; **కోవినార్**=రాజులైన ఆ పంచేంద్రియములుకూడ: **శెయ్యుమ్**=చేయునట్టి; **కొడుమైయై**=క్రౌర్యమును, **మడిత్తేన్**=మరల్చితిని; **ఎన్ నావినాల్**=నా నాలుక చేత; **పావిన్ ఆర్**=ఛందస్సులతో నిండిన; **ఇన్**=మధురమైన శబ్దములతో; **ఉన్పాదమే**=నీ శ్రీపాదములనే; **పరవి**=స్తోత్రము చేసి; **పణిన్దు**=నమస్కరించి; **వన్దు**=వచ్చి; **ఉన్**=నీయొక్క; **తిరువడి**=శ్రీచరణారవిన్దము లను; **అడైన్దేన్**=ఆశ్రయించితిని.

***తా॥*** తిరుక్కురుంగుడి క్షేత్రమందు వేంచేసియున్న జలనిధి శ్యామవర్ణుడా! నైమిశారణ్యక్షేత్రాధినాథుడా! కలిపురుషుడనే మహారాజు నన్ను (తిరుమంగై ఆళ్వార్లను) బాధింపమని పంచేంద్రియములను, నాపైకి పంపెను. కాని ఆ కలిపురుషునకు బ్రతికియుండుటకు ఇక దారిలేనేలేదు. మధురమగు వాఙ్మయ పుష్పమాలికను జిహ్వాగ్రమున గొని నీ దివ్యచరణారవిందములనే నుతించుచు నిన్నే ప్రణమిల్లితిని. ఆ పంచేంద్రియముల దౌష్ట్యమును అణచివేసితిని. మనోజ్ఞములగు నీ శ్రీచరణముల నాశ్రయించితిని.

***విశేషార్థము :*** "తొన్నెరికేట్టే తుళంగినేన్" నరకమార్గమును గూర్చి వినినంతనే భయకంపితుడనైతిని' అనిన తిరుమంగై ఆళ్వార్లు గతపాశురమున సర్వేశ్వరునిలోని

“ఆశ్రితుల విరోధినిరసనమనెడి” స్వభావమును తలచి తాము భయరహితులై ఉన్న విధమును ఈ పాశురమందు ప్రతిపాదించుచున్నారు.

**ఏవినార్ కలియార్ :** కలికాలమునకు భయపడి ఆళ్వార్లు కలిపురుషుని “కలియార్” అని బహువచనమున సగౌరవముగ తెలుపుచున్నారు. కలిపురుషుడు నన్ను బాధింపమని పంచేంద్రియములను నాపై త్రోలినాడు.

**ఎంగనే వా౹మాఌ :** పంచేంద్రియములకు వశ్యులైనవారు ఇక సుఖముగ ఎచ్చట జీవించగలరు? పంచేంద్రియములను ప్రేరేపించినంత మాత్రమున ఏమియగును అని అందురేమో? వినుడు.

**ఇవర్ ఇత్యాది:** ఇంద్రియములు మనస్సునకు విధేయములై మనస్సు తెలిపినట్లు ప్రవర్తించవలసియుండగ అవి అందులకు భిన్నముగ ప్రవర్తించుచు మనస్సునకు భారమును కలిగించుచున్నవి. (అనగ) ఇంద్రియములు స్వేచ్ఛగ సంచరించుచు క్రూరకృత్యములను ఆశ్రయించిన ధైర్యముతో ఈ ఇంద్రియములను ఇంత స్వేచ్ఛగ విడచివేసితిరి అందురేమో! వినుడు.

**కుఌుంగుడి నెడుంకడల్ వణ్ణా :** స్వపదాశ్రితులయినవారి శ్రమనంతటిని తీర్చివేసెడి దివ్యరూపమును గొని తిరుక్కురుంగుడి క్షేత్రమందు సన్నిహితుడైనందున.

**పావినార్ ఇత్యాది :** చక్కని ఛందస్సుతో కూడినవియు, ఇంపైనవియునగు పలుకులనెడి పుష్పములను గొని క్రమరహితముగ నుతించి నీ శ్రీపాదములను చేరితిని.

**ఎన్ నావినాల్ :** అనర్థములను కలిగించునటువంటి పలుకులనే పలికిన నా నాలుకతో

**నైమిశారణియత్తుళ్ ఎందాయ్ :** మహాత్ములగు వారందరిచే స్తుతింపబడు నీవు నేను చేయు స్తోత్రమునకు పాత్రభూతుడవై నైమిశారణ్యక్షేత్రమందు వేంచేసి నాకు అత్యంతము సన్నిహితుడవైతివి గదా స్వామీ! *(సశేషం)*

శ్రీమతే రామానుజాయ నమః

# తిరుక్కార్తి కై- విశేషములు

ఉ.వే.శ్రీమాన్ ఎన్.వి.ఎల్.ఎన్. రామానుజాచార్యస్వామి- నరసాపురం

నమ్మాళ్వార్ల అనుగ్రహించిన నాలుగు ప్రబంధములు నాలుగు వేదములయొక్క సారభూతములు. కావుననే వానికి ద్రావిడ వేదసాగరమని పేరు. వానిలో తిరువిరుత్తము ఋగ్వేదస్థానీయము, యజుర్వేద స్థానీయము తిరువాశిరియము, అధర్వణవేద స్థానీయము పెరియతిరువన్దాది, సామవేద స్థానీయము తిరువాయ్‌మొళి. తిరుమంగైయాళ్వార్లు అనుగ్రహించిన పెరియ తిరుమొళి, తిరుక్కురున్దాణ్డగమ్ తిరునెడున్దాణ్డగమ్ తిరువెళుక్కూత్తిరుక్కై, శిరియ తిరుమడల్, పెరియ తిరుమడల్ అను ఆరు ప్రబంధములు వేదాంగస్థానీయములు. తక్కిన పెరియాళ్వార్లు మున్నగువారు అనుగ్రహించిన పెరియాళ్వార్ తిరుమొళి మొదలైన దివ్యప్రబంధములు ఉపాంగములు. ఈవిధముగా నాలాయిర దివ్యప్రబంధములు సాంగోపాంగముగా వేదార్థప్రకాశకములై ద్రవిడవేదముగా ప్రసిద్ధి చెందినవి. ఈ విషయమును మార్కండేయ పురాణోత్తరఖండము ఇట్లు చెప్పుచున్నది.

**శ్లో॥ సంస్కృతశ్రుతయో యద్వత్ ద్రావిడశ్రుతయ స్తథా ।**
**నిత్యా స్తద్వత్ ప్రణీయన్తే మునిభిస్తు కలౌకలౌ ॥**

**వేదాశ్చ వేదగాథాశ్చ నిత్యా ద్రావిడసమ్మతాః ।**
**కలౌకలౌప్రణీయంతే కృపయా జ్ఞానయోగిభిః ॥**

**ద్వాపరాన్తే యథా వ్యాసో వేదవిద్యాం ప్రణేష్యతి ।**
**తద్వ న్నిత్యాత్మభూ గాథాః ప్రణేష్యతి...॥**

సంస్కృత వేదములవలె ద్రావిడవేదములున్ను నిత్యములు. ప్రతికలియందు లోకోద్ధరణకై జ్ఞానప్రధానులైన పరాంకుశాది మునులచేత ప్రకాశింప చేయబడుచున్నవి. ద్వాపరాంత మందు వ్యాసమహర్షి వేదవిభాగంచేసినట్లు భగవన్నిర్హేతుక కటాక్షలబ్ధ దివ్యజ్ఞానము కల శ్రీశఠకోపమునీంద్రులవారు ద్రావిడవేదములును ప్రకాశింప చేయగలరు.

ఇంతేగాక సంస్కృతవేదమునకువలె ద్రావిడవేదమునకును ఉపక్రమో త్సర్జనములు పురాణ సిద్ధములై యున్నవి.

**"తైష్యాం సూర్యర్క్షే ద్రావిడీ మధీయీత। ఊర్జే హ్యగ్న్యర్క్షే హ్యుత్సర్జనమ్॥"** **"గీర్వాణమయ వేదస్య తైష్యశ్రావణ పర్వయోః। యథా ప్రోక్తా మహారాజ సముత్సర్జన సంగ్రహౌ। ద్రావిడ శ్రుతిబృందస్య కార్తికీ మార్గశీర్షయోః। పర్వవద్దినయోరేవ సముత్సర్జన సంగ్రహౌ। వృశ్చికేమాసి పూర్ణాయాం దీపారోపణ మాచరేత్। తత్రైవ శఠకోపాది సూక్తీనాం శాంతిమాచరేత్ ।"** ఇత్యాదులు ఇందుకు ప్రమాణములు. పుష్యమాసములో అనగా మకరమాసములో హస్తానక్షత్రమున ద్రావిడ వేదాధ్యయనమును ప్రారంభించవలెను. కార్తీక మాసము అనగా వృశ్చికమాసమున ఉత్సర్జనము. సంస్కృతవేదమునకు పుష్య శ్రావణమాస పర్వములలో ఉత్సర్జన ప్రారంభములు చెప్పబడిపట్లు ద్రావిడ వేదమునకు కార్తీక లేక మార్గశిరములుమాస పర్వములయందు అనగా వృశ్చిక, మకరమాసములందు ఉత్సర్జన ప్రారంభములు చెప్పబడినవి. వృశ్చికమాసములో పూర్ణిమనాడు దీపారోపణమును చేయవలెను. ఆనాడు శఠకోపాది మునీంద్రు లను గ్రహించిన దివ్యప్రబంధమునకు శాన్తిని చేయవలెను." అని సంస్కృతవేదమునకువలె ద్రావిడ వేదమునకును ఉత్సర్జన ఉపక్రమములు చెప్పబడినవి.

**వృశ్చికే మాసి పూర్ణాయాం దీపారోపణ మాచరేత్ ।**
**పరేతత్ర ప్రబంధానాం సమాపన మథాచరేత్ ॥**

**రోహిణ్యాం వాసుదేవస్య వృశ్చికే మాసి పర్వణి ।**
**అర్థమణ్డలవేళాయాం దీపారోపణ మాచరేత్ ॥**

**తత్రైవ శఠకోపాది సూక్తీనాం శాన్తి మాచరేత్** అని వృశ్చిక మాసమున పూర్ణిమనాడు దీపారోపణము చేయవలయుననియు మరునాడు దివ్యప్రబంధ నిగమనము చేయవలెను. వృశ్చికమాసమున పూర్ణిమదివసమున రోహిణీనక్షత్రము నాడు అర్థమణ్డలసమయమున దీపారోపణము చేయవలెను. అపుడే శఠకోపాది మునీంద్రులయొక్క ప్రబంధములకు శాన్తిచేయవలెను అనియు చెప్పటగలదు.

ఇట్లు ఉత్సర్జనము మొదలు ఉపక్రమమువరకునుండు సమయము అనధ్యయనకాలము. ఆసమయములో నాలాయిర దివ్యప్రబంధములో చేరిన వానిని అనుసంధించరాదు. తక్కిన ప్రబంధములను అనగా నాలాయిరములో చేరని తిరువాయిమొN నూత్తన్దాది, ఉపదేశరత్తినమాలై మున్నగు ప్రబంధములను అనుసంధింపవచ్చును.

మరియు ధనుర్మాసమున ముప్పదిరోజోలు ధనుర్మాససమయమున తిరుప్పళ్ళి యెழுச్చి, తిరుప్పావై ప్రబంధములను వ్రతాంగముగా అనుసంధింప వచ్చును. తక్కిన సమయములలో వానిని అనుసంధింపరాదు.

ఈ విషయమును తిరుక్కార్తిక్కై పర్వత్తిల్ రోహిణియిల్ ప్రబంధనిగమనం పణ్ణి తిరుమ్బి కూరత్తాళ్వాన్ తిరునక్షత్రత్తళవుమ్ తిరువాయిమొNయై అనుసంధిక్కక్కూడాతు. శిన్దైయాలుమ్ శొల్లాలుమ్ శెయ్‌కయినాలుమ్ నినైక్కవుమ్ శొల్లవుమ్ శెయ్‌కైయుమ్ వేణ్డాతు. శెయ్‌కై–ఎళుతుకై అని అనుష్ఠాన రహస్యము స్పష్టపరచినది. అనగా– కార్తీకమాసమున అనగా వృశ్చిక మాసమున పూర్ణినాడు రోహిణీ నక్షత్రమున ప్రబంధనిగమనమునుచేసి తిరిగి కూరత్తాళ్వాన్ తిరునక్షత్రమునాటి వరకు అనగా మకరమున హస్తానక్షత్రమువరకు తిరువాయిమొళిని అనుసంధింపరాదు. (తిరువాయిమొNని ఆనుసంధింపరాదనగా తక్కిన ప్రబంధము లను అనుసంధింపరాదనుటయే ఎట్లనగా తిరువాయిమొN అంగి ప్రబంధమగుట చేతను తక్కిన ప్రబంధములు అంగములగుటచేతు అంగిని అనుసంధింపరాదనుటచే అంగప్రబంధములను అనుసంధింపరాదనుట సిద్ధించుచున్నది.) మనస్సుచేతను, వాక్కుచేతను చేతలచేతను తలచుట, చెప్పుట, చేయుట చేయరాదు. ఇచట చేయుట అనగా వ్రాయుట అని అర్థము.

**తైష్యాం పౌర్ణమాస్యాం రోహిణ్యాం వా విరమేత్** అని యుండుటచే రోహిణీ నక్షత్రమునాడు ఉత్సర్జనము. శ్రావణ్యాం అధ్యాయ ముపాకృత్య అనుటచే శ్రావణ పౌర్ణమినాడు ప్రారంభము. తిరువాయిమొN అంగి ప్రబంధమై సామవేద స్థానమగుటచేత హస్తర్షే సామవేదినః అనునట్లు సామవేదులకు హస్తానక్షత్రము ఉపాకర్మ యగుటచే హస్తానక్షత్రమే దివ్య ప్రబంధమునకును అధ్యయన ప్రారంభ కాలమని పెద్దల నిర్ణయము..

సారాంశ మేమనగా దివ్యప్రబంధము వేదముతో సమానమగుటచే వేదమునకు వలె ఉత్సర్జన ఉపక్రమములు ద్రావిడ వేదమునకును కలవు. అవి వృశ్చికమాసమున రోహిణీనక్షత్రమున ఉత్సర్జనము. మకరమాసమున హస్తా నక్షత్రమున ఉపక్రమము. ఈమధ్యకాలము అనగా "వృశ్చికరోహిణినుండి మకరము హస్తానక్షత్రమువరకుగల కాలము అనధ్యయనకాలము". ఈ సమయములో నాలాయిర దివ్య ప్రబంధములో చేరిన ప్రబంధములను అనుసంధింపరాదు. ఆసమయమున మణవాళమహాామునులు

అనుగ్రహించిన తిరువాయిమొN నూత్తన్దాది ఉపదేశరత్తినమాలై ప్రబంధములను అనుసంధానము చేయవలెను.

అట్లే తిరువారాధనలోని పాశురములను మాత్రము యథాప్రకారము వేదసూక్తములతో సమానముగా అనుసంధింపవచ్చును.

ధనుర్మాసములో తిరుప్పళ్ళియెళుచ్చి తిరుప్పావై ప్రబంధములను ధనుర్మాస సమయమున మాత్రమే అనుసంధానము చేయవలెను. ఇతర సమయములందు అనుసంధానము చేయరాదు. ఈ విషయములను గమనించి తదనుగుణముగా ప్రబంధాధ్యయనమును చేసి భగవదనుగ్రహమును పొందదగును.

**విశేషము:** దివ్యస్థలములలో మాత్రము వృశ్చిక రోహిణినుండి ప్రారంభమైన అనధ్యయనము వైకుంఠ ఏకాదశినుండి ప్రారంభమగు అధ్యయనోత్సవముతో పరిసమాప్తి యగును. గృహములలో మాత్రము మకరమాసమున హస్తానక్షత్రము వరకు అనధ్యయనకాలము అని పెద్దల నిర్ణయము ఆచారమును అట్లే కొనసాగుచున్నది.

***ఇంకను విశేష వివరణములు కావలసినవారు అనుష్ఠాన రహస్యములో చూడవచ్చును.***



"అహో! భారతమ్"

# గరుడోపాఖ్యానము

శ్రీమతి డా॥ టి.కె.చూడామణి-విజయవాడ

*(గత సంచిక తరువాయి)*

గరుడుడు మహావేగంతో ఎగిరాడు. ఆ వేగానికి సముద్రజలం ఎగిరి నిషాదులు బయటపడ్డారు. వారిని మింగడానికి తన పెద్దనోరు తెరిచాడు. వేలకొద్దీ నిషాదులు అతని నోట్లో పడిపోయారు.

ఆ సమయంలో ఉన్నట్లుండి గొంతులో బాధ. తల్లిమాటలు గుర్తుకు వచ్చాయి. 'నాకంఠంలో బ్రాహ్మణుడుంటే బైటకి రావాలి' అన్నాడు.

కంఠంలో ఉన్న బ్రాహ్మణుడు 'నాయనా! నా భార్య నిషాది. మరి ఆవిడ మాటేమిటి? ఆవిడని విడచి నేనెలా రాగలను?' అన్నాడు.

'అబ్బా! ఇద్దరూ వచ్చేయండయ్యా!' అన్నాడు గరుడుడు. అమ్మయ్యా అనుకుంటూ బ్రాహ్మణుడు భార్యతో బైటికి వచ్చి వైనతేయుని ఆశీర్వదించి వెళ్ళిపోయాడు.

గరుడుడు ఆకాశమార్గాన ఎగిరి తండ్రి దగ్గరకు పోయి నమస్కరించి... 'తండ్రీ! నిషాదులతో నా ఆకలి తీరలేదు. నాకు వేరే ఆహారం ఏదైనా చూపించండి!' అని ప్రార్థించాడు.

అప్పుడు కశ్యప ప్రజాపతి కొడుకుతో 'నాయనా! ఒక పెద్ద సరస్సుంది. ఆ సరస్సులో ఒక పెద్ద ఏనుగు, పెద్ద తాబేలు ఉన్నాయి. అవి ఎప్పుడూ దెబ్బలాడుకుంటూనే ఉంటాయి... ఎందుకో తెలుసా.. అదొక పెద్ద కథ. విను...

పూర్వం విభావసుడు అనే మహర్షి ఉండేవాడు. ఆయనకి చెప్పలేనంత కోపం. ఆయనకో తమ్ముడుండేవాడు. పేరు సుప్రతీకుడు. మహాతపస్వి. అతనికి తన ఆస్తి అన్నగారి ఆస్తితో కలిసి ఉండడం ఇష్టం లేదు. అందువల్ల 'అన్నయ్యా! నా వాటా నాకు ఇచ్చెయ్!' అని అడిగాడు. అన్నకి కోపం ఎక్కువ కదా! 'ఎందుకురా... ఎవరు చెప్పారు? నీ సలహా... పనిపాట లేనివాళ్ళు చెప్పడం. నువ్వు అడగడం పంచుకొంటే మనం విడిపోయామని లోకువగా చూస్తారు తెలుసా! అయినా ఇలా వచ్చి మాటిమాటికీ అడుగుతున్నావు కాబట్టి తరువాత జన్మలో ఏనుగువై పుట్టు' అని శపించాడు. నిర్ఘాంతపోయాడు సుప్రతీకుడు. 'నేనేమైనా తప్పు మాటన్నానా? నా భాగం నాకివ్వమంటే అంత కోపమా! అయితే నువ్వు కూడా తరువాత జన్మలో తాబేలుగా పుట్టు' అని ప్రతిశాపమిచ్చాడు.

ఎంతటి మూర్ఖత్వం. ఎటువంటి వాళ్ళు కూడా ఈ కోపాన్ని జయించలేక పోతున్నారే. అదుగో, ఆ ఇద్దరన్నదమ్ములే ఈ చెరువులో ఉండే గజకచ్ఛపాలు. జంతు జన్మలో కూడా వారి ద్వేషం పోలేదు. ఆ సరస్సులో ఎప్పుడూ దెబ్బలాడు కుంటూనే ఉన్నాయి. ఏనుగు ఆరుయోజనాల ఎత్తు. పన్నెండుయోజనాల పొడుగు. తాబేలు మూడు యోజనాల వెడల్పు, పది యోజనాల చుట్టు కొలత. ఎప్పుడూ యుద్ధం చేసుకుంటున్న ఆ రెండింటిని నువ్వు ఆహారంగా స్వీకరించు' అంటూ ఆకలి తీరే ఉపాయం చెప్పాడు.

గరుత్మంతుడు తండ్రి చెప్పిన సరస్సు దగ్గర చేరాడు. ఒక గోటితో గజాన్ని, ఒక గోటితో కచ్ఛపాన్ని పట్టుకొని ఎగిరాడు. "అలంబతీర్థ"మనే ప్రదేశం చేరాడు. ఎక్కడ ఆహారం తినడానికి అనువుగా ఉంటుందా! అని వెదికాడు.

"రోహిణము" అనే గొప్పచెట్టు ఒకటి గరుడుని రాక చూచింది. అయ్యా! నా కొమ్మ వందామడల పొడవుంది. దానిపై వ్రాలి ఆహారం తీసుకో అంది. సరేనని ఆ కొమ్మపై వ్రాలాడు. అంతే భళ్ళుమంటూ ఆ కొమ్మకాస్తా విరిగి పోయింది. ఆ కొమ్మ మీదుండే పక్షులన్నీ కకావికలైపోయాయి. ఆ కొమ్మకి తలక్రిందులుగా వ్రేలాడుతూ, సూర్యకిరణాలే ఆహారంగా స్వీకరిస్తూ వాలఖిల్యులనే మహామునులు తపస్సు చేసుకుంటున్నారు. అప్పుడు చూశాడు వారిని గరుత్మంతుడు. అమ్మో! ఈ కొమ్మ భూమిపై పడిపోతే ఈ మహర్షులకెంత బాధ కలుగుతుంది అనుకుంటూ ఆ కొమ్మని ముక్కుతో కరచుకొని ఏనుగుని, తాబేలుని చేతులతో అదిమి పట్టుకొని ఎగురుతూ గంధమాదన పర్వతంలో తపస్సు చేసుకుంటున్న తండ్రిని చేరాడు.

కశ్యపప్రజాపతి పుత్రుణ్ణి చూశాడు. ఏం రూపం? ఏం బలం? మహర్షులతో ఉన్న కొమ్మ ముక్కుతో పట్టావా! రెండు చేతులలో రెండు జంతువులా, ఋషులకి ఏ బాధ కలగకూడదనే ఆలోచనా... అబ్బ గర్వంతో, ఆనందంతో 'మీరే మావాడిని అనుగ్రహించి వేరొకచోటికి వెళ్ళండి' అన్నాడు.

కశ్యపుడు హిమాలయ గుహప్రాంతంలో నిష్పురుషం అనే కొండ ఉంది. అక్కడ ఈ చెట్టుకొమ్మ విడిచి పెట్టెయ్. కానీ అక్కడికి సామాన్యులు వెళ్ళలేరు. అది ఈ గంధమాదన పర్వతానికి లక్షామడల దూరంలో ఉంది అని చెప్తే అలా చేసి హిమాలయాలలో ఆ ఏనుగుని, తాబేలుని తిని ఆకలి తీర్చుకొని గొప్ప వేగంతో ఆకాశంలోకి ఎగిరాడు గరుడుడు.

ఆహా! ఎవరికీ బాధ కలుగకుండా ఏ పని చెయ్యాలన్నా ఎంత కష్టపడాలి? ఎంత శక్తి సహకరించాలి. ఎంత సహనం ఉండాలి. అందునా ఆకలి బాధ తీర్చు కోవడానికి గరుత్మంతుడంతటివాడే ఎంత కష్టపడవలసి వచ్చింది? శక్తిసామర్థ్యాలున్నా సమయానుకూలంగా సహనంగా పనిని సాధించుకొనడంలో ఎన్ని సాధక బాధకా లుంటాయి. *(సశేషం)*

# అర్చామూర్తి వైభవము

శ్రీమాన్ సముద్రాల శఠగోపాచార్యస్వామి-వరంగల్

పరాత్పరుడైన శ్రీమన్నారాయణుడు వైకుంఠంలో పరవాసుదేవునిగా, పాల సముద్రంలో వ్యూహవాసుదేవునిగా విరాజిల్లుతూ ఉన్నాడు. అంతియే కాక శిష్ట రక్షణకు, దుష్టశిక్షణకు ధర్మసంస్థాపనకు రామకృష్ణాది అనేకావతారములను ఎత్తియున్నాడు. దయాసముద్రుడైన భగవానుడు ప్రాణికోటిలో స్వరూప స్థితి ప్రవృత్తులను కలిగించి వారిని సద్విషయములలో నియమించుటకై అంతర్యామిగాను వేంచేసి యున్నాడు.

పరవ్యూహములు ఈ శరీరంతో పొందలేనివి. భగవంతుడు వివిధ అవతారములనెత్తి అనుగ్రహింపబూనినప్పుడు మనము ఏ రూపంలో ఏ స్థితిలో ఉన్నామో– భగవదనుగ్రహ భాగ్యాన్ని పొందలేకపోయాము. 'అంతార్యమి' స్వరూపమును అష్టాంగ యోగులు మాత్రమే దర్శించగలరు. వారు మాత్రమే 'అంతర్యామి'ని ఉపాసిస్తారు.

ఇక భక్తులు భగవంతుని ఆశ్రయించి తరించుటకు అర్చావతారము ఒక్కటే సులభమైనది.

ఆలయములలో గృహాలలో విగ్రహరూపముతో దర్శనమిస్తూ, సర్వసులభుడై ఆరాధనాదులను స్వీకరించు రూపమునే 'అర్చామూర్తి'గా వ్యవహరిస్తారు.

ఆ పరమపదములో పాలకడలలో వేంచేసియుండే స్వామియే శ్రీరంగం, వేంకటాచలం, కాంచీ, యాదవాద్రీ మొదలైన 108 దివ్యక్షేత్రములలో అట్లే వివిధ నగరాల్లో గ్రామాల్లో ఉండే దివ్యాలయాల్లో ఆగమ శాస్త్రానుసారం ప్రతిష్ఠింపబడిన అర్చావిగ్రహములలోనూ వ్యాపించియుండును. భక్తులు కోరుకున్న రూపమునే, అలంకారమునే, వాహనసేవనే తనకు కూడా అభీష్టంగా భావించును. అర్చక పరాధీనమై సకల విధి ఉపచారములను స్వీకరించును. భక్తుల కోరికలను తీరుస్తూనే, జగద్రక్షణ కార్యమును నిర్వహించును. అట్టి అర్చారూపియైన లక్ష్మీపతికి ప్రణామము అని పేర్కొంటూ వాత్స్య వరదాచార్యులవారు ప్రసాదించిన పరత్వాది పంచకములోని అర్చా స్తుతిరూపమైన....

**"శ్రీరంగస్థల వేంకటాద్రి కరిగిర్యాదౌ శతేష్టోత్తరే**
**స్థానే గ్రామనికేతనేషు చ సదా సాన్నిధ్య మాసేదుషే ।**

**అర్చారూపిణ మర్చకాభిమతిత స్స్వీకుర్వతే విగ్రహం**
**పూజాం చాఖిల వాంఛితాన్ వితరతే శ్రీశాయ తస్మై నమః ॥**

అను శ్లోకము మనకందరకు ప్రాతర్నిత్యాను సంధేయమైనట్టిది.

అష్టోత్తర శత దివ్యదేశములలో వేంచేసియుండే అర్చామూర్తుల విషయములో ఆళ్వారులు, ఆచార్యులు శరణాగతి చేసినారు. పదుగురాళ్వార్లు శ్రీరంగం, తిరుమల, కాంచీ, తిరునారాయణపురం మొదలైన దివ్యదేశాలలో ఉండే అర్చామూర్తులకు మంగళాశాసనం చేస్తూ గానం చేసిన పాశురాలు నాలాయిర దివ్య ప్రబంధములలో మనకు దర్శనమిస్తాయి.

సేవకులు ప్రభువుకు రాచమర్యాదలను, రాజోపచారములను చేసినట్లే భక్తులు అర్చామూర్తి విషయంలో భక్త్యుపచారములను సమర్పించవలెను. తల్లి తన శిశువులను ఏ విధంగా ప్రేమతో ముఖప్రక్షాళన, స్నానాద్యుపచారములను నిర్వర్తించునో, అన్నపానాదులను సమకూర్చునో, అట్లే ఆరాధకులు కూడా అర్చామూర్తికి పరిశుద్ధమైన మనస్సుతో సర్వోపచారములను సమర్పించుటయే పరమ ప్రయోజనముగా భావించ వలెను. ఆ విధంగా భక్తితో తనకు సమర్పించే పత్రపుష్పాదులనే అర్చామూర్తి ప్రీతి పూర్వకంగా స్వీకరించును.

**యాః క్రియాః సంప్రయుక్తాస్స్యుః ఏకాన్తగత బుద్ధిభిః ।**
**తా స్సర్వాః శిరసాదేవః ప్రతిగృహ్ణాతి వై స్వయమ్ ॥**

భక్తులు త్రికరణశుద్ధిగా ఏ కైంకర్యాదులను చేయుదురో వాటిని అన్నింటిని అర్చామూర్తిగా శిరసావహించును.

అంతేకాక భక్తితో సమర్పించినది అతి స్వల్పమైనను, అణువంత పదార్ధమైనను అది అర్చామూర్తికి భోగ్యమగును. భక్తి లేకుండా సమర్పించినట్టిది. ఎంత పెద్దదైనను, ఎంతో విలువైనదైనను అది తనకు భోగార్హము కాదని పరమాత్మయే ప్రకటించినాడు. అనే విషయము –

**అణ్వపి ఉపహృతం భక్తైః మమ భోగాయ జాయతే ।**
**భూర్యపి అభక్తోపహృతం నమే భోగాయ జాయతే ॥**

అనే ప్రామాణిక శ్లోకము ద్వారా వెల్లడగుచున్నది.

ఎవరు ఎంతటి శ్రద్ధాభక్తులతో నన్ను ఆశ్రయిస్తారో వారిని కూడా నేను అంతటి ప్రీతితోనే పొందుతాను.

**యే యథా మాం ప్రపద్యన్తే**

**తాం స్తథైవ భజామ్యహమ్ ॥** అని భగవద్గీతలో శ్రీకృష్ణ పరమాత్మ పేర్కొన్న శ్లోకఖండము అర్చామూర్తియొక్క ప్రీతిపూర్వకమైన ఆరాధననే విధించుచున్నది.

కూరత్తాళ్వాన్ వరదరాజస్తవంలో ఎవడు అనన్యమైన మనసుతో భక్తిపూర్వకంగా భగవంతుని ఆశ్రయించునో అట్టి ఆశ్రితుని గూర్చి పరమాత్మ ఇతడు ఇట్టివాడు ఇంతటివాడు అని లెక్కించడు. పైగా ఆశ్రితుని గరుత్మంతునితో సమానంగా ఆదరించును.

**యః కశ్చిదేవ యది కించన హన్త! జన్తుః**
**భవ్యో భజేత గ వన్త మనన్య చేతాః ।**
**తం సోయ మీదృశ ఇయానితి వాప్యజానన్**
**హై వైనతేయ సమమప్యురరీకరోషి ॥** అని కీర్తించిరి.

భగవంతుని ఆరాధించేవారు అందరు కూరేశుల దివ్యసూక్తిని హృదయంలో సుప్రతిష్ఠితమొనర్చుకొని భగవత్కైంకర్యమును ఆచరించవలెను. గృహ తిరువారాధనలో లేక దివ్యాలయములో వేంచేసియున్న అర్చామూర్తి విషయంలోకాని నిర్లక్ష్య భావన పనికిరాదు. ఎటువంటి అపచారములు జరగకుండా జాగ్రత్త పడవలయును. గోదాదేవి అర్చామూర్తిపై అచంచలమైన విశ్వాసాన్ని కలిగియుండి, ధనుర్మాసవ్రతమాచరించి చివరకు అర్చామూర్తినే వివాహమాడినది. భగవద్రామానుజులు 'అర్చామూర్తి'కి సకలోపచారములు కూడా సక్రమంగా జరుగాలి. అనే ఉద్దేశ్యంతోనే దివ్యదేశములలో భగవత్కైంకర్య విషయంలో ఒక క్రమపద్ధతిని ఏర్పరచినారు.

శ్రీరంగనాథుడు అర్చకులతో నడాదూర్ అమ్మాళ్ స్వామివారితో కంచివరదరాజ స్వామి, కృష్ణమాచార్యస్వామి అనే సంగీత విద్వాంసునితో సింహాచలాధిపతియైన వరాహనృసింహస్వామి అర్చారూపంలో ఉండిగూడా సంభాషించినట్లు చరిత్ర చెబుతున్నది. (ఇటువంటి ఉదాహరణలు మరెన్నో కలవు. సుప్రసిద్ధమైన కొన్నింటినే ఉదహరించితిని)

భగవంతుడు తనను సంపూర్ణంగా విశ్వసిస్తూ, తనకు శేషభూతులై సకల ఉపచారములు చేసే అనన్య భక్తులకు అర్చారూపంలోనూ కొంగుబంగారంగానే వేంచేసియుండి భక్తుల యోగక్షేమాలను వహిస్తాడు.

# సీతాఫలం రామార్పణం

శ్రీమతి చెవుటూరి కుసుమకుమారి - విజయవాడ

*(గత సంచిక తరువాయి)*

అంతట ఆ యోగిని....

**మోహినీ నరనారీణాం రూపిణీం జనహారిణీ ।**
**ప్రాపయామి మహాభాగ్య కైకేయీం తవ సన్నిధిమ్ ॥**

ఓ దశరథరాజా! నరనారీలోకాన్ని మోహింపచేయగల శక్తి నాకున్నది. నేను దూతకగా ఉండగా నీకు చింత ఏల? కైకేయిని క్షణకాలములో నీ ఎదుట నిలబెట్టగలను. కానీ ఈ పని సత్పురుష ఆమోదయోగ్యము కాదేమో! అని భావిస్తున్నాను.

**తస్మాత్తస్యా త్త్వయా సార్ధం వివాహార్థం యతీత్వహమ్ ।**
**రాజ్ఞా సభాజితా సాఽపి యయౌ శీఘ్రం చ యోగినీ ॥**

దశరథా! రహస్యముగా ఆమెను తెచ్చి పెండ్లి ఆడుట సజ్జన నింద్యమే. కనుక నీకు ఆమెతో వివాహము జరుగునట్లు నేను ప్రయత్నించెదనని నిశ్చయముగా చెప్పినది. దశరథుని సత్కారములను గ్రహించి అతి తక్కువ సమయమునకే కేకయ రాజ్యమునకు చేరినది. నగరములోని ఒక సరస్సు తీరమున తపస్సు చేసుకొనుచున్నట్లు నటించుచూ కూర్చున్నది. ఆ యోగినిని చూచిన జనులందరూ వచ్చి ఆమెను పూజించసాగారు. ఒక పర్వదినవేళ కైకేయి ఆ సరస్సునకు స్నానమాడ వచ్చినది. కైకేయిని చూచిన యోగిని తనయత్నము ఫలించగలదని తలచినది. కైకేయి కూడా పురజనులచేత పూజించబడుచున్న యోగినిని చూడవలెనన్న ఆసక్తితో వచ్చి యోగినికి భక్తి శ్రద్ధలతో నమస్కరించి వినయముగా నిలబడినది. లోలోన మిక్కిలిగా సంతసించిన యోగిని...

"రాజపుత్రీ! రాజలక్షణ సంపన్నవలే కనుపించుచున్నావు. నీవు తప్పక ఒక సార్వభౌమునికి పత్నివి కాగలవు" అని ఆశీర్వదించింది. ఆ యోగిని మాటలకు కైక చాలా సంతోషించి ఆమెను తన రాజగృహమునకు తీసుకొని వెళ్ళినది. ఆ యోగినికి మేడపైభాగాన ఏకాంత నివాసము ఏర్పరచినది. అట్లుండగా లోకమోహిని అయిన యోగిని కైకతో ఈ విధంగా ప్రస్థావించింది.

**పృథివ్యా స్సాగరాంతాయాః రాజా భవేద్యది ।**
**తర్హి రూపస్య సాఫల్య మన్యథా వ్యర్థమే వహి ॥**

"రాజపుత్రీ! నీవు అతిలోక సౌందర్యవతివి. చతుస్సాగర పర్యంతమైన భూమిని

పాలించు సార్వభౌముడు నీకు భర్త అయిననే నీ సౌందర్యమునకు సాఫల్యము. లేకున్న వ్యర్థమని నా మనోభావము. రాకుమారీ! అటువంటి సార్వభౌముడేవరా? అని నీవు సందేహించకు. అయోధ్య అను పట్టణమున దశరథుడను గొప్ప సార్వభౌముడున్నాడు.

**ఈదృశో యది తే భర్తా సఫలం తవ జీవితమ్ ।**
**ఇత్థం నివేదితా కన్యా తస్మిశ్చేతో దధార సా ॥**

యశస్వినీ! కైకా! ఇటువంటి సార్వభౌముడు నీకు భర్తగా లభించిన నీ జీవితము సఫలమగునని చెప్పగ కైకమనసు దశరథుని మీద లగ్నమైనది. ఈ విషయమును గ్రహించిన యోగిని కైకకు మరింతగా ఉపదేశము చేయ ప్రారంభించినది.

“కైకా ఉదాసీనీ నిరాహారా స్థితా సా నిరలంక్రియా” అన్నపానాలు విడిచి పెట్టి, అలంకారాలు తీసివెయ్యి” అని చెప్పగా కైక అట్లే చేసి మౌనము పాటించసాగినది. కైకేయి సఖురాండ్రు హఠాత్తుగా ఆమెలో కలిగిన మార్పునకు భయభీతులైనారు. తల్లి కూతురు పరిస్థితిని చూచి దిగులు చెందినది.

అమ్మా కైకా! నీవు మౌనంగా, నిరాహారంగా కృశించటానికి కారణం ఏమిటి? దాపరికము మాని నిజము చెప్పిన యెడల తగిన చికిత్స చేయించగలము కదా! అని ఎంతగా అడిగిననూ రాకుమారి నోరు విప్పలేదు.

**యదా సా నోత్తరం ప్రాదాత్తదా సా యోగినీం గతా ।**
**సుతా మే త్వీదృశీం ప్రాప్తా దశాం వై కేన హేతునా ॥**

కైకేయి తల్లి యోగిని వద్దకు వెళ్ళి ఓ యోగినీ నా పుత్రిక ఎందువలన ఇట్లున్నది? దయతో తెలియచెప్పుమని వేడుకున్నది.

**అయోధ్యా వర్ణితా తస్యాః పతి ర్దశరథ స్తథా ।**
**వర్ణితో భూ న్మయా సర్వవర్ణనే రాజ్ఞి సత్తమే ॥**

అమ్మా! రాజపత్నీ! నీ కుమార్తె నన్ను యేయే దేశములు చూచినావని అడిగినది. అంతట నేను చూచిన దేశముల నన్నింటినీ వర్ణించుచూ అయోధ్యానగరిని, దాని ప్రభువైన దశరథునీ కూడ వర్ణించినాను. అది విన్నది మొదలు ఎందుకో ఆమె ఈ విధంగా ప్రవర్తిస్తున్నది. ఆమాట వినగానే రాజపత్ని కేకయ మహారాజువద్దకు వెళ్ళినది.

కుమార్తె చిత్తము దశరథుని మీద లగ్నమైనది. కనుక ఆమెను దశరథునకిచ్చి పెండ్లి చేయవలెనని చెప్పినది. పుత్రికమీది ప్రేమతో, భార్య వాక్యానుసారము అట్లే చేయుదమని మంత్రులను పిలిచినాడు. కైకా దశరథుల వివాహము గురించి చెప్పినాడు.

మంత్రులు భిన్నాభిప్రాయాలు వ్యక్తం చేశారు. కొందరు మన్మథ సమానుడైన దశరథునకు కైకా సుందరిని ఇచ్చుట సమ్మతమే అన్నారు. కొందరు తమ మనోగతాన్ని తెలిపారు.

**కథం దేయా హ్యపుత్రాయ బహుపత్నీ యుతాయ చ ।**
**తదా ప్రోవాచ గర్గస్తు విప్రో రాజపురోహితః ॥**

దశరథ మహారాజు వృద్ధుడనీ, బహుభార్యలున్నవాడనీ, సంతానము లేనివాడనీ విని వున్నాము కదా! అటువంటి దోషములున్న వానికి మన కైకను ఇచ్చుటెట్లని అభ్యంతరం తెలిపారు. అప్పుడు కేకయరాజ పురోహితుడు గర్గమహర్షి రాజా! నామాటను ఆకర్ణించు.

**సత్రం కృతం కుబేరేణ శ్రీహరేః ప్రీతికామ్యయా ।**
**తస్మిన్ యజ్ఞే ఋషిగణాః శంకరం ప్రోచువం స్తదా ॥**

రాజా పూర్వం ఒకప్పుడు కుబేరుడు విష్ణుప్రీతి కోసం సత్రయాగం చేశాడు. ఆయాగసమయాన మహర్షులు శంభునిలా అడిగాడు. "రావణో రాక్షసై స్సార్ధం కదా నాశం వ్రజిష్యతి" మహేశ్వరా! గంగాధరా! నీకు నమస్కారం. నీవు సర్వజ్ఞుడవు. రాక్షస సహితంగా రావణుడు ఎప్పుడు నశిస్తాడో చెప్పుమని కోరారు.

**అయోధ్యాయాం మహాపుర్యాం రాజా దశరథో అవసత్**
**తస్యపత్నీ సమిత్రా చ కౌసల్యా భానుమంతదా ।**
**అపరా కైకేయీనామ తా సుపుత్రా మహాబలాః**
**భవిష్యంతి చత్వారః తేషాం జ్యేష్ఠో హనిష్యతి ॥** రాజా! అయోధ్యాధిపతి దశరథునికి కౌసల్యా, సుమిత్రా కైకేయీ అను ముగ్గురు భార్యలయందు నలుగురు పుత్రులు జన్మించగా, వారిలో జ్యేష్ఠుడైన శ్రీరాముని చేతిలో రావణుడు చంపబడునని చెప్పినాడు. రాజా! ఈ వివాహము శివుని చేత ఎన్నడో చెప్పబడినది. కనుక ఇక్ష్వాకు వంశీయునికి కైక నిచ్చుటకు సందేహించకుమని చెప్పినాడు. (సశేషం)

ముముక్షు రహస్యం

# కూరత్తాళ్వాన్ వైభవం

- శ్రీమతి చక్రవర్తుల చూడామణి - ఖమ్మం

గత సంచిక తరువాయి

"ఆహా...! ఎంత వైరాగ్యం బామ్మా!. ఎవరైనా అంత సంపద వదులు కుంటారా? ఆయన వదిలినా ఆవిడ ఊరుకుంటుందా? పైగా ఆ ఆండాళమ్మ తనకోసం నగనట్రా కాక తన భర్తకోసం బంగారు పాత్ర తెచ్చింది. అదీ ఆయన పారేసినా మారుమాట మాట్లాడలేదు...."

''ఇదొకటేనా ఇంకా ఆయన చేసిన గొప్ప పనులు ఎన్నో ఉన్నాయి. శ్రీమద్రామానుజుల శిష్యకోటిలో చేరటం కోసం శ్రీరంగం బయలుదేరాడు."

"ఇంతకీ శ్రీమద్రామానుజాచార్యులు వీరిని శిష్యులుగా అంగీకరించారా లేదా బామ్మా?"

"అప్పటికీ కంచిలో వరదరాజస్వామికి కైంకర్యం చేస్తూ విశిష్టాద్వైత సిద్ధాంతాన్ని స్థిరపరచే కృషి చేస్తూ సన్యసించి 'రామానుజముని' అన్న తిరునామంతో వెలుగొందు తున్నారు శ్రీ యతిరాజులు. అక్కడికి చేరి వారి కరుణాకటాక్షంతో పంచసంస్కారం పొందారు శ్రీ కూరత్తాళ్వాన్. అదే సమయంలో యతిరాజుల మేనల్లుడైన ముదలి ఆండాన్ కూడా వారి శిష్యులుగా చేరారు. వీరిరువురూ ప్రథమ శిష్యులు యతిరాజులకు. అందుకే వీరిని దండపవిత్రాలనేవారు. సన్యాసులు త్రిదండాన్ని పవిత్రదండాన్ని ఎప్పుడూ వదలరు. అలాగే భగవద్రామానుజులు వీళ్లిద్దర్నీ ఎప్పుడూ వదిలి ఉండేవారు కాదు.

ఇలా వీరి కాలక్షేపం సాగుతుండగా శ్రీరంగం నుండి తిరువరంగప్పెరుమాళ్ అరయర్‌స్వామి కంచికి వచ్చి "శ్రీరంగనాథులు రామానుజులవారిని తీసుకురమ్మన్నార"ని కంచి వరదరాజస్వామికి విన్నిపం చేశారు. ఆ స్వామి ఆజ్ఞ మేరకు రామానుజులవారు శ్రీరంగం ప్రయాణమయ్యారు."

"మరి మన ఆళ్వాన్ ఏం చేశారు?" కృష్ణ

ఇందాకే చెప్పింది కదా బామ్మ. దండపవిత్రాలను ఎప్పుడూ వదిలిపెట్టి ఉండరని" గోదా.

"సరే తరువాత ఏమైందో చెప్పు."

''కూరత్తాళ్వాన్ మొదలియాండాన్‌తో సహా శ్రీరంగం చేరుకున్నారు రామానుజులవారు. వారి ఆచార్యులైన ఆళవందార్ ఆజ్ఞమేరకు తిరుక్కోట్టియూర్ నంబి నుండి చరమశ్లోకం పొందవలసి ఉంది."

"ఆయనే కదా 18 సార్లు తిప్పించింది." కృష్ణ

"ఊరికే తిప్పించలేదురా! చరమశ్లోకం అంతటి గొప్పది. అది పొందే వారికి కొన్ని అర్హతలుండాలి మరి. ఆ రోజులలో శిష్యులను పరీక్షించనిదే ఏ విద్యా చెప్పేవారు కాదు గురువులు. అందుకే తిరుక్కోట్టియూర్ నంబి కూడా 17 సార్లు పరీక్షించి 18వ సారి రామానుజులవారికి చరమశ్లోకం అనుగ్రహించి, వారితో ఇలా అన్నారు. "తమరినే 17 సార్లు పరీక్షించి కాని ఇవ్వలేదు. మీరు ఇలాగే పరీక్షించనిదే ఎవరికీ ఈ మంత్రం ఇవ్వరాదు. చాలా రహస్యంగా కాపాడాలి."

దానికి రామానుజులవారు... "కూరత్తాళ్వాన్‌కి మాత్రం చెప్పకుండా ఉండలే"నన్నారట. "అయితే సంవత్సరకాలం పరీక్షిచి చెప్పండి" అన్నారు.

ఇదే విషయాన్ని రామానుజులవారు కూరత్తాళ్వాన్‌తో చెప్పారు. ఇంకొకళ్ళైతే "మంచిది స్వామీ సంవత్సరం తరువాతే చెప్పండి. తొందరేముంది" అనేవాళ్ళు.

"మరి ఆళ్వాన్ ఏమన్నారు?"

వారు శాస్త్రంలోని అతి సూక్ష్మవిషయాలను కూడా క్షుణ్ణంగా చదివిన వారు కాబట్టి వెంటనే ఆ మంత్రం పొందటానికుపాయం కనిపెట్టారు. పైగా సంవత్సర కాలం పాటు ఈ దేహం ఉంటుందన్న నమ్మకం ఏమున్నది? అందుకని ఆ శ్లోకం పొందకపోతే ఎలా? అని ఆవేదన పడ్డారు. శాస్త్రప్రకారం ఒక సంవత్సరం పాటు ఆచార్యసేవ చేయటం, ఒక నెలపాటు ఆచార్యగృహమందు నిరాహారంగా నెలరోజులు ఉపవాసదీక్షలో ఉండి చరమశ్లోకాన్ని ఆచార్యుల నుండి పొందిన ధీమంతులు ఆళ్వాన్."

"ఇంతకీ 'ఆళ్వాన్' ఎలా అయ్యారో చెప్పనే లేదు.

"వస్తున్నా! అక్కడికే వస్తున్నా! కాస్త ఓపికపట్టు. మన ఆళ్వాన్ "తిరువాయ్‌మొజి" వ్యాఖ్యానం చాలా చక్కగా కాలక్షేపం చేసేవారట. రామానుజాచార్యులకు వీరు చెప్పగా వినాలని కోరిక. కాని కూరత్తాళ్వాన్ ఆచార్యుల ముందు కూర్చొని చెప్పరు. అందుకని ముదలిఆండాన్, ఇంకా ఇతర శిష్యులని కూరత్తాళ్వాన్ దగ్గర తిరువాయ్‌మొN కాలక్షేపం విన్నది విన్నట్టు రామానుజులవారికి చెప్పాలి అని ఏర్పాటు చేశారు. సరే వీళ్ళు వెళ్ళి అడిగారు. ఆళ్వాన్ మొదలు పెట్టారు కొన్ని రోజులు గడిచిపోయాయి. రామానుజులవారు శిష్యులను పిలిచి కాలక్షేపం ఎలా సాగుతున్నదని అడిగారు. ఆరంభంలోనే ఉందన్నారు వాళ్ళు. అదెలా ఇన్నాళ్ళూ ఏమీ చెప్పలేదా? అని ఆశ్చర్యపోయారు ఆచార్యులు.

"ఉయర్‌వర ఉయర్‌నల ముదయ..." అంటారండి. వెంటనే కన్నీళ్ళు కార్చుతూ ఉండిపోతారు" అని చెప్పారు.

మరుసటిరోజు కాలక్షేపం వేళకు ఆచార్యులు చాటుగా కూర్చున్నారు. రోజులాగానే మొదలు పెట్టారు. అంతలో మూర్చపోయారు"

"ఎందుకు బామ్మా అలా?"

"ఉయర్వర ఉయరే నలముడయవన్" అంటే సకల కళ్యాణ గుణములు కలవాడు అర్థం. తిరువాయ్మొళి అంటేనే పరమాత్మ కల్యాణగుణాలను తెలిపే గ్రంథం. దానిని అనుగ్రహించిన వారు నమ్మాళ్వార్. మొదటి ముక్కలోనే ఆ గ్రంథసారం మొత్తం ఇమిడ్చి చెప్పారు కదా! అది తలచుకొని వెయ్యి పాశురాల సారం మొదటి పదిగంలో, మొదటి పదిగంసారం మొదటి పాశురంలో మొదటి పాశురం సారం మొదటి పాదంలో చెప్పారే ఆ నమ్మాళ్వార్ ఎంతటి ధీమంతులు అనుకోగానే వానిమీద ఏర్పడిన భక్తి ప్రపత్తుల వలన మూర్ఛపోయేవారు. అప్పుడు ఆచార్యులు వచ్చి కూరేశుల వీపు నిమిరి "వీరు ఎంతగా భగవద్విషయంలో లయించారు కదా!! అని పొంగిపోయి ఆనందంతో "ఆళ్వార్ ఆళ్వార్..." అని పిలిచారు. నమ్మాళ్వార్ కూడా "అన్టు ఎత్తిరమ్" ఉరలినోడు ఇణైన్దిర్దు ఎంగియ ఎళవే అని చెప్తూ ఆరు నెలలు మూర్ఛపోయారట. ఆ నమ్మాళ్వార్నే తన శిష్యుడిలో చూసిన ఆచార్యులు "ఆళ్వాన్...." అని పిలిచారు. అప్పట్నించి 'కూరత్తాళ్వాన్' అన్నపేరు స్థిరపడిపోయింది."

"బామ్మా శ్రీభాష్యం వ్యాఖ్యానం ఎవరు రాశారు? కూరత్తాళ్వానా? భగవద్రామానుజాచార్యులా?"

"శ్రీభాష్యానికి వ్యాఖ్యానం రాసింది రామానుజులే అయినా కూరత్తాళ్వాన్ లేకపోతే సాధ్యమయ్యేది కాదు."

"అలా ఎందుకంటున్నావు బామ్మా?"

"నేననటం కాదురా మన పూర్వాచార్యులు అన్నమాటే అది. ఉన్నమాట కూడా. ఎందుకంటే కూరత్తాళ్వాన్ జ్ఞానంలో శ్రీమద్రామానుజులకు తీసిపోరు. అంతేకాదు. ధారణశక్తి కూడా చాలా గొప్పది. ఈ వృత్తాంతం వింటే మీకే అర్థమవుతుంది. శ్రీభాష్యం వేదవ్యాసులవారనుగ్రహించినది. దానికి బోధాయనుడు ఒక వ్యాఖ్యానం రాశారు. దానినే బోధాయన వృత్తి గ్రంథం అంటారు. అయితే శ్రీభాష్యానికి విశిష్టాద్వైత పరంగా వ్యాఖ్యానం రాయాలని అదీ భగవద్రామానుజులే రాయాలని ఆళవందార్ కోరిక. శ్రీభాష్యానికి వ్యాఖ్యానం రాయాలంటే బోధాయన వృత్తిగ్రంథం చదవాలి. అది కాశ్మీర్లో శారదాపీఠంలో ఉంది. అందుకని కాశ్మీరు వెళ్ళి దానిని చదవటం కోసం ప్రయాణ మయ్యారు భగవద్రామానుజులు. కూరత్తాళ్వాన్ని కూడా వెంట తీసుకెళ్ళారు. అక్కడికి వెళ్ళి వృత్తి గ్రంథం అడిగారు. అక్కడి వాళ్ళు రామానుజులవారిని వాదానికి పిలిచారు. వివిధ మతస్థులతో వాదంలో గెలిచి ఆ గ్రంథాన్ని పొందారు. ఆచార్యులు మొదటి అధ్యాయం పూర్తి చేయక ముందే గ్రంథం తిరిగి తీసేసుకున్నారు. ఆచార్యులు తీవ్ర

విచారానికి గురయ్యారు. "ఇంత కష్టపడివచ్చి ఇంతమందితో వాదంలో గెలిచి పొందిన పుస్తకం చేజారిపోయిందే! ఇక విశిష్టాద్వైత సిద్ధాంతానికి చేయగల ఉపకారం ఏముంది? పైగా ఆచార్యుల కోరిక తీర్చలేకపోయానే?" అని బాధపడడం చూసి కూరత్తాళ్వాన్ "స్వామీ విచారపడకండి. తమరు అనుమతిస్తే ఆ గ్రంథంలోని విషయాలన్నీ చెప్తాను. లేదా ఉభయ కావేరుల మధ్య (శ్రీరంగం) చెప్పమన్నా చెప్తాను" అన్నారు.

ఆచార్యులు ఆశ్చర్యపోయారు. వృత్తి గ్రంథం ఊహకందనంత పెద్దగ్రంథం. పైగా విషయం అసామాన్యమైనది. అంత గ్రంథాన్ని మనసులో నిలుపుకోవటం సామాన్య విషయం కాదు. పైగా సమయం కూడా చాలా తక్కువ. "మీరెప్పుడు చదివారు సదా నా సేవలోనే గడుపుతారు కదా!" అని అడిగారు. దానికి ఆళ్వాన్ "రాత్రి స్వామి విశ్రమించాక మొదలు పెట్టి ఉదయం తమరు లేచేవరకు చూసేవాడిని" అన్నారు. ఆచార్యులు వారి కృషిని చూసి మరోసారి ఆశ్చర్యపోయారు. అదే సామాన్యులైతే "ఆచార్యులు ఒక అధ్యాయం చదివే లోపల నేను మొత్తం చదివాను. ఆయన వ్యాఖ్యానం రాయడానికి నేనే కారణం" అని గర్వంతో ప్రవర్తించేవారు. కాని మన ఆళ్వాన్ ఎంతో అణకువతో తనకా మేథాశక్తి ఆచార్యపాద సంబంధం వలనే లభించిందని భావించారు. ఆచార్యులు తన శిష్యుని ప్రతిభకి సంతోషించి బోధాయన వృత్తిగ్రంథం మీ మనసులో ఉండగా ఆ పుస్తకం పోతే మాత్రం నష్టమేమిటి" అన్నారు.

"మరి శ్రీరంగం వచ్చారా? అక్కడే రాశారా?"

"వెళ్ళినపని అయిపోయిందిగా కాశ్మీర్‌నుంచి శ్రీరంగం చేరుకున్నాక ఆళ్వాన్ వృత్తిగ్రంథంలోని విషయమంతా రామానుజులకు నివేదించారు. తరువాత శ్రీభాష్య వ్యాఖ్యానం రాయటం మొదలు పెట్టేముందు రామానుజులు తాను చెప్తుండగా కూరత్తాళ్వాన్‌ని తాళపత్రం మీద రాయమన్నారు. అలా చెప్పేటప్పుడు వృత్తి గ్రంథానికి దీనికి తేడా వస్తేచెప్పమన్నారు. కాని కూరత్తాళ్వాన్ "రాయటమైతే నా భాగ్యం రాస్తాను. కాని ఆచార్యులు చెప్పిన విషయంలో తప్పులు ఎత్తి చూపటం నావల్ల కాదు" అన్నారు.

"ఎంత మంచి గురుశిష్యులో. తప్పులు చెప్పమని అడిగే ఆచార్యులెంతమంది ఉంటారు లోకంలో. అలా అడిగినా ఆచార్యుల తప్పులు ఎత్తిచూపని శిష్యులెంద రుంటారు?"

"అదే వాళ్ళిద్దరి గొప్పతనం. ఆళ్వాన్ ఇలా చెప్పాక ఆచార్యులే మరో పద్ధతి సూచించారు. "తేడా వచ్చినచోట రాయటం ఆపేయండి. అర్థం చేసుకుంటా"మన్నారు. అలా ఇద్దరూ శ్రీభాష్యవ్యాఖ్యానం మనకందించారు. (సశేషం)

# భర్తృహరి సుభాషితాలు

సేకరణ: **జి. రఘునాథ్ -సీతానగరం**

**ఆయుషః క్షణ ఏఽ కోపి న లభ్యః స్వర్ణకోటిభిః ।**
**సచేన్నిరర్థకం నీతః కాను హాని స్తతోఽ ధికా ॥**

తా॥ ఆయుర్దాయంలో గడచిన ఒక్కక్షణమైనా కోటి కాసులిచ్చినా కలసిరాదు. అల్లాంటి జీవితాన్ని వ్యర్థంగా గడిపితే అంతకు మించిన ఆపత్తు ఇంకేముంది.

**గీతం కోకిల! తే సుధారసముచం శ్రుణ్వన్తి కర్ణామృతమ్ ।**
**నోకి ఞ్చి ద్వితరన్తి తే తరుదళై రేవ స్వయం జీవసి ।**
**కర్ణారున్తుద ముద్గిరన్తి విరుతం కాకాస్తు తేభ్యో బలిమ్ ।**
**ప్రాజ్ఞా ఏవ దిశన్తి హన్త! ధిగిదం వక్రం విధేః క్రీడితమ్ ॥**

తా॥ షట్చాస్త్ర విశారుదుడై నేర్పుగ నుపన్యసించగల శక్తిగలయొకానొక పండితుని మనోవేదన ఇది. అతడొకసారి ఒక నగరమునకేగి మూడు రోజులు మూడుగంటల చొప్పున అతిగంభీరమైన అర్థములతో గీతాశాస్త్రమును ప్రవచనం చేసెను. చదువుకొన్నవాడను గౌరవముతో కొందరు ప్రాజ్ఞులు విని ఏదో విధముగ విరాళముల స్వీకరించి నూట పదహారు రూపాయలు బహూకరించిరి.

ఆ మరుసటి దినముననే యొక మిడిమిడి జ్ఞానముగల హరిదాసు ఆ గ్రామమునకు వచ్చి అనర్థ ప్రసంగములతో రోజుకొక గంట చొప్పున పదిరోజులు భారతములో రామాయణమును, రామాయణములో భారతమును జోడించి పాడి, గెంతి వినిపించగా ఆ పెద్దలందరు కలసి వేయినూటపదహారు రూపాయల విరాళమును సేకరించి, అతనిని పుష్పమాలాలంకృతుని గావించి, నూతనవస్త్రములతో గూడ సత్కరించిరి. పై పండితుడంత వరకు నచ్చటనే యుండెను. ఆ సంఘటనను జూచి యిట్లు బాధపడెను.

"ఓ కోకిలా! అమృతరసము నొలుకు పలుకులతో పాడి ప్రజలకు కర్ణామృతము గావించితివి. నీ కెవరైనను చారెడు బియ్యమును పెట్టినారా? నాలుగు అన్నపు మెతుకులను రాల్చినారా? పాపము!! నీవింత యుపకారమొనర్చియు చెట్ల చిగురులతోనే జీవించుచున్నావుగదా! కాకులు బెదరించినను పోక అచ్చటనే యుండి చెవులు బ్రద్ధలగునట్లు తల పగులునట్లు కూయుచునే యుండును. అయినప్పటికిని ఆ ప్రాజ్ఞులే చేతిలో అన్నపు ముద్దను ధరించి 'కావు కావు' మనుచు కాకి వచ్చి తిను వరకును అచ్చటనే నిలచియుందురు. ఆహా! ఏమి బ్రహ్మయొక్క విపరీత వ్యాపారము' అని విలపించెను.

# ఆచార్య వైభవం

మాది విశాఖజిల్లా, నక్కపల్లి మండలం, వేంపాడు గ్రామం. మా గ్రామ వికాసతరంగిణి సభ్యులంతా కలసి 27.2.2006 సం॥రం మాఘ బహుళ ఏకాదశి రోజున శ్రీస్వామివారి మంగళాశాసనములతో "శ్రీ విష్ణు సహస్రనామ ఏకాహము చేసాం. తర్వాత అలాంటి 108 ఏకాహములు లోకకళ్యాణార్థం చేయాలని ప్రారంభించినాము.

అవి ఒకచోట కాకుండా వివిధ పుణ్యక్షేత్రాలలో చేశాము. మా గ్రామంలో, మాకు ప్రధాన సమస్య "మంచినీరు". ఈ పారాయణ కార్యక్రమం మొదలుపెట్టిన 2 సం॥ల తరువాత ఆచార్య అనుగ్రహం, పెరుమాళ్ళ ఆశీస్సులవల్ల నీటికొరత తీరి, మంచినీటి బోర్లు పడినవి. ఇది మాకు మరచిపోలేని గొప్ప అనుభవం.

8.6.2010 నాటికి 108 ఏకాదశలు పూర్తయినవి. అప్పటికి శ్రీస్వామివారిని ముగింపు కార్యక్రమానికి ఆహ్వానించాం. కానీ శ్రీస్వామివారు సమయాభావంవల్ల కుదరక డిసెంబరు 17,18 తేదీలలో మా గ్రామానికి వేంచేస్తామన్నారు.

సమయం తక్కువే అయినా కనీసం 10,000మంది భక్తులను, 108 గ్రామాలలో ప్రచారం చేసి రప్పించాలని అనుకున్నాము. ఆచార్యుని మీద భారం వేసి ప్రచారం మొదలు పెట్టాము. ఇంతలో వానదేవుడు కూడా మా వెంట ప్రచారానికి వచ్చాడు. కార్యకర్తలందరూ నావద్దకు వచ్చి డిసెంబరు 16,17 తేదీలలో తుఫాను ఉందని టి.వి.లో చెప్తున్నారు. కార్యక్రమ తేదీ మార్చాలని వర్మగారి ద్వారా శ్రీస్వామివారికి తెలియజేసాము. దానికి శ్రీస్వామివారు మీ గ్రామస్థులు భయపడవలసిన అవసరం లేదు. ఇకపై వర్షములు పడవు. మీరు అనుకున్నదానికంటే మీ కార్యక్రమము బాగా జరుగుతుంది" అని మంగళాశాసనం చేశారు. ఇది కలా! నిజమా! భగవత్‌శక్తా! ఆచార్యదేవుని కృపా! మీరే నిర్ణయించండి. ఆ రోజునుండి వానదేవుడు మాయమైనాడు. ఆగిన ప్రచారం మొదలైంది.

17వ తేది సా॥ శ్రీస్వామివారు మా గ్రామానికి వేంచేశారు. వేలాది మంది భక్తులు 'జై శ్రీమన్నారాయణ!' నినాదంతో స్వాగతం పలికారు. స్వయంగా రాముడే ఇక్కడకు వేంచేశాడని భక్తులు తన్మయులైనారు.

శ్రీస్వామివారు వేదికపై శ్రీవిష్ణు సహస్రనామ వైభవాన్ని అనుగ్రహ భాషణం చేసి 18వ తేది ఉదయం ఆరాధనపూర్తి చేసుకొని శ్రీ వేంకటేశ్వర దీక్షా వైభవాన్ని భక్తులకు అనుగ్రహించారు. సుమారు 3వేలమంది శరణాగతి దీక్ష మాలాధారణ చేసి, 13 వేలమంది భక్తులతో 'లక్ష్మీపూజలు, శ్రీ వేంకటేశ్వర స్వామి పూజలు జరిపించారు. కార్యక్రమ అనంతరం సభ్యులందరికీ మంగళాశాసనం చేశారు. ఇది ఎప్పటికీ మేము మరచిపోలేని అనుభవం. "మా అమ్మ లక్ష్మితో కూడిన శ్రీమన్నారాయణుడు", భగవత్ స్వరూపులైన శ్రీశ్రీశ్రీ స్వామివారి మంగళాశాసనాలే ఈ కార్యక్రమం ఇంత వైభవముగా జరగడానికి కారణము.

- పి. సుజాత - వేంపాడు వికాసతరంగిణి



## మనస్మృతి మొదలగు ధర్మశాస్త్రములు బోధించిన

# మంచి చెడులు

- పరమపదవాసులు శ్రీ ఉ.వే. శ్రీమాన్ గోపాలాచార్యస్వామివారు

1. నీ బిడ్డలను ఐదు సంవత్సరముల వయస్సు వచ్చువరకు రాజువలె నాదరింపుము. పది సంవత్సరముల వరకు దాసునివలె వాడుకొనవలెను. పదునారు సంవత్సరముల వయస్సు పైబడినచో మిత్రునితో వలె ప్రవర్తించ వలెను.
2. తన ఆయువును, తనకున్న ధనమును, ఇంటిలోని చీకాకులను, మంత్రమును, మందును, తాను గావించిన దానమును, తనకు తటస్థించిన అవమానమును పరులతో చెప్పరాదు.
3. తన వయస్సునకు మించి వయస్సుగల స్త్రీని పెండ్లాడ తగదు.
4. ఆకులు పడి కుళ్ళిన నీటిని త్రాగరాదు. నిర్మలమైన నీటిని త్రాగవలెను.
5. రాత్రి పెరుగుతో భోజనము చేయరాదు. ఇట్లు చేసినచో ఆయువు క్షీణించిపోవును. రాత్రి పాలతో భుజించవలెను. ఇట్లు చేసిన ఆయువు పెరుగును.
6. నీ కష్టార్జిత ధనముతో జీవించుట ఉత్తమము. నీ తండ్రి వలన సంక్రమించిన ధనముతో బ్రతుకుట మధ్యమము. తోడబుట్టినవాడు సంపాదించిన ధనముతో జీవించుట నీచము. ఆడదాని సొత్తుతో బ్రతుకుటకన్న నీచమైన వృత్తి వేరొకటి లేదు.
7. వచ్చిన కోపము ఒక క్షణమాత్రమే ఉండి శాంతించుట సజ్జనుని స్వభావము. రెండు ఘడియలమాత్ర ముండుట మధ్యమునికి లక్షణము. ఒక రాత్రి పగలు విడువక యున్నచో నధముడన్నమాట. పాపాత్ముని కోపము వాడు చనిపోవువరకు తగ్గదు.
8. ఏపని నైనను తనంత తాను లెస్సగా నాలోచించి చేయుట సుఖకరము. తన గురువు చెప్పినట్లు చేయుట అంతకుమించిన సుఖకరము. పరులతో నాలోచించి వారు చెప్పినట్లు చేయుట అనర్థకరము. ఆడదాని సలహా ననుసరించి సంచరించుట ప్రళయమే యనవచ్చును.
9. అతిథి వచ్చి గుమ్మములో నుండగా నాతనిని యాదరింపక గృహయజమాని భోజనమును కూర్చొని ఔపోసనమునుపట్టి ఆ నీటిని త్రాగిన కల్లు త్రాగినట్లె, అన్నమును తినిన గోమాంసము తిన్నంత దోషము.

10. గార్గ్యముని ఉషఃకాలము (సూర్యోదయమునకు ముందు) ప్రయాణమునకు మంచిదనియును. బృహస్పతి శకునము చూచుకొని పయనించుట మంచి దనియును, నీ మనస్సులో పని జరుగునని గట్టి నమ్మక ముండుటయే లగ్నమని మాండవ్య మహర్షియు, ఒక బ్రాహ్మణోత్తము డెప్పుడు చెప్పిన అప్పుడే మంచిదని భగవానుడు తెలిపిరి.

11. ధనమును సంపాదించుటలోగల శ్రమను గమనింపుము. కష్టపడి సంపాదించిన ధనమును కాపాడుట ఎంత కష్టమో గమనింపుము. దానిని పెంచి వృద్ధిచేయ దలచి పరులకు అప్పునిచ్చి పడు పాటులను తలచుకొమ్ము. అది ఏదో విధముగ ఖర్చైపోయిన కలుగు దుఃఖమును ఆలోచించుము. ఇట్టి పాట్లకు పాలుచేయు ధనార్జనమునకే జీవితము వెచ్చించి విలపించనేల?
ఉన్నదానితో తృప్తినిచెంది అధికసమయమును పరోపకారమునకును పరమ పురుషుని సేవకును వినియోగింపుము.

12. బ్రాహ్మణుడు ఉన్నదానితో తృప్తిచెందనిచో చెడును, రాజు ఉన్నదానితో తృప్తిపడి ఉదాసీనుడైయున్న చెడును.

# సముద్రము నేర్పిన పాఠము

**అపూర్వమాణ మచల ప్రతిష్ఠం సముద్ర మాపః ప్రవిశన్తి యద్వత్ ।**
**తద్వత్ కామా యం ప్రవిశన్తి సర్వే సశాంతి మాప్నోతి న కామకామీ॥** గీ. 2-79

నేనెప్పుడును నీటితో నిండియుందును. నాలో నిరంతరము ఎన్నో నదీ ప్రవాహములు వచ్చి పడుచుండును. అవి రావలయునని నేన్నెడును కోరను. నేను నా హద్దు మీరను. నా రుచిని, రంగును, పరిణామమును మారనీయను. అవి నాలో సమసిపోవును. చూచితివా నా స్వభావము. నా శాంతికేమి లోటు? నీవును నావలె నుండ గోరుదువా?

ఆత్మానుభవానందముతో నిండియుండుము. విషయానుభవానందము రావలెనని కోరకు. తనంత వచ్చినను నీవు నీ హద్దు మీరకు. వాటిని నీలో సమసి పోనిమ్ము. నీ స్వభావమును మారనీయకుము. నీ శాంతికేమి లోటు?

*- 1979 భక్తినివేదన నుండి గ్రహించబడినది.*

# దివ్యసాకేత వైభవము

రండి రండి తరలిరండి
కలియుగ వైకుంఠానికి
రమ్యమైన దివ్యమైన
సాకేత క్షేత్రానికి

భాగ్యనగరిలో వెలసిన భద్రాచల రాముడండి
చింతలను తీర్చేటి ముచ్చింతల క్షేత్రమండి
భవసాగర తీరానికి భద్రంగా చేర్చునండి ॥రండి॥

కోరగనే వరములిచ్చు కోదండరాముడండి
కోరకనే కరుణజూపు అమ్మే సీతమ్మండి
తోడునిలచు లక్ష్మణుండు కీడుబాపు హనుమంతుడు
వీరందరు ఒక్కచోట వెలసినట్టి క్షేత్రమండి ॥రండి॥

శ్రీరంగముపు గోదాశ్రీరంగనాథస్వాములండి
పాశురాలనాలకించి పరవశించు దేవుడండి
చినజీయరు పూజలంది జీవాత్మలకృపజూచుచు
శేషశయనుడై వెలసెను శ్రీలక్ష్మీసమేతడై. ॥రండి॥

దివిలో వైకుంఠమందు దేవగణ సమేతుండు
దీన పతిత పావనుండు దివ్యపరంధాముండు
అలరారే వాసుదేవు డిలపై వెలసెను రండు
దివ్యసాకేతమందు వరములను కురియుచుండు ॥రండి॥

దివ్యదేశపరివేష్ఠిత సుందరప్రాకారమండి
గిరులన్నియు ముదముమీర శిఖరములై వెలసెనండి
తరులన్నియు పరవశించి హరికేతనమాయెనండి
భక్తిపంచి ముక్తినిచ్చు పరమాత్ముని క్షేత్రమండి ॥రండి॥

- డా॥ రామరాజు-ఖాజీపాలెం.

భగవద్విషయానుభవము

# ఆళ్వార్లు-పక్షులు

ప.ప. ప్రతివాది భయంకరం అణ్ణంగరాచార్య స్వామివారు

ఆళ్వార్లు తమ దివ్యప్రబంధములందు భగవంతునిగూర్చి దూతలను పంపు ప్రకరణమున హంసలు, కోకిలలు మున్నగు పక్షులను రాయభారముగ పంపునట్లు కలదు. మహాజ్ఞానులగు ఆళ్వార్లు జ్ఞానములేని పక్షులనంపుట అసంభావితముగాన ఇచట అంతరార్థము మరొకటిగా నుండదగును. దీనిని "తిరువిరుత్తము"న నమ్మాళ్వార్లు స్పష్టముగ సాయించియున్నారు. **వీశుమ్ శిఱకాల్ పఱత్తీర్.....విణ్ణోర్ పిరానార్, మాశిల్ మలరడిక్కీళ్ ఎమైచ్చేర్విక్కుమ్ వణ్డుగళే** (సర్వేశ్వరుని పాదారవిందంబున మమ్ములను చేర్చు వో తుమ్మెదలారా!)అని.

ఇచట భగవంతుని పాదారవిందంబులం చేర్చుటయను విశేషము తుమ్మెదలకు అసంభావి తంబగుటచే ఘటకకృత్యనిష్ఠలగు ఆచార్యులే తుమ్మెదలుగా వచింపబడినట్లు స్పష్టముగ తెలియుచున్నది. ఆళ్వార్లు ఇట్లు ఆచార్యులను పక్షులుగా నిర్దేశించుటచే పక్షులకును ఆచార్యులకునుగల సామ్యములను కొన్నిటిని తెలుసుకుందాము!

పక్షులు తమ రెండు రెక్కలచే ఆకాశమున సంచరించును. ఆచార్యులును అటులే జ్ఞానము అనుష్ఠానము అను రెండుపక్షములచే సద్గతిని పొందుదురు, శిష్యులకు పొందచేయుదురు.

**'ఉభాభ్యామేవ పక్షాభ్యాం ఆకాశే పక్షిణాంగతిః।**
**తథైవ జ్ఞానకర్మాభ్యాం ప్రాప్యతే పురుషోత్తమః॥'**అని మహర్షులు ఈ స్వాపదేశార్థంబును సూచించిరి.

ఇట్లు గూఢముగ చెప్పుట అలంకారశాస్త్ర ప్రసిద్ధము. అపహ్నుతి, సమాసోక్తి, అప్రస్తుతప్రశంస మున్నగు అలంకారముల ఉదాహరణములకు స్వాపదేశార్థమే ప్రాణము. చూడుడు. **'ఏకః కృతీ శకుంతేషు యోన్యం శక్రా న్నయాచతే'**– 'పక్షులలో ఒకానొకపక్షియే శ్రేష్ఠమైనది. అది ఏదనగా, దేవేంద్రునితప్ప మరియొకనిని ఏపక్షి యాచింపకుండునో ఆపక్షియే' అని యీ శ్లోకభావము. భూమిమీద పడిన జలమును తాకక వర్షధారనే త్రాగి దప్పితీర్చుకొను చాతకపక్షిని గూర్చిన ఈశ్లోకము భగవంతునితప్ప ఇతరుల నర్థింపని పరమైకాంతులను అన్యాపదేశముగా వచించు చుండునుగదా! ఇట్లు గూఢముగా తెల్పుటలోని స్వారస్యాతిశయంబును రసికులే ఎరుంగుదురు.

# హంస విశేషార్థము

ఆళ్వార్లు ఆచార్యులను అన్యాపదేశసరళిలో హంసగా వ్యవహరించి యుండుటచే హంసకును ఆచార్యులకునుగల సామ్యములను తెల్పెదము.

1. ఛాందోగ్యోపనిషత్తులో జానశ్రుతి ఉపాఖ్యానము అని ఒకటి కలదు. జానశ్రుతియను ఒక క్షత్రియుడు విశేషము నన్నపానాదులం దానము చేయు చుండెను. అయినను ఈ రాజునకు బ్రహ్మజ్ఞానము లేకుండుటను చూచి భల్ల-భల్లాక్షులుఅను మహర్షులు ఇతనికి బ్రహ్మజ్ఞానము కల్పింపదలచి హంసరూపముతో ఆకాశమున సంచరించుచు భల్లుడను హంసము భల్లాక్షుడను హంసను చూచి 'క్రింద జానశ్రుతి మహాప్రభువు కలదు. అతనిమీద నీడపడకుండ నేగుమనెను. అదివిని రెండవహంస 'వీడేమి రైక్వుడా? నీడపడిన ఏమగును. జ్ఞానశూన్యుడగు వీనినా మనము గౌరవింపవలయును? అని అవహేళనము చేసెను. అది విని ఆరాజు దుఃఖించి బ్రహ్మజ్ఞానము సంపాదిందలచి రైక్వుని అన్వేషించుచు మహారణ్యములలో తిరుగుచు ఎచటను కానరాక చిట్ట చివరకు చూచి అనువర్తించి బ్రహ్మవిద్యను ఉపదేశింప నర్థింపగా, 'శుశ్రూష చేయని వానికి ఉపదేశింపతగ" దని ఆమహర్షి చెప్పగా రాజు 'ప్రజారక్షణమున నిమగ్నమైయుండు నాకు శుశ్రూషకు అవకాశములేదే' అని బాధపడగా, ఆ ఋషియు ఈ రాజునకుగల ఆదరాతిశయమును పరీక్షింప ఎన్నియో నియమములను విధించెను. ఆ నియమములతో ఋషిని మెప్పించి రాజును అటులే బ్రహ్మవిద్య నధికరించెను అనునది ఆ ఉపాఖ్యానము. ఇట్లు బ్రహ్మజ్ఞానమునకు హంసప్రేరకముగనుండుటచే బ్రహ్మజ్ఞాన ప్రేరకులగు ఆచార్యులు హంసగా వివక్షింపబడిరి.

2. పాలను నీటిని విభజించి పాలనుమాత్రము గ్రహించు శక్తిగలది హంసము. ఆచార్యులుకూడ సారాసారములతో నిండియుండు ఈ ప్రపంచమునందుండి, శాస్త్రములనుండి సారములను మాత్రము గ్రహించువారు.

3. **'అన్నమాయ్ నూల్పయన్దాన్'** అనినట్లు భగవంతుడు హంసరూపము నొంది వేదశాస్త్రములను వెలువఱచినట్లు శిష్యులకు వేదశాస్త్రముల నుపదేశించువారు ఆచార్యులు.

4. **'నబధ్నాతి రతిం హంసః కదాచిత్ కర్దమాంభసి'** అనినట్లు హంస అడుసులో నిల్వదు. అటులే ఆచార్యులు సంసారమను పంకమున నిల్వరు.

5. **'శంగమువై మురలచ్చెంగమల మలరై యేతి అన్నమలిపెడైయోడు మమరుమ్'** అనినట్లు హంస శంఖనాదంబు నింపుగా వినుచుండును. అట్లే శుద్ధస్వభావులగుశిష్యులే శంఖములు. అట్టి శిష్యుల స్తుతిఘోషముల నాలకించువారు ఆచార్యులు.

6. **'పెడైయోడన్నమ్ పెయ్యాళై యార్తమ్ పిన్ శెన్టు నడైయోడియలి'** (పెరియ తిరుమొN) అనినట్లు హంస, స్త్రీల నడకల సౌందర్యముజూచి తాను అటులే నడచుటకై, వెంబడించును. ఆచార్యులును అటులే హంసగామిని యగు లక్ష్మీదేవియొక్క గతిని వెంబడింతురు.

గతియనగా నడత. భగవంతునితో చేతనులను గూర్చి పురుషకారము చేయుటయే లక్ష్మీదేవి యొక్క ప్రధాన కృత్యము. అటులే భాగవతులును పురుషకారకృత్యమున నిష్ణులైయుందురు. లక్ష్మీపురుష కారము లేనిచో భగవంతుడు మోక్షము నివ్వజాలడు. అటులే భాగవతుల, ఆచార్యుల పురుషకారములేనిదే మోక్షము నివ్వజాలడని **'దత్తే రంగీ నిజమపి పదం దేశికాదేశ కాంక్షీ'** అను శ్రీసూక్తిచే వేదాంతదేశికులు తెల్పిరి. ఇట్టి సామ్యములు ఎన్నియైన చెప్పవచ్చును. వానిని విమర్శించి చూడగలరు.

# తుమ్మెదలు-ఆచార్యులు

ఆళ్వార్లు భగవద్విషయానుభవ నిరతులగు భాగవతులనే తుమ్మెదలుగా వచించియున్నారు. కాన ఆచార్యులకును తుమ్మెదలకునుగల సామ్యములను తెల్పెదము.

1 తుమ్మెదను **'మధువ్రత'**మంటారు. మధువును తప్ప ఇతరమును గ్రోలదని యర్థము. **'అడియవర్ తజ్గళ్ ఉళ్ళత్తుళ్ ఊటియతేనై'** (భక్తుల హృదయంబున ఊరిన తేనెను) అని ఆళ్వార్లు పలుచోట్ల తేనెగా వచించిన భగవద్విషయమును తప్ప ఇతరమును చూడక దీని ననుభవించుటనే వ్రతముగా గలవారు. దీనినే

**'తవామృతస్యందిని పాదపంకజే, నివేశితాత్మా కథమన్యదిచ్ఛతి, స్థితేరవిందే మకరందనిర్భరే, మధువ్రతో నేక్షురకం హి వీక్షతే'** అని ఆళవందార్లు స్తోత్రరత్నమున సాయించిరి.

2 సదా ఝుంకారము చేయుటయే తుమ్మెదల కృత్యము. అటులే **'మచ్చిత్తాః మద్గతప్రాణాః బోధయన్తః పరస్పరమ్ కథయన్తశ్చ మాం నిత్యం తుష్యన్తిచ రమన్తిచ'** అని గీతాచార్యులు వచించినట్లు సదా భగవంతుని కీర్తించి ఆనందించువారలును, తిరువాయ్‌మొNని అనుసంధించి రమించు వారలు భాగవతులు.

3 తుమ్మెద 'చచంరీకం' బనబడును. ఒకచోట నిల్వక మధువుగల స్థలమంత తిరుగును. అటులే శ్రీరంగాది దివ్యదేశములందు సదా సంచరించు చుండువారలు భాగవతులు. ఇటులే ఇతరార్థములం కనుగొనుడు.

## కోయిలలు-భాగవతులు

**'పోత్తి యానిరన్దేన్ వున్నై మేలుఱై పూఙ్కుయిల్‌గాళ్'** అని ఆళ్వార్లు కోకిలలు పొన్నచెట్టున వసించునట్లు వచించిరి. **'పున్నాగతల్లజ మజస్ర సహస్ర గీతి నేకోత్థ దివ్య నిజసౌరభ మామనామః'** అని శ్రీరంగరాజస్తవమున భట్టరు సాయించినట్లు తిరువాయ్‌మొN అర్థవిశేషమున వృద్ధిచెందిన శ్రీరంగములోని పున్నాగవృక్షము క్రిందనిల్చి విశేషార్థములను చర్చించు వారలు వివక్షితులు.

1. శ్రీరంగమున పూర్వాచార్యులకాలము మొదలు పున్నాగవృక్షము సుప్రసిద్ధముగ నుండెను. ఆ చెట్టునీడనుండి ఆచార్యులు తిరువాయ్ మొN అర్థములను చర్చించు చుందురని శ్రీవచనభూషణ వ్యాఖ్యానాదు లలో స్పష్టము. ఇట్లు ఆ చెట్టునీడనుండి తిరువాయ్‌మొN అర్థవిశేషము లను అనుభవించు ఆచార్యులే కోయిలలుగా వివక్షింపబడిరి.
2. **'మామ్బొయిల్ తళిర్‌కొదియ మడక్కుయిల్ వాయదు తువర్పెయ్‌ద త్తీమ్బులఙ్గని త్తేనదు నుగర్'** (పెరియతిరుమొN) అని మొట్టమొదట మామిడి చిగుళ్ళలో నోరిడుటచే వగర్పొందగా, పిమ్మట అది తొలగుటకై పనసపండ్లలోని తేనెను

గ్రోలునట్లు చెప్పబడెను. కోకిల స్వభావ మిదట. దీనిచే మొట్టమొదట సామాన్యశాస్త్రములందు నోరిడి పిమ్మట విశేష(అధ్యాత్మ) శాస్త్రములను పరమభోగ్యముగ ననుభవించు భక్తులు తెల్పబడిరి.

3. **'వనప్రియః పరభృతః కోకిలః పికః'** అను అమరకోశరీతిగ కోయిలకు పరభృతమని పేరు. కాకిగూటిలో విడువబడి దానిచే పోషింపబడి పెరుగునవియని అర్థము. అటులే పరుడగు ఆచార్యునిచే పోషింపబడి పెరుగు గురుకులవాసులు వచింపబడిరి.

4. **'వసంతకాలే సంప్రాప్తే కాకఃకాకః పికఃపికః'** అనినట్లు కోయిల కాల విశేషంబున తమ కంఠస్వరమును తెల్పును. ఆచార్యులును అటులే సమయ విశేషములందు గంభీరముగ ఉపన్యసించి ఇతరుల కన్న తమ వైలక్షణ్యమును తెల్పుచుందురు.

5. **'పికః కూజతి పంచమమ్'** అనినట్లు కోకిలకూజితమును పంచమ స్వరమని అందురు. అటులే ఆచార్యులు వచించునవి నాలుగు వేదముల సారమే కాక ఇది ఐదవ వేదమా! యని అతిశయింపదగి యుండును.

6. **'కుయిలే! ఎన్ వేఙ్గడవన్ వరక్కూవాయ్'** (కోయిలా! నాస్వామి యేతెంచునట్లు కూయుము) అనినట్లు భగవంతుని తన కూతలచే పిలిపించునవి కోయిలలు. ఆచార్యులునటులే తమ యుక్తిమాత్రము చేతనే భగవంతుని విధేయునిగ చేయువారలు. ఇటులే ఇతరార్థ విశేషముల నెఱుంగుడు.

## నంపెరుమాళ్ - భూపతి తిరునాళ్

శ్రీరంగంలో ది. **11-1-2011** నుండి **21-1-2011** వరకు నంపెరుమాళ్ భూపతి పెరుమాళ్ శ్రీరంగనాథ కోవెలలో అత్యంత వైభవం జరుగును.

గరుడసేవ సందర్భంగా ది. **14-1-2011**న పెరుమాళ్ పల్లకిసేవలో వీరరాఘవ రామానుజ కూటానికి (జీయరు మఠానికి) విచ్చేస్తారు. ఆసక్తిగల భక్తులు వచ్చి స్వామిని దర్శించగలరు. ఈ కార్యక్రమానికి ఉభయదారులుగా కూడా వ్యవహరించవచ్చు.

**- వీరరాఘవ రామానుజకూటం, శ్రీరంగం**

# గీతాజయంతి 2010
# భగవద్గీతా 2వ అధ్యాయం ఫైనల్ పోటీల వివరాలు

గీతాజయంతి 2010 సందర్భముగా భగవద్గీతా 2వ అధ్యాయములో అన్ని వికాస తరంగిణి శాఖల స్థాయిలో, జిల్లా స్థాయిలో పోటీలను నిర్వహించారు. వక్తృత్వ పోటీలలో జిల్లా స్థాయిలో మొదటి, రెండు స్థానములు సాధించిన బాల, బాలికలకు ఫైనల్ పోటీలు ది. 26.12.2010 న దివ్యసాకేతము, శ్రీరామనగరము ఆశ్రమ ప్రాంగణములో శ్రీశ్రీశ్రీ చిన్న జీయరు స్వామివారి ప్రత్యక్ష పర్యవేక్షణలో జరిగినది.

**జూనియర్స్ 15 సం॥రంలోపు, సీనియర్స్ 16–25 మధ్య బాలబాలికలు.**

*ఈ పోటీలలో విజేతల వివరములు:*

| | మొదటి బహుమతి | రెండవ బహుమతి | మూడవ బహుమతి |
|---|---|---|---|
| **జూనియర్స్** | **త్రిషా సాయిశ్రీ** (కృష్ణాజిల్లా) | **తేజా** (రంగారెడ్డి) | **ఎమ్.జయంతి** (జంటనగరాలు), **టి. సాయికృప** (కరీంనగర్) |
| **సీనియర్స్** | **జి. నాగవెంకటేష్** (ప.గో.జిల్లా) | **ఆదిత్య** (జంటనగరాలు) | **ఎన్. మనోజ్ఞ, ఎస్.కృష్ణ** (రంగారెడ్డి) |

ఈ పోటీలలో విజేతలైన వారికి ప్రథమ బహుమతి రూ. 10,000/–, ద్వితీయ బహుమతి రూ. 6,000/– తృతీయ బహుమతి రూ. 3000 (ఇద్దరికి) శ్రీశ్రీశ్రీ స్వామివారు బహుమతులు, ప్రశంసా పత్రములు అందించారు. ఈ పోటీలలో పాల్గొన్న చిన్నారులకు, ప్రోత్సహించిన వారికి, న్యాయనిర్ణేతలకు, నిర్వాహకులకు అందరికీ శ్రీస్వామివారు మంగళాశాసనాలు చేసారు.

శ్రీస్వామివారు మంగళాశాసనాలు చేస్తూ భగవద్గీత 2వ అధ్యాయము సాంఖ్యయోగము మొత్తము భగవద్గీతకు సారాంశమని దీనిలో మానవుడు ఎలా జీవిస్తే తన జీవితాన్ని సుఖమయం చేసుకోగలడో ఈ అధ్యాయం తెలియజేస్తుందని అందుకే ఈ అధ్యాయాన్ని " ఆనందానికి తొలిమెట్టు" అని నామకరణం చేసినట్లు తెలియజేసారు.

2011 వ సం॥లో భగవద్గీతలోని 3వ అధ్యాయంపై పోటీలు నిర్వహిస్తామని ఔత్సాహికులు అందరూ ఇప్పటి నుండే అధ్యయనం చేసి అధిక సంఖ్యలో పాల్గోనాలని తెలిపారు.

# శ్రీశ్రీశ్రీ స్వామివారి ప్రచారవార్తలు

## ఖాజీపాలెం కళాశాలలో శ్రీమాన్ కె. రామరాజుగారి పదవీ విరమణ కార్యక్రమ వివరాలు

శ్రీస్వామివారు డిసెంబరు 1వ తేదీన ఖాజీపాలెంలో శ్రీమాన్ కె. రామారాజుగారి పదవీవిరమణ అభినందన సభలో పాల్గొని మంగళాశాసనం చేశారు.

అలనాటి వెన్నవాడ-నేటి ఖాజీపాలెంలో పుణ్యవాగు చెంత మూడు దశాబ్దాల క్రితం పవిత్రాశయంతో నెలకొల్పిన విద్యాలయం K.V.R., K.V.R. & M.K.R. కళాశాల ఎందరో వదాన్యుల సహకారంతో శ్రీశ్రీశ్రీ చిన్న జీయరు స్వామివారి మంగళా శాసనములతో ఎంతగానో అభివృద్ధి చెందింది.

శ్రీ స్వామివారు తమ పాదస్పర్శతో ఈ కళాశాల ప్రాంగణాన్ని మరొకసారి పునీతం చేశారు. శ్రీస్వామివారితో ఈ ప్రాంతానికున్న అనుబంధం ఈనాటిది కాదు.

1993లో కళాశాల ప్రాంగణంలో 1008 మంది దంపతులతో సీతారామ కళ్యాణం, 1995లో వికాసతరంగిణి కార్యకర్తలకు ఐదురోజుల శిక్షణకార్యక్రమం, 1996లో 1008 గ్రామాల నుండి కలశాలు రాగ ఫిబ్రవరి 24,25,26 తేదీలలో పిట్టలవానిపాలెంలో సహస్ర కలశాభిషేకం... ఇలా ఎన్నో ఎన్నెన్నో.

2002లో శ్రీస్వామివారి కరకమలాలతో ఖాజీపాలెం డిగ్రీ కళాశాలలో ప్రారంభమైన ఎమ్.ఎస్.సి. కెమిస్ట్రీ కోర్సు అత్యుత్తమ ప్రమాణాలతో కొనసాగుతూ కళాశాల కీర్తిప్రతిష్ఠలను ఇనుమడింపచేస్తున్నది. 2002లో ధనుర్మాస కార్యక్రమం 2005లో పిట్టలవానిపాలెంలో స్వామివారి తిరునక్షత్రోత్సవము, 2008లో ఖాజీపాలెంలోని గీతామందిరం నూతన భవన ప్రారంభోత్సవం శ్రీస్వామివారి చేతుల మీదుగ జరగడం, ఈ ప్రాంతం శ్రీస్వామివారి కృపకు మిక్కిలి పాత్రమైనదనడానికి నిదర్శనం.

శ్రీస్వామివారు ముందుగా విశ్వవిద్యాలయ గ్రాంట్ల సంఘం ఆర్థిక సహకారంతో నిర్మింపబోవు తరగతి గదుల భవనానికి శంకుస్థాపన చేశారు. తదుపరి స్వర్గీయ పద్మభూషణ్ డా॥ బి.వి.రాజుగారి జ్ఞాపకార్థం వారి దౌహిత్రుడు అంజని పోర్ట్‌ల్యాండ్ సిమెంట్స్ అధినేత మరియు విష్ణు ఎడ్యుకేషనల్ సొసైటీ ఛైర్మన్ శ్రీ కె. విష్ణురాజుగారి సౌజన్యంతో నిర్మించబోవు బాలుర మరియు బాలికల విశ్రాంతి భవనానికి కూడా శంకుస్థాపన చేశారు.

అనంతరం 1981లో స్థాపించిన K.V.R. & M.K.R. కళాశాలకు 3 సం॥లు కామర్స్ అధ్యాపకునిగా, 27 సం॥లు ప్రిన్సిపాల్‌గా అసామాన్య సేవలందించి కళాశాల అభివృద్ధిలో కీలపాత్ర వహించి ది. 30.11.2010న పదవీ విరమణ చేసిన డా॥ కె. రామరాజుగారికి జరిగిన అభినందన సభలో పాల్గొని 'వృత్తిరీత్యా విద్యారంగానికి సేవచేస్తూ – ప్రవృత్తిరీత్యా సామాజిక, ఆధ్యాత్మిక సేవాతత్పరు'లైన డా॥ రామరాజుగారిని అభినందించి మంగళాశాసనాలు చేశారు.

శ్రీ స్వామివారు డా॥ రామరాజుగారి కోరిక మేరకు ముందుగా విద్యార్థులతో తనకున్న అనుబంధానికి గుర్తుగా వారి అభివృద్ధిని, శ్రేయస్సును కాంక్షిస్తూ వాత్సల్యపూర్వకంగా ఇవ్వదలచిన విలువైన పుస్తకాలను శ్రీస్వామివారి చేతులమీదుగా 800 మంది విద్యార్థులకు అందేటట్లు చేశారు. అంతేకాదు కళాశాల సిబ్బందికి, అభినందన మహోత్సవానికి విచ్చేసిన అనేకమందికి భారతీయ సంస్కృతి వైభవాలను చాటిచెప్పే 'గోపురము' పుస్తకమును శ్రీస్వామివారి చేతులమీదుగా యివ్వడం జరిగింది. శ్రీస్వామివారు విచ్చేసిన ప్రముఖులకు మంగళాశాసనాలు కృపచేశారు.

శ్రీస్వామివారు ఖాజీపాలెంలోని డా॥ రామరాజుగారి గృహాన్ని సందర్శించి పుత్రపౌత్ర బంధుసమేతంగా, కుటుంబ సభ్యులందరికీ మంగళాశాసనాలు చేశారు. అనంతరం 1996లో సహస్ర కలశాభిషేకం జరిగిన పవిత్రస్థలంలో వివిధ రకాల పండ్ల మొక్కలతో కళకళలాడుచున్న శ్రీ పెనుమెత్స మురళీకృష్ణంరాజుగారు నూతనంగా నిర్మిస్తున్న భవనాన్ని, వారు ప్రేమపూర్వకంగా పెంచుతున్నవనాన్ని సందర్శించి మంతెనవారిపాలెం, అలకాపురం, గోకరాజుపాలెం, పిట్టలవానిపాలెం మొదలగు గ్రామాల నుండి వచ్చిన వికాసతరంగిణి సభ్యులను ఉద్దేశించి అనుగ్రహభాషణం చేసి మంగళాశాసనాలు అందించారు.

3వ తేది రాత్రి 10.గం. లకు చెన్నైకు విచ్చేసిన శ్రీ స్వామివారికి కుచలాంబాళ్ కళ్యాణమండపం వద్ద చెన్నై జెట్, వి.టి. కార్యకర్తలు, మరియు భక్తులు శ్రీస్వామివారికి పూర్ణకుంభస్వాగతంతో ఆహ్వానించారు.

4,5 తేదీలలో ఆచార్యపీఠం, జెట్, వి.టి. సభ్యులు నిర్వహించే ' శ్రీవేంకటాచల ఇతిహాసమాల' సదస్సులో శ్రీస్వామివారు పాల్గొన్నారు. ఈ సదస్సులో ఉ.వే.శ్రీమాన్ ఎ. అరంగరాజన్‌స్వామి, ఉ.వే.శ్రీమాన్ ఎ. కృష్ణమాచార్యస్వామి, ఉ.వే. శ్రీమాన్ పరాశర భట్టర్‌స్వామి, ఉ.వే.శ్రీమాన్ వేల్కుడి కృష్ణస్వామి, ఉ.వే.శ్రీమాన్ వేంకట కృష్ణస్వామి, ఉ.వే. శ్రీమాన్ కపిస్థలం శ్రీనివాసాచార్యస్వామి, ఉ.వే. శ్రీమాన్ కె.బి. దేవరాజన్ స్వామి, ఉ.వే. శ్రీమాన్ వరదరాజన్ స్వామి, ఉ.వే. శ్రీమాన్ ఎ.టి.ఆర్. మాధవన్

స్వామి పాల్గొని శ్రీ వేంకటేశ్వర స్వామి వైభవాన్ని, తిరుమల క్షేత్ర వైభవాన్ని, భగవద్రామానుజులు ఏర్పరచిన వ్యవస్థల గురించి ప్రసంగించారు.

4వ తేదీ సాయంత్రం జెట్ చెన్నైవారు 2,000 మంది చిన్నారులతో వివిధ అంశములపై జరిగిన పోటీలలో విజేతలైన 200 మంది చిన్నారులకు శ్రీస్వామివారి చేతుల మీదుగా బహుమతి ప్రదానం జరిగింది. ఈ కార్యక్రమానికి ముఖ్య అతిథిగా శ్రీమాన్ రవి సానారెడ్డిగారు (శ్రీసిటి), ఈ పోటీ కార్యక్రమ నిర్వహణకు సహకరించిన శ్రీమాన్ రామూర్తిగారికి శ్రీస్వామివారు మంగళాశాసనాలు చేశారు.

5వ తేది సాయంత్రం 300 మంది భక్తులతో శ్రీస్వామివారు "శ్రీ విష్ణు సహస్రనామావళి" కార్యక్రమం అత్యంత వైభవంగా జరిపించారు.

6వ తారీఖున తీర్థగోష్ఠి అనంతరం ఉమ్మిడి రామయ్యగారి గృహంలో జరిగిన శ్రీసీతారామ కళ్యాణంలో పాల్గొన్నారు. అనంతరం శ్రీమతి పవన జనార్ధనరెడ్డిగారి, శ్రీమాన్ నరసారెడ్డిగారి గృహాలకు వేంచేసి మంగళాశాసనాలు చేశారు. సాయంత్రం "మనము–మన కర్తవ్యము" అనే అంశంమీద అనుగ్రహ భాషణం గావించారు.

చెన్నైపట్టణములో విపరీతమైన వర్షాలు పడుతున్నా అనేకమంది భగవద్బంధువులు ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు. కార్యక్రమ అనంతరం శివకాశికి పయనమై వెళ్ళారు.

7వ తేది మధురై విమానాశ్రయం నుండి కారులో శివకాశికి చేరుకున్నారు. శ్రీమాన్ మాధవన్‌స్వామి, శ్రీ విజయ్‌శ్రీధర్ (Kartik Poly pack–శివకాశి), శ్రీమాన్ శ్రీనివాస్, (G.M. Sripathi Paper & Boards), శ్రీ నాగరాజన్(Partner Balaji Packing Industries, Director Sripathi Paper & Boards), శ్రీమాన్ బాలాజీ మొదలగువారు భక్తిప్రపత్తులతో స్వాగతం పలికారు శ్రీస్వామివారికి. శ్రీమాన్ రవిచందన్ గృహంలో శ్రీవారికి వసతి ఏర్పాట్లు చేశారు.

8వ తేది ఉదయం తీర్థగోష్ఠి అనంతరం భక్తులకు సమాశ్రయణం అనుగ్రహించారు. సాయంత్రం శ్రీవిల్లిపుత్తూర్ నాచ్చియార్ సన్నిధికి వేంచేసి పెరుమాళ్ళను, అమ్మవారిని సేవించుకున్నారు. అక్కడ జరుగుతున్న నాచ్చియార్ కోవెలకు బంగారు విమానం తాలూకు పనులను పర్యవేక్షించి, రాబోయే సంప్రోక్షణ ఏర్పాట్లను గమనించి తగు సూచనలను చేశారు.

శ్రీస్వామివారు శ్రీమాన్ మాధవన్‌స్వామివారితో కలసి కార్తీక్ పాలీప్యాక్‌కు విచ్చేసి, అచ్చుట బ్యాగులను తయారు చేసే 3 మిషన్లను ప్రారంభించారు. అచట నుండి 'తిరుతంగాళ్'కు వేంచేసి, పెరుమాళ్ళను, తాయారును సేవించుకున్నారు.

అనంతరం శ్రీమాన్ గణేశన్ (సోనీ ఫైర్‌వర్క్స్ ఫ్యాక్టరీ), శ్రీ పద్మాశ్రీనివాస్ (శ్రీనివాసా పేపర్&బోర్డ్స్) గృహాలకు వేంచేసి వారి కుటుంబ మంగళాశాసనాలను చేశారు. శ్రీ విజయాశ్రీధర్ గృహంలో రెండు రోజులుగా జరుగుతున్న యాగ పూర్ణాహుతిలో పాల్గొని అక్కడ భక్తులకు మంగళాశాసనాలు చేశారు. ఈ కార్యాక్రమాలన్నీ శ్రీమాన్ మాధవన్‌స్వామి నేతృత్వంలో జరిగాయి. కార్యక్రమ అనంతరం శ్రీస్వామివారు శంషాబాద్ పయనమై వెళ్ళారు.

## వారిజ-విశాఖపట్టణం

గోదాదేవి లోకానికందించిన ధనుర్మాస వ్రతం పాడిపంటలను, సిరిసంపదలను ప్రసాదిస్తుంది. ఈ ఏడాది ధనుర్మాసం ప్రారంభంరోజే శ్రీ చిన్న జీయరు స్వామివారు విశాఖ వారిజ ఆశ్రమంలో భక్తులందరిని అనుగ్రహిస్తూ వేంచేసి ఉన్నారు.

శ్రీస్వామివారు 16-12-2010 వారిజ ఆశ్రమంలో శ్రీరామచంద్రుని ఆరాధన అనంతరం 3వేలమంది భక్తులకు శ్రీ ఏడాది వేంకటేశ శరణాగతి దీక్షను అనుగ్రహించారు.



శ్రీకాకుళం, విజయనగరం, విశాఖపట్నం, అనకాపల్లి ప్రాంతాలనుండి భక్తులు ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు. దీక్షాధారులకు శ్రీ వేంకటేశ వైభవాన్ని వివరించి, శ్రీస్వామివారే స్వయముగా తులసిమాలలను అనుగ్రహించారు.

శ్రీ విల్లిపుత్తూరు ఆండాళ్ సన్నిధి నుండి శ్రీరంగాచార్యస్వామి ఈ కార్యక్రమానికి విచ్చేసారు. శ్రీ విల్లిపుత్తూరులోని ఆండాళ్ గోపురాన్ని స్వర్ణగోపురంగా కట్టించి శాశ్వతంగా ఉండేలా ఏర్పాటు చేస్తున్నారు. ఆండాళ్ ఆలయ గోపురం నిర్మాణంలో మనవంతు సేవని అందించే అదృష్టం మనకు లభించింది.

ఈ అవకాశాన్ని సద్వినియోగ పరచుకోవాలని శ్రీశ్రీశ్రీ స్వామివారు తెలియజేయగానే సెంట్రల్ కమిటీ వర్మగారు 49 గ్రాముల బంగారు చేతి కంకణాన్ని స్వర్ణగోపుర నిర్మాణానికి సమర్పించారు. భక్తులు సుమారు 250 గ్రాముల బంగారు ఆభరణములను, ధనమును కూడా సంతోషంగా అక్కడే సమర్పించారు.

శ్రీశ్రీశ్రీ స్వామివారు అందరికీ మంగళాశాసనం చేస్తూ "ఎన్నోవేల సంవత్సరాలుండే ఆలయగోపురంలో సేవచేసుకొనే భాగ్యాన్ని సద్వినియోగం చేసుకోండి" అన్నారు.

"2011 వికాసతరంగిణి డైరీ"లను మరియు "2011 ఆదర్శ దినచర్య"ను



శ్రీస్వామివారు ఆవిష్కరణ చేశారు. ఈ కార్యక్రమంలో అన్వయించిన శ్రీమతి కరి తిరువేంగళమ్మ మొదటి డైరీని శ్రీస్వామివారి శ్రీహస్తముల ద్వారా అందుకున్నారు.



17వ తేది వైకుంఠ ఏకాదశి రోజున శ్రీస్వామివారు వారిజ ఆశ్రమంలో శ్రీరామచంద్రుని ఉత్తర ద్వారం వద్ద వేంచేపు చేసి ఆరాధన జరిపారు. భక్తులకు ఉత్తర ద్వారదర్శన భాగ్యం కలిగింది. అనంతరం వైకుంఠైకాదశీ వైభవాన్ని వివరించి, తీర్థగోష్ఠి జరిపారు.

శ్రీశ్రీశ్రీ స్వామివారి నేతృత్వంలో గత రెండు సం॥లుగా సామూహిక గీతాపారాయణను మొదటిసారి మంగళగిరి - ఎన్.ఆర్.ఐ. మెడికల్ కాలేజ్ ఆవరణలో, 2వ సారి ఎన్.టి.ఆర్. స్టేడియం-హైదరాబాద్‌లో వేలాదిమంది భక్తులతో అత్యంత వైభవంగా జరిగింది. ఈసారి ఎస్.వి.ఎస్. సంస్థ అధినేత శ్రీమాన్ బాలాజీగారు శ్రీస్వామివారిని ఆహ్వానించగా విశాఖలోని స్వర్ణభారతి స్టేడియంలో "సామూహిక భగవద్గీతా పారాయణ'' కార్యక్రమంలో పాల్గొన్నారు. వేలాదిమంది భక్తులు ఈ కార్యక్రమంలో అన్వయించారు.



శ్రీ విష్ణు సహస్ర నామ పారాయణ సర్వ శుభాలను కలిగిస్తుంది. ఈ విషయం గ్రహించిన తుని సమీపంలోని వేంపాడుగ్రామ వికాసతరంగిణి భక్తులు గ్రామంలో ప్రతి ఏకాదశి రోజున "అఖండ శ్రీ విష్ణు సహస్రనామ పారాయణ"ను శ్రీమతి సుబ్బలక్ష్మి, తునికి చెందిన శ్రీమాన్ వర్మ, శ్రీమతి పి. సుజాత మరియు వికాసతరంగిణి కార్యకర్తలు జరుపుకుంటున్నారు. ఇప్పటివరకు 121వ ఏకాదశి పారాయణలు పూర్తిచేశారు. ఈ సందర్భంగా శ్రీస్వామివారు 17వ తేది సాయంత్రం వేంపాడు గ్రామానికి వేంచేసి శ్రీ విష్ణు సహస్రనామ పారాయణ జరుపుకున్న భక్తులకు మంగళాశాసనాలు చేశారు.

18వ తేది ఉదయం శ్రీమతి సుబ్బలక్ష్మిగారి గృహంలో తీర్థగోష్ఠి జరిపారు. అనంతరం సుమారు 13వేలమంది భక్తులతో తులసిపూజ, కుంకుమపూజ జరిగాయి.

శ్రీస్వామివారు ప్రవచనంతో అందరినీ ఆనందింపచేశారు. కార్యకర్తలకు జ్ఞాపికలను అందజేశారు. ఈ కార్యక్రమానికి సహకరించిన వారికి, గ్రామపెద్దలకు మంగళా శాసనాలు చేశారు. సెంట్రల్ కమిటీ సభ్యులైన శ్రీమాన్ వర్మ, జిల్లా సెక్రటరీ శ్రీ వి. శ్రీనివాస్‌వర్మ ప్రత్యేక శ్రద్ధతో ఈ కార్యక్రమాన్ని నిర్వహించారు.

అనంతరం శ్రీ చిన్న జీయరు స్వామివారు శ్రీరామనగరం, దివ్యసాకేతంలో జరిగే అధ్యయనోత్సవాలలో పాల్గొనడానికి 'జీవా' ప్రాంగణానికి విచ్చేసారు.

ఈసారి ధనుర్మాస సందర్భంగ జరిగే శ్రీ వేంకటేశ శరణాగతి దీక్షకు ఓ ప్రత్యేకత ఉంది. 2004లో మన వికాసతరంగిణి ద్వారా శ్రీస్వామివారు ఆరంభం చేసిన ఈ దీక్ష ఈ ఏడాది ఏడవసారి జరుగుతోంది. ఇది, ఏడుకొండల రాయడి సేవ లోపరహితంగ జరగాలని, అక్కడి చరిత్రను తుడిచి పెట్టే దుష్టుల చర్యలు అడుగంటాలని, అక్కడ తొలగిన చారిత్రక చిహ్నాలు తిరిగి నెలకొనాలనే ఆశయాలతో ఆరంభమైంది. ఆర్తులైన భక్తులకు ఆ స్వామి చరిత్రను తెలియచేయడం, ఆచార్యవరేణ్యులైన భగవద్రామానుజులు అక్కడ ఏర్పరచిన వ్యవస్థిత పరచిన అద్భుత సంస్కరణల పట్ల అవగాహన కలిగించడం, తత్ఫలితంగ ఆ కొండయొక్క పవిత్రతను పరిరక్షించుకొనే ఆసక్తిని అందరిలో నింపడం ఈ వ్రతలక్ష్యాలు. వాటిని తెలియచేస్తూ ఏడు ప్రార్థనలు రోజుకొక్కటి చొప్పున పారాయణం చేయడం, అందలి విశేషాలను పురాణాలలోంచి, శ్రీ వేంకటాచల ఇతిహాసమాల అనే చారిత్రక గ్రంథం నుండి తెలుసుకోవడం, అందరితో కలసి పంచుకోవడం ఈ వ్రతంలో చేసే ప్రధాన కార్యాలు. సుమారు నాలుగు ఆవృత్తులు ఈ ప్రార్థనలను చదువుకుంటారు.

ఒక్కొక్కసారీ కొన్ని విశేషాలను తెలుసుకోవాలనేది తాత్పర్యం.

ఈసారి ప్రతిపట్టణంలోనూ విశేషసంఖ్యలో ఈ దీక్షావ్రతాలు జరగాలని శ్రీస్వామివారు సూచించారు.

దీనికి స్పందించిన మన వికాసతరంగిణులు, శ్రీశ్రీశ్రీ అహోబిల జీయరుస్వామి వారిని తమ తమ ప్రాంతాలకు విచ్చేయవలసిందిగ, అక్కడి భక్తులకు మంగళాశాసనాల ద్వారా ప్రోత్సాహాన్ని కలిగించవలసిందిగ ప్రార్థించారు. శ్రీస్వామివారు అంగీకరించి వీలయినన్ని చోట్ల శ్రీ సుదర్శన నారసింహయాగములను జరుపడానికి కార్యక్రమాన్ని రూపొందించారు. అందులో భాగంగ శ్రీ అహోబిల జీయరు స్వామివారు....

# శ్రీశ్రీశ్రీ అహోబిల జీయరు స్వామివారి ప్రచారవార్తలు

## ధనుర్మాస-శరణాగతి దీక్ష-సుదర్శన నారసింహ యాగ యాత్రా విశేషాలు

శ్రీశ్రీశ్రీ చిన్నజీయరు స్వామివారు సమాజం బాగుండాలని, ప్రతివ్యక్తి పరమాత్మ పాదములను ఆశ్రయించి ఉజ్జీవింపబడాలని 2004లో మనకు కృపజేసిన 'శ్రీవేంకటేశ్వర శరణాగతి దీక్ష' ఈ 7వ సంవత్సరం మన స్వామివారు ఏ సంకల్పాలతో ఈ దీక్షను ప్రారంభించారో ఆ సంకల్పాలను ఆమోదించి, నెరవేర్చుటకు శ్రీనివాసుడు రంగాన్ని సిద్ధంజేసింది ఈ సంవత్సరం. శ్రీనివాసుడు మనపై చూపుతున్న అనుగ్రహానికి కృతజ్ఞతగా, స్వామి వైభవాన్ని లోకానికి మరింతగా చాటాలని, తద్వారా లోకానికి మరింత శుభాలు కలగాలని, సుఖసంపదలతో సమాజం సత్ సంప్రదాయమార్గంలో ముందుకు సాగాలనే సత్ సంకల్పంతో ఈ సంవత్సరపు దీక్షలో శ్రీశ్రీశ్రీ అహోబిల జీయరు స్వామివారి ప్రత్యక్ష పర్యవేక్షణలో ధనుర్మాసంలో "శరణాగతి యాత్ర"ను జరపమని మంగళాశాసనములు అనుగ్రహించారు శ్రీశ్రీశ్రీ చిన్న జీయరు స్వామివారు.

డిసెంబర్ 16 నుండి జనవరి 20వ వరకు జరుగు ఈ యాత్రలో విశేషించి లోకకళ్యాణార్థమై "శ్రీ సుదర్శన నారసింహయాగము", శ్రీ నారసింహ సామూహిక పూజలు, నిర్వహించాలని శ్రీస్వామివారి సంకల్పం.

శ్రీ చిన్న జీయరు స్వామివారి సంకల్పానుసారం శ్రీ అహోబిల జీయరు స్వామివారు రాజమహేంద్రి శ్రీరంగధామంలో డిసెంబరు 16వ తేది నుండి 18 వ తేది వరకు శ్రీ సుదర్శన-నారసింహయాగాన్ని అతి వైభవముగా నిర్వహించారు.

18వ తేది మధ్యాహ్నం పూర్ణాహుతి ముగించుకొని సాయంత్రానికి సూర్యాపేటలోని శ్రీ వేంకటేశ్వర ఆలయానికి చేరుకున్నారు.

కార్యక్రమంలో ప్రతిచోట ముందురోజు ధనుర్మాస ప్రవచనం, తెల్లవారి శ్రీసుదర్శన నారసింహయాగం జరుపుతున్నారు శ్రీ అహోబిల జీయరు స్వామివారు.

19వ తేది ఉదయం ధనుర్మాస కార్యక్రమంలో భాగంగా శ్రీ వేంకటేశ్వర, శ్రీకృష్ణ, గోదా అర్చనలు, సేవాకాలం, తీర్థగోష్ఠి ముగించుకొని శ్రీ సుదర్శన నారసింహ యాగ సంకల్పంతో కార్యక్రమాన్ని ఆరంభించారు.

ప్రతివ్యక్తి సకల శుభాలను పొందాలని శ్రీ నృసింహాష్టకము, శ్రీసుదర్శనాష్టకము లను ఉపదేశాత్మకంగా కృపజేశారు శ్రీ అహోబిల స్వామివారు. మధ్యాహ్నం పూర్ణాహుతి ముగించుకొని కార్యక్రమాన్ని అందంగా నిర్వహించిన శ్రీమాన్ వేణుగోపాలాచార్య

స్వామికి, వి.టి. అధ్యక్షులు శ్రీమాన్ సత్యనారాయణగారి బృందానికి, యజమానులకు, ఉభయదారులకు మంగళాశాసనం కృపజేశారు.

సాయంత్రం నల్గొండలోని రామగిరి సీతారామాలయం చేరుకుని ధనుర్మాస ప్రవచనం కృపజేశారు.

20వ తేది ఉదయం యథావిధిగా ధనుర్మాస వ్రతం పూర్తిచేసుకొని మధ్యాహ్నానికి పూర్ణాహుతి జరుపుకొని కార్యక్రమాన్ని నిర్వహించిన ఆలయ కమిటీ బృందానికి సహకరించిన వి.టి సభ్యులకు యజమానులకు, ఉభయదారులకు మంగళాశాసనాలు కృపజేసి సాయంత్రానికి భాగ్యనగరం చేరుకున్నారు.

విశేషించి హైదరాబాద్ జంటనగరాలలో సుమారు 25 వి.టి.శాఖలు 6 స్థానాలలో పై కార్యక్రమాన్ని నిర్వహించడానికి సిద్ధపడ్డాయి. సాయంత్రం సికింద్రాబాద్ క్లాసిక్ గార్డెన్స్‌లో ధనుర్మాస ప్రవచనం కృపజేశారు.

21 ఉదయం ధనుర్మాసవ్రతాన్ని ఆరంభించి మధ్యాహ్నానికి పూర్ణాహుతి జరుపుకున్నారు. ఇక్కడి కార్యక్రమాన్ని సికింద్రాబాద్, బోయినపల్లి, కవాడిగూడ, కొంపల్లి, వి.టి.శాఖలు సంయుక్తంగా ఎంతో వైభవంగా నిర్వహించాయి. వారి బృందాలకు, యజమానులకు, ఉభయదారులకు, ఈ కార్యక్రమానికి ఫంక్షన్‌హాలును ఉచితంగా అందించిన క్లాసిక్ గార్డెన్స్ యాజమాన్యానికి శ్రీ అహోబిల స్వామివారు మంగళాశాసనాలను చేశారు.

కూకట్‌పల్లి హౌసింగ్‌బోర్డ్‌లోని రమ్యగ్రౌండ్స్‌లో ధనుర్మాస ప్రచన యాగ ఏర్పాట్లు నిర్వహించబడ్డాయి.

22వ తేది ఉ॥ తీర్థగోష్ఠి ముగించుకొని మధ్యాహ్నానికి శ్రీ సుదర్శన-నారసింహ యాగ పూర్ణాహుతి పూర్తిచేసి కార్యక్రమాన్ని నిర్వహించిన శాతవాహన, కూకట్‌పల్లి, హౌసింగ్ బోర్డ్.... వి.టి.శాఖల బృందాలకు, యజమానులకు, ఉభయదారులకు మంగళాశాసనం కృపజేశారు శ్రీ అహోబిల జీయరు స్వామివారు.

22వ తేది సాయంత్రానికి E.S.I. విజయలక్ష్మి దేవాలయం చేరుకొని ప్రవచనాన్ని కృపజేశారు.

23 ఉదయం గోష్ఠి ముగించుకొని, మధ్యాహ్నానికి యాగపూర్ణాహుతిని జరిపి, ఈ కార్యక్రమాన్ని E.S.I., మాసబ్‌టాంక్, ఖైరతాబాద్, ఎస్.ఆర్.నగర్ వి.టి.శాఖలు వైభవంగా నిర్వహించారు. వారి బృందాలకు, ఉభయదారులకు మంగళాశాసనం

చేసి సాయంత్రం రామంతపూర్ చేరుకొని అక్కడి ప్రభుత్వ పాలిటెక్నిక్ కళాశాల గ్రౌండ్స్‌లో ధనుర్మాస ప్రచనం కృపజేశారు.

24వ తేది ఉదయం అంబర్‌పేట, రామంతపూర్, హచ్చిగూడ వి.టి.శాఖలు ఇక్కడి కార్యక్రమాన్ని ఎంతో సమర్ధవంతంగా నిర్వహించాయి. వారికి శ్రీమాన్ హనుమంతరావుగారి అధ్యక్షతన శివాజీయూత్ అసోసియేషన్‌వారికి, యజమానులకు, ఉభయదారులకు మంగళాశాసనాలు కృపజేసారు. శ్రీ అహోబిల జీయరు స్వామివారు

సాయంత్రానికి సైదాబాద్, సంతోష్‌నగర్, మలక్‌పేట, దిల్‌షుక్‌నగర్ వి.టి. శాఖలు నిర్వహిస్తున్న కార్యక్రమం-లక్ష్మీగార్డెన్స్, చంపాపేటకు చేరుకుని ధనుర్మాస ప్రవచనం కృపజేశారు.

25 ఉదయం ఆరాధన గోష్ఠి, శ్రీసుదర్శన నారసింహయాగాన్ని ఎంతో వైభవంగా నిర్వహించుకొని, కార్యక్రమాన్ని నిర్వహించిన వి.టి. బృందాలకు, యాజమానులకు, ఉభయదారులకు మంగళాశాసనములు కృపజేశారు శ్రీస్వామివారు.

సాయంత్రం వనస్థలిపురం హిల్స్‌కాలనీ శ్రీరామాలయంలో కార్యక్రమ ఏర్పాట్లు చేశారు. వనస్థలిపురం, అలకాపురి, మీర్‌పేట వి.టి.శాఖలు. అక్కడ ధనుర్మాస ప్రవచనం కృపజేశారు స్వామివారు.

26 ఉదయం గోష్ఠి శ్రీసుదర్శన-నారసింహయాగం అతి వైభవంగా జరుపుకొని కార్యక్రమాన్ని నిర్వహించిన వి.టి. శాఖలకు, యాజమానులకు, ఉభయదారులకు మంగళాశాసనాలు కృపజేశారు శ్రీస్వామివారు.

పై ఆరు స్థానాల కార్యక్రమంలో పుష్పకైంకర్యాన్ని అందించిన శ్రీమతి శ్రీఉష శ్రీస్వామివారినుండి మంగళాశాసనాలు స్వీకరించారు. అలాగే శ్రీమాన్ చంద్రయ్య, (కరస్పాండెంట్ శ్రీస్వామి చిన్న జీయర్ ఇంటర్నేషనల్ స్కూల్) ధన్యులు. వీరు శ్రీ స్వామివారిచే ఉపదేశింపబడుతున్న "సుదర్శనాష్టకం" కార్డ్సును అందించారు. సాయంత్రానికి సిద్ధిపేట చేరుకున్నారు.

సిద్ధిపేట వికాసతరంగిణి, వారు ఊరు చివర నుండి శ్రీస్వామివారితో శోభాయాత్రను జరుపుకొని, సా॥ 7గం.లకు టి.టి.డి. కళ్యాణమండపం చేరుకుని ఆనాటి పాశుర వైభవాన్ని కృపజేశారు శ్రీ అహోబిల స్వామివారు.

27 ఉదయం ధనుర్మాస వ్రతం, తీర్థగోష్ఠి అనంతరం శ్రీ సుదర్శనయాగ పూర్ణాహుతిని ముగించుకొని కార్యక్రమాన్ని నిర్వహించిన సిద్ధిపేట వికాసతరంగిణి సభ్యులకు, సహకరించిన వైదిక పరివారానికి, యజమానులకు, ఉభయదారులకు

మంగళాశాసనం కృపజేసి సాయంత్రానికి కరీంనగర్ మన వేదభవనానికి చేరుకుని, ఆనాటి పాశుర వైభవాన్ని కృపజేశారు.

28వ తేది ఉదయం శ్రీమాన్ నరసింహాచార్య-వేదం గురువుగారు, శ్రీమాన్ ప్రభాకరరావుగార్ల బృందం ఎంతో వైభవంగా ఏర్పాట్లను కావించారు. ఆరాధన, తీర్థగోష్ఠి జరుపుకొని, శ్రీసుదర్శన నారసింహ యాగాన్ని ప్రారంభించారు. మధ్యాహ్నం పూర్ణాహుతి, కుంభసంప్రోక్షణ ముగించుకొని, నిర్వాహకులకు, యజమానులకు, ఉభయదారులకు మంగళాశాసనాలు అందించి రామగుండం బయలుదేరి సింగరేణి యాజమానుల ఆధ్వర్యంలో శ్రీ వేంకటేశ్వర ఆలయంలో ధనుర్మాస ప్రవచనం కృపజేశారు శ్రీ అహోబిల స్వామివారు.

29వ తేది ఉదయం రామగుండం దగ్గరలో ఉన్న గుండాల గుట్టపై ఉన్న శ్రీరామపాదుకాక్షేత్రంలో కార్యక్రమాన్ని శ్రీమాన్ తిరుపతిగారు, వికాసతరంగిణి వారు కలసి నిర్వహించారు. ఈ క్షేత్రాన్ని శ్రీశ్రీశ్రీ చిన్న జీయర్‌స్వామివారు కూడా సందర్శించి మంగళాశాసనాలు కృపజేశారు. గోష్ఠి, యాగపూర్ణాహుతి ముగించుకొని ఇక్కడి ఆలయ కమిటీ బృందానికి, వి.టి. కార్యకర్తలకు మంగళాశాసనాలు కృపజేసి సాయంత్రం మంచిర్యాలలోని టి.టి.డి కళ్యాణమండపంలో ధనుర్మాస ప్రవచనాన్ని కృపజేశారు శ్రీ అహోబిలస్వామివారు.

శ్రీమాన్ కృష్ణారావుగారి స్థలంలో కార్యక్రమ ఏర్పాట్లు జరిగాయి.

30 ఉదయం గోష్ఠి, శ్రీ సుదర్శన నారసింహయాగాన్ని అతి వైభవంగా ముగించుకొని కార్యక్రమాన్ని నిర్వహించిన శ్రీమాన్ వేంకటేశ్వరరావు, శ్రీమాన్ ప్రభాకర్‌రావుగారు, వి.టి. బృందానికి, యజమానులకు ఉభయదారులకు మంగళాశాసనాలు కృపజేశారు.

సాయంత్రానికి నిజామాబాద్ సుభాష్‌నగర్ రామాలయం చేరుకుని ధనుర్మాస ప్రవచనం కృపజేశారు.

31 ఉదయం గోష్ఠి, శ్రీసుదర్శన నారసింహయాగం, నరసింహ అష్టోత్తరపూజ వైభవంగా నిర్వహించుకొని, కార్యక్రమాన్ని ఏర్పాటు చేసిన శ్రీమాన్ గంప శ్రీనివాస్, ఇందూర్ వి.టి. బృందానికి, యజమానులకు, ఉభయదారులకు మంగళా శాసనాలుకృపజేశారు.

రాత్రికి మన ఆచార్యులైన శ్రీశ్రీశ్రీ చిన్న జీయర్ స్వామివారిని నూతన సంవత్సరంలో సేవించుకోవడానికి “శరణాగతి యాత్రా బృందం”తో శ్రీ అహోబిల స్వామివారు శ్రీరామనగరం చేరుకున్నారు.

**రాజమహేంద్రి:** శ్రీశ్రీశ్రీ అహోబిల జీయరు స్వామివారు 10-12-10 నుండి 18-12-10 వరకు రాజమహేంద్రి తులసీ రామానుజ కూటంలో వేంచేశారు. 11వ తేదీ నుండి మూడు రోజులపాటు 'యోగ తరగతులు' ఉ.5-30 నుండి నిర్వహించి, తీర్థగోష్ఠి జరిపారు. సాయంత్రం శ్రీ విష్ణు సహస్రనామ పారాయణ, ప్రవచనం, అనంతరం ఆక్యుప్రెజర్ తరగతులు నిర్వహించారు. ఈ కార్యక్రమాలకు శ్రీమతి అరుణ-మహబూబ్‌నగర్ సహకారం అందించారు.

13వ తేదీన శ్రీరంగధామం వేంచేసి తీర్థగోష్ఠి జరిపి సాయంత్రం లక్ష్మీనారాయణ పూజ జరిపించారు.

15వ తేది ముక్కోటి ఏకాదశి ప్రయుక్త సుదర్శన-నారసింహ యాగ అంకురార్పణ జరిగింది.

16వ తేది సమాశ్రయణాలు జరిగినవి. సాయంత్రం పెరుమాళ్ళను తులసీ రామానుజకూటం వేంచేపు చేసి తిరువీధి ఉత్సవం జరిగింది. ఈ ఉత్సవంలో మందస నుండి వచ్చిన పాత్తాంగుల ఆధ్వర్యవంలో పెరుమాళ్ళ ఊరేగింపు చాలా నయనానందంగా సాగింది.

పెరుమాళ్ళను ఊరేగింపుగా వయ్యారి నడకలతో సన్నాయి వాయిద్యాలతో, భజన బృందాలు, కోలాటాలతో గోదావరినదీ తీరానికి చేరుకున్నారు. అక్కడ అందంగా అలంకరించబడిన పడవలపై పెరుమాళ్ళు అందులోకి వేంచేశారు. తరువాత శ్రీ అహోబిల జీయరు స్వామి, స్థానాచార్యులు శ్రీ రఘునాథ్‌భట్టర్ స్వామి గీతాభవనం శ్రీమాన్ కృష్ణ, వేదపండితుల ఆధ్వర్యవంలో నదీపూజ పవిత్రంగా జరిగింది. గోదావరి తల్లికి పట్టుచీరె, గజమాల, పసుపు, కుంకుమ, పళ్ళరసాలు, మధుర ప్రసాదాలతో పూజా కార్యక్రమం జరిగింది. ఉపద్రవాలు ఏమీ రాకుండా అందరిని చల్లగా చూడమని శ్రీ అహోబిల జీయరు స్వామివారు భక్తులచే ప్రార్థన చేయించారు. చాలా అందంగా ఈ కార్యక్రమం జరిగింది. భక్తులు నదిలోన దీపాలు వదిలారు. అవి నక్షత్రాలలాగా భాసిల్లాయి.

పెరుమాళ్ళ సమక్షంలో నృత్యగీతాలాపనలు, భజనలు, సాంస్కృతిక కార్యక్రమాలు జరిగాయి. విజయవాడ నుండి ఘంటసాల పవన్ కుమార్‌గారి శిష్యులు, ఘటనృత్యం, రాజమహేంద్రి విజయశంకర సంగీత నృత్య కళాశాల విద్యార్థుల దశావతారాల నృత్యం, కర్ణాటక సంగీత కచేరి చక్కగా జరిగాయి. ఎంతో వినూత్నంగా జరిగిన ఈ కార్యక్రమం రాజమహేంద్రిలోనే 'న భూతో న భవిష్యతి' అన్నట్లుగా జరిగింది.

అనంతరం సుదర్శన నారసింహయాగ కార్యక్రమము, సాయంత్రం లక్షతులసి పూజ కార్యక్రమం జరిగింది. తరువాత కోటి దీపారాధన కార్యక్రమానికి 10వేలమందితో శ్రీరంగధామక్షేత్రం జనసంద్రమైంది.

17వ తేది ఉదయం శ్రీరంగధామంలో ముక్కోటి ద్వారదర్శనం ద్వారా పరంధామ నాథుని వేంచేపు చేసి భక్తులకు దర్శనమిచ్చారు. స్వామి పాదాల నుండి ఉద్భవించిన గంగను తలపించే సన్నివేశాన్ని చూపించి (పాదముల నుండి నీరు వచ్చేటట్లు ఏర్పాట్లు చేశారు.) భక్తులు ఆనందపరవశులయ్యారు.

18వ తేది తీర్థగోష్ఠి, యాగపూర్ణాహుతి అనంతరం వేదపండితులు విజయవాడ వాస్తవ్యులు, శ్రీ అహోబిల జీయరు స్వామివారి గురువుగారైన శ్రీమాన్ జొన్నవిత్తుల సుబ్బరామశర్మ గారికి సన్మానం చేశారు. ఎందరికీ విద్యాదానం చేసిన మహానుభావులను సంభావించుకోవడం పూర్వజన్మ అదృష్టంగా భక్తులు భావించారు. తరువాత చక్రస్నానం కోసం గోదావరి తీరానికి పెరుమాళ్ళు, భక్తులు చేరారు. అవబృధ స్నానానంతరం తదీయారాధన జరిగింది.

**శ్రీ వేంకటేశ శరణాగతి దీక్షలు :** శ్రీ అహోబిల జీయర్ స్వామివారు రాజమహేంద్రి సెంట్రల్ జైలుకి వెళ్ళి అక్కడ వున్న సుమారు 200 మంది ఖైదీలకు దీక్షను అనుగ్రహించారు. ఉన్నతాధికారులు కూడా దీక్షను స్వీకరించారు. విడుదలైన ఒక ఖైది ఆగి దీక్షను స్వీకరించడం ఒక అద్భుతం.

ఈ ఆధ్యాత్మిక కార్యక్రమాన్ని మాచే చేయించిన శ్రీ అహోబిల జీయరు స్వామివారికి ఏ విధంగా కృతజ్ఞతలు తెలియజేయగలం? అంజలులు ఘటించడంతప్ప.

కార్యక్రమానికి జెట్, వి.టి. సభ్యులు మాజీ ఎమ్.వి.వి. రామానుజంగారు, డా॥ రాజారాంగారు, శ్రీమాన్ బుచ్చిరామయ్యగారు, శ్రీమతి పద్మావతి, శ్రీమతి వేదవతి, శ్రీమాన్ రంగప్రసాద్‌గారు, ఆంజనేయులు, సుదర్శనం, బాబి, వర్మ, శారద గార్లు సహకరించారు.

**శ్రీరంగం :** డిసెంబరు 17వ తేదిన గీతాజయంతిని పురస్కరించుకొని రామానుజకూటంలో గీతాపారాయణ జరిగింది. వచ్చిన భక్తులకు ప్రసాద వితరణ జరిగింది.

**మందస :** వాసుదేవ పెరుమాళ్‌సన్నిధిలో అధ్యయనోత్సవములు22-1-10 నుండి 26-12-10 వరకు వైభవముగా జరిగాయని ఆలయ అర్చకులు తెలియజేశారు.

# పరమపదము



వరంగల్ వాస్తవ్యులు **శ్రీమాన్ కోయిల్ కందాడై శేషాచార్య స్వామి** ది. **10-12-2010**న పరమాత్మ పదసన్నిధికి చేరినారు.

వీరి తాతగారైన శ్రీమాన్ కోయిల్ కందాడై రంగాచార్య స్వామి, తండ్రిగారైన శ్రీమాన్ అప్పలాచార్యస్వామి, మరియు శేషాచార్యస్వామి శ్రీశ్రీశ్రీ పెద్ద జీయరు స్వామి, శ్రీ చిన్న జీయరు స్వామివార్లు నిర్వహించిన పండిత సభలలో పాల్గొనేవారు.

వీరికి పరమాత్మ పదసన్నిధిలో శాశ్వత కైంకర్యం లభించాలని శ్రీస్వామివారు మంగళాశాసనం చేశారు.

---

మచిలీపట్నం వాస్తవ్యులైన జగ్గయ్యపేట ఆచార్యులు అని పిలవబడే పరమపద వాసులు ఉ.వే.ప్ర. శ్రీమాన్ మరింగంటి శ్రీనివాసాచార్యస్వామి ధర్మపత్ని **శ్రీమతి లక్ష్మమ్మ ది.4-12-2010**న పరమపదించారు. వీరు శ్రీశ్రీశ్రీ పెద్ద జీయరు స్వామివారు మచిలీపట్నంలో ప్రతిష్ఠింపబడిన శ్రీరామక్రతుస్థూపంలో వేంచేసిన పెరుమాళ్ళకు అనేక విధములు తన వంతు సేవలందించిన కైంకర్యపరురాలు.

వీరికి శ్రియఃపతి సన్నిధిలో శాశ్వత కైంకర్యం లభించాలని వీరి కుటుంబ సభ్యులకు శ్రీస్వామివారు మంగళాశాసనం చేశారు.

---

మన సంస్థకు అత్యంత సన్నిహితులు, ప్రముఖ న్యాయవాదులు, శ్రీవారి శిష్యులు శ్రీమాన్ గొట్టుముక్కల సత్యనారాయణరాజుగారి ధర్మపత్ని శ్రీమతి **సుజనలక్ష్మిగారి** 6 వ వర్ధంతి ది.**19-12-2010**న జరుపుకొన్న సందర్భంగా భక్తినివేదనకు కైంకర్యం సమర్పించారు.

---

శ్రీస్వామివారి ప్రియశిష్యులు, విజయవాడ వాస్తవ్యులు శ్రీమాన్ **మొగళ్ళపు విద్యాసుగణ పూర్ణచంద్రరావు**గారి 10వ వర్ధంతి ది. **5-2-2011**న జరుపుకొను సందర్భంగా వారు చేసిన సేవలను గుర్తుంచుకొని వారి శ్రీమతి సరోజనమ్మగారికి, మరియు కుటుంబ సభ్యులకు శ్రీస్వామివారి మంగళాశాసనములు తెలియజేస్తున్నాం



- భక్తినివేదన

శ్రీమతే రామానుజాయ నమః

# భక్తినివేదన

ఆధ్యాత్మిక మాసపత్రిక



శ్రీ వికృతి నామ సంవత్సర ఉత్తరాయణం, శిశిరఋతువు, మాఘమాసం

**సంపుటి 63** **ఫిబ్రవరి 2011** **సంచిక 11**

వ్యవస్థాపకులు

పరమహంస పరివ్రాజకాచార్య

**శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జీయరుస్వామివారు**

సంపాదకులు :

శ్రీ ఉ.వే.శ్రీమాన్ T.P. **శ్రీరామచంద్రాచార్యులు**

# విషయ సూచిక



**శ్రీనమ్మాళ్వార్ శకం 5111  శ్రీ రామానుజ శకం 992-993  శ్రీమన్నారాయణ రామానుజ జీయరు శకం 102**

## పండుగలు - పంచాంగ వివరాలు

### ఫిబ్రవరి

6. ధనిష్ఠకార్తె
7. శూన్యతిథి
8. వసంతపంచమి
10. రథసప్తమి
11. భీష్మాష్టమి
13. కుంభసంక్రమణం ఉ. 10-26
14. భీష్మైకాదశి, సర్వేషాం శ్రీవిష్ణు సహస్రనామ జయంతి
15. భీష్మ ద్వాదశి, కులశేఖరాళ్వార్ తిరు॥
18. మాఘపూర్ణిమ, తిథిద్వయం
19. శతభిషకార్తె
22. మందసా వాసుదేవ పెరుమాళ్ బ్రహ్మోత్సవారంభం.
25. మందసా శ్రీవాసుదేవ పెరుమాళ్ కళ్యాణోత్సవం
28. సర్వేషామేకాదశి

### మార్చి

2. మహాశివరాత్రి, వేములవాడ శ్రీశైలములయందు అభిషేక కళ్యాణోత్సవము
4. పూర్వాభాద్రకార్తె, పిండపితృ యజ్ఞము, అమావాస్య.
5. రాజమహేంద్రి శ్రీరంగధామంలో బ్రహ్మోత్సవములు ఆరంభం


Printed & Published by H.H. Tridandi Chinna Srimannarayana Ramanuja Jeeyar Swamiji on behalf of **Jeeyar Educational Trust** and Printed at **Sriman Printers & Processors** C/o JET, Sitanagaram-522 501, Guntur Dist., Andhrapradesh. **Published at** C/o JET, Sitanagaram-522 501 Guntur Dist, Andhrapradesh, Editor: Sri **T.P.Sriramachandracharya** S/o. Sri Sitaramacharyulu, No: 5-74, Ayodhya, Visakhapatnam-28, Andhrapradesh.


**మీ సేవలో....**


**భక్తినివేదన,** సీతానగరం - 522 501, గుంటూరు జిల్లా, ఆంధ్రప్రదేశ్. 08645 272929,


**చందావివరాలు:-** సంవత్సరచందా రూ.50*/- జీవితచందా రూ.500/-,
విదేశాలకు సంవత్సరచందా $ 30*/-

* క్రొత్తగా సంవత్సర చందాదారులుగా చేరువారు సభ్యత్వ నమోదు, రూ.30/-లు (విదేశాలకు $5) అదనంగా చెల్లించవలెను. ఆపై ప్రతి సంవత్సరం సకాలంలో వార్షిక చందా చెల్లించిన చాలు.


E-mail : jetsitanagaram@yahoo.com  Internet : www.chinnajeeyar.org



D.T.P. & Design by : పరిశోధనాలయమ్,

ముద్రణ : శ్రీమాన్ ప్రింటర్స్ & ప్రోసెసర్స్, సీతానగరం

# దాగుడు మూతలు

దేవకి ఒడిబిడ్డగా కారాగారంలో అవతరించిన కృష్ణయ్య కంసుని భయం వల్ల వ్రేపల్లెలో యశోద ఒడి చేరి నందనందనుడుగా దాగి పెరిగినాడని లోకప్రసిద్ధి.

నిజంగా కృష్ణయ్య చాటుగానే పెరిగినాడా?

ఆయన వాలకాలూ వర్తనాలూ చూస్తే అట్లా అనిపించదు. దేవకీవసుదేవుల సంబంధమే ఎరుగని అభీరార్భకునిగా నటిస్తూనే అబ్బురంపు సాహసములు కావించి అతిమానవ శిశువుగా ఖ్యాతిని పొందుతాడు. ఈ అబ్బురంపు గరిమ స్వామి లీలా చారిమను చాటుతుందే తప్ప ఆయన ఆభిజాత్యానికి మట్టుకు అవకుంఠనం కాజాలదు - సరికదా సముత్తంగ హిమనగ శృంగనిభంగా నిలిచిన విజయధ్వజమే కాగలదు.

రోజుల శిశువుగా విషస్తన్యంతోపాటు ప్రాణాలూ పీల్చి బాలఘాతినిని పూతనను సంహరించినాడు. అర్ధయోజనముమేర పడిన ఆ ఆసురికట్టె బాలుని యశోవల్లి నింగిని చేర నిలిపిన పాదుకొయ్య తానైనది. ఈ వార్తవిన్న కంసుడు ఈ బుడుతడు గోపబాలుడని నమ్మునంతటి వెట్టివాడా?

పూతన సరే! శకటుని సంగతి?

ఆకటి కినుకతో కాలొకటి లీల చాచి తాచినాడట. సంధిబంధములెడలి బండినేలకూలినది. ఈ శకటభంజనం అతిమానవ శిశువొకడు వ్రేపల్లెలో నందునింట పెరుగు తున్నాడని, అసుర విమర్దనమతనికి అలవోక పనియనీ చాటుతూనే వుంది.

అసురమర్దనమే కాదు. ఆపన్నావనమూ అతనికలవోకయే. చిన్నికృష్ణుని చిలిపి చేష్టితములకు వ్రేపల్లెలోని వ్రేతల అభియోగములకు ఎదకలిగిన యశోద శిశువును ఱోట కట్టివేసినది. ఆ పాపడు నలకూబరమణిగ్రీవులను గుహ్యకులు శాపగ్రస్తులయి జంట మద్దులుగా నుండ కాంచి వాటి నడుమగా ఱోలీడ్చుకొనిపోగా చెట్లు నేలకూలి గుహ్యకులిరువురు శాపముక్తులయి కృష్ణభక్తులయిరి.

ఈ యమలార్జునభంజనం శిశుయశోవల్లి కల్నిపై లోకాలకు పాకించింది.

వత్స కపిత్థ ధేనుక ప్రలంబాది బహురాక్షస సంహారాదులు స్వామి కలరూపునకు విజయ ధ్వజపతాకలుగా నిలిచినవి.

వాస్తవం ఇట్లా ఉండగా కంసభయాన కృష్ణుడు వ్రేపల్లెలో దాగి పెరుగుతున్నాడనటం ఏపాటి సబబు? దాగినట్లే ఉన్నాడు. తన ఉనికిని ప్రతిక్షణం చాటుకొంటూనే ఉన్నాడు. అతిమానవ శిశులీలామధురిమను భక్తులకు చూరలిస్తూనే ఉన్నాడు. కంసునితో దాగుడు మూతలాడుతూనే ఉన్నాడు. ఈ అతిలోక కమనీయ శిశు లీలా మాధురీ రసోల్బణములయిన సన్నివేశములను స్ఫురింపచేస్తూ

*శ్రీ కూరత్తాళ్వాన్ అనుగ్రహించిన....*

"సా పూతనా శకట మర్జునయోశ్చ యుగ్మం
బాల్యోచితాన్యపర చేష్టిత విస్ఫులింగే
యస్యాలభంత శలభత్వ మహోనిగూఢః
సత్వం వ్రజే వవృధిషే కిల కంసభీత్యా"

అన్న శ్లోకం స్మరించుకోదగినది.

శ్రీరామచంద్రాచార్య

# శ్రీ కలివైరిసూరి వైభవము

శ్రీ ఉ.వే. శ్రీమాన్ కె.టి. రామానుజాచార్యస్వామి - నెల్లూరు

*(గత సంచిక తరువాయి)*

**తిరుమంగై ఆళ్వార్ - పెరియతిరుమొழி (బృహత్సూక్తి) 1-6-9**

**ఊనిడై చ్చువర్వైత్తు ఎన్బు తూణ్ నాట్టి ఉరోమం మేయ్న్దు ఒన్బదు వాశల్**
**తానుడై క్కురుంబై ప్పిరియుంబోతు ఉన్దన్ శరణమే శరణ మెన్నిరుందేన్ ।**
**తేనుడై క్కమల త్తిరువిను క్కరశే! తిరైకొళ్ మా నెడుం కడల్ కిడందాయ్**
**నానుడై త్తవత్తాల్ తిరువడి యడైందేన్ నైమిశారణియత్తుళెన్దాయ్ ॥**

*ప్రతిపదార్థము :* **తేనుడై**=తేనెలుగల; **కమలం**=తామరపుష్పమునందు అవతరించిన; **తిరువినుక్కు**=లక్ష్మీదేవికి; **అరశే**=వల్లభుడా! **తిరైకొళ్**=అలలుగల; **మా**=గొప్పదై; **నెడు**=లోతైన; **కడల్**=పాలకడలియందు; **కిడన్దాయ్**=శయనించినవాడా; **నైమిశారణియత్తుళ్**=నైమిశారణ్యమందు వేంచేసియున్న; **ఎన్దాయ్**=మాస్వామీ! **ఊన్**=మాంసమును; **ఇడై**=మధ్యలో; **శువర్**=గోడగ; **వైత్తు**=ఉంచి; **ఎన్బు**=ఎముకలను; **తూణ్**=స్తంభములనుగా; **నాట్టి**=నాట్టి; **ఉరోమం**=రోమములచే; **మేయ్న్దు**=నేసి (రోమములచే కప్పి); **ఒన్బతువాశల్ తానుడై**=తొమ్మిది ద్వారములుగల; **కురుంబై**=గుడిసె అగు ఈ శరీరమును; **పిరియుంబోతు**=ఎడబాయునప్పుడు; **ఉన్దన్**=నీయొక్క; **శరణమే**=శ్రీపాదములనే; **శరణమెన్ను**=రక్షకమని; **ఇరున్దేన్**=భావించియుంటిని; **నానుడై**=నాయొక్క; **తవత్తాళ్**=తపస్సుచే; **తిరువిడి**=నీ శ్రీపాదములను; **అడైన్దేన్**=ఆశ్రయించితిని.

**తాత్పర్యము:** మధుస్యన్దినియగు తామరపుష్ప మందవతరించిన లక్ష్మీదేవికి వల్లభుడైనవాడా! కెరటములతో కూడిన దియు, మిక్కిలి పెద్దదియునగు పాల కడలిపై శయనించియున్న స్వామీ! నైమిశారణ్యనాథా! మాంసపు ముద్దల నడుమ నడుమగోడగా నుంచి ఎముక లను స్తంభములనుగా నాటి, రోమము లను పైకప్పుగా వేసి, తొమ్మిది ద్వారము లతో కూడిన గుడిసెవంటి యీ శరీరమును వీడిపోవునపుడు నీ శ్రీచరణములే రక్షకములు కావలె అని తలంచియుంటిని. నీ నిర్హేతుక కృపయనెడి తపఃఫలముగా నీ శ్రీచరణములను ఆశ్రయింపగలిగితిని.

**విశేషార్థము:** ఆళ్వారే! మంగళకర మగు ఈ దివ్యమంగళ విగ్రహమును శుభాశ్రయమైనదిగా భావించి మీరు స్తుతి ప్రణామ పూర్వకముగ నన్ను ఆశ్రయించి ఇంద్రియములను కూడ జయించితి

నంటిరి. శరీర అవసానకాలమున నా స్మరణమును కూడ మీరు చేసితిరేని మోక్షము దానిచ్చుకు అదియే చేకూరును కదా! కలత ఏల చెందెదరు? అని యందువా స్వామీ! ఆ విధముగ నీవు పలుకుట తగదు. ఎన్నిటికిని శ్రీ చరణములే మాకుపాయము. ఆ ఉపాయ ఫలితముగ నాకు కలిగిన లాభముల పరంపరను అనుసంధించితిని. అంత మాత్రమే.

**ఊనిడైచ్చువర్వైత్తు :** మాంసమునే గోడగనుంచి లేదా మాంసపూరితమగు శరీరమును గోడగనుంచి, ఎముకలను స్తంభములనుగానాటి, దానిపై రోమము లను కప్పి.

**ఒన్బతు వాశల్తానుడైక్కురుంబై:** జీవుడు ఏ ద్వారము నుండి యయినను ప్రవేశించుటకును, బయలు వెడలుటకును వీలుగ భగవంతుడు శరీరమనే కుటీరము నకు తొమ్మిది ద్వారముల నమర్చెను.

**సర్వకర్మాణి మనసా**
**సంన్యస్యాస్తే సుఖం వశీ ।**
**నవద్వారే పురే దేహీ**
**నైవ కుర్వన్ నకారయన్** (భ. 5అ. 13శ్లో.)

**తాత్పర్యము:** అంతఃకరణమును అదుపులో నుంచుకొనిన యోగియగు పురుషుడు కర్మలను తాను ఆచరించిననూ ఆచరించనట్లే. తొమ్మిది ద్వారములుగల శరీరమునందు సమస్త కర్మలను మానసిక ముగ త్యజించి తాను కర్తగను, అకర్తగను కాకుండా సుఖముగ నుండును. రాకుమారుడు ఒక చిన్నకుటీరమున నివసించినట్లు జ్ఞాన, ఆనందములను లక్షణముగా గలిగి నిత్యుడై మార్పులు ఏవియు లేనటువంటి జీవుడు కర్మల కారణముగ జ్ఞానమునకు వికాస సంకోచములను కలిగించునటువంటి శరీరమున బంధింపబడియున్నాడు.

**విరయఱంబోదు:** శరీరమున ప్రవేశించుటకు తగిన కర్మలనువలె ఆ శరీరమునుండి విముక్తి నొందుటకును ఒక కర్మను చేయవలెనుకదా! అందులకు నీ శ్రీచరణారవిందములనే శరణములని నిశ్చయించుకొను కర్మచేయుచున్నాను.

ఆళ్వారే! మీరు దేనిని ఆలంబన ముగాగొని ఇట్లు భావించితిరి అని అందురేమో!

**తేనుడై క్కమల త్తిరువిను క్కరశే:** పురుష కార బలమును ఊతగగొని తేనెలూరు పద్మమందు వసించు శ్రీదేవికి ప్రియుడైన ప్రభువా!

**తిరైయిత్యాది:** అలసటను తొలగించు క్షీరాబ్ధియందు శయనించిన వాడా!

**మా నెడుం కడల్:** క్షీరాబ్ధి వెడల్పు లోను, లోతులోను మిక్కిలి గొప్పది.

**నానుడై ఇత్యాది:** తిరుమంగై ఆళ్వార్లు ఇంతకుమునుపే తమ ప్రవృత్తిని గూర్చి తెలిపియున్నారు. ఇక ఇచ్చుట **నానుడై త్తవం** అనుపదముచేత సర్వేశ్వరునే తెలుపుచున్నారు. నేను గావించిన తపః ఫలితముగ నీ శ్రీచరణములనే వచ్చి ఆశ్రయించితిని.

**నైమిశారణియత్తుళెందాయ్:** నీవు జగత్ సృష్టిని గావించియు ఈ లోకమున అవతరించియు దివ్యదేశములలో అర్చా రూపియై సన్నిహితుడవై వేంచేసి యుండి కదా ఈసుకృతమును నాకు కలిగించితివి.

**తేనుడై క్కమల త్తిరువిను క్కరశే:** తేనె లొలుకు తామరపుష్పమును వాసనముగా గల లక్ష్మీదేవికి వల్లభుడా! అనుటవలన ద్వయమంత్రమున పూర్వఖండములో మొదటగా తెలుపబడిన శ్రీమత్, పదము యొక్క అర్థము అనుసంధింపబడినది. పురుషకారభూతురాలగు లక్ష్మీదేవి సాన్నిధ్యమున ఆశ్రయించినందున, ఆగ్రహముతో భగవంతుడు దండించదని భావము. **తిరైకొళ్ మానెడుం కడల్ కిడందాయ్** అనుటచే **ఏషనారాయణః శ్రీమాన్ క్షీరార్ణవనికేతనః** అను శ్లోకమున తెలుపబడిన నారాయణ శబ్దార్థమును **తిరువడి అడైందేన్** అనుట **చరణౌ శరణం ప్రపద్యే** అను దాని అర్థమును తెలిపి ద్వయమంత్రములోని పూర్వ ఖండము యొక్క అర్థమును ఆళ్వారులు ఈ పాశురమున ప్రకాశింప చేసియున్నారు. తిరుమంగై అలా "సర్వేశ్వరుడే" తమ తపస్సుగా భావించియున్నారు. వారట్లు భావించుటకు భగవంతుడు గావించిన ప్రయత్నములను మనమున నుంచు కొని **ఎందాయ్** మహోపకారకుడా! అని భగవంతుని ప్రస్తుతించుచున్నారు. *(సశేషం)*



## భక్తినివేదన పాఠకులకు మనవి

**భక్తినివేదన అభివృద్ధిని ప్రోత్సహిస్తున్న పాఠకులకు శ్రీశ్రీశ్రీ స్వామివారి అనేక మంగళాశాసనములు...**

భక్తినివేదనలో మీ సభ్యత్వము చిరునామా మార్పు మరియు చందా పునరుద్ధరణ నిమిత్తం మాతో సంప్రదింపులు జరిపినప్పుడు తప్పక మీ చందా నెంబర్ మరియు పాత, క్రొత్త చిరునామాలు సూచింపగలరు. చందా ముగింపు తేది వివరములు మీ చిరునామా పైభాగంలో ఉంటాయి. గమనిస్తున్నారు గద! – **మీ భక్తినివేదన**

# శ్రీకులశేఖరాళ్వార్ వైభవము

ఉ.వే.శ్రీమాన్ ఎన్.వి.ఎల్.ఎన్. రామానుజాచార్యస్వామి- నరసాపురం

వీరు కలియుగాది 28వ సంవత్సరమునకు సమానమైన పరాభవనామ సంవత్సరమున సూర్యుడు కుంభరాశి యందు ప్రవేశించియుండగా మాఘశుద్ధ ద్వాదశీ గురువారమునాడు పునర్వసూ నక్షత్రమున కేరళదేశమందలి తిరు వంజి క్కళమ్ అను నగరమున కౌస్తుభాంశతో కేరళదేశాధీశులకు కుమారులై యవతరించిరి.

వీరి తండ్రిగారు క్షత్రియోత్తముడైన ధృఢవ్రత మహారాజు. అన్నగారు చేరన్. తిరువారాధన పెరుమాళ్ళు శ్రీరాముడు. (మన్ననార్,) కులశేఖరాళ్వార్, కులశేఖర ప్పెరుమాళ్, శేరలరకోన్, కుక్కుట పురాధీశర్, కొల్లికావలన్ అనునవి వీరి తిరునామములు. వీరి ఆచార్యులు విష్వక్సేనులు. వీరికి అర్చావతారమున తిరువేంగడముడైయాన్ యందు మిక్కిలి ప్రావణ్యము. ఆ విషయమును **పడియాయ్ కిడన్దు ఉన్ పవళవాయ్ కాణ్బేనే** అను పాశురమువలన తెలియుచున్నది. వీరు శ్రీరంగము, తిరుమల, అళ్గర్ కోయిల్, విత్తువక్కోడు, అయోధ్య, తిరు క్కణ్ణపురమ్, వణ్‌పురుషోత్తమ్; తిరుచ్చిత్తర కూడమ్ (గోవిందరాజస్వామి, లేదా చిదంబరంలోని పెరుమాళ్ళు) అను యెనిమిది దివ్యదేశములకు మంగళా శాసనము చేసిరి.

సకల శస్త్రాస్త్రవిద్యలను అభ్యసించిన వీరు శత్రువులను జయించి రామ రాజ్యముగా పాలించుచుండిరి. అయినను వీరిమనస్సులో యేదో కొఱత యుండెడిది. ఆకొఱతతీరునట్లు సర్వేశ్వరుడు వీరిని తన నిర్హేతుకమైన కృపతో అనుగ్రహించెను. ఆ కటాక్షమువలన వీరు దివ్యజ్ఞాన సంపన్నులై సర్వేశ్వరుని కైంకర్యము కంటె వేరు పరమార్థములేదని తలచి యుండిరి.

**అన్రు శరాశరజ్గళై వైకున్దత్తేత్తి** అనునట్లు ఆనాడు శ్రీరామావతార పరిసమాప్తి కాలమున అయోధ్యలోనుండు చరాచరములకు అన్నింటికిని పరమపదమును ప్రసాదించిన అవ్యాజ కరుణామూర్తియైన శ్రీరామచంద్రునియందు ప్రీతి మిక్కుటము.

ఆ కారణమున వీరు ప్రతి దినమును పౌరాణికులవలన శ్రీరామాయణమును వినుచుండెడివారు. వినుటలో వీరికుండెడి ఆసక్తి ఎంతటిదో తెలిపే ఒక అద్భుత సంఘటన వీరి చరిత్రలో ఉంది.

ఒకనాడు ఖరదూషణవధ ఘట్టము వచ్చినది.

*పౌరాణికులు...*

**చతుర్దశ సహస్రాణి**
**రక్షసాం భీమకర్మణాం**
**యేకో హి రామో ధర్మాత్మా**
**కథం యుద్ధం భవిష్యతి॥**

"ఆత్మలలో లేవు తేడాలు - అంతరంగాలలోనే."

అను శ్లోకాన్ని వినిపించారట. క్రూరకర్ములైన పదు నాలుగువేలమంది రాక్షసులతో ధర్మాత్ముడైన శ్రీరామచంద్రుడు ఒక్కడే యెలా యుద్ధంచేస్తాడో అని దేవతలు మహర్షులు బాధపడుతున్నారనే శ్లోకం విని అది అపుడే జరుగుతున్న దానినిగా భావించిన వీరు శ్రీరామచంద్రు నకు సహాయం చేయటానికి పోదామంటూ ధనుర్బాణాలను తీసికొని బయలుదేరా రట. వీరి అభినివేశాన్ని గమనించిన మంత్రులు వీరు నగరం వెలపలకుపోవు సరికి పౌరాణికులచే....

**తం దృష్ట్వా శత్రుహంతారం**

**మహర్షీణాం సుఖావహమ్।**

**బభూవ హృష్టా వైదేహీ**

**భర్తారం పరిషస్వజే।** "సాధు కంటకు లైన ఖర, దూషణ,త్రిశిరులను సంహరించి మహర్షులకు సుఖాన్ని కలిగించిన శ్రీరామ చంద్రునిచూచి సీతాదేవి సంతోషించి ఆలింగనము చేసికొనెను'' అను శ్లోకమును చదివించారు. అది విని కులశేఖరులు శాన్తులై వెనుదిరిగిరి.

మన శ్రీవైష్ణవ సంప్రదాయంలో శ్రీరామచంద్రునకు **పెరుమాళ్** అని వ్యవహారము. కులశేఖరాళ్వార్ల అవతార నక్షత్రము శ్రీరామచంద్రుని అవతారనక్షత్ర మగు పునర్వసు అగుటచేత, శ్రీరామ చంద్రునియందు మిక్కిలి భక్తిగలిగి యుండుటచేత వీరికికూడా పెరుమాళ్ అను తిరునామము ఏర్పడినది. కావుననే వీరిని **కులశేఖరప్పెరుమాళ్** అని అందురు.

వీరు శ్రీరంగమున అర్చామూర్తిగా వేంచేసియున్న శ్రీరంగనాథుని దివ్య దర్శనమునకై తహతహలాడుచుండిరి.

ఈవిషయము **వన్‌పెరువాన్ అగముయ్య అమరర్ ఉయ్య** – సకల లోకవాసులు, దేవతలు, భూలోకము; భూలోకవాసులు, తరించుటకు; అశేషపాపరాశిని నశింప చేసి కొనుటకు, మహానందమును అనుభ వించుటకు, దక్షిణదిశాభిముఖముగా శయనించిన శ్రీరంగనాథుని సేవించుట యెన్నడోగదా! అను వారి పాశురములోనే మనకు కనిపిస్తుంది.

శ్రీరంగనాథుని సేవించుటకై వీరు ప్రతిదినము ప్రయాణమయ్యేవారు. వీరు శ్రీరంగముచేరి రంగనాథుని సేవించినచో తిరిగి రాజ్యమునకు రారని, రాజ్యపాలన చేయరని భావించిన మంత్రులు వీరి భాగవతనిష్ఠను గమనించినవారు గనుక శ్రీరంగప్రయాణ సమయమునకు భాగవత గోష్ఠిని వీరికి ఎదురుగా తీసికొని వచ్చు చుండిరి. కులశేఖరులును భాగవత గోష్ఠిని సేవించి వారికి సకలోపచారములను చేయుసరికి ఆదినము గడచిపోయేది.

ఇట్లే ప్రతిదినము వీరి ప్రయాణము భాగవతుల ఆగమనముతో నిలచి పోయేది.

ఈ విషయము **ఘుష్యతే యస్య నగరే రంగ యాత్రా దినే దినే** అను వీరి తనియన్ (శ్లోకం)ద్వారా మనకు తెలుస్తోంది.

**వీరి భాగవతనిష్ఠకు ఒక ఉదాహరణ:**

శ్రీవైష్ణవ సిద్ధాన్తములో ప్రత్యక్షము,

అనుమానము, శబ్దము అని ప్రమాణములు మూడు. అందులో శబ్దము అనగా వేదము.

ఈ శబ్దప్రమాణముచేతనే సర్వేశ్వరుని తెలిసికొనవలెను. కానీ తొండరడిప్పొడియాళ్వార్లు తాము అనుగ్రహించిన తిరుమాలై ప్రబంధమున ఒక పాశురమున ప్రత్యక్షప్రమాణముచే శ్రీమన్నారాయణుని పరత్వమును ప్రకటించారు చూడండి... తిరుమాలై ప్రబంధంలో ఏడవ పాశురంలో **తలై యరపుణ్ణమ్ శావేన్ శత్తియమ్ కాణ్మిన్ ఐయా, శిలయినాల్ ఇలజ్గైశెత్త దేవనే దేవనావాన్**– అయ్యా! ఇదిగో "తన ధనస్సుచేత లంకను నశింపచేసిన శ్రీరామ చంద్రుడే వరదైవము'' అని ప్రమాణము చేయుచున్నాను. ఇది ప్రత్యక్ష ప్రమాణము. కావలెనంటే నా తల నరుకుడు. నేను చెప్పినమాట నిజమే అయినచో నేను చావను. ఇది ప్రత్యక్ష సత్యము చూడుడు. అని ప్రత్యక్ష ప్రమాణముద్వారా పరదేవతా నిష్కర్ష చేసియున్నారు.

అట్లే కులశేఖరప్పెరుమాళ్లను భాగవత వైభవమును ప్రత్యక్ష ప్రమాణము ద్వారా తెలియచేస్తారు.

ఈ విషయమును వీరి... **ఆరంకేడ పరనన్బర్ కొళ్ళారెన్డు అవర్ గళుక్కే వారజ్గొడు కుడప్పామ్బిల్ కైయిట్టవన్**– హారములనెవరో అపహరించారు. అది వైష్ణవులేనని వీరలపై నిందలు మోపగ... కులఖేరులు దానిని అంగీకరించకుండా శ్రీవైష్ణవుల యందు పక్షపాతము వహించి శ్రీవైష్ణవులు దొంగతనము చేయరు అని పామున్న కుండలో చేయిపెట్టినవారు, అను వీరి తనియన్ పాశురము ద్వారా తెలుస్తోంది. ఈ విషయమును తెలిసి కొందుము.

కులశేఖరులు భాగవతనిష్ఠులై రాచ కార్యముల యందు అశ్రద్ధ వహించిరి. ఇదిగమనించిన మంత్రులు వీరికి భాగవతులయందు వైముఖ్యము గలుగుటకుగా వారి ఆరాధనామూర్తి కంఠహారమును దొంగిలించి దాచి ఆనేరమును కైంకర్యమును చేయు స్వాములపై పెట్టిరి. ఇట్లుచేసిన శ్రీవైష్ణవస్వాములు ధనమునకై భగవద్రవ్యమును దొంగిలించుటకుకూడ వెనుదీయరు అని తలచి కులశేఖరులు వారియందు వైముఖ్యముగలవారై రాచ కార్యములందు శ్రద్ధ వహింతురని మంత్రుల అభిప్రాయము.

కానీ, కులశేఖరులు అట్లు భావింపక శ్రీవైష్ణవస్వాములయందే పక్షపాతము వహించి 'శ్రీవైష్ణవస్వాములు దొంగతనము వంటి పాపకార్యములు చేయరు. ఇది ప్రత్యక్షముగా నిరూపింతును. ఒక కుండలో పామునుపెట్టి తెండు. నేను ఆకుండలో చేయి పెట్టెదను. శ్రీవైష్ణవులే దొంగతనము చేసినచో ఆ పాము నన్ను కరచును. చేయనిచో అది నన్ను కరవలేదు' అని చెప్పి పామున్నకుండలో చేతిని పెట్టిరట. ఆపాము వారిని యేమిచేయలేదు. ఇది చూచిన మంత్రులు వారి

భాగవతనిష్ఠకు ఆశ్చర్యపడి జరిగిన విషయమును వారికి తెలియచేసిరి.

కులశేఖరులును పరమవైరాగ్య సంపన్నులై రాజ్యమును కుమారునకు అప్పగించి శ్రీరంగము చేరి శ్రీరంగనాథుని నిత్యకైంకర్యమును చేయుచుండిరి.

వీరు అనుగ్రహించిన గ్రంథములు రెండు. 1. పెరుమాళ్ తిరుమొళ్థి 2. ముకుందమాల. ఈరెండును రెండు ఆణిముత్యములు. పెద్దల ద్వారా వీనిని సేవించి తరింపవలెను.

### వీరి తనియన్

1. **కుంభే పునర్వసౌ జాతం**
   **కేరళే చోళపట్టణే,**
   **కౌస్తుభాంశం ధరాధీశం**
   **కులశేఖర మాశ్రయే॥**

2. **ఘుష్యతే యస్య నగరే**
   **రంగయాత్రా దినే దినే**
   **తమహం శిరసా వందే**
   **రాజానం కులశేఖరమ్॥**

**నాళ్ పాట్టు**

**మాశిప్పునర్పూశమ్ కాణ్మినిన్ఱు మణ్ణులగీర్,**
**తేశు ఇత్తివశత్తక్కు యేదెన్టిల్, పేశుగిన్ఱేన్**
**కొల్లినగర్‌కోన్ కులశేకరన్ పిఱప్పాల్**
**నల్లవర్‌గళ్ కొణ్డాడుమ్ నాళ్.**

### వాళ్థి తిరునామమ్

**అఞ్జనమామలై ప్పిఱవి**
**యాదరిత్తోన్ వాళ్థి యే,**
**అణియరంగర్ మణత్తూణై**
**యడైన్దు ఉయ్న్దోన్ వాళ్థి యే,**
**వఞ్జినకరమ్ తన్నిల్**
**వాళ్థ వన్దోన్ వాళ్థి యే,**
**మాశితనిల్ పునర్పూశమ్**
**వన్దుతిత్తాన్ వాళ్థి యే,**
**అఞ్జలెన క్కుడప్పాంబిల్**
**కైయిట్టాన్ వాళ్థి యే,**
**అనవరతమ్ ఇరామకతై**
**అరుళువవన్ వాళ్థి యే**
**శెఞ్జొల్‌మొళ్థి నూత్తఇఞ్జ శెప్పినాన్ వాళ్థి యే,**
**శేరలర్ కోన్ శంకమల త్తిరువడి కళ్ వాళ్థి యే ॥**

గ్రంథ పరిచయము:

## "శ్రీవైష్ణవ అనుష్ఠాన దీపిక"

కీ.శే. **బూరగడ్డ కందాళై జగన్నాధ తిరువేంకట రామానుజాచార్యులు**గారిచే సంకలనం చేయబడిన గ్రంథం **"శ్రీ వైష్ణవ అనుష్ఠాన దీపిక"**. ఈ గ్రంథములో 'పరమార్థ స్తుతి, స్నానసమయ సంకల్పం, త్రికాల సంధ్యావందనం, గురుపరంపర, నూతన యజ్ఞోపవీత ధారణ, శ్రావణపౌర్ణమ్యాం యజ్ఞోపవీతధారణవిధి, లఘు తిరువారధన, సంకల్పవిధానం, ఆబ్దీక మంత్రం, మహాలయ దర్శ ప్రయుక్త తర్పణం" కలవు.

**వెల** : 15/-, పోస్టేజి రూ. 2 అదనం. (బుక్‌పోస్ట్ మాత్రమే. వి.పి.పి. లేదు.)

**ప్రతులకు:** **బి.కె. వెంకటాచార్యులు** బి.ఎ., రిటైర్డ్ టెలిఫోన్ సీనియర్ సూపర్‌వైజర్,
రాఘవాచార్యవీధి, 24 బి-10-27, ఆర్.ఆర్.పేట,
ఏలూరు - 534 002. ప.గో.జిల్లా. ఫోన్: 08812 237942.



"అహో! భారతమ్"

# గరుడోపాఖ్యానము

**శ్రీమతి డా॥ టి.కె.చూడామణి-విజయవాడ**

*గత సంచిక తరువాయి*

గరుత్మంతుడు స్వర్గలోకం నుండి అమృతాన్ని తెచ్చి తల్లిని దాస్యం నుండి విడిపించాలని వేగంగా బయలుదేరాడు. బలమయిన రెక్కల నుండి పుట్టిన గాలి వలన చెట్లన్ని అటూ ఇటూ ఊగిపోయాయి. పూలన్నీ వానలాకురిసాయి. అతని రెక్కలు ఆపూలతో నిండిపోయాయి.

అదే సమయంలో స్వర్గంలో ఏదో తెలియని భయం చోటుచేసికొంది. దిక్పాలకుల మనసులు భయంతో నిండిపోయాయి. వజ్రాయుధం ఎందుకో కళాహీనంగా కనిపించింది. దుశ్శకునాలు ఎదురయ్యాయి. దేవతాగణాల ఆయుధాలన్నీ ఒకదానితో ఒకటి ఢీకొట్టుకున్నట్లు కనిపించాయి. ఉరుముల గర్జనలు వినిపించాయి.

దేవతల మెడలో ఉన్న దండలు వాడిపోయాయి. ఏదో దుమ్ము దేవతల కిరీటాలపై పడి మాసిపోయి నట్టయ్యాయి. ఇంద్రుడు భయంతో వణకిపోయాడు. తమ గురువైన బృహస్పతి దగ్గరకి పరుగుపరుగున వెళ్ళి "అయ్యా ఆచార్యా! ఏమిటీ అపశకునాలు? ఎందుకిలా జరుగుతోంది?" అని ప్రశ్నించాడు.

బృహస్పతి చిన్నగా మనసులో నవ్వుకున్నాడు. తప్పు చేసినప్పుడు తెలియదు. తరువాతే దాని ఫలితం అనుభవించవలసి వస్తుంది అనుకుంటూ - 'దేవేంద్రా! ఇదంతా నువ్వు చేసిన తప్పువల్లనే వచ్చిన కష్టమయ్యా' అన్నాడు.

'ఆచార్యా! నేనా? ఏం తప్పుచేశాను? ఎప్పుడు చేశాను?' అన్నాడు ఇంద్రుడు.

బృహస్పతి వివరించి చెప్పడం మొదలు పెట్టాడు.... 'పూర్వం కశ్యప ప్రజాపతి తనకు పుత్రులు కలగాలని పుత్రకామేష్టి అనే యజ్ఞాన్ని చేశాడు. అప్పుడు యజ్ఞంలో తనకి సాయంగా మిమ్మల్ని, వాలఖిల్యులనే మహర్షులని, ఆహ్వానించాడు. అందరూ వచ్చారు. 'ఇంద్రా! నువ్వేమో చాలా బలం గలవాడివి కాబట్టి సమిధల మోపు పెద్దదానిని తలపై తేలికగా మోసికొని వస్తున్నావు.

కాని వాలఖిల్యులు బొటన వేలంత చిన్నవారు. బలం లేనివారు. అయినా తాము కూడా సాయం చేయాలని దర్భల కట్టలు నెత్తిపైపెట్టుకొని అవి కూడా మోయలేక మోయలేక తెస్తున్నారు. ఎప్పుడూ ఉపవాసాలు చేస్తూండడం వలన మరీ సన్నగా ఉన్నారేమో పాపం మోయ

"స్పర్ధతో సాధించలేనిది సహకారంతో సాధించగలము."

లేక పోతూంటే నువ్వు వాళ్ళని చూసి హేళనగా నవ్వావు. వాళ్ళు సిగ్గుపడ్డారు. అంతలో కోపం వచ్చేసింది. వెంటనే కశ్యపప్రజాపతి దగ్గరకి వెళ్ళి అయ్యా! నీకు ఈ యజ్ఞం వలన ఇంద్రుడికంటే వంద రెట్లు బలంకలిగిన కొడుకు పుడతాడు. యుద్ధంలో అతనిని ఎవరూ జయించ లేరు. అగ్నిలాంటి ప్రకాశమూర్తి, అణిమాది సంపద గలవాడు, ఇంద్రుడయ్యే వాడు, అసామాన్యుడు పుడతాడు' అంటూ మంత్రజపాలతో అగ్నిలోహోమం చేశారు.

అపుడు నువ్వు భయపడిపోయావు. వెంటనే కశ్యపుని దగ్గరకి వెళ్ళావు. నన్ను దయ చూడండి అని ప్రార్థించావు. ఆయన దయచూపాడు. వాలఖిల్యులను చూచి అయ్యా! ఈ ఇంద్రుడు ఉండగా మళ్ళీ ఇంద్రుడు వస్తే లోకపాలన తారుమారవు తుంది గదా! అలాగనీ మీ వాక్కు కూడా వ్యర్థం కాదు. కాకూడదు. అందుకని నాకు పుట్టబోయే కుమారుడు పక్షిజాతికి అంతటికి రాజౌతాడు. పక్షులలో ఇంద్రు డన్నమాట. పక్షీంద్రుడు. కశ్యప ప్రజాపతి పుత్రకామేష్టి మాహాత్మ్యం చేత, వాలఖిల్యుల మాహాత్మ్యం చేత పుట్టాడేమో అబ్బో! మహనీయుడయ్యాడు. అతడు కామరూపుడు కూడా. ఇప్పుడు మన అమృతం అపహరించడానికి వస్తున్నాడు. అనుకొన్నదానిని సాధించడంలో సమర్థుడు. అతనికి అసాధ్యమన్నదే లేదు" అన్నాడు.

బృహస్పతి మాటలకి ఇంద్రునికి ఆనందం, భయం ఒకేసారి కలిగాయి. తన పదవికి పోటీ లేనందుకు ఆనందం కలిగినా అమ్మో...! అమృతాన్ని ఎత్తుకు పోతాడా.. బాబోయ్... వెంటనే అమృత రక్షకులని పిలిచాడు. "చూడండి బలవీర్య సంపన్నుడయిన పక్షీంద్రుడు అమృతం కోసం వస్తున్నాడు. ఆయన మహాబలశాలి యని మన గురువులు చెప్పారు. జాగ్రత్తగా రక్షించండి అమృతాన్ని" అన్నాడు.

అంతలో పిడుగుల గుంపు అన్నంత శబ్దం వచ్చింది. మబ్బులు దూదిపింజల్లా ఎగిరిపోయాయి. గరుడుడు మనోవేగంతో అమృతం దగ్గరకి ఎగిరాడు. అమృత రక్షకులు గట్టిగా అరుస్తూ అతనిపై దాడి చేశారు. వైనతేయుడు రెక్కలతో ధూళిని లేపి దారిని చీకటిచేశాడు. వాయువు ఇంద్రుని ఆజ్ఞతో ఆ దుమ్ము చెదరగొట్టాడు. భామనుడు అనే గొప్ప వీరుడు ఇంద్రాజ్ఞతో గరుత్మంతుని ఎదిరించాడు. కాని మిడతలా బూడిదయ్యాడు. దిక్పాలకులు దిక్కుతోచక పరుగులుపెట్టారు. వసువులు, రుద్రులు, సాధ్యులు, ఆదిత్యులు, అశ్వినీ దేవతలు పరుగులు పెట్టారు. వజ్రాల్లాంటి గోళ్ళతో, ఎదరు వచ్చిన వారినందరిని చీల్చి చెండాడాడు గరుత్మంతుడు. తన దేహాన్ని చిన్నగా మార్చి అమృతాన్ని రక్షించే చక్రం క్రింద చేరాడు. అక్కడ రెండు పాములు తమ విషాన్ని చిమ్ముతూ ఎవరినీ

దగ్గరికి రానీయకుండా అమృతాన్ని రక్షించడం చూశాడు. వాటి తలలు తన్ని పడేశాడు. ఒక్కసారిగా అమృత కలశాన్ని పట్టుకొని ఆకాశంలోకి ఎగిరాడు.

శ్రీమహావిష్ణువు గరుడుని బలానికి ఎంతో ఆనందించాడు. 'అమృతం దొరికినా కూడా నోట్లో పోసుకోడే.... తాగడే.... అబ్బా.... అనాసక్తి. బలే! ఇతనికి వరం ఇవ్వాలి' అనుకుంటూ అతని ముందునిలిచాడు. వరంకోరుకో! అన్నాడు.

గరుత్మంతుడు అతనికి నమస్కరించాడు. ''దేవా! ఈ అమృతం తాగకుండానే నాకు ముసలితనం, చావు రాకుండా వరమియ్యి, ఎప్పుడూ నీసేవ చేసే భాగ్యం కల్పించు'' అన్నాడు. "అయితే నాకు వాహనంగా, జెండగా ఉండు'' అంటూ అనుగ్రహించాడు శ్రీమహావిష్ణువు

"ఆహా! ఏమి భాగ్యం? స్వామీ నీకు గరుడ వాహనుడు, గరుడధ్వజుడు అనే పేర్లు వస్తాయి. అలా నీసేవలో నేను చిరస్థాయిగా ఉండిపోతాను. కృతజ్ఞుడను" అంటూ నమస్కరించి అమృతంతో ఎగిరి పోయాడు.

చూశాడు ఇంద్రుడు. అయ్యో! అమృతం, అమృతం అనుకుంటూ తన వజ్రాయుధాన్ని విసిరేశాడు. గరుత్మంతుడు వజ్రాయుధంతో నువ్వు నన్నేం చేయలేవు. కానీ మహాశక్తిమంతుడు, తపస్సంపన్నుడు అయిన దధీచి వెన్నెముక చేత దీనిని తయారుచేశారు గదా! ఆ గౌరవంతో నా యీక ఒకదానిని నీకిస్తున్నాను. దానిని తెంపు' అన్నాడు. వజ్రాయుధం తాకిడితో గరుత్మంతుని ఈక ఒకటి రాలింది. చూస్తున్న ప్రాణికోటి ఆశ్చర్యపోయింది.

"ఆహా ఇతని పర్ణాలు, అంటే ,రెక్కలు ఎంత దృఢమైనవి. అందుకే ఇతడు **సుపర్ణుడు** మంచి బలమైన రెక్కలు గలవాడు" అని స్తుతించింది.

ఇంద్రుడు కూడా ఆ పక్షిరాజు గొప్పదనానికి మెచ్చుకున్నాడు. "మహావీరా! నీతో నాకు స్నేహం చేయాలని ఉంది. నీకు శ్రీమహావిష్ణువు వరంతో ఎలాగూ జరామరణాలు లేవు. మరి ఈ అమృతం ఇతరులకిస్తే వాళ్ళని జయించడం కష్టం. దీనిని ఎవరికీ ఇయ్యకు. నాకే ఇచ్చెయ్" అన్నాడు.

గరుడుడు "అయ్యా! మా అమ్మ దాస్యం పోవాలంటే నేను పాములకి అమృతాన్నియ్యాలి. నేను వాళ్ళకిచ్చి, వాళ్ళు తాగేలోపే నువ్వు వచ్చి పట్టుకెళ్ళిపో. సరేనా!" అన్నాడు ఇంద్రుడు.

గరుడా! 'నీ పరాక్రమాన్ని ఒక్కసారి వర్ణించి చెప్పు' అన్నాడు.

అబ్బే! అలా మనని మనం పొగుడుకో కూడదు. అది ఆత్మస్తుతి. అలాగే ఇతరులని నిందించకూడదు. పరనింద పనికిరాదు. కాని నిజాన్ని చెప్తున్నా విను. నేను ఈ భూమండలాన్నంతటిని మోయగలను. సముద్రంలో రత్నాలతోసహా పైకి నీళ్ళన్నింటిని వెదజల్ల

"పుష్పానికి సంపద పరిమళం. - చంద్రునికి సంపద వెన్నెల."

గలను. మూడు లోకాలు క్షణంలో చుట్టి రాగలను. ఇది సత్యం' అన్నాడు.

'అందుకే నీవంటి బలశాలితో స్నేహం చేయాలని కోరుకుంటున్నాను' అన్నాడు ఇంద్రుడు. 'నీకొకవరం కూడా ఇస్తాను కోరుకో' అన్నాడు.

'అయితే నన్నూ, మా అమ్మ వినతనీ ఇంతగా బాధించిన కద్రువ కొడుకులు నాకు ఆహారం కావాలి. నిన్ను ఎందుకు అడుగుతున్నానంటే నువ్వు పాలించే లోకాల్లో ఆ సర్పాలు తిరుగుతున్నాయి. కాబట్టి నీఅనుజ్ఞ అడుగుతున్నాను' అన్నాడు.

'సరే' అన్నాడు ఇంద్రుడు.

గరుడుడు అమృతభాండాన్ని తెచ్చి దర్భలపై పెట్టాడు. కాద్రవేయులందరినీ పిలిచాడు. 'ఇదుగో... ఇంద్రుడు రక్షించే అమృతం తెచ్చి మీకిచ్చాను. దేవతాసాక్షిగా మా అమ్మ దాసీతనం పోయింది. ఇంక మీరంతా స్నానం చేసిరండి. శుచిగా అమృతం త్రాగండి' అని పంపించాడు.

తన తల్లి వినతను వీపుపై ఎక్కించు కొని ఆనందంగా ఎరిగిపోయాడు. పాములంతా ఆనందంతో స్నానంచేసి రావడానికి పరుగులు తీశారు. ఇంతలో ఇంద్రుడు అమృతాన్ని గ్రహించి అమరావతికి వెళ్ళి అమృతకలశాన్ని మళ్ళీ జాగ్రత్త పరచి సుఖంగా, నిశ్చింతగా ఉన్నాడు.

పాములన్నీ స్నానం చేసి వచ్చే టప్పటికి అమృతమేదీ? అయ్యో! ఇక్కడే కదా అమృతభాండం పెట్టాడని గబ గబా నాలుకతో నాకేటప్పటికి వాటి నాలుకలు రెండుగా చీలాయి. జిహ్వ అంటేనాలుక కదా! నాలుక రెండుగా అవడం వలన పాములకి 'ద్విజిహ్వులు' అని పేరు వచ్చింది. అమృతం తమపై ఉంచడం చేత దర్భలు పవిత్రాలయ్యాయి.

ఈ కథకే "సుపర్ణోపాఖ్యానము" అని పేరు. గరుత్మంతునికి సంబంధించిన ఈ కథను విన్న పుణ్యాత్ములకు సిరిసంపదలు వృద్ధిచెందుతాయి.

పాపాలన్నీ నశిస్తాయి. పాములు, రాక్షసుల భయాలు కలగనే కలుగవు. అతి పవిత్రమైనదీ గరుడోపాఖ్యానం.

సమాప్తం

# శిష్య వాత్సల్యమ్

శ్రీమాన్ సముద్రాల శఠగోపాచార్యస్వామి-వరంగల్

దయాంతరంగులైన, సద్విద్యానిధులైన సదాచార్యులు సకలసద్గుణభూషితులై శిష్య జనకల్పతరువులై భాసిల్లుతూ ఉంటారు. సదాచార్యుని వైభవాన్ని లోకానికి చాటి చెప్పే సద్గుణసంపత్తిలో అగ్రగణ్యమైనది శిష్యవాత్సల్యమనునదియే.

సదాచార్యులు తమను ఆశ్రయించిన శిష్యులకు తమ శక్తియుక్తులను, తమలో దాగియున్న సర్వ విద్యారహస్యాలను ఉపదేశిస్తారు.

శ్రీశుకులవారు పరీక్షన్మహారాజుకు భాగవతాన్ని ఉపదేశించే సందర్భంలో "ప్రియతములైన శిష్యులకు సదాచార్యులు ఎంతో గొప్పవైన విద్యారహస్యాలను ప్రేమతో ఉపదేశిస్తారు.

**"బ్రూయుః శిష్యస్య స్నిగ్ధస్య**
**గురవో గుహ్య ముత్తమమ్"**

అని పేర్కొన్నారు.

వేదశాస్త్ర పురాణేతిహాస సంప్రదాయ విజ్ఞాన రహస్యాలను శిష్యులకు అందించ డమే లక్ష్యంగా జీవనాన్ని కొనసాగించేవారే సదాచార్యులు. ఒకటో రెండో ప్రశ్నలను అడిగి ఏవో కొన్ని విషయాలను మాత్రమే తెలుసుకుందామని భావించే వారినికూడా సదాచార్యులు ఎక్కువ మక్కువతో అక్కున చేర్చుకొని వారిని జిజ్ఞాసువులుగా తీర్చి దిద్దుతారు.

తల్లి కొసరి కొసరి పిల్లవాడికి తిని పించినట్లు శిష్యవాత్సల్యపూర్ణులైన సదా చార్యులు ఆశ్రితులైన శిష్యులనుద్దేశించి మరికొంచెం వినండి, మరికొంచెంవినండి అంటూ పరమరహస్యార్థాలను వివరిస్తాను. మీకంటే ఆప్తులు ఆత్మీయులు నాకు వేరెవరూ లేరు అంటూ విద్యాబుద్ధు లను నేర్పిస్తారు.

*శ్రీకృష్ణపరమాత్మ అర్జునునితో...*

**"భూయ ఏవ మహాబాహో!**
**శృణు మే పరమం వచః ।**
**ఇష్టోఽసి మే సఖా చేతి**
**రహస్యం హ్యేతదుత్తమమ్ ॥**

నీవు నాకు ప్రియమైన మిత్రుడవు. కావున నీకు ఉత్తమోత్తమములైన రహస్యార్థాలను వివరిస్తాను. ఇంతకు మించిన విలువైన మాటమరొకటి లేదని జగద్గురువైన శ్రీకృష్ణుడు, తనకు ప్రధాన శిష్యుడైన అర్జునుడికి సత్సంప్రదాయ రహస్యాలను చెప్పకుండా ఉండలేకఅమిత వాత్సల్యంతో వరుసపెట్టి వివరించెను.

"మహాపాపినైనా మహాత్ముణ్ణి చేస్తాడు మాధవుడు."

పాలు పిండేవారు అందుబాటులో లేకుంటే ఆవులు, గేదెలే తమ దూడలను తలుచుకుంటూ తమ పొదుగు దగ్గర దూడలు మూతిపెట్టినట్లుగా భావించు కుంటూ సమృద్ధిగా పాలను వర్షించును (కార్చును.) అట్లే సదాచార్యులు కూడా శిష్యులపట్ల అమితవాత్సల్యాన్ని కలిగి యుండి, వారు అడగకుండానే తమంతట తామే సదుపదేశాలను అనుగ్రహిస్తారు.

శిష్యవాత్సల్య పూర్ణులైన సదా చార్యుల ప్రబోధం వలన

**"శ్రీభాష్యం వా యతిపతి కృతం,**
**శాంకరం వాపి భాష్యమ్।**
**కాణాదం వా కపిల గదితం**
**శాస్త్రమేవాఽపి చాన్యత్"**

భగవద్రామానుజుల శ్రీభాష్యము, శాంకరభాష్యము, కాణాదుని వైశేషికము, కపిలుని సాంఖ్యశాస్త్రం అట్లే ఏ ఇతర శాస్త్రమునైనా సరే సులభంగా అభ్యసించ వచ్చు. సదాచార్యోపదేశానికి బండరాళ్ళ వంటి కఠినహృదయాలుకూడా కరిగి మెత్త పడుతాయి. ఆచార్యోపదిష్టమైన విషయాన్ని

**(పాషాణం వా భవతి మృదులం**
**మానసం తత్ ప్రబోధాత్)**

సంపూర్ణంగా గ్రహించగలుగుతాయి.

జగదాచార్యులైన శ్రీరామానుజులు తమను ఎవరూ కోరకుండానే తమంతట తామే గోపురమెక్కి సర్వజనోజ్జీవనార్థమైన మంత్రాన్ని ఉపదేశించారు. కృపామాత్ర ప్రసన్నాచార్యులై వెలుగొందారు.

గోదాదేవి ఐదులక్షలమంది గోపిక లతో కలసి శ్రీవ్రతాన్ని ఆచరించి తమ సమకాలీనులైన వారెందరినో ఉద్ధరించిరి. దయామయురాలైన జగన్మాతయైన గోదాదేవికి సంసారార్ణవమగ్నులైన దీను లైన చేతనులను ఉద్ధరించాలనే లోకహిత భావన కలిగినది. అందుకే వర్ణలింగ వయోభేదం లేకుండా అన్ని కాలాలకు, అన్ని ప్రాంతాలకుచెందిన ఆస్తిక జను లెల్లరూ **శ్రీవ్రతాన్ని** అనుష్ఠించి తరించుటకు 'తిరుప్పావై' అనే శ్రీసూక్తిరత్నమాలికను లోకానికి ఉపదేశించి ఆదర్శాధ్యాపకురాలై నిలిచినది. భక్తజనులకు ప్రాతఃస్మరణీయు రాలైనది గోదాదేవి.

లోకహితాభిలాషులైన కులశేఖరులు ముకుందమాలలో...

**"హేమర్త్యాః! పరమం హితం**
**శృణుత వో వక్ష్యామి సంక్షేపతః,**
**సంసారార్ణవ మాపదూర్మి బహుళం**
**సమ్యక్ ప్రవిశ్య స్థితాః ।**
**నానాజ్ఞానమపాస్య చేతసి**
**నమో నారాయణాయేత్యముం,**
**మంత్రం సప్రణవం ప్రణామ**
**సహితం ప్రావర్తయధ్వం ముహుః"**

**"భక్తుని బాసకు భగవంతుడు బద్ధుడు."**

టఓమనుజులారా! ఆపదలు అనే అలలతో కూడిన సంసారం అనే సముద్రంలో మునిగియున్న మీకు పరమ హితవైన విషయాన్ని సంక్షేపంగా చెప్పెదను. కాస్త శ్రద్ధగా వినండి.

మీరు భేదదృష్టినివదిలి **'నమో నారాయణాయ'** అను మంత్రానికి ఓంకారమును కలిపి నమస్కరిస్తూ ప్రతి నిత్యము' జపించండి తరిస్తారు' అని జగద్ధిత భావనతో అష్టాక్షరీమహామంత్ర ప్రాముఖ్యాన్ని గుర్తించమని సరళంగా సంగ్రహంగా స్పష్టంగా సుందరంగా ఉద్బోధించారు.

ఈ విధంగా శిష్యవాత్సల్య గుణ పూర్ణులైన ప్రాతః స్మరణీయులైన ఆళ్వారా చార్యుల దివ్యశ్రీసూక్తులను ఆస్వాదిద్దాం. జీవితాన్ని సార్థకం చేసుకుందాం!



సకలాభీష్టదాయిని

## శ్రీవిష్ణు సహస్రనామ స్తోత్ర పారాయణం

**విశ్వశాంతికై సకలసంపత్ ప్రదాయిని అయిన శ్రీ విష్ణు సహస్రనామ స్తోత్ర పారాయణం గత 14 సంవత్సరాల నుండి మన శ్రీశ్రీశ్రీ చిన్న జీయర్ స్వామి వారు భీష్మ ఏకాదశిని పురస్కరించుకుని లక్షలాది మందితో ఉపదేశాత్మకంగా భక్తులందరికీ అందిస్తున్నారు.కోట్లాది మంది భక్తులు శ్రీ విష్ణు సహస్రనామ స్తోత్రపారాయణం శ్రీవారి ద్వారా ఉపదేశం పొంది తద్వారా వారి వారి అభీష్టాలను నెరవేర్చుకోగలిగారు.**

**శ్రీ విష్ణు సహస్రనామ స్తోత్రపారాయణ చేయడం విశ్వశాంతికి, సమాజ శ్రేయస్సుకు, సర్వమానవాళికి ఎంతో ఉపయోగకరంగా ఉంటుందని, ఆహార్దికంగ, ఆర్థికంగా బలాన్ని చేకూరుస్తుందని శ్రీ స్వామివారు దీనిని గురించి తెలుపుతుంటారు.**

**ఈ సంవత్సరం భీష్మ ఏకాదశి (ఫిబ్రవ్రరి14) పర్వదినాన్ని పురస్కరించుకొని తమ తమ ప్రాంతాలలోని దేవాలయాలలో, గృహాలలో శ్రీ విష్ణుసహస్రనామ పారాయణం సా॥6గం.లకు భక్తులు జరుపుకోవాలని శ్రీ స్వామివారు ఆదేశించారు. " అందరికీ సకల అభీష్టాలు కలగాలని, అరిష్టాలు, అశాంతులు తొలగాలని, మానసిక ప్రశాంతతో అందరం కలసి సహజీవనంచేయాలి విశ్వశాన్తిని కాంక్షిస్తూ" మనందరం సంకల్పం చేసుకుని శ్రీస్వామివారి ఆదేశానుసారం శ్రీవిష్ణుసహస్రనామాలను పారాయణం చేసి శ్రీలక్ష్మీనారాయణుల అనుగ్రహానికి పాత్రులం అవుదాం, జీవితాలను ధన్యం చేసుకుందాం.**

"చూచేవారిని బట్టి మణుల విలువ పెరుగుతుంది."

# సీతాఫలం రామార్పణం

శ్రీమతి చెవుటూరి కుసుమకుమారి - విజయవాడ

*(గత సంచిక తరువాయి)*

అంతట కేకయరాజు

**కైకేయ్యాం మమ పుత్ర్యాం యః**
**రాజ్ఞః పుత్రో భవిష్యతి ।**
**రాజ్యం తస్మై ప్రదేహి త్వం**
**సత్యేనానేన గృహ్యతామ్ ॥**

హే గర్గమునీ! నాకుమార్తెకు జన్మించిన పుత్రునికే రాజ్యార్హత కలుగునట్లు దశరథునిచేత శపథము చేయించి, కైకేయి వివాహమునకు ఏర్పాట్లు చేయించుడని కోరాడు. గర్గముని వెంటనే అయోధ్యకు చేరి, దశరథా! నేను నిన్నొక కోరిక కోరుటకై బహుదూరదేశమునుండి వచ్చినాను. కనుక నీవు తప్పక నాకోరిక తీర్చవలెనని అడిగినాడు.

దశరథుడు 'మహర్షీ! నా అర్ధ ప్రాణాలను ఒడ్డి అయినా సరే నీ కోరిక నెరవేర్చెద'నని మాట ఇచ్చినాడు. దశరథుని మాటకు ఆనందించిన గర్గముని 'రాజా! కాశ్మీరప్రభువైన అశ్వపతి మహారాజు తనకుమార్తె కైకను నీకిచ్చి పరిణయము చేయతలచినాడు. కానీ ముందుగా ఒక ప్రతిజ్ఞను నీకు చెప్పు' మనినాడు.

**కైకేయ్యాం మమ కన్యాయాం**
**యస్తు పుత్రో భవిష్యతి ।**
**తస్మై రాజ్యం దదా త్వేవం**
**గృహ్ణాతు మమ కన్యకామ్ ॥**

రాజా! కైకేయియందు నీకు కలిగిన పుత్రునకు రాజ్యము నిచ్చెదనని ప్రమాణము చేసి ఆ కన్యను స్వీకరించుమని.

అప్పుడు దశరథుడు మనసులో ఈ విధంగా యోచన చేసినాడు. "కైకను వివాహము చేసుకొనుట నాకు అంగీకారమే. కాని ఈమె పుత్రునికే రాజ్యమిత్తునని ప్రతిన చేయుట సమ్మతము కాదు. అయిననూ సంతానమే లేని నాకు సంతానము కలిగిన యెడల ధర్మబద్ధుడైన నా పుత్రులు ఇక్ష్వాకువంశ మర్యాదను అతిక్రమించరు" అని గట్టిగా నిర్ణయించుకొనినాడు.

వసిష్ఠమహర్షితోను, తనభార్యలతోనూ యోచించి వారి అంగీకార ప్రోత్సాహాలతో గర్గమహర్షికి తన అంగీకారమును తెలియచేశాడు. అనంతరము యథావిధిగా కైకను పెండ్లి చేసుకొనినాడు. అనేక బహుమానాలతో కూతురిని అత్తవారింటికి పంపుతూ, తన పుత్రికకు ప్రేమాస్పదదాసి అయిన మంథరను కూడా వెంట పంపినాడు. (మంథర= ప్రశాంతముగా వున్నదానిని కల్లోలము చేయునది. అనగా కవ్వము)

కైకతో అయోధ్యకు చేరిన దశరథుడు

ధర్మబద్ధముగా రాజ్యపాలనలో నిమగ్నుడై నాడు. ఆ విధంగా కొంతకాలం గడిచింది. అప్పుడు దేవదానవులకు యుద్ధం జరిగింది. ఆ రణంలో దేవతలు శంబరుడు అనే రాక్షసునిచేత ఓడినారు.

**తథాஉభవ ద్దైవవాణీ**
**'యత్రా యోధ్యాధిపతీర్మహాన్ ।**
**జయస్తత్ర నసందేహః**
**సమానయత తం' త్వితి**

అప్పుడొక దేవవాణి ఈ విధంగా వినిపించింది. 'దేవతలారా! అయోధ్యాధిపతి దశరథుడు ఏ పక్షమున ఉండునో ఆ పక్షమునకు జయము కలుగును. సందేహము లేదు. కనుక ఆ మహారాజును వెంటనే తీసుకొని రండు' అని.

ఆకాశవాణిని అనుసరించి దేవతలు వాయుదేవుని అయోధ్యకు పంపినారు.

**సమీరణ ప్రార్థనయా**
**తథా దశరథో నృపః ।**
**కైకేయీా సహిత స్తూర్ణం**
**రథారూఢో వినిర్యయౌ ॥**

వాయుదేవుడు అయోధ్యకు వెళ్ళి రాక్షసులతో రణమునకు దేవతలకు సాయపడుమని కోరగా దశరథుడు సమ్మతించాడు. రాక్షసులతో రణమనిన భర్తకు ఏమి ప్రమాదము వాటిల్లునో అని రాక్షస మాయలుతెలిసిన కైకకూడా వెంటబయలు దేరినది. దశరథునికీ, శంబరాసురునికీ, గొప్పరణము జరిగినది. ఆ శంబరాసురుడు సింహ, వ్యాఘ్ర, సర్పాకృతులు, ఇంకా అనేక భీకరాకృతులు ధరించి రాక్షసమాయలు ప్రయోగించి చీకాకు పరచసాగాడు.

**వారయామాస మాయాస్తాః**
**ధవళాంగ మహర్షిణా ।**
**ఉపదిష్టా న్మంత్రబలాత్**
**కైకేయీా సంగరే తదా ॥**

దశరథుని ప్రక్కనే రథములోనున్న కైకేయి శంబరాసురుని రాక్షసమాయల నన్నిటినీ తన మంత్రబలముచేత నిలువరించినది.

ఎట్లన కైక తండ్రి ఇంట వున్నప్పుడు ధవళాంగమహర్షికి చేసిన పరిచర్యకు సంతసించిన ఆ మహర్షి రాక్షసమాయకు ప్రతిక్రియామంత్రములను ఉపదేశించినాడు. అదే సమయమున రాజు రథచక్రముయొక్క శీల విరిగినది. యుద్ధమున మునిగి వున్న దశరథునకు గానీ సారథికి గానీ అది తెలియలేదు.

**రాజ్ఞాంతికే స్థితా సుభ్రూః**
**కైకేయీా స్వరథం పునః ।**
**భిన్నాక్షం తు దదర్శాథ**
**వామహస్తం నిజం పునః ॥**
**అక్షస్థానే చకారాஉశు**
**స్వపతే ర్ధయహేతవే ।**

దశరథుని సమీపమున ఉందున్న కైక రథచక్రపు శీల విరుగుటను గమనించినది. ఆ రథశీలకు బదులుగా తన ఎడమచేతిని గ్రుచ్చిపెట్టి రథము పడిపోకుండా కాపాడినది.

ఒకస్త్రీ పైగా సుకుమార రాకుమారి తన చేతిని రణము చేయుచున్న ఒక

రథమునకు ఇరుసు(శీల)గా పెట్టి ఆపుటయా? అని మనకు ముందుగా కలుగు హాస్యాస్పద సందేహము. కానీ మహర్షుల అమోఘవాక్కుల వలన ఏదైననూ సాధ్యమే! (అని అనేక రామాయణాలు మన సందేహాలను తీరుస్తూనే ఉంటాయి.)

కైక బాలికగా వున్నప్పుడు ధవళాంగుడను మహర్షి కేకయరాజు భవనమునకు విచ్చేసినాడు. ఆ మహర్షికి పరిచర్య చేయుటకు అశ్వపతి మహారాజు తనపుత్రిక కైకేయిని నియమించాడు. ఆమె భక్తి ప్రపత్తులతో ఆ మహర్షిని సేవించగా మహర్షి సంతసించి, కుమారీ! నీకు గొప్ప చక్రవర్తి భర్తగా లభించగలడని వరమిచ్చినాడు.

అప్పుడు కైకేయి ఎడమచేతితో మహర్షికి పాదాభివందనం చేసింది. అంతట మహర్షి 'బాలికా నీవు నాకు ఎడమచేతితో నమస్కరించినావు కనుక నీ ఎడమచేయి వజ్రముకన్నా కఠినముగా మారును' అని పలికి, రాక్షసమాయలకు ప్రతిక్రియను, దానికి తగిన మంత్రములను కూడా ఉపదేశించి వెళ్ళినాడు.

**అథ జిత్వా రణే దైత్యాన్**
**హృష్టా తత్కర్మ పార్థివః ।**
**దదౌ వరౌ ద్వౌ కైకేయ్యై**
**తయా న్యాసికృతౌ నృపే ।**
**యదాహి యాచయిష్యామి**
**తదా త్వం దేహి తావితి ॥**

అనంతరము దశరథుడు రాక్షసులను జయించాడు. కైకేయి తనరథము పడిపోకుండా కాపాడినందుకు శంబరాసుర మాయలకు ప్రతిక్రియలు చేసినందుకు రెండు ఉపకారములకు రెండు వరములు కోరుకొనుమనినాడు.

మహారాజా! తరువాత నేను కోరినప్పుడు ఆ వరాలను ఈయవచ్చును. మీవద్దనే దాచి వుంచుడని పలికినది.

తరువాత దశరథమహారాజు శంబరాసురుని వధించటానికి ఉద్యమించాడు. వెంటనే నారదమహర్షి అక్కడ ప్రత్యక్షం అయినాడు.

**ద్వాపరే శంబరం భూప**
**ప్రద్యుమ్నో నిహ నిష్యతి ।**
**ఇత్యుక్త్వాఽథ గతస్వర్గం**
**నారదోరామనామకృత్ ॥**

దశరథా! శంబరుని నీవు చంపకుము. వానిని ద్వాపరయుగమున ప్రద్యుమ్నుడు చంపగలడు. అని దశరథుని ప్రయత్నాన్ని ఆపి, రామనామము పలుకుతూ స్వర్గలోకానికి వెళ్ళిపోయినాడు. దశరథుడు కూడా కైకను అయోధ్యకు పంపి ఇంద్రుని ఆహ్వానం మీద స్వర్గమునకు వెళ్ళినాడు. *(సశేషం)*

ముముక్షు రహస్యం

# కూరత్తాళ్వాన్ వైభవం

- శ్రీమతి చక్రవర్తుల చూడామణి - ఖమ్మం

"బామ్మా! శ్రీవైష్ణవ దర్శనం కోసం తమ దర్శనం కోల్పోయారు కూరత్తాళ్వాన్ అంటారు కదా! అంటే ఏవిటో వివరంగా చెప్పవా" వెంకట కృష్ణ అడిగాడు.

''అవునురా కన్నా! ఆరోజు ఆ మహానుభావుడు మన ఆచార్యులను, శ్రీవైష్ణవదర్శనాన్ని కాపాడటం కోసం తన ప్రాణాలను సహితం లెక్కచేయక క్రిమి కంఠచోళుని ఆస్థానానికి వెళ్ళాడు".

"ఆరాజు అసలుపేరు కుళోత్తుంగ చోళుడు కదా బామ్మా" వేద.

''అవునవమ్మా, ఆరాజు చేసిన దుర్మార్గాలు అన్నీ ఇన్నీకావు. అతని స్వంత కొడుకే అతని పద్ధతిని నిరసించి ఆ రాజును ద్వేషించాడు. అందుకే మన పూర్వాచార్యులు అలాంటి దుర్మార్గుడి పేరు ఉచ్చరించినా పాపం అంటు కుంటుందని "క్రిమికంఠుడు" అనేవాళ్ళు".

''ఇంతకీ ఆరాజు ఏం చేశాడు బామ్మా?" వెంకటకృష్ణ.

''ఆరాజు శైవమతావలంబి. ఆ మతాన్ని దేశమంతా విస్తరించాలని కోరుకున్నాడు. ప్రయత్నం చేశాడు. అంతవరకు తప్పులేదు. శ్రీవైష్ణవ మతాన్నిరూపుమాపాలని ప్రయత్నించాడు. అందుకోసం వాడి రాజ్యంలోని విద్వాంసు లను పిలిపించి "శివాత్ పరతరం నాస్తి" అని బలవంతంగా రాయించేవాడు".

"అంటే ఏమిటి బామ్మా?" వేంకట కృష్ణ అడిగాడు.

"శివుని మించిన దైవం లేదు" అని అర్థం. భయానికి కొందరు, వాడిచ్చే డబ్బు, పదవి, భూమి లాంటి ప్రలోభాలకు లొంగి కొందరు అలాగే రాసి ఇచ్చేవాళ్ళు. అలా రాయటం ఇష్టంలేని వాళ్ళు ఆరాజ్యం వదిలిపెట్టి పారిపోయేవాళ్ళు. ఇలా జరుగు తుండగా **"నాలూరాన్"** అనే భ్రష్టవైష్ణవుడు కూరత్తాళ్వాన్ శిష్యుడు దుష్టబుద్ధితో ఆరాజును చేరి "రాజా ఈపనికిరాని సంత కాలు ఎన్నివేలమంది చేసినా శ్రీవైష్ణవాని కొచ్చిన ముప్పులేదు. వీళ్ళందరి ఆచార్యు డైన భగవద్రామానుజాచార్యులు ఒక్కరితో సంతకం చేయించారంటే చాలు. శ్రీవైష్ణవ మతం లోకంలో కనపడకుండా పోతుంది" అని సలహా ఇచ్చాడు.

నాలూరాన్ సలహాకు సంతోషించిన రాజు వెంటనే సైన్యాన్ని శ్రీరంగానికి పంపి శ్రీమద్రామానుజాచార్యులను తీసుకు రమ్మన్నాడు. ఈ సైనికులు శ్రీరంగం చేరి

ఆచార్యులమఠం దగ్గరకు వచ్చి రాజాజ్ఞను తెలియజేశారు. ఆ సమయంలో అదృష్టవశాత్తు భగవద్రామానుజులు, ముదలియాండాన్, కూరత్తాళ్వాన్ మరి కొందరు శిష్యులతో కలసి కావేరీతీరానికి స్నానం చేయటం కోసం వెళ్ళారు. అది తెలిసి రాజభటులు కావేరీతీరంవైపు బయలుదేరారు. అల్లంత దూరాన వారి రాకను గమనించిన కూరత్తాళ్వాన్ రాబోయే ఆపదను పసిగట్టి తాను రామానుజాచార్యుల కాషాయం ధరించి, త్రిదండం చేపట్టి భటుల వెంట రాజసభకు బయలుదేరారు. కావేరిలో స్నానంచేస్తున్న రామానుజాచార్యుల వారికిది తెలియదు. స్నానాంతరం ముదలియాండాన్ ఇచ్చిన తెల్లవస్త్రాలు చూసి 'విషయం ఏమిటని?' విచారించారు.

అప్పుడు ముదలియాండాన్ జరిగిన విషయం చెప్పి "ఆచార్యుల దివ్యశరీరాన్ని రక్షించుకోవటం శిష్యుల కర్తవ్యమని చెప్పి తాను రాజసభకు వెళుతూ తమరి రక్షణభారం చూసుకో"మని నన్ను ఇక్కడ ఉండమన్నారని చెప్పారు.

రామానుజులవారు క్రూరుడైన రాజు ఏ విధంగ ప్రవర్తిస్తాడో కూరేశుల విషయంలో అనుకొంటూ శిష్యులగురించి చింతిస్తూనే కావేరిదాటి మేలుకోటవైపు సాగిపోయారు. అటు కూరత్తాళ్వాన్‌తో పెరియనంబి (మహాపూర్ణులు), వారి కుమార్తె అత్తుళాయమ్మ, మరికొందరు రాజు దగ్గరికి వెళ్ళారు.

"కూరత్తాళ్వాన్ మహాపండితులుకదా! ఆరాజుకు అర్థమయ్యేట్టు, అన్ని విష యాలూ నిరూ పించవచ్చుగా బామ్మా!" వేద అడిగింది.

"పాపం! ఆళ్వాన్ ఆ ప్రయత్నమే చేశారు. రామానుజులవేషంలో ఉన్న కూరేశులను చూసి క్రిమికంఠుడు **శివాత్ పరతరం నాస్తి** అని తాళపత్రంలో రాయ మన్నాడు. కూరేశులు శ్రీమన్నారాయణుడే పరతత్వమని నిరూపించటం కోసం శ్రుతి, స్మృతి, పురాణ, ఇతిహాసాల నుండి అనేక ఆధారాలు చూపించి వాదించారు. అయినా ఆరాజు ఏమాత్రం తగ్గలేదు. అప్పుడు ఆతాళపత్రం తీసుకొని **ద్రోణమస్తి తతః పరమ్** అని రాశారు.

"అంటే అర్థమేంటిబామ్మా?" వేంకట కృష్ణ.

"ద్రోణమంటే మానికలాగా ఒక కొలపాత్ర. 'శివం' అన్నా 'శోలెడు' అనే కొలపాత్ర. 'శోల' చిన్నది. 'మానిక' పెద్దది. అందుకే కూరేశులు "ద్రోణమస్తి తతః పరమ్" అన్నారు. శోలకంటే ద్రోణియే పెద్దది అన్న అర్థంలో అన్నారన్నమాట.

"వెర్రిమొఖం పెట్టకురా కృష్ణా! శివః అంటే పరమశివుడని అర్థం. శోల అనే కొలపాత్ర అని కూడా మరో అర్థం.

క్రిమికంఠుడేమో శివుడే పరతత్వం అన్న అర్థంలో "శివాత్ పరతరం నాస్తి" అంటే "శివుడికంటే గొప్ప పరతత్వం లేదు" అన్న అర్థంతో రాయమన్నాడు.

ఆళ్వాన్ దాన్ని కొలపాత్రగా స్వీక రించి "ద్రోణమస్తి తతః పరమ్" అంటే ద్రోణం దానికంటే పెద్దది అన్న అర్థంలో చెప్పారన్నమాట" వేద వివరించింది.

"అది విని రాజు ఊరుకున్నాడా?" కృష్ణ.

''ఊరుకుంటాడా! ఆళ్వాన్‌తో వచ్చిన పెరియనంబిని రాయమన్నాడు. వారు **"శ్రీమన్నారాయణుడే పరతత్వం"** అని డొంకతిరుగుడు లేకుండా రాశారు. రాజు ఉగ్రంతో ఊగిపోయాడు. సేవలకులను పిలిచి వాళ్ళిద్దరి కళ్ళు పీకి వేయమన్నాడు. "నీలాంటి విష్ణు ద్రోహిని చూసిన కళ్ళు ఉండడమే పాపం" అంటూ ఆళ్వాన్ తనకళ్ళను తానే పీకివేసుకున్నారు. పెరియ నంబికళ్ళను రాజభటులు పీకివేశారు.

శ్రీవైష్ణవ దర్శనం (సిద్ధాంతం)కోసం తమ దర్శనం (కళ్ళు) కోల్పోయారు. ఆ మహానుభావులిద్దరూ.

"ముందుతరాల కోసం, శ్రీవైష్ణవ సిద్ధాంత సంరక్షణకోసం, ఆచార్యులను కాపాడు కోవటం కోసం ఆళ్వాన్, పెరియ నంబి ఎంత గొప్పత్యాగం చేశారో సామాన్యులకిది సాధ్యమా! అందుకే వారు మహానుభావులు కదూ బామ్మా!"

"అవునురా వేదా! అలాంటి వారికి కృతజ్ఞతలు తెలియచేయటం ఎలాగో తెలుసా మీకు? వారు చూపిన మార్గంలో నడవటమే మనం ఆయనపట్ల చూపే నిజమైన కృతజ్ఞత అవుతుంది".

"తరువాత ఏవైందోచెప్పు బామ్మా" కృష్ణ.

"ఆళ్వాన్, పెరియనంబి, అత్తుళా యమ్మ శ్రీరంగం వెళ్ళటానికి బయలు దేరారు. దారిలో **శ్రీపరాంతక పురం** (జ్యోతిష్కుడి) దగ్గర పెరియనంబి వయోభారం వలన, కళ్ళు పీకటంవలన కలిగిన శరీరబాధను తట్టు కోలేక పరమపదించారు. అక్కడే పెరియ నంబిగారి అంతిమక్రియలు చేసి కొంత కాలముండి శ్రీరంగం చేరారు అత్తుళాయమ్మ, ఆళ్వాన్.

"ఆళ్వాన్ **పంచ స్తవాలు** పాడారంటారు కదా! అవి ఎప్పుడు పాడారు బామ్మా?"

"మంచి ప్రశ్నవేశావు వేదా! శ్రీరంగం చేరిన ఆళ్వార్ రంగనాథ కైంకర్యం కోసం కోవెలకు వెళితే అక్కడ ఉన్న రాజభటులు అడ్డగించి రామానుజ సంబంధులను లోపలికి వదలమన్నారు. అక్కడ్నుంచి విరక్తితో శ్రీరంగం వదలి **తిరుమాలిరుం శోలై** బయలుదేరారు. కాలినడకన పోతూ ఆర్తితో పరమపదనాథుడి వైభవాన్ని స్తుతిస్తూ నూరుశ్లోకాలుగల **శ్రీవైకుంఠస్తవం**

పాడారు. దాని తరువాత పరమాత్మ విభవ రూపాలైన నరసింహ, రామ, కృష్ణాది అవతారాలను, ఆయా అవతారాలలో పరమాత్మ లీలలను స్తుతిస్తూ **అతిమానుష స్తవం** పాడారు. "తిరుమాలిరుంశోలై" చేరాక అక్కడ వేంచేసి ఉండి, సుందర బాహుస్వామిని స్తుతిస్తూ **సుందరబాహు స్తవం** పాడారు.

132 శ్లోకాలతో కూడిన అత్యంత అద్భుతస్తవం ఇది. అక్కడే కొంతకాలం ఉండి స్వామికైంకర్యం చేస్తూండగా ఒక శుభదినాన దేశానికి పట్టినపీడ వదలినట్లు క్రిమికంఠచోళుడు గొంతులో పురుగులు పడి ప్రాణం వదిలాడని తెలిసి మళ్ళీ శ్రీరంగం ప్రయాణమయ్యారు.

అటు మేల్కోటలో వేంచేసి ఉన్న రామానుజుల వారు కూడా జరిగిన విషయాలు తెలిసికొని కూరత్తాళ్వాన్‌ని చూడాలని శ్రీరంగం బయలుదేరారు.

ఇద్దరూ కలుసుకున్నక్షణాన ఆర్తితో తడిసిముద్దయ్యారు.

అప్పుడు కూడా ఆళ్వాన్ తన కళ్ళు పోవటానికి చోళరాజు, నాలూరాన్‌పిళ్ళైనో, తప్పుపట్టక తనే భాగవత అపచారం చేసుంటానని, ఆచార్యుల దగ్గర చెప్పటం వారి స్వరూపాన్ని తెలియజేస్తుంది. మనలాంటి వాళ్ళైతే, మనతప్పు వలన మనకి కష్టం కలిగినా దాన్ని ఎవరో ఒకళ్ళ నెత్తినవేసి వాళ్ళవల్లనే ఇలా మనకు కష్టం వచ్చిందని నిందిస్తాం.

"మిగిలిన రెండు స్తవాలు ఎప్పుడు పాడారు బామ్మా?"

"వరములనిచ్చేవాడు వరదుడు కాబట్టి వరదరాజుల మీద స్తవం చేసి పోయిన కళ్ళుకోరమని రామానుజులు ఆళ్వాన్‌ని ఆదేశించారు.

"ఆళ్వాన్ అలా చేశారా? మళ్ళీ చూపు వచ్చిందా?" *(సశేషం)*

## తిరుక్కోట్టియూర్ నంబిగారి మంచిమాట

బంగారమును పుటము వేయగావేయగా తూకము తగ్గి కాంతి హెచ్చినట్లు ఆత్మకు ప్రపత్తివలన కర్మద్వారా వచ్చిన జ్ఞానసంకోచముపోయి జ్ఞానవికాసము ఏర్పడుతుంది. అట్టి స్థితిలో ప్రతిజీవుడూ శ్రీ,భూ,నీళాదేవులతో సమానముగా నుండునని సెలవిచ్చిరి. ఇందుకు నిదర్శనము శ్రీనమ్మాళ్వార్లే.

(ముఖచిత్ర పరిచయం)

రథ సప్తమి నాడు

# సకల ఆరోగ్య సిద్ధికై ఆదిత్య హృదయ పారాయణము

ఫిబ్రవరి 10 వ తేదీన రథసప్తమి వస్తోంది. సూర్యుని ప్రార్థనా దినంగా ఉండే ఈ రోజున ఆదిత్య హృదయాన్ని పారాయణం చేయడం ఆరోగ్యదాయకం. ఒంటరిగా చేసుకున్నా ఎంతో ఉపయోగకరమే. అయినప్పటికీ సమూహంగా చేరి పారాయణం చేయడం సమాజానికే ఆరోగ్యకరం. గత రెండేళ్లుగ శ్రీస్వామివారు రథసప్తమినాడు సామూహికంగ ఆదిత్య హృదయమును జరిపిస్తున్నారు. ఈ ఏడాది ఉపదేశాత్మక ఆదిత్య హృదయ పారాయణ కార్యక్రమం మహబూబ్‌నగర్ జిల్లా జడ్చర్ల మండలం గంగాపురం గ్రామంలో ఆజిల్లా వి.టి. ఆధ్వర్యవములో ఆ గ్రామంలోగల శ్రీచెన్నకేశవ ఆలయములో జరుగుతోంది.

"యుద్ధరంగంలో దెబ్బతిన్న రావణుణ్ణి రథంతోదూరంగా తీసుకుపోయాడు సారథి. అప్పటికే ఎన్నోసార్లు ఓడించి, వదిలిపెట్టినా రావణుడికి బుద్ధిరాలేదు. ఎన్ని తలలు తీసినా వాడి ప్రాణం పోవడంలేదు. రాముడెంతో అలసిపోయి ఉన్నాడు.

ఇక ఇదే సమయమని దేవతల ప్రేరణతో అగస్త్యుడు శ్రీరాముని సమీపించి సూర్యుని ఉపాసనగ ఉండే ఈ **ఆదిత్యహృదయ స్తోత్రాన్ని** ఉపదేశించాడు. ఇది పొందిన శ్రీరాముడు నూతన కాంతితో ప్రకాశించాడు. అలుపుతీరి పోరాడవచ్చిన రావణునితో యుద్ధానికి దిగాడు శ్రీరాముడు.

ఇక ఆలస్యమెందుకని బ్రహ్మాస్త్రముతో అతని శిరస్సును ఖండించి వేసాడు శ్రీరాముడు. ఈ స్తోత్రమువల్ల "బలహీనత దూరమౌతుంది. శక్తి నిండుతుంది. శత్రువులు నశిస్తారు. విజయం లభిస్తుంది" శారీరకంగా, మానసికంగా ఆరోగ్యవంతంగా ఉండటానికి ఉపయోగపడుతుంది.

భక్తులందరూ సకల ఆరోగ్య సిద్ధికై ఆదిత్యహృదయ పారాయణాన్ని తమ తమప్రాంతాల్లో ఫిబ్రవరి 10వ తేదీన జరుపుకుని సర్వసుఖాలను పొందగలరని శ్రీస్వామివారు ఆదేశించారు.





*ఉభయవేదాన్త ప్రవర్తకులు శ్రీమాన్ తె.కం.గోపాలా చార్య స్వామివారి స్మృత్యర్థం సమర్పించే*

## ఆచార్య వరివస్య - గోపాలోపాయన పురస్కారం

***పరమహంస పరివ్రాజకులు శ్రీశ్రీశ్రీ చిన్న జీయరు స్వామివారి పర్యవేక్షణలో***

**జనవరి 30వ తేదీన ఖమ్మం పట్టణంలో జరగవలసిన పురస్కారసభ అనివార్య కారణాలవల్ల వాయిదా పడి తిరిగి**

**1-03-2011**న వేదవిద్యాలయ ప్రాంగణం, సీతానగరంలో

న్యాయవేదాన్తవిద్వాన్ శ్రీ ఉ.వే.శ్రీమాన్ **ఈయుణ్ణి రంగాచార్యస్వామి**–అంతర్వేదిపాలెం

**భక్తినివేదన సంపాదకులు శ్రీ ఉ.వే.శ్రీమాన్ టి.పి.శ్రీరామచంద్రాచార్య స్వామి** వార్లకి

పురస్కార సమర్పణ జరుగును.

**వివరములకు: శ్రీమదుభయవేదాంతాచార్యపీఠం, సీతానగరం 08645 272929**

**మనిషికి సాధించవలసిన లక్ష్యం కావాలి-అది భగవంతుని చేరటం అనేది.**

# భర్తృహరి సుభాషితాలు

సేకరణ: **జి. రఘునాథ్ -సీతానగరం**

**కోఽర్థః పుత్రేణ జాతేన యో న విద్వాన్ నభక్తిమాన్ ।**
**కాణేన చక్షుషా కింవా చక్షుఃపీడైవ కేవలమ్ ॥**

*తా॥* గ్రుడ్డికన్నుండుట వలన లాభమేమి? ఇక కంటికి బాధమాత్రమే. అటులనే బుద్ధిహీనుడు, భక్తిరహితుడూ అయిన కొడుకుపుట్టిన లాభమేమి? వాడు నిత్యమును చేయుచున్న పాడుపనులతో మనస్సునకు వ్యాకులతయే ఫలము, అంతే.

**గుణై రుత్తుఙ్గతాం యాతి నతు సింహాసనాదిభిః ।**
**ప్రాసాద శిఖరస్థోఽపి కాకః కిం గరుడాయతే? ॥**

*తా॥* పెద్ద పెద్ద సింహాసనములను వేసుకొని కూర్చున్నంత మాత్రమున మనిషి గొప్పవాడు కాలేడు. మంచిగుణములున్న మాత్రమే గొప్పవాడని గౌరవించబడును. ఎత్తైనగోపురశిఖరమున కూర్చున్నంత మాత్రమున కాకి గరుడపక్షిగా గౌరవమును బడయగల్గునా?

**తారాణాం భూషణం చన్ద్రః నారీణాం భూషణం పతిః ।**
**పృథివ్యాః భూషణం రాజా విద్యాసర్వస్య భూషణమ్ ॥**

*తా॥* నక్షత్రములకు కాంతి నొసంగువాడు చంద్రుడు. స్త్రీకి అలంకారమైనవాడు భర్త. భూమికి రాజే భూషణము. విద్య అందరకును అలంకారమే.

**తృణం బ్రహ్మవిద స్స్వర్గం తృణం శూరస్య జీవితమ్ ।**
**జితాక్షస్య తృణం నారీ నిస్స్పృహస్య తృణం జగత్ ॥**

*తా॥* బ్రహ్మవేత్తయగు ముముక్షువునకు విషయాభిలాషులకు ప్రియమగు స్వర్గము కూడా గడ్డిపరకవంటిది. (అనగా–గడ్డిపరకనువలె నాతడా స్వర్గమును అనాదరించును.) పరాక్రమవంతునకు తన ప్రాణము తృణప్రాయము. (అనగా అందరును సర్వస్వమును సమర్పించియైనను రక్షించుకొను ప్రాణము పరాక్రమశాలికి గడ్డిపరకవలె అనాదరణీయము. ఇంద్రియ నిగ్రహము కలవారికి స్త్రీ తృణప్రాయము. ఏ వస్తువునందును ఆశలేనివానికి జగత్తంతయు అనాదరణీయమే.

**తృణాని భూమి రుదకం వాక్చతుర్థీచ సూనృతా ।**
**ఏతాన్యపి సతాం గేహే నోచ్ఛిద్యన్తే కదాచన ॥**

*తా॥* గోవులకు గ్రాసమగు గడ్డి మొదలగునవి, సారవంతమగు భూమి, పానీయమగు మంచినీరు, సత్యభాషణము- అను నీ నాలుగున్ను సజ్జనుల గృహమునందు నిరంతరము పూర్ణములై విరాజిల్లుచుండును.

**"విశ్వములోని ప్రతి అణువులో పరమాత్మ వ్యాపించి ఉన్నాడు".**



శ్రీమతే రామానుజాయ నమః



పరమహంస పరివ్రాజకులు శ్రీశ్రీశ్రీ చిన్న జీయరు స్వామివారి

మంగళాశాసనములతో...

శ్రీశ్రీశ్రీ అహోబిల జీయరు స్వామివారి పర్యవేక్షణలో....

నడిగడ్డపాలెం-శ్రీ వాసుదాసాశ్రమంలో వేంచేసియున్న



# శ్రీలక్ష్మీనారాయణ - శ్రీ కోదండ రామస్వామివార్ల బ్రహ్మోత్సవములు

లక్షమల్లెల పుష్పార్చన - శ్రీ లక్ష్మీనారాయణ యాగం

**ది. 13-03-2011 నుండి 20-03-2011 వరకు**

**విశేష కార్యక్రమములు**

| తేది | వారము | ఉదయపు ఇష్టి | ఉదయపు వాహనసేవ | రాత్రి వాహనసేవ |
|---|---|---|---|---|
| మార్చి 12 | శని | --- | --- | 6 గం॥ విష్వక్సేన ఆరాధనతో అంకురార్పణ |
| ,, 13 | ఆది | పుత్రకామ ఇష్టి | ధ్వజారోహణము | శేషవాహనము |
| ,, 14 | సోమ | వైభవ ఇష్టి | సూర్యప్రభ | చంద్రప్రభ |
| ,, 15 | మంగళ | సుదర్శన ఇష్టి | సింహ | హంస |
| ,, 16 | బుధ | నారసింహ | కల్పవృక్ష | హనుమంత |
| ,, 17 | గురు | హయగ్రీవ ఇష్టి | మోహిని, పల్లకిసేవ | గరుడవాహనసేవ |
| ,, 18 | శుక్ర | శ్రీలక్ష్మీనారాయణ ఇష్టి | అశ్వవాహనసేవ<br>కోదండరాముని కల్యాణం | గజవాహనసేవ<br>దోపిడీ ఉత్సవం |
| ,, 19 | శని | రథోత్సవం, | మహాపూర్ణాహుతి, అభిషేకం<br>సప్తవర్ణ ప్రదక్షిణం, ధ్వజారోహణము | ద్వాదశారాధన, |
| ,, 20 | ఆది | శ్రీలక్ష్మీదేవికి క్షీరాభిషేకం, పూజ, లక్ష్మీనారాయణ కల్యాణం. | | |

**ఈ ఉత్సవములలో భాగస్వామ్యము పొందు కైంకర్య వివరములు**

| | |
|---|---|
| ఒకరోజు పూర్తి యాజమాన్యం (ఇష్టితో) | రూ. 10,000/- |
| ఒకరోజు బ్రహ్మోత్సవం, వాహనసేవ యాజమాన్యమునకు | రూ. 3,000/- |
| ఒకరోజు ఇష్టి కార్యక్రమమునకు | రూ. 2,500/- |
| ఒకరోజు ఊయలసేవ | రూ. 1,000/- |
| శ్రీ ఆంజనేయ స్వామివారి ఆకుపూజ, వడమాల | రూ. 1,000/- |
| కళ్యాణ మహోత్సవమునకు | రూ. 500/- |
| ఒకరోజు సమష్టి లక్ష్మీ మల్లెపుష్ప సహస్ర నామార్చన | రూ. 150/- |

కావున పవిత్రమైన ఉత్సవములలో జరుగు కార్యక్రమములో వివిధ కైంకర్యముల ద్వారా పాల్గొని మన మనోభీష్టాన్ని నెరవేర్చుకొనుటయే కాకుండా లక్ష్మీ నారాయణుల అనుగ్రహాన్ని - ఆచార్య కటాక్షాన్ని పొందుదాం!

వివరములకు : ఉభయ వేదాంతాచార్యపీఠం, శ్రీవాసుదాసాశ్రమం, నడిగడ్డపాలెం,
గుంటూరుజిల్లా - 522 318. ఫోన్ (08644) 276522, 08645 272929;
సెల్: 94410 65582, 98663 99790, 98497 41537.

# వారికి శ్లోకాలు కరతలామలకాలు!

ఎందరో భక్తులు శ్రీస్వామివారి ప్రవచనాలు వింటూఉంటారు. వారిలో ఎందరి గుండెలు ఆర్ద్రమై ఆచరణపర్యంతమూ పర్యవసిస్తాయో వారే ధన్యులు.
ఎల్కేశ్వరం, కరీంనగర్‌జిల్లా ఓ 200 వందల గృహాలున్న చిన్న ఊరు. అందరూ పొలంపనులు చేసుకునే కూలీ-నాలీ జనం. రెక్కాడితేకానీ డొక్కాడని స్థితి. చదువు సంధ్యలు అంతంత మాత్రమే. అయితేనేం సంస్కారం వారికి చోటుచేసుకొంది. ఆచార్యానుగ్రహం కలిగింది. భగవంతుని దయ నేరుగా ప్రసరించింది. ఇకలోటేమిటి? వారికి ప్రబంధాలు వచ్చాయి. స్తోత్రాలు వచ్చాయి. ప్రవచనా లొచ్చాయి.విష్ణుసహస్రనామ స్తోత్రాల్లాంటివాట్లో శ్లోకం చెబుతే సంఖ్య చెప్పడం. సంఖ్య చెపితే శ్లోకం అందుకోవడం, అలానే సంఖ్య చెప్తే వేయినామాల్లో ఆ సంఖ్యకల నామాన్నిచెప్పటంవంటి కఠినశ్రమకూడా వారికి కరతలామలకమైంది. చదవండి వారి మాటల్లోనే......

శ్రీశ్రీశ్రీ చిన్న జీయర్ స్వామివారి మంగళాశాసనములతో ''కృష్ణం వందే జగద్గురుమ్'' అనే కార్యక్రమంలో మా గ్రామానికి "ఓం దామోదరాయనమః" అనే నామాన్ని కేటాయించి, కలశాన్ని ఇచ్చారు. కరీంనగర్ వికాసతరంగిణి వారు.

శ్రీ స్వామివారే స్వయంగా ఇచ్చినంత ఆనందంతో భక్తి శ్రద్ధలతో వి.టి. వారి సూచనలమేరకు "కృష్ణం వందే జగద్గురుమ్" కార్యక్రమాలన్ని చేసుకున్నాము.

అనంతరం కరీంనగర్‌లో శ్రీ స్వామి వారి సమక్షంలో జరిగిన ''సహస్ర కలశాభిషేక" కార్యక్రమంలో మేమందరము పాల్గొన్నాము శ్రీ స్వామి వారు తమ ప్రవచనముల్లో విష్ణు సహస్ర నామాలను అందిరితో పలికించారు. అందరూ ప్రతి నిత్యం ఇలా చేయండి అని ఆజ్ఞాపించారు.

అదే ఆజ్ఞగా ఆనాటినుండి ఆ గ్రామస్థుడైన శ్రీమాన్ చీటి కిషన్‌రావు అనే నేను శ్రీవిష్ణుసహస్రనామ స్తోత్రాన్ని పారాయణ చేస్తూ, అందరినీ రమ్మన్నాను. అందరికీ శ్రీవిష్ణు సహస్రనామ పుస్తకం ఎలా చదవాలో నేర్పించాను. దానితో మేము ముగ్గురం అయినాము.

మేమందరమూ గ్రామంలో మిగిలి వారికే ఈ సహస్రనామాలు నేర్చుకుందాం రండి అని పిలచి నేర్పాము. 35 మందికి విష్ణుసహస్రనామం వచ్చేలాగ నేర్పాము.

మేమందరము ప్రతినిత్యము కలిసి ఉదయం, సాయంత్రం పారాయణ చేసు కుంటున్నాము.

2003లో గోదావరి పుష్కరాలలో ''మంచిర్యాలలో'' శ్రీస్వామివారి కార్యక్ర మంలో చి॥ రోహిత్ అనే పిల్లవాడు తడుము కోకుండా నెంబరు చెప్తే శ్లోకం, శ్లోకం చెప్తే నెంబరుచెప్పాడు. అరే! చిన్నపిల్లవాడే ఇలా చెప్తే మనం కూడా నేర్చుకుంటే చెప్పగలం కదా అనిపించింది.

అలాగే శ్రీవిష్ణుసహస్ర నామావళిని ఒక శ్లోకానికి సూచించిన నామాలను

నెంబర్లతో సహనేర్చుకుని మూడురోజుల పాటు వాటినే ఏపనిలో ఉన్నా స్మరించు కుంటూ కంఠస్తం చేసాము. 3 సంవత్స రాల కాలంలో విష్ణుసహస్ర నామావళిని 1000 నామాలను నెంబర్లతో సహ కంఠస్తంగా నేర్చుకున్నాము.

మేము నేర్చుకున్న ఈ విధానాన్ని చూచి మాగ్రామంతోపాటు ప్రక్క గ్రామాల వారూ మెచ్చుకున్నారు.

2006వ సంవత్సరం ''ఆచార్య సేవాయాత్ర" హన్మకొండలో శ్రీస్వామి వారు పెట్టినప్పుడు మేమందరమూ "వాలంటీర్లు"గా పాల్గొన్నాము. "రామానుజవాణి" వారి దగ్గర పుస్తకాలను, క్యాసెట్లు కొనుక్కొని తిరుప్ప ల్లాండు, తిరుప్పళ్ళియెఝ్లుచ్చి, తిరుప్పావై పాశురాలను **విష్ణుసహస్రనామం** నేర్చుకున్నట్లే స్పష్టంగా 2 సంవత్సరాలలో నేరుకున్నాము.

2010వ సంవత్సరం జూన్‌నెలలో శ్రీమతి మాధవిగారి ప్రవచనం చెప్పడం కోసం వారు మా గ్రామానికి వచ్చారు. అప్పుడు మాగ్రామంలో మేము చేసే "సేవాకాలంను" ప్రతిరోజు ఉదయం 7.30 గం॥లకు చేసుకుంటుఉండే వారము.

ఆరాధననుచూసి సంతోషించి హైదరాబాద్ శ్రీమతి జ్యోతిరెడ్డిగారికి వెంటనే ఫోన్‌ద్వారా తెలియజేశారు. వికాసతరంగిణి హైదరాబాద్‌లో జరిగిన సమావేశంలో మేము పాల్గొన్నాం, శ్రీరామారావుగారు సమావేశంలో ఎవరి సమస్యలు వారు చెప్పవచ్చు నని కోరగా వెంటనే మేముచేసే కార్యక్రమాలను, సమస్యలను తెలియజేసినాము. మాగ్రామానికి రామమందిరం అవసరమని, దానికి సహాయంకావాలని అర్థించాము. మా సమస్యలను విని ఖమ్మం జిల్లా అశ్వారావు పేట వి.టి. ప్రెసిడెంట్ శ్రీమాన్ సుబ్రహ్మణ్యం అనే భక్తుడు శ్రీ సీతారామ లక్ష్మణ ఆంజనేయ స్వామి విగ్రహాలను తయారు చేయించి ఇచ్చినారు. చాలా ఆనందం కలిగింది. శ్రీవారికృప మాయందుండి మా సత్సంగం అలానే కొనసాగాలని కోరు కుంటున్నాము.

జై శ్రీమన్నారాయణ!

**– చీటి కిషన్‌రావు,** ఎల్కేశ్వరం




**జనవరి 17 తారీఖున నడిగడ్డపాలెంలో శ్రీశ్రీశ్రీ పెద్దజీయర్ స్వామివారి పరమపదోత్సవ కార్యక్రమంలో కలశాభిషేకంతో విశేష పూజలు గావిస్తున్న శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ చిన్న జీయర్ స్వామివారు.**

భగవద్రామానుజముని కటాక్షించిన సర్వశ్రేయోమార్గాన్ని లోకానికి అప్రతిహతంగా అందింప నుద్యమించిన మన శ్రీశ్రీశ్రీ పెద్దజీయర్‌స్వామివారికి అసహాయసహాయులై వారి సంప్రదాయమార్గాన్ని మనందరకు సులభ ప్రవేశ్యం చేసిన మహనీయులు ఎందరో. శ్రీగోపాలాచార్యస్వామివారి దివ్యస్మృతిని 'గోపాలోపాయన' పురస్కార ప్రదానముఖంగా అనువత్సర స్మరణీయం చేస్తున్నారు. ఇంత వరకు మన సంప్రదాయంలో విశేషకృషిచేస్తున్న లబ్ధ ప్రతిష్టులైన ఉభయవేదాన్త విద్వాంసులను సమ్మానించుకుంటున్నాము. ఈ సంవత్సరము గోపాలోపాయన పురస్కారములు రెండు సమర్పించ బడుచున్నాయి. రెండు పురస్కారాలు అందుకుంటున్న మహనీయులు శ్రీ.ఉ.వే.శ్రీమాన్ టి.పి.శ్రీరామచంద్రాచార్యస్వామి మరియు శ్రీ.ఉ.వే.శ్రీమాన్ ఈయుణ్ణి రంగాచార్యస్వామివార్లు. వారిగురించి పాఠకులకు పరిచయం చేస్తున్నాం.

## శ్రీ ఉ.వే.శ్రీమాన్ టి.పి. శ్రీరామచంద్రాచార్యస్వామివారు



భక్తినివేదన సంపాదకులుగా, 30 సంవత్సరాలుగా శ్రీశ్రీశ్రీ చిన్న జీయర్ స్వామివారి కార్యక్రమాలలో బహు ముఖంగా తమ సేవలను అందిస్తున్న మహానుభావులు. శ్రీమాన్ అనంత పద్మనాభ సీతారామాచార్య, తాయారమ్మ గార్ల గర్భశుక్తి ముక్తాఫలమై ఆవిర్భవించిన స్వామివారు. శ్రీ ఉ॥వే శ్రీమాన్ ఎస్.ఎన్.సి రఘునాథాచార్య స్వామివారి వద్ద ఉభయ వేదాన్తాలను అధికరించి, తమకు ఆనువంశికంగాను పెద్దల సాహచర్యంతోను అంతేవాసితతోను సాధించుకున్న పాండిత్యానికి, సాంప్రదాయిక పరిమళాన్ని సంతరించుకున్నారు స్వామివారు. తమ పాండిత్యానికి భాషా వైశద్యానికి నిదర్శనంగ మనసు-మాట, అమృత తరంగాలు పేరున భక్తినివేదనకు సంతరించిన సంపాదకీయాలను, సిద్ధాన్త కుసుమాలు-సంప్రదాయ సౌరభాలు అనే పేరున సాంప్రదాయిక రహస్య నిదర్శకాలైన విషయాలతో కూడిన గ్రంధాన్ని, కృష్ణమాచార్య వచన నిగూఢతాత్పర్య ప్రకాశకంగా మరొక గ్రంథాన్ని, సుందర పాండ్యుని ఆర్యోక్తుల మర్మాన్ని నిరూపించే శ్రీకోశాన్ని వెలయించారు స్వామివారు.

తమ కృషికి ఫలితంగా కేంద్రీయ సంస్కృత విశ్వవిద్యాలయం వారి "వాచస్పతి" (D.Lit), గౌరవోపాధితో పాటు TTD వారి శాస్త్ర విద్వన్మణి, పండితరత్న, సువచ: శ్రీవల్లభ వంటి బిరుదులు వారికి అందిన సత్కారాలు, స్వామివారి వైభవాన్ని ఆవిష్కరిస్తాయి. ప్రస్తుత పురస్కారం స్వామివారికి ఉ.వే.శ్రీమాన్ గోపాలాచార్యస్వామి వారితో గల సాన్నిహిత్యాన్ని సంప్రదాయ ప్రచారాభి నివేశాన్ని లెస్సగా విశద పరుస్తుంది.

## శ్రీ ఉ.వే. శ్రీమాన్ ఈయుణ్ణి రంగాచార్యస్వామివారు,



మహావిద్వాన్ శేషశింగరాచార్య, శేషమ్మ దంపతుల భవ్య సంతానంగా ఆవిర్భవించిన మహనీయులు. ఆంధ్ర ప్రదేశ్‌లోగల సంప్రదాయా భినివేశంగల కుటుంబాలు శ్రీవైష్ణవ ప్రచారానికి సంప్ర దాయదీప్తికి చేసినసేవ అసమానం.

ఈవంశాల్లోనివారు న్యాయవేదన్తాలను రెంటినీ అధికరించి సంప్రదాయ ప్రచారానికి దీప్తిని కలుగజేయటం సర్వ సామాన్యంగా ఉండేది.

శ్రీ పెరుంబూదూరువంటి సుదూర ప్రాంతాలకు సహితంవెళ్లి శ్రమకోర్చి న్యాయవేదాన్తాలను అధికరించేవారు. అయితే కాలక్రమంగా "అన్యాయవేదాన్తం" ఆంధ్రదేశంలో పదం కలిపించుకున్నది. శ్రీశ్రీశ్రీ పెద్ద జీయర్ స్వామివారు, శ్రీ ఉ.వే.గోపాలాచార్య స్వామివారు న్యాయ వేదాన్తాలు అధికరించిన వారే.

ఈ కోవకు చెందిన విద్వాంసులు... ప్రస్తుతం వేంచేసి ఉన్న పెద్దలలో **శ్రీ ఉ.వే.శ్రీమాన్ ఈయుణ్ణి రంగాచార్య స్వామి వారు** మాత్రమేననడం నిష్ఠుర సత్యం. బ్రహ్మశ్రీ ఉడాలి సుబ్బరామశాస్త్రి, వేదాంతం శేషయ్య శాస్త్రిగార్లవద్ద న్యాయ పూర్వోత్తర వాదాలను- శ్రీమాన్ శఠకోపా చార్య స్వామివారివద్ద, న్యాయ వేదాన్తాలు రెంటినీ అధికరించడమే కాక, తమ తండ్రిగారైన శేషసింగరాచార్య స్వామివారి వద్ద సంస్కృత సారస్వతం ద్రవిడవేదాన్త - స్మార్త ప్రక్రియలను అధికరించి సమగ్రతను సాధించుకున్నారు. ఉభయవేదాన్త సభలలో అవిచ్ఛిన్నంగా పాల్గొనడమే కాక - సాక్షాత్తు శ్రీశ్రీశ్రీ పెద్ద జీయర్ స్వామివారి ద్వారానే "న్యాయ వేదాన్త విద్వాన్" అనే బిరుదాన్ని పొందిన స్వామివారి విశిష్టతకు వేరే నిదర్శనం అవసరంలేదు. ప్రస్తుత సత్కారం స్వామి వారి సంబంధంతో తనకు ఒక విశిష్టతను సంతరించుకొంటున్న దనడం వాస్తవం.

బాలనివేదన

# తెలుసుకుందాం

-నిర్వహణ -విజేఆర్

**బాలల్లారా!** ఈ ప్రక్కన ఉన్న చిత్రంలోని మహాపురుషుని గుర్తించి, తెలుసు కుందాం రండి. అలాగే "తాబేలు నేర్పిన పాఠము" చిన్నకథను ఈ క్రింద మీకు అంద జేస్తున్నాం. చదివి తెలుసుకుందాం రండి.

**లోకం అజ్ఞానంధకార బంధురమయినప్పడు, అశాంతితో అలమటించేటప్పడు, సర్వేశ్వరుడు ఆ లోకాన్ని ఉద్ధరించేందుకు మహానుభావులను అవతరింప జేస్తాడు. వారే యుగపురుషులు. అలాంటి మహానుభావులు మన పెద్ద జీయరు స్వామివారు. వీరు 1909 సెప్టెంబరు 1వ తేది, సౌమ్యనామ సం॥రం, నిజశ్రావణమాసంలో, ఉత్తరాభాద్ర నక్షత్రంలో అవతరించారు.**



**1968లో విజయవాడలో కోటితులసిపూజలను చేయించుచు, శ్రీవిష్ణు సహస్రనామములు చెప్పచున్నప్పటి చిత్రం.**

*భగవద్గీతలో 2వ అధ్యాయంలో శ్రీకృష్ణపరమాత్మ ఒక చక్కని నీతిని ఓ తాబేలు ద్వారా తెలిపాడు. గుర్తిద్దాం!!*

## తాబేలు నేర్పిన పాఠం

**యదా సంహరతే చాయం**
**కూర్మోఽజ్గానీవ సర్వశః ।**
**ఇన్ద్రియాణీన్ద్రియార్థేభ్యః**
**తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా ॥**

భగవంతుడు ప్రసాదించిన అవయవాలు, ఇంద్రియాలను మన అధీనంలో ఉంచుకోవాలి. తాబేలును చూశారా దాని వీపుపైన కవచంలాంటిపెంకు ఉంటుంది. దానితో తనను తాను రక్షించు కుంటుంది. తాబేలు చాలా నెమ్మదిగ నడుస్తూ తన గమ్యం చేరుతుంది. దారిమధ్యలో ఏదయిన అపాయం సంభవిస్తుందనిపిస్తే వెంటనే తన కాళ్ళను, మెడను తన కవచం లోకి ఇముడ్చుకుంటుంది. ప్రమాదం తీరిందనుకుంటేనే తిరిగి బయటకు వస్తుంది. నిదానంగా సాగిపోతుంది.

మరి బుద్ధి జీవులమయిన మనం మన చుట్టూవున్న మంచిని గ్రహించి చెడును దరిచేరనీయకుండా మన ఇంద్రియాలను మన అదుపులో పెట్టుకోవాలని తాబేలు మనకి పాఠం నేర్పుతున్నది.

జీవితంలో మనకు ఎన్నో సమస్యలు ఎదురవుతూంటాయి. సమస్య లెదుర య్యాయని భయపడకూడదు. సమస్య తీరేంత వరకు ఓపిగ్గా వేచి వుండాలి. ఆ సమస్యని బుద్ధిఅనే కవచంతో వివేచించి మన ఇంద్రియాలను అదుపులో పెట్టుకుని ఆ సమస్య తీరిన తరువాత ముందుకు సాగా లని తాబేలును దృష్టాంతంగా చూపి శ్రీకృష్ణపరమాత్మ పాఠాన్ని నేర్పాడు.

*(ఉ.వే.శ్రీమాన్ గోపాలాచార్యస్వామివారి శ్రీసూక్తులనుండి గ్రహించబడినది.)*

# సాకేతరామునికి - దివ్య సమర్పణ




**శ్రీరాంనగర్ శంషాబాద్:** మన ఆచార్యులైన శ్రీశ్రీశ్రీ స్వామివారిచే నిర్మితమైన మన దివ్య సాకేత వైభవాన్ని తెలుసుకున్న మహబూబ నగర్ జిల్లాలోని మాదారం గ్రామస్తులు వికాసతరంగిణి జిల్లా సమన్వయ కర్త అయిన శ్రీమాన్ వెంకటరెడ్డిగారి ద్వారా ప్రేరణ పొందారు. అష్టాంగ విమానంతో కూడిన మన దివ్యసాకేతంలో తమ ఊరి వారందరూ మంచి సంపదలతో, పాడిపంటలతో సుఖంగా వుండాలని ప్రతి సంవత్సరం 12 రోజులు దివ్యసాకేత రామునికి రాజభోగ కైంకర్యానికి (మహాప్రసాదం) సమర్పిస్తామని, ఈ సంవత్సరం రోజుకొక్క క్వింటాలు చొప్పున 12 క్వింటాళ్ల బియ్యమును శ్రీవారి సన్నిధిలో సమర్పించారు. శ్రీస్వామివారు వారందరికీ మంగళాశాసనములుచేశారు.

## ఉడుతా భక్తిగా గో సేవ



గోసేవను తనపుట్టిన రోజున చేయాలన్న గొప్ప ఆశయంతో 10వ తరగతి చదువుతున్న 14 ఏళ్ల కుమారి కె.ఎస్.ఎన్. అక్షిత హైదరాబాద్‌కు చెందిన శ్రీమాన్ కె. రవీందర్ రెడ్డిగారి అమ్మాయి. తాను ప్రతినెలా ట్యూషన్‌కు చెల్లించే 4వేల రూపాయలను ఇంటివద్దనే చదువుకుని ఆనెల ట్యూషన్‌ఫీజును గోసేవకు అందించింది. తన మనోభావాలను ఇలా తెలియజేసింది. చూడండి!

In our Indian culture, a cow is given the top most priority. Our ancestors have worshipped the cows as deities and the custom is still being practiced by many people till date. Many times, I have also heard Swamiji talk about the importance of a cow. All this has made me donate some amount to the Gho:sha:la on the occassion of my birthday.

# దేశీయ ఆధ్యాత్మిక గురువుల సమాఖ్య

భారతీయ సనాతన ధర్మం యుగ యుగాలుగా భాసిల్లుతూ, నిరంతరంగా గంగా–కావేరి పుణ్యనదులవలే ఇక్కడి ప్రజల జీవితాన్ని పునీతంను చేస్తున్నది, వారిలో సామాజిక చైతన్యాన్ని ఆధ్యాత్మిక చింతనను అందిస్తూ ప్రభావితం చేస్తూ మన సంస్కృతిని సుసంపన్నం గావిస్తున్నది అలాంటి పవిత్ర భారతదేశంలో జన్మించడం మనకెంతో గర్వకారణం.

వేలాది సంవత్సరాలుగా భారత ఉప ఖండం అనేక అసమానమైన ఆధ్యాత్మిక ఉద్యమాలను నిర్మించి విశిష్టతను గడించింది. ఈ ఉద్యమాలు మానవ కళ్యాణానికి ఎంతగానో దోహదపడ్డాయి. మానవ జాతివికాసానికి తోడ్పడిన ఏకైక ప్రాంతం భారత ఉపఖండమే కనుకనే అనాది కాలంగా భారతదేశం "విశ్వ ఆధ్యాత్మిక రాజధాని"గా గుర్తింపు పొందినది. అందుకే ఆధ్యాత్మిక దాహాన్ని తీర్చడానికి మార్గ దర్శకత్వం వహించే గురుతర బాధ్యత భారతదేశానికే ఉంది.

దురదుష్టవశాత్తు నేడు ప్రపంచ దృష్టిలో లంచగొండితనం, దారిద్ర్యం విలయ తాండవం చేస్తున్న దేశంగా భారతదేశం ముద్రితమైంది. ఆధ్యాత్మిక ఉద్యమాల మధ్య వైరుధ్యాలవల్ల కూడా కొంత అయోమయ పరిస్థితి ఏర్పడినది. ఈలక్ష్యసాధన కోసమని ఆధ్యాత్మిక ద్వారంగా భారతదేశాన్ని నిర్మించా లని కొందరు చిత్తశుద్ధికలిగిన ఆధ్యాత్మిక బృందం జనవరి 6వ తేది మధ్యాహ్నం నుండి సాయంత్రం 6గం॥లవరకు న్యూఢిల్లీలో గల కాన్‌స్టిట్యూషన్‌హాలులో సమావేశమయ్యారు.

ఈ కార్యక్రమానికి **శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ చిన్నజీయరు స్వామివారు** ప్రత్యేక అతిథిగా వేంచేశారు. ఎందరో గురువులు, సంత్‌లు ఆధ్యాత్మిక వేత్తలు ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు.

**సనాతన**ధర్మాన్ని ప్రచారం చేసే ప్రముఖ గురువులందరూకలసి ఈ సమావేశంలో కొన్నితీర్మానాలను ఆమోదించారు.

1 ఆధ్యాత్మిక ఉద్యమాల కన్నింటికి ఒక ఉమ్మడి వేదికను ఏర్పరచడం.
2 భారతదేశాన్ని ప్రపంచ ఆధ్యాత్మిక రాజధానిగా నిరూపించడంలో కలసి కట్టుగా కృషిచేయడం.
3 ఈ వేదిక లక్ష్యసాధనగా ఒక వెబ్ సైట్‌ను ప్రారంభించి అందరి వివరా లనూ దానిద్వారా ప్రపంచానికి అందించడం.
4 "గురుసంగమం"గా ప్రతి సంవత్సరము అందరూ సమావేశ మవ్వడం.

ఈ అంతర్గత సమావేశాన్ని ఒక అపూర్వఘట్టంగా పేర్కొనాలి. ఈ దిశలో కృషిచేయుడానికి అందరూ కలిసి ఒక సమాఖ్య ఏర్పడాలి అని నిర్ణయించారు. సద్గురు జగ్గి వాసుదేవస్వామి, స్వామి చిదానందసరస్వతి, శివరాత్రి దేశికేంద్ర మహాస్వామి, శ్రీ చిన్నజీయర్‌స్వామి, బాబా రామ్‌దేవ్, ఉడిపి పెజావర్‌స్వామి, సిక్కు గురువులు, జైనులు, బౌద్ధులు తదితరులు ఇందులో పాల్గొన్నారు.

వార్తామాలా

# శ్రీస్వామివారి ప్రచారవార్తలు



2011, జనవరి 1వ తేదిన శ్రీరామనగరంలోని దివ్యసాకేతంలో జరిగే నిత్యకళ్యాణం, నిత్యసుదర్శన హవన కార్యక్రమాలలో శ్రీచిన్న జీయరు స్వామివారు పాల్గొని భక్తులకు నూతన సంత్సర శుభాకాంక్షలను, మంగళాశాసనములు అందజేశారు. తీర్థగోష్ఠిలో భక్తులు పాల్గొన్నారు.

**సమాశ్రయణాలు**

జనవరి 2 ఆదివారం ఉదయం దివ్యసాకేతంలో శ్రీస్వామివారు దివ్య కరకమలములతో సమాశ్రయణాలు గావించారు. ఈ కార్యక్రమంలో దాదాపు 200మంది భక్తులు మంత్రోపదేశం పొందారు.

శ్రీస్వామివారు సమాశ్రితులను అనుగ్రహిస్తూ... సమాశ్రయణాల విశిష్టతను, మంత్రాన్ని ఆచరించే విధానాన్ని వివరించారు. మంత్ర స్మరణ సంసారాన్ని దాటించుటయేకాక ఈ లోకంలో మనం ఉన్నంతవరకు సకల శుభాలను అందిస్తున్నారు. సమాశ్రితులు శ్రీస్వామివారిని దర్శించుకొని పునీతుల మయ్యామని ఆనందపరవశులైనారు.

**బ్రైలీ డే జనవరి 2**

మధ్యాహ్నం "జీవా" ప్రాంగణం లోగల నేత్ర కళాశాల 4వ వార్షికోత్సవం, అలాగే ప్రపంచ అంధుల అక్షరాశ్యత దినోత్సవం శ్రీస్వామివారి అధ్యక్షతన ఘనంగ జరిగింది.

ఈ కార్యక్రమంలో నేత్రహీనులైన విద్యార్థులు తాము నేర్చుకున్న విద్యలను, కళలను అత్యంత ప్రతిభావంతంగ ప్రదర్శించారు. మేమెవరికీ తీసిపోమన్న విధంగ వారు తమలో దాగివున్న కళలను, గురువుల ద్వారా నేర్చుకున్న విద్యను జోడించి ప్రదర్శించినతీరు కార్యక్రమంలో పాల్గొన్న అతిథులను, ప్రేక్షకులను మంత్రముగ్ధులను గావించింది. శ్రీస్వామి వారు విద్యార్థు లకు మంగళాశాసనాలను అందించారు.

కనుచూపు లేకపోయినా శ్రీజీయర్ స్వామివారి దివ్యానుగ్రహమే చూపుగ చేసుకొని విద్యార్థులు చూడచక్కగ కార్యక్రమాన్ని అందించిన విధానం, ప్రదర్శించినతీరు చక్కగావుంది. నేత్ర కళాశాల విద్యార్థుల కొరకై కైంకర్యాలని సమర్పించి ప్రోత్సహిస్తున్న మానవతా మూర్తులను శ్రీ స్వామివారు మంగళా శాసనములు చేసారు.

ఈ కార్యక్రమానికి ఉస్మానియా విశ్వవిద్యాలయం ఉపకులపతి శ్రీమాన్ యన్. తిరుపతిరావు, ప్రిన్స్‌పల్ సెక్రటరీ

ఎడ్యుకేషన్ శ్రీమాన్ బిశ్వాల్ ఐ.ఎ.యస్., ఓయూ ఎకాడమిక్ సెల్ డైరెక్టర్ ఆడిట్ శ్రీమాన్ ప్రొఫెసర్ విష్ణువర్ధనరెడ్డి, ఇంటర్ మీడియట్ బోర్డ్ కంట్రోలర్ ఆఫ్ ఎగ్జామినేషన్ శ్రీమాన్ సి.డి.గౌస్, ఇంటర్ మీడియట్ బోర్డ్ ఇ.డి.పి.మేనేజర్ శ్రీమాన్ సంజీవ్‌రాయుడు, కాకతీయ మెడికల్ కాలేజీహెడ్ శ్రీమాన్ విజయకుమార్, మహాసిమెంట్ అధినేత శ్రీమాన్ జె. రామేశ్వరరావు, శ్రీ ఉ.వే. శ్రీమాన్ యస్. వి. రంగరామానుజాచార్యస్వామివారు పాల్గొని విద్యార్థులను ఆశీర్వదించారు.

కాలేజీ కరస్పాండెట్ శ్రీమాన్ టి. కృష్ణమాచార్యస్వామి, నేత్ర డిగ్రీ కళాశాల ప్రిన్స్‌పల్ శ్రీమతి పి. వాణిశ్రీ, నేత్ర జూనియర్ కళాశాల ప్రిన్సిపల్ శ్రీమాన్ వి.మాధవరావు, కాలేజీ కమిటీ చైర్మెన్ శ్రీమతి డి.గాయత్రి, కార్యదర్శి పి.డి.వి. రాజు, శ్రీమతి విజయలక్ష్మిలు కార్య క్రమాన్ని చక్కగ నిర్వహించారు.

విజయనగరంలో ఉన్న అంధుల పాఠశాలలోనూ పలు వికాసతరంగి వారిచే పలుప్రాంతాల్లోనూ బ్రైలీడే నిర్వహించారు

జనవరి 6వ తేదీన శ్రీ స్వామివారు న్యూఢిల్లీలో జరిగిన "దేశీయ ఆధ్యాత్మిక గురువుల సమాఖ్య'' కార్యక్రమంలో పాల్గొన్నారు. సాయంత్రానికి శ్రీరాంనగర్ చేరుకున్నారు.

## కూడారై మహోత్సవం
## భక్తి-ముక్తి మార్గదర్శకురాలు
## శ్రీ ఆండాళ్‌తల్లి

'పరమపవిత్రమైన మార్గశీర్ష మాస (ధనుర్మాస)వ్రతాన్ని ఆచరించి, 30 పాశురాలతో శ్రీరంగనాథుని కీర్తించి, భగవంతుని సన్నిధానం చేరుకొనే అతి సులువైన మార్గాన్ని లోకానికి చూపిన మార్గదర్శకురాలు, సాక్షాత్తు భూదేవి అంశ మన ఆండాళ్ తల్లి' అని పరమహంస పరివ్రాజకాచార్య శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయర్ స్వామివారు తమ అనుగ్రహభాషణంలో వివరించారు.

'ఆండాళ్ తల్లి తాను ఆచరిస్తూ, తమ తోటివారిని తోడ్కొని, భగవంతుని అర్చించే విధానాన్ని చూపించింది ఈ ధనుర్మాస వ్రతంలో' అని జీయర్‌స్వామి వారు ఆండాళ్‌తల్లి భక్తితత్పరతను తెలిపారు.

పెరియాళ్వార్‌గ ప్రసిద్ధులైన శ్రీ విష్ణు చిత్తుల వారికి వరప్రసాదంగ లభించినది. "కోదై'' అని ముద్దుగ పిలిచే ఆతల్లి హరిభక్తురాలై, ధనుర్మాస వ్రతాన్ని అందించి రంగనాథునిలో లీనమైయ్యింది. రంగనాథుని కొఱకు తయారుచేసిన పూలమాలను ముందుగ తాను ధరించి మురిసిపోయేది. శ్రీరంగనాథుడు ఆ మాలను స్వీకరించడంతో శూడిక్కొదుత్త నాచ్చియార్‌గ లోకప్రసిద్ధిగాంచింది మన అమ్మ.

నిత్యం ప్రవహించే కళ్యాణగంగ ప్రవాహంవంటి ప్రేమస్వరూపుడు భగవంతుడని, తనవారినందరిని జాలరి వలె, గుణములను దర్శించే దివ్యచేష్టలనే వలవేసి తనవైపుకి లాక్కుంటాడని, ఆ బంధంవేసి అక్కున చేర్చుకుంటాడని స్వామివారు ఉపన్యసించారు.

గోదాదేవి "కూడారై" నూరు గంగాళాలతో పాయసాన్నిచేసి, స్వామికి అర్పిస్తానని మొక్కుకున్నది. శ్రీరంగనాథుని చేరుకున్న ఆ తల్లి ఆ మొక్కును తీర్చలేకపోయిందని, భగవద్రామానుజుల వారు ఆ మొక్కును తీర్చి, గోదాగ్రజులు అయినారు. ఆమే శ్రీ రామానుజలవారిని "అన్నా" అని పిలిచి "యతిరాజ సహోదరి' అయినది.

దివ్యసాకేతంలో శ్రీస్వామివారే స్వయంగ తమ స్వహస్తాలతో పాల్గొన్న భక్తజన వాహినికి పాయసప్రసాదాన్ని అందించారు. ఈ ప్రసాదాన్ని అందుకుని తాము ధన్యులమయ్యామని ఆనంద పరశులయ్యారు.

### 14న శరణాగతిదీక్ష విరమణ

శ్రీస్వామివారి సంకల్పానుసారంగ గత ఆరు సంవత్సరాలనుండి అత్యంత భక్తి శ్రద్ధలతో దీక్షతో జరుపుకుంటున్న శ్రీవేంకటేశ శరణాగతిదీక్షను ఈ సంవత్సరం ఏడుకొండలకు ప్రతీకగ 7వ సారి దీక్షా కార్యక్రమాన్ని చేపట్టిన భక్తులు ఆ రోజు శ్రీస్వామివారి సమక్షంలో దీక్షా విరమణ గావించారు.

అన్నిచోట్ల భక్తులు దీక్షవిరమణలు గావించుకున్నారు. విశేషించి పలు జైళ్ళలో ఖైదీలు కూడా శ్రీస్వామివారి ఉపదేశాను సారంబానిన శరణాగతి దీక్షలు గోదారంగనాథులు కళ్యాణం నాడు విరమించారని వికాసతరంగిణి కార్యకర్తలు పేర్కొన్నారు.

### 14న గోదారంగనాథుల కళ్యాణమహోత్సవం

దివ్యసాకేత ప్రాంగణంలో ధనుర్మాసం చివరిరోజున గోదారంగ నాథుల కళ్యాణమహోత్సవం శ్రీవారి ప్రత్యక్షపర్యవేక్షణలో కనుల పండవగ జరిగింది. భక్తిప్రపత్తులతో అశేషజన వాహిని పాల్గొని, తరించింది. ఆరోజు సాయంత్రం శ్రీ స్వామివారు సీతానగరం బయలుదేరారు. వెళుతూ మధ్యలో సూర్యాపేట, నల్గొండల్లో గోదాకళ్యాణాలను సందర్శించి రాత్రికి సీతానగరం చేరుకున్నారు.

### సీతానగరంలో గోదాకళ్యాణం

15వ తేది ఉదయం శ్రీస్వామివారు ఆరాధన పూర్తిచేసుకొని వేదికను అలంకరించారు. పూర్వరంగంగ శ్రీమాన్ మధుసూదనాచార్యస్వామి దీక్షావిరమణ కార్యక్రమాన్ని ప్రారంభించారు. శ్రీస్వామివారు అందరిచేత సంకల్పం చెప్పించి, అర్చనగావించి దీక్షను విరమింపచేసారు.

అనంతరం భక్తులు తమ గోదా రంగనాథవిగ్రహాలను వేంచేపు చేసుకొని

కళ్యాణోత్సవంలో అన్వయించారు. శ్రీమాన్ మధుసూదనా చార్యులు అందరి చేత కళ్యాణం చేయిస్తూ శ్రీగోదా రంగనాథ కళ్యాణం అత్యంత వైభవంగ జరిపించారు.

ఈ కార్యక్రమానికి శ్రీమాన్ నల్లూరి కృష్ణగారు యాజమాన్యం వహించారు. వీరి కుటుంబసభ్యులకు శ్రీస్వామివారు మంగళా శాసనాలను అనుగ్రహించారు. శ్రీమాన్ కృష్ణ దంపతులు విద్యార్థులకు, స్వాములకు వస్త్రకైంకర్యం చేసుకున్నారు. అనంతరం శ్రీస్వామివారు స్వయంగ వచ్చినభక్తులకు తీర్థాన్ని అనుగ్రహించారు. అనంతరం విశేష తదీయారాధన జరిగింది.

16 సాయంకాలం శ్రీవారు నడిగడ్డ పాలెంకి బయలుదేరారు. మధ్యలో తాడేపల్లిలో వయోవృద్ధురాలైన శ్రీమతి తులసమ్మగారి నివాసానికి విచ్చేసి, మంగళాశాసనాలు కృపచేసి నడిగడ్డపాలెం చేరుకున్నారు. ఆలయ నిర్వాహకులు పూర్ణ కుంభ స్వాగతం పలికారు. ఆశ్రమంలో నామసంకీర్తనపరులకు, నిర్వాహకులకు నూతనవస్త్రాలను అందించి మంగళా శాసనాలు చేశారు.

17వ తేదీ శ్రీశ్రీశ్రీ పెద్దజీయర్‌స్వామి వారి పరమపదోత్సవ సందర్భంగ తీర్థగోష్ఠి అనంతరం శ్రీపెద్దజీయర్‌స్వామివారి సన్నిధిలో శ్రీస్వామివారు తమ కరకమలాలతో కలశాలతోక్షీరాభిషేకం జరిపించారు. తరువాత శ్రీపెద్ద జీయర్ స్వామివారికి అష్టోత్తరశతనామ పూజను సమర్పించారు.

ఈ సందర్భంగ శ్రీస్వామివారు ప్రసంగిస్తూ "పరమపద మహోత్సవ విశిష్టతను, శ్రీపెద్దజీయర్‌స్వామివారి వైభవాన్ని" వివరించారు. ఈ కార్యక్రమానికి విచ్చేసిన శ్రీమాన్ ఫలహారి శ్రీమాన్ కోసలేంద్ర ప్రపన్న ఆచార్యస్వామి,శ్రీమాన్ ఆత్రేయస్వామి, ఉ.వే శ్రీమాన్ ఉడయ వర్లుస్వామి శ్రీపెద్దజీయర్ స్వామివారి వైభవాన్ని కొనియాడారు. ఆశ్రమ నిర్వాహకులు శ్రీమాన్ నరసింహాచార్యులు, కవిగారి కుమారులు విచ్చేసిన భగవద్బంధువులందరికి విశేష తదీయారాధన ఏర్పాట్లు గావించారు. స్థానిక వికాస తరంగిణి కార్యకర్తలు విశేషసేవలందించారు. శ్రీస్వామివారు వీరందరికీ మంగళాశాసనాలు అనుగ్రహించారు.

శంషాబాద్ శ్రీరామనగరంలోకూడ శ్రీపెద్దజీయర్ స్వామివారి పరమపదోత్సవ కార్యక్రమాన్ని వైభవంగ జరిపారు. అభిషేక, అష్టోత్తర శతనామ పూజలను జరిపిం చారు. ఈ కార్యక్రమానికి భక్తులు పాల్గొని శ్రీ పెద్దజీయర్‌స్వామివారికి పుష్పాలను సమర్పించారు. అదేవిధంగా రాష్ట్ర వ్యాప్తంగా వికాసతరంగిణి అన్ని కేంద్రాల లోను శ్రీ పెద్ద జీయరు స్వామి వారి పరమపదోత్సవాన్ని భక్తిశ్రద్ధలతో జరుపుకున్నారు.

శ్రీస్వామివారు18వ తేదీనుండి20 వ తేదీ వరకు సీతానగరంలో వేంచేసి ఉన్నారు. ఆరోజు మధ్యాహ్నం శంషాబాద్ బయలు దేరి వెళ్ళారు.

21వ తేదీ ఉదయం తీర్థగోష్టి జరిపారు.

శనివారం 22వ తేది ఉదయం శంషాబాద్‌లోని దివ్యసాకేత ప్రాంగణంలో జరిగిన జంటనగరాలకు చెందిన ఆరు వికాస తరంగిణి కార్యకర్తల సమావేశంలో శ్రీస్వామివారు వారికి దిశానిర్దేశన చేశారు.

విశ్వశాంతి కొరకు శరణాగతియాత్ర, సామూహిక నారసింహపూజ, శ్రీసుదర్శన నారసింహయాగం, గోదారంగనాథుల కళ్యాణ మహోత్సవాలను ఘనంగా జరుపు కొన్నారని శ్రీవారు వారికి అభినందనలు అందజేసారు. ఈ కార్యక్రమాలను నెల రోజులూ సమన్వయ పరిచి చక్కగా నిర్వహించిన శ్రీమాన్ భరత్‌స్వామి, వికాస తరంగిణి కార్యకర్తలకు శ్రీస్వామివారు మంగళాశాసములు చేశారు.

మంచిమంచి కార్యక్రమాలు చేయడంలో ముఖ్యంగా సమష్టిగా కలిసి చేయడంలో ఒకరికిఒకరు తరచుగా ఆయా ప్రాంతాల్లో కలుసుకొని తమ మనోభావాలను పంచుకొని కార్యక్రమాలు నిర్వహించడంలో తగిన ప్రణాళికను రూపొదించుకొని ముందుకు సాగాల న్నారు. అలాగే తాము నేర్చుకున్న విషయాలను కొత్త తరానికి అందేలా కృషి చేయాలన్నారు.

ఏ కార్యక్రమానికైన ధనం అనేది ఒక్కటే ప్రధానం కాదని, ధనం లేకుండానే అనేక మంచి మంచి కార్యక్రమాలు చేయవచ్చని శ్రీ స్వామివారు కార్యకర్తలకు వివరించారు. తరచు కార్యక్రమాలు చేయడంవల్ల, పెద్ద కార్యక్రమాలలలో పాలు పంచుకోవడంవల్ల, ఉత్సాహం కలుగుతుంది. లేకపోతే స్తబ్దత ఏర్పడు తుందన్నారు.

ఈ కార్యక్రమములో పాల్గొన్న శ్రీశ్రీశ్రీ అహోబిల రామానుజ జీయరు స్వామివారు అనుగ్రహభాషణ చేస్తూ శ్రీ చిన్నజీయరు స్వామివారు మనందరికి చక్కని అవకాశాన్ని అందజేసారన్నారు. వారిచ్చిన మనోబలంతో మనందరం కలిసి యాత్రను దిగ్విజయంగా జరుపు కున్నామన్నారు. అనంతరం వీరు కార్యకర్తలకు ఆదర్శ దినచర్య పుస్తకాలను అందించగా శ్రీ చిన్నజీయరు స్వామివారు ప్రతిమలను అందజేశారు

ఆనాటి సాయంత్రం శ్రీస్వామి వారు మాటీవి నిర్వహించిన ''వెలుగు వెలిగించు" కార్యక్రమంలో విశిష్ట అతిథిగా పాల్గొన్నారు. ఆ కార్యక్రమంలో మనరాష్ట్ర గవర్నర్ శ్రీమాన్ నరసింహన్‌గారు ముఖ్య అతిథిగా విచ్చేసి శ్రీస్వామివారి మంగళా శాసనములు పొందారు.

23 ఉదయం తీర్థగోష్టి, సాయంత్రం మహబూబ్‌నగర్ జిల్లాలోని భీమారం గ్రామం సందర్శించి అక్కడ జరిగిన విశేష కార్యక్రమంలో స్వామివారు పాల్గొన్నారు.

24వ తేదీ తీర్థగోష్టి అనంతరం మధ్యాహ్నం హైదరాబాద్ సమీపంలోగల

ప్రగతి రిసార్ట్స్‌ను స్వామివారు సందర్శిం చారు. వారితో శ్రీ అహోబిల స్వామివారు కూడా ఉన్నారు.

ఆ రిసార్ట్స్‌లో ఔషధమొక్కలను, పండ్ల, పూలతోటలను, గోశాలను శ్రీస్వామివారు సందర్శించారు. ప్రగతి రిసార్ట్స్ అధినేత శ్రీమాన్ రావుగారు మాట్లాడుతూ "నిజానికి నేను మీకు ఇప్పుడు తెలుసు. కానీ, నాకు మీరు ఎప్పటినుండో తెలుసు. మిమ్ములను అనుసరించేవారెందరో ఉన్నారు. మీరు చెప్పే ప్రవచనాలను విని స్పందించి ఈ చిరు ప్రయత్నం చేశాను. మీ మంగళాశాసనాలను అందుకుంటు న్నాను. ఇది నా పూర్వజన్మ సుకృతంగా భావిస్తున్నాను" అన్నారు.

25వ తేదీన కూరత్తాళ్వాన్ తిరునక్షత్రం సందర్భంగా శ్రీ స్వామివారు కూరేశుల వైభవాన్ని అనుగ్రహించారు.

26వ తేదీ ఉదయం భారత గణతంత్ర దినోత్సవాన్ని పురస్కరించుకొని శ్రీశ్రీశ్రీ స్వామివారు పతాకావిష్కరణ గావించారు.

శ్రీవారు మాట్లాడుతూ గణతంత్ర దినోత్సవ ప్రాముఖ్యాన్ని వివరించారు. శ్రీ అహోబిల స్వామివారు, నేత్రవిద్యాలయ డిగ్రీ, జూనియర్‌కాలేజీ విద్యార్థులు, జీవా గురుకుల విద్యార్థులు, జీవా ప్రాంగణం లోని అందరూ ఈ వేడుకలో పాల్గొన్నారు. జాతీయగీతాన్ని ఆలపించి జాతీయ ఝండాకు గౌరవ వందనం చేశారు. కాలేజీలెక్చరర్ శ్రీమాన్ యాదిగిరి మాస్టారు వందనసమర్పణతో కార్యక్రమం ముగిసింది. అనంతరం తీర్థగోష్ఠి జరిగింది

దివ్యసాకేతంలో చిత్తానక్షత్రం సందర్భంగా శ్రీకోదండరామస్వామి మూలవరులకు తిరుమంజనాన్ని సమ ర్పించారు. అనంతరం నిత్యకళ్యాణ, నిత్య సుదర్శనహవన కార్యక్రమాలలో శ్రీ స్వామి వారు రథసప్తమిని పురస్కరించుకుని ఆదిత్యహృదయ పారాయణంచేసి సర్వ సుఖాలను పొందగలరని భక్తులకు మంగళాశాసనాలు చేశారు. శ్రీ అహోబిల స్వామివారుకూడా శ్రీరామునిలోని మంచి లక్షణాలను భక్తులు వివరించారు

# శ్రీ జీయర్ స్వామివారి పర్యటన వివరములు

| | |
|---|---|
| ఫిబ్రవరి 1న | బెంగుళూరు మకాం |
| ,, 2న | మైసూరులో సుట్టూరు మఠం వారి కార్యక్రమాలలో పాల్గొంటారు. |
| ,, 3న | మేల్కోట, జ్ఞాన మండపంలో సుదర్శనయాగం. |
| ,, 4న | మేల్కోటలో ఉదయం 4.15ని॥ భవన ప్రారంభోత్సవము. |
| ,, 5న | శంషాబాద్‌లోగల జీవాప్రాంగణంలో హోమియో వైద్యశాలకు శంకుస్థాపన |
| ,, 6న | కూకట్‌పల్లిలో శ్రీమాన్ చంద్రయ్యగారి స్కూల్ భవన ప్రారంభం, ఇతర కార్యక్రమాలు. |
| ,, 9 మరియు10 | మహబూబ్‌నగర్ జిల్లా, జడ్చర్ల మండలం గంగాపురంలో మకాం. రథసప్తమి సందర్భంగా "ఆదిత్యహృదయం" సామూహిక ఉపదేశాత్మక పారాయణం |
| ,, 13న | యాదగిరిగుట్ట సందర్శన |
| ,, 16న | లక్ష్మీనరసింహస్వామి దేవస్థానం, మహబూబ్‌నగర్‌లో పుష్కరోత్సవంలో పాల్గొంటారు. |
| ,, 17న | రాత్రికి బీచుపల్లి రామాలయంలో మకాం |
| ,, 18న | బీచుపల్లిలో హయగ్రీవ, సరస్వతి ఆలయాల ప్రతిష్ఠ |
| ,, 19న | B.H.E.L. దగ్గర మైత్రీనగర్ శ్రీ వేంకటేశ్వరాలయం సందర్శన. |
| ,, 20న | పస్మాముల (రంగారెడ్డి జిల్లా) సీతారామచంద్రస్వామి విగ్రహ ప్రతిష్ఠ, వి.టి. వనస్థలిపురం ఆలయ సందర్శన. |
| ,, 21న | జీవాప్రాంగణంలో IGNOU సౌజన్యంతో కమ్యూనిటీ కాలేజీ కోర్సులు ప్రారంభం |
| ,, 22న | సింహచలం సందర్శన.. తదుపరి పూజాకార్యక్రమాల్లో పాల్గొంటారు. |
| ,, 23న | సీతానగరం మీదుగా |
| ,, 24న | సంతరావూరు శ్రీ చెన్నకేశవ స్వామి ఆలయ ప్రతిష్ఠ కార్యక్రమం నిమిత్తం వెళ్లుట. |
| ,, 26న | సంతరావూరు నుండి బయలుదేరుట |

| | |
|---|---|
| ,, 26న | నెల్లూరు జిల్లా, పాపిరెడ్డిపాలెం శ్రీకోదండరామాలయం చేరుట |
| ,, 27న | ఆలయప్రతిష్ఠ, నరసింహులు కొండలోని ఆశ్రమం సందర్శిస్తూ రాత్రికి పెంచలకోన చేరుట |
| ,, 28న | పెంచలకోనలో శ్రీసుదర్శననారసింహయాగ పూర్ణాహుతిలో పాల్గొనుట రాత్రికి సీతానగరం చేరుట. |
| మార్చి | |
| 1 | విజయవాడలో శ్రీమాన్ జి.ఎస్.ఎన్. రాజుగారి నిర్వహించే కార్యక్రమాలలో పాల్గొనుట. |
| ,, 2 | విజయవాడ లక్ష్మీపురంలో పరమపదోత్సవ కార్యక్రమంలో పాల్గొనుట.. |
| ,, 3 | సీతానగరం ఆశ్రమంలో మంత్రోపదేశము(సమాశ్రయణాలు) జరుగును. |
| ,, 5 | నల్గొండజిల్లాలో నిడుగొండ చేరుట |
| ,, 6 | నిడుగొండలో శ్రీ ఆంజనేయస్వామి దేవాలయము ప్రతిష్ఠ, రాత్రికి హాలియా గ్రామం చేరుట. |
| ,, 7 | నల్లగొండజిల్లా హాలియాలో శ్రీరామాలయ ప్రతిష్ఠ, రాత్రికి శ్రీరామనగరం ప్రయాణం. |
| ,, 11 | మెదక్ జిల్లా వేలిజాల గ్రామము సందర్శన |
| ,, 12 | హైదరాబాద్‌లోని ఎల్.బి.నగర్‌లోగల సౌభాగ్యపురంలో శ్రీవేంకటేశ్వరాలయ ప్రతిష్ఠ. అనంతరం జగిత్యాల బయలుదేరుట. |
| ,, 13 | జగిత్యాల రాజగోపురం సంప్రోక్షణ, అక్కనుండి కొండగట్టు శ్రీఆంజనేయ స్వామివారిని సందర్శన, అక్కడి కార్యక్రమాలలో పాల్గొనుట, రాత్రికి వెలిశాల చేరుట. |
| ,,14,15,16 | కరీంనగర్, వెలిశాల గ్రామంలో ఆలయ బ్రహ్మోత్సవాలలోపాల్గొనుట. శ్రీవీర్లప్రభాకర్‌రావుగారు ఏర్పాట్లు చూస్తారు. |
| ,,16 | జీవాప్రాంగణంలో శ్రీమతి వనజాభాస్కర్‌రావుగార్ల నిర్మింపచేసిన అతిథి గృహ ప్రారంభోత్సవము. |
| ,, 19 | పశ్చిమ గోదావరి జిల్లా భీమవరం వద్ద కోదండ రామాలయ ప్రతిష్ఠ |

# శ్రీశ్రీశ్రీ అహోబిలస్వామివారి ప్రచారవార్తలు



శ్రీశ్రీశ్రీ చిన్నజీయరు స్వామివారు ఈ సంవత్సరం శ్రీనివాసుడు మనపై చూపుతున్న అనుగ్రహానికి కృతజ్ఞతగా, స్వామి వైభవాన్ని లోకానికి మరింతగా చాటాలని, తద్వారా లోకానికి మరింత శుభాలు కలగాలని, సుఖసంపదలతో సమాజం సత్ సంప్రదాయమార్గంలో ముందుకు సాగాలనే వారి సంకల్పానుసారం శ్రీశ్రీశ్రీ అహోబిల జీయరు స్వామివారు "శరణాగతి దీక్షా", "ధనుర్మాస వ్రతదీక్షల" జనవరినెల విశేషాలు.

శ్రీ అహోబిల జీయరుస్వామివారు శరణాగతి దీక్షయాత్రలో భాగంగా జనవరి 2011వ సం॥ జనవరి 1వ తేదిన శ్రీరామనగరంలోని దివ్యసాకేతానికి వేంచేసి, శ్రీస్వామివారి మంగళాశాసనములు తీసుకున్నారు. అక్కడ జరిగే దివ్యసాకేతంలో జరిగే నిత్యకళ్యాణం, నిత్యసుదర్శన హవన కార్యక్రమాలలో శ్రీచిన్న జీయరు స్వామివారి కలసి పాలుపంచుకున్నారు. అదే రోజు సాయంత్రం మహబూబ్‌నగర్ శ్రీలక్ష్మీనరసింహస్వామి ఆలయానికి చేరుకుని ఆనాటి తిరుప్పావై ప్రవచనం కృపచేశారు. స్థానిక వికాసతరంగిణి ఆధ్వర్యంలో జరిగిన పలు కార్యక్రమాలలో పాల్గొన్నారు.

2వతేదీ శ్రీ లక్ష్మీనరసింహస్వామి కోవెలలో శ్రీసుదర్శన-నారసింహ హవన కార్యక్రమం నిర్వహించి, మొగలిగిద్దకు చేరుకున్నారు. మొగలిగిద్దలో ఆనాటి తిరుప్పావై ప్రవచనము అందించారు.

3వ తేది ఉదయం పురాతన శ్రీరంగ నాథస్వామి ఆలయంలో సుదర్శన- నార సింహ హవన కార్యక్రమం గావించారు. ఆరోజు సాయంత్రం బయలుదేరి ఖమ్మం చేరుకున్నారు.

4వతేది ఉదయం శ్రీమాన్ ఇ. రామారావుగారు,శ్రీమాన్ పోలాశ్రీనివాస్, శ్రీమాన్ హరిబాబుగార్ల అధ్యక్షతన శ్రీకోదండరామాలయంలో హవన కార్య క్రమం జరిగినది. అనంతరం కల్లూరు శ్రీకృష్ణాలయాన్ని, సత్తుపల్లి పార్థసారథి ఆలయాన్ని సందర్శించి, సాయంత్రం తుంబూరు చేరుకున్నారు.

5వ తేదిన శ్రీ సుదర్శన నారసింహ హవనము వైభవంగా జరిగినది. వంద లాది భక్తులు యజ్ఞంలో యాజ మాన్యాన్ని వహించి, అధిక సంఖ్యలో పాల్గొనడం విశేషం. ఆకార్యక్రమాన్ని శ్రీ లక్ష్మీ నరసింహస్వామి దేవాలయ కమిటీ ప్రెసిడెంట్ శ్రీమాన్ రామారావు, వికాస తరంగిణి వారు నిర్వ హించారు. అదేరోజు

సాయంత్రం అశ్వారావుపేట చేరుకుని శ్రీమాన్‌ఎన్.సుబ్రహ్మణ్యంగారినిర్వహణలో వాసవి కన్యాకాపరమేశ్వరి ఆలయఫంక్షన్ హాలులో అనుగ్రహ భాషణం చేసి 6వ తేదీ ఉదయం హవన కార్యక్రమం నిర్వహించారు. సాయంత్రం కాకినాడ టి.టి.డి కళ్యాణమండపం చేరుకున్నారు.

7వ తేది శ్రీమాన్ ఆంజనేయ ప్రసాద్, శర్మగారి పర్యవేక్షణలో జరిగిన కార్యక్రమాలలో పాల్గొన్నారు. సాయంత్రం పాయకరావుపేట శ్రీపాండురంగ ఆలయంలో శ్రీమాన్ రాజుగారు, శ్రీమాన్ వర్మగారు, వి.టి. సభ్యులు ఆధ్వర్యవంలో జరిగిన కార్యక్రమంలో పాల్గొన్నారు.

8వ మధ్యాహ్నం పూర్ణాహుతి పూర్తి చేసుకుని వైజాగ్ దగ్గర కూర్మన్నపాలెం చేరుకున్నారు.

9వ తేది స్థానిక కూర్మన్నపాలెం శ్రీ వేంకటేశ్వర ఆలయంలో వి.టి. కన్వీనర్ శ్రీమాన్ అశోక్‌రాజుపర్యవేక్షణలో, ఆలయ కమిటీ ఆధ్వర్యవంలో జరిగిన పూజాది కార్యక్రమంలో పాల్గొని అనంతరం అష్టలక్ష్మిఫౌంటెన్ ప్రారంభోత్సవ కార్యక్రమంలో పాల్గొని మంగళాశాసనం చేశారు. అదే రోజు సాయంత్రం రాజాం బయలుదేరారు.

10 తేది సాయంత్రం రాజాం వేణుగోపాలస్వామి ఆలయ కమిటీ తరఫున బుస్కీ మాస్టర్ ఆధ్వర్యవంలో ఆలయంలో హవన కార్యక్రమాలనుజరిపి సాయంత్రం మందస చేరుకున్నారు.

11వ తేదిన స్థానిక శ్రీవాసుదేవ పెరుమాళ్ ఆలయంలో **కూడారై** ఉత్సవం అత్యంత వైభవంగా నిర్వహించారు. ఈ కార్యక్రమాన్ని పురుషోత్తమ రామానుజ దాస్, శ్రీ వాసుదేవసేవాసమితి సభ్యులు, వి.టి. సభ్యులు నిర్వహించారు. స్వామి వారు రాత్రికి భువనేశ్వర్ చేరుకున్నారు.

12వ తేదినుండి 14వ తేది వరకు టి.టి.డి. కళ్యాణమండపంలో శ్రీసుదర్శన నారసింహ హవనము, సామూహిక పూజలు నిర్వహించారు. **తిరుప్పావై** పై పవర్ పాయింట్ ప్రదర్శనను ఏర్పాటుచేసి చూపించారు.

14వ తేది భోగిపండుగ సందర్భంగా శ్రీ గోదారంగనాథుల కళ్యాణమహోత్సవ కార్యక్రమాన్ని నిర్వహించిన శ్రీమాన్ జగన్నాద్ దాస్, శ్రీమాన్ తిరువేంగళా చార్యులు, ఇతర సభ్యులకు మంగళా శాసనాలు అందజేశారు. అనంతరం పూరీ బయలుదేరి పూరీ జగన్నాథస్వామిని సేవించి తిరిగి రాత్రికి మందసకు వేంచేశారు శ్రీ అహోబిల స్వామివారు.

15వతేది మకరసంక్రాంతి సందర్భంగ మందసలో తిరుప్పావై పవర్ పాయింట్ ప్రదర్శనను జరిపి 16వ తేదిన గోదాకళ్యాణాన్ని స్థానిక వి.టి. సభ్యుల ఆధ్వర్యవంలో ఘనంగా జరిపించి రాత్రికి వారిజ చేరుకున్నారు.

17వతేది శ్రీపెద్దజీయరు స్వామివారి పరమపదోత్సవాన్ని, శ్రీ సుదర్శన నారసింహహవన కార్యక్రమాన్ని ఘనంగా వారిజలో జరిపించారు. శ్రీమాన్ వర్మ, శ్రీమాన్ నారాయణరెడ్డి, శ్రీమాన్ రాజు, వారిజ ఆశ్రమ కమిటి నిర్వహణలో ఈ కార్యక్రమము జరిగింది. శ్రీశ్రీశ్రీ పెద్ద జీయర్ స్వామివారి పరమపదోత్సవం సందర్భంగా భక్తుల కోరికపై వేంపాడు చేరుకున్నారు.

స్థానిక గవర్నమెంట్ హైస్కూల్‌లో ప్రవచనం గావించారు. ఈ కార్యక్రమంలో శ్రీమతి సుజాత, శ్రీమతి రేఖ తదితర భక్తులు, స్థానికులు పాల్గొన్నారు. శ్రీస్వామి వారు మంగళాశాసనాలు అందించి రాత్రికి రాజమహేంద్రి రంగధామం చేరుకున్నారు.

18వతేది శ్రీరంగధామంలో తీర్థగోష్ఠి అనంతరం మార్చి 4 నుండి 10 వరకు శ్రీరంగధామంలో జరగబోయే బ్రహ్మోత్సవాలపై తగు సూచనలను సభ్యులకు అందజేసారు. తరువాత ఖమ్మం బయలుదేరి శ్రీమాన్ కోటేశ్వరరావుగారి గృహానికి వేంచేశారు.

19వ తేది సీతానగరం వేంచేశారు. 21న తేదీన శ్రీశ్రీశ్రీ అహోబిల స్వామి వారు గుంటూరులోని సంగడిగుండలో 600 సంవత్సరాలనాటి వరద రాజస్వామి వారి (ఆంజనేయస్వామి) ఆలయాన్ని సందర్శించి ఆలయ జీర్ణోద్ధరణకు కావలసిన తగు సూచనలు అందజేసి, సామూహిక హనుత్ పూజా కార్యక్రమాన్ని నిర్వహించారు.

మధ్యాహ్నం అక్కడి నుండి బయలు దేరి రాత్రికి శంషాబాద్ శ్రీరాంనగర్ చేరుకున్నారు.

అక్కడ నుండి శ్రీ చిన్న జీయర్ స్వామివారితో కలిసి పలు విశేష కార్యక్రమాలలో అన్వయించారు.

# ఇతర రాష్ట్ర వికాసతరంగిణి విశేషాలు

**కర్ణాటక-దావణగిరి:** వికాస తరంగిణి సభ్యులు ఆధ్వర్యంలో రంగధామం(దావణగిరి)లో తిరుప్పావై పారాయణ, నిత్య ఆరాధనలతో తీర్థగోష్ఠులు, సాయంకాలం ప్రవచనాలు, సామూహిక లక్ష్మీనరసింహ పూజలు ఈ ధనుర్మాస మహోత్సవాన్ని పురస్కరించుకొని అత్యంత వైభవంగా జరిగాయి. భోగిరోజున శ్రీగోదారంగనాథుల కళ్యాణం వైభవంగా జరిగింది. వందలాది మంది భక్తులు ఈ ఉత్సవాన్ని సేవించుకొని ఆనందపరవశులయ్యారు. ఈ కార్యక్రమానికి కర్ణాటక విధాన పరిషత్ అధ్యక్షులు డా|| నాగస్వామి వారి, దావణగిరి నగరపాలక అధ్యక్షులు శ్రీమాన్ జి.ఎమ్. బక్కేశవుగారు మరియు తదితరులు విచ్చేసినారు.

**జెట్ -బెంగుళూరు** వారు ధనుర్మాస కార్యక్రమాన్ని కుమారి ఉషశ్రీగారి ఆధ్యర్యవంలో నిర్వహించారు. 'గోకుల్' శ్రీ వేంకటేశ్వరస్వామివారిదేవాలయంలో గీతాజయంతి, ముక్కోటి ఏకాదశి సందర్భంగా గీతాపారాయణ చేశారు. తిరుప్పావై ప్రవచనాలు 'కాక్‌స్టోన్ మౌనగిరి మఠం'లో,అలానే కాఫీబోర్డు రామాయలంలోను జరిగాయి. శ్రీ గోదారంగ నాథుల కళ్యాణం టెక్‌పార్క్‌లోని ఉషా జగదీష్‌గారి నూతన గృహమందు శ్రీమాన్ వేదవ్యాసాచార్యులుగారు జరిపించారు. ఈ కార్యక్రమంలో అన్వయించి ఎంతోమంది ఆనంద పరవశులయ్యారు.

**శ్రీరంగం:** వీరరాఘవీయ కూటంలో ధనుర్మాసంలో తిరుప్పావై ప్రవచనం శ్రీశ్రీశ్రీ ఉ.వే. శ్రీ పరాశర లక్ష్మీ నృసింహ భట్టర్‌స్వామివారిచే నెలరోజులపాటు తిరుప్పావై ప్రవచనాలు జరిగినాయి.

14వ తారీఖునాడు శ్రీగోదారంగ నాథుల కళ్యాణం అత్యంత వైభవంగా జరిగింది.

17వ తేదీన శ్రీశ్రీశ్రీ పెద్ద జీయరు స్వామివారి పరమపదోత్సవమును అష్టోత్తర పూజ, అరయర్ల గానంతో, ఆరాధనతో అత్యంత వైభవంగా జరిగింది. వీరరాఘవ రామానుజకూటం మేనేజర్ వి.వి.ఎస్. సూర్యనారాయణరావుగారు అరయర్లకు, స్వాములకు రామానుజ కూటం తరపున సత్కరించారు. ఈ కార్యక్రమానికి చెన్నై నుండి శ్రీమతి ఐ.వి. ఆనంద్‌కుమారిగారు, జి.వి. చలపతిరావు గారి దంపతులు, విశాఖపట్నం నుండి చిరంజీవి రాజుగారు, శ్రీమతి కొండమ్మ దంపతులు మరియు విశాలగారు కాళహస్తి నుండి సుశీలగారు మరియు భక్తులు పాల్గొన్నారు. విశేష తదీయారాధన జరిగింది.



శ్రీరాంనగర్‌లోని దివ్యసాకేతంలో కూడారై మహోత్సవంలో
భక్తులకు శ్రీస్వామివారు మంగళాశాసనాలు చేస్తున్న దృశ్యం.




శ్రీరాంనగర్‌లో శరణాగతి దీక్షావిరమణ మహోత్సవంలో
శ్రీ స్వామివారు ప్రసంగిస్తున్న దృశ్యం.



కూడారై మహోత్సవంలో శ్రీ స్వామివారు స్వయంగా
పాయాసాన్ని అందిస్తున్న దృశ్యం



గోదాకళ్యాణ మహోత్సవంలో పూజాసామాగ్రిని,
విగ్రహాలను శ్రీ స్వామివారు అందిస్తున్న దృశ్యం



గోదా కళ్యాణం లో పాల్గొని పూజలు చేస్తున్న భక్తకోటి



సీతానగరంలో భోగినాడు శ్రీస్వామివారికి గంగిరెద్దుల
విన్యాసాలతో స్వాగతం పలుకుతున్న దృశ్యం



హైదరాబాద్‌లో జనవరి 14న శరణారగతియాత్రను,
గోదాకళ్యాణోత్సవాలను ఘనంగా నిర్వహించడానికి తోడ్పడినవారికి
శ్రీస్వామివారు మంగళాశాసనాలు చేస్తున చిత్రం.



గోదారంగనాథుల కళ్యాణం, శరణాగతి దీక్షా విరమణ

"హరినామ స్మరణతో ప్రతి ఉదయము ప్రారంభించు త్రివిక్రముని మరువక స్మరించు."

# పరమపదము



విజయవాడ వికాసతరంగిణి సభ్యులైన శ్రీమాన్ కోనేరు నిరంజన్‌గారి తల్లిగారైన **శ్రీమతి సరోజినిగారు** ది. **3.1.2011**న పరమపదము చేరినారు. వీరికి పరమాత్మ పదసన్నిధిలో శాశ్వత కైంకర్యం లభించాలని శ్రీస్వామివారు మంగళాశాసనములు చేశారు.



వరంగల్ వాస్తవ్యులు **శ్రీమతి పొట్లపల్లి ఆండాళమ్మ**గారు ది **20.1.2011** పరమపదము చేరినారు. వీరు పెద్దస్వామివారి శిష్యురాలు. హన్మకొండలో శ్రీ చిన్న జీయరుస్వామివారు నిర్వహించే అన్నికార్యక్రమాలలో వారు తమ సేవలందించేవారు. వీరికి పరమాత్మ పదసన్నిధిలో శాశ్వత కైంకర్యం లభించాలని శ్రీస్వామివారు మంగళాశాసనములు చేశారు.



వరంగల్ జిల్లా, ఏడునూతుల వాస్తవ్యులు **శ్రీమతి నెల్లుట్ల శకుంతలాదేవి**గారు శ్రీ పెద్ద జీయరు స్వామివారి వద్ద సమాశ్రితులు. వీరు **8.1.2011**న పరమపదం చేరినారు. హైదరాబాద్ ఎల్.వి.ప్రసాద్ హాస్పిటల్‌లో తమ నేత్రములను దానం చేశారు. వీరికి పరమాత్మ పదసన్నిధిలో శాశ్వత కైంకర్యం లభించాలని శ్రీస్వామివారు మంగళాశాసనములు చేశారు.



విజయవాడ వాస్తవ్యులు **శ్రీమతి పర్వతనేని అన్నపూర్ణ**గారి ప్రథమ వర్ధంతి **16.2.201 1**న జరుపుకొనుచున్నారు. వీరి కుటుంబసభ్యులు భక్తినివేదనకు కైంకర్యము సమర్పించినారు.



భద్రాచలం వాస్తవ్యులు **శ్రీమతి పలివెల సరస్వతి**గారు **2.1.2011**న సంవత్సరీకము. ఈ సందర్భంగా భక్తినివేదనకు కైంకర్యమును సమర్పించినారు.



శ్రీమతే రామానుజాయ నమః

63 సం॥ల నుండి అశేష భగవద్బంధువులు ఆదరిస్తున్న .....

# భక్తినివేదన

ఆధ్యాత్మిక మాసపత్రిక



శ్రీ వికృతి నామ సంవత్సర ఉత్తరాయణం, శిశిరఋతువు, ఫాల్గుణమాసం


**సంపుటి 63** **మార్చి 2011** **సంచిక 12**


వ్యవస్థాపకులు

పరమహంస పరివ్రాజకాచార్య

శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జీయరుస్వామివారు

సంపాదకులు :

శ్రీ ఉ.వే.శ్రీమాన్ T.P. శ్రీరామచంద్రాచార్యులు

## విషయ సూచిక





శ్రీనమ్మాళ్వార్ శకం 5111



శ్రీ రామానుజ శకం 992-993



శ్రీమన్నారాయణ రామానుజ జీయరు శకం 102


Printed & Published by H.H. Tridandi Chinna Srimannarayana Ramanuja Jeeyar Swamiji on behalf of **Jeeyar Educational Trust** and Printed at **Sriman Printers & Processors** C/o JET, Sitanagaram-522 501, Guntur Dist., Andhrapradesh. **Published at** C/o JET, Sitanagaram-522 501 Guntur Dist, Andhrapradesh, Editor: Sri **T.P.Sriramachandracharya** S/o. Sri Sitaramacharyulu, No: 5-74, Ayodhya, Visakhapatnam-28, Andhrapradesh.


మీ సేవలో....


**భక్తినివేదన,** సీతానగరం - 522 501, గుంటూరు జిల్లా, ఆంధ్రప్రదేశ్. 08645 272929,


**చందావివరాలు:-** సంవత్సరచందా రూ.50*/- జీవితచందా రూ.500/-,

విదేశాలకు సంవత్సరచందా $ 30*/-

* క్రొత్తగా సంవత్సర చందాదారులుగా చేరువారు సభ్యత్వ నమోదు, రూ.30/-లు (విదేశాలకు $5) అదనంగా చెల్లించవలెను. ఆపై ప్రతి సంవత్సరం సకాలంలో వార్షిక చందా చెల్లించిన చాలు.


E-mail : jetsitanagaram@yahoo.com Internet : www.chinnajeeyar.org



D.T.P. & Design by : పరిశోధనాలయమ్,

ముద్రణ : శ్రీమాన్ ప్రింటర్స్ & ప్రోసెసర్స్, సీతానగరం

# మంచిమాట



**యతో ధర్మ స్తతః కృష్ణః యతః కృష్ణ స్తతోజయః॥**
**యతః కృష్ణ స్తతో ధర్మః యతోధర్మ స్తతోజయః॥**

ఎక్కడ ధర్మం వుంటే అక్కడే కృష్ణుడుంటాడు.
ఎక్కడ కృష్ణుడుంటాడో అక్కడ జయం.
ఎక్కడ కృష్ణుడుంటాడో అక్కడే ధర్మం వుంటుంది.
ఎక్కడ ధర్మం వుంటుందో అక్కడే జయం.



## మార్చి 2011

| తేదీ | వారం | వివరాలు |
|---|---|---|
| 1 | మంగళ | మాఘబ॥ద్వాదశి రా.8-23 ఉత్తరాషాఢ రా.7-28 వ.రా.11-43 మొ 1-25 |
| 2 | బుధ | త్రయోదశి రా.9-32 శ్రవణం రా. 8-57 వ.రా.1-16 మొ 3-0 |
| 3 | గురు | చతుర్దశి రా.10-54 ధనిష్ఠ రా. 10-51 వర్జ్యం లేదు. |
| 4 | శుక్ర | ● అమావాస్య రా 12-38 శతభిషం రా 1-9 వ.ఉ.6-44 మొ 8-30 |
| 5 | శని | ఫాల్గుణ శు॥పాడ్యమి రా 2-44 పూ.భా.రా 3-40 |
| 6 | ఆది | విదియ రా.తె. 4-52 ఉత్తరాభాద్ర రా.తె. 6-21 |
| 7 | సోమ | తదియ పూర్తి రేవతి పూర్తి వ.రా.7-36 మొ 9-22 |
| 8 | మంగళ | తదియ ఉ. 6-56 రేవతి ఉ. 8-50 వర్జ్యం లేదు. |
| 9 | బుధ | చవితి ఉ. 8-46 అశ్విని ఉ. 11-9 వ.ఉ.7-0మొ8-45 పు.వ.రా.9-32 మొ11-16 |
| 10 | గురు | పంచమి ఉ.10-10 భరణి ప 1-3 వ.రా. 1-48 మొ 3-30 |
| 11 | శుక్ర | షష్ఠి ఉ 11-10 కృత్తిక ప 2-33 వర్జ్యం లేదు. |
| 12 | శని | సప్తమి ఉ 11-37 రోహిణి ప 3-31 వ.ఉ.7-12 మొ 8-52 |
| 13 | ఆది | అష్టమి ఉ 11-34 మృగశిర సా 4-0 వ.రా. 12-25 మొ 2-0 |
| 14 | సోమ | నవమి ఉ 11-03 ఆర్ద్ర సా 4-1 వ.రా. 3-49 మొ 5-24 |
| 15 | మంగళ | దశమి ఉ 10-0 పునర్వసు ప 3-36 వ. రా 11-19 మొ 12-52 |
| 16 | బుధ | ❀ ఏకాదశి ఉ 8-36 పుష్యమి ప 2-46 వ.రా. 2-57 మొ 4-29 |

మాఘ బ॥ ద్వాదశి మంగళవారము మొదలు
ఫాల్గుణ బ॥ ద్వాదశి గురువారము వరకు

| తేదీ. | సూ.ఉ. | సూ.అస్త |
|---|---|---|
| 1 | 6-35 | 6-22 |
| 11 | 6-27 | 6-25 |
| 21 | 6-21 | 6-27 |
| 31 | 6-12 | 6-29 |

### పండుగలు

2. మహాశివరాత్రి, శ్రీశైలాది శైవక్షేత్రముల యందు అభిషేకోత్సవము
4. పూర్వాభాద్రకార్తె, ద్వాపర యుగాది పిండపితృ యజ్ఞము, అమావాస్య
7. త్రిద్యుస్పృక్
9. శాంతచతుర్థి
14. మీనసంక్రమణం
16. సర్వేషాం ఏకాదశి
17. నృసింహ ద్వాదశి
18. దక్షిణాది కామదహనం ఉత్తరాభాద్రకార్తె
19. హోళికోత్సవము
20. వసంతోత్సవము, శ్రీరంగ నాచ్చియార్ తిరు॥ తిరువరంగత్త ముదానార్ తిరు॥
23. మేళ్ళచెర్వు బ్రహ్మోత్సవారంభం
24. గురుమౌఢ్యారంభము
26. మేళ్ళచెర్వు శ్రీవేంకటేశ్వర కళ్యాణం
30. సర్వేషామేకాదశి

పరమహంస పరివ్రాజకులు
**శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న జీయరు స్వామివారి**
మంగళాశాసనములతో....

| తేదీ | వారం | వివరాలు |
|---|---|---|
| 17 | గురు | ద్వాదశి ఉ 6-53 త్రయోదశి రా.తె.4-53 ఆశ్లేష ప 1-38 వ.రా.12-57 మొ 2-28 |
| 18 | శుక్ర | చతుర్దశి రా 2-35 మఖ ఉ 11-14 వ.రా.7-43 మొ 9-13 |
| 19 | శని | ○ పౌర్ణమి రా 12-14 పుబ్బ ఉ 10-39 వ.సా. 5-22 మొ 6-52 |
| 20 | ఆది | బ॥ పాడ్యమి రా9-48 ఉత్తర ఉ.9-2 వ.సా. 4-51 మొ 6-20 |
| 21 | సోమ | విదియ రా.7-28 హస్త ఉ7-21 చిత్త రా.తె.5-45 వ.ప.2-49 మొ 4-19 |
| 22 | మంగళ | తదియ సా 5-12 స్వాతి రా.తె.4-16 వ.ఉ. 11-0 మొ 12-30 |
| 23 | బుధ | చవితి ప 3-8 విశాఖ రా 3-5 వ.ఉ. 9-35 మొ 11-7 |
| 24 | గురు | పంచమి ప 1-22 అనూరాధ రా 2-12 వ.ఉ. 6-55 మొ 8-28 |
| 25 | శుక్ర | షష్ఠి ఉ 11-55 జ్యేష్ఠ రా 1-35 వ.ఉ.7-39 మొ 9-13 |
| 26 | శని | సప్తమి ఉ 10-52 మూల రా 1-31 వ.రా 11-55 మొ 1-30 |
| 27 | ఆది | అష్టమి ఉ 10-17 పూర్వాషాఢ రా 1-55 వ.ఉ. 11-16 మొ 12-54 |
| 28 | సోమ | నవమి ఉ 10-11 ఉత్తరాషాఢ రా 2-45 వ.ఉ.11-16 మొ 12-54 |
| 29 | మంగళ | దశమి ఉ 10-38 శ్రవణం రా 3-10 వ.ఉ.10-11మొ 11-50 |
| 30 | బుధ | ❀ ఏకాదశి ఉ 11-32 ధనిష్ఠ రా.తె. 5-58 వ.ఉ. 8-28 మొ 10-11 |
| 31 | గురు | ద్వాదశి ప 1-1 శతభిషం పూర్తి వ.ప. 1-33 మొ 3-38 |

# చేసినమేలు చెఱపదు మనిషిని

మానవులు తాము చేసుకొన్న మేలుకీళ్ళనుబట్టి వారి అభ్యుదయ వినాశాలు ఏర్పడతాయి. అంతేకాదు సమాజం ఉచ్చనీచగతుల సాగేదీ యీ మేలు కీళ్ళవల్లనే అన్న విషయాన్నీ విస్మరించరాదు.

కేవలం మేలే కావించే వాడుగానో, పూర్తిగా కీడే కావించేవాడుగానో మనుషులంతా ఉండరు. ఇది స్థూలాభిప్రాయం మాత్రమే. పురావాసనలను బట్టి, జనిశ్రేణీ సమాయాత సుకృత దుష్కృతాతిశయాన్ని పట్టి ఇట్లా రకరకాల కారణాలను పట్టి యీ మేలుకీళ్ళుంటాయి. దుష్కృతాలు కావించటమే జీవితపరమార్థంగా బ్రతుకులు సాగించినవారూ ఉన్నారని, వారి నేమని చెప్పాలో తెలియటం లేదంటూ... **"పరహిత మూరకే చెరచు దుర్జనులెవ్వరొ తోపదాత్మకున్"** అని వాపోతాడు పండిన జీవితానుభవంతో భర్తృహరి.

మనిషి మనుగడలోని మేలుకీళ్ళ విశదప్రస్ఫురణాన్ని బట్టి అతని వ్యక్తిత్వం తేటతెల్లమౌతుంది. చంపదగిన శత్రువు చేజిక్కినా చంపక, గడువిచ్చి – సేదతీరి పరికరమంతా సమకూర్చుకొని, శక్తి పుంజుకొని మరీ రమ్మని ఆ శత్రువును విడిచి పెట్టటం కంటే మేలేమిటున్నది? అసలీ గుణాన్ని ఏమనాలో తోచటం లేదు' అని చకితులైపోతారు మానవమనోగుణ విశ్లేష చతుర భావుకులైన మనీషులు.

**'పొసగ మేలు చేసి పొమ్మనుటే చాలు'** అన్న దేశికవి అంతరంగము, **'గట్టి మేల్ తలపెట్టవోయ్'** అని జనహిత సంకల్పమతులుగా జనులంతా రూపొందాలి అంటున్న ఆధునిక కవి ప్రబోధాంతరంగమూ ఇదే!

కావాలని చేసినదయినా అనుకోకుండా చేసినదే అయినా మేలు మేలే! మంచి సంస్కారం కలిగి సత్త్వవికాసం ఏర్పడి సర్వభూతదయ గలిగి సకలమూ భగవన్మయముగా ఎరిగి సకలాన్నీ ఆదరించటం భగవదారాధనంగా భావించ గలిగినవాడు సమదర్శనంతో ప్రణయ భావనంతో చేతనాచేతనములకు కావించే మేలు ప్రశస్యతరం.





ఇంతటి జ్ఞానప్రకాశం భావనాప్రకర్ష లేకపోయినా నిర్హేతుకంగా నిరపేక్షంగా ఒరులకు మేలొనర్వక తానుండలేక చేసే మేలు మరీ మేలు!

అయితే మనిషి తానెందుకు ప్రవర్తించినా దానివల్ల తనకు ఒనగూరే ప్రయోజనాన్ని ముందుగా బేరీజు వేసుకొని మరీ ప్రవర్తించటం మనం చూస్తూనే ఉన్నాం.

అట్లా అయితే ఈతకాయవేసి తాటికాయ లాగేది మాత్రం మేలా? కాదు. సుతారామూ కాదు.

ఇక్కడ మేలునుగూర్చి కాస్త జాగ్రత్తగా అనుశీలించాలి.

ఇది రెండు రకాలు : ఒరులకు కావించే హితం మేలు!

తానాచరించే సుకృతం మేలు!

తానాచరించే సుకృతంవల్ల ఇతరులకు మేలు చేకూరవచ్చును. ఇతరులకు కావించే మేలువల్ల తనకు సుకృతము చేకూరవచ్చును. దీనివల్ల స్వతారణము, పరతారణమూ రెండూ సిద్ధిస్తాయి. అయితే దేనిలోనూ ప్రయోజనాపేక్ష లేదు.

మేలు చేయటం తన ధర్మంగా తన మనుగడకు పరమార్థంగా భావించి మేలు చేయటమే.

ఇట్లా కావించిన మేలు మానవుని తప్పక ఉత్తమగతికి చేరుస్తుంది. ఫలాభిసంధి రహితంగా కావించిన పరమధర్మం ఈ మేలు. ఇది చేసిన మనిషిని చెరచదు. అంతేకాదు ప్రేయస్సును, శ్రేయస్సునూ కూడా చేకూరుస్తుంది. ఇది సుకృతరూపంగా బంధకమూ కాదు, ఫలాభిసంధితో చేసినది కాదు కనుక.

మానవునిలో చైతన్యం ఉంటుంది. దాని స్పందనంవల్ల ఏదో చేస్తూనే ఉంటాడు. **'న హి కశ్చిత్ క్షణ మపి జాతు తిష్ఠ త్యకర్మకృత్'** – గీతావాక్యం చెపుతోంది. కర్మకృత్ కావాలి. మంచి(మేలు) చేసేవాడు కావాలి. అట్లాంటివాడు చెడిపోడు సుమా అని భగవానుడే తానుగా భరోసా ఇస్తున్నాడు. – **'న హి కళ్యాణ కృత్ కశ్చిద్దుర్గతిం తాత గచ్ఛతి'** అని. కనుక మానవులంతా సుకృతాభిముఖులు కావటం స్పృహణీయం.

శ్రీరామచంద్రాచార్య

# శ్రీ కలివైరిసూరి వైభవము

(గత సంచిక తరువాయి)

శ్రీ ఉ.వే. శ్రీమాన్ కె.టి. రామానుజాచార్యస్వామి - నెల్లూరు

**తిరుమంగై ఆళ్వార్ - పెరియతిరుమొళ్ళి (బృహత్సూక్తి) 1-6-10**

**ఏతం వన్దణుకావణ్ణ నామెణ్ణి యెళ్ళుమినోతొళ్ళుతు మెన్నిమైయోర్**
**నాతన్ వన్దిఱైంజుమ్ నైమిశారణియత్తు ఎందైయై చ్చిందైయుల్వైత్తు ।**
**కాతలేమికుత్త కలియన్ వాయొలిశెయ్ మాలైతాన్ కత్తవల్లార్కళ్**
**ఓతనీర్ వైయకమాండు వెణ్కుడైక్కీళ్ ఉంబరుమాకువర్తామే ॥**

***ప్రతిపదార్థము :*** **ఏతం**=దుఃఖము; **వందు**=వచ్చి; **అణు కావణ్ణం**=సమీపించిన విధము; **నామ్**=మనము!; **ఎణ్ణి**=తలచి; **తొళ్ళుతుం**=ఆశ్రయించుదము; **ఎళ్ళుమినో**= లేవండి; **ఎన్ను**= అని; **ఇమైయోర్**=దేవతలును; **నాతన్**=వారికి ప్రభువైన ఇంద్రుడును; **వన్దు**=వచ్చి! **ఇఱైంజుమ్**=ఆశ్రయించునట్టి; **నైమిశారణియత్తు**= నైమిశారణ్యమున వేంచేసియున్న; **ఎందయై**=మాస్వామిని; **శిందైయుళ్**=మనస్సునందు; **వైత్తు**= ఉంచుకొని; **కాతలే**=భగవద్విషయకమగు ఆశయే; **మికుత్త**=అధికమైన; **కలియన్**=తిరుమంగై ఆళ్వార్లు; **వాయ్**=అనుగ్రహించిన; **ఒలిశెయ్మాలై**= శబ్ద సందర్భములగు మాలను; **కత్తవల్లార్గళ్**=అభ్యసించుటకు సమర్థులగువారు; **ఓతనీర్**= సముద్ర పరివేష్ఠితమగు, **వైయకమ్**= భూమిని; **వెణ్కుడైక్కీళ్**= తెల్లనిగొడుగుక్రింద; **ఆండు**=ఏలుకొని; **ఉమ్బరుం**= నిత్యసూరులుగను, **ఆగువర్**= అగుదురు.



**తాత్పర్యం:** మనమందరమును కలసి నైమిశారణ్యక్షేత్రమునకు వెడలి అచ్చట వేంచేసియున్న భగవంతుని ఆశ్రయింతుము. మన దుఃఖములన్నియు తొలగిపోవును" అని దేవేంద్రుడు దేవతలందరితోవచ్చి సేవించే క్షేత్రము నైమిశారణ్యము. అచ్చట భగవంతుడు అరణ్యరూపమున వెలసి యున్నాడు. ఆస్వామి విషయముగ తిరుమంగై ఆళ్వారులు కృపచేసిన ఈ పాశురములను అనుసంధించువారు (తమకపేక్ష ఉన్నచో) ఇహలోక భోగములను అనుభవించి సంతుష్టులై నిత్యసూరుల గోష్ఠిలో చేరి నిత్యానుభవమును పొందుదురు.





**విశేషార్థము: ఏతమిత్యాది..** దుఃఖములు తమను అంటకుండుటకై భగవంతుని ఆశ్రయించి ఉజ్జీవింప దలచిన ఇంద్రుడు దేవతలతో కలసి వచ్చి నైమిశారణ్యక్షేత్రమున వేంచేసియున్న స్వామిని ఆశ్రయించును. "అటువంటి నైమిశారణ్యక్షేత్రమున మనకు సన్నిహితుడుగా వేంచేసియున్న స్వామిని, హృదయమున నుంచుకొని, నిత్యనూరి బృందముతో శ్రీవిష్వక్సేనులు వచ్చి, ఆశ్రయించుచుందు"రని మరొకభావన.

**కాతలేమికుత్త..** భగవంతుని యందు మిక్కుటమగు ఆశగల శ్రీకలివైరిసూరి అనుగ్రహించిన ఈ పాశురములను అర్థ యుక్తముగ అభ్యసించకలిగినవారికి "భగవత్ప్రేమ" అను నీడను ఈదశకము కలిగించును.

**ఓతనీర్ వైయకమాండు..** నిత్యసూరుల గోష్ఠిలో ఒకరినిగా చేర్చును. ఇహలోకమున ఐశ్వర్యాపేక్ష ఉన్నచో దానిని కూడ మనకు ప్రసాదించి శరీర వియోగానంతరము నిత్యసూరులకు స్థానమగు మోక్షమును మనకు ప్రసాదించును.

**శ్రీశ్రీశ్రీ చిన్న జీయర్ స్వామివారి మార్చి నెల పర్యటనా విశేషాలు**

| తేది | విశేషాలు |
|---|---|
| 7 | నల్లగొండజిల్లా హాలియాలో శ్రీరామాలయ ప్రతిష్ఠ, రాత్రికి శ్రీరామనగరం ప్రయాణం. |
| 11 | మెదక్ జిల్లా వేలిజాల గ్రామము సందర్శన. |
| 13 | జగిత్యాల రాజగోపురం సంప్రోక్షణ, అక్క నుండి కొండగట్టు శ్రీఆంజనేయ స్వామివారిని సందర్శన, అక్కడి కార్యక్రమాలలో పాల్గొనుట, రాత్రికి వెలిశాల చేరుట. |
| 14,15,16 | కరీంనగర్, వెలిశాల గ్రామంలో ఆలయ బ్రహ్మోత్సవాలలోపాల్గొనుట. శ్రీవీర్లప్రభాకర్‌రావుగారు ఏర్పాట్లు చేస్తున్నారు. |
| 19-20 | పశ్చిమ గోదావరి జిల్లా భీమవరం వద్ద కోదండ రామాలయ ప్రతిష్ఠ. రాత్రికి మహబూబ్‌నగర్ జిల్లా ఒట్టెం గ్రామం చేరుకుంటారు. |
| 21, 22 | ఒట్టెం గ్రామంలోని కళ్యాణ వేంకటేశ్వరస్వామి ఆలయ బ్రహ్మోత్సవాలలో పాల్గొంటారు. |
| 23-29 | నల్గొండజిల్లా, మేళ్ళ చెరువు (మహాసిమెంట్) శ్రీ కళ్యాణ వేంకటేశ్వర స్వామివారి బ్రహ్మోత్సవాలలో పాల్గొంటారు. |



4/D.T.P. systemD/G/Bn folder/Bn Mar11



మార్చి 19వ తేదీ లక్ష్మీజయన్తి సందర్భంగా...

# లక్ష్మీ అవతారము

ఉ.వే.శ్రీమాన్ ఎన్.వి.ఎల్.ఎన్. రామానుజాచార్యస్వామి- నరసాపురం

**ఉల్లాస పల్లవిత పాలిత సప్తలోకీ**
**నిర్వాహకోరకిత నేమ కటాక్షలీలామ్ ।**
**శ్రీరంగహర్మ్యతలమంగళ దీపరేఖాం**
**శ్రీరంగరాజమహిషీం శ్రియ మాశ్రయామః ॥**

లక్ష్మీదేవి శ్రీమన్నారాయణుని విడచి క్షణకాలమైనను విడచి యుండనిది. ఆమె చేతనకోటిలో చేరినను అనపాయిని. అట్టి ఆమె అవతరించుట యేమి? అను సందేహము కలుగును. నిజమే ఆమె అనపాయినియే. కానీ ఒకానొకప్పుడు ఇంద్రుడు చేసిన అపచారము వలన ఆమె యొక్క కళ ఇంద్రుని విడచి సముద్రమున మునిగినది. తిరిగి ఇంద్రునికి శ్రీమన్నారాయణుని అనుగ్రహము లభించగానే యథా పూర్వస్థితిని పొందినది. ఇందుకు సంబంధించిన గాథను వినుడు.

పూర్వము ఒక విద్యాధరకన్యక మిక్కిలి భక్తి శ్రద్ధలతో శ్రీమహాలక్ష్మిని స్తోత్రముచేసినది. శ్రీదేవియు ఆమె భక్తికి సంతసించి అఖండైశ్వర్యమును ఒక దివ్యపుష్పమాలికను ప్రసాదించినది. వానిని మహాప్రాదముగా స్వీకరించి తన స్వస్థానమునకు పోవుచున్న ఆవిద్యాధర కన్యకకు మధ్యేమార్గమున దూర్వాస మహర్షి దర్శనమిచ్చెను. **"రిక్తహస్తేన నోపేయాత్ రాజానం దైవతం గురుమ్"** – మహాత్ములను రిక్తహస్తములతో సేవింపరాదను మర్యాదననుసరించి ఆ విద్యాధరకన్యక లక్ష్మీదేవి తనకు ప్రసాదించిన ఆ దివ్యమాలికను దూర్వాసునకు సమర్పించెను. దూర్వాస మునియు ఆమెను ఆశీర్వదించి స్వర్గమునకు పయనమయ్యెను.

ఆసమయమున దేవేంద్రుడు ఐరావతమునధిరోహించి బృందారక బృందపరివేష్టితుడై దూర్వాసునకు కనుపించెను. దూర్వాసుడు ఇంద్రుని చూచి ఆశీర్వదించి మహాలక్ష్మీదేవి అనుగ్రహరూపమైన ఆపుష్పమాలికను ఇంద్రునకు ప్రసాదించెను. ఐశ్వర్యమద మత్తుడైన ఇంద్రుడు ఆమాలికను సామాన్యమైనదిగా తలంచి అంకుశముతో తీసికొని ఐరావతముపై నుంచెను. **యథారాజా తథా ప్రజాః** అన్నట్లు ఇంద్రుడు నిరాదరముతో స్వీకరించిన ఆ





మాలిక నాకు మాత్రమేల కావలయునని ఐరావతము దానిని తన తొండముతో నేలపైగొట్టి కాళ్ళతో చిదిమివేసెను. ఈ విధముగా లక్ష్మీదేవి పరమానుగ్రహంతో ప్రసాదించిన పుష్పమాలిక ఐరావతము యొక్క పాదములక్రిందబడి నశించెను. ఇది చూచి దూర్వాసుడు ఆగ్రహోదగ్రుడయ్యెను.

ఇంద్రుడు అనగా పరమైశ్వర్య సంపన్నుడు అని అర్థము. ఆపై త్రిలోకపతి అను అధికారమొకటి కలదు. ఆ గర్వాతిశయముచే ఉచితానుచితములను మరచి నిర్లక్ష్యముగా వ్యవహరించి అటు లక్ష్మీదేవియొక్క ఆగ్రహమునకు, ఇటు దూర్వాసుని ఆగ్రహమునకు కారణభూతుడయ్యెను. లక్ష్మీదేవి తల్లి గనుక ఆ సంబంధమును తలచి ఇంద్రుని దోషమును క్షమించినదిగాని, ఆమె విషయమై ఇంద్రుడుచేసిన అపచారమును మాత్రము దూర్వాసుడు క్షమింపలేదు. ఆతడు ఆగ్రహోదగ్రుడయ్యెను.

"ధన మదముచే పూజ్యులను ఇట్లు అవమానించితివి. ఈమదమునకు కారణమైన నీసంపదలన్నియు సముద్రమున మునిగిపోవుగాక" అని శపించెను. వెంటనే దేవేంద్రుని సంపదలు నీట కలసినవి. రాక్షసులు స్వర్గమును ఆక్రమించిరి. దేవతలు వారికి ఓడి పర్వతగుహలలో తలదాచుకొనిరి.

చూచితిరా! క్షణకాలములో అఖండ ఐశ్వర్య సంపన్నుడను అనుకొనిన ఇంద్రుని సంపదలు నీటమునిగినవి. ఏ ఐశ్వర్యములు శాశ్వతములని తలచి దూర్వాసుడు ప్రసాదించిన మాలికను అనాదరించెనో ఆసంపదలు ఇపుడు చేజారి పోయినవి. **మమైవ దుష్కృతం కించిత్ మహదస్తి** అనునట్లు లక్ష్మీదేవిని అవమానించిన దుష్కృతము ఒకటి, పరమభాగవతోత్తముడు పూజ్యుడైన దూర్వాసుని అవమానించిన పాపము ఒకటి ఇంద్రుని పట్టి పీడించినవి.

ఒకనాటి త్రిలోకాధిపతి ఈనాడు పర్వత గుహలలో తలదాచుకొనెను. ఇది భగవత్ భాగవతాపచారమునకు కలిగిన ఫలము. భాగవతాపచారమును చేసిన వాడు యెంతటి వాడైనను దాని ఫలమును అనుభవించి తీరవలసినదే. అదే ఇంద్రునకు లభించినది.

సంపద నశించుటతో దేవేంద్రుని మదము నశించెను. ఆతనికి జ్ఞానోదయమయ్యెను. తన తప్పును తెలిసికొనెను. తన సంపదలను తిరిగి పొందదలచి అర్థార్థీ అనునట్లు సర్వాభీష్టప్రదాతయగు శ్రీమన్నారాయణుని శరణుజొచ్చెను. భక్తవత్సలుడైన స్వామి అమ్మ పురుషకారముతో ఇంద్రుని క్షమించెను. సంపదలు లభించు మార్గమును ఉపదేశించెను.

ఆ స్వామి ఉపదేశమునననుసరించి ఇంద్రుడు రాక్షసుల సహాయమును అర్థించి శ్రీమన్నారాయణుడే తనకు

బలముగా భావించి సముద్రమథనమును గావించెను.

ఆ సముద్ర మథనమున లక్ష్మీదేవి అవతరించెను. అట్లు **లక్ష్మీదేవి మీన మాసములో పూర్ణిమతోకూడిన ఉత్తరా నక్షత్రమునాడు అవతరించినది.** ఆనాడు సముద్రమునందావిర్భవించిన లక్ష్మీదేవి దేవతలందరు చూచుచుండగా శ్రీమన్నారాయణుని వక్షస్థలమును అధిరోహించినది. ఆనాడే జగత్కల్యాణ మూర్తులైన లక్ష్మీనారాయణుల కల్యాణ మహోత్సవము జరిగినది. దేవతలు మహర్షులు ఆ దివ్యదంపతుల కల్యాణ మహోత్సవమునుతిలకించి ధన్యులైనారు. అలా ఆవిర్భవించిన లక్ష్మీ పరమానుగ్రహముచే ఇంద్రుడు తిరిగి అఖండైశ్వర్య సంపన్నుడైనాడు.

ఆ నాటినుండి నేటి వరకు మీన మాసమున ఉత్తరా నక్షత్రమున జగత్ కల్యాణమూర్తులైన లక్ష్మీనారాయణుల కల్యాణ మహోత్సవము జరుగుచునే యున్నది.

ఈ మీనమాసములో శ్రీరంగ నాథుడు శ్రీరంగనాయికతో వేంచేసి యున్న దివ్యసన్నివేశమును దర్శించినారు శ్రీరామానుజులవారు ఆకాలంలో.

ఈ చేతనులందరిని తరింపచేయుటకు ఇదే సరియైన సమయమని భావించినారు. ఆ దివ్యదంపతుల సన్నిధిలో శరణాగతి గద్యమును విన్నవించి తనతో సంబంధము కలిగి ఈ గద్యను విన్నవించిన వారందరికీ పరమపదము లభించునట్లు వరమును పొందినారు. కనుక భగవద్ రామానుజులవారి సంబంధము గలిగిన వారందరికిని పరమపదము తప్పక లభించును. ఇది గద్యత్రయము అవతరించిన శుభసమయము. ఆనాడు భగవదారాధన గావించి లక్ష్మీనారాయణుల దివ్యసాన్నిధ్యమున భగవద్రామానుజులవారిని ముందుంచుకొని గద్యత్రయమును పారాయణచేసి భగవత్ భాగవత ఆచార్యానుగ్రహమునకు పాత్రులమగుదుముగాక.

లక్ష్మీదేవి ఆచార్యపరంపరలో రెండవ స్థానమునందున్నవారు కనుక వారి తనియన్ అనుసంధానమును చేసికొనవలెను.

**తిరునక్షత్రనియన్:**

**ఫాల్గునోత్తరఫల్గున్యాం**
**సంభూతాం శ్రియ మాశ్రయే।**
**విష్ణోర్దివ్య పదాంభోజ**
**ఘటకాం తత్పదాశ్రితామ్॥**

**నిత్యతనియన్:**

**నమః శ్రీరంగనాయక్యై యత్**
**భ్రూవిభ్రమ భేదతః।**
**ఈశేశితవ్య వైషమ్య**
**నిమ్నోన్నత మిదం జగత్॥**







# అహో! భారతమ్

శ్రీమతి డా॥ టి.కె.చూడామణి-విజయవాడ

(గతసంచిక తరువాయి)

## ఆదిశేషుడు

కద్రువ సంతానమైన పాముల్లో శేషుడు ఉత్తమోత్తముడు. తన సంతానానికే కద్రువ భయంకరమైన శాపం ఇవ్వడం భరింపలేక పోయాడాయన. ఇదేం తల్లి? ఇదేం శాపం? తన మాట వినలేదని కడుపునపుట్టిన బిడ్డలకి ఇంత కఠినమైన శాపాన్నిస్తుందా తల్లి! ఛీ – ఏం ప్రపంచం? నేనిక్కడ ఉండలేను. దూరంగా పోయి తపస్సు చేసుకుంటాను అని నిర్ణయించుకొని బదరికాశ్రమానికి వెళ్ళాడు. అక్కడ తపస్సు చేశాడు. ఇంకా ఎన్నో పవిత్ర తీర్థాలు, క్షేత్రాలు సేవించాడు. శరీరం తపోదీక్షవలన ఎండిపోయింది. ఎంతో తీవ్రమైన తపస్సు. ఆ తపస్సుకి మెచ్చి బ్రహ్మదేవుడు ప్రత్యక్షమయ్యాడు. 'శేషుడా! ఎందుకు తపస్సు చేస్తున్నావు? నీ కోరిక ఏమిటి చెప్పు' అని అడిగాడు.

**ఇదేం తల్లి? ఇదేం శాపం?**
**తన మాట వినలేదని కడుపునపుట్టిన బిడ్డలకి ఇంత కఠినమైన శాపాన్నిస్తుందా**

శేషుడు అతనికి వందనం చేసి 'పితామహా! మా అమ్మ కోరికను, శాపాన్ని గూర్చి విన్నారుగా నా మనస్సు తట్టుకొనలేకపోతోంది. ఇంక నా సోదరుల గురించి చెప్పాలంటే గరుడుడు నాకు సోదరుడే కదా! వాడిని, తల్లి వినతను మావాళ్ళు చూడలేకపోతున్నారు. అలాంటి వాళ్ళతో ఉండాలని అనిపించడం లేదు. వారు అధర్మాలు చేసన్తాంటే భరించలేకపోతున్నాను. అందుకే ఇలా తపస్సులోనే ప్రాణాలు విడిస్తే నరిపోతుంది అన్నాడు దుఃఖంతో. బ్రహ్మ 'నాయనా! వద్దు వద్దు అలాంటి మాటలనకు. నీ తల్లి! సోదరుల మాట విడిచిపెట్టు. నీ ధర్మబుద్ధి నాకెంతో ఆనందాన్నిచ్చింది. నీకొక వరం ఇస్తా కోరుకో' అన్నాడు.

'పితామహా! అదే అదే ఆ ధర్మబుద్ధే నాకు శాశ్వతంగా ఉండాలని జీవితం ధర్మమార్గంలో నడవాలని వరమియ్యి తండ్రీ! అన్నాడు.

బ్రహ్మ ఆనందించాడు. 'నాయనా! నీ శమదమాలు నాకెంతో నచ్చాయి. ఈ భూమిని కదలకుండా, నిశ్చలంగా, జాగ్రత్తగా మోసే బాధ్యత నీపై పెడుతున్నాను. మరి గరుత్మంతుడు

పక్షీంద్రుడు కదా- అతనితో స్నేహంగా ఉండు. అదే నీ ధర్మం అంటూ వరంతో పాటు హితాన్ని చెప్పి అంతర్ధాన మయ్యారు. బ్రహ్మగారి ఆజ్ఞతో భూమి క్రింద పాతాళానికి చేరాడు. భూమిని తనతలపై ధరించాడు. అనేక పడగలతో భూభారం మోస్తూ అనంతుడు పాతాళ లోకంలో ఉండిపోయాడు. అతడు వెళ్ళాక సర్పాలన్నీ వాసుకిని రాజుగా చేశాయి.

వాసుకి పాలసముద్రాన్ని దేవ దానవులు మథించిన సమయంలో మంథర పర్వతానికి త్రాడుగా ఉండి సాయం చేశాడుకదా! అందుకని అతనికి మరణం గాని భయంగాని లేకుండా దేవతలు వరాలిచ్చారు. నిజానికి తల్లిశాపం తనకేమీ తగలదు. నష్టంరాదు. ఎవరెలా పోతే నాకేమిటి అని అనుకోవచ్చు వాసుకి. కాని అతడలా అనుకోలేదు. అయ్యో నాసోదరులంతా- సర్పకులమంతా తల్లి శాపానికి గురై పోతుందే! ఏం చెయ్యాలి? ఈ ఆపదనెలా తప్పించాలని చింతించాడు. నాగులంద రిని సమావేశపరచి ఏం చేద్దాం? చెప్పండని అడిగాడు. ఒక్కొక్కరు ఒక్కొక్క సలహా ఇవ్వడం మొదలు పెట్టారు.

మనం బ్రాహ్మణ వేషాలు వేసుకొని జనమేజయుని దగ్గరకి వెళ్లి యజ్ఞం చేయవద్దయ్యా అని అడుగుదాం...

ఆహా...!

అలా కాదు మనలో కొందరం అతని వద్ద మంత్రులుగా చేరదాం. యజ్ఞాన్ని గూర్చి అడిగినపుడు సర్ప యాగం చెయ్యడం మంచిది కాదు. అబ్బో ఆ యజ్ఞంలో ఎన్నో దోషాలొ స్తాయి అంటూ భయపెడదాం. ఏం!

అబ్బే! అలాకాదు. యజ్ఞం చేయించ డానికి వచ్చిన యాగ ఉపాధ్యాయుణ్ణి కాటేసి చంపేద్దాం! తప్పు తప్పు బ్రహ్మ హత్యచెయ్యకూడదు. ధర్మంగా ఆలోచించి చెయ్యాలి. మనం మేఘాలుగా మారి యాగగుండలో అగ్నిని ఆర్పేద్దామా?

రాత్రికి రాత్రి యజ్ఞభాండాన్ని ఎత్తుకు పోదామా? యాగం చూడటా నికి వచ్చిన వాళ్ళందరిని కాటేసి చంపేద్దామా? తినే పదార్థాలపై విషం కక్కేద్దామా?...లేకపోతే జనమేజయుణ్ణే ఎత్తుకుపోదామా... ఇలా అబ్బో ఎన్ని సలహాలో...

ఓపికగా వారి మాటలు విన్నాడు వాసుకి. చూడండి నాయనలారా! మీరనేవన్నీ జరిగేవి కావు. ఆలోచిస్తే నాన్నగారి దగ్గరకి వెళ్ళి విషయం చెప్పి సలహా అడిగితే మంచిదనిపిస్తుంది. ఏమంటారు? పెద్దవాణ్ణి నేనుండగా మీకే ఆపద రాకూడదు అన్నాడు.

ఏలాపత్రుడు అని ఒక సోదరు డున్నాడు వాసుకికి. అతడు గబగబా ముందుకి వచ్చి 'సోదరా! నేనొకటి చెపుతాను వినండి. అమ్మ మనలని శపించే సమయంలో నేను ఆవిడ ఒడిలోనే పడుకొని ఉన్నాను. దేవతలకీ, బ్రహ్మకీ జరిగిన సంభాషణ విన్నాను. మీరూ జాగ్రత్తగా వినండి. దేవతలు బ్రహ్మగారితో అయ్యా! ఆవిడ అలా నాగుల్ని శపిస్తోంటే మీరు అడ్డుచెప్ప లేదేమిటి? అని అడిగారు. దానికి బ్రహ్మగారు దేవతాకోటిలో చాలా తీవ్ర స్వభావం కలిగినవారు పన్నగులు, వీళ్ళలో చాలామందికి క్రౌర్యం ఎక్కువ. విషపూరితాలైన పాములూ ఎక్కువే! సర్పయాగంలో అలాంటి పాములే శాపం వలన పడి మరణిస్తాయి. మంచివాటికి శాపం తగలకుండా రక్షింపబడతాయి.

యాయావరవంశంలో జరత్కారుడు అనే ఆయనకి ఆస్తీకుడు అనే మహాను భావుడు పుడతాడు. సర్పయాగం జరగ కుండా ఆస్తీకుడు రక్షిస్తాడు. నాగుల శాపాన్ని ఆయన పోగొడతాడు" అని చెప్పాడు బ్రహ్మ. జరత్కారుడు అనే మహర్షి అదే పేరున్న ఆవిడని పెళ్ళి చేసుకుంటాడట. సోదరా... మన సోదరి జరత్కారువు ఉన్నది గదా! నువ్వు వారిద్దరికీ పెళ్ళి చెయ్యి. వారి కుమారుడే ఆస్తీకుడట. ఆయన మన శాపాన్ని పోగొట్టగల సమర్థుడట. నా మాటలు నమ్ము" అన్నాడు. ఏలాపత్రుని మాటలు విని పాములన్నీ ఆనందించాయి. బ్రహ్మగారి మాట ప్రకారం జరత్కారుడనే ఋషికి తనసోదరి జరత్కారువునిచ్చి పెళ్ళిచేయాలని వాసుకి సంసిద్ధుడ య్యాడు.





## జరత్కారుడు

యాయావరము అనే వంశంలో పుట్టిన ముని జరత్కారుడు. ఆయన బ్రహ్మచర్యాన్ని పాటించే మహర్షి. పెళ్ళి అంటే ఆయనకి ఏమాత్రం ఇష్టంలేదు. **జరా** అంటే క్షీణించడం అంటే కృశించడం అని అర్థం. **కారు** అంటే చాలా భయంకరమైన అని అర్థం. ఈ ఋషి ఎంత ఘోరమైన తపస్సు చేశాడు అంటే ఆ తపస్సుకి అతని శరీరం భయంకరంగా కృశించి పోయింది. అందుచేతనే ఆయనని జరత్కారుడు అన్నారు. వాసుకి సోదరి కూడా అలాగే ఎండిపోయి ఉండడం చేత ఆవిడని కూడా జరత్కారువు అన్నారు.

జరత్కారుడు మహాతపోధనుడు. ఆయన దేశసంచారం చేస్తున్నాడు. సాయంకాలం అయినప్పుడు ఎక్కడ ఉన్నాడో అక్కడే ఆగిపోయేవాడు. అది ఆతని నియమం. ఆయన వాయువుని మాత్రమే ఆహారంగా స్వీకరిస్తూ శరీరాన్ని ఇంకా ఇంకా ఇంకా ఎండింప చేస్తున్నాడు. ఒకనాడు ఒకగుంటలో ఔరుగడ్డిదుబ్బులో మిగిలి ఉన్న ఒక్కవేరును మాత్రమే పట్టుకొని తలక్రిందులుగా వ్రేలాడుతున్న ఋషు లను కొందరిని చూశాడు. సూర్య కిరణాలే వారికి ఆహారంగా ఉండడం చూశాడు. (సశేషం)

బదరీ విశాల్ భగవాన్‌కీ జై!



# బదరీనాథ్ జ్యోతిర్దర్శనం



**శ్రీశ్రీశ్రీ చిన్న జీయరు స్వామివారి మంగళాశాసనములతో...**

ఆరునెలలు దేవతార్చన తరువాత బదరీనారాయణుని ఆలయంలో **మే 9 న జ్యోతిర్దర్శనము**తో మానవులకు దర్శనభాగ్యం కలగబోతోంది.



మన అష్టాక్షరీక్షేత్రం ప్రతిసంవత్సరంవలెనే ముందుగానే, భగవద్బంధువులకు సేవలందించుటకు సిద్ధమవుతోంది. మన అష్టాక్షరీ క్షేత్రంలో అన్నదానం జరువుటకు తదీయారాధనకు కావలసిన వస్తువులను, ద్రవ్యమును కైంకర్యము చేయుటకు ఉత్సాహముగల భగవత్ బంధువులకు **బదరీ అష్టాక్షరీక్షేత్రీయ అన్నదానశాఖాసంఘం** ఆహ్వానిస్తోంది. ఒక్కరుగాని, గోష్ఠిగాగాని ఈ అవకాశమును సద్వినియోగము చేసికొని శ్రీస్వామివారి మంగళాశాసనములు పొందగలరు.

## ఋషీకేశ్ జీయర్‌మఠంలో శ్రీరామాలయ నిర్మాణం

పవిత్ర గంగానదీతీరంలోని హృషీకేశ్‌లోని జీయర్‌మఠంలో మన స్వామివారి ఆరాధ్యదైవమైన శ్రీ సీతారామ లక్ష్మణ హనుమత్సమేత ఆలయ నిర్మాణము శరవేగముతో జరుగుతున్నది. ఈ మందిర నిర్మాణమునకు చదరపు అడుగు రూ.1000/-లు చొప్పున కైంకర్యము చేయదలచినవారు సీతానగరంలో తమ కైంకర్యములను సమర్పించగలరు. చెక్కులు, డి.డి.లు **బదరీ అష్టాక్షరీ క్షేత్రీయ అన్నదాన శాఖాసంఘం (BAKASS)** పేరుమీద పంపగలరు.

**గంగానదీ పుష్కరాలకు ఆహ్వానం:** పరమపవిత్రమైన గంగానదీ పుష్కరాలు **మే ౧ నుండి ౨౦** వరకు జరుగుతున్నవి. ఋషీకేశ్‌లో పుష్కరస్నానాలు ఆచరించే భగవద్బంధువులను మన జీయర్‌మఠం సాదరంగా ఆహ్వానిస్తోంది. ఈ ఆతిథ్యాన్ని స్వీకరించి తరించండి.

**వివరములకు:**

BAKASS
సీతానగరం, తాడేపల్లి మండలం,
గుంటూరుజిల్లా- 522 501
ఫోన్: 08645 272929

శ్రీమాన్ డా॥ టి. రామనాథం
సెల్: 93478 81779



*రామాయణంలో...*

# ప్రజాస్వామిక పరిపాలనా విధానాలు

**ప్రొఫెసర్ పి. జ్యోతి - హన్మకొండ**

**వాల్మీకి గిరి సంభూతా రామసాగర గామినీ ।**
**పునాతి భువనం పుణ్యా రామాయణ మహానదీ ॥**

వాల్మీకి అనే పర్వతం నుండి వెడలి రామసాగరంలో సంగమింపబోయే రామాయణ మహానది సమస్త భువనాన్ని పునీతం చేస్తుందని సంప్రదాయజ్ఞుల విశ్వాసం. భారతీయ వాఙ్మయంలో శ్రీమద్రామాయణమే వేద వేదాంతాల తరువాత ప్రధాన స్థానమాక్రమించింది. ధార్మిక సామాజిక దృష్టితో కూడ ఇది పరమోపాదేయమైన కావ్యం.



వాల్మీకి నారదునితో పదహారు గుణాలు చెప్పి ఆ గుణాలున్న మానవుడెవడైనా ఈలోకంలో ఉన్నాడా? అని ప్రశ్నించాడు.

"గుణవాన్, వీర్యవాన్, ధర్మజ్ఞః, కృతజ్ఞః, సత్యవాక్యః, దృఢవ్రతః, చారిత్రేణ చ యుక్తః, సర్వభూతేషు హితః, విద్వాన్, సమర్థః, ఏకప్రియదర్శనః, ఆత్మవాన్, జితక్రోధః, ద్యుతిమాన్, అనసూయకః, సంయుగే జాత రోషస్య దేవాః బిభ్యతి" అనేవి పదహారు గుణాలు.

అవి కలిగినవాడు కేవలం శ్రీరాముడొక్కడేనని నారదుడు వాల్మీకితో చెప్పాడు. మానవజాతి గొప్పదనానికి ప్రతీకగా నిల్చి తన ధర్మనిరతిని రాముడు లోకానికి ప్రకటించాడు. రామాయణంలో రామునికెంతప్రాధాన్యముందో సీతకు కూడా అంతే ప్రాధాన్యము ఉంది. అందుకే రామాయణాన్ని **సీతాయాశ్చరితం మహత్** అని వాల్మీకి అన్నాడు.

ఈ రహస్యాన్ని గుర్తించిన కవులు తమ తమ ఆదర్శాల ననుసరించి రామాయణకథలు రచించారు.

అధ్యాత్మరామాయణం, విశ్వామిత్ర రామాయణం, వాసిష్ఠ రామాయణం, దుర్వాస రామాయణం, ఆనంద రామాయణం మొదలైనవేకాక, భాస కాళిదాస భవభూతి శక్తి భద్రాది వంటి మహాకవులు రామకథను సంపూర్ణంగానో ఏకదేశంగానో కావ్యాలుగా నాటకాలుగా తమకు నచ్చిన విధంగా మలచి సంస్కృత

ఉత్తమపురుషుల సచ్చరిత్రను వర్ణించుకావ్యము మహాకావ్యముగా వర్ణింపబడును.

వాఙ్మయాన్ని పరిపుష్టం చేశారు. పాలీ ప్రాకృతభాషల్లో కూడ రామాయణ గాథలు వెలువడ్డాయి.

భారతీయ భాషల్లోనే కాక ఇతర ప్రాచ్య పశ్చిమోత్తర దేశాలలో ఆయా భాషల్లో రామాయణ కథలు అనంతంగా వ్యాపించాయి. ఇటువంటి కథల వ్యాప్తి ఆధారంగానే ఆధునిక కాలంలో సుశాస్త్రజ్ఞులు ఏకమూల సిద్ధాంతం (Monogensis) చారిత్రక -భౌగోళిక విధానం (Historical Geographical method) పురాణ మూలసిద్ధాంతం (Broken down Mytheory) మొదలైనవి ప్రతిపాదించారు.

**"శ్రీరామాయణ కథ జరిగి యుగాలు గడచినా రాముని నడవడిక మానవుడైన వాడు ఎట్లా జీవించాలో నేర్పింది.**

తెలుగు ప్రజలు కూడ అనంతమైన రామాయణ సాహిత్యం సృష్టించుకున్నారు. భాస్కరుడు, రంగ నాథుడు, కట్టా వరదరాజు మొదలుకొని విశ్వనాథ, పుట్టపర్తి వరకున్న కవు లెందరో రామాయణ కథను కావ్యాలుగా మలచు కున్నారు. మహాకావ్యాలే కాక ద్విపదలు, ప్రబంధాలు, యక్షగానాలు, శతకాలు, దండకాలు ఖండకావ్యాలు, వచనములు, కీర్తనలు, కృతులు, పద ములు, పాటలు, ఘంటాప్రహరులు, నక్షత్ర మాలికలు, తారావళులు, చాటువులు, సమస్యలు, అష్టకములు, ద్వ్యర్థి, త్ర్యర్థి, చతురర్థి, చిత్రబంధ కావ్యాలు, మొదలైనవెన్నో వెలువరిం చారు. హిందీ తులసీ రామాయణం, తమిళ కంబ రామాయణం, ఓఢ్రం సిద్ధేశ్వరదాస విరచిత విచిత్ర రామాయ ణాలు కూడా తెలుగులోకి అనువదింప బడ్డాయి. తెలుగునాట కలం పట్టనేర్చిన ప్రతికవి, రామునిపై పాటో పద్యమో తప్పక వ్రాసేవాడు. ఇప్పటికీ వ్రాస్తున్నారు. సృజనాత్మక, విమర్శనాత్మక రామాయణ సంబంధి రచనలు వచ్చాయి. వాసిలోను రాశిలోను జానపద రామాయణాలు లెక్కకు మిక్కిలిగా కనిపిస్తాయి. యక్షగానాలు, బుఱ్ఱ కథలు, మంజరులు, తందాన కథలు, భజన కీర్తనలు, కోలాటాలు, చిరుతల రామా యణాలు, దాస సాహిత్యం, సంకీర్తన సాహిత్యం, గిరిజనుల్లో ఉన్న రామ కథలు మొదలైనవెన్నో పేర్కొన దగినవి.

తెలుగులో రామాయణాన్ని నిందిస్తూ, విమర్శిస్తూ వెలువడిన సాహిత్యంకూడ కొంత ఉంది. **"యద్భావం తద్భవతి"** అన్నట్లు వైరభక్తితో తరించిన వారు కూడ లేకపోలేదు.

రామాయణకథ జరిగి యుగాలు గడచిపోయినా రాముని నడవడిక మానవుడైనవాడు ఎట్లా జీవించాలో నేర్పింది. దేవతలంతా నీవు సాక్షాత్తు





నారాయణుడివన్నా కూడా రాముని **ఆత్మానం మానుషం మన్యే రామం దశరథా త్మజం** అని తాను మానవుణ్ణేనని చెప్పి తన ఆచరణ ద్వారా మానవత్వాన్ని నిరూ పించుకున్నాడు.

రామాయణంలో ఎన్నో ధర్మ సూక్ష్మాలున్నాయి. మానవుడు సమాజంలో ప్రవర్తించవలసిన విధి విధానాలు అనేకం కనిపిస్తాయి. అయోధ్యాకాండలో భరతుడు అరణ్యంలో ఉన్న రాముని దగ్గరకు వెళ్ళి రాజ్యాన్ని స్వీకరించుమని ప్రార్థించిన సందర్భంలో రాముడు భరతునికి ఎన్నెన్నో ప్రజాస్వామిక పరిపాలనా సూత్రాలను వివరించాడు.

మానవుడు తన జీవితంలో పాటింపవలసిన సర్వధర్మాలను తేటతెల్లం చేసి స్వార్థరహిత పరార్థ ప్రవృత్తిని పెంచు కోవలసిన పద్ధతులను స్పష్టం చేసినాడు. పాలక పాలిత సంబంధాలు, మానవత్వం లోని విలువలు ఏ విధంగా ఉండాలో సర్వలోక ప్రియుడైన సర్వశాస్త్రార్థ తత్త్వజ్ఞుడైన రాముడు భరతునికి చెప్పాడు. ఆ విధి విధానాలు పరిశీలించటమే ఈ వ్యాస ఉద్దేశ్యం.

మేనమామ ఇంటినుండి అయోధ్యకు వచ్చిన భరత శత్రుఘ్నులు దశరథుని మరణానికి దుఃఖించి తల్లి ద్వారా సీతా రామలక్ష్మణుల వనవాస గమనాన్ని తెలుసుకొని కలతపడతారు.

తల్లితో భరతుడు ధర్మాత్ముడైన రాముడు అరణ్యానికి ఎందుకు వెళ్ళి నాడు, ఏ బ్రాహ్మణుల ధనాన్నైనా అప హరించాడా? పరస్త్రీని పొందాలను కున్నాడా? గర్భస్థశిశువును చంపినవాణ్ణి అరణ్యానికి పంపినట్లు రాముడు పట్టణం వదిలి అరణ్యానికి వెళ్ళవలసిన అవసరం ఏమి వచ్చిందని ప్రశ్నల వర్షం కురిపించాడు.

కైకేయి సమాధానంగా రాముడు తప్పు పని చేయలేదు. ఎవరిని ధనం కోసం హింసించలేదు. పరస్త్రీని కన్నెత్తి చూడదని కీర్తించింది.

## భక్తినివేదన పాఠకులకు మనవి

**భక్తినివేదన అభివృద్ధిని ప్రోత్సహిస్తున్న పాఠకులకు శ్రీశ్రీశ్రీ స్వామివారి అనేక మంగళాశాసనములు...**

భక్తినివేదనలో మీ సభ్యత్వము చిరునామా మార్పు మరియు చందా పునరుద్ధరణ నిమిత్తం మాతో సంప్రదింపులు జరిపినప్పుడు తప్పక మీ చందా నెంబర్ మరియు పాత, క్రొత్త చిరునామాలు సూచింపగలరు. చందా ముగింపు తేది వివరములు మీ చిరునామా పైభాగంలో ఉంటాయి. గమనిస్తున్నారు గద! – **మీ భక్తినివేదన**

ముముక్షు రహస్యం

# కూరత్తాళ్వాన్ వైభవం

- శ్రీమతి చక్రవర్తుల చూడామణి - ఖమ్మం

గత సంచిక తరువాయి

"ఆళ్వాన్‌కి అలా అడగడం ఇష్టం లేదు? అది శ్రీవైష్ణవ సాంప్రదాయం కూడా కాదు. అయినా రామానుజా చార్యులు అలా అడగమన్నారంటే కూరత్తాళ్వాన్ ఇప్పటికే ఈ సాంప్రదా యానికి చేసిన సేవే అపారమయింది. అదే పద్ధతిలో ఇంకా చేయవలసింది ఎంతో ఉంది. అందుకే ఆచార్యుని ఆళ్వాన్‌ని కంచి వెళ్ళి వరదరాజ స్వామిని సేవించి వారిని స్తుతించే స్తవం చేయమని ఆదేశించారు. ఆళ్వాన్ ఆచార్యులమాట మీరే ప్రవృత్తి లేనివారు కాబట్టి అలాగే చేశారు. అదే "వరద రాజస్తవం".

స్వామి కరుణించి "ఏం కావాలో కోరుకో"మన్నారు.

ఆళ్వాన్ తనకోసం ఏదీ ఎవరినీ కోరటం అలవాటు లేనివారు. అందుకనే 'స్వామీ! నాకు లభించబోయే సంపద నాలూరాన్‌కి కూడా అనుగ్రహించు" అన్నారు.

"అదేంటి బామ్మా!" నాలూరాన్‌కదా చోళరాజును ప్రేరేపించాడు. అందు వలననే కదా ఆళ్వాన్ కళ్ళుపోగొట్టు కున్నది? అలాంటి నాలూరాన్ గురించి స్వామిని అడిగారా? సంపద అంటే ఏమిటి?

"సంపద అంటే మనలాంటివాళ్ళు డబ్బు, నగలు, వస్తువాహనముల్లాంటి వనుకుంటాం. కాని ఆళ్వాన్‌లాంటి ప్రపన్నులకు పరమపదం, అక్కడ వైకుంఠ నాథునికి నిత్యకైంకర్యభాగ్యం సంపద. తను రామానుజ సంబంధి కాబట్టి తనకెలాగూ పరమపదం లభిస్తుంది. కానీ! నాలూరాన్ పాపం అపచారం చేశాడు కదా! అతనికి పరమపదం ఇవ్వరేమో అని వరదరాజ స్వామిని 'నాకు లభించబోయే సంపద నాలూరాన్‌కి కూడా అనుగ్రహించమని ప్రార్థించారు. వరదరాజస్వామి "అలాగే ఇచ్చాను" అన్నారు.

ఈ విషయం తెలిసి రామానుజా చార్యులు ఎంతో నొచ్చుకున్నారు. "నేను చెప్పిందేమిటి? మీరు చేసిందేమిటి?" అని ఆళ్వాన్‌ని నిలదీశారు. స్వామిని చూసి "తమరైనా నా కోరిక తీర్చ కూడదా" అని వాపోయారు. ఆచార్యుల వేదనను చూసి సాక్షాత్ వరదరాజులే కదిలి పోయారు. "చింతించకండి. ఆళ్వాన్‌కి మిమ్మల్ని, నన్నుమాత్రం చూసే కళ్ళు అనుగ్రహిస్తా"నని చెప్పి అలాటి దివ్యచక్షువులు ఇచ్చారు. అప్పుడే ఆళ్వాన్ "శ్రీస్తవం" పాడారు.





"ఆళ్వాన్‌లాగా కోరికలను జయించే వారెందరుంటారు? పరమాత్మ కరుణించి అడిగినదిస్తా కోరుకోమంటే తమకేమి కావాలని అడగకపోగా తనకు, శ్రీవైష్ణవ సిద్ధాంతానికి, ఆచార్యులకు ఆపద తల పెట్టిన నాలూరాన్‌కి పరమపదం ఇవ్వమని కోరటం విశాలహృదయం, సామ్యత, ఆహా...! మనం ఎన్ని జన్మ లెత్తితే ఆ మహానుభావుడి గుణసంపద మనకబ్బుతుంది.

అందుకేఆళ్వాన్‌ని **ముక్కురుబ్బరు త్తవర్** అంటారు. అంటే మూడురకాల గర్వాలను జయించిన వారన్నమాట.

"మూడు రకాలేమిటి బామ్మా?"

"ఒకటి వీరు అపారజ్ఞాన సంప న్నులు. అయినా విద్యాగర్వం లేదు. రెండు సంపద, ఐశ్వర్యం కలవారు. అంతటి సంపదను తృణప్రాయంగా వదిలివేసే ఉదారగుణం కలవారు. అయినా ధనమదం ఇసుమంతైనా లేనివాడు.

అభిజాత్యం కులంచేత, జ్ఞానం చేత, ధనం చేత ఎంతోమంది గొప్పవారి కంటే గొప్పవారు. అయినా ఆధిక్యతా భావం కొంచెం కూడా లేకుండా తాను అందరికంటే తక్కువ వాడినని, ఇవన్నీ శ్రీమద్రామానుజాచార్యుల పాద సంబంధం వలన అబ్బినదేగాని తన ప్రయోజకత్వం వలన కాదని తలచే నిగర్వి ఆళ్వాన్".

"ఆళ్వాన్ ఈ లోకంలో ఎంత కాలం ఉన్నారు బామ్మా?"

"అది రేపు చెప్పుకుందాం లేవండి! పొద్దుపోయింది. మీరు చదువుకోండి. నాకు లోపల పని ఉంది."

"అలాగే బామ్మా" అంటూ పిల్లలు లేస్తారు.





మహబూబ్‌నగర్ జిల్లా, జడ్చర్లమండలం, గంగాపురం గ్రామంలో శ్రీస్వామివారి ప్రత్యక్ష పర్యవేక్షణలో జరిగిన "ఆదిత్యహృదయ పారాయణ" కార్యక్రమ దృశ్యం.

చిత్రంలో శ్రీస్వామివారిని, శ్రీ అహోబిల స్వామివారిని చూడవచ్చు.

# సారజ్ఞత

శ్రీమాన్ సముద్రాల శఠగోపాచార్యస్వామి-వరంగల్

పూర్వపూర్వజన్మల పుణ్యఫలంగానే మానవజన్మ లభిస్తుందని **"మానుష్యం పుణ్య సంచయాత్"** అనుసూక్తి పేర్కొంటున్నది. మానవజన్మ అంత సులభంగా లభించేది కాదని **"ప్రాణినాం నరజన్మ దుర్లభమ్" "నరత్వం దుర్లభం లోకే" "దుర్లభో మానుషో దేహః"** వంటి ప్రమాణ వాక్యాలు తెలియజేస్తున్నాయి.

మానవులకే ప్రత్యేకంగా కర్తవ్యా కర్తవ్య, సారాసార, యుక్తాయుక్త విచక్షణా జ్ఞానాన్ని భగవంతుడు అనుగ్రహించాడని మానవులందరూ గుర్తించాలి. మానవులు సారవంతమైన విద్యలను తప్పక అభ్యసించాలి.

ప్రహ్లాదుడు తన తండ్రియైన హిరణ్యకశిపునితో **"చదువులలోని మర్మమెల్ల చదివితి"**నని పేర్కొన్న విషయాన్ని మనం ఆదర్శంగా గ్రహించాలి. చక్రహస్తుని ప్రకటించే చదువే యథార్థమైన చదువు" అని ప్రహ్లాదోపదేశాన్ని కూడా శిరసా వహించాలి.

ఎందుకంటే లోకంలో ఎన్నో శాస్త్రాలున్నాయి. ఎన్నెన్నో విద్యలున్నాయి. మానవుని ఆయుర్దాయమేమో చాలా స్వల్పమైనది. ఆ స్వల్పమైన జీవన యానంలో అడుగడుగునా విఘ్నాలు వచ్చి మీదపడుతూంటాయి. కాబట్టి మానవుడు తన వివేకాన్ని ఉపయోగిస్తూ, హంస నీళ్ళను పాలను వేరు చేసి పాలనే స్వీకరించినట్లు, సార హీనమైనదానిని త్రోసివేసి సారవంతమైన వానినే స్వీకరించాలి అనే విషయాన్ని ఉద్బోధించే శ్లోకమిది–

**అనంతశాస్త్రం బహులా చ విద్యా**
**అల్పోహి కాలః బహవశ్చ విఘ్నాః ।**
**యత్సారభూతం తదుపాసనీయం**
**హంసో యథా క్షీరమివాంబురాశిః ॥**

ప్రతిఒక్కరూ కూడా సారవంతమైన పదార్థాలనేభుజించాలి. సారవంతమైన ఔషధాలనే సేవించాలి. నిస్సారమైన విషయాలపై అనురాగాన్ని ఆసక్తిని కలిగి యుండవద్దు.

సంసారబంధం నుండి విముక్తులను గావించే సారవంతమైన మార్గమేది? అనే ఆలోచన అందరి మనసులో రేకెత్తాలి. అల్పసారమైన దానిని వదలాలి అనే భావన ఏర్పడాలి. సముద్రంలో ఉండే చేపలు మొదలైన జలచరములను





ముత్యపు చిప్పలను చివరకు రత్నములను కూడా వదలి అమృతమునే దేవతలు పొందినట్లు మానవులు సార, సారతర విషయాలను కూడావదిలి సారతమమైన, పరమ ప్రామాణికమైన శాస్త్రోపదేశమును శిరసా వహించాలి. ఆచరణలో నిలుపుకోవాలి అనే విషయాన్ని

**"అసారమల్పసారం చ**
**సారం సారతరం త్యజేత్ ।**
**భజేత్ సారతమం శాస్త్రం**
**రత్నాకర ఇవామృతమ్ ॥"**

అను సూక్తి ఉద్బోధిస్తున్నది. ఈ సదుపదేశాన్ని సారాసార వివేకజ్ఞులు విశ్వాసంతో పాటించాలి.

కర్మ జ్ఞాన భక్తిమార్గాలు భగవంతుని పొందుటకు ఉపకరించేవే అయినప్పటికీ పశువైనా పక్షియైనా, పొందుటకు ఉపకరించే సారతమమైన మార్గమే ప్రపత్తి మార్గమని పెద్దలు ఉపదేశించారు.

ఈ విషయాన్ని **"న ప్రపత్తేః పరావిద్యా"** అను ప్రమాణవాక్యము ధ్రువపరుస్తున్నది.

కొన్ని ఫలితాలను ప్రయోజనాలను కోర్కెలను తీర్చగల దేవతలు 33 కోట్లమంది ఉన్ననూ పరమపురుషార్థమైన మోక్షసంపత్తిని అనుగ్రహించ గలిగిన (మోక్షమిచ్ఛేత్ జనార్దనాత్) దేవాధిదేవుడు శ్రీమన్నారాయణుడే అనే విషయాన్ని, శ్రీమన్నారాయణుని కంటే వేరొక పరదైవం లేదని (నవిష్ణోః పరదైవతమ్) ఆయన నిత్యనివాసంగా ఉండే వైకుంఠంకంటే పైన మరొకలోకం లేదని వైకుంఠమే 'పరమపద'మని గుర్తించడం వల్లనే మానవులు సారజ్ఞులుగా కీర్తించబడతారు.

లోకశాస్త్ర కావ్యజ్ఞులందరూ మానవులను యుక్తాయుక్తా సారాసార విచక్షణాజ్ఞాన సంపన్నులని పేర్కొంటున్నారు. కావున మనమంతా ఈ మానవజన్మను చరితార్థమొనరించుకునే విధంగా సారజ్ఞులమై జీవనయానాన్ని కొనసాగిద్దాం.



11/D.T.P. systemD/G/Bn folder/Bn Mar11



శ్రీమతే రామానుజాయ నమః





పరమహంస పరివ్రాజకులు శ్రీశ్రీశ్రీ చిన్నజీయరు స్వామివారి

మంగళాశాసనములతో...

శ్రీశ్రీశ్రీ అహోబిల జీయరు స్వామివారి పర్యవేక్షణలో....

నడిగడ్డపాలెం-శ్రీ వాసుదాసాశ్రమంలో వేంచేసియున్న

## శ్రీలక్ష్మీనారాయణ - శ్రీ కోదండ రామస్వామివార్ల బ్రహ్మోత్సవములు

లక్షమల్లెల పుష్పార్చన - శ్రీ లక్ష్మీనారాయణ యాగం

**ది. 13-03-2011 నుండి 20-03-2011 వరకు**

**విశేష కార్యక్రమములు**

| తేది | వారము | ఉదయపు ఇష్టి | ఉదయపు వాహనసేవ | రాత్రి వాహనసేవ |
|---|---|---|---|---|
| మార్చి 12 | శని | --- | --- | 6 గం॥ విష్వక్సేన ఆరాధనతో అంకురార్పణ |
| ,, 13 | ఆది | పుత్రకామ ఇష్టి | ధ్వజారోహణము | శేషవాహనము |
| ,, 14 | సోమ | వైభవ ఇష్టి | సూర్యప్రభ | చంద్రప్రభ |
| ,, 15 | మంగళ | సుదర్శన ఇష్టి | సింహ | హంస |
| ,, 16 | బుధ | నారసింహ | కల్పవృక్ష | హనుమంత |
| ,, 17 | గురు | హయగ్రీవ ఇష్టి | మోహిని, పల్లకిసేవ | గరుడవాహనసేవ |
| ,, 18 | శుక్ర | శ్రీలక్ష్మీనారాయణ ఇష్టి | అశ్వవాహనసేవ<br>కోదండరాముని కల్యాణం | గజవాహనసేవ<br>దోపిడీ ఉత్సవం |
| ,, 19 | శని | రథోత్సవం, | మహాపూర్ణాహుతి, అభిషేకం<br>సప్తవర్ణ ప్రదక్షిణం, ధ్వజావరోహణము | ద్వాదశారాధన, |
| ,, 20 | ఆది | శ్రీలక్ష్మీదేవికి క్షీరాభిషేకం, పూజ, లక్ష్మీనారాయణ కల్యాణం. | | |

**ఈ ఉత్సవములలో భాగస్వామ్యము పొందు కైంకర్య వివరములు**

| | |
|---|---|
| ఒకరోజు పూర్తి యాజమాన్యం (ఇష్టితో) | రూ. 10,000/- |
| ఒకరోజు బ్రహ్మోత్సవం, వాహనసేవ యాజమాన్యమునకు | రూ. 3,000/- |
| ఒకరోజు ఇష్టి కార్యక్రమమునకు | రూ. 2,500/- |
| ఒకరోజు ఊయలసేవ | రూ. 1,000/- |
| శ్రీ ఆంజనేయ స్వామివారి ఆకుపూజ, వడమాల | రూ. 1,000/- |
| కళ్యాణ మహోత్సవమునకు | రూ. 500/- |
| ఒకరోజు సమష్టి లక్ష్మీ మల్లెపుష్ప సహస్ర నామార్చన | రూ. 150/- |

కావున పవిత్రమైన ఉత్సవములలో జరుగు కార్యక్రమములో వివిధ కైంకర్యముల ద్వారా పాల్గొని మన మనోభీష్టాన్ని నెరవేర్చుకొనుటయే కాకుండా లక్ష్మీ నారాయణుల అనుగ్రహాన్ని - ఆచార్య కటాక్షాన్ని పొందుదాం!

వివరములకు : ఉభయ వేదాంతాచార్యపీఠం, శ్రీవాసుదాసాశ్రమం, నడిగడ్డపాలెం,
గుంటూరుజిల్లా - 522 318. ఫోన్ (08644) 276522, 08645 272929;
సెల్: 94410 65582, 98663 99790, 98497 41537.



# భర్తృహరి సుభాషితాలు

సేకరణ: జి. రఘునాథ్ -సీతానగరం

**అజరామరవత్ప్రాజ్ఞః విద్యా మర్థం చ సాధయేత్ ।**
**గృహీత ఇవ కేశేషు మృత్యునా ధర్మ మాచరేత్ ॥**

తా॥ విద్యనుగాని ధనాన్నిగాని సంపాదించేవాడు "నేనెప్పుడు పడుచు తనంగానే ఉంటాను. నేను చాలా కాలం బ్రతికి ఉంటాను" అని ఉండాలి. "రేపో మాపో ముసలివాణ్ణి అయిపోతాను. ఎప్పుడో తెలియకుండా చచ్చిపోతాను" అనుకుంటే నాకీ చదువెందుకు? నాకీ డబ్బెందుకు?" అని విరక్తిగా ఉంటుంది. అప్పుడు చదువూవద్దు, డబ్బూవద్దు అనిపిస్తుంది. ఏదైనా ఒక ధర్మకార్యం చెయ్యాలంటే మాత్రం ఇప్పుడేం తొందర, సమయం రానీ చేద్దాం! అనుకుంటే ఈలోగా ఎప్పుడో ఆ పెద్దపులి (మృత్యువు) మీదపడి మింగేస్తుంది. వీడు చేయదలచుకొన్న ధర్మం వీడి ఆలోచనలోనే సమసి పోతుంది. అందుచే నేడో రేపో చనిపోతానేమో అన్నీనిత ఆతృతగ ఆ ధర్మం అప్పుడే చేసివేయాలి. ఇది బుద్ధిమంతుని లక్షణము.

**అధ్యాపనం బ్రహ్మయజ్ఞః పితృయజ్ఞస్తు తర్పణమ్ ।**
**హోమో దైవో బలిర్భూతో నృయజ్ఞోఽతిథి పూజనమ్ ॥**

తా॥ ప్రతి మానవునికీ ఐదురకముల ప్రాణిహింసలు తెలియ కుండానే ప్రతిరోజూ సంభవిస్తూ ఉంటాయి. ఆ ఐదు పాపాల శాంతికై ప్రతినిత్యం ఐదు యజ్ఞాలు చేయాలి. అవి బ్రహ్మయజ్ఞం, పితృయజ్ఞం, దైవయజ్ఞం, భూతయజ్ఞం, నృయజ్ఞము. అని ఐదు విధాలు.

1. **బ్రహ్మయజ్ఞం**=అంటే సంస్కృతద్రావిడ వేదమును శిష్యులకు సంతచెప్పి వల్లింప చేయటం.
2. **పితృయజ్ఞం**=పితృదేవతలకు పర్వదినాల్లో తర్పణాలివ్వడం శ్రాద్ధాలు పెట్టడం.
3. **దైవయజ్ఞం**=శాస్త్రం తప్పకుండా అగ్నిని వేదికయందు ప్రతిష్ఠించి హోమములను మంత్రయుక్తంగా చేయాలి.
4. **భూతయజ్ఞం**=ప్రాణులకు ఆహారం పెట్టుట.
5. **నృయజ్ఞం**=అతిథులను అభ్యాగతులను ఆదరించుట.

ఈ యైదింటిని ప్రతిరోజూ చేస్తూ ఉంటే తెలియకుండా సంభవించే ఈ ఐదు పాపాలు నశిస్తాయి.

# సీతాఫలం రామార్పణం

శ్రీమతి చెవుటూరి కుసుమకుమారి - విజయవాడ

*(గత సంచిక తరువాయి)*

## పుత్రులకై దశరథుని చింత - అశ్వమేధయాగ సంకల్పం

సుమనసమను పట్టణము మీదకు యుద్ధమునకు పోవలెనని దశ రథికులకు సమాన రథికుడైన దశరథునకు తలపు కలిగినది. వెంటనే కులగురువు, బ్రహ్మ పుత్రుడు అయిన వశిష్ఠునకు నమస్కరించి అనుజ్ఞపొంది, కులదైవమైన రంగనాథుని ఆరాధించి శతఅక్షౌహిణీసేనతో తెల్లనిఅశ్వాన్నెక్కి సుమనస నగరము మీదికి దండయాత్రకు బయల్దేరాడు.



సుమనస నగరాధిపతి సాధ్యుడు దశరథునితో పోరి పట్టుబట్టాడు. వెంటనే సాధ్యుని పుత్రుడు భూషణుడు దశరథునితో రణము చేయవచ్చాడు. భూపతి అయిన దశరథునకు సుకుమారుడైన ఆ యువకునితో పోరుటకు మనసొప్పలేదు.

అయ్యో! ఇంతటి సుకుమారుని యుద్ధమున చంపుటా! వీనిని చంపిన వీని తలిదండ్రులు జీవింతురా?

నవయవ్వని అయిన ఇతని భార్య భర్తృవియోగమును ఎట్లు సహించగలదు? ఆహా! ఇతని పాదములు తామరపూవులంత మృదువుగా వున్నవే! ఈ సాధ్య పుత్రుని చూచిన నామనసు ప్రీతికలుగుచున్నదిగాని వేరు విధముగా యోచించలేకున్నానే! అని వితర్కించి తన మీదకు దండెత్తి వచ్చిన ఆ యువకుని పట్టుకొన్నాడు.

పరాధీనుడైన ఆ యువకుని కూడా తండ్రి సాధ్యుని వద్దనే నిర్బంధమున వుంచాడు.

తన పుత్రుడు కూడా తనతోనే వుండుట వలన తన పరాజయ దుఃఖాన్ని విస్మరించి ఆనందంగా వున్నాడు సాధ్యుడు. సాధ్యుడు తన పుత్రుని చూచి పొందుచున్న ఆనందమును చూచిన దశరథుడు ఈ విధంగా చింతించాడు. ఈ సాధ్య పుత్రుని ముఖమును చూచిన సమస్త దుఃఖాలూ పోగొట్టునట్లు వున్నది. ఎంత సంపదవున్నా, ఎందరు రాజులను జయించినా పుత్రహీనుడనైన నాకు ఎటువంటి సుఖమును కలుగకున్నది.





పుత్రుడులేనివాని జన్మము వ్యర్థము. సంపదలు నిరర్ధకము. పుత్ర వంతుడు మరణించగా పుత్రుడు అగ్నిహోత్రము చేత ధరించి ముందు నడచుట కూడ ఒక ఉత్సవము వలెనే భాసించును కదా!

ఈ విధముగా యోచించిన దశరథుడు నిర్బంధములోనున్న సాధ్యుని పుత్రసంతానము పొందుటకు సాధనమేమి? అని అడిగాడు. రాజా! అశ్వమేధ యాగమువలన తప్పక పుత్రులు కలుగుదురని చెప్పినాడు సాధ్యుడు.

వెంటనే సాధ్యుని, పుత్రుని బంధ విముక్తులను చేసి, చింతాక్రాంతుడై అయోధ్యకు చేరాడు దశరథమహారాజు.

**అథ మంత్రిణ మాహూయ**
**రాజా దశరథోఽ వదత్ ।**
**జరాకృతాంత దూతీవ**
**కర్ణమూల ముపాగతా ॥**
**వంశాకురో నాభవన్మే**
**కింకరోమి సుమంత్ర భో! ॥**

తన మంత్రి అయిన సుమంత్రుని పిలచి సుమంత్రా! మృత్యుదూతికవలె వార్ధక్యము నా కర్ణమూలములను ఆశ్రయించినది. (అనగా నా చెంపలు నెరసినవి.) కానీ! నాకింతవరకూ వంశాంకురము లేకపోయినది కదా! ఏమి చేయను? ప్రాచీన పండితులు వార్ధకము గురించి వచించిన మాటలు మనసుకు తోచుచున్నవి.

వార్ధకమున మనుష్యుడు యమునంతతివాడు. అనగా దశరథుడు (చేతి కఱ్ఱకలవాడు) అవుతాడు. విష్ణుమూర్తి వలె గద కలవాడు (రోగముల పాలబడినవాడు) అవుతాడు.

చంద్రునివలే వంకర గలవాడు (వార్ధకమున శరీరము వంకరపోయి వంగిపోవుట మొదలైనవి) అవుతాడు.

శివునివలే విరూపాక్షుడు (కంటిచూపు ఆననివాడు) అవుతాడు.

బంధువులు ఆదరించరు. ఇటువంటి దోషభూయిష్ట వార్ధకము నన్నావరించుచున్ననూ నాకు పుత్రులు కలుగలేదే అని దశరథుడు మనసులో గూడుకట్టుకున్న విచారాన్ని వెలిబుచ్చాడు.

సుమంత్రా నీవు వెంటనే వసిష్ఠ వామదేవాది మహర్షి పుంగవులను తీసుకొనిరమ్ము అని ఆదేశించినాడు.

సుమంత్రుడు వెనువెంటనే వారిని తీసుకొనివచ్చినాడు. దశరథుడు మహర్షులను యథోచితంగా పూజించి

**మమరాజ్యసుఖం వ్యర్థం**
**నాభూత్పుత్ర సుఖం యతః ।**
**తదర్థ మశ్వమేధేన**
**యక్ష్యా మేతి మతిర్మమ ॥**

మహర్షులారా! పుత్రసంతాన సుఖములేని ఈ రాజ్యసుఖము వ్యర్థముగా తోచుచున్నది. నాకు అశ్వమేధ యాగము చేయవలెనను యోచన కలిగినది.

ఆ యాగమును మీ అనుమతితో మీ ఆదేశానుసారము చేయగలవాడను.

దయతో మీ అభిప్రాయమును తెలుపుడు. అని ప్రార్థించాడు.

వెంటనే మహర్షులందరూ ముక్త కంఠంతో బాగు బాగని హర్షాన్ని వ్యక్తం చేశారు. వెంటనే మహారాజు కులగురువు వసిష్ఠునకు నమస్కరించి గురుదేవా! మహర్షులారా! అశ్వమేధ యాగ విధానము ఏమి? దానిని చేయుట ఎట్లు సాధ్యమగును? రాజలోకమును జయించుటెట్లు? యాగమునకు ఎటు వంటి అశ్వమును నిర్ణయించవలెను? అన్ని విషయములను సవిస్తరముగా చెప్పుడని కోరినాడు. అంతట వసిష్ఠమహర్షి

**గంగాజల సమానేన**
**వర్ణేన వపుషా శుభః ।**
**కర్ణే శ్యామో ముఖే రక్తః**
**పీతః పుచ్ఛే సలక్షితః ॥**
**మనోవేగ స్సర్వగతి**
**రుశ్చైశ్రవ సమప్రభః ।**
**వాజమేధే హయః ప్రోక్తో**
**శుభలక్షణ లక్షితః॥**

హే దశరథ మహారాజా! యాగాశ్వము గంగాజలమువంటి తెల్లని రంగు, చెవులయందు నలుపు, ముఖము ఎరుపు తోకయందు పచ్చదనముతో, మనోవేగసమాన వేగముతో అడ్డులేక ఎక్కడికైననూ వెళ్ళగలిగి ఉండవలె. దశరథా! ఇంత ఏల ఒక్కమాటలో చెప్ప వలెనన్న ఇంద్రుని ఉచ్చైశ్రవమువలె ఉండవలె. అటువంటి శుభలక్షణ సంపన్నమైనదే అశ్వమేధ యాగాశ్వము.

ఆ అశ్వము నుదుట మీ నామము లిఖించిన పత్రమును కట్టి, రక్షక భటుల సహాయముతో ఆ అశ్వమును విడిచి పెట్టవలె. ఆ అశ్వము ఎచటికి వెళ్ళిన వారునూ వెంట ఉండవలె. ఎవరా అశ్వమును బలవంతముగా పట్టు కొందురో వారిని జయించి ఆ అశ్వమును తిరిగి అయోధ్యకు తీసుకొని రావాలె. యాగము చేయు యజమాని

**మృగశృంగ ధరో భూత్వా**
**బ్రహ్మచర్యా సమన్వితః ।**

సంవత్సర కాలము లేడికొమ్ములు ధరించి బ్రహ్మచర్యమును పాటించ వలెను.

సంవత్సర కాలము దీక్షను వహించి దీనులకు, అంధులకు వారి వారి కోరికను అనుసరించి ధన వస్త్ర దానములు చేసి సంతసింప చేయవలె. రాజా! అన్నిటికన్న మిన్నగా అన్న దానము చేయవలె. ఇట్లు యజ్ఞమును సంపూర్ణము చేసినవానికి సకల పాపాలూ నశించును. దశరథా నీవు యజ్ఞమును పరిపూర్ణము చేయుటకు, అశ్వరక్షణకు, పెద్దలను పూజించుటకు సర్వసమర్థుడవు. నీవీ యజ్ఞమును పరిపూర్ణము చేయుటకు, అశ్వరక్షణకు, పెద్దలను పూజించుటకు సర్వ సమర్థుడవు. నీవీ వాజిమేథ యాగము చేసి నీవు కీర్తిశాలివి కావటమేకాదు, ఇతరులను కూడా పవిత్రులను చేయుము.

(సశేషము)





# గ్రామం చిన్నదైనా -మనసు మాత్రం పెద్దది



మహబూబ్‌నగర్‌జిల్లా, గద్వాలమండలం, కొండపల్లి గ్రామవాసులైన శ్రీమాన్ కాంతారెడ్డి, శ్రీమాన్ ఈశ్వరయ్య, శ్రీమాన్ శ్రీనివాసులు, శ్రీమాన్ వెంకటనారాయణ, శ్రీమాన్ లక్ష్మన్న, శ్రీమాన్ ఆంజనేయులు, శ్రీమాన్ బుడ్డన్న, శ్రీమాన్ చంతన్న, శ్రీమతి లక్ష్మీదేవమ్మమొదలైన ఈ భక్తులు చిన్న గ్రామస్థులు. వీరు పొలంపనులు చేసుకుంటూ పండిన పంటలో శక్తి మేరకు కైంకర్యములు సమర్పించుకోవడం, ప్రతి సంవత్సరం ఏదో ఒక సమయంలో మన దివ్యసాకేత రామునికి జరిగే కార్యక్రమాల్లో పాల్గొని సేవచేసుకోవడం వారి పెద్ద మనసుకు నిదర్శనంగా చెప్పుకోవచ్చు.

ఈ గ్రామస్తులు 2005లో శ్రీ స్వామివారు శ్రీరాంనగర్‌లో చాతుర్మాసదీక్షలో వేంచేసి వున్నట్లు తెలుసుకుని అప్పటినుండి వికాసతరంగిణి కార్యక్రమాల్లో చురుకుగా పాల్గొంటున్నారని, మహబూబ్ నగర్ సెంట్రల్‌కమిటీ సభ్యురాలు శ్రీమతి విజితారెడ్డి తెలిపారు.

వీరు ఇటీవల శ్రీస్వామివారిని కలుసుకొని మంగళాశాసనాలు అందుకున్నారు.

**కొండపల్లి ఓచిన్న గ్రామం, ఆగ్రామవాసుల మనసు మాత్రం కొండంత నిండైనది. భగవదారాధనే పరమావధిగా ఆ గ్రామస్తులు తలుస్తారు. వికాసతరంగిణి కార్యకర్తలుగా అనేక కార్యక్రమాల్లో పాల్గొని సేవలను అందజేస్తుంటారు. వికాసతరంగిణి ఏర్పాటు చేసిన భజన గీతాల పోటీల్లో పాల్గొని బహుమతిని కూడా అందుకున్నారు వీరు.**



14/D.T.P. systemD/G/Bn folder/Bn Mar11



## వేదవిజ్ఞానాన్ని అందించే కేంద్రం జీవాప్రాంగణం

**శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ చిన్న జీయర్ స్వామి** వారి అనుగ్రహంతో వేద విజ్ఞాన సారాన్ని అందించే ఒక గొప్ప కేంద్రంగా గురుతర స్థానంలో "జీవా"ప్రాంగణం వెలిసింది. ఈ కేంద్రంలో మన ప్రాచీన వేదవాఙ్మయ సారాన్ని, వాటిలో నిక్షిప్తమైవున్న ఆధునిక విజ్ఞానాన్ని అందించే దిశగా జీవా కమ్యూనిటీ కాలేజీ స్థాపించటం మనందరికీ ఒక వరం.



## జీవా కమ్యూనిటీ కాలేజీ ప్రారంభం

ఇందిరాగాంధీ నేషనల్ ఓపెన్ యూనివర్శిటీ అనుబంధంగా జీవా కమ్యూనిటీ కాలేజీని ఇగ్నో వైస్ ఛాన్సలర్ శ్రీమాన్ డా॥ వి.యన్. రాజశేఖరన్ పిళ్ళైగారు ఘనంగా ప్రారంభించారు.

రాష్ట్ర దేవాదాయ శాఖ మంత్రి వర్యులు శ్రీమాన్ జూపల్లి కష్ణారావు లైబ్రెరీ(శ్రీకోశాన్ని), ఇగ్నో బోర్డ్ సభ్యులు శ్రీమాన్ ప్రొఫెసర్ ఎన్.బి. సింగ్ బదురియాగారు కంప్యూటర్‌ల్యాబ్‌ను, శ్రీ స్వామివారు డైరెక్టర్స్ ఛాంబర్‌ను, ఓయూ కామర్స్ డీన్ శ్రీమాన్ పురుషోత్తమ రావుగారు కార్యాలయ ఛాంబర్‌ను ప్రారంభించారు.





# వేద విజ్ఞానగని మన భారతదేశం



జీవా (జీయర్ ఇంటిగ్రేటెడ్ వేదిక్ అకాడమీ) అంగంగా 'ఇగ్నో' అనుబంధంగా వైదిక, విజ్ఞానాన్ని అందించేలా ప్రాచీన వేద విజ్ఞాన శాస్త్రవైభవసారం ఆవిష్కరింపబడే విధంగా విద్యా ప్రణాళి ఏర్పరచబడి "జీవా కమ్యూనిటీ కాలేజీ"ని స్థాపించడం జరిగిందని శ్రీ చిన్న జీయర్ స్వామివారు తెలిపారు.

సోమవారం 21వ తేదీ ఉదయం హైదరాబాద్ లోని ముచ్చింతల్ శ్రీరాంనగరం జీవా ప్రాంగణంలో శ్రీస్వామివారి అధ్యక్షతన ఏర్పాటు చేసిన జీవా కమ్యూనిటీ కాలేజీ ప్రారంభోత్సవ కార్యక్రమాన్ని వేదమంత్రోచ్చారణ మధ్య శ్రీస్వామివారు జ్యోతిప్రకాశనం గావించి ప్రారంభించారు. వీరితోపాటు అతిథులు పాల్గొన్నారు.



అనంతరం జీవా కాలేజీ వెబ్ సైట్‌ను ప్రారంభించారు. ఆతరువాత. శ్రీస్వామివారు అనుగ్రహ భాషణ చేస్తూ వేద విజ్ఞానగని అయిన మన భారతదేశంలో వేలాదిసంవత్సరాలకు పూర్వమే నలంద, తక్షశిలలాంటి విశ్వవిఖ్యాతిగాంచిన విశ్వవిద్యాలయాలుండేవని అందులో ప్రపంచ నలుమూలలనుండి విద్యార్థులు చేరి విద్యనభ్యసించిన సంగతి అందరికీ తెలిసిందేనని గుర్తుచేశారు.

వేదాలను మన పూర్వులు గురూచ్చారణ అనూచ్చారణ పూర్వకంగానే కంఠస్థం చేసి, ఒకరినుండి మరొకరికి ఈనాటికీ శ్రద్ధకలవారికి అందిస్తూనే ఉన్నారు.



కాలక్రమేణ విదేశీదాడులు, ఆక్రమణలు మనదేశంపై జరిగినప్పుడు కొంత నిర్వీర్యంగా కనబడినప్పటికీ వాటి మూలాలు పదిలంగానే ఉన్నాయని, అవి నిరంతర గంగా ప్రవాహంలా ప్రవహిస్తూనేవున్నాయని శ్రీ స్వామి వివరించారు.

ప్రాచీన సంస్కృత సారస్వతం అలంకార శాస్త్రం, విశిష్టాద్వైత వేదాంతం, ఆలయాలలో ఆరాధన సంబంధమైన ఆగమ విద్య, ఆలయ పరిపాలన, ఆలయ వాస్తు, ఖగోళ విజ్ఞానం, దర్శనములు మొదలైన కోర్సులు జీవా కమ్యూనిటీ కాలేజీలో బోధిస్తారు.




ముఖ్యఅతిథిగా విచ్చేసిన ఇగ్నో వైస్‌ఛాన్సలర్ శ్రీమాన్ డా॥ వి.న్. రాజశేఖరన్ పిళ్ళై కాలేజీ సిలబస్‌ను ఆవిష్కరించారు. అనంతరం మాట్లాడుతూ మన వేదవిద్యను జోడించి చక్కని కోర్సులు తయారుచేసి బోధించడానికి జీవా కమ్యూనిటీ కాలేజీ ముందుకు రావడం ఆనందదాయకం అన్నారు. ప్రపంచవ్యాప్తంగా ఇగ్నో వందలాది కమ్యూనిటీ కాలేజీలను స్థాపించి ఘనతవహించిందని, సర్వజగత్తుకు ఉపయోగపడే విధంగా మంచికోర్సులు తయారు చేసి అందించాలని ఆయన ఈ సందర్భంగా సూచించారు.

తొలుత దేవాదాయ ధర్మాదాయశాఖ మంత్రివర్యులు శ్రీమాన్ జె.కృష్ణారావు జీవా కమ్యూనిటీ కాలేజీ బ్రోచర్‌ను ఆవిష్కరించారు. తరువాత శ్రీ అహోబిల రామానుజ జీయర్ స్వామి అనుగ్రహభాషణ చేస్తూ ఇలాంటి కాలేజీలవల్ల లోకానికి ఎంతో మేలు జరుగుతుందని తెలిపారు. ఇగ్నో బోర్డుసభ్యులు శ్రీమాన్ ప్రొఫెసర్ ఎస్.బి. సింగ్ బదురియా, ఉస్మానియా యూనివర్శిటీ కామర్స్ డీన్ శ్రీమాన్ ప్రొ. పి. పురుషోత్తమరావు, హైదరాబాద్ సెంట్రల్ యూనివర్శిటీ డిపార్ట్‌మెంట్ ఆఫ్ తెలుగు ప్రొ॥ శ్రీమాన్ బేతవోలు రామబ్రహ్మం, హైదరాబాద్ సెంట్రల్ యూనివర్శిటీ డిపార్ట్‌మెంట్ ఆఫ్ తెలుగు ప్రొ॥ ఆర్.వి.ఆర్. కృష్ణశాస్త్రి, సెంట్రల్ యూనివర్శిటీ సంస్కృత శాఖ ప్రొ॥ కోరాడ సుబ్రహ్మణ్యం, హైదరాబాద్ సెంట్రల్ యూనివర్శిటీ తెలుగు లెక్చరర్ డా॥ అద్దంకి శ్రీనివాసాచార్యులు, ఉస్మానియా యూనివర్శిటీ సంస్కృత శాఖ విశ్రాంత ఆచార్యులు ప్రొ॥ బి. నరసింహాచార్యులు, ఉస్మానియా యూనివర్శిటీ సంస్కృత అకాడమీ సంచాలకులు డా॥ శ్రీనివాస వార్కెడే, శంషాబాద్ ఎం ఆర్.వో.శ్రీమాన్ వెంకటరెడ్డి, విజ్ఞాన








కళాశాల నిర్వాహకులు శ్రీమాన్ సతీష్, ప్రముఖ డాక్టర్ ప్రేమరాజ్ మొదలైనవారు జీవా కమ్యూనిటీ కాలేజీ నిర్వహణకు తమ సేవలను అందిస్తామని తెలియజేశారు.

విచ్చేసిన అతిథులకు,అలాగే ఈ కార్యక్రమంలో పాలు పంచుకుని కృషి చేసిన వికాసతరంగిణి కార్యకర్తలను, సహకారం అందించిన వారిని శ్రీ స్వామివారు శాలువా, జ్ఞాపికతో సత్కరించి మంగళాశాసనాలు చేశారు.

తొలుత సంస్కృత ఉపాధ్యాయులు శ్రీమాన్ జగన్నాథశాస్త్రి, ఆర్. నీళారామానుజదాసి, షర్మిలా రామానుజదాసిల దర్శక పర్యవేక్షణలో జీవా గురుకుల విద్యార్థులు ప్రదర్శించిన సాంస్కృతిక కార్యక్రమాలు అలరించాయి. సంస్కృత లఘునాటిక, కోలాట విన్యాసం, "రియల్ హీరో" నాటిక ప్రదర్శించిన తీరు బాగుంది. అందులో పాల్గొన్న విద్యార్థులు చక్కగా నటించారు. అలాగే నేత్రవిద్యాలయ విద్యార్థులు ప్రదర్శించిన "స్వాగతనృత్యం, గీతాలాపన" ఆకట్టుకుంది.

జీవా అకడమిక్ కౌన్సిల్ డైరెక్టర్ ఉ.వే. శ్రీమాన్ డా. ఎస్.వి. రంగరామానుజాచార్య స్వామివారు కోర్సువివరాలు తెలిపారు. ఈ కోర్సులన్నింటిలోనూ వివిధ వైదిక విజ్ఞాన విషయాలతోపాటు ఏర్పరచామన్నారు. ఆంగ్లభాషా పరిజ్ఞానంతో కంప్యూటర్ పరిజ్ఞానంకూడా ఈ కోర్సుల్లో భాగంగా ఏర్పరిచామన్నారు. నైతికవిలువల గురించి విశేషమైన అంశాలు ఈ అధ్యయన ప్రణాళికలో ఉన్నాయన్నారు.

ఆరునెలల కాలంపాటు కోర్సు పూర్తిచేస్తే సర్టిఫికెట్‌ను పొందవచ్చుని, దానిని దాటి 1 సంవత్సరం కోర్సు పూర్తిచేస్తే డిప్లొమ పొందవచ్చుని, మరో సంవత్సరం కోర్సుకూడా పూర్తి



చేస్తే అసోసియేట్ డిగ్రీని పొందవచ్చని. ఈ డిగ్రీలన్నీ ఇందిరాగాంధీ నేషనల్ ఓపెన్ యూనివర్శిటీవారే ఇస్తారని డైరెక్టర్ తెలిపారు. అధ్యయన ప్రణాళిని దూరవిద్యావిధానం (కరస్పాండెన్స్) మరియు ఆన్‌లైన్‌ద్వారా కూడా అమలుజరుపడానికి వ్యవస్థ ఏర్పడుచున్నదని కాలేజీ ప్రిన్సిపాల్ శ్రీమాన్ టి.యఎస్. కృష్ణ తెలిపారు.

**ఉపాధి అవకాశాలకు వీలుగా కోర్సు** – ఈ కోర్సులలో ఉత్తీర్ణతను పొందినవారు వివిధ సంస్థల్లో భారతీయ సంస్కృతిని విజ్ఞానాన్ని అందించడానికి, పరిశోధన చేయడానికి, సాహిత్య పరమైన కృషి చేయడానికి, ఆలయాలలో పరిపాలకులుగాను, అర్చకులుగాను సేవలు అందించడానికి, ప్రభుత్వపరమైన డిపార్టుమెంట్లలోను, పలు శాఖల్లోనూ ఉపాధి అవకాశాలు పొందడానికి వీలుగా ఈ కోర్సులు రూపుకల్పన చేయడం జరిగిందని ప్రిన్సిపాల్ తెలిపారు.

సర్టిఫికెట్ కోర్సుకు 8వ తరగతి ఉత్తీర్ణులైనవారికి, డిప్లొమా కొరకు 10వ తరగతి ఉత్తీర్ణులైనవారికి, అసోసియేట్ డిగ్రీకోర్సులో చేరడానికి ఇంటర్ ఉత్తీర్ణులైనవారికి అవకాశం వుంటుందని వివరించారు.

ఈ కార్యక్రమంలో ముచ్చింతల్ సర్పంచ్, గ్రామ ఎంపిటిసి, పలువురు రాజకీయ నాయకులు, ఉన్నతాధికారులు, పురప్రముఖులు, వేదపాఠశాల విద్యార్థులు, ఉపాధ్యాయులు, భక్తులు పాల్గొన్నారు. చివరిగా వేదపాఠశాల విద్యార్థుల శాంతి మంత్రపఠనంతో కార్యక్రమం ముగిసింది.

## "ఈ మాసం (ఫిబ్రవరి) – దివ్యసాకేతం"

ఆనందంగా ధనుర్మాస ప్రత్యేక పూజా కార్యక్రమాలు, కైంకర్యాలు జరుపుకుని కొంగ్రొత్త కాంతులతో ప్రకృతిని అంతా శోభాయమానంగా అలంకరించి, చిరువేడి జల్లులతో ప్రారంభమయిన ఈ మాసంలో మన **దివ్యసాకేతం** విశేషాలెన్నో. అక్కడడుగిడితేచాలు అలౌకికానందాన్ని పొందుతాం.

ఈమాసం ఆరంభంలో పూర్వాభాద్ర నక్షత్రం 6వ తారీఖున హనుమత్సన్నిధిలో ప్రతిమాసం వలె తిరుమంజన సేవ, పూమాల సేవ, ఆకుపూజలు జరిగాయి. రేవతి నక్షత్రాన 8వ తేదీన రంగనాథస్వామియొక్క ఉత్సవం జరుపుకున్నాం. రథసప్తమి రోజున ఆయురారోగ్య ప్రదాతయైన సూర్యభగవానుని ఆరాధనను, ఆదిత్య హృదయపారాయణముతో చేసుకున్నాం. భీష్మైకాదశినాడు పెరుమాళ్ సన్నిధిలో జరిగిన శ్రీ విష్ణుసహస్రనామపారాయణలో మన జీవా గురుకుల పాఠశాల, నేత్రకళాశాల విద్యార్థినీ విద్యార్థులు మరియు భక్త జనులందరూకలిసి ఎంతో భక్తి శ్రద్ధలతో పాల్గొన్నారు.

'పడియాయ్ కిడన్దు ఉన్ పవళవాయ్ కాణ్బేనే' నీ సన్నిధి ముందు గడపగా నుండైనా నిను సేవించుభాగ్యమును అనుగ్రహించమని శరణాగతి చేసిన కులశేఖరాళ్వార్ల తిరునక్షత్రమును, రామాయణ సమాపన పూర్వక పట్టాభిషేకమును జరుపుకున్నాం. చిత్త నక్షత్ర, శుక్రవారోత్సవ అభిషేకములు సాకేత రామునికి లక్ష్మీఅమ్మవార్లకు కన్నులపండువుగా జరిగాయి. అశేషంగ భక్తజనులు దివ్యసాకేతాన్ని దర్శించుకుంటూ ఆనందాన్ని పొందుతున్నారు. మరిన్ని దివ్యసాకేత విశేషాలు వచ్చేనెల సంచికలో తెలుసుకుందాం.

జై శ్రీమన్నారాయణ!





బాలనివేదన

## తెలుసుకుందాం...

-నిర్వహణ -విజేఆర్



ఈ చిత్రంలో ఎడమవైపున మొదటి వారు మన ఆచార్యులు శ్రీశ్రీశ్రీ చిన్న జీయర్‌స్వామివారు. వారి ఆచార్యులు (మధ్యలో ఉన్నవారు) శ్రీఉ.వే. శ్రీమాన్ తె.కం. గోపాలాచార్య స్వామివారిని తోడ్కొని వస్తున్నారు. చిత్రంలో కుడివైపున ఉన్నవారు శ్రీమాన్ కందాడై వేంకటాచార్యస్వామి (విజయనగరం). శ్రీమాన్ శ్రీభాష్యం అప్పలాచార్య స్వామి (విశాఖపట్నం) తదితరులను చూడవచ్చు.

## కనిపెట్టండి చూద్దాం!

మహర్షి
ఆతిథ్యం
వేదవిజ్ఞానం
ప్రజాపతి
విలాసాలు
భరద్వాజుడు
తపశ్శక్తి
అన్వేషణ
విజ్ఞానం
తపస్సు
ఆర్జించు
కొండలు
కృషి
వందలు
మట్టి

| లు | ర్షి | హ | మ | న్వే | కృ | నం | తి |
|---|---|---|---|---|---|---|---|
| ఆ | డ | థ్య | తి | షి | జ్ఞా | ప | డు |
| నం | ర్జిం | కొం | శ్శ | వి | జా | ఆ | జు |
| ణ | జ్ఞా | చు | ప | ప్ర | తి | లు | ద్వా |
| ష | వం | వి | త | థ్యం | స్సు | సా | ర |
| న్వే | ద | ట్టి | ద | భ | ప | లా | భ |
| ఆ | లు | మ | ర | వే | త | వి | ట్టి |



17/D.T.P. systemD/G/Bn folder/Bn Mar11

తెలుసుకుందాం రండి!

## మన "ఆళ్వార్లు"

**'ఆళ్వార్'**అనగా మునిగినవారు అని అర్థం.
దేనిలోమునిగారు?
భగవదనుభవమనే దివ్య ప్రవాహంలో మునిగినవారు.
కనుక మన బోటివారికి ఆ అనుభవాన్ని పంచి తరింపచేయగలిగివారిని **"ఆళ్వార్"**లంటున్నాము.

**ద**క్షిణ భారతదేశంలో ద్రావిడ భాషలో తమ అనుభవాల్ని పాడి లోకానికి అందించినవారు పన్నెండుమంది ఉన్నారు. వీరంతా వివిధ ప్రాంతాల్లో, వివిధ కాలాల్లో జన్మించి వివిధ రకాలుగా జీవితం గడిపి, వేదాంతసారాన్ని వెలువరించారు. వారియొక్క ఉపదేశాలని శ్రవణం చేసిన జ్ఞానులు అవి భగవదనుగ్రహలబ్ధి, అనుభవ పరిపూర్ణములని గుర్తించారు. అంతటి అనుభవపాత్రులుగనుకే అలా అందించగలిగారు. వారందించిన వాటిని అనుసరించడం చేత కోరిన రక్షణ లభించ గలదని పెద్దలు నిర్ణయించారు, దీనినిబట్టి వారిని "ఆళ్వార్లు" అని అన్నారు.

"ఆళ్వార్" అనేది ఒక తమిళపదం. ఆళ్వార్ అనగా మునిగిన వారు అని అర్థం. దేనిలో మునిగారు? భగవదనుభవమనే దివ్య ప్రవాహంలో మునిగినవారు, కనుక మనబోటి వారికి ఆ అనుభవాన్ని పంచి తరింపచేయగలిగేవారినే "ఆళ్వార్"లు అంటున్నాము. వారు 12 మంది-

**1) సరోయోగి (పొయిగై అళ్వార్), 2) భూతయోగి (పూదత్తాళ్వార్), 3) మహాయోగి(పేయాళ్వార్), 4) భక్తిసార యోగి(తిరుమళ్లిశై ఆళ్వార్), 5) కులశేఖరయోగి (కులశేఖరా ళ్వార్), 6) మునివాహనయోగి (తిరుప్పాణి ఆళ్వార్), 7)విప్రనారాయణులు (తొండరడిప్పొడి ఆళ్వార్), 8) శఠకోప యోగి (నమ్మాళ్వార్), 9) మధురకవియోగి (మధురకవి ఆళ్వార్), 10) విష్ణుచిత్తయోగి(పెరియాళ్వార్), 11)పరకాల యోగి (తిరుమంగైయాళ్వార్),12)ఆండాళ్తల్లి.**

వీరి నామాల చివర నున్న యోగి పదమునకు దర్శనము పొందిన వ్యక్తి అని అర్థము. వీరందరిని ద్రష్టలు అంటాము. వీరి గురించి, వీరి దర్శనం గురించి పరిచయం చేసుకోవడం సదా ఉత్తమం. బాలలూ తెలిసిందా! ఆ సత్పురుషుల గురించి తెలుసుకోవడానికి ప్రయత్నిద్దామా!

### శ్రీరంగంలోని నంబెరుమాళ్ "ఆదిబ్రహ్మోత్సవాలు"

**11-3-2011** నుండి **20-3-2011** వరకు శ్రీరంగంలోని నంబెరుమాళ్ మన **వీరరాఘవ రామానుజ కూటములో 14వ తేది నుండి 18వ తేది వరకు** వేంచేసి ఉంటారు. ఈ అవకాశమును భగవద్బంధువులు వినియోగించుకోగలరు.



**జై శ్రీమన్నారాయణ!**
**శ్రీశ్రీశ్రీ చిన్న జీయరు స్వామివారి అనుగ్రహంతో ఏర్పాటైన**
**"క్యాన్సర్ అవగాహన యాత్ర"** ప్రతి సంవత్సరం ఫిబ్రవరి 4వ తేది కేన్సర్ దినము పురస్కరించుకొని మన వికాస తరంగిణి సభ్యులు అవగాహన యాత్ర చేస్తున్నారు. అనేక శిబిరాలను నిర్వహిస్తూ, అవసరమైన మందులను సహాయ సహకారాలను ముమ్మరంగా అందజేస్తున్నారు.

### క్యాన్సర్ రాకుండా తీసుకోవలసిన కనీస జాగ్రత్తలు: అవగాహన

కేన్సర్ అంటువ్యాధి కాదు. అశ్రద్ధ చేస్తే ప్రాణాలు తీసే అతి ప్రమాదకరమైన వ్యాధి.

**క్యాన్సర్ అంటే :**

కొన్ని జీవకణాలు అదుపు తప్పి విశృంఖలంగ పెరిగి పోవడాన్ని "క్యాన్సర్" (పుట్టుకురుపు) అంటారు.

- క్యాన్సర్‌ను పెంచడములో పొగాకే ప్రధానమైనది. కనుక, పొగాకు సంబంధించిన పదార్థాలేవీ వాడరాదు. వాడేవారు వెంటనే మానాలి.
- మద్య మాంసాలు మానాలి.
- ఆకుకూరలు, కాయకూరలు, పండ్లు మొదలైనవి ఆహారంలో అధికంగా తీసుకోవాలి.
- శరీరానికి తగినంత పరిశ్రమ చేయాలి. కొంత వ్యాయామం చెయ్యాలి.
- శరీరం ఎక్కువ లావైపోకుండా జాగ్రత్త పడాలి.

**స్త్రీలు :** 30సం॥లు దాటినవారంతా గర్భకోశ పరీక్షలు చేయించుకోవాలి.

రొమ్ముక్యాన్సర్‌వంటివి గుర్తించేట్టు స్వయంగా పరీక్షలు చేసుకోవడం నేర్చుకోవాలి. ఏదైనా సంశయం కలిగితే వెంటనే అనుభవజ్ఞులైన డాక్టర్‌ను సంప్రదించాలి.



*ఎవరైనా ఏకధాటిగా మాట్లాడుతుంటే "ఉట్టి వాగుడు కాయ" అని అంటూంటారు. ముఖ్యంగా చిన్నపిల్లలు ముద్దుముద్దుగా గలగలా పెద్ద పెద్ద మాటలు మాట్లాడుతున్నా "ఒట్టి వసపిట్ట" అని కూడా అంటూంటారు. అలాంటి వస గురించి, దాని ఔషధ గుణాల గురించి, తెలుసుకుందామా?*

**"వస"** అకోరస్ కెలామస్ అనే శాస్త్రీయ నామం కల్గిన ఈ మొక్క ఆరేసీ కుటుంబానికి చెందిన బహువార్షిక గుల్మం.

దీనికి సంబంధించి కొన్ని వేరే భాషల్లోని పేర్లను తెలుసుకుందాం.

తెలుగు – వస, హిందీ–గొర్బాచ్, బాచ్, కన్నడము– బిజాల్, వస, తమిళం– వసంబు, సంస్కృతం– ఉగ్రగంధ, ట్రేడ్‌నేమ్– స్వీట్‌ఫ్లాగ్‌లని పిలుస్తారట.

ఇది భారతదేశం, శ్రీలంక దేశాల్లో వ్యాపించి ఉంది. అలాగే సిక్కిం, హిమాలయ ప్రాంతాలల్లోను వ్యాపించి ఉంది, ఆంధ్రప్రదేశ్‌లోని నల్లగొండ అటవీ ప్రాంతాల్లో అక్కడక్కడ విస్తరించి ఉంది. కర్ణాటక, గుజరాత్ రాష్ట్రాల్లో దీనిని ఎక్కువగా సాగుచేయడం జరుగుతున్నది.

**ఉపయోగాలు:** వేళ్ళలో ఆసరోన్ డిహైడ్, ఆసరోన్ వంటి రసాయనాలు ఉంటాయి. గొంతు వ్యాధులు, కడుపు నొప్పి, జ్వరం, మానసిక రుగ్మత, కాలేయంనొప్పి, రొమ్ము నొప్పుల నివారణలోను, మూత్రపిండ వ్యాధులలోను, ల్యూకోడెర్మా నివారణల్లో వాడుతారట. ఇదర్రా! ఎన్నో ఔషధ గుణాలుగల**"వస"** సంగతి.

(ఆంధ్రప్రదేశ్ ఔషధ మరియు సుగంధ మొక్కల బోర్డువారి సౌజన్యంతో)

**వేదం కేవలం మానవుల క్షేమమే కాదు సర్వజీవరాశి క్షేమం ఆకాంక్షిస్తుంది.**

దర్శనీయ స్థలాలు

# మేల్కోట (తిరునారాయణ పెరుమాళ్)



**తీ**ర్థయాత్రలు చేస్తూ దర్శనీయ స్థలాలను దర్శిస్తూ అక్కడి స్థలపురాణాలను తెలుసుకుంటూ ఓపిక వున్నంతకాలం భగవంతుని అవతార లీలలను తెలుసుకుంటూ మంచిపనులు చేస్తూ కాలంగడపడంలో వున్న హాయి, ఆనందం వేరొకటి ఉండదు. అటువంటి దర్శనీయ స్థలమే మేల్కోట (తిరునారాయణ పెరుమాళ్).

ఎక్కడికైనా వెళ్ళి ప్రశాంతంగా కొన్నిరోజులు గడిపి అలౌకికానందం కోసం తీర్థయాత్రలు చేయాలనుకునే వారికి చేరువలో వుంది మేల్కోట.

**మేల్కోట**, మాండ్యాజిల్లా, కర్ణాటక రాష్ట్రంలో బెంగుళూరుకి 90 మైళ్ళదూరంలో చుట్టూ కొండలతో నిండి తల్లిఒడిలా హాయిగొలిపే వాతావరణం ఇక్కడ కొలువై, ఆహ్లాదకరమైన, అలౌకికానందం కలిగిస్తూ ఉన్న రమణీయ ప్రదేశం.

**స్థలపురాణం:** తిరునారాయణ పెరుమాళ్, మూలవర్లు మొదట చతుర్ముఖునికి లభిస్తే ఆయన తన మానసపుత్రుడైన సనత్కుమారునికి, ఆయన ఈ మేల్కోట క్షేత్రానికి చేర్చినట్లు తెలుస్తుంది.

భగవద్రామానుజులవారి ప్రభావము, ప్రయత్నాల ఫలితంగా పునఃప్రతిష్ఠించిన కర్ణాటక రాష్ట్రంలోని మేల్కోటలో ఉన్న "తిరునారాయణస్వామి" దేవాలయం, మూలవర్లు భూమిలో లభిస్తే, సంస్కరించి, ఆలయ నిర్మాణం చేయించి ప్రతిష్ఠించారు. మహమ్మదీయుల అధీనంలో "శ్రీరామప్రియు"లనే ఉత్సవమూర్తులున్నట్లు తెలిసి ఆ రాజును మెప్పించి విగ్రహాన్ని తెచ్చి పునరారాధనను క్రమబద్ధం చేశారు. సమాజం వెలివేసిన హరిజనులకు గూడ వైష్ణవదీక్షను ఇచ్చి, మేల్కోటలోనే భగవద్దర్శనం చేయించిన మొదటి ఆధ్యాత్మిక సమతావాది ఆచార్య రామానుజులవారు. 12 సం॥లు స్వయంగా వేంచేసియున్న పరమపావన ప్రసిద్ధిక్షేత్రమిది. వేదవిజ్ఞానానికి ఏర్పడ్డ మచ్చులను కడిగివేస్తూ బ్రహ్మసూత్రాల తాత్పర్యాన్ని "అక్షరశః" నిరూపించి వేదవ్యాస బాదరాయణునికి హృదయము రంజిల్లేటట్లు "శ్రీభాష్య"మనే గ్రంథాన్ని లోకానికి అందించిన "జ్ఞానమండప"మిదే. మత సామరస్యానికి నాందిగ ఆనాటి తురుష్క పాలకులనుండి శ్రీరామప్రియులను తెచ్చినపుడు ఆ మూర్తిని ఎడబాయలేక వెన్నంటివచ్చి ఆలయంలోని స్వామి శ్రీచరణ సన్నిధిని చేరి ప్రాణం విడిచిన ఆ పాలకుని కుమార్తె "బీబీ నాచ్చియార్"కు ఆరాధనను భగవద్రామానుజులు ఏర్పాటు





చేసినది ఈ మేల్కోటలోనే! తర్వాత బీబీ నాచ్చియార్ తిరుమల, శ్రీరంగం వంటి అన్ని సుప్రసిద్ధ క్షేత్రాలలోనూ ఆరాధనలందుకొననారంభించింది దక్షిణబదరిగా ప్రసిద్ధిగాంచిన ఈ క్షేత్రం ప్రకృతి రమణీయతకు ప్రత్యక్ష నిదర్శనం. మండు వేసవిలో గూడ చల్లని తల్లి ఒడిలా హాయిగొలిపే వాతావరణం యిక్కడ ఉంటుంద"ని దీనిని "ఇందిరాక్షేత్రం" అంటారు.

ఉత్సవర్ల విషయానికొస్తే ఈ ఉత్సవమూర్తికి ఫాల్గుణమాసంలో శుక్లదశమినాడు జరిగే **"వైరముడి"** ఉత్సవము చాలా ప్రసిద్ధిచెందినది. "వైరముడి" అంటే **"వజ్రకిరీటము"** అని అర్థము. దీనికో చరిత్ర ఉంది. వ్యూహవాసుదేవుని వజ్రకిరీటాన్ని విరోచనుడనే అసురుడు అపహరించాడు. గరుత్మంతుడాతణ్ణి అణచి, దాన్ని తెస్తూ మధ్యలో ఈ ఉత్సవమూర్తి తన స్వామిలానే ఉండటాన్ని చూచి, ఇక్కడనే దానిని అమర్చి ఆనందించి వెడలెనట. ఆ దినం ఫాల్గుణ శుక్లదశమి. అదే వైరముడి ఉత్సవం.

ఇంత ప్రసిద్ధక్షేత్రమైనాగూడ ఇక్కడ సరియైన వ్యవస్థ లేకపోవడం వల్ల నిత్యమూ ఆరాధన, నైవేద్యములుగూడ నామమాత్రమై పోయాయి. దేవునికే నైవేద్య వ్యవస్థ లేనపుడు, దర్శించే భక్తులకేముంటుంది? అందుకే 1977లో మన శ్రీ పెద్ద జీయరు స్వామివారు ఆ క్షేత్రాన్ని సందర్శించినపుడు "మేల్కోట తిరునారాయణ పెరుమాళ్ ఆరాధన సమితి" అనే సంస్థ స్థాపించి కొంత మూలనిధిని ఏర్పాటు చేసి, దానితో ఆలయంలో ఆరాధన, ఆరగింపులకు అవసరమైన విధంగా ఏర్పాటు చేసినారు.

తదనంతరం శ్రీశ్రీశ్రీ చిన్న జీయరు స్వామివారి నేతృత్వంలో ఏర్పడ్డ ఈ సమితి ప్రస్తుతం ఈ బాధ్యతలతోపాటు ప్రతినిత్యం ఇతర ప్రాంతాలనుండి వచ్చే భక్తుల తదీయారాధనకు ఏర్పాటు చేసింది. కర్ణాటకలోని మన వికాసతరంగిణి సభ్యులుగూడ ఈ కైంకర్య బాధ్యతలను స్వీకరించారు.

ప్రస్తుత జ్ఞానమండపంలో భగవదారాధన దినదిన ప్రవర్ధమానమై నిత్య భగవదారాధనతోపాటు ప్రతినిత్యం క్షేత్రానికి వేంచేయుచున్న భాగవతోత్తములకు కూడా తదీయారాధన (సాపాటు) ఏర్పాట్లు మరియు వసతి ఏర్పాట్లు మరి 10సం॥ల తరువాత పెరిగే భక్తులకు తగినట్లుగ పెద్దస్థాయిలో మరొక నూతన జ్ఞానమండపం నిర్మాణమయినది. ఫిబ్రవరి 4వ తేదీన శ్రీ చిన్న జీయరు స్వామివారు "జీయరు శతాబ్ది జ్ఞానమండపం" ప్రారంభించారు.

శ్రీ పెద్ద జీయరు స్వామివారిచే సంకల్పించబడిన ఈ కార్యక్రమం ఈ జీయరు శతాబ్ది సంవత్సరాన్ని పురస్కరించుకొని ఆరంభించుటచే ఈ మండపానికి **జీయర్‌శతాబ్ది జ్ఞానమండపం**గ నామకరణం జరిగింది. ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకుందాం! ఈ దివ్యదేశాన్ని దర్శించి తరిద్దాం!!



19/D.T.P. systemD/G/Bn folder/Bn Mar11

# శ్రీశ్రీశ్రీ చిన్న జీయరు స్వామివారి ప్రచారవార్తలు



జనవరి 29వ తేదిన శ్రీస్వామివారు సీతానగరం వేంచేశారు. 30వ తారీఖు ఉదయం తీర్థగోష్ఠి అనంతరం శ్రీస్వామి వారు అనుగ్రహభాషణం చేస్తూ... ఉభయ వేదాంత ప్రవర్తకులు శ్రీమాన్ తె.కం. శ్రీగోపాలాచార్యస్వామివారి తిరునక్షత్రము సందర్భంగా ఆచార్యుల వైభవాన్ని వివరించారు. ఆయన ఓ మార్గదర్శకులు. దూరదృష్టి, విశాలదృక్పథంగల మేధావి. అంతేకాదు. అంతకంటే మహోన్నత వ్యక్తిత్వం మూర్తీభవించిన గురువులకు గురువు.

శ్రీ పెద్దజీయరు స్వామివారు రాజకీయాలలో ఆసక్తి కనబరుస్తున్న రోజులలో ధర్మరక్షణ కోసం రావలసిందిగా కోరడమే కాకుండా, వారిని ఒప్పించి మనకు ఒక మహాపురుషుణ్ణి అందించారు శ్రీ తె.కం. గోపాలాచార్య స్వామివారు. వీరు ఒకరి కొకరు తోడుగా వేదోద్ధరణకు, సమాజ ఉద్ధరణకు కంకణం కట్టుకున్నారు. శ్రీ పెద్ద స్వామివారిలోని సుగుణాలను, చొరవను గమనించిన శ్రీమాన్ గోపాలాచార్యస్వామి వారు వారిని లోకానికి మార్గనిర్దేశం చేయ మని, సంప్రదాయంలోనికి తీసుకువచ్చిన మహానుభావులు.

ఈ కార్యక్రమంలో శ్రీ అహోబిల స్వామివారు కూడా అనుగ్రహభాషణం చేశారు. శిష్యుల ప్రతిభాపాటవాల ద్వారా ఆచార్యుల వైభవం తెలుస్తుందని అన్నారు.

విశిష్ట అతిథిగా పాల్గొన్న శ్రీమాన్ కిడాంబి భక్తవత్సలంగారు మాట్లాడుతూ 'భగవద్రామానుజులవారి అపర అవతారమే శ్రీ పెద్దజీయరు స్వామివార"ని, "శ్రీ కూరత్తాళ్వార్ అవతారమే శ్రీ గోపాలాచార్య స్వామి వారి అవతార" మని వివరించారు.

శ్రీమాన్ ఉడయువర్లు స్వామి మాట్లాడుతూ... "శ్రీమాన్ గోపాలాచార్య స్వామివారు అనర్గళంగా సంస్కృతం, హిందీ, ఆంగ్లము మాట్లాడేవారని, పలు ప్రాంతాలలో పాఠశాలలను నెలకొల్పి, ఎందరినో శిష్యులను తయారు చేశారు. మన పిల్లలు కూడా చిన్నతనంలోనే సంస్కృతభాషలో మాట్లాడటం అనేది అలవాటు కావాలని ఆయన అన్నారు.

31వ తేదిన తీర్థగోష్ఠి అనంతరం ఏలూరులోని లైన్స్ క్లబ్‌వారి వార్షికోత్సవ కార్యక్రమంలో పాల్గొన్నారు. వివిధ జిల్లాలనుండి ప్రముఖులు విదేశీయులు పాల్గొని మన స్వామివారు చేసిన అనుగ్రహభాషణాన్ని ఆసక్తిగా విన్నారు. అక్కడ నుండి బయల్దేరి డా॥ ముక్కామల పార్థసారధిగారి గృహాన్ని సందర్శించి సీతానగరం చేరుకున్నారు.

ఫిబ్రవరి1వ తేది సీతానగరంలో శ్రీవారు తీర్థగోష్ఠి అనంతరం బెంగుళూరు మధ్యాహ్నం బయలుదేరి వెళ్ళారు.

**బెంగుళూరు:** శ్రీస్వామివారు 1వ తేది సాయంత్రం 4 గం.లకు విమానాశ్రయం





నుండి నేరుగా శ్రీమాన్ బింగి రమేష్ ఆహ్వానం మేరకు వారి విద్యుత్‌ఫ్యాక్టరీని సందర్శించడం జరిగింది.

నగరంలో వ్యర్థంగా పారేసే చెత్తను ఉపయోగించి విద్యుత్‌ను తయారుచేసే ఫ్యాక్టరీని శ్రీవారు, శ్రీ అహోబిల స్వామివారు సందర్శించారు. వచ్చిన బూడిదతో సేంద్రియ ఎరువులను తయారుచేసే ఒక యంత్రాన్ని శ్రీస్వామివారు శ్రీహస్తాల ద్వారా ఆరంభించారు. ఈ విధంగా విద్యుత్ తయారుచేసే ఫ్యాక్టరీని గతంలో ఎందరో ఆరంభించినప్పటికీ సఫలీకృతులు కాలేక పోయారు. వీరి ప్రయత్నం సఫలమవ్వాలని శ్రీస్వామివారు మంగళాశాసనాలు చేశారు. క్రొత్తగా తయారవుతున్న పవర్ ప్రాజెక్ట్‌ను ఆరంభించారు.

2వ తేదీ శ్రీమాన్ ఫణికుమార్ రెడ్డి, శ్రీమాన్ రాజుగార్ల గృహాలను సందర్శించి, మైసూరు జిల్లాలోని సుత్తూరు గ్రామంలో మహాశివరాత్రి స్వామి ఆహ్వానం మేరకు వారి ఆశ్రమాన్ని సందర్శించారు.

జెట్ చైర్మన్ శ్రీమాన్ గోకరాజు గంగరాజుగారి ఫామ్ హౌస్ మధుమలై అటవీప్రాంతంలో అందమైన ప్రకృతిఒడిలో రమణీయమైన పరిసరాల్లో నెలకొని ఉంది. ఆ ఫామ్‌హౌస్‌కు 2 వతేదీ రాత్రికి శ్రీస్వామి వారు చేరారు.

మరునాడు ఉదయం వన్యమృగ వీక్షణార్థం చుట్టుప్రక్కల ప్రదేశాలను పర్యటించారు. అక్కడ ప్రకృతి సిద్ధమైన ఆహ్లాదకరమైన వాతావరణం శ్రీస్వామివారిని, వారి పరివారాన్ని, వారిని అనుసరించిన భక్తులను ఎంతో ఆహ్లాదపరచింది. అనంతరం వేణ గోపాల స్వామిబెట్టలోని అక్కడి పెరుమాళ్ళను సేవించుకొని రాత్రి 7గం.లకు శ్రీస్వామివారు, శ్రీఅహోబిల స్వామివారు, పరివారంతో మేల్కోటకు చేరుకున్నారు.

3వ తేది రాత్రి మేల్కోటలో తిరు నారాయణపురం పెరుమాళ్ళను దర్శించుకుని వస్త్రాలను సమర్పించారు.

శ్రీమాన్ నడాదూర్ శ్రీనిత్యకృష్ణన్ (అట్లాంటా, యు.ఎస్.ఎ.) దంపతుల నూతన గృహంలో శ్రీస్వామివారు బసచేశారు.

4వ తేది మేల్కోటలో మన ఆశ్రమంలో భక్తుల సౌకర్యార్థం నూతన నిర్మిస్తున్న'జ్ఞానమండపం', అతిథిగృహ సముదాయాన్ని తెల్లవారుజామున 4గం.లకు శ్రీస్వామివారు ప్రారంభించారు. ఈ సందర్భంగా సుదర్శన హవన కార్యక్రమాన్ని నిర్వహించారు. ఇందులో వివిధ ప్రాంతాల నుండి విచ్చేసిన భక్తులు పాల్గొన్నారు. ఈ కార్యక్రమాన్ని నిర్వహించిన మేల్కోట తిరునారాయణ అన్నదాన సమితి సభ్యులు శ్రీమాన్ భద్రరావుగారు, శ్రీ సదాశివరెడ్డిగారు మొదలైన వారికి, అలాగే అతిథిగృహాలకు కైంకర్యాలు సమర్పించిన దాతలకు శ్రీస్వామివారు మంగళాశాసనాలు చేశారు.

స్థానికంగా ఉండే అర్చకస్వాములకు, వేదపండితులకు చందన వస్త్ర తాంబూలాలను శ్రీఅహోబిలస్వామివారు అందచేశారు.

సాయంత్రం 6గం.లకు శ్రీస్వామివారు బెంగుళూరు చేరుకుని శ్రీమాన్ టి.కె.రావు గారు (ఆయిల్‌పుల్లింగ్) గృహాన్ని సందర్శించి, వారి వివాహదిన సందర్భంగా మంగళాశాసనాలు అనుగ్రహించి రాత్రికి శంషాబాద్, శ్రీరామనగర్ చేరుకున్నారు.

5వ తేదిన శ్రీరామనగర్, శంషాబాద్ "జీవా" ప్రాంగణంలో హోమియో వైద్యశాలకు శ్రీస్వామివారు శంకుస్థాపన చేశారు.

6వ తేది కూకట్‌పల్లిలో శ్రీమాన్ చంద్రయ్య శ్రీస్వామివారి పేరుమీద నెలకొల్పిన పాఠశాలను ప్రారంభించారు.

9వ తేది సాయంత్రం మహబూబ్ నగర్‌జిల్లా, జడ్చర్ల మండలం, గంగాపురం చేరుకున్నారు. లక్ష్మీ చెన్నకేశవస్వామి దేవస్థానం ఛైర్మన్ శ్రీమాన్ జనార్దన్‌రెడ్డి, గ్రామ సర్పంచు శ్రీమాన్ అనంథరెడ్డి, శ్రీమాన్ కండెరెడ్డి గ్రామపెద్దలు శ్రీమాన్ విష్ణుమూర్తి బుచ్చిలింగం మరియు జిల్లా వికాసతరంగిణి కార్యవర్గంవారు శ్రీమాన్ వేంకట్‌రెడ్డిగారు, శ్రీమాన్ రాజశేఖర్‌రెడ్డి గారు, తుమ్మల బుచ్చయ్య గారు, వనపర్తి వి.టి. శ్రీనివాసులుగారు గ్రామభక్తులు, మంగళవాద్యాలమధ్య పూర్ణకుంభంతో శ్రీస్వామివారికి స్వాగతం పలికారు.

శ్రీశ్రీశ్రీ లక్ష్మీచెన్నకేశవస్వామి ఆలయం చేరుకున్నారు. రాత్రి 7గం.లకు సామూహిక లక్ష్మీనారాయణపూజలు చేయించి అనుగ్రహ భాషణం చేసి పాల్గొన్న భక్తులందరికి మంగళాశాసనము చేశారు.

10వ తేదీన తీర్థగోష్ఠి అనంతరం అక్కడ స్థానిక ప్రాచీన ఆలయాన్ని సందర్శించి, శిథిలావస్థలో ఉన్న కొన్ని విగ్రహాలను పరిశీలించి, వాటి పునర్నిర్మాణానికి తగు సూచనలు చేసారు.

తరువాత రథసప్తమి సందర్భంగా ''ఆదిత్య హృదయం'' సామూహిక పారాయణను శ్రీ చిన్నజీయరుస్వామివారు ఉపదేశాత్మకంగ అనుగ్రహించారు. శ్రీస్వామివారు అనుగ్రహభాషణం చేస్తూ.. "ఆదిత్యహృదయం పారాయణ చేయడం వలన బలహీనతతొలగి. శక్తి నిండుతుందని, శారీరక, మానసిక ఆరోగ్యంతోపాటు విజయాలు చేకూరతాయని" వివరించారు.

ఈ కార్యక్రమంలో శ్రీఅహోబిల రామానుజ జీయర్‌స్వామివారు పాల్గొన్నారు. అలానే స్థానిక ప్రముఖులు, మహబూబ్ నగర్, గంగాపురం వి.టి. సభ్యులు వైభవంగ జరిపించారు. సాయంత్రం మిడ్జల్ మండలం మాదారం గ్రామానికి చేరుకొని పురాతన రామాలయాన్ని సందర్శించారు.

మహబూబ్‌నగర్‌జిల్లా, మాదారం గ్రామభక్తులు మన దివ్య సాకేతానికి చక్కని సేవలనందిస్తున్నారు. గతంలో ఆ గ్రామాన్ని సందర్శించిన శ్రీఅహోబిల రామానుజ జీయర్‌స్వామివారిని, ఆ ఊరివారు పురాతన కోదండ రామాలయ జీర్ణోద్ధరణ విషయమై ప్రార్థించారు. ''అత్యంత ప్రాచీనమైన ఆలయ నిర్మాణ విషయంలో శ్రీశ్రీశ్రీ చిన్న జీయర్‌స్వామివారి సలహా తీసుకుని చేద్దాం" అని వారు చెప్పారు. ఊరివారి భాగ్య విశేషం ఈనాడు శ్రీస్వామివారు మాదారం భక్తులకోరికపై శ్రీ కోదండ రామాలయాన్ని సందర్శించి, ఆలయ జీర్ణోద్ధరణకై తగు సూచనలను అందించారు. అనంతరం





గంగాపురం మీదుగ రాత్రికి శ్రీరామనగర్ చేరుకున్నారు.

యాదగిరిగుట్ట ఆలయాధికారుల ఆహ్వానంపై శ్రీస్వామి వారు 12వ తేదీన రాత్రికి చేరుకున్నారు.

13వ తేదీ ఉదయం ద్వారపూజకి శ్రీస్వామివారు మంగళాశాసనంచేసి, ద్వారనిర్మాణ విషయంలో తగు జాగ్రత్తలు సూచించారు. అనంతరం హైదరాబాద్ మీదుగ షామీర్‌పేట్‌లోని శ్రీమాన్ పురుషోత్తంగారు నిర్వహించే శాంతినికేతన్ స్కూల్‌ని సందర్శించి, విద్యార్థులకు మంగళాశాసనాలను అనుగ్రహించారు.

14వ తేదీ భీష్మ ఏకాదశి సందర్భంగా సీతానగరంలో శ్రీస్వామివారు తీర్థగోష్ఠి జరిపారు. ఆ సందర్భంగా మన వేద విద్యార్థులు, ప్రపన్న వైశారది సారథ్యంలో ప్రవచనాన్ని చేశారు. శ్రీ అహోబిలస్వామి వారు భీష్మైకాదశి ప్రాముఖ్యాన్ని తెల్పారు. అనంతరం శ్రీవారు శ్రీ విష్ణు సహస్రనామ వైభవాన్ని అందించి సామూహికంగా శ్రీ విష్ణు సహస్రనామ పారాయణ జరిపారు.

సాయంత్రం గుంటూరులో గల గోరంట్ల శ్రీపద్మావతీ ఆండాళ్ సమేత శ్రీ వేంకటేశ్వరస్వామివారి నవమవార్షిక బ్రహ్మోత్సవాలలో స్వామివారు పాల్గొని కమిటీవారికి, అక్కడ స్థానికులకు మంగళాశాసనం చేశారు.

అక్కడి నుండి ప్రముఖవ్యాపారవేత్త, ఆధ్యాత్మికులు క్రేన్ వక్కపొడి అధినేత శ్రీమాన్ గ్రంధి సుబ్బారావుగారి 81వ పుట్టినరోజు సందర్భంగా గుంటూరులోని వారి స్వగృహానికి వారి కుమారులైన శ్రీమాన్ కాంతారావుగారి ఆహ్వానం మేరకు శ్రీ అహోబిల జీయరు స్వామివారితో కలసి శ్రీవారు వేంచేశారు.

108 దివ్యదేశాల చిత్రాలతో కూడిన వారి ఇంటి వరండాపైకప్పును స్వామివారు ప్రారంభించారు. శ్రీస్వామివారి పాద స్పర్శతో పునీతమై, పులకించి పోయింది ఆ ప్రాంగణమంతా. చూపరులకు అబ్బుర పరిచే రీతిలో కనీవినీ ఎరుగని విధంగా ఆ దివ్యదేశాల చిత్రాల ఛత్రచాయలో నిలబడిన ప్రతిఒక్కరూ పునీతులవ్వక తప్పదు. అనంతరం శ్రీస్వామివారు శ్రీమాన్ గ్రంథి సుబ్బారావుగారికి, వారి కుటుంబసభ్యులకు మంగళాశాసనాలు చేసారు.

అక్కడి నుండి శ్రీమాన్ గ్రంధి సుబ్బారావుగారి జన్మదిన వేడుక జరుగుతున్న విరాట్ క్రేన్ ప్రాంగణానికి చేరుకున్నారు. ఆ వేడుక ప్రాంగణమంతా ఒక పండుగ వాతావరణం నెలకొంది. రంగురంగుల విద్యుద్దీపాలతో అలంకరించారు. అందంగా అలంకరించిన విశాలమైన వేదిక, ఆ వేదికపై నెమలిపింఛ శోభితుడయై శంఖుచక్రాలతో, నగుమోముతో చూస్తున్న శ్రీనివాసుడు కొలువై వున్నాడు. ఆ వేడుక ప్రాంగణమంతా వేలాదిమందితో కళకళ లాడుతూ పలు సాంస్కృతిక కార్య క్రమాలతో అలరిస్తూ వుంది. శ్రీస్వామి వారు ఆ ప్రాంతానికి చేరుకోగానే పోటీ పడుతూ తారాజువ్వలు ఆకాశంలోకి ఆనందంగా ఎగిసెగిసిపడి మిరుమిట్లు గొలిపే కాంతులతో, మెరుపులతో, శబ్దాలతో స్వాగతం పలికాయి. రంగు రంగుల

విద్యుద్దీపాలతోరణాల గుండా శ్రీస్వామి వారు సభావేదికకు చేరుకున్నారు.

మన శ్రీస్వామివారితోపాటు, శ్రీఅహోబిల రామానుజ జీయర్‌స్వామి వారు, మాజీముఖ్య మంత్రి శ్రీమాన్ డా॥ కొనిజేటి రోశయ్య, శ్రీమాన్ అశ్వని సుబ్బారావు, శ్రీమాన్ గ్రంధి సుబ్బారావు లను సభావేదికపైకి శ్రీమాన్ గ్రంధి కాంతారావు ఆహ్వానించారు. అనంతరం శ్రీస్వామివారు జ్యోతిప్రజ్వలన కావించి కార్యక్రమాన్ని పారంభించారు. ఈ సంధర్భంగా "స్వీయ సాధనలో గ్రంధి సుబ్బారావుగారి క్రేన్ వక్కపలుకు" జీవిత చరిత్ర పుస్తకాన్ని ఆవిష్కరించారు.

శ్రీ స్వామివారు అనుగ్రహభాషణంలో "మట్టిలోనుంచే మణులు మాణిక్యాలు లభిస్తాయి. అలానే మామూలు మనిషిలోంచే మహనీయులు ఉద్భవిస్తూ ఉంటారు. వారి మాటలకు చేతలకు విలువలుంటాయి. క్రేన్ సుబ్బారావుగా ప్రసిద్ధి చెందిన శ్రీమాన్ గ్రంధి సుబ్బారావుగారు ఆ కోవకు చెందిన వారే! సామాన్య వ్యాపారిగా జీవితాన్ని ఆరంభించి, అనన్య సామాన్య వాణిజ్యవేత్తగా వెలుగొందుతున్న అనుభవపూర్ణులు. భావాన్ని వ్యక్తం చేయడంలో నిర్మొహ మాటం, పొగడినా, తెగడినా మనస్సుకు నచ్చినదే చెయ్యడం, దైవాన్ని, సంప్రదా యాన్ని విశ్వసించి అనువర్తించడంలో చిత్తశుద్ధి వివిధ గుణాలు సుబ్బారావుగారిని రాజర్షిగా తీర్చిదిద్దాయి. ఎన్నో ధార్మిక కార్య క్రమాలు దివ్యదేశాలలో యజ్ఞాల్లాంటి కార్యక్రమాలు చేసి ఘనత వహించారు. భగవద్దత్తమగు జీవితాన్ని ఆరోగ్య, ఆనంద, శాంతులతో గడపా"లని మంగళాశాసనం చేశారు. శ్రీఅహోబిల జీయరు స్వామివారు అనుగ్రహభాషణం చేసి మంగళాశాసనం చేశారు.

అక్కడి నుండి బయలుదేరి శ్రీస్వామి వారు గుంటూరు హైవే ప్రక్కనే ఉన్న "చిన్మయా విజయాశ్రమం"లో జరిగే వార్షి కోత్సవం కార్యక్రమానికి రాత్రి 11 గం॥లకు వేంచేశారు. అక్కడ శ్రీమాన్ ముక్కామల సుమతీ అప్పారావు దంపతులు శ్రీస్వామి వారిని, శ్రీ అహోబిల స్వామివారిని ఆహ్వానించారు. విద్యార్థులు శ్రీస్వామివారిని పాడుతూ కోలాటం చేస్తూ తోడ్కొని ప్రధాన మండపం వద్దకు తీసుకెళ్ళారు. శ్రీమాన్ అప్పారావు స్వాగతోపన్యాసం చేస్తూ... వేరు వేరు ప్రాంతాల నుండి ఇక్కడకు వచ్చి చేరిన 104మంది అనాథ బాలలు విద్యాబుద్ధు లను నేర్చుకుంటున్నార"ని తెలియజేశారు.

అనంతరం శ్రీస్వామివారు బాలల హృదయాలకు హత్తుకునే విధంగా వారి భాషలో వారితో కలసి భీష్మపితామహుని కథను చెప్పారు. మధ్య మధ్యలో స్వామి వారు అడిగిన ప్రశ్నలకు వెంటనే తడుము కోకుండా సమాధా నాలు కూడా చెప్పారు.

శ్రీమాన్ ముక్కామల అప్పారావు, సుమతిగార్లు అమెరికా నుండి ఇక్కడకు వచ్చి మీకోసం ఈ చల్లని నీడను కల్పించారు. మీరు మంచి భవిష్యత్తుకలిగి, గొప్ప వ్యక్తులుగా సమాజంలో వెలుగొందాలి" అని మంగళాశాసనం చేశారు.





అనంతరం శ్రీస్వామివారు అక్కడ ఉన్న టీచర్లకు, సిబ్బందిని అభినందించారు. ఆ ప్రాంగణంలో ఉన్న వివిధ భవన సము దాయాలను సందర్శించి అనంతరం సీతానగరం చేరుకున్నారు.

15వ తేది తీర్థగోష్ఠి అనంతరం శ్రీ కులశేఖరాళ్వార్ తిరునక్షత్ర వైభవాన్ని తెలియజేసారు. ఈ సందర్భంగా శ్రీ అహోబిలస్వామివారు కులశేఖరాళ్వార్ వైశిష్ట్యాన్ని తెలిపారు. ఆరోజు మధ్యహ్నం శ్రీవారు శ్రీరామనగర్ బయలుదేరారు.

16వ తేది ముచ్చింతల్‌లో శ్రీసీతా రామచంద్రస్వామివారి నూతన ఆలయ విగ్రహ ప్రతిష్ఠ కార్యక్రమంలో పాల్గొన్నారు.

19న B.H.E.L.లో శ్రీ వేంకటేశ్వర స్వామి ఆలయం సందర్శించారు. అనంత రం కవిగారి కుమారులైన శ్రీమాన్ గుదిమెళ్ళ బదరీనాథ్ ఆహ్వానం మేరకు వారి గృహానికి వేంచేసి సోదరులకు, కుటుంబ సభ్యులకు మంగళాశాసనం చేశారు.

20న వి.టి. వనస్థలిపురంలోని ఆలయాన్ని సందర్శించారు.

21న జీవాప్రాంగణంలో ఇందిరా గాంధీ నేషనల్ ఓపెన్ యూనివర్శిటీ వారి సౌజన్యంతో జీవా కమ్యూనిటీ కాలేజీ ప్రారంభోత్స కార్యక్రమంలో పాల్గొన్నారు.

సాయంత్రం బయలుదేరి సింహాచలం చేరుకున్నారు. సింహాచలంలో జరిగే కోటి తులసి పూజాకార్యక్రమంలో పాల్గొని మరునాడు సాయంత్రం శంషాబాద్ చేరు కున్నారు.

24న తీర్థగోష్ఠి అనంతరం ప్రకాశం జిల్లాలోని సంతరావూరు శ్రీచెన్నకేశవ స్వామి ఆలయ ప్రతిష్ఠ కార్యక్రమం నిమిత్తం బయలుదేరివెళ్ళారు.

25వ తేదీన స్థానిక భక్తులచే శ్రీలక్ష్మీ నారాయణ పూజలు గావించేశారు.

26వ తేది సంతరావూరులో భక్తులకు సమాశ్రయణములుచేసి మధ్యాహ్నం నెల్లూరువెళుతూ మార్గమధ్యంలో ఉప్పు గూడూలో శ్రీమతి నాగలక్ష్మి అనే వృద్ధు రాలికి శ్రీ స్వామివారు మంగళాశాసనం చేశారు. అక్కడినుండి పోతిరెడ్డిపాలెంలో చేరుకున్నారు. అక్కడ కోదండరామాలయ ప్రతిష్ఠాపన గావించారు.

శ్రీ స్వామివారు నృసింహకొండలో గల మన ఆశ్రమాన్ని సందర్శించి అక్కడి కార్యక్రంలో పాల్గొని భక్తులకు మంగళా శాసనాలుచేశారు, అక్కడ నుండి పెంచలకోన చేరుకున్నారు.

28న పెంచలకోనలో యాగ పూర్ణా హుతి కార్యక్రమంలో పాల్గొన్నారు. అక్కడ నుండి సోమశిలకు చేరుకున్నారు. అక్కడ వున్న మన ఆశ్రమం అభివృద్ధి మొదలైన విషయాలకు సంబంధించి తగు సూచనలు చేశారు. అక్కడ నుంచి నేరుగా సీతానగరం బయలుదేరారు. మార్గమధ్యంలో మార్కాపురంలోగల మన జ్ఞానవికాస్ కేంద్రాన్ని సందర్శించారు. అర్థరాత్రికి సీతానగరం చేరుకున్నారు.

మార్చి 1 వ తేదీన గోపాలోపాయన పురస్కార మహోత్సవంలకార్యక్రమంలో శ్రీ స్వామివారు పాల్గొన్నారు.

## 20వ శతాబ్ది యుగపురుషులు
## శ్రీమాన్ గోపాలాచార్యస్వామి

మన సంప్రదాయ ప్రచారానికి 20వ శతాబ్దంలో ఉద్భవించి మనసంప్రదాయాన్ని ప్రచారంచేసి ఎందరినో ప్రభావితంచేసిన యుగపురుషులు శ్రీమాన్ తె.కం. గోపాలా చార్యస్వామివారని శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న రామానుజ జీయర్‌స్వామి వారన్నారు.

మహావిద్వాంసులైన వీరు ఉత్తర దేశంలో మహాపండితులను మెప్పించారు. దక్షిణ దేశంలోని పండితులను సఖులుగా చేసుకోగలిగారు. వీరు అవిశ్రాంత ఆచార్య లేకాక అవిశ్రాంత శిష్యులుగానే చివరివరకు గడిపారని శ్రీ స్వామివారు తెలియజేశారు.

ఖమ్మం పట్టణంలో 30-1-2011 నాడు శ్రీమాన్ తే.కం. గోపాలాచార్య స్మృత్యర్థం సమర్పించే "ఆచార్య వరివస్య - గోపాలోప్తాయన పురస్కార" ఉత్సవం జరగ వలసివుంది. అవార్డు గ్రహీతలిరువురికి ఏర్పడ్డ శారీరక అసౌకర్యాలవల్ల ఆ కార్య క్రమం మార్చి 1న సీతానగరంలోని వేద విశ్వవిద్యాలయ ప్రాంగణంలో జరపవలసి వచ్చింది.

ఈ పురస్కారాన్ని న్యాయవేదాన్త విద్వాన్ శ్రీ ఉ.వే. శ్రీమాన్ ఈయుణ్ణి రంగా చార్య స్వామి ( అంతర్వేది) వారికి భక్తినివేదన సంపాదకులు శ్రీ ఉ.వే. శ్రీమాన్ టి.పి. రామ చంద్రాచార్యస్వామి (సింహాచలం) వారికి శ్రీ స్వామివారు అందజేశారు, శ్రీ గోపాలాచార్య స్వామి పేరిట ఏర్పాటు చేసిన ఈ పురస్కారం తమకు లభించటం విశేషంగా భావిస్తు న్నామని సమ్మానగ్రహీతలు పేర్కొన్నారు.

శ్రీమాన్ ఈయుణ్ణి స్వామివారు మాట్లాడుతూ తమ విద్యార్థి దశనుంచి శ్రీమాన్ గోపాలాచార్యస్వామి తెలుసునని వారితో ఉన్న అనుబంధాన్ని వివరించారు.

శ్రీమాన్ టి.పి రామచంద్రాచార్యస్వామి వారు మాట్లాడుతూ లౌకిక వేషభాషలతో వుండే నన్ను కాంతాసమ్మిత సందేశంతో వైదిక స్వరూపంలో సభల్లో పాల్గొనేట్లు ఒక క్రమ పద్ధతిలో తీర్చిదిద్దిన మహనీయులు గోపాలా చార్యులవారని కృతజ్ఞతను సమర్పించారు.

ఈ గోపాలోపాయన పురస్కార కార్యక్రమానికి శ్రీశ్రీశ్రీ అహోబిల రామానుజ జీయరు స్వామివారు అధ్యక్షత వహించగా, శ్రీ ఉ.వే.శ్రీమాన్ డా॥ సముద్రాల వేంకట రంగరామానుజాచార్యస్వామివారు కార్య క్రమాన్ని నిర్వహించారు.

శ్రీ ఉ.వే. శ్రీమాన్ ఉడయవర్లు స్వామి, గోపాలాచార్యుల వారితో ఉన్న పరిచయాన్ని వివరించారు.

అలాగే కైంకర్యపరులు శ్రీమాన్ కొల్లా నాగేశ్వరరావు దంపతులు, శ్రీమాన్ పుల్ల ఖండం రమేష్ దంపతులు, శ్రీమాన్ కర్లపాటి ఆదినారాయణ దంపతులకు శ్రీస్వామివారు మంగళాశాసనాలు చేశారు.

ఈ కార్యక్రమంలో భాగంగా గోపాలా చార్య స్వామివారి కుమార్తె శ్రీమతి తూపురాణి వేంకట చూడామణిగారు సమర్పించిన **"గోపాలోపాయనమ్"** సంక్షిప్త చరిత్ర గ్రంథాన్ని శ్రీ స్వామివారు ఆవిష్క రించారు.

ఈ కార్యక్రమంలో శ్రీమాన్ ఈయుణ్ణి సింగరాచార్యస్వామి, శ్రీమతి జానకిగారు, శ్రీమాన్ జి. కూర్మనాథ్, శ్రీమతి గోదాదేవి, శ్రీమతి అరుణ, శ్రీమాన్ శఠగోపాచార్య స్వామి, శ్రీ తె.కం. గోపాలాచార్య స్వామివారి విశిష్టవ్యక్తిత్వాన్ని స్మరించు కున్నారు.



## శ్రీశ్రీశ్రీ అహోబిల రామానుజ స్వామివారి ప్రచారవార్తలు



ఫిబ్రవరి 5వ తేది నుండి 15వ తేదీ వరకు శ్రీమాన్ జి.ఎస్.ఎన్.రాజుగారి ఆహ్వానం మేరకు విజయవాడలోని ముత్యాలంపాడు శ్రీపట్టాభిరామాలయంలో స్థానిక భక్తుల కోరిక మేరకు, సుదర్శన శతక ప్రవచనాన్ని అందజేశారు. ఈ సందర్భంగా మల్టీమీడియాలో తయారు చేసిన తిరుప్పావై, ఆచార్య-శిష్య లక్షణాలు, జీవుని పరమపద యాత్ర మొదలైన అంశాలపై వీడియో ప్రజంటేషన్ ఏర్పాటు చేశారు. ఈ కార్యక్రమానికి భక్తులు విశేషంగ పాల్గొన్నారు.

17వ తేదీ సోమవారం సాయంత్రం జహీరాబాద్ చేరుకున్నారు. అక్కడ శ్రీమాన్ అల్లాడి వీరేశంగారి ఇంట్లో బసచేశారు. మరునాడు తీర్థగోష్ఠి అనంతరం 18వ తేదీనాడు జహీరాబాద్‌లోని మహేంద్ర కంపెనీవారి నిర్వహణలో సాగే శ్రీ వేంకటేశ్వరస్వామి సన్నిధిలో శ్రీసుదర్శన - నారసింహ యాగాన్ని నిర్వహించారు. ఈ యజ్ఞకార్యక్రమంలో 300 మంది దంపతులు పాల్గొన్నారు. అక్కడి వి.టి. సభ్యులు విచ్చేసిన భక్తులకు విశేష తదీయారాధన ఏర్పాటు చేశారు.

అక్కడ నుండి శ్రీ అహోబిల స్వామివారు బయలుదేరి కర్ణాటకలోని బీదర్‌కు వేంచేశారు. అక్కడి స్థానిక వికాస తరంగిణి సభ్యులు శ్రీమాన్ ప్రభాకర్ గృహంలో బసచేశారు. అలాగే బయలుదేరి జనగాం శ్రీమాన్ కృష్ణమాచార్య(సిద్ధాంతి) స్వామి ఆహ్వానం మేరకు రాత్రి 9.30కు జనగాంలోని శ్రీ సరస్వతీ ప్రతిష్ఠాపన మహోత్సవంలో పాల్గొని ప్రవచనం అంద జేశారు.

రాత్రి ఆలస్యం అయినప్పటికీ భక్తులు వేచియున్నారు. వారి శ్రద్ధకు శ్రీస్వామివారు మంగళాశాసనాలు అందజేసి, సీతానగరం చేరుకున్నారు.

19వ తేది మధ్యాహ్నం ప్రకాశం జిల్లా మంగసముద్రంలోని పాలెంకు చేరు కున్నారు.

20 తేది ఉదయం నూతనంగ నిర్మించబోయే రామాలయ శంకుస్థాపనలో పాల్గొన్నారు. ఆ సందర్భంగా సుదర్శన- నారసింహ యాగం నిర్వహించారు. భక్తులకు, దేవాలయాల ఆవశ్యకతను వివరించారు. ఆ సందర్భంలో లింగ సముద్రంలోని స్థానిక శ్రీ వేంకటేశ్వర స్వామి ఆలయ కళ్యాణమండప శంకుస్థాపనలో పాల్గొన్నారు.

21వ తేది శంషాబాద్ చేరుకొని శ్రీరామనగర్, "జీవా కమ్యూనిటీ కాలేజ్" ప్రారంభోత్సవంలో పాల్గొన్నారు. రాత్రికి రాజమహేంద్రి బయలుదేరారు.

22వ తేది ఉ॥ తీర్థగోష్ఠి జరుపుకొని మందస బ్రహ్మోత్సవాలకు బయలుదేరి, మార్గమధ్యంలో విజయనగరం జిల్లాలో గరివిడి శ్రీమాన్ సోమయాజిగారిచే

నిర్వహించబడే సంవత్సర కాలం పాటు జరిగే "సత్రయాగం"లో పాల్గొని యాగ వైభవాన్ని వివరించారు. అక్కడ నుండి రాత్రి 1గం. మందస చేరుకున్నారు.

23నుండి25 తేదీ వరకు మందసలో జరిగిన "శ్రీవాసుదేవ పెరుమాళ్ బ్రహ్మోత్స వాలు", తిరువీధి ఉత్సవాలు విశేషంగా జరిగాయి. ఈ సందర్భంగా మందస ఆలయంలో భక్తుల సౌకర్యార్థం నిర్మితమైన ఒక గదిని, కార్యాలయాన్ని శ్రీస్వామివారు ఆరంభించారు. శ్రీ చిన్నజీయరు స్వామి వారి మంగళాశాసనాలతో మందసగ్రామం ఒక ఆదర్శగ్రామంగాదేశంలోఉందనటంలో సందేహంలేదు. ఎందుకంటే గ్రామంలో 26 వీధులున్నాయి. ఒక్కో వీధికి ఒక్కోపేరు చొప్పున కేశవవీధి, నారాయణ వీధి లాంటి మొదలైన పేర్లు పెట్టారు. వాటిని స్థానిక పురప్రముఖులతో ఆవిష్కరింపచేశారు. అలాగే వీధికొక చెత్తబుట్ట (డస్ట్‌బిన్)ను ఏర్పాటుచేసి పరిశుభ్రత నెలకొల్పారు. మందస గ్రామ ప్రెసిడెంట్ శ్రీమాన్ తిరువతయ్య శ్రీస్వామివారి ఆదేశం ప్రకారం ప్లాస్టిక్ కవర్లు, సంచులు వాడితే 500/-లు జరిమానా విధిస్తామని, దానివల్ల వచ్చే ధనాన్ని వాసుదేవ పెరుమాళ్ళ సేవలో వినియోగిస్తామన్నారు.

అలాగే ఇంటికొక మొక్కచొప్పున ఇవ్వటానికి పర్యావరణ పరిరక్షణకై ప్రతి ఒక్కరు వారి ఇంటిముందు మొక్కను నాటి దాన్ని పరిరక్షించాలని తీర్మా నించారు. ఇలా అనేక ఆదర్శాలతో ఆ గ్రామం ముందుకు నడుస్తోంది.

25వ తేదిరాత్రి శ్రీమాన్ ఘంటసాల పవన్‌కుమార్(విజయవాడ) బృందంచే నాట్య ప్రదర్శన జరిగింది. రింగునృత్యం, ఘటం నృత్యం, మేకుల మీద నృత్య ప్రదర్శనలు చేసి అందరినీ అలరించారు. ఈ కార్యక్ర మాన్ని అశేష భక్తులు తిలకించి, కళాకారులను ప్రశంసించారు. ఈ కార్యక్రమ అనంతరం గరుడ వాహ నం మీద వాసుదేవ పెరుమాళ్ మందస పురువీధులలో, ఆలయం ప్రక్కనేగల

మందసగ్రామంలో జరిగిన "శ్రీవాసుదేవ పెరుమాళ్ బ్రహ్మోత్సవాలు", తిరువీధి ఉత్సవాల దృశ్యాలు





గోపాలసాగరంలో విశేషంగా ఏర్పాటు చేసిన తెప్పలో విహరించారు.

ఈ బ్రహ్మోత్సవాలలో వేలాది మంది భక్తులు పాల్గొనటం జరిగింది.ఆ రాత్రి బయలు దేరి తెల్లవారు ఝామున రాజమహేంద్రికి చేరుకొని తీర్థగోష్ఠి అనంతరం ప్రకాశం జిల్లాలోని సంతరావూరు చేరుకున్నారు.

27వ తేదీన సంతరావూరులోని "శ్రీలక్ష్మీచెన్నకేశవస్వామి ఆలయప్రతిష్ఠ" జరిపి సాయంత్రం అక్కడి వి.టి. సభ్యులు శ్రీమాన్ ధర్మారావు ఆహ్వానం మేరకు మేదరుమెట్ల చేరుకొని సామూహిక లక్ష్మీ పూజ కార్యక్రమాన్ని నిర్వహించి రాత్రికి సీతానగరం ఆశ్రమానికి చేరుకున్నారు

# పరమపదము



పుల్లడిగుంట వాస్తవ్యులు **శ్రీమాన్ పాలేటి నాగేశ్వరరావు**గారు ది. **1-1-2011**న పరమపదం చేరినారు. వీరు శ్రీ పెద్ద జీయరు స్వామివారి శిష్యులు. వీరు పెద్దస్వామివారు నిర్వహించిన అనేక కార్యక్రమాలలో తమవంతు సేవలు అందించేవారు.

వీరికి పరమాత్మ పదసన్నిధిలో శాశ్వత కైంకర్యం లభించాలని శ్రీస్వామివారు మంగళాశాసనములు చేశారు.



విజయవాడ వాస్తవ్యులు **శ్రీమతి బచ్చు వెంకట రమణాబాయి** గారు ది. **28-1-2011**న పరమపదం చేరినారు.

వీరికి పరమాత్మ పదసన్నిధిలో శాశ్వత కైంకర్యం లభించాలని శ్రీస్వామివారు మంగళాశాసనములు చేశారు.



విజయవాడ వాస్తవ్యులు **శ్రీమాన్ సూరపనేని సీతారామానుజదాసు** గారు ది. **6-2-2011** పరమపదం చేరినారు.

వీరికి పరమాత్మ పదసన్నిధిలో శాశ్వత కైంకర్యం లభించాలని శ్రీస్వామివారు మంగళాశాసనములు చేశారు.



కృష్ణాజిల్లా, కొండపల్లి వాస్తవ్యులు **బొర్రా జయలక్ష్మి**గారి ప్రథమ వర్ధంతి **27-3-2011**న జరుపుకొనుచున్నారు.

వీరి కుటుంబ సభ్యులు భక్తినివేదనకు ప్రోత్సాహక కైంకర్యము సమర్పించినారు.

శ్రీమతే నారాయణాయ నమః

శ్రీమతే రామానుజాయ నమః



64 సం॥ల నుండి అశేష భగవద్బంధువులు ఆదరిస్తున్న...

ఆధ్యాత్మికమాసపత్రిక

# భక్తినివేదన



శ్రీఖరనామ సంవత్సర చైత్రమాసము

## పండుగలు- ఏప్రియల్

4. శ్రీ ఖరనామ సంవత్సర ఉగాది వసంత నవరాత్రారంభం, పెరియ పెరుమాళ్ తిరు ॥
8. మత్స్య జయంతి, లక్ష్మీ పంచమి, నంబెరుమాళ్ తిరు॥
12. సర్వేషాం శ్రీరామనవమి, భద్రాచలాది శ్రీ వైష్ణవ క్షేత్రములందు శ్రీరామనవమి కళ్యాణోత్సవములు.
14. సర్వేషాం ఏకాదశి, అశ్వనీ కార్తె, మేషసంక్రమణం ప. 2-23, తమిళ వత్సరాది
15. వామనద్వాదశి
16. తిథి ద్వయం, అనంగ త్రయోదశి
17. పూర్ణిమాతిథి
18. మధురకవి ఆళ్వార్ తిరు॥, హనుమద్విజయోత్సవం
23. గురుమౌఢ్య నివృత్తి
28. భరణీకార్తె, సర్వేషాం ఏకాదశి
30. త్రిద్యుస్పృక్

## మే

1. మాస శివరాత్రి
2. పిండపితృయజ్ఞం
3. అమావాస్య
4. వాస్తు కర్తరీ ప్రారంభం, ఉయ్యక్కొండార్ తిరు॥
5. తదియ తిథి, పరశురామ జయంతి
6. అక్షయ తృతీయ, సింహాచలంలో చందనోత్సవం
7. పంచమి తిథి, భగవద్రామానుజ జయంతి


సంపుటి 64 ఏప్రియల్

సంచిక 1 2011


వ్యవస్థాపకులు

పరమహంస పరివ్రాజకాచార్య

**శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జీయరుస్వామివారు**

అశేష భక్త పాఠకబృందానికి

**శ్రీ ఖర నామ నూతన సంవత్సర శుభాకాంక్షలు**

సంపాదకులు

శ్రీఉ.వే.శ్రీమాన్ T.P. **శ్రీరామచంద్రాచార్యులు**

## విషయ సూచిక




Printed & Published by H.H. Tridandi Chinna Srimannarayana Ramanuja Jeeyar Swamiji on behalf of **Jeeyar Educational Trust** and Printed at **Sriman Printers & Processors** C/o JET, Sitanagaram-522 501, Guntur Dist., Andhrapradesh. **Published at** C/o JET, Sitanagaram-522 501 Guntur Dist, Andhrapradesh, Editor: Sri **T.P.Sriramachandracharya** S/o. Sri Sitaramacharyulu, No: 5-74, Ayodhya, Visakhapatnam- Andhra Pradesh.


చందావివరాలు :- సంవత్సరచందా రూ.50/-

జీవితచందా రూ. 500/-,

విదేశాలకు సంవత్సరచందా $30/-

క్రొత్తగా సంవత్సర చందాదారులుగా చేరువారు సభ్యత్వ నమోదు, రూ.30/-లు (విదేశాలకు $5) అదనంగా చెల్లించవలెను. ఆపై ప్రతి సంవత్సరం సకాలంలో వార్షిక చందా చెల్లించిన చాలు.


మీ సేవలో....

భక్తినివేదన, సీతానగరం - 522 501,

గుంటూరు జిల్లా,

ఆంధ్రప్రదేశ్. 08645 272929.

E-mail : **jetsitanagaram@yahoo.com** Internet : www.chinnajeeyar.org



D.T.P. & Design by : పరిశోధనాలయమ్, ముద్రణ : శ్రీమాన్ ప్రింటర్స్ & ప్రాసెసర్స్, సీతానగరం

ఉగాది శుభాకాంక్షలు

జై శ్రీమన్నారాయణ!

శ్రీశ్రీశ్రీ పెద్ద జీయర్ స్వామివారు స్థాపించిన **"భక్తినివేదన "** ఆధ్యాత్మిక మాసపత్రిక మీ ఆదరాభిమానాలే కొండంత అండగా **64** వసంతాలుగా వెలువడుతోంది.

**శ్రీశ్రీశ్రీ చిన్న జీయర్ స్వామివారి మంగళాశాసనాలతో**

ఈ ఏప్రిల్ సంచిక నుండి **"భక్తినివేదన"**

**1/4** ఈ డెమ్మీ సైజులో వెలువడుతోంది. అందుకోండి!

ఈ శుభసమయంలో మీ కందరకు **శ్రీ "ఖర"నామ సంవత్సర ఉగాది శుభాకాంక్షలు** తెలుపుతున్నాం. ఈ నూతన వత్సరంలో మరింత వినూత్నమైన శీర్షికలతో ఆధ్యాత్మిక విజ్ఞానాన్ని పంచడానికి మీ ముందుకు రాబోతోంది. తెలుగులోనే కాక, ఇంగ్లీషులో కూడ వెలువడుతున్న మన పత్రిక ఈ నవవత్సరంలో భగవద్రామానుజ జయంతి మే 7వ తేదీన హిందీ భాషతోకూడ ఆస్తికలోకానికి అందేందుకు సిద్ధమౌతోంది. జిజ్ఞాసువులందరికీ ఇదొక మంచి కానుక! బంధుమిత్ర సపరివారంగా చదవండి. చదివించండి.

-మీ భక్తినివేదన

## శ్రీరామసేవ

మన శ్రీశ్రీశ్రీ పెద్దజీయర్‌స్వామివారి స్ఫూర్తితో, అందరూ సంపూర్ణ శ్రీరామాయణ పారాయణం చేసిన ఫలితాన్ని పొందేవీలుగ ఓ సులభపద్ధతిని మన విజయనగర వికాసతరంగిణి కార్యకర్తలు అందిస్తున్నారు.

మన కార్యకర్తలు 6 కాండలనుండి 6 ముఖ్యమైన సర్గలను ఎన్నుకొని, శ్రీరామాయణ పారాయణసారం అందిస్తున్నారు. ఈ సర్గలను వీలయినన్ని దినాలు రోజుకొక సర్గ పారాయణగ, సమూహములుగ కలసి చేయాలని ఆత్మోజ్జీవనంతో పాటు, లోకక్షేమం, ప్రశాంత సహజీవనము ఇందుకు లక్ష్యాలు కావాలని ఆశిస్తున్నారు. ఇదో అద్భుతమైన విన్యాసం.

ఇలా పారాయణచేసిన ప్రతిఒక్కరూ సర్గకు రూ. 11 చొప్పున శ్రీరామునికి సమర్పించుకునేలా ఏర్పాటుచేసారు. దీనిని మీమీ వికాసతరంగిణి కేంద్రాలలో అందజేయండి. ఇలా సేకరించిన నిధితో భద్రాచలంలోని మన **"జీయర్‌మఠం"** పునరుద్ధరణ, తదీయారాధన కైంకర్యానికి సమర్పించాలనుకుంటున్నారు. భగవద్బంధువులందరూ ఈ కైంకర్యములో పాల్గొని ఐహికాముష్మిక ఫలాన్ని పొందగలరని ఆహ్వానిస్తున్నాం!

### భద్రాద్రిలో మహాసామ్రాజ్య పట్టాభిషేకము

**శ్రీశ్రీశ్రీ స్వామివారు భద్రాచలంలో 4-4-2011 నుండి 13-4-2011 వరకు జరిగే పుష్కర పట్టాభిషేక మహోత్సవాలలో వేంచేసి ఉంటారు.**

*పరమహంస పరివ్రాజకాచార్య*

**శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయర్‌స్వామివారి**

*ప్రత్యక్ష పర్యవేక్షణలో....*

## దివ్యసాకేత రాముని

# వసంతోత్సవాలు

**ఉగాది నుండి శ్రీరామనవమి వరకు 9 రోజులు సుందరకాండ పారాయణ, శ్రీసీతారామ కళ్యాణము**

**13-4-11 నుండి 18-4-2011 వరకు**

**వేదిక: శ్రీరామనగర్, ముచ్చింతల్, శంషాబాద్.**

నిత్యకార్యక్రమాలు

తోటలోకి వేంచేపుచేసి....

1. **పరిమళ ద్రవ్యాలతో శ్రీ సాకేతరామునికి స్నపనం**
2. **రోజూ ప్రత్యేక పుష్పములతో స్వామికి అర్చన**
3. **వివిధ ఫలముల నివేదన**
4. **సాయంత్రం ప్రవచనగోష్ఠి, సాంస్కృతిక కార్యక్రమాలు**

**నవవసంతంలో సాకేతరాముని సేవలో అందరూ భాగస్వాములు కండి! తరించండి!!**

కైంకర్య వివరాలకు:

**95535 49971, 95535 49972, 98497 41335, 93475 81218**

E-mail: divyasaketham@chinnajeeyar.org.

# శ్రీశ్రీశ్రీ స్వామివారి "ఖర" నామ సంవత్సర ఉగాది మంగళాశాసనములు

ప్రియ భగవద్బంధువుల్లార!
శ్రీమతే నారాయణాయ నమః!
అనేక మంగళాశాసనములు!

శ్రీ'ఖర' నామ సంవత్సరంగ మనమధ్య అవతరించిన కాల స్వరూపుడైన భగవానునికి ప్రేమార స్వాగతం పలుకుదాం! గతానికి వీడ్కోలు చెబుదాం! **'కర్మణ్యేవాధికారస్తే'** అని భగవద్గీతలో ఆదేశించినట్లు ఒక్కొక్కరిని కొన్ని బాధ్యతలతో భగవంతుడు ఈ లోకానికి పంపాడు. మననుండి ఆ శ్రియఃపతి ఆశించేవాటిలో కొన్నైనా పూర్తి చేయగలిగే శక్తిని తానే మనలో నింపి, తనసేవగా ఈ క్రొత్త సంవత్సరాన్ని మనకందించుగాక!

**"ఖ"** అంటే భగవంతుడు. **"ర"** అంటే ప్రకాశించే తత్త్వం. **"ఖర"** అంటే అంతటా నిండి ప్రకాశించే తత్త్వము అనీ, **ఖం-** భగవంతుని **రాతి-** అందించేది అనికూడ అర్థము. **"ఖే రమతి ఇతి ఖరః"** హృదయాకాశంలో రమిస్తూ ప్రకాశించే తత్త్వమైన అంతర్యామి అని కూడా మనం భావన చేయవచ్చు. ఆ ప్రకాశాన్ని మనం గుర్తించగలగాలంటే ఆయన దయ మనయందు ప్రకాశించాలి. తదనుగుణమైన విశుద్ధజ్ఞానం మనలో ప్రకాశించాలి. దానికి ముందుగా మనం "ఖర వత్సర రూపంలో భగవంతుడు అనుక్షణం తన సన్నిధానాన్ని మనకనుగ్రహిస్తూ, మన సుఖదుఃఖాది అనుభవాలన్నిటిలో మనకండగా సాక్షిభూతుడుగా మన హృదయంలో నిలుస్తున్నాడు" అని విశ్వసించాలి.

ఒక జన్మనెత్తి ఈ ప్రకృతిలోకి వచ్చిన మనమంతా కాలప్రభావానికి లోనుకావలసిన వాళ్ళమే! కాలానుగుణమైన పరిణతిని, పక్వతని పొందవలసిన వాళ్ళమే! కర్మానుగుణంగా కాలప్రవాహంలో ఎన్నో అనుభవాలు ఎదురౌతాయి. అన్నిటినీ అనుభవిస్తూ గుర్తుంచుకోవలసిన వాటిని మాత్రమే గుర్తుంచుకుంటూ, నేర్చుకోవలసిన వాటిని నేర్చుకుంటూ, వదలవలసిన వాటిని వదులుకోగలిగితేనే, జీవనయానం సుఖవంతమౌతుంది.

ఈ ప్రకృతిలో అన్నీ త్రిగుణాత్మకములైనట్లే. ఈ కాలం కూడా మనలో ఈ మూడు గుణాలకి ప్రేరణ కలిగించే సామర్థ్యం కలిగి వుంది. కాలప్రభావం చేత భౌతిక ప్రకృతిలో వసంత గ్రీష్మాది ఋతువులు ఏర్పడినట్లే మానస ప్రకృతిలో కూడా ఋతువులు మారి మారి వస్తుంటాయి. వసంతం పచ్చదనంతో ఆహ్లాదాన్ని కలిగిస్తుంటే, గ్రీష్మం ఎండతీవ్రతతో తపింపచేస్తుంది. వర్షఋతువు వర్షిస్తూ బురద చేసినా సస్యాలకి తగినట్లు భూమికి పదునుతెస్తుంది. శరదృతువు స్వచ్ఛమైన వెన్నెల కాంతులను ప్రసరిస్తుంది. హేమంత ఋతువు గ్రీష్మ వర్ష ఋతువులలో పడిన ఇబ్బందులను మరచిపోయేట్లు ఫలసాయాన్ని మనకందిస్తుంది. శిశిర ఋతువు ఆకులన్నీ రాల్చి తిరిగి నవవసంతానికి సన్నద్ధమౌతుంది.

ఇలానే కాలప్రభావం మన మానస ప్రకృతిలో కూడా ఋతువులు మారి మారి వచ్చేట్టు చేస్తుంది. గతం నుండి పాఠాలు నేర్చుకున్న మనస్సు కొత్తకొత్త ఆశలతో, సంకల్పాలతో చిగురిస్తున్న నవవసంతంలా ఆహ్లాదంగా ఉంటుంది. కష్టాలనే ఎండలతీవ్రతకి మండిపోతున్న గ్రీష్మంలా తయారవుతుంది. దుఃఖాలనే వృష్టిలో చిత్తడి చిత్తడిగా చికాకుగా ఉంటుంది చిత్తం. కాస్త ఆ దుఃఖం గట్టెక్కామా మబ్బులు లేని శరత్‌చంద్రుని వెన్నెల కాంతిలాంటి స్వచ్ఛతతో దురాశలూ, దురూహలూ లేక విశుద్ధమై ప్రకాశిస్తుంది బుద్ధి. ఫలితం చేతికందిందా పడిన కష్టాలను మరిచి పుష్కలమైన ఆనందంతో హేమంతంలా సమృద్ధంగా ఉంటుంది మనస్సు. సమృద్ధితో కూడిన ఆనందానుభవాలన్నీ అయ్యాక మంచి, చెడుల తూకంలో వదలవలసిన వాటిని వదల్చుకొని ఆకులు రాల్చిన శిశిరంలా మరొకస్థాయిలో నవవసంత పునరాగమనానికి సన్నద్ధమౌతుంది.

ఇలా చక్రగతిలో పయనించేకాలం ఇలా ఒక్కొక్కమారు ఒక్కొక్క గుణాన్ని మనలో ప్రేరేపిస్తుంది. తదనుగుణమైన ప్రవృత్తితో ఆయా అనుభవాలని పొందేట్టు చేస్తుంది. గడచిన "వికృతి" నామ సంవత్సరము పేరుకి తగినట్లుగానే (వికారము=మార్పు) అనేక మార్పులను తీసుకొని వచ్చింది.

మన సంస్థలతో అనుబంధం కలిగియున్న భగవద్బంధువులందరూ ఆశతో ఎదురు చూసే తిరుమల వేయిస్తంభాల మండప నిర్మాణము కార్యరూపం దాల్చడం ఆరంభమైంది వత్సరంలోనే. ఆరకంగా "వికృతి" ఒకమంచి మార్పునే మనకి అందించిందనడంలో ఎలాంటి సందేహమూ లేదు! అయినా మందిర నిర్మాణంలో ఎన్నో ఆటంకాలు ఎదురవుతూనే ఉన్నాయి. నిర్మాణానికి సంబంధించిన పూర్తి వివరాలు త్వరలో తెలుస్తాయి.

"ఈ నూతన సంవత్సరంలో ఆ శ్రీనివాసుడు గత 7 సం॥ మన భగవద్బంధువులంతా చేసిన శరణాగతిని ఫలింపచేస్తూ ఆ వేయిస్తంభాల మండప నిర్మాణాన్ని పూర్తికావిస్తాడని ఆశిద్దాం! ఈలోపు మన జీవా, నేత్రవిద్యాలయ, బదరి మొదలైన సంస్థలలో అభివృద్ధికి సంబంధించి మనం నిర్ణయించుకున్న లక్ష్యాలు పూర్తిచేసుకునేందుకు తగినట్లుగా భగవంతుని మన హృదయంలో ఎప్పుడూ నిలుపుకొని కార్యరంగంలో ముందుకు సాగాలని" మీకందరికీ అనేకానేక మంగళాశాసనాలు చేస్తున్నాం!

**జై శ్రీమన్నారాయణ!**

సంపాదకీయం

# గతంలోంచి భవిష్యత్తులోకి



కాలం భగవత్స్వరూపం. అనాది, అఖండం, అనంత మూను. మానవుల వ్యవహార సౌలభ్యం కోసం నిమిషాలని, గంటలని, జాములని, దినాలని, వారాలని, పక్షాలని, నెలలని, ఋతువులని, అయనాలని, సంవత్సరాలని, యుగాలని, మన్వంతరాలని, కల్పాలని బహుధా వింగడించి పెట్టినారు పెద్దలు.

మనిషికి లభించిన గొప్పవరాలలో కాలం బహుదొడ్డది. సకల వ్యాపార సమర్థములయిన ఇంద్రియాలవలె, యుక్తాయుక్త నిత్యానిత్య హేయోపాదేయ కర్తవ్యాకర్తవ్య వివేక సంధాయకమైన జ్ఞానం వలె కాలమూ మనిషికి శ్రేయస్సును ప్రేయస్సును సమకూర్చగలదు. నాశనాన్నీ, పతనాన్నీ తెచ్చిపెట్టగలదు.

భగవత్స్వరూపంగా కాలం ఉపాదేయం, ఉపాస్యమూను. కర్మాచరణమే కాలోపాసనం. భగవత్ ప్రీతికరంగా కర్మల నాచరించి మనిషి భగవత్ప్రీతిపాత్రుడౌతాడు. భగవత్ప్రీతి పాత్రమైనవాడు ఉత్తమ గతులు పొందుతాడు. ఆయన శ్రీచరణ సన్నిధిని నిత్యకైంకర్య మహాభాగ్యాన్ని పొందుతాడు.

కాలోపాసనం కర్తవ్యం, బాగుంది. అయితే కేవలం ఉపాసనంకాదు సుష్ఠూపాసనం కావాలి. కర్మాచరణరూపం కదా ఈ ఉపాసనం. ఆ కర్మలు హితాలు కావాలి. విహితాలు కావాలి. స్వపర ప్రేయస్సాధకాలు శ్రేయస్సాధకాలూ కావాలి. అట్టిది కాని కర్మాచరణ ఉపకారకం కాదు, ఉపాదేయమూ కాదు.

సహజంగా మనిషి తామసానికి లోనై ఉంటాడు. ఈ తామసం అలసత్వాన్ని కలిగిస్తుంది. దీనికితోడు పురా జనిశ్రేణీ సమాయాత వాసనలు, ప్రకృతి బంధాలు. ఇవన్నీ మనిషిని కర్తవ్యపరాఙ్ముఖుణ్ణిగా ఉదాసీనుణ్ణిగా జడప్రాయుణ్ణిగాచేసి కూచోపెడతాయి. దీనితో తన శరీరంతోపాటూ, కరచరణాదులతోపాటు సంక్రమించిన కాలాన్ని ఉపేక్షించి ఉపయోగపరచుకోక జీవితాన్ని సార్థకం చేసుకోకపోవటమే కాదు తనపాలిటి శాపంగానూ మార్చుకుంటున్నాడు.

ప్రాణికోటిలో నరజన్మ ఎంత దుర్లభమో నరులకు కాలమూ అంత అబ్బురమైనది. మిగిలిన ప్రాణులకూ కాలం ఉంది. కాలానుగుణమైన ప్రవృత్తీ ఉంది. తరు గుల్మ లతాదులకూ కాలం ఉంది. కాలానుగుణమైన ప్రవృత్తులూ ఉన్నాయి. కాని మనిషి మనుగడలో కాలం విలువ వేరు. కాలంపట్ల అతని భావనే వేరు. కాలాన్ని అతడు సేవించే పద్ధతే వేరు. అతని కాలపరిగణన జ్ఞాన విధానమే వేరు. అతడేపనికి పూనుకున్నా ఒకానొక విలక్షణమైన సంకల్పం కావిస్తాడు. దిగ్దేశ కాలనదీ పర్వతాది పరిగణనం కావిస్తాడు. యుగాల కాలవ్యవధిలో అత్యల్ప పరిమితమైన నిమేషాల విభాగం కాలంపట్ల అతనికి గల భక్తి శ్రద్ధలని, గౌరవాదరాలనీ ప్రకటిస్తుంది.

ఏపనికావించినా గడచిన కాలాన్ని గడుస్తున్న కాలాన్ని రాబోయేకాలాన్ని స్మరించకుండా ఉండదు. ఈ త్రైకాలికత్త్వం కాలనైరంతర్యాన్ని సూచిస్తుంది. నిన్నకు రేపటికీ సేతువు నేడు. నేడు నిన్న కాక తప్పదు. రేపు నేడు కాకా తప్పదు. గతంలోంచి వర్తమానంలోకి వర్తమానంలోంచి భవిష్యత్తులోకి కాలం సాగిపోతూనే ఉంటుంది. నిరంతర నిర్నిరోధగమనశీలం కాలం. అది ఎవరి అదుపాజ్ఞలకూ లోబడి నిలిచిపోదు.

కాలంతోపాటు మనిషి దూసుకు పోవాలి. గతంలోంచి వర్తమానంలోకి వర్తమానంలోంచి భవిష్యత్తులోకి వింటినుంచి వెలువడినబాణంలా లక్ష్యాభిముఖంగా మనిషి దూసుకుపోవాలి. అయితే వచ్చిన చిక్కల్లా ఒకటే. కాలం గమనశీలం కనుక దానిమట్టుకు అది సాగిపోతుంది. కాలంతో మనిషి సాగాలి కదా! ఎట్లా యీ సాగటం?

కర్మాచరణం ద్వారా కర్తవ్యనిర్వహణం ద్వారా కాలాన్ని సేవిస్తూ దానితో సహప్రయాణం కావించాలి. ఈ పొంతనమే కుదరటంలేదు. మనిషీ కాలాన్ని గడిపేస్తున్నాడు. నిర్వ్యాపారంగానో, దుర్వ్యాపారంగానో పుడిసిట పట్టిన నీళ్ళు వ్రేళ్లసందు ల్లోంచి జారిపోయినట్టు కాలమూ చేజారిపోతోంది. కాలమూ వెనక్కురాలేదు మనిలషీ వెనక్కు రాలేడు. కాలం ఒకరికి లొంగేది కాదు. కనుక దాన్ని వెనక్కు రప్పించలేం. మనిషి సంకల్పబలంతో లక్ష్యశుద్ధితో కాలంతోపాటు సహయాత్ర సాగించాలి. కాలాన్నీ స్తంభింపచేసినవారి కథలు పురాణాల్లో వింటున్నాం. వాటినలా ఉంచండి. కాలస్తంభన వంటి

లోకోత్తరకృత్యాలకు మనిషి పాల్పడనక్కరలేదు. క్షణం ఏమరకుండా అనువర్తిస్తూ హితవిహిత కర్మాచరణం ద్వారా కాలాన్ని సేవిస్తూ మనుగడ సాగిస్తే చాలు, మనిషి కాలాన్ని సార్థకపరచుకొన్నట్లే .

ఇందుకు మనిషి అలసతను విడనాడాలి. తామసాన్ని దూరం చేసుకోవాలి. ఆర్జవాన్ని సంతరించుకోవాలి. ఇంద్రియాలనదుపులో పెట్టుకోవాలి. పవిత్రమైన లక్ష్యశుద్ధి నేర్పరచుకోవాలి. మానవజని చారితార్థ్యానికి కాలోపసేవనం ఎంత ఆవశ్యకమో గుర్తించాలి. లక్ష్యశుద్ధిలేక కొందరు, వైఫల్యం వల్ల కలిగిన నిర్వేదంచేత కొందరు, అలసతవల్ల కొందరు, 'చేదాంలే' అన్న తూష్ణీంభావంవల్ల, కొందరు ప్రవృత్తిభావమే లేక, కాలమనేది ఒకటి సాగుతోంది దాన్ని మనం సేవించాలి అన్న తలపే లేకుండా స్థాణువుల్లా పడి ఉంటారు. వీరి చైతన్యం జీవయాత్రా పర్యవసాయిగా మిగుల్తుంది. పశుపక్ష్యాదులకు వీరికీ తేడాలేదు. అపురూపంగా లభించిన మానవజనిని, అమూల్యమైన కాలాన్నీ కూడా వ్యర్థంగా నిరుపయోగంగా కోలుపోతారు.

మనిషి గతంలో నిలిచి పోకూడదు. వర్తమానంలోకి సాగాలి. వర్తమానంలోంచి భవిష్యత్తులోకి దూసుకుపోవాలి. ఇట్లా మూడు దశలుగా కాలాన్ని విభజించుకుని సేవించాలి. వర్తమానానికి గతం ఆధారం. అందుచేత వర్తమానంలో ఉంటున్నా, గతాన్ని నెమరువేసుకొంటూ ఉండాలి. భవిష్యత్తుకు వర్తమానం ఆధారం. వర్తమానమే కాలక్రమాన భవిష్యత్తుగా రూపొందుతుంది. నిన్నటి ఆ కాలమే నేటి కాలం. నేటి కాలమే రేపటికాలం. ఒకనాటి నిన్న ఒకనాటి రేపని, ఒకనాటిరేపు ఒకనాటి నిన్న అని మరవకూడదు. అప్పుడే కాలస్వరూపం చక్కగా తేటతెల్లమవుతుంది. అఖండకాలాన్ని విభజించి అనుభవించటమే 'నిన్న, నేడు, రేపుల' త్రిపుటి పరమార్థం. ఈ మూడింటిలో దేనిని ఉపేక్షించినా కాలోపసేవనం పరిపూర్ణం కాదు.

కొందరి దృష్టిలో గతం గతం. దాన్ని గూర్చిన స్మరణమూ ఉండదు. అయ్యో పుడిసిటి నీరులా జారిపోయిందే అన్న నిర్వేదమూ ఉండదు. కొందరికి వర్తమానమే ప్రధానం. వీరికి వెనకచూపు ఉండదు. ముందుచూపూ ఉండదు. భవిష్యత్తు మీద ఆశలూ ఉండవు. ఉదాసీనంగా బ్రతుకు నెట్టుకుపోతారు. వర్తమానంలోంచి కాల గతిని పట్టి భవిష్యత్తులోకి వస్తారు. అంతే. వచ్చేరు కనుక వారి ఇష్టానిష్టా లతో పని లేకుండానే ఈ భవిష్యత్తు వర్తమానం, గతం అయి సాగిపోతుంది. కాలగమనం బహువిలక్షణం. దాని వేగం ఇంతా అంతా కాదు. ఏం చెయ్యాలన్నా చేసి మరీ వెళుతుంది.

కనుక మనిషి కాలతత్త్వాన్ని అవగతం కావించుకొని శ్రద్ధతో కాలాన్ని ఉపాసించాలి. అప్పుడే అతని జని చరితార్థం అవుతుంది. అఖండమైన కాలముయొక్క వైలక్షణ్యాన్ని నెమరువేసుకునేందుకే కాల విభజన విధానం, విభక్తకాలోపాసన విధానం ఏర్పడినాయి. అందులో సంవత్సర విభాగవిధానం మనకు బాగా పరిచితమైనది. సంవత్సరం నుంచి నిమేషం వరకు ఖండశః కాలాన్ని గణించి తత్కాలోచిత కర్మాచరణం ద్వారా అఖండకాలాన్ని సేవిస్తున్నాం.

ఈ కాలోపాసనా క్రమంలో ప్రస్తుతం మనకు సన్నిహితంగా సముపస్థితమైనది నూతన సంవత్సరం. శ్రీఖర నామ సంవత్సరం. సంవత్సరస్వరూపంగా మనను చేరవచ్చిన అఖండకాలానికి వేడుకల ద్వారా స్వాగతం పలుకుతున్నాం. సంవత్సరాది మనకు తొలి పండుగ. దీన్ని చేదు పండుగగా కూడా కొందరు పేర్కొంటారు. గతించిన కాలాన్ని గూర్చిన నిర్వేదం, రాబోయే కాలాన్ని గూర్చిన ఉత్సాహం రెండూ చోటుచేసుకుంటా యిందులో. ఇందుకు సూచకంగా ఉగాది పచ్చడి సంవత్సరాదినాడు తినటం. చేదు వేపపువ్వు, వగరుమామిడి ముక్కలు, పుల్లని కొత్తచింతపండు. తియ్యని కొత్తబెల్లం ఈ నాలుగూ కలిపి చేసిన యీ పచ్చడి కాలతత్త్వాన్ని గూర్చిన మన అవగాహనకు ప్రతీక.

నిర్వేదం ఉత్సాహంగా, ఉత్సాహం ఫలపర్యవసాయిగా జీవితాన్ని చరితార్థం కావించేది ఈ ఉగాది పండుగ.

మనుష్యులంతా యీ పండువు కలరూపును, దీని పూర్వరంగాన్ని, అఖండకాలవైలక్షణ్యాన్ని చక్కగా గుర్తించి చరితార్థులు కావాలని కోరుకొందాం.

ఆకృతిలోను, అంతరంగంలోను పరిష్కృతిని పరిపుష్టినీ సంతరించుకొని యీ ఉగాది నుండి విలక్షణంగా వెలువడే మన పత్రిక పాఠకులనలరిస్తుందని ఆశిస్తున్నాము.

పాఠకులకు ఉగాది శుభాకాంక్షలు.

- శ్రీరామచంద్రాచార్య

# కలివైరిసూరి వైభవము

తిరుమంగై ఆళ్వార్– పెరియ తిరుమొழி– 1-7-1

గత సంచిక తరువాయి...

**శ్రీ ఉ.వే.శ్రీమాన్ కె. టి. రామానుజాచార్యస్వామి-నెల్లూరు**



**మొదటి శతకంలో 6వ దశకం పూర్తయి 7వ దశకంలోని మొదటి పాశురం**

**అజ్గణ్ ఞాలమఞ్జ అంగోరాళరియాయ్ అవుణన్**
**పొంగనాగమ్ వళ్ళుగిరాల్ పోழ்న్ద పునిదనిడమ్ ।**
**పైంగణానైక్కొంబుకొండు పత్తిమైయాల్ అడిక్కీழ்**
**శెంగణాళియిట్టిఱైంజుమ్ శింగవేழ்కున్నమే ॥**

**ప్రతిపదార్థము: అజ్గణ్**=అచ్చట (ప్రహ్లాదుడు ప్రతిజ్ఞను చేసిన స్థలమందు) **అమ్**=అందమగు; **కణ్**=ప్రదేశములు గల; **ఞాలమ్**=భూమి; **అఞ్జ**=భయపడునట్లు; **ఓర్**=అద్వితీయమగు; **ఆళ్ అరియాయ్**=నరసింహమై; **అవుణన్**= హిరణ్యకశిపుడు; **పొఙ్గ**=విజృంభించునట్లు, **ఆకమ్**=(ఆతని) శరీరమును; **వళ్ళుకిరాల్**=పదునైనగోళ్ళతో; **పోழ்న్ద**=బ్రద్దలుచేసిన; **పునితన్**=పవిత్రునియొక్క; **ఇడమ్**=స్థానము; **శెంగణ్**=ఎఱ్ఱని నేత్రములుగల; **ఆళి**=సింహము; **పైంకణ్**=పచ్చని నేత్రములుగల; **ఆనై**=ఏనుగుయొక్క; **కొంబు**=దంతమును; **కొండు**=తీసికొనివచ్చి; **పత్తిమైయాల్**=భక్తితో; **అడిక్కీழ்**= సర్వేశ్వరుని శ్రీపాదముల క్రింద; **ఇట్టి**=ఉంచి; **ఇఱైంజుమ్**= ఆశ్రయించు; **శింగవేழ்కున్నమే**= అహోబిలక్షేత్రము.

**తాత్పర్యము: ఈ విశ్వమున భగవంతుని ఎందెందో వెతికిన, హిరణ్యకశ్యపుడు అడిగినపుడు భగవంతుడు సకల లోకభయంకరుడై అద్వితీయమగు నరసింహరూపియై స్తంభమునుండి ఆవిర్భవించెను. ఇంత వరకు తనను ఎదిరించునటువంటి వీరుని చూడని ఆ హిరణ్యకశిపుడు ఆ శ్రీనరసింహమూర్తిని గాంచిన తక్షణమే ఆయన మీదికి లంఘించెను.**

శ్రీనరసింహమూర్తి ఆ హిరణ్యుని వక్షస్థలమును తన పదునైన నఖాగ్రములతో చీల్చి పారవేసెను. పవిత్రుడగు ఆ నరసింహస్వామి వేంచేసియున్న స్థలమే ఈ అహోబిల క్షేత్రము.

అహోబిల క్షేత్రమునే తిరుమంగై ఆళ్వారులు ఈ పాశురమున "శింగవేழ் కున్నమ్" (శింగ=సింహమూర్తి గను, **వేழ்**=మన్మథమన్మథమూర్తిగను భగవంతుడు వేంచేసి యుండు, **కున్నమ్**=పర్వతము అని అర్థము) అని మంగళాశాసనము గావించియున్నారు. ఈ పవిత్ర క్షేత్రమున సంచరించు క్రూరమృగములు సైతము నృసింహ భక్తిని కలిగియుండును. కనుకనే ఆ సింగములు అచ్చటి ఏనుగులను జంపి వాని దంతములను తెచ్చి శ్రీనరసింహ స్వామి శ్రీపాదములయొద్ద భక్తితో నుంచుచుండునట.

**విశేషార్థములు:** సర్వేశ్వరుడు తిరుమంగై ఆళ్వార్లతో ఈ విధముగ పలుకుచున్నాడు. కలివైరిసూరివర్యా! **ఒన్బతు వాశల్ తానుడైక్కురంబై ప్పిరియుంబోతు ఉన్దన్ శరణమే శరణమెన్నరిన్దేన్** (1-6-9) "తొమ్మిది ద్వారములుగల శరీరమనెడి గుడిసెను వీడిపోవునపుడు నీ శ్రీచరణములనే శరణముగా తలచియుంటిని" అని ఒకటికి పదిమారులు మీ అధ్యవసాయమును తెలుపవలెనా! చేతనుడు స్వప్రయత్నముల నుండి మరలినపుడు నేను వానికి ఉపకరింతును కదా! "ఓరీ ప్రహ్లాదా! ఈ స్తంభమునందు శ్రీహరి గలడా?" అని హిరణ్యాసురుడు భక్తప్రహ్లాదుని గద్దించినప్పుడు, ప్రహ్లాదుడు ఆస్తంభమునందు భగవంతుడు గలడని ప్రతిజ్ఞను చేసెను. ఆతని ప్రతిజ్ఞను నెరవేర్చుటకై అప్పుడు ఆ స్తంభమున సాన్నిధ్యము చేసి ఆ ప్రహ్లాదునకు ఉపకరించితిని కదా! **"ఉన్నై ప్పిరమణిత్తార్ పెత్తపేఱు"** "భగవంతుని ఆశ్రయించినవారు పొందిన అనర్ఘమగు లాభము అనునట్లు నా భక్తులందరికోసం చేసిన చేష్టితమే

గదా అది. మీవంటివారు ఉపేక్షింపనవసరము లేక ఆశ్రయించుటకు వీలుగ అహోబిల పర్వత శిఖరాగ్రమున సాన్నిధ్యము చేసి ఉన్నాను" అని సర్వేశ్వరుడు ఆళ్వార్లకు తన దివ్యసందర్శనము నిచ్చెను. పురుషకారభూతురాలగు లక్ష్మీదేవితో అహోబిల క్షేత్రమున వేంచేసియున్న ప్రకారమును అనుసంధించి తిరుమంగై ఆళ్వార్లు పరమ సంతుష్టులైరి. భక్తులకు మిక్కిలి ఉద్దేశ్యభూతుడగు భగవంతుడు వేంచేసియున్న స్థలము గనుక అహోబిల క్షేత్రమునందున్న ప్రతీదియును ఈ ఆళ్వార్లకు సమాదరణీయ మైనది. భక్తిలేని వారు ఆశ్రయించుటకు వీలుకాకుండునట్లు స్వామి ఈ క్షేత్రమున వేంచేసియున్నాడు కదా! అని తిరుమంగై ఆళ్వార్లు సుమనస్కులై అహోబిల క్షేత్రమును అనుభవించుటలో ఉద్యుక్తులగుచున్నారు.

**అంగణ్ ఞాలమంజ :** అందమగు ప్రదేశములతో కూడిన భూమియంతయు భయకంపితమగునట్లు తాను (భగవంతుడు) నరసింహుడై అవతరించినది ఈ జగత్తును రక్షించుట కొరకే కదా! తనను ఆశ్రయించిన భక్తప్రహ్లాదునకు విరోధి హిరణ్యాసురుడు. ఆతనిని సంహరించుటకై భగవంతుడిట్లు అవతరించెనని ఎరుంగక దీని పరిణామము ఏమియగునో అని భూమియంతయు కంపించినదట.

**అఞ్జ :** అచ్చట ప్రహ్లాదుడు ప్రతిజ్ఞను గావించిన స్థలమందు.

**ఓర్ ఆళ్ అరియాయ్ :** ఇంతకు మునుపు ఎచ్చటను కనుగొనని నరసింహరూపియై

**అవుణన్పొంగ :** కేవలము ఆసురస్వభావమేగల హిరణ్యుడు విజృంభించగ, హిరణ్యాసురుడు ఇంతకు మునుపుఎన్నడును తనను ఎదిరించు వానిని చూచిన వాడుకాడు. ఇపుడు ఆ అద్వితీయమగు నరసింహమును చూడగనే చెలరేగినాడు. అచేతనములగు పదార్థములను (నారమున్నగు వానిని) చీల్చినట్లు శ్రీనరసింహమూర్తి తన పదునైన గోళ్ళతో ఆ హిరణ్యాసురుని శరీరమును చీల్చివేసెను.

**పోణ్ణిన్ద పునితన్ ఇడమ్ :** భగవంతునిలోని భావశుద్ధిని వివరించుచున్నారు. బ్రహ్మాది దేవతలందు తాము అంతర్యామిగ నుండి జగద్రక్షణాదులను గావించినట్లుగాక తానే ఆ హిరణ్యుని స్పృశించి చీల్చినందున "ఆశ్రిత పరి రక్షణము" అనెడి పరమపవిత్రమగు భావశుద్ధిగలవాడు. కాలాంతరమున జన్మించిన మనవంటివారికిని ఉపకరించుటకై తాను (భగవంతుడు) వేంచేసియుండు స్థలము అహోబిల క్షేత్రము.

**పైజ్ఞణ్ ఇత్యాది:** అహోబిలక్షేత్రములోని క్రూరజంతువుల స్వభావమును వివరించుచున్నారు. హిరణ్యాసురుని జూచిన శ్రీనరసింహునకు కలిగిన కోపాతిశయమువలె ఏనుగులను జూచిన సింహములును ఆ క్షేత్రమున కోపోద్రిక్తములుగా నుండును. అవి జాత్యుచితమగు పచ్చని కన్నులుగల మత్తేభముల మస్తకములను చీల్చి అందలి దంతములను ఆ క్షేత్రమున వేంచేసియున్న శ్రీనరసింహని శ్రీపాదము లందు భక్తితో సమర్పించుచుండును. **"యత్కరోషి యదశ్నాసి యజ్జుహోషి దదాసియత్। యత్తపస్యసి కౌంతేయ తత్కురుష్వ మదర్పణమ్ ॥** భగవద్గీత 27. కౌంతేయ! నీవు ఆచరించు కర్మను భుజించెడి ఆహారమును హోమము చేయు హవ్యమును అర్పించుదానమును ఆచరించు తపస్సును నాకే సమర్పింపుము. అన్నట్లు ఘాతుక కౄరములగు సింహములు కూడ ఆ క్షేత్రప్రభావముచే తాము భుజింపబోవు దానిని భగవంతునకు ముందుగ భక్తితో సమర్పించుచున్నవట.

**ఇదం భుంక్ష్వ మహారాజ ప్రీతో యదశనావయమ్ ।**
**యదన్నః పురుషోభవతి తదన్నాస్తస్య దేవతాః ॥**

రా.అ.3కాం.30శ్లో॥

ఓ మహారాజా! నిత్యము మేము భుజించెడి ఆహారమునే నీకు సమర్పించుచున్నాము. దీనిని ఆరగింపుడు. మానవులు తాము స్వీకరించు ఆహారపదార్థములనే దేవతలకు భక్తితో నివేదన గావింతురు గదా! భక్తిభావముతో సమర్పించు ప్రతిదానిని భగవంతుడు పరమప్రీతితో స్వీకరించును. కనుకనే ఆ సింగములు తమ ఆహారములను భగవ న్నివేదనను గావించియే స్వీకరించుచున్నవట.

**శిన్దప్పుడైత్తు చ్చెంగురుతి కొణ్డు పూతజ్ఞళ్ ।**
**అన్దిప్పలి కొడుత్తావత్తనమ్ శెయప్పన్మలై ॥**

పెరియాళ్వార్ తిరుమొழி 4-2-9

తిరుమాలిరుంశోలైమలై క్షేత్రమున వసించు భూతములు కేవలము దేహపోషణ తత్పరులై స్వైరవిహారము లను గావించుచున్న భగవత్ప్రతికూల జనులను చంపి ఆ నెత్తురును సంధ్యాసమయములందు వనాద్రీశునకు ఆరాధన రూపేణ నివేదన చేసి తాము స్వీకరించు చుండుననెడి పాశురార్థము కూడ ఇచ్చట స్మరింప తగియున్నది. ఇందువలన అహోబిలక్షేత్రమునందుగల జంతుజాలము నకునుగల భగవద్భక్తి తెలియవచ్చుచున్నది.

**శెంగణ్ఆళి:** సింహములకు ఏనుగులపై ఆగ్రహ మున్నను వానికి భగవద్భక్తి పుష్కలముగనే గలదు. అచ్చటి జంతువులకు భగవద్భక్తి కలిగియుండుట సహజధర్మము. ఆగ్రహమును కలిగియుండుట ఆగంతుక ధర్మము.

పెద్దలు ఈ పాశురమునకు స్వాపదేశార్థమును ఇట్లు అనుగ్రహింతురు. సింహములనగ శ్రీ భగవద్రానుజులవంటి జ్ఞానాధికులు. రామానుజనూత్తందాదిలో **"వలిమిక్కశీయం ఇరామానుశన్"** అను పాశురమున శ్రీభగవద్రామానుజులు సింహముగ వర్ణింపబడియున్నారు. అటువంటి శ్రీరామానుజుల శ్రీచరణముల సంబంధముగలవారును సింహములవంటివారేయగుదురు. మత్తగజములనగ పరవాదులు. పరవాదమత్తేభములు. **"జైనేభకంఠీరవః"** అను శ్లోకమున పరమతస్థులను ఏనుగునే కదా వర్ణించి యున్నారు. అహోబిలక్షేత్రమందు వేంచేసియుండు భాగవతోత్తములు పరవాదులందు ఆగ్రహముగల వారైనను కొరతలేని భగవద్భక్తితో అలరారుచుందురు. శ్రీమతే నారాయణాయ నమః అని ద్వయ మంత్రములో ఉత్తర ఖండమున నిరూపింపబడిన ప్రాప్యానుభవము అను దానిని శ్రీకలివైరిసూరి ఈ దశకమున వివరించిరనియు పెద్దలు అనుగ్రహించుచుందురు.



ఖమ్మంజిల్లా వికాసతరంగిణి ముఖ్య సభ్యులు శ్రీమాన్ చల్లగొట్ల లోకేశ్వరరావు, వారి బృందం కలిసి బేతుపల్లి చుట్టుప్రక్క గ్రామాలనుండి 20 క్వింటాల బియ్యాన్ని సేకరించి ప్రసాద నిమిత్తం దివ్యసాకేతం, శంషాబాద్‌కి పంపించారు. అక్కడే శ్రీవారిని సేవించి మంగళాశాసనాలు అందుకున్నారు.



## చేదు అనుభవాన్ని పెంచుతున్న సునామి

జపాన్ దేశంపై విరుచుకుపడ్డ సునామి చేదు అనుభవాన్ని మిగిల్చింది. సునామికి తోడు వచ్చిన భూకంపాలు జపాన్ ప్రజలను అతలాకుతలం చేయడమేకాకుండా తీవ్ర ప్రాణనష్టాన్ని, ఆస్తినష్టాన్ని కలిగించాయి. ఈ విపత్తు ప్రపంచ ప్రజలందరినీ దిగ్భ్రాంతులనుచేసింది. ఈ దుర్ఘటనలో ప్రాణాలు కోల్పోయినవారికి ప్రగాఢ సానుభూతిని తెలియజేద్దాం. క్షతగాత్రులైనవారందరూ త్వరగా కోలుకోవాలని, మామూలు పరిస్థితులు త్వరగా నెలకొనాలని శ్రీమన్నారాయణుణ్ణి వేడుకుందాం.

– భక్తినివేదన



గత సంచికలో

# సీతాఫలం రామార్పణమ్



శ్రీమతి చెవుటూరి కుసుమకుమారి - హైదరాబాద్

(దశరథుడు పుత్రులకోసం పరితపిస్తూ గురువులైన వశిష్ఠ వామదేవాది మహర్షి పుంగవులను సంప్రదిస్తాడు. అశ్వమేథ యాగం చేయాలన్న సంకల్పాన్ని వెలిబుచ్చుతాడు. మహర్షులందరూ హర్షాన్ని వ్యక్తం చేస్తారు. అశ్వమేథ యాగ విధానాన్ని తెలియజేయమని దశరథుడు కోరగా వారు విషయాలను వివరిస్తారు.) తరువాయి..

అంతట దశరథ మహారాజు గురువర్యా! మన అశ్వశాలలో యాగమునకు తగిన అశ్వములున్నవా? అని ఒక్కసారి అశ్వశాలను పరీక్షింపుడని కోరినాడు. వసిష్ఠమహర్షి అశ్వశాలలోని అశ్వములను పరీక్షించి వచ్చి దశరథా! నీ అశ్వశాలను ఎంత చూచిననూ తనివి తీరకున్నది. ఒకటేమిటి? అశ్వశాలలోని అనేక అశ్వములు యాగార్హములై ఉన్నవి అని చెప్పినాడు. ఇక్ష్వాకు వంశోత్తమా! దశరథా! ఇంకనూ జాగేల? వెంటనే సరయూ నదికి ఉత్తర భాగమున యాగ భూమిని సిద్ధము చేయుము. సమస్త యాగసంభారములనూ సమకూర్చుము. స్వనామాక్షర లిఖిత సువర్ణ పట్టమును అశ్వలలాటమున కట్టి గుఱ్ఱమును విడిచి పెట్టుమని ఆదేశించుమని చెప్పి తన ఆశ్రమమునకు తిరిగి వెళ్ళాడు. మహర్షులందరూ అశ్వమేథయాగ సంకల్పమును మెచ్చుకొని, రాజానుమతితో వారి వారి ఆశ్రమాలకు మరలినారు.

వారందరూ వెళ్ళిన తరువాత వసిష్ఠాదుల మాటలు వినిన సుమంత్రుడు దశరథ మహారాజుతో ఈ విధంగా చెప్పినాడు. మహారాజా!

**అహ మిక్ష్వాకు సారథ్యం కుర్వన్ బ్రహ్మ సభాం గతః ।**
**తత్ర భావి మహీపాల ప్రసంగే తవ భూపతే ॥**

పూర్వము ఇక్ష్వాకు మహారాజు రథసారథినైన నేను ఆయన బ్రహ్మసభకు వెళ్ళుచుండగా నేను కూడా వెళ్ళినాను. అక్కడ భావికాలపు రాజుల గురించి ప్రసంగము వచ్చినది. రాజా! అప్పుడు నీ ప్రసంగము కూడ వచ్చినది. అప్పుడు అక్కడి మహర్షులు కొందరు దశరథునికి పుత్రసంతానము ఉండదు అని పలికినారు. కానీ సనత్కుమార మహర్షి

**ఋష్యశృంగం పురస్కృత్య స తు యజ్ఞం కరిష్యతి ।**
**పుత్రాస్తస్య భవిష్యంతి చత్వారోఽమిత విక్రమాః ॥**

మహర్షులారా! దశరథునకు పుత్ర సంతానము కలుగదనునది యథార్థముకాదు. ఋష్యశృంగమహర్షిని తీసుకొని వచ్చి దశరథుడు పుత్రకామేష్టి చేయగా పరాక్రమశాలురైన నలుగురు పుత్రులు జన్మించెదరని చెప్పినాడు. కనుక రాజా! ఋష్యశృంగమహర్షిని ఆహ్వానించి యాగము చేయుము. సనత్కుమార మహర్షి అమోఘ వాక్యానుసారము జరుగుట తథ్యము. అంతేకాదు నేనా ఋష్యశృంగుని చరిత్రను కూడా అక్కడ వినివున్నాను. ఆ ఋష్యశృంగుని ప్రభావమును, ఆయన జనన విచిత్రమును కూడ ఇప్పుడు చెప్పెదను ఆలకించుమని చెప్పసాగాడు సుమంత్రుడు.

## ఋష్యశృంగమహర్షి జనన దివ్యోదంతము

దశరథ మహారాజా! ఒకప్పుడు కశ్యపమహర్షి వంశము వాడైన విభాండకమహర్షి ఒక కొలనులో స్నానార్థము వెళ్ళగా అక్కడ అప్సరస ఊర్వశి కనుపించగా ఆ మహర్షి రేతస్సు ఆ కొలనిలో పడింది. సరిగా అదే సమయమున ఒక ఆడులేడి దాహార్తితో ఆ కొలనుకు వచ్చింది. నీరు త్రాగుచుండగా విభాండక మహర్షి రేతస్సు ఆ లేడి గర్భములోనికి వెళ్ళినది. ఆ లేడి వెంటనే ఒక పుత్రుని ప్రసవించి శాపవిముక్తురాలై, దివ్యరూపిణి అయి స్వర్గానికి వెళ్ళిపోయింది. రాజా! దానికి కారణము కూడా చెప్పెదను ఆకర్ణించుము.

చిత్రరేఖ అను దేవకన్య బ్రహ్మసభలో ప్రతిదినమూ నృత్యము చేయుచుండెడిది. ఒకనాడు నృత్యసమయమున బ్రహ్మకు అభిముఖురాలై నర్తించక ఇతరులవైపు తిరిగి నర్తించసాగినది. అది చూచిన బ్రహ్మ కోపించి నీవొక ఆడలేడివై పుట్టుమని శపించాడు. చిత్రలేఖ తనకు శాపవిముక్తి ప్రసాదించుమని బ్రహ్మదేవుని వేడుకొన్నది. నీవు ఋషిపుత్రుని కన్న వెంటనే శాపవిముక్తురాలవై యథాస్థానమునకు చేరగలవని ఆమెను అనుగ్రహించాడు.

**అమోఘత్వా దృషేశ్చైవ భావిత్వా ద్దైవ నిర్మితే ।**
**తస్యాం మృగ్యాం సముత్పన్నః తస్య పుత్రో మహీపతే ॥**
**పిత్రానీతో ఋష్యశృంగః వన ఏవాఽభ్యవర్థత ॥**

దైవ లిఖితము తప్పదు కనుక తన అమోఘ వీర్యహేతువు చేత ఆ ఆడలేడియందు ఋష్యశృంగుడు ఉద్భవించినట్లు దివ్యదృష్టితో సర్వమూ తెలుసుకుని విభాండకమహర్షి తన పుత్రుని తన ఆశ్రమమునకు తీసుకొని వెళ్ళి పెంచసాగినాడు.

దశరథ మహారాజా! మహితాత్ముడైన ఆ ఋష్యశృంగుని శిరస్సున మాతృచిహ్న సూచకమైన ఒక లేడికొమ్ము కూడ పుట్టకతోనే వున్నది. ఆ కారణము చేతనే ఆతడు ఋశ్యశృంగ నామధేయుడై ప్రసిద్ధిగాంచినాడు. ఆ ఋష్యశృంగుడు అన్యచింత ఎరుగని అపార తపోనిష్ఠుడైనాడు. తండ్రిని తప్ప మరొకరిని చూడని కారణము చేత ఆయన మనస్సు సదా బ్రహ్మచర్యమునందే లీనం అయి వుండెడిది.

రాజా! సరిగా అదే సమయమున నీ మిత్రుడు రోమపాదుడు ప్రతిదినము బ్రాహ్మణులకు అన్నదానము చేయుచుండెడివాడు. ఒకదినము ఒక బ్రాహ్మణుడు రోమపాదుని వద్ద దానము తీసుకొని మరల దానము కొరకు వచ్చినాడు. అది చూచిన రోమపాదుడు బ్రాహ్మణులు అసత్యవాదులనీ, ఆశోపహతులనీ దూషించాడు. దానితో బ్రాహ్మణులు రోమపాదుని త్యజించారు. అంగదేశమున వర్షములు కురువరాదని శపించారు. పురోహిత బ్రాహ్మణాపచారము వలన దేవేంద్రుడు అంగదేశమున వర్షమును కురిపింపలేదు. రాజాపరాధ దోషము వలన కలిగిన అనావృష్టితో ప్రజలు పీడించబడినారు. క్షామముతో మానవజాతులు, పశువులు నశించి పోతున్నాయి.

దశరథ మహారాజా! రోమపాదుడు తపస్సంపన్నులు సమర్థులు అయిన బ్రాహ్మణుల వద్దకు వెళ్ళి చేతులు జోడించి మహాత్ములారా! ఏమి చేసిన దేవరాజు మరల నాదేశమున వర్షము కురిపించునో ఆ ఉపాయమును చెప్పుడని ప్రార్థించాడు. అప్పుడు

**కుపితా స్తవ రాజేంద్ర! బ్రాహ్మణాః నిష్కృతిం చర ।**
**ఋష్యశృంగం మునిసుత మానయస్వ చ పార్థివ! ॥**

రాజా! నీమీద విప్రలోకమంత కోపగించినది. ముందుగా వారిని ప్రసన్నులను చేసుకొనుము. వర్షములు పుణ్యవశమున గాని కురవవు. అయిననూ ఒక మార్గము చెప్పెదను వినుము, విభాండక మహర్షి పుత్రుడైన ఋష్యశృంగుని ఈ అంగదేశమునకు రప్పించుము. ఆ ఋష్యశృంగుడు రాజ్యమున కాలుమోపగానే మేఘుడు వర్షించగలడు. అది నిశ్చయము, అని ఒక తపశ్శాలి అయిన బ్రాహ్మణోత్తముడు చెప్పినాడు.

అనంతరము రోమపాదుడు వివేకవంతులైన మంత్రులను పిలచి ఋష్యశృంగుని తీసుకువచ్చుటకు ఉపాయమును యోచన చేసినాడు. కార్యసాధకులు శాస్త్రపరిజ్ఞానవంతులు అయిన మంత్రులతో యోచించి, అందమైన స్త్రీలద్వారా ఋష్యశృంగుని రప్పించవలెనని భావించారు. వెంటనే వారవనితలను రావించి, వనితలారా! ఏ విధముగానైనా ఋష్యశృంగుని మీ హావభావాలతో మురిపించి, మరిపించి ఆయనను మన రాజ్యమునకు తీసుకొని వచ్చి మనరాజ్యమును క్షామమునుండి కాపాడమని ఆదేశించాడు.

కాని ఋషి శపించునేమో అనీ భయపడి మిన్నకున్నారు వనితలు. అందులో ఒక వనిత మనసును దిటవు పరచుకొని, "మహారాజా! నాకు కావలసిన వస్తు సంభారములను అన్నిటినీ సమకూర్చుడు. నేను ఋష్యశృంగుని తోడ్కొని రాగలను" అని పలికినది. (సశేషం)



## శ్రీరామానుజ జయంత్యుత్సవ శుభాహ్వానము

పరమహంస పరివ్రాజకులు శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయరు స్వామివారి
ప్రత్యక్ష పర్యవేక్షణలో మే 7వ తేదీన "భగవద్రామానుజ తిరునక్షత్రం"
వరంగల్ జిల్లా, మానుకోట, యశోదా గార్డెన్స్‌లో అత్యంత వైభవంగా జరుగనున్నది.
ఈ సందర్భముగా శ్రీ మదుభయవేదాన్తాచార్యపీఠం అధ్యక్షులు
శ్రీ ఉ.వే.శ్రీమాన్ డా॥ సముదాల్ర రంగరామానుజాచార్యస్వామి వారి తండ్రిగారు
"సాహిత్య భూషణ" శ్రీ ఉ.వే.శ్రీమాన్ సముదాల్ర లక్ష్మణాచార్యులవారి పేర దశమ "భవ్య స్మృతి సత్కారము"ను
శ్రీ ఉ.వే.శ్రీమాన్ డా॥ కె.ఇ. దేవనాథన్ స్వామి (ప్రొ॥ డిపార్ట్‌మెంట్ ఆఫ్ విశిష్టాద్వైత వేదాన్త ఆర్.ఎస్. విద్యాపీఠం-తిరుపతి) వారికి
శ్రీశ్రీశ్రీ స్వామివారి శ్రీహస్తాల ద్వారా ప్రదానోత్సవం జరుగును.

మరిన్ని వివరములకు :
ఓమ్ నారాయణ, మానుకోట.
సెల్: 9440107111,

**హింది భక్తినివేదన ఆవిష్కరణమహోత్సవం జరుగును**

భగవద్బంధువులకు
ఇదే మా
ఆహ్వానం



# అహో! భారతమ్

గత సంచిక తరువాయి...

శ్రీమతి డా॥ టి.కె. చూడామణి- విజయవాడ

(కద్రువ శాపం వల్ల పాములు తల్లడిల్లిపోతాయి. దేవతలకు మంథర పర్వతానికి తాడుగా ఉండి సహాయం చేసినందుకు వాసుకికి మరణం, భయం రాకుండా వరమిచ్చారు దేవతలు. తమ్ములైన పాముల శాపవిముక్తికై తన చెల్లెలు జరత్కారువునిచ్చి జరత్కారుడు అనే మహర్షికి వివాహం చేయాలని సిద్ధపడ్డాడు.జరత్కారుడు పితృదేవతల దుస్థితి చూసి చలించిపోతాడు.) తరువాయి...

గబగబా వారి దగ్గరికి వెళ్ళి 'అయ్యా! ఇదేం తపస్సు! చాలా విచిత్రంగా ఉందే! ఇలా చేస్తే గొప్పపుణ్యం వస్తుందా? నేను కూడా చేస్తాను చెప్పండి' అన్నాడు.

అతని మాటలు విని వాళ్ళు 'బాబూ! నీకిది తపస్సులా ఉందా నాయనా! చూడు ఎలుకలు ఈ గడ్డివేరు ఎలా కొరికేశాయో! ఇంక ఒక్కవేరే మిగిలి ఉంది. దానిని కూడా ఎలుకలు కొరికేస్తే ఈ గుంటలో పడిపోవడమే!' అన్నారు.

జరత్కారుడు జాలితో 'అయ్యా! నా తపస్సులో కొంతగాని మొత్తంగాని ఫలాన్నిచ్చి మిమ్మల్ని రక్షిస్తాను నేనేం చేయాలో చెప్పండి' అన్నాడు. దానికి వాళ్ళు "అయ్యా! ఓ వృద్ధ బ్రహ్మచారీ! తపస్సు మేమూ చేశామయ్యా! అది కాదు విషయం. మావంశంలో సంతానం క్షీణించడం వలన మాకు ఇలాంటి గతి వచ్చింది. నరకం రాబోతోంది. సంతానం లేకపోతే ఆ వంశంలోని పితృదేవతలగతి ఇంతే! నువ్వు మాకోసం బాధపడుతున్నావు పాపం. మేము యాయావరులు అనే మహర్షులం. పుణ్యలోకాలనుండి భ్రష్టులమయ్యాం. మా తపస్సంతా మా వంశంలో సంతానం లేకపోవడం వలన నష్టమైపోయింది. ఇప్పుడు మావంశంలో ఒక్కడే ఒక్కడున్నాడు. మా దురదృష్టం కొద్దీ వాడు తపోనిష్ఠలో మునిగి పెళ్ళిచేసుకోలేదు. వాడి పేరు జరత్కారుడు. వాడివల్లే మాకీ గతి పట్టింది. నాయనా! నీకు వాడెక్కడయినా కనిపిస్తే మా దీనస్థితిని వివరంగా చెప్తావా బాబూ! చెట్టువేరులా కనిపించేవన్నీ మావంశ తంతువులు (దారాలు) మిగలినది ఒక్కటి. దానిని కూడా ఎలుక అంటే "కాలుడు" కొరికేస్తున్నాడు. ఆ జరత్కారుడు అలాగే బ్రహ్మచారిగా ఉంటే ఈ ఒక్కదారం కూడా తెగిపోయి ఈ గుంటలో పడి నరకానికి పోతాం. తపస్సు-యజ్ఞం. వీటన్నిటికంటే సంతానం గొప్పది అని వాడికి చెప్పుతండ్రీ! తొందరగా సంతానవంతుని గమ్మని మామాటగా చెప్తావు కదా! మాబాధ తొలగిస్తావు కదా! ఔను ఇంతకీ నువ్వెవరివయ్యా?" అన్నారు.

గొల్లుమన్నాడు జరత్కారుడు. "అయ్యా! మీరు నాపితరులే! ఆ దౌర్భాగ్య జరత్కారుణ్ణి నేనే. బ్రహ్మచర్యం గొప్పదని నా అభిప్రాయం. సంతానప్రాప్తి వలన పితృదేవతల ఋణం తీరుతుందని తెలుసుకొనలేక పోయాను. మిమ్మల్ని చూశాక నేను చేసిన తప్పేమిటో తెలిసివచ్చింది. నేను తప్పకుండా వివాహం చేసుకుంటాను. అయితే కొన్ని షరతులున్నాయి. ఆ అమ్మాయి పేరు కూడా నాపేరే అయి ఉండాలి. అంతే కాదు. ఆవిడని ఎవరైనా తీసుకొని వచ్చి నాకు భిక్షగా ఇయ్యాలి. అలా ఇచ్చినా ఆవిడ పోషణభారం నామీద ఉండకూడదు. అలా అయితేనే ఆ పెళ్ళి జరుగుతుంది. ఇది నిజం. ఆవిడ పుత్రుడు మిమ్మల్ని నరకాన్నుంచి తప్పిస్తాడు. మీరు శాశ్వతంగా శుభలోకాలు చేరుతారు" అన్నాడు.

పాపం... ఇది జరిగేదేనా? అదే పేరుతో, భిక్షగా దొరికి, పోషణ భారం లేకుండా... అబ్బ ఎన్ని కలిసిరావాలి? కొంతకాలం అలా అడవుల్లో తిరిగినా అతనిపైన జర... వార్ధక్యం పడిందేమో... అసలెవరూ ముందుకి రానేరాలేదు. ఏం చెయ్యాలి? అడవి మధ్యలో నిలబడి దుఃఖిస్తూ తన నియమాలని కోరికలని అరచి చెప్తూ - అయ్యా అలా నా పేరున్న అమ్మాయిని నాకు భిక్షగా, పోషణభారం లేకుండా ఇయ్యండి అన్నాడు.

అక్కడ తిరుగుతున్న నాగులు, ఈ మాటలు విని పరుగున పోయి వాసుకితో చెప్పారు. ఎగిరి గంతేశాడు వాసుకి. చెల్లెలు జరత్కారువుని పెళ్ళికూతుర్ని చేసి ఆ ఋషి దగ్గరకి తీసుకొని వెళ్ళి ఆయనకి సమర్పించాడు. మళ్ళీ

తన షరతులన్నీ వివరించాడు జరత్కారుడు. ఆనందంతో అంగీకరించాడు వాసుకి.

'ఈవిడ నాకిష్టంలేని పని ఎప్పుడూ చేయకూడదు. అప్రియంగా నాకేమీ చెప్పకూడదు. నాకు కోపం కలిగించ కూడదు. అలా ఏదైనా జరిగిందా వెంటనే ఈవిడని విడిచిపెట్టి వెళ్ళిపోతా' జరత్కారుడు అన్నాడు.

సరే! అన్నాడు వాసుకి. భయంతో అంగీకరించింది జరత్కారువు. వాసుకి వారిద్దరికీ వివాహం చేశాడు. కొద్దిరోజులకి జరత్కారువు గర్భవతి అయింది. ఋషి ఒకనాడు అలసటగా భార్యఒడిలో తలపెట్టుకొని పడుకున్నాడు. సూర్యుడస్తమిస్తున్నాడు. సంధ్యాసమయంలో సూర్యునికి అర్ఘ్యమియ్యాలి కదా! ఆ సమయంలో నిద్రించకూడదే! వణకిపోయింది జరత్కారువు. ఈయన్ని లేపనా... కోపం వచ్చి వదిలేస్తాడేమో! వద్దా! సంధ్యావందన సమయం దాటిపోయి ధర్మలోపం కలిగితే లేపలేదేమని కోపం వస్తే... ఏం చేసినా తప్పే! ఎలా... ధర్మహాని కలుగనీయను అనుకొందావిడ.

నెమ్మదిగా ప్రేమగా... మహాభాగా... సూర్యాస్తమయం ఔతోంది... లేస్తారా..! అంటూ లేపింది. ఖస్సుమంటూ లేచాడు జరత్కారుడు. ఏమిటీ?... నేను నిద్రపోతూంటే అస్తమించగలడా సూర్యుడు! అంత ధైర్యమా అతనికి నన్ను లేపి అవమానిస్తావా? ఛీ... నీ దగ్గర ఒక్కనిమిషమైనా ఉండను. గబగబ అడుగులు వేశాడు. స్వామీ మన్నించండి. అవమనించడమా మిమ్మల్నా నేనా?

ఔను నువ్వా నాకు కర్తవ్యాన్ని చెప్పేదానివి? ముందే చెప్పాను కదా! మాట తప్పను మీ అన్నగారికి చెప్పు..'

"స్వామీ! గర్భవతినే... ఇలా విడిచేస్తారా?"

"ఆ... విడిచేస్తాను. నీకు గర్భం అస్తి.. అస్తి.. అస్తి (ఉంది). అగ్నితో సమానుడైన కొడుకు నీకు పుడతాడు. ధర్మాత్ముడు వేదవేదాంగ పారగుడు ఔతాడు... అస్తి. ఉన్నాడు... ఉన్నాడు కాబట్టే ఆస్తీకుడనే పేరు... అంటూ పెద్ద పెద్ద అంగలు వేసుకుంటూ వెళ్ళిపోయాడు.

పాపం జరత్కారువు వాసుకిని చేరి గొల్లుమంది. "అమ్మా...! ఎంతపని జరిగింది! అసలేమైంది?" "అన్నా! జరిగినదిదీ..." తల్లీ! నీపుత్రునివల్ల మన నాగులు రక్షింపబడతారన్నమాట. ఏమౌతుంది మరి."

అన్నా... నా భర్త నిష్ఠాగరిష్ఠుడు. సత్యవాది. ఆయన నా గర్భంలో సంతానం అస్తి అస్తి ఉన్నది ఉన్నది అంటూ వెళ్ళారు. అది జరిగి తీరుతుంది... అంది.

వాసుకి చెల్లెల్ని ప్రేమతో నిమిరాడు. జాగ్రత్తగా చూచుకున్నాడు. కొంతకాలానికి ఆమె పుత్రుణ్ణి కన్నది. ఆ బాలుడే ఆస్తీకుడు అనే పేరుతో ప్రసిద్ధిని పొందాడు.

ఇలా జరత్కారుడు-జరత్కారువు అనే ఒకే పేరున్న భార్యాభర్తల పుత్రుడే ఆస్తీకుడు. (సశేషం)

# రామాయణంలో ప్రజాస్వామిక పరిపాలనా విధానాలు

గత సంచిక తరువాయి...

**శ్రీమతి పి. జ్యోతి- వరంగల్**

దశరథుడు తనకు పూర్వం ఇచ్చిన మాట ప్రకారం భరతునికి రాజ్యాన్ని ఇచ్చి రాముని అరణ్యానికి పంపాలని తానే కోరుకున్నానని కైక చెప్పింది. భరతుడు అంతులేని దుఃఖంలో మునిగిపోయాడు. పాపాన్ని మూటగట్టినావు. నేను నిన్ను తల్లిగా భావింపరాదు. కోరరాదు, వదలివేయాలి. కాని రాముడు నిన్ను తల్లిగా భావించినాడు కదా! నేను నిన్ను వదిలితే అతడు బాధపడతాడని నేను నిన్ను తల్లిగా అంగీకరిస్తున్నాను. అరణ్యానికి వెళ్ళిన వారిని వెనుకకు మరలించి తీసుకువస్తానని అన్నాడు భరతుడు.

మంథరను వధించటానికి పూనుకున్న శత్రుఘ్నుని వారిస్తూ కైకేయిని వధించాలన్న ఆవేశం నాకు కూడా కలిగింది. ఈ ఆపదకు మూలమైన మంథర కూడ చంపదగిందే, కాని వీరిని మనం వధిస్తే రాముడు మన ముఖం కూడ చూడడు, మాట్లాడడు. అటువంటి ధర్మమూర్తి ప్రేమకు దూరమవుతామని శత్రుఘ్నుని ఆ ప్రయత్నం నుండి విరమింపచేశాడు.

యుద్ధకాండలో వాల్మీకి రామ పరిపాలనా విధానాన్ని చెపుతూ ప్రజలలో కొందరు పరస్పర ద్వేషం, హింస కలిగిన వారైనా కూడ రాముని ముఖం చూసి ఈ పనులకు ఉద్యమించరని, రాముని ప్రేమకు తాము దూరం కావలసి వస్తుందని ప్రజలు భావించి ఎటువంటి దుష్కార్యాలను ఆచరించేవారు కారని పేర్కొన్నాడు.

భరతుడు రాముని వెనుకకు మరలించి తీసుకురావాలని అరణ్యానికి బయలుదేరినప్పుడు అతని ప్రవర్తనను గుహుడు శంకించాడు. భరద్వాజ మహర్షి, చివరకు లక్ష్మణుడు కూడ రామునికి ఏదో ద్రోహం తలపెట్టడానికే భరతుడు అరణ్యానికి వస్తున్నట్లుగా భావించాడు. రాముడు లక్ష్మణునితో భరతుడు ఏనాడు మన మనసుకు బాధ కలిగించే పని చేయలేదు. అతనిపట్ల దురుసుగా ప్రవర్తిస్తే తనను బాధపెట్టినట్లేనని అన్నాడు. భరతుడు మన దగ్గరకు రాగానే మా లక్ష్మణునికి రాజ్యమివ్వమని నేను చెపితే వెంటనే సరేనని ఒప్పుకుంటాడు. అతనికి రాజ్యకాంక్షలేదని అన్నాడు. లక్ష్మణుడు తానన్న మాటలకు సిగ్గుపడ్డాడు.

భరతుడు, కృష్ణాజినం, నారబట్టలను ధరించిన రాముని చూసి సభలో మంత్రులు మొదలైనవారు చుట్టూ కూర్చొని సేవింపదగిన మా అన్న అడవిలో ఉండే మృగాలతో సేవింపబడుతున్నాడు కదా! కొన్నివేల విలువ చేసే వస్త్రాలు ధరింపదగిన మా రాముడు ఇప్పుడు ధర్మాచరణం చేస్తూ రెండు మృగాజినాలను ధరించినాడని, చిత్ర విచిత్రాలైన పూవులను ధరించే మా రాముడు జటాభారాన్ని దాల్చినాడని, యథాశాస్త్రంగా యజ్ఞాలు చేసి ధర్మాన్ని ఆర్జించిన మా అన్న శరీరాన్ని కష్టపెట్టడం ద్వారా ధర్మాన్ని ఆర్జింప సిద్ధపడినాడు. అమూల్యమైన చందనం పూసుకోదగిన మా రాముని శరీరం నేడు బురదపట్టి ఉంది. సుఖంగా ఉండవలసిన మా రామునికి ఈ దుఃఖమంతా నా మూలంగానే కలిగింది కదా! లోకులచే నిందింపబడుతున్న క్రూరుడైన నా జీవితం వ్యర్థమని దీనంగ విలపిస్తూ పరుగెత్తి రాముని పాదాలపై పడాలనుకున్నాడు. కాని, అంతవరకు చేరకముందే దుఃఖంతో క్రిందపడిపోయినాడు.

ఏమీ మాట్లాడలేకపోతున్న భరతుని లేవనెత్తి, రాముడు గాఢంగా కౌగిలించుకున్నాడు. శత్రుఘ్నుడు కూడ ఏడుస్తూ రాముని పాదాలకు నమస్కరించగా రాముడు వారిద్దరిని కౌగిలించుకొని కన్నీళ్ళు కార్చినాడు. ఆ తరువాత భరతుని శిరస్సును ఆఘ్రాణించి తన ఒడిలో కూర్చుండబెట్టుకొని సావధాన చిత్తుడై ఎన్నెన్నో ప్రశ్నలను అడిగాడు. రాజుగా భరతుడు పట్టాభిషిక్తుడైనాడని భావించి పరిపాలన గురించి ప్రశ్నించాడు. కుశలమడిగే వ్యాజంతో రాజనీతి నుపదేశించినాడు. *(సశేషం)*

**దొడ్డ మనసు వారిది:** మహబూబ్‌నగర్ జిల్లా, తాలకొండపల్లి (మం) చంద్రదన్ గ్రామము "వికాస తరంగిణి" సభ్యులు శ్రీమాన్ వాసుదేవ రెడ్డి, శ్రీమతి సంపూర్ణ మరియు తదితర గ్రామస్తులు కలిసి 25 బస్తాల బియ్యం మన Jiva వేద పాఠశాలకు అందజేసారు. ఈ కార్యక్రమాన్ని మహబూబ్‌నగర్ జిల్లా వికాసతరంగిణి సభ్యులు శ్రీమాన్ వెంకట్‌రెడ్డి, శ్రీమాన్ బుచ్చయ్య, శ్రీమాన్ రాజశేఖర్ నేతృత్వంలో ఈ ఉదాత్తమైన కార్యక్రమాన్ని దొడ్డ మనసుతో నిర్వహించారని ఆ జిల్లా వి.టి.ఇన్‌చార్జ్ శ్రీమతి విజితారెడ్డిగారు తెలిపారు. ఈ సందర్భంగా శ్రీ స్వామివారిని కలిసి మంగళాశాసనాలు అందుకున్నారు.

# "లక్ష్మీ కటాక్ష వైభవము"

శ్రీమాన్ సముద్రాల శఠకోపాచార్యస్వామి, వరంగల్

కోరితే రక్షించే పరమాత్మకన్న, కోరకుండానే రక్షించే స్వభావం కల్గిన పరమోదారచరితగా శ్రీమహాలక్ష్మి గణుతికెక్కినది.

ప్రకృతికి వశులైన' చేతనులు పరమాత్మయొక్క స్వరూప స్వభావాదులను, సౌలభ్య సౌశీల్య దయా వాత్సల్యాది సకల సద్గుణ గణమును గుర్తించలేకపోవుచున్నారు.

వీరిని ఎలాగైనా ఉద్ధరించాలి. పరమాత్మచేత రక్షింప చేయాలి అని జగన్మాత దీక్షబూనినది.

అందుకే సర్వస్వతంత్రుడైన నిగ్రహానుగ్రహ దక్షుడైన శ్రీమన్నారాయణుని తన ఐశ్వర్య, సౌందర్య సౌశీల్య సౌకుమార్యాది గుణములచే ఆకర్షించినది.

ఆయనయొక్క వక్షఃస్థలంలో నిత్యనివాసమును ఏర్పరచుకున్నది.

సాక్షాత్ క్షమామూర్తిగా విఖ్యాతినొందిన ఈ లక్ష్మీదేవి సంసారార్ణవమగ్నులను కటాక్షించి, వారు భగవత్పాదములను ఆశ్రయించునట్లుగా చేయునట్టి ఘటకురాలు. పైగా ఆశ్రితులపట్ల భగవంతుడు ఆనుకూల్యము ప్రదర్శించునట్లు, క్షమా వాత్సల్యాది గుణ విశిష్టుడైన పరమాత్మ ఆశ్రితులను అనుగ్రహించునట్లుగా ప్రవర్తించే లక్ష్మీదేవి అఘటితఘటనా సమర్థురాలు కూడా.

అందుకే జగన్మాతయైన శ్రీమహాలక్ష్మీదేవియొక్క కటాక్షం కలగాలని శాపగ్రస్తులైన ఇంద్రాది దేవ ప్రముఖులు తమ భార్యలతో కూడినవారై, విష్ణు వక్షఃస్థల వాసియైన శ్రీదేవిని శరణువేడుతున్నారు. ఆమెయొక్క కడగంటి చూపులచేత అనుగ్రహింపబడిన ఇంద్రాది దేవప్రముఖులు ఈ త్రైలోక్య సామ్రాజ్యాన్ని మళ్ళీ పొంది అన్ని విధాలా శాశ్వతమైన అభివృద్ధిగల ఐశ్వర్యాన్ని అనుభవిస్తున్నారు అని వేదాంత దేశికులు "శ్రీస్తుతి" అను స్తోత్రంలో లక్ష్మీకటాక్ష వైభవాన్ని

**"ఆలోక్య త్వా మమృత సహజే విష్ణు వక్షఃస్థలస్థాం**
**శాపాక్రాంతాః శరణమగమన్ సావరోధా స్సురేంద్రాః ।**
**లబ్ధ్వా భూయ స్త్రిభువన మిదం లక్షితం త్వత్కటాక్షైః**
**సర్వాకార స్థిర సముదయం సంపదం నిర్విశంతి ॥"** అను శ్లోకం ద్వారా ప్రకటించినారు.

శ్రీమహాలక్ష్మీదేవియొక్క కటాక్షం ప్రతిక్షణం ఇంద్రాదుల ఐశ్వర్యానికి హేతువు అనే విషయం సర్వజనప్రసిద్ధమని కూరత్తాళ్వాన్ శ్రీ వైకుంఠస్తవంలో

**"యస్యాః కటాక్షణ మనుక్షణ మీశ్వరాణాం ఐశ్వర్య హేతురితి సార్వజనీనమేతత్"** అను సూక్తిచేత సమర్థించినారు.

యామునాచార్యులవారు తాము అనుగ్రహించిన "కాన్తా చతుః శ్లోకీ" అను అద్భుత స్తోత్రము నందలి

**"ఈషత్ త్వత్ కరుణానిరీక్షణ సుధాసంధుక్షణాద్రక్ష్యతే**
**నష్టంప్రాక్ తదలాభతః త్రిభువనం సంప్రత్యనంతోదయం।**
**శ్రేయోనహ్యరవింద లోచన మనః కాంతా ప్రసాదాదృతే**
**సంసృత్య క్షర వైష్ణవాధ్వసు నృణాం సంభావ్యతే కర్హిచిత్ ॥**

అను శ్లోకములో "పుండరీకాక్షుని మనస్సుకు పరమప్రియురాలైన శ్రీమహాలక్ష్మీదేవియొక్క కరుణాకటాక్షము అను అమృతవర్షం ఏ కొంచెం కురిసినా నష్టాలు తొలగుతాయి.

పూర్వం సర్వేశ్వరియైన శ్రీమహాలక్ష్మీదేవియొక్క కటాక్షాన్ని పొందనందువల్ల ముల్లోకాలకు ప్రళయం అనే ఏ నాశము సంభవించినదో, అమ్మవారి కటాక్షముతో ఆ ముల్లోకాలు మళ్ళీ అంతులేని గొప్పతనాన్ని కలిగి ఉండే విధంగా రక్షింపబడినాయి. సకల మానవులకు ఐశ్వర్య కైవల్య మోక్ష (వైకుంఠ) ప్రాప్తిరూపమైన శ్రేయస్సులు సంభవిస్తాయి. ఆమె అనుగ్రహం లేకుండా ఏ విధమైన శుభము కలుగనే కలుగదు. సర్వశుభాలు జగన్మాత కటాక్షాధీనములే" అని పేర్కొన్నారు.

పరమాత్మ తాను చేసిన ఈ సకల చేతనాచేతన సృష్టిని లక్ష్మీదేవి కనువిచ్చి చూస్తే చాలు తన శ్రమంతా తొలగినట్లే అనుకుంటాడు శ్రీమన్నారాయణుని సృష్టినంతటినీ, తన అంగీకారమును ప్రకటింపచేసే తన కటాక్షములచేత సాఫల్యమొనరించును. అట్టి శ్రీమహాలక్ష్మీదేవిని నేను శరణువేడుచున్నాను అని శ్రీ పరాశర భట్టర్‌వారు శ్రీగుణరత్న కోశమందలి

**"శ్రియై సమస్త చిదచిద్విధానవ్యసనం హరేః ।**
**అంగీకారిభిరాలోకై స్సార్థయన్త్యై కృతోఽఞ్జలిః ॥"**

అను మంగళాచరణశ్లోకము ద్వారా తెలిపినారు. ముల్లోకాల్లోని భగవద్భక్తులు, స్వర్గాది లోకాలకు అధిపతులైన దేవేంద్రాదులే కాకుండా, సర్వజగన్నాథుడైన, తనకు తానే ప్రభువైన శ్రీమన్నారాయణుడు కూడా నీ కటాక్షాన్ని కోరుకుంటున్నాడని, అమ్మా లక్ష్మీదేవి! నీ కటాక్షం వల్లనే పరమాత్మ తనను తాను ధన్యునిగా భావించుకుంటున్నాడని కూరత్తాళ్వాన్ శ్రీస్తవంలోని

**"ధన్యం మన్యత ఈక్షణాత్తవ యత స్స్వాత్మాన మాత్మేశ్వరః"** అను సూక్తిచేత పేర్కొన్నారు. మన పూర్వాచార్యులు అనుగ్రహించిన స్తోత్రాలలోని సారమును తెలుసుకునేందుకు ప్రయత్నిద్దాం. ఆ స్తోత్రాల్లో పేర్కొనబడిన "లక్ష్మీ కటాక్ష వైభవాన్ని" గుర్తిద్దాం... లక్ష్మీదేవి కటాక్షమునకు పాత్రులం కావాలని ప్రార్థిద్దాం!

*జై శ్రీమన్నారాయణ!*

# శ్రీరంగనాచ్చియార్ తిరునక్షత్ర సమయనిర్ణయం



క్రిందటినెల ఫాల్గుణ మాసంలో లక్ష్మీతాయారు తిరునక్షత్రోత్సవం 20.3.2011వ తేదీన జరిగింది. మన పంచాంగం అలానే ప్రకటించింది. అయితే కొందరు 19.3.2011న దీనిని ఆచరించారు. ఆ సందర్భంలో తటస్థులుగ ఉండే కొందరికి, మరి కొందరు పెద్దలకు గూడ 'ఏ రోజు సరియైనది?' అనే సంశయం తల ఎత్తింది. శ్రీరంగములో కూడ 19వ తేదీనే జరపడం వల్ల ఈ విషయంలో కొంత వివరణ యివ్వవలసిన అవసరం ఏర్పడింది.

లక్ష్మీ అమ్మవారి తిరునక్షత్రం ఉత్తరఫల్గునీ నక్షత్రాన జరపాలనేది నిర్ణయం. ఒక నక్షత్రాన తిరునక్షత్రప్రయుక్తమైన ఉత్సవం జరపడానికి ఏరోజు తగినదీ అనే విషయంలో మన పూర్వాచార్యులు కొన్ని నిర్ణయాలు చేసి ఉన్నారు.

రోజుకి 24 గంటలున్నట్లుగ తిథి కానీ, నక్షత్రం కానీ, సరిగ్గా 24 గంటలు ఉండాలనే నియమం లేదు. ప్రస్తుతం నక్షత్రాన్ని గురించే తెలుసుకుందాం. 24గంటలు=60 ఘడియలు అవుతాయి. ఘడియలనే 'నాడిక'లని గూడ అంటారు. ఘడియ అంటే 24 నిమిషములని నిర్ణయం. ఒక రోజులో ని.24× ఘ.60=1440 నిమిషాలుంటాయి. 1440÷60=24 గంటలు.

కాల ప్రమాణాన్ని బట్టి, చంద్రుడియొక్క గతినిబట్టి నక్షత్రం ఎన్ని ఘడియలు ఉంటుందనేది తేలుస్తారు. ఒక్కొక్క నక్షత్రం 60 ఘడియలు దాటి కూడా ఉంటుంది. ఒక్కొక్క నక్షత్రం 60 ఘడియలకు తక్కువలోనే ముగిసిపోతుంది. ఇలా నక్షత్రం పెరిగితే 661/2 ఘడియలదాక ఉండచ్చు. తగ్గేటప్పుడు 55ఘడియలే ఉండచ్చు ఒక్కొక్క నక్షత్రం.

60 ఘడియలు దాటి పెరిగిన నక్షత్రం ఉన్నపుడు దానిని "వృద్ధి" అంటారు. 56 ఘడియలు కంటే తక్కువగ నక్షత్రం ఉంటే దానిని "క్షయ" మంటారు. 56 నుండి 60 ఘడియల వరకూ ఉండే నక్షత్రాన్ని "సమ"మంటారు.

ఇదిలా ఉండగ, సూర్యోదయమైనప్పటినుండి సూర్యాస్తమయమైయ్యే వరకూ ఉండే సమయాన్ని 'అహః ప్రమాణం' అంటారు. ఇది వేసవికాలంలో దీర్ఘంగ ఉంటుంది. శీతకాలంలో తక్కువగ ఉంటుందని మనకు తెలుసు. ఈ 'అహస్సు' కాలాన్ని 5 భాగాలుగ చేస్తారు. వాటిని క్రమంగ ప్రాతఃకాలం, సంగవకాలం, అపరాహ్నకాలం, సాయంకాలం, ప్రదోష కాలము అని వ్యవహరిస్తారు. ఇప్పుడు ఈ 5 కాలాల ప్రమాణం (సైజు) కూడా మారే అహస్సు ప్రమాణాన్ని (సైజుని) బట్టి మారుతూ ఉంటుంది. అహస్సు 30 ఘడియలుంటే, పైన చెప్పిన 5 కాలాలలో ఒక్కొక్క కాలమూ 6 ఘడియలుంటుందనేది గుర్తించాలి. 28 ఘడియలే అయితే ఒక్కొక్క కాలముయొక్క ప్రమాణమూ తగ్గుతూ వస్తుంది.

ఇప్పుడు, తిరునక్షత్రాన్ని చేయాలనుకున్నప్పుడు ఆ నక్షత్రం సూర్యోదయంలోపలే పూర్తైపోతే ముందు రోజే ఆ ఉత్సవం చేయాలి. ముందు రోజు నక్షత్రం ప్రారంభమై మరునాటికి సూర్యోదయానంతరం కూడా అదే నక్షత్రం వ్యాపించి ఉన్నప్పుడు ఆ నక్షత్ర ప్రయుక్తమైన ఉత్సవం ముందురోజున చేయాలా, తర్వాతిరోజున చేయాలా అనే సందేహం వస్తుంది. సామాన్యంగ, మిగులునాడే ఉత్సవం చేయాలని అనుకుంటు ఉంటారు. ఇక్కడ గమనించ తగిన అంశాలను ఎన్నో ధర్మశాస్త్ర గ్రంథాలు నిర్ణయించాయి. వాటిలో 'పరమవైదిక సిద్ధాన్తతత్త్వరత్నాకరము' అనే దాంట్లో ఇలా ఉంది.

**"జన్మనక్షత్రఘటికా సంగవస్పృక్ భవేద్యది ।**
**వృద్ధౌషణ్ణాడికాః ప్రోక్తాః క్షయే తిస్ర స్సమే చతుః" ॥** అంటే, ఉత్సవం చేయాలనుకునే వారి నక్షత్రం మరునాటి సూర్యోదయం తరువాత 2వదియైన సంగవకాలంలోకి వ్యాపించి ఉన్నా, లేదా కనీసం సంగవకాలాన్ని తాకి ఉన్నా, ముందు దినాన్ని వదిలి, మరునాటి దినాన్నే ఆ ఉత్సవం చేయాలి. అది వృద్ధి నక్షత్రమైతే మరునాటికి 6 ఘడియలైనా ఉండాలి. అదే నక్షత్రం 'క్షయం'లో ఉంటే మరునాటి సూర్యోదయం తర్వాత కనీసం 3 ఘడియలుండాలి. నక్షత్రం 'సమ'ములో ఉన్నట్లైతే సూర్యోదయానంతరం కనీసం 4 ఘడియలు వ్యాపించి ఉండాలి. ఇదే పై శ్లోకానికి తాత్పర్యం.

ఇక మన అమ్మవారి తిరునక్షత్రం ఉత్తర ఫల్గుని కదా! ఇది 19.3.2011న ఉదయం 10.39 కి ప్రారంభమైంది. ఆనాడు

అహఃప్రమాణం ఘ. 29.56వి ఉంది. అంటే ఒక్కొక్క కాలమూ ఘ5.59 వి. ఉంటుంది. అంటే 2 గంటల 24 నిమిషాలన్నమాట. సూర్యోదయం ఉ.గం.6.21 ని.అయింది.అప్పుడు ప్రాతఃకాలం గం.8.45ని. సంగవకాలం గం.11.09 వరకు. అంటే ఉదయం 10.38దాక పూర్వఫల్గుని ఉండి ఆ పై ఉత్తర ఫల్గుని వచ్చింది. ఈ నక్షత్రం 'విద్ధ' అనే దోషంతో కూడి ఉంది 19వతేదీన. మరునాడు అంటే 20 వ తేదీన సూర్యోదయం గం.6.21ని. ఆనాడు అహః ప్రమాణం ఘ.29.56వి. అంటే ఒక్కొక్క కాలమూ ఘ.5.35 వి. అంటే గం.2.14ని దీనిని బట్టి 20 వ తేదీన ప్రాతఃకాలం గం. 8.35 దాక సంగవ కాలం గం. 10.49 దాక ఉంది. ఉత్తరఫల్గునీ నక్షత్రం 20వ తేదీన ఉదయం గం.9.02 దాక ఉంది. అంటే సంగవకాలంలో 0.27 నిమిషాలు దాక కూడా ఉంది. పైగా 20వ తేదీన ఉత్తర ఫల్గునీ, విద్ధ దోషం లేకుండా, సంగమవ్యాప్తి కలిగి ఉంది.

అందుచేత అమ్మవారి తిరునక్షత్రం 20 వ తేదీన జరపడమే సరియైనది తప్ప 19 వ తేదీన కాదు. ఇంతే కాక ఉత్తరఫల్గునీ నక్షత్రం 55 ఘడియల 57 విఘడియలు ఉంది. అందుచేత దీనిని 'క్షయ' నక్షత్రమని గుర్తించాలి. అలాంటపుడు 'క్షయే త్రిసః' అనే ప్రమాణాన్ని బట్టి, సూర్యోదయం తర్వాత 3 ఘడియలుంటే చాలు, ముందురోజు వదలి 20 వ తేదీన జరుపవలసి ఉంటుంది. ఆలాంటిది ఆ నక్షత్రం 20 వ తేదీన 6 ఘడియల 43 విఘడియలు వ్యాపించి ఉంది. అంచేత కూడా 20 వ తేదీన ఉత్సవం జరపడమే సర్వథా యుక్తమే తప్ప 19 వ తేదీన తగదు. పై గ్రంథములోనే అమ్మవారి తనియన్ ను కూడా ఇలా చెప్పారు...

**"మీనే చోత్తర ఫల్గుణ్యాం సంభూతాం శ్రియమాశ్రయే ।**
**విష్ణోర్దివ్య పదాంభోజఘటకాం తత్పదాశ్రయామ్"॥**

*వ.వై.సి.త.రత్నాకరం.*

# ధార్మిక శ్రద్ధ



మార్చి1వ తేదీన సీతానగరం వేదవిశ్వవిద్యాలయ ప్రాంగణంలో శ్రీ స్వామివారి అనుగ్రహంతో, విజయవాడ వాస్తవ్యులు శ్రీమాన్ జి.ఎస్.ఎన్. రాజుగారు, ఆచార్యతిరువడిని చేరిన తమ ధర్మపత్ని శ్రీమతి సుజనలక్ష్మి జ్ఞాపకార్థం గోదాన, దంపతీపూజా కార్యక్రమాలను నిర్వహించారు. వారి కుమారులు శ్రీమాన్ శ్రీనివాసరాజు, కోడలు శ్రీమతి సుజాత, రాజుగారి కుమార్తె శ్రీమతి సరిపల్లి శారద అల్లుడు శ్రీమాన్ సీతారామరాజు, రాజుగారి తమ్ముని కుమారుడు శ్రీమాన్ సాగి తులసీ రామకృష్ణంరాజు దంపతులు ఎంతో శ్రద్ధాభక్తులతో, సంప్రదాయరీతిలో సవత్సంగ, సాలంకృతంగ 11 గోవులను దానమిచ్చారు. 11మంది శిష్టులైన దంపతులకు పూజ నిర్వహించి, సువర్ణ పుష్పం, రజత తమలపాకులు, వస్త్రాలతో సత్కరించి, సంభావన సమర్పించారు. వేదవిద్యార్థులను, పరివారాన్నందరినీ సంభావించారు.



ఎప్పటినుంచో జరపాలనుకున్న ఈ కార్యక్రమాన్ని ద్వాదశినాడు జరపమని శ్రీ స్వామివారి అనుగ్రహించడంతో నేటికి చేయగలిగామని శ్రీమాన్ రాజుగారు ఆనందంగా తెలిపారు.

"దంపతీపూజ, గోదానం వంటివి మన సంప్రదాయ విశిష్టతను తెలిపేవి. వాటిని నిర్వహించడం ద్వారా శ్రీమాన్ రాజుగారికి ఉన్న ధార్మిక శ్రద్ధ ఎంతటిదో తెలుస్తోంది. ఈ శ్రద్ధను తమ తరువాత తరాలవారికి కూడ అందించగలిగారనడానికి నిదర్శనంగ వారి కుటుంబసభ్యులంతా ఈ కార్యక్రమంలో అన్వయించడమే నిదర్శనం. భార్య జ్ఞాపకార్థం ఇంత చక్కటి కార్యక్రమాన్ని నిర్వహించడం వారికున్న ఆచార్యనిష్ఠను తెలియచేస్తోంది" అని శ్రీస్వామివారు మంగళాశాసనాలు చేసారు.

# నంజీయర్ వైభవము

ఉ.వే. శ్రీమాన్ ఎన్.వి.ఎల్.ఎన్. రామానుజాచార్యస్వామి - నరసాపురం.

నంజీయర్‌వారు పరాశర భట్టరువారి శిష్యులు. వీరు తిరునారాయణ పురము నందు విజయనామ సంవత్సరమున మీనమాసము ఉత్తరపల్గునీ నక్షత్రమునందు అవతరించిరి.

వీరు మొదట అద్వైత సంప్రదాయస్థులు. మాధవాచార్యులనిపేరు. 'వేదాంతి'అను బిరుదముతో షడ్దర్శనములకు షడాసనంబిడి మతాంతర విద్వాంసులను జయించు చుండిరి.

వీరి ఖ్యాతిని వినిన శ్రీపరాశరభట్టరు శ్రీరంగపట్టణము వేంచేసి తొమ్మిది దినములు వీరితో వాదముచేసి జయము నిర్ణయముగాక పదియవదినమున **'తిరునెడున్దాణ్డక'**మునగల రహస్యార్థముల నుపన్యసింపగా వేదాంతి సంభ్రమాశ్చర్యము లతో భట్టరువారి శ్రీపాదముల నాశ్రయించెను. వారివలన పంచసంస్కారములు పొంది భగవద్రామానుజ దర్శనమునందు అభిమానముగలవారైరి.

శ్రీభట్టరును శ్రీరంగమునకు వేంచేసి వేదింతిని జయించిన విషయమును 'తిరునెడున్దాణ్డక' దివ్యప్రబంధ రహస్యార్థములను శ్రీరంగని సన్నిధిలో విన్నవించిరి. ఆ మరునాటినుండి అధ్యయనోత్సవ ప్రారంభము. తదాదిగా భట్టర్ విజయ సూచకముగా నేటికిని అధ్యయనోత్సవమునకు ముందు దివసమున శ్రీరంగములో తిరునెడున్దాణ్డక ఉత్సవము జరుగుచున్నది.

వీరి ఆచార్యాభిమానము పరమవిలక్షణమైనది. వీరు శ్రీపరాశర భట్టరువారి సన్నిధిలో దివ్యప్రబంధార్థములను సేవించి రస్యముగా ఉపన్యసించెడివారు.

తిరువాయ్‌మొழி **'తిరుక్కురుగై ప్పిరాన్ పిళ్ళాన్'** అనుగ్రహించిన **'ఆరాయిఅప్పడి'** వ్యాఖ్యానము అతిసంగ్రహముగా నుండుటచే భట్టర్ నియమనానుసారము ఒన్బది నాయిరప్పడి' వ్యాఖ్యను అనుగ్రహించిరి. అంతేగాక తిరుప్పావునకు ఈరాయిరప్పడి వ్యాఖ్యానము, తిరుప్పల్లాణ్డునకు నాలుగు అన్దాదులకుకణ్ణినుణ్ శిరుత్తామ్బు నకు ఉఱై, శరణాగతి గద్యమునకు వ్యాఖ్యానము అనుగ్రహించిరి. అంతేగాక రహస్యత్రయ వివరణ రూపముగా నూటయెనిమిది గ్రంథములు అనుగ్రహించిరి. వీరు నూరుసంవత్సర ములు ఈ లీలావిభూతిలో వేంచేసియుండి నూరుమార్లు తిరువాయిమొழி కాలక్షేపమును అనుగ్రహించిరి. ఆసందర్భములలో వీరు అనుగ్రహించిన శ్రీసూక్తులను పెద్దలవలన తెలిసి కొనవలెను.

భట్టర్‌వారిచే 'నమ్ముడైయ జీయర్'అని అభిమానింపబడుటచే వీరికి 'నంజీయర్' అను తిరునామ మేర్పడినది.

**"నమ్బెరుమాళ్ నమ్మాళ్వార్ నఞ్జీయర్ నమ్బిళ్ళై"** అని ప్రస్తుతింపబడిన ఆప్తతమ వర్గములో వీరు ఒకరుగా ప్రసిద్ధినొందిరి.

**తిరునక్షత్రము:** మీనము– ఉత్తర.

**ఆచార్యులు:** శ్రీపరాశరభట్టర్,

**శిష్యులు:** నంబిళ్ళై, సేనాపతిజీయర్ మున్నగువారు మొదలగువారు.

**తిరునక్షత్రతనియన్ :–**

ఫాల్గునోత్తరఫల్గున్యాం జాతం వేదాన్త సన్మునిమ్।
శ్రీపరాశరభట్టార్య పాదరేఖామయం భజే॥
నమో వేదాన్తవేద్యాయ జగన్మంగళ హేతవే।
యస్యవాగమృతాసారపూరితం భువనత్రయం॥

**వాழி తిరునామమ్:–**

తెణ్డిరై శూழ் తిరువరఙ్గం శెழிక్కవన్దోన్ వాழிయే
శీమాతవనెన్నుమ్ శెల్వనార్ వాழிయే
పణ్డమఱై త్తమిళ్ పొరుళై ప్పకరవన్దోన్ వాழிయే
పఙ్గునియిల్ ఉత్తిరైనాళ్ పారుతిత్తాన్ వాழிయే

---

**వారిమనసు వెన్న :** శ్రీకాకుళం జిల్లా మున్సిపల్ ఆఫీస్ సిబ్బంది అందరూ కలిసి 20,000 రూ॥ లను విజయనగరం నేత్ర విద్యాలయానికి సమర్పించారని వారి మంచి మనసు అభినందనీయమని ఆముదాలవలస వి.టి సెక్రటరీ శ్రీమాన్ చక్రవర్తి తెలిపారు.

అలాగే విజయనగరం, విశాఖ, శ్రీకాకుళం, తూర్పుగోదావరి జిల్లాలలో క్యాన్సర్ అవగాహన కార్యక్రమాలు నిర్వహించారని ఆ జిల్లాల ఇన్‌చార్జ్ శ్రీమతి గాయత్రి గారు తెలిపారు.

## మందస వాసుదేవ పెరుమాళ్ బ్రహ్మోత్సవాలు

ది. 22-2-2011 నుండి 28-2-2011 వరకు మందస శ్రీ వాసుదేవ పెరుమాళ్ ద్వితీయ బ్రహ్మోత్సవాలు శ్రీశ్రీశ్రీ త్రిదండి అహోబిల రామానుజ జీయరు స్వామివారి ప్రత్యక్ష పర్యవేక్షణలో శ్రీమాన్ ముదుంబై మధుసూదనాచార్యస్వామి యాజ్ఞీకమున అత్యంత వైభవంగా జరిగాయి.

శ్రీమాన్ పురుషోత్తమ రామానుజదాస్, శ్రీమాన్ దయానిధి గ్రామగ్రామాల్లో శ్రీవాసుదేవ ప్రచార రథములో వెళ్ళి అందరినీ ఆహ్వానించారు. శ్రీమాన్ కిళ్ళంశెట్టి వెంకటరమణగారి నేతృత్వంలోని శ్రీవాసుదేవ సేవాసమితి వేదికను సర్వాంగ సుందరముగా సిద్ధంచేసి వచ్చే భక్తులందరికీ విశేష తదీయారాధన చేసింది. శ్రీమాన్ దేవరశెట్టి అప్పారావు వారి కుటుంబ సభ్యులు యాగ యాజమాన్యం వహించగా ప్రతిరోజు విశేష హోమకార్యక్రమములు, వేద, ఆగమ, పురాణ, ప్రబంధ పారాయణలు జరిగాయి.

శ్రీ వాసుదేవ పెరుమాళ్ దేవేరులతో ఉదయం, సాయంత్ర సమయాలలో తిరువీధిలో వివిధవాహనాలపై వేంచేసి, మందస శ్రీపాత్తాంగుల వయ్యారి నడకలతో భక్తులను అనుగ్రహించారు. శ్రీవాసుదేవ పెరుమాళ్ కళ్యాణ మహోత్సవంలో శ్రీమాన్ ఊన కామేశ్వరరావుగారు వారి కుటుంబసభ్యులు సమర్పించిన సుందరమైన వెండికిరీటమును శ్రీ అహోబిల రామానుజ జీయర్‌స్వామివారు లక్ష్మీ అమ్మవారికి అలంకరింప చేశారు.

కళ్యాణ శ్రీవాసుదేవ స్వామి దేవేరులతో గరుడవాహనముపై వేంచేసి గోపాల సాగర ప్రాంగణమును సందర్శించారు. సరియైన ఏర్పాట్లు చేసుకోలేకపోయినా, శ్రీ అహోబిల స్వామివారి సంకల్పానుసారం నౌకావిహారములో దర్శనమిచ్చాడు. ఈ సందర్భముగా స్పందించిన భక్తులు వచ్చే బ్రహ్మోత్సములలో చక్కగ శ్రీవాసుదేవస్వామితో నౌకావిహారములో పాల్గొనేట్లుగా పెద్ద నౌక (ఫంట్)ను తయారు చేసుకోవటానికి తగిన ప్రోత్సాహమును తెల్పుతూ ఒక లక్షరూపాయలు వరకు కైంకర్యములను అందించారు. భద్రత కొరకై వచ్చిన పోలీసుశాఖవారు భక్తిశ్రద్ధలతో భక్తులకు తమ సేవలందించటమే కాక స్వామికి చేయించే నౌక (ఫంట్)కి విశేష విరాళములను అందించటం గమనార్హం.

శ్రీ వాసుదేవస్వామి సన్నిధిలో రాజగోపురంలో జరిగే నిర్మాణములకు పాత్రకొండవాస్తవ్యులు శ్రీమాన్ ఇప్పిలి మోహనరావు 1,50,000/-లు, ఇచ్ఛాపురం వాస్తవ్యులు శ్రీమాన్ వల్లంపాటి కృష్ణప్రసాద్, దేవి కామేశ్వరి దంపతులు 2,500 అడుగుల టైల్స్, వికాసతరంగిణి టెక్కలి శాఖవారు రూ.54,000/-లు నిర్మాణ పనులకు సమర్పించారు. నిర్మాణ పనులు పూర్తి అయిన గదులను శ్రీ వాసుదేవ సేవాసమితి సభ్యులతో కలసి శ్రీ అహోబిల జీయరు స్వామివారు ప్రారంభోత్సవం కావించారు. శ్రీమాన్ సుడియా సురేష్, శ్రీమాన్ వడ్డి చంద్రశేఖర్, శ్రీ చిన్న జీయరు స్వామివారు సూచించిన విధంగా నిర్మాణములను చేయిస్తున్నారు.

శ్రీ వాసుదేవ స్వామి ఆలయం మందస గ్రామములో ఉన్నా ఇది కేవలం మందస గ్రామస్థాయికే పరిమితమైన ఆలయం కాదు. ఇది గొప్ప ప్రాచీన సంప్రదాయ క్షేత్రము. దీనిని దేశ విదేశాలలోని భక్తులంతా సందర్శించే స్థాయిలో తగిన నిర్మాణములను జరుపుకోవాలి. దానికి కృషి చేస్తున్నాము. మీరంతా సహకరించండని శ్రీ వాసుదేవ సేవాసమితి గౌరవాధ్యక్షులు మాజీ ఎమ్.ఎల్.ఎ. శ్రీమాన్ గౌతు శివాజి పిలుపునిచ్చారు. తిరుమలలో జరిగే బ్రహ్మోత్సవ స్థాయిలో మందస గ్రామంలో జరుపుకుంటున్నామంటే ఈ ప్రాంతముపై శ్రీ చిన్న జీయరు స్వామివారి కృపా ప్రసరణమే. దానిని మనమంతా కలసి సద్వినియోగ పరుస్తూ శ్రీస్వామివారు సూచించిన విధంగా గ్రామములను తీర్చిదిద్దుకొని వికాసము పొందుదాం అన్నారు.

---

## శ్రీభగవద్రామానుజ వార్షిక తిరునక్షత్రోత్సవములు

**ది28-04-11నుండి 07-05-2011వరకు**

నరసాపుర నగరమున శ్రీకృష్ణసదనమునందు అర్చారూపమున వేంచేసి యున్న శ్రీభగవద్రామానుజులవారి వర్ష తిరునక్షత్రోత్సవములు జరుగును.

ఈ సందర్భముగా ది. 01-05-2011నాడు సంప్రదాయప్రచారనిర్వాహకులునైన

**ఉ.వే. శ్రీమాన్ తూపురాణి ఉడయవర్ స్వామివారికి**

శ్రీమత్పరమహంసేత్యాది **శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన శ్రీమన్నారాయణ రామానుజజీయర్‌స్వామివారి మంగళాశాసనములతో**

శ్రీమత్పరమహంసేత్యాది **శ్రీశ్రీశ్రీ త్రిదండి అహోబిల రామానుజ జీయర్‌స్వామివారి** కరకమలములద్వారా

**ఉభయవేదాన్త వాచస్పతి** పురస్కారము సమర్పణ జరుగును.

**భగవద్బంధువులు అందరు ఈ కార్యక్రమమునకు విచ్చేసి భగవద్రామానుజులవారి కృపకు పాత్రులు కావలసినదిగా కోరుచున్నాము.**

**గమనిక: కార్యక్రమమునకు విచ్చేయు భాగవతోత్తములకు తదీయారాధన సౌకర్యముగలదు.**

**వేదిక: శ్రీకృష్ణసదనము, వైష్ణవవీధి, నరసాపురము ప.గో.జిల్లా.**

**ఇట్లు ఉభయవేదాంతసభా, నరసాపురము**

**బాలనివేదన** చక్కని రంగులు వేయండి!.. కళ్యాణరాముని సేవించండి!!



జై శ్రీమన్నారాయణ!

## జీవాగురుకులము, క్రొత్త విద్యార్థులకు ఆహ్వానం

**(శ్రీశ్రీశ్రీ చిన్నజీయర్‌స్వామివారి JIVAకు చెందినది)**

**ప్రస్తుతం 150 మంది విద్యార్థులకు స్కూలు వైదిక విద్యలను బోధించే ఈ గురుకులంలో ఈ ఏడాది చేరడానికి రుచి, శ్రద్ధకల విద్యార్థులు అప్లికేషన్లు పెట్టుకోవచ్చు.**

**బోధనామాధ్యమం** – ఇంగ్లీషు & సంస్కృతం.
**బోధనాంశాలు** – వేద, శాస్త్రముల అధ్యయనం
**అభ్యాస కాలం** – 10 సం॥లు
**అభ్యర్థి వయస్సు** – 8సం॥ నుండి 12సం॥ లోపు
**కనీస అర్హతలు** – ఇంగ్లీషు, తెలుగు చక్కగ చదువుట, వ్రాయుట. వైదికవేషంలో ఉండాలి.
**ప్రవేశ పరీక్ష** – జూన్ 20, 21 తేదీలలో
**దరఖాస్తులు మాకు చేరవలసిన ఆఖరుతేది** – మే, 15వ తేది
**దరఖాస్తుఫారాలు లభించుచోటు** www.chinnajeeyar.org/JIVA/jgappform.aspx or జీవా ప్రాంగణంలో కూడ లభిస్తాయి.
**మరిన్ని వివరాలకు సంప్రదించండి** 93462 62189/ 94415 83064.

**ఇతర వివరాలు**

- ✡ అభ్యర్థి పూర్ణ ఆరోగ్యంతో చురుకుగ ఉండాలి. ప్రవేశ పరీక్షలో ఉత్తీర్ణులైతేనే మౌఖిక పరీక్షకు పిలుస్తారు. అందులో ఉత్తీర్ణులకే గురుకుల ప్రవేశం.
- ✡ 4వ సం॥ ఇంగ్లీషు మీడియంలో స్టేటుసిలబస్ 10వ తరగతికి పంపిస్తారు.
- ✡ 5వ సం॥ నుండి IGNOU వారి డిప్లమా డిగ్రీకోర్సులకు తయారు చేస్తారు.

**JIVA, శ్రీరాంనగరం,
ముచ్చింతల్–509 325
శంషాబాద్, రంగారెడ్డి జిల్లా.**



పరమహంస పరివ్రాజకులు

# శ్రీశ్రీశ్రీ చిన్నజీయర్‌స్వామివారి ప్రచారవార్తలు



మార్చి 3 వతేదీ సీతానగరం ఆశ్రమంలో శ్రీస్వామివారు మంత్రోపదేశాన్ని అనుగ్రహించారు.

ఈ సందర్భంగా శ్రీ స్వామివారు ఉపదేశిస్తూ "సర్వజీవుల్లోనూ, విశ్వమంతా వ్యాపించి వున్న శ్రీ మహావిష్ణువును తెలుసుకోవాలని, అన్నింటా ఆస్వామిని దర్శించే స్థితిని అలవరచుకొని, శాంతియుత జీవనం సాగించాలని" ఉద్బోధించారు. "మన దైవాన్ని మనం ఆరాధించుకోవడం, అలాగే ఇతరులను ఆదరించడం అవరచుకోవాలన్నారు. దేవుడు సృష్టించినవన్నీ మంచి వేనని వాటిని తెలుసుకోవాలన్నారు". పంచసంస్కారాల యొక్క విశిష్టతను తెలియజేసి భక్తులు అడిగిన పలు సందేహాలకు శ్రీస్వామివారు సమాధానాలు కృపచేశారు.

మార్చి 4 వతేది సాయంత్రం శ్రీస్వామివారు రాజమహేంద్రిలో వేంచేసియున్న శ్రీరంగనాథ పెరుమాళ్ళ ద్వితీయ బ్రహ్మోత్సవాలను ప్రారంభించారు.

5వ తేది సాయంత్రం మెదక్ జిల్లాలోని గౌరారంలో సుమారు 100 సం. క్రితం శ్రీ భావానంద సరస్వతివారు ప్రారంభించిన శ్రీ పాండురంగాశ్రమానికి వేంచేశారు. నిర్వాహకులు శ్రీమాన్ సత్యనారాయణాచార్యుల ఆహ్వానం మేరకు అక్కడ శ్రీ సత్యనారాయణ స్వామి సహస్రవ్రత ఉత్సవాన్ని ఆరంభించారు.

శ్రీస్వామివారు అనుగ్రహభాషణ గావిస్తూ ఇంత మారుమూల గ్రామంలో సువిశాలమైన ఆశ్రమాన్ని నిర్మించి ఇక్కడ ప్రతి ఒక్కరికి ఆధ్యాత్మిక సౌరభాలను అందించిన శ్రీ భావానందసరస్వతి స్వామివారి గొప్పతనాన్ని కొనియాడారు. వారి పరంపరలో వారు చేస్తున్న కార్యక్రమాలు మరింతగా లోకానికి శుభం చేకూర్చుగాక అని శ్రీస్వామివారు మంగళాశాసనాలు చేశారు. ఈ కార్యక్రమంలో శ్రీమాన్ దైవజ్ఞశర్మగారు, అన్నవరం, నాచారం గుట్ట, యాదగిరిగుట్ట అర్చక, వేదపండిత బృందం పాల్గొన్నారు. వారందరికీ శ్రీ స్వామివారు మంగళాశాసనాలు చేసి ఆరాత్రికి వరంగల్ జిల్లా, జనగాం చేరి శ్రీ శ్రీనివాస్‌గారి గృహంలో బసచేశారు.

6 వ తేది ఉదయం జనగాం శ్రీ వేంకటేశ్వర ఆలయంలో వెండితాపడం చేసిన ప్రధానద్వార ఉద్ఘాటన, వేంకటేశ్వరునికి రజత కిరీట సమర్పణ, రాజగోపుర శంకుస్థాపన కార్యక్రమాలు శ్రీస్వామివారు గావించారు.

శ్రీస్వామివారు ఆలయ అభివృద్ధిని ఇంత సమర్థవంతంగా నిర్వహిస్తున్న శ్రీమాన్ టి.ఎన్.సి. సంపత్కుమార కృష్ణమాచార్య (మన పంచాగకర్త) వారిని, వారిపరివార బృందానికి మరిన్ని కార్యక్రమాలు చేయగలిగే శక్తిని భగవంతుడు అనుగ్రహించుగాక అంటూ మంగళాశానాలు కృపచేశారు. అక్కడినుండి సూర్యాపేటలో శ్రీమాన్ డా॥ చంద్రశేఖర్, శ్రీమతి డా॥ పవిత్ర నూతనంగా నిర్మించిన శ్రీ సాయిప్రసాద్ హాస్పిటల్‌ను ప్రారంభించారు. కార్యక్రమంలో ఎం.ఎల్.ఎ. శ్రీమాన్ దామోదర్‌రెడ్డిగారు ముఖ్య అతిథిగా విచ్చేశారు. డాక్టర్లు భగవంతుని తరపున ఈ లోకానికి ఆరోగ్యసేవలను అందించే వారిగా అభివర్ణిస్తూ అక్కడి వారందరకు మంగళాశాసనాలు కృపచేశారు.

అనంతరం శ్రీమాన్ వేణుగోపాలాచార్యస్వామి (వేంకటేశ్వర స్వామి ఆలయ అర్చకులు), వారన్నగారు శ్రీమాన్ మురళీధరాచార్యుల కుమారుల ఉపనయన కార్యక్రమానికి వేంచేసి వటువులను ఆశీర్వదించారు. "వేద అధ్యయనం ప్రపంచ ప్రగతికి ఎంతో అవసరమని, దానికి ఉపనయనసంస్కారం మొట్టమొదటి మెట్టని" శ్రీ స్వామివారు ఉపనయన ప్రాశస్త్యాన్ని వివరించి, మంగళాశాసనాలు కృపచేసారు. రాత్రికి నల్గొండజిల్లా హాల్యాపట్టణంలో శ్రీరామాలయ ప్రతిష్ఠాకార్యక్రమంలో భాగంగా యంత్ర ప్రతిష్ఠ గావించారు. శ్రీమాన్ రాంబాబుగారింట్లో బసచేశారు.

7వ తేది ఉదయం ఆలయంలో శ్రీరామాలయంలో మహాకుంభాభిషేకాన్ని గావించారు. ఈ కార్యక్రమానికి ముఖ్యఅతిథిగా రాష్ట్రగ్రామపంచాయితీ మంత్రివర్యులు శ్రీమాన్ జానారెడ్డిగారు విచ్చేశారు. 'అహల్య'గా వున్న ఆ ఊరు పేరు కాలక్రమేణ 'హాల్య'గా మారి ఉండవచ్చు కనుక తిరిగి దానిని 'అహల్యగా' మార్చితే బాగుంటుందన్న శ్రీస్వామివారి సూచనకు మంత్రిగారు స్పందిస్తూ, తప్పకుండా ప్రభుత్వంతో, సంబంధిత శాఖతో మాట్లాడి మార్పు జరిగేట్టుగా చూస్తామని వాగ్దానం చేసారు.

ఆలయాలు ప్రజలందరిని తరతమ భేదాలు లేకుండా ఒకచోట చేర్చి సమాజానికి శ్రేయస్సును, సుఖాన్ని కలుగచేస్తాయని, వాటిని కాపాడుకోవలసిన బాధ్యత అందరిపైనా ఉంటుందని శ్రీస్వామివారు ఉద్బోదించారు. కార్యక్రమాన్ని నిర్వహించిన శ్రీమాన్ యాదగిరి, లింగారెడ్డి, నారాయణ మరియు మోహన్‌రావుకి, పాల్గొన్న భక్తులందరికి శ్రీస్వామివారు మంగళాశాసనాలు చేశారు.

ఆరోజు సాయంత్రం 7 గంటలకు శ్రీరాంనగరం బయలు దేరారు. మార్గమధ్యంలో హైదరాబాద్‌లోని ఎల్.బి.నగర్‌లో శ్రీమాన్ జయప్రకాశ్‌రెడ్డి, శ్రీమతి గీత గార్ల నూతన గృహానికి మంగళాశాసనం చేసి శ్రీరాంనగరం చేరుకున్నారు.

9,10, వ తేదీల్లో శ్రీ స్వామివారు ఆశ్రమప్రాంగణంలో జరుగుతున్న వివిధ నిర్మాణాలను పర్యవేక్షించి తగు సూచనలు చేశారు.

11వ తేది శ్రీకిషన్‌ప్రభు ధర్మప్రచార సమితి పంచదశ వార్షికోత్సవం సందర్భంగ వారి ఆహ్వానం మేరకు వెలిజాల గ్రామంలో శ్రీరామకోటి జపయజ్ఞం, గీతాయజ్ఞ కార్యక్రమంలో పాల్గొన్నారు. ఈ కార్యక్రమంలో సినీనటులు శ్రీ సుమన్, కల్వకుర్తి M.L.A శ్రీమాన్ జైపాల్ యాదవ్, శ్రీ శంకరానంద్‌స్వామి, శ్రీప్రఫుల్ల చైతన్యానంద మొదలైన ప్రముఖులు పాల్గొన్నారు.

12 వ తేదీ ఉదయం హైదరాబాద్‌లోని ఎల్.బి.నగర్‌లో గల శ్రీవైష్ణవ సంఘం ఏర్పాటుచేసిన కార్యక్రమంలో 'శ్రీ వైష్ణవదినచర్య' డైరీని ఆవిష్కరించారు. ఈ కార్యక్రమంలో అతిథులుగా పాల్గొన్న రాష్ట్ర దేవాదాయ రెవెన్యూ ముఖ్య కార్యదర్శి శ్రీమాన్ రమణాచారి, ఎం.ఎల్.ఎలు శ్రీమాన్ వేణుగోపాలాచారి, శ్రీమాన్ సుధీర్‌రెడ్డి, పంచాంగ కర్త శ్రీమాన్ వేణుగోపాలాచార్యులు, శ్రీమాన్ కె.టి. రామానుజాచార్యులు, శ్రీమాన్ కె.నర్సింహులు, శ్రీమాన్ బి.ఎన్.చారి, శ్రీమాన్ ఎస్. రామానుజాచార్యులు, శ్రీమాన్ ప్రహ్లాదాచార్యులు తదితరులు, భక్తులు పాల్గొన్నారు. వారందరికీ శ్రీ స్వామి వారు మంగళాశాసనాలు అనుగ్రహించారు.

ఆతర్వాత హైదరాబాద్, కుద్బుల్లాపూర్, గోదావరి హోమ్స్ సుచిత్రలోని శ్రీవేంకటేశ్వరాలయ ప్రతిష్ఠ కావించారు. తరువాత కావేరీ సీడ్స్ అధినేత శ్రీమాన్ భాస్కరరావు వనజదంపతుల గృహానికి వేంచేసి మంగళాశాసనాలు కావించారు. జగిత్యాలకు బయలు దేరుతూ మార్గమధ్యంలో ప్రజ్ఞాపూర్ దగ్గర కుక్కునూరుపల్లిలో నిర్మాణమవుతున్న ఆంజనేయస్వామి ఆలయాన్ని సందర్శించి తగిన సూచనలందించారు.

13వ తేది జగిత్యాలలో ఇటీవల పునర్నిర్మించిన శ్రీవేణుగోపాల స్వామి ఆలయ రాజగోపుర సంప్రోక్షణ కావించి కరీంనగర్ జిల్లాలోని వెదురుగట్ట శ్రీవేంకటేశ్వర ఆలయబ్రహ్మోత్సవా లలో పాల్గొన్నారు. వావిలాల, గ్రామంలో రామాలయ ప్రాంగణంలో వికాసతరంగిణి నూతన ఆఫీస్‌ను ప్రారంభించారు. శ్రీమాన్ ఆనందరావు-సుగణ గార్ల ఆహ్వానం మేరకు పైడిమడుగులోని గీతామందిరాన్ని సందర్శించి అక్కడివారికి మంగళాశాసనం గావించి రాత్రికి శ్రీలక్ష్మీనరసింహ స్వామి బ్రహ్మోత్సవంలో భాగంగా వెలిచాలకు చేరుకున్నారు.

14వ తేది ఉదయం శ్రీస్వామివారు భక్తులకు మంత్రోపదేశం కృపచేశారు. శ్రీమాన్ రాందేవ్ బాబా ఆహ్వానం మేరకు వారు నిర్వహిస్తున్న యోగ శిబిరాన్ని సందర్శించారు.

15 ఉదయం లోకంలో ఫలసంపద అభివృద్ధి చెందాలని వృక్షకళ్యాణాన్ని జరిపించారు. సాయంత్రం లక్ష్మీనరసింహస్వామి కళ్యాణోత్సవంలో ఎదుర్కోలు ఉత్సవంలో పాల్గొన్నారు. శ్రీమాన్ కందాడై రామానుజాచార్యులు, శ్రీమాన్ బాపట్ల సత్యనారాయణా చార్యులు మొదలైన వేదపండితులు పురప్రముఖులకు శ్రీస్వామివారు మంగళాశాసనాలు కృపచేశారు. అల్లంపల్లి జీయరు గురుకులం నుండి వచ్చిన 10వ తరగతి విద్యార్థులకు పరీక్ష కిట్‌లను శ్రీస్వామివారు అందచేశారు. మరునాడు శ్రీలక్ష్మీనరసింహస్వామివారి కళ్యాణోత్సవాన్ని వైభవంగా జరిపించి కార్యక్రమ నిర్వాహకులు శ్రీమాన్ వీర్ల ప్రభాకరరావు దంపతులకు, పాల్గొన్న వారందరికి మంగళాశాసనాలు అనుగ్రహించారు.

16వ తేదీ ఉదయం మన వి.టి. వైస్ ప్రెసిడెంట్ శ్రీలక్ష్మీనరసింహారావు వారి ఆహ్వానంపై చలిమెడ ఆనందరావు వైద్యవిజ్ఞాన కళాశాలలో శ్రీలక్ష్మీహయ గ్రీవస్వామివారి విగ్రహాన్ని ఆవిష్కరించి, కేన్సర్ హాస్పిటల్‌కు శంకుస్థాపన గావించి, కోరుట్లలోని వేణుగోపాలస్వామి ఆలయాన్ని సందర్శించి కోరుట్ల వికాసతరంగిణి సేకరించిన స్థలాన్ని పర్యవేక్షించి మంగళాశాసనాలు చేశారు. అనంతరం ఉ.వే. శ్రీమాన్ శ్రీ నంబి వేణుగోపాలచార్య స్వామి (కౌశిక్) వారి ఆధ్వర్యంలో శ్రీ అష్టలక్ష్మి సేవాసమితి నిర్వహిస్తున్న శ్రీఅష్టలక్షీసహిత శ్రీ లక్ష్మీనారాయణస్వామి దేవాలయ ద్వితీయ వార్షికోత్స బ్రహ్మోత్సవాలలో పాల్గొని మంగళాశాసనాలు కృపచేసి ఆ రాత్రికి వరంగల్ చేరుకున్నారు.

డా॥ బచ్చు మురళీకృష్ణగారి హాస్పిటల్‌లో నూతనభవనం "మిత్ర" ప్రారంభించి అనంతరం వి.టి. సమావేశంలో పాల్గొన్నారు.

17వ తేదీ ఉదయం శ్రీమాన్ ముడుంబై రామానుజాచార్య స్వామివారి 90 తిరునక్షత్రోత్సవ కార్యక్రమానికి వేంచేసి మంగళాశాసనాలు గావించి భీమవరం చేరుకున్నారు.

18, 19 తేదీలలో భీమవరం వికాసతరంగిణి వారు ఏర్పాటుచేసిన కార్యక్రమాలలో శ్రీస్వామివారు ప్రవచనాన్ని అనుగ్రహించారు. శ్రీమాన్ గణేశ్‌రాజుగారి నేతృత్వంలో మన భీమవరం వికాసతరంగిణివారు అనేక సేవాకార్యక్రమాలను అందిస్తున్నారు. అందలో భాగంగానే ఆ రామాలయానికి 39వేల రూ॥లతో రంగులు వేయించారు. స్థానిక అంధులపాఠశాలలోని విద్యార్థులకోసం ఫ్యాన్స్ మరియు వస్త్రాలను అందించారు. ఆ పాఠశాలను సందర్శించిన శ్రీస్వామివారు ఒక లక్షరూపాయలను విరాళంగ అందించి, మంగళాశాసనాలు చేసారు. 20వ తేది గునుపూడి కోదండ రామాలయ ప్రతిష్ఠ గావించి, శ్రీరంగనాయికి తిరునక్షత్ర మహోత్సవాన్ని పూర్తిచేసుకొని, సాయంత్రం మహబూబ్ నగర్‌జిల్లా వట్టెం గ్రామం చేరారు.

20 వ తేదీన వట్టెం కళ్యాణ వేంకటేశ్వర స్వామి ఆలయ ద్వితీయ పుష్కర బ్రహ్మోత్సవాలలో విగ్రహ పునఃప్రతిష్ఠలో భాగంగా రాత్రి యంత్ర ప్రతిష్ఠ గావించారు.

21 వ తేదీ ఉదయం కుంభాభిషేకం జరిపి, సుమారు 24 అడుగుల ఆంజనేయ విగ్రహాన్ని, స్వాగత తోరణాన్ని, నూతన గోశాలను ప్రారంభించారు. అనంతరం కళ్యాణోత్సవంలో పాల్గొన్నారు. రాత్రి జవహర్ నవోదయ విద్యాలయాన్ని సందర్శించి విద్యార్థులకు, సిబ్బందికి మంగళాశాసనాలు గావించారు.

22 వ తేదీ ఉదయం సహస్రకలశాభిషేకాన్ని జరిపి, చక్రస్నానం కొరకు నూతనంగా నిర్మించిన కోనేరును ప్రారంభించి రాత్రికి శ్రీరాంనగరం చేరుకున్నారు.

23వతేది ఉదయం కంచిలో ప్రతివాది భయంకరం అణ్ణంగరాచార్యస్వామివారి 120వ తిరునక్షత్ర వేడుకల్లో పాల్గొన్నారు. ఇరామానుజ నూత్తందాది అనే వ్యాఖ్యాన పునర్ముద్రిత గ్రంథాన్ని శ్రీవారు ఆవిష్కరించారు. కంచి వరదరాజ పెరుమాళ్ళను సందర్శించుకొని, తరువాత చెన్నైలో పప్పిశెట్టి రాఘవయ్యశెట్టి ఛారిటీస్‌వారు నిర్మించిన పి.ఆర్.సి. సెంటనరీ హాల్‌ను ప్రారంభించారు.

24వ తేది మధ్యాహ్నం శ్రీరామనగరంలో BAKASS సమావేశం నిర్వహించారు. ఇందులో బదరీయాత్ర, ఋషీకేశ్‌లోని శ్రీసీతారామాలయ ప్రతిష్ఠ మొదలైన విషయాలపై శ్రీమాన్ డా॥ రామనాథం మరియు ఇతరసభ్యులతో చర్చించి, నిర్ణయించారు. సాయంత్రం హైదరాబాద్‌లోని సుందరయ్య విజ్ఞానకేంద్రంలో తిరుమల ఛారిటబుల్ ట్రస్ట్ అష్టమ వార్షికోత్సవ సందర్భంగ శ్రీమాన్ రాఘవాచార్యస్వామి రచించిన "న్యాసదశకం - సవ్యాఖ్యానం" గ్రంథావిష్కరణ, కవిపండిత సత్కారకార్యక్రమంలో పాల్గొని, మంగళాశాసనాలు చేసారు.

25వ తేదీన బయలుదేరి నల్గొండజిల్లా మేళ్ళచేరువులో మైహోమ్ ఇండస్ట్రీస్ లిమిటెడ్, మహాసిమెంట్స్‌లో వేంచేసి ఉన్న శ్రీదేవీ భూదేవీ సమేత శ్రీకళ్యాణ వేంకటేశ్వరస్వామి వారి 13 వ బ్రహ్మోత్సవానికి వేంచేసారు. 26వ తేదీ కళ్యాణమహోత్సంలో ఈ సంవత్సర పంచాంగమును ఆవిష్కరించారు. 27వ తేదీ ఉదయం ఈ సంవత్సరంలో సిద్ధమైన నూతనరథంతో రథోత్సవాన్ని ప్రారంభించారు. సాయంత్రం తిరుమంగైయాళ్వార్ల వైభవాన్ని తెలిపే దోపోత్సవాన్ని, శ్రీరంగం శ్రీపాత్తాంగులు విశేషంగా నిర్వహించారు. 28వ తేదీ ఉదయం ఫ్యాక్టరీ అవసరాల కనుగుణంగా నిర్మిస్తున్న కోల్ క్రషింగ్ అండ్ రిక్లెమింగ్ యూనిట్‌ను ప్రారంభించారు. తరువాత చక్రతీర్థోత్సవంలో అన్వయించివ మహాసిమెంట్స్ అధినేత, మన జీవా ఛైర్మన్ శ్రీమాన్‌రామేశ్వరరావు, శ్రీకుమారిగారికి, వారి పరివారానికి మంగళాశాసనాలు కృపచేసి సీతానగరం చేరుకున్నారు.

## శ్రీశ్రీశ్రీ స్వామివారి పర్యటన వివరాలు

**ఏప్రిల్**

**2. సింహాచలం, కోటికుంకుమార్చన పూర్ణాహుతిలో పాల్గొంటారు. సాయంత్రం 6గం॥కు అనపర్తి, ప్రముఖ సమాజసేవకులు, బాపిరాజుగారి విగ్రహావిష్కరణ**

**3. సీతానగరం - రాత్రికి భద్రాచలం చేరుతారు.**

**4. నుండి 13 వరకు భద్రాచలంలో శ్రీరామ సామ్రాజ్య పట్టాభిషేక ప్రయుక్త కార్యక్రమాలలో పాల్గొంటారు.**

**14. సిద్ధిపేట, ఆర్యవైశ్య అన్నదాన భవన ప్రారంభం.**

**14 నుండి 18 వరకు జీవా, దివ్యసాకేతంలో వసంతోత్సవాలు.**

**28. శ్రీరామనగరం, జీవా ప్రాంగణంలో శ్రీమాన్ వనజా భాస్కరరావు దంపతులు నిర్మింపచేసిన అతిథి సదనం ప్రారంభం.**

**మే: 6.ముప్పికుంట్ల, తిరువూరు మండలం, రామానుజుల వారి సన్నిధి ప్రతిష్ఠ.రాత్రికి వరంగల్‌జిల్లా, మానుకోట చేరతారు.**

**7. భగవద్రామానుజులవారి 995వ తిరునక్షత్ర మహోత్సవం హిందీ భక్తినివేదన ఆవిష్కరణ : డా॥ శ్రీమాన్ ఎన్.వి. రంగరామానుజాచార్యస్వామి వారు వారి తండ్రిగారి పేరున సమర్పించే "ఆచార్యవరివస్య" పురస్కార సభలో పాల్గొంటారు. రాత్రికి కోమటిపల్లి గ్రామానికి చేరుతారు.**

**8. శ్రీ లక్ష్మీనారాయణ ఆలయ ప్రతిష్ఠా మహోత్సవంలో పాల్గొంటారు. పర్వతపురం, బ్రహ్మోత్సవాలలో పాల్గొని రాత్రికి జీవా, శ్రీరామ నగరం చేరుతారు.**

**10- 16 వరకు దివ్యసాకేత ద్వితీయ బ్రహ్మోత్సవాలలో పాల్గొంటారు.**

**13. సౌభాగ్య కాలనీలో శ్రీ వేంకటేశ్వరాలయంలో ప్రతిష్ఠ.**

**22. గుంటూరుజిల్లా, ఉప్పరపాలెం శ్రీ వేంకటేశ్వరస్వామివారి ఆలయ ప్రతిష్ఠ**

**23. సీతానగర ఆశ్రమంలో భీమవరం భక్తుల ఉపనయన మహోత్సవం. రాత్రికి హైదరాబాద్ మీదుగ ఢిల్లీ - హృషీకేశ్ ప్రయాణం.**

**24 - 27 వరకు హృషీకేశ్, జీయర్‌మఠంలో శ్రీసీతారామ సమేత హనుమత్ప్రతిష్ఠ.**

**28. బదరీకి ప్రయాణం.**

**29 నుండి 1 వరకు } బదరీనాథ్ అష్టాక్షరీ క్షేత్రంలో 30 వ తేదీన సమాశ్రయణాలు, 31న అష్టాక్షరీ అనుష్ఠానం.**

**జూన్ 7. రాత్రి శ్రీమాన్ జె. రామేశ్వరరావుగారి నూతన గృహప్రవేశ కార్యక్రమాలు**

**8. ఉదయం గృహప్రవేశం**

**11. దాక న్యూజెర్సీ, బ్రిడ్జివాటర్ ఆలయ బ్రహ్మోత్సవాలు**

**19. వరకు బాస్టన్‌లో శిక్షణ శిబిరం**

**26. వరకు వర్జీనియాలో శిక్షణ శిబిరం**

**జూలై 1 న్యూజెర్సీలో ఎన్.ఎ.టి.ఎస్. (ఉత్తర అమెరికా తెలుగు సొసైటీ) ఉత్సవాలను ప్రారంభిస్తారు.**

**2. భారతదేశం తిరిగి విచ్చేస్తారు. చాతుర్మాస్య దీక్షను స్వీకరిస్తారు.**



పరమహంస పరివ్రాజకులు

## శ్రీశ్రీశ్రీ త్రిదండి అహోబిల రామానుజ జీయరు స్వామివారి పర్యటన విశేషాలు

4వ తేదీన శ్రీస్వామివారు శ్రీ చిన్న జీయరు స్వామివారితో కలసి రాజమహేంద్రికి వేంచేశారు. శ్రీశ్రీశ్రీ చిన్న జీయరు స్వామివారి శ్రీహస్తాలతో రంగధామంలో రంగనాథుని ద్వితీయ బ్రహ్మోత్సవాలు ప్రారంభించారు. ఆ కార్యక్రమాలను శ్రీశ్రీశ్రీ అహోబిల జీయరు స్వామివారు ప్రత్యక్షంగా పర్యవేక్షించారు.

5వతేదీ నుండి 10వ తేదీ వరకు జరిగిన బ్రహ్మోత్సవాలలో స్వామివారు అనుగ్రహ భాషణం గావించారు. రంగనాథునికి జరిగిన విశేష వాహనసేవలు, పూజాకార్యక్రమాలు, కైంకర్యాలు భక్తులు శ్రద్ధతో గావించారు. చివరిరోజు కార్యక్రమంలో గౌతమీనదీ తీరంలో రంగనాథస్వామికి తిరుమంజన సేవ, చక్రస్నానం వైభవంగా జరిగాయి. అనంతరం శ్రీస్వామివారు పాల్గొన్న భక్తులకు, కార్యక్రమ నిర్వాహకులకు మంగళాశాసనాలు అనుగ్రహించి శంషాబాద్‌కు బయలుదేరారు. .

12వ తేదీన నడిగడ్డపాలెంలో మన పెద్ద జీయరు స్వామివారి బృందావనంలో కవిగారి కుమారులు శ్రీమాన్ గుదిమెళ్ళ బదరీనాథ్, కూర్మనాథ్, రఘునాథ్‌గార్లు తమ తండ్రిగారు శ్రీమాన్ గుదిమెళ్ళ రామానుజాచార్యస్వామి జ్ఞాపకార్థం వారి పేరుమీద ఏర్పాటు చేసిన “7వ కవిరత్న పురస్కారా”న్ని సింహాచల వాస్తవ్యులు శ్రీ ఉ.వే. శ్రీమాన్ సాతులూరి గోపాలకృష్ణమాచార్యస్వామికి శ్రీస్వామివారి కరకమల ములమీదుగా అందజేశారు. అనంతరం శ్రీ ఉ.వే.శ్రీమాన్ ధనకుధరం సీతారామాచార్యస్వామిగానం చేసిన కవిగారి సంక్షేప రామాయణం, అహంవేద్మి, మానిషాద, శబరి(ఖండకావ్యాలు) సి.డి.ని ఆవిష్క రించారు. ఈకార్యక్రమంలో సభాసామ్రాట్ సత్యనారాయణా చార్యులు(బాపట్ల) కవిగారి కవితావైభవాన్ని కొని యాడారు.

కాండూరి సత్యనారాయణచార్యస్వామి,చిట్టిగూడూరు వాస్తవ్యులు గుదిమెళ్ళ శ్రీనివాసాచార్యులు తదితరులు పాల్గొన్నారు. కవిగారి కుమారులు విచ్చేసిన కవిపండితులను ఘనంగా సత్కరించారు. ఈ కార్యక్రమాన్ని అత్యంత వైభవంగా నిర్వహించారు. వీరికి శ్రీస్వామివారు మంగళాశాసనాలు చేశారు. ఆరాత్రికి శ్రీమాన్ గోళ్ళవాసుదేవరావు ఆహ్వానంపై మార్కాపురం చేరారు. ఆచార్యపీఠ నిర్వాహణలో సాగే శ్రీ ఆమలక లక్ష్మీనారాయణస్వామిదేవాలయంలో (వెంకచ్చమ్మగుడి) 48వ శ్రీరామనామ సప్తాహ మహోత్సవాల సందర్భంగా 13వ తేదీన శ్రీలక్ష్మీనారాయణ కల్యాణం, సాయంత్రం పెరుమాళ్ళ తిరువీధి ఉత్సవం, 14వతేదీన శ్రీ సుదర్శన నారసింహ యాగంతో కార్యక్రమం సుసంపన్నం చేసి, కార్యకర్తలకు శ్రీ స్వామివారు మంగళాశాసనం చేసి సాయంత్రం నడిగడ్డపాలెం చేరుకున్నారు.

శ్రీశ్రీశ్రీ అహోబిల స్వామివారి ప్రత్యక్ష పర్యవేక్షణలో నడిగడ్డపాలెం శ్రీ వాసుదాసాశ్రమంలో 13వ తేదీ నుండి 20 వరకు శ్రీ లక్ష్మీనారాయణ- శ్రీకోదండరామ స్వామివార్ల బ్రహ్మోత్సవాలలో భాగంగా లక్షమల్లె పుష్పార్చన సహిత శ్రీ లక్ష్మీనారాయణ యాగం జరిగింది.

ప్రతిరోజు ఉదయం ఇష్టి కార్యక్రమాలు ఉదయం రాత్రి వాహనసేవలు జరిగాయి. చివరిరోజు లక్ష్మీదేవికి క్షీరాభిషేకం, లక్ష్మీనారాయణ కళ్యాణం అత్యంత వైభవంగా జరిగింది. చివరిగా జరిగిన రథోత్సవంతో కార్యక్రమాలు ముగిసాయి. ఈ ఉత్సవంలో వివిధ ప్రాంతాల నుండి వందలాది భక్తులు పాల్గొన్నారు.

ఆశ్రమ నిర్వాహకులు శ్రీమాన్ లక్ష్మీనరసింహాచార్య స్వామి, శ్రీమాన్ గుదిమెళ్ళ బదరీనాథ్‌స్వామి, శ్రీమాన్ కూర్మనాథ్ స్వామి విచ్చేసిన భక్తులకు వసతి, తదీయారాధన ఏర్పాట్లను వైభవంగా జరిపించారు. శ్రీమాన్ మామిళ్ళపల్లి శ్రీనివాస్, గుంటూరు జిల్లా, పెదనందిపాడు వి.టి.సభ్యులు, శ్రీమాన్ రావిపాటి రామచంద్ర మూర్తి(వివేక్ విద్యాసంస్థలు) ఇలా ఎందరో భక్తులు చక్కని సేవలను అందజేశారు.

ఈ ఉత్సవాలలో కె. వసుంధర బృందం వారిచే అన్నమాచార్య భక్తిగీతాలాపన, కె. మహి కిరణశర్మ సమర్పించిన సురభి గోమహిమ చలన చిత్ర ప్రదర్శన, అలాగే విజయవాడ నృత్య కళాకారుడు శ్రీమాన్ ఘంటసాల పవన్‌కుమార్ బృందం(బాలలు)చే నృత్యప్రదర్శన తిలకించిన భక్తులను ఎంతగానో అలరించాయి. ఇందులో భాగంగ శ్రీమాన్ అమరవాది వేంకట నరసింహాచార్యస్వామి, లక్ష్మీ అవతార వైభవమును ప్రవచించారు.

18వతేదీన గుంటూరులోని శ్రీమాన్ బొల్లేపల్లి సత్యనారాయణ, శ్రీమాన్ మస్తానయ్యల ఆహ్వానం మేరకు బృందావన్ గార్డెన్స్‌లోగల శ్రీ వేంకటేశ్వర దేవాలయాన్ని సందర్శించి అక్కడ తులసీ సీడ్స్ అధినేత ప్రముఖ పారిశ్రామికవేత్త శ్రీమాన్ మండవ వెంకటరామయ్య, రమాదేవి దంపతుల సహస్రచంద్రదర్శన వేడుకలో పాల్గొని వారికి మంగళాశాసనాలు అనుగ్రహించారు.

20 వ తేదీన నడిగడ్డ పాలెం లక్ష్మీ అమ్మవారి తిరునక్షత్రం సందర్భంగా క్షీరాభిషేకాన్ని, పుష్పార్చన, శాంతి కళ్యాణ మహోత్సవాన్ని వైభవంగా జరిపారు. అక్కడనుండి సాయంత్రం గుడివాడ బయలుదేరి వెళ్లారు. అక్కడ పాడిగడ్డ శ్రీ వేంకటేశ్వరస్వామి ఆలయం సమీపానగల శ్రీమాన్ రాజేష్,తేజ దంపదతుల ఆహ్వానం మేరకు వారి నూతన గృహాన్ని సందర్శించి లక్ష్మీ అమ్మవారి తిరునక్షత్రం సందర్భంగా అక్కడ సామూహిక లక్ష్మీపూజకార్యక్రమాన్ని,

21వ తేదీన శ్రీ సుదర్శన నారసింహ హోమాన్ని జరిపి తామర పుష్పాలతో అర్చన జరిపించారు. ఆ దంపతులకు, వారి కుటుంబ సభ్యులకు, భక్తులకు మంగళశాసనాలు అందజేసి అక్కడనుంచి శ్రీ నవనీతం కృష్ణారావు కోరికపై ఆగిరిపల్లి సమీపానగల సగ్గూరు శ్రీరామాలయాన్ని సందర్శించి రాత్రి సీతానగరం చేరుకున్నారు.

బదరీ విశాల్ భగవాన్‌కీ జై!

# బదరీనాథ్ జ్యోతిర్దర్శనం

**శ్రీశ్రీశ్రీ చిన్న జీయరు స్వామివారి మంగళాశాసనములతో...**

ఆరునెలలు దేవతార్చన తరువాత బదరీక్షేత్రంలో **మే 9 న జ్యోతిర్దర్శనముతో** మానవులకు నరనారాయణుల దర్శనభాగ్యం కలగబోతోంది.

మన అష్టాక్షరీక్షేత్రం ప్రతిసంవత్సరంవలెనే ముందు గానే, భగవద్బంధువులకు సేవలందించుటకు సిద్ధమవు తోంది. మన అష్టాక్షరీ క్షేత్రంలో అన్నదానం జరుపుటకు తదీయా రాధనకు కావలసిన వస్తువులను, ద్రవ్యమును కైంకర్యము చేయుటకు ఉత్సాహముగల భగవత్ బంధువులను బదరీ అష్టాక్షరీక్షేత్రీయ అన్నదాన శాఖా సంఘం ఆహ్వానిస్తోంది. ఒక్కరుగాని, గోష్ఠిగాగాని ఈ అవకాశమును సద్వినియోగము చేసికొని శ్రీస్వామివారి మంగళాశాసనములు పొందగలరు.

**గంగానదీ పుష్కరాలకు ఆహ్వానం:** పరమపవిత్రమైన గంగానదీ పుష్కరాలు మే 9 నుండి 20 వరకు జరుగుతున్నవి. ఋషీకేశ్‌లో పుష్కరస్నానాలు ఆచరించే భగవద్బంధువులను మన జీయర్‌మఠం సాదరంగా ఆహ్వానిస్తోంది.

పరమహంస పరివ్రాజకాచార్య శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ చిన్న జీయర్ స్వామివారు మే 24 నుండి 27 వరకు ఋషీకేశ్‌లోని మన శ్రీరామాలయ ప్రతిష్ఠ కార్యక్రమంలో వేంచేస్తారు. 28 నుండి 31 వరకు బదరీనాథ్ అష్టాక్షరీ క్షేత్రానికి వేంచేస్తారు. మే 30 మంత్రోపదేశాన్ని (బదరికాశ్రమంలో) అనుగ్రహిస్తారు. మే 31 బదరికాశ్రమంలో అష్టాక్షరీ మహామంత్ర జపకార్యక్రమం శ్రీస్వామివారి ప్రత్యక్షపర్యవేక్షణలో జరుగుతుంది.

**వివరములకు:** BAKASS **సీతానగరం, తాడేపల్లి మండలం, గుంటూరుజిల్లా- 522 501. ఫోన్: 08645 272929. శ్రీమాన్ డా॥ టి. రామనాథం, సెల్: 93478 81779**

## ఋషీకేశ్ జీయర్‌మఠంలో శ్రీరామాలయ నిర్మాణం

**పవిత్ర గంగానదీతీరంలోని హృషీకేశ్‌లోని జీయర్‌మఠంలో మన స్వామివారి ఆరాధ్యదైవమైన శ్రీ సీతారామాలయ నిర్మాణము శర వేగముతో జరుగుతున్నది. ఈ మందిర నిర్మాణమునకు చదరపు అడుగు రూ.1000/-లుచొప్పన కైంకర్యము చేయదలచినవారు సీతానగరంలో తమ కైంకర్యములను సమర్పించగలరు. చెక్కులు, డి.డి.లు బదరీ అష్టాక్షరీ క్షేత్రీయ అన్నదాన శాఖాసంఘం (BAKASS) పేరుమీద పంపగలరు.**

## STATEMENT OF OWNERSHIP AND OTHER PARTICULARS OF BHAKTHINIVEDANA

FORM IV (See Rule 8)

| | | |
|---|---|---|
| 1. | Place of publication | : Sitanagaram, Guntur |
| 2. | Language / Periodicity | : Spiritual Telugu Monthly |
| 3. | Printer's Name | : **H.H. Sri Sri Sri Tridandi Chinna Srimannarayana Ramanuja Jeeyar Swamiji** |
| | Nationality | : Indian |
| | Address | : **JEEYAR EDUCATIONAL TRUST,** Sitanagaram, Guntur Dt. Andhra Pradesh-522 501 |
| 4. | Publisher's Name | : **H.H. Sri Sri Sri Tridandi Chinna Srimannarayana Ramanuja Jeeyar Swamiji** |
| | Nationality | : Indian |
| | Address | : **JEEYAR EDUCATIONAL TRUST,** Sitanagaram, Guntur Dt. Andhra Pradesh-522 501 |
| 5. | Editor's Name | : **T.P. SRIRAMACHANDRACHARYA** |
| | Nationality | : Indian |
| | Address | : S/o. Sitaramacharyulu 5-74, Ayodhya, Visakhapatnam-530 028. Andhrapradesh. |
| 6. | Name and address of individuals who own the news paper and partners of share holders holding more than one percent of the total capital | : Nil |
| 7. | R.N.I.No. | : 52762/91 |

I, Chinna Srimannarayana Ramanuja Jeeyar Swamiji herebydeclare that the particulars given above are true to the best of my knowledge and belief.

Dt. **31.03.2011**

Sd/-
**SRI SRISRI TRIDANDI CHINNA SRIMANNARAYANA RAMANUJA JEEYAR SWAMY**
*Signature of Publisher*



**భక్తినివేదన చదవండి! చదివించండి!!**
**సంప్రదాయ విలువలను పెంచండి!!!**

## STATEMENT OF OWNERSHIP AND OTHER PARTICULARS OF BHAKTHINIVEDANA

*FORM IV* (See Rule 8)

| | | |
|---|---|---|
| 1. | Place of publication | : Sitanagaram, Guntur |
| 2. | Language / Periodicity | : Spiritual Telugu Monthly |
| 3. | Printer's Name | : **H.H. Sri Sri Sri Tridandi Chinna Srimannarayana Ramanuja Jeeyar Swamiji** |
| | Nationality | : Indian |
| | Address | : **JEEYAR EDUCATIONAL TRUST,** Sitanagaram, Guntur Dt. Andhra Pradesh-522 501 |
| 4. | Publisher's Name | : **H.H. Sri Sri Sri Tridandi Chinna Srimannarayana Ramanuja Jeeyar Swamiji** |
| | Nationality | : Indian |
| | Address | : **JEEYAR EDUCATIONAL TRUST,** Sitanagaram, Guntur Dt. Andhra Pradesh-522 501 |
| 5. | Editor's Name | : **T.P. SRIRAMACHANDRACHARYA** |
| | Nationality | : Indian |
| | Address | : S/o. Sitaramacharyulu 5-74, Ayodhya, Visakhapatnam-530 028. Andhrapradesh. |
| 6. | Name and address of individuals who own the news paper and partners of share holders holding more than one percent of the total capital | : Nil |
| 7. | R.N.I.No. | : 52762/91 |

I, Chinna Srimannarayana Ramanuja Jeeyar Swamiji herebydeclare that the particulars given above are true to the best of my knowledge and belief.

Dt. **31.03.2011**

*Signature of Publisher*

శ్రీమతే నారాయణాయ నమః

శ్రీమతే రామానుజాయ నమః



64 సం॥ల నుండి అశేష భగవద్బంధువులు ఆదరిస్తున్న...

ఆధ్యాత్మికమాసపత్రిక

# భక్తినివేదన



శ్రీఖరనామ సంవత్సర వైశాఖమాసము


సంపుటి 64 మే

సంచిక 2 2011


## పండుగలు

**మే**

- 8. శంకర జయంతి, చక్రవర్తి తిరుమగనార్ తిరు, గంగానది పుష్కరారంభం
- 9. సప్తమి తిథి,
- 10. శ్రీరామనగర దివ్యసాకేత బ్రహ్మోత్సవ ప్రారంభం
- 11. కృత్తిక కార్తి అగ్ని కర్తరీ
- 13. స్మార్తానాం ఏకాదశి
- 14. వైష్ణవానాం ఏకాదశి, పరశురామ ద్వాదశి
- 15. వృషభ సంక్రమణము
- 16. నృసింహ జయంతి
- 17. అన్నమాచార్య జయంతి
- 18. తిథిద్వయం
- 19. తదియ తిథి, తిరువరంగప్పెరుమాళ్ అరయర్ తిరు
- 24. అష్టమి తిథి
- 25. రోహిణి కార్తి
- 27. హనుమజ్జయంతి
- 28. సర్వేషాం ఏకాదశి
- 29. వాస్తుకర్తరీ త్యాగము
- 31. మాస శివరాత్రి

**జూన్**

- 1. పిండపితృయజ్ఞము, అమావాస్య, శనిజయంతి
- 2. తిరుక్కోటియూర్‌నంబి తిరు॥
- 8. మృగశిర కార్తి

వ్యవస్థాపకులు

పరమహంస పరివ్రాజకాచార్య

**శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జీయరుస్వామివారు**

సంపాదకులు

శ్రీఉ.వే.శ్రీమాన్ **T.P. శ్రీరామచంద్రాచార్యులు**

## విషయ సూచిక




Printed & Published by H.H. Tridandi Chinna Srimannarayana Ramanuja Jeeyar Swamiji on behalf of **Jeeyar Educational Trust** and Printed at **Sriman Printers & Processors** C/o JET, Sitanagaram-522 501, Guntur Dist., Andhrapradesh. **Published at** C/o JET, Sitanagaram-522 501 Guntur Dist, Andhrapradesh, Editor: Sri **T.P.Sriramachandracharya** S/o. Sri Sitaramacharyulu, No: 5-74, Ayodhya, Visakhapatnam- Andhra Pradesh.


చందావివరాలు :- సంవత్సరచందా రూ.50/-

జీవితచందా రూ. 500/-,

విదేశాలకు సంవత్సరచందా $30/-

క్రొత్తగా సంవత్సర చందాదారులుగా చేరువారు సభ్యత్వ నమోదు, రూ.30/-లు (విదేశాలకు $5) అదనంగా చెల్లించవలెను.

ఆపై ప్రతి సంవత్సరం సకాలంలో వార్షిక చందా చెల్లించిన చాలు.


మీ సేవలో....

భక్తినివేదన, సీతానగరం - 522 501,

గుంటూరు జిల్లా,

ఆంధ్రప్రదేశ్. 08645 272929.

E-mail : **jetsitanagaram@yahoo.com** Internet : www.chinnajeeyar.org



D.T.P. & Design by : పరిశోధనాలయమ్, ముద్రణ : శ్రీమాన్ ప్రింటర్స్ & ప్రాసెసర్స్, సీతానగరం

సంపాదకీయం

మానవతకు మణి మకుటం

# మన రామానుజులు



సనాతన భారతీయ వైదిక విజ్ఞానాన్ని తరాలుగా, నిరంతరంగా, ప్రోదిచేసి, మానవాళికి ప్రసాదించిన ఋషిగణాలకు అచ్చపు వారసులుగా, అవతరించిన ఆచార్యులలో ప్రాతస్స్మరణీయులు భగవద్రామానుజులు.

వేదార్థ నిర్ణయంలో బ్రహ్మతత్త్వ నిరూపణంలో శ్రీరామానుజులనుసరించిన పద్ధతికి శ్రుతి సీమంతిని పాపట సింధూరము చిందినది. మొగాన సౌభాగ్య స్మితజ్యోత్స్న విరిసినది.

శ్రుతి సముదయాన్నంతనూ ప్రామాణికంగా పరిగ్రహించి, అక్కడక్కడ కనవస్తున్న అన్యోన్య వైరస్యాలను పరిహరించి, ప్రామాణికులైన పూర్వ వ్యాఖ్యాతలను సంభావిస్తూ, శ్రుతి భారతి అంతరంగపు కలరూపును హృద్యముగా, అనవద్యముగా, దివ్యముగా, సుందరముగా, మధురోజ్వలముగా, తాము దర్శించి, చూచువారి కనులముందు, అట్టె నెలకొల్పిన ఉదాత్త భావుకులైన భాష్యకారులు వారు. కప్యాస శ్రుతికి అర్థనిరూపణ కావించిన తీరులో సౌందర్య ప్రణయ మధురోదాత్త భావనల చూచి, శ్రుతి సీమంతిని ఇతడు నా ముద్దుల కొడుకని ముచ్చట పడినది.

భాష్యరచనలో విశ్రమించిన కేవల భాష్యకారులు కారు వారు. తామధ్యయనము కావించిన శ్రుతి నిచయము నిరూపించిన పరమాత్మను ఆయన స్వరూప రూప గుణ విభూతులనూ సర్వత్ర సందర్శించిన సమదర్శులు వారు. వారు మధుర భావుకులు – మానవతావాదులు – కరుణాసింధువు – ఔదార్య మేరువు. మానవుల మనుగడలను చరితార్థములను కావించడానికి వారుపడిన తపన, కావించిన శ్రమ, చూపిన తెగువ, మరో దగ్గర కానము.

ఆచార్యుల ఆనను ఆవలబెట్టి, గోష్ఠీపుర గోపుర మెక్కి, "మీరు రండి!, మీరూ రండి!!" అంటూ కూతవేటు దూరాననున్నవారిని కూయివెట్టి పిలచి, మంత్రార్థమును వెదజల్లిన పరహిత చింతనైక ప్రవణులు వారు. ఏమా కారుణ్యము! ఏమా వాత్సల్యము! ఏమా విశ్వహిత కామన! ఏమా ఔదార్యము! ఈ మానిసులకు ఆ మహానుభావులు ఋణపడి ఉన్నారా! వీరేమి వారి రక్తం పంచుకు పుట్టినారా! రూకలిత్తురు కోకలిత్తురు – ఎవ్వరైననూ ఇట్టి విత్తురే! మోక్ష లక్ష్మీ సామ్రాజ్య సౌధానికి నిచ్చెనలు నిలిపినారు. శత పద సముత్తుంగ గోష్ఠీపుర గోపురాగ్రము నుండి వారి కారుణ్యామృత పూరము నేలకు చేరినది. ఆ దయా తరంగిణిలో జనులోలలాడినారు. పుడిసిలి పట్టినారు కొందరు – దోయిలి పట్టినారు కొందరు – పుక్కిటి బంటిగా గ్రోలినవారు కొందరు – ఎదబంటిగా జుఱ్ఱినవారు కొందరు – వారి వారి భాగ్యము కొలది. ఈ సన్నివేశమొక్కటి చాలు భగవద్రామానుజులను మేరు తుంగ శృంగాగ్రమున నిలబెట్టుటకు.

సిగ్గెగ్గులు విడచి, ప్రేయసి అతిలోక సుందరాయత నేత్రములు ఎండకు వడలి పోతాయని, రంగని తిరువీధిలో జనసముద్రం నడుమ గొడుగు పట్టిన ధనుర్దాసుని అంతరంగాన్ని అట్టె పరికించి రంగని కర్ణాంత లోలేక్షణముల వైపు అతని దృష్టిని మరల్చుటలో ఎదిరి ఎదలోతులు తాకి చూడడంలో వారికి గల నేర్పు తెల్లమౌతుంది.

ప్రాతర్వేళల కావేట తీర్థమాడ బయలుదేరునప్పుడు, మహావిద్వాంసులు, అభిజాత్యపరులు అయిన దాశరథి

భుజమున చేయిడిపోయి, కావేట స్నానమాచరించి, ఆహ్నికము కావించుకొని, మఠానికి మరలి వచ్చునప్పుడు మల్లుడైన ధనుర్దాసు దండను ఊతగ కొనుటలో వారి అంతరంగమునుండి వెలువడు శ్రీవైష్ణవ సమతా సౌరభములు, ఆ సన్నివేశాన్ని విశదముగా సేవించుకోగల సహృదయుల ఎదలను నేటికీ తాకి, బాహిరంగానే కాదు, ఆంతరంగానా రోమాంచ కంచుకితము చేయక మానవు.

యాదవప్రకాశుల గురుకులాన ఉన్నవాడు, ప్రవాస జీవితములో బిత్తిగ దేవుని చేరిననాడు, వారి అతిమానవ శక్తులు - సంయమంతో ఆ శక్తులను వారు వినియోగించిన తీరూ - అతిమానవమే.

తిరుమల శ్రీనివాసుని ఈనాటి పుష్పవైభవానికి శ్రీకారం చుట్టి, నందనవనం నాటించి, తిరుమలను పుష్పమండపంగా తీర్చిదిద్ది, అలనాటి నమ్మాళ్వారుల కోరికను నెరవేర్చిన కృతకృత్యులాయన.

శెల్వపిళ్ళను ప్రేమించి, ఆ స్వామినే పరిణయమాడ వలెనని, కలలు కంటున్న ఢిల్లీ పాదుషా చెల్లెలితోపాటు, స్వామినీ ఢిల్లీ నుంచి మేల్కోటకు కొనివచ్చి, ప్రతిష్ఠించిన ప్రణయోదార గంభీర ధీర మూర్తివారు - చెట్టున పండిన మానవతా రసాలం వారు. ఎల్లలు దాటిన ఈ మధుర ప్రణయ బంధుర పరిణయానికి పౌరోహిత్యం నెరపడమే కాదు - "యత్ర దాతా గృహీతా చ" అన్నట్లు ఇరువైపుల పెండ్లి పెద్దగా తామే నిలచిన సౌహార్ద్ర రాశి వారు.

ఈ మహత్తర కార్య నిర్వహణలో తమకు బాసటగా నిలచిన దళితులను ఎదబంటి కృతజ్ఞతతో అభినందించటమే కాక, వారిని తిరుకులత్తారులుగా సంస్కరించి, నారాయణ నామమునుపదేశించి, భగవదారాధనకు వారూ యోగ్యులని భరోసా కల్పించి, వారికి దేవాలయ ప్రవేశం కలిగించి, దీనజనోద్ధారకులుగా పేరుపొందిన అనుకంపామూర్తి ఆయన.

ఈ సంఘటన విని, నాటి శంకరాచార్యులవారు అభినందన పూర్వకంగా తమ మఠం పల్లకీని శ్రీ పెరుంబూదూరు కోవెలకు సమర్పించినారట.

శ్రీరామానుజులు కేవల మతప్రవక్తలు మాత్రమే కాదు సామాజిక శ్రేయోవిధాతలూనూ! విష్ణువర్ధనుని రాజ్యంలో ఉంటూ, అక్కడి ప్రజలు త్రాగునీటికోసం, సాగునీటికోసం పడుతున్న పాట్లు చూసి, ఆ దేశం సర్వసమృద్ధంగా ఉండాలని, ఒక జలాశయం నిర్మింప సంకల్పించి, మహారాజుచేత ఆ జలాశయ నిర్మాణం కావింప చేసినారు. ప్రభుత్వాధినేతలూ, సామాజిక శాస్త్రవేత్తలు, ఇంజనీర్లు, ఇట్లా ఎందరెందరో కలసి, చేయవలసిన పనిని, భగవద్రామానుజులొక్కరూ కావింపచేసినారు. జలాశయ నిర్మాణానికి స్థల నిర్దేశం, పరిమాణ నిరూపణ, దానికి సంబంధించిన సకలమూనూ శ్రీరామానుజల సూచన ప్రకారమే జరిగింది. రాజుగారు వారి ఆలోచనలను ఆచరణలో పెట్టినారు. తొండనూరు దగ్గిర ఆ జలాశయం నేటికీ చెక్కుచెదరక రామానుజుల కీర్తి తరంగిణిగా విరాజిల్లుతోంది.

నాథమునులు, యామునులు, వారసత్వంగా తమకందజేసిన దివ్యప్రబంధ వాఙ్మయాన్ని సమాదరించి, ఉపనిషదంతరంగాన్ని అందులో అనుశీలించి, దానికి వేదాంత స్థాయి కల్పించి, ఉభయవేదాంత శాఖా సమన్వయం సంఘటింపచేసి, విశిష్టాద్వైతానికి విలక్షణ పరిమళాన్ని సంతరింపజేసిన సమన్వయవాది శ్రీరామానుజులు. మానవత తలదాల్చిన మహా మకుటమాయన.

అట్టి మహానుభావుల జయంత్యుత్సవం 7-5-2011 నాడు జరుపుకోనున్నాం. ఆ సందర్భంగా వారిని, వారి ఆశయాలను నిండు మనస్సుతో స్మరించుకుందాం! ఆచరించే ప్రయత్నం చేదాం!!

జయ శ్రీరామానుజ

**- శ్రీరామచంద్రాచార్య**



# య ఏవం వేద...



శ్రీమాన్ గుదిమెళ్ళ మురళీకృష్ణమాచార్యస్వామి-భద్రాచలం

విశ్వవాఙ్మయం వేదాల నుండే ఉద్భవించింది. విశేషించి సనాతనమైన మన భారతీయ సారస్వతానికి మూలాధారం వేదమే. పరమాత్మయొక్క నిశ్వాసరూపంగ ఆవిర్భవించినది వేదము. మన ఇంద్రియాదులకందని అనేక సృష్టి రహస్యాలను వేదము ఆవిష్కరించింది. అందుకే దానిని '**అపౌరుషేయ**'మని గుర్తిస్తున్నాము. '**స్వతఃప్రమాణం**'గ సంభావిస్తున్నాము.

'**పురుష**' అనే పదానికి జీవుడు, దేవుడు కూడా అర్థాలే. వారికి సంబంధించి వారి ప్రయత్నంతో ప్రవర్తించేవన్నీ '**పౌరుషేయా**'లంటారు. పురుషప్రయత్నం లేకుండా ప్రవర్తించేవన్ని 'అపౌరుషేయాలు'!

జీవ, పరమాత్మలలో ఎవరి ప్రయత్నమూ లేకుండానే ఏర్పడిన నిత్య, సత్య శబ్దరాశి కావడం వల్ల వేదశబ్దరాశిని '**అపౌరుషేయ**'మని కీర్తించారు. '**అస్య మహతో భూతస్య నిశ్వసితమేతత్ యదృగ్వేదః**' అంటూ బృహదారణ్యకోపనిషత్తు '**నిశ్వసితం**' అనే పదాన్ని ప్రయోగించి '**భగవంతుని నిశ్వాసగ వెలువడినదే ఋగ్వేదాదిగ కల వేదరాశి అంతా**' అని ప్రకటించి వేదముయొక్క '**అపౌరుషేయత్వాన్ని**' సమర్థిస్తోంది.

'**ప్రమా**' అంటే యదార్థజ్ఞానము! దానిని కలిగించే సాధనాలను '**ప్రమాణాలు**' అంటారు. ఇతర ప్రమాణాలు అవసరం లేకుండా, తనకు తానే ప్రమాణమై నిలిచే దానిని '**స్వతఃప్రమాణం**' అంటారు. వేదము, స్వతఃప్రమాణం మాత్రమే కాదు, ఇతర ప్రమాణాలన్నింటికీ తానే ఆధారమై నిలచిన '**దివ్యశబ్దరాశి**' కూడానంటూ ఆర్ష లోకమంతా దీనిని ప్రమాణ మూర్ధన్యంగ నిశ్చయించి, నిశ్చప్రచంగ ప్రకటించింది.

వేదాలు, సృష్టిక్రమాన్ని బోధించే ఉపదేశాలుగ పరమాత్మ, చతుర్ముఖబ్రహ్మకి ప్రసాదించాడంటూ **యో బ్రహ్మాణం విదధాతి పూర్వం యో వై వేదాంశ్చ ప్రహిణోతి తస్మై** అనే ఉపనిష ద్వాక్యము బోధిస్తున్నది. పురాణాలు కూడ పై విషయాన్నే సమర్థిస్తున్నాయి. అందుకే వేదాలను విశ్వసించి, తత్సారాన్ని ఆచరించిన వాడినే 'ఆస్తికుడు' అన్నారు. వేదవిజ్ఞానాన్ని విశ్వసించనివాడు, నిందించేవాడు నాస్తికుడైనాడు. ధర్మశాస్త్రాలు '**నాస్తికో వేదనిందకః**' 'వేదాలను నమ్మక నిందించేవాడే నాస్తికుడు' అంటూ హెచ్చరించాయి. మన భారతీయులు వైదిక విశ్వాసం కల్గి, పరంపరగ అందుకుంటున్న అక్షయ సంపదే 'వేదరాశి'! ఇది పదుగురికీ పంచినకొద్దీ పెరుగుతుందే తప్ప ఏనాటికీ తరుగదు. ఇంతటి గొప్ప సంపదను అందుకోనివారు 'నిర్భాగ్యులే' కద!

వేదాలనుండి ఏ కొంత నేరుగ తెలుసుకోగలిగినా మహద్భాగ్యమే. పైగ, అది మనకు ఆనృణ్యాన్ని కలిగిస్తుంది గూడ. '**ఆనృణ్య**'మంటే ఋణాలనుండి విముక్తి కలుగుట. అప్పులు లేకపోవడమన్నమాట.

మనం పుడుతూనే మూడు ఋణాలతో పుడతామని యజుర్వేదం శాసిస్తోంది. '**జాయమానో వై బ్రాహ్మణ స్త్రిభిర్ ఋణవా జాయతే. బ్రహ్మచర్యేణ ఋషిభ్యో, యజ్ఞేన దేవేభ్యః, ప్రజయా పితృభ్యః**'. ఋషిఋణం, దేవఋణం, పితృఋణం అని మూడు ఋణాలు. **బ్రహ్మచర్యం ద్వారా** ఋషిఋణం తీరుతుంది. **యజ్ఞము ద్వారా** దేవఋణం తీరుతుంది. **సంతానాన్ని కనడం ద్వారా** పితృ ఋణం తీరుతుంది.

బ్రహ్మచర్య మంటే వైదిక సాహిత్యాన్ని అధ్యయనం చేయడం, లేదా, వాటి గురించి సదవగాహనను సంపాదించడం. ఇది ఋషి ఋణాన్ని తీర్చుకునే పద్ధతి. యజ్ఞమంటే '**యజ్ దేవపూజాయాం**' అనే ధాతువును బట్టి యాగాదిరూపంగ చేసే దేవతారాధన, భగవన్మూర్తి ఆరాధన, భగవత్సేవగ జీవకారుణ్యంతో దానధర్మాల నాచరించడం అని అర్థము. వీటిని ఆచరించడం వల్ల దేవ ఋణం తీరుతుంది.

సంతానం, అంటే, కేవలం సంతతి అని మాత్రమే కాదు,

తన ధర్మాన్ని, సంప్రదాయాన్ని తన తదనంతరం కూడ కొనసాగించే ప్రాతినిధ్యం. అదే సత్సంతానం. అలాంటి సంతానాన్ని కని, వారి ద్వారా పై రెండు ధర్మాలను ఆచరించడం, ఆచరింపచేయడం ద్వారా మూడవదైన పితౄణం తీరుతుంది.

ఈ మూడింటిలో ప్రాథమ్యాన్ని, ప్రాధాన్యాన్ని పొందినది ఋషి ఋణం. ఇది వేదమును, దానిని అనుసరించి ఏర్పడిన సారస్వతాన్ని అధ్యయనం చేయడం ద్వారానే తీరుతుంది. అలా ఆచరించడమే బ్రహ్మచర్యం. **'బ్రహ్మ'** అంటే వేదం. దానియందు చరించడమంటే ఆధ్యయనం చేయడమన్నమాట.

ఆ అధ్యయనం రెండు విధాలు, ఒకటి, దాని స్వరూపాన్ని యథాతథంగా నేర్చి, ఆచరణద్వారా రక్షించడం. రెండవది, వేదం యొక్క స్వభావాన్ని ఆకళింపు చేసుకొని ఆచరణ ద్వారా సంరక్షించడం. వీటినే స్వరూపశిక్షణం, స్వభావరక్షణం అని అంటారు. స్వరూపశిక్షణలో యోగ్యాయోగ్య విచారమున్నదేమో కాని స్వభావరక్షణలో మాత్రం సర్వులకూ అధికారమున్నది. ఆర్తి మాత్రమే దానికి యోగ్యత. అది కలిగిన వారంతా స్వభావాన్ని అధ్యయనం చేస్తారు. తద్వారా ఋషిఋణ విముక్తులౌతారు. ముక్తులౌతారు. అలా ఋణవిముక్తులు కాగోరువారంతా వేదం గురించిన అవగాహనను పొంద వలసినదే. విముక్తి అంటే అదేదో చనిపోయి శరీరంలోంచి **'విముక్తి'**లాంటిదని భ్రమ పడుతున్నారేమో! అదికాదు. అలా కాదు. కర్మబంధం నుంచి విడుదల అని గుర్తించాలి.

మనకు అనంతమైన విజ్ఞానాన్ని అందించిన మనపూర్వుల పట్ల కృతజ్ఞులమైయుండడం. కృతఘ్నులు కాకుండా మనలను కాపాడుకోవడం. **'కృతఘ్నే నాస్తి నిష్కృతిః'** ఏ పాపం చేసిన వానికైనా నిష్కృతి ఉందేమో కానీ, చేసిన మేలును మరచిన కృతఘ్నునికి మాత్రం నిష్కృతి లేదు అనికదా ఆర్షసూక్తి! అలా కృతఘ్నులం కాకుండా ఉండాలంటే కృతజ్ఞత కలిగి ఉండాలి. అది ఉన్ననాడు మనధర్మాన్ని మనం పాటించాలనే లక్షణ శుద్ధి ఏర్పడుతుంది. తదాచరణ ద్వారా లక్ష్యసిద్ధి కలుగుతుంది అదే ఋణ విముక్తి.

అలా మనం ఆనృణ్యాల్ని పొందాలంటే ఆర్ష వాఙ్మయాన్ని అధ్యయనం చేయవలసినదే! ఆ వాఙ్మయానికి మూలప్రమాణమైన **'వేదం'** గురించి తెలుసుకొనవలసినదే. అందుకే ఈ ప్రయత్నం.

**'య ఏవం వేద'** ఇది వేద పురుషుడు తరచుగా వాడే 'ఊతపదం'. మనలను ఉద్ధరించడానికి చేయూత నిచ్చేపదం. "య ఏవం వేద" అనే పదానికి 'ఎవడైతే ఇలా తెలుసుకుంటాడో' అని అర్థము. ఈ వాక్యం తరువాత ఫలితాలను చెప్పే వాక్యాలున్నాయి. ఫలితాలను చెప్పని వాక్యాలూ ఉన్నాయి. కాబట్టి అది అసంపూర్ణ వాక్యం కాదు. అప్పటివరకూ చెప్పిన విషయాన్ని అర్థం చేసుకోమనే ఆదేశమే అందులో స్పష్టంగా ఉందన్నమాట. వేదపురుషుడు ఏ రహస్యాన్ని ఆవిష్కరిస్తున్నా, ఏ తత్త్వాన్ని బోధిస్తున్నా, ఏ నిషేధాన్ని విధిస్తున్నా... ఈ **'య ఏవం వేద'** అనే పద సముదాయాన్ని ప్రకటిస్తూంటాడు. ఏ విషయాన్ని చెప్తున్నా, ఏ విశేషాన్ని చెప్తున్నా, చెప్పేదానిని స్పష్టంగా తెలుసుకొమ్మనే ప్రభుసమ్మితమైన ఆదేశమే... ఆ "య ఏవం వేద"లో కనిపిస్తుంది. అందుకే ఈ శీర్షిక. అస్మదాచార్యులైన శ్రీస్వామివారి ఆదేశాన్ని ఔదలదాలుస్తూ **"ఆదౌ వేదాః ప్రమాణం"** అని పూర్వాచార్యులు చెప్పిన ప్రకారం ఆది ప్రమాణమైన వేదం గురించి పరిచయం చేస్కునే ప్రయత్నం చేద్దాం!

వేదం అంటే జ్ఞానమని అర్థం. **విద-జ్ఞానే** అనే ధాతువునుండి ఏర్పడిన పదమిది. ముఖ్యంగ జ్ఞానార్థకమైన ఈ వేదం అనే పదం మరో మూడు ధాతువులనుండి ఏర్పడింది. మూడువిధాలైన విశేషార్థాలను కూడ ఇస్తుంది. **"వైయ్యాకరణ సిద్ధాంత కౌముది"** అనే వ్యాకరణ గ్రంథంలోని చురాది ప్రకరణంలో **'విద్'** అనే ధాతువుయొక్క ప్రయోగం నాలుగు విధాలుగ కనిపిస్తోంది.

**సత్తాయాం విద్యతే జ్ఞానే వేత్తి వింతే విచారణే ।**
**విందతే విందతి ప్రాప్తౌశ్యన్లుక్ శ్నంశే ష్విదం క్రమాత్ ॥**

**విద సత్తాయాం, విద జ్ఞానే, విద విచారణే, విద్ల్ లాభే** అనే నాలుగు ధాతురూపాల ప్రకారం ఉనికి, జ్ఞానము, విచారణ, లాభము అనే నాలుగు రకాల ఫలితాలను ప్రసాదించే పదవిశేషానికి వేదము అని పేరు.

**విదసత్తాయాం** అనే ధాతురూపం ద్వారా సత్తార్థకము (ఉనికిని చెప్పే) అయిన ఈ పదం వ్యాకరణరీత్యా ఘఞ్ అనే ప్రత్యయం చేర్చడం ద్వారా ఏర్పడింది. **విద్యతే సత్తాం గృహ్ణాతి వస్తు అనేన ఇతి వేదః** అని దీని నిర్వచనం. మన ఉనికిని చెప్పేది, మనకు ఉనికిని కలిగించేది వేదము అని దీని తాత్పర్యం. పరబ్రహ్మయొక్క ఉనికి మనం ప్రత్యక్షంగ చూడగలిగినది కాదు. ఊహ ద్వారా తెలిసేదీ కాదు. అలా ప్రత్యక్షంగ కానీ, అనుమానం (ఊహ) ద్వారా కానీ, మనకు

తెలియని ఇంద్రియాతీత విషయజ్ఞానాన్ని కలిగించేది వేదం. మన ఇంద్రియాలకు అందని పరబ్రహ్మ ప్రతిపాదికాలైన ఆ అక్షర రాశికి వేదము అని పేరు.

**"సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ"** అనే వాక్యం ద్వారా బ్రహ్మయొక్క లక్షణాన్ని చెప్పి, **"బ్రహ్మవిదాప్నోతి పరం"** అనే మరోవాక్యం ద్వారా బ్రహ్మనిగురించి తెలుసుకున్నవాడు బ్రహ్మసాన్నిధ్యమును పొందును అని ఫలప్రతిజ్ఞను చేసింది. ఇది ప్రత్యక్షానుమానాలకు అందని ప్రకృష్టజ్ఞానము. బ్రహ్మయొక్క సత్తను (అస్తిత్వము) చెప్పే జ్ఞానము. **లక్షణప్రమాణాభ్యాం వస్తుసిద్ధిః** అనే న్యాయమును అనుసరించి పై రెండు వాక్యములలో లక్షణము ప్రమాణము ఈ రెండిటినీ చెప్పడం వలన బ్రహ్మయొక్క సత్త సిద్ధించింది కాబట్టి **విద సత్తాయాం** అనే ధాతువు నిష్పన్నమైన వేదపదం బ్రహ్మయొక్క ఉనికిని (బ్రహ్మసద్భావం) తెలియజేయడం ద్వారా సత్తార్థకమై భాసిస్తోంది. అందుకే **"సద్భావం సాధయంతీతి వేదాః"** అని పెద్దల వ్యాఖ్య. వేదం ఇలా బ్రహ్మసద్భావాన్ని మాత్రమే కాక, మన సద్భావం గురించి ఇతరులు గుర్తించేవిధానాన్ని కూడ బోధిస్తోంది. **'అస్తి బ్రహ్మేతి చేద్వేద, సంతమేనం తతో విదు రితి'** బ్రహ్మ అనేవాడు ఉన్నాడు అని గుర్తించినవానినే ఉనికిగల వానిగ ఇతరులు తెలుసుకుంటుంటారు. అర్థాత్ బ్రహ్మయొక్క అస్తిత్వాన్ని తెలుసుకోని వారంతా అస్తిత్వం లేనివారే నన్నమాట. ఇలా బ్రహ్మకు మనకు కూడ సత్తాను కలిగించే జ్ఞానరాశికి **'వేదం'** అనే వ్యవహారం ఏర్పడింది.

**విద-జ్ఞానే** అనేధాతు రూపం ద్వారా జ్ఞానార్థకము అయిన ఈ పదం కూడ వ్యాకరణరీత్యా **ఘఞ్** అనే ప్రత్యయం చేర్చడం ద్వారానే ఏర్పడింది. **విదంతి ఏభిః ధర్మబ్రహ్మణీ క్రియాః, జ్ఞానమయం బ్రహ్మ వా ఇతి వేదః** అని దీని నిర్వచనం. పూర్వభాగం ద్వారా భగవదారాధనారూపమైన ధర్మ స్వరూపాన్ని, తమ ఉత్తరభాగం ద్వారా ఆరాధ్యమైన భగవత్ స్వరూపరూపవిభవాదులను తెలియజెప్పునవి కావడం చేత వీటికి **వేదములు** అని పేరు.

**తంత్వౌపనిషదం పురుషం పృచ్ఛామి** అనే శ్రుతి ఉపనిషద్ జ్ఞానముచేతనే పరబ్రహ్మ తెలిసికొనదగినవాడు అని చెప్పడం వలన బ్రహ్మను తెలుసుకునే విషయమునందు వేదములే సాధనములు అని తెలుస్తోంది. అందువలన ప్రత్యక్షానుమాన సాధ్యములైన ప్రాపంచిక విషయములకే కాక, ఆ రెండు ప్రమాణాలకు అందని అతీంద్రియవిషయజ్ఞానమునకు కూడ సాధనమైన ఈ జ్ఞానసముదాయానికి వేదము అని వ్యవహారము సిద్ధించింది.

**విద - విచారణే** అనే ధాతురూపం ద్వారా విచారార్థకము అయిన ఈ వేదం అనే పదం వ్యాకరణరీత్యా **అచ్** అనే ప్రత్యయం చేరడం ద్వారా ఏర్పడింది. **వింతే విచారయతి ధర్మబ్రహ్మణీ, క్రియా జ్ఞానమయం బ్రహ్మ వా ఇతి వేదః** అని క్రియాత్మక మైన ధర్మస్వరూపాన్ని, జ్ఞానాత్మకమైన బ్రహ్మస్వభావాన్ని విచారించి బోధిస్తుంది. కాబట్టి దీనికి వేదము అని పేరు. **ఉత్సృజ్యాన్నేత్సృజ్యామితి మీమాగ్ంసన్తే...** ఇత్యాది వాక్యాలన్నీ ధర్మస్వరూప స్వభావాల విషయంలో విచారణ చేసేవే. అంతేకాక విధి నిషేధాల రూపంలో సార్వకాలికము లైన విధి నిషేధాలను, స్థల సమయాలను బట్టి మార్పుచెందే విధి నిషేధాలను కూడ విచారించి మనకు కర్తవ్యాలను ఉపదేశించేవాక్యాలు కలిగిన ఈ జ్ఞానరాశి విచారార్థకమై వేదము అనేనామధేయంతో విరాజిల్లుతోంది.

ఇక నాల్గవది అయిన **విద్ల్ లాభే** అనే ప్రయోగం వలన ఏర్పడిన వేద పదం బ్రహ్మ ప్రాప్తిని సూచిస్తోంది.

**విద్ల్-లాభే** అనే ధాతురూపం ద్వారా లాభార్థకము అయిన ఈ వేదపదం వ్యాకరణరీత్యా ఘఞ్ అనే ప్రత్యయ సంబంధంతోనే ఏర్పడింది. **విదంతే స్వరూపం లభంతే వస్తు అనేనేతి వేదః** అని దీని నిర్వచనం. బ్రహ్మ స్వరూపాన్ని తదధీనమైన ఆత్మస్వరూప లాభాన్ని అనగ, స్వస్వరూప జ్ఞానాన్ని పొందించేది కాబట్టి దీనికి వేదము అని పేరు. **బ్రహ్మాధీనం ఆత్మానం లభంతే ఇతి వేదాః** అనే శంకరుల వ్యాఖ్య ఇక్కడ స్మరణీయము. బ్రహ్మయొక్క స్వరూపజ్ఞానాన్ని అందించి, ఆ బ్రహ్మయొక్క అధీనంలోనే ఉండే ఆత్మస్వరూపముల యొక్క జ్ఞానలాభాన్ని పొందించి, తద్వారా బ్రహ్మ ప్రాప్తిని కలిగించే దివ్యాక్షర సముదాయమే **వేదము** అనే పేరిట విలసిల్లుతోంది.

ఇది **విద** అనే ధాతువు వల్ల ఏర్పడిన వేదము అనే పదం యొక్క వివిధార్థాల వివరణం మాత్రమే ఈ వేదం అనే పదాన్ని వేదోపబృంహణాలైన స్మృతీతిహాస పురాణాదులు ఎలా వ్యాఖ్యానించాయో, వేదభాష్యకారులు ఏ విధంగా విశ్లేషించారో వచ్చే సంచికలో తెలుసుకుంటూ ముందుకు సాగుదాం!

(సశేషం)

# పిబత భాగవతం రసం... వివిధావతార ప్రశంసనమ్

## 2స్క-3 వ అధ్యాయం

శాస్త్రరత్నాకర, శాస్త్రవిద్వన్మణి డా॥ఉ.వే సముద్రాల వేంకట రంగరామానుజాచార్యులు
డైరెక్టర్ - అకెడమిక్ కౌన్సిల్ 'జీవ' శ్రీరాంనగర్ (శంషాబాద్)

భగవానుడు మొట్టమొదటిగా మహత్తు, అహంకారం పంచతన్మాత్రలు మొదలైన తత్త్వాలతో కూడి పదహారుకలలతో సుసంపన్నమైన పురుషరూపాన్ని స్వీకరించాడు. ఇదే ఆద్యావతారం పురుషావతారం. పదకొండు ఇంద్రియాలు, పంచమహాభూతాలు కలిసి షోడశకళలు. ఇదే విరాడ్రూపంగా ప్రసిద్ధం. దీనితో భగవానుడు అంతర్యామిగా ఉండి లోకాలను అనుగ్రహిస్తున్నాడు. అండాంతర్వర్తిగా మొట్టమొదట ఆవిర్భవించిన విరాట్పురుషుని గురించి సుబాలోపనిషత్తు విస్పష్టపరచింది. ఈ విరాట్పురుషుడు చతుర్ముఖుడని కొన్ని పురాణాలు పేరొన్నాయి. కానీ, ఈ విరాట్‌పురుషుడు సాక్షాత్తు శ్రీహరియే. శ్రీహరి నాభికమల సంభూతుడు చతుర్ముఖుడైన బ్రహ్మ అని శ్రీభాగవతం విస్పష్టపరచింది.

**జగృహే పౌరుషం రూపం భగవాన్ మహదాదిభిః ।**
**సంభూతం షోడశకలమ్ ఆదౌ లోక సిసృక్షయా ॥**
**యస్యాంభసి శయానస్య యోగనిద్రాం వితన్వతః ।**
**నాభిహ్రదాంబుజాత్ ఆసీద్బ్రహ్మా విశ్వసృజాం పతిః ॥**

విరాడ్రూపధారి అయిన పరమాత్మనే **'సహస్రశీర్షాపురుషః'** ఇత్యాదిగా వేదం కీర్తించింది. ఈ విరాట్ పురుషుడే నారాయణుడు. ఆయనే శేషశయ్యపై అధివసించి ఉన్నవాడని స్పష్టపరుస్తున్నది భాగవతం.

**యస్యావయవ సంస్థానైః కల్పితో లోకవిస్తరః ।**
**తద్వై భాగవతోరూపం విశుద్ధ సత్త్వమూర్జితమ్ ॥**

విరాట్‌పురుషునిగా అవతరించిన నారాయణుని ఈ విరాడ్రూపంలోని అవయవ సన్నివేశాల నుండి సమస్త ప్రపంచము ఆవిర్భవించింది. శేషశయ్య నధివసించిన స్వామియే అన్ని అవతారాలకు నిధానమై సర్వావతార బీజమై ఉన్నాడు. శుద్ధసత్త్వమయుడు. ఈయనకు చెందిన అంశం చేతనే దేవతలు, పశుపక్ష్యాదులు, మనుష్యులు సృజింపబడుతున్నారు. పురుషసూక్త ప్రసిద్ధమైన సహస్రశీర్షాది విరాడ్రూపాన్ని ధరించి శేషశయనుడైన నారాయణుడే దానిలో అంతర్యామిగ ఉండి, తన విరాడ్రూపం నుండి సమస్తాన్ని ఆవిర్భవింపజేస్తున్నాడు.

వాస్తవానికి విరాడ్రూపమై ఆద్యావతారమైనా, భగవానుడు స్వీకరించిన కౌమారమూర్తినే, భాగవతం, ప్రథమ సృష్టిగ పేర్కొంటున్నది.

కౌమారము, ఆర్షము, ప్రాజాపత్యము, మానవము అని నాల్గు సర్గలలో మొదటిదైన కౌమారసర్గలో, భగవానుడు బ్రాహ్మణరూపధారియై బ్రహ్మచర్యాన్ని ఆశ్రయించాడు.

**స ఏవ ప్రథమం దేవః కౌమారం సర్గమాస్థితః ।**
**చచార దుశ్చరం బ్రహ్మ బ్రహ్మచర్య మఖండితమ్ ॥**

ఇక రెండవ అవతారం భూ సముద్ధారణానికై స్వామి స్వీకరించిన వారాహావతారం.

**ద్వితీయం తు భవాయాస్య రసాతలగతాం మహీం ।**
**ఉద్ధరిష్య న్నుపాదత్త యజ్ఞేశః సౌకరం వపుః ॥**

ఇక మూడవదైన ఋషిసర్గంలో, దేవర్షియైన నారదుడుగా ఆవిర్భవించి, కర్మాచరణంలోని నైష్కర్మ్య నిరూపకమైన సాత్త్వత తంత్రాన్ని లోకానికి ఆవిష్కరించాడు. ఛాందోగ్యోపనిషత్తులో సనత్కుమారుని సన్నిధికి నారదుడు వెళ్ళి, తన నిర్వేదాన్ని ఆవిష్కరించి, తత్త్వజిజ్ఞాసను ఆవిష్కరించినట్లు ఉంది. ఈ సాత్త్వతతంత్రమే భాగవత శాస్త్రంగాను, శ్రీపాంచరాత్రంగాను ప్రసిద్ధి చెందింది. శ్రీకృష్ణభగవానుడు స్వారాధనారూపమైన క్రియాయోగంగ దీన్నే ఉద్ధవునికి ఉపదేశించినట్లు భాగవతంలోని ఏకాదశస్కంధం చెబుతున్నది.

**తృతీయం ఋషిసర్గం వై దేవర్షిత్వ ముపేత్య సః ।**
**తంత్రం సాత్త్వతమాచష్ట నైష్కర్మ్యం కర్మణాం యతః ॥**

ఇక నాల్గవదైన ధర్మకలాసర్గంలో ధర్మప్రజాపతి పత్నియైన మూర్తి అనే పేరుగల ఆమెయందు నర నారాయణ ఋషులుగ శమ దమాదులతో కూడిన దుశ్చరమైన (ఇతరులకు ఆచరింపవీలుకాని) తపస్సును చేసాడు.

**తుర్యే ధర్మకలా సర్గే నరనారాయణావృషీ ।**
**భూత్వా శమదమోపేత మకరో ద్దుశ్చరం తపః ॥**

భగవదవతారాలలో ఐదవది కపిలావతారం. ఈ చెప్పిన క్రమంలో విరాట్ పురుషస్వరూపాన్ని ద్వితీయ స్కంధంలో ప్రథమాధ్యాయంలో భాగవతం విస్తారంగ వర్ణించింది.

ఇక, రెండవదైన సనత్కుమారాద్యవతార విశేషవర్ణనం భాగవతంలో లేకపోయినా, జయ విజయ శాపాదివృత్తాంతంలో వీరి ప్రస్తావనం ఉంది.

ఇక నారదవృత్తాంతం ప్రథమస్కధంలోనే విశేషంగ ఉంది. నరనారాయణావతార ప్రశంసనం ఏకాదశ స్కంధంలో ఉంది. ప్రసిద్ధావతారాల్లో ఒకటైన వారాహావతారం అవతారక్రమంలో సనకాద్యవతారం తరువాత రెండవదిగ భాగవతంచే నిర్దేశింపబడింది.

**ద్వితీయం తు భవాయాస్య** ఇత్యాదిగ ప్రసిద్ధావతారాలుగ చెప్పుకొనే పదింటిలో వారాహానికి ముందు మత్స్యకూర్మావతారాల నిర్దేశం ఉన్నా, ఇక్కడ మత్స్యావతారం 10వది గాను, కూర్మావతారం 11వది గాను నిర్దేశింపబడడం గమనింపదగి ఉంది. భాగవతం నిర్దేశించిన అవతార క్రమంలో (ఆద్యమైన పురుషావతారం విడచి) ఐదవదిగా చెప్పబడిన అవతారం కపిలావతారం. కపిలుణ్ణి **సిద్దేశ** శబ్దంచే నిర్దేశించింది భాగవతం. ఈయన షష్టితంత్రంగ ప్రసిద్ధమైన ఈశ్వరకృష్ణప్రోక్తమైన సాంఖ్యం కంటే కొంత విలక్షణంగ, సాంఖ్యసూత్రాలను వ్రాసి, పంచవింశతి తత్త్వాలను నిరూపించాడు. అయితే, యోగదర్శనంతో సమానతంత్రంగ (న్యాయవైశేషికులలాగ, పూర్వోత్తరమీమాంసలాగ, నిరుక్తవ్యాకరణాలలాగ) కలసి ఉండడంవల్ల కపిలప్రోక్త సాంఖ్యం సేశ్వరసాంఖ్యంగ ప్రసిద్ధి చెందింది.

**పంచమః కపిలో నామ సిద్ధేశః కాలవిప్లుతమ్ ।**
**ప్రోవాచాసురయే సాంఖ్యం తత్త్వగ్రామ వినిర్ణయమ్ ॥**

ఈయన, తన తల్లియైన దేవహూతికి తత్త్వోపదేశం చేసినట్లుగ శ్రీమద్భాగవతం, స్వాయంభువ మనువంశ వర్ణన పురస్సరంగ, కపిలజన్మ వృత్తాంతంతో కలిపి తృతీయస్కంధంలో ఐదు అధ్యాయాల్లో విస్తారంగ చెప్పింది.

కపిలుడు సాంఖ్యతత్త్వాన్ని ఆసురి అనే వానికి ఉపదేశించాడు. అతనిద్వారా దర్శనంగ మారింది. లోకానికి మరికొందరిద్వారా అందిందని ఈశ్వరకృష్ణుడు తన సాంఖ్యకారికల్లో చెప్పాడు.

**ఏతత్పవిత్ర మగ్ర్యం ముని రాసురయేఽనుకంపయా ప్రదదే ।**
**ఆసురిరపి పంచశిఖాయ తేన బహుధా కృతం తంత్రమ్ ॥**

ఆరవ అవతారంగ నిర్దేశింపబడినది దత్తాత్రేయావతారం. స్వామి, తాను అత్రికి-అనసూయ ద్వారా స్వయందత్తుడై ఆవిర్భవించాడు.

**షష్ఠమత్రై రపత్యత్వం యతః ప్రాప్తోఽనసూయయా ।**
**అన్వీక్షకీ మలర్కాయ ప్రహ్లాదాదిభ్య ఊచివాన్ ॥**

ఈ అవతారంలో తాను **అన్వీక్షకీ** అనే ఆత్మవిద్యను అలర్కుడనే ప్రభువుకు, ప్రహ్లాదాదులకు అనుగ్రహించాడు.

**తతః సప్తమ ఆకూత్యాం రుచే ర్యజ్ఞోఽభ్యజాయత ।**
**స యామాద్యైః సురగణై రపాత్ స్వాయంభువాంతరమ్ ॥**

అటుతరువాత ఏడవ అవతారంగ, ఆకూతియందు ఋచి అనే మునిద్వారా యజ్ఞుడనే పేర ఆవిర్భవించి, **యామ** నామకులైన దేవగణములతో కలసి స్వాయంభువ మన్వంతరాన్ని పరిరక్షించాడు.

ఎనిమిదవ అవతారం ఋషభావతారం. మేరుదేవి యందు **నాభి** అనేవాని ద్వారా శ్రీమన్నారాయణుడు ఋషభునిగా ఆవిర్భవించి, సర్వాశ్రమాలకు ఆదరణీయమైన తురీయాశ్రమమైన పారమహంస్యాన్ని (యతిధర్మాన్ని) ధీరులైన పెద్దలకు దర్శింపజేస్తూ తన విశిష్టతను లోకవిశ్రుతం చేసాడు.

**అష్టమే మేరుదేవ్యాం తు నాభేర్జాత ఉరుక్రమః ।**
**దర్శయన్ వర్త్మ ధీరాణాం సర్వాశ్రమ నమస్కృతమ్ ॥**

ఋషులంతా లోకంలోని అరాచకస్థితిని పోద్రోలడానికై నారాయణుని పార్థివరూపాన్ని ధరించమని ప్రార్థించగా, స్వామి, సాక్షాత్తుగా పృథువుగా ఆవిర్భవించి, ఆజగనమనే మహాధనువుతో కూడినవాడై ధనుష్కోటితో అస్తవ్యస్తంగ ఉన్న భూమిని ప్రథనంచేసి, దానిని పృథివిగ ప్రసిద్ధమగునట్లు చేసి, ఓషధులను దానినుండి పితికి, పృథుచక్రవర్తిగ సర్వ రాజన్యమాన్యుడైనాడు.

**ఋషిభి ర్యాచితో భేజే నవమం పార్థివం వపుః ।**
**దుగ్ధేమా మోషధీ ర్విప్రాః తేనాయం స ఉశత్తమః ॥**

(సశేషం)

# కలివైరిసూరి వైభవము



గత సంచిక తరువాయి...

శ్రీ ఉ.వే.శ్రీమాన్ కె. టి. రామానుజాచార్యస్వామి-నెల్లూరు

**తిరుమంగై ఆళ్వార్- పెరియ తిరుమొழி 1-7-2**

2 పాశురం: **అలైత్త పేழ்వాయ్ వాళెయిత్తోర్ కోళరియా యవుణన్**
**కొలై కైయాళన్ నెஞ்జిడన్ద కూర్ ఉకిరాళనిడమ్ ।**
**మలైత్త శెళ్శాత్తెరిన్ద పూశల్ వన్తుడివాయ్కడుప్ప**
**చ్చిలైక్కవేడర్ తెళిప్పరాత శిఙ్గవేழ்కున్నమే ॥**

**ప్రతిపదార్థము: అలైత్త**=కదలుచున్న; **పేర్వాయ్**= పెద్దనోరును; **వాళ్**=కాంతివంతములగు, **ఎయిఱు**= దంతములును (కోరలు) గల; **ఓర్**=సాటిలేని; **కోళ్**=బలము గల; **అరియాయ్**= నరసింహమై; **కొలై**= హింసించు నటువంటి; **కైయాళన్**= కరములుగల; అవుణన్= హిరణ్యకశిపునియొక్క; **నెంజు**=వక్షః స్థలమును; **ఇడన్ద**= చీల్చివేసిన; **కూర్+ఉకిర్+ ఆళన్**=వాడియైన గోళ్ళుగల స్వామి వేంచేసియున్న; **ఇడమ్**=స్థానము; **మలైత్త**= (బోయవారిచే) అడ్డగింపబడిన, **శెళ్శాత్తు**= యాత్రికుల గుంపు; **ఎఱిన్ద**= పెట్టినటువంటి; **పూశల్**=యుద్ధమునందు; **నల్**= అధికముగ ధ్వనించెడి; **తుడి**=వాద్య విశేషముయొక్క (డోలు); **వాయ్**=నోరు; **కడుప్ప**=ధ్వనించుచుండగ; **శిలై**=ధనస్సులు; **కై**=చేతియందు గల; **వేడర్**= వేటగాళ్ళ యొక్క; **తెழிప్పు**= ఆరవారములు; (సంతోషపు అరపులు) **అఱాత**=తరగని; **శింగవేழ்కున్నమే**= అహోబిలమనెడి దివ్యదేశము.

**తాత్పర్యము:** పరులను హింసించుటయే స్వభావ ముగాగల హిరణ్యాసురుని గుండెలను నఖాగ్రములతో చీల్చినవాడును, కోపావేశముతో నాలుకతో అటుఇటు పెదవుల మూలలను నొక్కుచున్నవాడును, విశాలమగు వదనము కలవాడును, ప్రకాశించుచున్న కోరలు గలవాడునగు శ్రీనరసింహమూర్తి అహోబిల క్షేత్రమున వేంచేసియున్నాడు.

అచ్చట వేటగాళ్ళు బాటసారులను అటకాయించు చుందురు. బాటసారులు వారిని ఎదిరించి పోరాడు చుందురు. ఆ పోరాటమున వేటగాళ్ళు చేయు వాద్య విశేషముల ధ్వనులు ఎడతెఱపులేక విననగుచుండును.

**విశేషార్థము :** భూమండలమంతయు గడగడ వణకునట్లున్న శ్రీనరసింహుని దివ్యరూపమును తిరుమంగై ఆళ్వార్లు ఈ పాశురమున వర్ణించుచున్నారు.

**అలైత్త :** కోపముతో, అటు ఇటు కదులుచున్న పెద్ద నోటితో, కాంతివంతములగు కోరలతో, అద్వితీయమగు బలముతో కూడిన నరసింహరూపియై,

**అవుణన్ కొలైక్కైయాళన్:** లోకమున జనులు సహజముగ తమ బిడ్డలను రక్షించుకొనుటకే పరులను హింసించుచుందురు. కాని హిరణ్యకశిపు అట్లుగాక తన కన్నబిడ్డనే హింసించు స్వభావముగల వాడైనాడు. హిరణ్యాసురుని చేతులు పరులను హింసించుటయే స్వభావముగాగలవి. పరులను హింసించుటకే దేవతల వలన వరములను పొంది, అదియే యాత్రగాగల ఆ అసురుని గుండెలను పదునైన తన నఖాగ్రములతో చీల్చివేసిన స్వామి వేంచేసియుండు స్థానము అహోబిల క్షేత్రము.

**మలైత్త:** అహోబిల క్షేత్రమునకు భక్తజనులు గుంపులు గుంపులుగా తీర్థయాత్రను చేయుచుందురు. ఆ మార్గముననున్న ఆటవికులు వారిని అడ్డగించి దోపిడి చేయబోవగా పరస్పరము ఘర్షణము ఏర్పడును.

**ఎఱిన్దపూశల్:** ఆ విధముగ ఏర్పడిన దోపిడి యుద్ధమున

**వన్ తుడివాయ్ కడుప్ప:** అప్పుడు ఆ వేటగాళ్ళు తమ వద్దనున్న "డోలును" ప్రయోగింతురు. ఆ వాద్యముల భయంకరమగు ధ్వని, విన్న వెంటనే ప్రాణములు పోవునట్లుండును.

**శిలక్కై:** నిరంతరము ధనుర్ధారులగు ఆ ఆటవికుల అరుపులతో కూడిన దివ్యదేవము అహోబిలక్షేత్రము. దివ్యదేశ సంబంధముగలవి అన్నియును భక్తులకు ప్రాప్యములే! పరమభోగ్యములే! కనుకనే తిరుమంగై ఆళ్వార్లు అహోబిలక్షేత్రమున ఆటవికుల చేతిలోనున్నట్టి, డోలుయొక్క ధ్వనులను వారి అరుపులను పరమభోగ్యముగ ఈ పాశురమున వర్ణించుచున్నారు. ఈ కలివైరిసూరి వర్యులకు అహోబిల క్షేత్రమున వేంచేసియున్న శ్రీనరసింహస్వామి యొక్క కోపముతోపాటు ఆ క్షేత్రమున నున్న వారి కోపము, వారి చేష్టితములు మున్నగునవి అన్నియు భోగ్యములైనవి.

**యస్యానుగ్రహ మిచ్ఛామి తస్య విత్తం హరా మ్యహమ్**

"నేను ఎవనిని అనుగ్రహింప నెంతునో వాని ధనమును హరింతును'' అని భగవంతుని వచనము. అనగ స్వపదాశ్రితులను అనన్య గతికులనుగ జేసి ఆ పిమ్మట భగవంతుడు వారిని అనుగ్రహించునని భావము. ఆ క్షేత్రము నందలి సింహములు ఏనుగులను చంపి వాని దంతముల నన్నింటిని శ్రీ నరసింహస్వామి పాదారవిందములలో సమర్పించిన విధముగ అచ్చటనున్న ఆటవికులును తాము చేసిన దారి దోపిడి ధనమునంతటిని శ్రీ నరసింహమూర్తికి సమర్పించి, ఆ భక్తులను శ్రీస్వామివారి సన్నిధిలో అనన్య గతికులనుగా జేయుచుందురు. కనుకనే ఈ ఆళ్వార్లకు అచ్చటి ఆటవికుల అరుపులు, వారి వాద్యపుధ్వనులు. భక్తుల ఆర్తనాదములు అన్నియును ప్రాప్యములైనవి. (సశేషం)



# సీతాఫలం రామార్పణమ్



గత సంచిక నుండి

శ్రీమతి చెవుటూరి కుసుమకుమారి - హైదరాబాద్

ఒక నావ ఆకృతిని సిద్ధముచేసి దానిలో కృత్రిమ వృక్షాలను, పండ్లు ఆకృతిలో పిండివంటలను, సుగంధ పానీయాలను, మధుర రసాలను ఆ వనిత కోరినట్లు సిద్ధము చేసినారు. సౌందర్యవంతులు, యౌవనవతులు అయిన మరికొందరు వనితలతో కూడి విభాండకమహర్షి ఆశ్రమ సమీపమున ఒక ఆశ్రమమును కల్పించుకొనినారు. విభాండకమహర్షి ఆశ్రమమున లేని సమయమున ఆయన ఆశ్రమమున ఒక సుందరాంగి మునివేషధారిణి అయి ప్రవేశించినది. ఋష్యశృంగుని తపస్సు, స్వాధ్యాయము, కందమూల ఫలాదుల గురించి కుశలమడిగినది.

**బుధ్వా భవాన్జ్యోతిరివ ప్రకాశతే**
**మాన్యే చాహం త్వామభివాదనీయం ।**
**పాద్యం చాహం సంప్రదాస్యామితేఽద్య**
**యథా సిద్ధ్యేత్కర్మ ఫలాని చైవ ॥**

మునివర్యా! నీకు నమస్కారము. సాక్షాత్ పరబ్రహ్మవలె భాసిస్తున్నావు. నా తపస్సంతా సిద్ధించునట్లు నీకు అర్ఘ్యపాద్యాలు సమర్పిస్తాను. స్వీకరించు. నీకు కుశాసనము, కృష్ణాజినము. నీకు నచ్చినచోట సుఖాసీనుడవు కమ్ము. అనగానే ఆ వనిత భయపడింది. విభాండకమహర్షి వచ్చునేమో అని భయపడి 'ఋష్యశృంగ మహర్షీ! మా ఆశ్రమము ఇక్కడికి పన్నెండు కోసులదూరము. మేము ఇతరుల నమస్కారమును, అర్ఘ్యపాద్యములను స్వీకరించము. కనుక నీవు మాకు నమస్కరించవలదు. నేనే నీకు నమస్కరించెదను. ఇప్పుడు మేమొక వ్రతదీక్షలో వున్నాము. కనుక మహర్షీ! ఇప్పుడు నిన్ను ఆలింగనము చేసుకొనెదము' అని ఆలింగనము చేసుకొని తాను తెచ్చిన ఫలరూప భక్ష్యములను తినిపించి, అగ్నికార్యమునకు వేళ అయినదను వంకతో వేగముగా వెళ్ళిపోయినది. కానీ విధివిచిత్రము. అంతటి తపశ్శాలి ఆ మునివేషధారిణినే తలచుచూ వికారమునకు లోనై నిత్య కృత్యములనే మరచినాడు.

అటు తరువాత ముహూర్తకాలమునకు కశ్యప పుత్రుడు సమాధి స్థితివంతుడు స్వాధ్యాయవేత్త అయిన విభాండకమహర్షి ఆశ్రమమునకు వచ్చి, నిర్వికారముగా వున్న పుత్రుని చూచి, 'పుత్రా! మనస్థిమితము లేనట్లున్నా వేమి? ఇచ్చటికి ఎవరైనా వచ్చివెళ్ళినారా?

**న కల్ప్యంతే సమిధః కిం ను తాత?**
**కచ్చిద్భూతం చాగ్నిహోత్రం త్వయాఽద్య?**

పుత్రా! సమిధలు తెచ్చినావా? యజ్ఞపాత్రలు, స్రుక్స్రువాలు శుభ్రముచేసినావా? అగ్నిహోత్రము చేసినావా? హోమధేనువు పాలు పితికినావా?' అని ప్రశ్నించినాడు మహర్షి. 'తండ్రీ! ఈ రోజు జటాధారి అయిన ఒక ఆశ్రమవాసి అయిన బ్రహ్మచారి వచ్చినాడు. అతడు మేలిమి బంగారువలె దేవతలను సహితము మోహింపచేయునట్లున్నాడు. తండ్రీ! అతడు నేనిచ్చిన ఫలమూలాలను కూడా స్వీకరించలేదు. అతడు తెచ్చిన వానిని నాకు ఈయగా నేను భక్షించినాను. వాని మాధుర్యముతో మన కందమూలములు, ఫలములు ఏమాత్రమూ మధురములు రుచ్యములు కావు. మధురరసాలు కూడ త్రాగినాను. అవి మధురాతి మధురాలు.

తండ్రీ! ఆ తపస్వి వ్రతచర్య ఏమైవుండును? నేను అతని సమీపముననే వుండి అటువంటి వ్రతచర్యనే చేయ గోరుచున్నాము. ఎందుకనగా అతడటువంటి వ్రతచర్యల చేతనే కదా! అంతటి గొప్పవాడైనాడు'. అతని మాటలు విన్న విభాండకమహర్షి యోగదృష్టితో యథార్థ విషయమును గ్రహించినాడు. తన పుత్రునితో

**రక్షాంసి చైతాని చరంతి పుత్ర! రూపేణ తేనాద్భుత దర్శనేన ।**
**అతుల్య వీర్యా హ్యతిరూపవంతి, విఘ్నం సదా తపస శ్చింతయంతి ॥**

'కుమారా! నీవు చూచిన అద్భుత రూపముగురించి నీవు

చెప్పిన దానిని బట్టి నేను యోచించినాను. రాక్షసులు మహర్షుల తపోభంగము చేయుటకు బలము సౌందర్యము గల అద్భుత రూపాలతో ఈ పరిసరములయందు సంచరించుచున్నారని నాకు తోచుచున్నది కనుక నీవు ఆ రాక్షసుల వైపునకు వెళ్ళకు' మని హెచ్చరించి ఫలములు తెచ్చుటకై వెళ్ళినాడు.

విభాండకమహర్షి అటు వెళ్ళగానే ఆ మునివేషిణి అయిన వనిత మరల ఋష్యశృంగాశ్రమమునకు వచ్చినది. ఆ బ్రహ్మచారిని చూచిన ఋష్యశృంగుడు సంతోషాంత రంగుడు అయినాడు. ఆయనకు ఒకవిధమైన చిత్తభ్రాంతి విధివిలాసమా! అన్నట్లు ఆవరించింది. మునివేషధారిణితో 'తపస్వీ! నా తండ్రి రాక ముందే మనము మీ ఆశ్రమమునకు వెళ్ళుద'మనినాడు. వెంటనే వనితలందరూ మునివేషులై ఋష్యశృంగుని తమ కల్పిత ఆశ్రమానికి తీసుకువెళ్ళారు.

సమాధిస్థితిలోవున్న ఋష్యశృంగుని నావలో ఎక్కించి పడవను రోమపాదుని చంపానగరమునకు తీసుకొని వెళ్ళారు. ఋష్యశృంగుని పాదస్పర్శతో గొప్పవృష్టి కురిసినది. దేశము సుభిక్షమైనది. రోమపాదుని రాజ్యము సస్యశ్యామలమైనది. తన అభీష్టము నెరవేర్చిన ఋష్యశృంగునకు తన కుమార్తె శాంతనిచ్చి పెండ్లి చేసి ఇరువురినీ తన పట్టణముననే నివసించుడని కోరినాడు.

ఋష్యశృంగుని విచిత్రకథను విన్నవారికి నిజముగనే అనేక సందేహములు కలుగును. అంతటి తపోధనునికి వారు ఆశ్రమవాసులా? లేక వనితలా అను విషయము తెలియదా? శాస్త్రాధ్యయనము చేసినచో స్త్రీల సాహచర్యము బ్రహ్మచర్యమున దోషమని ఎందుకు తెలియలేదు? అని. కాని ఇప్పటివరకు బ్రహ్మవేత్త అనీ, సమాధిస్థితిలో చంపాపట్టణమునకు చేర్చినారనీ చెప్పుకున్నాము. కనుక అతడు సర్వజ్ఞుడే. ఋజుబుద్ధితో చేసిన పనికి పాపమంటదని శాస్త్రము. బ్రహ్మవేత్తకు ప్రతివస్తువూ బ్రహ్మరూపముగనే కనుపించును. కనుక ఆతడు దానికనుగుణముగనే ప్రవర్తించును.

కానీ, బ్రహ్మవేత్తకైనా ప్రారబ్ధము అనుభవించక తప్పదు. కనుకనే విభాండక మహర్షి యోగదృష్టితో చూచి సర్వమూ తెలుసుకొనినాడు. తన పుత్రుని విధివశముననే ఇట్లు జరుగుచున్నదిగానీ, రోమపాదుడు, ఆ వనితలు అందరూ నిమిత్తమాత్రులే అనీ, ఇదంతా కార్యకారణము తెలుసుకొనుట చేతనే రాజునుగానీ, ఆస్త్రీలనుగానీ శపించలేదు.

అగ్నికల్పుడైన అపారశక్తివంతుడు ఋష్యశృంగుడు. అంతటి అపారశక్తివంతుని స్పృశించిన శక్తిహీనునకు శక్తివంతునిశక్తి కొంచెము కలుగునేమోగానీ, అశక్తుని దోషము మాత్రము శక్తివంతుని ఏమీ చేయలేదు.

ఆ విధముగా తపోహాని కలుగజేసిన వాతాపిని తిని జీర్ణించుకున్న అగస్త్యమహర్షి, లంకలో అస్తవ్యస్త రాక్షస గంధర్వాది స్త్రీలను చూచిన హనుమ, మావటి చేతిలోని గుగ్గిళ్ళను తిన్న ఉషస్తి అనే ఋత్విక్కు మొదలైనవారి గతి ఎట్లుండవలె? ఇదంత అట్లుండనీయుడు. సాక్షాత్తు శ్రీమహావిష్ణువు రాక్షస వధార్థము మానవుడై పుడమిన దుష్టశిక్షణ, ధర్మరక్షణలకై పుట్టుటకు పుత్రకామేష్టి చేయించుటకు బ్రహ్మదేవునిచేత ఎన్నబడిన బ్రహ్మవేత్త ఋష్యశృంగుడు. కనుకనే ఒకప్పుడు విధాత ఋష్యశృంగుని వద్దకు వచ్చి తానుగా వరాలను ప్రసాదించాడు.

'విభాండకపుత్రా! ఋష్యశృంగా! నీవు కాలుమోపిన చోట క్షామము నశించును. సుభిక్షము, పశుసంపద ప్రజాభివృద్ధి (సంతానవృద్ధి) కలుగును. నీవు ఏది సంకల్పించిననూ అది సఫలమగును'. అన్నిటికన్నా మిన్న అయిన విధాత వరములచేత ఋష్యశృంగ మహర్షి మహాజ్ఞాని అయినాడు. ఇదంతయూ చూడగా చూడగా రామావతార లక్ష్యమునకు శ్రీరామచంద్రోదయమునకు దేవతలు సిద్ధము చేయుచున్న రంగస్థల నిర్మాణమని భావన తప్పక కలుగును.

కందమూల ఫలాలను తీసుకొని తన ఆశ్రమమునకు వచ్చిన విభాండకముని తనపుత్రుడు కనుపించక క్రుద్ధుడైనాడు. రోమపాదుని వలననే ఇటువంటి పరిస్థితి వచ్చినదని గ్రహించి రోమపాదుని దేశమునకు బయలుదేరినాడు.

(సశేషం)

# కూరత్తాళ్వాన్ వైభవం



శ్రీమతి చూడామణి -ఖమ్మం

"బామ్మా! కూరత్తాళ్వాన్ గురించి చెప్తూ మధ్యలో ఆపేసావు. ఇవ్వాళ పూర్తి చేయవా!" వేంకట కృష్ణ గోముగా అడిగాడు.

"నా బంగారుకొండా! నువ్వంత ఉత్సాహంతో పూర్వాచార్య వైభవం తెలుసుకోవాలని ఆరాట పడుతుంటే చెప్పకుండా ఉంటానా...! వేదను కూడా పిలుచుకురా! తరువాత అలుగుతుంది."

"కృష్ణుడు నీ దగ్గరకు రావటం చూసి నేనే వచ్చేసా. ఇక చెప్పు బామ్మా..."

"ఆళ్వాన్ పరమపదం వేంచేసిన వైభవం చెప్పుకోవాలి కదా! ఒకసారి ఉడయవర్లు శ్రీరంగంలోని వారి మఠంలో నమ్మాళ్వార్ అనుగ్రహించిన తిరువాయ్‌మొழి వ్యాఖ్యానం చెప్తున్నారు. అందులో పదవ శతకంలో తొమ్మిదవ దశకం జరుగుతోంది. "శూழ் విశుమ్బణిముగిల్ తూరియమ్ ముழక్కిన..." అని మొదటి పాశురం చెప్తున్నారు. ఆ పాశురంలో పరమపదం చేరిన జీవాత్మను అక్కడివారు ఎలా స్వాగతం పలికి, సపర్యలు చేసి పరమాత్మ సన్నిధికి తీసుకు వెళతారో వర్ణించారు నమ్మాళ్వార్. అది వింటున్న మన ఆళ్వాన్ మనసులో ఒక సందేహం కలిగింది. తనకంటే ముందు ఆచార్యులు పరమపదిస్తే వారు తనకు స్వాగతం పలికి, సపర్యలు చేస్తారు. అది లోకవిరుద్ధం. అది శిష్యుడికి అపచారం. దానికంటే తనే ముందు పరమపదం చేరితే తమ ఆచార్యులకు స్వాగతం చెప్పి సపర్యలు చేయవచ్చు కదా" అని ఆ ఆలోచన వచ్చిందే తడవుగా శ్రీరంగనాథుని సన్నిధికి వెళ్ళారు ఆళ్వాన్. స్వామిని చేరి మౌనంగా నిలబడ్డారు. ఆ నిలబడ్డవైనం చూసిన స్వామి. "ఏదో చెప్పాలనుకుంటున్నట్టున్నారే?" అన్నారు. వెంటనే ఒక శ్లోకం విన్నవించారు ఆళ్వాన్. "మీకేం కావాలో కోరుకోండి ఇస్తా"నన్నారు. "ఇప్పటికే ఎంతో ఇచ్చారు కదా!" అన్నారు ఆళ్వాన్.

"ఏమిచ్చారు బామ్మా?" కృష్ణ

"మనకీ జన్మనిచ్చింది, ధారక, పోషక, భోగ్యతల నిచ్చింది స్వామే కదా! ఆయన ఇవ్వనిదే ఏదీ మనకు లభించదు. అందుకే ఆళ్వాన్ అలా అన్నారు. అయినా స్వామి ఊరుకోలేదు. "మీరు అడగాల్సిందే! ఏదడిగినా తప్పక ఇస్తాను.ఇది సత్యం" అన్నారు.

అప్పుడు మన ఆళ్వాన్ తన మనసులోని మాట బయట పెట్టారు. "ఈ ఓటికుండను వదిలి పరమపదం చేరి తమరికి నిరంతరం కైంకర్యం చేసే భాగ్యం ఇప్పించండి" అన్నారు. ఆమాట విన్న రంగనాథస్వామి కించిత్తు విచారంతో "అది తప్ప మరేదైనా కోరరాదా!" అన్నారు. "అడిగింది ఇస్తానన్నారు కదా! మాట మార్చటం తమకు తగనిది కదా" అన్నారు. అప్పుడు స్వామి చేసేదేం లేక "మీకు మీ తిరునామం స్మరించే సమస్త జనులకు, మీ సంబంధీకు లందరికి పరమపదం ఇస్తున్నాం" అన్నారు.

"బామ్మా! అయితే మనకూ పరమపదం ఖాయమా?!"

"అవును తల్లీ! మన పూర్వాచార్యుల చరణారవిందాలను మనసులో నిలుపుకొని వారు చూపించిన మార్గంలో ప్రవర్తించేవారికి అందరికీ పరమపదం ఖాయం."

"తరువాత ఏం జరిగింది బామ్మా?" అడిగింది వేద.

ఆళ్వాన్ శ్రీరంగనాథ స్వామి దగ్గర ఇలాంటి వరం పొందిన విషయం తెలుసుకొని రామానుజాచార్యులు తల్లడిల్లిపోయారు. అదే సమయంలో ఆనంద పరవశులై తమ మఠం బయటికి వచ్చి తమపై కాషాయవస్త్రం (పైపంచె) పైకి విసిరేసి ఆనంద నృత్యం చేశారు.

"అదేంటి బామ్మా! తమ శిష్యులు తమను వదిలిపోతున్న బాధ లేకుండా ఆనందనాట్యం చేయటం. పైగా వారు సన్యాసులు కదా! అలా చేయవచ్చా?" వేద.

"ఆచార్యులకంతటి ఆనందం కలగడానికి కారణం తెలిస్తే నువ్వలా అడగవు. మునుపు తిరుక్కొట్టియూర్ నంబి చరమశ్లోకం చెప్పి దాన్ని రహస్యంగా ఉంచాలని, ఎవరికైనా చెప్పవలసి వస్తే అర్హతను పరీక్షించి చెప్పాలని రామానుజాచార్యులకు చెప్పారు కదా!"

"అవును. రామానుజాచార్యులవారినే 17 సార్లు పరీక్షించి 18వసారి చెప్పారు తిరుక్కోట్టియూర్‌నంబి కదా!"

"మరి రామానుజాచార్యులు తమ ఆచార్యులమాట పాటించారా?"

"అదే తిరుక్కోట్టియూర్‌లో అప్పుడే రాజగోపురం ఎక్కి అందరికీ చెప్పేశారుగా!" కృష్ణ.

"ఆచార్యుల మాట మీరితే ఫలితం ఏమిటి? నరకం. అది తెలిసి కూడా సకల జనులకు మేలు జరిగేట్టయితే తానొక్కడికి నరకం ప్రాప్తించినా ఫరవాలేదనుకొని రామానుజులవారు అలా చేశారు. ఇప్పుడు శ్రీరంగనాథులు ఏమని చెప్పారు? కూరత్తాళ్వాన్ సంబంధీకులందరికీ పరమపదం ఇస్తానన్నారు. అంటే వారి ఆచార్యులైన రామానుజాచార్యులకూ పరమపదం ఖాయం కదా! అందుకే మన ఆచార్యులు ఆనందనాట్యం చేసారు!"

"బామ్మా! ఆచార్యుల పాదసంబంధం వలన శిష్యులకు పరపదం లభిస్తుంది కదా! మరి ఇక్కడ శిష్యుల వలన ఆచార్యులకు పరమపదం అంటున్నావేమిటి?" గోద.

"అదే మన కూరత్తాళ్వాన్ ప్రత్యేకత. శ్రీమద్రామానుజ శిరస్సు సంబంధం వలన వారి పూర్వాచార్యులు, తిరువడి సంబంధం వలన వారి తరువాతి ఆచార్యులందరూ పరమపదం పొందారు. కాని వారే తమ శిష్యులైన శ్రీ కూరత్తాళ్వాన్ సంబంధం వలన పరమపదం పొందుతున్నామని భావిస్తున్నారన్నమాట. "అదే మన కూరత్తాళ్వాన్ ప్రత్యేకత.

శ్రీమద్రామానుజ తిరువడి సంబంధం వలన వారి పూర్వాచార్యులు, తిరువడి సంబంధం వలన వారి తరువాత ఆచార్యులందరూ పరమపదం పొందారు. కాని వారే తమ శిష్యులైన శ్రీ కూరత్తాళ్వాన్ సంబంధం వలన పరమపదం పొందుతున్నారు. అలాంటి కూరత్తాళ్వాన్ వైభవం ఎంతటిదో మనం అర్థం చేసుకోవాలి.

"తిరుముడి సంబంధం, తిరువడి సంబంధం అంటే ఏమిటి?"

"తిరుముడి సంబంధం అంటే ఆచార్య సంబంధం. రామానుజాచార్యులకంటే ముందున్న ఆచార్య పరంపర. వీరి ఆచార్యులవారి పూర్వాచార్యులు, వారి పూర్వాచార్యులు... అలా అన్నమాట. తిరువడి సంబంధం అంటే శ్రీమద్రామానుజాచార్యుల శిష్యులు, వారి శిష్యులు, వారి శిష్యులు... అలా శిష్యపరంపర అన్నమాట.

"మన దాకానా బామ్మా!"

"అవును. మన ఆచార్యులు రామానుజుల శిష్యులు. మన ఆచార్యుల శిష్యులు, వారి శిష్యులు... అలా..."

"తరువాత ఏం జరిగిందో చెప్పు?" కృష్ణ.

"కాసేపు ఆనందించి అంతలో కూరత్తాళ్వాన్, తన ప్రియశిష్యుడు తనకంటే ముందు, తానింకా ఈలోకంలో ఉండక పరమపదం చేరుతారని తలచుకొని చాలా బాధపడి ఆళ్వాన్ ఇంటికి వెళ్ళి "ఎంత పని చేశారని" వాపోయారు. నేను ముందుగా వెళ్ళి తమరికెదురేగి కైంకర్యం చేయాలనే ఇలా చేశాన"న్నారు ఆళ్వాన్.

**"న శాస్త్రం నైవ చక్రం"** కదా పరమపదంలో ఈ భువిలో సాంప్రదాయం లేవీ అక్కడ ఉండవు కదా! అన్నీ తెలిసి ఇంత పనిచేశారే!" అని విలపించి ఆళ్వాన్‌ని మనసారా ఆలింగనం చేసుకొని వెళ్ళేటప్పుడు నన్ను కూడా తీసుకుపోవాలని తోచలేదా? తొండరిప్పొడి ఆళ్వార్ శ్రీరంగనాథులను వదలలేక "ఇచ్చు తవిరయాన్ ఇందిరలోకం ఆళుం, అచ్చువై పెరినుం ( అరంగమానగరుళానే" అన్నారే. ఆ మాట మరచిపోయారా? అని పరిపరి విధాలుగా తన దుఃఖం తెలియజేశారు.

*(సశేషం)*

# రామాయణంలో ప్రజాస్వామిక పరిపాలనా విధానాలు

గత సంచిక తరువాయి...

శ్రీమతి పి. జ్యోతి- వరంగల్

రాముడు భరతుని ఆకారం చూసి అతడు రాజు కాలేదని భావించి మనసులో బాధపడుతున్నా దాన్ని వ్యక్తం చేయకనే భరతునితో సంభాషించాడు. జటలను ధరించి, నారబట్టలను కట్టుకొని ముఖకాంతి మారిపోయి, తీవ్రమైన తపనతో కృశించి ప్రళయకాలంలో సూర్యుని విధంగా ఉన్న భరతునితో రాముడు... నీవిపుడు అరణ్యానికి వచ్చినావు కదా! దశరథ మహారాజు ఎక్కడికి వెళ్ళినాడు? వారు జీవించి ఉండగా నీవు అరణ్యానికి రాలేవుకదా! దుఃఖాక్రాంతుడై పరలోకానికి వెళ్ళలేదు కదా! నీవు చిన్నవాడివి కావటం వల్ల రాజ్యాన్ని కోల్పోలేదు కదా! సత్య పరాక్రముడైన తండ్రికి శుశ్రూషలు చేస్తున్నావా! దేవతలను, తల్లులను, తండ్రులను, గురువులను, తండ్రితో సమానులైన బంధువులను, వృద్ధులను, వైద్యులను, బ్రాహ్మణులను గౌరవిస్తున్నావా? అన్ని ప్రశ్నించాడు.

భరతుడు రాజ్యాన్ని స్వీకరించే ఉంటాడని కొంతవరకు ఊహించి అతనికి కొన్ని ధర్మాలనుపదేశించాలని అనుకొని రాముడు ప్రశ్నల రూపంగా సంభాషించాడు. పురోహితులను, యజ్ఞయాగాదులు చేసేవారిని, ఉపాధ్యాయులను, వైద్యులను, మంత్రులను, సేనాపతులను, సేవకులను, దూతలను, గూఢచారులు మొదలైన వారిని ఏ విధంగా నియమించుకోవాలో తెలుపుటయే కాక వారితో ప్రవర్తించే విధానాలను కూడ రాముడు వివరించాడు.

రాజైన వాడు ధర్మపరిపాలనలో తాను త్యజించవలసిన విధానాలను భరతునికి బోధించాడు. పౌరులతో, స్త్రీలతో మెలగవలసిన తీరును తెలిపాడు. ఆయా వృత్తుల వారిని, పేదలను సంరక్షించుకునే పద్ధతలను, ఏ కాలంలోనైనా రాజ్యపాలనలో ప్రభుత్వం అనుసరించవలసిన ధర్మాల నెన్నింటినో రాముడు భరతునికి ఉపదేశించాడు. ఈ సందర్భంలో విశ్వనాథ తన శ్రీమద్రామాయణ కల్పవృక్షంలో రామభరతుల **"వాక్ ప్రతివాక్ క్రియాచరణుల్"** ఏ విధంగా ఉన్నాయో అద్భుతంగా వర్ణించాడు.

ఉ. **ఎవ్వని కన్నఁ దక్కువ మఱెవ్వరు! వాక్ప్రతి వాక్క్రియాచరణుల్**
**పువ్వుల కన్న మెత్తనయి పోల్చును, రత్నచయంబుకన్న నుం**
**దవ్వయిఁ బొల్చుఁ దత్కఠినతాగుణ, మార్య మనస్సరోజముల్**
**బువ్వము తత్ప్రసంగములు పుట్టినచో విననైన వేళలన్ ॥**

వాల్మీకి మహర్షి విశ్వమంతా ఆదర్శంగా భావించే ఎన్నో ధర్మసూక్ష్మాలను, పాలక పాలిత ప్రజా సంబంధాలను రాముని నోట (అయోధ్యాకాండ – నూరవసర్గ) వ్యక్తం చేసినాడు.

వినయ సంపన్నుడు, శాస్త్రజ్ఞానం ఉన్నవాడు, అసూయలేనివాడు, కర్తవ్యాన్ని బోధించే పురోహితుని రాజు నియమించుకోవాలి. యజ్ఞయాగాదుల నిర్వహణలో శాస్త్రవిధి తెలిసిన వారిని చేర్చుకోవాలి. పెద్దలను అనువర్తించుట కాక కొందరు జ్ఞానంవల్ల వృద్ధులు, కొందరు శీలం వల్ల, కొందరు వయస్సువల్ల వృద్ధులుంటారు. వారి నందరిని సంతృప్తి పరచాలి. ఉపాధ్యాయుల గురించి చెపుతూ రాజనీతిశాస్త్రంలోనే కాక ధనుర్వేదశాస్త్రంలో నిపుణులైన వారిని, ముఖ్యంగా అస్త్రశస్త్రాలను ప్రయోగం తెలిసినవారిని ఆదరంగా దరికి చేరదీయాలి. రాజ్యపాలనలో వారి అవసరం ఎంతో ఉంటుందని రాముడు చెప్పాడు.

మంత్రుల విషయంలో, రాజు తనతో సమానమైన శూరులు, విద్యావంతులు, జితేంద్రియులు, మనస్సులోని భావాలను తెలుసుకొని పరాక్రమంలో రాజ్యకార్య విచారణలో, నిర్వహణలో తనవలెనే ఆలోచించగలవారు, నెరవేర్చ గలిగినవారిని నియమించుకోవాలి. ధనానికిగాని, వ్యసనాలకు గాని లోబడనివారు, రాజకార్య పర్యాలోచనం చేసినపుడు ఆ ఆలోచనలను రహస్యంగా కాపాడే వారై ఉండాలి. రహస్యంగా ఉంచిన వాటి వల్లనే రాజుకు విజయం చేకూరుతుందన్న విషయం అటుంచి రాజులు నిద్రకు వశం కాకూడదనేది ప్రధానమైంది.

తగినకాలంలో మేల్కొని ప్రజలకు ప్రభుత్వానికి మేలు చేకూర్చే ఆయా కార్యాల సాఫల్యం గురించి ఆలోచించాలి. ఆ ఆలోచనలు ఒకడే చేయరాదు. అట్లా అని చాలామందితో ఆలోచించకూడదు. అందరి అభిప్రాయాలు కలువక ఐకమత్యం లోపించి కార్యం చెడుతుంది.

మంత్రులతో తాను చేసిన నిర్ణయాలు అమలు చేయకముందే దేశంలో ఎవరికీ తెలియరాదు. స్వల్పమైన ప్రయత్నంతో ఎక్కువ ఫలాన్ని సాధింపగలిగిన కార్యాన్ని నిర్ణయించుకొని, అందులో ఏమాత్రం ఆలస్యం చేయకుండా అమలు చేయాలి. ఒక్కొక్కసారి ఆలస్యం వల్ల ఫలితం లభించకపోవచ్చు. రాజు చేయబోయేవి రాజుకు మంత్రులకు తప్ప ఆ కార్యాలు ఊహవల్ల, యుక్తివల్లగాని, ఇతర సాధనాలతోగాని ఇతరులు తెలుసుకునే విధంగా ఉండకూడదు.

రాజకీయ నిర్ణయాలు చేసేటప్పుడు ఎక్కువమంది ఉంటే మంచిదని మూర్ఖులను వందమందిని చేర్చుకోరాదు. వందమంది మూర్ఖులకంటే ఆలోచన కలిగినవాడు, స్థిరమైన బుద్ధి కలిగినవాడు, సమర్థుడు, నీతిశాస్త్రాన్ని అధ్యయనం చేసినవాడు ఒక్కడున్నా క్లిష్ట సమయాల్లో సహాయభూతుడవుతాడు.

సేవకులు ఉత్తములు, మధ్యములు, అధములు అని మూడు రకాలుగా ఉంటారు. వారి స్వభావం, సామర్థ్యాన్ని బట్టి పనులు అప్పగించాలి. సేవకులలోనే కాదు మంత్రులలో కూడ ఇటువంటి వారు ఉంటారు. వారిని పరీక్షించి నియమించుకోవాలి. మంత్రులను పరీక్షించే విధానాన్ని ఉపధ అంటారు. లంచాలకుగాని, స్త్రీ ప్రలోభానికి కాని లొంగనివారు, ఉత్తమచరిత్ర కలవారు, తాతతండ్రుల కాలం నుండి నమ్మకంగా ఉన్నవారిని మంత్రులుగా స్వీకరించాలి. అధికారమున్నది కదా అని చిన్న చిన్న తప్పులకే ప్రజలను శిక్షించినట్లయితే రాను రాను ప్రజలకు రాజుపట్ల విముఖత్వం ఏర్పడుతుందనే విషయాన్ని కట్టా వరదరాజు తన ద్విపద రామాయణంలో సహజ ప్రతిభా విశేషంతో ప్రశ్నార్థక క్రియలతో వర్ణించినాడు.

తగని దండనముచే - తప్పులేకయును
తెగినొంప కుందువే - తెకతేర జనుల
నన్యాయపరుడైన - యవని పాలకుని
సైన్యముల్ ఋత్విజుల్ - సవనంబునందు
పతితుండా యజమాను - బాసిన కరణి
యతివేల కామాంధు - డైఁ బల్మిఁ బట్టు
హితమెఱుగని మూర్ఖు - నెడ వాయునట్లు
ప్రతికూలులగుదురు - భావంబులోన - 9070

సదాచార సంపన్నులైన ఋత్విక్కులు దుర్దానాలు ప్రతిగ్రహించే పతితుని అవమానించినట్లు, స్త్రీలు కాముని అవమానించినట్లు తప్పులేక తీక్షణమైన దండనను విధించే రాజును అవమానిస్తారని రాజైనవాడు ఇటువంటి వాటికి తావివ్వకూడదని రాముడు భరతునితో చెపుతాడు. అయోధ్యాకాండలో ఉన్న ఈ వృత్తాంతాన్ని కట్టా వరదరాజు 250 పంక్తుల్లో యథా వాల్మీకంగా రచించాడు.

సామదాన భేద దండోపాయాలు తెలిసినవాడు అధికారవాంఛతో, ఏదో ఉపాయంతో రాజు ఆంతరంగిక సేవకులలో భేదం కలిగించి, వారిని రాజుకు ఎదురు తిరిగేటట్లు చేయ ప్రయత్నించిన వాడిని వెంటనే చంపివేయాలని, లేకపోతే రాజే నశిస్తాడని రాముడు భరతునితో క్రింది విధంగా కూటనీతిని తెలిపినాడు.

**ఉపాయకుశలం వైద్యం భృత్య సందూషణే రతమ్ ।**
**శూరమైశ్వర్యకామం చ యో న హన్తి స హన్యతే ॥** 28

సేనాపతి రాజుచేసే సత్కారాలకు సంతోషించేవాడై ఉండాలి. అతడు అసంతుష్టుడైతే రాజుకు ఉపద్రవం కలిగిస్తాడు. నిజాయితీపరుడు, సేవా నిర్వహణలో సమర్థుడైన వాడినే రాజు సేనాపతిగా నియమించుకోవాలి. ధనానికి, స్త్రీ ప్రలోభానికి లోనుకానివాడై ఉండాలి. యుద్ధంలో తమ నేర్పు చూపించిన వారిని, తమ శౌర్యం ప్రకటించిన వీరులను రాజు సత్కరించి గౌరవించాలి. సైన్యానికి తగిన విధంగా ఆహారాన్ని, వేతనాన్ని కాలాతిక్రమణం కాకుండా ఇవ్వాలి. ఆలస్యం చేస్తే రాజునే వ్యతిరేకిస్తారు.

ప్రజలనే కాక ప్రధానంగా జ్ఞాతులలో ముఖ్యమైన వారిని తన విషయంలో అనురాగవంతులై ఉండేటట్లు చూసుకోవాలి. వారు తనకోసం ప్రాణాలనైనా త్యజించే విధంగా వారితో ప్రేమగా ఉంటూ తనతో చేర్చుకోవాలి.

దూత లేదా రాయబారి ఏ విధంగా ఉండాలో రాముడు వివరిస్తాడు. దూత స్వదేశంలో పుట్టినవాడై ఉండాలి. విదేశీయుడైతే పక్షపాతాన్ని వహిస్తాడు. సమర్థుడు, సమయస్ఫూర్తి కలిగినవాడు, రాజు అభిప్రాయాన్ని, సందేశాన్ని పాలిస్తూ, దాన్నే సమర్థిస్తూ కార్యాన్ని నిర్వహించేవాడై ఉండాలి.




# తిరుప్పల్లాండు

వైశారదీ

మన భారతదేశం వైదిక వాఙ్మయం వలన ప్రపంచానికి ఆదర్శం కాగలిగింది. మనలో జ్ఞానవికాసానికో, మానసిక వికాసానికో, ఆధ్యాత్మిక వికాసానికో 'వాఙ్మయం' ఎంతో తోడ్పడుతుంది. ఇది రెండు రకాలు. 1. అపౌరుషేయం, 2. పౌరుషేయం. అపౌరుషేయములు వేదములు. అంటే, ఎవరూ నిర్మించనివీ, మౌఖికపరంపరలో అందుతున్న వాఙ్మయము. అంటే, గురువు ఒకసారి ఉచ్చరిస్తే శ్రద్ధతో విని, గ్రంథాపేక్ష లేకుండా తిరిగి, ఉచ్చారణ, స్వరము ఏమాత్రము చెడకుండా రెండుసార్లో లేదా మూడుసార్లో పలకడం ద్వారా నేర్చుకునేవారు. గురూచ్చారణానుచ్చారణ రూపంగా ఆనుపూర్వి చెడకుండా అందుతున్న వాఙ్మయము. ఇది ఎలాంటి దోషములు లేని వాఙ్మయము. మిగిలినవన్నీ పౌరుషేయములైన వాఙ్మయమునకు చెందినవే.

పౌరుషేయములలో భ్రమ, ప్రమాద, విప్రలంభ, అశక్తి వంటి దోషములు అన్నీ కానీ, వీటిల్లో ఏ కొన్నైనా ఉండవచ్చు. కనుక, వాటిని ప్రాకృత గ్రంథాలు అంటాము. కానీ, పౌరుషేయములైనా - వేదములతో దీటుగా గౌరవాన్ని అందుకున్నవి దివ్యప్రబంధములు. దీనికి కారణము, 1. వీనిని దివ్యసూరులు పాడటం, 2. వేదప్రతిపాద్యుడైన భగవత్తత్త్వమే ఇందులో ప్రతిపాదింపబడటము.

భగవతత్త్వానుభవ పరీవాహమే తప్ప ప్రాకృత ప్రస్తావన ఈ దివ్యప్రబంధాలలో ఉండదు. ఒకవేళ ఉన్నా భగవత్తత్త్వాన్ని మనలో స్థిరపరచేదిగా ఉంటుందే తప్ప ప్రధాన ప్రతిపాద్యంగా ఉండదు. ఉదాహరణకి రామాయణంలో బాలకాండలో ఉన్న గంగోత్పత్తి వంటి కథలు రామునితో గాని, మూలరామాయణానికి గాని సాక్షాత్తుగ సంబంధం లేనివి. దివ్యప్రబంధాలలో అలాంటివి ఉండవు. కొన్ని సందర్భాలలో ఈ దివ్య ప్రబంధాలలో కూడ ఐహిక సంపద, రాచరికవైభవం మొదలైన ప్రస్తావనలు కనిపించినా అవి అందులో ఉండే దోషాలను చూపిస్తూ, వాటిలోని అల్పత్వాన్నీ, వాటివల్ల కలిగే అనర్థమునూ గుర్తింప చేసన్తూ భగవత్తత్త్వం మీద విశ్వాసవర్థకాలుగా సాగుతాయి.

అందుకనే ఆళ్వారులు పాడిన దివ్యసూక్తులను 'దివ్య ప్రబంధములు' అన్నారు. వీటిని వేదములతో సమానంగా వైదికులంతా ఆదరిస్తారు. సమానంగా ఆదరించడమే గాక మన సంప్రదాయ ప్రవర్తకులైన భగవద్రామానుజులు వీటికి ప్రాథమ్యాన్ని ఆర్జించిపెట్టారు. అందుకనే వీటిని 'ద్రావిడవేదము' అని కూడా అంటారు.

వేదాధ్యయనాన్ని వేదమూలమైన 'ఓంకారం'తో ఆరంభిస్తారు. అలానే ముగించేటపుడు కూడా తిరిగి ఓంకారాన్నే అనుసంధానం చేస్తారు. ఓంకారమనే ఒక పేటికలో నిక్షిప్తమైన ఒక దివ్యాభరణం వంటిది వేదము. అందువలనే ఆద్యంతాలలో 'ఓం' ఉచ్చారణను వైదికులు చేస్తారు. అట్లానే, ద్రావిడవేదమై, ఆచార్యవర్గములోని అందరి ఆదరాభిమానాలు పొంది, ఆరాధనాదులలో భాగమైన దివ్యప్రబంధాలకి కూడా ఇలాంటి ఒక నియమమేర్పడింది. దివ్యప్రబంధాలకి పెరియాళ్వార్లు అనుగ్రహించిన 'తిరుప్పల్లాండు' అనే ఒక ప్రబంధము ఓంకార స్థానంలో ఉన్నది .

మొత్తం పన్నెండు మంది ఆళ్వార్లు అందించినవి నాలుగు వేల పాశురములు. అందుకని ఆళ్వార్ల శ్రీసూక్తులన్నింటినీ 'నాలాయిర దివ్య ప్రబంధము' అని అంటారు.

దివ్యప్రబంధాలకి ప్రధానలక్ష్యం భగవన్మంగళా శాసనము. కనుక, శ్రీవిష్ణుచిత్తులనే పెరియాళ్వార్లు మంగళాశాసనాన్ని చేస్తూ ప్రసాదించిన 'తిరుపల్లాండు' అనే దివ్యప్రబంధము ఓంకార స్థానాన్ని ఆక్రమించింది. ఆ కారణంగానే ప్రబంధానుసంధానం చేసే పెద్దలందరూ ద్రావిడవేదాన్ని 'తిరుపల్లాండు' తో ప్రారంభం చేసి 'తిరుపల్లాండు' తోనే ముగిస్తారు.

ఆళ్వార్ల హృదయాలలో భక్తిభావనలు తరంగాలై రాగమాలికలై వాగమృత ప్రవాహాలై వెలువడ్డాయి. నీటిఊట, తానుండే నేల స్వభావాన్ని కూడా తనలో చేర్చుకుని పొంగి

పారినట్లు, భావస్ఫురణము అనేది వ్యక్తి యొక్క - ప్రాంతం, స్వభావం, భాషలకి అనుగుణంగా వెలువడుతూ ఉంటుంది. ఒక వ్యక్తి ఏ భాష మాట్లాడే వాడైతే, ఏ ప్రాంతం వాడైతే, ఏ పరిసరాల్లో ఉంటే, వాటి కనుగుణంగానే భావనలు వెలువడుతుంటాయి. మనం నీరు ఎక్కడ నుండి వచ్చినదైనా వడగట్టి వాడుకున్నట్లు, వ్యక్తులలో వచ్చే భావనలని భాషాభేదం చూడక అందులోంచి అవసరమైన దానిని గ్రహించాలనేది గుర్తించాలి. అలానే గ్రహిస్తాం. ఆళ్వార్లు ద్రవిడదేశంలో అవతరించారు. కనుక, వారు పాడిన పాటలు ద్రావిడంలోనే ఉన్నాయి. మనం తత్త్వజిజ్ఞాస కలిగి తత్సారాన్ని, భావాన్ని, అందులో తత్త్వజ్ఞానాన్ని ఆత్మోజ్జీవనం కోసం గ్రహించాలి. అర్థంచేసుకోవాలి.

భావస్ఫురణము భాషగా వెలువడేటప్పుడు దేహంలో, మనస్సులో కలిగే స్పందనలు ఎవరికైనా ఒకే క్రమంలో ఉంటాయి. అందుకే అద్భుత దివ్యభావనలు ఏ భాషలో మొదట వెలువడ్డాయో వాటిని ఆ భాషలో అనుసంధానం చేసినప్పుడే, వారికి కలిగిన స్పందనలవంటి స్పందనలని మనకి కూడ కలిగించడానికి అవకాశం ఉంటుంది. అందుకే భాషా భేదాన్ని పక్కనపెట్టి, పెద్దలయొక్క అనుభవస్ఫోరకములైన ప్రబంధాలను ఆయా భాషలలోనే మనం అనుసంధించాలి అనేది నియమం. మనకర్థం కావడం కోసం మన మన భాషల్లోకి వాటిని అనువదించుకొని అర్థాలను తెలుచుకున్నా పారాయణాదులకి మాత్రం మూలప్రబంధాలనే స్వీకరించాలి. ఇప్పుడు, ఆళ్వార్లయొక్క అనుభవాలు ద్రావిడభాషామయములు కనుక, ఆ ద్రావిడ ప్రబంధాలని మనం యథాతథంగా అనుసంధానం చేస్తూ వాటి అర్థానుభవం కోసం ప్రతిపదార్థ తాత్పర్యములతో నేర్చుకుందాం!

మొదటగా భగవంతుని మంగళాశాసనరూపమై, ఓంకారస్థానీయమైన తిరుపల్లాండును అధ్యయనం చేద్దాం! ఏదైనా ఒక గ్రంథాన్ని అధ్యయనం చేసే ముందు ఆ గ్రంథాన్ని మనకందించిన వక్తను కీర్తిస్తూ ప్రారంభించుకున్నట్లైతే మనకు సులభంగా అర్థమౌతుంది. అందుకనే తిరుపల్లాండును భగవన్మంగళాశాసన రూపంగా మనకందించిన విష్ణుచిత్తులనే పెరుయాళ్వార్లను ప్రార్థిద్దాం! శ్రీమన్నాథమునులు విష్ణుచిత్తులవారి గురించి చేసిన ప్రార్థనా శ్లోకము మనకి వారి వైభవాన్ని సంక్షిప్తంగ అందిస్తుంది. దానిని తెలుసుకుందాం!

**గురుముఖ మనధీత్య ప్రాహ వేదా నశేషాన్**
**నరపతి పరిక్లృప్తం శుల్క మాదాతు కామః।**
**శ్వశుర మమర వంద్యం రంగనాథస్య సాక్షాత్**
**ద్విజకుల తిలకం తం విష్ణుచిత్తం నమామి ॥**

| | |
|---|---|
| నరపతి | = పాండ్యదేశపు రాజైన వల్లభదేవుని చేత |
| పరిక్లృప్తం | = ఏర్పరచబడిన |
| శుల్కం | = విద్యాధనాన్ని |
| ఆదాతు కామః | = స్వీకరించకోరినవారై |
| యః | = ఏ విష్ణుచిత్తులు |
| అశేషాన్ వేదాన్ | = అన్ని వేదముల సారమును |
| గురుముఖం అనధీత్య | = గురువుద్వారా నేర్వకనే |
| ప్రాహ | = చెప్పెనో, |
| ద్విజకులతిలకం | = బ్రాహ్మణశ్రేష్ఠుడైన |
| సాక్షాత్ | = స్వయముగా |
| రంగనాథస్య | = శ్రీరంగనాథునికి |
| శ్వశురం | = మామగారైన |
| అమరవంద్యం | = దేవతలకు గూడ పూజనీయులును అయిన |
| తం | = జగత్ప్రసిద్ధులైన |
| విష్ణుచిత్తం | = శ్రీ విష్ణుచిత్తుని (విష్ణువును తమ చిత్తమునందు కలిగిన వారు) |
| నమామి | = నమస్కరించుచున్నాను. |

**తా:** ఒకనాడు పాండ్యదేశరాజు పరతత్త్వనిర్ణయము చేయుటకై సభను ప్రకటించెను. ఆ సభలో ఏ పండితుడు సరియైన తత్త్వనిర్ణయం చేయునో అతనికి సమ్మానముగా కొంత ధనపురాశిని మూటకట్టి వ్రేలాడ తీసెను.

"యథార్థ తత్త్వమును ప్రతిపాదించిన పండితుని పాదముల వద్ద ఆ ధనపురాశి పడును" అని నిర్ణయించెను. దానికి 'విద్యా శుల్కము' అనిపేరు. ఆ సభలో ఎందరో పండితులు ఆరు నెలలుగ చర్చించుకొనినాము. ఏ నిర్ణయమూ చేయలేక పోయిరి. బ్రాహ్మణోత్తములైన విష్ణుచిత్తులు ఏ గురువువద్ద వేదవిద్యను అభ్యసించకపోయినప్పటికీ శ్రీమన్నారాయణుని ప్రేరణతో సకల వేదసారమైన పరమాత్మ

తత్త్వమును అందరికీ ఆమోదయోగ్యముగా నిరూపించి సమ్మానమును పొందిరి.

1 భగవంతుని అనుగ్రహంతోనే పండితుల సమక్షంలో పరతత్త్వ నిర్ణయము గావించినారు.

2. సాక్షాత్తు రంగనాథునికే తన కుమార్తెయగు గోదాదేవిని సమర్పించి మామగారైనారు.

3. తద్వార దేవతలందరికీ పూజనీయులైరి. వైదికశ్రేష్ఠులైన అట్టి విష్ణుచిత్తులను నమస్కరించు చున్నాను.

*పాండ్య భట్టర్ ప్రార్థన*

**మిన్నార్ తడమదిళ్ శూళ్ విల్లిపుత్తూర్ ఎన్ఱొరుకాల్**
**శొన్నార్ కళ్ఱక్కమలం శూడినోం, మున్నాళ్**
**కిళ్ఱి యఱుత్తా నెన్ఱురైత్తోమ్, కీళ్మైయినిల్ శేరుమ్**
**వళ్ఱి యఱుత్తోమ్ నెఞ్జమే వన్దు.**

వన్దు = ఇంతవరకు వచ్చాక (ప్రస్తుతము)
మిన్ = మెరుపులతో
ఆర్ = ప్రకాశించు
తడ = విష్ణుచిత్తులు నిర్మించిన, విశాలమైన
మదిల్ = ప్రాకారములతో
శూళ్ = చుట్టుకొని ఉన్నది
విల్లిపుత్తూర్ = శ్రీ విల్లిపుత్తూరు
ఎన్ఱు = అని
ఒరుకాల్ = ఒకసారి
శొన్నార్ = పలికినవారియొక్క
కళ్ఱల్ = శ్రీపాదములనెడి
కమలం = కమలములను
శూడినోం = శిరసా ధరించితిమి
మున్నాళ్ = పూర్వము
కిళ్ఱియఱుత్తాన్ = విద్యాశుల్కపు మూటను తన జ్ఞాన మహిమతో తెంపినవాడు
ఎన్ఱు = అని
ఉరైత్తోం = నోరారా పలికితిమి
నెంజమే! = ఓ మనసా!
కీళ్మైయినిల్ = అధోగతిని, నరకాది లోకములను
శేరుం = చేరెడి
వళ్ఱి = మార్గమును
అఱుత్తోం = ఛేదించితిమి.

***తా:*** ప్రకాశించు ఉన్నతమైన ప్రాకారాలతో కూడియున్న 'శ్రీవిల్లిపుత్తూరు' అని ఒకసారి భక్తితో పెరియాళ్వారును, ఆండాళమ్మవారును ఆవిర్భవించిన ఆ దివ్యక్షేత్రమును కీర్తించు భాగవతోత్తముల శ్రీపాదకమలములను శిరసా వహింతుము. 'పూర్వము పరతత్త్వమును స్థాపించి పాండ్యరాజు సమ్మానమును పెరియాళ్వారులు స్వీకరించి'రని ప్రశంసింతుము.

ఓ మనసా! మనము ఇకముందు అధోగతి రూపమగు నరకాది మార్గములకు పోవు దుర్గతిని ఈ పెరియాళ్వారుల వైభవ సంకీర్తనము వలన తప్పించుకొనగలిగితిమి.

*(సశేషం)*

# మన దర్శనం 'సు' దర్శనం

పూర్వమీమాంస
వైశేషిక
న్యాయ
యోగం
సాంఖ్య

వైశారదీ

మనిషి బుద్ధిజీవి. ప్రాణులన్నింటిలోకి మనిషికి మాత్రమే కారణతత్త్వాన్ని అన్వేషించగలిగే అర్హత, యోగ్యత ఉన్నాయి. ఎందరో దాన్ని వినియోగించుకోకపోవచ్చును. కానీ, వినియోగించుకునే వారికి బుద్ధి వికాసంతోపాటు, జన్మ సార్థకమూ అవుతుంది. వారివలన మిగతా సమాజానికి ఎంతో ఉపకారం జరుగుతుంది. కనుక, తత్త్వాన్వేషణ కోసం బుద్ధిని, సమయాన్ని వినియోగించగలగడం అనేది మనిషి చేయవలసిన ప్రధానమైనకృషి అని తెలుస్తోంది.

సృష్టిలోని ప్రతి వస్తువూ అచేతనమైన ప్రకృతి, చైతన్యం కలిగిన జీవుడు, పరమాత్మ అనే మూడు తత్త్వాల కలయిక. వాటి స్వరూప, స్వభావాలను యథాతథంగా గుర్తించగలగడాన్నే 'తత్త్వజ్ఞానం' అంటారు. 'తత్త్వం బ్రహ్మణి యాథార్థ్యే' అని నిఘంటువు. ఆ తత్త్వాలను తెలుసుకునే ప్రయత్నాన్నే 'తత్త్వాన్వేషణ' అంటాం, లేదా 'తత్త్వజిజ్ఞాస' అంటాం!

ఈ ప్రపంచంలో కొన్ని వస్తువుల ఆకారాలు త్వరత్వరగా మారుతుంటాయి. కొన్ని వస్తువుల ఆకారాలు సుదీర్ఘకాల ముంటాయి. స్వభావాలు కూడా అంతే. 'స్వభావా'లంటే వస్తువుని అంటిపెట్టుకొని ఉండే ధర్మాలన్నమాట. కొన్ని వస్తువుల ధర్మాలు వెంట వెంటనే పరిణామం చెందుతూంటాయి. కొన్ని వస్తువుల ధర్మాలు మెల్లమెల్లగా పరిణతి చెందుతాయి. ఇలా స్వరూపంలోనూ, స్వభావంలోనూ శీఘ్రపరిణతిని చెందేవి కొన్ని, ఆలస్యంగా పరిణతి చెందేవి కొన్ని, మన చుట్టూ ప్రపంచంలో ఉంటాయి.

వీటిని చూసినపుడు మనిషిలో సహజంగానే కొన్ని సంశయాలు కలుగుతాయి. అన్నీ పరిణామం చెందేవేనా? పరిణామం చెందనవి కూడా కొన్నేమైనా ఉన్నాయా? స్వరూపంలో పరిణామం చెందనివి ఏవి? స్వభావంలో పరిణామం చెందనివి ఏమైనా ఉన్నాయా? అనే జిజ్ఞాస కొందరికి కలుగుతుంది. అపుడు మనిషి 'తత్త్వాన్వేషణ' ని ఆరంభిస్తాడు.

తత్త్వాన్వేషణని చేయడమే జీవితంగా కలిగిన మహనీయులు కొందరు. ఉబుసుపోకకై తత్త్వాన్ని గురించి తెలుసుకోవాలనుకునేవారు కొందరు. అకుంఠిత దీక్షతో 'తత్త్వాన్వేషణ' చేసేవారికి సరియైన దిశానిర్దేశం లభిస్తే కలిగే వికాసాన్నే 'తత్త్వదర్శనం' అంటారు. సృష్టి ఆరంభంనుంచే ఇలాంటి తత్త్వాన్వేషణ చేసినవారున్నారు. వారిని 'ఋషులు' అన్నారు. వారు లోకానికి అందించిన అనుభవాలే వారి వారి పేర ఆయా 'దర్శనాలుగా' ప్రసిద్ధమయ్యాయి.

ఋషి అంటే 'క్రాంతదర్శి'. అనగా, గడచిన దానిని, జరగబోయేదానిని గుర్తించి వర్తమానానికి సమన్వయము చేయగలిగినవాడు అని అర్థము. అందరూ చూసే వెలుపలి ప్రపంచమును మాత్రమే కాక సాధారణులు చూడలేని ఆంతరప్రపంచమును, అందులోని వస్తువులను కూడా చూడగలిగిన మహానుభావులు ఋషులు. వీరిలో కొందరు, మంత్రములను వాటి అర్థభావనతో ఉపాసించి, మంత్ర ప్రతిపాద్య తత్త్వమును దర్శించిన మహనీయులు. అలాంటి వారు కొందరు ఆత్మ, పరమాత్మ తత్త్వాలను కూడా దర్శించి అందించారు. మరి కొందరు కేవలము ప్రకృతి తత్త్వాన్ని మాత్రమే గుర్తించి అందించగలిగారు.

తత్త్వదర్శనము కావాలంటే ముందుగా దాన్ని గురించి వినాలి. విన్న దానిని మననము చేయాలి. 'ఈ కారణం చేత ఇది, ఇలా, 'అవును ఇది సత్యము' అని మరల మరల తలవడం ద్వారా విన్న విషయాన్ని యుక్తులతో మనస్సులో స్థిరపరచుకోవడాన్ని 'మననము' అంటారు. తత్త్వం గురించి విన్నదాన్ని మననం చేసి హృదయంలో స్థిర పరచుకున్నాక దాన్ని గూర్చిన ధ్యాన దశ కలుగుతుంది. ఈ క్రమాన్నే ఉపనిషత్ **'శ్రోతవ్యః మంతవ్యః నిదిధ్యాసితవ్యః'** అని తెలిపింది. అప్పుడు ధ్యానము పండి దర్శన సమానాకార సాక్షాత్కార అనుభూతి కలుగుతుంది.

తత్త్వాన్ని గురించిన జిజ్ఞాసతో పెద్దలను ఆశ్రయించి వినడం, మననం చేయడం ప్రాచీన కాలములోని భారతీయు లందరిలోనూ ఎంతో కొంత ఉండేవి. దర్శనపర్యంతము సాధన చేసినవారు మాత్రము ఋషులయ్యారు. ఋషులు వేదములలో చెప్పిన విధానములను ఒక్కొక్కరు ఒక్కొక్క రకముగా అనుష్ఠించి దర్శించే ప్రయత్నం చేసారు. తత్త్వదర్శనానికి ఇంద్రియ నిగ్రహం, శుద్ధమైన మనస్సూ కావాలి. చుట్టూ ఉండే బాహ్యమైన అనేక ప్రతిబంధకాలవలన శుద్ధమైన మనస్సు కూడా ఒక్కొక్క సారి

మరల రాగద్వేషాదులకి లోనైపోతూ ఉంటుంది. ఎందుకంటే, ఆత్మ, పరమాత్మ తత్త్వములు బాహ్యేంద్రియములద్వారా తెలిసేవి కావు. కఠోపనిషత్ ఈ విషయాన్ని స్పష్టంగా చెప్తుంది. "పరాంచి ఖాని వ్యతృణత్ స్వయం భూః" బ్రహ్మ దేవుడు మనకి వెలుపలి వస్తువులను చూచేవిగ ఇంద్రియాలను ఇచ్చాడు కానీ, ఆంతరమైన ఆత్మ పరమాత్మలను నేరుగ చూడగలిగేట్టు చేయలేదు.

ఇక అంతరింద్రియమైన మనస్సుతో తెలుసుకుందామంటే ఈ మనస్సుకూడా బాహ్యంగా కన్పించే వస్తువుల పట్ల ఆకర్షితమై ఇంద్రియాల ఒత్తిడికిలోనై ఆంతర పదార్థాలవైపు పోనే పోదు. ఋషులంతా ఆంతరతత్త్వాల్ని దర్శించాలనే తపన కలిగినవారు కావడం చేతనే బాహ్య అనుభవాలకి దూరంగా ఉండాలనుకున్నారు. ఈ ప్రతిబంధకాలు తొలగించుకోవాలనే పూర్వకాలపు ఋషులంతా నగరాలకి దూరంగా అరణ్యాలలో ఆశ్రమ వాసులై నిరంతర మననశీలురై ఉండేవారు.

బాహ్యేంద్రియ నిగ్రహము, అంతరింద్రియ నిగ్రహము కోసం వారనుసరించే సాధనాపద్ధతులు వేదానుగుణములే అయినా వేరు వేరుగా ఉండేవి. శరీరమును కృశింపచేస్తే ఇంద్రియములు కూడా దుర్బలములై విషయములవెంట పరుగెత్తవని, నిరంతర ఉపవాసములు చేసేవారు కొందరు. ఆహారము సాత్త్వికమైతే మనస్సుకూడా సాత్త్వికమై సాధనకు సహకరిస్తుందని, పూర్తి ఉపవాసము కాక రాజస తామసాహారములుమాని, కేవల సాత్త్వికాహారమును మాత్రమే తీసుకునే వారు కొందరు. ఇలా, అనుసరించేది వైదికమార్గమే, తత్త్వదర్శనమొక్కటే లక్ష్యమైనా పాటించే పద్ధతులు, అనుసరించే మార్గములు వేరు వేరుగ ఉండేవి. అందుకే ఆనాటి ఋషులు చెప్పిన సాధనాపూర్వక అభిప్రాయాలలో భేదాలు కన్పిస్తుంటాయి.

ఋషులు సాధించి పొందిన తత్త్వదర్శనానికి ఆధారాలుగ వేదాలలో తత్త్వనిరూపణం చేసే ఉత్తరభాగమైన ఉపనిషత్తులు ముఫైరెండు 'బ్రహ్మవిద్యలను' ఉపదేశించాయి. ఈ ఉపనిషత్‌లు పరవిద్యలు అంటూ బ్రహ్మ ఉపాసనా విధానాలని వేరు వేరుగా వివరించాయి. వీటిలో ఏ ఒక్క పద్ధతిని అవలంబించినా పరమాత్మతత్త్వదర్శనము పొందవచ్చును. ఒక్కో ఉపాసనలో ఉపాస్యమైన పరతత్త్వం యొక్క స్వరూపనిర్ణయానికే చాలా కాలం పట్టేది.

పరవిద్యలలో ఒకటైన వైశ్వానర విద్యను ఉపాసించే మహర్షులు అందరూ ఒకచోట చేరినప్పుడు జరిగిన చర్చలలో ఒక ఆశ్చర్యకరమైన విషయం బయటపడుతుంది. అక్కడ చేరినవారందరూ చేసేది ఒకే వైశ్వానర ఉపాసనమే అయినా ఆ వైశ్వానరుని స్వరూపము ఎలా ఉంటుంది అన్న అవగాహనలో వైవిధ్యము ఏర్పడింది. అందరూ అదే ఉపనిషత్ మంత్రాలని బట్టి ఉపాసన చేసినా, వారికి వారికి ఉండే బుద్ధి వైలక్షణ్యాన్ని బట్టి అవగాహనలో తేడా ఏర్పడింది.

ఒకరు ఈ భూలోకమంతా వైశ్వానరుని విరాడ్రూపంగా భావిస్తే, మరొకరు ఈ సముద్రమంతా ఆయన రూపంగా భావించారు. వేరొకరు ఈ ఆకాశమంతా ఆ వైశ్వానరునిగా భావించారు. ఇలా ఐదుగురు ఋషులు తమ భావనలని వెలిబుచ్చగా, అక్కడ ఉన్న 6వ ఉపాసకుడు అవన్నీ వైశ్వానరునిలోని వేరువేరు భాగములనీ, భూమి ఆయన పాదస్థానీయమైతే, సముద్రము ఆయన వస్తి (పొత్తికడుపు) ప్రదేశమని, ద్యులోకము(మనకి కనబడే నక్షత్రమండలాలకి ఆవల ఉండే ఖగోళము) ఆయన శిరః స్థానమని ఇలా అందరి భావనలు కలిపితే వైశ్వానరుని సమగ్ర విరాడ్రూపం ఏర్పడుతుందని సమన్వయం చేసారు. అలా సమగ్ర స్వరూప అవగాహన కలిగిన మహానుభావులు ఋషులు చాలా కొద్ది మంది ఉంటుండేవారు. అలాంటివారిని ఆశ్రయించి మిగిలిన వారు సత్యమును గుర్తించి తత్త్వదర్శనం చేస్తూండేవారు.

ఉద్దాలక, సత్యకామ, యాజ్ఞవల్క్య , ఆంగిరసుడు, పిప్పలాద, ఆరుణి మొదలైన మహర్షులు ఎందరో ఉపనిషత్ప్రసిద్ధులైన ఋషులు. వారు మంత్ర ద్రష్టలు. అంతేకాక, ఆ మంత్రార్థజ్ఞానం కలిగి ఉపాసనలో వారు దర్శించిన తత్త్వాన్ని మనకి అందించడం కోసం చేసిన ప్రవచనాలే 'దర్శన వాఙ్మయం'గా ప్రసిద్ధమయ్యాయి. కపిల, కణాద, గౌతమ, ఆత్రేయ, ఆశ్మరథ్య, బాదరాయణ, జైమిని, బాదరి ప్రభృతులగు ఋషులు అనేకులు తామనుసరించిన ప్రక్రియను, లోకానికి చాటి చెప్పడానికి ప్రయత్నించిన మహనీయులు.

విషయలాలస లేని గాఢ వైరాగ్య సంపత్తి కల మహర్షులకే దుర్లభమైన తత్త్వదర్శనం, అల్పప్రజ్ఞావంతులమైన మనలాంటి సామాన్యులకి కూడా అందాలని తపన చెందారు మన మహర్షులు. వారు దర్శించిన విధానాన్ని మనమూ విని, మననం చేసి ధ్యానిస్తే మనకూ మానసిక విశుద్ధి ఏర్పడి తత్త్వదర్శనం కలుగ వచ్చు. ప్రయత్నిద్దామా మరి! *(సశేషం)*

# మన ఆళ్వార్లు



వైశారదీ

మనం ఆలయానికి వెళ్ళినప్పుడు మనం భగవంతుడు అమ్మవార్లతో పాటు ప్రక్కన మరొక సన్నిధిలో ఇంకొందరు కూడా మనకి దర్శనమిస్తూంటారు. వాళ్ళని ఆళ్వార్లు, ఆచార్యులు అంటారు. శ్రీవైష్ణవ సంప్రదాయంలో ఆళ్వార్లని దర్శించుకుని, వారి పురుషకారంతో అమ్మవారిని, ఆమె అనుగ్రహంతో అయ్యవారిని దర్శించడమనేది ప్రసిద్ధమైన క్రమము.

ఆళ్వార్లు ఉన్న స్థలాలని 'దివ్యదేశాల'ంటారు. వీరులేకపోతే అవి 'ప్రాకృతాలయాలు' అంటారు. ఆలయాలకే దివ్యత్వాన్ని కలిగించి, భగవద్దర్శనానికి మార్గదాయులయ్యే ఇలాంటి మహానుభావుల్ని తలచుకోవడం వారి గురించి తెలుసుకోవడం. వారి భక్తి వైచిత్రిని అర్థం చేసుకోగలగడం, భగవదనుగ్రహాన్ని కోరే మనకందరకూ అవసరము. భగవత్ ప్రేమలో తలమునకలైన ఆ ఆళ్వార్ల గురించి పరిచయం చేసుకొనే ప్రయత్నం చేద్దాము.

భగవంతుని విషయంలో గల ప్రేమనే 'భక్తి' అంటారు. అది కలిగిన వారు భక్తులు. అయితే ఈ 'ప్రేమ' లేదా 'భక్తి' రెండుదశలలో ఉంటుంది. మొదటి దశలో భగవంతుడు సర్వజ్ఞుడు, సర్వశక్తిమంతుడు, సద్గుణసంపన్నుడూ అన్న జ్ఞానం కలిగి ఉండి ప్రేమిస్తాము. సర్వజ్ఞత్వము, సర్వశక్తిత్వము ఉన్నాయి కనుక, మనకి కావలసినవన్నీ అనుగ్రహిస్తాడని, మనకొచ్చే ఆపదలని దూరం చేయగలడనీ విశ్వసించి, అలా సదా మనలని రక్షిస్తూండాలని ప్రేమిస్తాం! ఇది జ్ఞానదశలో ఉండే ప్రేమ. స్వలాభాపేక్షతో ఉండే ప్రేమ కనుక ఇది ప్రాథమిక దశ. అంటే పక్వము కాని 'కాయ' వంటిది.

ఇది కొంచెం పండితే భగవంతుడు మనకేమిస్తాడని కాక, ఆయనకి మనం ఏమివ్వగలం, ఎలా ఆనందాన్ని పంచగలం, అసౌకర్యం కలుగకుండా చూడగలం, దృష్టిదోషం తగలకుండా రక్షపెట్టగలం అని పరిపరివిధాల తపనపడేదశ ఏర్పడుతుంది. ఆ తపన క్రమంగా పక్వతచెందితే స్వార్థం తగ్గి, జ్ఞానము, పండినకాయలాగ, రసభరితం అవుతుంది. నిష్కల్మషమైన ప్రేమదశ అది. పండినకాయ రసము పరిమళము కలిగి ఆరగించేవానికి ప్రీతివర్ధకమైనట్లుగా జ్ఞానము నిస్స్వార్థముగా, పక్వమయ్యే కొద్దీ భక్తి రసముగా పరిణమించి, దానిని అనుభవించే భగవంతునికి కూడా ప్రీతిని పెంచుతుంది.

మొదటి దశలోని భక్తులు భగవంతుడు తమకేమిచ్చాడు, ఎలా అనుగ్రహిస్తున్నాడని చూస్తూ ఉంటారు. ఆ ఇవ్వడంలో ఆలస్యం జరిగినా, అనుకున్నది, ఆశించినది నెరవేరకపోయినా భగవంతుని నిష్ఠురాలాడటానికి కూడా వెనుకాడరు. రెండవదశలో తమకేమైనా ఫరవాలేదని భగవంతునికి మాత్రం ఏమీ లోటు రాకూడదని ఆర్తిపడతారు. వీరికి కూడా పరమాత్మ 'సర్వం తెలిసినవాడు', 'సర్వశక్తిమంతుడూ' అన్న జ్ఞానం ఉంటుంది. కానీ, అతిశయించిన వీరి "ప్రేమ" ఆ సామాన్య "జ్ఞానాన్ని" కూడా కప్పివేస్తుంది.

అందువలన, తాము పూర్ణులమనీ, తాము చేసేదానితో భగవంతునికి పూర్ణత కలగాలని భావిస్తారు. భగవంతుని అశక్తునిగా, అతనిని సంరక్షించే శక్తిమంతులుగా తమని భావిస్తారు. తల్లి బిడ్డపై ప్రేమతో తన ముసలితనాన్ని మరచి, యవ్వనంలోనే ఉన్న తన కుమారుని పెట్టె తానే మోసి అతని శ్రమను తగ్గించాలి అనుకున్నట్లుగా, జ్ఞానం వ్యత్యస్తమై ఈ దశలో ఉన్నవారు భగవంతునికి తామేదో చేయాలని, సమకూర్చాలని, వానికి తామేదో రక్ష పెట్టాలని ఆత్రుత పడతారే తప్ప అతణ్ణించి తామేదో పొందాలని ఆశించరు.

ఈ రెండవ దశలో ఉన్న భక్తుల విషయంలోనే భగవంతుడు అధికప్రీతి కలిగి ఉంటాడు. వారికోసం తానెంతైనా దిగి వస్తాడు. "**వాసుదేవః సర్వమితి స మహాత్మా సుదుర్లభః**"

'అన్నీ నీవే, అంతా నీదే అనే భక్తులు దొరకడం చాలా కష్టం' అని పరమాత్మ తానే భగవద్గీత 7వ అధ్యాయములో అన్నాడు. 'అలాంటి భక్తులనే తనకి "ఆత్మ"గా భావిస్తాన'న్నాడు. అంటే, ఎంతటి ప్రీతిపాత్రులుగా వారిని భావిస్తున్నాడో గమనించాలి.

లోకంలో అన్నిటికంటే మనకి ప్రియమైనది మన దేహమున్నూ, దానివలన కలిగే సుఖమున్నూ. అలానే భగవంతుడికి కూడా తన దేహంపై అంతే ప్రేమ ఉంటుంది. ఈ ప్రపంచమూ, దీనిలో ఉండే జీవవర్గమూ ఆయనయొక్క దేహం. వీటిని కూడా ఆయన ఎంతగానో ప్రేమిస్తాడు. దేహం జీవించి ఉందీ అంటే, లోపల ఆత్మ ఉండడమే కదా కారణం! ఆత్మని బట్టే మనం దేహాన్ని గుర్తించగలుగుతాము. విలువనిస్తాము. అలానే భగవంతుణ్ణి మనం గుర్తించేది జ్ఞానులు చేసే ఉపదేశం వల్లనే కనుక, ఆ జ్ఞానులని తనకి ఆత్మసమానులుగా భావిస్తాను అని భగవంతుడు చెప్పుకున్నాడు. అంటే, జ్ఞానులయొక్క అవసరం ఎంతటిదో మనం గమనించాలి. ఆ జ్ఞానులని ఆశ్రయించడం ద్వారానే మనకి ఉత్తమ జ్ఞానం కలగడమే కాకుండా భగవంతుడి అభిమానానికి కూడా మనం ఏ కొద్దిగానైనా పాత్రులం కాగలుగుతాం!

భగవంతుడే తనకు ప్రీతిపాత్రులుగా అనుగ్రహించి తయారుచేసుకున్న భక్తులను 'దివ్యసూరు'లని, 'ఆళ్వార్లు' అని మనం కీర్తిస్తున్నాం. **'ఆళ్వార్'** అనే తమిళ పదానికి 'కాపాడినవారు' లేదా 'భగవదనుభవంలో మునిగి తేలినవారు' అని అర్థము. భగవతత్త్వాన్ని తెలిపి మనవంటి జీవులను కాపాడినవారు. మనవంటి జీవులను సంస్కరించి భగవంతుని పరికరములుగా తయారుచేస్తూ భగవంతుని కొరతను తీర్చడం ద్వారా భగవంతుని కూడా వీరు కాపాడువారు. అలా చేయటానికి వీలుగా వేదైక వేద్యుడైన ఆ భగవంతునియొక్క కళ్యాణగుణ అనుభవ ప్రవాహంలో మునిగి తేలినవారు. అలాంటి వారినే మనం సేవించాలని ఈ శ్లోకం చెబుతోంది.

**"ఆహ్లాదశీత నేత్రాంబుః పులకీకృతగాత్రవాన్**
**సదా పరగుణావిష్టః ద్రష్టవ్యః సర్వదేహిభిః"**

'ఒడలు పులకరించగా, నేత్రములనుండి ఆనందబాష్పములు జాలువారుతూ భగవద్దర్శనాన్ని పొంది ఆ దివ్యానుభవంలో మునిగినవారు, మనకు ఉపాస్యులు' అటువంటివారే మన ఆళ్వార్లు. అలా భగవంతుని నిరంతరము ప్రేమతో దర్శిస్తూ ఉండేవారిని 'సూరులు' అంటారు. ఆ దర్శనము కూడా తమ సొంత ప్రయత్నముతో కాకుండా భగవదనుగ్రహంతోనే పొందినవారిని 'దివ్యసూరులు' అంటారు.

భగవత్ కటాక్షముతో పరిపూర్ణతని, పక్వ స్థితిని పొందినవారు వేరు వేరు ప్రాంతాలలో వేరు వేరు భాషలకి చెందిన భక్తులు చాలామందే ఉన్నారు. అయితే ఆ అనుభవసారాన్ని మనదాకా అందించాలనే తపనతో ద్రావిడంలో పాడినవారు ఓ పన్నెండు మంది. వారినే 'ఆళ్వార్‌లు' అంటాము. వారిని స్మరించినా చాలు. వారి దృష్టి దివ్యం. వారి మాట, చేష్ట అన్నీ దివ్యములే. కారణం, పరమాత్మ దివ్యతత్త్వాన్ని అనుభవించారు కనుక. అది వారిలో ప్రతిఫలిస్తూంటుంది. వారి ద్వారా వెలువడినవన్నీ దివ్యములు. 'దివ్యం' అంటే ఇలా, ఇంత అని చెప్పటానికి వీలులేనంత ఆనందమిచ్చేది. మధురపదార్థము తిన్న వ్యక్తి 'ఎలా ఉంది?' అంటే 'తియ్యగా ఉంది' అంటాడే తప్ప 'తీపి'ని వర్ణించలేడు. దివ్యుడైన భగవత్తత్త్వాన్ని కూడా సంపూర్ణంగా వర్ణించడం ఎవరికీ సాధ్యం కాదు. అయినప్పటికీ, అనుభవించినంతలో వేదాలతో సమానంగా, సులభంగ మరింత స్పష్టంగా భగవత్సంబంధ దివ్యానందాన్ని అందించినవారు ఆళ్వార్లు. అందుకే వారూ దివ్యులే అయ్యారు. వారుండే ప్రదేశములూ దివ్యదేశములు. వారు పాడినవి దివ్య ప్రబంధములు. వారి సంబంధంకలిగినవన్నీ దివ్యములే.

అలాంటివారు ఈ కలియుగంలో కూడా ఉన్నారు. ఈ కలియుగానికి పూర్వమూ ఉన్నారు. ఆళ్వార్లు పన్నెండు మందిలో మన కలియుగంలో ఆవిర్భవించినవారు ఎనిమిదిమంది ఉన్నారు. నలుగురు కలియుగానికి ముందు ఆవిర్భవించారు. వారిని గురించి కొద్దిగా తెలుసుకుందాం! వీరిని గురించి, భగవంతుడు వీరిని అనుగ్రహించిన వైనాన్ని గురించి తెలుసుకొని వారిని ఆశ్రయించటం ద్వారా భగవంతుని కృపకు మనమూ పాత్రులమౌదాం! ఆ దివ్యానందాన్ని పొందుదాం!

*(సశేషం)*




వేదము విజ్ఞాన సర్వస్వము. వేదము అంటేనే 'తెలుపునది' అని అర్థము. వేదము ప్రధానంగా రెండు భాగములు. 1.కర్మభాగము, 2.జ్ఞాన భాగము. మానవుడు దైహికంగా చేయవలసిన వాటన్నిటినీ తెలిపే భాగము కర్మభాగము. అది ఇక్కడ ఈ లోకంలో సుఖాన్ని పొందే అంశము కావచ్చు, లేదా స్వర్గాది దివ్యలోకాలలో దివ్యదేహాలతో అనుభవించే సౌఖ్యము కావచ్చు. ఒక జీవి దైహికంగా అనుభవించే విషయాలకి సంబంధించిన అంశములన్నిటినీ ఈ కర్మభాగము తెలుపుతుంది.

ఇక రెండవదైన జ్ఞానభాగము, ఆత్మోజ్జీవనానికి చేయువలసిన సాధనావిధానాన్ని, పొందవలసిన ఉత్తమపురుషార్థమును గూర్చిన జ్ఞాన వికాసాన్ని కలిగించే విషయాలనన్నిటినీ తెలుపుతుంది. మొత్తానికి వేదము ఇతర ప్రమాణాలద్వారా తెలిసే అవకాశం లేని సాధనాలన్నిటినీ తెలుపుతుంది.

**ప్రత్యక్షే ణానుమిత్యా వా య స్తూపాయో న బుధ్యతే ।**
**యస్తం విదంతి వేదేన తస్మాత్ వేదస్య వేదతా ॥**

ఇంద్రియముల ద్వారా అనుభవించడం వలన కలిగే జ్ఞానాన్ని ప్రత్యక్షం అంటారు. ప్రత్యక్షంగా తెలిసినదానిని ఆధారంగా చేసుకొని పరోక్షంలో ఉన్నదానిని ఊహించి తెలుసుకోవడాన్ని అనుమానం అంటారు. ఈ రెంటి ద్వారా తెలియనివాటిని వేదము మాత్రమే మనకు తెలుపుతుంది. అంటే, మన ఇంద్రియాలకీ, మనస్సుకీ అందని ఆత్మ, పరమాత్మల స్వరూప స్వభావాలను సాధనా రీతులను తెలిపేది వేదము మాత్రమే అని తాత్పర్యము.

అయితే జ్ఞానభాగములోని ఈ సాధనా స్వరూపము అనేది శ్రద్ధ కలిగి, జిజ్ఞాస కలిగి, సాధన చేసేపట్టుదల ఉన్నవారెవరైనా, అంతకుముందే సాధన చేసిఉన్న ఆచార్యులను, పెద్దలను ఆశ్రయించి మాత్రమే పొందతగిన విషయము. అందుకని దీనిని 'ఉపనిషద్భాగము' లేదా 'వేదాంతము' అని అంటారు.

'అంతం' అనే పదానికి 'చివర' అనే అర్థముంది కనుక, వేదాంతము అనగానే వేదములో చివరిభాగము అని అంటుంటారు. అయితే ఆత్మోజ్జీవనానికి సంబంధించిన తత్త్వ ప్రతిపాదన వేదాలలో చివర మాత్రమే ఉంటుందనే నియమమేమీ లేదు. కొన్ని వేదశాఖలలో మొదట్లోనే ఉంది. కొన్నిటిలో మధ్యలో, మరి కొన్నిటిలో చివరలోనూ ఉంది. అందువలన 'అంతం' అన్న పదాన్ని 'చివర' అన్న అర్థములోనే పరిమితం చేయాల్సిన అవసరం లేదు. మరే అర్థమైయ్యుంటుంది? 'అంతం' అనగా 'అందము', 'లక్ష్యము' అని మరో రెండు అర్థములు కూడా ఉన్నాయి.

ఆనందాన్ని కలిగించేదేదో దాన్ని అందంగా గుర్తిస్తాము. 'వేదాంతము' అంటే వేదంలో తెలియదగినవాటిలో అందమైన భాగము. 1.ఆత్మ, బ్రహ్మ తత్త్వప్రతిపాదకమై నిరతిశయానందాన్ని అందించేది కనుక అందమైనది. కనుక, ఆభాగము ఎక్కడున్నా వేదాంతమే అవుతుంది. ఉదాహరణకి, వనాంతము అనే పదానికి వనానికి చివర అని కాదు అర్థము. వనములో అందమైన స్థానము అని అర్థము. అలాగే వేదంలో అందమైన భాగమును 'వేదాంతం' అంటారు.

2. 'అంతం' అంటే లక్ష్యం అన్న అర్థంలో చెప్పవచ్చు. చేసే ప్రయత్నం ఎక్కడ అంతమవుతుంది? లక్ష్యాన్ని చేరినపుడు, తలపెట్టిన ప్రయోజనం నెరవేరినపుడు, ఫలితాన్ని పొందినపుడు మాత్రమే కదా! కనుక, 'అంతం' అనే శబ్దానికి "ప్రయోజనం, ఫలము, లక్ష్యము" అన్న అర్థాలు తీసుకుంటే, వేదము అంటే జ్ఞానము, ఎ) దానికి ప్రయోజనం బ్రహ్మ తత్త్వం తెలియడం. అది తెలిపే భాగమేదో అది 'వేదాంతము'. బి) జ్ఞానానికి లక్ష్యం బ్రహ్మప్రాప్తి అది కలిగించేది 'వేదాంతము'. సి) జ్ఞానానికి

ఫలము నిరతిశయానంద ప్రాప్తి. బ్రహ్మానుభవరూప నిరతిశయానందాన్ని కలిగించే భాగమేదో అది 'వేదాంతము' అని అర్థము. ఏతావతా, వేదంలో ప్రధాన భాగము, వేదంవలన కలగ వలసిన ప్రయోజనాన్ని అందించే భాగమును 'వేదాంతము' అంటారు. ఇది మనంతట మనం చదివితే తెలిసేది కాదు. ఆచార్యులను ఆశ్రయించి శుశ్రూషచేసి తెలుసుకోవలసినది మాత్రమే. కనుకనే దీనిని 'ఉపనిషత్' అని కూడా అంటారు.

ఈ 'ఉపనిషత్' శబ్దానికి కూడా విశేషమైన అర్థాలున్నాయి. భగవద్రామానుజుల వారు ఒక చక్కటి నిర్వచనాన్ని అందించారు. 1) 'ఉపనిషీదతి అస్మిన్ ఇతి ఉపనిషత్' ఉత్తమమైన భగవత్తత్త్వము ఇందులో ప్రతిపాదింపబడి ఉంది కనుక ఇది ఉపనిషద్భాగము అని అర్థము. అయితే వేదము పూర్వభాగములో కూడా భగవత్తత్త్వ ప్రతిపాదనము ఉంది. అయితే అది నేరుగా కాక, ఇంద్ర, అగ్ని, యమ మొదలైన దేవతలకి అంతర్యామిగా పరబ్రహ్మని చెప్పింది. అందుకని వేదపూర్వభాగాన్ని **"సద్వారక బ్రహ్మ ప్రతిపాదకము"** అంటారు. వేదములోని ఉత్తరభాగము నేరుగా పరబ్రహ్మతత్త్వమును, వానిని ఉపాసించే విధానమును చెప్పింది. దానిని **"అద్వారక బ్రహ్మ ప్రతిపాదకము''** అంటారు. ఈ రెండవభాగమునే ఉపనిషద్భాగముగా గుర్తిస్తారు అనేది రామానుజులవారి అభిప్రాయం.

2) 'ఉప నిషద్య గృహ్యతే ఇతి ఉపనిషత్' జ్ఞానుల సమీపంలో ఉండి వారి ఉపదేశం ద్వారా గ్రహించతగినది. ఆచార్యుల సన్నిధి చేరి ఆశ్రయించి, ప్రార్థించి, నేర్వవలసినది కనుక 'ఉపనిషత్' అంటారు.

షదుల్ అనే ధాతువునకు విశరణము, గత్యవసాదనము అనే అర్థాలున్నాయి. దీనిని బట్టి 'ఉపనిషత్' పదాన్ని శంకరభగవత్పాతులు మరొక విధంగా నిర్వచించారు. అవి 1) 'ఉప' ఆశ్రయించిన వారి అవిద్యను(అజ్ఞానమును), 'ని' నితరాం సంపూర్ణంగా, 'షత్' దూరము చేయును. 2) 'ఉప' ఆశ్రయించినవారికి 'ని' పరిపూర్ణంగా, 'షణ్ణా' పరమాత్మతో ఐక్యజ్ఞానమును కలిగించునది.

ఉపనిషత్తులు అనే పేరుతో చెలామణిలో ఉన్న గ్రంథాలు చాలా ఉన్నాయి. అన్ని వేదశాఖలలో కలిపి సుమారు 250 నుండి 500 దాకా ఉన్నాయంటారు. ఇంకా ప్రస్తుత కాలంలో తయారౌతున్న ఉపనిషత్‌లు కూడా ఉన్నాయట. అయితే ప్రామాణికంగా మనం తెలుసుకోదగినవేవి? ప్రసిద్ధులైన ఆచార్యులు అందించినవి. మిగిలినవి ఆయా సందర్భాలలో అవసరాన్ని బట్టి స్వీకరిస్తాం.

మనకి జగత్ప్రసిద్ధి చెందిన ఆచార్యులు ముగ్గురు. 1. అద్వైతసంప్రదాయ ప్రవర్తకులైన శంకరభగవత్పాదులు, 2.విశిష్టాద్వైతసంప్రదాయ ప్రవర్తకులైన భగవద్రామానుజా చార్యులు, 3. ద్వైతసంప్రదాయ ప్రవర్తకులైన శ్రీమధ్వాచార్యులు. ఈ త్రిమతాచార్యులు ఏయే ఉపనిషత్‌లను ప్రామాణికంగా అంగీకరించారో వాటిని మనం నిస్సంకోచంగా ప్రామాణికంగా భావించి స్వీకరించవచ్చు. అయితే, వారు ఈ యీ ఉపనిషత్‌లను స్వీకరించారు అనటానికి మనకేమిటి ఆధారం? అంటే, వారి కృతులనిబట్టి తెలుసుకోవచ్చు. 'ఇవి ఫలానా ఆచార్యులవా రందించిన గ్రంథములు' అని అందరూ అంగీకరించిన వాటిల్లో వారు ఏయే ఉపనిషత్‌లను ప్రస్తావించారో ఆ ఉపనిషత్‌లని వారు ప్రామాణికంగా అంగీకరించినట్లు గ్రహించాలి.

బ్రహ్మసూత్రములు, భగవద్గీత, ఉపనిషత్‌లకి త్రిమతాచార్యులూ అందించిన వ్యాఖ్యానాలు లభిస్తున్నాయి. అలాంటివాటిలో వారు ఉటంకించిన ప్రమాణకోటిలో చేరినవి ఓ పద్నాలుగు ఉపనిషత్‌లు మాత్రమే కన్పిస్తున్నాయి. వాటిలో ప్రధానమైన పదింటిని ఓ చక్కని శ్లోకరూపంలో గుర్తుంచుకోవడానికి వీలుగా ప్రస్తావిస్తారు.

**ఈశ కేన కఠ ప్రశ్న ముండ మాండూక్య తిత్తిరిః ।**
**ఛాందోగ్యం బృహదారణ్యం ఐతరేయం దశైవ చ ॥**

అవి **1.ఈశావాస్యోపనిషత్, 2.కేనోపనిషత్, 3. కఠోపనిషత్, 4. ప్రశ్నోపనిషత్, 5. ముండకోపనిషత్, 6. మాండూక్యోపనిషత్, 7.తైత్తిరీయోపనిషత్, 8. ఐతరేయోపనిషత్, 9.ఛాందోగ్యోపనిషత్, 10.బృహదారణ్యకోపనిషత్.** ఇవి కాక మరో నాలుగు కూడా కన్పిస్తాయి. **1. శ్వేతాశ్వతరోపనిషత్, 2. కౌషీత క్యుపనిషత్, 3. సుబాలోపనిషత్, 4.మహానారాయణోపనిషత్.**

ఒక్కొక్క ఉపనిషత్ ఒకొక్క విశేషమును మనకు తెలుపుతూ ఉంటుంది. ఒకచోట విస్తరించి ఉన్న విషయాన్ని మరో ఉపనిషత్ సంక్షేపించి ఇంకో విషయాన్ని విస్తరిస్తూ ఉంటుంది. అలాంటి విశేషాలతో కొనినంటిని మనం కూడా తెలుసుకొనే ప్రయత్నం అక్కడ చేద్దాము.

*(సశేషం)*



# శ్రీరామాయణము



ఎ. ఉషశ్రీ- శ్రీరాంనగర్

మానవుడు ప్రాణులన్నిటిలోకి విలక్షణమైన జ్ఞానం కలిగినవాడు. ప్రతిపనిలోను ఆనందాన్ని వెతుకుతాడు. ప్రతినిత్యం సుఖంగా జీవించాలని కోరుకుంటాడు. ఆ సుఖమనేది రెండు రకాలుగా ఉంటుంది. 1. అభ్యుదయము అంటే, ఈ లోకంలో చేసే కర్మలద్వారా సాధించే భౌతిక అభివృద్ధి, చేసిన పుణ్యఫలంగా స్వర్గాది లోకాలలో ఆనందానుభవం. 2. నిశ్శ్రేయసము అంటే, కర్మానుభవమంతా తీరి, తిరిగి శరీరాలను పొందనవసరం లేకుండా అనుభవించే నిరతిశయ నిత్యానందం. ఇది ముక్తిదశలో లభించేది. మానవునికి ఇవి రెండూ అవసరమే. వానిని ఏవిధంగా పొందవచ్చునో వేదం నిరూపించింది. ఆ వేదవే అర్థంచేసుకోవడానికి వీలయ్యేట్లు సులభమైన రామాయణంగా మనకి అందింది.

వేదవేద్యుడే ''కృత్వా మర్త్యమయీం తనుం'' మానవదేహంతో దశరథుని పుత్రునిగా అవతరించాడు. అతని చరితను తెలిపేదే రామాయణం. రామాయణము వాల్మీకి కోకిల అందించిన మధురమైన కావ్యము. పఠనానికి, గానానికి కూడా అనువుగా ఉండే అనుష్టుప్ ఛందస్‌లో ఉంది.

'చరితం రఘునాథస్య శతకోటి ప్రవిస్తరం' శ్రీరామాయణాన్ని బ్రహ్మలోకంలో 100 కోట్ల గ్రంథంగా నిరంతరం అక్కడుండే మహానుభావులు పారాయణం చేస్తూంటారట. అది ఎన్ని యుగాలుగా వస్తున్న రామకథో, ఎన్ని విధాలుగా వారు రామకథని పాడుకుంటూ ఉంటారో మనకు ఇతమిత్థంగా తెలియదు. అది ఆ లోకవువాసులకు కూడా నిత్యానుసంధేయంగా ఉన్నది అంటే దాని వైభవం ఎంతటిదో గుర్తించవచ్చు.

కానీ, ఈ లోకంలో, రామాయణాన్ని మనం చదువుకోడానికి మాత్రం వాల్మీకి మహర్షి, మనకి 24,000 శ్లోకాలుగానే అందించాడు. ప్రతి వేయి శ్లోకాలకీ గాయత్రీ మంత్రములోని ఒక్కొక్క బీజాక్షరమును సంపుటితం చేసి వాల్మీకి అందించాడు. ఈ రామాయణంలోని ప్రతీ అక్షరం మన మహాపాపాలను నశింపచేస్తుంది. ఉచ్చరించలేకపోయినా కనీసం వినినా చాలు 'జన్మ వ్యాధి జరా విపత్తి మరణైః అత్యంతసోపద్రవం, సంసారం స విహాయ గచ్ఛతి పుమాన్ విష్ణోః పదం శాశ్వతమ్' పుట్టుక రోగములు, ముసలితనం, ఆపదలు, మరణంలాంటివి లేకుండా శాశ్వతమైన ఆనందాన్ని పొందవచ్చు. ఈ రామాయణం ఆచరణ ప్రధానమైన గ్రంథం.

**'దుర్లభో మానుషో దేహః దేహినాం'** జీవికి మానవదేహం రావడం చాలా కష్టం. ఈ శరీరం ఉండగా మన సుఖమే కాక, మనమన వర్ణాశ్రమ ధర్మాలను ఆచరిస్తూ పుత్రధర్మం, సోదర ధర్మం, భర్తృధర్మం, పితృధర్మం, మిత్రధర్మాలు పాటిస్తూ మన తోటివారికి సుఖం కలిగేలా ప్రవర్తించగలగాలి. మన ధర్మాలను మనం ఆచరిస్తూ, రాగద్వేషాలను తగ్గించుకుంటూ, భగవంతునికి చెందినవారముగా జీవితం గడపాలి. దీనిని మనకి ఆచరించి చూపించడానికే వేదవేద్యుడు రాముడిగా అవతరించాడు. పదకొండువేల సంవత్సరాలు మానవధర్మాలను ఆచరించి చూపించాడు. ఆ చరిత్రనే రామాయణంగా మనకి అందించాడు వాల్మీకి మహర్షి

ఈ వాల్మీకి ఎవరు? వాల్మీకి ఒక గొప్ప మహర్షి. ఆశ్చర్యకరమైన విషయం, మహర్షి కాకముందు ఆయన ఆటవిక ప్రవృత్తి కలవాడు. పేరు ఋక్షుడు. అతనిని బ్రహ్మ రామాయణ రచనకు కర్తగా ఎంచుకున్నాడు.

రామాయణం పరిపూర్ణ మానవుని కథ. మానవునిలోని మానవత్వం పరిపూర్ణంగా పరిమళిస్తే ఎలా మహిమాన్విత మౌతుందో, దేవతలకు కూడా ఆరాధ్యమౌతుందో తెలిపే ఆదర్శ చరిత. మర్యాదా పురుషోత్తముడైన రాముని చరితని, యుగయుగాలకి, తరతరాలకి ఆదర్శకావ్యంగా అందించా లనుకున్నాడు బ్రహ్మ. అందుకు ఎంచుకున్నది మాత్రము ఒక ఆటవిక, క్రూరప్రవృత్తి కలిగిన ఋక్షుని. ఏరాముని వైభవాన్ని లోకానికి తాను అందించాలనుకున్నాడో ఆ రామ నామాన్నే నారదుని ద్వారా అతనికి ఉపదేశింప చేసాడు. రామనామ జపనిష్ఠలో ఋక్షుడు లోకాన్నే మరచిపోయాడు. ఎంతకాలము అతనలా ఆ రామనామోచ్చారణలో తనువు మరచి

ఉండిపోయాడో మనకు తెలియదు. అతనిపై పుట్టలు కట్టాయి.

పుట్టను సంస్కృతములో 'వల్మీకము' అంటారు. ఋక్షుడు పుట్టలోనే రామనామ జపంతో పరిణతి చెంది మహర్షి అయ్యాడు. కొంతకాలానికి దైవవశాత్తు కురిసిన వానకు ఆ పుట్ట కరిగింది. వరుణదేవుని అనుగ్రహముతో ఋషిగా మారిన ఋక్షుని ఉనికి బయటపడింది. వరుణ దేవునికి ప్రచేతసుడు అని పేరు. వరుణుని వలన బయటకు వచ్చాడు కనుక ఋక్షుని 'ప్రాచేతసుడు' అంటారు. వల్మీకము నుండి మహర్షిగా వెలికి వచ్చినందున 'వాల్మీకిమహర్షి' అని అంటారు.

రామనామ ప్రభావము ఎంతటిదో కదా! ఆటవికుడు మహర్షిగా మారినవైనం అత్యద్భుతం. వాల్మీకి మహర్షి రామనామ ప్రభావాన్ని స్వయంగా అనుభవించడమే కాక రాముని ప్రాభవాన్నీ కనులారా దర్శించాడు. కనుకనే, రామాయణ కావ్యాన్ని దృశ్యకావ్యంగా చాలా మధురంగా అందించాడు. రామాయణము ఈ లోకంలో ఛందోబద్ధంగా అందిన మొదటి కావ్యము. అందుకే దానిని అందించిన వాల్మీకి **'ఆదికవి'** అయ్యాడు.

వాల్మీకి తాను ఎక్కడో అరణ్యంలో ఆశ్రమంలో ఉన్నా అయోధ్యలోను, మిథిలలోను, అరణ్యంలోను జరిగిన సన్నివేశాలనన్నింటినీ బ్రహ్మ ఇచ్చిన వరంతో ప్రత్యక్షంగా దర్శించి అందించాడు. అందుకే 'రామాయణం' అంటే వాల్మీకిమహర్షి వ్రాసినది మాత్రమే. లోకంలో తులసీరామాయణం, మొల్ల రామాయణం, కంబరామాయణం ఇలా చాలా రామాయణాలు ఉన్నాయి కదా! కానీ, ఇవన్నీ వాల్మీకి రామాయణం తర్వాత వచ్చినవే. వాల్మీకి రామాయణమునే మూల రామాయణము అంటారు. మిగిలిన రామాయణాలని ఎవరు వ్రాసారో వారి పేర్లను ముందు చెప్పే పలుకుతాం! ఉపపదం లేకుండా కేవలం **'రామాయణం'** అంటే అది వాల్మీకి రామాయణం మాత్రమే అని గుర్తించాలి.

అయితే ఈ వాల్మీకిరామాయణాన్ని కూడా కొందరు శ్రీరామాయణమని, శ్రీమద్రామాయణమని అంటూ ఉంటారు. ఎందుకలా అంటారు? ఏది సమంజసము అనేది తెలుసుకొని, ఆ రామాయణంలోని పాత్రల ద్వారా, మనం నేర్వవలసిన అంశము లేమిటనేది రాబోయే సంచికల్లో తెలుసుకుందాం!

(సశేషం)

## వేంకటాచలము-వేదాచలము

పరమాత్మతో పాటు ఆయన అర్చామూర్తిగా నెలకొన్న ఆలయం, ఆ ఆలయం వెలసిన పర్వతం. ఆ పర్వతాన్ని చేర్చే మార్గమూ స్పృహణీయాలే, స్తవనీయాలే, సేవనీయాలే, మాననీయాలే, అభిగమనీయాలే, అనుభవనీయాలే అన్నది ఆళ్వారుల అంతరంగం.

ఈ దృష్టితో అదివో **'హరివాసమంటూ'** శ్రీనివాసుడు నిలచిన వేంకట నగాన్ని దశసహస్ర శేషఫణి-ఫణామణి మయంగా భావించి దానిని చూడండి, దానికి మొక్కండి అని దివి వారికి భువి వారికి ఎలుగెత్తి చాటుతారు అన్నమాచార్యులవారు.

శ్రీమన్నిగమాంత మహాదేశికులు వేంకటాచలాన్ని వేదవేద్యనిలయమైన వేదాచలంగా కీర్తిస్తూ శ్రీనివాసునికి అష్టపదాష్టపద పీఠిక నొకదానిని తమిళమున సమర్పించినారు. సేవించండి. -

**" కన్నయ్య పదయుగళి కానిపించెడి కొండ**
**పూర్వోత్త రాఘములు పోకార్చు కొండ**
**పరమ పదమిదె నిక్కమనబరగు కొండ**
**బహువిమల తీర్థముల ప్రవహించు కొండ**
**పున్నెముల నెలవనగ బొగడొందు కొండ**
**పరమ పద భోగములు చూరవిచ్చెడు కొండ**
**నింగినేలల వారలాశపడు కొండ**
**వేంకటాచలమనెడి వేదముల కొండ"**

**- శ్రీరామచంద్రాచార్య**




శ్రీమాన్ మధుసూదనాచార్యులు
ప్రధానాచార్య, ఆగమపాఠశాల, జగ్గయ్యపేట

# శ్రీపాంచరాత్ర పరిచయము

**"దైవాధీనం జగత్సర్వం మంత్రాధీనం తు దైవతమ్"** లోకమంతా భగవంతుని ఆధీనంలో ఉంటుంది. దివ్యశక్తికల ఆదేవుడు మంత్ర శక్తికి ఒదిగి ఉండును అని శాస్త్రం.

భగవంతుడెవరు? ఎక్కడ ఉంటాడు? ఏమిచేస్తాడు? ఆతణ్ణి తెలుసుకోవడమేలా? దర్శించడమెలా? రూపాలున్నాయా? ఉంటే ఎలా ఏర్పడ్డాయి? మనలాంటి వారము చూడాలన్నా వీలుందా? సాధనాలేమిటి?... ఇలాంటి అనేక ప్రశ్నలు జిజ్ఞాసువులను వెంటాడుతూనే ఉంటాయి. వాటికి సమాధానం చెప్పడానికి ఆవిర్భవించిన అద్భుతమైన శాస్త్రమే "శ్రీపాంచరాత్ర దివ్యాగమశాస్త్రం"

అపౌరుషేయాలైన వేదాలన్ని ప్రతిఅక్షరమూ శ్రియఃపతియైన శ్రీమన్నారాయణుని వైభవానికి ప్రకాశకములేనని వేదవిదులంతా ఏక కంఠంతో ఘోషిస్తూంటారు. ఈ శ్లోకంతో–

**"వేదాక్షరాణి యావన్తి పఠితాని ద్విజాతిభిః,
తావన్తి హరినామాని కీర్తితాని న సంశయః ॥**

వేదం అధ్యయనం చేసినవారంతా చివరపఠించే పాఠమే ఈ శ్లోకం. ఇందులో సకలవేద వాఙ్మయమూ ప్రతిపాదించే భగవతత్త్వము శ్రీహరియేనని తెలుస్తోంది. ఆ శ్రీహరియే స్వయాన ఉపదేశించిన తన ఆరాధనావిధానమే "శ్రీపాంచరాత్రాగమము". ఈ శాస్త్రానికి ప్రవర్తకుడు సాక్షాత్తు శ్రియఃపతిమైన శ్రీమన్నారాయణుడేనని "పాంచరాత్రస్య కృత్స్నస్యవక్తా నారాయణస్స్వయమ్"

అంటూ పాద్మసంహిత తెలిపింది. ఈ రకంగ ఇది భగవత్ ప్రోక్తమైన పౌరుషేయశాస్త్రమే అయినా అపౌరుషేయమైన వేదమువలె పరమప్రామాణికమై విరాజిల్లుతోంది.

ఈ శాస్త్రాన్ని భగవానుడు ముందుగ తన ప్రియపత్ని శ్రీదేవికే ఉపదేశించాడట. అలానే ఆపై ఆదిశేషునికి, గరుత్మంతునికి, తన ప్రతినిధి అయిన విష్వక్సేనునికీ, చతుర్ముఖునికీ, మహానుభావులైన నారద, సంవర్తకాది ఋషులకీ ఉపదేశ పరంపరకొనసాగింది. ఈశాస్త్రానికి, శ్రీపాంచరాత్రము, తంత్రము, దివ్యాగమము, భగవచ్ఛాస్త్రము, సాత్వతము, మహోపనిషత్, భాగవతము, ఏకాయనము, సర్వసిద్ధాన్తము వంటి ఎన్నో దివ్యములైన నామాలున్నాయి. అవన్నీ సార్థకములైన నామాలు.

ఈసృష్టికంతకూ భగవంతుడు మూలకారణమని తెలియచేసే వేదము ఆయన్ని **'పతిం విశ్వస్యాత్మేశ్వరం'** అని సంభావించింది. అంటే ఈ లోకాలన్నింటిని స్వేచ్ఛగ ఏలుకొనువాడు. అంతేకాక దేవ, మనుష్య, తిర్యక్, స్థావరాలనే రూపాలలో ఉండే జీవులనందరనూ నియమించువాడు కూడా అతడే. నిత్య, ముక్తులుగ ఉండే జీవులనుగూడ నియంత్రించువాడు ఆ శ్రియఃపతియేనంటూ నిర్ణయించింది.

ఇలా పాలకుడు ఆయన, ఆయన పాలనకులొంగి ఉండే చేతన వర్గాన్నంతనూ తన సంతానంగ భావించి, వారిలో నిత్యులుగ, ముక్తులుగ తన తోటే చేరి ఉండి నిత్యానందాన్ని శాశ్వతంగ అనుభవించే జీవులను చూచినపుడు, ఆ ఆనందానికి నోచుకోక కర్మకి బద్ధులై సుర, నర, తిర్యక్, స్థావరాలుగ జన్మమృత్యు చక్రంలో పడి, తిరుగుతూండే జీవులను చూచి భగవంతుడు బాధతో ఇలా భావిస్తాడట. "వీరుకూడా కర్మబంధంతొలగి నిత్య, ముక్తులవలె శాశ్వతానందాన్ని పొందవలసిన వారేగద! కానీ అజ్ఞానానికీ, కర్మకీలొంగి నన్ను మరిచారు. ప్రకృతిమాయలో చిక్కుకున్నారు. సంసార చక్రంలో తలమునకలౌతున్నారు. వారిని నేనే స్వయంగ ఉద్ధరించాలి. అందుకై నానిత్యవిభూతి నుండి క్రిందికి దిగుతాను. ఎంతవరకైనా దిగి వీరిని మరల్చడానికి అన్ని విధాల ప్రయత్నిస్తాను" ఇలా భావించిన భగవంతుడు జగత్సృష్టి సంకల్పాన్ని చేసాడని

**"సోఽకామయత" బహుస్యాం ప్రజాయేయేతి.
స తపో తప్యత, స తపస్తప్త్వా, ఇదగ్ం సర్వమసృజత,**

**యదిదం కించ, తత్ సృష్ట్వా, తదేవానుప్రావిశత్..."**

అంటూ తైత్తిరీయ సంహిత తెలిపింది.

'అతడు సంకల్పించెను, నేను నాలోని జీవులను విస్తరించుట ద్వారా అనేకమగుదును గాక! ఆతడు తన సత్యసంకల్పాది జ్ఞానమును కార్యోన్ముఖముగావించెను. వెంటనే ఈ విశ్వాంతరాళములోని బ్రహ్మాండములన్నీ వెలువడెను. వాటియందు జీవుని ద్వారా తాను ప్రవేశించి జగద్రచన చేయసాగెను'.

సంగ్రహముగ వేదము తెలిపిన ఈ క్రమాన్ని భగవానుడే శ్రీపాంచరాత్రాగమ దివ్యశాస్త్రములో మన కర్థమయ్యేరీతిలో వివరించాడు.

జీవులను తరింపచేయడానికి శ్రియఃపతి ఐదుస్థానములను ఏర్పరచుకొన్నాడట. అవి 1) పర స్వరూపము. 2) వ్యూహము. 3) విభవములు, 4) హృదయాన్తర్వర్తిగ అంతర్యామి. 5) అర్చామూర్తి, అంటుంది శ్రీపాంచరాత్రము.

వీటిలో పరస్వరూపంగ ఉండే తాను ఏ మార్పుచెందని లోకంలో, తానూ ఏమార్పుచెందక నిత్య, ముక్తులననుగ్రహిస్తూ వేంచేసి ఉంటాడు. మిగిలిన నాలుగూ బద్ధజీవులను ఉద్ధరించడానికే గ్రహించాడు.

వ్యూహ స్వరూపంలో ఉంటూ ఈ లోకాలయొక్క సృష్టి, స్థితి, లయాలను చేస్తూ ఉండడంతోపాటూ మూలవేదాలను ఉపదేశించడం ద్వారా విజ్ఞానవికాసాన్ని కలిగించడం ప్రారంభించాడు. బ్రహ్మకు నాలుగు ముఖాలకూ నాలుగు వేదాలను వివరించినదీ స్థానంనుండేనని

**"యో బ్రహ్మాణం విదధాతి పూర్వం,**

**యో వై వేదాంశ్చ ప్రహిణోతి తస్మై"** అనే శ్వేతాశ్వతర శ్రుతి స్పష్టం చేసింది.

అలానే, శ్రీపాంచరాత్రాదిగ్రంథాలను ఉపదేశించినదీ, అర్చామూర్తి ఆరాధనా విధానాన్ని ప్రవర్తింపచేసినది గూడా వ్యూహ స్వరూపంనుంచే. దీనినిబట్టి విగ్రహారాధన అనేది ఈ మధ్యకాలంలో పుట్టినది కాదని, సృష్టి ఆరంభంనుండే అంటే 2 వందల కోట్ల సంవత్సరాలముందే ప్రారంభమై ఈ నాటిదాక కొనసాగుతూ వస్తూండే సాంప్రదాయికమైన **"ఆచారసంపద"** అని తెలుస్తోంది.

విభవము, అంటే, తనలోని అసంఖ్యాతములైన కళ్యాణగుణములను ప్రకటించుచోటు. వీటి నాశ్రయించుకొని ఈ జీవవర్గం తరిస్తుందని వివిధ అవతారాలనెత్తడం. ఇవి సజ్జన సంరక్షణ, దుష్టశిక్షణ, ధర్మసంస్థాపన వంటివి జరపడానికి ఉపయోగపడుతున్నాయని భగవద్గీతలో తానే చెప్పాడు. అవతారాల ద్వారా ధర్మాచరణను, కోరుకున్నవారందరికీ తెలిసేటట్లు నిరూపించాడు.

ఆపై అంతర్యామి, అంటే, జీవులలో ఉంటూ వారి ఉనికిని కాపాడటం ద్వారా సర్వులతో అరమరికలు లేకుండా ఉంటానని, గుర్తింపుకోరనని నిరూపించుకున్నాడు. అంతర్యామిగ భగవానుడున్నాడని గుర్తించని వారికి బ్రతుకునిస్తూ సత్తాధారకుడౌతాడు.

గుర్తించిన వారికి ఉపాసనకు ఆధారమౌతాడు. **"స్వాంగుష్ఠ ప్రమితం చ యోగిహృదయేషు ఆసీనమ్"** అంటూ కోరిక కలిగి సాధనచేసిన వారిని యోగులుగ, భక్తులుగ తీర్చిదిద్దడమేకాక, వారిద్వారా ఎన్నెన్నో ధర్మశాస్త్రాలను ఆవిర్భవింపచేసి, ఇతరులకు వారు మార్గదర్శకులయేట్టు చేస్తాడు.

ఇక ఐదవస్థానమైనది అర్చామూర్తి. దీని ద్వారా ఏదో ఒక కాలానికేపరిమితంకాక, ఎక్కడో ఒక చోటుకే చెందిపోయి ఉండకుండా, అన్ని కాలాలలోనూ అన్ని రకాల వారికీ అందుబాటులో ఉండాలనే ఆ భగవంతుడు అర్చామూర్తిగ మారాడు.

సర్వశక్తీ కలవాడే అయినా అశక్తునివలె ఉంటాడు. సర్వజ్ఞుడే అయినా ఏమీ తెలియని వాడివలె కనిపిస్తాడు. సమస్త చేతనాలకీ మూలాధారమే తానైనా, తాను అచేతనమై సాక్షాత్కరిస్తాడు. చేతనాచేతనాలన్నీ తన స్వాధీనంలో ఉన్నా, తాను అర్చక పరాధీనుడై ఉంటాడు. ప్రకృతిలోని ప్రతికదలికకూ కారణంతానే అయినా, తన కదలిక భక్తాధీనమే అన్నట్లుంటాడు. అందరికీ అన్నీ ఇచ్చేది తానే అయినా తనకన్నీ వీరి వల్లనే లభిస్తున్నాయన్నట్లు పరతంత్రుడై ఉంటాడు.

విశ్వంలోని ద్రవ్యాలన్నింటికీ తానే ఆధారమైనా, తన

దేహరచనను ఏ(ద్రవ్యంతో భక్తుడు చేయదలిస్తే ఆ(ద్రవ్యాన్నే తన దివ్యమంగళ వి(గ్రహంగ అంగీకరించేస్తాడు. అలా అందరికీ అందుబాటులోకి వస్తూ "తన సౌలభ్యానికే కాక స్వతం(త్రతకి కూడా పరాకాష్ఠ" అని నిరూపించుకుంటున్నస్థితి అర్చావి(గ్రహం. దీన్నే భగవద్గీత వంటి స్మృతులలో "యే యథామాం (ప్రపద్యన్తే తాన్ తథైవ భజామ్యహమ్" 'ఏభక్తుడు నాకు ఏవిధమైన వి(గ్రహాన్ని ఏర్పరచదలిస్తే, తయారుచేస్తే, వారి (శద్ధను బట్టి, వారివారికి ఆయా కోరిన రీతిలోనే సులభుడనై అందుతాను. వారి ఆరాధనలేమైనా వాటిని (ప్రేమార శిరసా స్వీకరిస్తాను' అంటూ తెలుపుకున్నాడు భగవానుడే.

అందుకే అర్చామూర్తిని భగవంతుని ఐదు రూపాలలోకీ సౌలభ్యానికి చివరిహద్దు అని మన పెద్దలు కీర్తించారు. మిగిలిన నాలుగు రూపాల కంటే మనకి ఉపయోగపడే భగవంతుని సాక్షాత్స్వరూప మని ఆదరించి ఆరాధిస్తున్నారు.

ఆ అర్చామూర్తిని ఆరాధించేవిధానం, నిర్మించే విధానం, స్మరించేవిధానం, దానికి అనువుగా ఆమూర్తికి రక్షణగ ఆలయాన్ని ఏర్పరిచే పద్ధతి, అందులో మళ్ళీ వైవిధ్యము, అందులో జరుపదగిన వివిధసేవలూ, అందులో మళ్ళీ నిత్య, నైమిత్తిక, కామ్యాదిసేవలూ అవి జరిగేటప్పుడు చేయదగిన పరిచర్యలు, అనుసంధించే మం(త్రాలు, తెలిపినదీ ఈ భగవచ్ఛా(స్త్రనమే. ఒక వేళ ఈ ఆచరణలో ఏమైనా దోషాలుదొర్లితే సవరించుకొనే పద్ధతి, జరిపే (ప్రాయశ్చిత్తాలు, వాటికి చెందిన మం(త్రాలూ, ఆ మం(త్రాలను ఉద్ధరించే పద్ధతితో (ప్రారంభించి, ఎలా అనుష్ఠించాలో, ఉపాసించాలో కూడా సవిస్తరంగ వివరించిన దివ్యమైన శా(స్త్రం, శ్రీపాంచరా(త్ర దివ్యాగమ శా(స్త్రం.

**"మన్త్రాధీనం తు దైవతం"** అనుకొన్నాంగద! అందుకే మం(త్రానుష్ఠాన విధానాలను స్పష్ట పరచిందీశా(స్త్రం. అలాగని వాటిని అయోగ్యులబారిన పడేటట్లు బట్టబయలు చేయకుండా, ఒక రహస్య(క్రమంలో సదాచార్యులద్వార (గ్రహించ గలిగేరీతిలో కూర్చి (ప్రసాదించినదీ ఈ శా(స్త్రమే.

అటు ఆచార్య లక్షణాలు, ఇటు శిష్య లక్షణాలను, ఆచార్యులు ఉపదేశించే మం(త్రములు విశేషాలను, శిష్యునిలో నిర్మించుకోవలసిన నిష్ఠను... ఇలా ఒకటేమిటి ఈ సృష్టిలో (ప్రవేశించిన జీవుడు, కర్మబంధవినిర్ముక్తుడై తిరిగి భగవత్సన్నిధికి చేరడానికి అవసరమైన సమస్త సాధన సామ(గ్రినీ స్పష్టంగ సులభంగ, రమణీయంగ, ఆచణాత్మకంగ నిరూపించిన అద్భుతమైన శా(స్త్రం శ్రీ పాంచరా(త్ర దివ్యాగమశా(స్త్రం

ఈ శా(స్త్రములో (శియఃపతి స్వయంగా వివరించిన విశేషజ్ఞాన సర్వస్వాన్ని స్థాలీపులాకన్యాయంగ ఆస్వాదించే ముందర, ఈ శా(స్త్రానికి కల వివిధ నామాలగురించి కొద్దిగా పరిచయంచేసుకొని, వాటి సార్థకతను గుర్తించే (ప్రయత్నం చేద్దాం! *(సశేషం)*



# సుభాషితమ్ ... వసతు జిహ్వాగ్రే

శ్రీమతి గుడిమెళ్ళ మంజుల - విజయవాడ

భగవంతుని సృష్టిలో 'మానవజన్మ' ఉత్తమోత్తమమైనది. పశుపక్ష్యాదుల కంటే విలక్షణరూపము, జ్ఞానముతోపాటు మానవునకు **మాట** దేవుడిచ్చిన మహోన్నతవరము. హృదయంలో కదలాడే భావనలని మనిషి ఈ 'మాట' ద్వారానే వ్యక్తం చేయగలుగుతున్నాడు. మాటలలో వ్యక్తమయ్యేది 'భాష' అయ్యింది. భావవ్యక్తీకరణమే భాషకి(మాటకి) ప్రయోజనం. ఈ 'మాట' మంచిదై ఉండాలి. ఒక్కమంచిమాట మనిషి ప్రాణాల్ని నిలబెడుతుంది. బాధలోనున్న వానికి భుజం తట్టి ధైర్యాన్నిచ్చేదీ మాటే! అందుకే మన పెద్దలు సమాజంలో మనిషి గౌరవం పొందేది ఈ 'మంచిమాట' వలనే అంటూ మానవునికి ఉండవలసిన ఐదు లక్షణాలలో ఒకటిగా చేర్చారు. 'వ'కారముతో ప్రారంభమయ్యే ఈ ఐదులక్షణాలని ఒక శ్లోకంలో చెప్తారు.

**వస్త్రేణ వపుషా వాచా విద్యయా వినయేన చ ।**
**వ కారైః పఞ్చభిర్యుక్తో నరో భవతి పూజితః ॥**

మనిషిని చూడగానే గౌరవం కలగాలంటే **వస్త్రేణ**= వస్త్రం అంటే వేషధారణ సముచితంగా ఉండాలి అని అర్థం. **వపుషా** = మంచి ఆకారం ఉండాలి అంటే, శరీర సౌష్టవం బాగుండాలి. ఆ వెంటనే అతనియందు సద్భావం కలగాలి అంటే మాట్లాడే మాట మంచిదై ఉండాలి. మాట్లాడే తీరు బాగుండాలి. ఆతర్వాతనే అతనికున్న విద్యార్హతలు, సిరి సంపదలు, స్థితిగతులు లెక్కలోకి వస్తాయంటారు. అందుకే 'వాచా' అంటూ మంచిమాటను ఆపైస్థానములో ఉంచారు. ఆ మాటను ధర్మపూరితమైనదీ, ఆదర్శవంతమైనదీ, హితకరమైనదీ, ఆహ్లాదకరమైనదీ, ఆచరణయోగ్యమైనదీ, అనుభవంతో చెప్పినదీ అయితే 'సుభాషితం' అంటారు. దానినే సూక్తి , సదుక్తి, హితోక్తి అనీ, ప్రియభాషణం, సాధుభాషణం, ప్రియవచనం, హితవచనం అని అంటుంటారు. ఇవన్నీ కూడా సుభాషితమ్ అనే అర్థంలోనే వాడుతున్నాం. సుష్ఠు మంచిగా(బాగా) భాషితం పలికినది అని అర్థం.

ఈ సుభాషితాలను వేదముతో పాటు ఎందరో ఋషిపుంగవులు, కవులు, మహనీయులు, మహాత్ములు, అనేక విధాలుగా అంటే, మంత్రాలుగా, శ్లోకాలుగా, పద్యాలుగా, శతకాలుగా, గద్యలుగా, ముక్తకాలుగ, కథలుగా, కవితలుగా, ఆఖ్యాయికల రూపంలోనూ అందించారు.

నీతిశాస్త్రం మాట్లాడే విధానాన్ని ఒక శ్లోకరూపంలో

**సత్యం బ్రూయాత్ ప్రియం బ్రూయాత్**
**న బ్రూయాత్ సత్యమప్రియం ।**
**ప్రియం చ నానృతం బ్రూయాత్**
**ఏష ధర్మ స్సనాతనః ॥** అంటూ నేర్పుతోంది.

"మాటలాడేటప్పుడు నిజమే చెప్పండి.అబద్ధం చెప్పక్కర్లేదు. కానీ, ప్రియంగా చెప్పండి. హితంగా చెప్పండి.నిజమే అయినప్పటికీ, హితమే అయినప్పటికీ ఎదుటివానికి ప్రియం కలిగించనిదైతే చెప్పవద్దు. అంతేగాదు ఒకవేళ ఆ పలికేది ప్రియమైన దయినప్పటికినీ, అసత్యమైతే కూడా చెప్పద్దు" అంటుంది.

మంచిమాట తియ్యగా మాట్లాడటానికి పెద్ద పెద్ద చదువులు అక్కర్లేదు. మంచి మనస్సు కావాలి. సమయస్ఫూర్తి కావాలి. ఎదుటివారి ఔన్నత్యాన్ని గుర్తించి, అసూయలేక సహించేదై ఉండాలి. మనస్సు సత్త్వంతో, సద్భావనలతో నిండి ఉన్నప్పుడు మాటకూడా తేటగా, తియ్యగా వస్తుంది. అందుకే వాల్మీకి మహర్షి రామాయణంలో బాలకాండలో మంచివారి మనస్సును స్వచ్ఛమైన నీటితో పోలుస్తూ 'అకర్దమమిదం తీర్థం రమణీయం ప్రసన్నాంబు సన్మనుష్య మనో యథా' అన్నారు. మంచి మనస్సును బురదలేని, అందమైన, అలల అలజడిలేని నీటితో పోల్చారు. రజోగుణ ప్రభావం లేని మనస్సు, కామక్రోధాదులు అనే బురదలేక, అందంగా, ఆలోచనలనే అలల తాకిడిలేక ప్రశాంతంగా ఉంటుందని అర్థము.

'మాట' గురించి మాట్లాడుకుంటూ 'మనస్సు' ప్రసక్తి ఎందుకూ అంటే 'మాట' పుట్టేది మనస్సులోనే కదా! **'మనః పూర్వం వాక్ ఉత్తరః'** అనేది క్రమం. మనస్సు కరిగి మొదట భావం కదిలితేనే 'మాటల్లో చెప్పాలన్పించేదీ, చెప్పగలిగేదీను.

మనస్సుకు, మాటకు ఉన్న అవినాభావ సంబంధం అంత గొప్పదన్న మాట. మనస్సును కరిగించి, కదిలించేంత సౌందర్యం గాని, సుగుణాలుకాని ఎదుటి వ్యక్తిలో లేవు. ఇక మంచిగా ఎలా మాట్లాడమంటారు అని అంటారా? అపుడు మన మనస్సును పెద్దది చేసుకోవాలి. అంటే, మనలోనే ఔదార్యాన్ని పెంచుకొని ఎదుటి వ్యక్తితో స్నేహంగ మాట్లాడాలన్నమాట!

ఇక మళ్ళీ 'మాట' విషయానికి వస్తే 'నోరు మంచిదైతే ఊరు మంచిదౌతుంది' అంటారు. సంపదలు కలగాలన్నా, మిత్రులు, బంధువులూ ఏర్పడాలన్నా, చివరకు బంధనానికీ, మృత్యువుకూ కూడా మనమాటలే కారణమౌతాయి. అందుకే

**లక్ష్మీర్వసతి జిహ్వాగ్రే, జిహ్వాగ్రే మిత్ర బాధవాః ।**
**బంధనం చైవ జిహ్వాగ్రే, జిహ్వాగ్రే మరణం ధ్రువమ్ ॥**

అంటారు. దీనికి ఉదాహరణగా ఒక కథ ఉంది.

ఒకరాజుగారికి ఒక కల వచ్చింది తన దంతములన్నీ ఊడిపోతున్నట్లు. స్వప్నశాస్త్ర నిష్ణాతులను పిలిచి ఆ కలకి అర్థం చెప్పమన్నారు. అందులో ఒకరు 'మహారాజా! మీదంతములు మీ బంధువులకి చిహ్నము. అవి రాలిపోవుట అంటే త్వరలోనే మీ కంటే మీ బంధువులందరూ చనిపోతారు.' అనగానే కోపంతో ఆ రాజుగారు ఆ పండితునికి వంద కొరడాదెబ్బలను దండనగ విధించారు.

మళ్ళీ వేరొక ప్రాంతం పండితుడిని పిలిపించి స్వప్నసందేశం చెప్పమన్నారు రాజుగారు. గతంలో పండితులకి వంద కొరడాదెబ్బలు విధించిన వైనం తెలిసిన వాడు కనుక, కాస్త ఒళ్ళు దగ్గరపెట్టుకొని, మాటను సరిచేసుకొని అర్థం చెప్పాడట. ఏమని? 'మహారాజా! మీరు మీ బంధువులందరికంటే దీర్ఘాయువుతో చిరంజీవులై వర్ధిల్లుతారు' అని. రాజు పరమానందంతో ఆ పండితుని వంద బంగారు కాసులతో సంభావించి మరీ పంపాడట. చూశారా! ఇద్దరు పండితులూ చెప్పిన స్వప్నసారమొక్కటే! ఉన్నది ఉన్నట్లుగా కుండబద్దలుకొట్టినట్లు చెప్పిన వానికి దండన లభించింది. చెవికింపుగా మధురంగా చెప్పిన రెండవ పండితునికి సత్కారగౌరవాలు దక్కాయి. భావనని వ్యక్తపరచడంలో ఉండే తేడాని మాటలను వాడటంలో ఉండే పద్ధతిని మనం గుర్తించి అలవరచుకోవాలి.

మన మాటలు కూడ సత్యములై, ప్రియములై, హితములై వినేవారి చెవులలో అమృతము చిలికినట్లు మధరములై ఉండాలి. విన్నవారి ఆర్తిని తీర్చగల్గినవై ఉండాలి అని ఆ హయగ్రీవుని ఈ శ్లోకంతో ప్రార్థిద్దాం!

**దిశంతు మే దేవ! సదా త్వదీయాః**
**దయాతరంగానుచరాః కటాక్షాః ।**
**శ్రోత్రేషు పుంసాం అమృతం క్షరంతీం**
**సరస్వతీం సంశ్రిత కామధేనుమ్ ॥**

(సశేషం)

# దివ్యసాకేతంలో వసంతనవరాత్రులు

శ్రీమాన్ రఘుదత్తాచార్యులు - ప్రధానార్చకులు

**శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయర్‌స్వామివారి ప్రత్యక్షపర్యవేక్షణలో మన శ్రీరాంనగర్ దివ్యసాకేత ధామంలో వసంతాగమన సందర్భంగ వసంతోత్సవాలు ఏప్రిల్ 13 నుండి 18 వరకు అత్యంత వైభవంగ జరిగాయి.**

**శ్రీరామ నగరీ దివ్య సాకేత భువిరాజతే ।**
**సీతాలక్ష్మణ సంప్రీత చేతసే నిత్యమంగళమ్ ॥**

నిత్యోత్సవ మాసోత్సవములతో భక్తహృదయ రంజక వైభవంతో అలరారు మన సాకేత రాముడు ఈ నూతన సం॥ వసంత ఉత్సవాలతో మరింతగా భక్తులందరిని తన సౌందర్య లీలా రస వైభవాన ఓలలాడించాడు.

13.04.2011 బుధవారము నాటి సాయంత్రం శ్రీస్వామి వారి మంగళాశాసనముల ద్వారా అంకురారోపణతో ప్రారంభమైంది వసంతోత్సవము. మొదటి రోజు శ్రీమాన్ డా॥ సముద్రాల రంగరామానుజాచార్య స్వామివారి అధ్యక్షతన యాగశాలలో అగ్నిప్రతిష్ఠ కార్యక్రమాలు జరుపుకొని వసంత మంటపంలోకి స్వామి ప్రవేశించాడు. స్వామికి తిరుమంజన సేవలు ప్రారంభమయ్యాయి. పరిమళించు సుగంధ ద్రవ్యాలను సమర్పించి, చలువ చేయు చందన, మంజరి కాప్పులను స్వామికి చేసి తులసీ పుష్పాదులతో అలంకరించి సుజలాలతో సాకేత రాముణ్ణి అభిషేకించారు అర్చకులు.

అర్చామూర్తి యొక్క వైభవాన్ని శ్రీమాన్ డా॥ సముద్రాల రంగరామానుజాచార్య స్వామివారు అనుగ్రహించారు. అంతలోనే దివ్యాభరణ పరిమళ పుష్పమాలా భూషితుడై సీతా లక్ష్మణ సహితుడై సాకేత రాముముడు ఆరాధన లందుకొన సిద్ధమయ్యాడు. గుబాళించు మల్లెలతో సంతసింపజేయు సన్నజాజులతో ఒక్కొక్క నామాన్ని పలుకుతూ స్వామి పాదాలను అర్చించారు స్వాములు. ఇలా ఒకటేమిటి ఆ ఐదు దినాలు పరిమళాల విరులు సంపెంగలు, మరువు గొలుపు మొగలిరేకులు, గారాలు పోవు గులాబీలు, కులుకులొలుకు కలువలు, స్వామి నేత్రసమ సౌందర్యాతిశయం గల తామరలు, చిట్టి చేమంతులు, ఒదిగి ఉండి గుబాళించు మాలతీ, పొగడలు ఒకదాని తరువాత ఒకటి మేము మేమంటూ అమృత ధారలు కురియు స్వామి శ్రీచరణాలను చేరి ఆరాధనకై చేరి, మురిసి మరింత విరిసాయి. ఇన్ని విరుల మధ్య సిరుల రేడు ఆ సీతారాముడు సంబరాలు అంబరాలనంటుతుండగా పచ్చని వసంత మండపంలో, వేసవి తాపాన్ని తొలగిస్తూ చల్లగా తన దివ్య దర్శనాన్ని అనుగ్రహించాడు. ఇదంతా ఒక ఎత్తయితే మనసును ప్రవచనామృతంతో తడుపుతూ తడిసిన మనసును మాధవునికి నెలవుగా మలుచు మన శ్రీశ్రీశ్రీ చిన్నశ్రీమన్నారాయణ రామానుజ జీయర్ స్వామి వారి అనుగ్రహ భాషణల పర్వం ఒకవైపు.

ఎక్కడ చూచినా రాముని అందం. అంతరంగాన ఆనందరాముడు. అందరి నయనాల ఎదుట ఇందరి ఆనందానికి మూలకందమైన అందాల సాకేత రాముడు. ''నాటి ఇక్ష్వాకురాముడు తనతోపాటు ఈ లోకం నుండి అందరిని పరమపదానికి తీసుకువెళితే, పరమపదాన్నే సపరివారంగా ఈ లోకానికి మనకోసం తెచ్చాడు సాకేతరాముడని" శ్రీశ్రీశ్రీ త్రిదండి అహోబిల రామానుజ జీయర్ స్వామివారు అనుగ్రహించారు. కరుణ లొలుకు కులుకుల కొమ్మ సీతమ్మ, శ్రీచరణ సన్నిధియే పెన్నిధియని తలచి కొలుచు లక్ష్మణ, హనుమలతో దాసజన సంత్రాసకుడై, భక్తానంద దర్శన ప్రఫుల్లిత ముఖారవిందుడై సాకేత రాముడు ఈ వసంతోత్సవాలను ఎంతో వైభవంగా జరుపుకున్నాడు. ఇందు అన్వయించిన వారి సౌభాగ్యం సరిలేనిది.

ఇట్టి ఆనందాన్ని పొందలేదని మనం బాధపడనవసరం లేదు. రమింపజేయడం రాముని లక్షణం. అంతులేని సంతోషాన్నివ్వడం ఉత్సవ లక్షణం. మన అందాల సాకేత రాముని 3వ వసంతంలో ద్వితీయ బ్రహ్మోత్సవం ఈ వైశాఖ మాసమందు దివ్యసాకేతంలో ఈ నెల 10.05.2011 నుండి 16.05.2011 వరకు జరుపుకోబోతున్నాము. బహుదూరమని బడలిక పొందక, పనులున్నవని పరాకు చెందక, తప్పక ఈ మహోత్సవంలో అన్వయిద్దాం రండి! **అంతులేని ఆనంద ధామం దివ్యసాకేతం ద్వితీయ బ్రహ్మోత్సవ కార్యక్రమాలకు సాదరంగా ఆహ్వానిస్తున్నాం.**




# ఆముక్తమాల్యద

దక్షిణభారతదేశాన్ని అంతనూ ఒకనాడు ఏకచ్ఛత్రాది పత్యంగా పాలించి సామాన్యులకూ, ధీమాన్యులకూ కూడా ప్రాతఃస్మరణీయ ప్రభువుగా చరిత్రపుటలో నిలిచిపోయినవారు శ్రీకృష్ణదేవరాయులవారు. రాయలవారు వట్టి రాజు కాదు. విద్వాంసుడు, కవి, కళాప్రియుడు, తత్త్వవేత్త, దార్శనికుడు, ఉత్తమ ప్రబంధనిర్మాత, విద్యావల్లభుల పాలిటి కల్పవృక్షం. ఆయన శౌర్యపరాక్రమాలను దానధర్మాలను కవిపండిత పోషణాన్ని కీర్తించారు కవులు.

ఆయన పరిపాలనను చరిత్ర చెబుతుంది. ఆయన లోకజ్ఞతను, వైదుష్యాన్ని, ఉభయ వేదాన్త పరిజ్ఞానాన్ని - ప్రధానంగా ఆయన దర్శనాన్ని, తత్త్వవిచారధారను, ఉపదేశాన్నీ పట్టి యిచ్చేది ఆయన నిబంధించిన ఆంధ్ర ప్రబంధం ఆముక్తమాల్యద.

ఆయన బాల్యంనుంచీ కవి పండితుల చెలిమి కలవారు. తాముగా బహువిద్యల నేర్పరి. భువనవిజయం ఆయన యశఃపతాక. సారస్వతేయులపట్ల వారి మక్కువ చెప్పరానిది. 'మనుచరిత్రంబందుకొనువేళ పురమేగ పల్లకి తనకేల పట్టిన' మహావినీతులాయన.

ఒక గృహమేధి పరిపూర్ణజీవనుడై తాను తరించి తనవల్ల ఒరులు తరించేట్టు మనుగడ సాగిస్తే అదీ బతుకు...! దీనిపై జనావళికి తన పరిష్కారాన్ని సూచించాలి. ప్రభువుగా ఇది తన కర్తవ్యం అనుకున్నారు. పర్యాలోచనం కావించారు.

వారు అప్పటికే పర్యాప్తమైన ఉభయవేదాంత వైదుష్యం కలవారు. భగవద్రామానుజుల శ్రీభాష్యం వారిని బాగా ఆకట్టుకుంది. అన్యోన్య వైరుధ్యం లేకుండా భగవద్రామానుజులు గావించిన సకల శ్రుతి సమన్వయవిధానం వారికి సమీచీన మనిపించింది. జగన్మిథ్యాత్వవాదం ఆయనకు రుచించలేదు. అందులోని అవాస్తవికత అప్రామాణికత ఆయనకు స్పష్టంగా కనవచ్చాయి. వస్తువేదీ నిర్విశేషం కాదు. కాజాలదు, అన్న వాస్తవాన్ని ఆయన గ్రహించారు. భగవంతుడు చిదచిచ్ఛరీరకుడు. చేతనాచేతనాలు ఆయనకు శేషభూతములు. ఆయన శేషి అన్నది ఉపనిషదంతరంగంగా ఆయనకు అవగతమైనది.

బ్రహ్మము అద్వితీయము. నిజమే... అద్వితీయమంటే నిస్సమాభ్యధికము. తనవంటిది కాని, తనకు మించినది కాని మరొకటి లేనిది. అద్వితీయమంటే జీవ ప్రకృతులూ శరీరముగా లేకుండా బ్రహ్మమొక్కటే ఉన్నదని కాదు. బ్రహ్మమువంటి మరో బ్రహ్మము లేదు. రాజు అద్వితీయుడంటే రాజ్యం, రాణి, పిల్లలు మంత్రి, సామంత దండనాథాదులు ఎవరూలేరని, రాజు ఒక్కడే అని అర్థము కానేకాదు. అన్ని ఉంటాయి. రాజూ ఉంటాడు. అయితే అద్వితీయుడు అనే దానికి తాత్పర్యమేమి? నిస్సమాభ్యధికుడు అని. అంటే ఆతనితో సాటి అయినవాడు కానీ అధికుడుగానీ లేనేలేడనే కద.

రాయలవారు ఉపనిషత్తులనన్నిటినీ అనుశీలించినవారు. భగవద్రామానుజుల శ్రీ భాష్యాన్ని చక్కగా అవగాహన చేసుకున్నారు. ఎత్తులనుండి అన్నిటినీ సరిగా చూడగల ఔన్నత్యం కలవారు. చిదచిదీశ్వరులు మూడు తత్త్వాలని, బ్రహ్మమొక్కటే అని అది చిదచిద్విశిష్టముగా భాసిస్తుందని, సత్ - ఆత్మ - బ్రహ్మ ఆది పదాలతో నిరూపింపబడే పరమతత్త్వం శ్రీమన్నారాయణుడే అని, ఆయన సకలశేషి అని చిదచిత్తులు ఆయనకు శేషభూతములని, చిదచిత్తులు ఆయనకు శరీరమని, ఆయన చిదచిచ్ఛరీరుడని, చేతనులకు పరమప్రాప్యమైన పురుషార్థం కైంకర్యమని, అందుకు భగవదనుగ్రహమే కారణమని, దాన్ని పొందటానికి ఆయన ఆజ్ఞారూపాలుగా విలసిల్లుతున్న వేదాశాస్త్రాదులననుసరించి ఆయనకు ప్రీతికరంగా మనుగడ సాగించడమే అనీ గ్రహించినవారాయన.

ఈ విషయాన్ని దృష్టాంత పురస్సరంగా ప్రతిపాదింప దలచుకొని ఆముక్తమాల్యదా ప్రబంధ రచనానికి ఉపక్రమించినా రాయన. ఒక చక్కటి ప్రణాళికనేర్పరుచుకున్నారు. విష్ణుచిత్తులు ఇందులో ప్రధాన పాత్ర. తత్త్వజ్ఞానంతో భగవత్ కైంకర్యం చేసుకుంటూ భాగవతులను సేవించుకొంటూ ఆజ్ఞాకైంకర్యంగా పరతత్త్వ ప్రతిష్ఠాపనం కావించి, అనుష్ఠాన మార్గాన్ని ఉపదేశించి, తులసివనంలో తనకు లభించిన పిల్లను పెంచి పెద్దచేసి రంగనాథునికి అర్పించి తాను ధన్యుడు కావటం ప్రబంధ ప్రధాన ప్రతిపాద్యం.

*(సశేషం)*

- శ్రీరామచంద్రాచార్య



పరమహంస పరివ్రాజకులు

# శ్రీశ్రీశ్రీ చిన్నజీయర్‌స్వామివారి ప్రచారవార్తలు



శ్రీశ్రీశ్రీస్వామివారు మార్చి 30, 31 తేదీలలో సీతానగరంలో వేంచేసి ఉన్నారు. సాయంత్రాలు విజయవాడ సిద్ధార్థ ఆడిటోరియంలో 'ది రోల్ ఆఫ్ ఎ గురు' అనే అంశము పై భక్తులందరి ప్రార్థనపై అత్యద్భుత సందేశాన్ని అనుగ్రహించారు. శ్రీ శ్రీ శ్రీ అహోబిల రామానుజ జీయర్ స్వామి వారు కూడా ఈ కార్యక్రమంలో పాల్గొని, శ్రీవిష్ణు సహస్రనామ పారాయణ అనంతరం, తమ సందేశాన్ని అందించారు. ఈ కార్యక్రమాన్ని విజయవాడ వికాసతరంగిణి వారు ఏర్పాట్లు కావించగా దుర్గగారు, లలితానాగభూషణం గారు సమన్వయకర్తలుగా వ్యవహరించారు.

ఏప్రిల్ 1వ తేదీన సింహాచలక్షేత్రంలో సింహాద్రినాథుని సన్నిధిలో జరిగిన కోటి తులసీపూజా మహోత్సవ పూర్ణాహుతికి వేంచేసారు. మార్గమధ్యంలో వైజాగ్, లక్ష్మీపురం కాలనీలోని శ్రీ వేంకటేశ్వరస్వామి ఆలయాన్ని సందర్శించి, బ్రహ్మోత్సవాలని వైభవంగా జరుపుకోవడమే కాక, ఆలయాన్ని సుందరంగా తీర్చిదిద్దిన కమిటీవారందరికీ మంగళాశాసనాలు చేసారు. అక్కడ చేరిన భక్తులందరికీ ప్రవచనామృతాన్ని అనుగ్రహించారు. అనంతరం మనభక్తినివేదన ఎడిటర్ శ్రీ ఉ.వే. శ్రీమాన్ టి.పి. శ్రీరామచంద్రాచార్యస్వామివారి గృహానికి వేంచేసి వారికి మంగళాశాసనాలు కృపచేసారు.

2వతేదీ ఉదయం సింహాద్రినాథుని సన్నిధిలో కోటి తులసీ పూజా మహోత్సవానికి వేంచేసి చివరి ఆవృత్తి సహస్రనామ పూజ స్వయంగ జరిపించారు. మహాపూర్ణాహుతి అనంతరం అక్కడి అర్చక పరివారానికి, మన వికాసతరంగిణి కార్యకర్తలకి మంగళాశాసనాలు కావించారు. మందసా వాసుదేవపెరుమాళ్ ఆలయకమిటీ సభ్యులతో సమావేశమై ఆలయ ఉన్నతికి తగిన చర్యలను సూచనలను అనుగ్రహించారు. ఈ కార్యక్రమానికి మన జీవా ఛైర్మన్ శ్రీమాన్ రామేశ్వరరావుగారు దంపతులు పాల్గొన్నారు.

3వతేదీ సాయంత్రం సీతానగరంలో వేదవిద్యార్థులందరితో కలసి జపాన్‌లో సునామీ, భూకంప బాధితులకోసం శాంతి ప్రార్థన చేసారు. ఈ శాంతి ప్రార్థనా కార్యక్రమంలో టెలిబ్రిడ్జి ద్వారా వివిధ దేశాలలోని భగవద్బంధువులెందరో కూడా పాల్గొన్నారు. ప్రార్థనానంతరం ఆత్మీయమైన ఓదార్పును కలిగిస్తూ...భౌతికమైన ఇబ్బందులు తట్టుకోవడానికని 25 లక్షల ఆర్థిక సహకారాన్ని అందించాలని శ్రీ స్వామివారు సంకల్పించారు. వెంటనే స్పందించిన భక్తబృందం విరాళాలను సమర్పించారు. రాత్రికి భద్రాచలం చేరారు.

4వ తేదీ ఉగాది సాయంత్రం కూడా జపాన్‌లోని ఆత్మబంధువులకోసం ఆలయంలోని ఆస్థానమండపంలో శ్రీ సీతారాముల సన్నిధానంలో కిక్కిరిసిన భక్తులందరిచే హృదయపూర్వకంగా 'విరాట్ శాంతి ప్రార్థన' చేయించారు శ్రీ శ్రీ శ్రీ స్వామివారు. జపాన్‌లో మరల మరల వస్తున్న భూకంపాల వంటి విపత్తులు తొలగి, ఇంతవరకు వారికేర్పడిన భౌతిక, మానసిక, ఆత్మీయమైన ఇక్కట్ల నుండి వారు తేరుకొని మరల అభివృద్ధిపథంలో ముందుకు సాగాలని పెరుమాళ్ళని ప్రార్థిస్తూ మంగళాశాసనాలు కావించారు శ్రీశ్రీశ్రీ స్వామివారు.

కొత్త సంవత్సరారంభంలో భగవత్సన్నిధానంలో ఆత్మబంధువులకై ఈ శాంతి ప్రార్థన చేయగలగడం భగవంతుడు మనకందించిన ఒక సేవా కైంకర్యమని, ఆర్తుల ఆర్తిని పోగొట్టగలిగే సహృదయం, శక్తి భగవంతుడు సదా అనుగ్రహించాలని అందరికీ మంగళాశాసనాలు చేసారు.

ఈనెల కార్యక్రమాలన్నింటిలోనూ శ్రీస్వామివారితో పాటు శ్రీఅహోబిల రామానుజ జీయర్‌స్వామివారు కూడా అన్వయించారు.

13 వ తేదీ పట్టాభిషేకానంతరం భద్రాచలం నుండి బయలుదేరి శ్రీవారు శ్రీశ్రీశ్రీ అహోబిల జీయర్ స్వామివారితో కలసి సిద్దిపేట వేంచేసారు. 14వ తేదీ స్థానిక వైశ్యసంఘం రామరాజ హనుమద్దీక్షాపరులు ఏర్పాటు చేసుకున్న తదీయారాధన మండపాన్ని ప్రారంభించి సాయంత్రం దివ్య సాకేతరాముని వసంతోత్సవాలకి శ్రీరాంనగరం చేరారు.

## భద్రాచల దివ్య క్షేత్రంలో శ్రీరామసామ్రాజ్య పుష్కర పట్టాభిషేక మహోత్సవములు

జగత్ప్రసిద్ధమైన భద్రాచల దివ్యక్షేత్రంలో జరిగే ఉత్సవాలన్నింటిలో మహత్తమమైన మహోత్సవం 'మహాసామ్రాజ్య పట్టాభిషేక మహోత్సవం'. అది అరవైఏళ్ళకొక్కమారు జరుగుతుంది. సంవత్సర చక్రంలో మొదటి సంవత్సరమైన ప్రతి ప్రభవ నామ సంవత్సరంలో శ్రీరామనవమి మరునాడు ఈ మహోత్సవం అత్యన్త వైభవంగా, సార్వభౌమవర్చస్కంగా జరుగుతుంది. 1987 వ సంవత్సరంలో ఆ మహోత్సవం చారిత్రాత్మకంగా జరిగింది. అరవైఏళ్ళకొక్కమారు అరుదుగా వచ్చే ఆ మహోత్సవాలు అందరూ సేవించుకోవడానికి వీలుగా ఉండాలనే సంకల్పంతో ప్రతి పన్నెండేళ్ళకొక్కమారు 'సామ్రాజ్య పట్టాభిషేక మహోత్సవాల' పేరిట నిర్వహించడం జరుగుతుంది. ఆ క్రమంలో 1999 సంవత్సరంలో ప్రథమ పుష్కరపట్టాభిషేకోత్సవాలను నిర్వహించడం జరిగింది. ఇది ద్వితీయ పుష్కరం అంటే 24 వ సంవత్సరమన్నమాట.! ఇది గాయత్రీ మంత్రాక్షరాలకు, శ్రీరామాయణ శ్లోక సహస్రాలకు, భక్తరామదాసుగారు రచించిన శ్రీరామాయణ చూర్ణికలకు ఈ 24 సంఖ్య సంబద్ధం కావడంతో ఈ సామ్రాజ్య పుష్కర పట్టాభిషేకోత్సవాలను విశేష వైభవంతో చేయాలని దేవస్థానం సంకల్పించుకొని ఆ మహోత్సవాలకు ఆధ్వర్యవాన్ని వహించవలసినదిగా మన స్వామివారిని ప్రార్థించడం జరిగింది. వారి ఆజ్ఞానుసారం నవాహ్నిక దీక్షగా ఐదు హోమకుండములలో చతుర్వేద మంత్ర హోమములు, శ్రీరామాయణ సంపూర్ణ హవనము. వీటికి అనుగుణంగా భక్తుల అభీష్టాలు నెరవేరే విధంగా ఐదు రకాల ఇష్టి కార్యక్రమాలతో ఇంతకుముందెన్నడూ భద్రాద్రిలో జరుగని పద్ధతిలో పుష్కర పట్టాభిషేకాలకు ప్రణాళికను సిద్ధం చేసారు. ఆ విధంగా ఉగాది నాటి నుండి 10 రోజుల పాటు 'నవాహ్నిక పంచకుండాత్మక పంచేష్టి సహిత చతుర్వేద హవన పురస్కృత శ్రీ రామాయణ మహాక్రతువు'నకు భద్రాచల క్షేత్రం సంసిద్ధమైంది. పండుగ నాటి నుండి పది రోజులపాటు శ్రీ స్వామివారు సపరివారంగా భద్రాద్రిలో ఉండడానికి ఆమోదించడంతో దేవస్థానం వారి ఆనందానికి అవధుల్లేవు. అష్టోత్తర శత శ్రీరామమహాక్రతు నిర్వాహక పీఠాధిపతులైన శ్రీ స్వామివారి ఆధ్వర్యవంలో జరుగనున్న శ్రీరామాయణ మహాక్రతువు వల్ల భద్రాచల క్షేత్ర సర్వతోముఖాభివృద్ధితో పాటు, రాష్ట్ర సంక్షేమం, దేశ సౌభాగ్యాలు సమకూరి లోక కళ్యాణ దాయకంగా ఈ మహోత్సవాలు జరిగేటట్లుగా దేవస్థానం వారు పూర్వరంగాన్ని సిద్ధం చేశారు.

అర్చక పరాధీన సకలాత్మవృత్తి అయిన స్వామిలా స్వామివారు కూడ దేవస్థానం వారు కోరినట్లు ఏప్రియల్ 3 వ తేది నాడు సీతానగరం ఆశ్రమం నుండి భద్రాచలానికి ప్రయాణమైనారు. భద్రాద్రికి చేరేటప్పటికి అర్ధరాత్రి 2 గంటలైంది. తెల్లవారుఝామునుండి ఉత్సవాల సంరంభం మొదలైంది.

ముందుగా వైకుంఠద్వార మండపంలో శ్రీ స్వామివారి పెరుమాళ్ళకు తిరువారాధన, సేవాకాలం కార్యక్రమాలు జరిగాయి. అదే మండపంలో ఉత్సవాల నిర్విఘ్న పరిసమాప్తిని కాంక్షిస్తూ విష్వక్సేన పూజ, పుణ్యాహవాచనం కార్యక్రమాలు జరిగాయి. ఖరనామ సంవత్సరాదిని పురస్కరించుకొని శ్రీ స్వామివారు పంచాంగ పఠనం చేశారు. కాలాత్మకుడైన పరమాత్ముని మహిమను 'ఖర' అనే సంవత్సరనామం యొక్క వైశిష్ట్యాన్ని, సంవత్సర ఫలాలను శ్రీ స్వామివారు శ్రుతిసుభగంగా ప్రవచించగ శ్రవణం చేసిన భద్రాద్రి వాసులు ఆనందతరంగితులయ్యారు. ఈ కార్యక్రమం సాగుతుండగానే మహా క్రతు యాగశాల వద్ద పర్యగ్నీకరణం మొదలైన కార్యక్రమాలు పూర్తయ్యాయి. సరిగ్గా 9 గంటలకు యాగశాల ముందు శ్రీ స్వామివారు 'ఓంకారరామధ్వజాన్ని' ఆవిష్కరించారు. ఉగాదినాడు ప్రతి గృహంపై ఓంకార ధ్వజాన్ని ఎగురవేసుకోవాలని ధర్మశాస్త్రం. అంతే గాక శ్రీరాముని పట్టాభిషేకాన్ని పురస్కరించుకొని ఆనాటి అయోధ్యావాసులంతా తమతమ గృహాలపై ధ్వజాలను ఆనందోత్సాహసూచకాలుగా ఎగురవేసినట్లు వాల్మీకి రామాయణం ద్వారా తెలుస్తుంది. ఆ రెండు ప్రమాణాలను దృష్టిలో ఉంచుకొని రూపుదిద్దుకున్న ఆ ధ్వజాన్ని శ్రీ స్వామివారు ఎగురవేసిన 24 నిమిషాలలోపుగా భద్రాచల క్షేత్రవాసులంతా వాటిని తమతమ గృహాలపై ఎగురవేసారు. సుమారు 2,400 ధ్వజాలు ఒక్కసారిగా భద్రాద్రి గగనతలంపై రెపరెపలాడాయి. ప్రతి ఉగాది నాడు ఇదే విధంగా ఓంకారరామధ్వజాలు ప్రతి ఊరిలో ఎగురవేసే ఆచారానికి ఇది నాంది కావాలని దేవస్థానం సంకల్పించింది. శ్రీస్వామివారి శ్రీ హస్తాలద్వారా పునఃప్రారంభమైన ఈ ఆచారం ప్రతి ఏటా ప్రతి ఊరూరా జరగాలని ఆశిద్దాం.!

ఇది కాగానే వైకుంఠమండపంలో రక్షాబంధనం, ఋత్విగ్వరణం జరిగాయి. ముందుగా దేవస్థానం తరపున శ్రీ శ్రీ శ్రీ స్వామివారికి , శ్రీ అహోబిల జీయర్ స్వామివారికి దీక్షావస్త్రాలను సమర్పించారు. ఈ మహాక్రతువులో మొత్తం 135 మంది ఋత్విక్కులు పాల్గొన్నారు. వారందరికి దీక్షా వస్త్రాలను మన జె. రామేశ్వరరావుగారు సమర్పింపజేసారు. అందరికీ శ్రీరామాయణకోశాలను ఇతర పూజా సామాగ్రిని శ్రీలతా భూపాల్‌రెడ్డిగారు స్వయంగా సమర్పించారు. ఈ కార్యక్రమానికి మరింత వన్నె సమకూరేలా వచ్చిన మన శంషాబాద్ విద్యార్థులందరికీ శ్రీ స్వామివారు స్వయంగా నూతన వస్త్రాలను ప్రసాదించారు.

తదనంతరం శ్రీ స్వామివారు సపరివారంగా ఆలయ శఠారి మర్యాదలను స్వీకరించి భద్రాచల సీతారామచంద్ర మహాప్రభువును సేవించుకున్నారు. ఆ ముగ్ధ మోహనరూపుడైన రాముని సేవిస్తూ మన స్వామి పరవశించిన తీరు ప్రత్యక్షంగా సేవించి తరించవలసినదే.!

ఉగాది సాయన్త్రం 6 గంటలకు దర్బార్ సేవ కాగానే ఆలయ సంప్రదాయాన్ని అనుసరించి పంచాంగ శ్రవణం జరిగింది. శ్రీ స్వామివారు అదే సమయంలో జపాన్ భూకంపబాధితుల గురించి 'విరాట్ ప్రార్థన' చేయించారు. హృదయవిదారకమైన ఆ స్థితిలో ఉన్న జపాన్ దేశానికి మన జెట్ సంస్థల తరపున ... లక్షల రూపాయలను సహాయంగా ప్రకటించారు. స్థానిక వికాసతరంగిణులు కూడా సహాయాన్ని ప్రకటించాయి. దేవస్థానం 24 వేల రూ॥లు జపాన్‌కు సహాయంగా ప్రకటించింది.

శ్రీ స్వామివారి 'ఉగాదిసందేశం' అనుగ్రహించారు. అదే సమయంలో 'భక్తరామదాసుగారి సంగీతసేవ'గా ప్రముఖ వయొలిన్ విద్వాంసులు శ్రీ అన్నవరపు రామస్వామి వారి బృందం ద్వారా సంగీతకచేరి జరిగింది.

వైకుంఠమండపం వద్ద శ్రీ రామాయణమహాక్రతువునకు సంబంధించిన అంకురారోపణం కార్యక్రమం విధిగా జరిగింది. శ్రీ స్వామివారు పెరుమాళ్ళను సేవించుకుని రంగనాయకులగుట్టపై గల 'శ్రీచక్రం' (స్వామివారి కుటీరం) నకు చేరుకున్నారు.

5వ తేదీ ఉదయం వైకుంఠమండపం వద్ద శ్రీ స్వామివారి పెరుమాళ్ళకు తిరువారాధన, సేవాకాలంకాగానే మహాక్రతువునకు ముఖ్యాంగమైన 'అగ్నిమథనం' కార్యక్రమం జరిగింది. ఆ కార్యక్రమం అవుతుండగానే శ్రీ స్వామివారు విజయనగరం వికాసతరంగిణి వారు శ్రీ రామాయణంలోని ప్రతి కాండకు ఒక్కొక్కసర్గను (ప్రధాన) ఎన్నిక చేసి అలా 7 సర్గలతోను బాలరామాయణం సర్గతోను కలిపి 8 సర్గలతో రూపొందించిన 'శ్రీరామసేవ' పుస్తకం గురించి వివరించి సర్గ పారాయణను ప్రారంభించారు. దానితో పాటు అందరూ 108 సార్లు 'శ్రీరామ' నామాన్ని లిఖించేటట్లుగా అందరికి కార్డులను పంచి శ్రీ స్వామివారు స్వయంగా వ్రాస్తూ అందరి చేత శ్రీరామకోటిని వ్రాయించారు. ఈ కార్యక్రమాల్లో అశేష భక్తజనం పాల్గొన్నారు. అగ్ని మథనంలో భద్రాద్రిరాముని

ఉత్సవమూర్తుల సన్నిధిలో , జగదాచార్యుల సమక్షంలో పదినిమిషాలలోనే ప్రజ్వలిస్తూ ఆవిర్భవించిన అగ్ని భట్టారకుని యాగశాలలోకి ప్రవేశింపజేసి శ్రీరామాయణ మహాక్రతువును ప్రారంభించారు.

ప్రతిరోజు యాగశాలలో 7 గంటలకు తిరువారాధన, తీర్థగోష్ఠి కార్యక్రమాలు ఆగ్నేయకుండంలో శ్రీరామాయణ హవనం సాగుతుండగా మిగిలిన నాల్గు కుండాలలో ప్రాచ్యాది క్రమంలో ఋగ్వేదాది చతుర్వేద మంత్ర హోమాలు జరిగాయి. ప్రతి కుండంలోనూ ముందుగా శ్రీరామషడక్షరీమంత్ర హోమం 24 వేలు జరిగింది. ఇదే విధంగా సాయంకాలం 6 గంటల నుండి 9 గంటల వరకు యాగశాల కార్యక్రమాలు జరిగాయి. ప్రతిరోజు మధ్యాహ్నం 12-30 నిమిషాల వరకు నిత్య పూర్ణాహుతి. రాత్రి 9 గంటలకు పూర్ణాహుతి.

ఇలా ప్రతిరోజు యాగశాలలో కార్యక్రమాలు జరుగుతుండగా వైకుంఠమండపం వేదికపై శ్రీ స్వామివారి ద్వారా శ్రీరామసేవ పారాయణం, 108 నామాల శ్రీరామకోటి లేఖనం, శ్రీస్వామివారి అనుగ్రహభాషణాలు జరిగాయి. 5వ తేదీ నాటి ఈ కార్యక్రమాలలో జిల్లా మంత్రివర్యులు శ్రీమాన్ రాంరెడ్డి వెంకటరెడ్డి దంపతులు, మాజీ హోంమంత్రి శ్రీమాన్ జానారెడ్డి దంపతులు, మాజీ మంత్రి శ్రీమాన్ వనమా వేంకటేశ్వరరావు, స్థానిక యమ్.యల్.ఎ కుంజా సత్యవతి, జిల్లా కలెక్టర్, యస్.పి, ప్రభృతులంతా శ్రీరామనామ లేఖనంలో పాల్గొని శ్రీ స్వామివారి కృపకు పాత్రులయ్యారు. అదే సమయంలో శ్రీ చక్ర సిమెంట్స్ అధినేత శ్రీ యన్. కృష్ణమోహన్ గారి సౌజన్యంతో రూపుదిద్దుకున్న శ్రీ భద్రాద్రి రామ స్తోత్రమంజరి పుస్తకాన్ని శ్రీ స్వామివారు ఆవిష్కరించి మంత్రులకు, అధికారులకు అనుగ్రహించారు. ప్రత్యేకంగా భద్రాద్రిరామునిపై ఏర్పడిన స్తోత్రసంకలనమైన ఆ పుస్తకాన్ని అందరికి వితరణ చేయడం జరిగింది. ప్రతిరోజు సాయంకాలం 6 గంటలకు వైకుంఠ మండపం వేదికపై సామూహిక విష్ణుసహస్రనామ స్తోత్రపారాయణము, తదనంతరం ప్రసిద్ధ విద్వాంసులచే ప్రవచనం, శ్రీస్వామివారి అనుగ్రహభాషణం జరిగాయి.

5వ తేది సాయంత్రం ప్రారంభోపన్యాసంగా శ్రీశ్రీశ్రీ అహోబిల రామానుజ జీయర్ స్వామివారు 'శ్రీరామాయణ ఆవిర్భావం' గురించి అద్భుతంగా ప్రవచనం చేసారు.

6వ నుండి 10వ తేదీ వరకు ఐదురోజులపాటు వైకుంఠమండపమే ఇష్టిశాలగ ఐదురకాల ఇష్టిహోమాలు జరిగాయి. 6వ తేదీ సకల విజయప్రాప్తికై విష్వక్సేన ఇష్టి, 7వ తేదీ సకల విద్యాప్రాప్తికై శ్రీ హయగ్రీవ ఇష్టి, 8వ తేదీ సకల ఐశ్వర్యప్రాప్తికై శ్రీలక్ష్మీనారాయణేష్టి, 9వ తేదీ సకల బాధా నివృత్తికై శ్రీ సుదర్శనేష్టి 10వ తేదీ సత్సంతానప్రాప్తికై వైనతేయేష్టి హోమాలు జరిగాయి. ఈ హోమకార్యక్రమాల్లో శ్రీస్వామివారు వేంచేసియుండి ఆయా ఇష్టి వైభవం గురించి ప్రవచనం చేసారు.

8వ తేదీ ఇష్టితోపాటు శ్రీస్వామివారు సామూహిక శ్రీలక్ష్మీపూజలు చేయించారు. 9వ తేదీ ఉదయం ఇష్టికార్యక్రమం జరుగుతుండగానే స్థానిక చిత్రకూటమండపంలో శ్రీస్వామివారు సమాశ్రయణములు నిర్వహించారు. సుమారు 150మంది ఆర్తులు శ్రీస్వామివారి ద్వారా మంత్రోపదేశాలను పొంది ధన్యులైనారు.

8వ తేదీ ఉదయం 8గం॥ సన్నిధిలోని నిత్యయాగశాలనుండి చతుస్సముద్ర జల కలశాలను, 12 పుష్కరనదీ జలకలశాలను, వేంకటాద్రి తీర్థకలశాలను మొత్తం 18 కలశాలతో ఊరేగింపుగ గిరి ప్రదక్షిణం చేస్తూ మహాక్రతు యాగశాలకు చేర్చడం జరిగింది. ఈ తిరువీధిలో శ్రీస్వామివారు కావేరీనదీ కలశాన్ని, శ్రీ అహోబిల రామానుజ జీయర్‌స్వామివారు గోదావరినదీ కలశాన్ని ధరించి, ఈ 'తీర్థయాత్ర'ను సుసంపన్నం చేసారు.

ఈనాటినుండి సన్నిధిలో బ్రహ్మోత్సవాలు ప్రారంభమైనాయి. ఈనాటి సాయంత్రం స్థానిక గోవిందరాజ స్వామి సన్నిధిలో మృత్సంగ్రహణం జరిపించి, సన్నిధి యాగశాలలో అంకురారోపణ కార్యాన్ని అర్చకులు నిర్వహించారు. ఈ సంవత్సరం భద్రాద్రిలో రెండు నవాహ్నిక దీక్షలు సమ్మిళితమై వసంతపక్షోత్సవాలు జరగడం విశేషం. ఉగాదినాటినుండి (4.4.2011) పట్టాభిషేకం (13.4.2011) వరకు ఒక నవాహ్నిక దీక్షతో శ్రీరామాయణ మహాక్రతువు జరుగుతుండగ, ధ్వజారోహణ 10.4.2011 నుండి పూర్ణిమ 18.4.2011 వరకు, మరో నవాహ్నికదీక్షతో బ్రహ్మోత్సవాలు జరుగుతున్నాయి. ఈ బ్రహ్మోత్సవాలలో భాగంగ 9వ తేదీ సాయంత్రం ధ్వజార్చన, ధ్వజప్రతిష్ఠ కార్యక్రమాలు స్థానిక చిత్రకూటమండపంలో ఘనంగ జరిగాయి. ఈనాటి ఈ కార్యక్రమం భద్రాచలం శ్రీ జీయర్‌మఠం ద్వారా శ్రీస్వామివారే ప్రతీ ఏడాదీ నిర్వర్తిస్తున్నారు. ప్రతి ఏడాదీ ఈ ఉత్సవం మన మఠంలోనే జరిగి, మన మఠం నుండే ఈ గరుడధ్వజం ఊరేగింపుగ సన్నిధికి చేరుతుంది. అయితే ఈ సంవత్సరం మన జీయర్‌మఠం నిర్మాణదశలో ఉన్నందున ఈ ఉత్సవాన్ని చిత్రకూట మండపంలోనే జరిపించుకున్నాం. సుమారు 14 సం॥లుగ మన మఠంలోనే జరుగుతున్న ఈ ఉత్సవం మరోచోట జరగడం కొంచెం వెలితిగ ఉన్నా, ఈ సంవత్సరం శ్రీస్వామివారే స్వయంగ ఉండి మన మఠం యొక్క వార్షిక కైంకర్యంగ ఈ సేవను జరిపించడం విశేషం.

శ్రీస్వామివారు ఈ ఉత్సవాన్ని దగ్గర ఉండి జరిపించి, బ్రహ్మోత్సవ యాజ్ఞికులందరికీ దీక్షావస్త్రాలను, తులసిమాలను, సంభావనలను ప్రసాదించారు.

ప్రతిష్ఠావిధి పూర్తికాగానే దాని ఊరేగింపుగ నిత్యయాగశాలలకు చేర్చి, స్వామివారు వైకుంఠమడప వేదికను చేరుకున్నారు. ఆనాటి సాయంత్రం మన ఉభయవేదాంతాచార్యపీఠం కార్యదర్శి శ్రీమాన్ ఉ.వే. సముద్రాల రంగరామానుజాచార్యస్వామివారి ప్రవచనం, శ్రీరామాయణం- ఉక్తి వైచిత్రి అనే అశంపై గంభీరంగ సాగింది. ఇదే పద్ధతిలో 6వ తేదీ శ్రీశలాక రఘునాథశర్మగారు గురుభక్తి అనే అంశంపై, శ్రీ దోర్బలప్రభాకరశర్మగారు 7వ తేదీ శ్రీరామాయణం భ్రాతృప్రేమ అనే అంశంపై, 8వ తేదీ శ్రీ వాసుదేవ ఆత్రేయస్వామి (నేపాల్) వారిచే మరియు కోదండ రామాచార్యుల వారిచే ఆంజనేయ వైభవము అనే అంశంపై ప్రవచనాలు జరిగాయి. 10వ తేదీ ఉదయం వేదికవద్ద శ్రీస్వామివారు శ్రీరామసేవ శ్రీరామనామ లేఖనం నిర్వహించి, ఇష్టిని ప్రారంభించి, సన్నిధిలో జరిగే బ్రహ్మోత్సవాంగ ధ్వజారోహణ కార్యక్రమంలో అన్వయించారు. ఆనాటి సాయంత్రం అందరిచే సామూహిక శ్రీరామపూజను నిర్వహించారు.

11వ తేదీ ఉదయం నిత్యకార్యక్రమాలతో పాటు విశేషంగ భద్రాద్రిరాముని కళ్యాణమూర్తులకు 108కలశములతో ఉత్సవాంగ స్నపనాన్ని నిర్వహించారు. శ్రీస్వామివారి పర్యవేక్షణలో జరిగిన ఈ ఉత్సవంలో అశేషభక్తజనం పాల్గొన్నారు. సాయంత్రం వైకుంఠ మండపం వద్దనే శ్రీ సీతారాముల ఎదుర్కోలు మహోత్సవం కన్నుల పండుగగ వీనులవిందుగ జరిగింది. శ్రీరాములవారి పక్షంలో శ్రీస్వామివారు, మరియు ఆస్థానపండితులు, సీతమ్మవారి పక్షంలో శ్రీఅహోబిలరామానుజ జీయర్‌స్వామివారు, మరియు ఆస్థాన పండితులు పాల్గొని, వీనులవిందైన వ్యాఖ్యలతో శ్రీరాముని ప్రాభవాన్ని, సీతమ్మతల్లి వైభవాన్ని ప్రకటిస్తూ, ప్రవచిస్తూ ఎదుర్కోలు నిర్వహించారు. ఈ సాయంత్రం ప్రత్యేకరథంలో పట్టాభిషేకంలో సమర్పించబడే శ్రీరామ పాదుకలను ఊరేగించడం జరిగింది. ఈ సేవలో శ్రీ స్వామివారు కూడ రథంమీదనే ఉండి, చామరాన్ని వీస్తూ పాల్గొన్నారు. అనంతరం తిరువీధిలో హనుమద్వాహనాన్ని మోస్తూ శ్రీస్వామివారు, శ్రీఅహోబిల రామానుజ జీయర్‌స్వామివారు వయ్యారినడకలను చూపిస్తూ సేవలు చేయించారు. ఈ సంఘటన భద్రాద్రివాసులలో చెరగని ఆనందముద్రను వేసింది.

12వ తేదీ శ్రీసీతారాముల కళ్యాణమహోత్సవం శ్రీరామనవమి పర్వదినం. శ్రీస్వామివారు తమ కుటీరంలోనే ఆరాధనాదులు ముగించుకొని, 7గం॥లకు

మూలమూర్తుల సన్నిధికి చేరారు. మూలమూర్తుల సన్నిధిలో మన స్వామివారి ఆరాధన మూర్తులకు తిరుక్కళ్యాణ మహోత్సవం జరిగింది. ధ్రువమూర్తులతోపాటే మన శ్రీస్వామివారి మూర్తులకు కూడా శ్రీస్వామివారే ప్రత్యేకంగ ముత్యాల తలంబ్రాలను పోసి, కళ్యాణ వైభవాన్ని ఇనుమడింపచేసారు.

అనంతరం తిరువీధిగ ఉత్సవకళ్యాణ మూర్తులతో పాటు, శ్రీస్వామివారు క్రతు యాగశాలకు చేరి, అక్కడ నిత్యపూర్ణాహుతిలో పాల్గొన్నారు. తదుపరి మహాసంరంభంగ కళ్యాణమండపానికి చేరుకున్నారు.

శ్రీరామనవమి కళ్యాణమండపంలో ఉత్సవమూర్తులతో పాటు, "త్రిదండరాముడై" ఆసీనులై, కళ్యాణప్రాశస్త్యాన్ని మధ్యమధ్య మృదు మధురంగ వ్యాఖ్యానిస్తూ, సీతారాముల దాంపత్యవైభవాన్ని హృదయ ఫలకాలపై ప్రతిష్ఠించారు. కనీవినీ ఎరుగని రీతిలో కళ్యాణమహోత్సవం శ్రీస్వామివారి ఆధ్వర్యంలో అపూర్వవైభవంతో జరిగింది. ఈ కళ్యాణ మహోత్సవానికై శ్రీ స్వామివారు, శ్రీఅహోబిల రామానుజ జీయర్‌స్వామివారి శ్రీకరాలమీదుగ 15కిలోల మంచి ముత్యాలను సమర్పించారు. ఆ స్వాములిద్దరు సీతారాములపై ముత్యాల తలంబ్రాలను పోసే సన్నివేశం అనిర్వచనీయ శోభస్కరంగ జరిగింది.

కళ్యాణ మహోత్సవంలో అన్వయించిన రాష్ట్రముఖ్యమంత్రి గౌ॥కిరణ్‌కుమార్‌రెడ్డి దంపతులు శ్రీస్వామివారి మంగళాశాసనాలు పొంది, ధన్యులైనారు. అదేవిధంగ వివిధశాఖల మంత్రులు, అధికారులు, టి.టి.డి స్పెసిఫైడ్ అథారిటీ అధ్యక్షులు శ్రీసత్యన్నారాయణ దంపతులు, రెవెన్యూ ప్రధానకార్యదర్శి శ్రీరమణాచారి - ఐ.ఎ.యస్‌గారు, ఈ.ఓ. భద్రాచలం దేవస్థానం చంద్రశేఖర ఆజాద్ ప్రభృతులు శ్రీస్వామివారి చేతులమీదుగ కళ్యాణాక్షతలను, మంగళాశాసనాలు పొంది సంతుష్టాంతరంగులైనారు.

12 వ తేదీ రాత్రి పూర్ణాహుతిలో శ్రీ స్వామివారు అన్వయించారు. 13 వ తేది శ్రీరామచంద్రపుష్కర పట్టాభిషేక మహోత్సవ సుదినం..

నవాహ్నిక దీక్షతో అపూర్వంగా - అద్భుతంగా జరుగుతున్న శ్రీరామాయణం మహాక్రతువు యొక్క మహా పూర్ణాహుతి దినం.

శ్రీ స్వామివారు చివరి హోమ కార్యక్రమాన్ని స్వయంగా నిర్వర్తింపజేసి సరిగ్గా 9 గంటలకు మహాపూర్ణాహుతిని నిర్వర్తింపజేసారు. తదుపరి స్వాములంతా కలశాలను, ఇతర పూజా సామగ్రిని చేబూని పట్టాభిషేక మండపానికి వేంచేశారు.

శ్రీ స్వామివారు శ్రీరామపాదుకలను శిరసాధరించి శ్రీఅహోబిల రామానుజ జీయర్‌స్వామివారు, ఇతర స్వాములతో పాటు సకలమహారాజలాంఛన లాంఛితంగా వేద-మంగళవాద్యఘోషల నడుమ మండపానికి వేంచేశారు.

వసిష్ఠస్థానంలో స్వామివారు వేంచేసియుండి పట్టాభిషేకాన్ని ప్రారంభించారు. ఆగమోక్తమైన పద్ధతిలో పూజా కార్యక్రమాలు జరిగాయి. చతుస్సముద్రపుష్కరనదీ, నదతీర్థకలశాలను సప్తదశకలశస్నపన పద్ధతిలో ఆసాదన చేశారు. పట్టాభిషేకాత్మకంగా స్వామికి సమర్పించే స్వర్ణపాదుక, రాజదండ, రాజముద్రిక, స్వర్ణఛత్ర, వజ్ర కిరీటములను ప్రత్యేక మండలంగా ఆసాదన చేసి ఆరాధించారు. వాల్మీకి స్థానంలో శ్రీఅహోబిల రామానుజ జీయర్‌స్వామిని నియంత్రించి పట్టాభిషేక సర్గ పారాయణమును జరిపించారు. శ్రీ స్వామివారే స్వయంగా పట్టాభిషేక ప్రాశస్త్యాన్ని వివరిస్తుంటే

న భూతో న భవిష్యతి అన్నట్లు సార్వభౌమ వర్చస్కంగ దివ్యవైభవ సనాథంగ జరిగిన ఆ పట్టాభిషేకాన్ని జరిగిన వర్ణించడం అసాధ్యం. అనిర్వచనీయమైన వైభవంతో వాచామగోచరమైన ప్రాభవంతో శ్రీస్వామివారి మధురమనోజ్ఞమైన పట్టాభిషేక ప్రత్యక్ష వ్యాఖ్యానంతో శ్రీశ్రీరామసామ్రాజ్య పుష్కర పట్టాభిషేక మహోత్సవం అపూర్వంగ జరిగింది. ఒకొక్క ఉపచారంతో ఒకొక్క వస్తువును స్వామికి సమర్పించే విధానం, దానిపై శ్రీస్వామివారి వ్యాఖ్యానం సేవించినవారిదే భాగ్యం. ఈ మహోత్సవానికి ముఖ్య అతిథిగ రాష్ట్ర గవర్నర్ శ్రీ నరసింహన్ దంపతులు సంప్రదాయ దుస్తులతో విచ్చేసి, ఆసాంతం సేవించారు. 12 ఏళ్ళకు ఒక్కమారు అరుదుగ జరిగే ఈ మహోత్సవాన్ని భక్తులు ఒళ్ళంతా కళ్ళుచేసుకొని సేవించారు.

పట్టాభిషేకంలో కిరీటధారణ కాగానే సామ్రాజ్య అభిషేక మంత్రాలతో ప్రోక్షణ కాగానే శ్రీస్వామివారే స్వయంగ అభిషేక తీర్థాన్ని అందరిపై ప్రోక్షించారు. భద్రాద్రిరాముని దివ్యానుగ్రహం, శ్రీశ్రీశ్రీ స్వామివారి మంగళాశాసనములు అమృతవృష్టిగ కురిసిన ఆ మహోత్సవ వైభవం వర్ణనాతీతం.

శ్రీస్వామివారు భద్రాద్రివాసుల వీడ్కోలును చిరునవ్వుతో స్వీకరిస్తూ భాగ్యనగరంవైపు పయనమయ్యారు.

## శ్రీశ్రీశ్రీ స్వామివారి పర్యటన వివరాలు

**మే**

1. గుంటూరు
2,3 సీతానగరంలో ఉభయవేదాంతసభలు
4. విశాఖపట్నం వారిజ
5. ఋషికొండ వద్ద సాఫ్ట్‌వేర్ కంపెనీ ప్రారంభం
సా॥ విజయనగరంవద్ద గరివిడి సత్రయాగాన్ని సందర్శిస్తారు
6. ముష్టికుంట్ల, తిరువూరు మండలం, రామానుజుల వారి సన్నిధి ప్రతిష్ఠ. రాత్రికి వరంగల్‌జిల్లా, మానుకోట చేరతారు.
7. భగవద్రామానుజులవారి 995వ తిరునక్షత్ర మహోత్సవం
హిందీ భక్తినివేదన ఆవిష్కరణ : డా॥ శ్రీమాన్ ఎన్.వి. రంగరామానుజాచార్యస్వామి వారు వారి తండ్రిగారి పేరున సమర్పించే "ఆచార్యవరివస్య" పురస్కార సభలో పాల్గొంటారు. రాత్రికి కోమటిపల్లి గ్రామానికి చేరుతారు.
8. శ్రీ లక్ష్మీనారాయణ ఆలయ ప్రతిష్ఠా మహోత్సవంలో పాల్గొంటారు. పర్వతపురం, బ్రహ్మోత్సవాలలో పాల్గొని రాత్రికి జీవా, శ్రీరామ నగరం చేరుతారు.
10- 16 వరకు దివ్యసాకేత ద్వితీయ బ్రహ్మోత్సవాలలో పాల్గొంటారు.
13. సౌభాగ్య కాలనీలో శ్రీ వేంకటేశ్వరాలయంలో ప్రతిష్ఠ.
22. గుంటూరుజిల్లా, ఉప్పరపాలెం శ్రీ వేంకటేశ్వరస్వామివారి ఆలయ ప్రతిష్ఠ
23. సీతానగర ఆశ్రమంలో ఉపనయనం.
రాత్రికి హైదరాబాద్ మీదుగ ఢిల్లీ - హృషీకేశ్ ప్రయాణం.
24 - 27 వరకు హృషీకేశ్, జీయర్‌మఠంలో శ్రీసీతారామ సమేత హనుమత్ప్రతిష్ఠ.
28. బదరీకి చేరతారు.
30. సమాశ్రయణాలు

**జూన్**

1. తిరుగు ప్రయాణం
3. రాత్రికి వైజాగ్ చేరతారు.
4. మత్స్యకారుల కార్యక్రమం
5. వైభవ వేంకటేశ్వరస్వామి గోపుర ప్రతిష్ఠ. రాత్రికి శ్రీకాకుళం రొట్టవలస చేరతారు.
6. రొట్టవలసలో రామాలయ ప్రతిష్ఠ
7. హైదరాబాద్
8. శ్రీమాన్ జె. రామేశ్వరరావుగారి నూతన గృహప్రవేశం
రాత్రికి అమెరికా ప్రయాణం

# మెదడుకి మేత!

భగవద్బంధువులారా! జిజ్ఞాసతో మీరంతా చదువుతూ ఆదరిస్తున్న 'భక్తినివేదన'లో మీకోసం ఈ శీర్షిక! ఈ పత్రికలోని వ్యాసాలనుండే మీకు ప్రశ్నలిస్తున్నాం! మీరు శ్రద్ధతో చదువుతారని తెలుసును. అయినా మరొక్కసారి జ్ఞాపకం చేసుకోవడం మనస్సుకి ఆనందమని మెదడుకీ చిన్న మేత! అన్నీ సరిగా వ్రాస్తే ఆకర్షణీయ బహుమతులు! అందుకోండి ఇక ఆలస్యమెందుకు? ప్రతి నెల 15వ తేదీలోపు మాకందిన సమాధానాలని మాత్రమే పరిశీలిస్తాం! ఆ పై దాటివచ్చినవి పరిశీలింపబడవు. దీనిపై ఎలాంటి ఉత్తరప్రత్యుత్తరాలు ఉండవు.

| ప్రశ్నలు | సమాధానాలు |
|---|---|
| 1.'ప్రమాణము' అనగా...... | |
| 2. వేదము ......... ప్రమాణము. | |
| 3. మానవునికి పుట్టుకతో వచ్చే ఋణాలు...... | |
| 4. 'య ఏవం వేద' అనగా....... | |
| 5. వేదశబ్దము మూలధాతువు..... | |
| 6. 'ఆళ్వార్' అనగా.... | |
| 7.కలియుగంలో ఆవిర్భవించిన ఆళ్వార్లెందరు? | |
| 8. భక్తి అనగా... | |
| 9. ఋషి అనగా... | |
| 10. ద్రావిడవేదానికి 'ఓం'కారము..... | |
| 11. రామాయణంలో సంపుటితమైన మంత్రము..... | |
| 12. మనిషికి గౌరవాన్నిచ్చే పంచ'వ'కారాలు...... | |
| 13. మనం అంగీకరించే ఉపనిషత్‌ల సంఖ్య..... | |
| 14. వేదాంతము అని వీటిని పిలుస్తాము....... | |
| 15.వాల్మీకి పూర్వనామం...... | |
| 16. అద్వారక బ్రహ్మ ప్రతిపాదకమనగా.... | |
| 17. వేదాలందించిన పరవిద్యల సంఖ్య...... | |
| 18. కలివైరి సూరులు ఎవరు? | |
| 19. రామానుజులు తమని తరింపచేసేవారిగా భావించినది...... | |
| 20. ఋష్యశృంగుని రాకతో వానలు కురిసిన దేశం..... | |
| 21. రామానుజులు భగవత్సౌందర్యాన్ని వర్ణించిన శ్రుతి..... | |
| 22. భూమినుండి ఓషధులని వెలికితీసిన వ్యక్తి...... | |
| 23. మత్స్యావతారం ఎన్నవది...... | |
| 24. 'ఆముక్తమాల్యద' రచయిత...... | |

సూచన: సమాధానాలు ఈ పత్రంలోనే నింపి, 15 వ తేదీలోపు అందేట్టు పంపగలరు.

భక్తినివేదన శ్రీరాంనగరం, ముచ్చింతల్, పాలమాకుల పోస్ట్ 509 325 శంషాబాద్, రంగారెడ్డి జిల్లా. ఆంధ్రప్రదేశ్

శ్రీమతే నారాయణాయ నమః

శ్రీమతే రామానుజాయ నమః





64 సం॥ల నుండి అశేష భగవద్బంధువులు ఆదరిస్తున్న...

ఆధ్యాత్మికమాసపత్రిక

# భక్తినివేదన

శ్రీఖరనామ సంవత్సర జ్యేష్ఠమాసం


సంపుటి 64 జూన్

సంచిక 3 2011


వ్యవస్థాపకులు

పరమహంస పరివ్రాజకాచార్య

శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ

రామానుజ జీయరుస్వామివారు

సంపాదకులు

శ్రీఉ.వే.శ్రీమాన్ T.P. శ్రీరామచంద్రాచార్యులు

## పండుగలు

జూన్:

8. మృగశిర కార్తె
10. తిథి ద్వయం
11. ఏకాదశి తిథి
12. సర్వేషాం నిర్జల ఏకాదశి, కూర్మజయంతి
13. అవమతిథి, రామలక్ష్మణ ద్వాదశి, నమ్మాళ్వార్ తిరు॥
14. పరాశర భట్టర్ తిరు॥
15. సంపూర్ణచంద్రగ్రహణం, మిధున సంక్రమణం
22. ఆర్ద్ర కార్తె
24. త్రిద్యుస్పృక్
27. సర్వేషాం కట్టెకోల ఏకాదశి
29. చతుర్దశి తిథి, మాసశివరాత్రి
30. అమావాస్య తిథి పిండపితృయజ్ఞము

జూలై:

1. అమావాస్య పాడ్యమి తిథి, వట సావిత్రీ వ్రతం
2. విదియ తిథి
3. పూరీ జగన్నాథ రథయాత్ర
6. అవమతిథి, పునర్వసు కార్తె, స్కంద పంచమి
10. పెరియాళ్వార్ తిరు॥
11. సర్వేషాం తొలిఏకాదశి, శయనేకాదశి, చాతుర్మాస్యారంభము

## విషయ సూచిక




Printed & Published by H.H. Tridandi Chinna Srimannarayana Ramanuja Jeeyar Swamiji on behalf of **Jeeyar Educational Trust** and Printed at **Sriman Printers & Processors** C/o JET, Sitanagaram-522 501, Guntur Dist., Andhrapradesh. **Published at** C/o JET, Sitanagaram-522 501 Guntur Dist, Andhrapradesh, Editor: Sri **T.P.Sriramachandracharya** S/o. Sri Sitaramacharyulu, No: 5-74, Ayodhya, Visakhapatnam- Andhra Pradesh.


చందావివరాలు :- సంవత్సరచందా రూ.225/-



విదేశాలకు సంవత్సరచందా $30/-

క్రొత్తగా సంవత్సర చందాదారులుగా చేరువారు సభ్యత్వ నమోదు, రూ.30/-లు (విదేశాలకు $5) అదనంగా చెల్లించవలెను. ఆపై ప్రతి సంవత్సరం సకాలంలో వార్షిక చందా చెల్లించిన చాలు.


E-mail : **jetsitanagaram@yahoo.com**

Internet : www.chinnajeeyar.org



D.T.P. & Design by :

పరిశోధనాలయమ్, ముద్రణ : శ్రీమాన్ ప్రింటర్స్ & ప్రొసెసర్స్, సీతానగరం



మీ సేవలో.... భక్తినివేదన, సీతానగరం - 522 501, గుంటూరు జిల్లా, ఆంధ్రప్రదేశ్. 08645 272929.

# శ్రీశ్రీశ్రీ స్వామివారి సందేశం
## శ్రీవారి ప్రవచనాల నుండి

జై శ్రీమన్నారాయణ!

భగవద్బంధువులారా!

లోకంలో ఆలయ, గృహాది నిర్మాణాలు ఏవి జరిగినా వాటి ఉపయోగానికి ముందు వాస్తుశాంతి జరిపించడం మనకందరికీ తెలిసిన విషయమే. అయితే నేటి ఆధునిక సమాజంలో ఆ వాస్తు పురుషుని పూజిస్తూ ఉన్నా, ఆ వాస్తు ఎవరు? ఎందుకు పూజించాలి? అన్న వివరాలు తెలిసింది ఏ కొద్దిమందికో. అందుకే వాస్తుకి సంబంధించిన, శ్రీపాంచరాత్రా గమశాస్త్రంలో తెలిపిన ఈ కథను ఈసారి మీకందిస్తున్నాం!

ఈ సంవత్సరం మే 27న హృషీకేశ్‌లోని మన జీయర్ మఠంలో నూతనంగ నిర్మింపబడిన ఆలయ ప్రతిష్ఠా మహోత్సవ సందర్భంలో శ్రీశ్రీశ్రీస్వామివారు అనుగ్రహించిన ప్రవచనంలోని వాస్తుపురుషుని గురించిన కథ మీతో పంచుకుంటున్నాము.

ఒకసారి దేవదానవయుద్ధంలో అమృతం త్రాగిన దేవతల ప్రభావాన్ని తట్టుకోలేక దానవులంతా పారిపోయి తలదాచుకునే ప్రయత్నం చేశారు. దానవుల గురువైన శుక్రాచార్యుని వంశం వాడైన భృగుమహర్షి ఆ దానవులను దాచి రక్షించే ప్రయత్నం చేశారు. భర్త చేస్తున్న పనిలో తానూ తోడుపడాలనుకున్న భృగుపత్ని కొందరు అసురులను తల్లి మనసుతో తన గర్భంలో దాచుకుని రక్షించింది.

ఇది తెలిసిన శ్రీ మహావిష్ణువు ఆమె గర్భంలోని అసుర సంహారం కోసం, ఆమె శిరస్సును ఖండించాడు. వెంటనే భృగువుకు తీవ్రమైన కోపం వచ్చింది. ఆ కోప తీవ్రతలో అతని శరీరంలో స్వేదం పుట్టి, భూమిమీద పడగానే ఒక అసురుడు ఆవిర్భవించాడు. అతడే 'వాస్తుపురుషుడు'. భృగు ప్రభావంతో భూమిమీద పుట్టి గొప్ప బలశాలి అయ్యాడు. తన తండ్రి వలన జరిగింది తెలుసుకొని పరాక్రమంతో దేవలోకం వెళ్ళి దేవతలతో యుద్ధం ప్రారంభించాడు. దేవతలలో ఏ ఒక్కరూ కూడా అతనిని ఏమీ చేయలేక పోయారు. అంతా కలసి అతని అన్ని అవయవాల మీద దాడి చేసి, తిరిగి భూమిమీదకి పడవేశారు. అంటే అతను ఎంతటి మహాకాయుడో, బలవంతుడో మనం ఊహించు కోవచ్చు.

అతనలా దేవతలచే హింసపొంది తిరిగి భూమి మీద బోర్లా పడిపోతూ చతుర్ముఖ బ్రహ్మని "నేనిలా భృగువు వలన పుట్టాను. ఈ దేవతలంతా నన్ను హింసించి నశింపచేస్తున్నారు. నాగతి ఇంతేనా!" అని ప్రార్థించాడు. బ్రహ్మరుద్రేంద్రాది దేవతలను ఆశుతోషులు అంటారు. అనగా ఎవరైనా ప్రార్థించిన వెంటనే కరిగిపోయి వరములిచ్చేవారు అని అర్థము.

వాస్తుపురుషుడు చేసిన ప్రార్థనకు కరిగిన బ్రహ్మ అతనికి వరమిచ్చాడు. "భూమినుండి పుట్టి, తిరిగి దేవతల ద్వారా ఆ భూమిమీదకే నెట్టివేయబడ్డ నిన్ను ఈ భూమిమీద జనులంతా ఆరాధించేట్టుగ వరం ఇస్తున్నాను. ఈ భూమి మీదున్న ప్రజలు ఏరకమైన నిర్మాణ కార్యక్రమం చేపట్టినా, ముందుగా నీ వివిధ అవయవాల మీదున్న దేవతలను ఆరాధించడం ద్వారా వారి గృహాది నిర్మాణాలకు ఉండే దోషాలు నశించి పోతాయి"అని వాస్తుపురుషునికి వరమిచ్చాడు బ్రహ్మ. బ్రహ్మవరంతో వాస్తు పురుషుడు చాలా సంతోషించాడు.

అందువలనే జనులందరూ నిర్మాణ కార్యక్రమాలలో అది ఆలయమైనా, గృహమైనా, కార్యాలయమైనా, ఫ్యాక్టరీ వంటిదైనా వాస్తుహోమం చేయాలని శ్రీపాంచరాత్రా గమానికి చెందిన శ్రీ ప్రశ్న సంహిత తెలియజేస్తోంది.

సంపాదకీయం

# ఆశాదాసులు



మనిషి మనుగడ సాగడానికి ఆలంబనం ఆశ. ఆశతోనే మనిషి వర్తమానాన్ని కొనసాగిస్తాడు. ఆశతోనే భవిష్యత్తులోకి ప్రవేశిస్తాడు. మనిషి దేన్ని సాధించాలన్నా ఆశే ప్రధానం. ఆశ లేకపోతే అడుగు ముందుకు పడదు. ఎక్కడ నిలిచినవాడు అక్కడే నిలిచిపోతాడు.

ఆశ మనిషిని ఎంతకైనా సిద్ధపడేట్టు చేస్తుంది. ఆశ సాధ్యాసాధ్యాలను, కృత్యాకృత్యాలను, ఔచిత్య మర్యాదాదులను కూడా చూడనివ్వదు. తాను జీవితంలో సాధించగలిగే అవకాశం బొత్తిగా లేదనిపించే దశలో కూడా ఆశతో ముందుకు సాగాలనుకొంటాడు.

భారతయుద్ధం జరుగుతోంది. భీష్ములవారు అంపశయ్య చేరుకున్నారు. ద్రోణాచార్యులవారు కాలగతిని పొందినారు. కర్ణుడు శల్యుణ్ణి సేనాపతిగా చేసి, పాండవులను జయించాలనుకొంటాడు. అందుకే, 'ఆశా బలవతీ' అన్నారు. భారతయుద్ధంలో తాను గెలిచే అవకాశం సుతారమూ లేదని తెలిసీ, మరలక దుర్యోధనుడు యుద్ధానికి సిద్ధపడటానికి కారణం, ఆశే!

ఆశ మనిషి జీవితంలో అవసరమైనదే! కాదనం. కాని, దీనికి కొన్ని పరిమితులున్నాయి. ఆ పరిమితులకు లోబడక ఆశవెంట పరుగులుతీసేవారు నష్టపోవడం, నశించిపోవడం చూస్తున్నాం. 'ఆశాపాశము తా కడున్నిడుపులేదంతంబు' అని ఆశాస్వరూపాన్ని విచక్షణులైనవారు నిరసించినారు.

దేశకాలాలు, తన శక్తిసామర్థ్యాలు, యోగ్యతాయోగ్యతలు గమనించి మరీ ఆశను పెంచుకోవాలి. దీని పరిమితిని పరిధినీ సుతరామూ దాటకూడదు. అప్పుడే ఆశ జీవితంలో పురోగతికి తోడ్పడుతుంది. అట్లా కాక ఆశకి మనిషి తాను దాసుడై అది చెప్పినట్లల్లా నడుచుకుంటే తాను పొంద దలచినది పొందకపోగా ఉన్నదాన్ని కూడా పోగొట్టుకొని సర్వథా భ్రష్టుడౌతాడు.

ఆశ మితిమీరినపుడు మనిషి సిగ్గెగ్గులు కోల్పోతాడు. ఎంతటి నీచానికైనా సిద్ధపడతాడు. అల్పాల్పములైన అర్థములకు సైతం వాడివాకిటా వీడివాకిటా పడిగాపులు పడతాడు. పళ్ళికిలించుతాడు.

ఆశ మనిషికి దాసి కావాలి. మనిషి ఆశకు దాసుడు కాకూడదు. ఆశకు దాసుడైనవాడు సర్వానికీ దాసుడౌతాడు. ఆశను దాసిగా చేసుకొన్నవాడికి లోకమంతా దాసోహం అంటుంది. ఆశ విజృంభించగానే ఎలాగైనా అనుకున్నదాన్ని పొందితీరాలనుకొంటాడు. దానికోసం పడరాని పాట్లు పడతాడు, చేయరాని పనులు చేస్తాడు. పరుల మనుగడలలో చిచ్చు పెడతాడు. ఇది అది ఏమిటి? ఎంతటి అకృత్యకరణానికైనా సిద్ధపడతాడు. కనుక మనిషికి ఆశ కావాలి, కాదనం. కానీ, ఆ ఆశపై అతనికి అదుపు ఉండాలి. అట్లా ఆశను వశం చేసుకొని ప్రవర్తించినప్పుడు జీవితం చరితార్థం అవుతుంది. ఈ దృష్టితోనే నీతికారుడు చెప్పిన ఈ సుభాషితాన్ని గమనించండి–

**ఆశాయాః దాసాః యే దాసాస్తే సర్వలోకస్య ।**
**ఆశా దాసీ యేషాం తేషాం దాసాయతే లోకః ॥**

\- శ్రీరామచంద్రాచార్య



# య ఏవం వేద...



శ్రీమాన్ గుదిమెళ్ళ మురళీకృష్ణమాచార్యస్వామి-భద్రాచలం

మనం గతమాసంలోని వ్యాసంలో 'వేదము' అనే పదానికి నాలుగు విధాల అర్థాలున్నాయని తెలుసుకున్నాము. సత్త–జ్ఞానము– విచారణం– లాభము– అనేవి నాలుగు రకాల ధాతువులనుండి ఏర్పడిన చతుర్విధార్థాలు. వేదము అనే పదం ఇలా చతుర్విధార్థాలను ఇచ్చినట్లే వేదము చతుర్విధ పురుషార్థాలను ప్రసాదిస్తుంది అని **'బహ్వృక్ ప్రాతిశాఖ్య'** మనే గ్రంథం వేద పదాన్ని నిర్వహించింది.

**విద్యన్తే ధర్మాదయాః పురుషార్థాః యైస్తే వేదాః** ధర్మము, అర్థము, కామము, మోక్షము అనే నాలుగు పురుషార్థములను ప్రసాదించే జ్ఞానరాశి వేదము. లోకంలో సమగ్ర జీవనాన్ని సాగిస్తూ తరించాలనుకునే ప్రతీమానవుడు తప్పక సాధింపవలసిన ప్రయోజనాలు నాలుగు. అవే ఈ చతుర్విధ పురుషార్థాలు. ఇక్కడి 'పురుష' అనే పదానికి మగవాడు అని అర్థంకాదు. శరీరంలో ఉన్న జీవుడు అని అర్థము. **పురి శేతే ఇతి పురుషః** అనే శాస్త్ర నిర్వచనాన్ని అనుసరించి **పురి**– శరీరమునందు, **శేతే**– నివసించు జీవుడే పురుషుడు అని పిలవబడుతూ ఉంటాడు. లింగవివక్ష లేకుండా శాస్త్ర పద్ధతిలో మనమంతా పురుషులమే. మనకు కావలసిన ఈ నాలుగు ప్రయోజనాలే పై చతుర్విధ పురుషార్థాలు. ఈ ధర్మార్థకామ మోక్షములనే ఈ నాలుగు, రెండు జంటలుగా ఉంటాయి. ధర్మార్థములు ఒకజంట, కామమోక్షములు మరొకజంట. వీటిలో రెండవదైన అర్థము మొదటిదైన ధర్మాన్ని అనుసరించి ఉండాలి. మూడవదైన కామము చివరిదైన మోక్షాన్ని అనుసరించి ఉండాలి. ధర్మమూర్తియైన శ్రీరాముని, కైంకర్యార్థుడైన లక్ష్మణుడు అనుసరించి ఉన్నట్లుగా అర్థం ధర్మాన్ని అనుసరించి ఉంటేనే సార్థకం. మోక్షగామియైన భరతుని శత్రుఘ్నుడు అనుసరించి ఉన్నట్లుగా కామమనేది మోక్షానికి సంబంధించి ఉంటేనే పరమార్థకం. ఈ రహస్యాన్ని చెప్తున్నట్లుగా మన మహర్షులు ధర్మమోక్షాల మధ్య అర్థకామాలను ఉంచి క్రమబద్ధమైన జీవన మార్గాన్ని మనకు నిర్దేశించారు. ఆ నాలుగు పురుషార్థాలను మనకు సవిమర్శంగా తెలియజెప్పేది వేదము. అందుకే **బహ్వృక్ ప్రాతిశాఖ్యం** చతుర్విధ పురుషార్థప్రదంగా వేదమును నిర్వచించింది.

ఈ నాలుగు పురుషార్థాలు ధార్మికజీవనానికి సంబంధించినవి కాగా...అధ్యాత్మజీవనానికి సంబంధించిన మరో అయిదు పురుషార్థాలను విశేషంగా శాస్త్రం విధించింది.

**ప్రాప్యస్య బ్రహ్మణో రూపం ప్రాప్తుశ్చ ప్రత్యగాత్మనః ।**
**ప్రాప్త్యుపాయం, ఫలం ప్రాప్తేః తథా ప్రాప్తివిరోధి చ ॥**

పరస్వరూపము, స్వస్వరూపము, ఉపాయస్వరూపము, ఫలస్వరూపము, విరోధిస్వరూపము ఈ ఐదింటిని 'అర్థపంచకం' అని అంటారు. వీటిని గురించి తెలుసుకోవడాన్ని **అర్థపంచక జ్ఞానము** అని అంటారు. అధ్యాత్మపరంగా జీవునికి పొందతగిన వాడైన పరమాత్మగురించి తెలుసుకోవడమే 'పరస్వరూపజ్ఞానం'. ప్రత్యగాత్మ అయిన తన్ను గురించి తాను తెలుసుకోవడమే 'స్వస్వరూపజ్ఞానం'. ఆ పరమాత్మను పొందడానికి అతడే ఉపాయమని తెలుసుకోవడమే 'ఉపాయ స్వరూపజ్ఞానం'. శాశ్వతానందధామమైన అతని సన్నిధానమున కైంకర్యమే 'ఫలస్వరూపజ్ఞానం'. ఆ సన్నిధానానికి మనలను చేరకుండా అడ్డుపడే అహంత–మమతలే విరోధులు అని తెలుసుకోవడమే 'విరోధిస్వరూపజ్ఞానం'. ఈ అయిదు అర్థముల జ్ఞానమునే వేద–ఇతిహాసపురాణాదులన్నీ ఉద్ఘోషిస్తున్నాయని **వదన్తి సకలా వేదాః సేతిహాసపురాణకాః** అని వృద్ధహారీతస్మృతి చెప్తోంది.

మనం వ్యాసారంభంలో చెప్పుకున్నట్లు వేదపదమునకు సంబంధించిన సత్త–జ్ఞానము–విచారణం–లాభము అనే ఈ నాలుగు అర్థములు కూడ అర్థపంచకజ్ఞానాన్ని స్ఫురింపజేసేవిగా ఉండడం గమనార్హము. వీటిలో సత్తార్థకము జీవుని స్వస్వరూపజ్ఞానబోధకము. సకలేతరవిలక్షణుడైన పరమాత్మపట్ల శేషభూతునిగా ఉండడమే స్వస్వరూపము. ఈ విషయాన్నే వేదము, **సంతమేనం తతో విదురితి** తనకు 'శేషి'గా పరమాత్మ ఉన్నాడని తెలుసుకున్నవాడే ఉన్నవాని క్రింద లెక్క అని నిర్ణయించింది. ఈ జ్ఞానంలేనివాడు ఉన్నా లేనివాడే... అని

స్పష్టం చేసింది. అంటే తన ఉనికిని తాను కాపాడుకోవడం... సత్తను పొంది ఉండడన్నమాట. అదే స్వస్వరూపజ్ఞానం.

రెండవది జ్ఞానార్థకము. ఇది **ప్రాప్యస్య బ్రహ్మణో రూపం** అనే పరస్వరూపబోధకము. 'భగవంతునికి సంబంధించిన జ్ఞానమే....జ్ఞానము' అని కదా శాస్త్రోక్తి. **సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ** అనే ఉపనిషద్వాక్యంలో జ్ఞానపదాన్ని వివరిస్తూ రంగరామానుజముని **అత్ర జ్ఞానపదం-నిత్య అసంకుచిత జ్ఞానైకాకారమాహ** అని వ్యాఖ్యానిస్తారు. జ్ఞానము అనగా పరమాత్మలక్షణం కాబట్టి వేదపదమునకు రెండవ అర్థమైన జ్ఞానము- పరస్వరూపజ్ఞానబోధకము.

మూడవది అయిన విచారణార్థకము... విరోధి స్వరూపాన్ని తెలియజేస్తోంది. భగవత్ప్రాప్తికి 'ఏది అనుకూలము? ఏది ప్రతికూలము?' అనే విచారము తప్పనిసరి. **యత్త్వత్ ప్రియం తదిహ పుణ్యం అపుణ్యమన్యత్** అని కూరత్తాళ్వాన్ చెప్పినట్లుగా పుణ్యపాపరూప విచారణ భగవల్లాభానికి సంబంధించిన ఆటంకాలను తొలగిస్తుంది. ఈ జ్ఞానాన్ని కలిగి ఉండడమే వేదము చేసే పని. అలా అది విరోధిస్వరూపజ్ఞానమును కలిగిస్తోంది. విరోధిస్వరూపజ్ఞానం అంటే విడువదగినదేదో తెలియడం. దానితోపాటు దేనిని ఉపాయంగా స్వీకరించాలో కూడ తెలుస్తుంది. అది మన ప్రయత్నంవల్ల కాక, ఆ పరమాత్మ తనుకు తానే మనుకు లభ్యం అవుతాడు అని **యమేవైష వృణుతే తేన లభ్యః** అని ఉపనిషత్ చెప్తోంది. **యం**- ఎవరినైతే; **ఏషః**- ఈ పరమాత్మ; **వృణుతే**-వరిస్తాడో; **తేన ఏవ**-వారికి మాత్రమే; **లభ్యః**- తనంత తానే అందుతాడు. దానికి ఆతని అనుగ్రహం తప్ప వేరే ఉపాయం లేదు. వారు చేసిన సాధన లేదు. **వృణుతే**- వరిస్తాడో అనే పదం పరమాత్మయొక్క స్వతంత్రతను, మనపారతంత్ర్యాన్ని బోధిస్తోంది. దానివలన ఉపాయస్వరూపము కూడ ఆ పరమాత్మే అని స్పష్టం అవుతుంది. అదే ఉపాయస్వరూపజ్ఞానం. ఈ 'విచారణ' మనకు ఈ విధంగా విరోధిస్వరూపజ్ఞానాన్ని, ఉపాయస్వరూపజ్ఞానాన్ని కూడ కలిగిస్తోంది.

భగవల్లాభము అంటే పైన చెప్పినట్లు అతని అనుగ్రహమునే ఉపాయంగా స్వీకరించి, అతని దివ్యసన్నిధిలో శాశ్వతమైన నిత్య కైంకర్యాన్ని చేసుకోవడమే. ఇదే భగవల్లాభం. ఇదే భగవత్కైంకర్య నిత్య లాభం. ఈ జ్ఞానాన్ని లాభార్థము అయిన వేదము కలిగిస్తోంది. ఏతావతా వేదము చతుర్విధ పురుషార్థాలను బోధిస్తోంది. వేదము అనే పదమునకు కల చతుర్విధార్థాలు స్థూలంగా అర్థపంచకజ్ఞాన ప్రబోధకాలుగా కూడ మనకు స్ఫురిస్తున్నాయి.

మానవుని ధార్మిక జీవనానికి ఆవశ్యకాలైన నాలుగు పురుషార్థాలను, అధ్యాత్మజీవనానికి సంబంధించిన అర్థపంచక జ్ఞానాలను కూడ వేదం ఉద్బోధిస్తూ మనలను ఉజ్జీవింప చేయడానికి అమితములైన వాత్సల్యధారలను వర్షిస్తోంది. భగవద్రామానుజులు **'మాతాపితృ సహస్రేభ్యోஉ పివత్సలతరాః వేదాః'** వేల వేల తల్లిదండ్రులకంటే వాత్సల్యమూర్తులు ఈ వేదములు.. అని తమ శ్రీభాష్యంలో ఉటంకించినారు.

'శేషత్వమే ఆత్మకు స్వరూపము' అనిన శ్రీపిళ్లైలోకాచార్య స్వామియొక్క సూక్తిని అనుసరించి ఆత్మజ్ఞానంతో 'సత్యాన్ని' పొంది, తద్వారా సర్వేశ్వరుడైన పరమాత్మయొక్క 'జ్ఞానాన్ని' పొంది, ఆ పరమాత్మను చేరే విషయంలో మనకు ఎదురయ్యే ఉపాయాపాయాలను 'విచారణ' చేసికుంటూ భగవత్సన్నిధి 'లాభాన్ని' పొందడమే ఉజ్జీవన మార్గమనే విషయాన్ని వేదము తన నామానికి కల నాల్గు అర్థములద్వారా తెలియజేస్తోంది..అని పెద్దల శ్రీసూక్తి.

అందుకే శ్రీసాయణాచార్యులు వేదభాష్యభూమిక'లో వేదము యొక్క శబ్దార్థాన్ని ఇలా నిర్వచించారు. **ఇష్టప్రాప్తిః -అనిష్టపరిహారయోః అలౌకికముపాయం యో వేదయతి స వేదః** మనకు ఇష్టమైన విషయాన్ని సాధించడం.... ఇష్టం లేని, లేదా మనకు చేటు చేసే విషయాలను తొలగించుకోవడం అనే విషయంలో అలౌకికమైన ఉపాయాన్ని తెలియజేసే అక్షరరాశికి వేదము అని పేరు. మనకుండే ఆ ఇష్టానిష్టాలు ఈ లోకానికి సంబంధించినవి అయినా సరే. లేదా, పారలౌకికాలు అయినా సరే వాటికి అలౌకికమైన పరిష్కారాలను వేదం చెప్తుంది.

ఈ లోకంలో అనిత్యాలయిన భోగాలను SAVE చేసుకోవాలన్నా.. పై లోకంలో నిత్యయోగంతో భగవంతునికి 'సేవ' చేసుకోవాలన్నా వేదాన్ని ఆశ్రయించవలసినదే. వేదము లేదా వేదానుసృతాలైన గ్రంథాలే ఇష్టప్రాప్త్యనిష్ట పరిహారాలకు చక్కని ఉపాయాలు. ఆ విధంగా మనకోసం, మనయోగక్షేమాల కోసం భగవంతుని అనుగ్రహంగా ఈ లోకానికి అందిన అలౌకిక శబ్దరాశి..... ఈ వేదము. అందుకే శ్రీసాయణులు దీనిని **అపౌరుషేయవాక్యం వేదః** మానవప్రయత్నంతో కాక భగవద్దత్తంగా ఏర్పడిన అద్భుతగ్రంథం... వేదము అని వివరించారు.



# పిబత భాగవతం రసం... వివిధావతార ప్రశంసనమ్

శాస్త్రరత్నాకర, శాస్త్రవిద్వన్మణి డా॥ఉ.వే సముద్రాల వేంకట రంగరామానుజాచార్యులు
డైరెక్టర్ - అకెడమిక్ కౌన్సిల్ 'జీవ' శ్రీరాంనగర్ (శంషాబాద్)

శ్రీమన్నారాయణుడు ఋచి అనేదానికి ఆకూతి అనే స్త్రీ యందు యజ్ఞనామంతో ఆవిర్భవించాడు.

**తతః సప్తమ ఆకూత్యాం ఋచేర్యజ్ఞోభ్యజాయత ।**
**స యామాద్యైః సురగణైః అపాత్ స్వాయంభువాన్తరమ్ ॥**

స్వాయంభువమన్వంతరంలో యాముడు మొదలైన దేవగణాలతో కలసి స్వయంగా ఇంద్రత్వాన్ని పొంది ఆ మన్వంతరాన్ని పాలించాడు. దీన్ని గురించిన ప్రస్తావనను విష్ణు పురాణం కూడా చేసింది. విష్ణుశక్తి అసమానమై సత్త్వోద్రిక్తమై స్థితికారకంగా ఉంటూ అన్ని మన్వన్తరాలలోను దేవభావాన్ని పొంది ఉంటుంది. ఈ విష్ణుశక్త్యంశ చేతనే యజ్ఞుడు ఆవిర్భవించాడని చెబుతున్నది విష్ణుపురాణం.

**విష్ణుశక్తిరనౌపమ్యా సత్త్వోద్రిక్తా స్థితౌస్థితా ।**
**మన్వంతరేష్వశేషేషు దేవత్వేనాధితిష్ఠతి ॥**

**అంశేన తస్యా జజ్ఞేఽసౌ యజ్ఞస్స్వాయంభువేంతరే ।**
**ఆకూత్యాం మానసోదేవ ఉత్పన్నః ప్రథమేఽన్తరే ॥**

ఇక్కడ అష్టమావతారం చెప్పబడింది.

**అష్టమే మేరు దేవ్యాం తు నాభేర్జాత ఉరుక్రమః ।**
**దర్శయన్ వర్త్మ ధీరాణాం సర్వాశ్రమ నమస్కృతమ్ ॥**

ఈ అవతారం పారమహంస్యమార్గాన్ని లోకానికి చూపడానికి స్వామి స్వీకరించినది.

ఇక ఋషులంతా యాచించగా, తొమ్మిదవదైన పార్థివ దేహాన్ని స్వామి స్వీకరించాడు. ఇదే పృథుచక్రవర్త్యవతారం. ఈ అవతారంలోనే ఆజగవమనే మహాధనువును చేపట్టి, ధనుష్కోటితో అస్తవ్యస్తంగా ఉన్న భూమిని సమతలంగా ప్రథనం చేసాడు కనుక, ఆయన పృథువు అయినాడు. ఆయనచే ప్రథనం చేయబడింది కనుక భూమి పృథివి అయిందని విష్ణుపురాణం విశదపరచింది.

**ఋషిభిర్యాచితో భేజే నవమం పార్థివం వపుః ।**
**దుగ్ధేమా మోషధీః విప్రాః తేనాయం స ఉశత్తమః ॥**

ఉశత్తమః అనడంచేత పృథ్వ్యవతారంలో స్వామి సాధించిన అద్భుతకృత్యంవల్ల ఆయన సర్వస్పృహణీయుడైనాడని తాత్పర్యం.

ఇక పదియవ అవతారం మత్స్యావతారం. చాక్షుష మన్వంతరంలో ఏర్పడిన సముద్ర జలోపప్లవంలో స్వామి మత్స్యావతారాన్ని పరిగ్రహించి, మహీమయమైన నౌకలో వైవస్వతమనువును ఉంచి రక్షించాడు. వాస్తవానికి, చాక్షుష మన్వన్తరం చివర ప్రలయం లేకపోయినా మార్కండేయునికి తన ప్రభావాతిశయాన్ని చూపడానికి వైష్ణవమాయాముఖంగా ఈ ప్రలయాన్ని స్వామియే కల్పించినాడని శ్రీధరవ్యాఖ్య...

**రూపం సజగృహే మాత్స్యం చాక్షుషోదధి సంప్లవే ।**
**నావ్యారోప్య మహీమయ్యామ్ అపాద్వైవస్వతం మనుమ్ ॥**

పదకొండవ అవతారం కూర్మావతారం

**సురాసురాణాముదధిం మథ్నతాం మందరాచలమ్ ।**
**దధ్రే కమఠరూపేణ పృష్ఠ ఏకాదశే విభుః ॥**

దేవదానవులు సముద్రమథనం చేయగోరి మందర పర్వతాన్ని కవ్వంగా చేసి మథనారంభంచేయగా, సముద్రంలో క్రిందికి జారిపోయిన మందరపర్వతాన్ని తన వీపుపై మోసి, మథనం అప్రతిహతంగా కొనసాగింపజేసాడు స్వామి కూర్మరూపధారియై. ఈ అవతారం చాలా ప్రాచీనము ప్రసిద్ధము కనుక శ్రీరామాయణం కూడా వర్ణించింది.

**ధాన్వన్తరం ద్వాదశమం, త్రయోదశ మమేవ చ ।**
**అపాయయత్ సురానన్యాన్ మోహిన్యా మోహయన్ స్త్రియా॥**

పంద్రెండవ అవతారం ధన్వన్తరి అవతారం. పదమూడవది మోహిన్యవతారం. మోహినీరూపంలో అసురులను వ్యామోహపరచి, సురులకు అమృతాన్ని పంచి ఇచ్చాడు స్వామి.

**చతుర్దశమం నారసింహం బిభ్రద్దైత్యేంద్రమూర్జితమ్ ।**
**దదార కరజై ర్వక్షస్యేరకాం కటకృద్యథా ॥**

చాపలు తయారుచేసేవాడు తాటి ఆకులను నిలువునా చీల్చినట్లు నృహింహునిగా పదునాల్గవ అవతారం స్వీకరించిన స్వామి, మహాబలశాలియైన హిరణ్యకశిపుని వక్షఃస్థలాన్ని చీల్చివేశాడు.

**పంచదశం వామనకం కృత్వా ఆగాత్ అధ్వరం బలేః ।**
**పదత్రయం యాచమానః ప్రత్యాదిత్సుః త్రివిష్టపమ్ ॥**

బలిచే ఆక్రమింపబడిన స్వర్గాన్ని తిరిగి లాగుకొనగోరి, స్వామి పదహైదవదైన వామనావతారాన్ని స్వీకరించి బలిచక్రవర్తి నిర్వహించిన యజ్ఞానికి వెళ్ళాడు. అక్కడ మూడడుగుల భూమిని యాచించి, బలినుండి సమస్త ప్రపంచాన్ని, అంతరిక్షంతోపాటు స్వాధీనపరచుకొని, బలిని పాతాళానికి అణగద్రొక్కాడు స్వామి తన త్రివిక్రమణాలచేత. ఈ అవతారాన్ని వర్ణించిన వేదం త్రివిక్రమమూర్తిని విశేషించి ఆవిష్కరించింది. విష్ణుసూక్తాదులు ఈ అవతారాన్ని ప్రస్తావించాయి. త్రివిక్రమణ వైభవాన్ని కీర్తించాయి.

ఇక పదహారవ అవతారం పరశురామావతారం బ్రహ్మద్రోహులైన రాజన్యుల శిరస్సులను నిర్దాక్షిణంగా ఖండించిన అవతారం ఇది. రామావతారావిర్భావంతో ఇది ముగిసింది.

**అవతారే షోడశమే పశ్యన్ బ్రహ్మద్రుహోన్నృపాన్ ।**
**త్రిస్సప్తకృత్వః కుపితో నిఃక్షత్రామకరోత్ మహీమ్ ॥**

పదహారవ అవతారమైన పరశురామావతారంలో తన తండ్రియైన జమదగ్నిపట్ల నిష్కారణద్వేషంతో ప్రవర్తించి ద్రోహంచేసిన కార్తవీర్యార్జునిపట్ల కలిగిన దుర్భరక్రోధంచేత, రెండుసార్లు భూమిని నిఃక్షత్త్రం చేసాడు. బ్రాహ్మణజాతి పట్ల వారికి కల చులకనతనాన్ని నిర్మూలించాడు. ఇక్కడ బ్రహ్మద్రోహం వ్యాజం మాత్రమే. వాస్తవానికి ప్రజాకంటకులై ధర్మాతిక్రమణంచేసి విపరీత ప్రవృత్తులైన క్షత్రియాధములను స్వామి వధించి, క్షత్రియలోకం సద్వర్తన, ధర్మప్రవృత్తి కలిగి ఉండేలా తీర్చిదిద్దాడు స్వామి.

ఇక పదిహేడవ అవతారం వ్యాసనామం కల కృష్ణద్వైపాయనమూర్తి. ఈయన పరాశరునికి సత్యవతి యందు ఆవిర్భవించాడు. వేదమనే మహావృక్షానికి శాఖోపశాఖలను కల్పించి, అల్పాయుష్కులు, అల్పబుద్ధులు అయిన మానవులకు సహితం వేదం అందేలా అనుగ్రహించాడు ఈ అవతారంలో.

**తతః సప్తదశే జాతః సత్యవత్యాం పరాశరాత్ ।**
**చక్రే వేదతరోః శాఖా దృష్ట్వా పుంసోఽల్పమేధసః ॥**

ఇక్కడ పదిహేడవ అవతారంగా రామావతారానికి ముందే వ్యాసావతారాన్ని ప్రస్తావించడం లేఖక ప్రమాదమని కొందరు ఆధునిక వ్యాఖ్యాతలు (డా॥పొన్నాల రాధాకృష్ణశర్మ- తమ వ్యాఖ్యలో పేర్కొన్నారు). వాస్తవానికి ఇక్కడ పరాశర- సత్యవతుల సంతానంగా కృష్ణద్వైపాయనవ్యాస ప్రస్తావనంలో ఈ ప్రస్తుత భాగవతానికి ఆయన కర్తకావడమే కారణం. అయితే ఆయా కాలాల్లో ఎందరో వ్యాసులు వేదవిభాగ-పురాణవిభాగాదులు చేసినవారున్నారు. రామావతారానికి ముందు, తరువాతకూడా వ్యాసులున్నారు. ఆయా మహానుభావులకు, ఆయా కాలాల్లో వ్యాసత్వం నారాయణానుగ్రహంచేత కలిగిందని చెప్పడం సముచితం. శ్రీవిష్ణుపురాణం ప్రకారం 'ఒక్క వైవస్వత మన్వంతరంలోనే 28సార్లు వేదవిభాగం జరిగింది. ప్రతి ద్వాపరాంతంలోను ఈ ప్రక్రియ సాగింది.

ఇప్పటికి (కృష్ణద్వైపాయన వేదవ్యాసునికి నాటికి) 28మంది వేదవ్యాసులు గడచిపోయారు అని స్పష్టపరిచింది విష్ణుపురాణం. *(3వ అంశ, అధ్యా 3, శ్లో 9-20)* *(సశేషం)*

# కలివైరిసూరి వైభవము



గత సంచిక తరువాయి...

శ్రీ ఉ.వే.శ్రీమాన్ కె. టి. రామానుజాచార్యస్వామి-నెల్లూరు

**తిరుమంగై ఆళ్వార్- పెరియ తిరుమొழி 1-7-3**

**ఏయ్న్ద పేఱ్వాయ్ వాళెయిత్తోర్ కోళరియా యవుణన్ ।**
**వాయ్న్దవాకమ్ వళ్ళుకిరాల్ వకిర్న్ద వమ్మానతిడమ్**
**ఓయ్న్ద మావుముడైన్దకున్ను మన్నియ నిన్నఱలాల్**
**తేయ్న్ద వేయుమల్లతిల్లా చ్చింగవేఱ్ కున్నమే... ॥**

**ప్రతిపదార్థము:** **ఏయ్న్ద**=తగినటువంటి, **పేఱ్వాయ్**= పెద్ద నోరును; **వాళ్**=ఖడ్గమునుపోలిన, **ఎయిత్తు**=కోరలును; **ఓర్**= అద్వితీయమైన, **కోళ్**=బలమునుకల; **అరియాయ్**=నరసింహ మూర్తియై; **అవుణన్**=హిరణ్యాసురునియొక్క; **వాయ్న్ద**=తగినటు వంటి; **ఆకమ్**=శరీరమును; **వళ్ఉకిరాల్**=పదునైనగోళ్ళతో; **వకిర్న్ద**=బ్రద్దలు చేసిన; **అమ్మానతు**=స్వామియొక్క; **ఇడమ్**= స్థానము; **ఓయ్న్ద**=బలహీనమైన, **మావుమ్**=మృగములును; **ఉడైన్ద**= బ్రద్దలిల్లిన; **కున్నం**=పర్వతములును; **అన్నియుమ్**=అంతమాత్రమే కాక; **నిన్ను**=తనయందున్న; **అఱలాల్**=అగ్నిచేత; **తేయ్న్ద**=కాలినటు వంటి; **వేయుమ్**=వెదుళ్ళను, **అల్లతు**=తప్ప; **ఇల్లా**=లేని; **శింగ వేఱ్కున్నమే**=అహోబిలపర్వత క్షేత్రము.

**తాత్పర్యము:** విశాలమగు వదనమును ఖడ్గమువంటి కోరలును గల నరసింహరూపియై ఆవిర్భవించి హిరణ్యకశిపుని యొక్క బలసిన రొమ్మును తన పదునైన గోళ్ళతో చీల్చిన భగవంతుడు వేంచేసి యుండు క్షేత్రము అహోబిలము. త్రిప్పుటచే డస్సిన మృగము లును, ఎండవేడికి పగిలిపడియున్న రాతిగుట్టలును, దావాగ్నివలన సగము కాలిపోయి ఉన్న వెదుళ్ళును తప్ప అచ్చట వేరేదియును కానరాదు. భగవంతుడు వేంచేసియుండు స్థలములోనిది ఏదైనను ఈ ఆళ్వార్లకు ఉపాదేయములే!

**విశేషార్థము:** ఈ తిరుమంగై ఆళ్వార్లు శ్రీ నరసింహస్వామి యొక్క దివ్యముఖారవిందమును దర్శించుటయందే ఆసక్తి గలవారు గనుక ఆ దివ్యముఖమునే ఈ పాశురమున వర్ణించుచున్నారు.

**ఏయ్న్ద విత్యాది :** దివ్యమంగళ విగ్రహమునకు తగిన వదనము, ఖడ్గమువలె పదునై ప్రకాశవంతములైన కోరలును గలిగినదియునగు

**ఓర్ కోళ్ అరియాయ్ :** సాటిలేనిదియు బలిష్ఠమైనదియునగు నరసింహము

**అవుణనుడైయ :** కేవలము ఆసుర ప్రకృతియే స్వభావముగాగల హిరణ్యాసురునియొక్క వక్షస్థలమును విశాలమైనది. ఈ నరసింహమూర్తికి తగినట్లు ఆ అసురుని శరీరము పెరిగియున్నది. అటువంటి ఆ శరీరమును పదునైన తన గోళ్ళతో చీల్చిన శ్రీనరసింహునకు వాసస్థానమైనది శ్రీ అహోబిలక్షేత్రము.

**ఓయ్న్దమావుమ్ :** నిస్సారమగు ఆ పర్వతస్థలమున సంచరించు టచే ఆ ప్రాంతములోని జంతువులును బలహీనములై యుండును.

**ఉడైన్దకున్నమ్ :** అచ్చటి కొండబండలు దావాగ్నికి సూర్యుని వేడికి కాలి కాలి, వానిని తాకినంత మాత్రముననే పడిపోవు చుండును. ఆ రాళ్ళయందలి వేడికి వెదుళ్ళు అరకొరగ దహింప బడుచుండును. అవి తప్ప అచ్చట వేరొకటి ఏదియు కానరాదు.

అటువంటిది శ్రీ అహోబిలక్షేత్రము. శ్రీ తొండరడిప్పొడి ఆళ్వార్లు తిరుమాలై దివ్యప్రబంధమును శ్రీరంగక్షేత్రమును, **"వణ్డినమురలుంశోలై"** అను పాశురమున మధుకరముల నినాదముల తోను, శుకపికారావములతోను నలరారు తోటలతో పరివేష్టితమైన దని వర్ణించిన విధముగ ఈ కలివైరిసూరి అందులకు భిన్నముగ ఈ క్షేత్రముయొక్క సహజస్థితిని వర్ణించుచున్నారు. అది ఇది అననేల అచ్చటనున్నవి అన్నియును ఈ ఆళ్వార్లకు భోగ్యములై యున్నవి. లోకమున మానవులు దేనినైన ఇష్టపడినచో అందలి దోషములు సైతము వారికి భోగ్యములుగనే కదా ఉండును. శ్రీనరసింహస్వామి యొక్క కోపమనెడి అగ్నితో హిరణ్యాసురుడనే పర్వతము బ్రద్దలై యున్నది. ఆ పర్వతమును ఆశ్రయించియుండెడి రాక్షసులనెడి దుష్ట మృగములు బలహీనములై యున్నవను విషయమును తెలియజేయు చున్నట్లున్నది ఈ అహోబిలక్షేత్రము.



# సీతాఫలం రామార్పణమ్



గత సంచిక నుండి

శ్రీమతి చెవుటూరి కుసుమకుమారి - హైదరాబాద్

ఋష్యశృంగుని రాకతో రోమపాదుని దేశము సర్వసమృద్ధమైనది. దారిలో గోపాలురను, రైతులను వణిక్కులను ఎవరిని అడిగినా ఈ వైభవమంతా ఋష్యశృంగునిదే అని చెప్పసాగారు. అది విన్న విభాండకమహర్షి శాంతించిన కోపంతో రోమపాదుని వద్దకు వెళ్ళాడు. రోమపాదుడు మహర్షిని అంతఃపురమునకు తీసుకొని వెళ్ళి మిక్కిలిగా పూజించాడు.

మహావైభవంగా దేవేంద్రునిలా సమస్త భోగాలనూ అనుభవిస్తున్న పుత్రునీ, మెరుపుతీగెవంటి కోడలు శాంతాదేవిని చూచి పూర్తిగా శాంతించి రోమపాదునియందు అనుగ్రహము కలవాడై నూతన దంపతులను ఆశీర్వదించి, "కుమారా! నీవు రోమపాదుని అభీష్టము నెరవేరునట్లు పుత్రసంతానమును పొందిన తరువాత మరల వనమున ఆశ్రమమునకు తిరిగిరమ్ము" అని చెప్పి తన ఆశ్రమమునకు వెళ్ళిపోయినాడు.

దశరథమహారాజా! మహిమాన్వితము, పాపహరము అయిన ఋష్యశృంగుని చరిత్రను చెప్పినాను. నీవు వెంటనే ఋష్యశృంగుని రావించి సంతానముకొరకై క్రతువును చేయుమని చెప్పిన సుమంత్రుని ఆప్తవాక్యానుసారము దశరథుడు రోమపాదుని పట్టణమునకు వెళ్ళుటకు నిశ్చయించుకొని, దశరథ మహారాజు భార్యా బంధువులతో రోమపాదుని పట్టణమునకు వెంటనే వెళ్ళినాడు.

తనకు ఆప్తమిత్రుడు బంధువు అయిన దశరథునకు తగిన ఆదరసత్కారాలు చేశాడు. అల్లుడైన ఋష్యశృంగునితో దశరథునితో తనకుగల మిత్రత్వ, బంధుత్వాలను గురించి వివరించగా, ఋష్యశృంగుడు దశరథుని మిక్కిలిగా గౌరవించాడు.

వారము దినములు రోమపాదుని ఆతిథ్యమున వుండి, మిత్రమా! రోమపాదా! నేనొక మహత్కార్యమును ప్రారంభించబోవుచున్నాను. నీవు నీకుమార్తె శాంతను అల్లుడు ఋష్యశృంగుని నాతో అయోధ్యకు పంపుమని కోరినాడు. దశరథుని కోరిక ననుసరించి శాంతాఋష్యశృంగులు అయోధ్యకు వచ్చినారు. కులగురువు వసిష్ఠుల పర్యవేక్షణలో అశ్వమేధయాగము దిగ్విజయముగా సమాప్తమైనది.

అనంతరము దశరథ మహారాజు ఋష్యశృంగునితో మహర్షీ! వంశాభివృద్ధికై సంతానము కలుగునట్లు సంతాన తంతువును నాకు ప్రసాదించుమని కోరినాడు. ఋష్యశృంగ మహర్షి "రాజా! నీకు పుత్రసంతానము కలుగుటకు ఆథర్వణ వేదోక్త మంత్రములద్వారా యాగము చేయించెదను. అనంతరము నీకు నలుగురు పుత్రులు పుట్టగల"రని చెప్పినాడు. వెంటనే పుత్రకామేష్టికి దశరథమహారాజు చేత శుభారంభం చేయించినాడు.

## భూదేవి వేదన రావణ వధోపాయాన్వేషణ

**తదా మహీ రావణముఖ్య రక్షో**
**భారం తు వోఢుం బహుధాప్యశక్తా ।**
**ధృత్వా చ గోరూప మలం రుదంతీ**
**సమాససా దాబ్జభువం సురేశమ్ ॥**

అదే సమయమున భూదేవి రావణాది దుష్ట రాక్షసుల భారము భరించలేక గోరూపమును ధరించి రోదిస్తూ బ్రహ్మ వద్దకు వెళ్ళినది. విధాత భూమాతను ఓదార్చి, భూదేవీ! నేను యోగదృష్టిచేత నీ బాధను గ్రహించినాను. కానీ భూదేవీ! నేను రావణుని జయించుటకు అశక్తుడను. అందుచేత నీకు నేనెటువంటి సహాయమూ చేయలేకున్నాను. అందుకు కారణమైన పూర్వవృత్తాంతమును చెప్పెదను వినుము.

**మహతా తాపసారాధ్య రావణశ్శంకరం పురా ।**
**తస్మాద్వరాన్ సుదుర్లభాంస్తు లబ్ధ్వా తిష్ఠతి దుర్జయః ॥**

పూర్వము రావణుడు గొప్పతపస్సుచేత పరమశివుని మెప్పించి దుర్లభమైన వరాలను పొందినాడు. ఆ వరప్రభావము చేత ఎవరికీ జయింపనలవి కాకున్నాడు. నాచేతగానీ దేవతల చేతగానీ, మరే ప్రాణులచేతగానీ మరణము లేకుండా వరమును పొందినాడు. ఆ వరమదముతో ఇంద్రాది దేవతలను జయించి,

దేవేంద్రుని పూలమాలికలు తనకు అల్లి ఇమ్మని, వాయువును తన నగరమును ఊడ్చుమని, వరుణుని తన పట్టణమును తడుపుమని సేవకులుగా మార్చినాడు.

అదియునూ గాక సృష్టిచేయుట నాకర్తవ్యము. లయము చేయుట శివునిపని. కనుక రావణవధకై శివుని వద్దకు వెళ్ళెదమని చెప్పి, విధాతా భూమాతలిరువురూ ప్రమథగణ పరిపూజితమైన శివుని కైలాసమును చేరినారు. స్థూల సూక్ష్మ రూపుడవైన కైలాసనాథా! నీకు మా నమస్కృతులు. లోక సుఖంకరుడవైన శివా! మా విన్నపాన్ని మన్నించు.

దుష్ట రాక్షసుడైన రావణుని బాధలు భరించలేక దేవతలు పడరాని పాట్లు పడుతున్నారు. రావణునికి కొలువు చేస్తున్నారు. భూమాత రాక్షస బాధలు పడలేక రోదిస్తూ నీవద్దకు వచ్చినది. శంకరా! నీవు వెంటనే దుష్టరాక్షస సంహార ప్రయత్నము చేయ వలెనని ప్రార్థించారు దేవతలు. అంత శంకరుడు "పితామహా! దేవతలారా! విషపుచెట్టునైనా చేజేతులా పెంచి ఖండించుట దోషమేకదా! నేనే రావణునికి మరణము లేకుండునట్లు వరమిచ్చి మరల చంపుటకు ఎట్లు ప్రయత్నించగలను"?

**తస్మాద్విష్ణు సమీపం తు యూయం గచ్ఛథ సత్వరమ్ ।**
**లోక రక్షావహః కుర్యాత్కార్యం చ సఫలం హరిః ॥**

లోకరక్షణ భారము శ్రీమహావిష్ణువు వహించునుగనుక వెంటనే మీరు శ్రీహరి వద్దకు వెళ్ళిన ఎడల మీ కోరిక సఫలము కాగలదు. అని చెప్పగా నందీశ్వరుడీ విధంగా చెప్పాడు.

**ఏతస్మిన్నంతరే నందీవచనం ప్రాహ తాన్పునః ।**
**ఏకదా రావణో మౌర్ఖ్యాత్కప్యాసం మాం శశాప సః ॥**

దేవతలారా! పూర్వమెకసారి అహంకారి అయిన రావణుడు మూర్ఖుడై నన్ను వానరముఖుడగుదువ''ని శపించాడు. అందుకు కారణమును చెప్పెదను వినుడు.

"ఒకప్పుడు రావణుడు పుష్పక విమానమునెక్కి దేవ లోకములు తిరిగి తన నగరమునకు పరమశివుని తపస్థానము నకు పైనుండి వెళ్ళుచుండగా శివునకు తపోభంగము కలుగునని నేనా విమానమును ఆపివేసినాను. రావణుడెంత ప్రయత్నించిననూ ఆ విమానము కదలలేదు. కారణమేమని క్రిందకు దిగిన రావణుడు నాచేత విమానము నిరోధించ బడినదని తెలుసుకొని నన్ను వానరముఖునివికమ్మని శపించినాడు.

దేవతలారా! నేనునూ "రావణా! ఒకనరుడు వానరులతో కలసి నిన్ను సమూలముగా నాశనము చేయుగాక!" అని శపించినాను. కనుక దేవతలారా! లోకరక్షణ దీక్షాకంకణుడైన శ్రీహరిని మీరు వెంటనే వెళ్ళి ప్రార్థించుడు. మీ ప్రార్థన ముమ్మాటికీ సఫలమగు సమయమిదే అని సకారణంగా చెప్పాడు.

శివుని, నందీశ్వరుని వాక్యానుసారము దేవతలు క్షీరసాగర శయనుడైన జనార్దనుని వద్దకు వెళ్ళి అనేక విధాల స్తుతించి భక్తజనార్తిహరా! శ్రీహరీ కరుణతో మా ఆర్తిని తొలగించు. రావణుని బారినుండి లోకాలను రక్షించు. ఆ రావణుడు దేవేంద్రుని తేజోహీనునిగా చేసి, అగ్నిని పతనము చేసి, యముని శక్తిహీనుని చేసి వరుణుని చైతన్యరహితునిగా చేసినాడు. సూర్యతేజము నశించిపోయినది. వాయువు కంఠమున ప్రాణాలు నిలుపుకొని వున్నాడు. చంద్రుడు కారాగారమున బందీకృతుడై వున్నాడు. దిక్పాలకులైన దేవతల స్థితే ఇట్లుండ మానవుల బాధలు చెప్పవలెనా? కనుక శ్రీహరీ! శరణా గతులమైన మమ్ము రక్షించు అని వేడుకున్నారు. అంతట శ్రీహరి ప్రసన్నవదనుడై...

**విజ్ఞాపితోఽహం సమయే భవంత స్తద్వధం ప్రతి ।**
**ధృత్వాఽవతార మద్యైవ హనిష్యే తం సురోత్తమాః ॥**

బ్రహ్మాది దేవతలారా! మీరు తగిన సమయమున రావణవధ విషయమును నాకు విన్నవించి జ్ఞప్తికి తెచ్చినారు. వెంటనే నేనవతరించి రావణవధోపాయమును యోచించెదనని పలికినాడు. దేవతలారా! అనేక యజ్ఞయాగాదులు చేసిన సూర్యవంశీయుడు దశరథుడు ఇప్పుడు సంతానార్థి అయి పుత్రకామేష్టి చేయుచున్నాడు. ఆయన భార్యలు ముగ్గురియందు నేను నాలుగంశలతో జన్మించి ఆ రావణుని పుత్ర పౌత్ర జ్ఞాతి బంధు సమేతముగా రణమున వధించి, పదకొండువేల (11,000) సంవత్సరాలు మనుష్య లోకమైన భూమిని పాలించెదను. పితామహా! దశరథుని యజ్ఞవాటికకు ప్రాజాపత్య పురుషుని పంపించుము. (సశేషం)

# జీవన సాఫల్యము

శ్రీమాన్ సముద్రాల శఠకోపాచార్యస్వామి-వరంగల్

పూర్వజన్మల సుకృతఫలంగా లభించిన ఈ మానవజన్మను సార్థకం చేసుకోవాలంటే భగవద్దత్తమైన వివేకజ్ఞానంతో యుక్తాయుక్త విచారణ చేయగలగాలి. యోగ్యమైనమార్గంలో జీవన యానాన్ని కొనసాగించుటకై నడుం బిగించాలి. పశుపక్ష్యాదులు దేహపోషణకే పరిమితమౌతాయి.

మానవుడే బుద్ధిబలానికి శాస్త్రబలాన్ని తోడు చేసుకొని సదాచార్యుణ్ణి ఆశ్రయించగలుగుతాడు. అయితే యాంత్రికమైన ఆధునికయుగంలో భౌతికసుఖాలకు లౌకిక విషయాలకే చాలామంది పరిమితమగుచున్నారు.

కొందరు తమయొక్క తమవారియొక్క సుఖసంతోషాల కొరకు ప్రయత్నిస్తూ ఉంటే మరికొందరు స్వపరహితాభిలాషులై జీవనాన్ని కొనసాగిస్తున్నారు. ఇంకొందరేమో భర్తృహరియొక్క **"స జాతో యేన జాతేన యాతి వంశ స్సమున్నతిమ్"** అను సూక్తి ప్రకారం తమ వంశప్రతిష్ఠ ద్విగుణీకృతమయ్యే విధంగా జీవిస్తుంటారు.

ఈ స్థితిలో చాలాకొద్దిమంది కారణజన్ములు మాత్రమే తమ జీవనలక్ష్యం లోకోజ్జీవనమే అన్నట్లుగా నివృత్తరాగులై జీవిస్తారు.

ఇలాంటి వారి జీవనమే యథార్థమైన జీవనమని, ఎవరు జీవించి యుండడంవల్ల ఎక్కువమంది యథార్థమైన (ఉజ్జీవనార్హమైన) జీవనాన్ని కొనసాగించగలరో వారు మాత్రమే జీవించి యున్నట్లు అట్టివారి జీవనమే సఫలమైనట్లుగా

**"యస్మిన్ జీవతి జీవంతి బహవః స తు జీవతి"** అను సూక్తి ద్వారా మన పూర్వులు పేర్కొన్నారు.

కారణజన్ములైన ఈ సత్పురుషులు **"ఋణాని త్రీణ్యపాకృత్య మనో మోక్షే నివేశయేత్"** అనే మనువుయొక్క సదుపదేశాన్ని శిరసా వహిస్తూ దేవ పితృ ఋషి ఋణాలను తీర్చుకుని ధన్యులౌతారు.

లోకోజ్జీవనముకై కృషిచేసే సాధుపుంగవులకు ఎటువంటి దుర్గతి లభించదని భగవద్గీతలో శ్రీకృష్ణపరమాత్మ

**"న హి కళ్యాణకృత్ కశ్చిత్ దుర్గతిం తాత గచ్ఛతి"** అను వాక్యము ద్వారా ప్రకటించెను.

ఎవడైతే తన మనసును మంచిమార్గమునందు ప్రవేశింప చేస్తాడో అట్టివానికే జీవితములో సర్వార్థములు ఫలిస్తాయనే విషయం మహాభారతంలోని విదురనీతి ఘట్టంలోని...

**"యథా యథా హి పురుషః కళ్యాణే కురుతే మనః।**

**తథా తథాస్య సర్వార్థాః సిధ్యన్తే నాత్ర సంశయః॥"** అను శ్లోకము ద్వారా వెల్లడగుచున్నది.

న్యాయమార్గంలో ప్రవేశించి జీవనయానాన్ని కొనసాగించే వారికి జంతువులు కూడా సహాయం చేస్తాయని, అపమార్గంలో పయనించే వాడిని సోదరుడు కూడా వదిలి పెడుతాడని

**"యాంతి న్యాయ ప్రవృత్తస్య తిర్యంచోఽపి సహాయతామ్।**

**అపంథానం తు గచ్ఛన్తం సోదరోఽపి విముంచతి ॥"** అను మహాకవి సూక్తి ద్వారా వెల్లడగుచున్నది.

సన్మార్గంలో శ్రీరాముని జీవనయానం కొనసాగినందుననే వానరములు కూడా సహకరించినాయి. దుర్మార్గుడైన రావణుని, అతని సోదరుడైన విభీషణుడే వదిలి పెట్టినాడు అనే విషయం పై శ్లోకం ద్వారా ద్యోతకమగుచున్నది.

సన్మార్గులై సత్సంగులై జీవించేవారికి సమస్త శుభాలు లభిస్తాయి. స్వస్వరూప పరమాత్మ స్వరూపజ్ఞానం ఏర్పడుతుంది.

అసలు ఎంతవరకైతే ఒకనికి భగవద్భాగవతాచార్యుల అనుగ్రహంతో తిరుమంత్రోపదేశం లభించదో అంటే స్వరూపజ్ఞానం కలగదో అంతవరకు అతడు అసత్ప్రాయుడేనని, ఒకసారి స్వరూపజ్ఞానం కలిగాక దానిని వదలక ఆచార్యోపదిష్టమైన పద్ధతిలో జీవించేవారి జీవితమే సఫలం అనే విషయం.

**"అన్రునాన్ పిరందిలేన్ పిరందపిన్ మరందిలేన్"** అను సూక్తి ద్వారా వెల్లడగుచున్నది.

మానవులు ఎందరున్నా భగవద్ భాగవతాచార్యానుగ్రహ లబ్ధమైన స్వరూప యథాత్మ్య జ్ఞానంతో జీవించడమే జీవితానికి పరమార్థం. అపుడే మానవజీవితానికి సాఫల్యం సిద్ధిస్తుంది అనే సత్యాన్ని గుర్తిద్దాం!

# కూరత్తాళ్వాన్ వైభవం



శ్రీమతి చక్రవర్తుల చూడామణి -ఖమ్మం

ఆఖరికి తనే మనసు దృఢ పరచుకొని "సరే మీకోరిక నెరవేరనీయండి. శ్రీ వైకుంఠం చేరి స్వామి కైంకర్యం పొందండి అని వారి చెవిలో ద్వయమంత్రం ఉపదేశించారు రామానుజులు.

"పంచ సంస్కారం అయినప్పుడే ఆచార్యులు ద్వయ మంత్రం కూడ ఉపదేశిస్తారు కదా! ఇప్పుడు అంతిమదశలో మళ్ళీ ఎందుకు ఆళ్వాన్‌కి ఆచార్యులు ద్వయం ఉపదేశించారు?" వేద అడిగింది.

"ఈ సందేహం రామానుజాచార్యులతో కూరత్తాళ్వాన్ ఇంటికి వెళ్ళిన శిష్యులకు కూడా కలిగింది. అదే విషయం వారు అడిగారు. అందుకు ఆచార్యులు చాలా చక్కగా జవాబు చెప్పారు. "రాజకుమారులకు గొంతు తడి ఆరిపోకుండా పచ్చకర్పూరం నోట్లో వేస్తూ ఉంటారు సేవకులు. అలాగే మన ఆళ్వాన్‌కి ద్వయ మహామంత్రం. వారు నిరంతరం మనసులో ద్వయ మహామంత్రం అనుసంధానం చేస్తూనే ఉండేవారు. పైగా వారు రాజకుమారులు. రాజాధిరాజైన శ్రీరంగని పుత్రులు. జన్మతః కూరం రాజకుమారులు. వారికి ద్వయమహామంత్రం అనుగ్రహించాం. వారి గొంతు తడి ఆరిపోకుండా ఉండటం కోసం" అని చెప్పారు. అలానే ఆళ్వాన్ దగ్గర వీడ్కోలు తీసుకొని తన కుమారులకు చెప్పవలసిన విషయాలు చెప్పి తన ప్రియశిష్యుడైన పిళ్ళైపిళ్ళై ఆళ్వాన్ ఒడిలో తలపెట్టుకొని భార్య అయిన ఆండాళ్ ఒడిలో తన పాదాలుంచి పడుకున్నారు.

ఆళ్వార్లు, ఆళవందార్, ఉడయవర్లను మనసులో నిలుపు కొని శ్రీరంగనాథుని కోవెల వైపు చూస్తూ మోక్ష సామ్రాజ్యమైన పరమపదం చేరారు".

"వేంకట కృష్ణ ఎందుకు ఏడుస్తున్నావు?" వేద అడిగింది.

"ఆళ్వాన్ రంగనాథుడిని అడిగి మరీ అందరూ ఉండి తాను వెళ్ళిపోయారు. అలా అడగకుండా ఉంటే ఇంకా చాలారోజులు ఉండేవారు కదా!" ఎక్కిళ్ళు పడుతూ చెప్పాడు వేంకటకృష్ణ.

"నాబంగారు తండ్రీ! ఆళ్వాన్‌మీద నీకెంత భక్తి కుదిరిందిరా! అదలాగే నిలుపుకున్నావంటే ఉత్తమమార్గం దొరుకుతుంది" అంటూ వాడిని బామ్మ వళ్ళోకి తీసుకుంది గారాబంగా.

"బామ్మా! తిరుక్కొళూరమ్మాళ్ ఆళ్వాన్ గురించి ఏం చెప్పింది?" వేద అడిగింది.

"అవన్ వేండాం ఎన్రేనో ఆళ్వానైప్పోల" అంది. అంటే క్రిమికంఠచోళుని వలన శ్రీమద్రామానుజులు మేల్కోటలో వేంచేసి ఉన్నారు కదా కొంతకాలం. ఆ కాలంలో ఆరాజు కూరత్తాళ్వాన్, పెరియనంబులకు ఆస్థానానికి పిలిపించి కళ్ళు పీకించటం జరిగింది కదా!"

"అవును అదంతా చెప్పావుగా..."

"ఆళ్వాన్ శ్రీరంగం చేరుకున్నాక ఒకరోజు రంగనాథుని సేవించుకుందామని కోవెలకు వెళ్ళారు. అక్కడ ఉన్న కాపలా వాళ్ళు వీరిని లోపలికి పోనీయకుండా అడ్డుకున్నారు. "నన్నెందుకు ఆపారని" ఆళ్వాన్ అడగగా "రామానుజ సంబంధీ కులెవరినీ కోవెల లోకి పోనీయవద్దని రాజాజ్ఞ!" అన్నారు.

అక్కడే ఉన్న కొందరు ఆ మాటలు విని "వీరు రామానుజుల శిష్యులైనప్పటికీ గుణపరిపూర్ణులు, సాత్వికులు మిగిలిన వారిలాంటి వారు కాదు. వీరిని లోపలికి పోనీయండి" అన్నారు.

అది విన్న ఆళ్వాన్ "అందరికీ ఆచార్య సంబంధం వలన గుణపరిపూర్ణత ఏర్పడుతుంది. రామానుజ సంబంధంనుంచి నన్ను దూరం చేసేట్టయితే ఆ గుణపరిపూర్ణత నాకు అక్కర్లేదు, రంగనాథులసేవ అక్కర్లేదు" అని వెనక్కి తిరిగి వెళ్ళిపోయారు.

"అందుకే తిరుక్కొళూరమ్మాళ్ ఆళ్వాన్‌కున్న వైరాగ్యం, ఆచార్యభక్తి నాకు లేవే అని అర్థంలో **"అవన్ వేండాం ఎన్రేనో ఆళ్వానైప్పోల**" అంది కద బామ్మా" వేద.

"సరిగ్గా చెప్పావు తల్లి. మనం వారికథ చెప్పుకోవటంతో ఆగకుండా వారు చూపిన మార్గంలో నడవటానికి ప్రయత్నం చేద్దాం".

*(సశేషం)*

# రామాయణంలో ప్రజాస్వామిక పరిపాలనా విధానాలు

గత సంచిక తరువాయి...

శ్రీమతి డా॥ పి. జ్యోతి- వరంగల్

గూఢచారులను ఎక్కడెక్కడ నియమించాలో తెలిజేయటానికి రాముడు భరతుని క్రింది విధంగా ప్రశ్నించాడు.

**కచ్చిదష్టాదశాన్యేషు స్వపక్షే దశపంచ చ**
**త్రిభి స్త్రిభి రవిజ్ఞాతై ర్వేత్సి తీర్థాని చారకైః ॥** 36 శ్లో॥

"శత్రుపక్షంలోని పద్దెనిమిది తీర్థాలను (స్థలాలను) నీ పక్షంలోని పదిహేను తీర్థాలను ఇతరుల కెవ్వరికి తెలియని ముగ్గురు ముగ్గురు గూఢచారుల ద్వారా తెలుసుకుంటున్నావా?" అన్న ప్రశ్నలోనే గూఢచారి వ్యవస్థ ఏవిధంగా ఉండాలో రాముడు తెలిపాడు.

చారులను ఇతర దేశంలోని రాజుల దగ్గర, శత్రువుల దగ్గర పద్దెనిమిది స్థలాలలో నియమించాలి. తన రాజ్యంలో పదిహేను స్థానాల్లో నియమించాలి. ఒక్కొక్కచోట ముగ్గురు ముగ్గురు చారులను నియోగించాలి.

శత్రురాజ్యంలో యాభైనాలుగు మంది తన రాజ్యంలో నలభై అయిదుమంది చారులుండాలి. ఎక్కడ నియమించిన చారులకైనా వారు చారులని పరస్పరం తెలుసుకోకుండా ఉండేట్లు చూడాలి.

1. మంత్రులు 2. పురోహితులు 3. యువరాజు 4. సేనాపతి 5. ద్వారపాలకులు 6. అంతఃపురాధికారులు 7. అర్థ సంచయ కర్త లేదా ధనాధ్యక్షులు (రాజ్యానికి వచ్చిన ధనాన్ని భద్రపరచే వారు) 9. ప్రాడ్వివాకులు (న్యాయాధికారులు) 10. కారాగారాధికారులు 11. సేనానాయకుడు (సేనలోని సైనికులకు జీతభత్యాల విషయాన్ని పరిశీలించేవాడు) 12. నగరాధ్యక్షుడు (నగర, ప్రాకార, ద్వార రక్షణలకు తగిన ఏర్పాట్లు చేసేవాడు) 13. కర్మాంతికుడు (జీతగాండ్రకు, సైనికులకే గాక మిగిలిన వారందరికి తాను ముందే ఏకమొత్తంగా ధనం తీసుకొని వారి వారికి వేరు వేరు అధికారులతో ఇప్పించేవాడు) 14. సభాధికృతులు లేదా సభ్యులు (రాజుగారు సభకు వచ్చేలోపల సభను సిద్ధం చేయటం, మంత్రుల, మిగిలిన వారికి యథోచిత ఆసనాలు సిద్ధం చేసి సభారక్షణను కల్పించటం మొదలైన వ్యవహారాలను చూసేవారు) 15. ధర్మాధ్యక్షుడు (ప్రజలకు సంబంధించి న్యాయపరిష్కారంలో ధర్మా ధర్మ వివాదాలను, ధర్మశాస్త్రాన్ననుసరించి చేసేవాడు.) 16. దండపాలుడు (అపరాధాలు చేసినవారికి రాజు విధించిన శిక్షలను అమలు చేసేవాడు) 17. దుర్గపాలుడు (గిరి, వన, జల దుర్గాలను సంరక్షించేవాడు.) 18. రాష్ట్రాంత పాలకుడు (రాష్ట్రపు సరిహద్దులను ఇతర రాజులు ఆక్రమించుకోకుండా రక్షణ కల్పించేవాడు) అనే పద్దెనిమిది స్థలాలలో శత్రురాజ్యాలలో చారులను నియమించాలి.

తన రాజ్యంలో మంత్రులపై పురోహితులపై యువరాజుపై గూఢచారులను నియమించరాదు. కాని వారినే రాజే స్వయంగా పర్యవేక్షిస్తూ వారి స్వభావాన్ని అంచనా వేయాలి. శత్రురాజ్యంలో మాత్రం వారి ముగ్గురిపైన చారవ్యవస్థను ఏర్పాటు చేయాలి. రాముడు భరతుని అడిగిన ప్రశ్నలో ఇటువంటి గూఢచార విధానాలు నాడు ఎట్లున్నాయో తెలుస్తున్నాయి. ఓడిపోయిన శత్రువులను వారు దుర్బలులే కదా అనే తిరస్కారభావంతో చూడవద్దు. వారిపట్ల జాగ్రత్త అవసరం.

ఇంకా నాస్తికులైన వారి గురించి ఈ విధంగా రాముడు భరతునికి హితవు చెప్పాడు.

**కచ్చిన్న లోకాయతికాన్ బ్రాహ్మణాం స్తాత సేవసే**
**అనర్థ కుశలాహ్యేతే బాలాః పండితమానినః ॥** 8

ఈ లోకం గురించి ఆలోచించే నాస్తికులైన బ్రాహ్మణులను నీ దగ్గరకు రాకుండా చూసుకుంటున్నావు కదా! మేమే పండితులమని భావించే అజ్ఞానులు ఎన్నో అనర్థాలను కలిగిస్తారు. దేవుడు లేడన్నవారు నాస్తికులు కారు.

వేదం ప్రమాణం కాదన్నవారే నాస్తికులు. అటువంటి వారిని ఆశ్రయిస్తే రాజుకు ధర్మానుష్ఠానాలపై శ్రద్ధ తగ్గుతుంది. తద్వారా రాజుకు, రాజ్యానికి నష్టం వాటిల్లుతుందని రాముడు భరతునికి స్పష్టం చేశాడు.

అంతేకాక మనకోసం రాజ్యాన్ని మన పూర్వీకులు ఎంతో జాగ్రత్తగా రక్షిస్తూ వచ్చారు. నీవు కూడా రాజ్యం సమృద్ధంగా, ఆనందంగా ఉండేటట్లు పరిరక్షణ చేస్తున్నావా? అని కర్తవ్యబోధ చేశాడు. వ్యవసాయం చేసే కృషీవలులను, గోరక్షకులను, క్రయవిక్రయాది వ్యాపారం చేసే వారిని ఆదరంతో చూస్తూ వారికి తగిన వసతులను కల్పిస్తేనే ఆ రాజ్యంలో అందరూ సుఖపడతారు అని చెప్పి స్త్రీలతో మంచిగా మాటలాడుతూ వారిని భద్రంగా రక్షిస్తున్నావు కదా! వారి మాటలను నమ్మటం లేదు కదా? వారికి రహస్యాలేమి కూడ చెప్పటం లేదు కదా! అని ప్రశ్నించాడు. కుటుంబ స్త్రీలకు రాజకీయాలు తెలిస్తే వారి నుండి రహస్యం రాబట్టటం చాలా తేలిక. అందువల్ల శత్రువుల ప్రవేశం సులభమవుతుందని రాముని భావం.

రాజు ప్రతిరోజు సభ్యులకు, సామంతరాజులకు, ప్రజలకు కనిపించేటప్పుడు, సామాన్యవేషంలో కాక అలంకరించుకుని కనిపించాలి. చాలారోజులు సభకు రాకుండా ఉండకూడదు. రాజ్యంలో పనిచేసే అధికారులు రాజును చూడటానికి భయపడవద్దు. పూర్తిగా దూరంగా ఉండిపోకుండా, ఎక్కువ చనువుకాక మధ్యేమార్గంలో వారితో ప్రవర్తించాలని, భరతునికి రాముడు చెపుతాడు.

రాజ్యంలో ఆదాయం ఎక్కువ, వ్యయం తక్కువగా ఉండేటట్లు జాగ్రత్తగా చూసుకోవటమే కాక ధనం అపాత్రుల చేతులలోనికి పోవద్దు. ఎవరినైనా దండించే విషయంలో రాజు అప్రమత్తంగా ఉండాలి. ధార్మికుడైనవాడు ఇతరుల కుట్రవల్ల అతనిపై అపరాధం ఆరోపించబడితే శాస్త్రంలో నేర్పు కలవారితో వాడిని ప్రశ్నింపచేయకుండానే దురాశతో వాడిని చంపించటం లేదు కదా! అని భరతుని అడుగుతాడు.

అదేవిధంగా చోరుడు పట్టుబడితే ప్రశ్నింపబడి నేరం ఋజువైతే, అతడు దొంగ అని నిర్ధారింపబడిన తరువాత కూడ ధనలోభంవల్ల వాడిని వదిలివేస్తున్నావా? ధనవంతునికి కష్టం వచ్చినపుడు, దరిద్రునికి కష్టం వచ్చినపుడు పక్షపాత బుద్ధిలేక వ్యవహార నిర్ణయం చేస్తున్నావు కదా! ధర్మార్థ కామాలను విభజించి ఆర్జించి అనుభవిస్తున్నావా! రాజ్యంలో పౌరులు, జానపదులు, బ్రహ్మవేత్తలు అందరూ నీ క్షేమాన్నే కోరుతున్నారా? అని ప్రశ్నల రూపంలో రాజైనవాడు చేయవలసిన కార్యాలు రాముడు భరతునికి బోధించాడు.

చేయవలసినవే కాక రాజు చేయకూడని పద్నాలుగు దోషాలను క్రింది విధంగా వివరించాడు.

నాస్తికత్వం, అసత్యం, క్రోధం, ఏమరుపాటు, దీర్ఘసూత్రత, (చేయవలసిన పనిని నిర్ణయించుకోలేక దీర్ఘాలోచన చేయటం) జ్ఞానవంతులను దర్శించుకోకపోవటం, సోమరితనం, పంచవృత్తిత (ఇంద్రియాలకు లొంగిపోవుటం) మంత్రుల అవసరం లేదని తానొక్కడే ఆలోచన చేయటం, విషయం అర్థం కాని వారితో ఆలోచనలు చేయటం, నిర్ణయించిన కార్యాలు ప్రారంభించక పోవటం, అందరికీ క్షేమాన్ని కలిగించే మంగళకరమైన పనులు చేయకపోవటం, చాలామంది శత్రువులను ఒకేకాలంలో ఎదిరించటం అనే దోషాలను త్యజించాలి.

అంతేకాక అనుసరించవలసిన విధానాలను క్రింది విధంగా చెప్పినాడు.

దశవర్గం, పంచవర్గం, చతుర్వర్గం, సప్త, అష్ట, త్రివర్గాలు, మూడువిద్యలు, ఇంద్రియజయం, షాడ్గుణ్యం, దైవమానుషాలు, కృత్యం వింశతివర్గం, ప్రకృతులు, మండలం, యాత్రావిధానం, దండవిధానం, సంధివిగ్రహాలు మొదలైన వాటిని తగిన విధంగా అర్థం చేసుకొని అనుసరిస్తున్నావా అని రాముడు భరతుని అడిగాడు. *(సశేషం)*



నూతన అతిథిభవన గృహప్రవేశ వివరాలు 34పేజీలో....




వైశారదీ

*పాండ్య భట్టర్ సాయించిన తనియన్:*

**మిన్నార్ తడమదిళ్ శూళ్ విల్లిపుత్తూర్ ఎన్ఱొరుకాల్**
**శొన్నార్ కళఱ్కమలం శూడినోం, మున్నాళ్**
**కిళి యఱుత్తా నెన్ఱురైత్తోమ్, కీళ్మైయినిల్ శేరుమ్**
**వళి యఱుత్తోమ్ నెఞ్జమే వన్దు.**

**వన్దు** = ఇంతవరకు వచ్చాక (ప్రస్తుతం)

**మిన్** = మెరుపులతో

**ఆర్** = ప్రకాశించు

**తడ** = విష్ణుచిత్తులు నిర్మించిన, విశాలమైన

**మదిల్** = ప్రాకారములతో

**శూళ్** = చుట్టుకొని ఉన్నది

**విల్లిపుత్తూర్** = శ్రీ విల్లిపుత్తూరు

**ఎన్ఱు** = అని

**ఒరుకాల్** = ఒకసారి

**శొన్నార్** = పలికినవారియొక్క

**కళల్** = శ్రీపాదములనెడి

**కమలం** = కమలములను

**శూడినోం** = శిరసా ధరించితిమి.

**మున్నాళ్** = పూర్వము

**కిళియఱుత్తాన్** = విద్యాశుల్కపు మూటను తెంపెను

**ఎన్ఱు** = అని

**ఉరైత్తోం** = నోరారా పలికితిమి.

**నెంజమే!** = ఓ మనసా!

**కీళ్మైయినిల్** = అధోగతిని, నరకాది లోకములను

**శేరుం** = చేరెడి

**వళి** = మార్గమును

**అఱుత్తోం** = ఛేదించితిమి.

*తా:* పాండ్యభట్టర్‌వారు క్షుద్రవిషయములవైపు పరుగులు పెట్టే తన మనస్సు, ఈనాటికి ఆ మార్గాన్ని వదిలిపెట్టి అనుకూలంగా మారినందకు సంతోషిస్తూ తమ మనస్సుతో తామే చెప్పుకుంటున్నారు.

1. "ఓమనసా! ప్రకాశించు ఉన్నతమైన ప్రాకారాలతో కూడి యున్న 'శ్రీవిల్లిపుత్తూరు' అని పెరియాళ్వారును, ఆండాళును ఆవిర్భవించిన ఆ దివ్య క్షేత్రమును ఒకసారి భక్తితో కీర్తించు భాగవతోత్తముల శ్రీపాదకమలములను శిరసా ధరిద్దాం.

2. "పూర్వము పరతత్త్వ నిర్ణయ విషయంలో చర్చలు జరుగుతున్న సమయంలో పాండ్యరాజు స్థాపించిన సభలో సుస్పష్టముగా విష్ణువే పరతత్త్వమని స్థాపించి, విద్యాశుల్కపు మూట తెగిపడునట్లుచేసి రాజుచేసిన సమ్మానమును విష్ణుచిత్తులు స్వీకరించిరి.

ఓ మనసా! ఈ విధంగా పెరియాళ్వారుల సంబంధం కలిగిన శ్రీవిల్లిపుత్తూరును, వారి విజయగాథను స్మరించడం ద్వారా మనకిక ఏదుర్గతీ ఉండదు. ఇకముందు నరకాది లోకాలకు పోవలసిన దుస్థితిని తప్పించుకోగలిగాం.".

పాండ్యభట్టర్ ఈ పాశురంలో విష్ణుచిత్తులని, వారి విజయగాథని స్మరించడం ద్వారా తమకిక అధోగతి ఉండదని విశ్వసించారు!

**పాణ్డియన్ కొణ్డాడ పట్టర్ పిరాన్ వన్దానెన్ఱు**
**ఈణ్డియ శఙ్ఖ మెడుత్తూద, వేణ్డియ**
**వేదఙ్గళోది విరైన్దు కిరియఋత్తాన్**
**పాదఙ్గళ్ యాముడైయ పత్తు.**

**పట్టర్పిరాన్** = శ్రీభట్టనాథులు (విష్ణుచిత్తులు)
**వన్దానెన్ఱు** = వచ్చినారు అని,
**పాణ్డియన్** = పాండ్యదేశ మహారాజైన వల్లభదేవుడు
**కొణ్డాడ** = కీర్తించగా
**ఈండియశఙ్ఖం** = గొప్ప జయమునిచ్చు శంఖమును
**ఎడుత్తూద** = ఎత్తి ఊదుచుండగ
**వేణ్డియ** = అవసరమైన
**వేదంగళ్** = వేదప్రమాణములను
**ఓది** = పలికి
**విరైన్దు** = శీఘ్రముగానే
**కిరి అఋత్తాన్** = మూటనుతెంపిన విష్ణుచిత్తుల
**పాదంగళ్** = శ్రీపాదపద్మములే
**యాం ఉడైయ** = మేము లభించిన
**పత్తు** = రక్షకము.

"బ్రాహ్మణోత్తములైన విష్ణుచిత్తులనే శ్రీపెరియాళ్వారులు వచ్చినారు" అని పాండ్యదేశమహారాజు సభలో ప్రశంసింపగా, భక్తులందరును గూడి సంతోషముతో శంఖనాదములను చేయగా, అవసరమగు పలు వేదప్రమాణములను చూపి పరతత్త్వము **శ్రీమహావిష్ణువేనని** స్థాపించి సమ్మానరూపమగు శుల్కద్రవ్యమును సంపాదించిన ఈ పెరుయాళ్వారుల శ్రీపాద పద్మములే మాకు సర్వదా ఆశ్రయణీయములు. *(సశేషం)*



## ఉ.వే.ప్ర. శ్రీమాన్ ఆచి శ్రీనివాసాచార్యస్వామివారి - పరమపదప్రాప్తి

సుప్రసిద్ధ విశిష్టాద్వైత పండితులు, ఉపన్యాసకేసరి, అష్టావధానులు, పరమ పదవాసులు అయిన ఉ.వే.ప్ర. శ్రీమాన్ ఆచి వేంకట నృసింహాచార్య, ఆవునూర్ స్వామివారి సచ్ఛిష్యులు, సుపుత్రులైన ఉ.వే.ప్ర. శ్రీమాన్ ఆచి శ్రీనివాసాచార్య స్వామి ది. 15.04.2011న స్వాచార్య శ్రీచరణాలను చేరినారు.

వీరి పరమపదోత్సవము ఏప్రిల్ 27న వారి స్వగృహమున హైదరాబాద్‌లో శ్రీశ్రీశ్రీ చిన్న జీయర్ స్వామివారి ప్రత్యక్ష పర్యవేక్షణలో జరిగింది. శ్రీశ్రీశ్రీ జీయర్ స్వామివారు, శ్రీమాన్ సముద్రాల వేంకట రంగరామానుజాచార్యస్వామివారు, శ్రీమాన్ శిరిశనగళ్ వేంకటాచార్యస్వామివారు, శ్రీమాన్ అమరవాది వేంకట నృసింహాచార్యస్వామి వారు, శ్రీమాన్ స్థలశాయి స్వామివారు శ్రీమాన్ ఆచి శ్రీనివాసాచార్యస్వామివారు 30 సం॥రములుగ కావించిన కృషిని, ముఖ్యంగా ఇటీవల కాలంలో కావించిన భగవద్విషయ కాలక్షేపమును ప్రశంసిస్తూ యువతరం నిర్మాణానికై వారు శ్రమించిన తీరును కొనియాడారు. శ్రీశ్రీశ్రీ చిన్న జీయర్ స్వామివారు అర్చిరాది సారమును ప్రవచించి శ్రీమాన్ ఆచి శ్రీనివాసాచార్యస్వామివారు కుటుంబమునకు, భక్తజనానికి మంగళాశాసనములను కృపచేశారు.

శ్రీమాన్ ఆచి శ్రీనివాసాచార్యస్వామివారు విక్రమ నామ సం॥ మాఘ శుద్ధ భీష్మాష్టమి 04-02-1941న సిరిసిల్ల, కరీంనగర్ జిల్లాలో జన్మించారు. వీరు ఎమ్.ఎ., బి.ఇ. పట్టభద్రులై ప్రభుత్వ పాలనా శాస్త్రోపన్యాసకులుగా పదవీ విరమణ కావించి తదనంతరం సంప్రదాయ ప్రచారమునకే తమ జీవితాన్ని అంకితం చేశారు. వీరు తమ తండ్రిగారివద్ద మరియు ఉ.వే.ప్ర. శ్రీమాన్ కందాళై రంగాచార్యస్వామి, శ్రీ.ఉ.వే.శ్రీమాన్ శతావధాని కృష్ణమాచార్యస్వామివారల వద్ద తిరుప్పావై, ఉపనిషత్తులు, తిరుమంత్రార్థము, శ్రీవచనభూషణము, భగవద్విషయము, శ్రీభాష్యము మరియు గీతాభాష్యములను సేవించి అనేక స్థలాల్లో ప్రవచనములను కాలక్షేపములను 30 సం॥రములు కావించారు.

శ్రీమదాత్తిన్ నృసింహదేశికులవద్ద సంస్కారములను పొందిన వీరు ఉభయవేదాన్తచార్య పీఠంలో శాశ్వత సభ్యులు.

శ్రీరామాయణానుభవమును 6 భాగములుగను, భగవద్విషయ సారాన్ని "భక్తామృతం" అనే గ్రంథంగాను ముద్రించారు. వీరిని శాస్త్ర విద్వన్మణి, ప్రవచన శిరోమణి, ఉపన్యాస వాచస్పతి, ఇత్యాది బిరుదులతో లోకం సత్కరించుకుంది.

# మన దర్శనం 'సు' దర్శనం

పూర్వమీమాంస
వైశేషిక
న్యాయ
యోగం
సాంఖ్య

వైశారదీ

## మారని సత్యం సనాతనం

భారతభూమి జ్ఞానానికి పుట్టినిల్లు. యథార్థ జ్ఞానాన్ని పండించే సుక్షేత్రం. సనాతనమైన సత్యాలు మానవాళికి అందించిన మహానుభావులు ఎందరో ఈ బంగారుభూమి లోంచి ఆవిర్భవించారు. సత్యాలు ఎప్పుడూ మారవు కనుక వాటిని సనాతనాలు అన్నారు.

ఆ సనాతనమైన సత్యజ్ఞాన సంపదకి మనమంతా వారసులం. జన్మసిద్ధమైన ఈ హక్కు మనకందరికీ సంక్రమించింది. పోరాడి సంపాదించనక్కర్లేదు. జన్మసిద్ధమైన హక్కుని ఉపయోగించుకోలేకపోతే నష్టపోయేది మనమే కదా! ఆ సంపదలు మాత్రం ఎవరో ఒకరి చేతిలో ఎప్పుడూ వుంటూనే ఉంటాయి. మన సంపదను పరాయి వాడెవడో తెచ్చి మనకి ఇవ్వక్కర్లేకుండా ఉండేట్టు చూసుకోవడం అంటే మన సంపదను మనమే జాగ్రత్త చేసుకోవడమనేది ఉత్తమం.

మన ప్రాచీనులు ప్రాపంచిక సుఖాలకి మాత్రమే ప్రాధాన్యాన్నిచ్చి ఊర్కోలేదు. ఆంతరమైన మానసిక శాంతికి కూడా సాధనాలు అన్వేషించి అందించి ఉంచారు.

మనిషి మనిషిగా మనుగడ సాధించాలంటే మంచి మనసు ఉండాలి. ఆ మనసు స్వాధీనంలో ఉండాలి. ఉద్రేకం లేకుండా ప్రశాంతంగా ఉండాలి. ప్రేమ నిండి మరీ ఉండాలి. తనకు కలిగినది పదిమందికి పంచి ఇవ్వాలనే ప్రవృత్తి ఉండాలి. అయితే ఇవన్నీ దూరపుకొండలే అన్పించినా 'వీటిని సంపాదించుకోవాలి' అనుకునే వారికి మాత్రం సాధన సామగ్రిని పండించి ఇవ్వగలిగే శక్తి ఈ బంగారు భూమికి మాత్రమే ఉంది.

'సనాతనం' అంటే చాలా పాతది అంటారు కొందరు. మారే ఈ రోజుల్లో మారే విజ్ఞానంతో అమరగలిగేవి మనకి కావాలి తప్ప 'పాత చింతకాయ పచ్చడి మనకెందుకు!' అంటూ ఆక్షేపించేవారు కొందరు లేకపోలేదు. అలాంటి వాళ్ళు ఈ 'సనాతనం' అంటే ఏమిటో ముందు తెలుసుకోవాలి.

'సదా' ఎప్పటికీ మారకుండా ఒక పద్ధతిలో ఏదైతే 'అస్తి' ఉందో దానిని 'సనాతనం' అంటారు. ఉదాహరణకి 'నీరు మన నదుల్లో, సముద్రంలో కొన్నివేల సంవత్సరాలుగా ప్రవహిస్తూనే ఉంది. ఆ నీరే ఈనాడు మనిషికి ప్రాణధారక మౌతోంది. ప్రవహిస్తున్న నీరేమీ మారటంలేదు. చక్రగతిలో అదే నీరు మళ్ళీ మనకు అందుతోంది. అలానే గాలికూడా.

ఈ మట్టికూడా నివాసభూమి అవుతూనే ఉంది. మనకి కన్పించే వాటిల్లో చాలా కాలంగా ఇవి ఉంటున్నాయి కనుక, వీటిని దృష్టాంతాలుగా చెప్పుకున్నాం. కాని అసలు ఇవి కూడా కొంతకాలానికి పోతూనే ఉంటాయి. గ్రహాల పరిభ్రమణం, వాతవరణంలో వచ్చే మార్పులు దానికి కారణం కావచ్చు.

మారే వాతావరణానికి కాని, మారే పరిస్థితులకు కాని మారకుండా స్థిరంగా, శాశ్వతంగా నిలవగలిగేదేదో అదే 'సనాతనం'. అలాంటి తత్వాన్ని గుర్తించే జ్ఞానాన్ని సువిజ్ఞానం అంటారు. ఆ జ్ఞానాన్ని సాధించిన నాడే మానవుడు ఇతర జీవకోటి మీద తన ఆధిపత్యాన్ని స్థిరపరుచుకున్న వాడు అవుతాడు. దానికి కావలసిన సాధనాలు అవలంబించడానికి మనిషికి శక్తి ఉంది. యథార్థ జ్ఞానాన్ని సాధించడానికి తమ శక్తిని వినియోగించగల వాళ్ళు ఎవరో వాళ్ళే కదా తత్ఫలితాన్ని కూడా సాధిస్తారు! అలా ప్రయత్నించి సనాతనమైన తత్వాన్ని దర్శించిన మహానుభావుల్ని 'ఆర్యులు' అన్నారు. అలాంటి వారు నివసించిన భూమి మనది కనుక దీనిని 'ఆర్యావర్తము' అని పిలిచేవాళ్ళు.

ఈ 'ఆర్యులు' అనే పదం గత రెండు, మూడువందల సంవత్సరాలుగా చాలా వివాదాస్పదమైంది. హిమాలయపు ఉత్తరతీరాల నుంచి సింధులోయ ఆవలినుంచి, హిమాలయాల దక్షిణానికి వలస వచ్చినవారే 'ఆర్యుల'ని అంతకుముందు ఈ దక్షిణప్రాంతంలో ఉన్నవారు ద్రావిడులో, అనార్యులో అని ఆ ఆర్యులు ఇక్కడి వాళ్ళను అణచివేసి తమ సంస్కృతి, సాంప్రదాయాలు వీళ్ళమీద రుద్దారని 'తద్వారా తమ ఆధిపత్యాన్ని స్థిరపరచుకున్నారు' అనే వాదనను మనం వింటూనే ఉన్నాం. ఈనాటి సమాజంలో కన్పించే రకరకాల చెడువ్యవస్థకి కూడా వాళ్ళే పునాదులు వేసారని కూడా ఆరోపిస్తుంటారు. కాని ఇవన్నీ కల్పనలని గుర్తించాలి. ఆంగ్లేయులు మన జాతిని నాశనం చేయడానికి నిర్మాణాత్మకంగా తయారు చేసి పెట్టిపోయినకుట్ర. దాన్ని మనం వదల్లేకుండా ఉన్నాం. ఆ శబ్దానికి అర్థం తెలుసుకోవడం చాలా అవసరం.

'ఆర్యులు' అంటే పూజ్యులు. **"ఆరాత్ యాతి బుద్ధిః ఏషాం తే ఆర్యాః"** అని ఈ పదానికి నిర్వచనం. అంటే సమాజ శ్రేయస్సుకు, సర్వమానవాళి హితానికి దగ్గరగా, దానికి విపరీత మైన వాటికి దూరంగా జీవించాలనే బుద్ధి కలవారిని 'ఆర్యులు' అంటారు. వారు ఏ దేశంలో పుట్టినా సరే... ఏ జాతికి చెందిన వారైనా సరే... వారి జ్ఞానాన్ని బట్టే కదా వారికి విలువ! అలాంటి వారు అన్ని ప్రాంతాల్లోను ఉండవచ్చు. ఏ కాలంలోనైనా ఉండవచ్చు. వాళ్ళని 'ఆర్యులు' అన్నారు. ఇప్పటికీ అలాంటి వాళ్ళనే 'ఆర్యులు' అనాలి. ఆర్యులంతా ఋషులుకారు, కాని ఋషులంతా మాత్రం ఆర్యులే!

భారతీయ సమాజంలో కుటుంబ వ్యవస్థ చాలా ప్రధానమైంది. దీనిని ఏర్పరచిన వాళ్ళు ఆర్యులే... సందేహం లేదు. అయితే ఈ కుటుంబ వ్యవస్థని ఏర్పాటు చేయడంలో వాళ్ళు ఎన్నిరకాల జాగ్రత్తలు తీసుకున్నారో ఆలోచిస్తే ఎంత వాడికైనా ఆశ్చర్యం కలక్కమానదు. ఏ ఏ వ్యక్తి ఏ ఏ రకమైన జీవలక్షణాలు కల్గివున్నాడో, ఆ జీవలక్షణాలని అతడెలా పెంచుకోవాలో, తనలోని ప్రజ్ఞాపాటవాలను పరంపరగా తనవంశంలో సాగాలంటే ఏ రకమైన వ్యక్తితోటి తాను వివాహాదులు జరుపుకోవాలో వాళ్ళు చెప్పారు.

మంచిఫలాన్ని పొందడానికి మేలురకానికి చెందిన బీజాలు ఎంత ప్రధానమో... సుక్షేత్రం కూడా అంత ప్రధానం. అంటే స్త్రీ పురుషుల వివాహ వ్యవస్థకి సంతానం కనిపారేయడమే ప్రధానాశయం కాకూడదు. ఆ సంతానం సమాజాన్ని పాడుచేసేది కాకుండా, ఆదర్శ వంతంగా.... సమాజం చేత ప్రశంసలందుకునేదిలా ఉండాలి.

అధిక దిగుబడి ఇవ్వాలి అనుకున్న రైతు ఏదో రకమైన విత్తనాలు, ఎలాగో అలా నేలలో నాటాడే అనుకోండి. అనుకున్న విధంగా ఫలసాయం పొందలేకపోవడం శ్రమంతా వ్యర్థ మవడం మనమూ చూస్తున్నాము కదా! విత్తుయొక్క సారాన్ని పరిశీలించి, లోపం ఉంటే తొలగించి కావల్సిన రీతిలో విత్తులు తయారు చేసుకుంటున్నాడు. నేలలో సారం లేదని తెలిస్తే దానికి యోగ్యత కల్పించుకుంటున్నాడు... లేదా సారవంతమైన మరో నేలైనా వెతుక్కుంటున్నాడు. అవకాశం ఉన్నచోట ఆ నేలని సారవంతం చేసుకోవడానికి ప్రయత్నిస్తున్నాడు. కాదూ... ఆ నేలకి తగిన పంటలేవో వేస్తున్నాడు.

స్థావరాలైన గింజలకే అంత శ్రద్ధ తీసుకుంటే, ఒక మనిషిని సమాజానికి అందించాలంటే ఎన్ని జాగ్రత్తలు తీసుకోవాలో కదా! శక్తిమంతమైన సమాజ నిర్మాణాన్ని దృష్టిలో పెట్టుకున్నవారే ఆర్యులు. స్త్రీని క్షేత్రంగా, పురుషుణ్ణి బీజంగా గుర్తించారు కనుకనే ఎలాంటి పంట నందిస్తే మనమంతా సుఖంగా ఉంటామో వారు చెప్పారు.

ప్రశాంతజీవనాన్ని కొనసాగించడానికి ఆర్యులు ఏర్పరచిన వివాహవ్యవస్థే భారతీయసమాజ నిర్మాణానికి పునాది అయింది. ఎవరెవరు ఎవరితో వివాహాలు జరిపించుకోవాలో, ఆహార విహారాదుల విషయంలో ఎలా నడుచుకోవాలో విస్తృతమైన పరిశోధనలు చేశారు. తాము పెట్టే నియమాలను పాటించని వాళ్ళని చిన్నచూపు చూడలేదు. వెలివేయలేదు. మనిషి అన్న తరువాత బలహీనతలుండటం సహజం. మనసులో మంచి చేద్దామని ఉన్నప్పటికీ కొన్ని పరిస్థితుల ప్రభావాలకులోనై పతనం కావడం జరుగుతుంది. అలాంటప్పుడు సమాజంలో రకరకాల సాంకర్యం ఏర్పడటం సహజం. అయితే వాళ్ళూ ఏదోరకంగా బ్రతికి బట్ట కట్టవలసినవాళ్ళే. అలా జన్మించే మనుష్యులలో అనులోమజాతులు, ప్రతిలోమ జాతులు కూడా ఉంటాయి. వాళ్లుకూడ జీవించాలి. ఈ సమాజవ్యవస్థలో వాళ్ళూ ఒక భాగమే! అలాంటి వాళ్ళకి కూడా కొన్ని వృత్తులు కల్పించి, వాళ్ళని కూడా సామాజిక జీవనస్రవంతిలో ఒకభాగంగా చేర్చేశారు.

ఆర్యులు చేసిన మహోపకారం ఏమిటంటే ఏవో లేనిపోని కొన్ని కొత్త నియమాలు పెట్టి వాటి ప్రకారం నడుచుకోమని మిగతావాళ్ళన్ని శాసించలేదు. ఈ సమాజాన్ని గమనించి ఆయా వ్యక్తుల సమస్యల్ని సానుభూతితో అర్థం చేసుకొని, ఎలా జీవిస్తే అది జనసామాన్యానికి హితకరమౌతుందో అలాంటి విషయాలనే ప్రబోధించారు. తమ ఆధిక్యాన్ని చాటుకోవాలని కాని, పెత్తనాన్ని చెలాయించాలని కాని ప్రయత్నం చేయలేదు వారు. ఉన్నంతలో అందరితో కలిసి సర్దుకుపోతూ సహజీవనం చేసే మనస్తత్వాన్ని చూపారు. సామరస్యంతో మనుగడ సాగించడానికి కావలసిన చక్కటి బాటను చూపారు. ఎక్కువమంది ప్రయోజనం కోసం తక్కువమందికి కలిగే నష్టం పట్టించుకోనక్కర్లేదు. 'సమాజానికి హానికరమౌతుంది' అనుకున్న వాటిని వారు గట్టిగా నిరసించారు కూడా. దానివల్ల నష్టపడ్డ వ్యక్తికి తాత్కాలికంగా కష్టం అన్పించినా సువిశాల సమాజాన్ని, సుదూర సుందర భవిష్యత్‌ను మనం లెక్కలోకి తీసుకున్నప్పుడు ఇలాంటి కష్టాలను కొన్నింటిని భరించక తప్పదు. ఇది మన ఆర్యులు చేసిన మేలు. *(సశేషం)*

# మన ఆళ్వార్లు



వైశారదీ

లోకంలో అందరూ భగవదనుగ్రహం కోసం ప్రాకులాడ తారు. కానీ ఆ భగవంతుడే ఆళ్వార్ల ఆదరం కోసం అభిమానం కోసం అర్రులు చాచినట్లు వారి చరిత్ర చెప్తోంది. పరమకారుణికు లైన ఆళ్వార్లు ఈ ప్రాణికోటి అంతా తరించాలని ఆరాటపడ్డారు. మనం చేయవలసిందల్లా వారిని ఆశ్రయించగలగడం. భగవంతుణ్ణాశ్రయిస్తే చూస్తాడో, చూడడో తెలియదు. పైగా మన దోషాలు ఆయనకి కోపాన్నే పెంచుతాయి. ఘనంగా దయచూడవచ్చినా ఘోరంగదండన విధించి మరీ పోదామని పించుతుంది. అందుకే నేరుగా ఆ భగవంతుణ్ణాశ్రయించడం ప్రమాదకరం. నిగ్రహానుగ్రహ సమర్థత భగవంతుణ్ణి మననుంచి దూరమే చేస్తుంది. ఇది మన దోషమే, ఆయన లోపం కాదు.

అయినా బాగుపడాలనుకొనే భక్తునికి, భగవంతునికంటే, ఆళ్వార్లే సులభులు. వీరిలో అనుగ్రహమే తప్ప ఆగ్రహముండదు. మనం దూరంగ పారిపోతున్నా వారు మనవెంట పరుగులు పెడతారు. మనం వినలేమన్నా, బలవంతంగా వినిపిస్తానంటారు. మనలోని లోపాలే వారికి మనపైకల ప్రేమను మరింత పెంచుతాయి. జాలి కల్గిస్తాయి. మనమీదనుంచి అనాదిగ ప్రోగు చేసుకొని పెంచు కున్న పాపరాశి, కర్మబంధమూ, అహంకారమూ తొలగించేంత వరకూ, మన శోకాలు బాపునంతవరకూ వారికే సుఖమూ, శాంతీ లేదని బాధపడి పోతారు. మనం ఆనందంగ బ్రతికితే అదేదో వారికి గొప్పఉపకారమైనట్టు భావిస్తారు. అంతేకాదు భగవంతుణ్ణి నిర్బంధించి అయినా మన మొరలాలకించేట్టు చేస్తారు. అందుకే వీరినాశ్రయించడమే అన్నిరకాలుగాను శ్రేయస్కరం, ప్రమాద రహితము. మన ఆళ్వార్లందరిని ప్రతినిత్యం ఈ క్రింది శ్లోకంతో ఆశ్రయిద్దాం.

భూతం సరశ్చ మహదాహ్వయ భట్టనాథ
శ్రీభక్తిసార కులశేఖర యోగివాహాన్।
భక్తాంఘ్రిరేణు పరకాల యతీంద్రమిశ్రాన్
శ్రీమత్ పరాంకుశ మునిం ప్రణతోఽస్మి నిత్యమ్॥

గురుపరంపరలోని ఈ శ్లోకం పన్నెండుమంది ఆళ్వార్ల పేర్లను మనకు తెలుపుతోంది. వీరి సంప్రదాయ నామాలను కూడా మనం తెలుసుకుందాం!

| సంస్కృతనామం | ద్రవిడ నామం |
|---|---|
| 1. భూతయోగి | పూదత్తాళ్వార్ |
| 2. సరోయోగి | పొయ్‌గైఆళ్వార్ |
| 3. మహాయోగి | పేయాళ్వార్ |
| 4. భట్టనాథ/విష్ణుచిత్త | పెరియాళ్వార్ |
| 5. శ్రీ/గోదా/ఆముక్తమాల్యద | ఆండాళ్/చూడికొడుత్త నాచ్చియార్ |
| 6. భక్తిసారులు | తిరుమజిశైయాళ్వార్ |
| 7. కులశేఖరులు | కులశేఖరాళ్వార్ |
| 8. యోగివాహన/మునివాహన | తిరుప్పాణాళ్వార్ |
| 9. భక్తాంఘ్రిరేణు/విప్రనారాయణ | తొండరడిప్పొడియాళ్వార్ |
| 10. పరకాల/కలివైరి | తిరుమంగైయాళ్వార్ |
| 11. పరాంకుశ/శఠకోప/శఠారి | ఆళ్వార్/నమ్మాళ్వార్/కారిమారన్ |
| 12. మధురకవి | మధురకవిఆళ్వార్ |

ఈ పన్నెండుమంది ఆళ్వారులలో ఎవరు ఏ జాతి అయినా కాని వారికి కలిగినది అనన్య సామాన్యమైన భగవద్భక్తి. దానితో భగవంతునిపై వారికి విడరాని ఆసక్తి. వారందరిలోకి పెద్ద ఆళ్వారుగా ఘనకీర్తిని గాంచినవారు శ్రీవిష్ణుచిత్తులు. వారి చరిత్రను ముందుగా మనం తెలుసుకుందాం!

## విష్ణుచిత్తులు – "పెరియ" ఆళ్వార్

అది పాండ్యదేశపు రాజధాని. మదురైనగరం. గాఢంగా వ్యాపించిన చీకట్లను చీల్చుకొంటూ ఇరువురు వ్యక్తులు చరచరా ముందుకు సాగుతున్నారు. ప్రశాంత గంభీరంగా ఉన్నవారి చూపులు అన్ని దిక్కులనూ పరిశీలిస్తున్నాయి. చకచకా సాగిపోయే వారి గమనం ఓ యింటి ముందర ఆగింది.

ఆ యింటి అరుగుమీద ఓ ముగ్గురు వ్యక్తులు మాటలాడు కొంటున్నారు.

"ఎవరు మీరు? ఏం చేస్తున్నారిక్కడ?" గంభీరంగా ప్రశ్నించారా ఇరువురూను.

"ఉత్తరదేశయాత్ర ముగించి, స్వదేశానికి తిరిగి పోతున్న బాటసారులం బాబూ!

ఇక్కడ కొంత విశ్రమించి, తెల్లవారగానే మా ప్రయాణం కొనసాగించాలని ఆగాం" కుతూహలంతో బాటసారుల దగ్గరికి చేరారా వ్యక్తులిద్దరూను. "దేశ సంచారం చేసే మీకింతవరకూ ఏం తెలిసింది? చెప్పగలరూ?" ఓ గొంతు ప్రశ్నించింది.

"రాత్రి సుఖంగా నిద్రపోవాలంటే పగలంతా శ్రమించి పనిచేయాలి. భవిష్యత్తు బాగుండాలంటే, బుద్ధి తెలిసిన నాటి నుండి కృషి చేయాలని తెలిసింది" అన్నాడొక బాటసారి. వెంటనే రెండో బాటసారి "వాతావరణం అనుకూలించని వానాకాలం లాంటి సమయంలో గూడ సుఖజీవనం కోసం, ప్రకృతి అనుకూలంగా ఉన్నపుడే గద పరిశ్రమించాలి! అలానే శరీర ప్రకృతి అనుకూలించే కాలంలోనే, అంటే, వయస్సు బాగా ఉన్నపుడే ముసలితనం నాటి సుఖజీవనం కోసం అవసరమైనవి కూడబెట్టే ప్రయత్నం చేయాలి అని తెలిసిందయ్యా!" అంటూ మౌనం వహించాడు.

ఇంతలో మూడవ బాటసారి "నాయనా! మీరెవ్వరో జిజ్ఞాసువుల్లా ఉన్నారు. ఏమీ అనుకోనంటే ఓ మాట చెప్తాను. ముసలితనం మీద పడ్డప్పుడు మరొక్కడితోడు అవసర మౌతుంది. అయినవాళ్ళకి ఇవ్వగా, మనకంటూ కొంత చేర్చి పెట్టుకోకపోతే ముఖమెవడు చూస్తాడు బాబూ! అప్పుడిక సంపాదించలేడాయె! ఆ బ్రతుకు దుర్భరం. అయితే ఆ స్థితిని అతిక్రమించాలంటే, ఒంట్లో ఓపిక ఉన్నపుడు ఏదో కొంత సంపాయించి పెట్టుకొంటే నలుగురూ పట్టుకుపోతారు. అంచేత సమయాన్ని సమర్థవంతంగా వాడుకోవాలి" అంటూ ఆగాడు.

'ఇంతకీ సారాంశమేమిటంటారు?' ఇద్దరు జిజ్ఞాసువులూ ప్రశ్నించారు. 'రాత్రి కన్పడకున్నా వస్తుందని ఊహించి, దానికోసం జాగ్రత్త పడుతున్నాం. ప్రకృతి అస్తమానం అనుకూలంగ ఉండదని తెలిసి, దానిని తట్టుకొనే మార్గాలను వెతుకుతున్నాం. ఇంకా కన్పడని ముసలితనాన్ని ఊహించి వయస్సున్నపుడే జాగ్రత్త పడుతున్నాం. ఇదే గదా ముందు చూపంటే! అలానే ఇప్పుడున్న ఈ శరీరం గూడ ఒకనాడు జారిపోవడమూ ఖాయం. ఆ తర్వాత మనమేం కావాలీ అనేది. ఈ శరీరముండగానే ఆలోచించి, తదనురూపంగా ప్రవర్తించ గలవాడే నిజంగా ధన్యుడు. ఆ విషయాన్ని బాగ అర్థం చేస్కోవడం కోసమే మేమీ యాత్రలు చేస్తున్నాం" అన్నారు ముగ్గురూ ఏకకంఠంగా.

"ఇంతకీ మీరిద్దరూ ఎవరు?" అడిగాడా ముగ్గురిలో ఒకడు. కాస్త తటపటాయిస్తూన్నట్టు ఇటూ అటూ చూచి "మేమీ ఊరువారమే కానీ, ఇంతకీ, ఆ పై జన్మకోసం ఇప్పుడే ఏదో తెల్సుకోవాలన్నారే! అదేమిటో చెప్తారు?" అంటూ ఎదురు ప్రశ్న వేశాడు.

"మనందరి బ్రతుకులకీ, ఈ ప్రపంచానికీ గూడ ఏదో వెనకాతల ఒక కారణం ఉండి ఉంటుంది. ఆ కారణమేమిటో తెలిస్తే కార్యాలుగా కన్పించే ఈ జీవితాలకి గమ్యం దొరుకుతుంది. కర్తవ్యం తెలుస్తుంది. జీవితం సార్థకమౌతుంది. మనస్సు ప్రశాంతమౌతుంది. ఆనందం వెల్లివిరుస్తుంది. ఆ! సరేగానీ, ఇంతకీ మీరెవ్వరో మాత్రం చెప్పనే లేదే? ఇలా అర్థరాత్రులలో వీధిసంచారం ఎందుకు చేస్తూన్నట్లో?" అడిగారా బాటసారులు ముగ్గురూ.

సరి అయిన సమాధానం చెప్పకుండానే "మీ విశ్రాంతికి భంగం కల్గించినట్లున్నాం. అన్యథా భావించకండి. విశ్రమించి సుఖంగా మీ తావులకు చేరండి. మీ మార్గములు మంగళ ములవుగాక!" అంటూ ఎలా వచ్చారో అలానే ఆ చిక్కని చీకటిలో కలిసిపోయారు. ఏమి ఠీవి ఉట్టిపడుతోందీ, వీళ్ళల్లో. ఎంత గంభీరము వాళ్ళ కంఠాల్లో!

వీళ్ళెందుకు రాత్రిపూట వీధుల్లో విహరిస్తున్నట్లు?" పరస్పరం ప్రశ్నించుకున్నారు. "ఏమో లెద్దూ! వాళ్ళుమాత్రం చెప్పనేలేదు. ఎవరో ఆర్తులనాదుకొనడానికి నియుక్తులైన రాచరికపు సిబ్బంది కాబోలు! ఏమైతే నేమిలే. తత్త్వాన్వేషణ నిపుణుల్లా ఉన్నారు". కాసేపు అలా యాత్రా విశేషాలు మాటలాడుకొంటూ తూరుపు తెల్లవారుతుండగానే మూటాముల్లే సర్దుకొని బాటసారులు ముందుకు సాగిపోయారు. *(సశేషం)*




మానవ విజ్ఞానానికి మూలాధారమైన వేదములు మూడు భాగాలుగ ఉంటాయి. సంహిత, బ్రాహ్మణము, ఆరణ్యకములని వాటిని వ్యవహరిస్తారు.

ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, ఆథర్వణ వేదమనే నాలుగు వేదాలలో ఒక్కొక్కదానికీ ఈ మూడు భాగాలూ ఉంటాయి. వీటిలో సంహిత, బ్రాహ్మణములను వేద పూర్వభాగమని, ఆరణ్యకభాగాన్ని ఉత్తరభాగమని అంటారు.

పూర్వభాగము, మానవుడు ఇహలోకంలో, స్వర్గాది పైలోకాలలో అనుభవించే అభ్యుదయానికి కావలసిన సాధన సామగ్రిని వివరిస్తుందంటారు ఉత్తరభాగము. మానవజన్మను సద్వినియోగం చేసుకుంటూ ఈ జీవికి అనాదిగ వస్తున్న కర్మబంధాలను తొలగించుకోవడానికీ, శాశ్వతము అపరిమితమూ అయిన నిత్యానందాన్ని లభించడానికి అవసరమైన నిశ్శ్రేయస సాధనసామగ్రిని అందిస్తుంది.

అందుకే పూర్వభాగాన్ని కర్మభాగము, ఉత్తరభాగాన్ని జ్ఞానభాగమని ఇవి రెండూ ఒకదానికొకటి పరస్పరమూ సహకరించేవేనని, మన పెద్దలు అనుగ్రహిస్తారు. మరోరకంగ, వేదవాఙ్మయమంతా జీవుడు తరించే ఉపాయాచరణ విధానాన్ని స్పష్టపరుస్తుంది.

జీవుణ్ణి కర్మబంధం నుండి విడిపించవలసినవాడు సర్వేశ్వరుడైన శ్రియఃపతి, శ్రీమన్నారాయణుడు. ఆతని నిర్హేతుకమైన కృప తప్ప ఇతరమేదీ ఈ జీవుణ్ణి ఆవరించి ఉన్న కర్మబంధాన్ని విడిపించలేదు. భగవంతుని కృప నిర్హేతుకంగ ప్రసరిస్తున్నా, దానిని మానవుడు తప్ప ఇతర జీవవర్గమంతా స్వీకరించగలుగుతుంది. దానికి బుద్ధివికాసం లేదు కనుక స్వతంత్రత–అహంకారాలు కలుగవు. కాని మానవుడికి శారీరకంగ ఏర్పడ్డ వికాసప్రభావంవల్ల లభించిన స్వాతంత్ర్యం కారణంగ భగవంతుని కృపను స్వీకరించడం కంటే తిరస్కరించడానికే ప్రవర్తిస్తూ ఉంటాడు. దానికి కారణం తన శరీరం మీద తనకు ఆధిపత్యం ఉందనుకొనే భ్రమ. దానివల్ల తలెత్తే అహంకారము కారణం. భగవంతుని దయ మనపై కలగడానికి మనం చేయగలిగినదేమీ లేదు కానీ, ఆ కలిగే దయను అహంకారగ్రస్తమైన మనస్సు కల జీవుడు అడ్డుకోగలడు. అలా అడ్డుకుంటాడా? అనే ప్రశ్న ఉదయించవచ్చు. అవును. సృష్టి విశేషాలను నేనే తెలుసుకోగలను నా పనులు నేనే చేసుకోగలననే భావనే అతని దయను అడ్డేది. దానివల్ల ప్రకృతి ప్రభావానికి లోనై కర్మభారాన్ని మరింత పెంచుకోవడం, దానివల్ల మానవజన్మనుండి పతనమై తిరిగి క్షుద్రజన్మలలోకి పోవడం, తిరిగి పుట్టడం, గిట్టడం..... ఇలా జన్మమృత్యు చక్రంలో తిరుగుతూ ఉండటమే పర్యవసానమౌతుంది.

ఈ జీవులు తరిస్తే బాగుండునని భగవంతుడు భావించినా, వారి స్వాతంత్ర్య ప్రవృత్తిలో తాను కల్పించుకొనే ప్రయత్నం చేయడు. దేనికైనా అవసరమైన శక్తిని మాత్రం జీవులందరికీ యిస్తూనే ఉంటాడు తప్ప, వారి వారి స్వంత వ్యవహారాలలో తల దూర్చాలని అనుకోడట. తటస్థునిగ తాను గమనిస్తూ ఉంటాడు. అహంకార వినిర్ముక్తుడైన జీవుడు తన ప్రవృత్తులనన్నింటిని భగవదారాధనగ మార్చుకోగలగాలి. అలా ఆచరించడం భగవంతుని వల్లనే కనుక, ఆతనికి చెందిన వానిగ తనను గుర్తుంచు కోవడమే తన సహజస్వరూపమని, ప్రీతితో

ఆ భగవంతునికి శరణాగతుడై ఉండాలి. అపుడు నిర్హేతుకంగ ప్రసరించే భగవత్కృపాధారలలో ఈ జీవుడు స్నానమాడ గలుగుతాడు. కర్మబంధ వినిర్ముక్తుడూ కాగలుగుతాడు. ఇలా చేయగలిగిన శక్తి ప్రాణులలో మానవుడికి మాత్రమే ఉంది. ఇతర ప్రాణులకు లేదు గద!

ఈ విధంగ శరణాగతుడై భగవత్సేవగ తన కర్మలన్నింటినీ ఆచరించుకొనే విధానాన్ని వేదము బోధిస్తుంది. అందులో పూర్వభాగము ఇహ, పర లోక సుఖానికై ఆచరించే కర్మలనన్నింటినీ భగవదారాధనగ ఎలా ఆచరించాలో నేర్పుతుంది. ఉత్తరభాగము, ఆరాధ్యుడైన భగవంతునియొక్క స్వరూప,రూప, గుణ, విభూతులను, ఆతనికీ జీవునికీ, ప్రకృతికీ ఉండే పరస్పర సంబంధాదులను వర్ణిస్తుంది. స్వరూపజ్ఞానం కల మానవుడు ప్రీతితో ఆచరించదగిన ఉపాసనా విధానాన్ని తెలియచేస్తుంది.

ఉత్తరభాగం వల్ల తత్త్వములైన జీవ, ఈశ్వర, ప్రకృతుల జ్ఞానం కలగాలి. పూర్వభాగంవల్ల జీవితాన్ని భగవత్సేవగ గడపగలగాలి. ఇలా, వేదం యొక్క పూర్వోత్తరభాగాలు రెండూ పరస్పర ప్రపూరకాలుగ ఉంటూ జీవుడు పొందవలసిన దానిని పొందడానికి సహకరిస్తాయి.

తత్త్వజ్ఞానాన్ని మానవుడికి కల్గించే ఆరణ్యకములే కద ఉత్తరభాగమంటే. దానికి చెందినవే ఉపనిషత్తులు. ఆయా వేదాలలో ఉండే ఉపనిషత్తులలో మన పూర్వాచార్యులు స్వీకరించిన ఓ పదునాలుగు ఉపనిషత్తుల పేర్లను మనం గతంలో చెప్పుకున్నాం గద! వాటిలో ఏ ఏ ఉపనిషత్తులు ఏ ఏ వేదానికి చెందినవో తెలుసుకోవాలి.

ఋగ్వేదానికి చెందినవి రెండు

1. ఐతరేయోపనిషత్
2. కౌషీతక్యుపనిషత్

శుక్లయజుర్వేదానికి చెందినవి నాలుగు

3. ఈశావాస్యోపనిషత్
4. సుబాలోపనిషత్
5. మహోపనిషత్
6. బృహదారణ్యకోపనిషత్

కృష్ణయజుర్వేదానికిచెందినవి మూడు

7. తైత్తిరీయోపనిషత్
8. కఠోపనిషత్
9. శ్వేతాశ్వతరోపనిషత్

సామవేదానికి చెందినవి రెండు

10. ఛాందోగ్యోపనిషత్
11. కేనోపనిషత్

అథర్వవేదానికి చెందినవి మూడు

12. ముండకోపనిషత్
13. ప్రశ్నోపనిషత్
14. మాండూక్యోపనిషత్

తత్త్వవిచారం చేసే పూర్వాచార్యులు తమ తమ వ్యాఖ్యానాలలో, భాష్యాలలో స్పృశించిన ఉపనిషత్తులు ఇంతవరకే. అందుచేత మనమూ అంతవరకే స్వీకరిస్తే చాలు. వీటికి విరుద్ధం కానపుడు మిగిలినవేవైనా తెలుసుకోవచ్చు. అలా కానపుడు వాటిని దూరంగ ఉంచడమే మంచిది. మనం దేనినీ 'ఇది తగదని' ఖండించనవసరము లేదు.

ఉపనిషత్తులలో విశేషాలు తెలుసుకోవడం ఎక్కడినుండి ప్రారంభించాలి? నామనిర్దేశం చేసిన శ్లోకంలో మన పెద్దలు స్వీకరించిన మొదటి ఉపనిషత్ ఈశావాస్యోపనిషత్. అందుకని మనమూ దాని నుండే ప్రారంభించవచ్చు. అచ్చుతో ప్రారంభమైనవి రెండే, ఈశావాస్యం, ఐతరేయమున్నూ. వీనిలో మొదటి అక్షరం 'ఈ' కనుక ఈశావాస్యం మొదట ఉచ్చరించి ఉంటారు. అంతేకాకుండా, ఆ ఉపనిషత్తు కొద్ది మంత్రాలలో సమగ్రజీవన విధానాన్ని స్పష్టంగ విశ్లేషించింది. అందువల్ల కూడా దానిని ముందు గ్రహించి ఉండవచ్చును.

భౌతిక జీవనాన్ని శాసించే నైతికమైన విలువల బోధనతో ప్రారంభించిందీ ఉపనిషత్. మధ్యలో పరమార్థాన్ని స్పష్టం చేసింది. భగవత్తత్త్వాన్ని ఎక్కడ, ఎలా దర్శించాలో, ఏమని ప్రార్థిస్తే మంచిదో సులభంగ బోధించింది. చివరకు మనిషి ఏ స్థితిలో ఉన్నా ఎంత చేతకాని వాడైనా భగవంతునికి శరణాగతుడవ్వడం ఎంత సులభమో తెలిపి ముగించింది. ఆ ఉపనిషత్ గురించి కొద్దిగ తెలుసుకునే ప్రయత్నం చేద్దాము!



# శ్రీరామాయణము



ఎ. ఉషశ్రీ- శ్రీరాంనగర్

ఆది కావ్యమయిన శ్రీరామాయణం ధర్మమనే జలముకల ఒక మహానది. ధర్మమంటే మంచి ఆచరణ. ఇది వాల్మీకి గిరులపై ఉద్భవించి "పునాతి భువనం పుణ్యా" అన్నట్లు భూమినంతటిని పవిత్రం చేస్తూ రాముడనే సాగరంలో కలిసింది. రూపుదిద్దుకొని కదలాడే ధర్మమే గద రాముడంటే! అందుకే ఆయన్ని సాగరంతో పోల్చారు. ఈ రామాయణం తరువాత ఎన్నో కావ్యాలు వచ్చాయి. కాని నాటినుండి నేటివరకు అంటే నాలుగు చతుర్యుగాల కాలం పూర్తయినా నేటివరకు దాని ప్రాధాన్యాన్ని, గొప్పతనాన్ని కోల్పోకుండా మానవుల ఆదరణ పొందుతోంది. దానికి కారణమేమిటి? అది మన అందరి చరిత్ర కనుక. మానవుడు కాలగతమైన మార్పులను గమనిస్తూ వాటికి లోనవుతున్నా, మానవుడిగానే బ్రతకాలంటే ఎలా ప్రవర్తించాలో తెలియాలి. ఆ ప్రవర్తనారీతిని మనకి చూపించేవాడు ధర్మమూర్తి శ్రీరాముడు.

ఆయన సాగరంలాంటివాడు. ప్రపంచంలో ఎక్కడ ఆస్వాదయోగ్యమైన నీరున్నా, అది సాగరంలోంచే వస్తుంది. ఆ నీటిని సంగ్రహించేగలిగేట్లు చేసేది నది కద! శ్రీరామాయణం అధ్యయనం చేయడం ద్వారా, ప్రవర్తించే రీతులు తెలుస్తాయి. ఎవరి ప్రవర్తనను మనం అనుకరించవచ్చునో తెలుస్తుంది. వేరెవరి ప్రవర్తనను మనం దూరంగ పరిహరించాలో కూడ తెలిసేది ఈ రామాయణ గ్రంథంలోంచే. అందుకే, దీనిని ఒక సజీవగంగా ప్రవాహంగ భావించారు మన పెద్దలు.

కర్ణపేయమయిన ఈ రామాయణం కథాకాలక్షేపముతో సామాన్యులకు ఆనందాన్ని కలిగిస్తోంది. బాగుపడాలనుకొనే వారికి ఆచరించదగిన ధర్మాలను తెలిపి వారి నడవడికను దిద్ది శ్రేయస్సును చేకూరుస్తోంది.

ఇందులో సాంప్రదాయిక ధర్మాలు గోచరిస్తాయి. సామాన్య ధర్మాలుంటాయి. విశేషధర్మాలున్నాయి. అన్నిరంగాలలో ఉన్నవారికి నేర్వదగిన ఆచరణవిశేషాలను స్పష్టంచేస్తుందీ శ్రీరామాయణమనే ఉత్తమ ఇతిహాసగ్రంథం. ముందుగ దీనిపేరుగురించిన విశేషాలను కొన్నింటిని తెలుసుకుందాం!

ఈ రామాయణాన్ని శ్రీమద్రామాయణం అనాలా? లేక శ్రీరామాయణం అని వ్యవహరించాలా? ఇదేమీ పెద్ద అవసరమైన ప్రశ్నగ అనిపించదు. ఎందుకీ చర్చ? అవసరమా అని సందేహం కలుగవచ్చును. చాల అవసరం. అసలు పేరులోనే రహస్యమంతా ఇమిడి ఉంది. అదేమిటో చూద్దాం!

**శ్రీః అస్య అస్తీ ఇతి శ్రీమాన్, శ్రీమాంశ్చ అసౌ రామశ్చ శ్రీరామః, తస్య అయనం - శ్రీమద్రామాయణం** అని ఒక నిర్వచనము. **శ్రీ** అంటే లక్ష్మి, సంపద. ఆమె ఎవరికి చెందినదో ఆతడు **'శ్రీమాన్'** అవుతాడు. శ్రీమంతుడైన రాముడు శ్రీరాముడు. ఆయన చరితను చెప్పేది శ్రీమద్రామాయణం. ఇలా చెప్పడంలో శ్రీరామునికి మాత్రమే ప్రాధాన్యం కనిపిస్తోంది. కాని సీతమ్మని గురించి ఏమీ తెలీయడం లేదు.

మరోనిర్వచనం **'శ్రీరామాయణం'** అని. ఇలా అనడంవల్ల ఏప్రయోజనం కలుగుతుంది? **శ్రీశ్చ రామశ్చ శ్రీరామౌ, తయోః అయనం శ్రీరామయణం.** అంటే **శ్రీ చ** లక్ష్మీదేవియు, **రామశ్చ** రాముడున్నూ సమప్రాధాన్యం కలిగి ఉండే స్థితి **'శ్రీరామౌ'** అనే పదం చెపుతుంది. **తయోః అయనం** –వారిరువురికి ఆధారమైన చరితను చెప్పేది శ్రీరామాయణం. దీనిలో **'శ్రీ'** –సీతకు, రామునికి సమానమైన ప్రాధాన్యము కనిపిస్తోంది. కనుక దీనిని **"శ్రీరామాయణం"** అనడమే సమంజసం.

వాల్మీకి మహర్షే ఈ రామాయణాన్ని గురించి చెప్తూ **"కావ్యం రామాయణం కృత్స్నం సీతాయాశ్చరితం మహత్"** అంటారు. మొత్తం రామాయణమంతా సీతమ్మ గొప్పతనాన్ని తెలిపే కథ. రామాయణమంతా రాముని చరిత. శ్రీరామునికి సంబంధించినదని చెబితే, అది 'ఉత్త చరిత' మాత్రమే అవుతుంది. అది సీతమ్మకు సంబంధించినదిగ చూచినపుడు మాత్రమే ఉత్తచరితం కాక, 'మహాచ్చరితం' అంటూ, అమ్మవారి సంబంధానికే అగ్రాసనంవేసాడు ఆదికవి, వాల్మీకి మహర్షి.

అదెలా అంటే, సీతమ్మ వనవాసయాత్రలో రాముని అనుసరించక పోతే శ్రీరామాయణం అరణ్యకాండ అర్ధభాగంతోనే ముగిసిపోయేది. అలా కాకుండా ఆ చరితను ముందుకు తీసుకు వెళ్ళాలంటే సీతమ్మ రామునితో కూడా ఉండితీరాలి. కష్టాన్ని లెక్కచేయకుండా అందుకు సీతమ్మ సిద్ధపడింది. కనుకనే, శ్రీరామయణం "సీతయొక్క గొప్పకథ" అంటారు వాల్మీకి.

శ్రీగుణరత్నకోశం అనే స్తోత్రంలో శ్రీపరాశరభట్టర్ "శ్రీమద్రామాయణ మపి పరం ప్రాణితి త్వచ్చరిత్రే" అంటారు. శ్రీమద్రామాయణం తల్లివైన నీ చరిత్రని చెప్పడంవల్లే అంత రమణీయమై జీవిస్తోంది అంటారు. సీతమ్మ కూడ లేకపోతే శ్రీరాముడు అడవులకు వెళ్ళినా ప్రయోజనం నెరవేరి ఉండేది కాదు. సీతమ్మ తోడుగ ఉండడం వల్లనే పుంసాం మోహన రూపుడైన శ్రీరాముడ్ని మోహించిన శూర్పణఖ, ఆతడు తనని తిరస్కరిస్తున్నాడని భావించింది. సీతమ్మ తన కడ్డుగ ఉందని భావించింది. ఆమెను లేకుండా చేయాలనుకుంది. లక్ష్మణునితో ముక్కు చెవులు కోయించుకుని జనస్థానంలో నివసించే తన అన్నలైన ఖరదూషణాదులను 14వేల మంది రాక్షససైన్యంతో రామునిపైకి ఉసి కొల్పింది. రావణునికి సీతమ్మ అందాన్ని వర్ణించి వ్యామోహితుని చేసింది. రావణుడు సీతమ్మను దొంగతనంగ మోసం చేసి తీసుకు వెళ్ళేట్టు చేసింది. చివరికి ఆ అన్న రావణుడు నశించేట్టు కూడా చేసింది. సీతాన్వేషణలో భాగమే సుగ్రీవమైత్రి, వాలివధ, సేతునిర్మాణం, రామ రావణ యుద్ధం దీనికంతటికి కారకురాలు సీతమ్మే కదా! ఆమెయే కూడాలేకపోతే ఇవేవీ జరిగి ఉండేవికావు.

శ్రీరాముడు అరణ్యాలకు బయలుదేరే సమయంలో సీతారాములకు పెద్ద సంవాదమే జరిగింది. శ్రీరాముడు, 'సీతా! నా తల్లిదండ్రుల ఆజ్ఞానుసారం అరణ్యాలకు వెళ్ళి ఓ 14 సం॥లలో తిరిగి వచ్చేస్తాను. నీవు పూజ్యులైన అత్తమామల పరిచర్యలు చేస్తూ వారికి అనుకూలురాలివై ప్రవర్తించు' అన్నాడు. సీత అంగీకరించలేదు. నేను సహధర్మచారిణిని. కనుక, నీకు వర్తించు ఆజ్ఞ నాకు కూడా వర్తిస్తుందని చెప్పింది. 'రామా! అరణ్యవాసంలో నీకు ఎటువంటి దుఃఖం కల్గించను' అని నచ్చచెప్పింది. 'నీతో కలసి ఉంటే నాకు స్వర్గం. నీవులేని స్వర్గమైనా నాకు నరకమే' అని రాముని మీద తనకున్న ప్రేమను తెలియజేసింది. 'నా చిన్నతనంలోనే నాకు వనవాసము తప్పదని సోదికత్తెలు చెప్పారు. అది నీతో గడపటం నా అదృష్టం' అని కర్మానుభవం సుఖాన్నిచ్చినా, దుఃఖాన్నిచ్చినా, దానికి తన సంసిద్ధతని తెలియజేసింది. 'నా తండ్రి వివాహమైన తరువాత నన్ను అత్తగారింటికి పంపుతూ, "నీ భర్తను నీడవలె అనువర్తింపు"మని చెప్పారు. కనుక, నేను కూడా అరణ్యాలకు వస్తా'నని తన భార్యాధర్మాన్ని తెలిపింది. "నాథా! నన్ను రక్షించలేక ఇంటి దగ్గర వదలి అరణ్యాలకు వెళ్ళావని నా తండ్రికి తెలిస్తే నా తండ్రి 'పురుషవేషంలో ఉన్న ఆడదానికి నా కుమార్తెను ఇచ్చి వివాహం చేసాను, అన్యాయం చేసాను' అని ఆక్రోశిస్తారు" అంటూ రామునికి పౌరుషం తెప్పించే మాటలూ అంది. ఎన్ని ప్రయత్నాలు ఎలా ఎలా చేసినా శ్రీరాముడు సీతను అడవికి తీసుకు వెళ్ళడానికి అంగీకరించలేదు.

ఇంక చివరికి సీత రామునితో "రామా!..

**యది త్వం ప్రస్థితో దుర్గం వనమద్యైవ రాఘవ! ।**
**అగ్రతస్తే గమిష్యామి మృద్నన్తీ కుశకణ్టకాన్॥"**

అని అన్నవెంటనే దానిలోని గూఢార్థాన్ని తెలిసిన రాముడు వెంటనే సీతను తనతో తీసుకువెళ్ళడానికి అంగీకరించాడు. 'రామా! దట్టమైనవనంలో నీకన్నా ముందు నేను సాగుతూ ముళ్ళను తొక్కిపారవేస్తా'' అని ఆ మాటలకు అర్థం. ఈ మాటలకి రామాయణకథకు ఉన్న సంబంధం ఏమిటో తెలుసుకోవాలి.

దీనిలోని నిగూఢార్థం... **యది**–ఒకవేళ; **త్వం**–నీవు; **దుర్గం**–చొరరాని; **వనం**–అడవికి; **అద్యైవ**–ఇప్పుడే; **ప్రస్థితః**–బయలుదేరావనుకో; **రాఘవ**–హే రామా! ఆ అడవికి నేను; **అగ్రతః**–నీకంటేముందుగ; **గమిష్యామి**–వెడతాను. ఏమి చేస్తూ? **'కుశకంటకాన్ మృద్నంతీ'** ఇందులో ఉంది అసలు రహస్యం.

**కుః**–భూమి, దానియందుండు ప్రజలన్నమాట; వారి **శం**–సుఖమునకు; **కణ్టకాన్**–ముళ్ళవలె పీడించు రాక్షసులను; **మృద్నన్తీ**–నీవు శిక్షించుటకు తగినట్లుగా చేయుటకు; **తే**–నీకు; **అగ్రతః గమిష్యామి**–ముందుగా వెళతాను. ఎక్కడికీ? లంకానగరానికన్న మాట.

విషవృక్షాల్ని వేరుతో పెకలించాలి. ఈ భూమిపై విషవృక్షాల వంటివారు రాక్షసులు. వారికి మూలం లంకలో రావణుడు. ఆ రావణుని స్థానం సమూలంగా నిర్మూలించాలి అంటే ఏదో ఒక తగిన కారణం ఉండాలి. అది ఏర్పడేటట్లు చేసింది సీతమ్మ. తాను పై శ్లోకంలో చెప్పినట్లే లంకకి రామునికంటే ముందుగానే వెళ్ళింది.

ఇలా చెప్పినప్పుడే సీతమ్మ చెప్పిన **'అగ్రతః గమిష్యామి'** 'ముందుగ నేను సాగుతాను' అన్న మాట సరిపోతుంది. అసలు, వారుముగ్గురు వనవాసదినాలలో అడవిలో నడిచిన క్రమం చూస్తే, వేరేవిధంగ ఉంది.

**అగ్రతః ప్రయయౌ రామః సీతా మధ్యే సుమధ్యమా ।**
**పృష్ఠతస్తు ధనుష్పాణిః లక్ష్మణోఽనుజగామ హ ॥**

'ముందు శ్రీరాముడు నడిచెను. సన్నని నడుముగల సుకుమారి సీతమ్మ మధ్యలో నడిచెను. ఆవెనుకగ ధనువును ధరించిన లక్ష్మణస్వామి అనుసరించెను. ఏమి ఆశ్చర్యమూ!' అంటారు వాల్మీకి అరణ్యకాండలో. (సశేషం)



# అహో! భారతమ్

శ్రీమతి డా॥టి.కె. చూడామణి–విజయవాడ

అభిమన్యునికి, ఉత్తరకి జన్మించిన కుమారుడు విష్ణురాతుడు. తల్లిగర్భంలో ఉండగా అశ్వత్థామ అపాండవం చేయాలని అస్త్రాన్ని ఆ గర్భంపై ప్రయోగిస్తే శ్రీకృష్ణపరమాత్మచేత రక్షింపబడినవాడు. తనను రక్షించిన మహనీయుడెవరా అని అందరినీ పరీక్షగా చూచి చూచి పరీక్షిత్తు అనే పేరు పొందినవాడు.

ముత్తాత పాండురాజులాగే పరీక్షిత్తుకి కూడా వేట అంటే ఎంతో ఇష్టం. ఒకనాడు గొప్ప ధనుస్సుని, బాణాన్ని తీసుకుని వేటకు బయలుదేరాడు. అతిఉత్సాహంతో ఎన్నో జంతువులను తరిమి తరిమి వేటాడాడు. హఠాత్తుగా ఒక లేడిని చూశాడు. బాణం వేశాడు. కాని ఆ బాణపు దెబ్బతిని మరింత వేగంగా పారిపోయింది ఆ లేడి. నా నుంచి తప్పించుకొంటుందా! అని పట్టుదలగా దానివెంటే పరుగెత్తాడు. కాని, అది ఎలా మాయమైపోయిందో తెలియకుండా పారిపోయింది. ఒంటరిగా దాన్ని వెతుకుతూ అడవిలో లోపలికి చేరాడు రాజు. ఎక్కడా లేడి కనిపించలేదు.

కాని, ఒకచోట ఒక మహర్షి తపస్సు చేసుకుంటూ కనిపించాడు. ఆయన పేరు శమీకుడు. ఓర్పుకి, ఇంద్రియ నిగ్రహానికి పెట్టింది పేరుగా ప్రసిద్ధికెక్కినవాడు. ఆయనను గూర్చి పరీక్షిత్తుకి తెలియదు. కన్నులు మూసుకొని తపస్సులో మునిగి ఉన్న ఆయన దగ్గరకి వెళ్ళి "మునీంద్రా! నా బాణం దెబ్బతిన్న లేడి ఇటువైపు పరుగుపెడుతూ వచ్చింది. అది ఎటు వెళ్ళింది? తెలుసా! చెప్పు" అని అడిగాడు. తపస్సమాధిలో ఉన్న ఆ ఋషికి ఈ మాటలు వినిపించలేదు. దైవచింతనలో మునిగిన ఆయన బైట విషయాలు తెలిసేస్థితిలో లేడు. అందువలన సమాధానం చెప్పలేదు. ఆ విషయం తెలియని పరీక్షిత్తు మరొక్కసారి అడిగాడు.

అలసి సొలసి ఉన్నాడేమో! కాస్త దాహం తీర్చమని ప్రార్థించాడు. అది వినేస్థితిలేని ఋషి సమాధానం చెప్పలేదు. తనంతటివానికి జవాబు చెప్పడా అని కోపం వచ్చింది. అహం తలఎత్తింది. అటు ఇటు చూశాడు. ప్రక్కన ఓ పాము చచ్చిపడి ఉంది. వింటికొనతో ఆ పాముని పైకి తీసి శమీకముని మెడలో వేసి వెనక్కి వచ్చేశాడు.

ఆ శమీకునికి శృంగి అనే పేరుకల కొడుకు ఉన్నాడు. ఆయన కూడా తపస్సు చేసుకొనే ఋషే. తండ్రి దగ్గరికి వస్తూ ఉంటే దారిలో కృశుడు అనే ఋషి కనిపించి ఒక రాజువచ్చి నీ తండ్రి మెడలో చచ్చినపామువేసి అవమానించాడు అని చెప్పాడు. వినగానే మండిపడ్డాడు శృంగి. 'నా తండ్రి ఎక్కడో అడవిలో ఓమూల తనదారిన తాను కూచుని తపస్సు చేసుకుంటున్నాడే! దూడలు పాలుతాగేటప్పుడు వచ్చే నురగనే ఆహారంగా తీసుకొంటున్నాడే! మౌనవ్రతంలో ఉన్నాడే! వృద్ధుడే, ఇంత అవమానం చేయడానికి చేతులెలా వచ్చాయి? ఆరాజు నేటికి ఏడురోజులలో తక్షకుడనే సర్పరాజు యొక్క విషాగ్నిచేత కాల్చబడి మరణించుగాక" అని శాపం ఇచ్చేశాడు.

పరుగు పరుగున తండ్రిని చేరాడు. ఆ మెడలో పాము శవం వ్రేలాడుతోంది. గబగబా దానిని తీసి పడేశాడు. అంతలో కన్నులు తెరిచాడు తండ్రి. నమస్కారం చేసి ఒక్కసారి ఏడ్చాడు కొడుకు. నోటమాటరాలేదు. ఎలానో తేరుకొని జరిగిన విషయం వివరించి తన శాపాన్ని కూడా చెప్పాడు. తండ్రి శమీకుడు పాపం ఎంతో బాధపడ్డాడు.

నాయనా శృంగీ! ఎందుకయ్యా అంత కోపం? కోపం తపశ్శక్తిని నశింపచేస్తుందయ్యా అష్టసిద్ధులనీ పోగొడుతుంది. ధర్మాచరణకి అడ్డుపడుతుంది. తపస్సు చేసుకొనే మునికి కోపం ఉండవచ్చునా తండ్రీ!

ఓర్పులేని ముని తపస్సు బ్రద్దలయిన కుండలో నీళ్ళ వంటిది. ఓర్పులేనివాడు ఎన్నో కష్టాలు పడతాడు. 'పరీక్షిత్తు అనే రాజుకి నువ్వు శాపం ఇచ్చి తప్పు చేశావు. నాయనా! ఋషులకి రాజులు రక్షకులు. వారి రక్షణలో ఋషులు ధర్మకార్యాలు చేస్తూ లోకశాంతిని చేకూరుస్తున్నారు. తండ్రివంటి రాజుకి చెడు జరగాలని కోరడం మహాపాపం. అందులోనూ పరీక్షిత్తు సామాన్యుడైన రాజుకాదు. నాలుగు వర్ణాలవారు వారి

వారి ధర్మాలని పాలించడంలో పరీక్షిత్తు ధర్మపాలన చాలా సహాయ పడుతోంది. ఆ మహారాజుకి నువ్వు ఇచ్చిన శాపాన్ని ఎలాగయినా వెనక్కి తీసుకో' అన్నాడు. శృంగి నాన్నా, అది సాధ్యంకాదు కదా అన్నాడు. నా వాక్కు అమోఘమని నీకు తెలుసుకదా అన్నాడు. కొడుకు మాటలు విని శమీక మహర్షి ఎంతో కుమిలిపోయాడు. ఆయన ఎంతో ఉదాత్త భావాలు కలవాడు – వెంటనే గౌరముఖుడు అనే తన శిష్యుని పిలిచాడు.

నాయనా! నువ్వు వెంటనే వెళ్ళి శృంగి శాపాన్ని గురించి పరీక్షిత్తుకు తెలియచెయ్యి. అంతేకాదు. తక్షకుని వలన రాబోవు ప్రమాదాన్నుంచి ఎలాగయినా తప్పించుకొనే ఉపాయం ఆలోచించు కొమ్మని చెప్పు అంటూ, పంపించాడు. మహర్షుల హృదయాలు దయా సముద్రాలనడానికి ఇదొక ఉదాహరణ కదా! గౌరముఖుడు వేగంగా వెళ్ళి శృంగిశాపము, శమీకుని ఆరాటము వివరించి చెప్పాడు. అది విన్న పరీక్షిత్తు అయ్యో! ఎంతటి ధర్మవిరుద్ధమయిన పనిచేశాను. ఎంతటి అపరాధిని. నేనంత అపరాధాన్ని చేసినా ఆ మహనీయుడెంత ప్రేమతో నా క్షేమం కోరి నాకు కబురు చేశాడు. ఆహా మహనీయుల క్షమాగుణమెంత గొప్పది. కాని నా దురదృష్టం నన్ను వెంటాడుతోంది. లేకపోతే ఆ శాపమేమిటి? దీన్నెలా తప్పించుకోవడం? దైవమా... నన్ను క్షమించు. అనుకుంటూ మంత్రులందరికీ కబురు చేశాడు. ఆప్తులు, సేవకులు, మంత్రులు అందరూ సమావేశమై ఒంటి కంబపు మేడలో, మంచిరక్షణలో రాజుని ఉంచి జాగ్రత్తలు తీసుకొనేలా నిశ్చయించారు. విషశక్తిని పోగొట్ట గలిగిన సమర్థుడైన విషవైద్యులందరికీ కబురు చేసి సిద్ధంగా ఉంచారు. విషాన్ని తొలగించే శక్తిగల మంత్రాలు, క్రియాకలాపాలు ప్రారంభించారు. అతిశ్రద్ధతో జాగరూకులై ఎలాగయినా సరే పరీక్షిత్తు ప్రాణాలని రక్షించాలని అందరూ ఉద్యమించారు.

పాములు విషాగ్నితో భూమిలో ఉన్న స్థావర, జంగమాలేవైనా సరే వాటిని బూడిదచేస్తూంటే బ్రహ్మదేవుడు చూడలేక కశ్యపుడనే బ్రహ్మర్షిని పిలిచి పాముల విషం వల్ల ప్రాణాలు కోల్పోయిన వారిని నువ్వు మళ్ళీ బ్రతికించు అంటూ దివ్యమంత్రాన్ని దయతో ఆ కశ్యపునికి ప్రసాదించాడు. ఆయనకి శృంగి ఇచ్చిన శాపవిషయం తెలిసింది. అరే! ధర్మ చరితుడైన పరీక్షిత్తుకి శాపమా– పాముల విషం వలనా– నేను వెంటనే పోయి అతనిని మళ్ళీ బ్రతికిస్తా. కీర్తి గౌరవం సన్మానం పొందుతా అనుకొంటూ బయలుదేరాడు కశ్యపుడు. *(సశేషం)*

## భక్తినివేదన పాఠకులకు విజ్ఞప్తి

ప్రియ భగవద్బంధువులారా!

శ్రీ ఖరనామసంవత్సర ఉగాది నుండి మన భక్తినివేదన నూతన శీర్షికలతో వినూత్న రూపంతో మన ముందుకు వచ్చిన సంగతి విదితమే కదా! వివిధ ప్రాంతాలలోని భక్తులకు అందించడానికి వీలుగ తెలుగుతో పాటు, ఇంగ్లీషు, హిందీ భాషలలో కూడా ముద్రించబడుతున్నది. దీనికి తగినట్లుగ ముద్రణా వ్యయాన్ని దృష్టిలో పెట్టుకొని మూడు భాషలలోను పత్రిక వెలను నిర్ణయించాము.

**ఇక నుండి పత్రిక విడి ప్రతి వెల రూ. 20/-**

**సంవత్సర చందా రూ. 225/-**

**పోస్టేజితో కలిపి రూ. 250/-**

**విదేశాలలో ఉన్నవారికి $30/-**

**పోస్టేజీ నిమిత్తము అదనంగా $5/- చెల్లించవలెను.**

**చిరునామా:** భక్తినివేదన, జీయర్ ఎడ్యుకేషనల్ ట్రస్ట్, సీతానగరం, తాడేపల్లి మండలం, గుంటూరు జిల్లా.

**పాఠక బంధువులు ఈ విషయాన్ని గమనించి తగిన రుసుమును పంపి మీ సభ్యత్వాన్ని సరిచేసుకోగలరు.**



శ్రీమాన్ మధుసూదనాచార్యులు
ప్రధానాచార్య, ఆగమపాఠశాల, జగ్గయ్యపేట

# శ్రీపాంచరాత్ర పరిచయము

వేదైకప్రతిపాద్యుడైన శ్రియఃపతియొక్క స్వరూపరూపగుణ విభూతులను విస్తరించి ప్రతిపాదించేవి ఇతిహాసపురాణాలైతే, ఆతణ్ణి అనేక రకాలుగ ఆరాధించాలనుకొనేవారికి ఆరాధించే విధానాన్ని వివరించే వైదిక వాఙ్మయము శ్రీపాంచరాత్రాగమము.

భగవదారాధనను ప్రతిపాదించే శ్రీపాంచరాత్రాగమ శాస్త్రాన్ని స్వయంగ భగవానుడే సార్ధకోటిప్రమాణముగ చతుర్ముఖునికి ఉపదేశం చేసినట్లు శ్రీ పాద్మసంహిత తెలియచేసింది.

**ఉదితం యన్మహచ్ఛాస్త్రం తత్సర్వం ప్రబ్రవీమి తే।**
**సార్ధకోటి ప్రమాణేన బ్రహ్మణా కేశవాచ్చ్యుతః॥**

ఇంత విస్తృతమైన గ్రంథంగ మనకు ఇది అనిపిస్తున్నా పరమపదంలో సదా స్వామిని సేవిస్తూ, ఆయా సందర్భాలలో ప్రేమతో, ఆర్తితో సేవలందించే నిత్యసూరులంతా, ఇంత గ్రంథాన్ని, అంటే 50 లక్షల అనుష్టుప్ శ్లోకాల ప్రమాణంగ లభించే శాస్త్రాన్నంతటినీ భగవానుడే స్వయంగ ఉపదేశించిన క్రమంలోనే మనసా స్మరించుకుంటూ నిత్యమూ పరమవైదికంగ ఆరాధనాదులు అర్పిస్తూ ఉంటారని శ్రీప్రశ్న సంహిత 2వ అధ్యాయంలో తెలిపింది.

**సార్ధకోటి ప్రమాణేన అనుష్టుభా ఛందసా రమే।**
**వేదవ న్నిత్యమేతచ్ఛ మల్లోకే నిత్యసూరయః॥**
**ఆమనన్తి సదా భక్త్యా మనసా పూజయన్తి చ॥**

అయితే ఈ గ్రంథమంతా యథాతథంగ మనదాక రాలేదు. చతుర్ముఖబ్రహ్మ ఈ గ్రంథంలో 5 లక్షల పరిమితికల గ్రంథాన్ని మాత్రం కపిలుడనే మహర్షికి అనుగ్రహించెనట. ఆయన పద్ముడనే మహానుభావునికి లక్షపరిమితికల గ్రంథముగ ఉపదేశించెనట. ఆ పద్ముడు సంవర్తుడనే మహర్షికి 10 వేల శ్లోకాల పరిమితి కల గ్రంథాన్ని అందిస్తే అది 'పాద్మసంహిత' అనే గ్రంథంగ అయినట్లు ఆ గ్రంథంలోని జ్ఞానపాదంలో 1వ అధ్యాయంలో 31-34వ శ్లోకం దాక తెలిపింది.

దీనిని బట్టి అసంకుచితమైన జ్ఞానం కల పరమపదవాసుల వద్ద భగవానుడందించిన గ్రంథమంతా లభిస్తాండగ, మనలోకంలోకి వచ్చేసరికి, అందుకొనే వారి శక్తి సామర్థ్యాలనుబట్టి అవసరమైనంత మాత్రమే ఆనాటి ఋషులు అందించేవారని తెలుస్తోంది.

అయితే ఇలా అందించే ఋషులు కాలభేదాన్నిబట్టి, అందుకొనే శిష్యుల అవసరాలను, సామర్థ్యాలను బట్టి వేరు వేరు విషయాలను, వేరు వేరు సమయాలలో ఉపదేశించినందువల్ల ఆయా విషయాన్ని బట్టి కానీ, ఆయా వ్యక్తుల పేర్లనుబట్టి కానీ సంహితలు ఏర్పడ్డాయి. 108 సంహితలుగ విస్తరించిన శ్రీపాంచరాత్రశాస్త్రం సమగ్రంగ కలిపితే సార్థకోటి ప్రమాణంగ భగవానుడందించిన గ్రంథమే కావచ్చు. ఇందులో అన్ని విషయాలూ సమగ్రంగ ఉంటాయి. ఆయా సంహితల్లో మాత్రం వారు వారు కోరిన అంశాలు మాత్రమే వివరంగ లభిస్తూంటాయన్నమాట. పద్మమహర్షి తనకు లక్షపరిమితిగల గ్రంథం లభించినా తననాశ్రయించిన సంవర్తునికి పదివేల గ్రంథాన్ని మాత్రమే యివ్వగా సంవర్తుడా భాగానికి 'పాద్మసంహిత' అని పేరు పెట్టుకున్నాడు. అలానే 'శ్రీ' కి లభించిన గ్రంథం ఎంతఉన్నా ఆతల్లి ఏకతుడనే మహర్షికి ఉపదేశించిన గ్రంథము మాత్రమే **"శ్రీప్రశ్న సంహిత"** అయిందన్న మాట. ఇలానే మిగిలిన సంహితలున్నూ ఉంటాయి.

శ్రీపాంచరాత్రాన్ని అనేక పేర్లతో పిలుస్తారని గతంలోనే మనం తెలుసుకున్నాం. ఆ పేర్లన్నీ ఈ శాస్త్రం అందించే ఫలాన్ని చెప్పేవిగానో, శాస్త్రం ఆవిర్భవించిన విధానాన్ని తెలిపేవిగానో, ఇందులో అందే ఆరాధనా పద్ధతిని తెలిపేవిగానో ఉంటాయి. కనుక, ఆ పేర్లన్నీ అన్వర్థనామాలే, అంటే, సార్థకములే. అదెలానో కొద్దిగ తెలుసుకుందాం!

## ఏకాయనం

ఏకాయనమంటే 'మోక్షాన్ని చేర్చే సాధనాన్ని వివరించేది" అని అర్థం. 'ఏకం అయనం యస్మిన్ ఇతి ఏకాయనం' అని

నిర్వచనము. ఈ పేరు వేదశాస్త్రానికి అంతకీ చెప్పవచ్చు. కానీ, వేదాలలో రాజస, తామస గుణములు కల్గినవారు ఆచరింప దగినవీ, ఇతర కోరికలు కలవారై ఉన్న సాత్వికులు ఆచరించేవీ ఎన్నెన్నో చెప్పి ఉన్నాయి. పరంపరగా అవి మోక్షానికి చేరుస్తాయి కానీ, అంతవరకూ వాటిని అవలంబించిన సాధకుడు మోక్షార్థిగ నిలవలేడు. ప్రకృతి ప్రభావం వల్లనో, పూర్వ కర్మలవల్ల ఏర్పడే వాసనలబలం వల్లనో ఆయా కర్మల ఫలితాలెదురైనప్పుడు, వాటిని వదలి మోక్షాన్ని కోరడానికి బదులు, వాటికే తగులకుపోయి క్రమంగ దిగజారి, తిరిగి సంసార చక్రంలో పడిపోతుంటాడు. అందుకే భగవద్గీతలో భగవానుడు 2వ అధ్యాయంలో...

**త్రైగుణ్యవిషయావేదాః నిస్త్రైగుణ్యో భవార్జున!**

**నిర్ద్వంద్వో నిత్య సత్త్వస్థః....** 'వేదాల సత్త్వ,రజ స్తమస్సులనే మూడు గుణాలున్న వారికోసం నేనిచ్చాను. వాటి సముదాయానికి నీవు అతీతంగ ఉండుము. అంటే, సత్త్వమును పెంచే వాటియందు మాత్రమే ఆసక్తుడవై సత్త్వాన్ని పెంచుకునే ప్రయత్నం చేయు' అని ఆదేశిస్తాడు.

అది వేదాల ద్వారా బహుశ్రమ సాధ్యం కనుక, అందులో సత్త్వవివృద్ధిని కాంక్షించే వారికోసం ఆ భగవానుడే ఉపదేశించిన శాస్త్రభాగం 'శ్రీపాంచరాత్ర దివ్యాగమశాస్త్రం' కనుక దీనిని గూడ 'ఏకాయనము' అనవచ్చునని శ్రీప్రశ్నసంహితయే తెలిపింది.

**వేదమేకాయనం నామ వేదానాం శిరసి స్థితం।**
**తదర్థకం పాంచరాత్రం మోక్షదం తత్ క్రియావతామ్॥**
**యస్మిన్ ఏకో మోక్షమార్గః వేదే ప్రోక్తస్సనాతనః।**
**మదారాధన రూపేణ, తస్మాదేకాయనం భవేత్॥ 2-39.**

ఇదే విషయాన్ని ఈశ్వరసంహిత 1వ అధ్యాయంలో 18వ శ్లోకం నుండి తెలిపింది.

**శృణుధ్వం మునయస్సర్వే వేదమేకాయనాభిధం।**
**మోక్షాయనాయ వై పంథాహ ఏతదన్యో న విద్యతే।**
**తస్మాదేకాయనం చేతి ప్రవదన్తి మనీషిణః।**

మోక్షమనే గమ్యాన్ని చేర్చడానికి శ్రీపాంచరాత్రము కంటే వేరు మార్గము లేనే లేదు. దీనినే ఏకాయనవేదమంటారు. **నాన్యః పంథాః అయనాయ విద్యతే** అంటూ పురుషసూక్తం 'ఏకాయన వేదమే' మోక్షమార్గమున నడిపించే దివ్యసాధనమని తెలిపింది.

వేదాలలో శుక్లయజుర్వేదాన్ని ఏకాయనశాఖ అని వ్యవహరిస్తారు. శ్రీపాంచరాత్రాన్ని నేర్చి, ఆరాధనాదులను చేయడానికి మొదటి అధికారం శుక్లయజుర్వేదీయులలో కాణ్వశాఖకు చెందినవారికే ఉందని పాద్మసంహిత వాచ్యంగానే చెప్పుకుంది.

వారు లభించినప్పుడే ఇతరశాఖీయులకి ఆయా మంత్రదీక్ష తీసుకోవడం ద్వారా అవకాశం లభిస్తుందన్నమాట.

**కాణ్వీం శాఖాం అధీయానాన్ వేదవేదాన్తపారగాన్**

అయితే ఏకాయనమంటే శుక్లయజుర్వేదమే తప్ప శ్రీపాంచరాత్రమని ఎందుకు అనాలి? అనే ప్రశ్న రావచ్చు. దానికి సమాధానం గతంలోనే చెప్పుకున్నాం! శ్రీప్రశ్నసంహితలో 2వ అధ్యాయంలోంచి.

ఆవేదంలోంచి మోక్షగాములైన క్రియాశీలురకోసం ఉద్ధరించి ఉపదేశించిన అంశమే శ్రీపాంచరాత్రం కనుకనే దీనినీ 'ఏకాయనం' అనే వ్యవహరిస్తారు అని అక్కడ స్పష్టం చేశారు. కనుక ఏకాయనమంటే శ్రీపాంచరాత్రమే అనడంలో సంశయం లేదు.

ఛాందోగ్యోపనిషత్ 7వ ప్రపాఠకంలో సనత్కుమార-నారదుల సంవాదం ఉంది. భూమవిద్య అనే ఒక బ్రహ్మవిద్యను పొందడానికని నారదుడు, సనత్కుమారుడి దగ్గరికి శిష్యుడిగ వెడతాడు. 'ముందు నీకేమి తెలుసునో, ఏమి అధ్యయనం చేసావో చెప్పుమా! అపుడు నేను నీకేమి చెప్పవలెనో ఆలోచిస్తా' నంటాడు సనత్కుమారుడు. దానికి సమాధానం చెప్పే ప్రకరణంలో నారదుడు తానింతవరకూ నేర్చిన గ్రంథాల పేర్లను ఏకరువు వేస్తాడు.

**ఋగ్వేదం భగవోధ్యేమి యజుర్వేదం సామవేదం ఆథర్వణం చతుర్థం ఇతిహాసపురాణం, పంచమం వేదానాం వేదం పిత్ర్యం రాశిం దేవం నిధిం వాకోవాక్యం, ఏకాయనం వేదవిద్యాం బ్రహ్మవిద్యాం భూతవిద్యాం క్షత్రవిద్యాం నక్షత్ర విద్యాం సర్ప దేవ జనవిద్యాం ఏతత్ భగవో అధ్యేమి 7-2**

అందులో వేదాలను చెప్పిన తర్వాత 'ఏకాయనం' అని మళ్ళీ ప్రత్యేకించి తెలిపినది 'శ్రీపాంచరాత్రశాస్త్రాన్నే'.

ఏతావతా శ్రీపాంచరాత్రదివ్యాగమ శాస్త్రం భగవానుడే తన ప్రాప్తికి స్వయంగ ఉపదేశించిన తన ఆరాధానా విధానము. కనుక దీనిని 'ఏకాయనం' అంటారనే విషయం వేదాలే స్వయంగ ప్రస్తావించాయి. కనుక ఈ పేరువల్ల శ్రీ పాంచరాత్రానికి కల ప్రాచీనత, పరమవైదికత్వము స్పష్టమవుతున్నాయి.

## అల్లంపల్లి జీయర్ గురుకుల, నేత్రవిద్యాలయ విద్యార్థుల విజయోత్సవం

శ్రీశ్రీశ్రీ చిన్న జీయర్ స్వామివారి మంగళాశాసనములతో, ఈ సంవత్సరం అల్లంపల్లి జీయర్ గురుకులం నుండి, విజయనగరం నేత్రవిద్యాలయం నుండి 10వ తరగతి పరీక్షకు హాజరైన విద్యార్థులు నూటికి నూరు శాతం ఉత్తీర్ణులైనారు.

అల్లంపల్లి పాఠశాల నుండి **16** మంది విద్యార్థులు పరీక్షకు హాజరు కాగా **6** గురు విద్యార్థులు **A2** గ్రేడ్ సాధించగా **9** మంది విద్యార్థులు **B1** గ్రేడ్ పొందారు. ఒకరికి **B2** గ్రేడ్ వచ్చింది. శ్రీ స్వామివారి మంగళాశాసనములతో **2004** లో ఆరంభించిన మన అల్లంపల్లి జీయరుగురుకుల పాఠశాలనుండి మొట్టమొదటి బ్యాచ్ విద్యార్థులు, పదవతరగతి వరకు శిక్షణ పొంది, గతసంవత్సరం పరీక్షకు హాజరై నూరు శాతం ఉత్తీర్ణత సాధించారు. ఈ సంవత్సరం రెండవ బ్యాచ్ విద్యార్థులు విశేష కృషి చేసి నూరు శాతం ఉత్తీర్ణతతో పాటు ఉత్తమమైన గ్రేడ్స్ పొందగ శ్రీజోగినపల్లి మణికుమార్ మండలస్థాయిలో ద్వితీయ స్థానాన్ని కూడా పొందడం విశేషం. విద్యార్థుల విజయానికి జెట్ సొసైటీ కమిటీ సభ్యులు, పాఠశాల నిర్వహణాధికారులు, ఉపాధ్యాయులు విశేష కృషి చేసి శ్రీస్వామివారి మంగళాశాసనాలకి పాత్రులైనారు.

విజయనగరం నేత్రవిద్యాలయం నుండి ఈ సంవత్సరం **12**మంది విద్యార్థులు హారుజు కాగ, **10** బి గ్రేడ్‌తో, ఒకరు బి2 గ్రేడ్‌తో ఉత్తీర్ణులైనారు.



## సుభాషితమ్ ... వసతు జిహ్వాగ్రే

శ్రీమతి గుదిమెళ్ళ మంజుల - చిట్టిగూడూరు

# అనిర్వేదః శ్రియో మూలమ్

ప్రతి మానవుడూ పుట్టినప్పటినుంచీ దేనికో ఒకదానికి పరుగులు తీస్తూనే ఉంటాడు. అది చదువుల కోసమే కావచ్చు, సంపాదన కోసమే కావచ్చు, అటు వ్యవసాయం కోసమో, ఇటు వ్యాపారం కోసమో కావచ్చు. కారణం ఏదైనా ప్రతినిత్యం మనిషి పరుగెత్తుతూనే ఉంటాడు. ఉండాలి కూడా.

మనిషై పుట్టినందుకు ఏదో ఒకటి మంచిని సాధించి తీరాలి గదా! ఆ సాధించేదేదో అది నలుగురికి ఉపయోగించేదైతే మరీ సంతోషం.

ఏమి సాధించాలో ఎలా సాధించాలో తెలుసుకొని అడుగు ముందుకు వేయాలి. ఆ వేయడంలో తొట్రుబాటు ఉండకూడదు. ఒకసారి ఒక అడుగు ముందుకు వేశామా అంటే మరి వెనక్కు తగ్గకూడదు. అందుకే ఏపని చేసినా ఆలోచించి చేయాలి. **"సహసా విదధీత న క్రియాం అవివేకః పరమాపదాం పదమ్"** – అంటారు కవి. ఆలోచన లేకుండా ఏ పనీ చేయరాదు. ఆపదల పాలవుతాము.

ఒకవేళ తాననుకున్నది నెరవేరకపోయినా నిరుత్సాహ పడరాదు. ఒక్కసారి మనల్ని నిరుత్సాహం ఆవహించిందంటే ఏ పనినీ చేయనీయదు, అడుగు ముందుకు వేయనీయదు, ఆలోచనలు రానీయదు, ప్రాణత్యాగానికైనా ఉసిగొల్పుతుంది. అందుకే నిరుత్సాహం పనికిరాదు. ఉత్సాహం తెచ్చుకోవాలి. ప్రయత్నం కొనసాగించాలి. అప్పుడే విజయం మనల్ని వరిస్తుంది. అది మన చేతిలోనే ఉంది. దీనికి శ్రీమద్రామాయణంలో హనుమే చక్కని నిదర్శనం.

శ్రీమద్రామాయణం ఒక సుభాషితరత్న భాండాగారము. నిశితంగా పరిశీలిస్తే ఎన్నో సుభాషితరత్నాలు మనకు కన్పిస్తాయి. వాల్మీకిమహర్షి సుందరకాండలో హనుమంతుని ద్వారా జీవితంలో దేనికీ కూడా నిరుత్సాహపడరాదని ఒక మహోపదేశాన్ని అందించారు.

సీతాన్వేషణకై దక్షిణ దిక్కుకు బయలుదేరిన హనుమ బృందం ఎన్నో ఆటంకాలను దాటుకొని దక్షిణ సముద్రతీరం చేరారు. సీతజాడ కనిపించక, సుగ్రీవ దండనకు భయపడి ప్రాయోపవేశానికి సిద్ధపడ్డారు. బుద్ధిమంతుడైన హనుమ ఆ దశలో వారికి ధైర్యం చెప్పే ప్రయత్నం చేశాడు. దైవవశాత్తూ సంపాతి, సీత లంకలో ఉన్నదని సమాచారం అందించాడు. అందరికీ తిరిగి జీవితం మీద ఆశ చిగురించింది.

కానీ, నూరుయోజనాల సాగరాన్ని దాటాలి అనగానే తిరిగి అందరినీ నిరుత్సాహం ఆవహించింది. జాంబవంతుని ప్రేరణతో మరల హనుమంతుడే సాగరలంఘనానికి సాహసం చేశాడు.

అనితర సాధ్యమైన ఈ కార్యాన్ని సంకల్పించిన హనుమంతుని ధైర్యాన్ని దేవతలు ప్రశంసించారు. ఆదిలోనే హంసపాదులా ఎదురైన మైనాకుని స్నేహపూర్వక ఆహ్వానానికి ఆగిపోక, లక్ష్యంమీద దృష్టితో ముందుకు దూసుకుపోయాడు. అతని లక్ష్యశుద్ధిని చూచిన మహనీయులంతా శ్లాఘించారు.

సురస రూపంలో దేవతలు పెట్టిన పరీక్షను తన బుద్ధిబలంతో నెగ్గి, దేవతల ఆశీస్సులతోపాటు దివ్యశక్తిని పుంజుకున్నాడు.

సింహిక రూపంలో వచ్చిన ఆటంకాన్ని తన శక్తిసామర్థ్యాలతో జయించి లంకలో ప్రవేశించాడు.

**"ధృతిః దృష్టిః మతిః దాక్ష్యం"** ఈ నాలుగు గుణాలు కలిగినవానికి కర్మలలో ఎన్నడూ అపజయముండదని నిరూపించాడు. అంతటి మహానుభావుడైన హనుమ సీతమ్మ కోసం లంకానగరమంతా వెదికి, వెదికి కనబడక పోయేసరికి నిరుత్సాహపడ్డాడు. ఆ నిరుత్సాహంలో సీతమ్మ కనపడకపోతే పరిస్థితి ఏమిటి అనే ఆలోచనలు సాగాయి. తాను తిరిగి వెళ్ళి సీత కనపడలేదని చెప్పగానే... ముందుగా సాగరతీరంలో ఉన్న వానరులంతా నిరాశతో ప్రాణత్యాగం చేస్తారు. ఈ వార్త సుగ్రీవుని సన్నిధిలో ఉన్న రామునిదాకా చేర్చినట్లయితే రాముడు ప్రాణాలతో నిలువడు. లక్ష్మణుడు అన్ననే అనుసరిస్తాడు. ఎవరివల్లన తనకీ జీవితం, రాజ్యం లభించాయో ఆ స్నేహితులను కోల్పోయిన సుగ్రీవుడు ప్రాణత్యాగం చేస్తాడు. రాజుని కోల్పోయిన కిష్కింధ వానరులంతా జీవితాలను అంతం చేసుకుంటారు.

ఇక అయోధ్యలోనివారి సంగతి చెప్పనే అక్కర్లేదు. రాముని రాకకై 14 సంవత్సరాలుగా ఎదురు చూస్తున్న భరతుడు ఈ వార్త వినగానే ప్రాణాలు కోల్పోతాడు. అతన్ని అనుసరించి శత్రుఘ్నుడు, ముగ్గురు తల్లులు, అయోధ్యావాసులు ఒకరి వెనుక ఒకరు ప్రాణాలు వదిలిపెడతారు.

నిర్వేదం ఆవరించటంతో ఎంతో బుద్ధిశాలి అయిన హనుమకే ఆలోచనా పరంపర ఇలా సాగింది. దానితో మనస్సు మరింత నిర్వీర్యమైనది. ఇందరి ప్రాణాలను రక్షించటం కోసం తాను తిరిగి వెళ్ళకపోవటమే మంచిది అనుకున్నాడు. లంకాతీరంలోనే అన్నపానాలు మాని ప్రాయోపవేశము చేద్దామనుకున్నాడు.

ఇదే పరిస్థితి సామాన్యులకెదురైతే అదే పని చేసేవారు. కానీ హనుమంతుడు తనను స్మరించిన వాళ్ళకి కూడా చక్కటి బుద్ధిని, బలాన్ని, కీర్తిని, ధైర్యాన్ని, తేజస్సుని, వాక్చాతుర్యాన్ని అందించగలిగే దివ్యశక్తి సంపన్నుడు కనుక ఒక్కసారి నిర్వేదాన్ని వదిలించుకొనే ప్రయత్నం చేశాడు.

తనకు తానే "చనిపోతే ఏమొస్తుంది. బ్రతికుంటే ఎప్పటికైనా సీతమ్మను చూడొచ్చు కదా!" అనుకుని నిరుత్సాహాన్ని ప్రక్కకు నెట్టి ఉత్సాహాన్ని తెచ్చుకుని ఇలా తలిచాడు.

**అనిర్వేదః శ్రియోమూలం అనిర్వేదః పరం సుఖమ్ ।**
**అనిర్వేదో హి సతతం సర్వార్థేషు ప్రవర్తకః ॥**

'నిర్వేదం' అంటే నిరుత్సాహం అని అర్థం. దానికి **"అ"** చేర్చితే **"అనిర్వేదం"** అయింది. అంటే నిరుత్సాహం లేకపోవుట, ఉత్సాహంగా ఉండటం అని అర్థం.

ఉత్సాహమే శ్రేయస్సులకు మూలం. ఆ ఉత్సాహమే విశిష్టమైన సుఖాలకు కారణం. అంతేకాదు, అన్ని కార్యాలలో ముందుకు నడిపించేది, ఆ కార్యాన్ని సాధించేలా చేసేది ఆ ఉత్సాహమే!

సంస్కృత భాష చాలా గొప్పది. అందమైంది కూడా. ఒక్క అక్షరంలో ఎంతో అర్థాన్ని దాచిపెట్టుకుంటుంది. అది ఆ ఒక్కభాషకే సొంతం. నిర్వేదానికి, అనిర్వేదానికి ఒక్క "అ" అనే అక్షరమే తేడా. కానీ, అది కలిగించే ప్రభావంలో పూర్తి విపరీత పరిణామాన్ని మనం పొందుతాం. నిర్వేదం, అనిర్వేదాలలో ఒకటి మనిషి పతానికి కారణమౌతుంది. మరియొకటి మనిషి ఉన్నతశిఖరాలను అధిరోహించటానికి కారణమౌతుంది. ఇది గ్రహించి మనం జీవనయానంలో ఎలాంటి పరిస్థితి ఎదురైనా ఉత్సాహంగా ముందుకు సాగాలి.

జీవితం సమస్యల తోరణం. అయినా జీవితమొక హరివిల్లు. అందులో సుఖ-దుఃఖ, లాభ-నష్ట, గెలుపు-ఓటమి, వేడుక-వేదనలు ఉంటాయి. వీటన్నింటి కలయికే జీవితం. సుఖం కలిగినప్పుడు పొంగిపోకుండా, దుఃఖం వచ్చినపుడు కృంగి పోకుండా జీవితంలో ముందుకు నడిచే ప్రతిమనిషి ఆదర్శప్రాయుడే! ఎన్ని అడ్డంకులెదురైనా వాటిని అనుకూలంగా మార్చుకుని విజయం సాధించాలి. ఆటంకాలలోనుంచే అనుకూలతలను వెతుక్కోవాలి. అప్పుడే ఆపదలు సంపద లౌతాయి. కనుకనే సాధ్యమైనంతవరకూ పొరపాట్లు చేయ కుండా లక్ష్యసాధనవైపు పయనిస్తే విజయం తథ్యం. దీనికి కూడా ఉత్సాహమే కారణం. ఉత్సాహంతో పాటు, ఓర్పు, వివేకం ఈ రెండూ కూడా ఉండాలి. వివేకం లేనిది దేనికీ పనికిరాము. జీవన రహదారిలో ముళ్ళుంటాయి, గులకరాళ్ళుంటాయి. జాగ్రత్తగా ఏరిపారేస్తూ ముందుకు నడవగల్గితే విజయం మనదే! ప్రతిమనిషికీ జీవితంలో గెలవలేని లక్ష్యం లేనేలేదు. ఒకరికంటే ఒకరం ముందో వెనుకో వెళ్ళవలసినవాళ్ళమే అని తెలిసినా, బ్రతకటానికి చేసే ప్రయత్నాలు మానటం లేదు కదా! అలాగే గెలుపుకోసం ఎన్నో ఓటములను ఎదుర్కొన్నా, ఉత్సాహంతో చేసే ప్రయత్నాలు తరువాతి తరాలవారికి స్ఫూర్తిదాయకాలు కావాలి.

ఈ విశాల ప్రపంచంలో పుట్టిన ప్రతిజీవి పుట్టుకకూ ఒక అర్థం, పరమార్థం ఉంటుంది. మేఘం నుంచి కురిసే వర్షం ప్రతిచుక్క ఒక ముత్యం కాలేకపోయినా, ఎక్కడో ఏ చిన్నిమొక్కకో ప్రాణం పోస్తుంది. ఎండిపోయిన ఆకైనా మనం ఆహారం గైకొనటానికి పనికొస్తుంది. ప్రతిదానికి ఒక ప్రయోజనం ఉందని గుర్తించి ఉత్సాహంగా ముందుకు నడిస్తే మన జీవితం కూడా చరితార్థం అవుతుంది. అంతే కాదు, ఇంద్ర ధనుస్సులోని సప్తవర్ణాలు మనకు ఆనందాన్ని, ఆహ్లాదాన్ని, ఉల్లాసాన్ని, ఉత్సాహాన్ని కల్గిస్తాయి. అలాగే జీవితంలోని సుఖాలు, దుఃఖాలు, కష్టాలు, నష్టాలు, లాభాలు, మోహాలు వీటన్నింటినీ కూడా కర్మానుభవంలో భాగంగా గుర్తించి ఆచార్య అనుగ్రహంతో సాధనకు అనుకూలంగా మరల్చుకొని ముందుకు నడిస్తే మన జీవితం కూడా సఫలమౌతుంది. నిరుత్సాహాన్ని పారద్రోలుదాం. ఉత్సాహంతో ముందుకు సాగుదాం!



## రాయల ఊహాల పల్లకీ....
# ఆముక్తమాల్యద

సంపూర్ణమానవుడు తన పుట్టుకననుసరించి ఎట్లా మనుగడ సాగించాలో ధన్యతనెలా పొందాలో నిరూపించేది ప్రబంధం. ఇహపరాలకు సేతువుగా నిలిచేది.

రాయలవారు సంస్కృతవేదాంతాన్ని చక్కగ ఎరిగినవారు. దివ్యప్రబంధ నిషేవణం కావించారు. ఉభయవేదాంత సంప్రదాయ రహస్యాలనాకళించుకున్నవారు.

ఆముక్తమాల్యదలో ఖాండిక్యకేశిధ్వజ సంవాదం వరకూ పచ్చకపురపు తావులవలె సంస్కృతవేదాంతం గుబాళిస్తూంటే, మాలదాసరి కథనుండీ పొగడపూల తావులవలె ద్రావిడవేదాంతం గుబాలిస్తుంది.

ఎన్నిశాస్త్రీయ విషయాలు ప్రస్తావించినా ఎంతగా భక్తిప్రసూనాలు పరిమళింపచేసినా అడుగడుగున ఆయనలో సామాజికస్పృహ తొణికిసలాడుతూనే ఉంటుంది. ఆయన ప్రకృతి ప్రియుడు. సమాజహితచింతకుడు. వైదుషీ విభూషితుడు. పరమ ప్రపన్నుడు. సదనుష్ఠాన ప్రవణుడు. తన ప్రజల అభ్యుదయ నిశ్శ్రేయసములను రెండిటినీ కాంక్షించిన ఉత్తమ ప్రభువు. కనుకనే ఈ ప్రబంధాన్ని ఇట్లా నిర్మించగలిగినారు.

ఇవన్నీ తెలిసినవారు తప్ప ఈ ప్రబంధాన్ని తూచలేరు. నిజానికి ఆంధ్రప్రబంధాలలో తలమానికముగ నిలవదగినది ఈ ప్రబంధము. ఈ పాత్రలు వేరు. వారి పలుకులు వేరు. తలపులు వేరు. జీవత ప్రయోజనాలు వేరు. ఈ ఉదాత్తత వేరు. ఈ దివ్యత వేరు. ఇలలో ఉంటూనే మానిసి పరమానందాన్ని పొందే మార్గాన్ని సూచించేది ఈ ప్రబంధం.

తెనుగున వెలసిన పంచకావ్యాలలో ప్రౌఢమైనది ఆముక్తమాల్యద. సాహితీప్రణయులతోపాటు, సంప్రదాయ ప్రవణులూ ఆదరించదగినది. ఈ ప్రబంధాన్ని భక్తినివేదన పాఠకులకు సరళవచనంతో నూతన ఉపాయనంగా అందించాలని సంకల్పించాం. అందుకే ఈ పూర్వరంగం.

ఇక రాయలవారి ఊహాల పల్లకీలో భావాంబర వీధివిహారాలు కావిస్తూ... సత్సంప్రదాయ సౌరభాల నాఘ్రాణిద్దాం!

పాండ్యదేశంలో విల్లిపుత్తూరు అని ఓ నగరం ఉంది. ఆ నగరంలో అన్నీ బంగరు మేడలే. అవీ ఆకాశాన్నంటుతూంటాయి. ఆ మేడల పైకప్పులమీద అందంగా అలంకారంకోసం ఇంద్రనీలమణులతో చేసిన చిలకల్నీ పెట్టేరు. ఆ ఇళ్ళకు దగ్గరలోనే ఉన్న ఉద్యానవనాల్లో అసలైన కోకిలలు, చిలకలు ఉన్నాయి. వాటి కలకలధ్వనులు ఆ ఇళ్ళలో మారుమ్రోగుతున్నాయి. పైనించివచ్చి వీధుల్లో తిరుగుతున్న కొత్తవారు ఆ ధ్వనులువిని అవి ఆ మేడలమీది కోయిలలు, చిలకలు చేస్తున్న ధ్వనులే కాబోలు అనుకుంటున్నారు. ఆ మేడల పైకప్పులు బంగారు పెంకులతో నిర్మించినవి. ఆ కప్పులమీద కెంపులతో తామరమొగ్గల్లా తీర్చిన శిఖరాలున్నాయి. ఆ మేడలు స్వర్గానికి దగ్గరగా ఉన్నాయేమో, కెంపులశిఖరాలు, ఎఱ్ఱని శిరస్త్రాణాల్లా, బంగారు పెంకుల కప్పు, బంగరు కవచాల్లా ఉండడంతో ఆ మేడలు ఇంద్రుని మేడమీదికి జైత్రయాత్రకు సిద్ధపడుతున్నట్లుగా ఉంది.

ఆ పట్టణంలో వీధులు వంకరల్లేకుండా తీర్చిదిద్దినట్లున్నాయి. ప్రతి ఇంటి సింహద్వారందగ్గర అటూ ఇటూ మరకతమణులతో చేసిన ఏనుగుబొమ్మల్ని నిలిపేరు. మరకతాలతోచేసినవి కావటాన పచ్చగా పసరు రంగులో ఉన్న ఆ ఏనుగులు సముద్రంలో నిరంతరం ఉండడంవల్ల పాచిపట్టిన దిగ్గజాల్లా ఉన్నాయి. ఇవికాక, మరకతసింహాల బొమ్మలు ఉన్నాయక్కడ. నోటిలోంచి బైటికి ఏనుగు తొండాలు వేలాడుతున్న సింహాలవి. తొండం తప్ప మిగిలిన ఏనుగునంతా మింగేసినట్లున్నాయి ఆ సింహాలు. తెల్లని సింహాలు, నల్లని ఏనుగుల్ని మింగినందువల్ల ఆ నలుపూ, ఈ తెలుపూ కలిసి పసరు రంగులో కనిపిస్తున్నాయి ఆ సింహాలు. అల్లా కనపట్టంకోసమే సింహాలని మరకతాలతో నిర్మించారు.

ద్వారంమీద లక్ష్మీదేవి కొలువుతీరి ఉంటుంది. అటూఇటూ రెండేనుగులు ఆమెను అభిషేకిస్తున్నాయి. ఇదంతా బంగారపు నీటి పూతతో చిత్రించినట్లుంది. ఆ చిత్రానికి రెండువైపులా శంఖచక్రాల ప్రతిమలున్నాయి. కిందున్న రత్నాల అరుగుల్లో అవి ప్రతిఫలిస్తున్నాయి. ద్వారాలకు మణులతో తోరణాలు కట్టేరు. అవి ఆ ఇళ్ళనే రాజులు ఇతరపట్టణాల గృహలక్ష్ములను పెళ్ళిచేసుకోవడానికి ధరించిన బాసికాల్లా ఉన్నాయి.

(సశేషం)

\- శ్రీరామచంద్రాచార్య



## పరమహంస పరివ్రాజకులు
# శ్రీశ్రీశ్రీ చిన్నజీయర్‌స్వామివారి ప్రచారవార్తలు



శ్రీశ్రీశ్రీ పెద్దజీయర్ స్వామివారి శతాబ్ది ఉత్సవాలలో ప్రారంభమైన మన JIVA గురుకుల పాఠశాల, నేత్రవిద్యాలయ జూనియర్, డిగ్రీ కళాశాలలతో పాటు, ఈ మధ్యనే జీవా కమ్యూనిటీ కళాశాలను కూడా ప్రారంభించుకుని మరింతగా విస్తరిస్తోంది. అయితే ఇక్కడ ఆవాసం స్థానికంగా ఉండే వారికి మాత్రమే సరిపోతోంది. కార్యక్రమాల కోసం విచ్చేసే అతిథులను దృష్టిలో పెట్టుకొని శ్రీమతివనజాభాస్కరరావు దంపతులు 47కి పైగా SUITS ఉండేట్టుగా భవన నిర్మాణం గతంలో ప్రారంభించారు. బ్రహ్మోత్సవాల సమయానికి దానిని అతిథులకి వినియోగర్థ్వంగా అందించాలనే తపనతో ముందుగా 12 SUITS పూర్తికావించారు. ఏప్రిల్ 28వ తేదీన జరిగిన గృహప్రవేశానికి సాకేతరాముడు స్వయంగా వేంచేయగా, మన ఆచార్యులు శ్రీచిన్నజీయర్ స్వామివారు తమ పెరుమాళ్ళతో, శ్రీశ్రీశ్రీ అహోబిలరామానుజ జీయర్ స్వామివారితో వేంచేసారు. సాకేతరాముని నిత్యకళ్యాణము, సుదర్శన హోమము ఈ భవన ఆవరణలోనే జరిగాయి. శ్రీశ్రీశ్రీ స్వామివారు ఆర్తితో ఆశ్రయించిన భక్తులకి మంత్రోపదేశం అనుగ్రహించారు.

శ్రీమతివనజగారి వియ్యంకులు శ్రీమాన్ ఎమ్.శ్రీకాంతరెడ్డి, శ్రీమతి సుకన్యగార్లు స్వయంగా దగ్గరుండి ఈ భవన నిర్మాణ కార్యక్రమాన్ని జరపగా, శ్రీమాన్ రామారావుగారు, ఇంజనీర్ పర్యవేక్షిస్తూ బ్రహ్మోత్సవ సమయానికి భవనాన్ని సర్వాంగ సుందరంగా తీర్చిదిద్దారు. భగవద్బంధువులంతా విచ్చేసి కార్యక్రమాన్ని అద్భుతంగా జరిపారు. శ్రీమతి వనజగారు ఈ సందర్భంగా మాట్లాడుతూ పెరుమాళ్ళ సేవ మాకెప్పుడూ ఇలా ఉండాలని ప్రార్థన చేశారు.

శ్రీస్వామివారు మంగళాశాసనములు చేస్తూ త్వరలో దీనిని అతిథి గృహంగ ఉపయోగించటంతో పాటు JIVA లో జరిగే శిక్షణతరగతులవారికి కూడా వినియోగించే ఏర్పాట్లు చేసుకోవచ్చని తెలిపారు.

శ్రీశ్రీశ్రీస్వామివారు ఏప్రిల్ 29వ తేదీ సాయంత్రం శ్రీరాంనగరం నుండి బయలుదేరి సైదాబాద్‌కాలనీకి వేంచేసారు. అక్కడ పురాతన శ్రీకోదండరామాలయానికి నూతనంగ నిర్మించిన తోరణాన్ని ARCH శ్రీవారు ప్రారంభించి, విష్ణునగర్ కాలనీలో, సైదాబాద్ వికాసతరంగిణి వారు ఏర్పాటు చేసిన సామూహిక లక్ష్మీపూజా కార్యక్రమాన్ని నిర్వహించి, భక్తులకు మంగళాశాసనాలు కావించారు. తరువాత మన శ్రీ పెద్ద స్వామివారు ఏర్పాటు చేసిన రామస్థూపాలను పర్యవేక్షిస్తున్న విజయలక్ష్మిగారి గృహానికి వేంచేసి వారి పెరుమాళ్ళకి, కుటుంబసభ్యులకి మంగళాశాసనాలు చేసారు.

30 వతేదీ ఉదయం శ్రీకోదండరామాలయ ఆవరణలో సమాశ్రయణాలు కావించి, ఎంతో కాలంగా వారు శ్రీవారిని ప్రార్థిస్తున్న 108 సుదర్శనహోమ కార్యక్రమానికి పూర్ణాహుతిని కావించి భక్తులందరికీ మంగళాశాసనాలు చేసి సీతానగరం చేరారు.

1వ తేదీ గుణదలలో శ్రీమాన్ కామినేని శరత్ కుమార్, శ్రీమాన్ సంపత్ కుమార్ సోదరులు తమ తండ్రిగారైన శ్రీమాన్ సుబ్రహ్మణ్యేశ్వరరావు గారికి నిర్వహించిన పరమపదోత్సవంలో పాల్గొని భక్తులకి మంగళాశాసనాలు కావించారు. 2వతేదీ నుండి 4 వ తేదీ వరకు శ్రీ ఉ.వే.శ్రీమాన్ ఉదయవర్ స్వామివారి 76వ తిరునక్షత్ర మహోత్సవ సందర్భంగా ఏర్పాటు చేసిన ఉభయవేదాంత పండితసభలలో పాల్గొన్నారు. 4వ తేదీ ఉదయం బయలుదేరి ప.గో.జిల్లా దొమ్మేరులో, శ్రీమాన్ ఎమ్.ఎస్.ఎన్.రాజుగారు (వారిజ కార్యకర్త), భారతదేశంలోనే ప్రథమస్థానం పొందిన సిరామిక్ కప్స్ ఫ్యాక్టరీకి శ్రీవారు వేంచేయాలని ఎంతోకాలంగా కోరుతున్నారు. గతంలో వీరు ఈ ఫ్యాక్టరీలోనే కప్స్‌మీద రామాయణ చిత్రాలను తయారుచేయించి అందించారు. వీరికే కొవ్వూరుదగ్గర రైలు పట్టాల క్రింద వేసే స్లీపర్స్ తయారు చేసే ఫ్యాక్టరీకూడా ఉంది. ఈ రెంటికీ శ్రీవారు మంగళాశాసనం చేసి, కొవ్వూరులో శ్రీమతి బేబిగారి(విజయవాడ కార్యకర్త) సోదరి శ్రీమతి రమాదేవి గారి గృహానికి వేంచేసి మంగళాశాసనాలు చేసి రాత్రికి వారిజ చేరారు.

5వతేదీ ఉదయం డా.కందాడై రామానుజాచార్యులుగారి కుమారుడు శ్రీమాన్ మురళీగారు ఋషికొండపైన ప్రాడజీ సొల్యూషన్స్ అనే పేరుతో ఒక సాఫ్ట్‌వేర్ కంపెనీని ప్రారంభించి శ్రీకాకుళం జిల్లా గరివిడి గ్రామంవేంచేసారు.అక్కడ శ్రీమాన్ కృష్ణయాజిగారు గత సంవత్సరంగ చేస్తున్న సత్రయాగ కార్యక్రమానికి విచ్చేసి 'శ్రీపాంచరాత్రాగమ ప్రశస్తి' పుస్తకావిష్కరణ కావించి మంగళాశాసనాలు కావించారు. తిరుగు ప్రయాణంలో మన భక్తినివేదన ఎడిటర్ శ్రీ. ఉ.వే.శ్రీమాన్ శ్రీరామచంద్రా చార్యస్వామివారిని సందర్శించి మంగళాశాసనాలు కావించారు. సాయంత్రం రావులపాలెం వద్ద అయినవిల్లిలో మన సాకేతదివ్యాలయ కమిటీ సభ్యులు శ్రీమాన్ వెంకటసత్యనారాయణరాజు పద్మావతి దంపతుల నూతన గృహానికి మంగళాశాసనాలు చేసి నేరుగా తిరువూరు మండలంలో ముష్టికుంట్ల వేంచేశారు. అప్పటికే అక్కడికి శ్రీశ్రీశ్రీ అహోబిల రామానుజ జీయర్ స్వామివారు వేంచేసి ఉన్నారు.

ఈ ఊరికో ప్రత్యేకత ఉంది. ఈ ఊరివారంతా చాలాకాలంగా భగవద్రామానుజుల సన్నిధిని ఏర్పాటుచేసుకొని వారినే ఆరాధించు కుంటున్నారు. ఈ ఊరు వెనుకబడిన ప్రాంతమైనా ఆచార్యనిష్ఠ కలిగి రామానుజులవారికి ఆలయం కావాలని 2,3 సంవత్సరాలుగా శ్రీవారిని ప్రార్థిస్తున్నారు. శ్రీవారి ఆజ్ఞతో భగవద్రామానుజులతోపాటు వెనుక కేశవపెరుమాళ్ సన్నిధిని, తూర్పున వరదరాజుకి, పశ్చిమాన తిరునారాయణ పెరుమాళ్ళకి, ఉత్తరాన శ్రీనివాసునికి, దక్షిణ దిక్కున శ్రీరంగనాథునికి చిన్న చిన్న సన్నిధులు కూడా నిర్మాణం చేసుకున్నారు. అక్షతృతీయనాడు శ్రీవారు వాటన్నిటికీ ప్రతిష్ఠచేశారు. శ్రీశ్రీశ్రీ అహోబిల రామానుజ జీయర్ స్వామివారు రెండురోజులు ముందునుండీ ఉండి రామానుజ వైభవాన్ని ఉపదేశం చేశారు. అనంతరం బోనకల్లు వద్ద చిట్యాలలోని శ్రీవేంకటేశ్వర ఆలయ ప్రతిష్ఠ కావించి అక్షతృతీయ వైభవం పై ప్రవచనం కావించారు.

6వ తేదీ సాయంత్రం వరంగల్ జిల్లాలోని మానుకోట యశోదా గార్డెన్స్‌లో రామానుజవైభవం పై ప్రవచనం అనుగ్రహించారు. 7 వతేదీ రామానుజ తిరునక్షత్రం మహోత్సవ సందర్భంగ భగవద్రామానుజులకి అష్టోత్తర పూజ, తనియన్ విజ్ఞాపన తర్వాత ఎవార్డ్ ప్రదానోత్సవం. మన జీవా అకడమిక్ కమిటీకి డైరెక్టర్ అయిన డా.శ్రీ.ఉ.వే.శ్రీమాన్ సముద్రాల వెంకట రంగరామానుజాచార్య స్వామివారు గత కొలది సంవత్సరాలుగా రామానుజ జయంతి నాడు శాస్త్రాధ్యయనం చేసిన పండితులకి తమ తండ్రిగారి పేరు మీద ఎవార్డ్ సమర్పిస్తున్నారు. ఈ వత్సరం మానుకోటలో రామానుజ జయంతి రోజున తిరుపతి యూనివర్సిటీలో ప్రొఫెసర్ శ్రీమాన్ దేవనాథన్ స్వామివారికి సమర్పించడం జరిగింది. అనంతరం హిందీ భక్తి నివేదన ఆవిష్కరణ శ్రీవారి కరకమలములతో జరిగింది. ఆ యశోదా గార్డెన్స్ వారు ప్రారంభించ దలచిన ఒక స్కూలుకి శ్రీస్వామివారు మంగళాశాసనాలు చేసి నేరుగా కోమటిపల్లి చేరారు.

8ఉదయం కోమటిపల్లిలో ప్రతిష్ఠ కార్యక్రమం నిర్వ హించారు. ఈ ఊరిలో 100 సంవత్సరాలకి పూర్వం స్థానికంగా ఉన్న లక్ష్మీనారాయణ పెరుమాళ్ సన్నిధానంలో విగ్రహాలు తొలగించి నూతిలో పారవేశారు. 1975లో వాటిని వెలికితీసి చిన్న మందిర నిర్మాణం కావించి మన శ్రీశ్రీశ్రీ పెద్ద స్వామివారిచే ప్రతిష్ఠకావించారు. కాలక్రమంలో ఆరాధన అంతంతమాత్రంగా జరుగుతూ వస్తోంది. ప్రాయశః తెలంగాణ ప్రాంతంలోని శ్రీవైష్ణవ సన్నిధులన్నీ ఈ ప్రాంతానికి చెందిన భట్టర్ వంశస్థులచేత సంస్కారం పొందినవే. అక్కడుండే పండితులు క్రమంగా బ్రతుకు తెరువుకోసం అన్ని వైపులకీ చెదిరిపోవడంతో ఆ ప్రాంతం నామ మాత్రంగా మిగిలింది. ఈ ప్రాంతానికే చెందినా ప్రస్తుతం ఆస్ట్రేలియాలోని సిడ్నీ లో శ్రీమాన్ హృషీకేశభట్టర్ స్వామి ఉంటున్నారు. వారికి ఎంతోకాలంగా ఈ ఆలయం బాగు చేయాలని ఉండి, ఆస్ట్రేలియా దేశంలోనే వనరులన్నీ సమీకరించి ఈ ఆలయ పునరుద్ధరణ కావించి పునః ప్రతిష్ఠకు కావలసిన సామగ్రితో సహా అన్ని ఏర్పాట్లు చేసి, ఇక్కడుండే తమ బంధువుల సహకారంతో ప్రతిష్ఠా కార్యక్రమం ఏర్పాటు చేశారు. వీరు మన JET AUSTRALIA కి సలహాదారు. ఎంతో కాలంగా పునః ప్రతిష్ఠ శ్రీవారిచేతనే జరగాలని కోరుకుంటున్నారు. శ్రీస్వామివారు వేంచేసి మన పాంచరాత్ర కళాశాల అధ్యాపకులు, విద్యార్థుల చేతనే ఆ కార్యక్రమం నిర్వహింపచేయాలని కోరడంతో, మన విద్యార్థులు ముందుగా వెళ్ళి ఏర్పాట్లు ఆరంభించారు.

"భగవన్మూర్తులలో కేశవాది 24 వ్యూహాలకీ వేరు వేరుగ ప్రత్యేక రూపాలు ఉన్నాయని మన ఆగమాలు చెప్తున్నాయి. నారాయణ వ్యూహానికి క్రింద కుడిచేతిలో శంఖం పైన పుష్పం, ఎడమచేతిలో క్రింద చక్రం, పైన గద ఉండాలని నియమం. ఈ మూర్తి సరిగ్గా అలానే ఉంది. అంటే ప్రాచీనకాలంలో శాస్త్రం తెలిసిన పెద్దలు చక్కగా తయారుచేయించి మూర్తిని ఉంచినా మధ్య కాలంలో ఆరాధనాదులు లోపించాయి. తిరిగి పునరుద్ధరించే అవకాశం శ్రీమాన్ భట్టర్ వారికి కలిగిం"దని శ్రీవారు తమ అనుగ్రహ భాషణంలో మంగళాశాసనాలు చేశారు.

శ్రీపరాశరభట్టర్ వంశానికి చెందిన సుమారు 100 కుటుంబాలు తిరిగి ఆశ్రమానికి చేరడంతో ఆ గ్రామము, గ్రామస్తులందరూ కూడా ఆనందతరంగాలలో ఓలలాడారు. ఊరంతా కళగా ఉంది. ఈ కళ ఎప్పుడూ ఉండాలని శ్రీ స్వామివారు మంగళాశాసనాలు చేశారు. మన జెట్ సీనియర్ సభ్యులు శ్రీమతి శ్రీలతమ్మగారు కూడా వారి తల్లిగారికి ఆచార్యులు ఈ గ్రామం నుండే వేంచేశారన్న కృతజ్ఞతతో వెండి శఠారి సమర్పించి, తదీయారాధన ఏర్పాట్లు కావించారు.

8 రాత్రికి తూ.గో.జిల్లా రంపచోడవరం చేరారు. ఇక్కడ సాదిక్ హుస్సేన్, షకీలా అనే ముస్లిం దంపతులు రాతితో శ్రీ భూనీళా సమేత శ్రీ వేంకటేశ్వర స్వామి ఆలయాన్ని నూతనంగా నిర్మించారు. 2006లో జరిగిన గీతాజ్యోతి కార్యక్రమంలో వీరు శ్రీవారిని సేవించి ఆలయనిర్మాణానికి మంగళా శాసనాలు ప్రార్థించగ, శ్రీవారు గుమ్మం ఎత్తే సమయానికి వేంచేసి మంగళా శాసనాలు చేశారు. తిరిగి ప్రతిష్ఠకార్యక్రమం కూడా శ్రీవారి శ్రీహస్తాలతో జరుపమని ప్రార్థించగా 9 ఉదయం శ్రీవారు జరిపించి, రాత్రికి దివ్యసాకేత ద్వితీయ బ్రహ్మోత్సవాలకై శ్రీరామనగరం చేరారు.

14వ తేది లీవ్ లైఫ్ కిరణ్ హాస్పిటల్ ప్రారంభోత్సవానికి జె. జగపతిరావు గారితో కలసి వేంచేసారు. శరీరంలోనుండి వ్యర్థపదార్థాలను తొలగించే కేంద్రమిది.

18వ తేది ఉదయం వరంగల్‌జిల్లా, నక్కలగుంట వేంకటేశ్వరస్వామి వారి బ్రహ్మోత్సవాలలో పాల్గొని కుంభప్రోక్షణగావించి, గణేశ్ నగర్‌లోని శ్రీవేంకటేశ్వరస్వామి ప్రథమ బ్రహ్మోత్సవానికి విచ్చేసి అక్కడి భక్తులందరికీ వేంకటేశవైభవాన్ని అందిస్తూ, డిసెంబర్‌లో జరిగే శరణాగతిదీక్ష వివరాలను తెలిపారు. అనంతరం అభయ ఆంజనేయస్వామిని దర్శించి ఎక్సైజ్ కాలనీ వేంకటేశ్వరస్వామి ఆలయంలో కళ్యాణమండపం ప్రారంభించారు.

19వ తేది మహబూబ్‌నగర్ జిల్లా, మిడ్జెల్ మండలంలోని శ్రీఆంజనేయస్వామి ఆలయ పునప్రతిష్ఠకు వేంచేసి మంగళాశాసనాలు చేసారు.

20వ తేది సుచిత్ర పబ్లిక్‌స్కూల్‌ను సందర్శించి, రాత్రికి విజయవాడకు వేంచేసారు.

## శ్రీశ్రీశ్రీ స్వామివారి పర్యటన వివరాలు

**జూన్**

1. **బదరీ నుండి తిరుగు ప్రయాణం**
3. **రాత్రికి వైజాగ్ చేరతారు.**
4. **వారిజ వద్ద మత్స్యకారుల కార్యక్రమం**
5. **వైభవ వేంకటేశ్వరస్వామి గోపుర ప్రతిష్ఠ. రాత్రికి శ్రీకాకుళం రొట్టవలస చేరతారు.**
6. **రొట్టవలసలో రామాలయ ప్రతిష్ఠ**
7. **హైదరాబాద్**
8. **శ్రీమాన్ డా॥ జే. రామేశ్వరరావు గారి గృహప్రవేశంలో పాల్గొని అమెరికా వేంచేసారు.**

**తిరిగి జూలై 1న అమెరికా నుండి చాతుర్మాస్య దీక్షకై భారతదేశం వేంచేస్తారు.**

# దివ్యసాకేతంలో.... బ్రహ్మోత్సవాలు

శ్రీమాన్ రఘుదత్తాచార్యులు - ప్రధానార్చకులు

**చైత్రః శ్రీమాన్** అయం మాసః పుణ్యః అంటూ వాల్మీకి చైత్రమాసాన్ని పొగిడాడు. కౌసల్య జగద్భర్తగ శ్రీరాముని మనకందించిన నెల కనుక. అది త్రేతాయుగం. **శ్రావణ** మాసానికి **శ్రీ**మాసమని పేరు. దేవకీదేవి జగద్గురువైన శ్రీకృష్ణుని మనకందించిన శుభ మాసం కనుక. అది ద్వాపరం. ఈ కలియుగంలోని ఈ వైశాఖ మాసం కూడా దివ్యమూ, సంపత్ప్రదమూను. మన ఆచార్యులు, జగదాచార్యులైన శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయర్ స్వామివారు క్రింద రఘునాథునికి, ఆపై ఆయన ఆరాధ్యదైవమైన రంగనాథునితో, ఇంకా పైన పరమపదనాథునితో సహా దివ్యసాకేతధామంలో స్థిరనివాసమేర్పరచి, మనకందించిన దివ్యమాసం ఈ వైశాఖమాసం.

మే నెల 10–16వ తేదీ వరకు శ్రీశ్రీశ్రీ చిన్నజీయర్ స్వామివారి ప్రత్యక్ష పర్యవేక్షణలో ఈ **త్రి** నాథుల బ్రహ్మోత్సవాలను మనం అత్యంత వైభవంగా జరుపుకుని ఈ మాసపు దివ్యత్వాన్ని, శ్రీమత్వాన్ని కూడా భగవదనుగ్రహ రూపంలో పొందగలిగాము. శ్రీశ్రీశ్రీ అహోబిల రామానుజ జీయర్ స్వామివారు కూడా వేంచేసి ఉన్నారు.

పాంచాహ్నిక దీక్షగా సంకల్పించిన ఈ బ్రహ్మోత్సవానికి కావలసిన యాగమండపము, తదీయారాధన మండపము, గోశాలాది నిర్మాణాలన్నీ పూర్తి చేసే బాధ్యతను మన భీమవరానికి చెందిన శ్రీమాన్ గణేశ్ రాజుగారు తమ పరివారంతో కలిసి నెరవేర్చారు. కళ్యాణ మండపము శాశ్వతంగా ఉండేవిధంగా, సాకేతరాముని ఉత్సవాలన్నీ జరుపుకోవడానికి వీలుగా మన జీవా అధ్యక్షులు శ్రీమాన్ జె.రామేశ్వరరావుగారు ఒక అద్భుతమైన నిర్మాణాన్ని కావించి, సుమారు 5వేల మంది భక్తులు సేవించడానికి అనువైన పూర్వరంగం సిద్ధంచేశారు.

10 వతేదీనాడు ఉదయం పెరుమాళ్ళకి ఉత్సవాంగ స్నపనంతో కార్యక్రమాలు ప్రారంభమైనాయి. సాయంత్రం విష్వక్సేనారాధన, పుణ్యాహవాచనాదులను జరుపుకొని ఆచార్య, ఋత్విగ్వరణాన్ని చేసి, అంకురారోపణ కావించారు యజ్ఞాచార్యులైన శ్రీమాన్ శ్రీనివాసాచార్యులు, శ్రీమాన్ మధుసూదనాచార్యులు. చంద్రుడు బీజాలకు అధిపతి కాబట్టి ఈ అంకురారోపణ రాత్రి సమయానే చేయాలని శ్రీపాంచరాత్రాగమం నిర్దేశిస్తోంది. జీవసంసార తారణకారణమగు దయా ప్రకాశం కలిగిన మన ఆచార్యుల సన్నిధిలో మహదానంద పులక అంకురాల కోసం శ్రద్ధ అనే బీజాలను నాటారు ఉత్సవార్థం వచ్చిన భక్తహృదయాలనే పాలికలలో. అనంతరం శ్రీ స్వామివారు ఆలయం ఎదురుగా శ్రీ పెద్దజీయర్ స్వామివారి నిలువెత్తు విగ్రహానికి ఆచ్ఛాదన కల్పిస్తూ రంగు రంగు దీపాలతో అలంకరింపబడిన మండపాన్ని, శ్రీపెద్దజీయర్ స్వామివారి పాదాలను ప్రేమజలాలతో అభిషేకిస్తున్న లోటస్ వాటర్ ఫౌంటెన్‌ను ప్రారంభించారు.

సాయంత్రం నూతన కళ్యాణ మండపాన్ని జీవా విద్యార్థుల సాంస్కృతిక కార్యక్రమంతో ప్రారంభించారు. ఈ నూతన కళ్యాణ మండపానికి శ్రీవారు **"సాకేతమండప"**మని నామకరణం చేశారు. ఈ మండప నిర్మాణాన్ని కావించిన శ్రీమాన్ రామేశ్వరరావు, శ్రీకుమారి దంపతులకు మంగళాశాసనాలు కావించారు.

అనంతరం శ్రీవారు బ్రహ్మోత్సవవిధానాన్ని అనుగ్రహిస్తూ **" మొట్ట మొదటగా భగవంతుడు అర్చారూపంలో భూమి మీదకు దిగివచ్చినపుడు బ్రహ్మగారు నిర్వహించిన ఉత్సవాలకి బ్రహ్మోత్సవమని పేరు ఏర్పడింది. ఈ ఉత్సవాలకి గరుడుడు దేవతాహ్వానం మొదలుకొని వారి ఆతిథ్యం ఇవ్వడం ఉత్సవాంతంలో తిరిగి వెళ్ళేవరకు వారి బాధ్యతని స్వీకరిస్తాడు. విష్వక్సేనులవారు ఉత్సవకార్యక్రమ నిర్వహణ పర్యవేక్షణలో ఉంటార"**ని వివరించారు. ఈలోపు ఆలయంలో విష్వక్సేనారాధన, పుణ్యాహవాచన కార్యక్రమాలు జరిగాయి. గరుడపటల అధివాసం జరిగింది.

11 వ తేదీ ఉదయం దేవతాహ్వానం కోసం ముందుగా గరుడపటాన్ని ఎగరవేసి, సంతానార్థులకి గరుడముద్దలు ప్రసాదంగా అందజేసారు. "దేవతాహ్వానానికి ముందుగా గరుడుని ఆవాహన చేయడానికి మాత్రమే ఒక కంబాన్ని (దారువుని) పాతి గరుడ స్తంభము(ధ్వజస్తంభము) ఉపయోగించి, ఉత్సవాంతంలో ఆ స్తంభాన్ని తీసివేసేవారు. కాలక్రమంలో గరుడస్తంభం లేకపోతే అసలు అది ఆలయమే కాదు. దివ్యదేశమే కాదు అనే ఒక అపోహ ఏర్పడి ఆ ధ్వజస్తంభాన్ని శాశ్వతంగా ఉంచే విధంగా ఏర్పాటు చేయడం క్రమంగ స్థిరపడిపోయిన ఆచారము. అయినప్పటికీ దారుస్తంభాన్నే తప్ప లోహముతో చేసిన వాటిని ధ్వజస్తంభంగా పెట్టరాదని" శ్రీస్వామివారు వివరించారు.

నూతనంగా నిర్మింపబడిన యాగమండపం సంప్రదాయబద్ధమైన అలంకరణలతో ఆనాటి ఋషుల కుటీరాలను తలపించింది. యాగశాలలోనే శ్రీస్వామివారు ఆరాధనకావించి తీర్థగోష్ఠి అనుగ్రహించారు. వెంటనే యాగ కార్యక్రమాలకు కావలసిన అగ్నిని, యజ్ఞాచార్యులు సూర్యుని నుండి భూతద్దము ద్వారా సంగ్రహించి యాగశాలలో ప్రతిష్ఠావన కావించారు. శ్రీస్వామివారు యాగకార్యక్రమాలకి కావలసిన అగ్నిసేకరణ పద్ధతులను గురించి వివరిస్తూ **"అగ్నిమథనం ద్వారా అప్పుడే పుట్టించిన అగ్నిని 'బాలాగ్ని' అని, నిత్యం ప్రకాశిస్తూండే దివ్యగోళమైన సూర్యుని నుండి సేకరించిన అగ్నిని 'యువాగ్ని' అని, ఆలయాలలోని నిత్యాగ్నిహోత్రం నుండి సేకరించిన అగ్నిని 'వృద్ధాగ్ని' అని అంటారు. సందర్భాన్ని బట్టి ఆయా అగ్నులను సేకరిస్తా"**రని తెలిపారు.

**"మనం జరుపు కుంటున్నవి బ్రహ్మోత్సవాలు కనుక, భౌమ సంబంధమైన బాలాగ్ని, వృద్ధాగ్నులు కాక, దివ్యమైన యువాగ్నిని సూర్యుని నుండి సేకరించారు. మంత్రోచ్చారణపూర్వకంగా మన యజ్ఞాచార్యులవారు సూర్యుని నుండి అగ్నిని 2,3 నిమిషాలలోనే సేకరించగలిగారు. అలా సేకరించిన అగ్నిని మొదటగా పశ్చిమదిశలోని హోమకుండంలో చేర్చి అక్కడి నుండి క్రమముగా మిగిలిన దిక్కులలోని హోమకుండాలలోకి వ్యాపింపచేస్తారు. అలా మొదటిసారి మాత్రమే ఒక కుండం నుండి మరొక కుండంలోకి అగ్ని ప్రసరణ కావించవచ్చు, హోమం ప్రారంభమయ్యాక మాత్రము ఒకదానిలోని అగ్నిని మరొక దానితో కలపరాదు. తూర్పువైపు కుండంలో వాసుదేవునితో ప్రారంభించి ఒక్కొక్క కుండంలోను ఒక్కొక్క వ్యూహస్వరూపాన్ని ఆరాధిస్తా**"రని శ్రీవారు వివరించారు.

**దేవతలు తేజశ్శరీరకులు కనుక, వారికి మనం మంత్రపూతంగ సమర్పించే ఆహుతులే ఆహారము. యాగసమయంలో వేంచేసిన ఆయా దేవతలకి శ్రద్ధతో ఆహుతులర్పిస్తే వారు మన పట్ల ప్రసన్నంగా ఉంటారు. మంత్రములంటే, మనకి తెలిసిన అక్షరాలే అన్పించినా, వాటిని ఒక ప్రత్యేక క్రమంలో కూర్చి శ్రద్ధతో పలకడం వలన వాటికి దివ్యత్వం సిద్ధించి మంత్రాలౌతాయి. వాటికి దేవతలు స్పందించి మనల్ని అనుగ్రహిస్తారు. ఈ యాగసమయంలో విచ్చేసిన దేవతలంతా ఏ రూపంలోనైన మన మధ్యే ఉంటూ భగవంతుని సేవిస్తూ ఉండి ఉంటారు కనుక మనమంతా శ్రద్ధతో సేవిస్తూండా**"లని శ్రీ స్వామివారు అనుగ్రహించారు.

వెంటనే యాగశాలలో చతుస్థానార్చనలు ప్రారంభమైనాయి. భగవంతుడు విగ్రహరూపంలోను, కుంభంలోను, మండలంలోను, అగ్నిస్వరూపంలోను 4 స్థానాలలో ఆరాధనలందుకుంటూ ఉంటాడు కనుక, దీనిని చతుస్థానార్చన అంటారు. పాంచాహ్నిక హోమ కార్యక్రమాలను కూడా ప్రారంభించి శ్రీస్వామివారు, శ్రీఅహోబిలరామానుజ జీయర్ స్వామివారితో కలిసి సాకేత రాముని ఉత్సవమూర్తి రూపంలో నూతన కళ్యాణ మండపంలోకి వేంచేపు చేశారు.

మానవునిగ అవతరించి 11వేల సంవత్సరాలు ఈ భూమిపై నడయాడి అర్చామూర్తిగ ఈ నాడు దివ్య సాకేతాన వేంచేసి ఉన్న శ్రీసాకేత రాముని అర్చనను భక్తులందరిచేత సామూహికంగా చేయించారు శ్రీస్వామివారు. భగవన్నామ సంకీర్తనముతో అక్కడి భక్తులందరి హృదయాలు తన్మయమైనాయి. నూతన మండపంలోనే భక్తులందరికి తదీయారాధన జరిగింది.

సాయంత్రం శ్రీ విష్ణుసహస్రనామ పారాయణ ప్రవచనాలు పూర్ణాహుతి అనంతరం వాహనసేవప్రారంభమైంది. "నివాస శయ్యా ఆసన పాదుక అంశుక ఉపధాన వర్షాతపవారణ" అని ఆళవందారులు కీర్తించినట్లుగ సకల సేవలు అందించే ఆదిశేష వాహనంపై స్వామి తిరువీధి ఉత్సవం ఎంతో వైభవంగ జరిగింది.

12 ఉదయం యాగశాలలో చతుస్థానార్చనతో పాటుగ సాకేతమండపంలో పూజా కార్యక్రమం జరిగింది. బ్రహ్మయొక్క నిర్వేదాన్ని తొలగించడానికై స్వామి అందించిన తొలి అర్చా స్వరూపం, బ్రహ్మ నుండి ఇక్ష్వాకు వంశానికి అంది శ్రీరామునిచేత కూడా ఆరాధింపబడి, పట్టాభిషేక సమయంలో విభీషణునికి అనుగ్రహింపబడి, శ్రీరంగంలో స్థిరనివాసమేర్పరచుకున్న శ్రీరంగనాథుడు, మన దివ్యసాకేతం లో కూడా వేంచేసి ఉండి బ్రహ్మోత్సవాలు జరిపించుకుంటున్నాడు. ఈ రెండవరోజున రంగనాథుని సామూహిక పూజా కార్యక్రమాన్ని శ్రీవారు భక్తులందరికీ అనుగ్రహించారు.

సాయంత్రం హనుమద్వాహనం పై స్వామి, హంస వాహనం పై అమ్మ సాకేతమండపానికి వేంచేయగా ఎదుర్కోలు ఉత్సవం అత్యంత వైభవంగా జరిగింది. అమ్మ తరఫున భద్రాచల రామాలయ స్థానాచార్యులగు శ్రీమాన్ స్థలశాయి గారు, శ్రీమాన్ అమరవాది స్వామి ప్రభృతులు, స్వామి తరఫున శ్రీ జీయర్ స్వాములు, శ్రీ ఉ.వే.శ్రీమాన్ డా.ఎస్.వి.రంగరామానుజాచార్యస్వామి వారు వాద ప్రతివాదరూపంలో ఆ దివ్యదంపతుల వైభవాన్ని భక్తులకందించారు.

13వతేదీ ఉదయం యాగశాలలో ఆరాధనానంతరం సాకేతమండపంలో అమ్మవారి మాస తిరునక్షత్ర సందర్భంగా లక్ష్మీపూజా మహోత్సవాన్ని శ్రీస్వామివారు జరిపించారు. స్వామి వక్షస్థలంలో నిత్యవాసినియై నిత్యానపాయినియై జీవుల నైరాశ్యాన్ని తొలగిస్తూ భగవచ్చరణారవిందామృతాన్ని అందింపజేయుటకు తహతహలాడు దయామృతవర్షిణి అయిన ఆ అమ్మ తిరునక్షత్ర సందర్భంగా పూజించుకోగలగడం అదృష్టమని పాల్గొన్న భక్తులు భావించారు.

సాయంత్రం కళ్యాణోత్సవం శ్రీరంగంలోని చేర్తి ఉత్సవంలా భాసించింది. భక్తజనహృదయ మృదంగ తరంగమా... ఇది! అనంతజీవుల తపో తరువుల విరిసిన పుణ్యఫల సమాహారమా...ఇది! ఆచార్యానుగ్రహాన విరిసిన హృదయకమల పరిమళ సౌరభమా...ఇది! సకలజీవపోషక, ఆశ్రిత జన సంత్రా, జగజ్జన్మాది లీలారస కేళీ విలాస రసికుడైన ఆ రామచంద్రుడు ఒక ప్రక్క, జీవుల దోషాలు చూడక, పాపాలు పరిమాపి, స్వామి హృదయ తాపాన్ని బాపి, జీవుల స్వామి చరణయుగళిని ఆశ్రయింపజేయు తల్లి సీతమ్మ మరొక ప్రక్క, ఆగమోక్త ఉపచారాలతో కళ్యాణోత్సవం వైభవంగ జరుగుతోంది.

"హే ప్రభో! అనంత సంసార సాగర నిమగ్నులమగు, మేము నీ కృపా వీక్షణ భాగ్యముచే మనుష్య జన్మ పొందిన నాటినుండి కూడా అనేక విధములైన అనంతాపచారాలను బాపుకొన ఈ ఆత్మ అనే కన్యారత్నమును నీకే సమర్పించుకుంటున్నాము స్వీకరించి అనుగ్రహింపమా!'' అని భక్తుల ప్రార్థనలు వింటూ స్వామి శ్రీరామచంద్రుడు అర్చారూపంలో మరొక్క మారు అమ్మని చేపట్టాడు

ఇక ఎన్నడూ వీడనవసరంలేని విధంగ. అమ్మ మెడలో మాంగళ్యధారణ, భక్తుల హృదయాలలో పుణ్యాలు ఫలించిన భావన. బెంగుళూరు వాస్తవ్యులైన శ్రీమాన్ వెంకటరంగదాసు గారు తెచ్చిన 17 కిలోల ముత్యాలను అర్చకస్వాములు ఆ దివ్య దంపతులకి సమర్పించారు. శ్రీస్వామివారు జీవా విద్యార్థులచే ఆ ముత్యాలతో కూడిన అక్షతలను భక్తులందరికీ అనుగ్రహించారు.

14 ఉదయం యాగశాలలో చతుస్థానార్చనలు ప్రారంభం కాగానే సాకేత మండపంలోకి నూతన వధూవరులైన ఆ దివ్యదంపతులిద్దరూ ముత్యాల పందిరిలో వేంచేసి, తమ చల్లని కృపను భక్తులందరిపై వర్షించారు. శ్రీస్వామి వారి అనుగ్రహభాషణానంతరం, శ్రీ అహోబిల రామానుజ జీయర్ స్వామివారు, శ్రీరంగరామానుజాచార్య స్వామివారు, కలియుగదైవమై, తననాశ్రయించిన వారికి సంసారసాగర మును మోకాలి లోతు నీటివలె దాటించెదనన్న ఏడుకొండల వాని వైభవాన్ని భక్తులకి అందించి, శ్రీ వేంకటేశ్వర సామూహిక పూజా మహోత్సవాన్ని భక్తులందరిచే జరిపించారు.

సాయంత్రము ప్రణవధ్వాన నిర్ఘోష హిమాద్రిసమశోభిత నాగేంద్ర దర్ప వినాశక రత్నకాంచన భూషితుడు, ఛందోమయుడగు గరుడుని అధిరోహించిన వేద ప్రతిపాద్యుడైన స్వామి, అష్టమ చంద్ర సమాకారమైన లలాటాన దివ్య ఊర్ధ్వ పుండ్రములతోడ, మల్లిక, కమల,కల్హార, తులసీ, పూగ, పున్నాగ, మాలతీ పుష్పమాలాలంకృతుడై, కిరీట, కేయూరాది ఆభరణములు తిరుమేని విరాజిల్లుతుండగ, బ్రహ్మరుద్రేంద్రాది సమస్త దేవతలు శరణు శరణనుచు పరుగులిడుతూ చేరు శ్రీచరణయుగళితో ప్రకాశిస్తూ తిరువీధికేగినాడు. భక్తజనమంతా జయ జయధ్వానాలతో ఆ గరుడుని అనుసరించి స్వామిని సేవించి తరించారు.

15 ఉదయం పూర్ణాహుతి అనంతరం స్వామి శ్వేతఛత్రము కల రథాన్ని అధిరోహించి మాడ వీధులగుండ తిరువీధిగ శ్రీరామనగరంలో ఈశాన్యం మూల నేత్రవిద్యాలయం వద్ద తాత్కాలికంగ ఏర్పాటు చేసిన కోనేరు చేరాడు. అక్కడ స్నపనానంతరం సుదర్శనునితో చక్రవారి తీర్థాన్ని భక్తులంతా సేవించారు.

సాయంత్రం శ్రీపుష్పయాగం, ద్వాదశారాధనవిధి. పుష్పములతో రచించిన మండలంలోని 12స్థానములనుండి 12పుష్పములను తీసుకుని, స్వామి తిరుమేనియందు 12భాగములలో 12మంత్రాక్షరములతో 12మార్లు ఉంచుతూ 12నెలల ఆరాధనాదోష వైషమ్య నివారణకు జరిపే ద్వాదశారాధనను స్వామికి సమర్పించారు. అనంతరం శ్రీ స్వామివారు ఆ దివ్య దంపతులకి అనేక రకాల పుష్పాలతో అభిషేకించారు.

తరువాత యాగశాలలో మహాపూర్ణాహుతి చేసి 5 రోజులపాటు ఆరాధనలందుకున్న స్వామిని తిరిగి ఆలయానికి చేర్చి శ్రీ స్వామివారు అన్ని సన్నిధులలోను మహాకుంభ ప్రోక్షణ కావించారు. భక్తులందరికీ ఆ తీర్థ ప్రోక్షణ గావించి అనుగ్రహించారు. వైభవంగ ఉత్సవాలను జరిపించుకున్న పెరుమాళ్ళను, అందించిన ఆచార్యులను, విద్వజ్జనులను సంభావించుకుని ఉత్సవాన్ని సుసంపన్నం చేశారు మన ఆలయ కమిటీ సభ్యులు, శ్రీమాన్ మురళీకృష్ణం రాజుగారు, శ్రీమతి సుచరితగారు, శ్రీమతి వసుమతీ భాస్కరరావుగారు, శ్రీమతివనజాభాస్కరరావుగారు, శ్రీమాన్ వెంకటసత్యనారాయణరాజు ప్రభృతులు.

16 వతేదీ ఉదయం ఉత్సవాలలో అలసిన స్వామికి అది తీరేట్టుగ 81 కలశాలతో ఉత్సవాంత స్నపనాన్ని సమర్పించారు. సాయంత్రం సప్తావరణ, ఏకాంత సేవలతో మహోత్సవకార్యక్రమాలన్నీ సుసంపన్నమయ్యాయి. వైభవమంటే దివ్య సాకేతం, వైభోగమంటే సాకేత దర్శనం, ఆనందమంటే సాకేతరాముని సంసేవనం. సౌభాగ్యమంటే ఉత్సవాన అన్వయించడం.ఎన్నో ఉత్సవాలకాలవాలమైన దివ్యసాకేతాన్ని చేరుదాం! మహదానందాన్ని పొందుదాం!

**బ్రహ్మోత్సవాలలో సాంస్కృతిక కార్యక్రమాలు**

దివ్యసాకేతంలో మే 10-16 వ తేదీ వరకు జరిగిన బ్రహ్మోత్సవాలలో సాంస్కృతిక కార్యక్రమాల సమన్వయకర్తగా శ్రీమతి అరుణా రాఘవరెడ్డిగారు చాలా చక్కని కార్యక్రమాలను అందించారు. 10 వతేదీ నాట్యాచార్యులు శ్రీమాన్ పవన్ 26 మంది శిష్యులతో చేసిన నృత్యాలలో కథక్ మరియు రింగ్ కార్యక్రమాలు భక్తులను ఆకట్టు కున్నాయి. పూర్వాశ్రమంలో శ్రీ అహోబిలరామానుజ జీయర్ స్వామివారి స్నేహితులైన వీరు దేశవిదేశాలలో అనేక ప్రదర్శనలిస్తున్నారు. 11వతేదీ

శ్రీరాధిక మ్యూజిక్ అండ్ డ్యాన్సు అకాడమీకి చెందిన, దూరదర్శన్‌లో కూడా పాడి సంగీత సిస్టర్స్ గా ప్రసిద్ధి చెందిన శ్రీమతి సంగీతకళ, శ్రీమతిరాజ్యలక్ష్మిగార్లతోపాటు శ్రీమతి రోజా అనిల్ గారు అందించి గాత్రకచేరీ భక్తులకు వీనులవిందు చేసింది. శ్రీమతి రమణి సిద్ధి బృందం వారందించిన ఆముక్త మాల్యద నృత్యరూపకం కూడా భక్తులను ఆకర్షించింది. 12వతేదీ లిటిల్ మ్యుజిసియన్స్ అకాడమీ నుండి శ్రీమాన్ రామాచారి గారు బృందం అన్నమయ్య కీర్తనలనాలపించి భక్తులను సంతోషింపచేశారు. 13 న అన్నమయ్య హరి శరణాగత సమాఖ్య వారు అన్నమయ్య కీర్తలనాలపించి భక్తులను పరవశులను చేశారు. 14న మన నేత్రవిద్యాలయ విద్యార్థులు చక్కని పాటలతోటి, తిరుమంగైయాళ్వార్ల పై స్వయంగ వ్రాసిన బుర్ర కథతోటి భక్తులను అలరించి తమ మానసిక వికాసాన్ని అందరికీ పంచారు. అనంతరం ప్రముఖ నాట్యాచార్యులైన వెంపటి చినసత్యంగారి ముని మనుమరాలు కుమారి లలితా సింధూరి తన కూచిపూడి నృత్యప్రదర్శనతో భక్తుల హృదయాలను ఆనందతరంగితం చేసి, మన కళల వైభవాన్ని ప్రభావాన్ని చాటింది.

**జీవా గురుకుల విద్యార్థుల అద్భుత విన్యాసాలు**

వార్షికోత్సవంలో భాగంగ జీవా విద్యార్థులు ఈ ఏడాది కాలంలో అభ్యసించిన వివిధ అంశములను ప్రతిరోజు వేదిక పై ఆవిష్కరించినారు. కొద్దికాలంలోనే ఇంత చక్కగా విద్యార్థులు సాధించిన ప్రతిభను జీవా ఛైర్మన్ శ్రీమాన్ డా.జె.రామేశ్వరావుగారు ప్రశంసించినారు. పెద్దలంతా ఆనందించినారు. గురుకుల విద్యార్థులకు శ్రీస్వామివారు మంగళాశాసనాలు కృపచేసినారు.

# 'భక్తి' నివేదన

భక్తి నివేదనని 64 వసంతాలుగ ఆదరిస్తున్న మీ కోసం.... ప్రత్యేకం ఈ పేజీ
భక్తినివేదనలో 'మీ' 'భక్తి' 'నివేదన' కోసం ఒక అద్భుత అవకాశం

జై శ్రీమన్నారాయణ!

జగదాచార్యులు మనందరి ప్రియతమ ఆచార్యులైన
శ్రీ శ్రీ శ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయర్ స్వామివారి
ప్రవచనామృతాన్ని విని, వారనుగ్రహంతో నడిచే సేవాకార్యక్రమాలతోనూ ప్రేరణ పొంది,
వారినాశ్రయించి మంత్రోపదేశం పొందిన భక్తులు అసంఖ్యాకం.

ఆచార్యస్తు హరిస్సాక్షాత్ చరరూపీ న సంశయః

మన శ్రీ స్వామివారు ఇలలో విష్ణుస్వరూపమన్నది మనకందరికీ అనుభవైక వేద్యమే.
అయితే కబీర్ వంటి భక్తులు గురువు, గోవిందులిద్దరిలో గోవిందుని కంటే గురువే గొప్పని కూడా భావించారు.
కారణం ఉత్తమోత్తమమైన భగవత్తత్వాన్నే మనకి అందించగలిగినవారు కనుక, అనేది ఒక కారణమైతే
భగవంతుని కంటే వాత్సల్యమూర్తులై మన కర్మానుభవాన్ని అవసరమైతే సవరించగలిగిన మహానుభావులు కూడా.
కనుకనే, మనలో ప్రతి ఒక్కరం మన ఆచార్యులైన శ్రీశ్రీశ్రీ చిన్నజీయర్ స్వామివారితో
ఒక అద్భుతమైన ఆధ్యాత్మిక అనుబంధాన్ని భావన చేయడమే కాకుండా

త్వమేవ మాతాచ పితా త్వమేవ త్వమేవ బంధుశ్చ గురుస్త్వమేవ
త్వమేవ విద్యా ద్రవిణం త్వమేవ త్వమేవ సర్వం మమ దేవ దేవ!

అని హృదయపూర్వకంగా శరణాగతి చేయగలుగుతున్నాం!
వారు నిర్వహించే కార్యక్రమాలలోను, సమాజసేవలోనూ ధనరూపేణకాని, సేవా కైంకర్యం ద్వారా కాని
భాగస్వాములమై జీవితాన్ని సఫలం చేసుకోవాలని తహతహలాడుతున్నాం!
ఆచార్య సన్నిధిలో కైంకర్యం చేసేటపుడు వారి కృపాదృష్టితో చిరునవ్వు వెన్నెలతో
మన హృదయాలలో నింపిన దివ్యానుభూతులెన్నెన్నో
అలాంటి ఆచార్యవైభవాన్ని తెలిపే ఒకానొక అనుభూతిని అందరితో పంచుతూ
మరికొంత మందికి ప్రేరకులుగా, మార్గదర్శకులయ్యే అవకాశాన్ని మన భక్తినివేదన మీకు కల్పిస్తోంది.
ఆలస్యమెందుకు వెంటనే మీ అనుభూతులను మాకు వ్రాసి పంపండి. ఆచార్యవైభవాన్ని అందరితో పంచండి!

*గమనిక:* ప్రచురణకి అనుకూలంగా ఉన్నవాటిని మాత్రమే అవసరమైన మార్పులు చేసి ప్రచురించగలము.
మిగిలినవి తిప్పి పంపబడవు. కవరు మీద 'ఆచార్యవైభవము' అని వ్రాయగలరు.

చిరునామా : శ్రీరాంనగరం, ముచ్చింతల్, పాలమాకుల పోస్ట్ 509 325 శంషాబాద్,
రంగారెడ్డి జిల్లా. ఆంధ్రప్రదేశ్.



## సముద్రాల వేంకట నరసింహాచార్య స్వామివారి (అయోధ్యస్వామి) పరమపదప్రాప్తి

అయోధ్యస్వామివారుగా ప్రసిద్ధి చెందిన ఉ.వే.ప్ర. శ్రీమాన్ వెంకట నరసింహాచార్య స్వామివారు 2.4.2011న స్వాచార్య తిరువడిగళ్ళను చేరినారు.

ఈ ఆచార్యస్వామివారు 45,46 సంవత్సరాలపాటు నిర్విరామంగా తెలంగాణా ప్రాంతంలోని 7,8 జిల్లాల్లో రామానుజ సంప్రదాయ ప్రచారానికై విశేష కృషిని సలిపినారు. 46 సార్లు ధనుర్మాస కాలక్షేప గోష్ఠులను నిర్వహించారు. 13 పర్యాయములు భగవద్విషయ కాలక్షేప గోష్ఠులను, అనేక పర్యాయములు తిరుమంత్రార్థం, గురుపరంపరా ప్రభావం, శ్రీవచన భూషణం, ఆచార్యహృదయంవంటి సంప్రదాయ గ్రంథ కాలక్షేపగోష్ఠులను నిర్వహించారు.

వందకు పైగా సంఖ్యలో అర్చిరాది కాలక్షేపాలను అనుగ్రహించిన శ్రీమాన్ అయోధ్యస్వామివారు వేలసంఖ్యలో శిష్యులకు పంచసంస్కారాలను అనుగ్రహించారు.

కాలినడకన, ఎడ్లబండ్లపై గూడా ప్రయాణించి ఏడాదిలో 8 నెలలపాటు శిష్య సంచారం చేస్తూ విశేషకృషిచేసిన సముద్రాల వేంకట నరసింహాచార్య స్వామివారు తాము పరమపదించుటకు కొంతకాలం క్రితం వరకు భగవద్విషయ కాలక్షేపగోష్ఠిని నిర్వహించారు. తమ జ్యేష్ఠ పుత్రులైన సముద్రాల శఠకోపాచార్యస్వామికి ఎరిజర్ల స్వామివారి కనిష్ఠపుత్రులైన కండ్లకుంట శ్రీనివాసాచార్యచార్యస్వామివారికి తిరుప్పల్లాండు, కణ్ణినుణ్ శిరుత్తాంబు భగవద్విషయ మహాప్రవేశాలను పూర్తిచేసి మొదటిపదిలోని కొన్ని తిరువాయ్‌మొజిలను మాత్రం పూర్తి చేశారు.

గత సంవత్సరం మే 28 2010 హనుమకొండ నక్కలగుట్టలోని శ్రీ వేంకటేశ్వరదేవాలయ ప్రతిష్ఠా కార్యక్రమ సందర్భంలో శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయర్ స్వామివారు శ్రీమాన్ అయోధ్యస్వామి దంపతలుకు నూతన వస్త్రములు, 5,000/-లు నగదుతో సత్కరించారు.

అయోధ్యస్వామివారికి "సంప్రదాయ సుధానిధి", "భగవద్విషయ ప్రబోధక" అనే బిరుదులు కలవు. వీరు నమ్మాళ్వార్ వైభవం, యతిరాజ శతకము, వరవరముని వైభవం అను గ్రంథాలను ప్రకాశింపచేసినారు. తమకు గ్రంథాచార్యులైన ఉ.వే. శ్రీమాన్ కందాడై శ్రీరంగశఠకోప దేశికుల వారి శతజయంతి సందర్భాన్ని పురస్కరించుకొని వారి కృతులనన్నింటిని సంకలనం చేసి ఒక గ్రంథంగా ముద్రింపచేసే బాధ్యతను తమ ముగ్గురు కుమారులకు ఇద్దరు కుమార్తెలకు, శిష్యులకు అప్పగించినారు.

సముద్రాల వేంకట రంగదేశికుల వద్ద పంచసంస్కారాలను పొందిన అయోధ్యస్వామివారు తమ ఆరాధనలో ఉండే భగవన్మూర్తులకు ఆరగింపులో, ఆరాధనలో ఏమైనా ఆటంకాలు ఎదురౌతాయేమోననే భావనతో దూరప్రాంతాలలో జరిగే పండిత సభలకే వెళ్ళలేదు. ఈ స్వామివారి పెద్ద కుమారులైన శ్రీమాన్ సముద్రాల శఠకోపాచార్యస్వామి 2006 జనవరి నుండి మొదలు ఇప్పటికి వరుసగా 57 వ్యాసాలను రచించి భక్తినివేదనకై పంపారు. ఏప్రిల్ 17వ తేది వరకు వైదిక సాంప్రదాయిక కార్యక్రమాలు జీయర్‌స్వామి వారల మంగళాశాసన బలంతో వైభవంగా జరిగాయి.

పెద్దలు, ఆచార్య పురుషులైన బ్రహ్మవేత్తలైన శ్రీమాన్ అయోధ్యస్వామి వారికి బ్రహ్మమేధ సంస్కారాన్ని జరిపించి, పుత్రులు శ్రద్ధగా కార్యక్రమాలను నిర్వహించునట్లు ప్రోత్సహించారు.



తూర్పుగోదావరిజిల్లా, దుగ్గుదుర్రు గ్రామ వాస్తవ్యులు, శ్రీ పెద్దజీయరు స్వామివారి శిష్యురాలు అయిన శ్రీమతి **రేమెళ్ళ సావిత్రమ్మ**గారు ది. **3.3.2011**న పరమపదం చేరినారు. వీరికి పరమాత్మ పదసన్నిధిలో శాశ్వత కైంకర్య లభించాలని శ్రీస్వామివారు మంగళాశాసనము చేశారు.



తూర్పుగోదావరిజిల్లా, అర్థవరం గ్రామ వాస్తవ్యులు, శ్రీమతి రుద్రరాజు వెంకటరత్నంగారి భార్య **నాగరత్నమ్మ**గారు ది. **11-3-2011**న పరమ పదం చేరినారు. వీరికి పరమాత్మ పదసన్నిధిలో శాశ్వత కైంకర్యం లభించాలని శ్రీస్వామివారు మంగళా శాసనము చేశారు.



కరీంనగర్ జిల్లా, వేములవాడ వాస్తవ్యులు శ్రీమాన్ **చీటి నారాయణరావు**గారు ది. **5.3.2011**న పరమదం చేరినారు. వీరికి పరమాత్మ పదసన్నిధిలో శాశ్వత కైంకర్యం లభించాలని శ్రీస్వామివారు మంగళాశాసనం చేశారు.



హైదరాబాద్ వాస్తవ్యులు, శ్రీమతి **యిల్లిపిళ్ళా సీతారామాయమ్మ**గారు ది. **4.11.2010**న పరమపదం చేరినారు. వీరికి పరమాత్మ పదసన్నిధిలో శాశ్వత కైంకర్య లభించాలని శ్రీస్వామివారు మంగళాశాసనము చేశారు.



గుంటూరు జిల్లా, చుండూరు వాస్తవ్యులు శ్రీమతి **ఇక్కుర్తి రాఘవమ్మ**గారు **9.2.2011** న పరమ పదం చేరినారు. వీరికి పరమాత్మ పదసన్నిధిలో శాశ్వత కైంకర్యం లభించాలని శ్రీస్వామివారు మంగళా శాసనము చేశారు.



గుంటూరు వాస్తవ్యులు శ్రీ పెద్దస్వామివారి శిష్యులు కీ॥ శే॥ అమ్మిశెట్టి నారాయణ గారి భార్య శ్రీమతి **అమ్మిశెట్టి మాసమ్మ** గారు **20.2.2011** న పరమదం చేరినారు. వీరికి పరమాత్మ పదసన్నిధిలో శాశ్వత కైంకర్యం లభించాలని శ్రీస్వామి వారు మంగళాశాసనం కృప చేశారు.



ఏలూరు వాస్తవ్యులు శ్రీమతి **మోతే సత్యవతి** గారు ది. **3.1.2011**న పరమదం చేరినారు. వీరికి పరమాత్మ పదసన్నిధిలో శాశ్వత కైంకర్యం లభించాలని శ్రీస్వామివారు మంగళాశాసనం చేశారు.



రాజమండ్రి వాస్తవ్యులు శ్రీమాన్ **తాళ్ళూరి మనవాళ్ళ సూరి**గారు **9.6.2010**న పరమపదం చేరినారు. శ్రీ స్వామివారు నిర్వహించే కార్యక్రమాలలో సేవ లందించే వారు. వీరికి పరమాత్మ పదసన్నిధిలో శాశ్వత కైంకర్యం లభించాలని శ్రీస్వామి వారు మంగళాశాసనం కృప చేశారు.

# మెదడుకి మేత!

భగవద్బంధువులారా! జిజ్ఞాసతో మీరంతా చదువుతూ ఆదరిస్తున్న 'భక్తినివేదన'లో మీకోసం ఈ శీర్షిక! **ఈ పత్రిక లోని వ్యాసాలనుండే మీకు ప్రశ్నలిస్తున్నాం!** అయినా మరొక్కసారి జ్ఞాపకం చేసుకోవడం మనస్సుకి ఆనందమని మెదడుకీ చిన్నమేత! అన్నీ సరిగా వ్రాస్తే ఆకర్షణీయ బహుమతులు! ప్రతినెల 20వ తేదీలోపు మాకందిన సమాధానాలని మాత్రమే పరిశీలిస్తాం! ఆ పై దాటివచ్చినవి పరిశీలింపబడవు. దీనిపై ఎలాంటి ఉత్తర ప్రత్యుత్తరాలు ఉండవు. శ్రద్ధతో మీరు పంపిన గత నెల సమాధానాలందాయి. విజేతల పేర్లు క్రింద ప్రకటించాము. బహుమతులు పంపిస్తాం!

| ప్రశ్నలు | సమాధానాలు |
|---|---|
| 1. యజ్ఞునిగా స్వామి అందించిన మార్గం........... | |
| 2. 'ఇది' తెలిసుకున్నవాడే ఉన్నవాని కింద లెక్క.... | |
| 3. వేలమంది తల్లిదండ్రులకంటే మనపై వాత్సల్యం కలది....... | |
| 4. తిరుమాలై ప్రబంధమును అందించినవారు......... | |
| 5. దశరథుని పుత్రులు................అంశలే. | |
| 6. ఆశా........యేషాం తేషాం ..............లోకః. | |
| 7. హిరణ్యాసురుడనే పర్వతాన్ని బద్దలు చేసిన అగ్ని........ | |
| 8. ..............మంచివైపు ప్రవేశపెట్టగలిగితే ............ సిద్ధిస్తాయి. | |
| 9. పన్నిద్దరాళ్వార్లను తెలిపే శ్లోకం.............. | |
| 10. వేదంలోని ఆరణ్యకభాగం మానవునికి........... కలిగిస్తుంది. | |
| 11. కారణజన్ముల జీవనలక్ష్యం................ | |
| 12. ఇది వేస్తే గొంతు తడారనివ్వదు.......... | |
| 13. కూరత్తాళ్వాన్ రామానుజసంబంధం కోసం వదులు కున్నది..... | |
| 14. నాస్తికులనగా........... | |
| 15. ఆండాళ్ ఆవిర్భావస్థానం............... | |
| 16. సదా అస్తి............. | |
| 17. విప్రనారాయణులని వీరి నంటారు.............. | |
| 18. భారతీయ సమాజ ప్రశాంత జీవనానికి ఆర్యులు వేసిన పునాది? | |
| 19. ఏకాయనమని దీనికి పేరు............. | |
| 20. రామాయణాన్ని ఇలా పిలవడం సమంజసం............ | |
| 21. అపజయం కలుగనీయనివి, నాలుగు............ | |
| 22. రాయలవారిది ................పల్లకీట. | |
| 23. దివ్యసాకేతంలోని త్రినాథులు........................... | |
| 24. 'శ్రీ'కి లభించిన ఆగమ గ్రంథం........... | |
| 25. అగ్రతస్తే గమిష్యామి అని పతితో అన్న నారీమణి..... | |

**విజేతలు**

శ్రీమతి జయలక్ష్మీ- చెన్నై, కే. పుణ్యవతి- ఏలూరు, టి. జానకి- గూడూరు, డి. నిర్మల- సైదాబాద్ కాలనీ, యం.ఎస్.వి. సాంబశివరావు- గుంటూరు, టి. శ్రీనివాసన్ - హైదరాబాద్, కే. పూర్ణచంద్రరావు - రాజమండ్రి.

*సూచన:* సమాధానాలు ఈ పత్రంలోనే నింపి, 20వ తేదీలోపు అందేట్టు పంపగలరు.

భక్తినివేదన శ్రీరాంనగరం, ముచ్చింతల్, పాలమాకుల పోస్ట్ 509 325 శంషాబాద్, రంగారెడ్డి జిల్లా. ఆంధ్రప్రదేశ్.

శ్రీమతే నారాయణాయ నమః

శ్రీమతే రామానుజాయ నమః



64 సం॥ల నుండి అశేష భగవద్బంధువులు ఆదరిస్తున్న...

ఆధ్యాత్మికమాసపత్రిక

# భక్తినివేదన



శ్రీఖరనామ సంవత్సర ఆషాఢమాసం


సంపుటి 64 జూలై

సంచిక 4 2011


## పండుగలు

**జూలై :**

6. అవమతిథి, పునర్వసు కార్తె, స్కంద పంచమి
10. పెరియాళ్వార్ తిరు॥
11. సర్వేషాం తొలిఏకాదశి, శయనైకాదశి, చాతుర్మాస్యారంభము
12. తిథిద్వయం, వాసుదేవ ద్వాదశి
13. చతుర్దశి తిథి
15. గురుపూర్ణిమ, వ్యాసపూర్ణిమ, యతులకు చాతుర్మాస్యారంభము
17. కర్కాటక సంక్రమణము, దక్షిణాయన పుణ్యకాలము
20. పుష్యమి కార్తె
26. సర్వేషాం ఏకాదశి
29. మాసశివరాత్రి
30. పిండపితృయజ్ఞము, శనిపూజ, చుక్కల అమావాస్య

**ఆగస్టు:**

2. శ్రీ ఆండాళ్ తిరునక్షత్రము
4. బదరీనారాయణ పెరుమాళ్ తిరునక్షత్రము నాగ, గరుడ పంచమి, తిథి ద్వయం
5. సుదర్శనాళ్వాన్ తిరు॥
7. అవమతిథి, ఆశ్లేషకార్తె.
9. సర్వేషామేకాదశి
12. వరలక్ష్మీవ్రతం, వరాహజయంతి, ఆళవందార్ తిరు॥, పుండరీకాక్షుల తిరు ॥


వ్యవస్థాపకులు

పరమహంస పరివ్రాజకాచార్య

**శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జీయరుస్వామివారు**

సంపాదకులు

శ్రీఉ.వే.శ్రీమాన్ T.P. **శ్రీరామచంద్రాచార్యులు**


## విషయ సూచిక




Printed & Published by H.H. Tridandi Chinna Srimannarayana Ramanuja Jeeyar Swamiji on behalf of **Jeeyar Educational Trust** and Printed at **Sriman Printers & Processors** C/o JET, Sitanagaram-522 501, Guntur Dist., Andhrapradesh. **Published at** C/o JET, Sitanagaram-522 501 Guntur Dist, Andhrapradesh, Editor: Sri **T.P.Sriramachandracharya** S/o. Sri Sitaramacharyulu, No: 5-74, Ayodhya, Visakhapatnam- Andhra Pradesh.


చందావివరాలు :- సంవత్సరచందా రూ.225/-

విదేశాలకు సంవత్సరచందా $30/-

క్రొత్తగా సంవత్సర చందాదారులుగా చేరువారు సభ్యత్వ నమోదు, రూ.25/-లు (విదేశాలకు $5) అదనంగా చెల్లించవలెను. ఆపై ప్రతి సంవత్సరం సకాలంలో వార్షిక చందా చెల్లించిన చాలు.


E-mail : **jetsitanagaram@yahoo.com**

Internet : www.chinnajeeyar.org

D.T.P. & Design by :

పరిశోధనాలయమ్, ముద్రణ : శ్రీమాన్ ప్రింటర్స్ & ప్రోసెసర్స్, సీతానగరం

మా సేవలో.... భక్తినివేదన, సీతానగరం - 522 501, గుంటూరు జిల్లా, ఆంధ్రప్రదేశ్. 08645 272929.

# శ్రీశ్రీశ్రీ స్వామివారి సందేశం

### శ్రీవారి ప్రవచనాల నుండి

"సత్పురుషుల శ్రీసూక్తులు ఎల్లవేళలా మనకి స్మరణీయాలు" అవి మనలో ఒక దివ్యశక్తిని నింపి మనల్ని కార్యోన్ముఖులుగా తీర్చిదిద్దుతాయి. కనుక అవి మనకి సదా సంస్మరణీయాలు. అందుకే శ్రీస్వామివారి ఉపదేశామృతంలోంచి మనకు ఆచరణీయమైన మరొక అమృతబిందువును ఆస్వాదిద్దామిప్పుడు.

మానవునికి తన జీవన వ్యాపారాన్ని కొనసాగించడానికి దేవుడిచ్చిన మూలధనం వంటివి సమయము, సమర్థవంతంగ పనిచేసే ఇంద్రియాలతో కూడిన శరీరమూను. ఈ రెంటితో మనిషి ఎక్కువగ సంపాదించాలనుకునేది ధనం.

ప్రతి మనిషీ సమయాన్ని, శక్తినీ, ధనాన్ని, వ్యయం చేయక తప్పదు. చేయకుండా దాచుకుందామన్నా అవి నిలిచేవి కావు గదా! మనం ఏం చేసినా చేయకపోయినా సమయం సాగిపోతూనే ఉంటుంది. అది ఎవరికోసం ఆగదు. తిరిగి రాదు.

భగవంతుడు ఇంద్రియాలకి, శరీరానికి ఇచ్చిన శక్తి కూడా శాశ్వతము కాదు. యవ్వనం ఉన్నంతవరకే అవి సక్రమంగ పనిచేసే అవకాశం ఉంటుంది. అదీ సద్విషయాలవైపు వాటిని ప్రసరింపచేయగలిగితే! లేదంటే అవి నిర్వీర్యమైపోతాయి. శక్తి అనేది ఆ క్షణంలో ఉపయోగించుకోవటానికే తప్ప మరుక్షణానికి నిలువ చేసేందుకు వీలయ్యేది కాదు.

ఇక మనిషి ఈ సమయాన్ని, శక్తిని కేవలం ధనార్జనకోసమే వినియోగిస్తున్నాడు. అదీ ధనాన్ని తన అవసరాలకు మించి కూడబెట్టాలనుకుంటాడు. తాననుభవించక, ఇతరులకు వినియోగించక ఎంతో శ్రమించి నిలువచేసినా ఆ ధనం కూడా శాశ్వతంగా ఉండదు. ఎప్పుడు ఎవరు పట్టుకుపోతారో తెలియదు. ఇంత సంపాదించానని చూసుకోడానికి చివరికి ఆ సంపాదించిన వారూ మిగలరు.

కనుక మనమంతా భగవంతుడిచ్చిన సమయాన్ని, శరీరేంద్రియాలని ఉపయోగించి మనమార్జించిన ధనాన్ని సత్కార్యాలకు ఉపయోగించాలి. అవకాశము లభించినప్పుడే సద్వినియోగం చేసుకోవాలి తప్ప అవకాశాలు మనకోసం వెతుక్కొని రావు. ధనాదులు వ్యయమయ్యేదెలాగూ తప్పదు. కనుక, ఉన్నంతలో బాగా వాడుకోవాలి. స్వార్థానికో, సమాజానికో హితకరమయ్యే విధంగ వినియోగించగలగాలి. అలా మంచిమార్గంలో వినియోగిస్తేనే ఆవ్యక్తి సమాజంలో కీర్తినీ, గౌరవాన్ని పొందుతాడు. ఉత్తమ స్థితిని గూడ అందుకుంటాడు. శాస్త్రోపదేశం ప్రకారము భగవంతుని అనుగ్రహాన్ని గూడ లభించగలుగుతాడు.

వీచే ఉద్ధృతమైన గాలిని వదిలేస్తే ఉపద్రవాలనెన్నో తెస్తుంది. వ్యర్థంగానైనా పోతుంది. చక్కని గాలిమరలను ఏర్పాటుచేస్తే చీకట్లు తొలగే వెలుగులను, శక్తిని అందించే విద్యుత్తును ఇస్తుంది, మరెన్నో పనులకు ఉపయోగ పడుతుంది. అలానే మనిషికి ఉండే శక్తి అనంతం. దానిని గుర్తించలేక వ్యర్థ విషయాలలో ఇంద్రియాలని ప్రవర్తింపచేస్తూ, సమయాన్నంతటిని వృధా చేస్తూ, అవసరానికి మించి ధనాన్ని ఖర్చుచేస్తూ , లేనిపోని దుఃఖాలను కొనితెచ్చుకోకుండా, సదుపయోగ పరచుకొంటూ సత్కార్యాలలో పెడితే తనకూ, సమాజానికీ గూడ లాభం చేకూరుతుంది.

నదిలో నీరు వ్యయమైపోతోందని బాధపడి ప్రయోజనం లేదు. చూస్తూ కూర్చుంటే ఆగదు. అదే నీటిని ఆనకట్టలతో నిలువరించి క్రమపద్ధతిలో వదిలితే పంటలు పండటం వంటి అనేక ప్రయోజనాలు పొందవచ్చు.

మనం కూడా నేటినుండి సమయాన్ని, శక్తిని, ధనాన్ని సన్మార్గంలో కుటుంబశ్రేయస్సుకు, సమాజశ్రేయస్సుకై వినియోగించి పదిమందికి ఉపయోగపడే సేవాకార్యక్రమాలను నిర్వహించే ప్రయత్నం చేద్దాం! తద్వారా భగవంతుడిచ్చిన మూలధనాన్ని సద్వినియోగం చేసుకుని సత్ఫలితాలను పొందుదాం!

జై శ్రీమన్నారాయణ!

సంపాదకీయం

# బుద్ధిమంతులకు కాలం ఎలా గడుస్తుంది!



కాలాన్ని గడపడాన్ని కాలక్షేపం అంటారు. ఈమాట జనబాహుళ్యంలో బాగా వాడుకలో ఉన్నదే.

మానవుడు జని చరితార్థ్యానికి పొందిన మహాభాగ్యం కాలం. వారి వారి అదృష్టాన్ని బట్టి, క్షణం మొదలు, శతాబ్ది వరకు ఈ కాలం లభిస్తుంది. సద్వినియోగ పరచుకున్నాడా – అనుభవజ్ఞులు, అభిజ్ఞులు, అయిన ఆప్తుల మాటప్రకారం నడుచుకున్నాడా, చరితార్థుడవుతాడు. కాలాన్ని దురుపయోగ పరచుకున్నాడా–వృథాగా గడిపేసినాడా– మళ్ళీ జీవితం వెనక్కూ రాదు, వీడు బాగుపడడు.

కాలం గమనశీలం. నిర్వ్యాపారంగానో, దుర్వ్యాపారం గానో, సద్వ్యాపారంగానో కాలం గడచిపోతూనే ఉంటుంది. పుడిసిటి నీటివంటిది కాలం. నీకోసం క్షణం ఆగదు. నువ్వే దాన్ని వెన్నంటి పోవాలి తప్ప అది నీకోసం నిరీక్షిస్తూ కూచోదు.

మనిషికి కాలం ఎలా గడుస్తుందన్న విషయాన్ని సామాజిక నీతివేత్తలు చక్కగా ప్రవచించినారు. మనుషుల్లో బుద్ధిమంతులు కొందరైతే, మూర్ఖులు కొందరు. పెద్దల మాట పాటిస్తూ, సదసద్వివేచనం కలిగి, సుగుణ సంపదతో అలరారేవారు బుద్ధిమంతులైతే – పెద్దలమాట పెడచెవిన పెట్టి, సర్వమూ తామెరుగుదుమన్న దురహంకారంతో కుసంస్కారులై దుర్గుణ పుంజాలుగా ఉండేవారు మూర్ఖులు.

ఈ ఇరువురికీ కాలం సమానంగానే లభిస్తుంది. కాని, దాన్ని వినియోగించుకొనే పద్ధతే విభిన్నం. దీన్ని గురించి, సామాజిక తత్త్వవేత్త అంటాడు...

**కావ్య శాస్త్ర వినోదేన కాలో గచ్ఛతి ధీమతాం**
**వ్యసనేన చ మూర్ఖాణాం నిద్రయా కలహేన వా ॥**

కావ్య శాస్త్ర ప్రసంగాలతో బుద్ధిమంతులకు కాలం గడుస్తుంది. ఎందుకొచ్చిన గ్రంథ నిచయం అని తిరస్కారాన్ని, ఔదాసీన్యాన్నీ వహించకుండా, ఎంతో ఆసక్తితో కుతూహలంతో జిజ్ఞాసతో కావ్యశాస్త్ర ప్రసంగాలు కావిస్తూ ఇటు బుద్ధి వికాసాన్నీ, అటు హృదయస్పందనాన్నీ పొందుతూ చక్కటి సంస్కారాన్ని ప్రోది చేసుకుంటూ అబ్బురంగా లభించిన మానవ జనిని చరితార్థం చేసుకొంటాడు బుద్ధిమంతుడు.

ఇక మూర్ఖుడు, వీడికి జీవితం పట్ల లక్ష్యమూ లేదు, అవగాహనాలేదు, జిజ్ఞాసా లేదు. అనర్ఘమైన కాలాన్ని దురుపయోగ పరచుకో రాదన్న వాస్తవమైన ఎరుకా లేదు. అలవోకగా, నిర్లక్ష్యంగా, కాలాన్ని గడిపేస్తాడు. ఎట్లా! రకరకాల వ్యసనాలతో, నిరంతర నిద్రతో, దురహంకారంతో సర్వజ్ఞతా బుద్ధితో సర్వులనూ తృణప్రాయంగా చూస్తూ వారితో కాని మాటలకు దిగుతూ కాలక్షేపం కావిస్తాడు.

ఈ రెండు రకాల కాలక్షేప పద్ధతీ చాలా సాధరణమైనదీ, బహుజన విదితమైనదీనీ.

మన సంస్కృతినీ, సంప్రదాయాన్నీ ప్రతిపాదించే విలక్షణ మైన కాలక్షేప పద్ధతి ఒకటి సత్సంప్రదాయపరుల జీవితాలతో పెనవేసుకొని ఉన్నది. ఇక్కడ "కాలక్షేపం" కేవల వాచ్యార్థపరం కాదు. లాక్షణికం. అసలీ పదప్రయోగ సన్నివేశాలే చాల విలక్షణంగా, విచిత్రంగా, గంభీరంగా ఉంటాయి.

శ్రీభాష్య, భగవద్విషయాది సంప్రదాయ గ్రంథముల నియమపూర్వక పఠన, పాఠనాదులకు "కాలక్షేపం" అని వ్యవహారం. "శ్రీభాష్యం కాలక్షేపం అయ్యాము" "శ్రీరామాయణ కాలక్షేపం చెపుతున్నారు" "వారు గొప్ప కాలక్షేపవేత్తలు"... మొదలైన రీతిలో ప్రయోగాలు కనవస్తాయి. ఇట్లాగే, "సేవించడం" అన్నమాటానూ! శ్రీభాష్యాది గ్రంథములను సేవించినారు. దివ్యప్రబంధం సేవించినారు. ఇట్లా చాలా పదాలు సంప్రదాయ పరిపాటి ప్రకాశాలుగా సత్సంప్రదాయ పరుల వ్యవహారంలో ఏర్పడినాయి.

శ్రీరామాయణ, శ్రీమద్భాగవతాది గ్రంథాలను పుస్తకాలని కాక శ్రీకోశాలు అనడం సంప్రదాయ పరిభాష. అట్లాగే సంప్రదాయ గ్రంథ పఠనాన్ని అనుసంధానం అనడం సంప్రదాయ పరుల మర్యాద. "దివ్యప్రబంధానుసంధాన ధ్యానము" అంటారు రాయలవారు.

ఏతావతా, కాలక్షేపం అంటే సంప్రదాయ గ్రంథ పఠన పాఠనాదులతో కాలాన్ని గడపడం అని తేలింది. ఈ కాలక్షేప విధానాన్ని గంభీరంగా మహోదాత్తంగా, ధ్వని గర్భితంగా, పేర్కొంటూ పెద్దలు ఒక శ్రీసూక్తిని చమత్కార చతురంగా అనుగ్రహించినారు. ప్రకృత కాలక్షేప ప్రసంగంలో ఆ రసోక్తిలోని

చమత్కార చారిమను అందు అంతర్గతంగా దాగియున్న సనాతన జీవన విధానాన్ని అవగాహన చేసుకోవడం అప్రస్తుతం కాదు సరికదా ఆవశ్యకం కూడాను.

బుద్ధిమంతులకు కాలం ఎలా గడుస్తుందో పెద్దల మాటల్లో వినండి...

**ప్రాతర్ద్యూత ప్రసంగేన, మధ్యాహ్నే స్త్రీ ప్రసంగేన।**
**రాత్రౌ చోర ప్రసంగేన కాలో గచ్ఛతి ధీమతాం ॥**

రేపటి వేళ జూదపుటాటలతోనూ, మధ్యాహ్నవేళ విలాసినీ వినోదాలతోనూ, మాపటివేళ చోర కథా ప్రస్తావనలతోనూ బుద్ధిమంతులు కాలం గడుపుతారు... అంటుంది ఈ సూక్తి.

సప్త వ్యసనాలలో ఒకటైన జూదంతో ఆహ్నిక కృత్యాలు ఆరంభిస్తారు వీరు. జీవితంలో స్త్రీకి ప్రధాన భాగమే ఉంది. స్త్రీ సాంగత్యం ధర్మావిరుద్ధం కావాలి. స్త్రీ సాంగత్యానికి కొన్ని మర్యాదలున్నాయి. ఇక రేల చౌర్య ప్రసంగాలు. ఈ మూడింటి ప్రవృత్తి కావచ్చు- ప్రసంగమేనా కావచ్చు. రెండింటికీ ప్రయోజనంలో పెద్ద తేడా ఏమీ లేదు. ఈ శ్లోకంలో పాచికల సవ్వడులు, కంకణాల కమ్ర ధ్వనులు వినబడగా ఈ ధ్వనుల ద్వారా, గాఢాంధతమో వీధులలో చోరవృత్తాన్ని అన్వేషించాలి.

ఇదేనా జీవిత పరమార్థం... బుద్ధిమంతులు చేయాల్సిన పనులా యివి! వ్యక్తి అభ్యుదయ నిశ్శ్రేయసాలకు గాని, సామాజిక సర్వతో భద్ర శ్రేయో నిధానానికి గానీ, ఇవా మార్గాలు! త్రివర్గ సాధనకుగాని, అపవర్గ సాధనకు గాని, ఈమూడు మెట్ల నిచ్చెన కంటే వేరు సాధనం యీ ప్రవక్తలకు లభించనే లేదా! వ్యక్తి నిశ్శ్రేయసాన్ని, సర్వతోముఖ సామాజిక శ్రేయాన్ని, కాంక్షించే ఆప్తులైన ప్రవక్తలు కదా వీరు. ఇట్టి మాటలు ఎందుకు చెపుతారు?

కావ్యశాస్త్రాద్యవేక్షణ పరులై లోకవృత్తావగాహన కలిగి సమన్వయంతో సామరస్యంతో జీవితాన్ని నిండుగా పండించుకొన్న పరిపూర్ణులు వారు – ప్రవక్తలు వారు.

ఈ శ్లోకంలో చమత్కార చారిమను చూడాలి. ధ్వని రామణీయకాన్ని వినాలి. ధ్వని ప్రస్థానానికి పరసీమగా నిలచిన ఘనరస మసృణోక్తి ఈ శ్లోకం. సనాతన ధార్మిక జీవన విధాన ప్రహేళిక ఈ శ్లోకం. ఇక్కడ ద్యూత ప్రసంగం మహాభారతాన్నీ, స్త్రీ ప్రసంగం శ్రీరామయణాన్నీ, చోర ప్రసంగం శ్రీమద్భాగవతాన్నీ, ధ్వనిస్తాయి.

భారతీయ విజ్ఞాన సర్వస్వ నిధానాలు ఈ మూడు గ్రంథాలూనూ... **"యది హాస్తి తదన్యత్ర యన్నేహాస్తి న తత్ క్వచిత్"** అని కతపత్రం పొందినది మహాభారతం. గీతా, నామ సహస్రా లిందున్నా, ప్రధానంగా లోకవృత్త ప్రకాశకం మహాభారతం. జీవితపు తొలినాళ్ళలో మనుగడ ధర్మప్రవణంగా సాగడానికి వ్యక్తిత్వ రేఖలు స్ఫుటంగా రూపు దిద్దుకోడానికీ మానవులకు ఇదొక పాఠ్యగ్రంథం.

శ్రీరామాయణం వేదమే! **"వేదః ప్రాచేతసా దాసీత్ సాక్షాత్ రామాయణాత్మనా"** స్వ స్వరూప, పరస్వరూప, ఫలస్వరూప, ఉపాయ స్వరూప, విరోధి స్వరూపాలను వివరించి, తత్త్వత్రయ జ్ఞానాన్ని మనోరంజకంగా కలిగించి మనిషిని పశ్చిమాభి ముఖునిగా తీర్చిదిద్దే రసవత్కావ్యం. మనుగడ తొలిమెట్టు మహాభారతం కాగా, రెండవమెట్టు శ్రీరామాయణం. ఈ రెండు మెట్లూ ఎక్కిన తరువాత, మూడోమెట్టు చేరుకోవాలి. ఇదే తుదిమెట్టు. ఈ నిచ్చెన ఎక్కితే చేరుకొనేది పరమపదానికే! ఈ మెట్టు శ్రీమద్భాగవతం. ప్రామిన్కుల వేల్పు చెట్టు పండిన మధురామృత రసఫలం శ్రీమద్భాగవతం.

లౌక్య ప్రజ్ఞతో ధర్మానుబద్ధంగా మనుగడ సాగిస్తూ తత్త్వ జ్ఞానం ప్రోది చేసుకున్నాక ప్రాకృతిక ప్రపంచం కలరూపు నెరిగినాక, లోజీకటులపహరింప, నవనీత చోరుణ్ణి వేడుకోవడం రాత్రి కృత్యం.

లో వెలుగులు చిమ్మినప్పుడు తల నెమ్మిపించియముతో, పెదవుల క్రోవితో, కపోలముల స్మిత జ్యోత్స్నా దీర్ఘికలతో, రమ్య త్రిభంగి లలితంగా, కడిమినానుకొని, కాళింది తఱగల సవ్వడు లకు అనుగుణంగా, వేణుగానంతో ఈరేడు జగాల పరవశింప చేయు పీతాంబరధారిని, నవనీతచోరుని, దర్శించాలి. శ్రిత జన పాపాపహర్త ఆ వంశీమోహనుడు! ఆయనను సందర్శిస్తూ, జన్మ చరితార్థం చేసుకోవాలి.

శ్రీమద్భాగవతం అనుసంధేయం మాత్రమే కాదు... అనుష్ఠేయం కూడాను! హృదయ దఘ్నంగా అనుభవింప దగినదీని! దీని అనుసంధానానికీ అనుభవానికీ కేవలం బుద్ధి చాలదు చిత్తద్రుతి కావాలి. భాగవతం వల్ల చిత్తస్పందన, చిత్త ద్రుతి ఏర్పడి, పఠిత అననుభవితగా రూపొంది ఆనంద పారవశ్యాన్ని పొందుతాడు.

బుద్ధిమంతులు భారత, శ్రీరామాయణ, భాగవతముల అవలోకన, అనుసంధాన అనుభవాలతో జీవితాన్ని చరితార్థం కావించుకోవాలని బుద్ధిమంతులైనవారు ఇట్లాగే జీవితాన్ని గడుపుతారని పైసూక్తి తాత్పర్యం.

**శ్రీరామచంద్రాచార్య**



# య ఏవం వేద...



శ్రీమాన్ గుదిమెళ్ళ మురళీకృష్ణమాచార్యస్వామి-భద్రాచలం

*గత సంచిక తరువాయి...*

**'ఇష్ట ప్రాప్తి - అనిష్ట పరిహారయోః అలౌకికం ఉపాయం యో వేదయతి స వేదః'** అని విద్యారణ్యులవారి మాట.

వేదభాష్యకారులలో అన్యతములైన ఈ మహానుభావులు వేదపదాన్ని ఇలా నిర్వచించారు. ఇష్టము అనగా సుఖము. అనిష్టము అనగా సుఖముకానిది. దుఃఖము అని అర్థము. మనకు సుఖరూపమైన ఇష్టాన్ని అందించేదీ- దుఃఖరూపమైన అనిష్టాన్ని తొలగించేదీ... అయిన అలౌకికమైన ఉపాయానికే **'వేదము'** అని పేరు. ఈ నిర్వచనంలోని **'అలౌకికం'** అనే పదం చాలా ప్రధానమైనది.

లోకంలో సుఖమును కలిగించే సాధనములు ఎన్నో ఉన్నాయి. స్రక్ చందన వనితాదీని... అన్నట్లుగా వివిధములైన మాలికలు, పలురకాలైన చందనాది పరిమళద్రవ్యములు, సుందరీమణులైన వనితలు మొదలైనవన్నీ లోకప్రసిద్ధములైన సుఖసాధనములే. అలాగే యోగసాధన, ఔషధసేవనం మొదలై నవి దుఃఖనివృత్తిని కలిగించడం ద్వారా సుఖకారకములే. వీటి గురించి తెలుసుకోవాలంటే ప్రత్యక్ష- అనుమానాది ప్రమాణ ములు చాలు. ఇంద్రియ జ్ఞానాధీనాలైన ఈ సాధనాలన్నీ ఈ లోకంలోని వ్యవహారములకు సరిపోతాయేమో తప్ప... జన్మాంతరం గురించి కాని, లోకాంతరం గురించి కాని అవి బోధించలేవు. ఎందుకంటే జన్మాంతర జ్ఞానాదులు అతీంద్రి యాలు కాబట్టి... లోకాంతర జ్ఞానాదులు అలౌకికాలు కాబట్టి.

అందువలన అతీంద్రియజ్ఞాన సాధ్యములైన ధర్మా ధర్మముల వివేకమును కాని, జన్మాంతర లోకాంతరాది విషయములను కాని బోధించే శక్తి, సామర్థ్యం ఒక్క వేదానికి మాత్రమే ఉంది.

**ప్రత్యక్షేణానుమిత్యా వా యస్తూపాయో న బుధ్యతే ।**
**ఏనం విదంతి వేదేన తస్మాత్ వేదస్య వేదతా ॥**

'ప్రత్యక్ష- అనుమాన ప్రమాణములచే తెలియని విషయాలను తెలియజేస్తుంది కాబట్టి దీనికి 'వేదము అని పేరు'. ఈ శాస్త్రానువాదమే విద్యారణ్యులవారి పై నిర్వచనం కూడ. వారి నిర్వచనంలోని అలౌకికం అనే పదం పై ప్రమాణ శ్లోకంలోని ప్రత్యక్ష అనుమాన ప్రమాణములకంటే వైలక్షణ్యాన్ని బోధిస్తోంది. **'అత్ర అలౌకిక పదేన ప్రత్యక్షానుమానే వ్యావర్త్యేతే'** అంటూ... వారే వ్యాఖ్యానించారు కూడ.

లౌకిక విషయములను మాత్రమే కాకుండా అలౌకిక విషయములను బోధించగలిగినది వేదమొక్కటే. **'జ్యోతిష్టోమేన స్వర్గకామో యజేత'** అనే వేదవాక్యం స్వర్గసుఖములను కోరువారు జ్యోతిష్టోమ యాగమును ఆచరింప వలెనని బోధిస్తోంది. మన కనులకు కనిపించే ఈ లోకంకంటే మరొక ఉన్నతమైన లోకం ఉన్నది అని కాని, దానిపేరు స్వర్గం అనికాని మనకు తెలియదు. ఈ లోకంలో మనం అనుభవించే భోగములకంటే ఆ స్వర్గంలోని భోగములు మరింత సుఖప్రదములు అనే విషయం కూడ మనకు తెలియదు. ఆ స్వర్గం కంటికి కనుపించేది కాదు. ఆ సుఖముల తీరు మనం ఊహిస్తే తెలిసేదీ... కాదు. ఇలా మన ఇంద్రియాలకు తెలియని ఎన్నో విషయాలను బోధించే అద్భుత శబ్దరాశి... వేదము.

దేనినయినా బోధించే ప్రతి శబ్దము అక్షరములతో, పదములతో వాక్యములతో కూడి ఉండేదే కదా!! లోకంలో బోధకశక్తి కలిగిన అర్థవంతమైన ఒక శబ్దం పుట్టిందీ... అంటే, అలా బోధించాలి అనుకునే వ్యక్తి లేకపోతే అది ఏర్పడదు. ఎవరో ఒకరు తమకు తెలిసిన లేదా స్ఫురించిన విషయాన్ని మరొకరికి చెప్పాలనే తలంపుతోనే ఇలా బోధక వాక్యప్రయోగం చేస్తారు. ఏ భాషకు చెందిన వారైనా ఇదే రీతి... ఏ భాషలోనైనా ఇదే పద్ధతి. ఇది సర్వజనవిదితమైన విషయం మరి... అదే సత్యమైతే వేదం **'అపౌరుషేయం'** అని అనరాదు కదా! అనే సందేహం కలగడం సహజం.

ఈ సందేహానికి సమాధానంగా శ్రీ కుమారిలభట్టు అనే మహానుభావులు రచించిన వార్తికంలో యుక్తియుక్తంగా ఇలా చెప్పారు.

**వేదస్యాధ్యయనం సర్వం గుర్వధ్యయన పూర్వకమ్ ।**
**వేదాధ్యయన సామాన్యాత్ అధునాధ్యయనం యథా ॥**

వేదాధ్యయనమనేది అనాదిగా గురుశిష్యపరంపరా పద్ధతిలో సాగుతోంది. ఒక గురువు వేదాన్ని ఉచ్చరిస్తూ బోధిస్తే, శిష్యుడైనవాడు ఆ బోధను వింటూ తాను ఆ విన్న దానిని మళ్ళీ ఉచ్చరిస్తాడు దీనినే **'అనూచ్చారణం'** అంటారు. ఈ పద్ధతిలో గురూపదేశం ద్వారా తాను నేర్చిన వేదాన్ని ఆ శిష్యుడే గురువై మరో శిష్యునికి తానూ ఉపదేశిస్తాడు. ఆ శిష్యుడు ఇదే పద్ధతిలో గురుస్థానాన్ని పొంది... ఈ వేదాధ్యయనాన్ని సాగిస్తూంటాడు. ఇలా సాగే అధ్యయన విధానాన్నే గురుశిష్య పరంపరాపద్ధతి... అంటారు. ఈ విధంగా అధ్యయనమనేది కొన్నివేల సంవత్సరాలుగా, అనాదిగ జరుగుతోంది. ఈ ప్రకారం అధ్యయనం చేసిన, చేస్తున్న గురుశిష్యులందరిలో 'ఈ వేదాన్ని ఎవరు రచించారు?' అని ఎవరిని అడిగినా వారు చెప్పే సమాధానం ఒక్కటే... 'మా గురువుగారు నాకు బోధించారు.. నేను నా అంతేవాసులకు బోధిస్తున్నానంతే' అనే ఈ సమాధానం మాత్రమే ఉంది. కొంచెం లోతుగా పరిశీలిస్తే ఈ అధ్యయన పరంపరకు ఆద్యుడైన బ్రహ్మకు కూడ పరమాత్మ ఉపదేశించాడు... ఈ పరబ్రహ్మ కూడ **'యో వై వేదాంశ్చ ప్రహిణోతి తస్మై'** వేదములను అందించాడు అని మాత్రమే తెలుస్తోంది తప్ప 'ప్రణినాయ తస్మై' ఆ బ్రహ్మకోసం రచించాడు... అని చెప్పలేదు. ఇది అనాదిగా అంతు చిక్కని ప్రశ్న. పోనీ... ఆ పరబ్రహ్మమే రచించాడు అని భావిద్దామా!.. అంటే గోపథ బ్రాహ్మణం మొ॥న గ్రంథాలన్నీ **స తపో తప్యత... స భూయో౽ శ్రామ్యత్... భూయో౽ తప్యత్...** ఇత్యాది వాక్యాల ద్వారా ఆ పరబ్రహ్మ తపస్సునాచరించగా ప్రత్యక్షమైనది ఈ మంత్రరాశి అనే చెప్పాయి. ఆ వేదముల ఆధారంగానే హిరణ్యగర్భాది సృష్టి అంతా జరిగిందనే బోధిస్తున్నాయి. ఏతావతా 'ఫలానా పురుషుడు ఈ వేదమును రచించినవాడు' అని నిర్ణయించడానికి ఏమాత్రం అవకాశం లేకపోగా వేల సంవత్సరాల నాటి గ్రంథాలు.. అప్పటికే వేదములను అపౌరుషేయములుగా ప్రకటించడం వలన వీటిని అపౌరుషేయములుగా సంభావించడమే సర్వశ్రేయస్కరం, అదే నిత్యసత్యం కూడ.

ఏవో కొన్ని పద్యాలనో, శ్లోకాలనో లేదా కొన్ని వచనాలనో రచించి వాటి చివర ఆ పద్యాల సంఖ్యకంటే తన గురించిన వివరాలు కల పద్యాలసంఖ్యను పెంచి స్వకర్తృకాన్ని స్వయంగా ప్రకటించుకునే నైజం మనిషిది. **'మనుష్యా వా ఈడేన్యాః'** అని వేదం చెప్పినట్లు తన్ను తాను పొగడుకోవడమే కాక తన వారందరిచే పదేపదే పొగిడించుకోవాలనే స్వభావం కలవాడు మనిషి. ఒక ఉద్గ్రంథాన్ని రచించి ఇది నేను రచించలేదు అనగలడా!? తన కర్తృత్వాన్ని తానే కాదనగలడా?

**'అనంతా వై వేదాః'** అన్నట్లు 'ఇన్ని అని చెప్పడానికి వీలులేనన్ని మంత్రాల సమూహం వేదం'. మంత్రమంటేనే మనన యోగ్యమైనది... లేదా మననం చేసేవానిని రక్షించేది... అని అర్థం. మనస్సును ఆకట్టుకునే చోటే మననం సాగుతుంది. మళ్ళీ మళ్ళీ ఉచ్చరించడానికి తగిన నాదము– భావము– శైలి ఆ శబ్దానికి ఉన్నప్పుడే సకృదుచ్చారణం–సంతతోచ్చారణమై మననంగా మారుతుంది. అలాంటి అందాలన్నీ కలిగి ఉన్న శబ్దం... మంత్రం. దానికి శ్రవణసుభగము అయిన ధ్వని సౌందర్యమున్నది. తెలియని విషయములను తెలియచెప్ప గలిగిన ప్రబోధకత్వము – ప్రచోదకత్వము ఉంది. అంతేకాదు లయబద్ధము, వచస్సిద్ధము అయిన ఛందస్సౌందర్యమున్నది. ఇలా ఇన్ని కవితా సౌందర్యనిధానాలైన అన్నివేల, కోట్ల మంత్రాలను మనకు పరంపరగా ఉపదేశిస్తూ వచ్చిన మహర్షిగణము లేదా గురుగణములో ఏ ఒక్కటీ ఈ మంత్రాలను నేనే రచించాను అని చెప్పక పోవడం ఎంత ఆశ్చర్యం?! ఈ మంత్రాలన్నీ మేము తపస్సమాధిలో ఉండగా వినిపించినవి.. వీటికి మేము ద్రష్టలం మాత్రమే అని వారు ఉద్ఘోషించడం.. ఇంకెంతటి ఆశ్చర్యకరం. వారిలో ఎవరైనా ఇవన్నీ నేనే రచించాను అని అంటే కాదనేవారు ఎవరున్నారు? ఎవరి కవిత్వాన్నో, వ్యాసాన్నో, భావాన్నో 'దొంగిలించి' మనదిగా చెలామణీ చేయగల సమర్థులం... కవిచోరులం అయిన మనం ఈ దృక్పథంతో ఆలోచించగలిగితే... మన వేదములయొక్క అపౌరుషేయత్వం మనకు అర్థమవుతుంది. మన పూర్వులైన మహర్షులయొక్క ఔన్నత్యం... సత్యనిష్ఠ మనల్ని అబ్బుర పరుస్తాయి. గర్వపడేలా చేస్తాయి.

అలాంటి మహర్షి పరంపర మనది. అద్భుతమైన మంత్రసంపద మనది. అందుకునే ప్రయత్నం చేద్దాం!! ఆ ఆనందాన్ని అనుభవించేందుకు సిద్ధం అవుదాం!!

జై శ్రీమన్నారాయణ!



# పిబత భాగవతం రసం... వివిధావతార ప్రశంసనమ్

శాస్త్రరత్నాకర, శాస్త్రవిద్వన్మణి డా॥ఉ.వే సముద్రాల వేంకట రంగరామానుజాచార్యస్వామివారు
డైరెక్టర్ - అకెడమిక్ కౌన్సిల్ 'జీవ' శ్రీరాంనగర్ (శంషాబాద్)

*గత సంచిక తరువాయి...*

వేదవ్యాసావతారాన్ని పదిహేడవ అవతారంగా ప్రశంసించి, పదునెనిమిదవ అవతారంగా రామావతారాన్ని ప్రస్తావించాడు పురాణకర్త.

**నరదేవత్వమాపన్నః సురకార్యచికీర్షయా ।**
**సముద్రనిగ్రహాదీని చక్రే వీర్యాణ్యతః పరమ్ ॥**

మానవునిగా రావణాది దైత్యనిగ్రహణం కోసం రామచంద్ర ప్రభువుగా జన్మను స్వీకరించి స్వామి దేవకార్యమైన రావణ హననాన్ని సాధించాడు. అందుకొరకు సీతాపహారకుడైన రావణుని లంకకు చేరడానికై శతయోజన విస్తీర్ణమైన సముద్ర భాగంలో సేతువును నిర్మించాడు స్వామి. శ్రీ భాగవతం ఈ లీలను అద్భుతంగా నిరూపించింది.

దశమంలో - జాంబవత్‌స్తవన ముఖంగా-

**యస్యైతదుత్కలిత రోషకటాక్షమోక్షై**
**ర్మత్వాఽ దిశత్ క్షుభిత నక్ర తిమింగలోబ్ధిః ।**
**సేతుః కృత స్స్వయశ సోజ్జ్వలితా చ లంకా**
**రక్షః శిరాంసి భువి పేతు రిషుక్షతాని ॥**

ఎవ్వని రోషకషాయిత దృక్ప్రసరణలేశం చేతనే జలజంతువులన్ని క్షోభించగా, 'సాగరుడు' స్వయంగా మార్గాన్ని నిర్దేశించాడో, ఎవ్వని యశస్సు చేతనే సేతువు నిర్మింపబడిందో, లంక దహింపబడినదో, బాణక్షతాలై రాక్షస శిరస్సులు నేలరాలాయో అట్టి శ్రీరామచంద్రనువి నీవేవని ఎరిగినానంటాడు జాంబవంతుడు.

ఇటు తరువాత, 19,20 అవతారాలుగా బలరామ కృష్ణావతారాలు నిర్దేశింపబడ్డాయి. ఈ రెండూ భూభార హరణానికి నారాయణుడు శేషాఖ్యమైన తన 'ధామ' తో పాటుగా స్వీకరించిన అవతారాలు.

ఇక, కలిలో రాక్షస సంమోహనానికై తామస ప్రవృత్తి కలవారిని (నిగ్రహించడానికై) '**అజిను**'ని పుత్రునిగా స్వామి బుద్ధరూపియై ఆవిర్భవించాడని శ్రీ భాగవతం నిర్దేశిస్తున్నది. ఈయన గయా ప్రాంతంలో ఆవిర్భవిస్తాడని చెప్పబడింది.

**తతః కలౌ సంప్రవృత్తే సంమోహాయ సురద్విషామ్ ।**
**బుద్ధో నామ్నాఽ జినసుతః కీకటేషు భవిష్యతి ॥**

"**కీకట**" శబ్దంచే "**మధ్యగయ**" నిర్దేశింపబడుతున్నదని శ్రీధరవ్యాఖ్య. '**జినసుతః**' అని కూడా ఇక్కడ పాఠం ఉంది. జినసుతుడు జైనుడు. ఈతడు '**శౌద్ధోదని**' (**శుద్ధోదన పుత్రుడు**) కాడని వ్యాఖ్యాతల వివరణం. భాగవతం ఈ అవతారం గురించి, ఇక్కడ తప్ప మరెక్కడా విశేషంగా పేర్కొనడం జరగలేదు. కాని విష్ణుపురాణం భగవానుని "**మాయామోహావతారాన్ని**" గురించి ప్రస్తావించింది. వేదబాహ్యమైన నాస్తికవాదాన్ని చేసినవాడుగా "**మాయామోహుడు**" అక్కడ (**విష్ణుపురాణంలో**) చెప్పబడ్డాడు. ఈ మాయామోహుడు భగవచ్ఛరీరం నుండి పుట్టాడు.

**ఇత్యుక్తో భగవాం స్తేభ్యః మాయామోహం శరీరతః ।**
**సముత్పాద్య దదౌ విష్ణుః ప్రాహ చేదం సురోత్తమమ్ ॥**

అని విష్ణుపురాణం (**3**అం, **18**వ అధ్యా, శ్లో**41**) చెబుతున్నది. ఒకప్పుడు ఈతడు "**దిగంబరుడు**" గాను, జితేంద్రియుడు గాను, ఆసురవ్యామోహకునిగాను చెప్పబడ్డాడు. ఈతడు '**ఆర్హత ధర్మాన్ని**' ప్రవర్తింపజేశాడని విష్ణుపురాణ వివరణం.

**"ధర్మా యైత దధర్మాయ -స దేత దస దిత్యపి ।**
**విముక్తయే త్విదం నైతత్, విముక్తిం సంప్రయచ్ఛతి ।**
**పరమార్థో యమత్యన్తం పరమార్థో న చా ప్యయమ్ ॥"**

ఇది ధర్మం, ఇది ధర్మం కాదు, ఇది సత్తు, ఇది సత్తు కాదు. ఇది విముక్తిని కలిగిస్తుంది, ఇది విముక్తినీయదు. ఇది పరమార్థం, ఇది పరమార్థం కాదు. అంటూ ఒకే దాన్ని విరుద్ధ ధర్మాలు కల అనైకాన్త వాదంగా ఆతడు ప్రవర్తింప చేసినాడని పురాణం చెబుతున్నది. ఈ ధర్మం దిగంబరులది, ఇది అనేకాంబరులది అంటూ ఈ ధర్మాన్ని గౌరవించండి. పూజించండి (**అర్హత**) అని ప్రేరేపించినాడు ఆ మాయామోహుడు. కనుక, ఈ మతాన్ని ఆశ్రయించిన వారు ఆర్హతులైనారంటుంది పురాణం.

**అర్హత్తైతం మహాధర్మం మాయామోహేన తే యతః ।**

**ప్రోక్తా స్తామాశ్రితా ధర్మ మార్హతా స్తేన తేఽ భవన్ ॥** అని.

ఇక్కడ భాగవతంలో బుద్ధ శబ్దంతో నిర్దేశించినా, జినపుత్రుడు అనడాన్ని బట్టి ఈతడూ జైనుడేనని ఊహింపవచ్చు. లేదా బుద్ధుడే ఇక్కడ నిర్దేశింపబడ్డాడనుకున్నా ఇబ్బంది లేదు. ఈ రెండిటి విషయంలోను (జిన-బుద్ధుల విషయంలో) కొంత భ్రమ ఉంది. ఇద్దరూ ఒకే కాలానికి చెందిన వారవడమే దీనికి కారణం కావచ్చు.

ఇక చిట్టచివరి అవతారంగా కల్క్యవతారం నిర్దేశింపబడింది. యుగసంధిలో, రాజులంతా అధార్మికులు దస్యుప్రాయులు (దోపిడి దొంగలవంటివారై ప్రజాపీడకులు) అయినప్పుడు విష్ణుయశస్సుడనే బ్రాహ్మణుని నుండి కల్కి పుట్టగలడు అని నిర్దేశించింది భాగవతం.

**అథాసౌ, యుగసంధ్యాయాం దస్యుప్రాయేషు రాజసు ।**

**జనితా విష్ణుయశసో నామ్నా కల్కి ర్జగత్పతిః ॥** అని.

**భగవదవతారాలు అసంఖ్యాలు**

ఒక నాశరహితమైన సరోవరం నుండి అనేక కుల్యాలు (కాలువలు) ఆవిర్భవించినట్లు, సత్త్వనిధియైన పరమాత్మ నుండి లెక్కలేనన్ని అవతారాలు ఆవిర్భవిస్తాయి. ఋషులు, మనువులు, దేవతలు, మనుపుత్రులు, వీరంతా శ్రీహరి అంశతో పుట్టినవారే- కనుక, ఇవన్ని అంశావతారాలు- ఇక శ్రీకృష్ణుడు పూర్ణస్వభావుడైన సాక్షాత్తు భగవానుడే. షాడ్గుణ్యపూర్తి కలవాడని తాత్పర్యం. ఆళ్వారులు భగవానుని పరిపూర్ణునిగానే దర్శించారు. వైష్ణవసంప్రదాయానికి చెందిన గౌడీయ సంప్రదాయం కృష్ణునే సర్వావతార నిధానంగా భావిస్తున్నది.

**"ఏతే చాంశకలాః పుంసః కృష్ణస్తు భగవాన్ స్వయమ్"** అన్న భాగవతవచనం దీన్నే చెబుతున్నది. ఈ సందర్భంలో భాగవతంలోని 1,2 శ్లోకాలు జాగ్రతగా అర్థం చేసుకోవాలి. వీటి సమన్వయంలో ఆచార్యులకు భేదాభిప్రాయాలున్నాయి.

**ఏతద్రూపం భగవతో హ్యరూపస్య చిదాత్మనః ।**

**మాయాగుణై ర్విరచితం మహదాదిభి రాత్మని ॥**

**యథా నభసి మేఘౌఘో, రేణుర్వా పార్థివోఽ నిలే ।**

**ఏవం ద్రష్టరి దృశ్యత్వ మారోపిత మబుద్ధిభిః ॥**

ఇక్కడ అర్థం ఇది. వాస్తవానికి చిద్రూపుడు పరమాత్మ. ఈయనకు ప్రకృత్యాత్మకమైన మాయకు సంబంధించిన సత్త్వరజస్తమోగుణాలు లేవు. అందువల్ల నిర్గుణుడు, అంటే ప్రాకృతిక గుణాలు లేనివాడని అభిప్రాయం. అట్టివాడు ఆ గుణాలను తీసుకొన్నప్పుడు, ఆ గుణాలతో కూడిన బుద్ధి అహంకారం పంచతన్మాత్రలు, ఇంద్రియాలు, పంచభూతాలు అనే వీటి సంబంధం ఏర్పడి ఒక రూపం త్రిగుణాత్మకంగా ఏర్పడుతున్నది. సహజంగా ప్రకృతి సంబంధం లేని పరమాత్మ తను మానుషస్వభావునిగా గోచరించి మనుష్యలోకంలో సంచరించడానికి ఈ ప్రాకృతిక దేహాన్ని స్వయంగా స్వీకరిస్తాడన్న అభిప్రాయం ఇక్కడ గోచరిస్తున్నది. అయితే **"న తస్య ప్రాకృతా మూర్తిః మాంసమేదోఽస్థి సంభవా"** అని భారతం చెబుతున్నది. అంటే భగవానుని మూర్తి, మాంసము, క్రొవ్వు, అస్థులు మొదలైన ద్రవ్యాలతో ఏర్పడిన మన శరీరాలవంటిది కాదని అభిప్రాయం. భగవానునికి అలాంటి ప్రాకృతిక దేహం లేకపోయినా, కనిపించే కరచరణాది అవయవాలుండటం వల్ల, ఆయనా, మన లాంటి నశ్వరము లేదా, పరిణామశీలమైన దేహం కలవాడని భ్రాంతి పడటం ఈ "అబుద్ధులైన" మానవులకు నైజం. కనుక ఇది సరికాదని పురాణం అంటుంది. ఆకాశంలో కనిపించే మేఘబృందం ఆకాశంలో భాగం కానట్టే, వాయువుతో ధూళికలసినా అది వాయువుకు చెందినది కానట్లే, స్వామికి, గుణసంబంధ మూలంగా ప్రాకృతదేహం ఉన్నట్లు గోచరించినా, అది మనుష్య సజాతీయమే తప్ప - కేవల ప్రాకృతికం కాదని తాత్పర్యం. పరమాత్మ సాక్షి అంటే అంతటిని తటస్థంగా దర్శిస్తూ ఉండేవాడు. దీన్నే పురాణం ద్రష్టరి అనే పదంతో నిర్దేశించింది. ఇలా ద్రష్ట అయిన పరమాత్మయందు విగ్రహవత్త్వం స్వామి స్వయంగా స్వీకరించినా, అంటే మనం కల్పించినది కాకపోయినా దానిని ప్రాకృతికంగా మనం భావించటం చేత ఈ అజ్ఞాన మూలమైన భావనను ఆరోపణంగా పురాణం చెబుతున్నది. అంతే తప్ప ఈ రూపం అసలు లేనిది మన చేత కల్పింపబడినది అనడం సరి కాదు. కనుకనే విష్ణుపురాణం **"స్వేచ్ఛా గృహీతాభిమతోరు దేహః"** స్వేచ్ఛగా తనంత తాను భగవానుడు గ్రహించిన గొప్ప దేహం అని అంటుంది. అవతారరూపాలన్ని భగవానుడు స్వసంకల్పం చేత స్వయంగా గ్రహించినవే తప్ప ఎవ్వరూ కల్పించినవి కావని పురాణ తత్త్వం అని మనం గుర్తించాలి. *(సశేషం)*

# కలివైరిసూరి వైభవము



గత సంచిక తరువాయి...

శ్రీ ఉ.వే.శ్రీమాన్ కె. టి. రామానుజాచార్యస్వామి-నెల్లూరు

**తిరుమంగై ఆళ్వార్- పెరియ తిరుమొழி 1-7-4**

పాశురం. ఎవ్వుం వెవ్వేల్ పొన్ పెయరోన్ ఏతలన్ ఇన్నుయిరైవవ్వి
ఆగం వళ్ళుకిరాల్ వకిర్న్ద వమ్మానతిడమ్ ।
కవ్వునాయుం కழுగుం ఉచ్చిప్పోతొడు కాల్ శుழన్ను
తెయ్‌వమల్లాల్ శెల్లవొణ్ణా చ్చిఙ్గవేழ్‌కున్నమే ॥

**ప్రతిపదార్థము: ఎవ్వుం**=దుఃఖమును కలిగించునదియు; **వెం**=క్రూరమైనదియునగు; **వేల్**=ఈటెను కలిగిన; **ఏతలన్**= శత్రువైన; **పొన్‌పెయరోన్**=హిరణ్యాసురునియొక్క; **ఇన్‌ఉయిరై**= ప్రియమైన ప్రాణమును; **వవ్వి**=తీసి; **ఆకమ్**= (ఆతనియొక్క) శరీరమును; **వళ్ ఉకిరాల్**=పదునైననఖాగ్రములతో, **వకిర్న్ద**= చీల్చిన; **అమ్మానతు**= స్వామియొక్క, **ఇడమ్**=నివాసము, **కవ్వుం**=కరచునట్టి; **నాయుం**= కుక్కలును; **కழுకుం**=గ్రద్దలు; **ఉచ్చిప్పోతొడు**=మధ్యాహ్న సమయములందు; **కాల్‌శుழన్ను**=సుడిగాలులను (కలిగినదై), **తెయ్ వమల్లాల్**=దేవతలు తప్ప; **శెల్లఒణ్ణా**=పోవుటకు సాధ్యముకానిది; **శింగవేழ్‌కున్నమే**= అహోబిలమనే దివ్యక్షేత్రము.

**తాత్పర్యము:** సాధువులను బాధించునటువంటి పదునైన వేలాయుధమును (శూలమును) గలవాడును, భాగవత విరోధియునగు హిరణ్యాసురునియొక్క ప్రియమైన ప్రాణమును అపహరించి ఆతని శరీరమును తన పదునైన గోళ్ళతో చీల్చిన స్వామి వేంచేసియుండు స్థలము శింగవేழ்కున్నమనెడి అహోబిల క్షేత్రము.

ఆ రోజులలో ఆ క్షేత్రము కంటబడిన వారినెల్ల కఱచునట్టి కుక్కలతోను గ్రద్దలతోను నిండియుండును. మిడియెండయు సుడిగాలులు నుండుటచేత దేవతలు తప్ప అన్యులెవరును ఆ క్షేత్రమును సమీపింపలేరు.

**విశేషార్థము: ఎవ్వుం వెవ్వేల్ పొన్ పెయరోన్**= హిరణ్యా సురుడు భయంకరమగు వేలాయుధమును చేత బూని యుండును. చూచెడివారికి ఆతని తీరు బల్లెము గుచ్చుకున్నంత దుఃఖమును కలిగించుచుండును. అతడు భగవంతునకు శత్రువు. **న మే ద్వేష్యోస్తి న ప్రియః** నాకు ద్వేషింపతగిన వారెవరును లేరు అని పలికిన భగవంతునకు శత్రువులు గలరా? అనిన భాగవతులకు శత్రువులైన వారెల్లరును భగవంతునకు శత్రువులే! హిరణ్యకశిపు, భక్తప్రహ్లాదునకు శత్రువైనాడు! కనుకనే భగవంతునకు శత్రువైనాడు.

**"ద్విషదన్నం న భోక్తవ్యం ద్విషంతం నైవ భోజయేత్ ।**
**పాణ్డవాన్ ద్విషసే రాజన్! మమ ప్రాణా హి పాణ్డవాః ॥"**

శత్రులిడిన అన్నమును తినరాదు. శత్రువునకు అన్నము నిడరాదు. రాజా! నీవు పాండవులను ద్వేషించుచున్నావు. ఆ పాండవులు నాకు ప్రాణతుల్యులు అని తాను (భగవంతుడు) పలికియేయున్నాడు కదా!

హిరణ్యాసురుని ప్రాణములను శ్రీనరసింహమూర్తి అపహరించిన విధమును శ్రీపరాశర మహర్షి శ్రీవిష్ణుపురాణమున ఇట్లు తెలిపి యున్నాడు.

**"హృదయస్థ స్తత స్తస్య తం వాయుం అతి శోషణమ్ ।**
**పపౌ జనార్దనః క్రుద్ధః స యయౌ పవనక్షయమ్ ॥"**

తా॥ హృదయస్థుదును క్రుద్ధుడునగు శ్రీజనార్దనుడు హిరణ్యాసురుని ప్రాణావాయువును పానము చేసెను. హిరణ్యుడు ఊపిరిలేనివాడాయెను.

**కవ్వునాయుమ్ కழுకుమ్**=కంటబడినవారినెల్లరిని కఱచెడి కుక్కలును, శవములను పీక్కొని తినెడి గ్రద్దలును ఆ క్షేత్రమున అధికముగానుండును. మిడిమిడి వేళలో సూర్యుని వేడిమి అధికముగా నుండును. సుడిగాలులు ఆ మధ్యాహ్న వేళలలో భయంకరముగా వీచుచుండును. దేవతలు తప్ప ఇతరు లెవరును ఆ క్షేత్రమునకు వెళ్ళనాశపడరు. అటువంటి ఆ అహోబిలక్షేత్రమున వేంచేసియున్న శ్రీ నరసింహస్వామి యొక్క సౌందర్యమును జూచి అసూయపడువారు ఎవరును లేరు. "అழగియాన్ తానే అరియురువుం తానే" 'శ్రీ నరసింహ మూర్తియు తానే! సుందరుడును తానే!' అని తిరుమழிశైయాళ్వార్లు నాలగవ తిరువందాదిలో అనుగ్రహించియున్నారు.

**'నారసింహవపుః శ్రీమాన్'** నరసింహరూపమును గొనినవాడు సౌందర్య సంపదగలవాడని శ్రీ విష్ణు సహస్రనామ మందు తెలుపబడి యున్నది. ఈ శ్రీనరసింహుని దివ్యమంగళ విగ్రహ సౌందర్యసంపదకే **"అంది యంపోదిల్ అరియురువాకి యరియై యழித్తవనై... పల్లాణ్డు"** సాయంకాలమున శ్రీనరసింహరూపియై లోకకంటకుడైన హిరణ్యాసురుని మట్టు పెట్టినవానికి మంగళమని పెరియాళ్వారులు తిరుప్పల్లాండును అనుగ్రహించియున్నారు కదా! ఆళ్వారులందరును ఇటువంటి స్వభావముకలవారే! శ్రీనరసింహమూర్తి ఇంతటి సౌందర్య రాశియే యయినను భగవద్విరోధి అయిన హిరణ్యకశిపునకును అట్టి స్వభావము కలవారికినీ దరిచేరుటకు సాధ్యము కానివాడు.

***సూచన:* ఆళ్వార్లకాలంలో ఆ క్షేత్రమట్లుండేది కాబోలు. ఇప్పటి స్థితికాదు. వారి మంగళా శాసనబలము, ప్రభావము వల్ల ఆనాటి స్థితిమారి, అది దర్శనీయమైన దివ్యక్షేత్రమై ఇప్పుడు విరాజిల్లుతోంది.**



# సీతాఫలం రామార్పణమ్



శ్రీమతి చెవుటూరి కుసుమకుమారి - హైదరాబాద్

గత సంచిక నుండి

**అన్య ద్వక్ష్యామి భో దేవాః లంకాయాం యోగినీగణైః ।**
**గౌరీ నివాసం కురుతే తత్పురీ పరిపాలినీ ॥**

దేవతలారా! మరొక సంగతి వినుడు. గౌరీదేవి తన పరిచారికలైన యోగినీ గణములతో లంకాపురిని రక్షిస్తూ ఉన్నది. కనుక **"సుప్రసన్నా యథా గౌరీ తథా కుర్వంతు వై గణాః"** గౌరీదేవిని ప్రార్థించి ప్రసన్నురాలిగా చేసుకొనుడు అని చెప్పి శ్రీహరి అంతర్ధానం అయినాడు. అనంతరము బ్రహ్మాది దేవతలందరూ లోకమాత గౌరీదేవిని ఈ విధంగా స్తోత్రం చేశారు.

'అమ్మా! గౌరీదేవీ! నీవు త్రిలోకపూజితవు. సాక్షాత్తూ లంకేశ్వరివి నీవే. తల్లీ లోకజననీ! నీవు రావణ సంహారమునకై మాకు సహకరించు' అని ప్రార్థించారు. ప్రసన్నురాలైన గౌరీదేవి.

'దేవతలారా! చింతించకుడు. శ్రీహరి మానుషరూపముతో పుడమిన ప్రభవించగానే లక్ష్మీదేవి మానుషదేహము ధరించి భూలోకమున జన్మించగలదు. దురాత్ముడైన రావణుడు ఆమెను అపహరించి లంకాపట్టణమునకు తీసుకొని రాగానే నేను లంకావినాశనమునకై లంకను విడిచి పెట్టెదను. నేను విడిచి పెట్టగానే శివాంశ సంభూతుడైన ఒక వానరుడు లంకను భస్మీభూతము చేయగలడు' అని పలికిన గౌరీదేవి మాటలను దేవతలు ఆనందించి భూదేవిని ఓదార్చి వారి వారి లోకములకు చేరినారు.

**దేవాశ్చ సర్వే హరి రూపధారిణో**
**స్థితా స్సహాయార్థ మితస్తతో హరేః ।**
**మహాబలాః పర్వత వృక్షయోధినః**
**ప్రతీక్షమాణా భగవంత మీశ్వరమ్ ॥**

సమస్త దేవతలు శ్రీహరి సహాయార్థమై మహాబలవంతులైన వానరరూపధారులై గిరులమీద, తరువులమీద సంచరిస్తూ భగవంతుడైన శ్రీహరికి సహాయము చేయుట ఎప్పుడెప్పుడా అని నిరీక్షిస్తున్నారు. వారి నిరీక్షణ ఫలించి ఆరోజు రానే వచ్చింది.

**చైత్రమాసే సితే పక్షే నవమ్యాం చ పునర్వసౌ**
**మధ్యాహ్నే కర్కటకే లగ్నే ఉచ్ఛస్థే గ్రహపంచకే**
**కౌసల్యా జనయామాస రామం రాజీవలోచనమ్ ॥**

చైత్రశుద్ధ నవమి పునర్వసు నక్షత్రమున మధ్యాహ్నవేళ ఐదుగ్రహములు ఉచ్ఛస్థితిలో ఉండగా కర్కాటక లగ్నమున లోకనాథుడు, పరమాత్మ, లోకాభిరాముడు అయిన శ్రీరామచంద్రుని కౌసల్య కన్నది. ఆ విధంగా చెప్పిన సూతమహర్షికి చేతులు జోడించి ధన్యవాదములు తెలియచేసి ఆనంద పరవశులు అయినారు నైమిశారణ్య మునులు.

రౌమహర్షణి మహర్షీ! ఇప్పటి వరకూ రామకథామృతాన్ని మా చెవులనే దోసిళ్ళతో త్రాగాము. కానీ మాకు సీతాజననము, బాల్యక్రీడలు కూడా విననిదే తనివితీరదు. కనుక సీతా జననాది వృత్తాంతాలను చెప్పి, తరువాత సీతారామ కథను తెలుపుమని ప్రార్థించారు.

మహర్షులారా! ఇప్పుడు మీరు నన్ను అడిగినట్లే ఒకప్పుడు పార్వతీదేవి పరమేశ్వరుని అడిగినది. అప్పుడు శంకరుడు పార్వతికి చెప్పిన విషయమునే ఇప్పుడు మీకు చెప్పెదను ఆకర్ణించుడని చెప్పటం ప్రారంభించాడు సూత మునీంద్రుడు.

**సీతా జననాద్భుత దివ్యోదంతము**

**పద్మాక్షో నామ నృపతిః పురా కశ్చిదభూద్విజాః**
**స దృష్ట్వా సకలా న్లోకా న్లక్ష్మీ కామైక తత్పరాన్ ॥**
**చింతయామాస మనసి లక్ష్మీం కన్యాం కరోమ్యహమ్।**

మునీశ్వరులారా! పూర్వము పద్మాక్షుడనే రాజు సంపదనే కోరుకొనే జనులను చూచి తాను కూడా అమితైశ్వర్యవంతుడు కావలెనని బలీయమైన కోరిక కలిగింది. సాక్షాత్తు లక్ష్మీదేవినే పుత్రికగా పొందిన యెడల తన కోరిక తీరగలదని భావించి, లక్ష్మీదేవిని గురించి తీవ్ర తపస్సు చేశాడు. కొంతకాలానికి లక్ష్మీదేవి ప్రత్యక్షమై ఈ విధంగా పలికినది. "మహారాజా! నీవు నన్ను పుత్రికగా కోరి తపస్సు చేయు చున్నావు. కానీ నేను పరాధీనను, శ్రీహరి పత్నిని. కనుక నీవు శ్రీహరిని ప్రార్థించు. హరి నన్ను నీకు పుత్రికగా ఇచ్చుటకు అంగీకరించిన ఎడనల నీకు పుత్రికనయ్యెద"నని అంతర్ధానమైనది. *(సశేషం)*



# అహో! భారతమ్

గత సంచిక తరువాయి...

శ్రీమతి డా॥టి.కె. చూడామణి-విజయవాడ

హస్తినాపురానికి కశ్యపుడు గబగబా బయలుదేరడం చూశాడు తక్షకుడు. ఒక్కక్షణం కంగారు పడ్డాడు. ఈ ముని పరీక్షిత్తుని చేరాడా నా ఆటలు సాగవు. ఎలాగైనా ఇతనిని వెనక్కి పంపించాలి అనుకుంటూ ఒక ముసలి బ్రాహ్మణవేషం ధరించాడు తక్షకుడు. కశ్యపునికి ఎదురు వచ్చాడు "ఓ మునిశ్రేష్ఠుడా! ఎక్కడికి బయలుదేరావు? ఏం పనిమీద బయలుదేరావు" అంటూ ప్రశ్నించాడు.

ఒక్క క్షణం కశ్యపుడు ఆగాడు. ఏమిటీ ప్రశ్నించడం అనుకున్నాడు. అయినా మనస్సు సర్దుకొని "అయ్యా! పరీక్షిత్తు అనే మహారాజున్నాడు కదా! ఎంతటి మహాబలశాలి అతడు! ఎంతటి వీరుడతడు! ఆయన మనస్సెంత మంచిది! అలాంటి ధర్మాత్ముని తక్షకుడనే పాము ఈ రోజు కరవబోతోందట. ఈ విషయం నాకు తెలిసింది. నా దగ్గర గొప్పశక్తి ఒకటుంది. మంత్ర తంత్రాలెన్నో నాకు తెలుసు. ఆ శక్తితో ఎంతటి విషాగ్నయినా నేను పోగొట్టగలను. ఒకవేళ తక్షకుడే కనుక ఆ రాజును కరిస్తే నామంత్రశక్తితో ఆ విషాన్ని బయటికి లాగి ఆ రాజును నేను రక్షిస్తాను. తక్షకుడు ఈరోజే రాజును కరవబోతున్నాడని తెలిసి తొందరగా వెళ్ళాలని బయలుదేరాను" అన్నాడు.

అతని మాటలు విని తక్షకుడు ఒక్క నవ్వు నవ్వాడు. "ఓ... మహానుభావా! నేనే ఆ తక్షకుడిని వజ్రాయుధం దెబ్బతిన్న బ్రతుకవచ్చేమో గాని నా కాటు నుండి ఎవరూ బ్రతికి బయట పడలేదు తెలుసా! నీ మంత్రాలు, మందులు నా దగ్గర పనిచెయ్యవు. పో... తిరిగి వెళ్ళిపో... వెళ్ళు... వెళ్ళు... అన్నాడు.

కశ్యపునికి పట్టుదల వచ్చింది. తనశక్తిని చూపించాలనిపించింది. అందుకని... ఓహో... అంత గొప్పవాడివా... అయితే నీ ప్రతాపం చూపించు చూద్దాం" అన్నాడు.

తక్షకునికి అంతకంటే పట్టుదల పెరిగింది. ఇదిగో ఇలా చూడు నేను ఈ మఱ్ఱిచెట్టుని కరుస్తాను. ఏమౌతుందో నీకే తెలుస్తుంది అంటూ పచ్చగా ఉన్న పెద్ద మఱ్ఱిచెట్టుని కాటేశాడు. చూసన్తుండగా అంత పెద్ద చెట్టు విషంవల్ల భగ్గుమని మండిపోయింది. పొడవైన కొమ్మలు పెద్దపెద్ద ఆకులుగల ఆమాను అంతలో బూడిదగా మారిపోయింది. విషప్రభావాన్ని కనులారా చూశాడు కశ్యపుడు.

అయిందా... అయితే ఇపుడు నా ప్రతాపం చూడు! అంటూ ఆ బూడిదను కొంచెం దగ్గరచేసి దానిముందు పద్మాసనంలో కూచుని ఆ భగవంతుని ప్రార్థించి కొన్ని మంత్రాలు చదివాడు. అంతే... ఆ బూడిద... అలా అలా... చెట్టుగా మారిపోయింది. అదుగో అదే చెట్టు పూర్వం ఎలా ఉందో... అచ్చు అదే... తక్షకుడు ఆశ్చర్యంలో మునిగిపోయాడు. మంత్రానికి ఎంతశక్తి! మంత్రశక్తితో సాధించలేనిది ఏముంది? మననం చేసిన వారిని రక్షించేదే కదా మంత్రమంటే. ఈ కశ్యపుడు ఎంత గొప్పమంత్రవేత్త... క్షణకాలం ఆశ్చర్యంలో మునిగి తేలాడు తక్షకుడు. "మునీంద్రా! నీవెంత గొప్పవాడివో! నీమంత్రశక్తి ఎంత గొప్పదో స్వయంగా చూశాను. అయినా ఒక్కమాట. ఆ పరీక్షిత్తు శృంగి చేత శపింపబడ్డాడు. ఆయన ఆయుష్షు తీరిపోయింది. కాబట్టి ఆయనకి బ్రతికే అవకాశం లేదు. నీకింత శక్తి ఉందనేమాట ఆయన విషయంలో నిజం కాకపోతే నీకు అవమానమే కదా! ఇంకొక్కమాట. నువ్వు ఏమి కోరి ఆ రాజుని రక్షించాలని అనుకుంటున్నావు" అని అడిగాడు. "ధనం... ధనం... కోరినంత ధనం ఇస్తాడు ఆ రాజు. అందుకే" అన్నాడు కశ్యపుడు.

"ఓ...! ఆయన ఇచ్చేదానికంటే రెట్టింపు ధనం నేనిస్తాను. ఆ సొమ్ము తీసుకొని వెనుకకి వెళ్ళిపో! నా దారికి అడ్డురాకు. పరీక్షిత్తు ఆయువు తీరిపోయింది కాబట్టి నువ్వు బ్రతికించాలను కొన్నా బ్రతుకడు. అపకీర్తి తెచ్చుకోకు. ఇదుగో చూడు... ఈ ధనం ఈ బంగారం ... ఈ రత్నరాసులు చాలా! నువ్వు చాలు అనేంత ఇస్తాను. తీసుకొని వెళ్ళు" అన్నాడు.

ధనకాంక్ష ఎంత బలమైనది! ఒక మహారాజు ప్రాణం రక్షించడం కంటే తాను కోరిన ధనం లభించడమే ముఖ్యం. ఈ ప్రలోభానికి గురి అయ్యాడు కశ్యపుడు.

తపోజ్ఞానంతో పరీక్షిత్తు ఆయువుమూడిందని గ్రహించాడు. వెంటనే తక్షకుడిచ్చిన ధనమంతా మూటకట్టుకొని వెనక్కి వెళ్ళిపోయాడు. భగవత్ కటాక్షం లేనప్పుడు సహాయం కూడా సమయానికి అందకపోవడమంటే ఇదే కదా! అడ్డుతొలగిన విజయగర్వంతో ఒక్క నవ్వు నవ్వి పరీక్షిత్తు వద్దకు బయలుదేరాడు తక్షకుడు. ఈ కథ లోకానికి ఎలా తెలిసిందో తెలుసా?

ఒక కట్టెలు కొట్టుకొనే బీదవాడు అడవికి పోయి ఓ మఱ్ఱిచెట్టు ఎక్కి కట్టెలు కొట్టుకుంటున్నాడు. సరిగ్గా ఆ చెట్టునే కాటువేశాడు తక్షకుడు. అయ్యో! ఇదెక్కడి పరీక్ష? నేనెక్కిన చెట్టునే కాటువేయాలా? వీరి పరీక్ష నా ప్రాణాన్ని బలి చేసుకొంటూందే అంటే ఆ చెట్టుతోపాటు మాడిపోయాడు కట్టెలవాడు.

అయితే ఏం... మళ్ళీ ఆ కశ్యపుని మంత్రశక్తితో అతడూ బ్రతికిపోయాడు. కశ్యప, తక్షకులు ఎవరి దారిన వారు వెళ్ళిపోయిన తరువాత బ్రతుకుజీవుడా అంటూ చెట్టుదిగి ఊళ్ళోకి వచ్చి జరిగిన సంగతి అందరికీ చెప్పాడు. అలా లోకానికి తెలిసిందీ కథ.

కశ్యపమహర్షి వెళ్ళిపోయిన తరువాత తక్షకుడు సర్పకుమారులను పిలిచి... "మీరంతా బ్రాహ్మణవేషాలు ధరించి మంచి సువాసనగల పూలు, మంచి మంచి పళ్ళు మోదుగ ఆకులలో బుట్టలలో పెట్టుకొని పరీక్షిత్తు దగ్గరికి వెళ్ళి అతనికివ్వండి. నేను కూడా అదృశ్యరూపంలో మీవెంటే వస్తాను" అని ఆజ్ఞాపించాడు.

సర్పాలు బ్రాహ్మణయువకులుగా బయలుదేరాయి. వేదఘోష చేస్తూ వస్తున్న ఆ వేదపండితులను దర్శించాడు పరీక్షిత్తు. ఆహా....! ఎంత శ్రవణ శుభగంగా వేదనాదాలు వినిపిస్తున్నారు వీరు. ఆ పదపాఠం, ఆ క్రమపాఠం, క్రియాగణనం, ఎంత బాగుంది!" అంటూ వారికి ఎదురు వెళ్ళాడు.

పదం అంటే వేదవాక్యంలో పదాలను చక్కగా విడదీయడం, క్రమం అంటే ఒక్కొక్కసారి ఒక్కొక్క పదాన్ని విడిచి మరొక పదాన్ని గ్రహిస్తూ వేదాన్ని పఠించే ఒక పద్ధతి. ఆహా మధుర వేదనాదాలు... పరీక్షిత్తు వింటూ ఆనందపరవశు డయ్యాడు. వారిచ్చిన పళ్ళు, పూలు ఆదరంతో స్వీకరించాడు. మళ్ళీ వారందరికీ తగినట్లు సన్మానాలు చేశాడు. వేదాభిమాని, వేదపోషకుడయిన ఆ మహానుభావుడు వారియందుగల గౌరవం, అభిమానంతో వారిని పూజించి పంపించాడు. పెద్దలు అనుగ్రహించిన ప్రసాదంగా ఆ పళ్ళను కళ్ళకు అద్దుకున్నాడు. తినాలి అనుకున్నాడు. అందరికి పళ్ళు పంచి పెట్టాడు. తాను కూడా ఆదరంతో ఒక పండు తీసుకొన్నాడు. సరిగ్గా ఆ పండులోనికి తక్షకుడు క్రిమిరూపంగా ప్రవేశించి కూర్చున్నాడు. పరీక్షిత్తు ఆపండును చీల్చిన వెంటనే చిన్నగా ఉన్న ఆ పురుగు నల్లని కళ్ళతో, పారాణివంటి ఎఱ్ఱని రంగుతో పాముగా మారిపోయింది. అగ్నిలాంటి విషం జ్వలిస్తూ, ఒక్కసారి పరీక్షిత్తుని కాటువేసింది. ఒక్కసారి మంటలో భస్మీభూతు డయ్యాడు పరీక్షిత్తు. శృంగి శాపం రూపం దాల్చింది. నిష్ఠాగరిష్ఠు డయిన బ్రాహ్మణోత్తముని మాట ఎలా యథార్థమౌతుందో లోకానికి మరొక్కమారు చాటి చెప్పింది శృంగిశాపం. *(సశేషం)*

# రామాయణంలో ప్రజాస్వామిక పరిపాలనా విధానాలు

గత సంచిక తరువాయి...

శ్రీమతి డా॥ పి. జ్యోతి- వరంగల్

దశవర్గమంటే వేట, జూదం, పగటినిద్ర, ఇతరులను నిందిస్తూ మాట్లాడటం, స్త్రీలోలత్వం, మద్యపానాదులు, నిరంతరం నృత్య గీత వాద్యాలలో మునిగిపోవటం, వ్యర్థంగా తిరగటం అనేవి. లేదా లుబ్ధుడు, క్రూరుడు, అలసుడు, అసత్యవాది, ఏమరుపాటుతో ఉండేవాడు, పిరికివాడు, స్థిరత్వం లేనివాడు, మూఢుడు, నీతిలేనివాడు, అందరినీ అవమానించే వాడు. ఇటువంటి గుణాలే దశవర్గంలో చేరతాయి.

పంచవర్గమంటే పంచవిధ దుర్గాలైన కావొచ్చు లేదా శత్రువు, ద్రవ్యం, పరుషవాక్కు స్త్రీలు, అపరాధం వీటివల్ల కలిగే పంచవిధాలైన వైరాలు.

చతుర్వర్గమంటే సామ దాన భేద దండోపాయాలు లేదా కామందకీయంలో చెప్పినట్లు ధనాన్ని న్యాయంగా ఆర్జించటం, రక్షించటం, వృద్ధిపొందించటం, సత్పాత్రదానం చేయటం.

సప్తవర్గాలంటే స్వామి, అమాత్యులు, రాష్ట్రం, దుర్గం, కోశం, సైన్యం, మిత్రుడు లేదా తనవాడు, మిత్రుడు ఆశ్రితుడు, బంధుత్వం కలవాడు, కార్యం వల్ల ఏర్పడినవాడు, భృత్యుడు, ఉపకారాలు చేయటం వల్ల లభించినవాడు.

అష్టవర్గమంటే వ్యవసాయం, వర్తకం, దుర్గాలు, సేతువులు, ఏనుగులను పట్టే అడవులు, గనులు, పన్నులు గ్రహించటం జనశూన్య ప్రదేశాలలో జనాలను నివసింప చేయటం అనేవి మంచి పరిపాలనను అందించే రాజు ఆచరించే విధానాలు.

త్రివర్గమంటే ధర్మార్థకామాలే కాక శక్యం కాని పనులు చేయటానికి ఉద్యమించటం, అజ్ఞానంవల్ల సాధ్యమైన పనులను కూడ చేయకపోవటం, సాధ్యమైన పనులను సమయం కాని సమయంలో చేయటానికి ప్రయత్నించటం.

మూడు విద్యలంటే త్రయి(వేదత్రయం), వార్త (వ్యవ సాయం, గోరక్షణ, వర్తకం), దండనీతి (రాజనీతి).

షాడ్గుణ్యం అంటే సంధి, విగ్రహం (విరోధం పెట్టుకోవటం) దండెత్తి వెళ్ళటం (యానం) తగిన కాలానికై ప్రతీక్షించటం, దుర్బలులతో, ప్రబలులైన శత్రువులతో మాటలతో మాత్రమే మంచిగా ఉండటం, బలవంతుని ఆశ్రయించటం ఆరు గుణాలు.

దైవమానుషాలంటే దైవం వలన అనగ విధివశాత్తు వచ్చేవి, మానవులన వచ్చే ఆపదలు. అగ్ని, జలం, వ్యాధులు, కఱవు, మరణం అన్నవి దైవం వల్ల వచ్చిన ఆపదలు. అధికారులు దొంగలు, శత్రువులు, రాజు సన్నిహితులు, దురాశాపరులు మొదలైన వాటివల్ల వచ్చేవి మనుషుల వలన కలిగే ఆపదలు.

వింశతి వర్గమంటే ఎటువంటి పరిస్థితులలోను సంధి చేసుకోవటానికి తగనివారు, విరోధం వల్లనే సాధింపదగిన వారైన శత్రుసముదాయం, చిన్నవాడు, వృద్ధుడు, దీర్ఘరోగంతో బాధపడుతున్నవాడు, బంధువులు బహిష్కరించినవాడు, పిరికివాడు, పిరికిపందలైన జనం కలవాడు, లోభి, లుబ్ధులైన జనం కలవాడు, మంత్రులు మొదలైన వారిని ప్రేమగా చూడనివాడు, భోగలాలసుడు, చపలచిత్తుడు, దుష్ట ఆలోచనలు కలవాడు, దేవబ్రాహ్మణులను నిందించేవాడు, దేవోపహతుడు, అన్నీ దైవమే చేస్తుందని పురుషప్రయత్నం చేయనివాడు, రాజ్యంలో దుర్భిక్షం ఏర్పడ్డవాడు, వ్యసనాల్లో చిక్కుకున్నసేన కలిగినవాడు, స్వదేశంలో ఉండనివాడు, చాలామంది శత్రువులు కలవాడు, కాలం ప్రతికూలంగా ఉన్నవాడు, సత్యం ధర్మం లేనివాడు అని ఇరవై విధాల శత్రువులతో సంధి చేసుకోకూడదు.

నేను కోరుకునే విధంగా నీ బుద్ధి కామార్థాలపై శ్రద్ధకలదై ఆయుర్దాయాన్ని, యశస్సును వృద్ధి పొందించేదిగా ఉన్నదా? అని ప్రశ్నల వర్షం కురిపిస్తూ తద్వారా రాజనీతిని బోధిస్తున్న రామునితో భరతుడు "అయోధ్యకు రాజు కావలసినవాడు శ్రీరాముడు. నేను రాజును కాను కనుక నీవు చెప్పిన రాజధర్మా లన్నీ నాకు తెలియనవసరం లేదు. నేను నీదాసుడను. స్వతంత్రుడను కాను" అని పలికి పట్టాభిషేకాన్ని స్వీకరించుమని రాముని పాదాలపై బడి ప్రార్థించాడు.

మానవుడు సమాజంలో ప్రవర్తించవలసిన విధానాన్నే కాక సమస్త నాగరిక ప్రపంచం ఆదర్శప్రాయంగా భావించే ఎన్నో నైతిక ప్రమాణాలను అయోధ్యకాండ నిరూపిస్తున్నది. రాజనీతి, రాజ్యాంగ విధులకు సంబంధించి ప్రజాస్వామిక పరిపాలనాసూత్రాలను ఆవిష్కరించింది. సర్వకాలాల్లో రామాయణమే మానవత్వాన్ని పరిరక్షించుకునే ఉత్తమ ప్రమాణ గ్రంథంగా నిలిచింది. మానవులను మానవులుగా నిలుపడానికి ప్రయత్నం చేసింది.

సమాప్తం.

# భక్తప్రియుడు భగవానుడు

శ్రీమాన్ సముద్రాల శఠకోపాచార్యస్వామి-వరంగల్

సకల జగత్కారణభూతుడు, సర్వజగద్రక్షకుడు, చిదచిద్విశిష్టుడైన శ్రీమన్నారాయణుడు భక్తసులభుడు, భక్తుల కొంగు బంగారమై నిలచే భక్తప్రియుడు. భక్తుల కోరికలనన్నింటినీ నెరవేర్చే భక్తవరదుడు.

"వేదములచేత లేక యజ్ఞదాన తపస్సులచేతగాని నన్ను దర్శించలేరు, కేవలం నాయందు సంపూర్ణంగా ఉండే భక్తిచేతనే నన్ను యథార్థంగా తెలుసుకొందరు. నా తత్త్వాన్ని దర్శించగలరు" అని శ్రీకృష్ణపరమాత్మ అర్జునునితో స్వయంగా పలికిన

**"నాహం వేదై ర్నతపసా న దానేన న చేజ్యయా ।**
**శక్య ఏవంవిధో ద్రష్టుం దృష్టవానసి మాం యథా ॥"**
**"భక్త్యా త్వనన్యయా శక్యః అహమేవం విధోஉర్జున! ।**
**జ్ఞాతుం ద్రష్టుం చ తత్త్వేన ప్రవేష్టుం చ పరంతప! ॥"**

ఈ పలుకులే భగవంతుణ్ణి భక్తపరవశునిగా ప్రకటిస్తున్నాయి.

శ్రీమన్నారాయణుడు తనను అమితంగా ప్రేమించే, ఆరాధించే, విశ్వసించే భక్తుల స్థితిగతులను, దేశ-కాల-జాతి-లింగ-వయో భేదములను గణించడు. బాహ్య గుణసౌందర్యమును అపేక్షించడు. భక్తులు తనకర్పించే పత్ర-పుష్ప- ఫల-తోయ(జల) ములను పరమాదరముతో ఆరగిస్తాడు.

భగవానుడు గుహుడనే వ్యాధుని బాహ్యాచరణను పట్టించుకోలేదు. ధృవుని లేతవయస్సును లెక్క పెట్టలేదు. గజేంద్రుడు అభ్యసించిన విద్య ఏపాటిది, అతడు శరణాగతి చేయుటకు ఎట్లు అర్హుడు అని భావించలేదు. సుగ్రీవ, జాంబవంత, విదుర శబర్యాదుల జాతి-కుల-లింగములను గురించి పర్యాలోచన చేయలేదు. కుబ్జ యొక్క సౌందర్యమెట్టిదని తలచలేదు. కుచేలుని ధనమెంతటిదని పరిగణించలేదు. భక్తప్రియుడగు శ్రీపతి కేవలం భక్తిచేతనే ప్రీతినొందును, అంతేకాని విద్య-ధన- సౌందర్య-జాతి-లింగ- వయో గుణములచే సంతోషించడని, భగవంతుడు భక్తజన ప్రియుడని తెలియచెప్పే శ్లోకమిది.

**వ్యాధస్యాచరణం ధృవస్య చ వయో విద్యా గజేంద్రస్య కా?**
**జాతిః కా విదురస్య? మర్కటపతేః కా వా శబర్యాః పునః?**
**కుబ్జాయా కమనీయరూపమధికం కిం తత్సుధామ్నో ధనం?**
**భక్త్యా తుష్యతి కేవలైః న చ గుణైః భక్తప్రియః శ్రీపతిః ॥**

భక్తిభావతత్పరులై, నన్ను ఎడబాయలేక నా దివ్య చేష్టితములను, గుణసంపత్తిని, అద్భుత కృత్యములను, నాతో వారికుండే గాఢ (నవవిధ) బంధమును గుర్తించి, నిత్యము నా వైభవాన్ని కీర్తించే భక్తాగ్రేసరులపై, వారు ప్రసాదించిన దివ్యప్రబంధములపై నాకు ఉండే ప్రేమ ఎల్లప్పుడూ నా హృదయమందే నివసిస్తూ నన్ను రంజింపచేసే లక్ష్మీదేవిపై కూడ ఉండదు అనే సాక్షాత్ శ్రీమన్నారాయణుని కంఠోక్తి రూపమైన శ్రీమద్భాగవత సూక్తి..

**న ప్రీతిరస్తి మమ వక్షసి లాలితాయాం**
**లక్ష్మ్యాం తథా సకలభూత నిదానసీమ్ని ।**
**మజ్జన్మ కర్మగుణ బంధ కృతాన్ ప్రబంధాన్**
**సంకీర్తయత్యనఘ భక్తిజనే యథైవ ॥**

భగవద్భక్తులైన వారికి ఎన్నటికి కూడా వినాశమేర్పడదని, సాక్షాత్తు పరమాత్మయే అర్జునుణ్ణి సాక్షిగా పెట్టుకొని ప్రమాణం చేశారు.

**"కౌంతేయ ప్రతిజానీహి న మే భక్తః ప్రణశ్యతి"** అని. **"న వాసుదేవ భక్తానాం అశుభం విద్యతే క్వచిత్"** భగవద్భక్తులకు అశుభమనేది ఉండనే ఉండదు. **"మోక్షసాధన సామగ్ర్యాం భక్తిరేవ గరీయసీ"** మోక్షసాధన సామగ్రిలో భక్తియే శ్రేష్ఠమైనదను వాక్యసారాన్ని, భగవద్భక్తి సాగరమగ్నులైన ఆళ్వారుల దివ్య చరితలలో చాటారు. భగవద్రామానుజులు కూడా

**"అఖిల భువన జన్మస్థేమ భంగాదిలీలే**
**వినత వివిధ భూత వ్రాత రక్షైకదీక్షే**
**శ్రుతిశిరసివిదీప్తే బ్రహ్మణి శ్రీనివాసే**
**భవతు మమ పరస్మిన్ శేముషీ భక్తిరూపా॥"** అను శ్రీభాష్య మంగళాచరణ శ్లోకంలో వక్షఃస్థలంలో లక్ష్మీదేవిని నిత్య నివాసినిగా కలిగియున్నట్టి శ్రీమన్నారాయణుడి విషయంలో నాకు భక్తి రూపాపన్నమైన జ్ఞానం కలుగాలని ప్రార్థించినారు.

నా భక్తులు నా దివ్య జన్మ గుణ క్రియాదులను గురించి ఎక్కడ కీర్తిస్తుంటారో అక్కడ తప్పక వారికి సన్నిహితంగా ఉంటాను. నన్ను కీర్తించే భక్తుల చెంతనున్నంత స్థిరంగా వైకుంఠములోనో, యోగీశ్వరుల హృదయంలోనో, సూర్యమండల అంతర్వర్తిగా కూడా ఉండను -

**నాహం వసామి వైకుంఠే న యోగిహృదయే రవౌ ।**
**మద్భక్తా యత్ర గాయన్తి తత్ర తిష్ఠామి నారద! ॥** అని శ్రీమన్నారాయణుడు నారదమహర్షితో పేర్కొన్న విషయాన్ని బట్టి భక్తవల్లభుడైన పరమాత్మ మహాభక్తజన హృదయాల్లోనే నిత్య నివాసంగా ఉంటాడు కాబట్టి మనమంతా పరమాత్మ మెచ్చిన మహాభక్తజనుల సాంగత్యాన్ని పొందేందుకు, వారి మార్గ దర్శకత్వంలో జీవనయానాన్ని కొనసాగించేందుకు ప్రయత్నిద్దాం!




# తిరుప్పల్లాండు

పల్లాండు! పల్లాండు! పల్లాయిరత్తాండు! పలకోడి నూరాయిరమ్।
మల్లాండ తిండోళ్ మణివణ్ణా! ఉన్ శేవడి శెవ్వి తిరుక్కాప్పు ॥ 1

| | | |
|---|---|---|
| **మల్ ఆణ్డ** | = | చాణూర ముష్టికులను మల్లురను జయించిన |
| **తిణ్ తోళ్** | = | దృఢమైన భుజములు కల |
| **మణివణ్ణా!** | = | ఇంద్రనీలము వంటి దేహకాంతి కలవాడా! |
| **ఉన్ శే అడి** | = | నీయొక్క ఎర్రని శ్రీపాదముల యొక్క |
| **శెవ్వి** | = | సౌందర్యమునకు |
| **తిరుకాప్ప** | = | పరిపూర్ణమైన రక్షణము |
| **పల్ ఆణ్డు** | = | అనేకానేక |
| **పల్ ఆణ్డు** | = | సంవత్సరములు |
| **(తిరుకాప్ప** | = | పరిపూర్ణరక్షణము) |
| **పల్ ఆయిరత్తాండు** | = | అనేక వేలసంవత్సరములు |
| **(తిరుకాప్ప** | = | పరిపూర్ణరక్షణము) |
| **పలకోడి నూరు ఆయిరం** | = | ఎన్నో కోట్ల వందల వేల సంవత్సరములు |
| **(తిరుకాప్పు)** | = | పరిపూర్ణరక్షణము! |

**తా:** పరతత్త్వనిర్ణయం చేసిన తరువాత విష్ణుచిత్తులను ఏనుగుమీద ఊరేగిస్తున్న సమయంలో ఆ దృశ్యాన్ని చూచి ఆనందిద్దామని శ్రీమన్నారాయణుడే గరుడవాహనుడై తన పరివారంతో అక్కడ ప్రత్యక్షమైనాడు. అలా ప్రత్యక్షమైన స్వామిని చూచి పెరియాళ్వార్ ప్రేమతో ఆయనకు ఎక్కడ దిష్టి తాకుతుందోనని **పల్లాండు పల్లాండు** అని మంగళాశాసనం ప్రారంభిస్తారు. స్వామి 'నాకేమీ భయంలేదు' అని ఆయన భుజబలం చూపిస్తాడు. వెంటనే వీరు **'నీ భుజమునకు మంగళం'** అని పాడారు. వెంటనే నీలమేఘవర్ణుడైనస్వామి 'ఎలాంటి ఆపద వచ్చినా నాకాలి బ్రొటనవేలితో తీసివేస్తా'నని ఆయనకు తన శ్రీపాదాన్ని చూపించాడు. ఆ పాదసౌందర్యానికి ఎక్కడ దృష్టిదోషం కలుగుతుందోనని భయపడిన విష్ణుచిత్తులవారు వెంటనే **'అయితే ఆ ఎర్రని నీ పాద పద్మములకు పరిపూర్ణమైన రక్షణము కలుగుగాక!' అని పాడారు.** స్వామిమీద ఉండే ప్రేమతో, **"ఎన్నో కోట్ల వందల వేల సంవత్సరములు నీకు మంగళము"** అగుగాక అంటూ మంగళాశాసనము చేయుచున్నారు. అయితే ప్రేమ అధికం కావటంచేత సంఖ్యామానాన్ని కూడా మరచిపోయారు. అందుకే వందలు, వేలు, కోట్లు అనే క్రమం పోయి వేలు కోట్ల వందలు వేలు అనే క్రమంలో వీరు పాడారు.

**అడియో మోడుమ్ నిన్నోడుమ్ పిరివిన్ఱి యాయిరమ్ పల్లాణ్డు**
**వడివాయ్ నిన్ వలమార్బినిల్ వాழ்గిన్ఱ మంగైయుం పల్లాండు।**
**వడివార్శోది వలత్తుఱైయుమ్ శుడరాழியుమ్ పల్లాండు**
**పడైపోర్ పుక్కు ముழంగుమ్ అప్పాఞ్చశన్నియముమ్ పల్లాండే ॥ 2**

| | | |
|---|---|---|
| **అడియో మోడుం** | = | దాసులమైన మాతో |
| **నిన్నోడుం** | = | స్వామివైన నీతో |
| **పిటివు ఇన్టి** | = | ఎడబాటు లేకుండునట్లు |
| **పల్ ఆయిరం ఆండు** | = | అనేకవేల సంవత్సరములు మంగళము అగుగాక! |
| **వడివు ఆయ్** | = | దేహమునందు ఒక భాగమైన |
| **నిన్** | = | నీయొక్క |
| **వల మార్బినిల్** | = | కుడిప్రక్క వక్షస్థలమున |
| **వాఴ్ కిన్ట** | = | అలరారుచున్న |
| **మంగైయుం** | = | లక్ష్మీదేవికిని |
| **పల్లాండు** | = | అనేక సంవత్సరములు శుభమగుగాక! |
| **వడివు** | = | తన దేహము నందు |
| **ఆర్** | = | నిండిన |
| **శోది** | = | కాంతితో |
| **వలత్తు** | = | నీయొక్క కుడిచేతిలో |
| **ఉఱైయుం** | = | ఎల్లప్పుడూ నిలచియున్న |
| **శుడర్** | = | కాంతులీను |
| **ఆఴియుం** | = | సుదర్శన చక్రమునకును |
| **పల్లాండు** | = | పలు సంవత్సరములు మంగళ మగుగాక! |
| **పడైపోర్** | = | సంకులమైన యుద్ధమందు |
| **పుక్కు** | = | ప్రవేశించి |
| **ముழంగుం** | = | ధ్వనించునటువంటి |
| **అ ప్పాంచశన్నియముం** | = | అందమైన ఆ పాంచజన్య శంఖమున కును |
| **పల్లాండే** | = | పలు సంవత్సరములు మంగళమగు గాక! |

**తా:** విష్ణుచిత్తులు, భగవానుడు ఏది చూపినా దానికి **"మంగళం మంగళం"** అని పాడుతూ ఉంటే స్వామి తన ప్రక్కన ఉన్న పరివారాన్ని ఒకసారి చూపిస్తాడు. అది గమనించిన విష్ణుచిత్తులు **దాసులమైన మాకు స్వామివైన నీతో ఎడబాటు లేకుండా ఉండేటట్లు అనేక వేల సంవత్సరములు మంళమగుగాక** అని పాడిరి.

"మంగళాన్ని ఇచ్చే మంగళదేవతైన లక్ష్మీదేవతయే నావద్ద ఉంటే, ఎందుకయ్యా మంగళం పాడుతావు?" అని తన కుడి ప్రక్క వక్షస్థలమందు విరాజిల్లుతున్న లక్ష్మీదేవిని భగవానుడు చూపించాడు. ఆ దృశ్యాన్ని చూసిన శ్రీవిష్ణుచిత్తులు **'నీతో కూడిన లక్ష్మీదేవికి కూడా మంగళమగు గాక'** అని పాడారు.

మొదటి పాశురం నుండి వారు **"స్వామీ! నీ భుజాలకు రక్షణము, నీ శ్రీపాదాలకు రక్షణము. నీ భక్తులకు రక్షణము, నీ హృదయవాసియైన లక్ష్మీదేవికి పరిపూర్ణమైన రక్షణము కలుగగాక!"** అని మంగళము పాడుతూంటే, "మా స్వామికి ఎలాంటి ఆపద వచ్చిందో!" అని సుదర్శన భగవానుడు ప్రకాశిస్తూ ప్రయోగ చక్రంగా మారుతాడు. "అలాంటి సుదర్శనచక్రం నాప్రక్కన ఉంది కదా! నాకేమి భయం?" అని అంటాడు స్వామి. అపుడు విష్ణుచిత్తులు, **తనకాంతివంతమైన దేహంతో స్వామి సౌందర్యాన్ని మరింత ప్రకాశింపచేస్తున్న చక్రరాజానికి మంగళం** అని పాడతారు. అలాగే యుద్ధసమయమున తన ధ్వనితోనే శత్రువులను సంహరించు ఆ పాంచజన్య శంఖమును కూడా స్వామి చూపితే, తనదృష్టిదోషమే ఎక్కడ తగులుతుందోననే భయంతో తలను త్రిప్పుకొని **"ఆ.... శ్రీపాంచజన్య శంఖానికీ రక్షణమగుగాక!"** అని మంగళాశాసనము చేస్తున్నారు. ఈ విధంగా భగవంతుడియందుండే ప్రీతి అతిశయం చేత, విష్ణుచిత్తులవారికి, భగవంతుడు తనకి రక్షకములని చూపించినవన్నీ కూడా భగవత్సౌందర్యవర్ధకాలుగానే కన్పించి, వాటికి కూడా మంగళం పాడాలన్పించింది. అతిశయించిన ప్రేమతో జగద్రక్షకునికే రక్ష పెట్టిన పెద్ద మనసు కల విష్ణుచిత్తులు ఆనాటి నుండి **పెరియ ఆళ్వార్** అన్న ప్రసిద్ధిని పొందారు.




శ్రీమాన్ మధుసూదనాచార్యస్వామి
ప్రధానాచార్య, ఆగమపాఠశాల, జగ్గయ్యపేట

# శ్రీపాంచరాత్ర పరిచయము

వేదాలు పరమాత్మ తత్త్వాన్ని అనేక పేర్లతో పిలిచాయి. ఆకాశం, జ్యోతి, అగ్ని, ఇంద్ర, రుద్ర, బ్రహ్మ, ఆత్మ వంటి ఎన్నో పేర్లను పరతత్త్వాన్ని చెప్పే సందర్భంలో వాడడం వల్ల మోక్షాన్ని కోరి బ్రహ్మోపాసన చేసే సాధకులకి ఏ నామాన్ని ఆధారం చేసుకొని ఉపాసన చేయాలో తేల్చుకోలేని స్థితి ఏర్పడింది. ఎందుకంటే, ఆయా పేర్లు కొన్ని భౌతిక తత్త్వాల విషయంలోనో, లేదా, కొందరు దేవతల విషయంలోనో ప్రసిద్ధాలుగ ఉన్నాయి. ఆకాశము, జ్యోతి మొదలైన భౌతిక పదార్థాలు కానీ, ఇంద్ర, రుద్రాది దేవతా విశేషాలుగానీ ఉపాస్యుడైన పరమాత్మ తత్త్వానికి ఉండవలసిన జగత్కారణత్వాది లక్షణాలు కలవిగ కనబడటం లేదు.

జగత్కారణత్వమంటే ఏమిటి? ఈ జగత్తును సృష్టించడం, చిత్ర విచిత్రమైన లక్షణాలు కలిగి, పెరుగుతూ, తరుగుతూ ఈ పదార్థాలను వాటి వాటి లక్షణాలతో నిలబెట్టడం, వాటివల్ల జరుగవలసిన పనులు పూర్తికాగానే వాటిని నశింపచేయడం. ఈ మూడు పనులను సృష్టి, స్థితి, ప్రళయాలంటారు. అచేతన వస్తువులన్నింటికీ ఈ మూడు అవస్థలూ ఉంటాయి. చేతనాలయిన జీవులకి మాత్రం ఈ రకమైన మార్పులు ఉండవు కానీ, అచేతనాలతో కలిసి ఉన్నంత వరకూ వాటికి ఏర్పడే పరిణామాల తోటే ఆ జీవులను కూడా వ్యవహరిస్తూ ఉంటారు.

జీవుడు అచేతనాల సంపర్కంలోంచి పూర్తిగ విముక్తి పొంది, తిరిగి అచేతనాల బంధంలోకి రాకుండా నిత్యానందాన్ని పొందడాన్నే 'మోక్షం' అని అంటారు. అంటే, అచేతనాలకీ, వాటితో కలిసి ఉండేటప్పుడు జీవులకీ ఈ మూడు దశలు ఉంటాయి. బంధ విముక్తుడైన జీవుడికి శాశ్వతమైన ఆనందాన్నిచ్చే దశ ఒకటి. ఈ నాలుగు దశలనూ కల్గించే ఏకైక తత్త్వమేదైనా ఉంటే దానిని "జగత్కారణము", లేదా "బ్రహ్మ"మని అంటారు.

కృష్ణయజుర్వేదానికి చెందిన తైత్తిరీయోపనిషత్‌లో ఈ విషయంలో స్పష్టమైన ప్రతిపాదన ఉంది. వరుణుడనే బ్రహ్మవేత్తను ఆతని కుమారుడైన భృగువు శిష్యుడై ఆశ్రయిస్తాడు. బ్రహ్మతత్త్వాన్ని గురించి తనకు తెలియచేయమని ప్రార్థిస్తాడు. తండ్రి కుమారుని శ్రద్ధకు సంతోషించి బ్రహ్మను ఎలా గుర్తించాలో చెపుతాడు. పరిమళాన్ని బట్టి పుష్పాన్ని గుర్తించినట్లు జగత్కారణత్వ లక్షణాలను బట్టి పరబ్రహ్మను గుర్తించాలి. ఆ లక్షణాలు నీకు చెప్తాను. నీవే అన్వేషిద్దువుగాని. **'యతో వా ఇమాని భూతాని జాయన్తే, యేన జాతాని జీవన్తి, యత్ ప్రయన్తి అభిసంవిశన్తీతి, తద్విజిజ్ఞాసస్వ, తద్బ్రహ్మేతి'.**

ఈ జగత్తుకి సంబంధించి కనిపించేవి, కనిపించనివిగ ఉన్న పదార్థాలన్నీ ఎవనివల్ల జన్మను పొందుతున్నాయో, అలా జన్మించి సత్తను పొందిన వాటినన్నింటిని భూతాలంటారు. ఈ భూతాలన్ని ఎవనివల్ల నిలకడను పొందుతున్నాయో, అంటే, రక్షణను పొందుతున్నాయో, తిరిగి వాటి పని అయిపోగానే ఎవ్వనిలో లీనమైపోతున్నాయో, అంతేకాకుండా ఈ జీవులందరూ ప్రకృతిబంధంలోకి ఇక తిరిగి రానక్కర్లేని మోక్షదశను ఎవ్వనివల్ల మాత్రమే పొందగలుగుతున్నారో అదే జగత్కారణమైన 'పరబ్రహ్మ'. 'పరమాత్మ'! దానినే బుద్ధిమంతుడైన ప్రతిమానవుడూ తెలుసుకోగోరాలి".

ఇది విన్న భృగువు ఈ లక్షణాన్ని గ్రహించి పరబ్రహ్మను అన్వేషించడానికి సిద్ధమౌతాడు. చాల ప్రయత్నం ఎన్నో రకాలుగ చేశాక, చివరకు నిత్య ఆనందస్వరూపుడే ఆ పరబ్రహ్మ. ఆతడే ఈ నాలుగు రకాలైన పనులు చేస్తూ జగత్కారణ మౌతున్నాడని నిరూపించి, తండ్రిగారైన వరుణుడి అనుగ్రహాన్ని పొందుతాడు, అక్కడ.

పైన తెలిపిన ఆకాశాదులకు గాని, ఇంద్ర, రుద్ర, బ్రహ్మాది పేర్లతో ప్రసిద్ధులైన దేవతలకు గానీ ఈ జగత్కారణత్వాది లక్షణాలు లేవు. కనుక మోక్షాన్ని కోరేవారికి అవేవీ ఉపాసించ తగినవి కావన్నారు వేదాన్తులు. సర్వ చేతనాలకూ, అచేతనాలకూ కూడా లోపల, బయట వ్యాపించి, నియమించే లక్షణము కలదిగ ప్రసిద్ధమైన జగత్కారణ తత్త్వము నారాయణుడే, **"అంతర్ బహిశ్చ తత్ సర్వం వ్యాప్య నారాయణస్స్థితః"** అంటూ వేదపురుషుడు ఎలుగెత్తి చాటాడు. అందుచే ఉపాసించదగిన నామము, తత్త్వమూ గూడ నారాయణుడే'నని నిర్ణయించారు. విశేషించి, శుక్ల

యజుర్వేదము ఈ నిర్ణయాన్ని మరింత స్పష్టంగ ప్రకటించింది. పృథివీ మొదలైన పంచభూతాలతో ప్రారంభించి మొత్తము పదార్థాలన్నింటినీ ఒక్కొక్కటిగ తీసుకొని నిరూపించింది. ఎలాగంటే పృథివికి లోపల నిలబెట్టే వాడు నారాయణుడు. దానికి అలా ఆతడున్నాడని తెలియనివ్వడు. ఆత్మశరీరాన్ని ధరించినట్లు, నియమించినట్లు, తనకోసమే ఆ ఆత్మశరీరాన్ని వాడుకున్నట్లు ఆ నారాయణుడు ఈ పృథివిని శరీరంగ కలిగి, తానే ఆత్మగ ఉండి దీనిని నిలబెడుతున్నాడు. ఆతడే నీకు కూడా అంతరాత్మగ ఉన్న అమృత స్వరూపుడు".

ఇలా, శుక్లయజుర్వేదానికి చెందిన బృహదారణ్యకమనే ఉపనిషత్తులో 3వ అధ్యాయము 7వ బ్రాహ్మణం ఈ విషయాన్ని మొదటినుండి చివరిదాక నిరూపించింది. **'యః పృథివ్యాం తిష్ఠన్, పృథివ్యా అంతరో, యం పృథివీ న వేద, యస్య పృథివీ శరీరం, యః పృథివీమంతరో యమయతి, ఏష త ఆత్మా, అంతర్యామ్యమృతః"** అంటూ అచేతనమైన పృథివిని శరీరంగ కలిగి ఉండి నిలబెడుతున్నాడీ అమృతస్వరూపుడైన అంతర్యామి, అని ప్రారంభించి సుమారు 22 వాక్యాలలో మొత్తం పదార్థాలనిన్నింటినీ చెప్పి చివరకు చేతనుడైన జీవునికి కూడా అలానే లోపల ఉండి నియమించి, ధరించే సర్వశరీరిన్నీ ఆ అంతర్యామియే అమృతస్వరూపుడే అని స్పష్టం చేసింది.

స్పష్టమైన పేరు, గుర్తులేకపోతే స్మరణయే సాగదు. వేదపురుషుడే ఈ అమృతస్వరూపుడెవరని కలిగే ప్రశ్నకు సృష్టికి పూర్వపు దిశను పరామర్శించి "నారాయణుడు" అని తేల్చింది.

**"ఏకో హ వై నారాయణ ఆసీత్, న బ్రహ్మా, నేశానః, న మే ద్యావా పృథివీ, నాంతరిక్షం"** ఈ జగత్తు, పృథివీ, ఆకాశము, ద్యులోకము మొదలైన భోగభూములుగను, బ్రహ్మరుద్రాది దేవతలు మొదలైన భోక్తలుగనూ రూపదిద్దుకొననిదశ ప్రళయదశ. ఆ స్థితిలో ఈ చేతనాలనీ, అచేతనాలనీ తనలో పెట్టుకొని ఉన్న తత్త్వము నారాయణుడొక్కడు మాత్రమేసుమా! తిరిగి సృష్టికాలం ఆసన్న మైనపుడు **"యోబ్రహ్మాణం విదధాతి పూర్వం యో వై వేదాంశ్చ ప్రహిణోతి తస్మై"**, తనలోంచే బ్రహ్మాది జీవులనూ, వారిని చెప్పే శబ్దరాశియైన వేదాలను వారు నివసించగల లోకాలను వెలికితీసి నిలబెట్టినాడని శ్రుతి తెలిపింది.

ఇలా, సృష్టి, స్థితి, ప్రళయాలు చేస్తూ జగత్కారణమైన నారాయణ తత్త్వాన్నే మోక్షప్రదాతగ విశ్వసించి ఉపాసించినవారు శుక్లయజుర్వేదులు, కనుక వారిని ఏకాయనులని, వారధ్యయనం చేసే శాఖ ఏకాయన శాఖ అనీ కీర్తించారు. చతుర్ముఖ బ్రహ్మయే స్వయంగ ఈ శుక్లయజుర్వేదులకి భగవదాజ్ఞతో పాంచరాత్ర దీక్షను ప్రసాదించాడు. బ్రహ్మద్వారా ఎందరో ఋషులు వేదాలను ఉపదేశం పొంది, ఆయా శాఖలకు ప్రవర్తకులయ్యారు. వారిలో ఔపగాయనుడు మొదలైన ఎనిమిదివేలమంది శుక్లయజుర్వేదానికి చెందిన కాణ్వశాఖను, మాధ్యందిన శాఖను ఉపదేశంగ పొందారు. మిగిలినవారు ఆయా వైదికానుష్ఠానాలను చేసుకొంటూ, తత్తత్ ఫలితాలను పొందుతూ ఆనందిస్తూ ఉండేవారు. అయితే పైన తెలిపిన ఔపగాయనాదులకు ఇతర ఫలితాలను పొందాలనే కోరిక కలుగలేదు. వారికి భగవంతుని చేరి, ఆయన సేవ చేసుకోవడమే మోక్షమనే జ్ఞానం కలిగి, ఆ రకమైన మోక్షం పొందాలనే తీవ్రమైన తపన ప్రారంభమైంది. వారు చతుర్ముఖుని చేరి, తమ ఆర్తిని తెలిపి, దానికి ఉత్తమమైన సాధనాన్ని తెలుపమని ప్రార్థించారు.

వారిపై కనికరించి బ్రహ్మవారికి అనుగ్రహించిన ఉపదేశమే 'శ్రీపాంచరాత్ర'మైంది. వారికి ఆయన ప్రసాదించిన శరణాగతి దీక్షయే 'శ్రీపాంచరాత్రదీక్ష' అయింది. ఆ దీక్షనిచ్చే క్రమాన్ని "మంత్రసిద్ధాన్త"మని వ్యవహరించారు.

ఆనాటి ఋషులకు బ్రహ్మయే స్వయంగ ఆ దీక్షనిచ్చి, ఇక పై వారు తమ తరువాతి తరాల వారికి ఈ పాంచరాత్ర దీక్షను మంత్రసిద్ధాన్తాన్ననుసరించియే ఇవ్వవచ్చునని అధికారమును కూడా యిచ్చాడు.

ఫలకాంక్షలేకుండా సర్వకర్మలూ భదవదారాధనగ చేసుకొంటూ సుఖమయ జీవితాన్ని గడపమని ఆదేశించడమే కాకుండా, వీరినాశ్రయించిన వారికీ అలా నిరాడంబరంగ జీవించడాన్ని అలవరచమన్నాడు. ఇలా ఉండే వారందరినీ 'భాగవతోత్తము'లని కీర్తించాడు కూడ. వీరందరూ ఏకాయనులే అయ్యారు. ఈ విషయాన్ని పాద్మసంహిత చర్యాపాదంలో 21వ అధ్యాయం చక్కగ వివరించింది.

భగవానుడే స్వయంగ బ్రహ్మగారికి ఇలాంటి దీక్షను శ్రద్ధాళువులకు యివ్వమని ఆజ్ఞాపించడమే కాక, 'తత్త్వనిర్ణయం చక్కగ చేసే శుక్లయజుర్వేదానికి చెందిన వారికే ఈ ఏకాయన దీక్షను స్వీకరించడానికి మొదటి అధికారం ఉంటుం'దని స్పష్టపరిచాడు, అదే పాద్మసంహిత చర్యాపాదం 1వ అధ్యాయంలో 2,3శ్లోకాలలో.అందుకే శ్రీపాంచరాత్ర దివ్యాగమ శాస్త్రానికి 'ఏకాయన'మనే పేరు చాల ప్రధానమైనది మాత్రమే కాక వైదిక వర్గంలో ఈశాస్త్రాన్ని పాటించేవారికి అగ్రాసనాన్ని అనుగ్రహించిన పేరుగ గూడ ప్రసిద్ధమైంది. *(సశేషం)*

# మన దర్శనం 'సు' దర్శనం

పూర్వమీమాంస
వైశేషిక
న్యాయ
యోగం
సాంఖ్య

వైశారదీ

గత సంచిక తరువాయి...

వివాహ వ్యవస్థను ఏర్పాటు చేయటం ద్వారా సహ జీవనాన్ని మనకి ఆర్యులు నేర్పించారు. అయితే ఇదంతా బాహ్య ప్రపంచానికి సంబంధించింది. అంత మాత్రానికే పరిమితమై పోతే వాళ్ళను మనం ఏనాడో మరిచిపోయి ఉండేవాళ్ళం. భౌతికానికి అతీతమైన ఆంతర ప్రపంచాన్ని గురించి కూడా వారు మనకు బోధించారు. ఎందుకంటే బయటి బ్రతుకు సరిగా లేకపోతే... చుట్టూ ఉండే సమాజానికి ఇబ్బందికరంగా ఉంటే ఆ చుట్టూ ఉండేవాళ్ళే వాడ్ని సంస్కరిస్తారు. ఈ మాత్రానికి ఎవ్వరూ చెప్పనక్కర్లేదు. ఇంతవరకూ పశువులకీ, మనుష్యులకీ పెద్ద తేడా అక్కర్లేదు.

తాను చేయవలసిన పని పూర్తిగా చేసినపుడే మనిషి మనిషిగా తన ఉనికిని నిలబెట్టుకోగలిగినవాడౌతాడు. 'ఆహార నిద్రా భయ మైథునాలు' పశువులకీ, మనుష్యులకీ సమానమే. ఒక్క జ్ఞానంవల్లే మనిషి తన వైలక్షణ్యాన్ని, గొప్పతనాన్ని నిరూపించుకోగల్గినవాడౌతాడు. ఆ జ్ఞానం కూడా మామూలుగా మనం అనుకుంటున్నట్లు ప్రాపంచిక విషయాలవరకే పరిమితం కాక అసలు వీటికన్నింటికీ మూలకారణమేమిటో, దానిని గుర్తించేంత వరకూ వెడితేనే సార్థకం అవుతుంది. గుర్తించడమనేది ఎప్పుడూ గుర్తించినట్లుగా ప్రవర్తించడానికి ఉపయోగపడాలి.

కేవలం తెలివి తెలివికోసమైతే, పుస్తకానికి, క్యాసెట్‌కి, మనిషి మెదడుకి ఏం తేడాలేదు. ఓరకంగా ఆలోచిస్తే ఈ మెదడుకంటే అవే నయమేమో కూడా! అవి వాస్తవాన్ని మార్చవు. వక్రభాష్యాలు చేయవు. అడిగినవాడికి ఉన్నదున్నట్టు బద్ధకించకుండా తెలియచేస్తాయి. లేకపోతే తమ మానాన అవి పడుంటాయి. అందుకే నిరుక్తాన్ని రచించిన యాస్కాచార్యులు అనే మహానుభావులు మనిషి అంటే ఏమిటో చెప్తూ **"మత్వా కర్మాణి సీవ్యతి"** అన్నాడు. పరిస్థితులను, స్వశక్తిని, అవసరాన్ని ఆలోచించి తన యోగ్యతకి తగినట్లుగా తన తన విధులను నెరవేర్చువాడే మనిషి అన్నమాట! 'సీవ్యతి' అంటే కుట్టుట అని అర్థం. ఓ పెద్దగుడ్డను ధారణయోగ్యమైన రీతిలో కుట్టడానికి వీలుగ కత్తిరించిన తర్వాత చిందరవందరగా చెదిరివున్న గుడ్డముక్కలని ఆకర్షణీయమైన గౌనుగానో, చొక్కాగానో మరోరకంగానో తీర్చిదిద్దే పనిని 'సీవనము' లేదా 'అమరికగ' కుట్టుట అంటారు.

ప్రపంచంలో తృప్తిలేని జీవనం మనుష్యులది. ఉదరపోషణే లక్ష్యం జంతువులది. నిస్స్వార్థ ప్రవృత్తిగలవి స్థావరాలు. వీటి నడుమ మనుగడ సాగించాలి మనిషి. వీటన్నింటికీ అనుకూలంగా ప్రేమమయమైన జీవితాన్ని సాగించ నేర్వడమే 'బట్ట కుట్టడంలాంటిది'. కుట్టడం వల్ల వస్త్రంలోలేని కొత్త అందాలు పైకి ప్రకాశిస్తాయి. అలాగే తన జీవన విధానాన్ని తన ఆలోచన ద్వారా క్రమబద్ధం చేసుకుని ప్రేమమయమైన జీవితం గడపగలవాడెవడో వాడే 'మనిషి' అలా బ్రతక నేర్చినవాడే లోకానికి ఆదర్శ పురుషుడౌతాడు.

మనచరిత్రగ్రంథాలు ఉత్తమపురుషుడిగా శ్రీరాముడిని గుర్తించాయి. తన ప్రవృత్తి చేత అందరి ప్రేమను పొందాడు. మంచి మనసుతో మనుష్యుల్ని, జంతువుల్ని, రాక్షసుల్నీ కూడా చూశాడు. కనుకనే మనుష్యులేమి... కోతులు, ఎలుగుబంట్లు లాంటి జంతువులేమి... రాక్షసులేమి! అంతా అతడ్ని ప్రేమించారు. అంతెందుకు....? ముక్కు, చెవులు కోయించు కున్న శూర్పణఖ సైతం నోరు తెరిచి తిట్టలేక పోయింది. "తరుణౌ... రూప సంపన్నౌ..."అంటూ ప్రేమ పలుకులే ఒలక బోసింది. చావుదెబ్బలు తింటూ రావణుడు కూడా... "రంజనీయస్య విక్రమైః" అంటూ అప్రయత్నంగానే పొగిడాడు.

రాముడు దూరమైతే చెట్లు ఎండాయిట.... నీళ్ళు మరిగాయిట! ఇదీ... మనిషంటే! ఇలా బ్రతకాలి! తన ప్రేమవల్ల అందరి ప్రేమను దోచుకోగలిగాడు. తన విధిలో లోపం చేసుకోలేదు. ఇదీ కుట్టడం లాంటిది. తన పనులను ప్రపంచమనే వస్త్రాన్ని కుట్టడానికి చిత్తశుద్ధితోటి వినియోగించాడు. "మనిషైన ప్రతివాడు అలాగే శక్తివంచన లేకుండా పాటుపడాలి" అనేది యాస్కాచార్యులవారి ప్రబోధం. అలా కృషిచేసినవారే ఆర్యులు. అక్కడ జాతి, కుల, మతం చూడాల్సిన అవసరమేలేదు.

సీత హనుమంతుణ్ణి లంకలో చూసినపుడు ఒక సందర్భంలో "ఆర్యా!" అని సంబోధించింది. "కార్యం కరుణం ఆర్యేణ..." "ఈ రాక్షస స్త్రీలపై దయచూపు... నువ్వు పూజ్యుడివి కదా...!" అంటుంది. దీన్నిబట్టి చూస్తే ఆర్య, ద్రావిడ విభాగం 'సరియైనది కాదు' అని మనకి స్పష్టపడుతోంది.

ఈ ప్రపంచానికి మూలకారణాన్ని అన్వేషించడానికి తమ జీవితాలను ధారపోసినవాళ్ళు ఆర్యులు, లేదా, ఋషులైనారు. కన్పించే చిత్రవిచిత్రమైన ప్రపంచంతోపాటు ఇంతకంటే మహాద్భుతమైన కంటికి కన్పించని మరో ప్రపంచం వుందని వాళ్ళు విన్నారు. బాహ్య ప్రపంచాన్ని అలా వుంచినా, అసలు మనిషిలోంచే అనూహ్యమైన ప్రవృత్తులు బయల్దేరుతున్నాయి. అంటే ప్రతి శరీరంలో ఈ కారణతత్త్వం ఉండి ఉంటుంది.

"అదేమిటి? ఎలావుంది? ఎందుకుంది? అసలేం జరుగుతోంది? ఎప్పట్నించి ఇలా జరుగుతోంది? ఈ చుట్టూ కన్పించే ప్రపంచంయొక్క వాస్తవస్వరూపం ఏమిటి!?" - ఇలాంటి ప్రశ్నల పరంపర వాళ్ళ మనసులని మథించింది. తెలుసుకోవాలనే తపన బయల్దేరింది.

ఆర్యులైన ఋషులు ఈ కన్పించే ప్రపంచానికి చెందిన, కన్పించని లోకాలకి చెందిన యథార్థ స్వరూపాన్ని దర్శించటం కోసం కొన్నివేల సంవత్సరాలపాటు కఠోరమైన తపస్సులు చేశారు. ఆ స్థితిలో ఎన్నో అద్భుతమైన రహస్యాలను చూడగలిగారు. చూసినవాటిని యథాతథంగా తమ దగ్గరకి చేరిన జిజ్ఞాసువులకి అందించారు.

### క్రాంత దర్శిత్వమే ఋషిత్వం

**'ఋషి'** అనగానే బారెడు గడ్డం-మీసాలతోటి... జడలు కట్టిన కేశపాశాలతోటి... ఇలాంటివేవో కొన్ని ఆకారాలు మన భావనా ప్రపంచంలో మెదుల్తాయి. ఋషికి అది కూడా ఒక లక్షణం అయితే కావచ్చును. కాని వాస్తవానికి **'ఋషి'** అంటే **'క్రాంత దర్శి'**. ఉన్నదానిని ఉన్నట్లు చూచి చెప్పగల వాడని అర్థం.

బయటి ప్రపంచంలోని వస్తువుల్ని చూసినంత స్పష్టంగా, లోపలి ప్రపంచంలోని వస్తువుల్ని కూడా చూడడానికి ఆ మహానుభావులు ఎంతకాలం ఎన్నిరకాలుగా శ్రమించారో వర్ణించలేం. తమ శ్రమ ఫలితంగా, అనుభవ సారంగా ఆ ఋషులు తెలియచెప్పిన విషయాలు ఎంతో అందంగానూ, స్పష్టంగానూ ఉంటాయి.

అలాంటి ఋషులు లెక్కకు మించి ఈ భారతభూమి లోంచి బయలుదేరి ప్రపంచానికి వాస్తవిక తత్త్వాల గురించి తెలియజేశారు.

అయితే వీరిలో కొందరు ఋషుల చరిత్ర అంత సవ్యంగా ఉన్నట్టు మనకనిపించదు. ఆ చరిత్ర మాత్రమే విని, వారిని వేలెత్తి చూపడంతోటే తృప్తి పడుతున్నారు చాలమంది ఈ రోజుల్లో. వారందించిన జ్ఞానమెంత గొప్పదో గుర్తించరు. ఇది దురదృష్టకరం. విదేశీయులెవరో మన ఋషులందించిన జ్ఞాన భాండాగారాన్ని తరచి తరచి చూసి "ఆహా!" అనుకుంటూ పొంగిపోతూ, "విలువైన ఇంత జ్ఞానాన్ని వీరెలా సంపాయించ గలిగారు... ఏ వైజ్ఞానిక సాధనమూ లేకుండా...!" అని ఆశ్చర్యంతో ముక్కున వ్రేలేసుకుంటున్నారు. వైదేశికులు అయిన వారు ఈ ఋషులు చూపిన తత్త్వాలను అర్థం చేసుకొని వారి భాషల్లో అనువదించి ఇస్తే మనం గుర్తించేస్థితిలో ఉన్నాం. అసలు మనం ఈనాటి పరిస్థితినిబట్టి వాళ్ళని చూస్తున్నాం కాని, ఆనాటి స్థితిగతులు, పరిస్థితుల ప్రభావం ఎలాంటివో అవగాహన చేసుకోలేం. అలా అవగాహన చేసుకున్న వాళ్ళకి తప్ప ఆయా ఋషులయొక్క ఆంతర్యం, ప్రవర్తనా రీతులు బోధపడటం కష్టం! *(సశేషం)*




వైశారదీ

### ప్రజారంజకుడు కావాలి పాలకుడు:

ఉత్తమ పరిపాలకులు ప్రజలకి తామందించే పరిపాలనను ప్రజారంజకముగా ఉండాలని, అది ధార్మికముగా సాగాలని కోరుకొంటారు. దేశప్రయోజనాన్ని కాపాడుకొంటూ, అభివృద్ధిని కొనసాగించడముతోపాటు తమ ప్రజల సుఖసంతోషాలను గూడ గమనిస్తుంటారు. దీనినే రాజ్యోపాసన అంటారు. రాముడు అలా పాలించేవాడని వాల్మీకి భగవానుడు చెప్పుతాడు శ్రీరామాయణములో. అలాంటివారి చరిత్రయే లోకంలో కలకాలం నిలచిపోతుంది.

తన అభిప్రాయాలను ప్రజలపై రుద్దడము కాక ప్రజలలోనే ఆ రకమైన అభిప్రాయాలు నెలకొనేటట్లు ఉత్తమ పాలకుడు చేస్తాడు. ఉత్తమపరిపాలకుణ్ణి చారచక్షువు అంటారు. అనేకమంది చారులు ప్రచ్ఛన్నవేషంలో ప్రజలమధ్య తిరుగుతూ, వారి అభిప్రాయాలను తెలుసుకొంటూ ఎప్పటి కప్పుడు రాజుకు చేరవేస్తే, దానిని బట్టి తన పాలనలో ఉండే లోటుపాటులను సవరించుకొంటూ, అవసరమైనవి సమకూర్చు కుంటూ అంటే – దేశాన్ని, ప్రజలయొక్క మనస్సులని గూఢచారుల ద్వారా చూస్తాడు. కనుక, రాజు చారచక్షువు.

కేవలము అటువంటి చారులమీదే ఆధారపడి, వారు చెప్పినదే నిజమని నమ్మి, నిర్ణయాలు తీసుకోవడము, పాలన సాగించడమూ అన్నివేళలా శ్రేయస్కరము కాకపోవచ్చు. వారందించే సమాచారపు నిజానిజాలను పరిశీలించవలసి ఉంటుంది గదా! దానికోసం తాను గూడ స్వయముగా విషయపరిశీలన సాగించవలసి ఉంటుంది.

ఆ విధముగా నిగ్గుతేలిన వాస్తవాన్నే నిర్ణయాత్మకముగా అమలు పరచవలసి ఉంటుంది. అలాంటి పరిపాలకుడే తన పాలనలోని దేశానికీ, ప్రజలకూ గూడ న్యాయమును కూర్చులుగుతాడు. ఆపనిని శ్రీరాముడు చేసేవాడని వాల్మీకి "రామో రాజ్యముపాసిత్వా...." రాముడు తన ప్రజలను ఉపాసించెను అని అపూర్వముగా చెపుతాడు.

పాండ్యదేశపు రాజైన వల్లభదేవరాయలు ఆ విధముగా పరిపాలించి ఉత్తమ పరిపాలకుడయ్యాడు. ధార్మిక విషయాలలో సలహాలు ఇవ్వడానికి కొందరు, లౌకిక విషయాలలో సలహాలు ఇవ్వడానికి కొందరు వేరే వేరే మంత్రులు రాజాస్థానములో ఉండేవారు.

వారి వైదికమంత్రివర్గములో ప్రధానుడు 'శెల్వనంబి' అనే మహానుభావుడు. చక్కటి శాస్త్రపరిజ్ఞానముతోపాటూ సత్సంప్రదాయనిష్ఠగూడ కలిగినవాడు. వల్లభదేవరాయులు తరచు తన ప్రజల కష్టసుఖాలను తెలుసుకోవడానికీ వారి మనోగతాన్ని పరిశీలించడానికి, చారులు అందించే సమాచారం మీదే ఆధారపడకుండా తాను కూడా ప్రచ్ఛన్నవేషములో తన రాజ్యములో సంచరిస్తూండేవాడు. తరచూ అమాత్య శెల్వనంబిని తనకు తోడుగా తీసుకొని వెళ్ళుతూండేవాడు. అలా వెళ్ళినప్పుడు ఆ రాత్రి కనపడిన ఇరువురు బాటసారులూ చెప్పిన "పరజన్మలో సుఖానికై ఈ జన్మలోనే ప్రయత్నించు కోవలసి ఉంటుంది సుమా!" అనే సందేశం రాజును తీవ్రముగా ఆలోచింపచేసింది.

### పరతత్త్వ సభకు పూర్వరంగం :

మన అందరిని నడిపించే ఆ పరతత్త్వమేమిటో? తెలుపమని రాజు శెల్వనంబిని ప్రశ్న వేశాడు. ప్రాజ్ఞుడైన శెల్వనంబి తనకీ విషయము తెలిసినా వెంటనే తెలుపలేదు. తాను ఒక నిర్ణయాన్ని తెలిపినా దానిని స్థిరపరచుకోవడానికి రాజు మరొకరినెవరినైనా తిరిగి అడుగవచ్చు. ఈ విధముగా రాజుకి తెలియాల్సినటువంటి విషయము బహుముఖమై పోవచ్చు. ఏది తగినదీ, ఏది వాస్తవమూ అని నిర్ణయించే పండితులు వారి వారి అభిప్రాయాలకి అనుగుణముగా వాదనలు జరిపి రాజును తప్పుదారిని పట్టించే ప్రమాదము కూడా లేకపోలేదు. ఇవన్నీ లేకుండా చేయాలంటే నిర్దుష్టమైన విషయమేదో అది నిర్ణయాత్మకముగా రాజుకి తెలియపరచ వలసి ఉంది. దానికి సాధనము విద్వత్సభ అని ఆలోచించి మంత్రి రాజుతో "అతి గంభీరమైన ఈ విషయాన్ని సభా ముఖముగా తెలుసుకోవడమూ ప్రభువుల పరిపాలనలో ఉండే

ప్రజానీకానికి అంతకూ తెలియచేయడము ఎంతైనా సముచిత"మని మంచి సలహా ఇచ్చాడు.

మరునాడు రాజు, ఈ విషయాన్ని సభలో ప్రస్తావన చేసి "సమస్త ప్రపంచాన్ని ప్రాణికోటిని పరిరక్షించే పరతత్త్వ మేమిటి?" అని ప్రశ్నవేశాడు. ఎవరికి తోచిన సమాధానాలు వారు చెప్పారు. కొందరి వాదనలను మరి కొందరు పూర్వపక్షము చేశారు. మరికొందరు తమకు తోచిన రీతిలో సిద్ధాంత ప్రవచనాలు చేశారు. ఏ ఒక్కరి వాదాన్ని అందరు అంగీకరించేటట్లు కనిపించలేదు. అక్కడ చేరినవారే కాక జగత్ప్రసిద్ధులైన ఇతర పండితులను రావించీ ఒక సభ చేయడము అవసరమని మంత్రులంతా సలహా ఇచ్చారు రాజుకి.

**విద్యాశుల్కం ఏర్పాటు :**

అయితే అప్పుడుమాత్రం వారు వారు చెప్పినదే సిద్ధాన్తమా? కాదా? అనేది నిర్ణయము ఎట్లా? వాదము పనికిరానిదైనా వాది బుద్ధిమంతుడైతే తాను పట్టిన కుందేటికి మూడే కాళ్లని నిరూపించవచ్చు. ఉత్తమమైన వాదమే అయినా వాది దుర్బలుడైతే తన వాదాన్ని సమర్థవంతంగా నిరూపించు కోలేకపోవచ్చు. ఈ ఇబ్బంది కూడా లేకుండా చేయాలంటే విద్యాశుల్కాన్నొక దాన్ని ఏర్పాటు చేసి ఒక మూటలో అపారరత్నరాశులను నింపి దానిలో సర్వదేవతలను ఆవాహన చేసి పరమవైదిక సిద్ధాన్తాన్ని సప్రమాణముగా నిరూపించినవారి ముందర ఆ ధనపురాశి ఊడి పడవలెనని మంత్రి సలహామేరకు రాజు నిర్ణయము తీసుకొన్నాడు.

భారతదేశములోని అన్ని మూలలకు ఆహ్వానాలు వెళ్ళాయి. ఉద్దండపండితులంతా తమ తమ వాదపాటవముతో తత్త్వనిర్ణయం చేసి అపారధనరాశులను సొంతము చేసుకోవాలని ఉవ్విళ్ళూరుతూ మదురైపట్నానికి చేరారు. వాదనలారంభమై నెలలు గడుస్తూన్నా ఎవ్వరి వాదనా దేవతలకు నచ్చలేదో ఏమిటో, ఆ ధనపురాశులు మాత్రం చలనం లేకుండా అలాగే పెట్టినచోటిలోనే ఉండిపోయాయి. రాజుకి ఆవేదన అధికమైనది ఇందరు పండితులు ఇంతకాలము వాదనలు కొనసాగించినా పరతత్త్వమేమిటో నిర్ణయము చేయలేకపోతున్నారే! ఆ రాత్రి కనపడిన బాటసారులనే అడిగి ఉండవలసినది అనుకొంటూ రాజు చింతాక్రాంతుడైనాడు. రోజులు గడుస్తూన్నాయి. మృత్యువు దగ్గరికొస్తోంది. ఆ మృత్యువు ఎంత దగ్గరిలో ఉందో తెలియదు. కానీ దాని బారిని పడేలోపు ఏలాగైనా తత్త్వాన్ని తెలుసుకోవాలనే పట్టుదల మాత్రము పెరుగుతోంది. కాని ఎలా?

**భగవన్నిర్ణయం, ఆశారేఖ:**

పాండ్యదేశానికి పవిత్రతను కలిగించిన దివ్యదేవాలయము ఒకటి శ్రీ విల్లిపుత్తూర్‌లో ఉన్నది. అక్కడ ఆరాధ్యుడైన దైవానికి "వటపత్రశాయి"అనిపేరు. ఆయననే "వడపెరుంకోయిలుడైయాన్" అని పిలుస్తారు.

మధుకైటభ సంహారము చేశాక అలసిన పరమాత్మ ఇక్కడ చేరి, ఇక్కడి చంపకారణ్యపుచెట్ల క్రింద విశ్రమించాడట. దీర్ఘకాలము యోగనిద్రాపరవశుడైన ఆ పరమాత్మపై పుట్టలు వెలిశాయట, ఈ ప్రాంతాన్ని పరిపాలించే 'విల్లి' అనే ఒక మహారాజుకి స్వప్నములో పాలకడలిలో ప్రళయసాగరాన లోకాలన్ని బొజ్జలో దాచి కాపాడిన పరమాత్మ దర్శనమిచ్చి, ఇక్కడ పుట్టలో తానున్నానని తెలియచేశాడట. రాజు ఆ పుట్టను కనిపెట్టి అందులోని భగవన్మూర్తిని దర్శించి ఆశ్చర్యపడ్డాడు. ఇక్కడ ఒక చక్కటి ఆలయము కట్టి భృగు-మార్కండేయ మహర్షులను ప్రార్థన చేసి ఆరాధనా విధానాన్ని ఏర్పరచాడు. విల్లి మహారాజు, పుట్టను ఆధారముగా చేసుకొని నిర్మించిన ఊరు కావడముచే "విల్లిపుత్తూర్" అని ప్రసిద్ధమైనది.

ఈ ఊరులో నిష్ఠాగరిష్ఠులైన సేవాపరులెందరో పరంపరగా ఆ స్వామిసేవలో నియుక్తులయ్యారు. సేవానిష్ఠులైన అలాంటి పరంపరలో మాలాకైంకర్యానికి నియుక్తులైన కుటుంబానికి చెందినవారు శ్రీవిష్ణుచిత్తులు. వీరు పూరశ్ఛూడులు, అంటే వీరికి శిఖ, శిరస్సున వెనుకవైపుకాక తలకిపై భాగంలో ఉంటుంది. శాస్త్రీయమైన చదువు ఏమి లేకపోయినా పరిపూర్ణ విశ్వాసముతో భగవత్కైంకర్యము చేసు కొంటూవస్తూన్న కుటుంబం వీరిది. వీరు భగవంతుణ్ణే సంతానముగా భావించుకొని పూర్తిగా భగవత్సేవలోనే ఉంటూ జీవితాన్ని తృప్తిగా గడిపేవారు. విశాలమైన తులసీవనాన్ని పెంచి తుమ్మెదలకు విహారస్థలమనదగిన తేనెలూరు తులసీ దళములను, తామే స్వయముగా, తులనలేని మాలికలుగాగ్రుచ్చి వటపత్రశాయికి రోజూ అర్పించడము వీరి కైంకర్యము. (సశేషం)




**వే**దాలలో తత్త్వవివేచన, నిర్ణయము చేసే భాగాన్ని ఉపనిషత్తులని అంటారు. ప్రతి వేదశాఖకు కొన్ని ఉపనిషత్తులు ఉంటాయి. యజుర్వేదానికి 101 శాఖలున్నాయట. దానిని ప్రధానంగ రెండు భాగాలుగ వ్యవహరిస్తారు. 1.శుక్లయజుర్వేదము, 2.కృష్ణయజుర్వేదము, అని. వీటిలో 16 శాఖలు శుక్ల యజుర్వేదానికి, 85 శాఖలు కృష్ణయజుర్వేదానికి ఉండేవట. కానీ ప్రస్తుతము, కృష్ణయజుర్వేదం మొత్తం మీద 3,4 శాఖలు మాత్రమే లభిస్తున్నాయి. శుక్లయజుర్వేదంలో రెండుశాఖలు వినిపిస్తున్నాయి. ఒకటి మాధ్యందిన శాఖ. రెండవది కాణ్వశాఖ. మొదటిది ఉత్తరభారతావనిలో ప్రసిద్ధి చెందింది. కాణ్వశాఖను దక్షిణభారతావనిలో విశేషంగ అధ్యయనం చేస్తూంటారు.

బృహదారణ్యకోపనిషత్తు, ఈశావాస్యోపనిషత్తు ఈ శుక్లయజుస్సుకు సంబంధించిన ఉపనిషత్తులని గతంలోనే తెలుసుకున్నాం గద! 40 అధ్యాయాలున్న సంహితాభాగానికి చెందిన చివరి అధ్యాయము ఈ వేదంలో ఈశావాస్యోపనిషత్తుగ లభిస్తోంది. మాధ్యందిన, కాణ్వశాఖలలో రెంటిలో ఈ ఉపనిషత్తు సమానంగానే ఉన్నా కాణ్వశాఖలో 18 మంత్రాలున్నాయి. మాధ్యందిన శాఖలో 17 మంత్రాలు మాత్రమే ఉన్నాయి. కాణ్వశాఖకు చెందిన పాఠాన్నే మన పెద్దలందరూ స్వీకరించి వ్యాఖ్యానములతో దానిని సంభావించారు. కనక మనమూ ఆ మార్గంలోనే సాగుదాం.

18 అధ్యాయాలున్న శ్రీకృష్ణభగవానుని మహోపదేశమైన భగవద్గీత సర్వవేదసారమూ, సర్వోపనిషత్సారమూ కూడా అయినట్లే 18 మంత్రాలున్న ఈశావాస్యోపనిషత్తు గూడ సమస్తవేదాన్తసారాన్ని మనకందిస్తోంది. సంగ్రహంగ దానిని పరిశీలిద్దాం.

ప్రతి ఉపనిషత్తుకు ముందూ, చివరగూడ దానికి తగిన ఒక శాన్తి మంత్రాన్ని స్మరిస్తూంటారు. ఈ శుక్లయజుర్వేదాన్ని అధ్యయనం చేసేటపుడు తలచే శాన్తిమంత్రం “పూర్ణమిదం...” అనేది. ముందుగ ఈ శాన్తిమంత్రాన్ని స్మరించి పూర్వాచార్యులు ప్రస్తావించిన క్రమంలో దాని అర్థాన్ని తెలుసుకుందాం!

**ఓమ్ పూర్ణమిదం పూర్ణమదః పూర్ణాత్ పూర్ణముదచ్యతే**
**పూర్ణస్య పూర్ణమాదాయ పూర్ణమే వావశిష్యతే**

**ప్రతిపదార్థము:**

**ఇదం** = ఇది, అంటే, అతి సమీపమునందున్న బ్రహ్మ తత్త్వము, అంతర్యామి స్వరూపము.

**పూర్ణం** = అన్ని విధముల నిండుదనం కలిగి ఉన్నది.

**అదః** = అది, అంటే, అంతటా వ్యాపించి ఉండటం వలన అన్నింటికీ ఆవలనున్న బ్రహ్మతత్త్వము, పర స్వరూపము.

**పూర్ణం** = అన్ని రకములుగ నిండుదనం కలిగి ఉన్నది.

**పూర్ణాత్** = ఆ పరస్వరూపమునుండి

**పూర్ణం** = నిండుదనము కలిగి విరాజిల్లు వ్యూహమనే బ్రహ్మ తత్త్వము

**ఉదచ్యతే** = ఏర్పడుచున్నది. ఇది వాసుదేవ, సంకర్షణ, ప్రద్యుమ్న, అనిరుద్ధ అనెడి పేర్లతో నాలుగు స్వరూపములలో నుండును.

**పూర్ణస్య** = పరిపూర్ణమై విరాజిల్లు ఆ వ్యూహమునకు సంబంధించిన

**పూర్ణం** = బహుముఖముగ వెలువడు గుణపూర్ణములగు విభవావతారములను

**ఆదాయ** = ఆధారముగ చేసుకొనిన

**పూర్ణం ఏవ**=బ్రహ్మతత్త్వమైన అర్చావతారము, అన్ని విధముల నిండుదనము కలదైయ్యే

**అవశిష్యతే** = విరాజిల్లుచున్నది.

ఉజ్జీవించగోరు మానవుడు భగవత్తత్త్వాన్ని ఎలా తెలుసుకోవాలి? ఎలా ఉపాసించాలి? ఎక్కడ ఉపాసించాలి మొదలైన విషయాలను ఈ శాంతి మంత్రము స్పష్టం చేస్తోంది.

అసలు భగవంతుడనే తత్త్వం ఎలా ఉండాలి? పూర్ణమై ఉండాలి. అంటే, నిండుదనం కలిగి ఉండాలి. దేనితో నిండుదనం కలిగి ఉండాలి? పై మంత్రంలో 'దీనితో పూర్ణుడు, దానితో పూర్ణుడు,...ధనంతో పూర్ణుడు, హోదాతో పూర్ణుడు'... ఇలా హద్దేమీ పెట్టి చెప్పలేదు. "ఆయన పూర్ణుడు" అంటూ సామాన్యముగానే చెప్పినందువల్ల 'అన్నింటితో, అన్నిరకాలుగ, అన్ని సమయాలలోనూ పూర్ణుడే' అని తెలిపినట్లైంది.

ఒక ప్రాంతంలో ఉండి, మరో ప్రాంతంలో లేడంటే, అది పూర్ణత కాదు కద! అంటే ఆ భగవంతుడు ఏ పరమ పదానికో, పాలకడలికో, ఒక పట్టణానికో మాత్రమే పరిమితుడు కాడన్నమాట. **అంతర్బహిశ్చ తత్సర్వం వ్యాప్య ...** అని వేదాలు ఉపదేశించినట్లు, **"ఇందుగలడందు లేడని సందేహము వలదు.... చక్రిసర్వోపగతుండు"** అని మహానుభావులైన భక్తకవులు తెలిపినట్లు, దేశపరమైన హద్దులు ఆతనికి లేవు. తన స్వరూపము చేత, ఆకృతి విశేషములచేత కూడా పూర్ణుడని అర్థము.

సౌందర్యముచే పూర్ణుడు, దయతో పూర్ణుడు, వాత్సల్యముతో పూర్ణుడు.... ఇలా ఫలానా గుణములతో అని పూర్ణత్వాన్ని పరిమితి పెట్టి చెప్పలేదు కనుక సకల కళ్యాణగుణములకూ ఆ భగవంతుని తత్త్వము పుట్టినిల్లు. అలాంటి గుణాలు "ఇన్ని" అని చెప్పలేకపోవడం వల్ల సాగరము వలె అనంతములు అని తెలుస్తోంది. కళ్యాణగుణగణములకు ఆ తత్త్వము ఒక అద్భుతసాగరము, కనుక గుణపూర్ణము.

ఆ గుణములను ప్రకాశింపచేయడానికే ఉంటాయి అన్నట్లు ఆయన దాల్చే అవతారాలు గుణాలెన్నో చెప్పలేనట్లే ఆయన అవతారాలు కూడా 'బహూని' అన్నట్లు ఎన్నో చెప్పలేమంటాయి మహర్షుల శ్రీసూక్తులు. గుణాలకు అంతం లేదన్నప్పుడు, ఆ గుణాలకాధారమైన అవతారాలు గూడ అనంతాలు, లెక్కకు మీరినవి అనే గద తెలుస్తోంది. అంచేత ఇవీ పూర్ణమే. అంటే స్వరూపము చేత, ఆకారవిశేషం చేత, గుణములచేత, తన సంపదలైన అవతారములవంటి విభూతుల చేత కూడ ఆ భగవత్ తత్త్వము పరిపూర్ణమే అని పై 'పూర్ణం' అనే పదం స్పష్టం చేసింది.

బ్రహ్మతత్త్వాన్ని ఇలా తెలుసుకోవడమే తగును తప్ప మరో రకంగ కాదు. **'విజ్ఞాతం అవిజానతాం'** చక్కని విశదతమమైన జ్ఞానం కల మహానుభావులు ఎంత తెలుసు కున్నా 'ఆతడింకా అందనివాడే, తెలియదగినవాడే, పూర్తిగ ఎవ్వరి తెలివికీ అందనివాడే మాకు ఆతని గురించి ఏమీ తెలియదు అంటారు. వారే తత్త్వాన్ని వాస్తవంగ గుర్తించిన వారు.

**'అవిజ్ఞాతం విజానతాం'** మాకాతని గురించి అంతా తెలిసిపోయింది. ఇక్కడ పరమపదంలో లేదా పాల్కడలిలో, ఇలా నాలుగు చేతులతో, శేషపాన్పుపై వేంచేసి ఉన్నవాడు మాత్రమే అంటూ తెలివిని ప్రదర్శించేవారికి ఆతని తత్త్వమేమీ తెలియదని అర్థం అంటుంది కేనోపనిషత్తు.

వేదాలన్నీ ఆ భగవత్ తత్త్వాన్ని **'యతో వాచో నివర్తన్తే, అప్రాప్య మనసా సహ'** అంటూ "వాక్కుగానీ, మనస్సుగానీ ఆ తత్త్వాన్ని ఇంత, ఇలా అని గుర్తించలేక వెనుదిరిగినవి. ఆయన వీటికన్నిటికీ అతీతుడు. ఆయన పూర్ణతకు హద్దనేది లేదు" అనే చాటాయి.

ఈ పూర్ణతను చెప్పేదే శ్రీవిష్ణుసహస్రనామంలోని మొదటిపదం **"ఓం విశ్వాయ నమః"** అనేది.

అక్కడ వేదాలలో **'పూర్ణం'** అనే పదముతో తెలిపిన నిండుతనమునే, శ్రీవేదవ్యాసభగవానుడు శ్రీమన్మహాభారతంలో **'విశ్వం'** అనే పదముచేత ఈ సహస్రనామాధ్యాయములో ప్రస్తావించాడు. దేశసంబంధమైన హద్దులు, కాలసంబంధమైన హద్దులు, ప్రకారసంబంధమైన హద్దులు లేనివాడు. తన స్వరూప, రూప, గుణ, విభూతులతో పూర్ణుడై ఉండేవాడు అని తెలిపి, అదెట్లానో ఆ పై 999 నామాలలో వివరించాడు. ఒక్కొక్క నామమూ ఒక్కొక్క రకమైన పూర్ణతను పక్రాశింపచేస్తున్నదని గుర్తించాలి.

శాన్తి మంత్రంలో ఉండే 'పూర్ణం' అనే పదం భగవంతుని తత్త్వాన్ని ఇలానే తెలుసుకోవాలని శాసిస్తోంది. అయితే ఉపాసన చేసేవారి సౌకర్యం కోసం ఆ తత్త్వం విగ్రహరూపాన్ని గూడ ధరించి దర్శనమిస్తూ ఉంటుంది. అలా వేంచేసి ఉన్న మూర్తులే పరమపదంలో శ్రియాది సమేతుడైన పరవాసుదేవుడు, పాల్కడలిలోని అనంతశయనుడు మొదలైనవన్నీను. *(సశేషం)*



# శ్రీరామాయణము



ఎ. ఉషశ్రీ- శ్రీరాంనగర్

శ్రీరామాయణం పైకి శ్రీరాముని చరిత్రను తెలిపే గ్రంథమని అనిపించినా, దాని తాత్పర్యాన్ని ఆసాంతము తరచి చూచిన మన పెద్దలు అది అమ్మ వైభవాన్ని తెలియచేసే ఉత్తమ గ్రంథంగ పేర్కొన్నారు. వాల్మీకి మహర్షి ఈ చరిత్రను రచించేటపుడు కూడా అలానే పేర్కొన్నాడు. 'సీతాయాశ్చరితం మహత్' అని గతంలో మనం తెలుసుకున్నాం. ఇందులో శ్రీరామునికెంత ప్రాముఖ్యం ఉన్నదో, సీతమ్మ తల్లికీ అంతే ఉన్నది. ఇంకా చెప్పాలంటే అంతకంటే అధికముగానే అమ్మ వైభవమీ గ్రంథంలో మనకి తెలుస్తోంది. ఆమె రామునితో అడవికి వెళ్ళిఉండకపోతే శ్రీరాముని అవతారమే నిష్ప్రయోజనమూ, 'అసరసమభవిష్యన్' రసహీనమూ అయి ఉండేదంటారు, శ్రీపరాశరభట్టర్. అందుకే ముందుగ నడిచేస్తా నంటూ బలవంతం చేసి మరీ బయలుదేరింది, సీతమ్మ అడవికి.

మరి, ముందు నడుస్తానన్న ఆమె అడవిలో పయనించేటపుడు 'సీతా మధ్యే సుమధ్యమా' అంటూ మధ్యలో ఎందుకు నడిచినట్లు? అడవిని చూడగానే భయంవేసి ఉంటుందా? అయి ఉండకపోవచ్చు. ఆమెయొక్క కోమలత్వాన్ని తెలిసిఉన్నవారే ఇరువురు అన్నదమ్ములూ కనుక, పెద్దవాడు శ్రీరాముడు ముందుండి దారిచేసాడు. చిన్నవాడు లక్ష్మణస్వామి వారిని వెన్నంటి సాగుతూ... వెనుకనుండి ఏ ఉపద్రవమూ రాకుండా చూసుకుంటూ సాగారు. ఇది నిజానికి సహజంకూడాను. అయితే మరి, ముందు సాగుతానన్నమాట సీతమ్మ బింకానికే పలికిందా? అనే సంశయం అవసరంలేదు. ఆమె ముందుగ నడుస్తానని చెప్పినది ఉత్త అడవిలోనికిమాత్రమే కాదన్నమాట. రాక్షసుల మూలస్థానమైన లంకలోనికని మనం గుర్తించాలి. అలానే జరిగింది కదా!

బురదలో చిక్కుకున్న పిల్లవానిని రక్షించడానికి, తల్లి, ఆ బురదలోకే దిగుతుంది. ఎంతోమంది రాజకన్యలు రావణుని వలలో చిక్కుకుని దుఃఖిస్తున్నారు. వారిని రక్షించడానికి సీతమ్మ తాను గూడా దుఃఖాలకి నిలయమూ, క్రూరుల స్థావరమూ అయిన లంకకు వెళ్ళింది ఆహా!

**సున్దరీ రఘునాథస్య సురస్త్రీ దుఃఖశాన్తయే ।**

**దశాననస్య భవనే దశమాసానువాస హా!** అంటూ కొందరు పెద్దలు ఆశ్చర్యపోతూంటారు.

సామాన్యులు చాలామంది 'సీతమ్మను రావణుడు ఎత్తుకుపోయాడు' అని భావిస్తారు. కానీ, రావణుడు సీతమ్మను అబలను చేసి తీసుకుపోలేదు. వాడే తనను తీసుకువెళ్ళేటట్లు సీతమ్మ చేసుకుంది. అదెలా? అంటే, పంచవటి దగ్గర ఉన్న సమయంలో బంగారు లేడి కావాలని పట్టుపట్టి శ్రీరాముణ్ణి దూరంగా పంపివేసింది సీతమ్మ. బంగారులేళ్ళు లోకంలో ఉండవనే విషయం మనకే తెలుసుకదా! అలాంటిది, విజ్ఞురాలైన రాకుమార్తె సీతమ్మకు తెలీదా? పైగా రామలక్ష్మణులు ఇద్దరూ చెప్పారు, అది మాయలేడి అని. కాని సీతమ్మ తనపట్టుదలతో ఎలాగోలా రాముణ్ణి పంపింది. ఇక, లక్ష్మణుణ్ణి ఎలా పంపాలి? అవకాశం కోసం ఎదురు చూస్తోంది సీతమ్మ.

ఇంతలో మారీచుని అరుపులు వినిపించాయి. అదే సరైన అవకాశం. దాన్ని వదులుకుంటే మళ్ళీ అవకాశం రాదని ఎలాగోలా లక్ష్మణుని కూడా దూరం పంపే ప్రయత్నం చేసింది. ఎంతకీ తన ప్రయత్నం నెరవేరలేదు. ఇంకొద్దిసేపాగితే రాముడు రానే వచ్చేస్తాడు. ఇక లాభం లేదనుకొని లక్ష్మణుణ్ణి చాలా పరుషంగా మాట్లాడింది. భరించలేక ఆయనా వెళ్ళాడు రాముణ్ణి వెతుక్కుంటూ. ఇలా ఇద్దర్నీ దూరం పంపి, అలానే తనను రావణుడికి చిక్కించుకొంది, అక్కడికి వెళ్ళి వానికి హితం చెప్పాలని. శ్రీరాముడితో ఉంటే ఆ హితబోధకు వీలవ్వదు గద!

సహస్ర శీర్షా పురుషుడు శ్రీరాముడు. వేలాది తలలుగలవాడు ఆదిశేషుడు. ఆదిశేషుని ప్రతిరూపమే లక్ష్మణుడు. ఆదిశేషుడంత శక్తి కలవాడు గద! ఇలా ఇద్దరు హేమాహేమీల్లా వేలాది తలలతో సీతమ్మకు కాపలా ఉండగ వారిముందు పదితలలుగల రావణుడెంత? అంతేకాదు. అంతకు ముందే రాముని పరాక్రమాన్ని చూసింది సీతమ్మ. ఖరదూషణాదులు 14వేలమంది రాక్షసులు, వారందరితో శ్రీరాముడు ఒక్కడు నిలబడి, ఎప్పుడు బాణం తీస్తున్నాడో, ఎప్పుడు సంధిస్తున్నాడో, ఎప్పుడు వదులుతున్నాడో కూడా తెలీనంత వేగంతో యుద్ధం చేశాడు. 14వేలమందినీ నేలకూల్చాడు. అటువంటి రామునిముందు రావణుడెంత?

కడివెడు పాలల్లో ఒక్క ఉప్పురవ్వ పడ్డా పాలనన్నింటినీ విరిచేస్తుంది. అలానే ఎన్ని మంచిగుణాలు ఉన్నా ఒక్క దుర్గుణం

చాలు అధోగతిపాలు చేయడానికి. రావణునిలో పట్టుదల, పరాక్రమం, భగవద్భక్తి ఇలా ఎన్నో మంచిగుణాలు ఉన్నాయి. కాని 'అన్నింటినీ తాను ఒక్కడే అనుభవించాలనే 'అత్యాశ,' అదొక్కటే వానిలో ఉన్న దుర్గుణం.

దుర్గుణాలున్న పిల్లలను తండ్రిముందు పెడితే దండిస్తాడు. దండనకు కొందరు లొంగరు. మరింత మొండికేస్తారు. వారికి మెల్లగ అనునయించి చెప్పాలి. వినకపోతే అప్పుడు దండన తప్పదు. ముందే దండన కూడదు. ఇది తల్లి హృదయం. తండ్రికి అలా ఉండదు. సీతమ్మ లోకమాత. రావణుని కూడా తన పిల్లవానిగ బాగు చేయదలచింది. అలాంటప్పుడు రాముడు తనతో కూడా ఉండగ రావణుడు రాడు. బుద్ధి చెప్పడానికి వీలూ పడదు. అందుకే ఏకాంతంగ చెప్పాలి. అలా చేయాలంటే ఇక్కడ వీలు కాదు. కనుక రామలక్ష్మణులను దూరంగ పంపి, తాను రావణుడి వద్దకే వెళ్ళి, అది అసహ్యము, బాధాకరమూ కూడా అయినప్పటికీ, కొంత హితం చెబుదాం. వీలుకాక, వినకపోతే అప్పుడు చూద్దాం!

ఏమైనా వానిని సరైన మార్గంలో పెట్టాలి. కనుకనే, తాను రావణునితో లంకలోకి ప్రవేశించింది. 10 నెలలు ప్రయత్నం చేసింది మార్చడానికి. 'రామునితో స్నేహం చేసుకో చాలు' అని చెప్పింది. **తేన మైత్రీ భవతు తే** అని. కానీ, రావణుని తలకి ఎక్కితేనా. "రావణా! నిన్ను బూడిద చేసి పారేయగలను. కానీ నేను అవకాశాన్ని ఇస్తున్నా" అన్నట్లు,

**అసన్దేశాత్తు రామస్య తపసశ్చాను పాలనాత్ ।**
**న త్వా కుర్మి దశగ్రీవ! భస్మ భస్మార్హ! తేజసా ॥**

అని కోపంతో చెప్పింది. వినే దానికన్నా చూస్తే మార్పు ఏమయినా వస్తుందేమోనని హనుమంతుని తోకకి నిప్పుపెట్టినట్లు తెలియగానే ఒక ప్రతిజ్ఞ చేసింది.

**యద్యస్తి పతిశుశ్రూషా యద్యస్తి చరితం తపః ।**
**యది చాస్త్యేక పత్నీత్వం శీతో భవ హనూమతః ॥**

'నా భర్త మాట వినేదాన్నైతే, ఆతనితో ధర్మాన్నాచరించే దాన్నైతే ఆతనిని తప్ప వేరు తలువని దాన్నైతే హే అగ్నిహోత్రమా! హనుమకి వేడి కలుగక చల్లదనమిమ్ము. లంకను కాల్చుము' అన్నది.

ఈ ప్రతిజ్ఞ చేయగా అంతవరకు హనుమంతునికి మండుతూ వేడిగా ఉన్న తోక కాస్తా చల్లగా మారిపోయింది. అంటే, మంటలు ఆరలేదు. హనుమంతునికి మాత్రం వేడి తెలియనివ్వలేదు. లంకనంతటిని కాల్చింది. అయినా రావణునిలో మార్పు రాలేదు. వీటిని బట్టి చూస్తుంటే సీతమ్మే కావాలని కోరి లంకకు వెళ్ళినట్లు తెలుస్తోంది. **"శీతో భవ హనూమతః"** అన్నట్లు **"దగ్ధో భవ దశానన"** అని ఉంటే రావణుడే బూడిదై ఉండేవాడు. కానీ, సీతమ్మకి అది అభిమతం కాదు. మారతాడేమో ఈ రావణుడని చివరిదాక ప్రయత్నించింది. కానీ ఫలించలేదు. చివరికి ఇక విధిలేక బాధపడుతూనే సంహరింప చేసింది రావణున్ని.

రామాయణం సీతమ్మ చరితే. అయినా అందులో రామునికి కూడా సీతమ్మతో సమంగ ప్రాధాన్యముంది. కనుకనే ఇది ఉత్త రామాయణం కాదు. శ్రీమద్రామాయణమూ కాదు. **"శ్రీ రామాయణం"** అయింది. అలా పిలవడమే శ్రేయస్కరం. సముచితం కూడా.

శ్రీరాముడినుండి సీతమ్మ మూడుసార్లు ఎడబాయడం కూడా ఈ ఇతిహాసంలో ఆమెకుండే ప్రాధాన్యాన్ని తెలియజేయడానికే అనేది కూడా మనం గుర్తించాలి. అదెప్పుడంటే...

1. రావణుడు పంచవటి నుండి తీసుకువెళ్ళినపుడు...
2. గర్భవతియై ఉండగా లక్ష్మణుడు అడవిలో వదిలినప్పుడు...
3. ఇతరులకు తాను చెందనని తెలుపడానికి అవతారాన్ని చాలిస్తూ భూప్రవేశం చేసినప్పుడున్నూ...

ఇలా మూడుసార్లు ఎడబాయడం ద్వారా మూడు గుణాలను ప్రకాశింపచేసింది ఆ సీతమ్మతల్లి.

మొదటిసారి వీడినప్పుడు కృపా గుణాన్ని. లంకకు చేరినప్పుడు, 'తనను బాధిస్తూనే ఉండేవారిపైగూడ జాలి కలిగి, వారికుండే ఇక్కట్లు తొలగాలి, వారూ మంచిగ బ్రతుకగలగాలనే కృపాగుణాన్ని ప్రకాశింప చేసింది.

రెండవసారి పారతంత్ర్యాన్ని. రామాజ్ఞతో గర్భవతిగ వాల్మీకి ఆశ్రమం చేరింది. రాఘవ వంశానికి సంతతిని అందించడం తన బాధ్యత కనుక, ప్రాణత్యాగం చేయకుండా బాధని ఓర్చుకుని లవకుశులను కన్నది. తన ప్రాణం మీదకూడా తనకి అధికారం లేదనే పారతంత్ర్యాన్ని నిరూపించింది.

మూడవసారి అనన్యార్హతను. ఇక తన ప్రయోజనం రామునికి లేదని తెలిసాక, వేరెవరికి చెందనని అవతారాన్నే చాలించింది. తనలోఉండే అనన్యార్హతని లోకానికి చాటింది. ఈ మూడు గుణాలు ఎవరిలో బాగా ప్రకాశిస్తాయో వారే తన యజమానిని మెప్పించి, ఒప్పించే పురుషకార స్వరూపులు కాగలుగుతారు. వారే ఇతరులను రక్షింప చేయగలుగుతారు. అమ్మ అలాంటి అద్వితీయ పురుషకారస్వరూపిణి కనుకనే ఈ మూడు గుణాలను ప్రకాశింపచేసింది. పురుషకారిణిగా ఆమె ఆశించేది జీవసంరక్షణమే కదా!

ఇలా పురుషకారిణిగా ఆమెలోని గుణాలని ప్రకాశింపచేసిన చరిత కనుకనే రామాయణాన్ని సీతాచరితము లేదా శ్రీరామాయణము అనడమే సముచితము.



# దివ్యసాకేతంలో.........

శ్రీమాన్ రఘుదత్తాచార్యులు - ప్రధానార్చకులు

వేల సూర్యులు ఒక్కమారుగా ఉదయించిన తీరుగల తిరుమేని ప్రకాశమా! ఇది! కోటికొలది ఇందుకిరణ సమభాస ముఖహాసమా! ఇది అను భావ సమాహారాలమధ్య అక్షరములకు అందక, కల్పనలకు దొరకక, సంసార పంకిలమున సంకులమైన వారి చక్షువులకు అగోచరమై, తత్సదృశమైనది తత్తుల్యమైనది ఈ జగత్తునందు లేక "యతోవాచో నివర్తంతే అప్రాప్య మనసా సః" కీర్తించడానికి బయలుదేరిన వేదములకు సైతము అప్రాప్యమైన తత్త్వమొకటి అంతులేని ఆనందమును అందించెడి స్థానమున "నీవే సర్వమని'' ప్రేమల నిండిన కైంకర్యములతో కొలుచు నిత్యసూరిగణముల తోడ దయామృత బిందు పూరిత దృక్కుల జీవుల కాచుతూ ఉండు తత్త్వమొకటి ఏదో పరమపదమను ఒక స్థానమందు వెలుగొందుతూ ఉందని వినడమే కాని దానిని తలుచు స్థాయికూడా లేని మనబోటి ఆర్తులకోసమా ఈ స్థానమనునటుల వెలసినది మన 'దివ్యసాకేతం'. అందులోని

'త్రి'నాథుల వైభవాన్ని తెలుసుకుందాం!

నాడు భగవద్రామానుజులు అవ్యయానంద మూల కందమగు పరమపదమునకు దివ్య జ్ఞానజ్యోతుల తోడ జీవులను నడుపుటకై జగన్మాల తత్త్వమును అందించు అష్టాక్షరి మహామంత్రమును తిరుక్కోష్టియూరునందు గల అష్టాంగ విమానముపై నిలచి ఉపదేశించెనట, మరి వారి అంశమున జన్మించిన మన శ్రీచిన్నజీయరుస్వామివారి మది ఊరక ఉండునా ఆర్తులను ఉద్ధరింపకా!

అందుకే అష్టాక్షరీ స్వరూపమగు అష్టాంగ విమాన మును మన ఎదుటనే నిలపి ఆ దివ్య ఛాయయందు మంత్ర స్వరూపుడగు పరమపదనాథుని పరివారసహితముగా మనకందించినారు. మనము నిత్యము ఆరాధనకుముందు ధ్యానిస్తూ ...

**కూర్మాదీన్ దివ్యలోకాన్ తదను మణిమయం మంటపం తత్ర శేషం**
**తస్మిన్ ధర్మాది పీఠం తదుపరి కమలం చామరగ్రాహిణీశ్చ విష్ణుం।**
**దేవీర్విభూషాయుధ గణమురగం పాదుకే వైనతేయం సేనేశం**
**ద్వారపాలాన్ కుముదముఖగణాన్ విష్ణు భక్తాన్ ప్రపద్యే ॥**

**సవ్యం పాదం ప్రసార్య శ్రితదురితహరం దక్షిణం కుంచయిత్వా**
**జానున్యాదాయ సవ్యేతరమితరభుజం నాగభోగే నిధాయ ।**
**పశ్చాద్బాహుద్వయేన ప్రతిభటశమనే ధారయన్ శంఖ చక్రే**
**దేవీభూషాదిజుష్టో జనయతు జగతాం శర్మ వైకుంఠనాథః ॥**

అంటూ ప్రార్థిస్తూ భావించే ఆ స్వామిని మన కళ్ళెదుట నిలిపిన మన ఆచార్యులదయావృష్టిలో స్నానమాడి.....రండి! ఒకసారి ఆ స్వామి వేంచేసియున్న తీరును మనసులో నింపుకుంటూ దర్శిద్దాం!

ఆధారముగా కూర్మముండగా దానిపై శేషుడు ధరణిని మోస్తుండగా, వాటిపై ధర్మాధర్మ జ్ఞానాజ్ఞాన వైరాగ్య అవైరాగ్య ఐశ్వర్య అనైశ్వర్యములను ఎనిమిది శక్తులు సింహముఖముల తోడ చతుర్భుజముల ఆసనమును ధరించగా, పశుపతి పంచవింశతి శిరములతోడ స్వామి సేవన నిలువ, వాక్పతి చతుర్వేదముల స్తుతించుచుండ, త్రితత్త్వములు అహంకార త్రయములు ప్రకాశించుచుండగా, ద్వాదశ దళ పద్మమునందు ద్వాదశ శక్తులు శోభిల్లుతుండగా వ్యాప్తి, కాన్తి, తృప్తి, శ్రద్ధా, విద్యా, జయ, క్షమ అను దివ్య స్త్రీలు వింజామరములు వీచుచుండగా, శంఖి, చక్రి, గది, పద్మి, ముసలి, ఖడ్గి, శార్ఙ్గి అను వారల ఆయుధములు స్వామిని సంరక్షించుచుండగా, ఇంద్రాదులు స్వామిని సేవింపగా, పరమపదనాథుని శ్రీపదముల మ్రోయుటయే ప్రాణములు నిలుపుకొనుటయని తలచి ప్రణమిల్లు పన్నగకుల నాశకుడు పక్షికుల భూషణుడు ప్రణవస్వరూపుడగు ఆ వినతాసుతుడు, వైనతేయుడు ఎదుట నిలువ, స్వామి ఆజ్ఞను శిరసావహిస్తూ లోకమును తర్జనితో శాసించు విష్వక్సేనుడు ఐశాన్యమందు సేవించుచుండ ముగ్గురమ్మల తోడ ముదముగా ఎడమకాలిని జాపి, ఆశ్రయించిన వారిని చూపుడు వ్రేలితో పిలుస్తూ అమృతానంద స్వరూపుడు ఉపనిషద్వేద్యుడగు పరమపదనాథుడైన ఆ శ్రీమన్నారాయణుడు విలాసముగ యోగపీఠంపై కూర్చొని ఉండి స్మరణమాత్ర మోక్ష ప్రదాతయై జీవుల ఆక్రోశమును తొలగిస్తూ దివ్యసాకేతాన వెలుగొందుతూ ఉన్నాడు. రండి సేవిద్దాం! ఆచార్యులద్వారా అందిన మహద్భాగ్యాన్ని ఆనందాన అనుభవిద్దాం! తరిద్దాం!

'మీ' 'భక్తి' 'నివేదన'

# ఆచార్య వైభవం

కుమారి ఎ. విజయలక్ష్మి, విజయవాడ

శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయర్ స్వామివారిని మొట్టమొదటగ రాజమహేంద్రవరంలో రామానుజ కూటములో సేవించుకున్నాను. 1989 లో తిరిగి శ్రీస్వామివారు చాతుర్మాస్యదీక్షకై వేంచేసినపుడు, దాసురాలికి మంత్రోపదేశం అనుగ్రహించారు. అప్పటినుండి మన కనులముందు తిరుగాడే సాక్షాత్ నారాయణ స్వరూపులైన మన ఆచార్యుల సన్నిధిలో ఎన్నెన్నో దివ్యానుభవాలు. తల్లి, తండ్రి, గురువు, దైవమూ తానే అయి శ్రీస్వామివారు కురిపించే అవ్యాజమైన కృపకి సదా కృతజ్ఞతా పూర్వక దాసోహము సమర్పిస్తూ.......వారి దివ్యానుగ్రహాన్ని మీ అందరితో పంచుకోవాలని అనుకుంటున్నాను.

ఆచార్యులు శిష్యుల భౌతికజీవనంలో ఎదురైయ్యే ఇబ్బందులను తొలగించి ఆధ్యాత్మిక జీవనంలో ముందుకి నడిపిస్తారనేది దాసురాలి విషయంలో అక్షర సత్యము. మన భూతభవిష్యత్ వర్తమానములు తెలిసినవారు మన ఆచార్యులు. భౌతికకర్మానుభవానికి తగిన సూచనలు చేయడమే కాకుండా స్వప్న రూపంలో కూడా కర్మానుభవాన్ని సూచించి మంగళాశాసనాలు చేశారు.

ఒకసారి మా తండ్రిగారికి బాగా అనారోగ్యం చేసి శరీరంలో ఏ అవయవమూ కదల్చలేని స్థితి వచ్చింది. వైద్యులంతా కూడా ఇంక అంతా అయిపోయింది. ఏమీ చేయలేమన్నారు. ఇది జరగక ముందే శ్రీస్వామివారు కలలో ఈ విషయాన్ని సూచించి అనుగ్రహము చూపారు. కలలో శ్రీస్వామివారు కేవలం శిరస్సు మాత్రమే ఉండి దేహం లేకుండా ఉన్న ఎవరో ఒక వ్యక్తికి తీర్థము ఇస్తున్నారు. దాసురాలు 'అదేమిటి స్వామి దానికెందుకు తీర్థమిస్తున్నారు!' అని అడిగింది. శ్రీస్వామివారు "మీకు దేహం లేకుండా కన్పిస్తోంది, కానీ, ఇది ప్రాణము ఉన్న జీవి త్వరలో అంతా బాగుంటుంది" అన్నారు. ఆ కల అప్పుడు నాకర్థం కాలేదు. వైద్యులు నాన్నగారిని చూసి అంతా అయిపోయింది అన్న సమయంలో ఆ కల గుర్తుకు వచ్చింది. ఆ సమయంలో శ్రీస్వామివారికి నాన్నగారి పరిస్థితి ఫోను ద్వారా విజ్ఞాపన చేయగానే వారు అంతా మంచిగా అయిపోతుంది మరేం ఫరవాలేదని మంగళా శాసనాలు కృపచేశారు. ఆ తర్వాత 2,3 రోజులలో శ్రీస్వామివారు విజయవాడ వేంచేసినపుడు తీర్థమును అనుగ్రహించారు.

అంతే, ఆ తర్వాత వైద్యులంతా ఆశ్చర్యపడేలా ఒక అద్భుతం జరిగింది. మా నాన్నగారు పునర్జన్మ ఎత్తినట్లు కోలుకోవడమే కాకుండా ఇప్పటికీ వారి పనులన్నీ వారే చేసుకోగలుగుతున్నారు. ఇప్పుడు వారి వయసు 70 సంవత్సరములపైనే. ఒకసారి ఆశ్రయించాక 'శ్రీశ్రీశ్రీ స్వామివారు ఎల్లప్పుడూ అండగా ఉండి కాపాడతారు అనడానికిదే అద్భుత నిదర్శనం. ఆశ్రితరక్షణమే దీక్షగ కల్గిన ఆ రామచంద్రుని ఆరాధించే మన స్వామివారిదీ అదే స్వభావము కదా!

అష్టాక్షరీదీక్ష సమాప్తికై బదరీనాథ్‌లో జరిగిన కార్యక్రమములో 10రోజులూ పాల్గొనే అదృష్టం ఆచార్య కృపవలన దాసురాలికి కలిగింది. అక్కడ జరిగిన శ్రీఅష్టాక్షరీకోటిహవన మహాక్రతువులో ప్రతిరోజు శ్రీస్వామివారు మంత్రాన్ని జపం చేస్తూ....భావనచేసే విధానాన్ని వివరించేవారు. శ్రీస్వామివారే స్వయంగ వేంచేసి ఉండి అనుగ్రహించడం వలన ఎన్నో మంచి అనుభూతులు కలుగుతూ ఉండేవి. ఒకరోజు జపంలో మంత్ర మననంతోపాటు, భావనలో శ్రీరంగం, తిరుపతి, సింహాచలం, మేల్కోటవంటి దివ్యదేశాలలో పెరుమాళ్ళనందరినీ సేవిస్తున్నట్లుగ భావన చేయడం ఎలాగో చెప్తూ చేయించారు. ఆచార్యులే స్వయంగ దగ్గరుండి దర్శింపచేసిన ఆ దివ్యానుభూతి మరువరానిది. అంతటి దివ్యానందాన్ని సామాన్యులమైన మనకందరికీ పంచే మన ఆచార్యుల దివ్యకృపకు మంగళమని పాడుదాం!

ఇంకా ఆనందాశ్చర్యకరమైన విశేషమేమంటే ప్రతిరోజూ జపవిధానాన్ని, భావనాక్రమాన్ని అనుగ్రహించిన తర్వాత శ్రీస్వామివారు, భక్తులందరూ జపం చేస్తూండగ సాధుసంతులకి తదీయారాధన, జిజ్ఞాసువులకి మంత్రోపదేశము కావించడం కోసమని మధ్యలో వేంచేస్తూండేవారు. అయితే వారు వేంచేసినా, ధ్యానంలో కనులు మూసి ఉన్న మాకందరికీ కూడా ఆస్థానంలో వారున్నట్లుగానే, వారి దివ్యమంగళవిగ్రహం దర్శనమౌతూండేది. సదా మనసులో దివ్యమంగళ విగ్రహంతో కనులముందున్నట్లుగానే వారు వేంచేసి ఉండి లోపల సాధన నడిపించిన ఆ వైనం చాలా చిత్రంగానూ ఆశ్చర్యంగాను అన్పించేది. అన్ని గంటలూ మా ముందే ఉన్నట్లుగా అన్పించేది. బహుశా వారి దివ్యతేజస్సు బదరీక్షేత్రమంతటా వ్యాపించి ఉండడమే కారణం కావచ్చు. ఇది చాలా అద్భుతమైన మరపురాని దివ్యానుభూతి. అంతటి దివ్యతేజోసంపన్నులైన, దయాసముద్రమైన ప్రియతమఆచార్యులని సదా హృదయమందిరంలో వేంచేసి ఉండమని ప్రార్థిస్తూ.... దాసోహముతో...... జైశ్రీమన్నారాయణ!

గీతాధ్యాయ మహిమలు

1. అర్జున విషాదయోగము



# చిలుక చెప్పిన నిజం....

శ్రీమాన్ వోలేటి రామకృష్ణమాచార్యులు - హైదరాబాద్

భగవద్గీత ఎప్పటికి నిత్యనూతన గ్రంథము అంటారు పెద్దలు. ఈ గ్రంథాన్ని ఏకాగ్రతతో అధ్యయనం చేసే వాళ్ళకి, ఇందులో ఉన్న ప్రతి పదములో, ప్రతివాక్యంలో ఏదో రహస్యం నిక్షిప్తమై ఉందనిపిస్తుంది. ఎందుకంటే ఇది సమస్త వేదసారం. శ్రీకృష్ణ భగవానుడు గానం చేసిన ఉపనిషత్తుల సారం.

ఈ గీతామాహాత్మ్యం తెలుసుకుందాం!

పద్మపురాణం ప్రకారం ఒకరోజు పార్వతీదేవి శంకర భగవానుడిని సమీపించి "ప్రభూ! తమరు దయతో నాకు భగవద్గీత మహిమను తెలుపవలసింది"అని అడిగింది.

అందుకు శంకరుడు "అలాగే, ఇదే ప్రశ్న పూర్వం లక్ష్మీదేవి శ్రీమహావిష్ణువునడిగితే ఆ మహావిష్ణువు గీతామాహాత్మ్య కథలను లక్ష్మీదేవికి చెప్పాడు. ఆ కథలను నీకు నేనిపుడు చెపుతాను" అన్నాడు.

భగవద్గీత మొదటి అధ్యాయం అర్జున విషాదయోగం. ఈ అధ్యాయంలో మొత్తం 47శ్లోకాలు ఉన్నాయి. మొత్తం ఈ అధ్యాయంలో ధృతరాష్ట్రుడితో ప్రారంభించి, సంజయుడు, దుర్యోధనుడు, అర్జునుడు పలికిన మాటలే ఉంటాయి. వీళ్ళ మాటల్ని కొంత విశ్లేషిస్తే ధృతరాష్ట్రుడి మాటల్లో స్వార్థం గోచరిస్తుంది. దుర్యోధనుడి మాటల్లో భయం గోచరిస్తుంది. అర్జునుడి మాటల్లో మొదట ఉత్సాహం తరువాత దుఃఖం గోచరిస్తుంది. ఇది అర్జున విషాదయోగం అనే అధ్యాయం కనుక ఇందులో అర్జునుడి దుఃఖమే అధికంగా కనపడుతుంది.

వీరి స్వార్థాలు, భయాలు, దుఃఖాలు గురించి తప్ప, ఎక్కడా ఈ అధ్యాయంలో భగవంతుడు ఉపదేశం చేసినట్లుగా కనబడదు. మరి ఈ అధ్యాయానికి మహిమ ఉంటుందా! అని ఆశ్చర్యం వేస్తుంది. కాని గమనించవలసిన విషయం ఏంటంటే, ఈ అధ్యాయంలో భగవానుడు చెప్పినది కేవలం ఒకే ఒక్క మాట. అది "పార్థ! పశ్యైతాన్ సమవేతాన్ కూరున్" అని శ్లోకంలో సగం. కానీ, అదే అర్జునునిలో పరిణామాన్ని తీసుకు వచ్చింది. 'భగవద్గీత' ఉపదేశానికి అవకాశం కల్పించింది. కనుక, భగవానుడు ఎక్కువగ ఏమీ మాట్లాడక పోయినా ఈ అధ్యాయంలో ఆయనే ప్రధాన పాత్రధారి. గీతోపదేశానికి సూత్రధారి. ఆయన అర్జునుడు పలికిన ప్రతిమాట శ్రద్ధగా విన్నాడు. అందువలనే మనం ఈ అధ్యాయం గురించి ఏకాస్త విన్నా ఫలితం అధికమంటోంది పద్మపురాణం.

**శ్లో॥ తస్మాదధ్యాయ మాద్యం యః పఠేత్ శ్రుణుతే స్మరేత్**
**అభ్యసేత్తస్య న భవేత్ భవాంభోధి ర్దురుత్తరః ॥**

అందుచేత ఈ అధ్యాయంలో నిక్షిప్తమైయున్న విషయాన్ని ఎవరైతే చదువుతారో వింటారో, తలుస్తారో లేక అభ్యసిస్తారో వారిని ఈ సంసారము బాధించదు.

ఇక పద్మపురాణం అర్జున విషాదయోగం అనే ఈ అధ్యాయానికి చెప్పిన మహిమను గురించి తెలుసుకుందాం!

పూర్వము సుశర్మ అనే బ్రాహ్మణుడొకడుండేవాడు. ఆతడు ఎన్నో పాపాలు చేశాడు. చేసిన పుణ్యకార్యాలు శూన్యం. ఎప్పుడూ విషయాల వెంట పరుగులెత్తేవాడు. అశుచిగా ఉంటూ, దయమాలి ప్రవర్తించేవాడు. మద్య మాంసాదులు సేవిస్తూ కోరికలు తీర్చుకోవడానికి పరుగులు పెడుతూ ఒకనాడు చివరికి ఒక విషనాగు కాటుకు బలియై మరణించాడు.

ఇన్ని పాపాలు చేసిన వాణ్ణి భగవంతుడు ఊరికే వదుల్తాడా! వీడిని నరకానికి తీసుకెళ్ళి, ఎన్నో సంవత్సరాలు ఎన్నో నరకయాతనలు అనుభవింపచేసి మళ్ళీ భూలోకంలో ఒక ఎద్దుగా పుట్టించాడు. ఆ ఎద్దుజన్మలో ఒక వ్యవసాయ దారుని ఇంట ఉండి అనేక విధాలుగా పొలాలు దున్ని, బండిలో బరువులు లాగుతూ ఎన్నో సేవలు చేశాడు. ఆ ఎద్దుకు కొన్నేళ్ళకు అవసాన దశ ప్రాప్తించి, ఒక పర్వత ప్రాంతంలో బండిలోనున్న బరువులు మోయలేక, ఒగరుస్తూ క్రిందకు కూలబడిపోయింది. అది ఆ ఎద్దుకు ప్రాణం పోయే సమయం. ఆ సమయంలో ఆ పక్కనుండే ఒక వేశ్య నడుస్తూ వెళ్తూ ఆ ఎద్దును చూసి జాలిపడింది. ఆమె పెద్ద పుణ్యకర్మలు చేసే స్త్రీ ఏం కాదు. కాని కరుణ కలిగిన హృదయం వలన ఆ వేశ్య

ఇలా అనుకుంది. "ఓ భగవంతుడా! నాకు తెలిసి నేను ఏ పుణ్యము చెయ్యలేదు. నాకు తెలియకుండా కూడా నేనేదైనా పుణ్యకార్యం చేసి ఉంటే, అది ఈ అవసాన కాలంలో ఉన్న ఈ వృషభానికి ఇచ్చి, దీనిని ఉద్ధరించు". ఆ వేశ్య ఈ మాటలు అనుకున్న తరువాత ఆ ఎద్దు అక్కడే మరణించింది.

ఆ వేశ్య దానం చేసిన పుణ్యవిశేషం వల్ల, ఆ ఎద్దు మరుజన్మలో ఒక ఉత్తమమైన బ్రాహ్మణ వంశంలో బాలుడై జన్మించింది. ఆ బ్రాహ్మణ బాలునికి పూర్వజన్మజ్ఞానం కూడా ఉంది. అతనికి పది సంవత్సరాలు వచ్చిన తరువాత తిరిగి ఆ పర్వత ప్రాంతాలకు వెళ్ళి, ఆ వేశ్యను గుర్తించి ఆమె ఇంటికి వెళ్ళి ఇలా అడిగాడు. "తల్లీ! నీవు చేసిన దాన మహిమను అందుకొన్న పుణ్యవిశేషం చేత నాకు నా ఎద్దు జన్మ నుండి విముక్తి పొంది ఒక ఉత్తమ బ్రాహ్మణ వంశంలో జన్మించాను. కానీ నీవు ఏ పుణ్యాన్ని దానం చేశావో తెలియదు. ఇంతటి ఉత్తమ ఫలితాన్ని ఇవ్వగలిగిన ఆ ఉత్తమ పుణ్య కర్మ ఏదో నాకు దయతో వివరించవలసినది" అని ప్రార్థించాడు.

ఆ బ్రాహ్మణ బాలకుడి మాటలు విన్న ఆ వేశ్య ఆశ్చర్యంతో "నాకేం తెలియదయ్యా!" అంది. కాని ఆ యింట్లోనే ఒక పంజరంలో ఉన్న మాటలు నేర్చిన చిలుక ఒకటి, "ఇలా రండి! నేను చెప్తాను" అంది.

ఆ వేశ్య, బ్రాహ్మణబాలకుడు మరింత ఆశ్చర్యంతో ఆ పంజరం దగ్గరకు వెళ్ళారు.

"ఓ బ్రాహ్మణ బాలకా! ఆ విషయం నేను చెప్తాను విను."

"పూర్వజన్మలో నేనొక విద్వాంసుడిని కాని అహంకారంతో అందరిని అవమానించే వాడిని. అందువల్ల నేను మరణానంతరం ఎన్నెన్నో నరకయాతన లనుభవించి, ఈ జన్మలో నేనొక చిలుకనయ్యాను. కాని నేను పుట్టగానే నా తల్లిదండ్రులు కాలవశమున మరణించారు. ప్రాణావశిష్టనై పడిఉన్న నన్ను ఒక మహర్షికాపాడి తన ఆశ్రమంలో పెంచుకునేవాడు. ఆ మహానుభావుడు రోజూ ఉదయమే తన శిష్యులకు భగవద్గీత నేర్పించడం మొదలు పెట్టాడు. అలా ఆ శిష్యులకు చెప్తుండగా విని నేను భగవద్గీతలో ప్రథమాధ్యాయం నేర్చుకున్నాను. ఆ తర్వాత ఒక దొంగ నన్నెత్తుకొచ్చి ఈ వేశ్యకు అమ్మివేశాడు.

అలవాటు ప్రకారం నేను ప్రతిదినం భగవద్గీతలోని ప్రథమాధ్యాయాన్ని పారాయణ చేసేదాన్ని. ఈమెకు నాపై ఉన్న మమకారం వలన, ఈమెకూడా ఆ శ్లోకాలన్నీ శ్రద్ధగా వినేది. అలా ఆ శ్లోకాలు వినడం వలన ఈమె అంతరంగం కూడా ప్రక్షాళితమై పరిశుద్ధమైంది. కాని ఈమె ఏమి విందో, దానివలన వచ్చిన ఫలితమేమిటో తెలియదు. ఆ పుణ్యవిశేషమే నీకు దానం చేసింది. ఆ పుణ్యభాగ్యం వలననే నీవు కూడా ఉద్ధరింపబడ్డావు.

ఆ మాటలు విన్న ఇద్దరూ ఆశ్చర్య చకితులయ్యారు. భగవద్గీత విన్నందునే ఇంత ఫలముంటే, ఈ గ్రంథాన్ని పారాయణ చేస్తే ఇంకెంత ఫలము కలుగుతుందో అని, ఆ రోజునుండి ఆ బ్రాహ్మణబాలకుడు, ఆ వేశ్యకూడ భగవద్గీతలోని ప్రథమాధ్యాయాన్ని పారాయణ చేస్తూ కాలాన్ని గడిపి చివరికి మరణానంతరం మోక్షాన్ని పొందారు అని శ్రీ మహావిష్ణువు లక్ష్మీదేవికి చెప్పిన ఈ కథని శంకరుడు పార్వతీదేవికి వినిపించాడు.

## బదరీనాథ్ ఆశ్రమమునకు తదీయారాధన నిమిత్త కైంకర్యం సమర్పించిన దాతలు

| దాత | ఊరు | కైంకర్యం |
|---|---|---|
| 1. గుండవరం | వి.టి. 36వ శాఖ | పండుమిర్చి 600 కె.జి |
| 2. తాడేపల్లి | వి.టి. | పండుమిర్చి&ఉసిరికాయ 500 కె.జి |
| 3. కె. రాజ్యలక్ష్మి | ఆకివీడు వి.టి. | ఆవకాయ-200 కె.జి |
| | | మాగాయ 100 కె.జి |
| 4. రామానుజదాసులు | రామచంద్రాపురం | టమోటా-200 కె.జి |
| 5. పల్లపాడు | వి.టి. | ఆవకాయ 75 కె.జి |
| | | ఆవకాయ 30 కె.జి |
| 6. ఎ. కొండూరు భారతీదేవి | | ఆవకాయ 60 కె.జి |
| 7. బొమ్మనంపాడు | వి.టి. | టమోటా 50 కె.జి |
| 8. సిద్ధాంతం శశికళ | | ఆవకాయ 35 కె.జి |
| 9. చెరుకుపల్లి | వి.టి. | టమోటా 20 కె.జి |
| 9. వికాసతరంగిణి | మంటాడ | టమోటా ఊరగాయ 15 కె.జి |
| 15. తిమ్మరాజుపాలెం | వి.టి. | బియ్యం 125 కె.జి, |
| | | కందిపప్పు 10 కె.జి. |
| 11. కోగంటి యశోధర్ | గుంటూరు | బియ్యం 100 కె.జి |
| 17. వల్లభనేని ప్రసాదరావు | గోపవరం | బియ్యం 100 కె.జి |
| 12. కోగంటి విశ్వనాథ్ | విజయవాడ | బియ్యం 100 కె.జి |
| 13. కాకుమాను శ్రీనివాసరావు | పొదిలి | బియ్యం 50 కె.జి. |
| 14. కాకుమాను సురేష్‌కుమార్ | పొదిలి | బియ్యం 50 కె.జి |
| 10. మద్దుల రామారావు | కావూరు వి.టి. | బియ్యం 25కె.జి |

**వీరందరికీ శ్రీస్వామివారు అనేక మంగళాశాసనములు చేశారు.**



రాయల ఊహల పల్లకి....

# ఆముక్తమాల్యద

*గత సంచిక తరువాయి...*

ఆ పట్నంలో వీధులన్నీ వజ్రాలు తాపినవి. వీధులకు రెండువైపులా ఎర్రటి బొండాలతో కొబ్బరిచెట్లు. వజ్రాలు తాపిన వీధులు తెల్లగా గంగాప్రవాహాల్లాగ, కొబ్బరిచెట్లు కల్పవృక్షాల్లాగా ఉన్నాయి. ఆ ఊరివారు తమ ఇళ్ళు కట్టుకోవడం కోసం సముద్రంలోంచి కావలసినన్ని రత్నాలు తెచ్చుకున్నారట. వారు తెచ్చుకోగా మిగిలిన రత్నాలనైనా కాపాడుకుందామనుకుని ఇదిగో మా ఆవిడ గంగను, నా పిల్లలు కల్పవృక్షాలను మీ దగ్గర కుదువపెడుతున్నాను. వీరినుంచుకుని నా రత్నాల జోలికి ఇకనైనా రాకండి అని సముద్రుడు తన భార్యగంగను బిడ్డలు కల్పవృక్షాలను వాళ్ళ దగ్గర కుదువ బెట్టినట్టుంది.

వాకిళ్ళ ముందు కత్తులు వేసిన కొబ్బరిచెట్లు రత్నాలు తాపిన నేలమీద ప్రతిఫలిస్తూంటే కొబ్బరిమట్టల నీడలవల్ల నేలంతా పేడతో అలికినట్లు, తెల్లగా పొడుగ్గా కుచ్చుల్లా ఉన్న కత్తులు ఆ నేలమీద వేసి తెల్లని ముగ్గుల్లానూ కనిపిస్తున్నాయి. ఇంటివారు పేడతెచ్చి అలికి ముగ్గు పెట్టుకొనక్కర్లేకుండానే ఎవరో అలికి ముగ్గులు వేసి అలంకారాలు కావించినట్లు ఉంది ఈ సన్నివేశం.

ఆ ఊళ్ళో ఇళ్ళ వెనుకవైపు ఉద్యానవనాలున్నాయి. వాటిలో ఎఱ్ఱకలువల దిగుడుబావులు. పావడాలు ధరించిన ద్రావిడస్త్రీలు పసుపురాసుకొని ఆ దిగుడుబావుల్లో స్నానాలు చేసి ఇంట్లో కొలువుతీరిన గోవిందుని తిరుమంజనం కోసం బిందెలతో తీర్థం పట్టుకొస్తున్నారు. పూజకోసం తుంచి తెస్తున్న చేతిలోని తామరపూలు ఆ నీటిలో కదలాడుతూంటే ఆ బిందెలు నడుములకెత్తుకుని ఆళువారులు పాడిన పాశురాలు చదువు కుంటూ లోపలితోవల్లోంచి ఇళ్ళలోకి నడిచివస్తున్నారు. తడిబట్టలతో వారు నడుస్తూంటే కాళ్ళు తడబడుతూన్నాయి. బిందె బరువువల్ల, బిగువైన చనుకట్టువల్ల నడుము అల్లల్లాడుతూ ఒయ్యారంగా కనవస్తున్నారు.

ఉద్యానాల్లో చెట్లు, కొమ్మలు ఇళ్ళచూరుల వరకూ సాగి ఉన్నాయి. వాటిమీద లకుముకి పిట్టలు గుంపులుగా ఉన్నాయి. వీధుల్లో నీలమణులు తాపిన తల్లివొరదాకా నిండిన తేటనీటితో దిగుడుబావులు. వాటిలో చేపలూను. ఆ చేపలకోసం ఈ లకుముకులు మూడేసి నాలుగేసి ఒక్కమారు దుముకుతూ పైకిలేస్తూ ఉన్నాయి. వాటికి అదో ఆటలా ఉంది. ఇదంతా ఎల్లా ఉందీ, ఆ గృహలక్ష్మి ఎవ్వరికీ కనపడకుండా ద్రావిడస్త్రీల సావాసంవల్ల వారాడే బంతులాటను తానూ ఆడుతోందా అనిపిస్తోంది. ఆ బంతులాటలోను నాలుగైదు బంతులతో ఒకమారే ఆడడం ఇంకాగొప్ప. లకుముకులు బంతుల్లా ఉన్నాయి.

ఆ ఊళ్ళో లక్ష్మీదేవికో రథం, శ్రీమన్నారాయణునికి ఓ రథం ఉన్నాయి. అవీ ఒకటి మేరువులా మరోటి మందరం లానూ ఉన్నాయి. మేరుపర్వతం దేవతలకు నివాసాన్నిచ్చింది. మందరపర్వతం ఆహారంగా అమృతాన్నిచ్చింది. ఈ రెండు కొండల్లోనూ సిద్ధదంపతులుండే గుహలున్నాయి. విల్లిపుత్తూరు లోని మేడలు కూడా ఆ ఊరివారికే కాదు, అతిథి అభ్యాగతులకూ నివాసాన్నిస్తున్నాయి, ఆహారాన్నీ ఇస్తున్నాయి. మేరు మందరాల్లో ఈసు బయలుదేరింది. నివాసాన్నిస్తున్నాను నేను గొప్ప అంటుంది మేరువు. తిండి పెడుతున్నందువల్ల నేనే గొప్ప అంటుంది మందరం. ఈ తగవు తీరేదెల్లా...? ఎవరో మధ్యవర్తి నడగాలి. ఆ మధ్యవర్తి వివాదవిషయంలో అనుభవం కలవాడైతేనే సరైన తీర్పు ఇవ్వగలడు. విషయం తెలియకపోతే ఏం చెబుతాడు! అంచేత విల్లిపుత్తూరి మేడలు కూడా తమలాగే నివాసాన్నీ, ఆహారాన్నీ ఇట్లా రెండింటినీ ఇస్తున్నాయి కనుక వాటినే తమ తారతమ్యాన్ని గూర్చి అడుగుదామని అక్కడకు వచ్చిన మేరు మందరపర్వతాల్లా ఉన్నాయి ఆ రథాలు రెండూను. ఆ రథాల్లో ఉన్న నవదంపతుల చిత్రప్రతిమలు మేరుమందరాల గుహల్లో ఉండే సిద్ధదంపతుల్లా ఉన్నాయి.

ఆ ఊళ్ళో ఆటవెలదులున్నారు. వీధి అరుగుమీద కూచుని వారు పాచికలాడుతూ ఉంటారు. ఉంకించి బంగారుగాజుల గలగల లతో వారు పాచికలు వేసే తీరుకు యోగులకు సహ గుండెలు జల్లుమంటాయి. తన్మయత్వంతో వారాడుతూ ఉంటే ఎదురుగా మన్మథుడొచ్చి నిలబడ్డా కన్నెత్తి కనరు, పల్లెత్తి పలుకరించరు. దాంతో ఇంతటి మన్మథుడూ దైన్యంతో కుమిలి పోవాల్సిందే! అంత పారవశ్యంలో ఉన్నా ఆలయ శ్రీకార్యపరులెవరైనా వీధిలో అల్లంత దూరాన కనపడగానే ఆట ఆపి తాము లేచి వారికి దాసోహాలు చేసి మరీ కానీ ఆటలోనికి రారు. ఇది చూసి వారి నమస్కారాలు కోసం ఇంద్రుడంతటివాడు కూడా తానూ ఆలయాన ఒక శ్రీకార్య పరుడైతే బాగుండుననుకుంటాట్ట. *(సశేషం)*

శ్రీరామచంద్రాచార్య

## మా జీవితాలలో వెలుగులు నింపిన జీయరు స్వామికి జేజేలు








జై శ్రీమన్నారాయణ

మేమంతా చిన్నారులం. వెలుగు చీకట్లకు తేడా తెలియని వాళ్లం. ప్రేమతో పలకరిస్తే అదే మాకు వెలుగు. ఎవరైనా మమ్మల్ని కసిరికొడితే చీకటని తెలుసు. అందరిని చల్లగ చూసే భగవంతుడి రూపం ఎలా ఉంటుందో మాకు తెలియదు కాని మా చీకటి జీవితాల్లో వెలుగులు నింపిన చిన్న జీయర్ దేవుని రూపం ఒక్కటే మాకు తెలుసు. ఇప్పటికే మేమెవ్వరిమో మీ కర్థమయ్యే ఉంటుంది.

మాది విజయనగరం. "నేత్ర విద్యాలయ అంధబాల బాలికల పాఠశాల విద్యార్థులం" మా పాఠశాలను శ్రీ స్వామివారు అనుగ్రహించి పదివసంతాలు పూర్తి అయిన సందర్భంలో మాతియ్యని అనుభూతులని మనవారందరితో పంచుకోవాలనిపించింది.

2001వ సంవత్సరం 18 మంది విద్యార్థులతో ఉన్న పాఠశాలని శ్రీస్వామివారు దత్తత తీసుకున్నారు. ఈ రోజు స్వామి వారి అనుగ్రహంతో వందమందికి పైగా నేత్ర విద్యాలయలో చదువుతున్నాం.

మేమంతా గిరిజన గ్రామీణ ప్రాంతాల నుండి వచ్చిన వాళ్ళమే ఎక్కువ. మా వూరిలో ఏంట్రా! గుడ్డోడా! అనే పలకరిస్తారు చాలామంది. ఏం చెయ్యాలన్నా చూపున్న వాళ్ళలా చెయ్యలేక పోయేవాళ్లం. చాలా బాధగా అనిపించేది. కాని స్వామి వారి దయతో నేత్రవిద్యాలయలో చేరాక ఇప్పుడు మేము ఆడగలం, పాడగలం, చదవగలం, ఒక్కరమే ధైర్యంగా ప్రయాణించగలం. ఒకటేమిటి వృత్తి విద్యలు అంటే క్రొవ్వొత్తులు తయారు చేస్తాం, వైరు బేగులల్లుతాం, ఆకులుకుడతాం. మా అందరి ఆనందం కోసం స్వామివారు మాలాంటి వాళ్లనందర్నీ ఒక చోట చేర్చి ఆటలు కూడా ఆడించారు. 15 వందలమంది స్నేహితులం ఆడి, పాడి విజేతలమై ఆనందాన్ని అనుభవించాం.

తల్లి, తండ్రి, గురువు, దైవం మాకు జీయరు స్వామివారే. ఒకసారి ఏమైందంటే వరదలకి మా పాఠశాల ప్రక్కనే ఉన్న చెఱువుకి గండిపడి మొత్తం పాఠశాలలో అన్ని వస్తువులూ కొట్టుకుపోయాయి. మాలో చాలామంది చిన్న పిల్లలు కూడా ఉన్నారు. కాని మన ఆచార్యులు మాకు ఏ ప్రమాదం జరగకుండా కాపాడారు. ఇప్పటికీ మాకు చాలా ఆశ్చర్యంగా ఉంటుంది.

మేమంతా పబ్లిక్ పరీక్షలు వ్రాయాలంటే స్క్రైబ్,అంటే మరొకరు మావంతు పరీక్ష మేము చెబితే వ్రాయాలి. ఇలా వ్రాస్తే చాలా కష్టంగా ఉండేది మా బాధని అర్థం చేసుకున్న స్వామివారు స్క్రైబ్ లేకుండా మాపరీక్షలు మేమే వ్రాసుకొనేలా లేప్‌టాప్ మీద పరీక్షలు వ్రాయించి ఇంటర్, డిగ్రీ కాలేజీలు మా అంధుల కోసం దేశంలోనే మొదటిగా ఏర్పాటు చేసి ఎందరి జీవితాల్లోనో వెలుగులు నింపుతున్నారు. మా పాఠశాలలో చదివిన శ్రీను అనే విద్యార్థికి రైల్వే ఉద్యోగం కూడా వచ్చింది. స్వామివారి కరుణ మాపై ఎంతుందో అనుభవించిన మాకు వ్రాయడానికి ఎన్ని పుస్తకాలైనా సరిపోవు.

అందుకే స్వామివారి మీద మేము ఒకపాట రాసుకున్నాం అందులో,

"చిన్న జీయరు దేవుని అండ ఉండగ కన్నులెందుకింకమాకు దండగ"

అని వ్రాసుకున్నాం. మాకన్నులకి వెలుగు మన స్వామి వారే.

పాటలలో, ఆటలలో ఎన్నో బహుమతులు పొందాం. యోగ, శ్లోకాలు, ఆధ్యాత్మిక విషయాలు నేర్చుకొని మంచి పౌరులుగా తయారువుతున్నాం. పదవతరగతిలో ప్రతి సంవత్సరంలో నూరు శాతం ఉత్తీర్ణులవుతున్నాం అంటే స్వామి ఆశీస్సులు, మా ఉపాధ్యాయుల కృషి, వారికి మాపై ఉండే ప్రేమే కారణం.

మీ అందరి సహాయ సహకారాలు కూడా మమ్మల్ని ముందుకు నడిపిస్తున్నాయి. **పదివసంతాలు** పూర్తి చేసుకున్న సందర్భంగా మీ అందరిని నేత్రవిద్యాలయ విద్యార్థులమంతా ఒక కోరిక కోరుతున్నాం.

**మీ చుట్టు ప్రక్కల ప్రాంతాలలో ఎవరైనా మాలాంటి కంటి చూపులేని 5 సం.ల నిండి 15 సం.లోపు బాలబాలికలు కనిపిస్తే దయచేసి మన నేత్ర విద్యాలయ పాఠశాలలో చేర్చమని చెప్పండి. వారి జీవితంలో వెలుగులు నింపండి. మాలాగా వాళ్ళని కూడా నేత్రవిద్యాలయలో చదివించమని, స్వామివారి అనుగ్రహాన్ని పొందమని కోరుకుంటున్నాం.**

విజయనగరం నేత్ర విద్యాలయకి వచ్చి మమ్మల్నందర్ని చూసి మేము మరింత ప్రతిభను సాధించేలా ప్రోత్సాహాన్నందించమని ఆహ్వానిస్తున్నాం.

ఇన్ని వరాలను అనుగ్రహించిన ఆచార్య దేవునకు ఆనంద కుసుమాంజలి సమర్పిస్తున్నాం.

జై శ్రీ మన్నారాయణ.

## నేత్ర విద్యాలయ నిర్వాహక సభ్యుల కృతజ్ఞతాంజలి

శ్రీశ్రీశ్రీ స్వామివారు అద్భుతమైన సేవ చేసుకొనే భాగ్యాన్ని మాకందించారు. జెట్,వికాసతరంగిణి విజయనగరం నిర్వహించే ఈ కార్యక్రమానికి దేశ విదేశాల నుండి నేత్ర విద్యాలయకు సహాయమందిస్తూ ప్రోత్సహిస్తున్న వారందరికి, ప్రోత్సాహాన్ని అందించాలనుకున్నవారికి, శ్రీశ్రీశ్రీ స్వామివారి మంగళాశాసనములు పరిపూర్ణంగా లభించాలని ఆకాంక్షిస్తున్నాం. శ్రీశ్రీశ్రీ స్వామివారికి నచ్చే కార్యకర్తలుగా సేవలందించే భాగ్యం కలుగజేయమని ప్రార్థిస్తూ కృతజ్ఞతాంజలి సమర్పించుకుంటూ....

విజయనగరం నేత్ర విద్యాలయ నిర్వాహక, ఉపాధ్యాయబృందం,

జై శ్రీమన్నారాయణ.







నేత్రవిద్యాలయ, ప్రేమ సమాజం, పూల్‌బాగ్ రోడ్, విజయనగరం, ఫోన్‌నెం: 9440540467, 944019393

ముఖచిత్ర వివరణ...

# జగన్నాథ రథయాత్ర

భారతదేశ ప్రాచీన సంస్కృతికి, ఆధ్యాత్మిక చింతనాధారకినెలవైన మన దేవాలయాల్లో ప్రముఖమైనది పూరీజగన్నాథం. దీనికే '**శ్రీపురుషోత్తమ క్షేత్రము**' అని కూడా పేరు. మనదేశంలోని అన్ని సంప్రదాయాలవారు ఆదరించి దైవాన్ని ఆరాధించే స్థానము పూరీ క్షేత్రము. అందరూ ఇక్కడ జగన్నాథుని సేవించి, ప్రసాదం స్వీకరించాలని తపన పడతారు. శంకరభగవత్పాదులు, భగవద్రామానుజులు, నింబార్కులు, వల్లభులు, చైతన్యమహా ప్రభువు వంటి ఆచార్యులెందరో సేవించి కీర్తించిన క్షేత్రమిది.

ఇక్కడ జగన్నాథునిగ ప్రసిద్ధి చెందిన శ్రీకృష్ణుడు సుభద్రాదేవి, బలభద్రులతో కలసి వేంచేసి ఉంటాడు. వారికి జరిగే రథయాత్ర చాలా విలక్షణమైనది, ప్రపంచ ప్రసిద్ధినొందినది. అయితే ఈ సన్నిధిలో కృష్ణుని దేవేరిగ దర్శనమిచ్చే సుభద్రాదేవి, ఆదేశపు రాజు కుమార్తె. బలరామకృష్ణుల చెల్లెలు సుభద్ర కాదు.

ఇక్కడ జరిగే విలక్షణమైన రథయాత్రను దర్శించడానికి ప్రపంచం నలుమూలల నుండి లక్షలాదిమంది వస్తారు. ప్రతీ సంవత్సరం జూన్ లేదా జూలై ఆరంభంలో బ్రహ్మాండంగ జరిగే ఈ రథయాత్రకి కావలసిన ఏర్పాట్లు అక్షయతృతీయ నుండే ఆరంభిస్తారు. రథనిర్మాణానికి కావలసిన కలపను ముందుగానే సేకరించి పెట్టుకుని ఆనాడు నిర్మాణాన్ని ప్రారంభిస్తారు.

ఇక రథయాత్రకి సుమారు 15 రోజులు ముందు, జ్యేష్ఠపూర్ణిమ నాడు ఆలయంలో జగన్నాథునికి సపరివారంగ తిరుమంజనం, స్నానోత్సవం జరుగుతుంది. దీనికి కావలసిన తీర్థాన్ని శీతలదేవి అనే శక్తి సంరక్షణలో ఉన్న స్థానికమైన ఒక బావి నుండి తీసుకుని వస్తారు. ఈ స్నానోత్సవం తరువాత 15 రోజుల వరకు ఆలయంలో జగన్నాథుని దర్శనం భక్తులకు ఉండదు. గర్భగుడిలో మాత్రం రహస్యోపచారాలు జరుగుతాయి.

ఆషాఢ అమవాస్య లేదా పాడ్యమినాడు తిరిగి కొత్తగా వేసిన వర్ణకలాపముతో ఈ మూర్తులు భక్తులకి దర్శనమిస్తారు. ఈ దర్శనాన్ని **"నవయవ్వన దర్శనం"** అంటారు. నిత్యమూ శ్రీ జగన్నాథుని సేవించే భక్తులు ఈ దర్శనం కోసమై 15 రోజులపాటు తహతహతో ఎదురుచూస్తారు. ఆ మరునాడు అనగ ఆషాఢశుక్ల విదియనాడు జగన్నాథుడు సపరివారంగ రథయాత్రకై బయలుదేరి సింహద్వారం చేరుకుంటాడు. ఈ సంవత్సరం జూలై 3వ తేదీన ఈ రథయాత్ర జరుగుతోంది.

లక్షలాదిమంది భక్తుల సమక్షంలో వీరిని మూడు బ్రహ్మాండమైన రథాలపై ఎక్కిస్తారు. **"పహండి"** అని పిలవబడే ఈ రథారోహణ దృశ్యము మిక్కిలి పవిత్రమైనది. భక్త్యావేశముతో భక్తులు సాష్టాంగ నమస్కారములు చేస్తూండగా, ఆ దేశపు రాజు స్వయంగ బంగరు చీపురు కట్టతో రథమార్గాన్ని శుద్ధి చేస్తూ ముందు నడుస్తూంటే యాత్ర సాగుతుంది.

ఈ మూడు రథాలు, భక్తుల జయజయధ్వానాల మధ్య రాజవీథిలో ప్రయాణించి, మందిరానికి సుమారు 11/2 (ఒకటిన్నర) మైళ్ల దూరంలో ఉన్న జగన్నాథుని ఉద్యానవనమైన **"గుండిచ"** అనే ప్రాంతానికి చేరుకుంటాయి. ఆవనంలో స్వామి వారం రోజులపాటు విశ్రాంతి తీసుకుని ఆషాఢశుక్ల దశమి లేదా ఏకాదశినాడు ఆలయానికి రథంపై తిరుగు ప్రయాణ మౌతాడు. తిరుగు ప్రయాణాన్ని **"బహుడా"** ఉత్సవమంటారు. వనంలో విశ్రాంతి తీసుకున్న వారం రోజులు, రానూపోనూ ప్రయాణం రెండురోజులు మొత్తం ఈ 9 రోజులనీ కలిపి జగన్నాథరథోత్సవమని అంటారు.

ఈ రథోత్సవంలో ఉపయోగించే 3 రథాలూ మేరుపర్వతంలా ప్రకాశిస్తూ విస్మయానందాల్ని కలిగిస్తాయి. జగన్నాథుని రథం ఎత్తు 45 అడుగులు, వెడల్పు 35 అడుగులు, వ్యాసం 7 అడుగులు ఉంటాయి. ఇంత పెద్దరథానికి 16 చక్రాలు ఏర్పాటు చేస్తారు. జగన్నాథ రథం, రథచక్రాలను అనేక మంది కవులు తమ తమ సారస్వతాలలో కీర్తించారు. ఈ రథానికి 'నందఘోష'మని పేరు. చక్కటి పీతవర్ణంతో, ప్రకాశించే ఈ రథానికి రక్షకుడు నృసింహస్వామి. సారథి సూతుడు. రేతిక, మాటిక, సుషా, అమృతా అనే నాలుగు ధవళాశ్వాలు ఈ రథాన్ని లాగుతున్న ట్లుంటాయి. ఈ రథానికి కట్టిన పెద్ద పెద్ద మోకు తాళ్లతో భక్తులే ఈ రథాలని ముందుకు లాగుతారు.

తరువాత బలభద్రుని రథం పేరు 'తాళధ్వజం'. ఇది జగన్నాథుని రథం కన్న ఒక అడుగు చిన్నగ ఉంటుంది. నీలవర్ణంలో ప్రకాశించే ఈ రథానికి సారథి ప్రద్యుమ్నుడు. స్థిర, ధృతి, స్వితి, సిద్ధి అనే పేర్లుగల నాలుగు కృష్ణవర్ణ అశ్వాలు కలిగి ఉంటుంది.

ఇక సుభద్రాదేవి రథానికి 'దేవదళనం' అని పేరు.. ఇది కృష్ణవర్ణంలో ఉంటుంది. అధర్మ, అజ్ఞాన, అపరాజిత, జ్యోతినీ అనే నాలుగు అశ్వాలు ఉంటాయి. సారథి స్థానంలో అర్జునుడు ఉండడం విశేషం.

రథంపై జగన్నాథ మూర్తి 5 అడుగులు, సుభద్ర 4 అడుగులు, బలరాముడు 6 అడుగుల మూర్తులుగ వేంచేసి ఉంటారు. ముందుగ పెద్దవాడైన బలరాముని రథం, ఆ తరువాత సుభద్ర రథం, చివరగ జగన్నాథుడైన శ్రీకృష్ణుని రథం యాత్రలో బయలుదేరుతాయి.

ఈ రథయాత్రలో దేశదేశాల నుండి వచ్చిన గాయకులు, నర్తకులూ, పరమభాగవతోత్తములూ వెంటరాగా, దారిపొడుగునా పుష్పవృష్టి కురుస్తూండగ నాల్గువైపులా మృదంగం, తూరీభేరీ, శంఖధ్వనులూ ఘోషిస్తుంటే ఆకాశం పై, రథశిఖరాగ్రాలపై కేతనాలు రెపరెపలాడుతుంటే, రథాలపై గల తైలవర్ణ చిత్రాలూ, నానావిధ అలంకారాలు కళ్లను జిగేల్ జిగేల్ మన్పిస్తూంటే మెల్లమెల్లగ రథాలు ముందుకు సాగిపోతాయి.

దేశం నాలుగు చెరగుల నుండి వచ్చిన యాత్రికులు రథాల్ని స్పృశించి, ఆ రథానికుండే తాళ్లతో రథాన్ని లాగుతూ, భక్త్యావేశముతో జయజయధ్వానాలతో ఉత్తేజం పొంది పరవశులౌతారు. లక్షలాది మంది జయ జయధ్వానాల మధ్య సాగే ఈ రథయాత్ర వైభవము జగత్ ప్రసిద్ధినొందింది.

ఆ కాలంలో అక్కడికి వెళ్లినవారు మాత్రమే దర్శించగలిగే ఆ వైభవం టి.వి ఛానళ్ల పుణ్యమా అని ప్రపంచమంతటా ఇంటింటా ఆసక్తి కలిగిన వారందరూ శ్రమ లేకుండా దర్శించగలుగుతున్నారు. ***రథస్థం కేశవం దృష్ట్వా పునర్జన్మ న విద్యతే*** అంటుంది శాస్త్రం జగత్ప్రసిద్ధమైన జగన్నాథుని రథంలో సేవించి తరిద్దాం!



## పరమహంస పరివ్రాజకులు
# శ్రీశ్రీశ్రీ చిన్నజీయర్‌స్వామివారి ప్రచారవార్తలు



### ఋషీకేశ్ జీయర్ మఠంలో నూతన ఆలయ ప్రతిష్ఠ

శ్రీశ్రీశ్రీస్వామివారు మే నెల 23 వ తేదీన శ్రీరామనగరం నుండి బయలుదేరి ఋషీకేశ్ వేంచేశారు. అక్కడ మన జీయర్ మఠంలో నూతనంగ నిర్మింపబడిన శ్రీ సీతారామలక్ష్మణ సమేత ఆంజనేయ స్వామివారి ఆలయ ప్రతిష్ఠా మహోత్సవాన్ని కావించారు. త్రయాహ్నిక దీక్షతో జరిగిన ఈ వైదిక కార్యక్రమాన్ని శ్రీవారి నేతృత్వంలో బాకాస్ అధ్యక్షులైన డా.రామనాథంగారు తమ బృందంతో కలిసి బాధ్యతవహించగ, మన ఆగమపాఠశాల ప్రధాన అధ్యాపకులైన శ్రీమాన్ మధుసూదనాచార్యులు తమ శిష్యపరివారంతో కలిసి అద్భుతంగ నిర్వహించారు.

మూడు రోజులపాటు జరిగిన ఈ కార్యక్రమంలో ఎన్నో అద్భుతాలు జరిగాయి. తీవ్రమైన ఎండలతో ఉన్న వాతావరణమంతా శ్రీస్వామివారి రాకతో చల్లబడింది. ప్రతిష్ఠకి ముందు జరిగే జలాధివాసం సమయంలో సుమారు 2,000 కిలోల బరువున్న హనుమ మూర్తిని జలంలోకి దింపితే తిరిగి బయటకి తీయడం కష్టమౌతుందని ఆలోచించి ఒడ్డునే ఉంచారు. శ్రీవారిచేత ప్రోక్షణ కాగానే వాయుదేవుడు తన మిత్రుడైన వరుణుని సహాయంతో రాత్రంతా దివ్యజలాలతో అభిషేకించిన వైనం ఒడలు పులకరింపచేసింది. మామూలు వాన నీరులా కాక ఆ నీరు ఎంతో తియ్యగ ఉంది.

మరునాడు ప్రతిష్ఠకి సిద్ధం చేయడం కోసం మూర్తులను ఆలయంలోకి తరలించడం ఇంకొక అద్భుతం. శ్రీవారి సారథ్యంలో కోటి, బాబి మిగిలిన భక్తబృందమంత హనుమంతుని గర్భాలయంలోకి చేర్చారు. ఆ బృందంలోని వారు శ్రీస్వామివారే దగ్గరుండి శక్తిని అనుగ్రహించి నడిపించారన్న అనుభూతిని పొందారు.

27వ తేది ప్రతిష్ఠా మహోత్సవం అత్యంత ఆనందదాయకంగ సాగింది. భారతదేశంలోనే ఇది ఒక అపురూపమైన మూర్తి. ఒకే పీఠం పై భద్రాద్రి లోలాగ సీతమ్మని ఒడిలో కూర్చుండబెట్టుకుని చల్లని చిరుదరహాసంతో రాముడు ఆసీనుడైయుండగ, ప్రక్కన లక్ష్మన్న సేవిస్తూ నిలచి ఉన్నాడు. విలక్షణంగ హనుమన్న రెండు చేతులా ఆ పీఠాన్ని వహిస్తూ నిలచిఉన్నాడు.

ఆ దివ్యదర్శనం చాలా అపురూపంగ అన్పించింది. శ్రీరామాయణ ములో రామలక్ష్మణులు ఇరువురినీ తన భుజస్కంధాలపై వహించి సుగ్రీవుని సన్నిధికి చేర్చిన హనుమ, లంకలో ఉన్న సీతమ్మను కూడా అలాగే తన భుజాల మీదుగ రాముని సన్నిధికి క్షణాలలో చేర్చాలని, ఆ దివ్య దంపతులని ఆనంద పెట్టాలని తపన పడ్డాడు. ఆ కోరికను ఇన్ని యుగాల తర్వాత ఇప్పుడు తీరుస్తున్నారా! అన్నట్లు ఉంది ఆ దివ్యమూర్తి. తప్పక సేవించవలసిన సుందర సుమధుర రూపమది.

28 ఉదయం ఆరాధనానంతరం బయలుదేరి బదరీ చేరారు. 30 వ తేదీ అదృష్టవంతులైన భక్తులకు మంత్రోపదేశం కావించారు. 1 వతేదీ వేంచేసి ఉండి అక్కడ జరుగుతున్న కార్యక్రమాలను పర్యవేక్షించారు. రాత్రికి ఋషీకేశ్ చేరారు. 2వతేదీ బయలుదేరి నేరుగ హైదరాబాదు చేరుకున్నారు.

3వతేదీ శ్రీరామనగరంలో జరుగుతున్న అల్లంపల్లి టీచర్స్ శిక్షణ శిబిరాన్ని సంపూర్ణం చేశారు. అప్పుడే 10 వ తరగతి పరీక్షా ఫలితాలు రావడం మన అల్లంపల్లి విద్యార్థులంతా ఉత్తీర్ణులైన సంతోషకర వార్త అందింది. 16 మంది విద్యార్థులకి 500 కంటే మార్కులు వచ్చాయి. వారందరినీ కూడా శ్రీస్వామివారు ఇంటర్, డిగ్రీ వంటి ఉన్నత చదువులకి పంపిస్తామని మంగళాశాసనాలు చేశారు.

4,5 తేదీలలో వైజాగ్‌లోని వైభవ వెంకటేశ్వరస్వామి కోవెల ప్రతిష్ఠ కావించి, 5సాయంత్రం రొట్టవలసకు వేంచేశారు. 6 ఉదయం అక్కడ రామాలయ ప్రతిష్ఠ కావించి వనజంగి గ్రామంలో వేంకటేశ్వరాలయాన్ని సందర్శించుమున మన జెట్ అధినేత శ్రీమాన్ రామేశ్వరరావుగారి నూతన గృహప్రవేశం కావించారు. తీర్థగోష్ఠి అనంతరం అక్కడే ఇగ్నో కమ్యూనిటీ నియత సమావేశం జరిగింది. శ్రీస్వామివారి సన్నిధిలో, ఢిల్లీ నుండి వచ్చిన పరిశీలనాధికారిణి గారు, శ్రీమాన్ రామేశ్వరరావుగారు, శ్రీమాన్ పురుషోత్తమ రావుగారు, శ్రీమాన్ కృష్ణగారు, శ్రీఉ.వే.శ్రీమాన్ రంగరామానుజాచార్యస్వామి వారు ఈ సమావేశంలో పాల్గొన్నారు.

అదే రోజు రాత్రి ఎమిరేట్స్ విమానంలో బయలుదేరి 9 మధ్యాహ్నానికి బ్రిడ్జివాటర్‌లోని శ్రీమాన్ నాథముని నేరెళ్ళ దంపతుల గృహానికి చేరారు.

9-11 వరకు స్థానిక వేంకటేశ్వరాలయ పుష్కరోత్సవంలో వేంచేసి ఉన్నారు. 12 సంవత్సరాల క్రితం ఈస్వామిని మన స్వామివారే ప్రతిష్ఠ కావించారు.

12 ఉ॥ ఆరాధనానంతరం కనెక్టికట్‌లో శ్రీమతి గీతా విజయభాస్కర్ రెడ్డి దంపతుల గృహానికి వేంచేసి, సాయంత్రం జరిగిన ప్రజ్ఞా స్నాతకోత్సవంలో పాల్గొని విద్యార్థులకి, తల్లితండ్రులకి, ప్రజ్ఞా టీచర్స్‌కి మంగళాశాసనాలు చేశారు. గత సంవత్సరం న్యూజెర్సీలో శ్రీవారే స్వయంగ అనుగ్రహించిన ప్రజ్ఞా శిక్షణ శిబిరంలో పాల్గొన్న శ్రీమాన్ సాయిగారు ప్రభృతులు ఇప్పుడు సమర్థవంతమైన టీచర్స్‌గా రూపొందడం ముదావహం. ఆ మరుసటి రోజు 2వ మాడ్యూల్ శిక్షణ శిబిరం నిర్వహించి, సాయంత్రం బోస్టన్‌లో శ్రీమతి మాధవిసురేష్ దంపతుల గృహానికి వేంచేశారు. 14-16వ తేదీ వరకు Personality development తరగతులు నిర్వహించారు. 17- 19వ తేదీవరకు శ్రీమాన్ ప్రసన్న శ్రీనివాసరావు కోల దంపతుల గృహంలో వేంచేసి, Vedic essence in daily life, శ్రీవిష్ణుసహస్రనామవైభవాన్ని గురించి శ్రీవారు ప్రవచించారు. V.T. Seva Awareness & cultural programme లో పాల్గొని 20వ తేదీన న వాషింగ్టన్ డి.సి. శ్రీమతి సాయికాంత తేజ దంపతుల గృహానికి వేంచేశారు. 21-26 తేదీ వరకు భగవద్గీత 13వ తేదీ అధ్యాయం నుండి పెర్సనాలిటీ డెవలప్‌మెంట్ తరగతులు నిర్వహించారు. 27వ తేదీ న్యూజెర్సీలోని మన ఆశ్రమానికి వేంచేశారు.

28వ తేదీ న్యూయార్క్ లో ఫ్లషింగ్ ప్రాంతంలో నూతనంగ ఒక జెట్ చాప్టర్ ప్రారంభించి రాత్రికి ఆల్బనీ శ్రీమతి స్వాతి వేణు దరూరి దంపతుల గృహానికి వేంచేశారు. 29వ తేదీ ఆల్బనీ లోని Nano Technology Centreను దర్శించి, సాయంత్రం హిందూ టెంపుల్‌లో శ్రీవిష్ణుసహస్రనామ వైభవాన్ని అనుగ్రహించి, న్యూజెర్సీ చేరారు.

స్థానిక భక్తుల కోరికపై 30 వ తేదీ సాయంత్రం, జూలై 1వ తేదీ ద్వయ మంత్రార్థాన్ని అనుగ్రహించారు. నార్త్ అమెరికా తెలుగు సొసైటీ తరపున శ్రీమాన్ డా.ముక్కామల అప్పారావుగారి ఆహ్వానం మేరకు 2, 3 తేదీలలో ఎడిసన్ లో వారి కార్యక్రమానికి వేంచేసి మంగళాశాసనాలు కావించారు. 3వ తేదీ తిరిగి భారతదేశానికి వేంచేస్తారు.



# శ్రీశ్రీశ్రీ అహోబిల జీయరు స్వామివారి ప్రచార వివరములు



మే 22వ తేదీ నుండి జూన్ 6వ తేదీ వరకు శ్రీరామనగర్‌లో జీయర్ గురుకుల ఉపాధ్యాయు లకు, శ్రీహరి సత్సంగ సమితి రామకథకులకు జరిగిన శిక్షణతరగతులలో పాల్గొన్నారు. మధ్యలో 22వ తేదీ మహబూబ్‌నగర్ జిల్లాలోని పామిరెడ్డివల్లిగ్రామంలో 25 అడుగుల హనుమంతుని విగ్రహ ప్రతిష్ఠా కార్యక్రమంలో పాల్గొని నిర్వాహకులైన శ్రీమాన్ మన్నెపురెడ్డిగారికి, గ్రామస్థులకు, వి.టి. సభ్యులకు మంగళాశాసనాలు చేశారు.

జూన్ 2వ తేదీ హైదరాబాద్‌లో శ్రీమాన్ చీకోటి జనార్దన్‌గారి ఆహ్వానం మేరకు వారి గృహంలో జరిగే సుదర్శనహోమం పూర్ణాహుతిలో పాల్గొన్నారు.

జూన్ 9వ తేదీ బదరీయాత్రకై బయలుదేరి 15వ తేది రాత్రి శ్రీరామనగర్ చేరుకున్నారు.

16వ తేది సా॥ దిల్‌షుక్‌నగర్‌లో ఆలయ ఛైర్మన్ శ్రీమాన్ సి. రమణయ్యగారి ఆహ్వానం మేరకు శ్రీసత్యనారాయణస్వామి బ్రహ్మోత్సవాలలో పాల్గొని, శ్రీస్వామివారి వైభవాన్ని ప్రసంగించి 17వతేదీ ఉదయం లక్ష్మీ హవనంలో పాల్గొని, సాయంత్రం సామూహిక తులసీ పూజా కార్యక్రమం నిర్వహించారు.

రాత్రికి బయలుదేరి హుజూర్ నగర్ శ్రీమాన్ ముడుంబై జనార్దన్, కమిటీసభ్యుల ఆహ్వానం మేరకు 18,19,20 తేదీలలో కళ్యాణవేంకటేశ్వరస్వామి ప్రతిష్ఠా కార్యక్రమంలో పాల్గొన్నారు. ఈ కార్యక్రమంలో చుట్టుప్రక్కల గ్రామాలనుండి సుమారు లక్షమంది భక్తులు పాల్గొనుట ఆశ్చర్యకరము.

21,22,23 తేదీలలో కృష్ణాజిల్లా, గుడివాడ సమీపంలోని బేతవోలులో శ్రీమాన్ వీరాస్వామి నాయుడు ఆహ్వానించగా శ్రీ వేణుగోపాలస్వామి ఆలయంలో ఆళ్వార్ ఆచార్యుల, ధ్వజ ప్రతిష్ఠా కార్యక్రమాలు వైభవంగా నిర్వహించారు.

23వ తేదీ ఉ॥ సామూహిక లక్ష్మీనారాయణ వ్రతం జరిపించారు. అదేరోజు శ్రీశ్రీశ్రీ అహోబిల జీయరు స్వామివారి తిరునక్షత్ర సందర్భంగా వారి ఆచార్యులైన శ్రీశ్రీశ్రీ చిన్న జీయరు స్వామివారి పాదుకలకు అభిషేక కార్యక్రమం జరిపారు. సాయంత్రం ఘంటసాల పవన్‌కుమార్ శిష్య బృందంచే నృత్య ప్రదర్శన జరిగింది.

రాత్రికి చి॥ శ్రీనివాస్ వరప్రసాద్-పెనమలూరు ఆహ్వానించగా అక్కడి శ్రీవేణుగోపాలస్వామివారి ఆలయంలో 24వ తేదీ పూర్ణాహుతి, జరిపి భక్తులకు శ్రీకృష్ణుని వైభవాన్ని అందించి, మంగళాశాసనాలు చేశారు.

24 సా॥ నరసరావుపేట కోటప్పకొండలోని శ్రీనివాస్ నగర్‌లో శ్రీమాన్ చిలకపాటి విజయరాఘవాచార్యస్వామి, శ్రీమాన్ ఎమ్.ఆర్.కె. ప్రసాద్ మరియు ఆలయ కమిటీ ఆహ్వానంపై శ్రీకళ్యాణ వేంకటేశ్వరస్వామి ప్రతిష్ఠా కార్యక్రమంలో పాల్గొనుటకై వేంచేసి శ్రీనివాసుని వైభవాన్ని, శరణాగతి మాహాత్మ్యాన్ని ప్రవచనం చేశారు.

25వ తేదీ ప్రతిష్ఠా కార్యక్రమం జరిపి నిర్వాహకులు శ్రీమాన్ మోహనరావు, తిరుమల పాల డైరీ అధినేత శ్రీమాన్ వెంకట్రావు, శ్రీమాన్ బ్రహ్మానాయుడు మరియు ఆలయ కమిటీ సభ్యులకు మంగళాశాసనాలు చేసి రాత్రికి శ్రీరామనగర్ చేరుకున్నారు.

26వ తేదీ హైదరాబాద్ మాదాపూర్‌లో శ్రీ లక్ష్మీ, పద్మావతి సమేత వేంకటేశ్వరస్వామి ప్రతిష్ఠా కార్యక్రమాన్ని జరిపించారు. వ్యవస్థాపకులు శ్రీమాన్ హాథీరాం బాబా పరివారానికి మంగళాశాసనం చేశారు.

27వ తేదీ రాత్రి సూర్యాపేట శ్రీమాన్ సూర్య వెంకట సత్యనారాయణ వి.టి. జిల్లా అధ్యక్షుల స్వగృహంలో వేంచేసి 28,29 తేదీలలో విశ్వహిందూ పరిషత్‌వారి ఆధ్వర్యంలో నల్గొండలోని వాల్యాతండా, వల్లభాపురం, ఒంద్రుగొండ ప్రాంతాలలో ఆధ్యాత్మిక ప్రవచనాలు అందించారు. విశేషించి సంగ్యం గ్రామం ప్రక్కనగల శ్రీరాముని తండాలో శ్రీమాన్ రామకోటి అను భక్తునికోరికపై గుట్టపైగల శ్రీరాముని పాదాన్ని సందర్శించారు. ఆ ప్రాంతలలో చుట్టుప్రక్కల ఎక్కడ నీరు లేక పోయినా ఈ బండరాతిపైగల శ్రీరామపాదగుంటలో ఏడాది (365రోజులు) పొడుగునా నీరు ఊరుతూనే ఉంటుంది. ఆ ప్రాంతాన్ని రాముని తండగా పిలుస్తారు. అక్కడ దేవాలయ నిర్మాణానికి మంగళాశాసనం చేశారు. ఈ ప్రాంతాలన్ని నల్గొండ జిల్లా వి.టి. కన్వీనర్ శ్రీమాన్ ఎన్.సిహెచ్. వేణుగోపాలాచార్య స్వామి-సూర్యాపేట వి.టి. బృందం శ్రీస్వామివారితో కలసి అన్వయించారు.

29వ తేది ఎమ్. శ్రీనివాస్-సుధారాణి దంపతుల నూతన గృహంలో సుదర్శన హవన పూర్ణాహుతిలో పాల్గొని మత్స్యయంత్ర ప్రతిష్ఠ జరిపి విచ్చేసిన భక్తులకు శరణాగతి దీక్ష వైభవాన్ని అందించి రాత్రికి సీతానగరం చేరుకున్నారు.

---

**ఋషీకేశ్ జీమర్ మఠ్‌లో నూతన ఆలయం:**

మన జీయర్ మఠంలో నూతనంగా నిర్మించబడిన శ్రీ సీతారామలక్ష్మణ సమేత ఆంజనేయ స్వామి ఆలయాన్ని శ్రీశ్రీశ్రీ చిన్న జీయరు స్వామివారి శ్రీహస్తములతో 27.5.11న ప్రతిష్ఠించారు. ఈ ఆలయాన్ని దర్శించి, సేవించి తమ అభీష్టములను సిద్ధించుకోవలసినదిగా ఆహ్వానించుచున్నాం.

**ఇట్లు**

బదరీ అష్టాక్షరీ క్షేత్రీయ అన్నదానశాఖా సంఘం

**ఈ ఆలయంలో శాశ్వత పూజా కార్యక్రమాలు ఏర్పాటు చేయాలని శ్రీశ్రీశ్రీ స్వామివారి సంకల్పం.**

శాశ్వత ఆలయ నిర్వహణ సభ్యత్వం : 1,00,116/-

శాశ్వత పూజా కార్యక్రమంలో పాల్గొనుటకు : 10,116/-

| **వివరములకు:** | | |
|---|---|---|
| | జెట్ సీతానగరం | : 08645 272929 |
| | డా॥ రామనాథం | : 9347881779 |
| | సిహెచ్. వెంకటేశ్వరరావు | : 98430 30515 |
| | రవికుమార్ భట్టర్ | : 98490 13392 |

## శ్రీశ్రీశ్రీ త్రిదండి అహోబిల రామానుజ జీయరు స్వామివారిపర్యటన వివరములు :

**జులై 12,13, 14 తేదీలలో విజయనగరం వాస్తవ్యులు శ్రీ ఉ.వే. శ్రీమాన్ కందాళ వేంకటాచార్యస్వామివారి 81వ తిరునక్షత్ర స్మృత్యర్థం శ్రీత్రైవర్ణిక వైష్ణవ రామానుజ కూటం, కురుపాం మార్కెట్, మెయిన్‌రోడ్, విశాఖపట్నం - 1లో జరుగు పండిత సభలలో పాల్గొంటారు. జులై15వ తేదీ నుండి సెప్టెంబరు 12వ తేదీ వరకు శ్రీరామనగర్‌లో శ్రీశ్రీశ్రీ చిన్న జీయరు స్వామివారితో కలసి చాతుర్మాస్యదీక్షలో అన్వయిస్తారు.**

# మెదడుకి మేత!

భగవద్బంధువులారా! జిజ్ఞాసతో మీరంతా చదువుతూ ఆదరిస్తున్న 'భక్తినివేదన'లో మీకోసం ఈ శీర్షిక! **ఈ పత్రిక లోని వ్యాసాలనుండే మీకు ప్రశ్నలిస్తున్నాం!** అయినా మరొక్కసారి జ్ఞాపకం చేసుకోవడం మనస్సుకి ఆనందమని మెదడుకీ చిన్నమేత! అన్నీ సరిగా వ్రాస్తే ఆకర్షణీయ బహుమతులు! ప్రతినెల 20వ తేదీలోపు మాకందిన సమాధానాలని మాత్రమే పరిశీలిస్తాం! ఆ పై దాటివచ్చినవి పరిశీలింపబడవు. దీనిపై ఎలాంటి ఉత్తర ప్రత్యుత్తరాలు ఉండవు. శ్రద్ధతో మీరు పంపిన గత నెల సమాధానాలందాయి. విజేతల పేర్లు క్రింద ప్రకటించాము. బహుమతులు పంపిస్తాం!

| ప్రశ్నలు | సమాధానాలు |
|---|---|
| 1. 'భగవంతుడి గీతే' అయినా ప్రథమాధ్యాయంలో ఆయన ఆడిన మాటలు | |
| 2. ఆదర్శదంపతులు, లోకహితం కోసం వచ్చి------సార్లు ఎడబాసారు. | |
| 3. అష్టాంగవిమానంతో వెలసిన మొదటి క్షేత్రం--------. | |
| 4. కవులు, చెవిని దీనితో పోలుస్తారు! | |
| 5. భగవంతుని పూర్ణతను తెలిపే నామం----- | |
| 6. వాదనలో గెలిచిన పండితులకి లభించేది---------- | |
| 7. రావణుడు కూడా రాముణ్ణి ఇలా పొగిడాడు----------- | |
| 8. మోక్షం కోరిన ఋషులకి స్వయంగ బ్రహ్మయే ఇచ్చిన శరణాగతిదీక్ష------ | |
| 9. జగద్రక్షకునికే రక్ష పెట్టి విష్ణుచిత్తులు----గ ప్రసిద్ధినొందారు. | |
| 10. రాజుకి తెలియాల్సిన నాలుగుఉపాయాలు? | |
| 11. తక్షకుడినుండి పరీక్షిత్‌ను కాపాడాలనుకున్న మహర్షి------ | |
| 12. పేయాళ్వార్ అవతరించినది ఇక్కడే------.? | |
| 13. భక్తులకు అశుభమనేదే ఉండదు. అనే మాట తెలిపే శ్లోకభాగం----------. | |
| 14. వేదవతి అగ్నిలో దాగి ఉన్నప్పడు ఈ పేరుతో ప్రసిద్ధి చెందింది---------. | |
| 15. భక్తిసారులు నృసింహుని ప్రశంసించిన పాశురం------- | |
| 16. స్వర్గసుఖాలు కావాలా? ఈ యాగం చేయండి. | |
| 17. బుద్ధిమంతులు ముప్పొద్దులా వీటితో కాలక్షేపం చేస్తారు---------. | |
| 18. మనిషి వీటిని కుటుంబ, సమాజ శ్రేయస్సుకై వినియోగిస్తే తరిస్తాడు. | |
| 19. పూదత్తాళ్వార్ -----------దిట్ట గనకనే ----------అన్పించుకున్నారు. | |
| 20. పరమపదనాథుని పీఠాన్ని ధరించే ఎనిమిది శక్తులు--------- | |
| 21. విల్లిపుత్తూరులో వెలసిన దైవానికి తమిళంలో పేరు? | |
| 22. చిలుక భగవద్గీత గురించి చెప్పిన సారం? | |
| 23. 'మనిషి' కి యాస్కాచార్యుల నిర్వచనం----- | |
| 24. 'జగత్కారణము' అంటే ఇవన్నీ చేసేది. ఏవి? | |
| 25. అనూచ్చారణమనగా | |

**గత నెల విజేతలు:** దాసరి రజని–విజయనగరం, వి.ఎస్.వేణు మల్లిక్–హైదరాబాద్, కె. శ్రీనివాసరావు–పొదిలి, జయలక్ష్మి రామానుజదాసి - చెన్నై, జి. రాజ్యలక్ష్మి - గుంటూరు, ఎ. రామచంద్రారెడ్డి–హనుమకొండ, యర్రమిల్లి జయలక్ష్మి–రాజమహేంద్రి.

**సూచన: సమాధానాలు ఈ పత్రంలోనే నింపి, 20వ తేదీలోపు అందేట్టు పంపగలరు.**
**భక్తినివేదన శ్రీరాంనగరం, ముచ్చింతల్, పాలమాకుల పోస్ట్ 509 325 శంషాబాద్, రంగారెడ్డి జిల్లా. ఆంధ్రప్రదేశ్.**

శ్రీమతే నారాయణాయ నమః



శ్రీమతే రామానుజాయ నమః





64 సం॥ల నుండి అశేష భగవద్బంధువులు ఆదరిస్తున్న...

ఆధ్యాత్మికమాసపత్రిక

# భక్తినివేదన

శ్రీఖరనామ సంవత్సర శ్రావణమాసం


సంపుటి 64 ఆగస్టు

సంచిక 5 2011


## పండుగలు

**ఆగస్టు:**

5. సుదర్శనాళ్వాన్ తిరు॥
7. అవమతిథి, ఆశ్లేషకార్తె.
9. సర్వేషామేకాదశి
12. వరలక్ష్మీవ్రతం, వరాహజయంతి, ఆళవందార్ తిరు॥, పుండరీకాక్షుల తిరు ॥
13. ఋగ్వేద,యజుర్వేదులకు ఉపాకర్మ, హయగ్రీవ జయంతి, రాఖీపూర్ణిమ, విఖనస జయంతి, నవోపాకర్మ
15. భారత స్వాతంత్ర్య దినం
17. శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జీయరు స్వామివారి తిరునక్షత్రము, మఖకార్తె, సింహ సంక్రమణము.
18. త్రిద్యుస్పృక్
21. స్మార్త శ్రీకృష్ణజయంతి
23. శ్రీ వైష్ణవానాం శ్రీకృష్ణ జన్మాష్టమి
25. సర్వేషామేకాదశి
27. మాసశివరాత్రి
28. పిండపితృయజ్ఞము
29. అమాసోమవారవ్రతం, పోలాలమావాస్య.
30. అవమతిథి
31. బలరామ జయంతి, అట్లతదియ, షోడశోమావ్రతం

**సెప్టెంబరు :**

1. విఘ్ననివారణ చతుర్థి, విష్వక్సేన పూజ
2. ఋషి పంచమి
3. సూర్యషష్ఠి
5. తిథిద్వయం
8. సర్వేషామేకాదశి


వ్యవస్థాపకులు

పరమహంస పరివ్రాజకాచార్య

**శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జీయరుస్వామివారు**

సంపాదకులు

శ్రీఉ.వే.శ్రీమాన్ **T.P. శ్రీరామచంద్రాచార్యులు**


## విషయ సూచిక




Printed & Published by H.H. Tridandi Chinna Srimannarayana Ramanuja Jeeyar Swamiji on behalf of **Jeeyar Educational Trust** and Printed at **Sriman Printers & Processors** C/o JET, Sitanagaram-522 501, Guntur Dist., Andhrapradesh. **Published at** C/o JET, Sitanagaram-522 501 Guntur Dist, Andhrapradesh, Editor: Sri **T.P.Sriramachandracharya** S/o. Sri Sitaramacharyulu, No: 5-74, Ayodhya, Visakhapatnam- Andhra Pradesh.


చందావివరాలు :- సంవత్సరచందా రూ.225/-

విదేశాలకు సంవత్సరచందా $30/-



క్రొత్తగా సంవత్సర చందాదారులుగా చేరువారు సభ్యత్వ నమోదు, రూ.25/-లు (విదేశాలకు $5) అదనంగా చెల్లించవలెను. ఆపై ప్రతి సంవత్సరం సకాలంలో వార్షిక చందా చెల్లించిన చాలు.


E-mail : **jetsitanagaram@yahoo.com**

Internet : www.chinnajeeyar.org



D.T.P. & Design by :

పరిశోధనాలయమ్,

ముద్రణ : శ్రీమాన్ ప్రింటర్స్ & ప్రాసెసర్స్, సీతానగరం



మీ సేవలో.... భక్తినివేదన, సీతానగరం - 522 501, గుంటూరు జిల్లా, ఆంధ్రప్రదేశ్. 08645 272929.

# శ్రీశ్రీశ్రీ స్వామివారి సందేశం

## 2001 శ్రీవారి ప్రవచనముల నుండి

మన భారతదేశం ఆధ్యాత్మికంగా ఎంతో అభివృద్ధి చెందిన దేశం. ప్రపంచంలో భారతజాతి మహోన్నతమైనదనే భావం మనలోనే కాదు విశ్వమానవాళిలోనూ కనిపిస్తుంది.

నువ్వు బ్రతుకు, నేను బ్రతుకుతాను, నీ ఆశయం నీది, నా ఆశయం నాది. ఇద్దరం ఒకళ్ళనొకళ్ళం గౌరవించుకుందాం! ఇద్దరం కలసి మన సాటివాడికి చేతనైన మంచిచేద్దాం. ఈ సహజీవన శ్రుతికి భాష, మతం, వేషం, ఆచారం, కట్టుబొట్టు ఏదీ అవరోధం కాదు. ఇందుకోసం ఎవరూ దేన్నీ వదులుకోవాల్సిన పనిలేదు. భారతీయమైన వసుధైవకుటుంబక భావనమూ ఇంతే! భిన్నత్వంలో ఏకత్వం-ఏకత్వంలో భిన్నత్వమూ కూడా ఈ భారతీయ భావనంలో ఒదిగి ఉన్నాయి.

ఎక్కడెక్కడ ఎవరెవరిలో ఏ ఆచారాలుంటే వాటిని గౌరవించి, వాటిని రక్షించి, వాటిని వారాచరించుకోగలిగేట్టు చేస్తూ అందులో ఎక్కడ ఏది మంచిగా కనిపిస్తే దాన్ని అందరం గ్రహించి పాటిద్దామనే విశ్వాసం ఈ భారతజాతిది.

వ్యక్తికి నాలుగు మార్గాలు చూపించి "నాయనా! నీకేది మంచిది అని అనుకుంటావో ఆ మార్గంలోంచే ఉత్తమగతిని నువ్వు చేరవచ్చును" అని చెప్పడం మన జాతి గొప్పదనం. భగవంతుడు తీపి, కారం, పులుపులను పుట్టించినట్లే చేదును కూడా పుట్టించాడు. ఒక రకమైన జిహ్వా కలిగిన వాడికి తీపి అవసరమైనట్లే, వేరొక రకమైన జిహ్వా కలవాడికి చేదు కూడా అవసరమే! వేపచెట్టు మీద ఉండే పురుగు చేదే తింటుంది. చేదు చెడ్డదని ఆ వేప పురుగును తెచ్చి పాలల్లోనో, పంచదారల్లోనో వేస్తే అది కాస్తా చనిపోతుంది.

తినడం చేతకాని పిల్లవాణ్ణి చంకనెత్తుకొని అన్నాన్ని మెత్తగా గుజ్జులా చేసి గోరుముద్దలు తినిపించే తల్లిలా ఈ జాతి కూడా మానవమనుగడకు అన్ని మతాలూ అవసరమనుకుంది. కాని పాశ్చాత్యులు తమఆచరణ తప్ప మిగతావన్నీ పనికిరానివి, వాటిని నిర్మూలించడమే తమ కర్తవ్యం అనుకున్నారు. ఇప్పటికీ అలానేఉన్నారు.

కానీ, భారతీయుల సంస్కారం చాలా విలక్షణమైనది. ఏ ప్రాంతానికి వెళ్ళినా అక్కడ ప్రాంతీయమైన ఆచారాన్ని గౌరవిస్తూ తమ ఆచారాలను వదులుకోకుండా ప్రవరిస్తూంటారు.

బహుశా చాలమందికి తెలుసును, పుట్టిన రోజు పండుగ వచ్చింది కదా అని బ్రిటీష్ రాణీగారికి అగ్గిపెట్టెలో చీరనందిస్తే 'ఎంత గొప్పపని చేసావయ్యా!' అని ఆనందించి ప్రోత్సహించాల్సింది పోయి, ఆతనిని పిలిపించి అటువంటి అద్భుతమైన వస్తువు ఇక ఇతరులకందకుండా ఆ చేసినవాని వ్రేళ్ళు నరికివేయించిందిట. ఇదీ వారి చరిత్ర! హుబ్లీ బ్రిడ్జ్ వంటి వాటిమీద ఓడ వస్తే బ్రిడ్జే తెరుచుకుని ఓడ వెళ్ళగానే మళ్ళీ బ్రిడ్జ్ మూసుకొని అది రోడ్డు క్రింద ఉపయోగించేటట్లుగా నిర్మించే మన ఇంజినీర్స్ స్కిల్స్‌ని చూచి ప్రోత్సహించకపోతే పోయే, కనీసం సంతోషించనూ లేక వాళ్ళ తలలు తీసేసిన జాతులు, ఆయా జాతులు. కానీ మన భారతజాతి ఎప్పుడూ అట్లా చేయలేదు.

కానీ, మన దురదృష్టం, అసలు మనకు గొప్ప చరిత్ర ఉందని, దానిని మనదాకా అందించిన ఎంతోమంది మహానుభావులకృషి దీని వెనుకఉందనీ మరిచాం. మన పేరేమిటో, ఊరేమిటో, మన వంశ వైభవమేమిటో మరిచాం. ఎక్కడో ఏదో ఉందని పరుగులు పెడుతున్నాం. మన పూర్వుల చరిత్రని, జన్మభూమిని, కన్నవారిని వదిలి ఎక్కడికో ఎగిరిపోవాలని చూస్తున్నాం.

మనజాతి ఆచార, వ్యవహార ధర్మాలని, దైవాన్ని కనీసం విశ్వసించే ప్రయత్నం చేద్దాం!!!

సంపాదకీయం

# .... తస్య తుష్యతి కేశవః



మానవుడు ఎంత ఐశ్వర్యం సంపాదించినా, ఎన్ని భోగాలు తాననుభవించినా, అవి అతనికి పరమ ప్రాప్యాలు కావు. అంత మాత్రాన అతని జన్మ చరితార్థమూ కాదు. అర్థసంపాదన కావాలి, సుఖానుభవాలు కావాలి. అవి అతని జీవితంలో ఒక భాగమే కాని అవే జీవితం కాదు. చతుర్విధ పురుషార్థాలలో అర్థ, కామాలూ ఉన్నాయి. అయితే, అవి ధర్మానుమతాలు కావాలి. మోక్షాభిముఖాలు కావాలి. అప్పడే అతని జని చరితార్థం అవుతుంది. భౌతికజీవనం మాత్రమే కాక, ఆధ్యాత్మిక గతి అనేది ఒకటి ఉన్నదని, అదే పరమో పాదేయమనీ, భౌతికజీవనం దాన్ని పొందడానికి ఒక సాధనం మాత్రమే అని, అతడు గుర్తించాలి.

అట్లాంటి తెలివితో విశ్వాసంతో భగవంతుని ఉనికిని గుర్తెరిగి, ఆయననుపాసించి, ఆయన అనుగ్రహానికి పాత్రుడై ఆయన శ్రీ చరణాల దరిచేరి, నిత్యకైంకర్య లాభ ధన్యుడు కావాలి. అట్లా కాగలిగిన వాడే మానవజన్మ చరితార్థం అవుతుంది.

ఇట్లాంటి చారితార్థ్యాన్ని అతడు పొందలేకపోతే జనన మరణ చక్రభ్రమణంలో చిక్కుకోక తప్పదు. అందులో పడ్డాక ఏమో! ఉత్తమ జన్మరావచ్చు-నీచ జన్మరావచ్చు-స్వర్గాది సుఖానుభవాలు రావచ్చు- నరకాది దురంత దుఃఖాలు రావచ్చు- ఎవరు చెప్పగలరు! ఉత్తమమైన, పరిపుష్టమైన సకల జంతు స్పృహణీయమైన మానవజన్మనుండే ఊర్ధ్వగతులు పొందలేనివాడు అంతకంటే ఉత్తమజన్మను పొందగలగడం సంభావ్యమా! అంచేత దీపం ఉండగనే ఇల్లు చక్కపెట్టుకోవాల న్నట్లు ఈ దొరక్క దొరక్క దొరికిన మానవజన్మను వమ్ము చేసుకోకుండా, ఊర్ధ్వగతులు పొందడానికి అపునరావృత్తి రూపమైన మోక్షాన్ని పొందడానికి పరమపదంలో పరమాత్మ సన్నిధిని నిత్యకైంకర్యనిరతుడు కావడానికి ప్రయత్నించాలి.

ఇంతకూ ఇందుకు ఏం చెయ్యాలి? ఇది ఎల్లా సాధ్యం? కర్మాచరణం వల్లనా, జ్ఞాన సముపార్జన వల్లనా, భక్తివల్లనా, ప్రపత్తివల్లనా, దేనివల్ల ఈ స్థితి సమకూరుతుంది.

భగవంతుణ్ణి పొందడానికి ఇవేమీ సాధనాలు కావంటుంది ఉపనిషత్తు.

**"నాయమాత్మా ప్రవచనేన లభ్యః న మేధయా న బహునాశ్రుతేన।**
**యమేవైషవృణుతే తేన లభ్యః తస్యైషాత్మావివృణుతే తనూం స్వామ్॥**

కేవల శ్రవణ మననాదుల వల్ల పరమాత్మ లభించడు. ఎవని తాను దరిచేర్చుకోవాలని కోరుకుంటాడో, వారికే లభిస్తాడు. తనకు ఇష్టుడైన భక్తునికే పరమాత్మ తన స్వరూపాన్ని ప్రకటిస్తాడు.

ఆయన కోరుకొనేదెవరిని? ఎవరిని తానిష్టపడతాడో వారిని కోరుకుంటాడు. ఎవరిని ఇష్టపడతాడు? ఎవరు తమ వర్తనాదికంవల్ల తనకు సంతోషం కలిగిస్తారో వారినిష్టపడతాడు. వారికే తాను సాక్షాత్కరిస్తాడు. ఎవరికి తాను సాక్షాత్కరిస్తాడో వారికి తన సాన్నిధ్యాన్ని, నిత్యకైంకర్యాన్ని ప్రసాదిస్తాడు.

ఇంతకూ ఆయన ఎవరిని ఇష్టపడతాడు? ఎలా వీరుంటే ఆయన ఇష్టపడతాడు? అన్న వివరాలని వేదోపబృంహణాలైన పురాణాలు మనోరంజకంగా శ్రుతిసుభగంగా బహుధా పేర్కొన్నాయి.

ఎల్లాంటి జీవితం మానవుడు గడిపితే శ్రీహరి తాను సంతోష పడతాడో విష్ణు ధర్మోత్తర పురాణం "...తస్య తుష్యతి కేశవః, ...తస్యతుష్యతి కేశవః" అంటూ చాలా విపులంగా విశదీకరించింది, అవలోకించండి.

మనిషి ప్రధానంగా అహింసారతుడు, సత్యవ్రతుడు, దయాళువు, సకల భూతానుగ్రహం కలవాడు కావాలి. మాతా, పితరులను, గురుజనులను అనువర్తించువాడు కావాలి. మధు, మాంసములను వర్జించాలి. భగవన్నిర్మాల్యాన్ని ప్రసాదంగా తాను స్వీకరించి ఒకరులకివ్వాలి. ఒరులను నొప్పించు పనులు చేయనివాడు కావాలి. తన ఆహారం నుంచి కొంత విభజించి, భూతకోటికి పెట్టాలి. దేనియందూ అసూయ కలవాడు కారాదు. క్రోధాన్ని అదుపులో పెట్టుకోవాలి. తీర్థయాత్రలు చేయాలి. ద్విజ సమూహ సేవనం కావించాలి. విశేషించి, విష్ణుభక్తులైనవారిని పూజించాలి.

వేకువనే లేచి, విష్ణుసహస్రనామ స్తోత్రానుసంధానం కావించుకోవాలి. శక్తిగలవారు పురుషసూక్తంతో జపహోమాదు లాచరించాలి. మిత్రులపట్ల, యజమానుల పట్ల, ద్రోహ బుద్ధి లేక ఉండాలి. పరదార, పరధనేచ్ఛాపరుడు కారాదు. స్వ వర్ణాశ్రమధర్మాలను పాటిస్తూ, మధుసూదనుని ఆరాధించాలి. సర్వమునూ కృష్ణుని యందు, సర్వమునందు కృష్ణునీ, సందర్శించగలగాలి. శ్రీహరి కథల యందు ప్రీతితో ఉండాలి. అంతేదాకు, ఆయన కథలనే ప్రస్తుతించాలి. తన్మనస్కుడు, తద్గతప్రాణుడు కావాలి. తుమ్ము, ఆవులింత మొదలైనవి వచ్చినప్పడు 'కృష్ణకృష్ణ' అనుకోవాలి.

పండ్లు, పువ్వు, ఆకు, ఇట్లా ఏది కొత్తగా లభించినా, ముందు భగవానునికర్పించి, తరువాత తాననుభవించాలి. నిత్యమూ యథాశక్తిగా దేవదేవుని ఆరాధించుకోవాలి. దానాదులవల్ల, వివిధ రత్న, ధన సంచయాదుల వల్ల, భగవంతుడు సంతోషపడడు. భక్తికి మాత్రమే సంతోషిస్తాడు. తదేకాగ్రచిత్తుల భక్తి చేత, సంతోషించినంతగా, తీర్థాటనములు, వివిధవ్రతోపవాసములు మొదలైన వానివలన శ్రీహరి సంతోషపడడు.

ఇవన్నీ, భగవదనుగ్రహం కోరిన మానవుడు పాటించవలసిన ధర్మాలు. ఈ ప్రకారం మనిషి నడచుకొంటే అతడు పరిపూర్ణుడౌతాడు. ఒరులకు ఒజ్జబంతి తానవుతాడు. ఇట్టివారితో నిండిన సమాజం ఆధ్యాత్మికసౌరభాలు గుబాళించి సర్వులకూ ఆదర్శమూ అనువర్తనీయమూ అవుతుంది.

ఈ విధమైన వర్తనం గలవారి భక్తికి కేశవుడు మెచ్చుకొని సంతోషిస్తాడు. వారినే తాను ఇష్టపడతాడు. వారినే తనకు ప్రియతముగా భావించి, స్వీకరిస్తాడు. శ్రీహరి తానుగా మెచ్చుకొని ఆదరించడం కంటే, దరిచేర్చుకోవడం కంటే, ఒక చేతనునికి స్పృహణీయం వేరు ఏముంటుంది! అతనికి సిద్ధించనిదేముంటుంది! అతనికంటే చరితార్థులెవరుంటారు!

-శ్రీరామచంద్రాచార్య



# య ఏవం వేద...



శ్రీమాన్ గుదిమెళ్ళ మురళీకృష్ణమాచార్యస్వామి-భద్రాచలం

*గత సంచిక తరువాయి...*

బృహదారణ్యకోపనిషత్ వేదమును భగవంతుని 'నిశ్వసితం'గా ప్రకటించింది. నిత్యమూ జరిగే శ్వాస ప్రక్రియలో భాగంగా పీల్చిన గాలిన విడిచిపెట్టడాన్ని నిశ్వసితం అని అంటారు. దీనికే నిశ్వాసము అని పేరు.

ఉచ్ఛ్వాసము అంటే గాలిని పీల్చుట, నిశ్వాసము అంటే ఆ పీల్చిన గాలిని విడిచి పెట్టుట అని సామాన్యార్థములు.

శ్వస అంటే ప్రాణము అని అర్థం. 'శ్వస-ప్రాణనే' అనే ధాతువు నుండి ఏర్పడిన పదమిది. తెలుగులో ఈ శ్వాసనే ఊపిరి అని అంటాము.

ఉచ్ఛ్వాసము అనగా ప్రాణవాయువును ఆస్వాదించుట, తద్వారా ప్రాణమును ధరించి మరల క్రొత్త ప్రాణవాయువును ఆస్వాదించడానికి వీలుగా పీల్చిన దానిని నిశ్వాసము ద్వారా విడిచి పెట్టుట. దీనినే శ్వాస ప్రక్రియ, లేదా ప్రాణధారణ ప్రక్రియ అని అంటారు. ఏతావతా ప్రాణాన్ని ధరించి ఉండాలంటే ఈ ప్రక్రియ నిరంతరంగా సాగుతూండవలసినదే. ఇది ప్రతిజీవి విషయంలో అప్రయత్నంగా, అంతరాయం లేకుండా సాగే ప్రక్రియ.

ఏ జీవికూడ తన ప్రయత్నంతో ఉచ్ఛ్వాస నిశ్వాసములను చేస్తూ ఉండదు. ఇవి మన ప్రయత్నంతోనే సాగేవి అయితే ఏమాత్రం పొరపాటుగా మనం మధ్యలో ఆపినా ప్రాణ ప్రయాణం తప్పదు. అంతేగాక, ప్రాణధారణమే లక్ష్యంగా ఈ పనినే మనం చేస్తూంటే కనుక దీనిని తప్ప ఇంక ఏ పనినీ మనం చేయలేము.

అందుకే భగవంతుడు, పూర్వకర్మానురూపంగా, మనం చేయవలసిన పనులను చేసుకోవడానికి అనువుగా అవశ్య భవ్యాలైన వీటిని అప్రయత్న క్రియలుగా చేసి మనకు మహోపకారం చేశాడు. ఈ ఉచ్ఛ్వాస నిశ్వాములే ప్రయత్న సాధ్యాలు అయితే కనుక మన మనుగడ సాగడం అసాధ్యమే కదా! అందుకే వీటిని జీవ సంజ్ఞలుగా వ్యవహరిస్తారు. జీవం ఉన్నచోట ఈ ప్రక్రియ ఆగదు. ఇది సాగనిచోట జీవం నిలువదు.

పై ఉపనిషత్ చెప్పిన దాని ప్రకారం ఈ ఉచ్ఛ్వాస నిశ్వాస ప్రక్రియ మనకు మాత్రమే కాదు... సకల జగత్కారణమైన పరమాత్మకు కూడ ఉండడం విశేషం. అయితే మనకు సంబంధించిన ఈ ప్రక్రియ ఆయన చేతుల్లో ఉంది. ఆయనకు సంబంధించినది ఆయన చేతుల్లోనే ఉంటుంది. అది మన పట్ల భవ్యము (కాదగినది) అయితే ఆయన పట్ల దివ్యము (లీలావిలాసమైనది) అని శాస్త్రవచనము.

పంచభూతాల సమాహారమైన శరీరం మనది. పంచ ఉపనిషణ్మయమైన దేహం భగవంతునిది. మన ఉచ్ఛ్వాస నిశ్వాసములు ప్రాణవాయువులైతే... భగవంతునివి ప్రణవ మంత్రాక్షరములు. ప్రళయ కాలంలో యావత్ సృష్టి ఒకదానిలో ఒకటి లీనమౌతూ మూడు లోకాలూ ఋగాది మూడు వేదములలో, అవి భూరాది మూడు వ్యాహృతులలో, అవి అ-ఉ-మ అనే ప్రణవాక్షరాలలో, అవి వాటిలో ప్రకృతి రూపమైన అకారంలో లీనమై, అది భగవత్స్వరూపమై పర్యవసించడమే... భగవంతుని ఉచ్ఛ్వాసము.

మళ్ళీ కేనాహ మే కేనాక్షరేణ సర్వాంశ్చ లోకాన్, సర్వాంశ్చ దేవాన్, సర్వాంశ్చ వేదాన్, సర్వాంశ్చ యజ్ఞాన్, సర్వాంశ్చ శబ్దాన్, సర్వాశ్చ వ్యుష్టీః, సర్వాణి చ భూతాని స్థావర జంగమాన్యనుభవేయమితి... అని సృష్టి చింతను పొందిన సమయంలో ఆ భగవంతుని నుండి అప్రయత్నంగా, సకల జగత్ సృష్టి నిదానములుగా వెలువడిన వేదములే భగవంతుని నిశ్వాసము.

వేదాంత పరిభాషలో చెప్పుకోవాలంటే అతని ఉచ్ఛ్వాసమే... లయము. అతని నిశ్వాసమే సృష్టి. జీవ-జగత్తులు రెండూ భగవత్స్వరూపంతో చేరితే అది లయము.

భగవంతుడే జీవ జగత్తులను వెలువరిస్తే... అదే సృష్టి. సూక్ష్మేక్షికతో పర్యాలోకిస్తే సృష్టికి-లయానికి మధ్య స్థితి కాలమంతా భగవంతుని ఉచ్ఛ్వాస నిశ్వాసముల మధ్య జరిగే

ప్రాణధారణ కాలమంత... అనే విషయం ఆశ్చర్యాన్ని కలిగిస్తుంది. ఏతావతా భగవంతుని నిశ్వాసోచ్ఛ్వాసములు రెండూ సృష్టి లయములకు సంకేతములు అనే విషయాన్ని 'నిశ్వసితం' అనే బృహదారణ్యకోపనిషత్ పదం మర్మగర్భంగా వ్యాఖ్యానిస్తోంది. వేదము భగవన్నిశ్వాసముగా వెలువడినది... అని చెప్పడం వలన అకార వాచ్యుడైన పరమాత్మలో ప్రకృతి రూప అకారమై చేరి ఉన్న వేదము సృష్టికి సంకేతముగా ఆవిష్కృతమైనది అని తెలుస్తోంది.

అలా **'నిశ్వసిత'**మైన వేదమును **'అపౌరుషేయము'** అని స్మృతీతిహాస పురాణాది వాఙ్మయమంతా సంభావించింది. మహర్షులంతా ఆ భావనముందు శిరసు వంచి వేదహృదయా నికి అనుగుణముగా తమ తమ వాఙ్మయాన్ని వెలయించారు. ఇది యుగయుగాలుగా నమ్ముతున్న సత్యం.

వేదహృదయాన్ని ఎరుగనివారు, ఏమాత్రం వేద సంబంధ గంధం లేనివారు దీనియొక్క అపౌరుషేయత్వాన్ని శంకిస్తే... వారిపట్ల జాలిపడడం తప్ప మనమింకేమి చేయగలం!!? వారికి యథార్థ జ్ఞానాన్ని పొందగలిగే యోగ్యతను ప్రసాదించమని ఆ వేదవేద్యుడైన పరమాత్మను వేడుకుందాం!!

నిజానికి ఏ పురుషునితో నిమిత్తం లేకుండా అర్థవంతము, అఖిల ధర్మమూలమూ అయిన **'వేదము'** అనే ఇంత బృహత్తమమైన వాఙ్మయం ఆవిర్భవించిందీ... అని ప్రకటించాలంటే ఎంతటి హృదయ సంస్కారం ఉండాలి?!! ఉన్నా... వేదంలోని నిత్యనూతనమైన అంశాలను గమనిస్తు న్నప్పుడు ఆ సంస్కారం శంకాగ్రస్తం కాకుండా ఉండాలంటే ఆ వేదంపై ఎంత విశ్వాసముండాలి?! అంతటి విశ్వాసం మన పూర్వులైన మహర్షులలో కుదురుకున్నదీ... అంటే ఆ వేదంలో ఎంత విజ్ఞానం... ఉండాలి...!!

వేదంయొక్క **'అపౌరుషేయత్వం'** విషయంలో మన పూర్వులు మనకంటే దీక్షగా, దీర్ఘంగా శాస్త్రీయంగా ఎన్నో చర్చలు జరిపారు.

దీనిలోని అనంతమైన విజ్ఞానాన్ని ఆస్వాదిస్తూ, ఆదరాతిశయాలు ఉండి కూడ దీని 'అపౌరుషేయత్వాన్ని' గురించి సుదీర్ఘంగా చర్చించిన వారూ ఎందరో ఉన్నారు. అందరికీ ఒకే సందేహం... వేదమంతా శబ్దరూపమే కదా! అసలు శబ్దం అనేది స్వతంత్ర ప్రమాణం కాదు కదా?! ప్రత్యక్షంగా కాని, అనుమాన ప్రమాణంతోకాని అధిగతమైన విషయాన్ని అనువదించి చెప్పడమే కదా... శబ్ద స్వభావము! అదీగాక ఆప్తుడైనవాడు చెప్పినప్పుడే ఆ శబ్దం, ఆప్తోచ్చరిత ప్రమాణం అవుతుంది. ఆప్తస్తు యథార్థ వక్తా అను సూత్రాన్ని అనుసరించి ఆప్తుడు అంటే ఉన్న దానిని ఉన్నట్లుగా చెప్పేవాడు అని అర్థం. ఆప్తవాక్యం శబ్దః, ఆప్తవాక్యం ప్రమాణం... ఇత్యాది న్యాయశాస్త్ర నియమాలను బట్టి అలాంటివాడు చెప్పిన విషయమునే కదా... మనం శబ్ద ప్రమాణంగా స్వీకరించడం జరుగుతోంది. అలాంటప్పుడు వేదమునకు కర్తయే లేదని అంటే... అతడు ఆప్తుడా??! అనాప్తుడా? అనే ప్రశ్నే ఉండదు.

ఆప్తవాక్యమైన శబ్దమే ప్రమాణము అనే శబ్ద ప్రామాణ్యము వేదం విషయంలో పొసగదు. అలాంటప్పుడు మూలఘాతములాగ వేదము అప్రమాణము అనవలసి వస్తుందేమో కదా!!

శాస్త్రీయమైన ఈ సందేహానికి దార్శనికులైన మన మహర్షులు చక్కని సమాధానాలను ప్రసాదించారు.

ప్రమాణము... అంటే యథార్థ జ్ఞానమును కలిగించునది అని అర్థం. ప్రమాకరణం ప్రమాణం... అని దాని నిర్వచనము. ఇది అన్ని ప్రమాణాలకు సాధారణము. ఆ యథార్థ జ్ఞానాన్ని కలిగించే విధానాన్ని బట్టి అది ప్రత్యక్షమా!!, అనుమానమా!!? లేక శబ్దమా!! అనే ప్రమాణ నిర్దేశం జరుగుతుంది.

ఏ ప్రమాణమైనా యథార్థజ్ఞానమును కలిగించినప్పుడే సార్థకమవుతుంది. అ యథార్థజ్ఞానం కలగడానికి కల ఇతర కారణాల గురించి కూడ మన పెద్దలు క్షుణ్ణంగా పరిశీలించారు.. ఆ లోతుపాతుల జోలికి పోకుండా మన అర్హతను-ఆవశ్యకతను బట్టి కొన్ని విషయాలను మాత్రం తెలుసుకునే ప్రయత్నం చేద్దాము.

# కలివైరిసూరి వైభవము



గత సంచిక తరువాయి...

శ్రీ ఉ.వే.శ్రీమాన్ కె. టి. రామానుజాచార్యస్వామి-నెల్లూరు

**తిరుమంగై ఆళ్వార్- పెరియ తిరుమొழி 1-7-5**

పా॥ మెన్న పేழ்வాయ్ వాళెయిత్తు ఓర్కోళ్ అరియాయ్
అవుణన్ పొన్నవాకం వళ్ళుకిరాల్ పోழ்న్ద పునితనిడమ్।
నిన్తశెన్దీయొణ్డు శూழై నీళ్ విశుమ్బూడిరియ
చ్చెన్ను కాణ్డఱ్కరియ కోయిల్ శిఙ్గవేழ்కున్నమే ॥

**ప్రతిపదార్థము:** మెన్న=నమలుచున్నటువంటి; **పేழ்వాయ్**=పెద్దనోరును; **వాళ్**=ఖడ్గమువంటి; **ఎయిఱు**=దంతములును కలిగినట్టియు, **కోళ్**=బలమును కలిగినట్టియు; **ఓర్**=అద్వితీయమైనట్టిదియు అయిన, **అరియాయ్**=నరసింహమై, **పొన్న**=చచ్చిన; **అవుణన్**=హిరణ్యకశిపునియొక్క; **ఆకమ్**=శరీరమును **వళ్ ఉకిరాల్**=పదునైన గోళ్ళతో; **పోழ்న్ద**=చీల్చివేసిన; **పునితన్**=పవిత్రుడైనవానియొక్క; **ఇడమ్**=స్థానము; **నిన్త**=స్థిరముగానున్న; **శెంతీ**=ఎఱ్ఱనైన అగ్నిని; **శూழை**=సుడిగాలి; **యొణ్డు**=గ్రహించి; **నీళ్ విశుమ్బూడు**=సువిశాలమగు ఆకాశముయొక్క మధ్యభాగమున; **ఇరియ**=వీయగ; **శెన్ను**=వెళ్ళి; **కాణ్డఱ్కు**=చూచుటకు; **అరియ**=సాధ్యముకాని; **కోయిల్**=రాజభవనమైనది; **శింగవేழ்కున్నమే**=అహోబిలక్షేత్రము.

**తాత్పర్యము:** రోషాతిశయముతో నాలుకను కఱచుకొనుచున్న పెద్దనోరును, కత్తులను బోలిన దంతములును గల బహుపరాక్రమశాలి నరసింహరూపమును దాల్చెను. ఆతనిని చూడగనే హిరణ్యకశిపుడు మృతప్రాయుడాయెను. అతనిని పదునైన తన గోళ్ళతో చీల్చివేసిన ఆ భగవంతుడు వేంచేసియున్న క్షేత్రము అహోబిలక్షేత్రము. ఆ క్షేత్రమున సుడుగాలులు, దావానలము ఆకాశమునకెగయునట్లు వీచుచుండును. కావున ఆ క్షేత్రమునకు చేరుట దుస్సాధ్యము.

**విశేషార్థము:** ధనస్సును చేత బూనిన శ్రీరామచంద్రమూర్తిని చూడగనే శత్రవులు నశించినట్లు శ్రీనరసింహుని దివ్యముఖారవిందమున కలుగు కవళికలను చూడగనే శత్రువులు నశించు విధమును శ్రీకలివైరిసూరి ఈ పాశురమున తెలుపుచున్నారు.

**మెన్న ఇత్యాది :** కోపాతిశయముచే నాలుకను కఱచుకొనిన పెద్ద ముఖమును, కత్తులవంటి కోఱలును, మిక్కిలి బలమును కలిగిన స్వామి శ్రీనరసింహమూర్తి.

**అవుణన్ పొన్న:** ఆ దివ్యరూపము చూడగనే హిరణ్యాసురుడు శవమైనాడు.

**ఆకమ్ ఇత్యాది:** కోపావేశము తగ్గనందున శ్రీనరసింహమూర్తి ఆ శవమును చీల్చివేసినాడు.

**పునితనిడమ్ :** అటువంటి పవిత్రుడు వేంచేసియున్న స్థలము. శ్రీనరసింహస్వామి యొక్క పవిత్రత ఎటువంటిదనగ, తాను పరులకు ఫలించు విధముగాగాక తన శత్రువును సంహరించుకొనినట్లు భావించు స్వభావముకలవాడు.

శ్రీనరసింహస్వామి యొక్క భావశుద్ధిని తిరుమంగై ఆళ్వార్లు "పునితన్" అనుపదము ద్వారా తెలుపుచున్నారు.

**నిన్న విత్యాది:** ఇక క్షేత్రమును వర్ణించుచున్నారు. ఆ క్షేత్రమున నిప్పులమంటలు అధికముగానుండును. సుడిగాలులు వీచుచుండును. అందువలన ఆ మంటలు ఆకాశపర్యంతము మండుచుండును. హాహాకారములు వినవచ్చుచుండును. భయంకరమగు అగ్నిజ్వాలలతో నున్న కారణమున ఆ క్షేత్రము సందర్శించుటకు ఏ ఒక్కరికిని సాధ్యము కానిదైయుండును. (ఆ కాలంలో అలా ఉండేది కాబోలు.)

పరమపదముననున్న భగవంతునకు ఎవరివలన, ఎపుడును ఎటువంటి కీడును కలగని విధముగ ఈ అహోబిల క్షేత్రమున వేంచేసియున్న స్వామికిని ఎటువంటి కీడును కలుగదని భక్తులు నిర్భయులై సంతుష్టులై యుందురు.



# సీతాఫలం రామార్పణమ్



శ్రీమతి చెవుటూరి కుసుమకుమారి - హైదరాబాద్

అటు తరువాత పద్మాక్ష మహారాజు శ్రీహరిని గూర్చి తీవ్రమైన తపస్సు చేశాడు. హరి ప్రత్యక్షం అయినాడు. అప్పుడా రాజు హే భగవన్! నా కోరికను విని నీవు ప్రసన్నుడవైనచో లక్ష్మీదేవిని నాకు పుత్రికగా అంగీకరించుమని ప్రార్థించాడు.

**పద్మాక్షాయ వితీర్యాథ మాతులుంగ ఫలం హరిః ।**
**స్వయ మంతర్ధదే పశ్చాత్ఫలం భిత్వా నృపాలకః ।**
**కన్యాం దదర్శ స్వర్ణాభాం మేనే తాం నృపతి స్సుతామ్॥**

శ్రీహరి పద్మాక్ష మహారాజుకు ఒక మాదీఫలమును ప్రసాదించి అంతర్ధానం అయినాడు. రాజు ఆ ఫలమును విడదీసి చూడగా దానియందు ఒక మేలిమి బంగారు వన్నెతో ఒక బాలిక కనుపించినది. ఆ కన్యను తన కుమార్తెగా స్వీకరించి ముచ్చటగా పెంచసాగాడు. ఆ బాలిక శుక్లపక్ష చంద్రునిలా పద్మాక్ష మహారాజు ఒడిలో పెరిగి పెద్దదైనది.

శుభలక్షణ సంపన్న అయిన ఆ కన్యను చూచిన రాజు ఈ కన్యకు తగిన వరుని ఎట్లు తేగలను? అని యోచించి స్వయంవరం ప్రకటించాడు. శుభలగ్న పత్రికను అందుకున్న ఎందరో రాజులు సర్వాలంకార భూషితులై స్వయంవర మండపానికి విచ్చేశారు. దేవతలు, దానవులు, గంధర్వులు ఎందరో వున్నారా స్వయంవర సభలో. వారందరితోనూ పద్మాక్ష మహారాజు ఈ విధంగా పలికాడు.

**ఆకాశ నీలవర్ణేన యస్సాంగం పరిలేపయత్ ।**
**దదామి తస్మై మే సత్యం జ్ఞేయం వచో మమ ॥**

స్వయంవర సమాహుతులైన సభాసదులారా! ఎవరు నీలమేఘ సమానకాంతిగల శరీరము కలిగి వున్నారో వానికే నాకుమార్తె నిచ్చెదను అని ప్రకటించాడు. ఆ కన్యమీద మోహముతో వెంటనే ఆమెను అపహరించాలని దానవులు ఉద్యుక్తులైనారు. ఆ దానవులను ఎదరించి పద్మాక్షుడు మరణించాడు.

**తతస్తే మిళితా స్సర్వే తాం ధర్తు మద్రువు ర్జవాత్ ।**
**సా దృష్ట్వా ధర్తు ముద్యుక్తా న్జుహావాఽగ్నౌ కళేబరమ్ ॥**

అటు పిమ్మట దానవులందరూ ఆ కన్యను పట్టుకొన వెంటపడినారు. అది తెలుసుకొనిన ఆ కన్య వారికి వశమగు టకు ఇచ్చగించక శరీరమును అగ్నికి ఆహుతి చేసుకొనినది.

మునులారా! పద్మాక్షమహారాజు లక్ష్మిని కోరటం చేతనే ఇటువంటి అవస్థ సంభవించినది కదా! కనుకనే మహర్షు లెప్పుడూ లక్ష్మిని కోరరు. లక్ష్మిని కోరిన వారికి భయము, శోకము, చిత్తచాంచల్యము, మహాదుఃఖము, మరణము సంభవించును. కావున లక్ష్మిని కోరరాదని చెప్పి తదుపరి శ్రీ వచనము ప్రారంభించినాడు సూతముని.

**కదాచిత్సా మాతులుంగీ కుశధ్వజ తపస్వినః ।**
**వేదపాఠం కుర్వతశ్చ ప్రాదుర్భూతా పురస్తతః ॥**

మునివర్యులారా! అనంతరము లక్ష్మీ అంశ సంభూతురాలు అయిన ఆ కన్యక మాతులుంగీ అనే పేరుతో కొంతకాలం అగ్నిలోనే దాగివున్నది. అనంతరం ఒకప్పుడు బృహస్పతి పుత్రుడైన కుశధ్వజుని స్వాధ్యాయ సమయమున (వేదము వల్లెవేయువేళ) ఆయన ఎదుట శిశురూపమున ఆవిర్భవించినది. వేద పఠనవేళ ఆవిర్భవించినది కనుక ఆమెకు వేదవతి అని నామకరణము చేసినాడు కుశధ్వజుడు. ఆ వేదవతి శ్రీహరిని పతిగా కోరి ఒక ఆశ్రమమును ఏర్పరచుకొని తీవ్ర తపస్సు చేయుచుండగా అక్కడకు రావణుడు వచ్చి, తపస్విని అయి వేదవతిని చూచి కామమోహితుడై ఈ విధంగా మాటలాడసాగాడు.

“వ్రత నియమశీలవైన సుందరీ! మంగళప్రదా! పరిపూర్ణ కాంతిమంతమైన నీముఖ బింబానికి పోలిక లేదుకదా! పూర్ణచంద్ర బింబమని అందునా! ఆ చంద్రబింబముకూడ కళంక సహితమే కదా! అటువంటి సుకుమారీ నీకీ జట లెందుకు? జింకచర్మమెందు లకు? నేను సమస్త లోకాలనూ జయించినవాడను. లోకములోని ఎందరో ప్రముఖ స్త్రీలను తీసుకొని వచ్చినవాడను. నావంటి పరాక్రమశాలి ముల్లోకాలా లేనేలేడు. ఉత్తమురాలా! నన్ను భర్తగా స్వీకరించు. నావశమున ఉన్న స్త్రీలందరికీ నీవే ప్రథమస్థానము స్వీకరించుము” అని పలికినాడు.

**పతిం కామయమాఽనాహం శ్రీహరిం రజనీచర! ।**

రాక్షసుడా! నేను శ్రీహరిని పతిగా కోరి తపస్సు చేయుచున్న దానను.

**నాన్యం వృణోమి గచ్ఛ త్వం వ్యర్థాలాపాంశ్చ వర్జయ**

నేను ఇతరులను వరించను. నీవు వ్యర్థ ప్రసంగాలు ఆపి వెళ్ళిపొమ్మని మందలించింది.

రావణుడా మాటలు విని ‘ఉత్తమురాలా! నీవు కోరి కోరి తపించి వరించే ఆ శ్రీహరి ఎన్నటికీ నాతో సమానుడు కాలేడు. నీ

పూర్వ పూర్వ పూర్వులైనా ఆ జనార్దనుని జన్మ యేవిధమైనదో ఎరుగలేరు.

అనగా ఆ శ్రీహరి పుట్టుకే లేనివాడు. సనాతనుడు. ఆదిమధ్యాంత రహితుడు. కనుక, అతడు కులగోత్రాలు లేనివాడు. ఆ శ్రీహరి విశ్వరూపధరుడని చూచినవారు అంటారు.

**విశ్వరూప ధరశ్చేతి కథయంతి బుధాస్తుతమ్ ।**

(అనగా వేషధారి అని కానీ ఆయన విశ్వంభరుడని అర్థము)

**శేషాహి భోగ పర్యంకే తేన త్వం శయితా సహ ।**

**సవిషై ర్భోగ నిశ్వాసైః పరాం గ్లాని ముపైష్యసి ॥**

"లలనా! అతడు శేషశయనుడు. ఆ సర్ప ఉచ్ఛ్వాస నిశ్వాస విషజ్వాలలకు తట్టుకొనుట నీవంటి సుకుమారికి బహు కష్టము సుమా!

అంతేకాదు. కోమలీ! మధుకైటభులనే రాక్షసులచేత పట్టుకొన బడిన అతని కంఠమును నీవెట్లు ఆలింగనము చేసుకోగలవూ? హిరణ్య కశిపుని చీల్చిన ఆ గోళ్ళను నీవెట్లు సహించగలవు?

కనుక, సుందరాంగీ ఆ శ్రీహరి మీది మనసు మరల్చు కొని ఆ ప్రేమను నాపై మరల్చు"మని ప్రేలాపించిన రావణునితో...

"ఓయీ! రాక్షసుడా! విష్ణుమూర్తి యందు నీవు ఆరోపించిన దోషములన్నీ ఆలోచించి చూచిన ఎడల అవి అన్నీ ఆయనకు స్వభావ సిద్ధ గుణములే గాని దోషములు కావు.

**జగత్ప్రకాశకా! భానో రులూకస్యేవ రశ్మయః ।**

సమస్త జగత్తును ప్రకాశింపచేసే సూర్యకిరణాలు గుడ్లగూబకు సరిపడనట్లు సర్వలోకేశ్వరుడైన శ్రీహరి గుణాలు నీకు దోషపూరితంగా కనుపించుచున్నవి కాబోలు. పోనిమ్ము. నీతో నాకేమి పని? నేను మాత్రము శ్రీహరిని గాక వేరొకరిని వరించను గాక వరించను పొమ్ము" అని వక్కాణించి చెప్పినది.

ఆమె మాటలు విన్న రావణుడు ఆ తపస్విని కేశపాశాన్ని పట్టుకున్నాడు.

**త్వయా సంఘర్షితా పాప ప్రవేక్ష్యామి హుతాశనమ్ ।**

**అయోనిజా భవిష్యామి వధార్థం చ తథా తవ ॥**

**ఇత్యుక్త్వా సాఽగ్నికుండే తు ముమోచ స్వకళేబరమ్ ॥**

పాపాత్ముడా! నీచేత స్పృశించబడిన నేను ఇంక ఈ శరీరముతో జీవించను. నిన్ను సమూలంగ నాశనము చేయుటకు అయోనిజనై పుట్టెద"నని చెప్పి తన శరీరమును అగ్ని గుండమునకు ఆహుతి చేసినది. *(తరువాయి భాగం వచ్చే సంచికలో)*

# నేర్చుకుందామా!

**శ్రీమతి డా॥టి.కె. చూడామణి-విజయవాడ**

ఆర్ష సంప్రదాయానికి చెందిన మనమెంతో భాగ్యవంతులం. మన పెద్దలు వాఙ్మయ నిధులను మనకోసం దాచి ఉంచారు. అద్భుతములైన పద్యాలు, శ్లోకాలు మన మహాకవుల ప్రతిభను చాటే మణిదర్పణాలు. వాటిని నేర్చుకుంటే మనకెంతో తృప్తి. ఆనందం. లాభం. ప్రతినెలా ఒక మంచి పద్యమో, శ్లోకమో నేర్చుకుందాం! పెద్దలు ఇవన్నీ నేర్చినవారే. రానివారికి నేర్పించండి. కంఠస్థం చేయించండి. నెలకొక్కటే... మరి నేర్చుకుందామా!

'నేర్చుకుందామా!' అనే ఈ శీర్షికలో సహజకవి పోతనామాత్యుల వారు రచించిన భాగవత వైభవాన్ని చాటే పద్యం ముందుగా నేర్చుకుందాం.1

మ॥ **లలితస్కంధము, కృష్ణమూలము, శుకాలాపాభిరామంబు, మం
జులతా శోభితమున్ సువర్ణసుమన స్సుజ్ఞేయమున్, సుందరో
జ్జ్వల వృత్తంబు, మహాఫలంబు, విమల వ్యాసాలవాలంబునై
వెలయున్ భాగవతాఖ్య కల్పతరు వుర్విన్ సద్ద్విజశ్రేయమై.**

శ్రీమద్ భాగవతాన్ని కల్పవృక్షంతో పోల్చారు కవీంద్రులు ఈ పద్యంలో. ఇది మత్తేభంలో సాగింది. సభరనమయవ అనే గణాలుంటాయి ఇందులో.

ముందుగా కల్పవృక్షంతో పోలిక ఎలాగో తెలుసుకుందాం!

కల్పవృక్షం చుట్టూ అందమైన బోదె ఉంటుంది. స్కంధము అంటే బోదె.

నల్లని (మూలం) వేళ్ళు కలిగి ఉంటుంది. చిలుకలు కలకలా రావాలు చేస్తూ ఉంటాయి. అందమైన లతలు అల్లుకొని ఉంటాయి. రంగురంగుల పూలతో మనస్సులను ఆకర్షిస్తూ ఉంటుంది. చెట్టునిండా పెద్దపెద్ద పళ్ళు భలేగా ఉంటాయి.

విశాలమైన పాదు కలిగి ఉంటుంది. శుక పిక శారికాది పక్షులకు శ్రేయస్సునిస్తుంది. ఆ వృక్షం స్వర్గంలో ఉంటుందిట. మరి భాగవతమనే వృక్షం ఎలా ఉంటుందో చూడండి.

భాగవతంలో అందమైన భాగాలు స్కంధాలు అనే పేరుతో 12 ఉన్నాయి. నల్లనివాడైన శ్రీకృష్ణుడే ఈ కథకి మూలాధారం.

శుకమహర్షి పలుకులతో మధురంగా ఉంటుంది.

మంజులత్వం... పద్యాలన్నీ ఎంత అందంగా ఉంటాయో!

బంగారు మనస్సున్న వారంతా తెలుసుకోదగినది ఈ భాగవతం. మోక్షఫలమే ప్రయోజనంగా కలది భాగవతం. సహృదయులు, పవిత్రమూర్తి, వ్యాసులవారే ఆధారంగా కలిగినది. ద్విజులకి శ్రేయస్సు నిచ్చేది. ఈ భాగవత వృక్షం భూలోకంలో విరాజిల్లుతోంది. ఈ చెట్టుని చూద్దాం. పూల సువాసనలు గ్రోలుదాం. పళ్ళరసాలు అనుభవిద్దాం.



# అహో! భారతమ్

గత సంచిక తరువాయి...

శ్రీమతి డా॥టి.కె. చూడామణి–విజయవాడ

పరీక్షిత్తు కుమారుడు జనమేజయుడు తండ్రికి తక్షకుని వలన జరిగిన ప్రాణాపాయకథ విన్నాడు. అతని హృదయం బాధతో బ్రద్దలైనట్లనిపించింది. కళ్ళు సముద్రాలే అయ్యాయి.

అయ్యో! కాశ్యపుడనే బ్రాహ్మణుడు వచ్చి ఉంటే అతని మంత్రశక్తి వలన నా తండ్రి తిరిగి జీవించేవాడు కదా! తక్షకుడు అతనిని రానీయకుండా ఎంత పాపం చేశాడు. ఆ నీచుని వదిలి పెడతానా నేను. ఇంతకు ఇంత అనుభవింప చేస్తాను, అనుకున్నాడు.

పెద్దలను, మంత్రులందరినీ పిలిపించాడు. "అయ్యలారా! నా కర్తవ్యాన్ని నిశ్చయించుకున్నాను. తక్షకునిపై ప్రతీకారం తీర్చుకుంటాను. నా తండ్రి బ్రతికితే అతనికేం నష్టం? కాశ్యపుని ప్రలోభపెట్టి వెనక్కి పంపించేస్తాడా? మహాపాపం చేశాడు తక్షకుడు. అతనిని చంపి నా మనసుని శాంతింప చేస్తా. ఆనాడు ఉద్దంకునివద్ద కుండలాలు దొంగిలించి అతనిని బాధపెట్టిన తక్షకుడు జీవించి ఉండడానికి వీలులేదు. దీనికోసం నేనేం చెయ్యాలి? తక్షకుని, అతని బంధువులతో సహా చంపాలంటే మార్గం ఏమిటి? చెప్పండి" అని అడిగాడు.

వెంటనే మహనీయులైన ఋత్విజులు "మహారాజా! ఒక గొప్పయజ్ఞం పూర్వం దేవతలు కల్పించారు. దానికి "సర్పయాగం" అని పేరు. దానిని అందరూ చేయలేరు. నువ్వే సమర్థుడివి. అది ఎలా చెయ్యాలో మాకు తెలుసు" అన్నారు.

ఆహా! తక్షకుని జీవితం ముగిసిపోయిందనుకున్నాడు రాజు. యజ్ఞసామగ్రిని సిద్ధం చేయమని కోరాడు. వెంటనే భూమిని కొలిచి, శాస్త్రప్రకారం యజ్ఞమండపాన్ని సిద్ధం చేశారు. బ్రాహ్మణోత్తములంతా అక్కడ చేరారు. జనమేజయునికి దీక్షనిచ్చారు. జనమేజయుని భార్య కాశీరాజు కుమార్తె వపుష్టమ. ఆవిడతో కలసి దీక్షని స్వీకరించాడు రాజు.

ఆ సమయంలో ఒక విశేషం జరిగింది. ఆ యజ్ఞమండపానికి ఒక వాస్తు శాస్త్ర పండితుడు వచ్చాడు. అతడు మహామేధావి, అనుభవశాలి. మండపాన్ని చూస్తూనే "అది నిర్మించిన సమయాన్ని బట్టి ఈ యజ్ఞానికి ఒక బ్రాహ్మణుని కారణంగా విఘ్నం ఏర్పడుతుంది. ఎట్టి పరిస్థితిలోనూ యజ్ఞం పూర్తికాదు" అని చెప్పాడు.

మండిపడ్డాడు రాజు "అతనిని లోపలికెవరు రానిచ్చారు? ఎవరినీ రానీయకండి" అంటూ కసిరాడు. ఏదో తెలియని ఉద్వేగం. ఎందుకో– ఏమో!

ఋత్విజుల వేదఘోషలతో సర్పయాగం అద్భుతంగా ప్రారంభమయింది. ఋత్విజులంతా నల్లని దీక్షావస్త్రాలు ధరించారు. అగ్ని ప్రజ్వరిల్లుతోంది. పొగలకి కళ్ళు ఎఱ్ఱబడి వారూ పాముల్లా బుసలు కొడుతున్నారు. సర్పలోకాన్ని ఆహ్వానించడం మొదలు పెట్టారు. అంతే... ఇంక చూడాలీ...

పాములన్నీ చేష్టలుడిగి దీనంగా బుసలు కొడుతూ హోమగుండంలో పడడం మొదలు పెట్టాయి. ఒకదాని నొకటి తోకలతో పడగలతో పెనవేసుకొని ఆకాశాన్ని దులిపితే పడినట్లు రాలి పడిపోతున్నాయి. ఒకటా... రెండా తెల్లపాములు, నల్లపాములు, నీలంవి, ముసలివి, చంటివి, అబ్బో! ఆర్తనాదాలు... బుస్–ఫట్–ఢాం– ఢదేల్– అమ్మో ఎన్ని రకాల శబ్దాలో... క్రోసు పొడవునుంచి నాల్గు క్రోసులున్న పాముల వరకు చుట్టలు చుట్టలుగా వచ్చి అగ్నిలో పడిపోయి మసి అయిపోతున్నాయి. పదులు, వందలు, లక్షలు కాదు కాదు కోట్లు... కోట్లు విషపూరితాలు, ఆనాడు కద్రువ ఇచ్చిన శాపఫలితాన్ని అనుభవిస్తూ పడిపోతున్నాయి.

హోత చండభార్గవుడు ఉద్గాత కౌత్సుడు, బ్రహ్మలుగ జైమిని, శార్ఙ్గరవులు, అధ్వర్యుడు.... పింగళుడు. హేమా హేమీలు వారంతా. వేదవిద్యా పారంగతులెందరో సదస్యులు... అందరూ ఆశ్చర్యంగా చూస్తూ ఉండగా పాములన్నీ పిలిస్తే వచ్చేస్తున్నాయి. అగ్నిలో ఆహుతి అయిపోతున్నాయి. అబ్బబ్బ వాటి దేహాల నుండి వస, క్రొవ్వు కాలువలే, దుర్వాసన, కుతకుత, ఉడికే శబ్దం... భయంకర దృశ్యం.

చూశాడు తక్షకుడు ఒక్క పరుగులో ఇంద్రుని చేరాడు. రక్షించు. రక్షించు అంటూ ప్రార్థించాడు. తక్షకా! నీకేం భయం లేదయ్యా! ఒకప్పుడు బ్రహ్మగారు నీకు వరమిచ్చారు కదా! భయం విడిచి పెట్టు. అభయమిచ్చాడాయన. అమ్మయ్య! ఆయన దగ్గరే ఉండిపోయాడు తక్షకుడు.

సర్పాలన్నీ అగ్నిలో పడి నశిస్తూంటే పాపం వాసుకి

విలవిల లాడిపోయాడు. అయ్యో! ఎక్కడెక్కడి పాములూ అగ్నిదగ్ధమయ్యాయే! ఇంక కొన్నే మిగిలాయి. జాతి మొత్తం నశించిపోతుందా! ఎలాగైనా దీనిని ఆపాలి. అమ్మా! సోదరీ! జరత్కారూ... నా శరీరం ఎలా మండిపోతోందో చూడు తల్లీ! దిక్కుతోచడం లేదు. కళ్ళు తిరిగిపోతున్నాయి. శరీరం వశం తప్పుతోంది. మనస్సు వికలం అయిపోతోంది. సర్పవంశ నాశనం అయిపోతోంది అమ్మా! ఈ ఆపదనుండి నీవే రక్షించగలవు. నీకు నీపేరుతో ఉన్న జరత్కారువుకి కల్గిన పుత్రుడు ఆస్తీకుడు. ఒక్కడే ఈ యజ్ఞాన్ని ఆపగలడని బ్రహ్మగారు చెప్పారు గదా తల్లీ! ఆ సమయం వచ్చింది. నీ పుత్రుడు ఆస్తీకుని పిలు. మేనమామలమైన మమ్మల్ని రక్షించమని చెప్పు. మన వంశాన్ని కాపాడమని చెప్పు తల్లీ! ఆలస్యం చేయకు.

అన్నమాటలు వింటూనే జరత్కారువు కొడుకుని పిలిచింది. నాయనా! నీ జన్మ చాల విలక్షణమయినది. ఒక మహత్కార్యం చేయడానికే నువ్వు పుట్టావు. కద్రువ తన సంతానమైన సర్పాలు తన మాట వినలేదని వాటిని శపించింది. ఆ శాపకారణంగా అవి జనమేజయుని సర్పయాగంలో పడి బూడిద అవుతున్నాయి. నాయనా! ఆ యజ్ఞాన్ని ఆపగలవాడివి నువ్వే! నీ మామ వాసుకి చాలా చాలా దుఃఖిస్తున్నాడు. వెంటనే ఈ కష్టం నుండి విముక్తి కలిగించు తండ్రీ అంది.

"అమ్మా! అసత్యమంటే ఏమిటో తెలియని నేను మాట ఇస్తున్నాను. జనమేజయుని సర్పయాగాన్ని నేను మాన్పిస్తాను. నా మాటలు నమ్ము. మామా! మీరు బెంగవిడిచి పెట్టండి. బ్రహ్మదండం నుండి నేను సర్పకులాన్ని రక్షిస్తాను. శాపాన్నీ పోగొడతాను. ఎవ్వరూ భయపడవద్దు" అన్నాడు.

ఆస్తీకుని మాటలు వాసుకి భయజ్వరాన్ని పోగొట్టాయి. ఆస్తీకుడు జనమేజయుని యజ్ఞశాలకు వెంటనే బయలుదేరాడు. అద్భుతమైన ఆ శాలను దర్శించాడు ఆ ప్రదేశం దేదీప్యమానంగా వెలిగిపోతోంది. ఆ యాజ్ఞన్ని ఋత్విక్కులని, జనమేజయుని, అగ్నిని, సభ్యులను ఎంతో గొప్పగా కీర్తించాడు ఆస్తీకుడు.

ఆస్తీకుని ప్రార్థన సాగిపోతోంది. "జయము జయము జనమేజయ రాజా! నీ యజ్ఞం చంద్రుని యజ్ఞంలా, వరుణుని యజ్ఞంలా, ప్రజాపతి యజ్ఞంలా ఎంతో శోభాయమానంగా ఉంది. ఇంద్రుని నూరుయజ్ఞాలకు ఇది సరిపోయేలా ఉంది. మా ప్రియజనులకు శుభం కలుగుగాక!" అంటూ పూర్వం పెద్దలందరూ చేసిన యజ్ఞాలని మించిపోయిందంటూ ప్రతివాక్యం చివర మా ప్రియవంశజులకు మంగళమగుగాక! అంటూ పొగిడాడు.

తరువాత ఋత్విజులు కర్మానుష్ఠాన సంపన్నులని కీర్తించాడు. జనమేజయుడు ఇంద్రాదులను మించిన వాడని స్తోత్రం చేశాడు. సభ్యులను, అగ్నిని కూడా అద్భుతంగా పొగిడాడు. అతని మాటలు అందరికీ చెప్పలేని ఆనందాన్ని కలిగించాయి.

జనమేజయుడు ఆస్తీకుని రూపానికి, వినయానికి, మాటలనేర్పుకి ముగ్ధుడైపోయాడు. బ్రాహ్మణోత్తములారా! ఈ బాలుని మాటలు విన్నాక ఇతనికి వరం ఇవ్వాలని అనిపిస్తోంది. మీరేమంటారు అని అనుమతి వేడాడు. యథోచితంగా సత్కరించవయ్యా రాజా అంటూ వారంతా అంగీకారం తెలిపారు.

ఇంతలో బ్రహ్మవేత్తలు మంత్రాలతో తక్షకుని ఆహ్వానించారు. రాజు... ఔను తక్షకుడు వస్తేగాని ఈ యాగానికి పరిపూర్ణత లేదు. రానీయండి... లేదా రప్పించండి... ఊ... అతడే నిజమైన శత్రువు.. ఊ... పిలవండి అన్నాడు.

'రాజా తక్షకుడు ఇంద్రుని ఆశ్రయించాడు. ఇంద్రుడు అతనికి అభయమిచ్చాడు. అందువల్లే తక్షకుడు రావడం లేదు' అన్నారు.

'అయితే ఇంద్రునితో సహా తక్షకుని పిలవండి' అన్నాడు ఆవేశంతో రాజు.

"సహేంద్ర తక్షకాయ స్వాహా" అంటూ మంత్రోచ్చారణ గావించారు బ్రాహ్మణోత్తములు. తక్షకుడు ఇంద్రుని ఉత్తరీయంలో దాగి సింహాసనానికి చుట్టుకొని ఉన్నాడు. మంత్రం సింహాసనంతో సహా ఇంద్రుని లాక్కొని వస్తోంది.

హడలిపోయాడు ఇంద్రుడు. ఆకాశంలో యాగశాల పైదాకా వచ్చేశారిద్దరూ... దానితో ఏం చెయ్యాలో తోచలేదు ఇంద్రునికి. కండువా దులిపి తక్షకుని ఆకాశంలో విడిచి కంగారుగా తన లోకానికి పారిపోయాడు ఇంద్రుడు. భయంతో తల్లడిల్లాడు తక్షకుడు. మంత్రం అతనిని అగ్ని దగ్గరకి లాగుకొని వచ్చేస్తోంది.

జనమేజయుడు "ఆస్తీకా! నీకేం వరం కావాలయ్యా?" నిర్భయంగా చెప్పు అన్నాడు. వెంటనే ఆస్తీకుడు "రాజా! ఈ సర్పయాగాన్ని ఉన్న దానిని ఉన్నట్లు ఆపేయ్" అన్నాడు.

జనమేజయుని గుండెల్లో బండరాయి పడినట్లయింది. "నాయనా! బ్రాహ్మణోత్తమా! అబ్బే ఆ వరంకాదు. బంగారం, వెండి, ఆవులు, ఏది ఎంత కావాలంటే అంత కోరుకో... అంతేగాని యజ్ఞం ఆపమనకు" అన్నాడు.

"అబ్బెబ్బే... అవన్నీ నాకెందుకు? ఈ సర్పయాగం ఇంక జరుగకూడదు. ఓ తక్షకా భయంలేదు. ఆగు.. ఆగు... ఆగు... అక్కడే ఆకాశంలో ఉండు. రాజా! ఈ యాగం ఆపేయ్! వెంటనే ఆపెయ్..." ఆయన మాటలు విన్న బ్రాహ్మణోత్తము లందరూ "రాజా! ఆస్తీకుని కోరికను తీర్చు. నీకు శుభం కలుగుతుంద"ని జనమేజయుని ప్రార్థించారు.

తక్షకుడు భయంతో విలవిలలాడుతూ వ్రేలాడుతూ ఉన్నాడు. చూశాడు రాజు. ఋత్విజుల, బ్రాహ్మణుల మాటలు రింగురింగుమని మ్రోగుతున్నాయి చెవుల్లో... అంతే! "ఆస్తీకుని కోరిక తీరుగాక" అంటూ వరం ఇచ్చాడు.

అంతే హర్షధ్వానాలు... ఋస్ ఋస్ ధ్వనులు... భూమ్యాకాశాలను ఏకం చేశాయి. జనమేజయుని సర్పయాగం సమాప్తం అయిపోయింది. పాములన్నీ ఆనందంతో మెలికలు తిరుగుతూ నమస్కరించి క్షణంలో అదృశ్యమయ్యాయి.

జనమేజయుడు ఋత్విజులకి సభాసదులకి, ధనరాశుల నిచ్చాడు. యజ్ఞం పూర్తికాదు అని చెప్పిన బ్రాహ్మణుని రప్పించి నమస్కరించి అధికమైన ధనాన్ని దక్షిణగా సమర్పించాడు. యజ్ఞవాటికా నిర్మాణానికి కృషి చేసిన పెద్దలకి, శిల్పులకి కానుక లర్పించాడు. అందరినీ ఆనందపరిచాడు. అవభృధస్నానం చేశాడు. ఆస్తీకునివైపు చూశాడు. ఆయన కృతకృత్యుడు కాబట్టి ప్రశాంతంగా చిరునవ్వుమొగముతో కన్పించాడు. "అయ్యా! నేను భవిష్యత్తులో అశ్వమేధయాగాన్ని చేయబోతున్నాను. ఆ యజ్ఞానికి నీవు వచ్చి నా సభనలంకరించాలి" అంటూ ప్రార్థించాడు.

"అలాగే తప్పక వస్తాను" అని జనమేజయుని ఆనంద పరచి బయలుదేరాడు ఆస్తీకుడు.

ప్రసన్నహృదయంతో ఇంటికి వచ్చి తల్లి, మేనమామ లకు నమస్కరించి జరిగిన వృత్తాంతాన్ని యథాతథంగా వివరించాడు. నాగజాతి ఆనందం వర్ణనాతీతం. "నాయనా! ఎంత కష్టాన్నుంచి గట్టెక్కించావు నువ్వు. ఏం చేసినా నీ ఋణం తీరదు. నీకేదైనా వరమిస్తాం, కోరుకో!" అన్నారు.

ఆస్తీకుడు "పన్నగోత్తములారా! ప్రపంచములోని జనులంతా మంచి మనస్సుతో నా కథను ఎవరైతే చదువుతారో వాళ్ళందరికీ మీ వలన ఎలాంటి భయమూ కలుగకూడదు. ఇదే నా కోరిక అన్నాడు. మేనల్లుడా! తప్పకుండా నీ కోరిక తీరుస్తాం. రాత్రైనా, పగలైనా ఎవరైతే అసితుడు, ఆర్తిమంతుడు, సునీధుడు మొ॥ మహనీయ సర్పముల పేర్లను స్మరిస్తారో వారికి సర్పభయమనేది ఉండదు.

అంతేకాదు. జరత్కారు ఋషివలన, జరత్కారువు అను నాగకన్యకు జన్మించి, జనమేజయుని సర్పయాగంలో సర్పాలను రక్షించిన ఆస్తీకుని నేను స్మరిస్తాను. నాగులారా! నన్ను మీరు హింసించకండి. అనే ఈ మంత్రాన్ని జపించండి. మహాసర్పమా! తప్పుకొని వెళ్ళిపో! జనమేజయుని సర్పయాగాంతకాలంలో ఆస్తీకుని మాటలను స్మరించు. అట్టి ఆస్తీకుని మాటలను విని ఏ సర్పం తొలగదో దాని శిరస్సు శింశవృక్షఫలం లాగ నూరు వ్రక్కలు అగుగాక!" ఇది విన్న నాగులందరూ సరే సరే అని తలలాడించారు. ఆస్తీకుడు సర్పకులాన్ని ఇలా ఉద్ధరించాడు. వివాహానంతరం పుత్రపౌత్రాదులతో వర్ధిల్లి ఆనందంగా జీవించి మోక్షం పొందాడు.

ఈ ఆస్తీకోపాఖ్యానాన్ని కీర్తించిన వారికి ఎన్నటికీ సర్పభయం ఉండదు. పుణ్యం కలుగుతుంది. సర్వపాపాలు నశిస్తాయి.

# ముముక్షు రహస్యం

శ్రీమతి చక్రవర్తుల చూడామణి -ఖమ్మం

"ప్రతిభక్కా... ప్రతిభక్కా.."

"ఏవిటిరా చిన్నా... ఏం కావాలి?"

"ఇడక్కిరయిల్ కండేనో" ... అంటే ఏవిటో చెప్పవా!"

"ఇక్కిరయిల్ కండేనో ముదలాళ్వార్‌గళైప్పోల" అని ముమ్ముక్షువార్తలో 34వ వార్త కదా! ఇప్పుడదెందుకొచ్చింది నీకు?"

"బామ్మ అమ్మతో అంటుంటే విన్నా."

"మరి బామ్మనే అడగలేకపోయావా?"

'అమ్మో...! రేపుయాత్రకు బయలుదేరాలి కదా! వాళ్ళంతా బోలెడు పనిలో ఉన్నారు ఇప్పుడడిగితే కోప్పడతారు...."

"భడవా... అయితే నేను పనీపాటా లేనిదాననా నీ ఉద్దేశ్యం..."

"అలా కాదులే అక్కా. నువ్వు చాలా మంచిదానివి. పని చేస్తూనే చెప్తావు. అందుకే నిన్నడిగా...."

"ఈ తెలివితేటలు బాగా ఉన్నాయి.... సరేలేరా... అడిగింది. మంచివిషయం. నీకు తెలుసుకోవాలన్ని ఉన్నప్పుడే తెలియ చెప్పటం విధాయకం....."

ఒక్క చీమ వాసన పట్టగానే మిగిలిన గుంపంతా వచ్చినట్టు పిల్లలందరూ బిలబిల లాడుతూ ప్రతిభ చుట్టూ చేరారు."

"కథవింటూ ఈ బట్టలన్నీ మడవాలి సరేనా..."

"సరేలే నువ్వు మొదలు పెట్టు..."

"ముదలాళ్వార్ల పేరు చెప్పండి చూద్దాం..."

"పొయ్‌గైయాళ్వార్, పూదత్తాళ్వార్, పేయాళ్వార్"

వీరికి సరోయోగి, భూతయోగి, మహాయోగి అని కూడా పేర్లున్నాయి కదక్కా.."

"అవును నాన్నా. వీరు ముగ్గురూ కలియుగ ప్రారంభానికి ముందే ఈ లోకంలో అవతరించారు."

"అందరూ అలా కలియుగానికి ముందే అవతరించారా?"

"అందరంటే ఎవరు?"

"ఆళ్వార్లందరూ"

"ముదలాళ్వార్లు ముగ్గురు, భక్తిసారులు, మధురకవి యాళ్వార్ మాత్రమే ద్వాపర యుగాంతంలో కలికి ముందుగా అవతరించారు. శ్రీకృష్ణుడు ఈ లోకంలో ఉన్నప్పుడే ద్వాపర యుగ అంతంలోనే కలిప్రభావం ఆరంభమైంది. పరమాత్మకు కలియుగంలో తిరిగే అవతారం లేదు. కనుక తన ఆయుధాలను భూలోకానికి పంపి వారి ద్వారా చేతనులను ఉజ్జీవింప చేయాలని సంకల్పించాడు శ్రీమన్నారాయణుడు!

ఏరు పొంగి ఊరు మునిగిపోయాక తీరికగా వంతెన కట్టడం వలన ప్రయోజనం లేదుకదా! ముందే ప్రవాహానికి అడ్డుకట్ట వేస్తే ప్రమాదాన్ని తగ్గించవచ్చు. అలాగే కలిప్రారంభానికి ముందే కలి ప్రవాహానికి అడ్డుకట్ట వేస్తే ప్రమాదాన్ని తగ్గించవచ్చు. అందుకే కలిప్రారంభానికి ముందు, ద్వాపరయుగం 8 లక్షల 909సం॥ నడిచాక సిద్ధార్థి నామ సంవత్సరం ఆశ్వీయుజ శుక్ల అష్టమి శ్రవణా నక్షత్రం మంగళవారం నాడు కాంచీపురంలో యథోక్తకారి సన్నిధి దగ్గర (పొత్తామరైకుళం) బంగారు తామరసరస్సులో నారాయణుని శంఖాంశగా పొయిగై ఆళ్వార్ అవతరించారు.

**"తులాయాం శ్రవణే జాతం కాంచ్యాం కాంచన వారిజాత్**
**ద్వాపరే పాంచజన్యాంశం సరోయోగిన మాశ్రయే ॥**

వీరికి సరోయోగి, కాసారయోగి అని పేర్లు.

మరి పూదత్తాళ్వార్ ఎప్పుడవతరించారు?

**తులాధనిష్ఠా సంభూతం భూతం కల్లోలమాలినః ।**
**తీరే పుల్లోత్పలే మల్లాపుర్యా మీడే గదాంశజయే ॥**

తులామాసం శ్రవణా నక్షత్రంనాడు పొయిగైయాళ్వార్ల అవతారం, ధనిష్ఠా నక్షత్రం పూదత్తాళ్వార్ అవతారం. అంటే, ఎన్నిరోజుల తేడానో చెప్పండి.

"శ్రవణం తరువాత ధనిష్ఠే కదా! మరుసటిరోజేగా అక్కా"

"సరిగ్గా చెప్పావు! మహాబలిపురం తెలుసుకదా! ఆ మహాబలిపురం వెళ్ళేదారిలో 'తిరుక్కడల్‌మల్లై' అని ఒక దివ్యక్షేత్రం అక్కడ మాధవీపుష్పం (కురకత్తి పుష్పం)లో పూదత్తాళ్వార్, భగవంతుని గదాంశగా అవతరించారు. వీరు వాదంలో పరమతస్థులను ఓడించటంలో దిట్ట. అందుకే వీరిని 'వైష్ణవ భూతం' అంటారు పెద్దలు.

వీరి తరువాత పేయాళ్వార్ శతభిష నక్షత్రం దశమి గురువారం నాడు చెన్నైలో ఉన్న మైలాపూర్‌లో ఆదికేశవప్పెరుమాళ్ సన్నిధిలోని "మణికైరవము" అనే బావిలో ఎర్రకలువపూవు (రక్తోత్పలము)లో ఖడ్గాంశగా అవతరించారు.

"వీరి తిరునక్షత్ర తనియన్ చెప్పవా!"

**తులా శతభిషగ్జాతం మయూరపురి కైరవాత్ ।**
**మహాన్తం మహదాఖ్యాతం వన్దే శ్రీనందకాంశజమ్ ॥**

"నువ్వు మైలాపూరన్నావు. తనియన్‌లో 'మయూరపురి' అని ఉంది. మైలాపూర్ అంటే నెమళ్ళుండే ఊరనే అర్థం. మైయిల్ అంటే నెమలి కదా! అప్పుడు అడవులు, తోటలు, నెమళ్ళు ఉండేవి. ఇప్పుడు అవిలేవు. అంతా అపార్ట్‌మెంట్స్ కదా! సరే విషయానికి వద్దాం. ఈ ముగ్గురూ నిరంతరం భగవద్ధ్యానం చేస్తూ ఉన్న ఊళ్ళో ఉండకుండా దేశమంతా పాదయాత్ర చేస్తూ జనులకు మంచిని బోధిస్తూండేవారు.

"నేనడిగిందొకటైతే నువ్వు ఇంకేదో చెప్తున్నావు..."

"ఒరేయ్ చిన్నా! నువ్వడిగిందీ అక్క చెప్పేది ఒకటే. కాస్త ఓపిక పట్టు..."

"వీరు ఇలా యాత్ర చేస్తూండగా ఒకసారి కాకతాళీయంగా తిరుక్కోవలూరు అనే ఊళ్ళో ముగ్గురూ కలుసుకోవటం జరిగింది. అది ఎలాగంటే తిరుక్కోవలూరిలో ఉలగళంద పెరుమాళ్, త్రివిక్రమమూర్తి వేంచేసి ఉన్న కోవెల. పొయిగైయాళ్వార్ అక్కడికి వచ్చారు. సాయంకాలం పెరుమాళ్ళను సేవించుకొని వచ్చి ఒక యింటి అరుగుమీద పడుకున్నారు. ఉరుములు, మెరుపులు లేకుండానే హఠాత్తుగా ఆకాశం అంతటా నల్లని మేఘాలు కమ్ము కున్నాయి. చిమ్మచీకటై పోయింది. జల్లుగా మొదలై చూస్తూండగానే ఝడివానగా మారిపోయింది. అప్పుడు మన ఆళ్వార్ ఆ యింటి తలుపు తట్టారు. వాళ్ళు తలుపు తీసి నడవలో ఉండమని చెప్పి లోపలి తలుపు వేసుకున్నారు.

"నువ్వు చెప్పేదేం అర్థం కావట్లేదు..."

"నీకర్థం కావాలంటే అప్పటి ఇళ్ళు ఎలా ఉండేవో తెలియాలి..."

"చెప్పు మరి."

"సరే విను. ఇంటి మధ్యన 'మిద్దె' అని ఖాళీగా కొంత స్థలం గచ్చుచేసి వదిలేసేవారు. అది దీర్ఘ చతురస్రంగా ఉంటుంది. దాని చుట్టూ నాలుగువైపులా వసారా. ఆ వసారా చుట్టూ హాలు. ఆ హాలులోనే మూలలలో వంటకు, పడక, సామాన్లకు, పూజకుగదులు కట్టేవాళ్ళు. ఇంటి ముందరవైపు ఆ గదుల మధ్యనుంచి బయటకి వెళ్ళడానికి దారి వదిలేవారు. దానినే నడవ అంటారు. ఆ నడవ బయట తిన్నెలుంటాయి. భద్రత కోసం నడవకు ముందు వెనుక కూడా తలుపులుంటాయి.

ఇప్పుడు ఆళ్వార్ ముందు తలుపు తట్టారన్నమాట. ఆ తలుపు తీసి వారిని ఆ నడవలో ఉండమని లోపలి తలుపు వేసుకు వెళ్ళారు ఇంటివాళ్ళు. దీనినే ఇడైక్కు అంటారు. అది నడవడం కోసం వదిలిన స్థలం కాబట్టి ఇరుకుగా ఉంటుంది. ఎంత ఇరుకంటే ఒకరు పడుకోవచ్చు. ఇద్దరైతే కూర్చోవచ్చు. ముగ్గురైతే నిలబడవచ్చు. నాలుగవవారు వచ్చిచేరితే... ఎలా ఉంటుంది? ఎంత వత్తిడి? ఇప్పుడక్కడ ఏం జరిగిందో చూద్దాం.

"పొయ్‌గైయాళ్వార్ ఆ నడవలోకెళ్ళి నిలబడ్డ కాసేపటికి ఎవరో తలుపు తట్టారు. పాపం వారూ వానలో నిలబడలేకే గదా తలుపు తట్టారని తలుపు తెరిచారు పొయ్‌గైయాళ్వార్. తెరిచి **"ఒరువర్ పడుక్కులామ్, ఇరువర్ యిరుక్కిలామ్"** అన్నారు. అంటే ఒకరు పడుకోవచ్చు, ఇద్దరైతే కూర్చోవచ్చు అన్నారు. సరే అని పూదత్తాళ్వార్ లోపలికి వచ్చారు.

కాసేపటికి మళ్ళీ తలుపుకొట్టారు. **"ఒరువర్ పడుక్కులామ్, ఇరువర్ యిరుక్కులామ్, మువ్వర్ నిర్కలామ్"** అని తలుపు తీశారు.

పేయాళ్వార్ కూడా లోపలికొచ్చారు. ముగ్గురూ నిలబడ్డారు. చిమ్మచీకటి. బయట జోరున వాన. ఇంతలో ఎవరో నెడుతున్నట్టు ముగ్గురికీ అనిపించింది. పరస్పరం నేను కాదంటే నేను కాదన్నారు. మరి ఎవరు నెడుతున్నట్టు? మనకు తెలియకుండా నాలుగవ వ్యక్తి ఎవరో చీకట్లో లోపలికొచ్చేశారు. బహుశా వాళ్ళే నెడుతున్నారను కున్నారు. ఆ నాలుగవ వ్యక్తిని కనుక్కోవాలి ఎలా? ఉత్తచేతులు, తడిసిన బట్టలు, చిమ్మచీకటి. పొయ్‌గైయ్‌యాళ్వార్ ముందు తేరుకొని తన యోగశక్తిచేత భూమిని ప్రమిదగా, సముద్రాన్ని తైలంగా, సూర్యుని దీపంగా చేసి దీపం వెలిగించారు.

**వైయమ్ తకళియా వార్కడలే నెయ్యాక**
**వెయ్యకతిరో విళక్కాగ శెయ్య**
**శుడరాఴియాన్ అడిక్కే శూట్టినేన్ శొల్‌మాలై**
**ఇడరాఴి నీంగవే ఎన్ఱు ॥**

అని మొదలు పెట్టి ఆ వెలుగులో చూసిన శ్రీమన్నారాయణుడి గుణాలను నూరు పాశురాలుగా పాడారు. దీనినే "ముదల్ తిరువందాది" అంటారు.

"అక్కా! తిరువందాది అంటే ఏమిటి?"

"తిరు అంటే శ్రీ. శ్రీమన్నారాయణుని గురించి చెప్పేది కాబట్టి తిరు, అందాది అంటే అంతం, ఆది మొదటి పాదంలో చివర ఉన్నపదం తరువాత పాశురంలో మొదట వస్తుంది. దీనినే తెలుగులో "ముక్తపదగ్రస్తం" అంటారు. విడిచిన పదాన్ని ఎత్తుకుని తరువాత పాశురం చెప్పటమన్నమాట."

"అప్పుడు ఆ నాలుగవ వారు ఎవరో తెలిసిందా!"

"పూదత్తాళ్వార్ భగవద్భక్తిని ప్రమిదగా చేసి ఆర్తినే నెయ్యిగా

చేసి భక్తిచే కరిగిన మనసే వత్తిగా జ్ఞానదీపం వెలిగించారు. ఆ దీపం వెలుగులో నారాయణుని చూశారు.

**"అన్బేతగళియా ఆర్వమేనెయ్యాగ**
**ఇన్బురుకుశిన్దై ఇదుతిరియా నన్బురుకి**
**జ్ఞానచ్చూదర్ విళక్కేత్తినేన్ నారాయణక్కి**
**జ్ఞాన చిమిర్ పురిన్దనాన్**

అని మొదలు పెట్టి వీరు నూరు పాశురాలను చెప్పారు. అదే "ఇరండామ్ తిరువందాది."

"పేయాళ్వార్ ఏం చేశారు?"

**"తిరుక్కణ్డేన్ పొన్ మేని కణ్డేన్ తికరుమ్**
**అరుక్కన్ అణినిఱముమ్ కండేన్ శురుక్కళరుమ్**
**పొన్ ఆరి కణ్డేన్ పురిశంగం అమ్కైణ్డేన్ ఎన్నారివణ్ణన్ పాలిన్దు॥**

"దీపపుకాంతిలో కాక మనసుతోనే చూశారు. వచ్చిన వానిని శ్రీలక్ష్మిని చూశాను. బంగారు మేను చూశాను. సూర్యుడిలా ప్రకాశించే మేనిచ్ఛాయ చూశాను. బంగారు చక్రాన్ని చూశాను. పురితోకూడిన శంఖం చూశాను" అని మొదలుపెట్టి నూరు పాశురాలు చెప్పారు. అదే మూన్డానూత్రందాది. మున్నూరు పాశురాలు చెప్పారు ముగ్గురూ కలసి. ఇప్పుడర్థమయిందా ఆ నాలుగవవారు ఎవరో? ఆ త్రివిక్రముడే ఈ ముగ్గురిని ఒక్కచోట చూసిన ఆనందం, ఆ భాగవత గోష్ఠిలో చేరాలన్న ఆరాటంతో తాను వచ్చి వాళ్ళ మధ్య చేరాడు. అందరూ ఆ శ్రీమన్నారాయణుని పాదాల చెంత చేరాలని కొరుకుంటారు. ఆయన తనుగా వచ్చి ఈ గోష్ఠిలో చేరాడు. ఆ రాత్రంతా స్వామి తన భక్తుల అమృతవాక్కులు వింటూ ఆనందంగా ఆ నడవలో ఇరుకులో గడిపి తెల్లవారాక వెళ్ళాడు. ఆళ్వార్లు ముగ్గురూ తెల్లవారాకా తలో దారి వెళ్ళారు. తిరుక్కోళూరమ్మాళ్ ఈ కథ గుర్తు చేసుకుంటూ ముదలాళ్వార్లలాగా ఇడైక్కళియిల్ స్వామిని చూశానా? నాకంత భాగ్యం అబ్బేనా అని వాపోతుంది.

ఈ నెల సంచికలో **'వేదారణ్యాల్లో విహరిద్దాం!'** అనే వ్యాసం అనివార్య కారణాలవల్ల అందించలేక పోతున్నాం!

# నివేదన

**ప్రియ భగవద్బంధువులారా!**

మన భక్తినివేదన పత్రిక అత్యంత మనోహరంగా అలంకరించుకొని మీ కరకమలాలకు చేరుతోంది కదా!

మన పత్రిక పట్ల మీకుండే భక్తిశ్రద్ధలు ఉత్సాహం మాకెంతో ఆనందాన్ని కల్గిస్తున్నాయి.

గత 16 సం॥గా వ్యయ ప్రయాసలు, భారమైనా భక్తులకు భారం కాకూడదని పత్రిక చందాలో ఏమార్పులు చేయకపోవడం మీకందరికీ తెలిసినదే! సుమారు 25,000 వేలమంది చందాదారులతో సాగే మన భక్తినివేదన లక్షలాది పాఠకుల ఆదరాభిమానాలను పొందుతోంది అనే విషయం లోకవిదితం.

ఎందరో భక్తులు దీనిని వ్యాసపరంగా, చందాపరంగాను పెంచమని చాలకాలంగ కోరుతున్నారు.

అయితే ఇందులో మరికొన్ని క్రొత్త వ్యాసాలు చేర్చి, మరింత అందంగా తయారు చేస్తేనే పెంచడం తగునని ఇంతవరకూ ఆ పని చేయలేదు.

దానికి తగిన సమయం వచ్చింది. మీరు కోరిన మార్పులు ఇప్పటికైనా చేయగలుగుతున్నందుకు మాకెంతో ఆనందంగా ఉంది.

భగవద్రామానుజుల చిత్రకథ ఆసక్తికరంగా ప్రారంభమైంది చూశారు కదా!

అలాగే మధ్యపేజీలో అప్పుడప్పుడు ఆళ్వార్, ఆచార్యుల చిత్రపటాలు కూడ మీకందుతూ ఉంటాయి. మరిన్ని వ్యాసాలు, విశేషాలు కూడా అందించాలని మా ఆశ.

వర్తమాన స్థితిని బట్టి ఈ పత్రిక చందాకూడా సంవత్సరానికి రూ. 250/- చేసుకుంటున్నాం. శాశ్వత చందాను పెట్టుకోవడం లేదు. వడ్డీరేట్లులో ఏర్పడే ఒడిదుడుకులవల్ల ఆ రకంగ సాగడం శ్రమ కలిగిస్తుందని భావిస్తున్నాం. అయితే పాఠకులకు ప్రోత్సాహం కోసం 5 సం॥కు చందాను ఒకేసారి పంపిస్తే పత్రికను ఆరు సం॥ వరకు పంపాలని నిర్ణయం.

ఈ మార్పులన్నీ మీకందరికీ ఆనందాన్నే కల్గిస్తాయని మా విశ్వాసం. మీ సహాయ సహకారాలు భక్తిపూర్వకంగా అందు తాయనే మా నమ్మకం. ఇలా ధార్మికసేవలో అందరం కలిసి ముందుకు సాగుదాం!

**జై శ్రీమన్నారాయణ!**

***గమనిక :*** *ఇంతవరకూ ఉన్న శాశ్వత, వార్షిక చందాలు అన్నింటినీ ఈ పైనిర్ణయం ప్రకారం సవరిస్తున్నాము.*




శ్రీమాన్ మధుసూదనాచార్యులు
ప్రధానాచార్య, ఆగమపాఠశాల, జగ్గయ్యపేట

# శ్రీపాంచరాత్రాగమము

**సార్ధకోటి ప్రమాణం హి శాస్త్రం తత్ పంచరాత్రకం ।**
**కార్త్స్న్యేన భగవానాహ లోకానాం హితకామ్యయా ॥**

*విష్ణు తిలకే 8అ॥340శ్లో॥*

లోకులు సదాచార సంపన్నులై తాము బాగుపడటమే కాకుండా, ఇతరులకీ ఉపకరించడానికి వీలయ్యేట్లు జగత్కారణుడైన శ్రియఃపతి శ్రీమన్నారాయణుడే 1 1/2కోట్ల గ్రంథంగ శ్రీపాంచరాత్రాగమ దివ్యశాస్త్రాన్ని తానే స్వయంగ ఉపదేశించినాడని విష్ణుతిలక సంహిత తెలిపింది.

ఈ శాస్త్రానికి **"రహస్యామ్నాయం'** వంటి పేర్లెన్నో ఉన్నాయి. ప్రతిపేరుకీ ఒక ప్రయోజనముంది. ఈ శీర్షికలో కొన్నిపేర్లను వాటి వైభవాన్ని మనము తెలుసుకొంటున్నాము. ఈసారి, అసలు **'పాంచరాత్రము'** అనే పేరెలా ఏర్పడిందో తెలుసుకొనే ప్రయత్నం చేస్తున్నాము.

108 సంహితలుగ విస్తరించినది ఈశాస్త్రమని పాద్మ సంహిత తెలియచేసింది. అదే పాద్మసంహిత, జ్ఞానపాదము, మొదట్లోనే 69వ శ్లోకం నుండి పాంచరాత్రమనే పేరు రావడానికి కారణం సంవర్తకుడనే మహర్షి వాక్కుగ మనకందించింది.

**పంచేతరాణి శాస్త్రాణి రాత్రీయంతే మహాన్త్యపి ।**
**తత్ సన్నిధౌ సమాఖ్యాసౌ తేన లోకే ప్రవర్తతే ॥ 69**

లోకప్రసిద్ధములైన సంప్రదాయములైదు ఉన్నాయి. అవి కపిలుడు ప్రవర్తింపచేసిన 1) సాంఖ్యము, 2) హిరణ్యగర్భుడు ప్రవర్తింపచేసిన యోగశాస్త్రము, 3) మహేశ్వరుడు అందించిన కాపాలం 4) శుద్ధశైవం, 5) పాశుపతం అనేవి. వేదశాస్త్రము అందించిన ఆచార క్రమాన్ని సర్వజనామోదకరముగ, సర్వాధికారికంగాను అవి అందించలేకపోయాయి. శ్రీ పాంచరాత్ర శాస్త్రము సర్వవర్ణములవారికీ, స్త్రీ, పురుష తారతమ్యం లేకుండా అందరికీ వేదైకవేద్యుడైన భగవానుణ్ణి ఇటు తమ తమ గృహాలలోనూ, అటు సాముదాయికంగ సమాజంలోనూ వారి వారి అవసరాలకు, యోగ్యతకూ తగ్గట్టు ఆరాధించుకునే పద్ధతిని, అందుకవసరమైన వివరాలన్నింటినీ స్పష్టంగ బోధించింది.

అజ్ఞానాంధకారంలో కొట్టుమిట్టాడే జనసామాన్యానికి దేవుడి జ్ఞానాన్ని, ఆరాధనాదు లాచరించే పద్ధతులనీ కూడా అందించే జ్ఞానభాస్కరుడిలా శ్రీపాంచరాత్రం వెలుగొందింది.

దీనిముందర పై శాస్త్రాలైదూ కూడా, వాటి వాటి స్థాయిలో అవి గొప్పవే అయినా, రాత్రిలా నిష్ప్రకాశకములైపోయాయి.

**పంచేతరాణి అనేన రాత్రీయంతే ఇతి పంచరాత్రమ్, తదేవ పాంచరాత్రమ్** అదే పాంచరాత్రమై లోకంలో అన్వర్థనామమైంది.

**చంద్రతారాగణం యద్వత్ శోభతే నైవ వాసరే ।**
**తథేతరాణి శోభన్తే పంచ నైవాస్య సన్నిధౌ ॥ 70**

పగటిపూట కాంతులీనే సూర్యుడిముందర చంద్రుదు కానీ, నక్షత్రగణం కానీ నిర్వీర్యమై, కాంతిరహితమైపోతుంది. అలానే శ్రీపాంచరాత్రశాస్త్రం ముందు పై శాస్త్రములు ఐదూ నిర్వీర్యములై అనాదరణీయములగును. పరమవైదికమైన తత్త్వార్థాలను, ఆచరణ విధానాన్ని అందించడంలో ఇది గొప్పదని తాత్పర్యం.

**పంచత్వ మథవా యద్వత్ దీప్యమానే దివాకరే ।**
**ఋచ్ఛన్తి రాత్రయ స్తద్వత్ ఇతరాణి తదన్తికే ॥** *71*

ఆకాశంలో సూర్యుడు తన కిరణాలను దశదిశలా వ్యాపింపచేసినపుడు అంతవరకూ కన్నుపొడుచుకున్నా కానరానట్లు గాఢాంధకారపు కాటుకను నింపిన రాత్రులన్నీ మటుమాయమైపోతాయి. అలానే పైన తెలిపిన సాంఖ్యాది శాస్త్రాలు శ్రీపాంచరాత్రం ముందు అచిత్ప్రాయములగునని తాత్పర్యం.

సాక్షాత్తు భగవానుడే శ్రీదేవికి ఉపదేశించిన "శ్రీప్రశ్న సంహిత" పాంచరాత్ర శబ్దాన్ని మరోరకంగ నిర్వచించింది.

**రాత్రి రజ్ఞాన మిత్యుక్తం పంచేత్యజ్ఞాన నాశకం ।**
**తచ్ఛాస్త్రం పంచరాత్రం స్యాత్ అన్వర్థస్యానురోధతః ॥** *2.40*

అజ్ఞానాన్ని 'రాత్రి' అనే పేరుతో పిలుస్తారు. 'పంచ' అంటే దానిని నశింపచేసేది. వేదమార్గానుయాయులై తరించాలనుకొనేవారికి తెలియదగిన విషయములన్నింటినీ స్పష్టంగ తెలిపే శాస్త్రం కనుక దీనిని **'పాంచరాత్ర'**మని పెద్దలు కీర్తించారు.

పౌష్కర సంహిత అనేది శ్రీపాంచరాత్ర సంహితలలో

'రత్నత్రయం'గ ప్రసిద్ధిగాంచిన సాత్వత, పౌష్కర, జయాఖ్య సంహితలలో రెండవది. ఈ గ్రంథం తన 38వ అధ్యాయం 307,308వ శ్లోకములలో ఈ పాంచరాత్ర శబ్దాన్ని మరోలా నిర్వచించింది.

**"పురాణం వేద వేదాన్తం తథాన్యత్ సాంఖ్య యోగజం**
**పంచ ప్రకారం విజ్ఞేయం యత్ర రాత్ర్యాయతేஉబ్జజ!**
**ఫలోత్కర్ష వశేనైవ పాంచరాత్ర మితి స్మృతమ్ ॥**

మానవజన్మ దాల్చిన జీవుడు చేయవలసిన కర్మలను, వాటివల్ల లభించే ఫలితాలను ఒక్కొక్క శాస్త్రమూ ఒక్కొక్క రకంగ వర్ణించాయి. పౌరాణికులు, వైదికులు, వేదాన్తులు, సాంఖ్యదర్శనకారులు, యోగదర్శనకారులు అనే ఐదు రకాల వారూ తమ తమ గ్రంథాలలోకూడా వీటి ప్రస్తావన చేసినా అవి అర్థం కావడమూ కష్టమే. ఆచరించాలన్నా ఎన్నో రకాల క్లేశాలను సహించవలసి ఉంటుంది.

కానీ, శ్రీపాంచరాత్ర శాస్త్రంలో పంచసంస్కారాలను పొంది భగవంతుని శరణాగతి చేసి, ఆతనికే చెందినదిగ జీవుణ్ణి గుర్తించడం, సర్వవస్తువులూ ఆ భగవంతునివేనని నిశ్చయించుకోవడం, ఆతడే ఆరాధనాశక్తి నిస్తున్నాడని విశ్వసించడం. ఇలా చేసే సేవలన్నీ భగవంతుని కైంకర్యములుగ చేసి, ఆతని శ్రీపాదాలకే సమర్పించి తాను నిరహంకారుడై, నిర్మముడై భగవద్భక్తుల వద్ద వినయ విధేయతలతో జీవితాన్ని భగవన్నామానుసంధానంతో గడపడం, చివరికి ఆ భగవంతుని నిత్యకైంకర్యమునే సాయుజ్య రూప మోక్షంగ విశ్వసించి ఉండడం వీటన్నింటినీ శ్రీపాంచరాత్రం సులభతరం చేసి అందించింది.

మన పూర్వాచార్యులైన నాథమునులు, యామున మునులు, భగవద్రామానుజమునులు, శ్రీమద్వరవరమునులు మొదలైన ఆచార్యశిరోమణులందరూ సిద్ధాంత నిర్ధారణ చేయగలిగినదీ, అద్భుతంగ వేదాన్త వాక్యాలను సమన్వయ పరచి, వాటికి ఇతరులు కల్పించిన అపార్థాలను తొలగించినదీ ఈ శ్రీపాంచరాత్ర గ్రంథాల ఆధారముగనే, అంటే, ఇవెంత చక్కగ అర్థనిర్ణయం చేయగలవో మనం గుర్తించాలి. అందుకే పైశ్లోకంలో చతుర్ముఖునితో భగవానుడు "ఫలప్రదర్శనలో శ్రీపాంచరాత్ర శాస్త్రము పురాణాది ఐదు శాస్త్రాలనూ కాంతిహీనం కావిస్తున్నది సుమా" అని స్పష్టం చేసినాడు.

విశ్వమిత్ర సంహితా అనే గ్రంథం కూడా 2వ అధ్యాయంలో 6వ శ్లోకంలో ఇదే విషయాన్నీ సమర్థించింది. అయితే "పాంచరాత్ర" శబ్దానికి మరొక అందమైన నిర్వచనాన్ని కూడా ఇచ్చింది.

**పంచేంద్రియాణి విషయాః పంచభూతాని తద్గుణాః ॥ 3**
**పంచశబ్దాభిధేయాని విద్వాంసోప్యాஉచచక్షిరే ।**
**రా ఇత్యయమపిప్రోక్తో ధాతురాదాన వాచకః ॥ 4**

**విషయేంద్రియ భూతానాం ఆదాతారశ్చ పంచరాః ।**
**మనుష్యాః పాలనాత్తేషాం పంచరాత్రమితి స్మృతమ్ ॥5**

ఇదొక అద్భుతమైన నిర్వచనం. శ్రోత్ర, త్వక్, చక్షుర్, జిహ్వా, ఘ్రాణములనే జ్ఞానేంద్రియములు ఐదింటిని "పంచ" అని అంటారు.

ఈ జ్ఞానేంద్రియములు గ్రహించే విషయములైన శబ్ద స్పర్శ రూప రస గంధములను మరొక "పంచ" అని అంటారు. వీటికి ఆధారములైన పృథ్వివ్యాది పంచభూతములు మరొక "పంచ".

"రా" అనే ధాతువునకు సంస్కృతములో "గ్రహించుట" అని అర్థము. పంచభూతాత్మకమైన శరీరంలో, దీనికంటే వేరుగ జీవుడనే వాడొకడు ఉన్నాడని గుర్తించగలిగిన వారు మనుష్యులు. అలా గుర్తించిన వారిని **'పంచరులు'** అని అంటారు. **"పంచరాః త్రాయన్తే అనేన ఇతి పంచరాత్రం, తదేవ పాంచరాత్రం".**

దీనికి తాత్పర్యమేమిటంటే, శబ్ద స్పర్శాది విషయములను మనుష్యులు ఎలా గ్రహించవలెనో, ఎట్లా వాటిని ఆత్మోజ్జీవన కరంగ అయిదు ఇంద్రియాల ద్వారా ఎలా ఉపయోగించుకోవలెనో, ప్రాకృతిక విషయాలను పరమాత్మ ప్రాప్తి సాధనాలుగ మలచుకొనే విధానమేమిటో చక్కగ తెలియజేసే శాస్త్రం శ్రీపాంచరాత్రం.

అది ఎలానో కొద్దిగ వివరించుకోవడం అవసరం. కంటితోటి చేసేపని రూపాలు చూడటం. అది కేవలం రూపములు, రంగులు, ఆకారములు మొదలైనవి చూసేటప్పుడు కొన్నింటియందు ఇంద్రియం ఆకర్షిత మవుతుంది. కొన్నింటిని ఇంద్రియం ఇష్టపడదు. మరికొన్నింటి యందు ఉదాసీనంగా ఉండిపోతుంది. ఆకర్షకంగా ఉండే వాటిని ఇష్టపడుతుంది, దానివైపు ప్రవర్తిస్తుంది. ఆ విషయం మంచిదైతే మనలో మంచి సంస్కారాన్ని చక్షురింద్రియం నింపుతుంది. లేకపోతే చెడు సంస్కారములను చేరుస్తుంది. పైగా నేను చూస్తున్నా, నాకు కావాలి, ఇత్యాది భావనల ద్వారా అహంకార, మమకారములను ప్రేరేపిస్తుంది.

*(తరువాయిసంచికలో)*

# మన దర్శనం 'సు' దర్శనం

పూర్వమీమాంస
వైశేషిక
న్యాయ
యోగం
సాంఖ్య

వైశారదీ

గత సంచిక తరువాయి...

**పూర్వం ఓ గ్రామం నుంచి మరో గ్రామానికి ప్రయాణించే బాటసారి దారిలో తినడానికి తగిన ఆహారం కూడా మూట కట్టుకుని వెళ్ళేవాడట! ఎన్నో రకాల సామాన్లు గట్రా సర్దుకుని కాని బయల్దేరేవాడు కాదట! ఆ మాట వింటే ఈనాటి వారికి ఆశ్చర్యంతోపాటు నవ్వు కూడా వస్తుంది. ఎక్కడికి పడితే అక్కడికి వాహన సౌకర్యాలు... విశాలమైన రోడ్లు... హోటల్స్‌లాంటి ఆహార శాలలు ముమ్మరంగా ఏర్పడ్డ ఈనాటి పరిస్థితుల్లో అలవాటుపడినవాడికి పై చద్దిమూట ప్రయాణికుడి కథ ఉత్త ఛాదస్తంలా అన్నిస్తుంది. కానీ, ఆ రోజుల్లో రోడ్లు లేవు... కనుచూపు మేరలో జీవసంచారం మచ్చుకైనా ఉండేదికాదు. ఆహారం ఎక్కడ దొరుకుతుందో తెలీదు. గమ్యాన్ని చేరతాడో, లేదో అనుమానమే! ఆ రకమైన ప్రయాణం చేయడమే చాల ఆశ్చర్యం కదా!**

**ఎవరైనా ఒక వ్యక్తిని గురించి ఆలోచించేటప్పుడు ఆనాటి ఆ వ్యక్తియొక్క పరిస్థితులను కూడా మనం దృష్టిలో పెట్టుకోకపోతే మన ఆలోచనావిధానం అసమగ్రమౌతుంది. వాస్తవాన్ని మనం గుర్తించ దలుచుకోలేదన్నమాట! ఋషుల విషయం కూడా అంతే. వారివారి జీవితాల్లో కొన్ని అసందర్భాలుగా, కొన్ని అసంగతాలుగా కన్పించినా, వాటిని కుదృష్టితో చూడకుండా ఆనాటి స్థితిగతుల్ని బట్టి ఆలోచించాలి.**

అయినా ఋషుల జీవితాలలో వేలెత్తి చూపించదగినవిగా కన్పించే లోపాలు వారు చెప్పుకుంటేనే కదా మనకు తెలిసింది! మనం ఎవరమూ అక్కడికి వెళ్ళిచూడలేదు. కనుక ఆ విషయాలు మనకు తెలియవు. **తమ జీవితంలో చెడు చూపించుకోవాలని ఎవ్వరూ అనుకోరు. ఒకవేళ చెడే జరిగినా దాన్ని కప్పిపుచ్చి సదాచార సంపన్నులుగానే కన్పించాలని ఆరాటపడతారు. కాని మన ఋషులెవరూ అలాంటి ముసుగు వేసుకున్నట్టు కన్పడదు. మంచో, చెడో ఎదుటివాడికి నచ్చినా సరే... నచ్చకపోయినా సరే వాస్తవాల్ని వక్రీకరించకుండా వాస్తవంగా చూపించడమే తమ పవిత్ర బాధ్యతగా గుర్తించారు. తమని గౌరవించక పోయినా, తాము గుర్తించిన వాస్తవాన్ని భావితరాల వారు కోల్పోకూడదని... తమంత శ్రమ పడకుండానే వాస్తవాన్ని గుర్తించి బాగుపడాలని కరుణార్ద్ర హృదయులై దాపరికం లేకుండా, ఉన్నది ఉన్నట్టు, జరిగింది జరిగినట్టు మన ముందుంచారు. వారు చెప్పిందంతా ప్రమాణంగా స్వీకరించడానికి మనకిది కారణమౌతుంది.**

అసలు అదలా ఉంచి "దూషించడం తగదు". వారు అందించిన యథార్థ జ్ఞానాన్ని అందుకునే ప్రయత్నం చేయాలే తప్ప, అందులోని సారాన్ని ఆకళింపు చేసుకునే ప్రయత్నం చేయాలే తప్ప, వారి చరిత్రలను సంకుచిత దృష్టితో విచారించడం అప్రస్తుతం.

"బజారు నుంచి తెచ్చిన పండును మనం తింటున్నాం అంటే, 'అది ఎవరు పండించారు? ఎక్కడ పండించారు?. ఎలా పండించారు? ఎన్నెన్ని చేతులు మారాయి?' అని ఆలోచిస్తున్నామా!? 'పండు బావుందా... లేదా?' అని చూస్తున్నాం! తీసుకుంటున్నాం! ఋషులు అందించిన సత్యాన్ని కూడా అలాగే గ్రహించగలిగితే చాలు.

"పదార్థం తయారయ్యేటప్పుడు చూడకూడదు" అని అందుకే అంటారు కాబోలు! తినటానికి విస్తట్లో వడ్డిస్తే రుచ్యంగా.... హృద్యంగా.... అనవద్యంగా ఉంటుంది. కాని వంటశాలలోకి వెళ్ళి చూస్తే పదార్థం తినబుద్ధి కాదు. బయట పేర్చి పెడితే మాత్రం అనుభవించడానికి బావుంటుంది నోరూరిస్తూ.

అలాగే, విశాలమైన నది పుట్టేచోట చాలా చిన్నకాలువగానో... ధారగానో... చుక్కలుగా పడుతూనో ఉంటుంది. అక్కడ చుట్టూ దృశ్యములు కూడా అంత రమణీయంగా ఉండక పోవచ్చు. కాని అదే ప్రవహించి... ప్రవహించి వచ్చి ఒక విశాలమైన మైదానం చేరేసరికి దర్శనరమణీయంగా... హృదయోల్లాసకరంగా... ప్రాణికోటికి జీవనాధారంగా కన్పిస్తోంది.

విభిన్న దేశాలలో విభిన్న ప్రాంతాలలో విభిన్న పరిస్థితులలో... విలక్షణమైన పుట్టుపూర్వోత్తరాలతో వివిధ ఋషుల చరిత్ర మనకి అందుతోంది. వాళ్ళ యథార్థ విజ్ఞానం మాత్రం జీవనదుల్లా అతిలోక సుందరము, పరమ విలక్షణము, సర్వులకీ పరమ స్వీకార్యము అనడంలో సంశయించాల్సిన పనిలేదు.

బయట ప్రపంచాన్ని, ఆంతర ప్రపంచాన్ని వాటి వాటి స్వభావాలతో చక్కగ గుర్తించి ఏది ఎంతవరకు స్వీకరించవచ్చో చక్కగా విశ్లేషించారు మన ఋషులు. ఆ గుర్తించిన విషయం

తమవరకే పరిమితం చేసుకోలేదు. తమని ఆశ్రయించిన వారందరికీ ప్రతిఫలాపేక్ష లేకుండా నిస్వార్థంగా ఆ జ్ఞాన పరిమళాలను వెదజల్లారు.

మన భారతీయ ఋషులు యథార్థ పదార్థ విజ్ఞానం కోసం చేసిన తపస్సుతో ప్రకృతి రహస్యాలనెన్నింటినో దర్శించారు. ఆ దర్శించిన వాటిలో అవసరమైనవాటిని మరింత విశ్లేషించుకుంటూ పోయారే తప్ప – తెలిసినవి తెలిసినట్టుగ ప్రచారం చేయలేదు అనిపిస్తుంది. వారి పరిశోధనల్లో బాహ్య విజ్ఞానంకంటే ఆధ్యాత్మిక విజ్ఞానానికే అధిక ప్రాధాన్యం కనిపిస్తుంది. అందుకే వారు ఆధ్యాత్మిక సాహిత్యాన్నే అపారంగా అందించుకుంటూ పోయారు. అంతమాత్రం చేత భౌతిక విజ్ఞానం గురించిన అవగాహన వారికి లేదు అనుకోవడం పొరపాటు.

వైజ్ఞానికంగా మనదేశం చాలా వెనుకబడి ఉందని, దానికి కారణం మన ఋషులు అందించిన ఈ ఆధ్యాత్మిక విద్య ఒక పెద్ద అవరోధమని – ఇదో మతమని, మత్తుమందు వంటిదని – సమాజ ప్రగతికి అడ్డువచ్చే ఇటువంటి విద్యలను ప్రోత్సహించకూడదు, పోషించకూడదు అంటూ పలురకాలుగా వ్యాఖ్యానాలు చేసే అభ్యుదయవాదులమనుకునే వాళ్ళు లేకపోలేదు. మానవజీవితానికి ఎన్నో వసతులు కల్పిస్తూ అద్భుతమైన ప్రకృతి రహస్యాలను వెలికితీసే విజ్ఞానాభివృద్ధికి తోడ్పడే ఈ వైజ్ఞానిక శాస్త్రవేత్తలే అసలైన ఋషులు, వీళ్ళని మనం పూజించాలంటూంటారు. నిజమే! ఈనాటి విజ్ఞానవేత్తలు సాధించిన ప్రగతి సామాన్యమైందేమీ కాదు.

పూర్వకాలపు ఋషులకి ఎక్కడో జరిగే దాన్ని వినగలిగే శక్తి చూడగలిగే శక్తి ఉండేవిట! ఎంత దూరమైనా గగనతలంలో విహరించగలిగే లాఘవం ఉండేదట. తామున్నచోట నుంచే ఎక్కడో ఉండేవారితో సంభాషించగలిగేవారట! ఎంతోకాలం ఇంద్రియ నిగ్రహంతో తపస్సు చేసిన ఫలితంగా ఇలాంటి అద్భుత శక్తులు ఆ ఋషులకున్నట్లు చెప్తున్నా అవివాళ్ళ వాళ్ళ వరకే పరిమితమయ్యాయి తప్ప జనబాహుళ్యానికి అందినట్టు తెలియటంలేదు. పైగా అది వాళ్ళకెప్పుడో ఉండే శక్తి తప్ప – అదైనా వాళ్ళతోనే అంతరించిపోయింది తప్ప తరువాతి తరాల వాళ్ళకి అందలేదు. కనుక అవి ఊహాకల్పితాలో – నిజానికలాంటి శక్తులు వారికి ఉండేవో లేవో తెలీదు.

''వైమానిక విజ్ఞానం మా చరిత్రలోనూ ఉంది'' అంటూంటారు. అది రామాయణంలాంటి కథల వరకే పరిమితమైంది తప్ప ఆ విజ్ఞానం అప్పటి జనసామాన్యానికిగాని, తరువాత వాళ్ళకిగాని ఉపయోగపడలేదు. వీటినిబట్టి చూస్తే భారతీయులకు భౌతిక విజ్ఞాన విషయంలో ప్రవేశంలేదని అంటూంటారు. ఈనాటి వైజ్ఞానికులు టెలిఫోన్‌వంటి వాటిని కనిపెట్టారంటే అది కేవలం తమ ఒక్కరి కోసమే అంకితం కాలేదు. దానిని ప్రతివాళ్ళూ ఉపయోగించుకోగలుగుతున్నారు. ఏ యోగ్యతాలేని సామాన్యుడు కూడా టి.వి. చూడగలుగుతున్నాడు. ఎక్కడో ఉన్నవ్యక్తితో నేరుగా మాట్లాడగలుగుతున్నాడు. విహంగవిహారం ఇతరగ్రహాలదాకా విజయవంతంగా చేస్తున్నాడు. మానవ విజ్ఞాన వికాసానికి ఇన్ని రకాలుగా తోడ్పడుతూ సుఖ జీవనాన్ని సాగించగలిగే వసతులు కల్పించే ఉపకారాల్ని ఇప్పటి వైజ్ఞానికులు చేస్తున్నమాట నిజమే! ఋషులు ఇటువంటి ఉపకారాలు చేయలేదన్నమాట కూడా వాస్తవమే!

ఒక దృష్టితో ఆలోచిస్తే ఈ వైజ్ఞానికులందరినీ కూడా గొప్ప ఋషులే అనొచ్చు. ఎందుకంటే ఆయా వస్తువుల్ని కనిపెట్టడానికి వీరు చేసిన తపస్సు తక్కువదేం కాదు. ఎంతో మంది ఎన్నో రకాలుగా ఈ విజ్ఞానం కోసం తమ జీవితాలని అంకితం చేశారు. అయితే వీళ్ళందరినీ మనం ఋషులు అవడం లేదు. ఎందుకంటే వీళ్ళంతా బాహ్యపదార్థాల్ని చేతనైనంత వరకూ విశ్లేషించి, తను పరిశోధనలతోటి భౌతిక జీవనాన్ని అనాయాసంగా, సుఖప్రదంగా, విలాసవంతంగా సాగించడానికి తమవంతు సహకారం అందించిన మాట వాస్తవమే! అంతే తప్ప మానవుడి మనశ్శాంతికి కావల్సిన సాధనాలను వేటినీ వీరు చెప్పలేకపోయారు.

మనిషికి బాహ్య సుఖాలెన్ని ఉన్నా అనుభవించగలిగే మనఃస్థితి కూడా కావాలి కద! భౌతిక సుఖాల్ని అనుభవించేకొద్దీ పెంచుకోవాలనిపిస్తుందే తప్ప చాలన్పించదు. విలాసాలు పెరుగుతున్న కొద్దీ, మరిన్ని విలాసాల కోసమే అర్రులు చాస్తున్నాడే తప్ప 'ఇక చాల'నే తృప్తి కన్పించడంలేదు. శారీరక సుఖాలు పెరుగుతున్న కొద్దీ మానసికంగా బలహీనుడై పోతున్నాడు మనిషి. తనకున్నన్ని, మరెవ్వరికీ లేనన్ని సుఖాలు తనకొక్కడికే కావాలని ఆశాపీడితుడౌతున్నాడు. స్వార్థం తలకెక్కితే తన సుఖానికడ్డువచ్చిన, వస్తారు అనుకొన్నవాళ్ళని భయపెట్టి అవసరమైతే హతం చేయడానికి కూడా వెనుకాడటం లేదు. వైజ్ఞానికంగా ఇన్ని విలాసాలు పెంచుకున్నా ఎంతశక్తి సంపాదించుకున్నా క్షణక్షణం భయంతో తన ఊపిరిని వింటూ, తననే శంకించుకునేంత ఉత్కంఠతో మేకపోతు గాంభీర్యంతో మనిషి మనుగడ సాగిస్తున్నాడు. *(తరువాయి సంచికలో)*

(తరువాయి సంచికలో)

# రామానుజ చిత్రకథ


ధన్యోస్మి స్వామీ!
ఇంతకాలానికి అనుగ్రహించావా స్వామీ!
కొంతకాలం తరువాత
ఏమర్రా! విన్నారా! మన కాంతిమతి గర్భవతి అయ్యిందట!
అలానా! పార్థసారథి పెరుమాళ్ళ అనుగ్రహం లభించిందన్నమాట!
ఆ శుభవార్త కోసమే ఎదురుచూస్తున్నా
ఏమర్రో! ఇదిగో! మన కాంతిమతి మగబిడ్డను ప్రసవించిందట.
చూసివద్దాం రండి!
ఆహా! ఎంత అందంగా ఉన్నాడు!
ఎంత విశాలమైన నేత్రాలు!
ఇది పింగళనామ సంవత్సరం, చైత్రమాసం, పంచమి, గురువారం, ఆర్ద్రా నక్షత్రం, చాలా గొప్పవాడవుతాడు ఈ పిల్లవాడు.


శ్రీశైలపూర్ణులా! వేంచేయండి! బాగున్నారా! బావగారు
కేశవాచార్యా! మీరు తండ్రికావడం అదృష్టం.
ఇదిగో మీ మేనల్లుడు. చూడండి!
ఎంతోమంది పసివాళ్ళను చూశాను. కానీ, ఏమి అందం! కావ్యాలలో చదివానే కాని,ఇలాంటి పిల్లవాడిని ఎక్కడా చూడలేదు. ఆ ముఖమండలం చూడు! ఆదిశేషుని నీడలేమిటి? అబ్బా! ఇళై ఆళ్వానే!
ఆదిశేషుని అంశ అన్నమాట!
ఇళై ఆళ్వాన్ అంటే లక్ష్మణుడు! రాముని అనుజుడు కదా!
అంటే ఆదిశేషునిలాగా, లక్ష్మణునిలాగా భగవంతునికి అన్ని రకాల సేవలను చేస్తాడేమో!
రామానుజుడా! ఎంత బాగుందీ ఈ పేరు! రామానుజా!
రాముని అనుజుడు రామానుజుడు ఈ పేరు బాగుందే!
ఏడేళ్ళకు ఉపనయనమైంది.రామానుజునికి.
రామానుజా! వేదాధ్యయనం ప్రారంభిస్తాను రా! నాయనా!
హరిః ఓమ్ ఇషేత్వోర్జేత్వా...
హరిః ఓమ్ ఇషేత్వోర్జేత్వా...
మన రామానుజునికి ఎంత కుశాగ్రబుద్ధి! చెప్పటమే ఆలస్యం, ఇట్టే గ్రహించేస్తున్నాడు.


పన్నెండు సంవత్సరాలకే వేదాధ్యయనం పూర్తి చేసేశాడు. ఇక వేదాంత విద్యను నేర్పాలి.
కాంచీపురంలోని యాదవప్రకాశకులు తప్ప వేదాంత చెప్పేవారెవరున్నారు?
ఔను! యాదవప్రకాశులు సూత్రభాష్యాన్ని చాల చక్కగా చెప్పగలరు. అక్కడికే పంపిద్దాం.
యోగ్యమైన వయస్సు, ఓ మంచి పిల్లనుచూసి వివాహం జరిపేస్తే, ఇక, ఎక్కడికైనా పంపచ్చు.
ఆ శుభసమయం త్వరలోనే వస్తుంది
స్వామీ! మా కుమార్తె తంజమాంబను మీ కోడలిగా స్వీకరించ ప్రార్థన!
అలాగే! తప్పకుండా.
“తంజమాంబ” మన రామానుజులకు తగిన కన్య.
అయితే ఆలస్యం దేనికి ముహూర్తాలు నిర్ణయించండి.
వివాహం పూర్తయింది.
ఈడూ జోడూ సరిపోయారు


ఆ తరువాత కొంతకాలానికి కేశవాచార్యులు పరమపదించి స్వాచార్య చరణాలను చేరారు.
"నాయనా! పరమపదించిన మీ నాన్నగారికి కోరిక ఒకటి మిగిలిపోయింది. నువ్వు కాంచీ పురంలోని యాదవప్రకాశకులవద్ద వేదాంతాధ్యయనం చేయాలి అని వారి కోరిక"
తప్పకుండా అమ్మా! అయితే మనం కాంచీ పురానికి వెళ్ళిపోదాం!
ధర్మపత్ని తంజమాంబతో, తల్లి తో కంచీకి బయలుదేరాడు రామానుజులు
అమ్మా! అధ్యయనానికి వెళ్ళివస్తా! ఆశీర్వదించు!
మీనాన్నగారి ఆశయం నెరవేరుగాక!
దాసోహం స్వామీ! నన్ను రామానుజుడు అంటారు. వేదాన్త విద్యను కోరి వచ్చాను.
రామానుజా! రా నాయనా!
ఇంకా ఉంది..

**శ్రీమన్నారాయణ రామానుజ యతిభ్యో నమః**

# యతిరాజవింశతి

శ్రీశ్రీశ్రీ అహోబిల రామానుజ జీయరు స్వామివారు

భగవంతుడు మనందరినీ దిద్దుబాటు చేయటానికి ఎన్నో అవతారాలను ధరించాడు. శ్రీరామునిగా ధర్మాన్ని ఆచరించి చూపాడు. శ్రీకృష్ణుడై తత్త్వాన్ని **"గీతాశాస్త్రం"** గా అందించాడు. స్వామి మనకోసం పన్నిన ఉపాయాలు వ్యర్థమై దిగులుతో వైకుంఠాన్ని చేరాడు. ఈ మానవులను తరింప చేడానికి వచ్చిన నన్ను మనిషిగా చూసారు **అవజానంతి మాం మూఢాః, "మూఢులు"** అంటూ సంభావించాడు స్వామి. సర్వేశ్వరుని సంకల్పాన్ని గుర్తించిన ఆదిశేషుడు స్వామిని ప్రార్థించాడు. ఇతర విషయాలలో మునిగి శరీర సౌఖ్యమే మిన్నగా తలచే ఈజనులని సన్మార్గంలో ప్రవర్తింపచేస్తానన్నాడు. శ్రీమన్నారాయణుడు సంతోషించి ఈ లీలా విభూతితోపాటు, నిత్యవిభూతి అయిన పరమపదమునకు కూడా మీరే నాయకులు, ఈ నాటి నుండి మీదే బాధ్యత అన్నాడు స్వామి.

ఒక్క నాడు కూడా స్వామిని విడచి ఉండని ఆదిశేషుడు తన స్వామి ఆనందంకోసం పరమపదము నుండి ఈ భూలోకానికి వేంచేసి కాంతిమతీ సుతుడిగా అవతరించారు. ఈయనను తమిళంలో ఇళైయాళ్వాన్ అని వ్యవహరిస్తారు. అనగా లక్ష్మణముని అని అర్థము.

భగవంతుడు శ్రీరామునిగా అవతరిస్తే ఆయన్ని అనుసరిస్తూ ఆదిశేషుడు లక్ష్మణుడై జన్మిస్తే **"రామానుజ"** అని పిలిచారు. ఆయనే మరలా కలియుగంలో **"భగవద్ రామానుజులు"**గ అవతరించాడు. వీరి వైభవం 'ఇంత' అని చెప్పుటకు ఎవ్వని తరము కాదు. **'రామానుజ'** అను ఈనాలుగు అక్షరాలు లేకపోతే మేమంతా ఏమైపోయి ఉండేవారమో అని ఆనాటి జ్ఞానులైన పెద్దలే అన్నారంటే ఇక సామాన్యులమాట చెప్పనక్కరలేదు. ఎందరికో సన్మార్గాన్ని ప్రసాదించి లోకాచార్యులయ్యారు **"రామానుజులు".**

మనకు జ్ఞానాన్ని బోధించేవారందరిని **'గురువు'** అనే సంభావించినా **"తస్మిన్ రామానుజార్యే గురురితి చ పదం భాతి నాన్యత్ర"** అని, భగవద్రామానుజుల యందే ఈ 'గురువు' అనే పదము సార్థకమౌతుందనేది పూర్వాచార్యుల నిర్ణయం. ఎందుకంటే! భగవంతుని గురించి వివరించే వేదవాక్యాలకు ఎందరో అపార్థాలు చెప్పి, 'మేము బాగా చెప్పాం' అనుకున్నారు. కానీ వేదం మాత్రం 'అయ్యో! నేను చెప్పిన దానికి అర్థం ఇదికాదే' అని శోకించినది. శోకాన్ని పోగొట్టే వారికోసం ఎదురు చూసింది. విచ్చేశారు మన రామానుజులు. వేదాలకు సరైన అర్థాన్ని వివరించారు. విరుద్ధమతాలను ఖండించారు. వేదమాత ఆనందించినది. **'భాష్యకార'** అనే బిరుదంతో రామానుజులను సత్కరించినది. తన శోకాన్ని పోగొట్టినందుకు శారదామాత, తన ఆరాధ్యదైవమైన హయగ్రీవుని రామానుజుల శ్రీ సన్నిధికి సమర్పించినది.

శ్రీరామానుజులు సాక్షాత్తు శ్రీ తిరుమల శ్రీనివాసునికే మార్గనిర్దేశం చేసి, ఆచార్యులై, లోకారాధ్యులయ్యారు. ఆశ్రితు లందరికీ భగవదనుగ్రహాన్ని అందించటమే తమ ప్రయోజనం తప్ప, తమ సుఖంకోసం కాలయాపనము చేసిన వారుకారు. జ్ఞానులైన పండితులు మొదలుకొని హరిజన, గిరిజనుల వరకు అందరూ వీరి కల్యాణ గుణములకు ముగ్ధులై భగవంతుని మరచి రామానుజులే రక్షకులని ఆశ్రయించి తరించారు.

శ్రీరంగం, కాంచీపురం, తిరుమల, మేల్కోట ఇలా అనేక దివ్యదేశాలను సంస్కరించి ఆయా ఆలయాలకు చక్కని వ్యవస్థను చేసారు. లోకమంతా రామానుజులు చేపట్టిన సంస్కరణలను శిరసావహించి **"రామానుజార్య దివ్యాజ్ఞా వర్థతాం-అభివర్థతాం"** అంటూ కీర్తించింది. ఆశ్రయించిన వారికి సాటిలేని జ్ఞాన సంపదను అనుగ్రహించడమే కాదు, పరమపదాన్ని వ్రాసి ఇచ్చిన ఉదారులు రామానుజులు. అలాంటి ఆచార్యుల వైభవాన్ని నిత్యము వేనోళ్ళ కీర్తించడంతప్ప ఏమిచ్చినా ఋణం తీర్చుకోలేము. పెరియజీయర్ అను నామధేయులైన మణవాళమామునులు ఒక ఇరువది శ్లోకాలలోవారి పరమాచార్యులైన భగవద్ రామానుజుల వైభవాన్ని **"యతిరాజవింశతి"**గా మనకు అనుగ్రహించారు. సకల మంగళప్రదమైన **'యతిరాజుల'** వైభవాన్ని ఈ స్తోత్రం ద్వారా తెలుసుకొంటూ ముందుకు సాగుదాము!




# తిరుప్పల్లాండు

వైశారదీ

వారాట్పుట్టు నిన్ఱీరుళ్ళీరేల్, వన్దు మణ్ణుమ్ మణముమ్ కొణ్మిన్
కూరాట్పుట్టు నిన్ఱీర్‌గళై ఎజ్గళ్ కుఝువినిల్ పుగుదలొట్టోమ్।
ఎరాట్కాలుమ్ పరిప్పిలోమ్ నాజ్గళ్ ఇరాక్కదర్‌వార్, ఇలంగై
పారాళాక ప్పడై పొరుదానుక్కు ప్పల్లాండు కూరుదుమే ॥ 3

| | |
|---|---|
| **వార్ ఆళ్ పట్టు** | = ఉజ్జీవింపచేయు భగవత్సేవయను వృత్తిలో |
| **నిన్ఱీర్** | = స్థిరబుద్ధి కలవారెవరైనా |
| **ఉళ్ళీరేల్** | = ఉన్నచో |
| **వందు** | = వచ్చి |
| **మణ్ణుమ్** | = దీక్షామృత్తికను |
| **మణముమ్** | = కంకణమును |
| **కొణ్మిన్** | = స్వీకరింపుడు |
| **కూరాట్పుట్టు (కూర్+ఆళ్+పట్టు)** | = కూటికొరకై దాస్యవృత్తిలో దిగి |
| **నిన్నీర్‌గళై** | = ఉన్నవారిని |
| **ఎంగళ్ కుఝువినిల్** | = మా గోష్ఠిలోనికి |
| **పుకుదల్ ఒట్టోమ్** | = ప్రవేశించుటకు అంగీకరించము |
| **ఏరాట్కాలుం** | = ఏడు తరములుగా |
| **నాంగళ్** | = (ఇతరప్రయోజనాలు కోరని) మేము |
| **పరిప్పు+ఇలోం** | = ఎటువంటి దోషములేనివారము |
| **ఇరాక్కదర్ వార్** (రాత్రించరులు) | = రాక్షసులు బాగుపడునట్లు |
| **ఇలంగై** | = లంకానగరమునందలి దుష్టులు |
| **పారాళాగ** | = నశించునట్లు |
| **పడై పొరుదానుక్కు** | = యుద్ధముచేసిన శ్రీరామచంద్రునికి |
| **పల్లాండు** | = రక్షణమగుగాక అని మంగళాశాసనము |
| **కూఱుదుమే** | = పలికెదము |

**తా:** స్వామికి మంగళాశాసనము పాడిన తరువాత లోకాన్ని ఉద్దేశించి పలుకుతూ భగవత్సేవయను "మనలను ఉజ్జీవింపచేయు కైంకర్యములో (వృత్తిలో) స్థిరబుద్ధికలవారై ఎవరైనా ఉన్నచో వచ్చి దీక్షామృత్తికను, కంకణమును (భగవంతుని సేవ చేయుటయే అను కంకణమును) స్వీకరింపుడు. కేవలము కూటికొరకే దాస్యవృత్తిలో దిగి ఉన్నవారిని మా గోష్ఠిలోనికి ప్రవేశింప అంగీకరించము. ఏడుతరములుగా ఎటువంటి దోషము లేనివారమైన మేము. కంకణబద్ధులైన మీరు, అందరము కలసి లంకానగరములోని విభీషణాది రాక్షసులు బాగుపడునట్లు, దుష్టులు నశించునట్లు యుద్ధము చేసినటువంటి శ్రీరామచంద్రస్వామికి రక్షణము అగుగాక! అని మంగళం పలుకుదాం!" అని ఆహ్వానిస్తున్నారు.

**ఏడు నిలత్తిల్ ఇడువదన్ మున్నమ్ వన్దు, ఎంగళ్‌కుఱాం పుగున్దు**
**కూడు మనముడైయార్‌గళ్ వరమ్బొరి, వన్దొల్లై క్కూడుమినో।**
**నాడు నగరముమ్ నన్గఱియ నమో నారాయణాయ వెన్ఱు**
**పాడు మనముడై ప్పత్తరుళ్ళీర్ వన్దు పల్లాండు కూఱుమినే॥ 4**

| | | |
|---|---|---|
| **ఏడు నిలత్తిల్** | = | దేవుని స్మరణకు నోచుకోని క్లిష్టమైన స్థానమునందు (కైవల్యము నందు) |
| **ఇడువదన్ మున్నం** | = | పడిపోకముందే! |
| **వందు** | = | వచ్చి |
| **ఎంగళ్ కుఱాం** | = | మా యొక్క గోష్ఠిలో |
| **పుగున్దు** | = | ప్రవేశించి |
| **కూడుమ్** | = | కలసియుండు |
| **మనం** | = | సంకల్పము |
| **ఉడైయార్‌గళ్** | = | కలవారల్లారా! |
| **వరంబు+ఒరి** | = | సంకోచము వదిలి |
| **ఒల్లై** | = | శీఘ్రముగా |
| **వన్దు** | = | వచ్చి |
| **కూడుమినో** | = | మాతో కలవండి! |
| **నాడుమ్** | = | జనపదాలలోనివారు |
| **నగరముమ్** | = | నగరములలోనివారు |
| **నన్గు** | = | బాగుగా |
| **అఱియ** | = | తెలుసుకొనునట్లు |
| **నమో నారాయణాయఎన్ఱు** | = | నారాయణ మంత్రమును అనుసంధించుచూ |
| **పాడుం** | = | గానము చేయు |
| **మనం+ఉడై** | = | మనస్సు కలిగిన |
| **పత్తర్** | = | భక్తులు |
| **ఉళ్ళీర్** | = | ఉన్నచో |
| **వన్దు** | = | వచ్చి |
| **పల్లాండు కూరుమినే** | = | మంగళాశాసనము పలుకుడు |

**తా:** విరజానది దాటిన తరువాత ఓ మూలగ అటు పరమపదానికీ చేరకుండా ఇటు లీలావిభూతికీ చెందక మధ్య ఉండే ఏకాంతప్రదేశానికి 'కైవల్యము' అని పేరు. ఏకాంతసుఖాన్నిచ్చే ఆచోటికి పోవుమార్గమున పడిపోవకముందే, వచ్చి, మాగోష్ఠిలో చేరాలి అనే సంకల్పము కలవారు సంకోచమును వదిలి శీఘ్రముగా వచ్చి మాతో కలవండి.

అంతేగాక నారాయణమంత్రాన్ని మనసారా భావిస్తూ, తత్సారాన్ని పల్లెలలో, నగరాలలో, పట్టణాలలో ఉండేవారందరూ తెలుసుకొని తరించేట్లు పాటలుగ పాడాలనే కోరిక కలవారంతా మాతో చేరండి. స్వామికి మంగళం పాడుదాము. *(సశేషం)*

# యజ్ఞప్రాశస్త్యము

శ్రీమాన్ సముద్రాల శఠకోపాచార్యస్వామి-వరంగల్

యజ్ఞ దాన తపశ్చర్యాది వేదవిహిత కర్మలు ఎన్నటికీ త్యజింపదగినవి కానే కావు. వాటిని తప్పక అనుష్ఠించవలసినదే! ఏలయన యజ్ఞ దాన తపస్సులు అను ఈ మూడు కర్మలు బుద్ధిబల సంపన్నులైన వారినందరిని పవిత్రమొనరిస్తాయి.

కావున ఈ యజ్ఞ దాన తపఃకర్మలను, అట్లే వేదవిహితములైన ఇతర కర్తవ్య కర్మలను అన్నింటిని తప్పక ఆచరించవలసినదే! అయితే ఈ కర్మలను ఆచరించువారు కర్మాచరణ సందర్భమున ఫలాసక్తులను వదలాలి. కర్తవ్యబుద్ధిని మాత్రవే కలిగి యుండాలి. ఇదే శ్రీకృష్ణ భగవానుని నిశ్చితాభిప్రాయము అనే విషయం శ్రీకృష్ణ పరమాత్మ అర్జునునికి చేసిన గీతోపదేశం వల్ల తెలుస్తుంది.

**యజ్ఞ దాన తపః కర్మ న త్యాజ్యం కార్యమేవ తత్ ।**
**యజ్ఞోదానం తపశ్చైవ పావనాని మనీషిణామ్ ॥**
**ఏతాన్యపితు కర్మాణి సంగం త్యక్త్వా ఫలాని చ ।**
**కర్తవ్యానీతి మే పార్థ! నిశ్చితం మత ముత్తమమ్ ॥**

*(భ. 18.5,6 శ్లో)*

ఓ అర్జునా! జనకచక్రవర్తి మొదలైన జ్ఞానులు యజ్ఞ యాగాది కర్మలను ఆచరించుట వల్లనే పరమసిద్ధిని పొందిరి. పరమ పావన యజ్ఞశేష రూపమైన అమృతాన్ని అనుభవించే యోగులు సనాతనుడైన పరబ్రహ్మ స్వరూపుడైన పరమాత్మను పొందుతారు. యజ్ఞము చేయనివారికి ఈ లోకమే సుఖప్రదం కాదు. ఇంకా పరలోక సుఖాలు ఎట్లా సంభవిస్తాయి. కావున నీవు కూడా లోకహితాభిలాషివై ఎల్లప్పుడూ ఆసక్తితో కాకుండా కర్తవ్యభావంతో వేదవిహిత కర్మలను ఆచరింపుము. ఆసక్తిని వీడి సదా కర్మలను ఆచరించు వ్యక్తి పరమాత్మనే పొందుతాడు.

**"యజ్ఞ శిష్టామృత భుజో యాంతి బ్రహ్మ సనాతనమ్ ।**
**నాఽయం లోకఽస్యయజ్ఞస్య కుతోఽన్యః కురుసత్తమ! ॥"**

*భగవద్గీత 4అ-31శ్లో॥*

**తస్మాదసక్తః సతతం కార్యం కర్మ సమాచర౹**
**అసక్తో హ్యాచరన్ కర్మ పరమాప్నోతి పూరుషః ॥**
**కర్మణైవ హి సంసిద్ధిమ్ ఆస్థితా జనకాదయః ।**
**లోకసంగ్రహమేవాపి సంపశ్యన్ కర్తు మర్హసి ॥**

*(భ. 3అ. 20శ్లో.)*

అంటూ సాక్షాత్తు శ్రీకృష్ణపరమాత్మయే అర్జునునికి చేసిన సదుపదేశం వల్ల యజ్ఞ ప్రాశస్త్యమెంతటిదో బోధపడు చున్నది.

యజ్ఞాలద్వారా భగవంతునికి అంగభూతులైన దేవతలను (అంగాన్యన్యా దేవతాః) మానవులు తృప్తిపరచ వలెను. యజ్ఞములవల్ల తృప్తినొందిన దేవతలు మానవాళికి వర్షాదులను అనుగ్రహిస్తారు. నిస్స్వార్థ భావనతో దేవతలు, మానవులు పరస్పరం సంతృప్తి పరచుకుంటూ భగవదనుగ్రహ రూపమైన పరమశ్రేయస్సును పొందగలరు. యజ్ఞాలద్వారా సంతృప్తిని పొందిన దేవతలు మానవులకు ఇష్టములైనట్టి అనేక భోగాలను ప్రసాదిస్తారు. దేవతలచే సమకూర్చబడిన భోగపదార్థములను పరమాత్మకు అవయవస్థానీయులైన దేవత లకు అర్పించకుండా కృతజ్ఞతా భావం లేకుండా సర్వాన్ని తానే అనుభవించువాడు దొంగగా పేర్కొనదగినవాడు. యజ్ఞ శిష్టాన్నమును (దేవతలకు నైవేద్యంగా పెట్టిన పదార్థమును) తినెడు శ్రేష్ఠ మానవులు అన్ని పాపములనుండి ముక్తు లయ్యెదరు.

స్వార్థభావనతో తమ తమ శరీరములను పోషించు కొనుటకొరకే ఆహారమును సిద్ధపరచుకొనువారు, సమాజ శ్రేయస్సును కాంక్షించకుండా, పరోపకార భావన లేకుండా వ్యక్తిగత సుఖశాంతులను లాభాలను కోరుకునేవారు పాపాత్ము లుగా పేర్కొనబడతారు. పాపానుభవమునే పొందుతారు.

**"దేవాన్ భావయతానేన తే దేవా భావయంతు వః ।**
**పరస్పరం భావయంతః శ్రేయః పరమవాప్స్యథ ॥**

**ఇష్టాన్ భోగాన్ హి వో దేవా దాస్యంతే యజ్ఞ భావితాః౹**
**తైర్దత్తా న ప్రదాయైభ్యో యో భుంక్తే స్తేన ఏవ సః ॥**
**యజ్ఞశిష్టాశినః సంతో ముచ్యంతే సర్వకిల్బిషైః ।**
**భుజంతే తే త్వఘం పాపాః యే పచంత్యాత్మకారణాత్ ॥**

అను శ్రీకృష్ణ భగవానుని దివ్యోపదేశమును శిరసా వహించాలి. ఆపై తాము నిస్వార్థ భావనతో వైదికమైన యజ్ఞయాగాదులను ఆచరించాలి. అంతే కాకుండా యజ్ఞ ప్రభావాన్ని లోకులు తెలుసుకునే విధంగా ప్రవర్తించాలి.

"యజ్ఞో వై విష్ణుః" యజ్ఞరూపంలో ఆరాధింపబడు భగవానుడైన శ్రీమహావిష్ణువు లోకానికి శ్రేయోదాయకుడు కాగల'డనే శతపథ బ్రాహ్మణంలో వాక్యసారాన్ని గుర్తెరిగి సమాజ శ్రేయస్సుకై మానవాళియొక్క సుఖశాంతులకై మహనీయుల మార్గదర్శకత్వంలో యజ్ఞయాగాదులను నిర్వహించాలి.

యజ్ఞం వల్ల లోకాలన్నీ ప్రసన్నములవుతాయి. యజ్ఞం వల్లనే దేవతలు అమరత్వాన్ని పొందగలిగినారు. యజ్ఞం వల్ల సమస్త పాపాలు నశిస్తాయి. యజ్ఞం వల్లనే శాశ్వతమైన పునరావృత్తిరహితమైన శ్రీ మహావిష్ణువుయొక్క దివ్య సన్నిధానంగా పేర్కొనబడే పరమపదాన్ని పొందుతారు.

**"యజ్ఞేన లోకాః విమలానుభాంతి**
**యజ్ఞేన దేవా అమృతత్వమాప్నుయుః ।**
**యజ్ఞేన పాపైః బహుభిర్విముక్తః**
**ప్రాప్నోతి లోకాన్ పదమస్య విష్ణోః ॥** అను హారీతస్మృతి ప్రమాణవాక్య సారాన్ని వంటబట్టించుకోవాలి.

యజ్ఞంవల్ల సకలదేవతలకు సంతృప్తి కలుగుతుంది. యజ్ఞంవల్ల సమృద్ధిగా వృష్టి సంభవిస్తుంది. తద్ద్వారా మానవులకు పోషణ, పాలనాదులు ఏర్పడుతుంటాయి.

ఈ యజ్ఞం సమస్త జగత్తును పోషిస్తూ, పాలిస్తూ ఉన్నందున సమస్త శుభాలకు కారణమై నిలుస్తున్నది.

**"యజ్ఞేనాప్యాయితా దేవాః వృష్ట్యుత్సర్గేన చ ప్రజాః ।**
**అప్యాయంతే తు ధర్మజ్ఞ యజ్ఞాః కళ్యాణహేతవః ॥"**

అను విష్ణుపురాణ సూక్తి వైశిష్ట్యాన్ని మనసుకెక్కించుకోవాలి.

**"నాతస్య యజ్ఞస్య లోకో వై నా యజ్ఞో విందతే శుభమ్ ।**
**అయజ్ఞో న చ భూతాత్మా నశ్యేత్తు ఛిన్నపర్ణవత్ ॥"**

యజ్ఞము అనుష్ఠించక పోతే పారలౌకిక సుఖముండదు. ఐహికమైన అభ్యుదయం సిద్ధించదు. యజ్ఞం చేయని వ్యక్తియొక్క ఆత్మ పవిత్రతకు దూరమై ఎండుటాకువలె వినాశమునొందును.

యజ్ఞమహిమ లోకులకు తెలిసే విధంగా, యజ్ఞార్థమే వేదముల ప్రవృత్తి (వేదాస్తు యజ్ఞార్థమప వృత్తాః) ఏర్పడిందనే విషయాన్ని లోకానికి చాటుతూ, రాగద్వేషాలకు అతీతులై, నిరాడంబరులై, ధర్మమార్గ ప్రవర్తకులై, బహుముఖ ప్రజ్ఞా పాటవ సమంచితులై, వేదమార్గ ప్రతిష్ఠాపకులై, వైదిక ధర్మపరిరక్షకులై, శమదమాది అనేక గుణపూర్ణులై, లోకోపకారకులై, భక్తితత్పరులై, భక్తజనోజ్జీవన కారకులై, ప్రపన్న జనోత్తారకులై ఆదర్శజీవనాన్ని కొనసాగించే సదాచార్యులు, సామాన్యులమైన మనలాంటి వారందరూ చేసే యజ్ఞములు కొన్ని ఉంటాయి. నిజజీవితములో భగవదారాధన బుద్ధితో సాగించే ప్రతి ప్రవృత్తీ యజ్ఞమవుతుందని, భగవద్గీత తెలిపింది. నేను చేస్తున్నాననే అహంకారం, నాకోసమే ఈ పని అనే మమకారాన్ని వదిలి, నావల్లే జరుగుతోందనే సంగం లేకుండా చేసే ప్రతి పనీ యజ్ఞమౌతుందని అలానే చేయాలని **"ముక్త సంగః సమాచర"** అనే శ్రీకృష్ణుడి సూక్తిని జ్ఞాపకం పెట్టుకోవాలి. లోకకల్యాణం కొరకు విశ్వశాంతికొరకు నిర్వహించే వైదికమైన మనతోటి వారిని కూడా ఇలాంటి యజ్ఞ నిర్వహణలో పాలుపంచుకునేట్లుగా ప్రేరేపిద్దాం. దానబుద్ధితో ప్రవర్తిద్దాం. మన సంపదలకు సార్థకత చేకూర్చుకుందాం. మన జీవితాన్ని ధన్యమొనరించుకునేందుకు ప్రయత్నిద్దాం.

## శ్రీశ్రీశ్రీ స్వామివారి చాతుర్మాస్య దీక్షా

### కార్యక్రమ వివరములు

*ప్రతిరోజు ఉదయం :*

| | | |
|---|---|---|
| | 7.00 గం॥ | శ్రీశ్రీశ్రీ స్వామివారిచే ఆళవందార్ స్తోత్రరత్న ప్రవచనం |
| | 8.30 గం॥ | తీర్థగోష్ఠి |
| ఆగస్టు : | 04 | బదరీనారాయణ తిరునక్షత్రం |
| | 12 | వరలక్ష్మివ్రతం |
| | 13 | హయగ్రీవ జయంతి |
| | 14 | మంత్రోపదేశములు (సమాశ్రయణములు) |
| | 17 | శ్రీశ్రీశ్రీ పెద్ద జీయరు స్వామివారి తిరునక్షత్రం |
| | 23 | శ్రీకృష్ణ జన్మాష్టమి మహోత్సవము *(సాయంత్రం 6.00గం. నుండి 9.00 గం. వరకు)* |
| సెప్టెంబరు : | 01 | విఘ్ననివారణ చతుర్థి |
| | 04 | సమాశ్రయణములు |
| | 12 | భాద్రపద పౌర్ణమి చాతుర్మాస్య దీక్షా విరమణ |

జై శ్రీమన్నారాయణ!

భగవద్బంధువులందరూ
ఈ సమయాన్ని గుర్తించి వినియోగించుకోగలరు.
వివరములకు: సీతానగరం, గుంటూరు జిల్లా, ఫోన్: 08645 272929

# మన ఆళ్వార్లు



## పెరియాళ్వార్లు

వైశారదీ

(గత సంచిక తరువాయి)

శెల్వనంబిగారి సాహచర్యములో అచంచలమైన ఏకాగ్రనిష్ఠ శ్రియఃపతియందు శ్రీ విష్ణుచిత్తుల వారికి అబ్బింది. **"తేషాం జ్ఞానీ నిత్యయుక్తః ఏక భక్తిర్విశిష్యతే"** నన్నారాధించే వాళ్ళెందరో, వారిలో ఇతర కోరికలు లేక నన్నే కోరేవారు 'నిత్యయుక్తులు'. ఇతర ప్రయత్నాలుమాని నా అనుగ్రహం మీదే ఆధారపడ్డవాడు 'ఏకభక్తుడు'. ఏమి ఇచ్చినా ఇవ్వకున్నా, ఏమీ కోరకుండా నాతోటే చేరి, నాసేవ తప్ప వేరొక ప్రయోజనము లేని వ్యక్తులను 'జ్ఞాను'లంటారు.

జ్ఞాని విషయంలో నాకెంత ప్రేమ ఉంటుందో సర్వజ్ఞుడనైన నేను గూడ చెప్పలేను. **"ప్రియో హి జ్ఞానినోఽ త్యర్థమహమ్"** అని భగవద్గీత ఏడవ అధ్యాయంలో సర్వేశ్వరుడైన శ్రీకృష్ణ భగవానుడు చెప్పిన సూక్తికి శ్రీ విష్ణుచిత్తులు ప్రత్యక్షోదాహరణము. యాత్రార్థము వచ్చి పోయే భక్తులతో వీరిగృహము ఎప్పుడూ కలకలలాడుతూ ఉండేది. తదీయారాధనలకు వీరి గృహము పెట్టినది పేరు.

**భగవంతుడు నేరుగా కాక జ్ఞానులవలె ప్రోత్సహిస్తాడు:**

ఒకరోజు తులసీవనములో మాలికలను కూర్చుతూ ఉండగా హఠాత్తుగా శెల్వనంబిగారు రావడము జరిగినది. మధురానగరపు పరతత్త్వ నిర్ణాయక సభను గురించి వారు విష్ణుచిత్తులవారితో చెప్పారు. "చరిత్రలో తత్త్వజిజ్ఞాస కలిగిన ఋషులు ప్రభువులుగూడ అప్పుడప్పుడు తత్త్వనిర్ణయసభలు చేస్తూండేవారు. అలాంటి వాటిలో, కర్మయోగులలో అగ్రగణ్యుడైన, జనకచక్రవర్తి జరిపిన సభలు బహుళ ప్రాచుర్యాన్ని పొందాయి. అల్ప ప్రజ్ఞులకోసము, తత్త్వ జిజ్ఞాసువులకోసము కూడా అలాంటి సభలు అప్పుడప్పుడు అవసరమౌతుంటాయి. ఇప్పుడు మదురైపట్నంలో జరిగే సభ కూడా ఆ కోవకి చెందినదే!

తత్త్వజిజ్ఞాసు అయిన పాండ్యరాజు లోకోపకారము కోసము, ఆత్మోజ్జీవనకోసము ఈ సభ ఏర్పాటు చేశాడు. అందులో తత్త్వనిర్ణయము చేసి చింతాక్రాంతుడైన ప్రభువుయొక్క ఆర్తిని తీర్చి ఉజ్జీవనమార్గాన్ని ప్రసాదించి లోకానికి వెలుగును అందించండి!" అని శెల్వనంబిగారు విష్ణుచిత్తులను ఆహ్వానించారు.

**నైచ్యానుసంధానం**

పరిష్కృతమైన శాస్త్రపాండిత్యములేని తనని ఈ సభకు ఆహ్వానించడము లేత చిగురుతో మహావృక్షాన్ని కోయడము లాంటిది. దానికి తాను తగనని నైచ్యానుసంధానము చేశారు వారు. "భగవంతుడు అఘటితఘటనాసామర్థ్యము కలవాడు. ఆయన తలచుకొంటే గడ్డిపోచ బ్రహ్మాస్త్రము కాలేదా? రాళ్ళునీళ్ళపై తేలలేదా? అయితే ఆ వస్తువు స్వతంత్రత వదిలి స్వప్రయోజనాన్ని ప్రకటించకుండా ఉండాలి. రాళ్ళు, గడ్డి ఆయన చెప్పినట్టు విన్నాయి. భగవత్కార్యం జరిగింది. దుష్టులు నశించారు. లోకము సుఖించినది. భగవత్సంకల్పానికి విరుద్ధముగా స్వప్రయోజనాన్ని చూసుకోవడమే గదా! లోకానికి ఉపద్రవకరం. మీద్వారా భగవంతుడికి ఒక కార్యం జరపాలనిపించినపుడు చేయగలనో లేనో అనుకోవడము మన బాధ్యత కాదు గదా! మనం ఒకపనికి తగును అనుకొన్నపుడే మనకు శ్రియఃపతి ఆ సంకల్పమును కల్గిస్తాడు. ఈవేళ మీచేత జరుపదలుచుకొన్న కార్యాన్ని నా ద్వారా చెప్పిస్తున్నాడు" అంటూ బోధించారు, స్వరూప జ్ఞానం కల శెల్వనంబి.

విష్ణుచిత్తులకు ధైర్యము కలగటములేదు. తగని పనికి సిద్ధపడ్డం నలుగురులో నవ్వులపాలకి దారి తీస్తుంది, అంటూ ఆలోచనలో పడ్డ విష్ణుచిత్తులతో "మీ చేతిలో ఉన్న ఈ తులసి భగవదారాధనాయోగ్యమైన మాలికలుగా చేరుతుంది. తులసిలా సహజ జ్ఞాన పరిమళంగల ఈ చేతనులంతా అక్కడక్కడా తమకు కొన్ని పరిధులు గీసుకొని వర్గాలు వర్గాలుగా ఉండిపోతూన్నారు. అన్ని మొక్కలలోనుంచీ మంచిదళాలు మీరు సేకరిస్తూన్నారు. ఒకమాలగా కూర్చుతున్నారు. దానిని భగవత్సేవలో వినియోగిస్తూన్నారు. అలానే, వివిధ రీతులలో భిన్న మనస్కులై,

గమ్యం తెలియక భీతిల్లే జిజ్ఞాసువులైన ప్రాణికోటిని గూడా సత్సంప్రదాయమాలికలో చేర్చి, భగవత్సేవానిరతులుగా చేయడము మీ విధి. మాలాకారుడుగా మీ బాధ్యత మీరు నెరవేర్చండి" అంటూ శెల్వనంబిగారు నిష్క్రమించారు.

ఎంతసేపట్లా విష్ణుచిత్తులవారు ఉండిపోయారో తెలియదు. శెల్వనంబిగారు వెడలినవేపే చూస్తున్నారు నమస్కారముద్రతో! తాము విన్నది కలయో, నిజమో కూడా తెలియటము లేదు. అంతా స్పష్టముగానే ఉన్నట్టు ఉన్నది. శెల్వనంబిగారి కంఠం ఈ రోజు నూతన గాంభీర్యాన్ని కల్గి ఉన్నట్టుంది. వారిమాటలు అలా చెవులో మారుమ్రోగుతూనే ఉన్నాయి. నిరక్షరాస్యుడనైన తనను ఇలాంటి పనికి వినియోగించుకోవాలని విద్యావంతుడైన శెల్వనంబిగారికి ఎట్లా అనిపించినదో? ఎందుకు తనను ఇట్లా ప్రేరేపిస్తున్నారు? "సంధ్యవేళ అయినా ఇంకా తోటలోనే ఆలోచిస్తూన్నారేంటి స్వామీ!" అని పరిచారకుల పిలుపుతో స్పృహలోకి వచ్చారు విష్ణుచిత్తులవారు.

"అయ్యో! శెల్వనంబిగారిని సాగనంపకైనాపోతినే! అయ్యో! అయ్యో!" అనుకొంటూండగా ఆ పరిచారకులు "అదేమిటి స్వామీ!" శెల్వనంబి గారు ఇక్కడలేరే! ఎవరూ ఇటుప్రక్కకు వచ్చినట్లు కూడా లేదే? ఏ భావనలో ఉన్నారో ఏమిటో? సంధ్యాసమయము అవుతోంది. వేంచేయండి" అని తులసిబుట్టలను తీసుకొని గృహోన్ముఖులైయ్యారు. భగవదాజ్ఞ శెల్వనంబిగారిరూపములో తమకందిందని నిర్ణయించుకొన్న విష్ణుచిత్తులు మదురైనగరానికి బయలుదేరారు.

**ఆశాకిరణం - భగవంతుని ఓదార్పు :**

పాండ్యరాజు వల్లభదేవుడు పరిపరివిధాల ఆలోచిస్తూ, తాను కోరిన తత్త్వనిర్ణయాన్ని ఇంతకాలమైన ఇందరు పండితులూ చేరికూడా చేయలేకపోవడంతో చింతాక్రాంతుడై ఉన్నాడు. శ్రీ శెల్వనంబిగారు రాజును ప్రోత్సహిస్తూ మరునాడొక మహానుభావులు సభకు విచ్చేస్తున్నారని, సర్వసంశయములను ఛేదించి సర్వసిద్ధాంతముల సారమును ప్రబోధిస్తారని భగవంతుని దయ కల్గి త్వరలోనే తత్త్వనిర్ణయం జరుగుతుందని ధైర్యంగా ఉండమని ఊరడించారు.

**భగవదాజ్ఞకు అనుగ్రహానికి తిరుగేమిటి!**

మరునాడు అతి సామాన్యునిగ సభకు విచ్చేసిన శ్రీ విష్ణుచిత్తులవారిని వల్లభదేవుడు సాదరంగా ఆహ్వానించి ఉచితరీతిన సత్కరించాడు. పిదపవారు వేదికనధిరోహించి, వడపెరుంకోయిలుడైయాన్‌ని తన మనస్సున నిలిపి, చేతులు జోడించగ, అప్రయత్నంగా వారి ముఖకమలం నుండి అద్భుత మైన వాక్ప్రవాహం వెలువడనారంభించింది.

సర్వోపనిషత్తులూ ఏకకంఠంగా ప్రతిపాదించే శ్రీమన్నారాయణుని పరత్వాన్ని ప్రతిపాదించారు. ప్రకృతి, పురుషులకిరువురకూ కారణమతడేనని తెలిపారు. భగవద్గీతాదులలో శ్రీకృష్ణ భగవానుడు తెలిపిన తత్త్వార్థాలనన్నింటినీ చూపుతూ, ప్రకృతిలో ఏ వస్తువుగానీ, అందరి గుణములుకానీ శ్రియఃపతి కృపలేనిదే ప్రవర్తించవని, చేతనవర్గాలన్నీ బద్ధ, ముక్త, నిత్యులదాకా సర్వమూ ఆతని వశమందున్నవేనని, ఏది ఎట్లు ప్రవర్తించాలన్నా ఆతని అనుగ్రహమే శరణ్యమని స్పష్టం చేశారు.

**పరతత్త్వ నిర్ణయం :**

ఉపనిషత్తులలో జగత్కారణంగ తెలిసే సత్, బ్రహ్మ, ఆకాశ, జ్యోతి, ఆత్మ, ఈశ, ఇంద్రవంటి పదాలన్నీ సామాన్యశబ్దాలనీ, అవన్నీ విశేషపదమైన నారాయణపదంలో చేరుతాయి కనుక, ఇలాంటి సకల శబ్దాలకు పర్యవసానమైన పదం నారాయణ పదమే నన్నారు. ఆ నారాయణపదం సకల కల్యాణగుణాకరమైన తత్త్వాన్ని చెప్తుంది. కొన్ని వేదవాక్యాలు తత్త్వం నిర్గుణమని చెప్తున్నాయి. అలాంటి వాటికన్నింటికీ ప్రాకృతులమైన మనవంటివారివలె దోషగుణాలు లేవని తాత్పర్యం. కనుక నిర్గుణమనే పదానికెప్పుడూ చెడు గుణాలు లేవని చెప్పాలి. సగుణమన్నపుడు ఆయనకి మాత్రమే తగిన అసాధారణ కళ్యాణగుణాలున్నాయని చెప్పాలి. అలానే ఆయనకి అపురూప, అతిలోకసుందర దివ్యమంగళ విగ్రహమున్నది. మరి ఆయనకి రూపం లేదని చెప్పాయే కొన్ని శ్రుతులు? అవును. అలాంటివాటికి మన శరీరాలవలె మురికికి నిలయాలైన పాంచభౌతిక శరీరాలు లేవని అర్థం తప్ప అసలే లేదని అనరాదు. అలానే ఆయన ఇంద్రియాలు లేని వాడనికొన్ని శ్రుతులు వక్కాణించాయే? అవును. మనలా ఇంద్రియాలమీదే ఆధారపడి పనులు చేయాల్సిన అగత్యం లేనివాడని అర్థం. తనతో చేతనా చేతనాలను శరీరంగా పెట్టుకొన్నాడు. తనలాంటి వాడిక ఎవ్వడూలేడు కనుక తానద్వితీయుడు.

*(తరువాయి సంచికలో)*

'మీ' 'భక్తి' 'నివేదన'

# ఆచార్య వైభవం

శ్రీమతి శాంతి-వైజాగ్

అనంతమైనది మన ఆచార్యుల వైభవం....వర్ణింప శక్తురాలను కాకున్నా ఒక బిందువైనా మీతో పంచుకోవాలన్న తపనతోనే ఈ చిన్ని ప్రయత్నం.

1983లో కార్తీకసమారాధనకై సీతానగరం వెళ్ళాము మా పరివారమంతా. అప్పుడే శ్రీశ్రీశ్రీ స్వామివారిని ప్రప్రథమంగా సేవించు కోగలిగాను. ఆ పచ్చని చెట్ల మధ్య, ఆ ప్రశాంత వాతావరణంలో వారి దర్శనం అత్యంత ఆనందదాయకం. చిన్నప్పటి నుండి విన్న శ్రీరాముని స్వరూపమిలానే ఉండేదేమో అన్పించింది. అది మొదలు ఈ క్షణం వరకూ జీవనయానంలో ఎక్కడెక్కడో ప్రయాణిస్తూ, వారిని మేము మరచినా వారు మరువక అనుగ్రహిస్తూ ముందుకు నడిపిస్తూనే ఉన్నారు. ఆచార్యులతో ఉండే ఆత్మసంబంధమంటే ఇదేనేమో! వారి దర్శన భాగ్యాన్ని నాకు కలిగించి, వారి పట్ల అచంచల విశ్వాసాన్ని కలిగించిన తల్లిదండ్రులకు నేను సదా కృతజ్ఞురాలిని.

అమ్మ ఇంట్లో ఏ సమస్య వచ్చినా స్వామివారే దిక్కు, వారికి విన్నవించుకోవాలి అంటూండేవారు. తీరా అక్కడికి వెళ్ళాక వారి దగ్గరికి వెళ్ళకుండా దూరం నుండే సేవిస్తూండేవారు. కానీ, విచిత్రం ఆమె హృదయంలోని సంఘర్షణకి తగిన సమాధానం శ్రీస్వామివారు తమ దివ్య ప్రవచనంలోనే అందించి అనుగ్రహించేవారు. తేలిక పడిన మనస్సుతో వారి మంగళాశాసనాలని మనసు నిండా నింపుకొని ఇల్లు చేరేవారు. ఇది నాకు చాలా ఆశ్చర్యమన్పించేది.

ఒకసారి చాతుర్మాస్యదీక్షలో శ్రీ స్వామివారు మన ఆశ్రమంలో భగవద్విషయాన్ని అనుగ్రహించారు. ఆ తమిళ పాశురాలు ఏమిటో మనకెందుకో అన్నట్లున్నా మనసులో, అమ్మకి తోడుగా ప్రతిరోజూ వెళ్ళేదాన్ని. ఆ దీక్షా సమయంలో వారి దర్శనభాగ్యం, ఆళ్వార్ల అనుభవ సారాన్ని తేట తెలుగులో వీనులకి అమృతప్రాయంగా శ్రీస్వామివారు అనుగ్రహించడం నాలో ఒక అద్భుత భావన కలిగించాయి.

నేను మారాలి, నేను ఇంకా తెలుసుకోవలసినవి చాలా ఉన్నాయి అనిపించింది. నాలో కలిగిన ఆ తపనకి మంత్రోపదేశంతో నాకు పంచసంస్కారాలను అనుగ్రహించి నా జీవితానికే ఒక అర్థాన్ని చేకూర్చే బాటను నాకు అనుగ్రహించారు.

జగ్గయ్యపేటలో ప్రప్రథమంగా ప్రారంభించిన తత్త్వశాస్త్ర వేసవిశిబిరంలో విద్యార్థినిగ ఎన్నెన్నో వైదిక రహస్యాలను తెలుసుకునే అవకాశం కటాక్షించారు. నెలరోజులు ఒక ధనుర్మాస వ్రతంలా, ప్రతి రోజూ ఒక దివ్య పాశురంలా, ఎంతో అద్భుతమైన, అనిర్వచనీయమైన భగవత్సంబంధ విశేషాలే కాకుండా, మన దైనందిన జీవితంలో ఉండవవలసిన స్వీయ క్రమశిక్షణ, సమయపాలన, ఆలోచనా విధానం, భగవద్దత్తమైన ఈ మానవజీవితాన్ని, సమయాన్ని ఎలా సద్వినియోగం చేసుకోవాలి వంటి ఎన్నో అంశాలను మాకు బోధించిన మార్గనిర్దేశకులు మన ఆచార్యులు. స్త్రీ,పురుష భేదం కానీ, వర్ణభేదం కానీ జిజ్ఞాసకు అడ్డుకావు అని, ఆ భేదాలేమీ చూడక కేవలం నేర్చుకోవలన్న ఆసక్తి ఉంటేచాలని మాకు జ్ఞానభిక్ష పెట్టిన ఉదారహృదయులు మన ఆచార్యులు.

ఆ నెల రోజుల శిక్షణ, ఆచార్యుల దివ్య సాన్నిధ్యం, స్నేహితులు, ఆహ్లాదకర ఆశ్రమవాతావరణం నాలో చాలా మార్పుతెచ్చాయి. ఒకప్పటి నా ప్రవర్తనకు, ఇప్పటి నా ప్రవర్తనకు ఎంతో తేడా ఉంది. అక్కడ నేను నేర్చుకున్నది ఒక్కటే. భగవంతుని పట్ల, ఆచార్యులపట్ల అచంచల విశ్వాసాన్ని మనం కలిగి ఉండాలి. వారిపట్ల నిర్మలభక్తితో, విశ్వాసంతో అడుగు ముందుకు వేస్తే ఇక వెనుతిరిగి చూసుకోవలసిన అవసరం లేకుండా సన్మార్గంలో మనల్ని ముందుకు నడిపిస్తూనే ఉంటారు.

దీన్ని నిరూపించే సంఘటని ఒకటి నేను విజయవాడలో వికాసతరంగిణి కార్యకర్తగ ఉండగ జరిగింది. వికాసతరంగిణి ప్రథమ వార్షికోత్సవం శ్రీస్వామివారి ఆధ్వర్యంలో తుమ్మలపల్లి కళాక్షేత్రంలో జరుపుకుంటున్నాం. ఆనాటి సభకు శ్రీశ్రీశ్రీ విద్యాప్రకాశనందగిరి స్వామివారు, అప్పటి మంత్రివరేణ్యులు శ్రీ కనుమోలు బాపిరాజుగారు ఇంకా కొంతమంది స్థానిక పెద్దలను ఆహ్వానించాము. ఏర్పాట్లన్నీ పూర్తిచేసుకొన్నాం. తీరా సమయానికి పెద్దలందరూ వేంచేసే సరికి, నాలో ఒకరకమైన భయం. సరిగ్గా యుద్ధసమయానికి డీలా పడ్డ అర్జునిడిలా ఉంది నా పరిస్థితి. ఇంతమంది పెద్దలముందు వ్యాఖ్యాతగ నేను న్యాయం చేయలేనన్పించింది.

శ్రీస్వామివారికి పూర్ణకుంభస్వాగత సమయంలోనే దాసోహం సమర్పించి నేను మీ పరికరాన్ని, ఇది సక్రమంగ పనిచేసేట్లు మీరే అనుగ్రహించాలి అని విన్నవించుకున్నా! చిరునవ్వుతోనే ధైర్యాన్ని మంగళాశాసనాలని అనుగ్రహించారు మన ఆచార్యులు. అంతే శ్రీవిష్ణుసహస్రనామ స్తోత్ర పారాయణతో ప్రారంభమైన కార్యక్రమం ఎంతో ఘనంగ, ఊహించినదానికంటే వైభవంగ జరిగింది. ఎవరిచేత, ఎప్పుడు ఎంత ఎలాంటి కైంకర్యం చేయించాలో తెలిసి అనుగ్రహించ సమర్థులు మన ఆచార్యులు.

అసంఖ్యాకమైన ఈ జన్మ పరంపరలో ఎప్పుడో ఎక్కడో కాకుండా ఆలాంటి ఆచార్యుల కాలంలో పుట్టి మనమంతా వారి శిష్యులు కాగలగడం ఎంతో అదృష్టమని నా విశ్వాసం. ఈ ఆత్మ సంబంధం ఎప్పటికీ వర్ధిల్లుతూ, మనలో వారు కోరుకునే గుణాలు, భగవద్భాగవతాచార్య కైంకర్యనిష్ఠ మరింత పెరిగేట్టు అనుగ్రహించమని మనసా వాచా కర్మణా ప్రార్థిస్తూ, మన ఆచార్యుల పదసన్నిధిలో ప్రణమిల్లుతూ......

జైశ్రీమన్నారాయణ!



# శ్రీరామాయణము



ఎ. ఉషశ్రీ- శ్రీరాంనగర్

శ్రీరామాయణం అనగానే సామాన్యంగా అందరి మదిలో మెదిలేవి శ్రీరాముడు, సీతాదేవి, వారి పరివారం, సోదరులు. వారు తిరుగాడిన ప్రదేశాలు. ఆయా ప్రాంతాలలో వుండే ఋషులు, గుహుడులాంటి ఆటవికులు, వానరులు, రాక్షసులు, జింకలాంటి వన్యమృగాలు చివరికి ఉడుత కూడా. మనకు తెలిసినవి, మన దృష్టికి వచ్చే ఇవిమాత్రమే కాక శ్రీరామాయణంలో మరెన్నో వింత వింత విశేషాలున్నాయి.

శ్రీరామయణంలో పైన చూపినవాటిల్లో ఒక్కొక్క కాండలో ఒక్కొక్కటి ప్రాధాన్యాన్ని సంతరించుకొంటూ ఉంటుంది. కానీ, రామాయణంలో అన్నికాండలలోనూ అనుస్యూతంగ మనకి కనిపించేవి పక్షులు. ఈ పక్షుల ప్రస్తావన ఏ సర్గలో, ఏ కాండలో, ఎలా వచ్చిందో కీర్తిమూర్తులు, భక్తినివేదన పూర్వ సంపాదకులు శ్రీ ఉ.వే.శ్రీమాన్ గోపాలాచార్యస్వామివారు వివరంగ గతంలో చెప్పి ఉన్నారు. దానిని గురించి కొద్దిగా ప్రస్తావించే ప్రయత్నమే ఇది.

వేదాంత శాస్త్రంలో, చాలా ఉపనిషత్తులలో జిజ్ఞాసువులైన శిష్యులకు జ్ఞానోపదేష్టలుగా పక్షులు సాక్షాత్కరిస్తూ ఉంటాయి. పక్షులను అక్కడ జ్ఞానోపదేశం చేసే ఆచార్యులుగా సూచిస్తూంటారు.

అసలు పక్షులకు, జ్ఞానులకు పోలిక ఏమిటి?

పక్షులు మనకంటే ముందు మేల్కొంటాయి. మనకు మెలకువ వచ్చేలా ధ్వని చేస్తాయి. రెండు రెక్కలతోటి సంచరించటం, ఆకాశంలో విహరించటం లాంటివి లక్షణాలు కొన్ని జ్ఞానులలో కూడా ఉండే లక్షణాలను సూచిస్తున్నాయి.

అజ్ఞానంలోనుండి జ్ఞానదశకు చేరాలనుకునేవారిని "జిజ్ఞాసువులు" అంటారు.

రాత్రిని అజ్ఞానంతోను, వెలుతురుని జ్ఞానంతోను పోలుస్తూ ఉంటారు. జ్ఞానాన్ని పొందాలనుకునే జిజ్ఞాసువుయొక్క జ్ఞానదశకు దిశానిర్దేశాన్ని చేసేవిగా మనకు ఈ పక్షులు కనిపిస్తూంటాయి. చీకటి తొలగి, వెలుతురు వచ్చేసంధికాలంలో పక్షులు ముందుగా మేల్కాంచి ధ్వనులు చేస్తాయి. మనని ఉద్దేశించి అవి చేయవు. అవి తమ ప్రవృత్తిగానే చేస్తాయి. అయినా మనకి ఉపకారకాలు అవి. అలానే జ్ఞానులు తమ నిత్యజీవితంలో ఆచరించే ఆచరణద్వారా మనకు మార్గదర్శకులవుతారు. పక్షులకు వాటి రెక్కలు గమనసాధనాలు. జ్ఞానులకు వారి జీవనయాత్ర సాగించడంలో జ్ఞానము+ఆచరణలే రెండు రెక్కలుగా ఉపకరిస్తాయి.

పక్షులు ఆకాశంలో సంచరిస్తాయి. జ్ఞానులు సంచరించే మార్గం కూడా ఆకాశమే! అంటే, అది భౌతికాకాశం కాదు. **ఆ**=అంతటా. **కాశ్**=ప్రకాశించేది. బ్రహ్మతత్త్వం. దానిని శాశ్వత తత్త్వం, అక్షరతత్త్వం, పరమాత్మతత్త్వం, భగవత్తత్త్వం అని అంటారు. ఇలా, అంతటా ప్రకాశిస్తూ ఉండే ఆకాశతత్త్వమైన బ్రహ్మ సంచరించే పక్షులవంటివారు జ్ఞానులు.

వీరు బ్రహ్మయందు నిరంతరము సంచరిస్తూ ఉంటారు. అలాంటివారిని మనం ఆశ్రయించడం ద్వారానే తగిన, యోగ్యమైన జ్ఞానాన్ని పొంది వాస్తవమైన తత్త్వాన్ని సాక్షాత్కరించు కోగలుగుతాం. తద్వారా మానవజన్మను సార్థకమూ చేసుకోగలుగుతాం. దీనిని మన పూర్వాచార్యులైన మనవాళ మహాములు ఉపదేశ రత్తినమాలై అనే ప్రబంధంలో చక్కగ తెలియజేశారు.

**"జ్ఞాన మనుష్ఠాన మివై, నన్గాగవే యుడైయ**
**నాన, గురువై యడై న్దక్కాల్, మానిలత్తీర్!**
**తేనార్ కమల త్తిరుమామగళ్ కొఴునన్**
**తానే వైగున్దం తరుమ్॥"**

***తా॥*** **జ్ఞానమనుష్ఠానం**=శాస్త్రీయమైన జ్ఞానము. దానికి తగిన ఆచరణ అను, **ఇవై**=ఈ రెండునూ; **నన్గాకవే**=చక్కగ; **ఉడైయనాన**=కలిగియున్న; **గురువై**=గురువును; **అడైన్దక్కాల్**=ఆశ్రయిస్తే; **మానిలత్తీర్**=ఓ భూలోకవాసులార!; **తేనార్ కమల తిరుమామగళ్**=తేనెలూరే పద్మమునందుండే లక్ష్మీదేవియొక్క వల్లభుడైన, **కొఴునన్**=ఆ నారాయణుడు; **తానే వైగున్దం తరుం**=స్వయముగ వైకుంఠాన్ని మనకు అనుగ్రహించును.

అంటే ఆచార్య అనుగ్రహాన్ని భగవంతుని అనుగ్రహం కంటే ముందు ఉండవలసిన దానినిగ అదే కారణముగా మనవాళ మహామునులు వివరించారు.

తత్త్వార్థాలనన్నింటినీ అందమైన కావ్యంగా శ్రీరామాయణంగా మనకందించిన వాల్మీకి ఈ విషయాన్ని మనకు అనేక సందర్భాలలో ఆయా కాండలలో పక్షుల ద్వారా జ్ఞాపకం చేస్తూంటారు.

అసలు రామాయణ ప్రస్తావనే పక్షులతో ఆరంభమైంది. రామాయణాన్ని మనకు అందించిన వాల్మీకినే ఒక అద్భుతమైన పక్షితో పోల్చిచెప్పారు చూడండి!

**"కూజంతం రామరామేతి మధురం మధురాక్షరం,**
**ఆరూహ్య కవితాశాఖాం వందే వాల్మీకి కోకిలమ్॥"**

వైదిక వాఙ్మయమనే రసాలంపై కవిత అనే కొమ్మలపై నుండి అమృతత్త్వాన్ని ప్రసాదించే అక్షరతత్వం, అంటే శాశ్వతమైన బ్రహ్మతత్త్వమే, రాముడని వీనులకు ఇంపుగా కూస్తున్న వాల్మీకి కోకిలకు నమస్కరిస్తున్నాను' అంటూ ఋషిని ధ్యానిస్తారు.

శ్రీరామయణం పిల్లలు కూడ హాయిగ పాడుకోవడానికి వీలయ్యేట్లుగ అందంగా అందించి వాల్మీకి వీనులవిందు కొలిపే కోకిల అయినాడు. కోకిలయొక్క పంచమరాగాలాపన నవవసంతానికి సంకేతమైనట్లే, వాల్మీకి ప్రసాదించిన శ్రీరామ నామస్మరణమే మానవుని సగటు బ్రతుకునుండి విలువలతో నిండిన ఉత్తమ మానవత్వాన్ని వికసింప చేసుకోడానికి సంకేతం. ఇంతకీ ఇది శ్రీరామాయణంలోకి అడుగుపెట్టకముందే సాక్షాత్కరించే పుంస్కోకిల. శ్రీరామాయణ శ్రవణానికాహ్వానించే గానకోకిల.

### బాలకాండలో - పక్షులు

ఇక, బాలకాండ, ఓ క్రౌంచజంట ప్రస్తావనతో ఆరంభమైంది. వాల్మీకి భగవానుడు నారదుని ద్వారా రామచరిత్రను ఉపదేశంగా పొందాడు. నారదుడు వాల్మీకికి, ఆ కాలంలో మూర్తీభవించిన మానవత్వానికి ప్రతీకగా, రాముడు రాజ్యపాలన చేస్తున్నాడని ఉపదేశం చేసివెళ్ళాడు.

వాల్మీకి తనకు లభించిన ఈ అద్భుతమైన రామచరిత్రను మననం చేసుకుంటూ తన శిష్యుడైన భరద్వాజునితో ప్రక్కనే ఉన్న తమసానదికి మధ్యాహ్న స్నాన, అనుష్ఠానాలు చేసుకోవటానికి వెళ్లాడు. అతని మనస్సు రామకథ వినడం వల్ల నిర్మలమై చాల ప్రశాంతంగా ఆనందంతో నిండి ఉంది.

దోషరహితమైన ఆతని మనస్సు ప్రకృతితో తాదాత్మ్యాన్ని చెంది ఉంది. తనలోపల, చుట్టూ ప్రకృతిలోనూ వ్యాపించి ఉన్న బ్రహ్మతో ఏకీభావాన్ని పొంది ఉండడంవల్ల చుట్టూ ఉండే ప్రపంచపు సుఖదుఃఖాలన్నీ తనవే అన్నట్లున్నాడు వాల్మీకి మహర్షి.

స్నానానికి ముందు కొంతసేపు అక్కడి రమణీయమైన వన సౌందర్యాన్ని, సందర్శిస్తూ సంచరిస్తూ ఉన్నాడు. ఈలాంటి సమయంలో అక్కడ ఒక చెట్టుమీద ఆదమరచి హాయిగా ఆడుకుంటున్న ఒక క్రౌంచపక్షుల జంటలో మగపక్షిని ఒక బోయవాడు తన అలవాటు ప్రకారం కొట్టాడు. బాణం గుచ్చుకొని ఆ పక్షి నేలపై వ్రాలింది. రక్తం కారుతోంది. గిలగిలా కొట్టుకొని తలవాల్చింది. ఆ పక్షి చుట్టూ ఆడపక్షి దుఃఖాన్ని తట్టుకోలేక అరుస్తూ రెక్కలు రెపరెపలాడిస్తూ గిరగిరా తిరుగుతోంది.

ఈ సన్నివేశాన్ని చూసిన వాల్మీకి ఆ పక్షికి కలిగిన శోకాన్ని చూసి తట్టుకోలేకపోయాడు. అప్రయత్నంగా అతని నోటినుండి

**"మానిషాద! ప్రతిష్ఠాం త్వం అగమః శాశ్వతీ స్సమాః।**
**యత్ క్రౌంచ మిథునాదేకం అవధీః కామమోహితమ్ ॥"**

అంటూ శోకం హృదయాంతరాళనుండి కట్టలు తెంచుకొని పొంగి పొరలింది. అప్రయత్నంగా శాపమై బయల్వెడలింది.

పక్షులను కొట్టడం బోయవానికి సహజమైన వృత్తి. ఆ విషయం వాల్మీకికీ తెలుసు. వేటగాడి బారిన పడితే పక్షికి మరణం ఖాయం. ఈ విషయమూ ఆయనకు తెలుసు. దానికి ఆ మహర్షి అంతగా కదిలిపోవలసిన అవసరం లేదు. బహుశా అది ఒక దైవ ఘటన కావచ్చు. కాబోయే జగత్కళ్యాణానికి వాల్మీకి కారణం కావలసి వుంది. అందుకే అతని నోటినుండి ఆ మాటలు వెలువడేటట్టు చతుర్ముఖ బ్రహ్మ చేయించిన ఘటన ఇది. ఈ విషయాన్ని తరువాత బ్రహ్మ కనిపించినపుడు ఆయనే వాల్మీకితో చెప్తాడు.

కోపంలో శపించిన తరువాత వాల్మీకి, తన మాటలను తానే పునఃపునః ఆవృత్తి చేసుకుంటూ శిష్యునికి చెప్పాడు. ఆయన అలా అనగా అనగా ఉంటే, కొత్త కొత్త అర్థాలు స్ఫురించసాగాయి. అది తనకే ఆశ్చర్యం కలిగించింది. మాటకి, పాటకి వీలయ్యేట్లుగా, వాయిద్యాలపై ప్రయోగించటానికి అనువుగా, పైకి ఒక శాపంలా కనిపించినా, లోపల ఒక సందేశాన్ని నింపుకున్న అద్భుతమైన పలుకులు అవి, అని వాల్మీకి గుర్తించాడు.

*(తరువాయి సంచికలో)*

భగవద్గీత సాంఖ్యయోగము-2

# మనశ్శాంతికి దివ్యౌషధం

శ్రీమాన్ వోలేటి రామకృష్ణమాచార్యులు - హైదరాబాద్

భగవద్గీతలోని ఒకటవ అధ్యాయంలో పుత్ర వ్యామోహంతో ధృతరాష్ట్రుడు, అహంకారంతో దుర్యోధనుడు, బంధుప్రీతితో అర్జునుడు విషాదానికి లోనై, దాన్నుంచి బయట పడాలన్న తపనతో ఒక్కొక్కరు ఒకొక్కరిని ఆశ్రయించారు. అదృష్టవశాత్తు అర్జునుడు కృష్ణుని ఆశ్రయించడంతో, అతని విషాదం కాస్తా 'యోగ'మయ్యింది. భగవంతుని ఉపదేశం మనదాకా అందడానికి నాంది అయింది. ప్రథమాధ్యాయం భగవద్గీతకు అవతారిక అయింది. ఆ ప్రథమాధ్యాయ పఠనం, లేదా, శ్రవణం చేయడం వలన కలిగే కర్మ పరిపాకాన్ని గురించి గత సంచికలో తెలుసుకున్నాం.

ఇక రెండవ అధ్యాయము పేరు సాంఖ్యయోగము. 'సాంఖ్యము' అంటేనే 'జ్ఞానము' అని అర్థము. దేహసంబంధం వలన కలిగిన బంధుప్రీతితో అర్జునుడు కర్తవ్య విమూఢుడైతే, అతడు కర్తవ్యం వైపు మరలడానికి అవసరమైన జ్ఞానాన్ని అందించిన అధ్యాయం కనుక, ఈ రెండవ అధ్యాయానికీ పేరు వచ్చింది.

ఇందులో మొత్తం 72 శ్లోకాలు ఉన్నాయి. అందులో కృష్ణార్జునుల మధ్య జరుగుతున్న సన్నివేశాన్ని దివ్యదృష్టితో చూస్తూ సందర్భానుసారంగా ధృతరాష్ట్రునికి వినిపించడానికి సంజయుడు పలికినవి 3 శ్లోకాలు. అర్జునుడు పలికినవి మొత్తం 6 శ్లోకాలు. అందులో తనబాధ వెళ్ళబోసుకున్నవి 5 శ్లోకాలు. ఉపదేశం మధ్యలో తను వెలిబుచ్చిన సందేహం 1శ్లోకం.

భగవంతుడు పలికినవి 63 శ్లోకాలు. 'అర్జునా! మనోదౌర్బల్యం వలన నిర్వీర్యుడవు అయిపోతున్నావు, ఏడుస్తున్నావు. కనుక, అది తగదు వదల'మని హెచ్చరించినవి 3 శ్లోకాలు(2,3,11). 12వ శ్లోకము నుండి భగవంతుని అసలు ఉపదేశం ప్రారంభమైంది. 12-53 శ్లోకాలలో దేహము అనిత్యమని, ఆత్మ నిత్యమని రెంటికీ ఉండే భేదాన్ని సుస్పష్టంగా వివరించి కర్తవ్యపాలన చేయమన్నాడు, స్వామి కృష్ణపరమాత్మ. అంతే కాకుండా అర్జునుని ప్రశ్నకి సమాధానంగా 55-72 శ్లోకాలలో స్థితప్రజ్ఞునిలో ఉండే దశలు వివరించాడు. ఆ పైన "ఆదశకు చేరకుండా ఆపే విషయాలలో ఇంద్రియాలు ఎలా కూరుకుపోతున్నాయో తెలిపి, వాటిని నాకు అప్పచెప్పు నీవు చేరాల్సిన ఉత్తమ స్థితికి నేను చేరుస్తాను" అని అర్జునికి జ్ఞానబోధ చేశాడు.

అలాంటి ఆ రెండవ అధ్యాయ వైభవాన్ని నారాయణుని ప్రార్థించడం ద్వారా మహాలక్ష్మి తెలుసుకున్నట్లుగా మనకి పద్మ పురాణం అందజేస్తోంది. అదేమిటో మనమూ తెలుసుకుందాం!

"నాథా! చిలుక చెప్పిన ప్రథమాధ్యాయ ప్రభావాన్ని, ఆ అద్భుతగాథను మీద్వారా విని చాలా సంతోషించాను. మరి భగవద్గీత రెండవ అధ్యాయానికి ఉన్న మహిమను కూడా వినాలనుంది" అని లక్ష్మీదేవి ప్రార్థించగా, శ్రీమన్నారాయణుడు ఇలా... అనుగ్రహించాడు.

పూర్వం దక్షిణ దేశంలో పురంధరపురం అనే పట్టణం ఉండేది. ఆ నగరం విద్వాంసులకు నిలయం. ఆ నగరంలో దేవశర్మ అనే బ్రాహ్మణుడు నివసించేవాడు. అతడు భక్తుడు, సద్వర్తనుడు, దాన ధర్మాది కార్యనిరతుడు, వేద వేదాంగవేత్త, యమనియమాది సప్తసాధనములతో భగవంతుడిని అర్చించే సకల సద్గుణ సంపన్నుడు. కాని ఎన్ని సత్కర్మలు ఆచరించినా దేవశర్మకు మనశ్శాంతి కలుగలేదు. దానికి మార్గం తెలుసుకోవాలని, ఆ నగరంలో ఉన్న, అక్కడికి విచ్చేసిన భాగవతులను ప్రతిరోజు భోజన, దక్షిణ, చందన తాంబూలాది సత్కారములతో సేవించడం మొదలు పెట్టాడు. అలా కొంత కాలం గడిచింది.

ఒకరోజు ఆ నగరానికి ఒక సాధుపుంగవుడు వచ్చాడు. ఆ సాధువు ప్రశాంత చిత్తుడిగా అనిపించాడు. దేవశర్మ ఆతనికి నమస్కరించి. "మహాత్మా! నాకు మనశ్శాంతి లభించడం లేదు. మీరు శాంతచిత్తులై దర్శనమిస్తున్నారు. నాకు కూడా ఆ ఉపాయాన్ని అనుగ్రహించవలసినది" అని ప్రార్థించాడు. దానికి ఆ మహానుభావుడు "నాయనా మనశ్శాంతికి మార్గము... ఆత్మజ్ఞానము. దానికోసం నీవు సౌపురమనే గ్రామానికి వెళ్ళు. అక్కడ మిత్రవంతుడనే ఒక మేకల కాపరి ఉంటాడు. అతని దగ్గరకు వెళ్ళి ప్రార్థించు. ఆతడు నీకు మార్గనిర్దేశం చెయ్యగలడు" అని చెప్పి వెళ్ళిపోయాడు.

దేవశర్మ సౌపురమనే గ్రామానికి వెళ్ళాడు. అది చాల

అందమైన గ్రామం. అక్కడ చక్కని పూతోటలు ఎన్నో ఉన్నాయి. ఒక అందమైన నది ప్రవహిస్తోంది. ఆ నది ఒడ్డున ఒక శిలపై కూర్చున్న మిత్రవంతుడిని గుర్తించాడు దేవశర్మ. ఆతనిని సమీపించి, నమస్కరించి తన వృత్తాంతాన్ని వివరించి " స్వామీ! నాకు మనశ్శాంతికి మార్గాన్ని అనుగ్రహించండి'' అని ప్రార్థించాడు.

దానికి మిత్రవంతుడు తను ప్రశాంతంగా జీవించ గలగటానికి వెనుక గల కథను ఇలా చెప్పాడు. "అయ్యా! నేను ఒక రోజు మేకలు కాచుకుంటున్నాను. అంతలో ఒక పులి మా మందవైపు వచ్చింది. నాకు పై ప్రాణాలు పైకి పోయినంత భయం కలిగింది. మేకలను అదలించి, నేను పరిగెత్తిపోయి దగ్గరలోనున్న చెట్టెక్కేశాను.

అంతలో నా మేకల మందలోని ఒక మేక ధైర్యంగా పులికి ఎదురు నిలిచి "ఓ వ్యాఘ్రమా ! నన్ను భక్షించు! నీ ఆకలి తీర్చుకో!" అని కోరింది. నేను, ఆ వింతని, మేక ధైర్యాన్ని చూసి ఆశ్చర్యపోయాను. ఆ పులి కూడా తన ప్రవర్తనకు తానే ఆశ్చర్య పోయింది. మేక వచ్చి తనతో మాటాడే వరకూ తనేమీ చేయకుండా ఆగడం ఏమిటి? అనుకుని "ఓ మేషమా! నిన్ను చూచినా నాకెలాంటి కౄరభావనా కలగడంలేదు. నిన్ను భక్షించాలని కోరికా కలగడం లేదు'' అంది. ఆ మేకకు భయమూలేదు, ఆ పులికి క్రౌర్యమూ లేదు. ఆ విపరీత స్థితికి ఆ జంతువులు కూడా విస్మయం చెంది దగ్గరలో ఉన్న మేకల కాపరినైన నా దగ్గర కొచ్చి కారణమడిగాయి.

నిజానికి అవి అలా ఎందుకు ప్రవర్తించాయో నాకూ అంతుబట్టలేదు. నేను కూర్చున్న చెట్టు మీద ఒక వృద్ధవానరం కూడా ఉంది. మేం ముగ్గురం కలిసి ఆ వృద్ధవానరాన్ని కారణం చెప్పమని ప్రార్థించాం. ఆ వానరమిలా చెప్పింది.

"నాయనలారా ! ఇదంతా ఇక్కడి స్థలమహిమ. ఇక్కడికి దగ్గరగానే ఒక దేవాలయం ఉంది. అది బ్రహ్మ ప్రతిష్ఠితం. ఆ ఆలయంలో సుకర్మ అనే బ్రాహ్మణుడు పూజాదికాలు నిర్వహించే వాడు. ఒకసారి ఇక్కడికి ఒక మహనీయుడు వచ్చాడు. సుకర్మ ఆ మహనీయునికి అతిథి సత్కారాలు చేసి సంతృప్తి పరిచాడు. వెళ్ళేటప్పుడు ఆ మహనీయుడు "బ్రాహ్మణోత్తమా ! నీ అతిథి సత్కారాలకి చాలా సంతోషించాను. అందుకు ప్రతిఫలంగా ఈ శిలా ఫలకముపై భగవద్గీతలోని రెండవ అధ్యాయాన్ని వ్రాసిస్తున్నాను. దీనిని అనుదినము భక్తితో పఠించి బ్రహ్మ జ్ఞానివికా!" అని ఆశీర్వదించి వెళ్ళిపోయాడు.

ఆనాటి నుండి సుకర్మ ఆ రెండవ అధ్యాయమును భక్తితో పఠించసాగాడు. దానివలన సుకర్మకు ఆత్మ జ్ఞానము లభించి ఆ పుణ్యాత్ముడు పాదం మోపిన ఈ ప్రదేశములన్నీ పుణ్య భూములయ్యాయి. ఆతని ప్రభావంతో పవిత్రమైన ఈ భూములలో జీవించే ప్రాణులకు సుఖదుఃఖాలు, రాగద్వేషాదులు లేకుండా పోయాయి. అందుకే పులి, మేక కూడా శత్రుభావన లేకుండా కలిసి ఉండగలిగాయి" అని చెప్పడమే కాకుండా అక్కడ ఉన్న భగవద్గీత ఫలకాన్ని కూడా చూపించింది ఆ వృద్ధ వానరం.

ఆ రహస్యాన్ని విన్న నేను కూడా ఆనాటి ఆ ఫలకములో ఉన్న భగవద్గీత యొక్క రెండవ అధ్యాయాన్ని భక్తితో పఠించి ఆత్మజ్ఞానాన్ని మనశ్శాంతిని పొందగలిగాను" అని చెప్పాడు మిత్రవంతుడు.

అదివిని దేవశర్మ కూడా ఎంతగానో సంతోషించి మిత్రవంతుడికి నమస్కరించి, తన నగరమునకు తిరిగి వెళ్ళాడు. నాటినుండి భగవద్గీత రెండవ అధ్యాయాన్ని భక్తితో పఠించి మనశ్శాంతిని, ఆత్మజ్ఞానాన్ని పొందాడు. అంతేకాక, తన చరమాంకంలో మోక్షం కూడా పొందాడు. ఈ విధంగా లక్ష్మీదేవికి విష్ణుమూర్తి చెప్పిన ఈ కథను, పార్వతీదేవికి శంకరుడు వినిపించాడు. ఈ కథను విన్న పార్వతీదేవి ఆనంద పరవశురాలయ్యింది. రాగద్వేషాది దోషాలు లేని నిర్మల మనస్సుకై మనమూ భగవద్గీతలోని రెండవ అధ్యాయాన్ని పారాయణ చేద్దామా మరి!



# దివ్యసాకేతంలో.........

శ్రీమాన్ రఘుదత్తాచార్యులు - ప్రధానార్చకులు

**శ్రీవైకుంఠపతీ రంగపతీ రఘుపతి ర్ముదా।**
**యత్రైవారాధ్యతాం ప్రాప్తాః దివ్యసాకేతభూ ర్జయేత్ ॥**

అసంఖ్యేయమైన కళ్యాణ గుణసాగరుడై, జగత్కారణుడై, తత్త్వములకు అతీతుడై, ఎటువంటి కల్మషములులేని అమల స్వరూపుడై, జ్ఞాన శక్తి బల ఐశ్వర్య వీర్య తేజస్సులనే షాడ్గుణ్య పూర్ణుడై, సమస్త చేతనా చేతన స్వరూపమగు జీవ ప్రకృతులకు స్వామియై, అఖిలాండకోటి బ్రహ్మాండములను కనుసైగ మాత్రం చేతనే నియమించగలిగిన ఆ పరమపదనాథుని దర్శించాలని ఆనాటినుండి ఈ నాటి వరకు ఎందరో ఋషులు, యోగులు, ఆళ్వార్లు, భక్తులు, మహానుభావులు తపిస్తూనే ఉన్నారు.

ఆనాటి ఋషులు, యోగులు ఎందరో భౌతిక సుఖాలనన్నిటినీ వదిలి, కేవల కందమూల భక్షణము జేస్తూ రాతి శిలలపై శయనిస్తూ, తపమారంభించి క్రమేణ వాటిని కూడా వదిలి కేవల వాయుభక్షణతో, ఘోరఅగ్నులమధ్య నిలుస్తూ, భాను కిరణాలకు తపిస్తూ, వానకు తడుస్తూ, విషసర్పములైననేమి, క్రిమికీటకములైననేమి శరీరముపై పాకిననూ పట్టించుకొనక, కేవలము వాడి దర్శనమే లక్ష్యముగ వేలకొలది వర్షములు తపించినారు. అయిననూ సుదుర్లభమట పరమపురుషుని దర్శనభాగ్యము. ఇది మహర్షులు యోగుల స్థితి.

వీరికంటే గొప్ప పుణ్యఫల అతిశయంచేత బ్రహ్మ, రుద్ర, ఇంద్రాది దిక్పాలకులుగా ఉన్నత స్థితినందిన దేవతలది కాస్త భిన్న స్థితి. కారణం, అవాఙ్మనసగోచరమైన దివ్యస్వరూపం ఆ పరాత్పరునిది. మానవులకంటే దివ్యజ్ఞానశక్తులుకల దేవతలు కూడా ఇదీ వాని రూపము, ఇదీ వాని వర్ణము, ఇదీ పరిమితి అంటూ వర్ణించుటకు కూడా అసంభవమైనదట స్వామి పరస్వరూపము. ఇదీ దేవతల పరిస్థితి.

కేవలము భక్తి మార్గమును అవలంబించి స్తోత్రముల ద్వారా, సంకీర్తనల ద్వారా, సౌమ్యమగు కైంకర్యముల ద్వారా స్వామిని తమ హృదయమందిరాలలోను, అర్చారూపంలోనూ సేవిస్తూ, త్రోవ మరల్చవచ్చిన సంకటములను కూడా స్వామితో సంబంధమునకు వేయు బంధమనుకొన్నారు ఇది ఆళ్వారాచార్యుల స్థితి.

ఇక మధుపానములు, మృష్టాన్న భోజనము, స్నేహితుల తోడ సల్లాపములు, లోకమును మరిపింపజేయు సుఖభోగాలు ఒకటా, రెండా క్షణక్షణమూ మనసును రంజింపచేస్తూ భోగములవైపు మరలింపజేయు విషయాలు, ఆకర్షణలెన్నో కలిగిన ఈ కాలంలో అసలు భగవంతుని వైపు దృష్టిమరలడమే అసాధ్యం. అయినా వీటన్నిటినీ త్యజించి ఆ స్వామిని సేవించాలని భక్తులు, మహానుభావులు ఎందరెందరో తపిస్తూనే ఉన్నారు.

పాపం ఇందరి స్థితిని అవస్థలను గమనించిన ఆ వైకుంఠనాథుడు మరి ఏమని తలచాడో ఏమో! "నీవిచ్చే ఆ పరమపదముకన్నా, నీ పరస్వరూపముకన్నా గూడా పరమానందము కలిగించునయ్యా! నీ ప్రతిమారూపము అర్చా స్వరూపము" అన్న ఆళ్వార్ల మాటలు విన్నాడో ఇలాగ ఉంటే బాగుంటుందనుకున్నాడో, ఏమో మనకోసం దిగివచ్చాడు.

ఆ వచ్చేది భక్తులతో పాటు లోకమందు సంకులమైన సంసారమనే భోగమును తలుచు అభాగ్యులను కూడా ఉద్ధరించాలని, వారిని తన పదపంకజ పంజరమందు మధువును భోగించు భాగ్యము నందివ్వాలను తపన కలిగిన వారి హృదయ సరసిజమున నివసించు సంకల్ప కల్పిత కల్పతరువవ్వాలని తలచి, ఎక్కడో మరెక్కడో కాదు మన శ్రీరామ నగరమందు, మనకంటిన భవభయమును పారద్రోలుతూ వచ్చి నిలిచాడు.

"భవ' మంటే బాధాపూరిత నరకం కాదు భగవత్స్వరూపము. దానిని భక్తిగా కొలచిన చాలును బంధములను తొలగించి భాగ్యసీమయైన పరమపదము నీకందు"నని తెలుపు జగదాచార్యులు, మన ప్రియతమ ఆచార్యులైన శ్రీశ్రీశ్రీ చిన్నజీయర్ స్వామివారి సంకల్ప కల్పతరువై నిలవాలనుకున్నాడో ఏమో! మన మధ్యకి దిగి వచ్చాడు. అదిగో ఆ స్వామి సంకల్పమే ఎవ్వరూ ఊహించని దివ్యధామమై దివ్య సాకేతమై, మనపాలిటి భాగ్య సీమయై, భాగ్యనగర సమీపాన శోభిల్లుతున్నది. దర్శిద్దాం రండి!



రాయల ఊహల పల్లకి....

# ఆముక్తమాల్యద

*(గత సంచిక తరువాయి)*

ఆలయాల్లో ఆయా ఆరాధనల వేళలు పదిమందికి తెలియడానికి శంఖాలూత్తారు. ఆ ఊరి విష్ణ్వాలయంలో అవసరాలకు ఊదే శంఖధ్వని చెవులకు సోకగానే ఒక్క ఉదుటున ఆటలోంచి వెలికివచ్చివారు చూసే కడగంటి చూపులు తళుకు మహావాడిగా ఉంటుంది. ఆ వాడి జనం గుండెల్లోంచి దూసుకు పోతోంది. ఉంకించి పాచికలు వేసేటప్పుడు ఆ అదటుకు కొప్పు సడలితే రెండోచేత్తో ఆ కొప్పును సవరించుకొంటున్నప్పుడు పైటలోంచి కనవచ్చే చనుగవ మన్మథుని తలగడలా పొడుచుకు వస్తుంది.

వారు తాంబూలం వేసుకున్నందున పలువరస ఎఱ్ఱబారి ఉంటుంది. ఆ ఎరుపు పోయి వెన్నెల విరిసినట్టు తెల్లగా ఉండడానికి ఒక్క వరిగింజతో సుతారంగా తోమగల చతురులు వారు. కట్టిన బట్టకు పసుపు అంటుకోకుండా శరీరం మీదే నిగ్గులు తేరేట్టు పసుపురాసుకుని స్నానం చేయడంలో మంచి నేర్పరులు. రకరకాల పరిమళద్రవ్యాలు కలిపిన కలపాన్ని పైటలోనే చేయాడించి పలచగా రొమ్మున పూసుకోగల నిపుణలు. మెళ్లో వేసుకున్న ముత్యాల సరాలు రతివేగానికి దారం తెగి కింద జల్లుకుపోతే లెక్కచేయని రాజసం, హుందాతనం కలవారు.

విటుడు కంటపడితేచాలు, వాడి కులగోత్రాలు, గుణశీలాలు తెలుసుకోగల దిట్టలు, తమ దగ్గరకు వచ్చే విటుడు ఏ కారణంచేతనైనా ఐశ్వర్యం కోల్పోయి పేదవాడైతే వాణ్ణి చేరదీసి పోషించగల ఉదారలు. రాజుగారి బయటి రాణివాసంలా జనం చూసేట్టు మెలగగలవారు. మాటలలోనే కవితలు వెలయించగలవారూను, బంగారం ధరిస్తే ఒంటికి చిదుం పడుతుందని ముత్యాలసరాలు, ముత్యాల కంకణాలు ధరిస్తారు కానీ బంగారు నగలు పెట్టుకోరు. ఒంటికి కస్తూరి పూసుకుంటారు కానీ చెమ్మగా ఉంటుందని పూలనొల్లరు. సన్నని మేటివలువలనే ధరిస్తారు కానీ, ఒంటికి హత్తుకుంటాయని ముదుకబట్టలు కట్టరు.

తెల్లారగానే మేడమీద గదిలో కిటికీ దగ్గర కూచొని జడవిప్పుకుంటూ అందులో తురిమిన పువ్వుల్ని చిమ్ముతారు. అట్లా చిమ్మేటప్పుడు ఆ పూలవాసనలకు తుమ్మెదలు ముసిరి చేసే ఝుంకారం వీణానాదంలా వినపడుతుంది. జడలోని పువ్వులు వీణమెట్లలా ఉంటాయి. వారు వీణవాయించడంలో మంచి నేర్పరులేమో చేత్తో సుతారముగా చిక్కు తీసుకోవడం, పూలు చిమ్మడం దూరానికి వీణమీటడంలా కనపడుతుంది. వారు వీణవాయించడంలో నేర్పరులని ఎరిగిన కాముకులు ఆ వీధిన పోతూ అప్పుడు వారు వీణవాయిస్తున్నారనే అనుకుంటారు.

ధనం రాసులు కురిపిస్తామన్నా ఎవరిని పడితే వారిని వారు లెక్కచేయరు. ఎల్లా అయినా వారిని ఒప్పించాలని చెలులు చెప్పే మాటల్ని వారి చెవులు వినవు. ఆ చెవులెందుకు వినవు అంటే, అవి శ్రీలు. శ్రీలను ధనలోభం ఆకర్షించలేదు. (చెవి శ్రీ అన్న అక్షరంలా ఉంటుందని కవులు వర్ణిస్తూంటారు.)

విల్లిపుత్తూరిలో ఇళ్ళవెనుక ఉద్యానాలు, వాటిలో సరస్సులు. ఆ సరస్సుల్లో స్నానం చేసేటప్పుడు పసుపు రాసుకుంటారు ఇల్లాళ్ళు. అల్లా రాసుకునేందుకు అక్కడున్న రత్నాలదిమ్మమీద పసుపుకొమ్ము అరగదీస్తారు. వారు స్నానం చేసిన ఆ పసుపునీరు ఆమెట్టుకింద పడీ పడీ ఆ హంసల రెక్కలు పచ్చగా అయేయి. అప్పుడప్పుడు ఆ హంసలు విహరిద్దామని ఊరిమీద ఎగురుతూంటాయి. ఊళ్లోవాళ్ళు వాటిని చూసి ఆకాశగంగలోని బంగారురెక్కల హంసలు అనుకుంటారు.

ఆ ఊళ్లో వరిమళ్ళకు పారే నీళ్ళకాలవల నడుమ పొద్దుటి పూట బాతులు రెక్కల్లో తలదూర్చుకుని నిద్రపోతూంటాయి. తలారులు వాటిని చూసి అంతకుముందు ఆ కాలవల్లో స్నానాలు చేసి వెళ్ళిన బ్రాహ్మణులు ఉతుక్కొని విడిచిపెట్టిన బట్టల పిడపలు, పాపం మరిచిపోయారు. వారికందచేద్దాము అనుకుని రేవుల్లోకి దిగ్గానే ఆ సవ్వడికి ఆ బాతులు మేలుకుని దూరంగా ఈదుకుంటూ ఎగురుకుంటూ పోతాయి. ఇది చూసి చేలల్లో మంచెలు వేసుకుని పైర్లు కాస్తున్న పడతులు నవ్వుకుంటారు. ఆ ఊళ్ళో బలిసిన వరిచేలున్నాయి. విరిసిన పూదోటలూ ఉన్నాయి. రెండింటికీ పోటీ. ఎవరు హెచ్చుంటే ఎవరు హెచ్చని. పువ్వుదోటల్లో తీగమల్లెలు, ఖర్జూరాలు, పుష్పమంజరులు, మామిడి గుత్తులు, కుసుమలు, సంపెంగలు, పచ్చగన్నేరు, పొళలు (పోక, కొబ్బరి వంటి దొప్పతో ఉన్న పూలగుత్తులు) ఇంకా ఎన్నో ఉన్నాయి, వరిచేలల్లో కూడా ఈ పేర్లతో ఉన్న సస్యాలున్నాయి. అంచేత చేలు, పూదోటలూ హెచ్చుతగ్గులేక సమం అయినాయి. కాని, పరకాయించి చూస్తే చేలవేపు ముల్లు చూపుతోంది. అంటే చేలుగొప్ప అని. ఎట్లా? చేలల్లో రాజనం అని ఒక వరి ఉంది. ఆ పేరుతో పూదోటల్లో పూలు లేవు. ఈ రాజనపు వరిగింజకు చివర ముల్లులా ఉంటుంది. ఇదీ చేలపక్షంలో అంటే ముల్లు చేలవైపు ఒరిగి చేలు గొప్పవని తేల్చిచెప్పినట్లయింది. దాంతో పూదోటలు చేలదగ్గర ఓడిపోయినై. గెల్చినవారు ఓడినవారిని పరిహసిస్తారు కదా, తెల్లని బెగ్గురుపక్షులు చేలల్లో ఉన్నాయి. ఆ బెగ్గురులు చేలనవ్వుల్లా ఉన్నాయి. బెగ్గురులు పూలతోటల్లో ఉండవు. రకరకాల పూదోటలతో ఏపైన వివిధ సస్యాలతో ఆ ప్రాంతమంతా అంత సుభిక్షంగా ఉందన్నమాట.

(తరువాయి సంచికలో)

-శ్రీరామచంద్రాచార్య



పరమహంస పరివ్రాజకులు

# శ్రీశ్రీశ్రీ చిన్నజీయర్‌స్వామివారి ప్రచారవార్తలు



ఒక నెలరోజులపాటుగా అమెరికా పర్యటనలో న్యూజెర్సిలోని బ్రిడ్జ్‌వాటర్‌లో శ్రీవేంకటేశ్వరస్వామి ఆలయ పుష్కరోత్సవాలు NATS సంస్థవారి తెలుగువార్షికోత్సవాలు, బాస్టన్, వర్జినీయాలలో శిక్షణ శిబిరాలు, న్యూయార్క్ ఆల్బనీలలో ప్రజ్ఞా తరగతుల పరిశీలన వంటి కార్యక్రమాలు ముగించి, దుబాయ్‌లో శ్రీ వినేష్‌భాయ్‌గారి ఆతిథ్యాన్ని ఒకరోజు స్వీకరించి 6వ తేది రాత్రికి శ్రీస్వామివారు శంషాబాద్, శ్రీరామనగర్ చేరుకున్నారు.

7వ తేది అక్కడి కార్యక్రమాలను పరిశీలించి రాత్రికి సీతానగరం చేరుకున్నారు.

8వ తేదిన నడిగడ్డపాలెంలో పెరుమాళ్ళను, ఆచార్యులైన శ్రీ పెద్ద జీయరు స్వామివారిని సేవించి చాతుర్యాస్యానికి ఆజ్ఞ స్వీకరించారు. అనంతరం కవిగారి కుమారుల ఆహ్వానం మేరకు వారి గృహానికి వేంచేసి కుటుంబ సభ్యులకు, భగవద్బంధువులకు మంగళాశాసనాలు చేశారు.

9వ తేది రాత్రికి చెన్నై చేరారు. అక్కడ శ్రీమాన్ కిశోర్‌గారి గృహంలో బస చేశారు.

10వ తేదీన పెరంబూర్ శ్రీనివాస్ పెరుమాళ్ కోవెలలో ప్రతిష్ఠా కార్యక్రమంలో పాల్గొన్నారు. అనంతరం బి.బి.రోడ్ శ్రీ వేంకటేశ్వరస్వామి వారి ఆలయంలో సుదర్శన పెరుమాళ్ ప్రతిష్ఠాపన కార్యక్రమంలో పాల్గొన్నారు. తరువాత పాతపట్నంలోని వరదాముత్తియప్పన్ వీధిలో శ్రీ పెద్ద జీయరు స్వామివారు స్థాపించిన "యతిరాజసేవా మహిళా మండలి"వారి ఆహ్వానంపై అక్కడి గీతాభవనానికి వేంచేసి, భగవద్రామానుజుల వారి విగ్రహాన్ని ప్రతిష్ఠించారు.

శ్రీ పెద్ద జీయరు స్వామివారు నిర్మింపచేసిన 108 రామక్రతు స్తూపాలలో వెండిస్తూపం ఈ గీతాభవనంలో ఉండడం ఒక విశేషం.

అక్కడ నుండి శ్రీ పెరుంబుదూర్‌కి చెందిన "ఉభయ వేదాంత వర్ధిని కళాశాల" వారి వెబ్‌సైట్‌ను శ్రీస్వామివారు ప్రారంభించి, అక్కడి వారందరికీ మంగళాశాసనములు కృపచేశారు.

తిరుగు ప్రయాణంలో కొరటూరులో శ్రీరంగం శ్రీలక్ష్మీ నృసింహ భట్టర్‌వారి గృహానికి విచ్చేసి అనారోగ్యంగా ఉన్న వారి శ్రీమతిగారికి మంగళాశాసనం చేశారు. ఆ రాత్రికి సీతానగరం విచ్చేశారు.

12వ తేది గుంటూరులోని ప్రభుత్వ మహిళా కళాశాల వారి ఆహ్వానంపై హెరిటేజ్ క్లబ్‌ను ప్రారంభించారు. అక్కడి విద్యార్థులకు, అధ్యాపకులకు, సిబ్బందికి మంగళాశాసనం చేశారు. వారి కృషిని ప్రశంసించారు. ప్రభుత్వ కళాశాలలో సమగ్రతకల కంప్యూటర్ లాబ్‌ను చరిత్ర తరగతుల నిర్వహణకు వాడకోగలుగుతున్నందుకు వారికి మంగళాశాసనాలు చేశారు. క్రిందటేడాది ఇక్కడే మొదటి కంప్యూటర్‌ను ప్రారంభించారు. ఈసారి వారికి ఒక LCD ప్రొజెక్టర్‌ను, ఒక లాప్‌టాప్‌ను శ్రీస్వామివారు బహూకరించారు. ఈ విభాగాన్ని సమర్థవంతంగ నిర్వహించే శ్రీమాన్ భవానీప్రసాద్ (VT కార్యదర్శి) గారిని కళాశాల ప్రిన్సిపాల్, స్టాఫ్‌ను శ్రీవారు ప్రశంసించారు.

గుంటూరులోని వికాసతరంగిణి భవనానికి ఉభయదారుగ ఉన్న శ్రీమతి మద్ది పద్మావతిగారు అనారోగ్యంతో అశ్విని హాస్పిటల్‌లో తిరగలేని స్థితిలో ఉండటంతో శ్రీస్వామివారు ఆ వైద్యశాలను సందర్శించి, ఆమెకు, అక్కడి వైద్యబృందానికీ ఇతర రోగులకూ మంగళాశాసనాలు చేశారు.

శ్రీస్వామివారు చాతుర్మాస్య దీక్షను శ్రీరామనగర్‌లో చేయవలసి ఉన్నప్పటికీ భగవత్సంకల్పం వల్ల సీతానగరం, వేదవిశ్వవిద్యాలయంలో జులై 15వ తేది చాతుర్మాస్య దీక్ష స్వీకరించారు. శ్రీస్వామివారితోపాటు ఖట్మాండు నుండి విచ్చేసిన శ్రీశ్రీశ్రీ త్రిదండి దేవనాయక రామానుజ జీయరు స్వామివారు కూడా సీతానగరంలోనే చాతుర్మాస్యదీక్షను స్వీకరించారు.

శ్రీశ్రీశ్రీ స్వామివారు సీతానగరంలో చాతుర్మాస్యాన్ని స్వీకరిస్తున్నా రని తెలిసి శ్రీశ్రీశ్రీ అహోబిల రామానుజ జీయరు స్వామివారు విశాఖ పట్నం నుండి హైదరాబాద్ ప్రయాణాన్ని మార్చుకొని నేరుగా సీతానగరం వేంచేశారు. గురుపౌర్ణమిని శ్రీస్వామివారి సన్నిధిలో జరుపు కొన్నారు.

శ్రీశ్రీశ్రీ అహోబిల జీయరు స్వామివారు సీతానగరంలో జరిగిన గురుపూజోత్సవం సభకు అధ్యక్షత వహించారు. శ్రీస్వామివారు అనుగ్రహ భాషణం చేస్తూ.... "వర్షాకాలంలో క్రిమికీటకాదులు భూమిపై ఎక్కువగా సంచరిస్తాయని వాటికి హాని కలిగించకూడదని, గ్రామైక రాత్రంగా సంచరించే యోగులు, మునులు, యతులు ఈ వర్షాకాలం నాలుగు నెలలూ తమ సంచారాన్ని నిలిపివేసి ఒకచోట ఉండి తమ జప, ధ్యాన, అధ్యయనాదులను చేస్తార"ని, తెలియచేశారు. గురువుయొక్క ప్రాశస్త్యాన్ని వారు తెలియజేస్తూ ఒక్క మానవజన్మలో మాత్రమే ఆచార్యుల అనుగ్రహంతో భగవంతుణ్ణి పొందగలిగే అవకాశం ఉంది. అటువంటి ఆచార్యులు మనకు లభించిన మనం అదృష్టవంతులమని తెలియజేశారు.

డా॥ ఉ.వే. శ్రీమాన్ ఎస్.వి. రంగరామానుజాచార్యస్వామి వారు, ఉ.వే. శ్రీమాన్ టి. ఉడయవర్లు స్వామివారు, డా॥ శ్రీమతి టి.కె. చూడామణిగారు ఆచార్యుల వైభవాన్ని తెలియ జేశారు.

శ్రీశ్రీశ్రీ స్వామివారు తమ ఆచార్యులైన శ్రీశ్రీశ్రీ పెద్ద జీయరు స్వామివారి పాదుకులకు తిరుమంజనం, ఆరాధనా చేశారు. "ఈ వ్యాపపూర్ణిమనే గురుపూర్ణిమగా జరుపుకుంటామని, వ్యాసులవారు అష్టాదశ పురాణాలను అందించి లోకానికి ఎంతో మేలు చేశారని, ఆ రోజునుండే చాతుర్మాస్య వ్రతాన్ని స్వీకరించడం అనాదిగా వస్తున్నదని, లోకంలో సెప్టెంబర్ 5న జరుపుకునే 'టీచర్స్ డే' (గురుపూజోత్సవం) టీచర్స్‌డే కాదని, వ్యాసపూర్ణిమయే అసలైన "ప్రపంచ టీచర్స్ డే" అని తెలియజేశారు.

ఎంతో కాలం తరువాత సీతానగరంలో చాతుర్మాస్య దీక్షను స్వీకరిస్తున్న స్వామివారిని సేవించుకోవడానికి వేలాదిమంది భక్తులు ఆనందోత్సాహాలతో సీతానగరానికి చేరారు. గురుపూజోత్సవంలో పాల్గొని ఆచార్య శ్రీపాదతీర్థాన్ని, ప్రసాదాన్ని స్వీకరించి తమ గురుభక్తిని చాటుకున్నారు.

అదే రోజు సాయంత్రం 3 గం॥కు తెనాలి నుండి వచ్చిన వివేక జూనియర్ కళాశాల విద్యార్థులకు శ్రీస్వామివారు ఉపదేశిస్తూ "ప్రత్యక్షానికి కాని, అనుమానానికి కాని తెలియని విషయాలను ఎన్నింటినో మనకి ఆచార్యులు తెలియజేస్తారు. గురువు మనకు ఉండే తెలివిని మేల్కొలుపుతారు. లోకంలో ఈనాడు మనం చూస్తున్న గురువులందరికి ప్రథముడు వేదవ్యాస భగవానుడు. ఆయన 18 పురాణాలను, శ్రీమన్మహాభారతాన్ని అందించడమే కాకుండా, అనంత శబ్దరాశి అయిన వేదాన్ని 1131 శాఖలగా, 4 భాగాలుగా విభజించారని తెలియజేశారు. కనుక, ఆ వేదవ్యాసుని ప్రతిఒక్కరూ జాతి, మత భేదాలు లేకుండా స్మరించాలని, **"వ్యాసం వశిష్ఠ నప్తారం శక్తే పౌత్రమ కల్మషం। పరాశరాత్మజం వందే శుకతాతం తపోనిధిం"** అనే శ్లోకాన్ని ఉపదేశించారు.

ప్రతి ఒక్కరూ తెలుసుకోవలసిన మంత్రరత్నం, పురాణరత్నం, స్తోత్ర రత్నాలలో స్తోత్ర రత్నమైన "ఆళవందార్ స్తోత్రాన్ని", దాన్ని వైభవాన్ని ఈ చాతుర్మాస్యంలో తెలుసుకొనే ప్రయత్నం చేద్దామని తెలియజేశారు శ్రీస్వామివారు.

17వ తేది తీర్థగోష్ఠి అనంతరం ఆరంభమైన వికాసతరంగిణి కార్యకర్తల సమావేశానికి శ్రీశ్రీశ్రీ అహోబిల రామానుజ జీయరు స్వామివారు అధ్యక్షత వహించారు. ఈ కార్యక్రమానికి మన రాష్ట్రం నుండే కాకుండా ఇతర రాష్ట్రాల నుండి కూడా కార్యకర్తలు విచ్చేశారు.

వికాసతరంగిణి ఆధ్యాత్మిక, సామాజిక కార్యక్రమాల్ని నిర్వహిస్తూంది. ఆధ్యాత్మిక కార్యక్రమాలకూ సామాజిక కార్యక్రమాలకూ సమ ప్రాధాన్యాన్ని ఇవ్వాలని శ్రీ స్వామివారు తెలియజేశారు. ఎన్నో ప్రాంతాలలో ప్రజ్ఞా కార్యక్రమాలు జరుగుతున్నప్పటికీ, విదేశాలలో జరుగుతున్నంత ఆసక్తికరంగా ఇక్కడ కూడా జరపాలని శ్రీస్వామివారు సూచించారు. మన మన ప్రాంతాలలో ఉండే ఉపాధ్యాయుల సహకారాన్ని తీసుకొని పాఠశాలలు ముగించిన తరువాత సాయంకాలపు వేళలలో ఆయా ప్రాంతాలలో ఉండే చిన్నపిల్లలకు వేమన శతకాలు, దాశరథి శతకాలు, సుమతీ శతకాలు లాంటి నీతిశతకాలను, దేశభక్తుల చరిత్రలు, మాతృదేవో భవ!, పితృదేవో భవ వంటి నీతికథలను పిల్లలకు చెప్తూ, వారిని మంచి సంస్కారవంతులుగా తయారు చేయాలని శ్రీస్వామివారు సూచించారు. పాఠశాలలో కూడా ప్రతిరోజూ బాలల నైతిక విలువలను పెంపొందించే విధంగా కొంత సమయాన్ని వెచ్చిస్తే బాగుంటుందని శ్రీస్వామి వారు తెలియజేశారు.

భగవంతుడు మనకు ఇచ్చినటువంటి అవకాశాన్ని సద్వినియోగ పరచుకొంటూ సమాజ అవసరాన్ని గుర్తించి, సేవలను చేయగలగడం మన అదృష్టమని తెలియజేశారు.

విశాఖజిల్లాలోని పాడేరు ప్రాంతంలో ఉన్న గ్రామాలలో సరైన త్రాగునీటివసతి లేనందున అక్కడ మూడు వాటర్ ప్లాంట్స్‌ని ఏర్పాటు చేసి ఆ ప్రాంతపు వారికి సేవలను అందించ గలిగినందుకు వికాసతరంగిణిని సేవలను కొనియాడారు.

## శ్రీశ్రీశ్రీ అహోబిల జీయరు స్వామివారి ప్రచార వివరములు

10వ తేది ఆదివారం విజయవాడ విద్యాధరపురంలోని ప్రముఖ హోమియో వైద్యులు శ్రీమాన్ పి. వేంకటేశ్వరరావుగారి ఆహ్వానంపై విద్యాధరపురం వేంచేశారు.

శ్రీమాన్ వేంకటేశ్వరరావుగారు ప్రతిసంవత్సరం ఎంతోమంది విద్యార్థులకు ఉచితంగా పుస్తకాలను, ఉపకార వేతనం అందిస్తూ ఉంటారు. ఈ సంవత్సరం శ్రీశ్రీశ్రీ అహోబిల రామానుజ జీయరు స్వామివారి చేతులమీదుగా విద్యార్థులకు స్కాలర్‌షిప్‌లను, పుస్తకాలను అందించారు. శ్రీమాన్ వెంకటేశ్వరరావుగారి శ్రద్ధకు, విద్యార్థులకు శ్రీ అహోబిల జీయరు స్వామివారు మంగళాశాసనం చేసి, రాత్రికి రాజమహేంద్రి చేరుకున్నారు.

11వ తేదీ తూర్పుగోదావరి జిల్లా, కోరుకొండ సమీపం లోని రంపచోడవరం గ్రామంలోని సాహెబ్‌గారి ఆహ్వానంపై వారు నిర్మించిన శ్రీ వేంకటేశ్వర స్వామి ఆలయాన్ని సందర్శించి విశాఖపట్నం చేరారు. ఆ రాత్రికి శ్రీమాన్ సుదర్శనంగారి ఇంట్లో బస.

పరమపదవాసులు శ్రీ ఉ.వే. శ్రీమాన్ కందాళ వేంకటాచార్యస్వామి వారి తిరునక్షత్ర మహోత్సవ సందర్భంగా 12,13,14 తేదీలలో జరిగిన పండిత సభలలో పాల్గొన్నారు. శ్రీమతి జానకమ్మగారి నేతృత్వంలో ఈ సభలు అత్యంత వైభవంగా జరిగాయి. శ్రీమాన్ కందాడై వేంకటాచార్య

స్వామి రచించిన "తిరుక్కుడం దాడగం" గ్రంథాన్ని శ్రీ అహోబిల రామానుజ జీయరు స్వామివారు ఆవిష్కరించారు.

14వ తేది రాత్రికి సీతానగరం ఆశ్రమానికి చేరారు. 15 తేదీ సీతానగరంలో శ్రీశ్రీశ్రీ చిన్న జీయర్ స్వామివారి చాతుర్మాస్య దీక్షా కార్యక్రమంలోను, గురుపూజోత్సవంలోనూ అన్వయించారు.

17వ తేదీన వికాసతరంగిణి సర్వసభ్య సమావేశంలో పాల్గొన్నారు. 18వ తేదీ శ్రీశ్రీశ్రీ చిన్న జీయరు స్వామివారి వద్ద ఆజ్ఞను స్వీకరించి చాతుర్మాస్యదీక్ష ఆరంభానికై శంషాబాద్, శ్రీరామనగర్ చేరుకున్నారు.

20వ తేది శంషాబాద్ చాతుర్మాస్య దీక్షను స్వీకరించారు.

ప్రతిరోజు ఉదయం ఇరామనుజ నూత్తందాది ప్రవచనాలను అనుగ్రహిస్తూ, దీక్షా కార్యక్రమాన్ని కొనసాగి స్తున్నారు శ్రీశ్రీశ్రీ అహోబిల రామానుజ జీయరు స్వామివారు.

# పరమపదము



శ్రీ పెద్ద జీయరుస్వామివారి పదాశ్రితులు, హైదరాబాద్ వాస్తవ్యులు, **శ్రీమాన్ సముద్రాల లక్ష్మీనారాయణాచార్యులు** గారు ది. **12-7-2011** న ఆచార్య తిరువడిని చేరినారు. వీరికి పరమాత్మ పదసన్నిధిలో శాశ్వత కైంకర్యం లభించాలని శ్రీస్వామి వారు మంగళాశాసనం చేశారు.

వీరి కుమారులు శ్రీమాన్ రఘురాం శ్రీమతి శ్రుతి దంపతులు, అమెరికాలోని బాస్టన్ మహానగరంలో మన జెట్ సంస్థలో సభ్యులుగ ఉండి 'ప్రజ్ఞ' కార్యక్రమాలు నిర్వహిస్తూంటారు. ఇతని కుటుంబ సభ్యులు ప్రసాద్ ప్రభృతులు హైదరాబాద్, గాంధీనగర్‌లో ఉంటారు.



గుంటూరు జిల్లా, తాడేపల్లి గ్రామ వాస్తవ్యులుశ్రీమతి **బుర్రముక్కు తులసమ్మగారు** ది. **9.6.2011**న పరమపదం చేరినారు. వీరు సీతానగరం ఆశ్రమం ప్రారంభించిన దగ్గర నుండి శ్రీశ్రీశ్రీ స్వామివారు నిర్వహించిన అనేక కార్యక్రమములలో తమ వంతుగా విశేష సేవలందించారు. వీరికి పరమాత్మ పద సన్నిధిలో శాశ్వత కైంకర్య లభించాలని శ్రీస్వామివారు మంగళా శాసనము చేశారు.



హైదరాబాద్ వాస్తవ్యులు శ్రీస్వామివారి శిష్యులు డా॥ **మొగిలి చెన్నారెడ్డి** గారు ది. **15.5.2011** న పరమదం చేరినారు. వీరికి పరమాత్మ పదసన్నిధిలో శాశ్వత కైంకర్యం లభించాలని శ్రీస్వామి వారు మంగళాశాసనం కృప చేశారు.



నల్గొండ జిల్లా, సూర్యాపేట వాస్తవ్యురాలు శ్రీమతి **గోనా శ్రీలక్ష్మి**గారు **17.4.2011** న ఆకస్మికంగా పరమ పదం చేరినారు. వీరికి పరమాత్మ పదసన్నిధిలో శాశ్వత కైంకర్యం లభించాలని శ్రీస్వామివారు మంగళా శాసనము చేశారు.



కరీంనగర్ జిల్లా, పెద్దపల్లి వాస్తవ్యురాలు **శ్రీమతి భోజనపల్లి యమున**గారి ది.**1-6-2011** సంవత్సరీకం సందర్భంగా వీరి భర్త వేంకటేశ్వర స్వామిగారు భక్తినివేదనకు కైంకర్యం సమర్పించు కున్నారు.



గుంటూరు జిల్లా, చిన కాకాని వాస్తవ్యులు, శ్రీస్వామివారి శిష్యులు శ్రీమతి **వెంకట సుబ్బమ్మ** గారు ది. **27.3.2011**న పరమదం చేరినారు. వీరికి పరమాత్మ పదసన్నిధిలో శాశ్వత కైంకర్యం లభించాలని శ్రీస్వామివారు మంగళాశాసనం చేశారు.



హైదరాబాద్ వాస్తవ్యులు శ్రీమతి **శారదాకుమారి**గారి సంవత్సరీకం ది. **8.5.2011**న జరిగింది. ఈ సందర్భంగా వీరి కుటుంబ సభ్యులు భక్తినివేదనకు కైంకర్యం సమర్పించుకున్నారు.



కృష్ణా జిల్లా, కానూరు వాస్తవ్యులు శ్రీమాన్ **కూనపరెడ్డి శేషగిరిరావు రామానుజదాస**గారు **27.7.2011** న జరుగు సంవత్సరీక సందర్భంగా వీరి కుటుంబసభ్యులు భక్తినివేదనకు కైంకర్యము సమర్పించారు.



నెల్లూరు వాస్తవ్యులు **శ్రీమాన్ మునగా వెంకట శేషయ్యగారు** సంవత్సరీకం ఆగస్టు 21వ తేదీ సందర్భంగా వీరి కుమారులు భక్తినివేదనకు కైంకర్యం సమర్పించారు.

# మెదడుకి మేత!

భగవద్బంధువులారా! జిజ్ఞాసతో మీరంతా చదువుతూ ఆదరిస్తున్న 'భక్తినివేదన'లో మీకోసం ఈ శీర్షిక! **ఈ పత్రిక లోని వ్యాసాలనుండే మీకు ప్రశ్నలిస్తున్నాం!** అయినా మరొక్కసారి జ్ఞాపకం చేసుకోవడం మనస్సుకి ఆనందమని మెదడుకీ చిన్నమేత! అన్నీ సరిగా వ్రాస్తే ఆకర్షణీయ బహుమతులు! ప్రతినెల 20వ తేదీలోపు మాకందిన సమాధానాలని మాత్రమే పరిశీలిస్తాం! ఆ పై దాటివచ్చినవి పరిశీలింపబడవు. దీనిపై ఎలాంటి ఉత్తర ప్రత్యుత్తరాలు ఉండవు. శ్రద్ధతో మీరు పంపిన గత నెల సమాధానాలందాయి. విజేతల పేర్లు క్రింద ప్రకటించాము. బహుమతులు పంపిస్తాం!

| ప్రశ్నలు | సమాధానాలు |
|---|---|
| 1. భగవదారాధనబుద్ధితో చేసే ప్రతి ప్రవృత్తి -------- | |
| 2. గీతలో రెండవ అధ్యాయ పారాయణ వలన -------- కలుగుతుంది | |
| 3. గురుపూర్ణిమకి మరోపేరు ---- | |
| 4. 'భవ'మంటే ---------- | |
| 5. రామాయణానికి కారణమైన పక్షులు --------- | |
| 6. భగవంతుడు నిర్గుణుడే ఎలా? | |
| 7. విష్ణుచిత్తులకి నారాయణుడీ రూపంలో ప్రేరకుడైనాడు ---- | |
| 8. యజ్ఞం వల్ల పాపనాశనమే కాకుండా ------ లభిస్తుంది | |
| 9. కేవలవ్యక్తిగతలాభాన్ని సుఖశాంతులను కాంక్షించేవారు --- | |
| 10. కైవల్యమిక్కడుంటుంది -------- | |
| 11. ఋషుల పరిశోధనల్లో దీనికే ప్రాధాన్యం -------- | |
| 12. 'గురు' పదసార్థక్యం -------- యందేనని పూర్వాచార్య నిర్ణయం | |
| 13. అజ్ఞానాన్ని------గా పిలుస్తారు. | |
| 14. ముదల్ తిరువందాది పాడినది ---- | |
| 15. ఒకే పేరుగల తల్లిదండ్రులు కల వ్యక్తి (లేదా) సర్పయాగాన్ని నిలిపిన మహనీయుడు | |
| 16. మత్తేభవృత్తంలో ఉండే గణాలు------- | |
| 17. వేదవతి పేరు వెనుక కారణం (లేదా) వేదపఠన సమయంలో ఆవిర్భవించినామె | |
| 18. పెరియతిరుమొழி1-7వదశకంలో ఆళ్వార్లు కీర్తించిన క్షేత్రం | |
| 19. భగవంతుని నిశ్శ్వాసోచ్ఛ్వాసాలు ------- సంకేతాలు. | |
| 20. సకలవేదాలకి ప్రకృతిస్వరూపమైనది --------- | |
| 21. వసుధైవకుటుంబక మనే దేశీయులు ------ | |
| 22. పూదత్తాళ్వార్ అవతారస్థలం ---- | |
| 23. శ్రీపాంచరాత్రం -------- సంహితలుగ విస్తరించింది. | |
| 24. 'సాంఖ్య'మనగా ------- | |
| 25. పక్షి ఆచార్యస్వరూపమైతే, రెక్కలు -----------. | |

**గమనిక:** గతనెల పత్రికలో 21 ప్రశ్నలకు సరైన సమాధానము వ్రాసిన వారిని పరిగణలోకి తీసుకున్నాము.

**గత నెల విజేతలు:** డా॥ ఎ. రామచంద్రారెడ్డి-వరంగల్, కె. రాగిణి మకరంద-అనంతపురం.

**సూచన:** సమాధానాలు ఈ పత్రంలోనే నింపి, 20వ తేదీలోపు అందేట్టు పంపగలరు.

**భక్తినివేదన** శ్రీరాంనగరం, ముచ్చింతల్, పాలమాకుల పోస్ట్ 509 325 శంషాబాద్, రంగారెడ్డి జిల్లా. ఆంధ్రప్రదేశ్.

శ్రీమతే నారాయణాయ నమః

శ్రీమతే రామానుజాయ నమః



64 సం॥ల నుండి అశేష భగవద్బంధువులు ఆదరిస్తున్న...

ఆధ్యాత్మికమాసపత్రిక

# భక్తినివేదన



శ్రీఖరనామ సంవత్సర భాద్రపదమాసం


సంపుటి 64 సెప్టెంబర్

సంచిక 6 2011


## పండుగలు

సెప్టెంబరు :

- 5. తిథిద్వయం
- 8. సర్వేషామేకాదశి, వామన జయంతి
- 10. శని త్రయోదశి
- 11. అనంత పద్మనాభ వ్రతం
- 12. పాడ్యమి తిథి, మహాలయ పక్షారంభము
- 13. శూన్యతిథి
- 14. ఉత్తర కార్తె
- 17. కన్యా సంక్రమణము, భరణీ మహాలయము
- 23. సర్వేషామేకాదశి
- 24. యతులకు మహాలయము
- 25. మాసశివరాత్రి
- 27. మహాలయమావాస్య, పింతపితృయజ్ఞము విశ్వకర్మ జయంతి, కుశగ్రహణం

అక్టోబరు :

- 28. తిథి ద్వయం, శరన్నవరాత్రారంభం తిరుమల శ్రీవారి బ్రహ్మోత్సవారంభం, హస్తకార్తె
- 4. సరస్వతీపూజ, దుర్గాష్టమి
- 5. మహర్నవమి
- 6. విజయదశమి
- 7. తిరువేంగడత్తాన్ తిరు ॥ శ్రీవారి చక్రస్నానం వేదాంత దేశికర్ తిరు॥ సర్వేషాం ఏకాదశి

వ్యవస్థాపకులు

పరమహంస పరివ్రాజకాచార్య

శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ

రామానుజ జీయరుస్వామివారు

సంపాదకులు

శ్రీఉ.వే.శ్రీమాన్ T.P. శ్రీరామచంద్రాచార్యులు

## విషయ సూచిక




Printed & Published by H.H. Tridandi Chinna Srimannarayana Ramanuja Jeeyar Swamiji on behalf of **Jeeyar Educational Trust** and Printed at **Sriman Printers & Processors** C/o JET, Sitanagaram-522 501, Guntur Dist., Andhrapradesh. **Published at** C/o JET, Sitanagaram-522 501 Guntur Dist, Andhrapradesh, Editor: Sri **T.P.Sriramachandracharya** S/o. Sri Sitaramacharyulu, No: 5-74, Ayodhya, Visakhapatnam- Andhra Pradesh.


చందావివరాలు :- సంవత్సరచందా రూ.225/-

విదేశాలకు సంవత్సరచందా $30/-


D.T.P. & Design by : పరిశోధనాలయమ్,

ముద్రణ : శ్రీమాన్ ప్రింటర్స్ & ప్రాసెసర్స్, సీతానగరం



మీ సేవలో....

భక్తినివేదన, సీతానగరం - 522 501,

గుంటూరు జిల్లా, ఆంధ్రప్రదేశ్. 08645 272929.

E-mail : **jetsitanagaram@yahoo.com**

Internet : www.chinnajeeyar.org




*ముఖచిత్ర వివరము:*

**వామన జయన్తి భాద్రపద శుక్ల ద్వాదశి- (8.9.2011)**

అదితి కశ్యపులకు పుట్టాడు. అప్పడే పెరిగాడు. దేవతల బాధలు తీరేట్టు బలి తలకొలిచి, లోకాలన్నీ తనవని తెలిపాడు, 3 అడుగులలో. శ్రవణానక్షత్రాన పుట్టి మాతృహృదయాన్ని రంజింప చేశాడు. బ్రహ్మ కడిగిన పాదతీర్థం అలకనందగ, ఆకాశగంగగ బదరీనాథ్ ద్వారా పాతి లోకాలను పావనం చేస్తోంది. ఆతడే బదరీనాథ్‌లో నరనారాయణులయ్యారు. తమ తల్లి మాతామూర్తిని చేరి అవతరించిన బాలలీలలను అనుభవిస్తారు.

బదరీలో ఉత్సవవర్లు బయటకొచ్చేది ఈ ఒక్కరోజే.

# శ్రీశ్రీశ్రీ స్వామివారి సందేశం

"శోకః నాశయతే ధైర్యం శోకః నాశయతే శ్రుతమ్" అని అంటారు. మనిషి ఎంత ధీరుడైనా అతని బుద్ధిమత్త్వాన్ని శోకం నాశనం చేసేస్తుంది. "నాస్తి శోకః సమో రిపుః" అంటారు. శోకాన్ని మించిన శత్రువు ప్రపంచంలోనే లేదు.

మనిషి ధర్మాన్ని ఆచరిస్తున్నంత వరకూ ఏ దుఃఖమూ రాదు. ఆచరించడం కొంత కష్టం. కానీ, అర్థాన్ని ఆర్జించడంలో ఆశ పెరిగినప్పుడు మాత్రం రకరకాల దుఃఖాల్ని పొందవలసి వస్తుంది. 13వ శతాబ్దికి చెందిన వేదాంత దేశికులవారు వేదభాష్యాలు వ్రాసిన విద్యారణ్యులవారూ ఒకేచోట విద్యాభ్యాసం చేసిన సబ్రహ్మచారులు. దేశికులు బీదవారు. విద్యారణ్యులు మాత్రం విజయనగర సంస్థానంలో ఆస్థాన విద్వాంసులు. మిత్రుడి మీద అభిమానంతో ఆస్థానంలో ఒక పండితస్థానం ఇప్పిస్తా రమ్మంటారు. కానీ, వారు 'కేవలం ధనాన్ని కోరి క్షుద్రులైన ఈ పరిపాలకులను నేను ఆశ్రయించనే ఆశ్రయించను' అని సమాధానం పంపిస్తారు.

మనిషి తాను చేయవలసినది చేస్తూ, ధనాశకు బానిస కానంత వరకు లభించదగినదేదో లభిస్తూనే ఉంటుంది. అది కీర్తి కావచ్చు. పదవి కావచ్చు. వేరే ఏదైనా కావచ్చు. వాటిని కోరి తాను పరుగులు తీయకుండా ఉన్నంతవరకు మనిషి మంచిమార్గంలో ప్రవర్తించ గల్గుతాడు. అతనిలో అది మానవత్వాన్ని పెంపొందిస్తుంది. మిగిలిన వారంతా అతనికి దాసులౌతారు. ధనం, కీర్తి, పదవి, ఇతర ప్రాపంచికమైన విషయాలన్నీ కూడా ఒక అందమైన ఆకర్షకమైన సీతాకోక చిలుకవంటివి, అని అంటారు. చూడ్డానికి పైపైన అందంగా ఉంటాయి. వాటిని పట్టుకోవాలనిపిస్తుంది. అవి తుప్పలపైనా తోటలలోనూ, ముళ్ళూ రాళ్ళపైనా హాయిగా ఎగురుతూ ఉంటాయి. అవి పైన తిరుగుతూ ఉంటాయి కనుక పట్టుకుందాం అంటే వానివైపు చూడాలి. వానిపైనే దృష్టిపెట్టడం వల్ల క్రింద చూడలేము. రాళ్ళు తగలవచ్చు. ముళ్ళు గుచ్చుకోవచ్చు. గోతులలో పడవచ్చు. మళ్ళీ లేవనే లేవలేకపోవచ్చు. ఎప్పుడు? వానిని కోరి వానివెంట మనం పరుగుపెడితే. అలాకాక మన తోటపని మనం చేసుకుంటూంటే మనమీదే అది వాలవచ్చు. మనకి సంతోషాన్ని కలిగించనూ వచ్చుకద!

ప్రాపంచికమైన విషయాలు అన్నీ అట్లాంటివే! మనిషి ప్రాపంచిక విషయాలను అనుభవించడం దోషం కాదు. అవి లభించడం దోషంకాదు. కాని అవే పరమార్థం అనుకుంటూ వాటి వెంటే పరుగులు పెట్టడం దోషం. ధనం, బంధువులు, వస్తువులు, విలాసాలు ఇలాంటివి ఎన్నో! ఎన్నెన్నో! కావాలి కావాలి అనిపిస్తుంది. వీటివల్ల మన ఇంద్రియాలు చేయదగినవాటిని మానేస్తున్నాయి. ఏపని తగదో ఆ మార్గంలో పయనిస్తున్నాయి. అందువల్ల మనకి శోకం, శోకం, శోకం.

మనిషికి లేనిదానివల్ల కాదు అసంతృప్తి. "లేదే!" అని అనుకోవడం వల్ల అసంతృప్తి. ఈ రోజులలో ఉన్నన్ని విలాసవంతమైన వస్తువులు ఇదివరకు లేకపోయినా మన పెద్దలకు ఇప్పటి మనలా శోకం కలగలేదు. అయితే ఆ రోజులలో కూడా విలాసవంతమైన వస్తువులు లేకపోలేదు. ఇది వరకు రోజులలో ఇండ్లలో పనిచేసే వ్యక్తులు ఉండేవారు. కర్మాగారాలలో పనిచేసే యజమానులూ, కార్మికులు ఉండేవారు. ఆ కార్మికులు వస్తువులు యజమానివి అని వాటిని సంరక్షించాలని చూసేవారు. తాము పొందవలసినవి తామూ పొందుతూ వీరూ సుఖంగా ఉండేవారు, వారూ సుఖంగా ఉండేవారు. కాని ఈ రోజులలో అలాంటి వస్తువులు తన ఒక్కనికే ఎందుకు ఉండకూడదు! దౌర్జన్యంగానైనా, దొంగతనం చేసైనా తానూ అలాంటివి పొందాలని చూస్తాడు మనిషి. మనిషిలో తృప్తి తగ్గింది, శోకం పెరిగింది, భావం మారింది. మనస్సు దుష్టమైంది. దానితో అశాంతి బయలుదేరింది లోకమంతా అల్లకల్లోలమౌతోంది.

పూర్వం కన్నా నేడు అందరూ ఎన్నో వసతులూ సుఖాలూ కలిగి ఉన్నా మరెన్నో రెట్లు సంపన్నులే! అయినా ప్రతి ఒక్కరికి ఏదో రకమైన అసంతృప్తి, ఆందోళన, శోకం. ఇవి తగ్గి మనిషి సుఖపడాలంటే "తరతి శోకం ఆత్మవిత్" అంటూ ఉపనిషత్తులు బోధించినట్లు ఆత్మతత్త్వాన్ని గుర్తించడం అవసరం. ఆత్మజ్ఞానంవల్ల సోదరభావం కలిగి పొరుగువాడితో కలిసి బ్రతకాలనే ఇంగితం కలుగుతుంది. స్పర్ధ తగ్గి సహకారం పెరుగుతుంది. ఆత్మవేత్తలు మాత్రమే శోకసాగరాన్ని దాటగలరు. ఆత్మతత్త్వాన్ని గుర్తించనంతవరకు ఏదో ఒక దాని వల్ల శోకం తప్పదు.



# య ఏవం వేద...

శ్రీమాన్ గుదిమెళ్ళ మురళీకృష్ణమాచార్యస్వామి-భద్రాచలం



*గత సంచిక తరువాయి...*

## వేదము స్వతఃప్రమాణము

లోకంలో తనవాదం యొక్క సత్యత్వాన్ని నిరూపించుకోవాలని అనుకునే ప్రతీవాడు ఏదో ఒక ప్రమాణాన్ని తప్పనిసరిగా ఆశ్రయిస్తాడు. ఆ ప్రమాణంకూడ మరొక ప్రమాణంచేత నిర్ధారించవలసిన అవసరం లేనిదైతేనే దానిని తన వాదానికి ఒక కొలబద్దగ స్వీకరిస్తాడు తప్ప అనవసరంగా 'అనవస్థ'ను తెచ్చిపెట్టుకోడు. 'అనవస్థ' అనేది ఒక దోషము. **"అపర్యవసితాప్రామాణిక ప్రవాహ ప్రసక్తిః అనవస్థా"**అంటుంది న్యాయపరిశుద్ధి అనే గ్రంథం. మనం చెప్పిన ప్రమాణాన్ని సమర్థించడానికి మరొక ప్రమాణం దానిని సమర్థించడానికి మరొక ప్రమాణం... ఇలా అసమర్థాలైన ప్రమాణాల ప్రవాహంలో కొట్టుకుని పోవడమే. అనవస్థాదోషము, ఇలాంటి దోషంలేని ప్రమాణంతోనే తనవాదాన్ని నిర్ధారించే ప్రయత్నం చేస్తూ ఉంటాడు. అది ఆస్తికవాదం కావచ్చు, లేదా నాస్తికవాదం కావచ్చు. వాదమేదయినా ఏదో ఒక ప్రమాణాన్ని ఆశ్రయించడం తప్పనిసరి.

ఈ ప్రమాణాలు కూడ చాలా ఉన్నాయి. ప్రత్యక్షం, అనుమానం, శబ్దం, ఉపమానం స్మృతి, ప్రత్యభిజ్ఞ, ఊహ, సంశయము, ప్రతిభ ఇలా ఎన్నో పేర్లతో మన పూర్వులు ప్రమాణాలను వ్యవహరించి ఉన్నారు. ఇన్ని ప్రమాణాలలో అనుమానం, శబ్దము ఈ రెండూ తప్ప తక్కినవన్నీ ప్రత్యక్షప్రమాణంలో అంతర్భవించిపోయేవే. వీటిలో అనుమానం కూడ ప్రత్యక్ష ప్రమాణాన్ని అనుసరించి ప్రవర్తించేదే అయినా దాని ఆవశ్యకతను బట్టి అనుమానాన్ని కూడ పెద్దలు ప్రత్యేక ప్రమాణంగా స్వీరించారు. ఏతావతా ప్రమాణాల పేర్లతో ఎన్ని ఉన్నా మూడింటిని మాత్రమే ప్రామాణికులైన పెద్దలందరూ ప్రధానంగా స్వీకరించారు. అవి వరుసగా ప్రత్యక్ష ప్రమాణము, అనుమాన ప్రమాణము, శబ్దప్రమాణము అనివ్యవహరించబడుతున్నాయి.

వీటిలో ప్రత్యక్షము అనేది మొదటిది. ప్రత్యక్షము అనగా ఇంద్రియగోచరము అని సామాన్యార్థము. 'అక్షం ప్రతి=ప్రత్యక్షం' అని దీనిని పెద్దలు నిర్వచించారు. అక్షం అంటే ఇంద్రియము. ఆ ఇంద్రియం తనకు ఎదురుగా ఉన్న తనకు సంబంధించిన విషయాన్ని ఉన్నది ఉన్నట్లుగా స్వీకరించడాన్ని ప్రత్యక్షము అని అంటారు.

ఒకొక్క ఇంద్రియం ఒక్కొక్క విషయాన్ని గ్రహిస్తుంది. దానికి అది ప్రత్యక్షం అన్నమాట. ఉదాహరణకు దృశ్యం అనేది కంటికి ప్రత్యక్షం. శబ్దం అనేది చెవికి ప్రత్యక్షం. కన్ను శబ్దాన్ని చూడలేదు. చెవి దృశ్యాన్ని వినలేదు. అంటే కంటికి శబ్దం ప్రత్యక్షం కాదు. చెవికి దృశ్యం ప్రత్యక్షం కాదన్నమాట. ఇదేవిధంగా రుచి- నాల్కకు, వాసన - ముక్కునకు, స్పర్శ- చర్మానికి ప్రత్యక్షాలు అవుతాయి. ఈ ఐదు ఇంద్రియాలు ఇలా ప్రత్యక్షజ్ఞానాన్ని కలిగిస్తున్నాయి కనుకనే వీటిని జ్ఞానేంద్రియాలు అని అంటారు. ఈ ఐదు ఇంద్రియాలు వాటివాటికి సంబంధించిన విషయాలను అనుభవించడం వలన కలిగేది ప్రత్యక్షజ్ఞానము. ఆ జ్ఞానము యథార్థమైనప్పుడే అది ప్రమాణంగా పరిణమిస్తుంది.

మనం ఏ ఇంద్రియంతో అయితే ప్రత్యక్షం చేసుకుంటున్నామో ఆ ఇంద్రియం స్వస్థతగా ఉండాలి. దానికి ఏరకమైన రోగం వచ్చినా కలిగే జ్ఞానంలో తేడా పాడాలుండవచ్చును. కంటికి శుక్లం వస్తే దృశ్యం సరిగ్గా కనిపించక మరోలా అనిపించవచ్చును. చెవిలోని కర్ణభేరికి చిల్లుపడితే శబ్దం తారుమారుగా వినిపించవచ్చును. నాల్కపై గ్రంథులు నశించిపోతే రుచి తెలియక పోవచ్చును. ముక్కునకు జలుబు చేస్తే సువాసనకాస్తా దుర్వాసన కావచ్చు. ఈవిధంగా ఇంద్రియం ఒక్కొక్కసారి యథార్థజ్ఞానాన్ని కలిగించలేకపోవచ్చును. ఒక్కొక్కసారి వాటికి ఎదురుగా ఉన్న ఆ విషయంకూడా సంశయగ్రస్తంగా ఉంటే యథార్థజ్ఞానం కలుగడం కుదరదు. ఏతావతా వస్తువు సరిగ్గాలేక పోయినా యథార్థజ్ఞానం కలుగదు. దానిని గ్రహించే ఇంద్రియం సరిగ్గా లేకపోయినా యథార్థజ్ఞానం కలుగదు. అర్థాత్ ఇంద్రియం సరిగ్గా ఉండి, తన ఎదుట సరిగ్గా ఉన్న వస్తువును, సరిగా స్వీకరించగలిగితేనే అది యథార్థజ్ఞానం అవుతుంది. దానినే ప్రత్యక్షప్రమాణము అని అంటారు. 'సాక్షాత్కారి ప్రమాకరణం ప్రత్యక్షమ్' అనేది యతీంద్రమతదీపికాకారుని నిర్ణయము. దీనిలో 'సాక్షాత్కారి' అనేపదం అనుమాన - శబ్దప్రమాణములకంటే వైలక్షణ్యాన్ని

బోధిస్తోంది. ఆ రెండూ వస్తువులను సాక్షాత్తుగా దర్శింప చేయలేవు కదా!

'ప్రమా' అనే రెండవపదం దుష్టేంద్రియాది వ్యావృత్తిని కలిగిస్తుంది. అంటే ఇంద్రియ- వస్తుదోషాలులేని యథార్థజ్ఞానాన్ని బోధిస్తుంది. ఇలాంటి సాక్షాత్కారి ప్రమను (యథార్థజ్ఞానమును) కలిగించే సాధకతమమైన కరణమే.. ప్రత్యక్ష ప్రమాణముగా స్వీకరించబడుతుంది. దీనిలో ఇంకా చాలా విశేషాలున్నాయి. మనకు స్థూలంగా తెలిస్తేచాలు. ఈ ప్రత్యక్షం మాత్రమే ప్రమాణం. దీనిని ఒక్కదానినే ప్రమాణంగా స్వీకరిస్తారు చార్వాకులు. తమ ముత్తాత తమకంటికి ప్రత్యక్షం కాకపోయినా తాతకు తండ్రిగా ఆయనను నమ్మడం అనుమాన ప్రమాణమే.

ఆ ముత్తాతల సూక్తులను మననం చేసుకోవడం శబ్ద ప్రమాణమే. అస్తు. 'ప్రత్యక్షమేకే చార్వాకాః' అని ప్రసిద్ధులైన వారు కూడ ఈ ప్రత్యక్షంతోపాటు ఈ అనుమాన-శబ్దాలను కూడ అంగీకరించవలసినదే కదా!?

రెండవది అనుమాన ప్రమాణము. అనుమానం అంటే మన వ్యవహారంలోని 'సందేహం' కాదు. 'అనుసృత్య మానం అనుమానం' అని సామాన్య నిర్వచనము. అంటే అనుసరించి గుర్తించే విధానమన్నమాట. 'అనుసరించి' అనగానే దేనిని? అనే ప్రశ్న ఉదయించకమానదు. ప్రత్యక్షాన్ని అనేది సమాధానం. అంటే ప్రత్యక్షంగా కనిపించే ఒక పదార్థాన్ని అనుసరించి ప్రత్యక్షం కాని మరో దాన్ని ఊహించడాన్ని అనుమానము అని అంటారు.

ఒక కొండపై పొగను చూడగానే అక్కడ నిప్పు ఉన్నది అని గుర్తించడం లాంటిదన్నమాట. నిజానికి మనం పొగనే చూచాము. నిప్పును చూడలేదు. కానీ 'పొగను అనుసరించి నిప్పు ఉన్నదని ఖచ్చితంగా చెప్పగలుగుతున్నాము కదా! దీనినే అనుమాన ప్రమాణము అని అంటారు. 'వ్యాప్యస్య వ్యాప్యత్వానుసంధానాత్ వ్యాపక విశేష ప్రమితిః అనుమితిః, తత్కరణం అనుమానమ్' అని దీని నిర్వచనము.

ఇక్కడ వ్యాప్యము అంటే పొగ వ్యాపకము అంటే నిప్పు. వ్యాప్యత్వానుసంధానము అంటే పొగకు - నిప్పునకు ఉండే అవినాభావ సంబంధము. పొగ ఉన్నచోట నిప్పు ఉండి తీరుతుంది. అనేది అనుభవసిద్ధమైన విషయము. ఈ పొగ-నిప్పులయొక్క సంబంధాన్ని మనం వంటశాలలో, యాగశాలలోనో చూశాము. గతంలో అనుభవించిన ఈ విషయాన్ని అనుసంధానం చేయడంతో మనం చూడకపోయినా నిప్పును నిర్ధారించుకుంటున్నాము. ఈ విధంగా గుర్తించగలిగేవి అన్నీ అనుమాన ప్రమాణానికి చెందినవే.

మూడవది శబ్ద ప్రమాణము. శబ్దము అంటే కేవలం సద్దుకాదు. అది ధ్వని మాత్రమే అయితే ప్రమాణమెలా అవుతుంది. శబ్దము అంటే అర్థస్ఫోరకమైన పదప్రయోగము. అర్థవంతమైన మాటే శబ్దము అని తాత్పర్యము. అలా ఎవడు ఏది మాట్లాడినా అదంతా శబ్దమే. కానీ అన్ని శబ్దాలూ యథార్థజ్ఞానాన్ని కలిగించేవని అనలేము కదా! అందుచేత యథార్థజ్ఞానాన్నిచ్చే శబ్దాలే ప్రమాణములుగ స్వీకరిస్తారు. అలాంటి శబ్దాలేవి? ఆప్తులు పలికిన పలుకులు. 'ఆప్తవాక్యం ప్రమాణం' అని ఆప్తుడైన వానిమాటే ప్రమాణమనదగిన శబ్దము అని నిర్ణయం చేసారు.

ఆప్తుడు అంటే ఎవరు? యథార్థాన్నిపలికి, హితాన్ని బోధించేవారు అని వ్యవహారసిద్ధమైన అర్థాన్ని చెప్తే శ్రీరామునికి వసిష్ఠుడు ఆప్తుడైనట్లే హిరణ్యకశిపునికి చండామార్కులూ ఆప్తులౌతారు. ధర్మజునికి శ్రీకృష్ణుడు ఆప్తుడైనట్లే దుర్యోధనునికి కర్ణుడూ ఆప్తుడే అవుతాడు. ఎవరి హితం వారిది కదా!?

సమస్యనుబట్టి తత్కాలానికి ఏది పరిష్కారమో అదే హితంగా భావించిన సందర్భాలున్నాయి కదా!? కాబట్టి ఆప్తుడు అనే మాటకు అంతే అర్థం కాదు. ఉన్నది ఉన్నట్లుగా చెప్పేవాడు ఆప్తుడు 'ఆప్తస్తు యథార్థవక్తా' అని నిర్వచనం చేశారు. ఏమాత్రం స్వార్థం లేకుండా ఎదుటివానికి అది ఇష్టమైనా, అనిష్టమైనా సరే ఉన్న విషయాన్ని ఉన్నట్లుగా హితకాముడై బోధించే సత్యవచనుడే ఆప్తుడు అని పెద్దలు వివరించారు. అలాంటివాడు చెప్పిన మాటనే ప్రమాణంగా స్వీకరించడం జరుగుతుంది.

ఎక్కడో సుదూరదేశంలో ఉండి తన తండ్రియొక్క యోగక్షేమాలకోసం ఆందోళన పడుతున్న ఒక వ్యక్తికి ఇలాంటి ఒక ఆప్తుడు 'పితాతే సుఖమాస్తే' నీ తండ్రి క్షేమంగానే ఉన్నాడు అని చెప్పగానే ఆ మాటమీది విశ్వాసంతో అతడు అమితానందాన్ని పొందుతాడు. ఆ కుమారుడు తన తండ్రియొక్క సుఖవర్తనాన్ని ప్రత్యక్షంగా చూడలేదు. అనుమానంతో తెలుసుకునే అవకాశమూ లేదు. కేవలం ఆప్తవాక్యమైన శబ్దమే అతనికి ప్రత్యక్షానందాన్ని కలిగించింది... ఇది శబ్దప్రమాణము. శబ్దప్రమాణం యొక్క ఆవశ్యకతను, దాని నిత్యత్వాన్ని గురించి మన పూర్వులైన మహర్షులు అద్భుతమైన రీతిలో ప్రవచించారు. శబ్దప్రమాణము అంటే ప్రధానంగా వేదమే అని నిర్ధారించారు. అదే నిజమైతే వేదం అపౌరుషేయం ఎలా అవుతుంది? ఈ సందేహాలకు సమాధానాలను వచ్చే సంచికలో తెలుసుకునే ప్రయత్నం చేద్దాం! *(ఇంకా ఉంది)*



# పిబత భాగవతం రసం... వివిధావతార ప్రశంసనమ్

శాస్త్రరత్నాకర, శాస్త్రవిద్వన్మణి డా॥ఉ.వే సముద్రాల వేంకట రంగరామానుజాచార్యస్వామివారు
డైరెక్టర్ - అకెడమిక్ కౌన్సిల్ 'జీవ' శ్రీరాంనగర్ (శంషాబాద్)

*జులై సంచిక తరువాయి...*

## (భగవదవతార రహస్యం-తృతీయాధ్యాయం-స్కం-1)

భగవదవతార వర్ణనం అయిన తరువాత, శ్రీమద్భాగవతం అవతార రహస్యాన్ని తెలిపింది. భగవదవతార రహస్యజ్ఞానం భగవత్ప్రాప్తికి ఉపాయం అని మన ఆచార్యులు పేర్కొన్నారు. శ్రీ గీతలో "జన్మ, కర్మ. ఈ రెండూ, దివ్యాలు. ఇవి ఇలాంటివని ఎఱిగినవారు నన్ను పొంది ఇంక మరల జన్మించరు" అని అంటాడు భగవంతుడు.

**జన్మ కర్మచ మే దివ్యం ఏవం యోవేత్తి తత్త్వతః ।**
**త్యక్త్వాదేహం పునర్జన్మ నైతి మామేతి సోఽ ర్జున ॥** అని.

ఇక్కడ శ్రీ భాగవతం కూడా ఈ అభిప్రాయాన్నే వ్యక్తపరచింది.

**జన్మగుహ్యం భగవతో య ఏతత్ ప్రయతో నరః ।**
**సాయం ప్రాతర్ గృణన్ భక్త్యా దుఃఖగ్రామా ద్విముచ్యతే ॥**

పరమరహస్యమైన భగవజ్జన్మను ఏకాగ్రమనస్కుడై మానవుడు సాయం, ప్రాతఃకాలాల్లో అంటే, సహజంగా మనస్సు అకలుషమై ప్రశాన్తంగా ఉండే సమయాల్లో కీర్తిస్తే, ఆ కీర్తించడం కూడా ప్రీతి పురస్సరంగా చేసినప్పుడు సకల సాంసారికదుఃఖాన్ని దూరం చేస్తుందని భాగవత తాత్పర్యం.

**యత్ర త్రిసర్గోమృషా** అని జన్మాదిశ్లోకంలో భాగవతం స్పష్టపరచింది. **త్రిసర్గ** అంటే త్రిగుణాత్మక దేహావయవాది సృష్టి, పరమాత్మయందు వాస్తవం కాదు. అంటే పరమాత్మ భూమిపై అవతరించి మనుష్య సజాతీయ దేహసంస్థానం కలిగి ఉన్నా ఇది ప్రాకృతికం కాదని తాత్పర్యం. దీన్ని **'ఏతద్రూపం' 'యథా నభసి'** అనే శ్లోకాలతో చెప్పి, ఇప్పుడు ఇలా తన దివ్య ప్రకృతితో ఆవిర్భవించే స్వామి **జీవుని** కంటే భిన్నుడని **అతఃపరం** అనే శ్లోకంలో చెబుతున్నది భాగవతం. పరమాత్మకు ఉండే స్వరూపం అతి సూక్ష్మమైనది, మనకు ఉండే కరచరణాది కాయవ్యూహము, దానికి సంబంధించిన ప్రాకృతిక గుణాలు కలది కాదు. భగవంతుని ఈ సూక్ష్మరూపం మనం నిత్యం చూచే వస్తువు వంటిదికాదు. అలానే మనం వినే వస్తువు వంటిదీ కాదు.

ఇక, జీవుడు పరమాత్మ కంటే ఎలాంటి భేదం కలిగి ఉన్నాడు? అన్న ప్రశ్నకు సమాధానంగా **సజీవో యత్ పునర్భవః**జీవుడు పూర్వపూర్వ కర్మానుగుణంగా మాటిమాటికి కాయ వ్యూహగుణాలతో కూడి పుడుతూ ఉంటాడు. దీన్ని బట్టి పరమాత్మ జన్మ దివ్యమని అప్రాకృతమని, జీవుడు మాత్రం కర్మమూలంగా దేహాలను ధరిస్తూ దేహ ధర్మాలతో కూడి ఉంటాడని ఈ ఇరువురికి ఇదే భేదమని స్పష్టపరచబడింది.

**అతఃపరం యదవ్యక్త మవ్యూఢగుణబృంహితమ్ ।**
**అదృష్టశ్రుతవస్తుత్వాత్, సజీవో యత్పునర్భవః ॥**

ఈ శ్లోకాన్ని పరమాత్మ కంటే జీవుడు స్వరూపస్వభావతః భిన్నుడని, జీవధర్మాలు పరమాత్మకు అవతార దశలో కూడా లేవని చెప్పడమే లక్ష్యంగా వ్యాఖ్యాతలు వివరించారు.

**అవ్యక్తమ్, అవ్యూఢగుణబృంహితమ్** ఇత్యాది విశేషణాలను జీవపరంగా కూడా వ్యాఖ్యానించవచ్చు. పరమాత్మ మనలాంటి ప్రాకృతమైన కర్మమూలదేహాన్ని ధరించాడని భావించడం అజ్ఞానమూలం. కనుక అది సర్వ సాక్షియైన పరమాత్మయందు ఆరోపితం అజ్ఞానకల్పితం అనవచ్చు. స్వసంకల్పం చేత, స్వామి స్వీకరించిన రూపమేననడం వస్తుతత్త్వం. ఇక జీవుని విషయం లోను కొంత సామ్యం ఉన్నా వైషమ్యము పూర్తిగ ఉంది. జీవుని స్వరూపం కూడా మన కంటికి గోచరించేది కాదు కనుక, అణుస్వభావం కనుక **అవ్యక్తం** అని చెప్పబడుతుంది. జీవునికి కర్మమూలంగా ఏర్పడే సురనరతిర్యక్ స్థావరాది రూపాలు కూడా స్వాభావికాలు కావు. కనుక, స్వరూపతః జీవునిది **వ్యూఢగుణబృంహిత** మైన దేహం కాదు. అంటే ప్రాకృతిక కాయ సంబంధ సత్త్వాది గుణపరివృద్ధమైన దేహాలు సహజంగా లేవు. మరి ఎలా వచ్చాయి? కర్మ మూలంగా ఏర్పడిన ప్రకృతి సంసర్గం వల్లనే. ఎప్పుడైతే ప్రకృతి సంసర్గం తొలగిపోతుందో, అప్పుడు గుణాష్టకావిర్భావం కలిగి, అంటే పరమాత్మకు ఎప్పుడూ ఉండే **"సత్యకామత్వం, సత్యసంకల్పత్వం"** మొదలైన ఎనిమిది గుణాలతో స్వస్వరూపంతో **'అభినిష్పత్తి'** కలుగుతుందని ఉపనిషత్తులు చెప్పాయి. కనుక, జీవస్వరూపం కూడా **'అవ్యక్తము' 'అవ్యూఢ గుణబృంహితము'** అలాగే ప్రాకృతిక వస్తువుల్లా కనిపించేది, వినిపించేది కాదు కనుక **'అదృష్టాశ్రుత వస్తువు'.** అయితే జీవ-బ్రహ్మభేదం ఏమిటి.? **'సజీవో యత్పునర్భవః'** ఈ కర్మ అనాది కనుక, కర్మసంబంధమూలంగా జన్మ పరంపర తప్పదు. కాని స్వామికి కర్మ, కర్మఫలాలు అంటవు. కనుక ఆయన పుట్టుక **దివ్యం** 'ఆయన **కర్మ** కూడా దివ్యమేనని శ్రీ గీత చెబుతున్నది.

అయితే ఈ జీవునికి ఏర్పడే వ్యక్తమైన స్థూలదేహాదులు, సూక్ష్మమైన **లింగదేహాదులు** తొలగే మార్గం లేదా? అంటే ఉంది. కేవలం **వేదన**రూపమైన ఉపాసన చేతనే ఇవి తొలగిపోతాయి. అప్పుడు అంటే, స్థూల సూక్ష్మదేహాలు తొలగిపోతే, అదే **బ్రహ్మదర్శనం** అంటుంది భాగవతం.

**యత్రేమే సదసద్రూపే ప్రతిషిద్ధే స్వసంవిదా ।**
**అవిద్యయాఽఽత్మని కృతే ఇతి, తద్బ్రహ్మదర్శనమ్ ॥**

**అవిద్య** అంటే విద్యాభిన్నమైన కర్మయే. **అవిద్యా కర్మ సంజ్ఞాన్యా యయా ముహ్యన్తి జన్తవః** అంటుంది విష్ణుపురాణం. ఈ కర్మాత్మకమైన అవిద్య చేత **యత్ర ఆత్మనికృతే** జీవునియందు కల్పింపబడ్డ, **సదసద్రూపే ఇమే** స్థూల–సూక్ష్మదేహాలు **స్వసంవిదా** తన ఉపాసనా బలం చేత, **ప్రతిషిద్ధౌ–** తొలగింప బడగా, **తద్బ్రహ్మదర్శనమ్ ఇతి** అదే బ్రహ్మ దర్శనం అని చెప్పబడుతుంది. ఇలా తొలగటం అంటే మాయ **(ప్రకృతి)** తొలగటమే! ఆ దశలో స్వస్వరూపావిర్భావాన్ని పొందడం ఏర్పడుతుందంటుంది పురాణం.

**"యద్యేషోపరతా దేవీ మాయా, వైశారదీ మతిః ।**
**సంపన్న ఏవేతి విదుః మహిమ్నిస్వే మహీయతే ॥**

**'యది'–** ఒక వేళ ఉపాసనాబలం చేత, **ఏషా దేవీ మాయా** మాయ అని పేరుగల ఈ త్రిగుణాత్మక ప్రకృతి **ఉపరతా** తొలగిందో (అప్పుడు), **వైశారదీ మతిః** అపరిచ్ఛిన్నమైన అనగా అసంకుచితమైన విజ్ఞానం ఆవిర్భవిస్తుంది.(వైశారదీ మతిః అనే రెంటిని కొందరు మాయకు అన్వయించారు. అప్పుడు– మహదాది వివిధతత్త్వరూపంగా విస్తరించిన **"మాయ"** తొలగిందో అని అన్వయం. అయితే, **వైశారదీ మతిః** అనే దానికి అసంకుచితజ్ఞానం అని చెప్పడమే సముచితం) అప్పుడు **'సంపన్న ఏవేతివిదుః'** గుణాష్టకావిర్భావ పురస్సరం, స్వస్వరూప సంపత్తిని పొందాడని అభిప్రాయం. దాన్నే **'స్వమహిమ్ని మహీయతే'** తన పూర్వసిద్ధమైన పరమాత్మతో సమానమైన భోగప్రతిష్ఠ కలుగుతుందని తాత్పర్యం.

ఈ విధంగా జీవుని జన్మకర్మల కంటే, పరమాత్మ జన్మకర్మలు విలక్షణాలని కేవలం క్రాంతదర్శనులైన ఋషులు (కవులు) మాత్రమే దర్శింపగలరంటుంది పురాణం.

**ఏవం జన్మాని కర్మాణి హ్యకర్తు రజనస్యచ ।**
**వర్ణయన్తిస్మ కవయో వేదగుహ్యాని హృత్పతేః ॥**

ఇలా, సహజంగా కర్తృత్వం, పుట్టుక, ఎంత మాత్రం లేని, హృదయాధినాథుడైన స్వామి యొక్క జన్మకర్మలను, వాటి తత్త్వమెరిగి, జన్మకర్మ రహస్యాలను కవులు (ఋషులు) మాత్రమే వర్ణిస్తారు, అని ఇంత వరకు స్వామియొక్క అవతారరహస్యాన్ని శ్రీ భాగవతం నిరూపించింది.

**పరమాత్మ వైభవం**

భాగవతం ఇప్పుడు కొన్ని శ్లోకాల్లో స్వామియొక్క వైభవాన్ని విశదపరుస్తున్నది.

**సవా ఇదం విశ్వ మమోఘలీలః**
**సృజ త్యవతి, అత్తి, న సజ్జతేఽస్మిన్ ।**
**భూతేషు చాన్తర్హిత ఆత్మతన్త్రః**
**షాడ్వర్గికం జిఘ్రతి షడ్గుణేశః ॥**

అప్రతిహత లీలలుకల స్వామి, ఈ సమస్త విశ్వాన్ని సృజిస్తాడు, రక్షిస్తాడు, చివరకు లయింపజేస్తాడు, అయినా, ఈ జగత్తుతో సంగాన్ని పెట్టుకోడు. అంటే దానియందు భోగ్యతా బుద్ధిని పెట్టుకోడు. సర్వభూతాలలో తాను అంతర్యామిగా లోపల ఉంటూ, సర్వాత్మలను నియమిస్తాడు. స్వతంత్రుడై ఉంటాడు. షడింద్రియవేద్యాలైన శబ్దస్పర్శాదులను భోగించినా, భోగబద్ధుడు కాడు. అంటే ఈ సమస్తాన్ని లీలావిభూతిగా చేసికొని **'లీలారసా'న్ని** అనుభవిస్తాడే తప్ప, జీవునిలా కర్మఫలభోక్తగా, దుఃఖమిశ్రితసుఖాన్ని భోగించడు. నిరంతరం– **జ్ఞానం–శక్తి–బలము–ఐశ్వర్యము– వీర్యము–తేజస్సు** అనే ఆరు గుణాలకు ఆశ్రయమై, ఆయా గుణాల వైభవాన్ని తన దివ్యచేష్టలచే నిరూపిస్తూ ఉంటాడు.

**నచాస్య కశ్చిత్ నిపుణేన ధాతు రవైతి జంతుఃకుమనీష ఊతీః ।**
**నామాని రూపాణి మనోవచోభిః సంచిన్వతో నటచర్యామివాజ్ఞః ॥**

జగద్విధాత అయిన స్వామియొక్క లీలలోని రహస్యాన్ని దుర్బుద్ధులైన వారు, ఎంతగా ప్రయత్నించినా తెలిసికోలేరు. దీని కారణం ఏమిటి? స్వామి, తన చేష్టలన్నింటిని నటచేష్టలవలెనే ప్రవర్తింపజేస్తాడు. నటుడు తానొక్కడే వివిధ వేషాలతో, వివిధ చేష్టలతో ప్రేక్షకులను ఎలా అబ్బురపరుస్తాడో అలాగే స్వామికూడా, అసంఖ్యాక నామరూపాలతో ఆశ్చర్యకర చేష్టితాలతో మనలను వ్యామోహపరుస్తాడు. ఆశ్చర్యంలో ముంచుతాడు. కనుక ఆతని చేష్టలను గతులను దుర్బుద్ధి అయినవాడు, తన తర్కాదికౌశలం చేత ఎంతగా విచారించినా ఎరుగజాలడు. ఇక ఎవ్వరికీ ఆయన చేష్టలు తెలియవా? అంటే తెలుస్తాయి. ఎవరికి? ఎవ్వరు, ఎంత మాత్రం కపటం, వంచన లేని **(అమాయయా),** అవిచ్ఛిన్నమైన **(సంతతయా),** కైంకర్యభావనా ప్రవృత్తితో **(అనువృత్త్యా),** పరమాత్మ పాదపంకజ పరిమళాన్ని **(తత్పాదసరోజగంధం),** సేవిస్తాడో **(భజేత),** ఆతడు మాత్రమే, సకల జగద్ధాత అయిన స్వామియొక్క స్థానాన్ని **(పదవీం),** తెలిసికొంటాడు **(సవేద).** ఆ స్వామి ఎలాంటివాడు? **'దురన్తవీర్యుడు'** అపారశౌర్యశాలి. **'రథాంగపాణి'–** చక్రధారి– అంతే కాదు పరుడు **(పరస్య)** ఇలాంటి స్వామియొక్క అవతారలీలారహస్యాన్ని ఎరగటం, లీలారసాన్ని అనుభవించడం కేవలం అవిచ్ఛిన్న స్మృతిసంతతిరూపమై కైంకర్యంగా పర్యవసించిన భక్తిచేత మాత్రమేనని, కుతర్కం చేత ఎంతమాత్రం కాదని భాగవతం నిష్కర్షిస్తున్నది. *(ఇంకా ఉంది)*



# కలివైరిసూరి వైభవము

గత సంచిక తరువాయి...

**శ్రీ ఉ.వే.శ్రీమాన్ కె. టి. రామానుజాచార్యస్వామి-నెల్లూరు**

**తిరుమంగై ఆళ్వార్- పెరియ తిరుమొழ்ழి 1-7-6**

పా॥ **ఎరిన్ద పైజ్ఞన్ ఇలజ్గు పేழ்వాయ్ ఎయిత్తోడు ఇదెవ్వురువెన్ఱు**
**ఇరిన్దు వానోర్ కలంగియోడ ఇరున్ద అమ్మానతిడమ్ ।**
**నెరిన్దవేయిన్ ముழைయుళ్ నిన్ఱు నీణెరివాయుழுవై**
**తిరిన్ద ఆనై చ్చువడుపార్కుం శింగవేழ்కున్ఱమే ॥**

**ప్రతిపదార్థము:** **ఎరిన్ద**=ప్రజ్వరిల్లుచున్న; **పైంగణ్**=పచ్చనికన్నులు; **ఇలంగు**=ప్రకాశించునటువంటి, **పేழ்వాయ్**=పెద్ద నోరు; **ఎయిత్తొడు**=కోరలతోకూడ; **ఇతు**=ఇది; **ఎవ్వురువెన్న**=ఏమిరూపమని; **వానోర్**=దేవతలు; **ఇరిన్దు**=చెదరి; **కలంగి**=కలతచెంది; **ఓడ**=పారిపోవునట్లుగా; **ఇరుంద**=వేంచేసియున్న; **అమ్మానతు**=స్వామియొక్క; **ఇడమ్**=స్థానము; **నెరిన్ద**=చేరియున్న; **వేయిన్ముழைయుళ్ నిన్ను**=వెదురుపొదలనుండి; **ఉழுవై**=పులులు; **నీణెరివాయ్**=విశాలమగు మార్గమందు; **తిరిన్ద**=తిరుగుచున్న; **ఆనై**=ఏనుగులయొక్క; **శువడు**=జాడను; **పార్కుమ్**=చూచుచున్నట్టి; **శింగవేழ்కున్నమే**=శింగవేழ்కున్న మనెడి దివ్యక్షేత్రము.

**తాత్పర్యము:** నిప్పులు గ్రక్కుచు పసుపురంగుగల కన్నులతో ప్రకాశించుచు, విశాలముగనున్న నోటిలోని కోరలతోను కూడిన శ్రీనరసింహుని రూపమును సందర్శించి, "ఇది ఎంత భయంకర రూప"మని దేవతలు తలచి భీతిల్లి, చెల్లాచెదరై, పరుగులు తీయునట్లు వేంచేసియున్న సర్వేశ్వరుని స్థానము అహోబిలక్షేత్రము. ఇచ్చట పులులు వెదురు పొదలలో పొంచియుండి పెద్దపెద్ద బాటలలో తిరుగు ఏనుగుల అడుగుజాడలను గమనించుచుండును.

**విశేషార్థము :** ఆ దినాలలో శ్రీనరసింహుని రూపమును జూచి కేవలము ఈ భూలోకవాసులేగాక దేవతలు కూడ భయపడిన విధమును తిరుమంగై ఆళ్వారులు ఈ పాశురమున వర్ణించు చున్నారు.

**ఎరిన్దఇత్యాది:** శ్రీనరసింహస్వామియొక్క నేత్రములు కోపాగ్నితో ప్రజ్వరిల్లుచు జాతిప్రయుక్తమగు పసిమిరంగు కలిగియున్నవి. సింహముయొక్క కనులు పచ్చగానుండుట లోకప్రసిద్ధమగు విషయము. అటువంటి కన్నులను, మిక్కిలి ప్రకాశమానముగనున్న నోటిని, ఆ నోటిలోని దంతముల కాంతిని జూచి "ఇదియేమి రూపము! అపూర్వ"మని దేవతలు భయపడి

**ఆర్వరవత్తైపణ్ణి:** తొట్రుపాటుతో కాళ్ళు తడబడగ చెల్లాచెదురై ఒకరు ప్రవేశించిన చోట వేరొకరు ప్రవేశించక పరువులిడిరి. దేవతలను ఆవిధముగ భయభ్రాంతులను జేసిన స్వామి వేంచేసి యున్న స్థలము **"శింగవేழ்కున్న"**మనెడి క్షేత్రము. దేవతలు శ్రీనరసింహుని రూపమును జూచి భయభ్రాంతులైన విధమును శ్రీకూరేశులు సుందరబాహుస్తవమున వర్ణించిన శ్లోకమిట అనుసంధింప తగియున్నది.

**"న వాయుః పస్పందేయయతురథ వాఽస్తం శశిరవీ**
**దిశోఽనశ్యన్ విశ్వాప్యచల దచలా సాచలకులా ।**
**నభశ్చ ప్రశ్చ్యోతి క్వథితమపి పాథో నరహరౌ**
**త్వయి స్తంభే శుమ్భద్వపుషి సతి హే సుందరభుజ ॥ 95**

*తా॥* ఓ సుందరములగు భుజములుగల స్వామీ! నీవు స్తంభమునందు ఆవిర్భవించి ప్రకాశించుచుండగ వాయుదేవుడు కదలలేదు. చంద్రసూర్యులు అస్తమించిరి. దిక్కులు అదృశ్యము లైనవి. పర్వతశ్రేణులతో కూడిన భూమికూడ కంపించిపోయినది. ఆకాశము దగ్ధమైనది. సముద్రములోని నీరు సలసలకాగినది.

**నెరిన్ద నిత్యాది :** ఒకదానిని వేరొకటి ఒరుసుకొనుచు దట్టముగనున్న వెదుళ్ళపొదల మార్గమునుండి పులులు విశాలముగనున్న ఆ అడవిబాటలో సంచరించుచున్న ఏనుగుల కుంభస్థలములను చీల్చి నెత్తురును పానము చేయుటకై వాని జాడలను గుర్తించుచుండును. అసురస్వభావము కలవారిని నశింపచేయుటకు శ్రీనరసింహస్వామి పొంచి ఉన్నట్లు ఏనుగులను చంపుటకై పులులు అచ్చట పొంచియుండును. *(ఇంకా ఉంది)*



# అహో! భారతమ్

శ్రీమతి డా॥టి.కె. చూడామణి-విజయవాడ

గత సంచిక తరువాయి...

## అమృతత్త్వసాధన-మృతసంజీవని

అద్భుతమైన భగవత్ సృష్టిలో ఈ మానవజన్మ అత్యంత దుర్లభమైన జన్మ. జనన మరణాల మధ్య సాగే ఈ జీవితం ఒక నాటకంలా రక్తిగా సాగుతుంది. జన్మ ఎత్తాము అంటే రెండవస్థితి అయిన మరణం కూడా పొంది తీరవలసినదే! దేహం పొందే జడత్వమే మృత్యువుయొక్క ఈ శాపం. మరణము అనేది లేకపోవడమే అమరత్వం. కాని అసలు జన్మే లేకుండా చేసికొనగలిగితే... అది మోక్షానందానుభవం.

మహాభారతం కర్మ, జ్ఞాన, భక్తి మార్గాలని చాలా అందంగా మేళవించి చూపించింది. ఏ ఉపాఖ్యానమైనా వీటిని చక్కగా నిర్దేశిస్తూ రసరమ్యంగా సాగడం భారతకథలలోని గొప్పదనం. అటువంటి కథలలో "మృతసంజీవని" అనే విద్యను, దాని గొప్పతనాన్ని చాటే కథను ఆస్వాదించడంలో ఉండే ఆనందం అనుభవైక వేద్యం.

వృషపర్వుడు అనే ఒక రాక్షసరాజు ఉండేవాడు. ఆయనకి శుక్రాచార్యుడు గురువు. దేవతలకి, రాక్షసులకీ జరిగే యుద్ధంలో రాక్షసులు మరణిస్తే... శుక్రాచార్యులు వారికెలాగైనా మేలు చేయాలని ఒక విద్యను వెలికి తెచ్చారు. ఏమిటా విద్య? మరణించిన వారిని తిరిగి బ్రతికించడమే! అందుకోసం చదివే మంత్ర విద్యపేరు "మృత సంజీవని". దీని శక్తితో, రాక్షసులెవరు మరణించినా వెంటనే వారిని బ్రతికింప చేసేవాడు శుక్రుడు.

మరి, దేవతలెవరికీ ఈ విద్య... ఈ మంత్రం గురించి తెలియదు. "ఆశ్చర్యం...! ఎంత గొప్ప విద్యను నేర్చాడీయన! అరె! మొదటిరోజు యుద్ధానికి వచ్చిన వారంతా... యుద్ధం ఎన్నాళ్ళు జరిగినా పాల్గొనడమే... ప్రాణనష్టమన్నదే లేదు. మరి మనమో"? తలలు బాదుకున్నారు దేవతలు.

కలవరం ఎక్కువైంది. "మనం కూడా ఆ విద్యను నేర్చేసు కుంటే... భలే ఉంటుంది. అయితే అదంత సులభంగా దొరికేదా ఏమిటి? ఆ శుక్రాచార్యులవారిని ప్రార్థిస్తే... అమ్మో... అంత ధైర్యం ఎక్కడ చేయగలం. దానికి సమర్థులైన వారెవరున్నారు...! ఎవరున్నారు? ఆ! మన ఆచార్యులు బృహస్పతి, ఆ బృహస్పతి కుమారుడు కచుడు. భలే గుర్తుకు వచ్చాడు... తండ్రిలాగే బుద్ధికుశలుడు. ఆయన్ని ప్రార్థిద్దాం."

వెంటనే పరుగులు తీశారు కచుడి దగ్గరికి... వారి హడావిడి చూస్తూనే ఏమిటని ప్రశ్నించాడు కచుడు. "నాయనా! జరుగుతున్న యుద్ధాలు, ఫలితాలు చూస్తున్నావుగా... రాక్షసాచార్యులయిన శుక్రులవద్ద మృత సంజీవని విద్య ఉంది. అది మనకి దొరికితే మనం కూడా అమరులమౌతాం. నువ్వు బాలుడివి. నియమవ్రత శీలుడివి. ఎలాగైనా శుక్రాచార్యులను మెప్పించి ఆయన దగ్గర ఉన్న మృత సంజీవనీ విద్యను నేర్చుకొని రా. గురువుల మనసు మెప్పిస్తే వారి దయతో కోరిన దానిని పొందడం తేలికగదా! ఇంకో విషయం ఏమిటంటే నీకు మరొక అవకాశం కూడా ఒకటుంది. అది... శుక్రాచార్యులవారికి 'దేవయాని' అనే పేరుగల కూతురుంది. ఆ కూతురంటే ఆయనకి చెప్పలేని మమకారం. కూతురు ఎలా చెప్తే అలా చేస్తాడాయన. నువ్వా... మంచి వయసులో ఉన్నావు. ముందుగా ఆ అమ్మాయి మనసు గెల్చుకో! సుముఖురాలిని చేసికో. గురుశుశ్రూషతో తండ్రిని, ప్రేమతో ఆయన కూతుర్ని గెలిచావనుకో... ఇంక నీకు అడ్డు ఉండదు. మృతసంజీవని విద్య దొరికినట్లే! నాయనా వెళ్ళు. కార్యాన్ని సాధించుకొనిరా" అని దీవించి పంపించారు.

దేవతల ప్రార్థన కాదనలేక, విద్యను నేర్చుకోవచ్చుననే ఆరాటాన్ని దిగమింగలేక బయలుదేరాడు కచుడు. వెళ్ళ వలసినది ఎక్కడికి? శత్రువుల ఆచార్యుని దగ్గరికి. తానా... దేవతల ఆచార్యుల పుత్రుడు. ఇది సాధ్యమేనా... ప్రయత్నిద్దాం. ప్రయత్నం చేయకుండా దేనినీ సాధించలేం గదా! వేగంగా సాగాడు కచుడు.

శుక్రాచార్యుల సన్నిధిలో నిలిచాడు. రాక్షసులు సేవిస్తూ ఉండగా, వేదాధ్యయన సంపన్నుడు, బ్రహ్మతేజస్సుతో వెలుగొందే శుక్రునికి సాష్టాంగ నమస్కారం చేశాడు. తానెవరో చెప్పాడు. అయ్యా! బృహస్పతి పుత్రుణ్ణి. నా పేరు కచుడు. మీకు శిష్యునిగా సేవలందించి విద్యలనభ్యసించాలని వచ్చాను అన్నాడు. ఒక్కసారి కచుని క్రిందనుండి పైవరకు చూశాడు శుక్రాచార్యులవారు.

ఆహా! బృహస్పతి అంతటి వాని పుత్రుడు నావద్ద శిష్యరికం చేయాలని రావడమా... ఎంత ఆశ్చర్యం... కచుడా ఇతని పేరు... ఎంత కాంతితో మెరిసిపోతోంది ఇతని ముఖం! ఆ సుకుమార గాత్ర శోభ ఎక్కడిదీ! ఆ మాటలలో వినయం, మాధుర్యం, మృదుత్వం మూటగట్టుకొని ఉన్నాయే! నియమనిష్ఠా గరిష్ఠుని జీవితం ఈతనిలో నాకు కనిపిస్తోంది. ఇటువంటి వాడు శిష్యునిగా లభిస్తాడా.. ఇతనిని ఆదరిస్తే ఆ బృహస్పతిని పూజించినట్లే అనిపిస్తుంది. ఆలోచనా స్రవంతికి ఆనకట్ట వేసి నవ్వుతూ ఆదరించాడు కచుణ్ణి. కొద్దిరోజులు ఆతనిని ఆతనికి తెలియకుండా పరీక్షించి కూడా తృప్తిచెందాడు. అరె! ఏమిటీ ఇతని ప్రవర్తన! ఏ పని చెప్పినా ఇప్పుడు కాదండీ! తరువాత అనే మాటే అనడే... అరె... అసలు విసుగు అంటే ఏమిటో తెలియదా! నవ్వుతూ సరేనంటాడు. నాకు సరే... మా అమ్మాయి దేవయాని ఏం చెప్పినాకూడా కాదు అనడే... మెత్తగా, తియ్యగా, చల్లగా, ప్రేమగా పలుకుతూ చేస్తాడు పనులన్నీ... ఆముఖం అంత ప్రశాంతంగా ఎలా

ఉంటుంది? అది భక్తివలనా! విద్య వలనా! ఏమో ఏమైనా ఇటువంటి వ్యక్తిని ఎప్పుడూ చూడలేదు. నా శిష్యులందరిలో ఉత్తముడు కచుడే..! మనసులో ముఖ్యస్థానంలో కూచోపెట్టేశాడు ఆ అబ్బాయిని.

ఇటు దేవయాని కూడా కచుని చూస్తూనే ఆతని రూప సౌందర్యానికి, ప్రసన్నతకి ముగ్ధురాలైపోయింది. నాన్నగారికి ఎంతో మంచి శిష్యుడు దొరికాడు. నాన్నైతే గురువుకాబట్టి తప్పదు సేవ అనుకోవచ్చు. గురుపుత్రికని కదా! నాకూ అంత గౌరవం ఇస్తాడే... ఇంతకు పూర్వం ఎందరిని చూశాను. మనస్సేమీ మార్పు చెందలేదు. కాని, ఇతణ్ణి చూస్తూ ఉంటే ఏదో తెలియని ఆనందం కలుగుతోంది. అతడి ప్రవర్తన కూడా ఆ ఆనందాన్ని రెట్టింపు చేసి ఆ అభిమానాన్ని ధృవీకరిస్తోంది. నిజంగా ఇటువంటివాడు దొరకడం అదృష్టం... ఇలా సాగుతున్నాయి దేవయాని ఆలోచనలు.

కొద్దిరోజులలోనే గురువుగారికి అత్యంత ప్రీతిపాత్రుడై పోయాడు కచుడు. ముఖ్యమైన పనులేవైనా అతనినే పిలిచి చెప్పడం, తరచుగా దగ్గర కూర్చో పెట్టుకొనడం... ప్రేమను, వాత్సల్యాన్ని ప్రకటించడం... ఇలా గడుస్తున్నాయి రోజులు.

ఇది చూచి భరించలేకపోయారు మిగిలిన శిష్యులు. మన గురువు గార్ని కచుడెంత మార్చేశాడు. ఇతడు రాకముందు అన్ని పనులు మనమే చేసేవాళ్ళం కదా! ఈమధ్య మనల్ని పిలవడమే లేదు గురువుగారు... ఇలా మొదలయ్యాయి మాటలు... నెమ్మదిగా మనసులో అసూయ మహావృక్షంలా పెరిగిపోయింది. ఏదో ఒకటి చేసి వీడి అడ్డు తొలగించుకోవాలి అనుకున్నారు.

ఒకనాడు హోమధేనువులను తీసికొని అడవికి వెళ్ళాడు కచుడు. పశువులు హాయిగా గడ్డిమేస్తూంటే ఒక్కడూ ఒకచోట కూర్చున్నాడు. సమయం కోసం ఎదురు చూస్తున్నారు రాక్షస విద్యార్థులు. అసూయ పడగలెత్తి కాటేయాలని సిద్ధపడింది. అంతే కచుణ్ణి చంపేశారు అంతా కలసి. మళ్ళీ అతడే ఉరిపోసుకున్నట్లు ఒకచెట్టుకి వ్రేలాడదీసి ఏమీ తెలియనట్లు ఇంటికి వచ్చేశారు. హోమధేనువులన్నీ రోజులాగే ఇంటిముఖం పట్టాయి. రోజూ కచునికోసం ఎదురుచూసే దేవయాని ఇవాళ అతడు రాలేదేమిటి? అని కంగారు పడింది. కాసేపు... మరి కాసేపు ఎదురు చూసింది. ఫలితం లేదు. వెంటనే తండ్రి దగ్గరికి పరుగు పెట్టింది.

నాన్నా...! సూర్యుడస్తమించాడు. ఆవులు అవే ఇంటికి వచ్చేశాయి. మీ నిత్యాగ్నిహోత్ర కార్యక్రమాలు కూడా అయిపోయాయి కదా! కచుడుమాత్రం రాలేదు నాన్నా! ఆ అడవిలో ఏ మృగాలో, రాక్షసులో, పాములో... ఏం చెయ్యలేదు కదా! అంటూ గొల్లుమంది. చూశాడు తండ్రి. ఒక్కసారి దివ్యదృష్టి ప్రసరింప చేశాడు.

అడవిలో చెట్టుకి వ్రేలాడుతూ కనిపించింది కచుని మృతదేహం. వెంటనే మృత సంజీవనీ మంత్రాన్ని ప్రయోగించాడు. వెంటనే బ్రతికాడు కచుడు. వెంటనే ఇంటికి వచ్చేశాడు. అమ్మయ్య అనుకున్నాడు శుక్రుడు. ఆహా...! బ్రతికాడు అని ఆనందించింది దేవయాని. ఇలా కొంతకాలం సాగింది. *(ఇంకా ఉంది)*




శ్రీమాన్ మధుసూదనాచార్యులు
ప్రధానాచార్య, ఆగమపాఠశాల, జగ్గయ్యపేట

# శ్రీపాంచరాత్రాగమము

*(గత సంచిక తరువాయి...)*

పంచసంఖ్యాకములైన పృథివ్యాధి భూతాలని, చక్షురాది ఇంద్రియాలని, ఆత్మకంటే వేరని గుర్తించి వాటినుండి ఆత్మ విడివడి తరించే మార్గంలో సాగాలనుకున్న వారిని "పంచరులు" అంటారని, వారినికాపాడే శాస్త్రం 'పాంచరాత్ర'మైందని గతంలో మనం చెప్పుకున్నాం.

ఇంద్రియములు తప్పుదారి పట్టకుండా చేయగల శాస్త్రం పాంచరాత్ర శాస్త్రం. ఇంద్రియాలు తప్పుదారి పట్టించే పద్ధతి మనకందరికీ అనుభవంలోనిదే అయినా దానిని ప్రస్తావించి, ఈ శాస్త్రం చూపే దిద్దుబాటు విధానాన్ని ముచ్చటించుకుంటున్నాం. ఉదాహరణకి కన్ను తానిష్టపడిన వాటిని 'మంచివి' అంటుంది. ఇష్టపడని వాటిని 'చెడ్డవి' అనేస్తుంది. ఇక ఈ సంచికలోకి వద్దాం...

ఇష్టపడని విషయాలనుండి అవి శాస్త్రము అంగీకరించినవే అయినప్పటికీ వెనుతిరగాలనుకుంటుంది. తద్వారా మనలో మంచి విషయాలపైనే జుగుప్స, ద్వేషములాంటి వాటిని కలిగించి మరి కొన్ని చెడు సంస్కారములను చేరుస్తుంది. ఇది ఒక్క కంటి గురించి. ఇదేరకమైన ప్రవృత్తి మిగిలిన నాలుగు జ్ఞానేంద్రియములకు ఆయా విషయాల గురించి ఏర్పడుతూ ఉంటుంది.

సామాన్యంగ ప్రాపంచిక ప్రాకృత విషయాలన్నీ మనకు హానికారకాలే అవుతాయి. అంటే, మనని వాటిలో మునిగేటట్లు చేసి భగవంతుడిని విస్మరింప చేస్తాయన్నమాట.

ఈ పాంచరాత్రశాస్త్రం ఇంద్రియాల ప్రవృత్తిని అరికట్టమనే చెప్పదు. ఇంద్రియాలను అన్నింటిని బాగా పనిచేయించమనే చెపుతుంది. వాటికి ఎదురయ్యే విషయాలన్నింటిని దోషరహితం చేస్తుంది. ఎలాగంటే, ఈ విషయములన్నింటిని భగవన్మయములుగా గుర్తింపచేస్తుంది. భగవంతుడు పర, వ్యూహ, విభవ, అర్చారూపాలలో ఉన్నాడని మనకు తెలియ చేయడంతో పాటు అంతర్యామిగ మనలో ఉండి మనలని తన శరీరంగ మార్చుకుంటాడు అని తెలుపుతుంది.

ప్రతిరోజు చేసే మానసయాగము, సాత్త్విక త్యాగం లాంటి సాధనల ద్వారా శరీరాన్ని, ఇంద్రియాలని భగవంతుడి వస్తువులుగా గుర్తించేట్టు ఈ శాస్త్రం బోధిస్తుంది. దానివల్ల మనలో అహంకార మమకారాలు తలెత్తకుండా అరికడుతుంది. ఆపై అర్చామూర్తియొక్క ఆరాధనకి ప్రాధాన్యాన్ని ఇవ్వడం ద్వారా మన చుట్టూఉండే ప్రపంచమంతా భగవన్మయమని నిరూపిస్తుంది ఈ శాస్త్రం.

అందుకే, అర్చామూర్తిని నిర్మించుకునేప్పుడు శిలను కానీ, దారువుని (కఱ్ఱ) కానీ, మృత్తికను కానీ, పటము (వస్త్రము)ను కానీ ఏ లోహాన్నైనా కానీ చివరికి ఒక కాగితాన్ని కానీ చిత్రపటాన్నికానీ ఉపయోగించి పూజా విగ్రహాన్ని తయారు చేసుకోవడానికి మార్గాలను తెలిపింది. దీనివల్ల, మనము చుట్టూ చూసే ఏ వస్తువులోంచైనా సర్వవ్యాపి అయిన భగవంతుడిని చేరవచ్చునని చెప్పినట్లయింది. అంతే కాకుండా, అర్చామూర్తికి చేసేసేవలో ఇంద్రియాలన్నింటికి అవసరమైన విషయాలనన్నింటిని వాడే విధానాన్ని తెలియచేసింది.

కంటికి ఇష్టమైన రంగులు, రూపాలు, కల వస్తువులను వాడుతూ, అలంకరణలు, ఆ అర్చామూర్తి దగ్గర ఎలా చేసుకోవాలో చెప్పింది. వాహనాలు, సేవలు మొదలైన వాటితో మన శరీరానికి పని చెప్పింది. చందన, పుష్ప, ధూపాదులతో మన ఘ్రాణేంద్రియానికి పని చెప్పింది. అద్భుతములైన ప్రసాదములతోటి వివిధ విచిత్రములైన స్తోత్ర పారాయణ, సంకీర్తన, భజన మొదలైన వాటితోటి నోటికి పని చెప్పింది.

ఇలా ప్రవృత్తి శీలములైన, అంటే, పని చేయడానికే అలవాటు పడ్డ శరీరానికీ, ఇంద్రియాలకీ వాటికి అలవాటైన, అవసరమైన, ఆకర్షకమైన విషయాలను ఇచ్చేటప్పుడు వాటన్నింటిని ప్రమాదరహితములుగ చేసి అవి మనకి హానికరములు కాకుండా ఉండేటట్లు తీర్చిదిద్ది, మనలో దైవీభావనను పెంచేటట్లు వాటిని మలచి, వాడుకునే విధానాన్ని తెలిపిన శాస్త్రం శ్రీపాంచరాత్రం.

ఇంతే కాకుండా, మన చుట్టూ ప్రకృతిలో ఉండే తరు, వృక్ష, గుల్మ, లతలని భగవత్సేవలో వినియోగింపచేసి ప్రకృతిని ఆరాధించే పద్ధతిని కూడా నేర్పింది ఈ శాస్త్రమే!

ఎలా? తులసీ, పుష్పములు, మామిడి తోరణాలు, సమిధలు, వేదికలు నిర్మాణము వాటికి చేసే అలంకరణలు ఇవన్నీ ప్రకృతిలోంచి లభించే వాటితోటే చేస్తాం. ఇలా వాటియందు మనకు ఒక దైవీభావాన్ని కలుగచేస్తోంది ఈ శాస్త్రం.

నిజానికి వేదవేదాంతాలన్నీ ఈ సిద్ధాంతాన్ని బహు ముఖంగా ప్రతిపాదించి, ప్రబోధించాయి కూడా. అయినప్పటికి ఆ శాస్త్రంలోకి అడుగుపెడితే బుద్ధిచంచలమై ఎన్నోరకాల వాదోపవాదాలకి దారి తీయడం, వాదనలతో అహంకారాన్ని, మొండితనాన్ని పెంచడం, చివరికి ఏమి ప్రారంభిస్తున్నామో, ఎక్కడికి తేలుతున్నామో తెలియని స్థితి ఏర్పడుతూ ఉండటం సహజంగా జరుగుతూ ఉంటుంది.

ఈ శ్రీ పాంచరాత్ర శాస్త్రానికి అలాంటి ఇబ్బందులు ఏమీ కలిగించకుండా కావలసిన వాటిని చక్కగా చెప్పగలిగినశక్తి ఉండటంచేత, ఇది భగవానుడే స్వయంగా ఉపదేశించడంవల్ల అసందిగ్ధంగా విషయాలను అందిస్తూ "పంచరులను", అంటే, బాగుపడగోరే మనుష్యులను **త్రాయతే** సులభంగా, నిర్దుష్టంగా, సత్ప్రవర్తన శీలురుగా తీర్చిదిద్ది కాపాడగలిగినది అని ఈ నిర్వచనం వల్ల తెలుస్తుంది. విశ్వామిత్ర సంహిత ఇచ్చినటువంటి ఈ నిర్వచనం ఇంత అర్థాన్ని తనలో ఇముడ్చుకొని ఉంది.

*****

కపింజల సంహిత 1వ అధ్యాయం 31వ శ్లోకంలో కూడా పై అర్థమే వచ్చేటట్లుగా మరోరకంగా నిర్వచిస్తూ తెలిపింది.

**శ్లో॥ అథ వక్ష్యామి విప్రేంద్ర పంచరాత్రార్థ ముత్తమం ।**
**పృథివ్యాదీని భూతాని గుణాః పంచ మహామతే! ॥31**
**రాత్రయో జంతవః ప్రోక్తాః సర్వశాస్త్రేషు నిశ్చితాః ।**
**తద్భోగాద్వినివృత్తిస్తు పాంచరాత్ర మితి స్మృతమ్ ॥32**

ఇక్కడ 'రాత్రి' శబ్దానికే 'జీవవర్గాన్ని' అంతటిని అర్థంగ చెప్పింది. అజ్ఞానమనే చీకట్లో బద్ధులై ఉన్నవారు ఈ జీవులు అని తాత్పర్యం. పంచభూతములు వాటికి చెందిన పంచ విషయముల యొక్క అనుభవం వల్ల ఏర్పడే బంధమునుండి నివృత్తిని కలిగిస్తూ కాపాడే శాస్త్రం శ్రీపాంచరాత్రం, అని చెప్పినట్లైంది.

*****

విష్ణుసంహితా 2వ పటలంలో కూడా పైన విశ్వామిత్ర సంహిత తెలిపిన అర్థాన్నే మరోరకంగా నిర్వచించి నిరూపించింది.

**శ్లో॥ రాత్రయో గోచరాః పంచశబ్దాది విషయాత్మికాః ।**
**మహాభూతాత్మకా వాఽత్ర పంచరాత్ర మిదం తతః ॥ 49**
**అవాప్య తు పరంతేజో యత్రైతాః పంచరాత్రయః ।**
**నశ్యంతి పంచరాత్రం తత్ సర్వాజ్ఞాన వినాశనమ్ ॥ 50**

ఇందులో ఐదు, ఐదువర్గాలుగ ఉండే శబ్దాది విషయములను, పృథివ్యాది భూతములను, 'రాత్రు'లుగా నిరూపించింది ఈ శాస్త్రం. ఎందుకంటే, అవి జ్ఞానాన్ని కప్పివేసి జీవుడిని ప్రకృతి బంధమనే చీకటిలోకి ఈడ్చిపారవేయగలవు కనుక వీటిని రాత్రులు అన్నారు. శ్రీపాంచరాత్ర శాస్త్రము వీటినన్నింటిని భగవన్మయములుగ మార్చి, భగవత్పరముగ వాడుకునే విధానాన్ని తెలియచేయడం ద్వారా మనలోని చీకట్లను పారద్రోలి జ్ఞానమనే తేజస్సును నింపుతోంది. ఈ శాస్త్రము యొక్క తేజఃప్రభావం వల్ల పంచాత్మకముగా ఉండే రాత్రులు అయిన పృథివ్యాదులు సుసంస్కృతాలవుతున్నాయి. అనగా ఈ పంచరాత్రములు తమ ప్రభావాన్ని ఈ శాస్త్రాన్ని పాటించేవారిపై చూపలేక నిర్వీర్యములవుతాయి. వారికి లొంగిపోతాయి. అలావాటిని లొంగించే శాస్త్రం కనుక శ్రీపాంచరాత్ర శాస్త్రం అని విష్ణుసంహిత తెలియచేసింది.

*****

ఇక ఈశ్వర సంహిత ఈ చర్చల జోలికి పోకుండా మరోరకమైన నిర్వచనాన్ని ఇచ్చింది. భగవానుడు ఈ లోకులకి సన్మార్గాన్ని చూప దలచి తన నిత్యపరివారమైన సుదర్శన, పాంచజన్య, కౌమోదకీ, నందక, శార్ఙములనే పంచాయుధములను, ఈ లోకంలో, ఋషులుగా అవతరించి లోకానికి తనను ఆరాధించే విధానాన్ని ఉపదేశించమని ఆదేశించాడు.

భగవదాజ్ఞకి బద్ధులైన పంచాయుధములు కాశీ మొదలైన దివ్యక్షేత్రాలలో శాండిల్య, ఔపగాయన, మౌంజ్యాయన, కౌశిక, భారద్వాజ ఋషులుగా అవతరించాయి. వారు దక్షిణ భారతావనికేగి వానమామలై, వానాద్రి ఇత్యాది పేర్లు కలిగిన తోతాద్రి క్షేత్రములో భగవదనుగ్రహం కోసం తీవ్రమైన తపస్సు చేసారు. భగవంతుడు వారికి ప్రత్యక్షమై ఒక్కొక్కరికి ఒక్కొక్క రాత్రి పూర్తయ్యేటట్లుగా మోక్షశాస్త్రాన్ని ఉపదేశం చేశాడు. ఇలా ఐదుగురికి విడి విడిగా ఐదురాత్రులలో ఉపదేశం చేసిన మోక్షశాస్త్రానికే శ్రీపాంచరాత్ర శాస్త్రమని పేరు వచ్చింది.

*****

సనత్కుమార సంహిత మరోరకంగా నిర్వచిస్తూ బ్రహ్మ, శివ, ఇంద్ర, ఋషి (సనత్కుమార) బృహస్పతి అనే ఐదుగురికి ఐదు రాత్రులలో భగవంతుడే స్వయంగా ఉపదేశించడం ద్వారా ఈ శాస్త్రానికి పాంచరాత్రశాస్త్రం అనే పేరు వచ్చిందని చెబుతోంది.

*****

కృతయుగ ఆరంభంలో భగవంతుడు మొదటిరాత్రియందు అనంతునికి, రెండవ రాత్రియందు గరుడునికి, మూడవరాత్రియందు విష్వక్సేనునికి నాల్గవరాత్రియందు చతుర్ముఖబ్రహ్మకు, ఐదవ రాత్రి యందు రుద్రుడికి వారి శ్రద్ధను పెంపొందిస్తూ తనను చేరడానికి పరమకృపతో ఉపదేశం చేసిన శ్రద్ధావర్ధకమైన ఈ శాస్త్రానికే పాంచ రాత్రమని విహగేంద్ర సంహిత మొదటి పటలం లోనే స్పష్టం చేసింది.

ఈశ్వరసంహితకు, సనత్కుమార సంహితకు, విహగేంద్ర సంహితకు భగవంతుని ద్వారా ఉపదేశం పొందిన వారు ఐదుగురు అని చెపుతున్నా వారి పేర్లలో తేడా కనిపిస్తుంది. ఇలాంటి తేడాలని కల్పభేదం చేత మన్వంతరాది భేదం చేత మన పెద్దలు పరిష్కరిస్తారు. ఓ కల్పంలో భగవంతుడు ఓ ఐదుగురికి మరొక కల్పంలో మరో ఐదుగురికి ఉపదేశం చేసి ఉండవచ్చునని పెద్దలు పరిష్కరిస్తారు.

ఇలా పాంచరాత్ర శబ్దానికి అనేక నిర్వచనాలు ఇంకా ఇతర సంహితల్లో కూడా ఉన్నాయి. మనం ఇంతవరకూ కొన్నింటిని తెలుసుకున్నాం. ఈ శాస్త్రానికి గల ఇతర నామముల ప్రభావాన్ని కూడా కొద్దిగ తెలుసుకునే ప్రయత్నం చేద్దాం! *(ఇంకా ఉంది)*

# మన దర్శనం 'సు' దర్శనం

పూర్వమీమాంస
వైశేషిక
న్యాయ
యోగం
సాంఖ్య

వైశారదీ

*గత సంచికలో...* (వైజ్ఞానికంగా ఇన్ని విలాసాలు పెంచుకున్నా ఎంతశక్తి సంపాదించుకున్నా క్షణక్షణం భయంతో తన ఊపిరిని తానే వింటూ, తననే శంకించుకునేంత ఉత్కంఠతో మేకపోతు గాంభీర్యంతో మనిషి మనుగడ సాగిస్తున్నాడు.)

వైజ్ఞానిక సాధనాలైన టి.వి., రేడియో, ఫోన్, విద్యుత్ – ఇలాంటివన్నీ ఆ కోవకు చెందినవే! రామాయణంలో విమానం గురించిన ప్రస్తావన ఉంది. దానికి పుష్పకమనే పేరు కూడా ఉందట! దాని గురించి మహాద్భుతంగా వర్ణిస్తారు. దేవతల్లో ఆర్థికశాఖను నిర్వహించే కుబేరుడికి చెందినదట ఈ పుష్పకం. రావణాసురుడు గొప్ప విజ్ఞానవేత్త. తపస్సుచేసి బోలెడు జిత్తులు సంపాదించాడు. అయితే అతని చదువు, శక్తి అత్యధికమైపోయి వెర్రితలలు వేసింది.

"సాక్షరా.. విపరీతాశ్చేత్.. రాక్షసా ఏవ కేవలం" చదువెక్కువైతే 'సాక్షారుడం'టారు. మరికాస్త పెరిగితే ఈ పదమే తిరగబడుతుంది. రావణుడి విషయంలో అదే జరిగింది. విజ్ఞానం పెరిగింది. స్వార్థం ఏర్పడింది. కుబేరుడిని చావబాది విమానాన్ని తెచ్చుకున్నాడు. తనకోసం వాడుకున్నాడు. ఇంతవరకూ అభ్యంతరం లేదు. ప్రజోపయోగం కోసం వాడవలసిన సాధనాన్ని స్వార్థతర్పణం కోసం దుర్వినియోగం చేసుకోవడమే కాదు. అడ్డొచ్చిన వాళ్ళనల్లా అంతం చేశాడు. అందమైన వస్తువులు ఎక్కడ కన్పిస్తే అక్కడ్నించి దౌర్జన్యంగా తెచ్చుకోవడానికి ఆ విమానం సాధనమైంది.

అందుకనే రావణ సంహారం అయ్యాక భరద్వాజ ఆశ్రమం చేరగానే ఆ విమానం తనవద్ద ఉంచుకోలేదు రాముడు. విభీషణుడు కూడా వద్దన్నాడు కనుక మానవులకి ఇటువంటి విలాస సాధనాలు అవసరం లేదని "సహ వైశ్రవణం దేవమనుజానామి గమ్యతాం", "హే పుష్పకమా! మీ ప్రభువైన కుబేరుణ్ణే మోయుటకు పొమ్ము..." అని పంపివేస్తాడు.

అలానే నీటిలోంచి విద్యుత్తుని తయారు చేయటం మనవాళ్ళకి కొత్తేం కాదు. ఉపనిషత్తులలో "అప్సుజ్యోతిః ప్రతిష్ఠితం జ్యోతిష్యాపః ప్రతిష్ఠితాః" నీటియందు విద్యుత్తు నెలకొనియుందని ఋషులు ఏనాడో దర్శించి చెప్పారు. దీనివల్ల కూడా ఏదో కొద్దిగా ఉపకారం ఉన్నట్టు మనకి కన్పించినా, అపకారమే ఎక్కువగా జరుగుతుంది అని కాబోలు వాటిని ఉదాసీనంగా వదిలివేశారు. ఏ భౌతిక వైజ్ఞానిక సుఖాలవల్ల ఉపకారం కంటే అపకారమే ఎక్కువ ఉంటుందో అలాంటి భౌతిక సుఖాలు అవసరం లేదనుకున్నారు వాళ్ళు. భౌతిక విజ్ఞాన పరిజ్ఞానం పరిపూర్ణంగా ఉన్నా ఎంతవరకు ఉంచితే స్వార్థాన్ని, హింసను కల్గించదో అంతవరకే తమ తరువాతి వారికి అందించి మిగతాది నశింపచేశారు.

పైగా ఋషులు కూడా ఇన్నీ కనిపెట్టినా పేరు రావాలనో, నోబుల్ ప్రైజిలిస్తారనో కనిపెట్టలేదు. లోకానికి హితకారి అవుతుందేమో అని ఏదైనా కనిపెట్టారు. కొంతకాలం పరిశీలన చేసిన తరువాత అది 'లోకహితకారి కాదు' అని గుర్తించగానే వాటిని అంతరింపచేశారు. అదికూడా మానవాళి హితాన్ని కోరే!

ప్రకృతిలో ఎన్నో ఉన్నా అన్నీ మనిషికే అవసరం లేదు కదా! మనిషికి కావలసింది తోటి మనిషిని ప్రేమించగలగటం, సుఖ దుఃఖాల్లో పాలుపంచుకోవడం, మానవజన్మ ఎందుకొచ్చిందో గుర్తించి, దానికి తగ్గట్టుగా ప్రయత్నించడం. ఈ ప్రవర్తన మనిషికి అలవడాలంటే ఆధ్యాత్మిక విజ్ఞానం ఎంతో అవసరం.

బాహ్య విలాసాలని తగ్గించుకునేట్టు, హృదయ వైశాల్యాన్ని పెంచుకునేట్టు, ప్రేమానురాగాలు పంచుకునేట్టు చేయగలిగినది ఆధ్యాత్మిక విద్యమాత్రమేనని మన ఋషులు ఆనాడే గుర్తించారు. అందుకే అది ఎంత పెరిగితే అంత మంచిదను కొన్నారు. అందుకే ఆధ్యాత్మిక వాఙ్మయాన్ని బహుళంగా విస్తరింపచేశారు. ఇంకా చెప్పాలంటే ఆధునిక వైజ్ఞానికులకి తెలీని ప్రకృతి రహస్యాలు కూడా మన ఋషులకి తెలుసు అనడానికి ఎన్నో ఉదాహరణలు ఉన్నాయి.

నీడనుబట్టి నియంత్రించడం, వృక్షాల్లోంచి లతలను గుర్తించటం, రకరకాల హైబ్రిడ్స్ తయారు చేయడంలాంటి ఎన్నో విషయాలు మన వేదాలలో ప్రస్తావించారు. అణు విస్ఫోటనలాంటి అల్పజ్ఞానమే మానవ అస్తిత్వానికి అవరోధంగా తయారైతే ఛాయా శాస్త్రంలాంటివి తెలిస్తే మనిషి ప్రవృత్తి ఎంత విపరీతంగ ఉంటుందో మనం ఊహించుకోవచ్చు. ఆశకొక అంతంలేదు కనుక ఉన్నంతలో తృప్తిచెంది "పొరుగువాడికి సాయపడవోయ్" అన్నరీతిలో మానవ జీవితాన్ని తీర్చిదిద్దడమే ఋషుల ఆశయం.

ఆధునిక వైజ్ఞానికులకూ, ప్రాచీన ఋషులకూ గల ప్రధానమైన తేడాను మనం గమనిద్దాం.

1. శరీర సుఖాలు మాత్రం ఆధునికుల లక్ష్యమైతే శరీరానికి కూడా ఆధారమైన ఆత్మోజ్జీవన మానసిక సుఖ సాధన ఋషుల లక్ష్యం.

2. తెలిసింది తెలిసినట్టుగా పర్యవసానం ఏమిటో ఆలోచించ కుండా సమాజానికందించేసి చేతులు కాలాక ఆకుల కోసం వెంపర్లాడటం ఆధునికుల లక్షణం అయితే కనిపెట్టిన దానిని సుదీర్ఘ కాలం రకరకాల పద్ధతులలో పరిశీలనచేసి అది మానవ కళ్యాణ కారిణి అని నిరూపించుకున్న తరువాత మాత్రమే మానవ జీవితంలో దాన్నో భాగంగా చేసెయ్యడం, దానికి విపరీతమైన వాటిని మానవ సమాజానికి దూరంగా ఉంచడం ఋషులు చేసిన ఉపకారం.

అందుచేత ఆధునిక వైజ్ఞానికుల విషయంలోనూ మనం చిన్నచూపు చూడక్కరలేదు. బాహ్య ప్రపంచంలోని ఓ కొద్ది భాగాన్ని వీరు దర్శిస్తే దీనికి మూలమైన ఆంతర ప్రపంచపు స్థితిగతుల్ని కూలంకషంగా చర్చించి సిద్ధాంతీకరించి ఋషులందించారు.

అలా ఆ ఋషులు అనేకులు ఆంతర ప్రపంచాన్ని, ఈ బాహ్య ప్రపంచాన్ని తమ తమ పరిధిలో దర్శించి ఈనాటి మన దాకా అందేట్టుగా చేసిన నిర్ణయాలే దర్శనములని ప్రసిద్ధి చెందాయి. మానవసమాజంలో తనూ మానవుడే అనుకొనే ప్రతీవాడికీ జాతి, మత భేదం లేకుండా ఆ ఋషి దర్శనాల గురించి అంతో ఇంతో తెలుసుకోవడం అనివార్యం, ఆరోగ్యకరం కూడా.

ఆధ్యాత్మిక విద్య బాగా విస్తరించియుండటం వల్లనే భారత జాతి సమస్త వైభవాలతో తులతూగుతూ ఉండేది కొంతకాలం క్రితం వరకూ. రత్నాలు రాశులుగా వీధుల్లో పోసి క్రయవిక్రయాలు జరుపుతూ ఉండేవారుట. విదేశీయులు కన్నుకుట్టి ఈ సంపదను కొల్లగొట్టుకుపోయారు. ప్రస్తుతం మనం అభివృద్ధి చెందుతున్న దేశంగ మిగిలిపోయాం. దీనికి కారణం ఏమిటి?

ఆంగ్లేయులు మనదేశంలో ప్రవేశించగానే మన వైభవానికి అసూయపడి దీనికి కారణాలు అన్వేషించారు. మనలో ఉండే ఆధ్యాత్మిక శ్రద్ధ చేత పరస్పర ప్రేమానురాగాలతో దైవస్వరూపంగా సమాజాన్ని భావిస్తూ **"ఆత్మవత్ సర్వభూతాని"**, "తన వలెనే ప్రతివ్యక్తిని ప్రేమించాలి" అనే సూక్తిని పరిపూర్ణంగా నమ్మి తమకున్నది కలో గంజో నల్గురుతోటి పంచుకొని అనుభవించాలి అన్న మనస్తత్వంతో, అనురాగమయ ప్రవృత్తితో అంతా ఒక శరీరంలో వివిధ అవయవాల్లా జీవితాన్ని సాగించేవాళ్ళు.

అందుకే అపుడు లక్ష్మి నిత్యనివాసం చేస్తుండేది. ఇంతకీ మూలం మనలో ఉండే ఋషి ప్రోక్తమైన ఆధ్యాత్మిక విద్యపట్ల ఆసక్తి దైవికశ్రద్ధ. వీటిని ఇలాగే పెరగనిస్తే బయటి సంపదను దోచుకున్నా, వీళ్ళు మరలా సంపాదిస్తూనే ఉండగలరని గుర్తించారు విదేశీయులు. అసలు దోచుకోవడం దాకా ఎందుకు? వీళ్ళే వచ్చిన వాళ్ళని అతిథి దేవుళ్ళుగా పూజించి, "పట్టుకుపోండోయ్" అంటూ దోసిళ్ళతో దానాలిచ్చేవాళ్ళు.

ఎదుటివాడి ఉన్నతిని చూడలేని అసురభావంతో తమకంటే మరొకడు సుఖపడకూడదని ఈ సంపదలకు మూలమైన ఆధ్యాత్మిక విద్యను మనలోంచి దూరం చేయడానికి మన దర్శన వాఙ్మయాన్ని వక్రీకరించడానికి అమోఘమైన వ్యూహాన్ని పన్నారు ఆంగ్లేయులు. వేరు అంటూ ఉంటే పై ఆకులు పీకేసినా మళ్ళీ వస్తూనే ఉంటాయి. వేరుకే విషం పెడితే ఆకులు పీకే శ్రమే లేదుగా! బాహ్యసంపదలకి మూలమైన మన 'ఆధ్యాత్మిక సంపద' అనే వేరుకే ఆంగ్లేయులు విషం పెట్టారన్న మాట! అదీ మనల్ని పొగుడుతున్నట్టు... మన వాఙ్మయానికి వ్యాఖ్యానాలు వ్రాస్తున్నట్లు, దీని ప్రామాణ్యాన్ని ప్రపంచ వ్యాప్తం చేస్తున్నట్టు తమ అభిప్రాయాల కనుగుణంగా మన వాఙ్మయం మీద మనకే విశ్వాసం పోయేటట్లు చేయగలిగారు. గ్రంథస్తమైన వాఙ్మయాన్ని చాల వరకు దోచుకుపోయారు. ఈ వాఙ్మయం వల్ల లభించవలసిన ఫలితాలను వాళ్ళు పొందుతున్నారు.

ఇచ్చింది పుచ్చుకుపోవడంతో తృప్తిపడక, పెట్టిన చేతినే తెగనరికినట్టు మన ఆధ్యాత్మిక విశ్వాసాలని కూకటి వేళ్ళతో పెకలించి, మనల్ని మాత్రం బికారుల్ని చేసి రోడ్లమీదకి వదిలారు. అయితే అదృష్టం ఏంటంటే మన ఆధ్యాత్మిక విజ్ఞాన సంపద కేవలం పుస్తకాల వరకే పరిమితమై ఊరుకోలేదు. ఇలాంటి ఉపద్రవాలు వస్తాయని మన ఋషులకి మాత్రం తెలీదా! అందుకే వాళ్ళు తాము దర్శించిన సత్యాలని గ్రంథాలలో పెట్టలేదు. తమ శిష్యులకి ఒకసారి తాము చెప్పూ, రెండు సార్లు ఉచ్చరిస్తూంటే, ఆ శిష్యుల బుద్ధిలోనే కంప్యూటరైజ్ చేశారు. గ్రంథాలు చూడక్కర్లేకుండానే గురువులు పాఠాలు చెప్పేవారు. పుస్తకాలు చూడక్కర్లేకుండానే శిష్యులు పాఠాలు నేర్చుకునే వాళ్ళు.

ఆ రోజులంత విస్తృతంగా కాకపోయినా, ఈనాటికీ ఆ పద్ధతి నామమాత్రంగానైనా మిగిలి ఉంది. గ్రంథాలు పోయినా, మరికొన్ని తయారు చేసుకోగలిగాము. కాని మనుష్యులలో వాళ్ళు నాటి పోయిన విషబీజాలని తొలగించుకోవడమే కష్టమౌతోంది. మన సంపదను మనం మళ్ళీ పొందగలగటంలో సందేహంలేదు. సారవంతమైన క్షేత్రం కదా మనది! మన ఋషి దర్శన వాఙ్మయం మీద, ఆధ్యాత్మిక విద్యమీద విశ్వాసం ఏర్పడితే మిగిలినవన్నీ దీన్ని అనుసరిస్తాయి. విశ్వాసమేర్పడాలంటే దాని గురించి మనకు కొంత తెలియాలి. మన ఋషిదర్శనాల గురించి తెలుసుకునే ఓ చిన్న ప్రయత్నమే మనమిప్పుడు చేస్తున్నాం.

ఆధ్యాత్మిక విద్య అనగానే మనసు, ఇంద్రియాలు, ఆత్మ, పరమాత్మ, శరీరం, ప్రకృతిలాంటి పదాలు మనకి విన్పిస్తుంటాయి. వీటినిగురించి ఎందరో ఋషులు తమ పరిశోధనాఫలితంగా ఎంతో దర్శించారు. దర్శనాలుగా లోకానికి అందించారు. *(ఇంకా ఉంది.)*



# సీతాఫలం రామార్పణమ్



శ్రీమతి చెవుటూరి కుసుమకుమారి - హైదరాబాద్

లోకరావణుడైన ఆ రావణుడు అగ్నికుండమును కలశోదకాలతో చల్లార్చి వెదుకగా ఆ అగ్నిగుండమున ఐదురత్నాలు కనుపించినవి. లోక రావణుడు ఆ ఐదురత్నాలను ఒక అందమైన పేటికలో పెట్టుకొని విమానమునెక్కి లంకానగరమునకు వెళ్ళినాడు.

తన భవనమున ఒకచోట ఆ రత్నాల పేటికను ఉంచి, పత్ని మండోదరిని పిలిచి, 'ప్రియమండోదరీ! నీకొరకు అమూల్య రత్నాలను ఐదింటిని తెచ్చినాను. అదిగో ఆ దివ్యమంజూషంలో వున్నవి. తీసుకొను'మనినాడు.

మండోదరి ఆ మంజూషాన్ని భర్తవద్దకు తెచ్చుటకై ప్రయత్నించినది. కాని, దానిని ఏమాత్రము కదలించలేక రావణుని పిలువగా, సగర్వంగా పెట్టెనెత్తుటకు ప్రయత్నించి విఫలుడైనాడు. కించిత్ లజ్జతో ఆ పెట్టెను అక్కడే తెరచి చూడగా, దానిలో కోటిసూర్య ప్రభాభాస అయిన ఒక పసిపాప కనుపించినది.

**దృష్ట్వా చ తత్ర పంక్త్వా స్వః కన్యాం సూర్య ప్రభోపమామ్ ।**
**తదా మండోదరీం ప్రాహ తస్యా వృత్తం యథాతథమ్ ॥**

అప్పుడు రావణుడు జరిగిన వృత్తాంతము నంతనూ మండోదరికి చెప్పినాడు. ఆమె అమితంగా భీతిల్లినది. నాథా! లంకేశ్వరా! ఇది సామాన్య బాలికకాదు. ఇదొక ప్రచండశక్తి. రాక్షసవంశనాశని. లంకేశ్వరా! ఆ వేదవతి ఆహుతి అయిన ఆ అగ్నిని ఆర్పి ఆ రత్నములను తెచ్చుట ఎందుకు? అసలు ఆమెను బలాత్కరించుట ఎందుకు? ఆమె దగ్ధమగుటకు మీరేల కారణమగుట? అయినదేదో అయినది. వెంటనే ఈమెను ఏ అడవిలోనో దూరముగా వదలి పెట్టించుడని త్వరపెట్టినది. వెంటనే రావణుడు మంత్రులతో యోచించి దూతలను పిలచి...

**కరండికేయం త్యక్త్వా వనే గచ్ఛత వేగతః ।**

వెంటనే ఈ పేటికను తీసుకువెళ్ళి దూరముగా అడవిలో విడిచి పెట్టుడని ఆదేశించాడు.

**దశాస్య పత్నీ తానాహ కార్యా భూమిగతా త్వియమ్ ।**
**తత స్సాపేటికా నీతా దూత్తై ర్యానేన వై జవాత్ ॥**
**కృతా భూమి గతా ప్రాంతే మిథిలాయాస్తు కాననే ।**

కానీ దశకంఠుని భార్య ఆ దూతలను పిలిచి, దూతలారా! ఈమెను ఊరక భూమిమీద వదలకుడు. ఒకగోతిని త్రవ్వి దానిలో పాతిపెట్టుడని చెప్పినది. దూతలు అతి కష్టముతో ఆ పెట్టెను మోసుకొనిపోయి, మిథిలాపట్టణ సమీపమున ఒక అడవిలో ఆ పెట్టెను పాతిపెట్టినారు. లంకకు తిరిగి వెళ్ళి తాము చేసిన పనినంతనూ రావణునకు నివేదించగా రావణుడు నిర్భీతిగా కాలం గడపసాగినాడు.

సీతాజనన అద్భుత దివ్యవృత్తాంతాన్ని సూతముని ఈ విధంగా కొనసాగించినాడు. మహర్షులారా! విదేహను జనకుడను రాజు ప్రజలను కన్నబిడ్డల్లా పాలించేవాడు. కానీ సంతానము లేదనే బాధ ఆయనను క్రుంగదీస్తూ వుండేది.

నీ దర్శన భాగ్యమును ప్రసాదించి నన్ను ధన్యుని చేయుమని అతడు భూమాతను ప్రార్థించాడు. జనకుని ప్రార్థనని మన్నించి భూమాత తన నిజరూపంతో ప్రత్యక్షం అయింది.

**ఏకదా నారద స్తస్య సమీపం ప్రాప భూపతేః ।**
**తదా మునిముఖాద్రాజా శుశ్రావైక ముదంతకమ్ ॥**

ఒకసారి నారద మహర్షి జనక మహారాజు వద్దకు వచ్చి "నీవు సంతానము కొరకై విచారించకు. నీకు తప్పక సంతానము కలుగును. అంత వృద్ధుడైన దశరథునకు అశ్వమేధ యాగము వలన నలుగురు పరాక్రమశాలురు అయిన పుత్రులు కలిగారు. నీవుకూడా యజ్ఞము చేసినచో సంతానవంతుడవు తప్పక కాగలవు" అని చెప్పి స్వర్గమునకు వెళ్ళినాడు.

దేవర్షి వాక్యానుసారము జనకమహారాజు భార్యలతో కూడి యజ్ఞదీక్ష వహించాడు. తమ పురోహితుడైన శతానందుని, మరికొందరు మునీశ్వరులను వెంట తీసుకొని యజ్ఞభూమికి వెళ్ళి భూశుద్ధికై క్షేత్రమును దున్నుటకు తలపెట్టినాడు. దేవర్షి నారదుని వాక్యానుసారము

**హాలేన స్వర్ణ వర్ణేన జనకే కర్షతి దృఢమ్ ।**
**ఘణం ఘణ నినాదోஉ భూత్కిమేత దితి విస్మితః ॥**

బంగారు నాగలితో భూమిని దున్నుచుండగా ఘణిల్లు ఘణిల్లుమని ఒక విచిత్ర శబ్దము వినిపించినది. ఇదేమని జనకరాజు విస్మయపడి నాగటి కాసయందలి భూమిని పరిశీలించినాడు.

**పరిశీలస్య నృపోஉ పస్యత్ యజ్ఞ వాట్యాం తు పేటికామ్।**
**తాముద్ఘాట్య సువర్ణాభాం కన్యాం తత్ర సమీక్ష్య చ ॥**
**సుదినం దినమే వేద మితి మత్వా ముమోచ సః ॥**

ఆ భూమిలోపల ఒక స్వర్ణపేటిక కనుపించినది. ఆశ్చర్యపడిన జనకరాజు ఆ పెట్టెను తెరచి చూడగా బంగారు ఛాయతో కాంతులీనుతున్న ఒక బాల దానిలో కనుపించినది. ఆహా! నేడెంతటి సుదినము! అని భావించి అమితానంద భరితుడైనాడు.

వెంటనే భూదేవి జనక మహారాజుతో ఈ విధంగా పలికినది.

**ఏషా సుతా మయా దత్తా తవ రాజన్మనోహరా ।**
**గృహాణ సుభగాం కన్యాం కులద్వయ శుభావహమ్ ॥**

జనక భూపతీ! అద్భుత సౌందర్యరాశి అయిన ఈ కన్యను నేనే నీకు ప్రసాదించినాను. రాజా! ఈమె పుట్టినింటినీ, మెట్టినింటినీ తరింపచేయ సమర్థురాలు. దారుణమైన భూభారము అను కష్టమునుండి నన్ను కూడా తరింప చేయుటకు కారణభూతురాలు కాగలదు. అది ఎట్లనిన

**రావణాద్యా మహావీరాః కుంభకర్ణాదయోఽ పరే ।**
**నాశం యాస్యంతి దుర్ధర్షాః కృతేఽ స్యాః రాక్షసాః పరే ॥**

రావణ కుంభకర్ణాది మహావీరులైన దుష్టరాక్షసులు ఈమె మూలముగా సమూలముగా నశించి పోవుదురు. కనుక జనకరాజా! ఈ చిన్న బాలికను నీవు పుత్రికగా స్వీకరించు. తద్వారా దేవ, పితృఋణములనుండి విముక్తిని కూడా పొందగలవు.

ఆ మాటలు విన్న జనక మహారాజు దేవీ! భూమాతా! నీ ఆదేశానుసారము ఈ బాలికను నా ప్రియపుత్రికగా స్వీకరించి పెంచెదను. కానీ, భూదేవీ! నీ నిజరూపమును చూడవలెనన్న నా కోరికను మన్నించు. నన్నునుగ్రహించి నీ దర్శన భాగ్యమును ప్రసాదించి నన్ను ధన్యుణ్ణి చేయుమని ప్రార్థించాడు. జనకుని ప్రార్థనను మన్నించి భూమాత తన నిజరూపంతో ప్రత్యక్షమయింది.

**నీలోత్పల దళశ్యామా మక్ష మాలాబ్జధారిణీమ్ ।**
**యుగ్మేన వస్త్రశుభ్రేణ మృణాళాయత లోచనామ్ ।**
**సుందరీం లోకధాత్రీం తాం దృష్ట్వా శశ్వ న్నృపోఽ నమత్ ॥**

నల్లకలువలవంటి దేహకాంతి, ఒకచేత పద్మము, మరొకచేత అక్షమాల ధరించిన భువనైక సుందరి లోకమాత అయిన భూదేవికి జనక మహారాజు భక్తి ప్రపత్తులతో వినయ వినమ్రుడై నమస్కరించాడు.

**తతస్సా పృథివీ దేవీ సీతాం జాతాం నృపాత్మజామ్ ।**
**కరణే శశ్వత్సం స్పృశ్య వచనం చేద మబ్రవీత్ ।**

భూమాత ఆ బాలికను చేతులలోనికి తీసుకొని ముద్దుపెట్టుకొని

**ఇయం కన్యా జగద్ధాత్రీ మానుషం రూపమాశ్రితా ।**
**తవ పుత్ర్య భవద్రాజ న్గోపనీయ మిదం త్వయా ।**
**ఇతి సంభాష్య సా దేవీ తత్రైవాంతర ధీయత ॥**

ఓ జనక మహారాజా! నీ జన్మాంతర పుణ్యవశమున ఈ బాలిక నీకు పుత్రిక అయినది. లోక జననియే మానుషరూపము ధరించినది అని గ్రహించి, నీవీ విషయమును అతి జాగ్రత్తగా దాచి వుంచవలెను. జాగరూకుడవై ప్రవర్తించుమని చెప్పి అంతర్ధానమైనది. అనంతరము జనకమహారాజు సర్వలక్షణ సంపన్న అయిన ఆ బాలికను ఎత్తుకొని హృదయముననిడుకొని పరివార సమేతంగా స్వగృహానికి మరలి వచ్చినాడు. నాగేటి చాలులో పుట్టినది కనుక ఆ బాలికకు **సీత** అని నామకరణము చేసినాడు జనకమహీపతి. *(ఇంకా ఉంది.)*

# నేర్చుకుందామా - 2

మహాభాగవత వైభవాన్ని చాటిన పద్యం నేర్చుకున్నాం గదా! మరిప్పుడు మహాభారతం గొప్పదనాన్ని చెప్పే పద్యాన్ని తెలుసుకొని కంఠస్థం చేద్దాం సరేనా!

మహాభారతం అనేక విశేష విషయాలతో కూడిన విజ్ఞానకోశం. వింటే భారతమే వినాలి. తింటే గారెలే తినాలి అనికదా నానుడి. నిజమే! ఆ కథ అంత బాగుంటుంది. ఈ లోకంలో ఉన్నన్నాళ్ళు ఆనందాన్నిస్తుంది. పరలోకంకోసం పుణ్యాన్ని కూడా సంపాదించి పెడుతుంది. ఇదొక ధర్మశాస్త్రం. ఇదొక ఇతిహాసం. ఆచార విధానాలకి నిలయం కూడా. అలాంటి భారతాన్ని వైశంపాయనుడు చెప్పడం మొదలు పెట్టాడు. భారతం వినడం వలన వచ్చే లాభాలు ఈ క్రింది పద్యంలో వివరించారు ఆదికవి నన్నయామాత్యులు. ఆ పద్యం ఏమిటో నేర్చుకుందామా!

శా॥ **ఆయుష్యం బితిహాస వస్తు సముదాయం బైహికాముష్మిక**
**శ్రేయః ప్రాప్తి నిమిత్త, ముత్తమ సభాసేవ్యంబు, లోకాగమ**
**న్యాయైకాంత గృహంబునా బరగి, నానావేద వేదాంత వి**
**ద్యాయుక్తంబగువాని జెప్పదొడగెం దద్భారతాఖ్యానమున్॥**

భారతకథ వింటే ఆయుర్దాయం పెరుగుతుందట. పూర్వాపూర్వకథలు విశేషాలు చాలా చాలా తెలుస్తాయట. ఇంక ఈ లోకంలో ఎన్నో శ్రేయస్సులు కలుగుతాయి. పరలోక సౌఖ్యాలు పొందాలన్నా భారతాన్ని వింటే చాలు ఆ విన్న పుణ్యంతో ఎన్నో సుఖాలు లభిస్తాయి. ప్రసిద్ధిచెందిన సభలలో భారతోపన్యాసాలు జరుగుతూనే ఉంటాయి. అంతేకాదు. లోకానికి, శాస్త్రానికి సంబంధించిన ఎన్నో ఆచారాలు – వ్యవహారాలు భారతం నిండా కోకొల్లలు. భారతం అంటే తెలియని వారుండరు కదా! వేదవిజ్ఞానం, వేదాంత విజ్ఞానం కూడా భారతంలో అడుగడుగునా దర్శనమిస్తుంది. అంత గొప్ప మహాభారతకథని వైశంపాయనుడు చెప్పడం మొదలు పెట్టాడు.

ఏ విషయాన్నైనా సరే ముందు వినడం అలవాటు చేసుకోవాలి. అప్పుడు నెమ్మదిగా అదే అర్థమవుతుంది. శ్రద్ధగా వినడం కూడా ఒక కళే! వేదమాత కూడా శ్రోతవ్యః శ్రోతవ్యః అంటుంది. వినాలి... వినాలి... అని.

అందుకోసమే పెద్దలు చెప్పే మంచి విషయాలను వినడం అలవాటు చేసుకుందాం! క్రమంగా అనడం కూడా వస్తుంది. నెమ్మది, నెమ్మదిగా అర్థం కూడా తెలుస్తుంది. ఈ పైపద్యాన్ని కంఠస్థం చెయ్యండి. మరిచిపోరుగా... ఈ పద్యం పేరు శార్దూలం. "మసజసతతగ" అనే గణాలుంటాయి.

జై శ్రీమన్నారాయణ!

శ్రీమన్నారాయణ రామానుజ యతిభ్యో నమః

# యతిరాజవింశతి

శ్రీశ్రీశ్రీ అహోబిల రామానుజ జీయరు స్వామివారు

సంపదలన్నిటిలోకి జ్ఞాన సంపద చాలా గొప్పది. "నహి జ్ఞానేన సదృశం పవిత్ర మిహ విద్యతే" అని శ్రీకృష్ణుడు భగవద్గీతలో జ్ఞానముతో సమానమైనది ఏదీలేదని అనుగ్రహించాడు. భగవంతుని గురించి తెలుసుకోవడమే జ్ఞానమని అంటారు. ఆ జ్ఞానాన్ని అందించువారు ఆచార్యులు. లోకంలో మనకి ఉపకారము చేసిన వారి విషయములో ఎంతో ప్రీతిని చూపుతాము. మంత్రమన్త్రార్థాలను అనుగ్రహించి పరమాత్మ జ్ఞానాన్ని కృపచేసిన ఆచార్యుల ఎడల మనం ఇంకెంత నిష్ఠతో ఉండాలో కదా! ఆచార్యుని వద్ద విద్యను ఆరంభించు సమయంలో దాసత్త్వం, విద్య సగం అవగానే స్వామిత్త్వం చూపేవారే ఎక్కువ. ఆచార్యుల యెడల భక్తి భావంతో, మంచి పనులు చేసి, వారి ముఖవికాసానికి తోడ్పడేవారే నిజమైన శిష్యులు.

ఆచార్యుని యందు శిష్యుడు ఎలా ఉండాలో, వారి ద్వారా మనం ఏమి పొందాలో మనకు నిరూపించిన గ్రన్థమే **"యతిరాజ వింశతి"**. శ్రీ రామానుజుల శ్రీపాద సన్నిధిలో భక్తితో సమర్పించిన ఈ స్తోత్రము అందరికీ ఉపాదేయము. అపర రామానుజులైన "మణవాళ మామునులు" మనకు దీనిని అందించారు. వీరు ఆళ్వార్ తిరునగరి అను దివ్య దేశములో అవతరించారు. తండ్రి "తిరునాఉడైయ పిరాన్ దాసరణ్ణర్ " శ్రీరంగనాథుని తిరునామాన్ని (పేరు) తమ పిల్లవానికి ఉంచాలని వీరి కోరిక. గోదాదేవిని శ్రీరంగనాథుడు వివాహం చేసుకోవడం వలన మన విష్ణుచిత్తుల వారికి అల్లుడైయ్యాడు స్వామి. ఆనాటి రంగనాథ కల్యాణాన్ని దర్శించిన వారందరూ స్వామిని అళగియ మణవాళన్ అని సంబోధించారట. అనగా " అందమైన అల్లుడు" అని అర్థము. ఈ తిరునామాన్ని దాసరణ్ణర్ వారి కుమారులకు "అళగియ మణవాళనాయనార్" అంటూ ఏర్పరచినారు.

బాల్యం నుండే ఎన్నో విద్యలను అభ్యసించారు. శ్రీశైలనాథులు అను మహానుభావుని ఆచార్యునిగా స్వీకరించి ద్రావిడ వేదాన్తాన్ని అధికరించారు. వీరి వైభవం ఇంత అని చెప్పటానికి వీలు కానిది. భగవత్కైంకర్యానికి గృహస్థజీవనము అవరోధముగా ఉండటంచేత మోక్షాశ్రమాన్ని (సన్యాసము) స్వీకరించి ''మణవాళమాముని'' అను నామధేయంతో శ్రీరంగనాథుని సన్నిధిలో పెరియ జీయర్‌గా వేంచేసి ఎందరినో దిద్దుబాటు చేసారు. పిళ్లైలోకా చార్య స్వామి అనుగ్రహించిన అష్టాదశ(18) రహస్య గ్రంథములలో "శ్రీవచనభూషణము, తత్త్వత్రయము, "ముముక్షుప్పడి" అను మూడు గ్రంథాలకు వ్యాఖ్యానము చేసిన మహనీయులు మణవాళమామునులు. అంతే కాకుండా ఆచార్య హృదయము, పెరియ తిరుమొళి, శ్రీరామానుజ నూత్తన్దాది, జ్ఞానసారము, ప్రమేయ సారములకు వ్యాఖ్యానములను అనుగ్రహించారు మామునులు.

నమ్మాళ్వార్ పాడిన తిరువాయ్ మొళికి ఏర్పడిన వ్యాఖ్యానానికి 'భగద్విషయ'మని పేరు. శ్రీరంగనాథుని సన్నిధిలో ఒక సంవత్సర కాలం భగవద్విషయ కాలక్షేపాన్ని (ప్రవచనము) అనుగ్రహించారు మామునులు. వీరి ప్రవచన ఝరి అమృతము కంటే భోగ్యమైనది. శ్రీరంనాథుడే ఉత్సవాలన్నిటిని వద్దని కాలక్షేపమే నాకు ముద్దని మామునుల ముందు అర్చామూర్తిగా వేంచేసి అందరితో పాటు ప్రవచనా మృతాన్ని ఆస్వాదించాడు. సంవత్సరం పూర్తయ్యాక అందరూ మాములను సత్కరిస్తు న్నారు. అప్పుడు ఒక ఆశ్చర్యకరమైన సంఘటన. ఐదు సంవత్సరాల పిల్లవాడు అక్కడకు విచ్చేసి, మాములను నమస్కరించి

**"శ్రీశైలేశదయాపాత్రం ధీభక్త్యాది గుణార్ణవమ్ ।**
**యతీంద్ర ప్రవణం వందే రమ్యజామాతరం మునిమ్" ॥**

అని శ్లోకాన్ని సమర్పించి రంగనాథుని గర్భాలయంలోకి ప్రవేశించి అదృశ్యమయ్యాడు. సాక్షాత్తు శ్రీరంగడే ఆ బాలుడని గ్రహించి అందరూ స్వామిని ప్రార్థించారు. రంగనాథుడు అర్చకముఖంగా "ఈ నాటినుండి వేదానికి ఓం కారము వలె ఈ శ్లోకాన్ని తమతమ ప్రబంధాలకు ముందు చేర్చి చదివిన నాకు ప్రీతి" అని ఆదేశించెను. సంవత్సరంపాటు తన వైభవాన్ని అనుగ్రహించిన మామునులను ఈ శ్లోకంలో రంగనాథుడు ఏమన్నాడంటే ''తిరుమలై ఆళ్వాన్‌గా ప్రసిద్ధి చెందిన శ్రీశైలనాథుల అనుగ్రహానికి పాత్రులై, అపారమైన జ్ఞానము, భక్తి మొదలగు గుణములకు సముద్రమైనవారు, రామానుజులయందు అమితమైన ప్రేమకలిగి యతీంద్ర ప్రవణులైన మణవాళ మామునులను నమస్కరిస్తున్నాను" అని అన్నాడు. ఇది ఒక

దివ్యమైన పవిత్ర మంత్రము. ఆనాటి నుండి ఈనాటి వరకు అన్ని దివ్యదేశాలలో మాత్రమే కాక శ్రీ వైష్ణవ గృహాలలో జరిగే ప్రతిశుభకార్యానికీ ముందుగ ఈ శ్లోకాన్ని అనుసంధిస్తూ, పారాయణా దులను చేయడము గమనించవచ్చు. వీరి వైభవాన్ని తెలుపు మరియొక ఘట్టాన్ని ఇక్కడ స్మరించడము ఎంతో అవసరము.

చోళ సింహపురమున శ్రీఘటికాచల క్షేత్ర సమీపమున "ఎఱుంబి" అను అగ్రహారములో దేవరాజా చార్యులను స్వామి ఉండేవారు. వీరినే "ఎరుంబి అప్పా" అని పిలుస్తారు. వీరు శ్రీరంగంలోని తమ బంధువు అయిన "కోయిల్ అణ్ణన్" స్వామిని చూడాలని వారి గృహానికి విచ్చేసారు. ఆ సమయంలో "మణవాళమామునులు" ప్రవచనము అనుగ్రహిస్తున్నారు. "ఎఱుంబిఅప్పా" కనీసం మామునులను సేవించక, వారి శ్రీపాద తీర్థాన్ని, ప్రసాదాన్ని స్వీకరించక వచ్చిన పని పూర్తి చేసుకొని తిరుగు ప్రయాణమయ్యారు. గృహానికి చేరిన "ఎఱుంబిఅప్పా" స్నాన సంధ్యావందనములు ఆచరించి ఆరాధనకై పెరుమాళ్ళ తలుపులు తెరవబోయారట! అవి తెరుచుకోలేదు. ఇది ఏమీ విచిత్రమని ఎన్నో ప్రయత్నాలు చేసి చివరకు దుఃఖముతో కన్నీరు కార్చుచూ ఆ స్వామి సన్నిధిలో స్పృహ కోల్పోయారు. వారి ఆరాధ్యదైవం శ్రీరామచంద్రుడు స్వప్నంలో సాక్షాత్కరించి సాక్షాత్తు ఆదిశేషుడు, అపర రామానుజులైన "మామునులను" సేవించక వారి శ్రీపాద తీర్థాన్ని గ్రహించని నీకు నేను దుర్లభుడను కానా! అన్నారట. వెంటనే మేల్కాంచిన ఎఱుంబిఅప్పా కన్నీటి పర్యంతమై ఎంత మంద భాగ్యుడను, అంతటి ప్రభావాతిశయము కల్గిన స్వామిని గుర్తించనైతినే అని బాధతో శ్రీరంగం బయలు దేరి, మామునుల శ్రీపాదాలను ఆశ్రయించి మామునులనే ఆరాధ్యదైవంగా ఆరాధించి తరించారు.

మామునులు ఏర్పరచిన అష్టదిగ్గజములలో ఎఱుంబియప్పా ఒకరు. వీరి వైభవాన్ని చూడలేని కొందరు అసూయాగ్రస్తులు మామునుల కుటీరానికి నిప్పుపెట్టి, కాలిపోతున్న ఆ గృహాన్ని చూచి ఇక మామునుల పని సరి, అని సంబరపడుతున్నారు. ఇంతలో దగ్ధమవుచున్న ఆ ఇంటి పైకప్పు అమాంతము వీరందరిపై పడి మంట మంట అంటూ అటు ఇటూ పరుగులు తీసారు. ఏమైనది అని మామునుల గృహం వైపు చూసారు. అగ్ని కంటే ప్రకాశవంతమైన కాన్తితో అనేక శిరస్సులతో బుసలు కొడుతున్న ఆదిశేషుని దర్శించారు. అయ్యో! మామునులు ఆదిశేషులా! ఇలాంటి వారినా మనం ఇబ్బందులకు గురిచేసాం, స్వామీ! "ఆచార్యా! త్రాహి త్రాహి" అంటూ వారి శ్రీపాదాలను ఆశ్రయించి శరీర బాధలను పోగొట్టుకొని తరించారని చరిత్ర మనకు తెలుపుతోంది. మామునుల వైభవాతిశయము చెప్పుట ఎవ్వరి తరము? సాక్షాత్తు శ్రీరంగనాథుని ఆజ్ఞతో పారాయణకు ముందు శ్రీశైలేశ అని తర్వాత ముగింపులో

**"శ్రీమతే రమ్యజామాతృ మునీంద్రాయ మహాత్మనే ।**
**శ్రీరంగ వాసినే భూయాత్ నిత్యశ్రీః నిత్యమంగళమ్ ॥**
**"మణవాళమామునియే ఇన్నుమొరునూత్తాండిరుమ్"**

అని స్మరించవలెను అని నియమం ఏర్పరిచారు. అనగా మునులలో శ్రేష్ఠుడు, శ్రీమంతుడైన మామునులు శ్రీరంగములో వేంచేసి ఉండి నిత్యమంగళాలను పొందుగాక, మామునులు ఇంకా నూఱుఏళ్లు ఉండాలని ప్రతి శ్రీవైష్ణవులు ఇప్పటికీ ఎప్పటికీ అనుసంధిస్తూనే ఉంటారు. ఇంత గొప్ప వైభవము కల్గిఉన్నప్పటికీ మణవాళ మామునులు శ్రీరామానుజులను ఆచార్యులుగా భావించి తమ తక్కువ తనాన్ని ప్రదర్శించారు. సరైన మార్గంలో నడిపించమని ప్రార్థించారు. నేను మూర్ఖుడిని, నర రూపంలో సంచరించే వింత పశువుని, మూడు కాలాలలో మూడు కరణాలతో తప్పులు చేసాను, చేస్తాను. నన్ను ఉద్ధరించండీ యతిరాజ, యతీన్ద్ర, రామానుజ అంటూ కీర్తించిన ప్రబంధము **యతిరాజ వింశతి.** ఏమీలేకపోయినా అన్ని ఉన్నట్లు, వచ్చినట్లు, తిరిగే మనకు, అన్నీ తెలిసినా తెలియని వానివలె గురుభక్తికి సోపానాలను అందించిన మామునులను ముందుగా మనం శరణువేడుదాం! మనకు కూడా ఆచార్యుల యందు చెదరని భక్తిని ప్రసాదించ మని.

అటువంటి మామునుల విషయములో "ఎఱుంబియప్పా" ఒక శ్లోకాన్ని అనుగ్రహించారు. ముందుగా ఈ శ్లోకాన్ని అనుసంధించాక **యతిరాజ వింశతి** తెలుసుకుందాం!

శ్లో॥ **యస్తుతిం యతిపతి ప్రసాదనీం,**
**వ్యాజహార యతిరాజ వింశతిమ్ ।**
**తంప్రపన్న జనచాతకామ్బుదం,**
**నౌమిసౌమ్య వరయోగి పుంగవమ్ ॥**

జై శ్రీమన్నారాయణ !

**పరమహంస పరివ్రాజకులు శ్రీశ్రీశ్రీ చిన్న జీయరు స్వామివారి మంగళాశాసనములతో...**

## భద్రాచల దివ్యక్షేత్రంలో శ్రీ జీయర్ మఠం నూతన నిర్మాణం జరుగుచున్నది

# "మీరూ భాగస్వాములు కండి !"

మన పరమాచార్యులు శ్రీశ్రీశ్రీ పెద్ద జీయరు స్వామివారికి ఎంతో ప్రీతిపాత్రమైన స్థలము భద్రాచల దివ్యక్షేత్రము. గతంలో ఆగష్టు 2010 భక్తినివేదనలో ప్రకటన ద్వారా మరియు ఏప్రియల్ 2011లో శ్రీరామక్రతువు సందర్భంగా శ్రీస్వామివారు భద్రాచల దివ్యక్షేత్రంలో వేంచేసి యున్న సందర్భంలో స్పందించిన భగవత్ బంధువులు సమర్పించిన కైంకర్యములతో పనులు ప్రారంభించి సెల్లార్ మరియు భూస్థాయి అంతస్తుల నిర్మాణం అయినది. మిగతా నిర్మాణ పనులు పురోగతిలో ఉన్నవి. మఠం పూర్తి నిర్మాణం కొరకు ఇంకా అదనంగా 1,30,00,000 (ఒక కోటి ముప్పై లక్షలు) అవసరం ఉన్నది. కావున సమర్పకులు తాము ఎంచుకొన్న అంచనాను అనుసరించి ఉదారులు తమ అవకాశాన్ననుసరించి ఈ కైంకర్యములను స్వీకరించి, భద్రాద్రిని సేవించే భక్తులకు మన మఠం అందించే సేవలో భాగస్వాములు కావలసిందని ఆహ్వానిస్తున్నాం.



**నిర్మాణ పనుల పూర్తి కొరకు అంచనాల వివరములు**

1. సెల్లార్ మరియు వంటసామాగ్రి 16 లక్షలు
2. గోదాకళ్యాణమంటపం గ్రౌండ్‌ఫ్లోర్, మైక్‌సెట్ డెకరేషన్, లైటింగ్ 16 లక్షలు
3. ఆధ్యాత్మిక గ్రంథాలయం, కార్యాలయం 5 లక్షలు
4. శ్రీరామానుజకూటం, (తదీయారాధనశాల) పెరుమాళ్ళ సామాగ్రి 15 లక్షలు
5. మఠంలో మొత్తం గదులు 20.
   (సాధారణ గదులు 12, ప్రత్యేక గదులు 8)
   ఒక్కొక్క సాధారణ గది 2 లక్షలు, ప్రత్యేక గది 3 లక్షలు
6. ఎలివేషన్, ఫర్నిచర్, జనరేటర్, లిఫ్ట్, మరియు ఇతరసామాగ్రి 30 లక్షలు



**సూచనలు :** జీయర్ ఎడ్యుకేషనల్ ట్రస్ట్ సీతానగరం, జెట్ భద్రాచలం (జీయర్ మఠం) వారి నియమ నిబంధనలకు లోబడి సమర్పకులకు సౌకర్యములు కల్పించబడును.

వ్యక్తిగతంగా, సంస్థాగతంగాని ఎంరీ సమర్పించినా సెక్షన్ 80జి క్రింద ఆదాయపు పన్ను రాయితీ గలదు.

సమర్పకులు తాము ఎంచుకున్న అంచనాను అనుసరించి సమర్పించే ద్రవ్యాన్ని ఒకటి లేక రెండు వాయిదాలలో అందించవచ్చును.

మన పరమాచార్యులైన శ్రీశ్రీశ్రీ పెద్ద జీయరు స్వామివారికి మనమర్పించే శ్రీ చరణపుష్పం. ఈ దివ్యక్షేత్రంలో శ్రీ జీయర్ శతాబ్ది కానుకగా జరిగే ఈ బృహన్నిర్మాణ యజ్ఞంలో వదాన్యులందరూ భాగస్వాములై భద్రాచల రామచంద్ర ప్రభువు అనుగ్రహంతో మరియు శ్రీస్వామివారి మంగళా శాసనములతో తరించవలసినదిగా విజ్ఞప్తి చేయుచున్నాము.

**నూతన నిర్మాణమునకు సమర్పణలను పంపదలచినవారు:**

స్టేట్‌బ్యాంక్ ఆఫ్ హైదరాబాద్, భద్రాచలం శాఖ,
జీయర్ ఎడ్యుకేషనల్ ట్రస్ట్,
అకౌంట్ నెం. SBHY 0020163 - 62058098145.

**వివరములకు :**

జెట్ సీతానగరం 08645 272929
జీయర్ మఠం రాజవీధి, భద్రాచలం, ఖమ్మంజిల్లా 507 111
ఫోన్ : 98485 28429, 98485 27268, 98482 90615

*సదా ఆచార్యసేవలో*
**అధ్యక్షులు మరియు సభ్యులు,**
**జెట్ – శ్రీ జీయర్ మఠం, భద్రాది**

# రామానుజ చిత్రకథ

చిత్రకథ - 3




ఇదిలా ఉండగా...రాజుగారి అంతఃపురములో
ఏమైంది నా చిట్టితల్లికి. ఇలా చిక్కిపోతోందేమిటి?
రాజవైద్యులారా! నా బంగారుతల్లికి ఏమైందో? సరైన వైద్యం చేయండి!
రాజా! యువరాణీగారికి శారీరకమైన అనారోగ్య మేమీలేదు. బహుశ ఏమైనా భూతావేశం కావచ్చు
ఆఁ..! ఏమిటీ? భూతావేశమా!
ఎవరైనా భూతవైద్యులను పిలిపించండి!
భూతవైద్యుల్లారా! నా చిట్టితల్లిని త్వరగా నయం చేయండి!
"హాం ఫట్!"
ఏయ్! ఎవర్రా నువ్వు? ఫో..ఇక్కడినుంచి పోతావా లేదా?


అమ్మో! మహారాజా! క్షమించండి!
రాకుమార్తె వారికి బ్రహ్మరాక్షసుడు పట్టాడు.
మావల్లకాదు వదిలించడం.
నా చిట్టితల్లిని ఎలా కాపాడుకోవాలి?
రాజా! యాదవప్రకాశులు, గొప్పపండితులు,
ఎటువంటి భూతాన్నైనా ఇట్టే పోగొట్టగలరు.
ఎవరక్కడ!
ప్రభూ!
వెంటనే యాదవప్రకాశులను సగౌరవంగా
తీసుకురండి!
గురుదేవులకు ప్రణామములు. రాజకుమార్తెను బ్రహ్మరాక్షసి
పట్టి పీడిస్తోంది. మీరు మాత్రమే ఆమెను రక్షించగలరని,
ఒక్కసారి తమరు రావలసిందిగా రాజుగారి ప్రార్థన.


ఇంతవరకూ భూతవైద్యులెవరూ పరీక్షించలేదా!
చిత్తం! ఎంతో మంది పరీక్షించారు స్వామీ. కానీ...
రాజుకు నా గొప్పతనం తెలిసేలా చేయాలి. ఇదే గొప్ప అవకాశం.
మీరు రాజకుమార్తె వద్దకు వెళ్ళి ఆమెను కూర్చోమనండి! కూర్చున్న తరువాత మా గురువుగారు యాదవప్రకాశులు వెంటనే రాజకుమార్తెను వదిలి నిన్ను వెళ్ళమన్నారని చెప్పండి.
ఏయ్! లేచి కూర్చో! మా గురువుగారు యాదవప్రకాశులు నిన్ను వెంటనే వదిలి వెళ్ళమంటున్నారు.
ఒరేయ్...! ఎవడ్రా మీ గురువు....? వాడెవడు నన్ను పొమ్మనటానికి? వాడినే ఈ ఊరొదిలి పొమ్మన్నానని చెప్పు.
ఆచార్యా! మీరు చెప్పినట్లే చేశాను. కానీ...
ఊc... ఏమిటి కానీ
ఆ రాక్షసుడు మిమ్మల్నే ఈ ఊరు వదిలిపొమ్మన్నాడు.
ఇంకా ఉంది..

# ముముక్షు రహస్యం

శ్రీమతి చక్రవర్తుల చూడామణి -ఖమ్మం

*(గతసంచికతరువాయి...)*

"బామ్మా కృష్ణుడికి నాన్న స్కూల్‌బ్యాగ్ కొనిచ్చారు కదా! వాడు దాన్ని వదలకుండా భుజాన వేసుకొని తిరుగుతున్నాడు. పడుకుంటే నెత్తికింద అదే. కూర్చున్నా అదే. మొన్నేం చేసాడో తెలుసా! వానొస్తుంటే ఆ బ్యాగే నెత్తిమీద పెట్టుకొని వానలో డాన్సు చేసాడు.... నువ్వు వాడిని పిలిచి కోప్పడాలి బామ్మా" చిన్నా....

**"శెన్డ్రాల్ కుడైయామ్ ఇరుందాల్ సింగాసనమామ్**
**నిన్డ్రాల్ మరవడియాం నీల్‌కడలుమ్। ఎన్డ్రుమ్**
**పుణైయామ్ మణివళక్కామ్ పూంపట్టామ్ పుల్గుమ్**
**అణైయామ్। తిరుమార్క్కు అరవు"**

"బామ్మా! నాకు కోపం తెప్పిస్తున్నావు. నేను వాడు బ్యాగు పాడుచేస్తున్నాడని చెప్తే, వాణ్ణి పిలిచి కోప్పడక ఆనందంగా పాటలు పాడుకుంటున్నావ్?

"ఓరి పిడుగా! అంతకోపం ఎందుకురా! దా..... నీకోకథ చెప్తా! ఇలా వచ్చి కూర్చో!

"సరే అయితే కథ చెప్పు. నాకొక్కడికే చెప్పాలి మరి"

"నేను నీకొక్కడికే చెప్తా!"

'సరేలే తొందరగా చెప్పు'.

నేను పాడిన పాట పొయిగై ఆళ్వార్ ముదల్ తిరువందాదిలో పాడింది. ఎవరి గురించో తెలుసా! ఆదిశేషుడి గురించి. 'ఆదిశేషుడంటే ఆ పెద్దపామేనా!'

'పాము రూపంలో ఉన్న పరమ భాగవతుడు. ఆ నారాయణమూర్తికి కైంకర్యం చేయటంలో మొదటివాడు. శేషప్రవృత్తిలో, అంటే, శ్రీమన్నారాయణునికి కైంకర్యం చేయడంలో ఆయనకు ఆయనే సాటి. మరొకరితో పోల్చలేము. ఎందుకంటే శ్రీమన్నారాయణుని ఇంగితం తెలిసి తన శరీరాన్ని మార్చుకుంటూ రకరకాలుగా సేవ చేస్తాడు.

"ఇంగితం అంటే ఏమిటి బామ్మా?"

"మనసులో మాట నోటితో చెప్పకుండానే తెలుసుకోవడం"

"అదేలా సాధ్యం!"

"ఏం! ఎందుకుకాదు. మీరు అడగకుండానే అమ్మ అన్ని చేసిపెట్టట్లేదా.... అలాగే ఆదిశేషుడూ అన్నిసేవలూ చేస్తాడన్న మాట!"

"ఇదే విషయాన్ని స్తోత్రరత్నంలో ఆళవందార్ సంస్కృతంలో చెప్పారు.

**నివాస శయ్యాసన పాదుకాంశుకో**
**పధాన వర్షాతప వారణాదిభిః ।**
**శరీరభేదై స్తవ శేషతాం గతైః**
**యథోచితం శేష ఇతీరితే జనైః ॥** *(స్తో.ర. 40)*

"నువ్వు పాటల మీద పాటలు పాడేస్తున్నావు. అందులో అర్థం చెప్పు...."

"చెప్తున్నాగా, తొందరపడతావేం. మొదట పాడింది పాశురం తమిళంలో, ఇప్పుడు పాడింది శ్లోకం సంస్కృతంలో. అర్థం మాత్రం దాదాపు ఒకటే. ఆదిశేషుడు శ్రీమన్నారాయణునికి అనేక విధాలుగా సేవ చేస్తాడు. అవి ఏమిటంటే, నివాస= నివసించటానికి వీలైన స్థానము ఆదిశేషుడి మీదే కదా లక్ష్మీనారాయణులు కూర్చునేది.

శయ్యా= పడుకోవడానికి పక్కలాగా మెత్తగా ఉంటాడు.

ఆసనము= కూర్చునే ఆసనము, నారాయణుడు "కూర్చుందామా!" అని అనుకుంటుడగానే సింహాసనంలా మారిపోతాడన్నమాట.

పాదుక= చెప్పులు. నడుద్దామా అనుకోగానే పాదుకలు గాను, అంతేనా అంశుక=ధరించే వస్త్రంగా, ఉపధాన= తల గడగా, వర్ష+ఆతప+వారణ+ఆదిభిః=ఎండా, వాన మొదలైన వాటినుండి కాపాడే ఛత్రముగ, ఇలానే మరికొన్ని ఆస్వామి ఏది సంకల్పిస్తే ఆరూపంలోకి రెప్పపాటులో తనని మార్చేసు కుంటాడు ఆ అనంతుడు. అందుకే కైంకర్యనిష్ఠలో అంతులేని వాడని పెద్దలంటారు.

శ్రీమన్నారాయణుడే జగద్రక్షకుడైనా, పరమపదంలోకి శత్రువులు వచ్చే అవకాశం లేకున్నా, అనంతుడు స్వామిని నిరంతరం రక్షించుకుంటూ ఉంటాడు".

"బామ్మా భగవద్రామానుజులు గురించి చెప్పేటప్పుడు చెప్పావు కదా! ఆదిశేషుడు ఎల్లవేళలా అన్నిరకాల సేవలు చేయటం వలన శ్రీమన్నారాయణ తత్త్వం ఆయనకు తెలిసినట్టు ఇంకెవ్వరికీ తెలియదని ఆదిశేషుని అంశంగా ఉడయవర్లు ఈ లోకంలో అవతరించారని చెప్పావు కదా!"

"అవునురా కన్నా. మన ఎంబెరుమానార్లు, వరవర మునులు ఆదిశేషుని అంశ. అంతటి శక్తి సంపన్నులు, జ్ఞానవైరాగ్యరాశులు కాబట్టి ఆ శ్రీమన్నారాయణ తత్త్వాన్ని వేయి ముఖాలుగా మనలాంటి అల్పబుద్ధులకు, మందబుద్ధులకు కూడా అర్థమయ్యేలాగా చెప్పారు. తిరుక్కోళూరమ్మాళ్ కూడా 'కొడై ముదలానదావేనో అనంతాఁవార్పోల' అన్నది.

అంటే ఏమిటి?

'గొడుగు మొదలైన రూపాలు ధరించానా ఏమి? ఆదిశేషునిలాగ' అని అర్థం.

'బామ్మా ఇంకోక కథ చెప్పవా!

నాకు పనులున్నాయిరా నాన్నా!

పోనీలే చిన్నకథ చెప్పు. రాత్రి పెద్దకథ చెబుదువుకాని...

ఓరి పిడుగా.... రాత్రి కథ కూడా ఇప్పుడే ఒప్పందమా!

సరే విను తిరుక్కోళూరమ్మాళ్ నైచ్యానుసంధానం చేస్తూ శ్రీమద్రామానుజాచార్యులవారితో 81 వార్తలు చెప్పింది కదా! అందులో ఒకటి 'అడివారివాంగినేనో కొంగిల్ పిరాట్టియైప్పోల' అంటే 'అడిగి పాదుకలు పొందిన కొంగిల్ అమ్మగారిలాగా' అని అర్థం.

"ఎవరిపాదుకలు?"

శ్రీమద్రామానుజుల పాదుకలు. ఈ కొంగిల్ పిరాట్టి గురించి తిరుక్కురుగైపిరాన్‌పిళ్ళై ఆరాయిరప్పడిలో గురు పరంపరా ప్రభావంలో ఈ అమ్మగారి ప్రస్తావన వస్తుంది. ఈమె అసలుపేరు సుమతి. ఇప్పటి కేరళలోని కొంత ప్రాంతాన్ని ఆరోజులలో 'కొరిగునాడు' అని పిలిచేవారు. ఈ సుమతి ఆప్రాంతంలోనే ఉండేది.

వరసగా కొన్ని సంవత్సరాలు వర్షాలు పడక ఆప్రాంత మంతా తీవ్రమైన కరువుబారిన పడింది. అక్కడ పనులు లేక బతకలేక చాలామంది పనులు వెతుక్కుంటూ వలస వెళ్ళారు.

వలస వెళ్ళటమంటే ఏమిటి?

కరువుకాటకాల వల్లో, మరే కారణంతోనో చదువులకోసం, ఉద్యోగాలకోసమో ఉన్న ఊరు వదిలి వేరేప్రాంతాలలో స్థిర పడటాన్ని 'వలస' అంటారు. ఒకొక్కసారి వాళ్ళ స్వంత ఊళ్ళల్లో పరిస్థితులు చక్కబడితే వెనక్కి వెళ్ళడం కూడా జరుగుతుంది. సరే ఈ సుమతి భర్తతో కలసి కొంగైనాడు నుంచి శ్రీరంగం వలస వెళ్ళింది. అక్కడ ఉన్నకాలంలో మన ఎంబెరుమానార్ గురించి విన్నది. ఎందరో గొప్పగొప్ప ప్రభువులు కూరత్తార్వాన్ లాంటి జ్ఞానసంపన్నులు వారి పాదసేవచేయడం చూసి తనుకూడా భర్తతో కలిసి ఆచార్యసేవ చేసింది. ఆచార్యపాదసేవ ప్రభావం వాళ్ళ స్వగ్రామం మళ్ళీ వర్షాలు పడటం వలన సుభిక్షంగా మారిందని తెలిసి అక్కడికే వెళ్ళిపోదామని ప్రయాణమయ్యారు.

"ఆచార్యసేవ చేస్తే ఊరు సుభిక్షమవుతుందా?"

ఆచార్యసేవ ప్రభావం వలన ఊరు సుభిక్షమవటమే కాదు, సకల సంపదలు దొరుకుతాయి. జ్ఞాన వైరాగ్యాలతోపాటు మోక్షం కూడా దొరుకుతుంది. అందుకే శ్రీవరవరముని సదాచార్యులను ఆశ్రయించిన శిష్యుడు ఎన్నిలాభాలు పొందుతాడో ఇలాచెప్పారు.

**జ్ఞానమ్ అనుట్టానమ్ ఇవై నన్గాగవే యుడయ**
**నాన గురువై అడైన్దక్కాల్ మానిలత్తీర్**
**తేనార్ కమల త్తిరుమామగళ్ కొఱునన్**
**తానే వైగున్దమ్ తరుమ్॥**

ఆచార్యులను పక్షులతో పోలుస్తారు. పక్షులకు రెండు రెక్కలున్నట్లు ఆచార్యులకు జ్ఞానం, అనుష్ఠానం ఉంటుందట, ఆ రెండూ ఉన్న ఆచార్యుని శ్రీపాదాలను చేరితే ఆ లక్ష్మీపతి తానే వైకుంఠప్రాప్తి కలిగిస్తాడట. అంతకంటే ఇంకేం కావాలి. పైగ మన సుమతి ఆశ్రయించింది ఏవరిని? జగదాచార్యులైన శ్రీమద్రామానుజులను వారి ముందు అవతరించిన ఆచార్యులు, వారి తరవాత అవతరించిన ఆచార్యులు కూడా వారి సంబంధం వలననే పరమపదం పొందారని పెద్దలు చెపుతారు.

'అప్పుడేం జరిగిందో చెప్పు!' *(ఇంకా ఉంది.)*




# తిరుప్పల్లాండు

వైశారదీ

*(గతసంచికతరువాయి...)*

అణ్డక్కులత్తు క్కదిపతి యాకి, యశుర రిరాక్కదరై
ఇణ్డక్కులత్తై ఎడుత్తు క్కళైన్ద ఇరుడీకేశన్ తనక్కు।
తొణ్డక్కులత్తి లుళ్ళీర్ వన్దడి తొ(్ళుతు ఆయిరనామం శొల్లి
పణ్డై కులత్తై తవిర్న్దు, పల్లాండు పల్లాయిరత్తా ణ్డెన్మినే॥ 5

| | |
|---|---|
| **అండక్కులత్తుక్కు** | = అనేక బ్రహ్మాండ సమూహమునకు |
| **అధిపతియాకి** | = నిర్వాహకుడై యుండి |
| **అశురర్ ఇరాక్కదరై** | = అసురులు, రాక్షసులను |
| **ఇండక్కులత్తై** | = గుంపులుగానున్న దుష్ట సమూహములను |
| **ఎడుత్తు క్కళైన్ద** | = సమూలముగా నశింపచేసిన (ఎత్తిపారవేసిన) |
| **ఇరుడీకేశన్ తనక్కు** | = ఇంద్రియనియామకుడైన హృషీకేశునకు |
| **తొణ్డ క్కులత్తిల్** | = సేవచేయు వర్గమునందు |
| **ఉళ్ళీర్** | = ఉండదలచినచో |
| **వన్దు** | = వచ్చి |
| **అడి తొ(్ళుదు** | = శ్రీపాదములను సేవించి |
| **ఆయిర నామం శొల్లి** | = (విష్ణు) సహస్రనామాన్ని పలికి |
| **పణ్డై కులత్తై** | = పుట్టుకతో వచ్చిన మీజాతిని |
| **తవిర్న్దు** | = వదిలి "జ్ఞానజన్మను పొంది శ్రీవైష్ణవులై" |
| **పల్లాణ్డు** | = పలు సంవత్సరములు మంగళమగుగాక! |
| **పల్ ఆయిరత్తు ఆణ్డు** | = కొన్నివేల సంవత్సరములు మంగళమగు గాక! |
| **ఎన్మినే** | = అని పలుకండి! |

**తా:** ఒక అందం అంటే 'భూః' 'భువః' అంటూ మొదలయ్యే 14లోకాలు. సూర్యుడు చంద్రుడువంటివారంతా ఇందులో ఉంటారు. ఇలాంటి కొన్ని అండాల సమూహములను ఒక బ్రహ్మాండము అంటారు. అలాంటి బ్రహ్మాండములకు అధిపతి మనస్వామి. దుష్టబుద్ధి కలిగిన అసురులను, భగవంతుడంటే ద్వేషం కలిగిన రాక్షసులను, గుంపులు గుంపులుగానున్న దుష్ట సమూహమును సమూలముగా నశింపచేయువాడు అతడే.

మన ఇంద్రియ నియామకుడైనందున హృషీకేశుడైనాడు. ఆతనికి (హృషీక=ఇంద్రియములను ఈశ=శాసించువాడు) సేవచేయు వర్గమునందు ఉండదలచినచో వెంటనే వచ్చి ఆతని శ్రీపాదాలను సేవించుడు. ఆతనికి కల సహస్రనామాలను పలుకుడు. పుట్టుకతో ఏర్పడిన లౌకికుల సంబంధాన్ని వదిలి జ్ఞానజన్మచే కలిగిన భగవత్సంబంధంద్వారా శ్రీవైష్ణవులైన భక్తులారా! మన స్వామికి పలువేల సంవత్సరములు మంగళము అగుగాక అని పాడుదము. వేంచేయండి!

**ఎన్దై తన్దై తన్దై, తన్దై తమ్మూత్తప్పన్, ఏళ్‌పడికాల్ తొడంగి.**
**వన్దు వళ్ళి వళ్ళి యాట్చెయ్ గిన్డోం, తిరువోణ తిరువిళ్ళవిల్**
**అన్దియమ్బోది లరియురు వాగి, అరియై అళ్ళిత్తవనై,**
**పన్దనై తీర ప్పల్లాండు, పల్లాయిఅత్తాణ్డెన్ఱు పాడుదుమే ॥ 6**

| | |
|---|---|
| **ఎన్దై** | = నేను, నా తండ్రి (2 తరాలు) |
| **తన్దై** | = వారి తండ్రియు (తాత+3) |
| **తన్దై** | = వారి తండ్రియు (ముత్తాత+4) |
| **తందై** | = వారి తండ్రియు (ముత్తాతకి తండ్రి+5) |
| **తమ్మూత్తప్పన్** | = వారి తండ్రియు, తాతయు (ముత్తాతకి + తాత 7వ తరములలో) |
| **ఏళ్‌పడికాల్** | = ఇట్లు ఏడు తరముల నుండియు |
| **తొడంగి** | = ప్రారంభించి |
| **వన్దు** | = వచ్చి |
| **వళ్ళి వళ్ళి** | = పరంపరగా |
| **ఆళ్** | = భగవత్సేవను |
| **శెయ్ గిన్డోం** | = చేయుచున్నాము |
| **తిరువోణ త్తిరువిళ్ళవిల్** | = శ్రవణా నక్షత్రమునకు చెందిన అవతార మహోత్సవమందు |
| **అన్ది అం పోతిల్** | = సూర్యాస్తమయ సుందర సమయంలో |
| **అరి ఉరువు ఆగి** | = నరసింహరూపియై |
| **అరియై** | = శత్రువైన హిరణ్యకశిపుని |
| **అళ్ళిత్తవనై** | = సంహరించిన స్వామిని |
| **పన్దనై తీర** | = ఆతని ఆయాసము తీరునట్లుగా |
| **పల్లాండు** | = అనేక సంవత్సరములు |
| **పల్.ఆయిరత్తు. ఆణ్డు** | = అనేక వేల సంవత్సరములకును మంగళమగుగాక |
| **ఎన్ఱు పాడుదుమే** | = అని పాడుదుము. |

**తా:** పెరియాళ్వార్లు క్రిందటి పాశురాలలో 7 తరములనుండి అని చెప్పుతూ వచ్చారు. 'ఆ 7 తరాలు ఏమనగా 1) నేను, 2) నా తండ్రియు, 3) వారి తండ్రియు, 4) వారి తండ్రియు, 5) వారి తండ్రియు, 6) వారి తండ్రియు, 7) 7వ తరం తాతయు ఇలా 7 తరముల నుండి అవిచ్ఛిన్నముగా భగవంతునికి సేవచేయు గొప్ప కుటుంబం మాది. అందమైన సూర్యాస్తమయ సమయంలో నరసింహరూపియై అవతరించి శత్రువైన హిరణ్యకశిపుని సంహరించిన స్వామికి ఆ అలుపుతీరునట్లు ఈ శ్రవణానక్షత్రపు అవతార మహోత్సవ సమయంలో మంగళము పాడుదుము.

*(ఇంకా ఉంది.)*

# భగవానుని ఆశ్రితవాత్సల్యము

శ్రీమాన్ సముద్రాల శఠకోపాచార్యస్వామి-వరంగల్

సర్వజగద్రక్షకుడైన శ్రీమన్నారాయణుడు తప్ప తనకు వేరొక దిక్కులేదని దృఢవిశ్వాసంతో భగవత్పాదారవిందాలను ఆశ్రయించిన ప్రపన్నుణ్ణి భగవానుడు ప్రేమతో చేరదీస్తాడు. అతనిలోని దోషాలను పట్టించుకోడు. ఆవు తన దూడయొక్క మాలిన్యాన్ని నాలుకతో శుభ్రపరచి, దూడను అక్కున చేర్చు కున్నట్లు పరమాత్మ అనన్యభక్తిభావంతో తనను ఆశ్రయించిన భక్తుడు దురాచారపరుడైనను అతనిని శిక్షించకుండా రక్షిస్తాడు అనే విషయం కాకాసురవృత్తాంతం ద్వారా స్పష్టమగుచున్నది.

జగన్మాతయైన సీతాదేవి విషయంలో మహాపచారం చేసిన కాకాసురుడు వధార్హుడే అయినను శ్రీరామచంద్రస్వామి వధించలేదు. అతణ్ణి రక్షించేవాడు వేరొకరు ఎవరూ లేరని కాకాసురునికి తెలియజెప్పుటకే బ్రహ్మాస్త్రాన్ని ప్రయోగించెను. కాకాసురుడు తండ్రియైన దేవేంద్రునిచే, సకల దేవతాగణముచే విడువబడెను. ముల్లోకాలూ తిరిగెను. వేరొక దిక్కులేక శ్రీరామ చంద్రుని పాదాలచెంత పడెను. కాకాసురుణ్ణి శరణా గతునిగా భావించి సర్వలోక శరణ్యుడైన రామచంద్రస్వామి రక్షించెను. శ్రీరామచంద్రస్వామియొక్క ఆశ్రితవాత్సల్య గుణవైభవాన్ని వాల్మీకి మహర్షి ఈవిధంగా వర్ణించెను.

**సతం విపతితం భూమౌ శరణ్య శ్శరణాగతం ।**
**వధార్హమపి కాకుత్స్థః కృపయా పర్యపాలయత్ ॥**

తన ప్రాణములకంటేను ఎక్కువ ప్రియమైన (ప్రాణేభ్యోపి గరీయసీ) సీతాదేవి విషయంలో అపచారపడిన కాకాసురుణ్ణి తననాశ్రయించినవానిలోని దోషాలను చూడలేని రాఘవుడు రక్షించెను.

విభీషణుడు శరణాగతుడేయైనను శత్రువువద్దనుండి వచ్చినాడు, కావున అతడు మనకు అనుకూలుడిగా కనిపిస్తున్ననూ నమ్మదగినవాడు కాడు.

**శత్రోస్సకాశా త్సంప్రాప్తః సర్వదా శంక్య ఏవ హి ।**
**విశ్వాసయోగ్య స్సహసా న కర్తవ్యో విభీషణః ॥**

అని సుగ్రీవ శరభాదులు పేర్కొన్ననూ ఆశ్రితవత్సలుడైన శ్రీరామచంద్రుడు వారి మాటలను అంగీకరించలేదు. మిత్రభావముతో వచ్చినవారిలో ఒకవేళ దోషములున్ననూ వారిని నేను వదలలేను. విభీషణుడు శరణు వేడినందువలన అభయమిచ్చి రక్షణభారము వహింతును. నా అభిప్రాయమును సత్పురుషులు ప్రశంసింతురు, అంతేకాని నిందింపరు.

**మిత్రభావేన సంప్రాప్తం న త్యజేయం కథంచన ।**
**దోషో యద్యపి తస్యస్యాత్ సతామేతదగర్హితమ్ ॥**

అంటూ శ్రీరామచంద్రప్రభువు ఆశ్రితుని పట్ల వాత్సల్యమును ప్రదర్శించెను. పరమాత్మ సేవతో సమానమైనది వేరొకటి లేదనే నిశ్చయబుద్ధితో అనన్యభావముతో నన్ను ఆశ్రయించు వ్యక్తి మిక్కిలి దురాచారపరుడైనను అతనిని నేను సత్పురుషునిగానే భావించెదను.

**అపిచేత్ సుదురాచారో భజతే మామనన్యభాక్ ।**
**సాధురేవ సమంతవ్యః మస్యగ్వ్యవసితో హి సః ॥** అని భగవద్గీతలో శ్రీకృష్ణపరమాత్మ స్వయంగా ప్రకటించెను.

పరమదయాళువైన పరమాత్మ తన కృష్ణావతార ఫలంగా అర్జునుణ్ణి ఒక కారణంగా పెట్టుకొని ఉజ్జీవించాలనుకునే (జననమరణరూపమైన సంసారచక్రం నుండి విముక్తులై పునరావృత్తిరహితమైన శాశ్వతమైన పరమపదమును చేరి శ్రీమన్నారాయణుడి నిత్యసేవా భాగ్యాన్ని పొందాలనుకునే) వారందరికి చరమశ్లోకంగా ప్రసిద్ధిని పొందిన...

**సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ! ।**
**అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః ॥**

అను శ్లోకమును ఉపదేశించెను. మోక్షసాధనములుగా చెప్పబడిన కర్మ-జ్ఞాన-భక్తియోగములకు, నేను కర్తను, భోక్తను, ఈ కర్మ నాది అనే కర్తృత్వ, భోక్తృత్వ, మమకారాలను విడిచి, నన్నే విశ్వాసంతో ఉపాయముగా(శరణు)పొందుము. ఇంత కాలము నీవు నన్ను పొందుటకు ఆటంకముగా ఉన్నట్టి సకల పాపరాశిని తొలగించి నిన్నుద్ధరింతును. ఇక దుఃఖించకుము అని శ్రీకృష్ణపరమాత్మ అర్జునుడికి అభయప్రదానము చేసెను.

నన్నాశ్రయించినవాని సకల పాపాలను, సకల దోషాలను నేను తొలగిస్తానని ప్రతిజ్ఞ చేసిన కృష్ణపరమాత్మ ఆశ్రితుడైన అర్జునుని సైంధవవధకు సంబంధించిన ప్రతిజ్ఞను తానే నెరవేర్చెను. ఆశ్రితుని రక్షించుటకు కౌరవ-పాండవ సమరంలో ఆయుధం పట్టను అనే తన ప్రతిజ్ఞను కూడా విస్మరించి అర్జునుని రక్షించుకొనుటకు భీష్మాచార్యులపైకిరథచక్రమును విసర బోయెను.

స్వప్రయత్నమును వీడి త్రికరణశుద్ధిగా భగవానుడే రక్షకుడని

గుర్తించి గోవిందనామోచ్చారణ పూర్వకముగా ద్రౌపది పరమాత్మను శరణువేడినది. ద్రౌపది శరణాగతి ఫలించినది. ఆమెను భగవానుడు రక్షించినాడు. అయినా పరమాత్మకి ద్రౌపది విషయంలో తృప్తి కలుగలేదు. శరణాగతురాలైన ద్రౌపదికి నేను ఎంతగానో ఋణపడియున్నాను. ఆ ఋణం రోజురోజుకూ ఎన్నో రెట్లు పెరుగుచున్నది.

**గోవిందేతి యదాక్రందత్ కృష్ణా మాం దూరవాసినమ్ ।**
**ఋణం ప్రవృద్ధమివ మే హృదయాన్నాపసర్పతి ॥**

అని శ్రీకృష్ణపరమాత్మయే పేర్కొనెను. పాండవులలో నేను అర్జునుణ్ణి (పాండవానాం ధనంజయః) పంచపాండవులు నాకు పంచప్రాణములు (మమ ప్రాణా హి పాండవాః) అని శ్రీకృష్ణపరమాత్మ పాండవప్రియత్వాన్ని చాటి, పాండవదూతగా, పార్థసారథిగా, జగద్గురువుగా నిలిచి చరమశ్లోకోపదేశం కూడా చేసినది వారిలోని గుణాలనుబట్టి కాదు. వారు తనను శరణువేడిన ద్రౌపదికి భర్తలు అయినందుననే ప్రియతములైనారు. లేకపోతే పాండవులు చేసిన మహాపచారానికి, శ్రీకృష్ణపరమాత్మ ఎప్పుడో వధించాల్సి ఉండెనట.

దుశ్శాసనుడు ద్రౌపదిని కౌరవసభలోకి బలవంతంగా తీసుకొనివచ్చి వస్త్రాపహరణం చేయుచుండగా పాండవులు తమకు శక్తియుండి కూడా తాము దుర్యోధనుడికి దాసులమై నాము అనే కారణంచేత అడ్డగించలేదు. ఆదశలో ద్రౌపది "గోవింద! పుండరీకాక్ష! రక్ష మాం శరణాగతాం" అని కృష్ణుని పరత్వాన్ని భగవద్రక్షకత్వాన్ని గుర్తించి తన రక్షణకై భగవంతుని ఆశ్రయించినది. పాండవులు ధర్మసంకటంలో పడి ద్రౌపదిని రక్షించలేకపోయినప్పుడు ఆమెకు జరుగుతున్న వస్త్రాపహరణ దృశ్యాన్ని చూడలేక దూరంగా పోవలసి యుండిరి. కాని పోలేదు. పాండవులు ద్రౌపది తమకు భార్య అని కాకపోయినా, శ్రీకృష్ణ భక్తురాలు అనే ఉద్దేశ్యంలోనైనా ఆమెను కాపాడవలసినది. లేక దూరంగా పోవలసినది. కన్నులనైనా మూసుకోవలసింది. పైగా శ్రీకృష్ణునివల్ల మేములెక్కకు అందనన్ని ఉపకారాలను పొందాము. ద్రౌపదికి జరిగే అవమానాన్ని అడ్డుకోకపోతే శ్రీకృష్ణునికి ముఖమెట్లా చూపగలము అని కూడా వారు ఆలోచించలేదు.

భగవంతుని విషయంలో జరిగే అపచారాన్ని భగవంతుడు క్షమిస్తాడు గానీ, ఆయన ఆశ్రితులైన భక్తులవిషయంలో అపచారం జరిగితే క్షమించడు. శిక్షిస్తాడు అని తెలిసికూడా భగవంతుని శరణు జొచ్చిన ద్రౌపది విషయంలో పాండవులు తమ కర్తవ్యాన్ని నిర్వర్తించ లేదు. ఇంతటి ఘోరమైన అపరాధమును చేసిన పాండవులను శ్రీకృష్ణపరమాత్మ పరిత్యజించవలసియున్నను తాను పాండవులను రక్షించకపోతే, వారుకౌరవులచేతిలో మరణిస్తారు. అప్పుడు తననాశ్రయించిన ద్రౌపది మంగళసూత్రమును కోల్పోతుంది. అమితంగా దుఃఖిస్తుంది. ద్రౌపది కొరకైనా ఈ పాండవులను రక్షించాలని ఆశ్రితవత్సలుడైన శ్రీకృష్ణపరమాత్మ భావించెను.

శ్రీకృష్ణపరమాత్మ ఆశ్రితురాలైన ద్రౌపది మనసులో ఏర్పడిన ప్రతీకారేచ్ఛను గుర్తించియే పాండవదూతగావెళ్ళినాడు. కౌరవుల మనసులలో పాండవులపట్ల ద్వేషభావం పెరుగునట్లు, సంధికి అవకాశమే లేకుండగా తప్పనిసరిగాకౌరవపాండవ యుద్ధము జరుగునట్లుగా దూతకృత్యమును నిర్వర్తించినాడు.

యుద్ధముచేయను (న యోత్స్యామి) అన్నట్టి అర్జునుడు మనసు మార్చుకొని కృష్ణా! నీమాటను పాటిస్తాను (కరిష్యే వచనం తవ) అని తనకు విన్నవించే స్థితికి తీసుకురావడానికే పార్థునికి సారథియైనాడు.

ఆయుధము పట్టనని ప్రతిజ్ఞచేసినట్టి శ్రీకృష్ణపరమాత్మ, స్వసంకల్పబలముతోనే సమస్త కౌరవసైన్యముయొక్క మదగర్వమును, బలమును నశింపజేసి అర్జునుణ్ణి యుద్ధరంగంలో నిమిత్తమాత్రుడిగా ఉండుము (నిమిత్తమాత్రం భవ సవ్యసాచిన్) అని ఆదేశించి అర్జునుడిచేతిలో కౌరవసైన్యము అంతరించినట్లుగా ప్రపంచానికి చూపెను. తననాశ్రియంచిన ద్రౌపది మాంగల్యరక్షణకే ఈ విధంగా కృష్ణపరమాత్మ పాండవులకు అడుగడుగునా సహాయపడెను అని ఆశ్రితవత్సలుడైన భగవానుని వైభవాన్ని మణవాళమహామునులు శ్రీవచనభూషణములోని మొదటి ప్రకరణంలో 20,21,22 సూత్రముల ద్వారా వివరించినారు.

అనితరసాధ్యమైన ఆశ్రితవాత్సల్య గుణమును అట్లే అభయ ప్రదానము, ఆర్తుల ఆర్తి హరణము, పాపహరణము, పరమోన్నతపద ప్రదానము చేయునట్టి విశిష్టగుణసాగరుడైన, దయాసింధువైన శ్రీమన్నారాయణుడే సంసేవ్యుడు.

**వాత్సల్యా దభయప్రదానసమయా దార్తార్త నిర్వాపణాత్**
**కారుణ్యా దఘశోషణాత్ అగణిత శ్రేయః పదప్రాపణాత్ ।**
**సేవ్యః శ్రీపతిరేక ఏక జగతా మేతేభవన్ సాక్షిణః**
**ప్రహ్లాదశ్చ విభీషణశ్చ కరిరాట్ పాంచాల్యహల్యా ధ్రువః ॥**

అని పేర్కొనే పరమప్రామాణిక శ్లోకసారాన్ని మనసులో నిలుపుకొని ఆశ్రితవాత్సల్యగుణవిశిష్టుడైన భగవంతుని పాదాలను త్రికరణశుద్ధిగా ఆశ్రయిద్దాం! భగవదనుగ్రహంతో జీవితాన్ని శుభప్రదమొనరించుకుందాం! ఉజ్జీవనయోగ్యంగా తీర్చిదిద్దు కుందాం!

# మన ఆళ్వార్లు



పెరియాళ్వార్లు

వైశారదీ

(గత సంచిక తరువాయి)

*ఆయనకి అపురూప, అతిలోకసుందర దివ్యమంగళ విగ్రహమున్నది. మరి ఆయనకి రూపం లేదని చెప్పాయే కొన్ని శ్రుతులు? అవును. అలాంటివాటికి మన శరీరాలవలె మురికికి నిలయాలైన పాంచభౌతిక శరీరాలు లేవని అర్థం తప్ప అసలే లేదని అనరాదు. అలానే ఆయన ఇంద్రియాలు లేని వాడనికొన్ని శ్రుతులు వక్కాణించాయే? అవును. మనలా ఇంద్రియాలమీదే ఆధారపడి పనులు చేయాల్సిన అగత్యం లేనివాడని అర్థం. తనతో చేతనా చేతనాలను శరీరంగా పెట్టుకొన్నాడు. తనలాంటి వాడిక ఎవ్వడూలేడు కనుక తానద్వితీయుడు.)*

ఒకటే తత్త్వమని అంటారు. ఇలా సగుణ, నిర్గుణ శ్రుతులను భేదాభేద శ్రుతులను, ఏకత్వ బహుత్వ ప్రతిపాదన శ్రుతులను, సశరీరక, అశరీరక శ్రుతులను సమన్వయం చేసి చూపే ఘటక శ్రుతులు కొన్ని ఉన్నాయి. అవి తెలిస్తే తప్ప ఈ వేదవాక్యాలకి సమాధానం లభించదు. అవి తెలియక పోవడమే ఇంతకాలమూ వీరందరూ ఇలా వాదులాడటానికి కారణమైంది. పురుష సూక్తాదులలో ఆ నారాయణతత్త్వాన్ని లక్ష్మీవిశిష్టునిగా గుర్తించాలని స్పష్టంగ ఉంది. కనుక జగత్కారణ తత్త్వం లక్ష్మీనారాయణ తత్త్వమే. దానికి సర్వాత్మనా లొంగి దాని ఆజ్ఞయైన శాస్త్రానికి వశపడి ఆత్మార్పణ ఆతనికే కావించి పరతంత్రమై మెలుగుటయే జీవుని లక్షణం.

ఈ జీవునికి అనాదిగ వస్తున్న కర్మబంధం తొలగి నిత్యానంద స్వరూపుడై సత్యకాముడై సత్యసంకల్పుడై మెలుగుటే లక్ష్యం. దానికి సాధనమూ లక్ష్మీనాథుని చరణ ద్వంద్వమును సమాశ్రయించుటే. ఆతని కైంకర్యముగా తన స్వరూపానికి తగినట్లు, వేదప్రోక్తమైన సత్కర్మాచరణ చేయాలి. అది భగవత్సేవగ మారుతుందనే జ్ఞానం కలగాలి. భగవంతుని ప్రీతికోసం ఆసేవ మానలేక చేయాలి. అన్ని చేసినా భగవంతుని నిర్హేతుక కృప ఒక్కటే తనకు రక్ష అని పరిపూర్ణంగ విశ్వసించాలి. ఇదే ఉపాయం. దానిలో అహంకారము కానీ, కీర్తికాంక్షగాని, స్వార్థము కానీ, ఏమాత్రం చోటుచేసుకున్నా పతనం తప్పదని గుర్తించాలి.

**ఆర్తి తీరింది... ఆనందం పొంగింది:**

ఇక్కడి పండితులు తమ విజ్ఞానమే సర్వార్థసాధకమను కున్నారు కనుక, వారి అహంకారమే వారికాటంకమై తత్త్వం ప్రకాశించలేదు. దయాళువు అయిన శ్రియఃపతి అల్పజ్ఞుడనైన ఈ దాసుని తన పరికరంగా చేస్కొన్నాడు. తన కార్యం జరుపుకొంటున్నాడు. తన సేవను నిర్హేతుకంగా ప్రసాదించాడు" అంటూండగా పైన సభలో కట్టి ఉంచిన ధనరాశి వీరి చెంత ఊడిపడింది. సదస్యులంతా ఆశ్చర్యపడి తమ వాదాలు పసలేనివని అంగీకరిస్తూ వీరి ఉపదేశాన్ని శిరోధార్యమని అంగీకరించారు. పరతత్త్వనిర్ణయసభ ముగిసింది. రాజు పండితులూ కలిసి వీరికి 'పట్టర్‌పిరాన్' అనే బిరుదు సమర్పించుకొని పొంగిపోయారు. ఘన సన్మానంతోపాటు వల్లభదేవరాయులు గూడ వీరివద్ద సమాశ్రితుడై నాడు. వీరిని అంబారీపై అధిరోహింపచేసి, అతికోలాహలంగా ఆ పట్టణపు వీధులలో తిరువీధ్యుత్సవము జరిపాడు. ముందు చామరం వీస్తూ రాజు నడువగా పండితులంతా పంక్తులుదీరి వెనుకసాగగ, పురవీధులన్నీ జై జై నినాదాలతో ప్రతిధ్వనించాయి.

**పారతంత్ర్యం వీరి సొత్తు:**

సహజ వినయంతోపాటు సాధుస్వభావులైన శ్రీ విష్ణుచిత్తులకు ఈ ఆర్భాటమంతా చాల ఇబ్బంది కల్గిస్తోంది. అయినా చేయించినవాడు పైవాడు కనుక వాడికి ఇష్టమై చేయించుకొనేటపుడు అవును కాదు అనడానికి తాను ఎవరు? అనే పరాధీనప్రవృత్తితో ఉత్సవవైభవాన్ని అనుభవిస్తూ ఉండిపోయారు. ఇంతలో గరుడవాహనారూఢుడైన శ్రియఃపతి సర్వాభరణభూషితుడై సకల పరివారసమేతుడై వీరి మానసవీధిలో సాక్షాత్కరించాడు. ఆనందము పట్టలేకపోయారు. ఉబ్బి తబ్బిబ్బై అలా సేవిస్తూ ఉండిపోయారు. ఆపాదమస్తకము అలరారే ఆ అందాలరాశిని ఆస్వాదిస్తూ ఉండిపోయారు.

**అతిస్నేహమున్నచోట మనసు పాపాన్ని శంకిస్తుంది :**

ఇంతలో విష్ణుచిత్తులకి భయం వేసింది. అతిస్నేహ మున్న చోట ఆ ప్రేమించిన వస్తువునకేమి ఉపద్రవం కలుగుతుందో అనే

భయం కూడా ఉంటుంది. వీరు ప్రగాఢంగా ప్రేమించిన పరాత్పరుని సౌందర్యం ఎక్కడ తన చూపుల వేడికి కందిపోతుందో ననే భయం వేసింది. కేవలం తానేకాదు. ఇక్కడ నడివీధిలో ఇందరి కన్నులు ఆతనిపై బడితే ఎక్కడ దృష్టిదోషం తగులుతుందోనని బెంగవేసింది. నిజానికి ఆస్వామి వారికి తప్ప ఇతరులకెవ్వరికీ గోచరించనేలేదు. కానీ, వీరుమాత్రం, ఆయన అందరికీ కన్పిస్తున్నాడ అనుకున్నారు.

భగవంతునికి రెండురూపాలున్నాయి. ఒకటి తనకంటూ ధరించే అసాధారణదివ్యమంగళకరమైన అప్రాకృత విగ్రహము. రెండవది ఈ కనిపించే ప్రకృతినంతనూ తన చిత్రవిచిత్ర వర్ణాత్మకమైన దేహంగ చేస్కొన్నరూపం. అంటే, దేనిని చూచిన అది భగవంతుని శరీరమేనని, ఈ రూపం ద్వారా భగవంతుడు దర్శనమిస్తున్నాడని భావించాలి. అన్నింటిని భగవద్భావనతో, ఆరాధ్యభావంతో గుర్తించాలి. శ్రీ విష్ణుచిత్తులలాంటి దృష్టికలవారు. శ్రీశుకునికి ఆ దృష్టి ఉండేదిట. అపుడు భగవంతునికి అనుకూలంగ స్పందించే వాటిని తమతో కలుపుకొని ఆనందాన్ని పెంచుకొంటారు జ్ఞానులు. వ్యతిరేకంగా ప్రవర్తించేవాటిని జాలితో, దయతో మార్చి మంచిగ నడిపే ప్రయత్నిస్తారు. అలా మారని వాటికి కలిగే నష్టాన్ని తమదిగా భావించి బాధపడుతూ ఉంటారు.

పల్లాండు! పల్లాండు!! పల్లాయిరత్తాండు!! : శ్రీ విష్ణుచిత్తులు ఈ చుట్టూ ఉన్న పండితవర్గమంతా ఇన్ని నెలలు వాదనలు చేసి గూడా ఆ శాస్త్రసారమైన నిన్ను గుర్తించలేకపోయిన అల్పజ్ఞులే. అలాంటివారి చీకటికన్నులు నీపై వ్రాలితే నీకాంతికి మచ్చలంటవా? కనుక ఈ ప్రాంతాలకు రాకు రాకు. రావద్దంటూ ప్రార్థించడం ప్రారంభించారు. ముందుగా వీరి మనసులు మార్చు. వీరి ప్రవృత్తిని మార్చుకో. అప్పుడు వీరిని నీవాళ్ళుగ తీర్చిదిద్దుకో! అలా చేయడానికి వీళ్ళని, వాళ్ళని, నీవు ప్రేమించాలి. ఆ రకంగ మారెడి నీ భక్తులకు, వారికి నీకూ ఉండే ఆ సత్సంబంధానికి, దానిని ప్రోత్సాహాన్నిచ్చే నీ దివ్యాభరణాలకీ, నీకూ, మాకూ మధ్య నిలిచి, మాదోషాలను తగ్గించి, స్వాతంత్ర్యాన్ని తగ్గించి, తండ్రీ శిశువులను దరిచేర్చే మా తల్లి శ్రీదేవికీ మంగళం. వేలు మంగళాలు. వందలు, కోట్లు మంగళములు. అంటూ, అటు భగవంతునికీ, ఇటు భగవంతునికి చెందిన ప్రజానీకానికీ, వారి మధ్య ప్రేమ బంధానికీ, అన్నింటికీ కలకాలం సుఖంగా ఉండాలంటూ, ఎవరి దృష్టీ పడరాదంటూ పైపైగా సమృద్ధిగ వర్ధిల్లాలంటూ, దోషాలన్నీ దూరమైపోవాలంటూ హారతి పట్టారు. తాము కూర్చున్న అంబారీ కిరువైపులా వ్రేలాడదీసిన గంటలు తీస్కొని మ్రోగిస్తూ 'పల్లాండు... తిరుకాప్పు!' అంటూ ద్రావిడభాషలో మంగళ గీతాలు ఆలపించారు.

వీరి భక్తి తన్మయతకు అందరూ అబ్బురపడి వీరిని తమకు ఉద్ధారకులుగా భావించారు. భగవద్భక్తిలో పిచ్చివారై, భగవంతునికి గూడా మంగళం పాడిన మహనీయులు కనుక వీరిని 'పెద్ద ఆళ్వార్లు' అని అంతా సంభావించారు. అదే 'పెరియాళ్వార్'గ వీరికి అన్వర్థనామమైంది. భగవంతుడు ప్రపంచమనే మహావృక్షానికి మూలం లాంటివాడు. ఆయనకి మంగళం పాడితే లోకానికంతకూ శ్రేయస్సు అనేది వీరి ఉపదేశసారం. మూలానికి నీరుపోసి ఎరువువేస్తే వృక్షమంతా కాంతులీనుతూ పచ్చని చిగుళ్ళతో కళకళ లాడుతూ ఎందరికో నీడనిస్తుంది గద!

అలానే భగవంతునికి మంగళం పాడి రక్షపెడితే ఆయన మీద ఆధారపడ్డ ప్రపంచమంతా సుసంస్కృతమౌతుంది. సురక్షితంగ ఉంటుంది. అపుడా లోకంలోని ప్రజాజీవనం కళకళలాడుతూంటుంది. ధార్మికత వర్ధిల్లుతుంది. ఆదేశం కూడా భగవంతునిలా ఎందరికో నివాసవృక్షమౌతుంది. మన భారతదేశము ఒకనాడలా ఉండేది కద! భగవంతునికి సద్భావనతో మంగళం పాడితే తిరిగి ఆ పూర్వపు వైభవాన్ని, అపూర్వమైన హోదాను ప్రగతిని పొందడంలో సందేహమే లేదు.

**మంగళాశాసనం ఎవరైనా ఎవరికైనా చేయవచ్చా! :**

అయితే అందరినీ రక్షించేవాడు భగవంతుడైతే ఆయనకి మనం రక్షపెట్టడమేమిటని అనిపించవచ్చు. నిజం! అయినా ప్రేమాధిక్యం కలచోట వారి వారి స్వభావాలను మరచిపోతారు. తల్లి ముదుసలి, తనయుడు యువకుడైనా, ఆతనికన్ని సేవలూ తానే చేయగలను అనుకుంటుంది ప్రేమాధిక్యతచేత. ఆతని శక్తిని, వయస్సును, తన శక్తిని వయస్సును మరచిపోయి. ప్రేమమాత్రమే పైకి పొంగి ఉండటం వల్ల ఆ పిల్లవానికన్నీ సేవలూ తానే చేస్తానని సిద్ధపడుతూంటుంది. ప్రేమ, సంబంధ జ్ఞానము, అందమూ మొదలైనవి, తనని ఎదటివారినీ మరచి వారికేదో తానే చేయాలనేట్టు చేస్తాయి. భగవంతునిలో, అందం, ఆతని సంబంధం గుర్తించి, ఆతనిపైకల ప్రేమతో, ఆతను తమరక్షణలో ఉండే పసిపిల్లవాని వంటివాడని, తాము రక్షకులవంటి వారమనే ప్రాజ్ఞులైన భక్త శిఖామణులంతా భావించారు. శ్రీరామయణ, భారతగ్రంథాలలో చూస్తే శ్రీరామ, శ్రీకృష్ణుల విషయంలో, అలా భావించి రక్షపెట్టిన వారెందరో ఉన్నారు. ఋషులూ పాలకులూ, విజ్ఞులు, అజ్ఞులూ అనే తేడా లేక అందరూ అలానే చేశారు. కనుక అదే శాస్త్రం, అదే నిర్ణయం. అదే తగినది. పెరియాళ్వార్లు అదే చేసి తరువాతి తరాల వారమైన మనకందరకూ ఆదర్శమై నిలచిపోయారు. *(ఇంకా ఉంది.)*



# శ్రీరామాయణము



ఎ. ఉషశ్రీ- శ్రీరాంనగర్

*(గత సంచికలో.... కోపంతో శపించిన తరువాత వాల్మీకి, తన మాటలను తానే పునఃపునః ఆవృత్తి చేసుకుంటూ శిష్యునికి చెప్పాడు. ఆయన అలా అనగా అనగా ఉంటే, కొత్త కొత్త అర్థాలు స్ఫురించసాగాయి. అది తనకే ఆశ్చర్యం కలిగించింది. మాటకి, పాటకి వీలయ్యేట్లుగా, వాయిద్యాలపై ప్రయోగించటానికి అనువుగా, పైకి ఒక శాపంలా కనిపించినా, లోపల ఒక సందేశాన్ని నింపుకున్న అద్భుతమైన పలుకులు అవి, అని వాల్మీకి గుర్తించాడు.)*

క్రమంగా వాల్మీకి స్నానాన్ని ముగించుకొని కుటీరానికి చేరాక, తానాడిన మాటలను మననంచేస్తూంటే పైకి అది కిరాతునిపై కోపంతో పల్కిన శాపంలా అనిపించినా, నిజానికి అది జగత్కారణుడైన శ్రీనివాసునికి జగద్రక్షణార్థం చేసే మంగళాశాసనంగా వాల్మీకి భగవానుడు గుర్తించాడు.

ఎలా వచ్చింది తన నోట ఈ మాట? అని ఆయన ఆలోచనలో మునిగి ఉన్నప్పుడు అక్కడికి ఆకాశంనుండి విచ్చేసిన చతుర్ముఖబ్రహ్మ, తనవల్లనే ప్రేరితురాలైన సరస్వతి, వాల్మీకి నోట ఈ శ్లోకాన్ని సాక్షాత్కరింపచేసిందని, అతని శోకాన్ని సాకుగా చేసుకొని, శ్లోకంగా పరిణమింప చేసింది తానేనని, లోకహితానికి ఉపయోగపడే అద్భుతమైన శ్రీరామకథ రచించడానికి ఇది నాంది అని, వివరాలన్నింటిని చెప్పి శ్రీరామాయణ రచనకు ఉపక్రమించమని ప్రేరేపిస్తాడు.

ఎలా వ్రాయాలి? ఎంత వ్రాయాలి? ఏమి వ్రాయాలి? వీటి వివరాలన్నీ చతుర్ముఖ బ్రహ్మ స్వయంగా ఆదేశించి వాల్మీకికి తగిన ఉత్సాహాన్ని నింపి వెళ్ళిపోయాడు.

శోకావేశం కట్టలు తెగినపుడు వాల్మీకి పలికిన ఆ పలుకులకు అర్థమిది. **నిషాద**=ఓ బోయవాడా!, **కామ మోహితం**= శృంగారమందు మునిగి ఉన్న; **క్రౌంచ మిథునాత్**= క్రౌంచపక్షుల జంటనుండి; **ఏకం**=ఒకదానిని (మగపక్షిని) **అవధీః**=చంపినావు. అందువల్ల, **త్వం**=నీవు, **శాశ్వతీ సమాః**= ఎక్కువకాలం, **ప్రతిష్ఠాం**=నిలకడను; **మా అగమః**=పొందవుగాక!

ఇది పైకి కనిపించే శాపం. శోకానికి గుర్తుగ వెలువడిన ఈ శ్లోకం తనవల్ల ఏర్పడినదే అని బ్రహ్మ సూచించిన తరువాత వాల్మీకి గుర్తించాడు. ఇది జగదుపకారకంగా బ్రహ్మ తనకు అనుగ్రహించినదని తెలిసింది. అది ఎట్లా? శ్రీరాముడు సాక్షాత్తూ నారాయణుడు, సీతాదేవి స్వయంగా లక్ష్మీదేవి. ఆమె ఎప్పుడు అతని వక్షఃస్థలాన్ని వదలక ఉండే దయా స్వరూపిణి. ఆయన హృదయంలో తానుండి కారుణ్యరసాన్ని ప్రేరేపిస్తుంది. కరుణాపరతంత్రుడైన పరమాత్మ తనని ఆశ్రయించి ఉండే జీవుల రక్షణను చేస్తుంటాడు. ఈ రక్షణ చేయటానికి అడ్డుగా ఉండే దుష్టశక్తులను నశింపచేస్తూ ఉంటాడు. ఆ అర్థం వచ్చేట్లు ఈ శ్లోకం చెప్పాడు.

**మా**=లక్ష్మీదేవికి, **నిషాద**=స్థానమైనవాడా! అంటే శ్రీనివాసా! **త్వం ప్రతిష్ఠాం అగమః**=నువ్వు శాశ్వతంగా ఈ లోకంలో వేంచేసి ఉందువుగాక! **యత్**=ఎందుకంటే, **క్రౌంచ మిథునాత్**=వక్రగతి కలిగిన; లోకకంటకులైన జంటనుండి, **ఏకం**=ఒకనిని, అంటే పురుషుని, సంహరించితివి గనుక!

క్రౌంచమంటే కుటిల గతి కలిగిన పక్షి. అంటే, కామాతురులై, వక్రగతి కలిగి లోకులను బాధించే వారిని క్రౌంచములు అనవచ్చు. రామాయణంలో ఇలాంటివి రెండు జంటలు కన్పిస్తాయి. వారిని ఇక్కడ క్రౌంచములతో పోల్చి చూపిస్తున్నారు. వారు, వాలి-తార, మండోదరి-రావణుడు.

తమ్ముని మీద అనుమానంతో అతనిని రాజ్యభ్రష్టుని చేసి, అడవులు పాలుచేసి, ఆతని సొమ్మును, భార్యని తన ఆధీనంలో పెట్టుకున్నవాడు ఒకడు. అతను వాలి. తద్వారా వాలి దోషి అయ్యాడు. వాలిని సంహరించి వానరజాతిని రక్షించాడు రాముడు. ఇలా క్రౌంచ జంటలో ఒకటైన వాలి తారలలో పురుషుని సంహరించాడు.

రెండవ జంట మండోదరి-రావణుడు. అందులో కామమోహితుడై రావణుడు వేలాదిస్త్రీలను చెరపట్టి వీరు వారని లేకుండా సురనర తిర్యక్ జాతులను అందరినీ ఏడ్పించడమే లక్ష్యంగా కలిగిన దుష్టుడు. అది చివరికి సీతాపహరణం దాకా కూడా పరిణమించింది. తనకి హితాన్ని బోధించే ఎవ్వరిమాటా విననంత మొండిగా రావణుడు తయారైయ్యాడు. ఆ జంటలో కామమోహితుడైన రావణుని సంహరించడం రెండవ క్రౌంచజంటలో పురుషక్రౌంచమును భగవానుడు సంహరించడం.

వక్రగతిలో మనల్ని నడిపించేది, తద్వారా లోకకంటకులుగా మనల్ని తయారు చేసే క్రౌంచజంట ఒకటి ప్రతి ఒక్కరిలోనూ ఉంది. అదే కామము క్రోధమనే జంట. ఈ రెంటిలో కామం చాలా ప్రధానమైనది. నిజానికి ఈ కామానికి పరిణామదశే క్రోధమనేది. ఈ రెంటిలో కామం చాలా ప్రబలమైనది అనుకున్నాం గద. భగవద్గీత 3వ అధ్యాయంలో..

**కామ ఏషః క్రోధ ఏషః రజోగుణ సముద్భవః ।**

**మహాశనో మహాపాప్మా విద్ధ్యేన మిహ వైరిణమ్ ॥** అని రజోగుణంలోంచి ఆవిర్భవించే కామక్రోధాలలో కామం **మహాశనః**= తిండిపోతు అని, క్రోధం **మహాపాప్మా**=ఘోరపాపి అని, అది చేయించని పాపమంటూ ఉండదని శ్రీకృష్ణుడు చెప్పాడు.

ఆ అధ్యాయంలో చివరికి వచ్చాక **జహి శత్రుం మహాబాహో! కామరూపం దురాసదం** జయించ శక్యంకాని కామాన్ని నువ్వు నశింపచేయ్! అని భగవంతుడు, కృష్ణుడు అర్జునుణ్ణి ఆదేశించాడు. అంచేత కామము అనే క్రౌంచాన్ని అరికట్టడం ద్వారా జీవుణ్ణి కర్మయోగిగా తీర్చిదిద్దుకోవచ్చునని భగవంతుని ఉపదేశం.

ఈ 'మానిషాద' అనే శ్లోకంలో, మనిషిని వక్రగతిని పట్టించే జంటలో ప్రబలమైన అతి ప్రధానమూ అయిన కామమనే క్రౌంచాన్ని సంహరించి మహోపకారం చేయడం వల్ల "హే శ్రీనివాసా! నీకు మంగళము" అని వాల్మీకి మంగళారంభం చేసేట్లు చతుర్ముఖుడు చేశాడన్నమాట. ఈ కామాన్ని జయించినందువల్లనే వాల్మీకి హృదయంలో నైర్మల్యం, ప్రశాంతత ఏర్పడ్డాయి. దీనికి సూచకమే! తమసా నదివద్ద సంచరించేటప్పుడు తమసానదీ తీర్థాన్ని ఆయన వర్ణించడం.

**అకర్దమ మిదం తీర్థం భరద్వాజ! నిశామయ ।**

**రమణీయం ప్రసన్నాంబు సన్మమనుష్యమనోయథా ॥** తమసాతీర్థంలో కెరటాల ఉధృతిలేదు, మాలిన్యంలేదు, ఆహ్లాదకరంగ ప్రశాంతంగా మంచిమనిషి హృదయంలా ప్రవహిస్తోంది

వాల్మీకి హృదయం ఆ రకమైన పక్వత చెంది ఉండడం వల్ల అతని మనస్సులో కామక్రోధములనే మాలిన్యంగాని, కుటిల గతిని కలిగించే ప్రవృత్తిగాని లేదు. అందుకే సన్మనుష్యుని చరిత్రని రచించ గలిగే యోగ్యత ఉందని గుర్తించిన చతుర్ముఖ బ్రహ్మ, సరస్వతి అనుగ్రహంతో రామాయణ రచన చేయమని వాల్మీకిని ఆదేశించాడు.

క్రౌంచపక్షుల జంట దీనికి ప్రేరకమైంది.

ఈ రకంగా బాలకాండలోని 'క్రౌంచజంట' ప్రస్తావన, మనిషి ప్రశాంత జీవనాన్ని సాగించటానికి ఏర్పడవలసిన స్థితి, ప్రయోజనాలను తెలియచేస్తోంది. అవి భగవంతునికి మంగళాశాసనం చేయడం, కామక్రోధాదులను జయించడం. వానిలో ఏది మొదలు?

దీపం వెలిగిస్తే చీకటి దానంతట అదే తొలుగుతుంది కద!.

"పరమాత్మని యో రక్తః విరక్తః అపరమాత్మని" అని శాస్త్రం చెప్పినట్లు, భగవంతునికి మంగళాశాసనం చేస్తే తద్వారా క్రౌంచ హననం అదే ఏర్పడుతుంది.

ఈ విధంగా వాల్మీకిభగవానుని నోటిద్వారా బ్రహ్మ, ఈ మంగళాశాసన శ్లోకాన్ని పలికించి, కామాన్ని తొలగించడాన్ని తెలిపాడు.

ఈ రకంగా బాలకాండలో దర్శనమిచ్చే క్రౌంచపక్షులు మనకి ఒక అద్భుతమైన సందేశాన్నిస్తూ శ్రీరామాయణంలోకి ప్రవేశింపచేస్తున్నాయి. *(ఇంకా ఉంది)*

సీతానగరం ఆశ్రమంలో

## శ్రీశ్రీశ్రీ స్వామివారి చాతుర్మాస్య దీక్ష

### కార్యక్రమ వివరములు

**ప్రతిరోజ ఉదయం :**

7.00 గం॥ శ్రీశ్రీశ్రీ స్వామివారిచే (ఆళవందార్) స్తోత్రరత్న ప్రవచనం

| | | |
|---|---|---|
| సెప్టెంబరు : | 12 | భాద్రపద పౌర్ణమి చాతుర్మాస్య దీక్షా విరమణ |
| | 13 | హైదరాబాద్ |
| | 19 | అమెరికా ప్రయాణం |

జై శ్రీమన్నారాయణ!

వివరములకు : సీతానగరం, తాడేపల్లి మండలం, గుంటూరు జిల్లా. ఫోన్: 08645 272929

E-mail : **jetsitanagaram@yahoo.com**

గీతా మహాత్మ్య కథలు-3

# కాలక్షేపం

శ్రీమాన్ వోలేటి రామకృష్ణమాచార్యులు - హైదరాబాద్

ఇంతవరకూ మనం భగవద్గీతలోని మొదటి రెండు అధ్యాయాల మహిమను తెలుసుకున్నాము. కాలక్షేపానికి ఈ మూడవ అధ్యాయ మహిమను కూడా తెలుసుకుందాం. "కాలక్షేపం" అంటే సరదాగా సమయాన్ని గడిపేయడం కాదు. "కాలక్షేపం" అంటే 'కాలుణ్ణి' అనగా యముడిని, 'క్షేపము' చేయుట అనగా దూరము చెయ్యడం అన్నమాట. ఈ విషయాన్నే భగవద్గీతలోని మూడవ అధ్యాయ మహిమను తెలిపే పద్మ పురాణాంతర్గతమైన కథ చెపుతోంది.

భగవద్గీతలోని మూడవ అధ్యాయానికి "కర్మయోగము" అని పేరు. కర్మలు అని అంటే మనం ప్రతిదినం నిద్రలేచినది మొదలు నిద్ర పోయేవరకు చేసేవన్నీను. అందులో భగవంతునికి ప్రీతికలిగించే కర్మలు చేయగలిగితే పుణ్యం తద్వారా సుఖజీవనము లభిస్తుంది. ఆయనకి కోపం తెప్పించే చెడు కర్మలు చేస్తే పాపాన్ని, దానివలన దుఃఖాన్ని పొందుతాం. అసలు ఏ కర్మా చేయకుంటే పుణ్యపాపాలు, సుఖదుఃఖాలు లేకుండా ముక్తిని పొందేయచ్చు కదా అని మనలో చాలా మందికి అన్పిస్తూ ఉంటుంది. కానీ అన్నపానాలు లేకుండా, ఊపిరితీయకుండా, రెప్పవేయకుండా ఉండగలమా? అవీ కర్మలే కదా. అందుకే ఈ అధ్యాయంలో, "జీవులు కర్మ చెయ్యకుండా ఒక్క క్షణం కూడా ఉండలేరు, కానీ ఎలా చేయాలో తెలుసుకొని చేస్తే అవిమిమ్మల్ని బంధించవు" అని చెప్పాడు శ్రీ కృష్ణపరమాత్మ.

సామాన్యులు కర్మలను, నాకిది కావాలనే ఫలాపేక్ష తోనో, స్వార్థబుద్ధితోను చేస్తూంటారు. వారిని అవి పుణ్యపాపాలనే సంకెళ్ళతో బద్ధులని చేసి, నీచమైన మరణానికి, మరణానంతర కష్టాలకు గురిచేస్తాయి. అలాంటి కర్మలు ఫలముల పట్ల ఆసక్తి లేకుండా, స్వార్థరహితంగ, లోకోపకారకంగ చేయగలితే, అవి సుఖసంతోషాలతో జీవించడానికి, సత్ప్రవర్తనను పెంచుకోవడానికి దారితీయడమే కాకుండా, 'యోగం'గ అంటే 'సాధనం'గ మారి పరమపద సోపానమార్గాన్ని చేరుస్తాయి.

ఈ విషయాన్నే శ్రీ కృష్ణుడు ఈ క్రింది శ్లోకంలో చెప్పాడు.

**శ్లో ॥ సక్తాః కర్మణ్య విద్వాంసో యథా కుర్వంతి భారత ।**
**కుర్యాద్విద్వాం స్తథాఽ సక్త శ్చికీర్షు ర్లోక సంగ్రహమ్ ॥**

అర్జునా! ఏ విధంగా అజ్ఞానులైనవారు ఫలాసక్తితో కర్మల నాచరిస్తారో అలానే జ్ఞానులు కూడా కర్మలను మానివేయకుండా ఆచరిస్తారు. అయితే, ఫలాపేక్ష లేకుండా, నిస్స్వార్థంగ లోకకళ్యాణం కోసం కర్మలనాచరిస్తారు. అందువలననే వారినవి బంధించవు. ఈ విధంగ శ్రీకృష్ణపరమాత్మ ఈ మూడవ అధ్యాయంలో కర్మలని యోగంగ మలచుకొని సంసారబంధనాలని ఎలా తొలగించు కోవచ్చనే రహస్యాన్ని చెప్పాడు కాబట్టి దీనికి "కర్మయోగ"మని పేరు.

ఈ విషయాన్ని బోధించేదే నేటి మన "కాలక్షేపం" కథ. ఇందులో ఒక భక్తుడు తన సత్ప్రవర్తనతో తనను తాను ఉద్ధరించుకోవడమే కాక, తద్విరుద్ధంగా ప్రవర్తించిన తన తండ్రిని, ఇతర బంధువులను నరకలోకం నుండి ఉద్ధరించిన పద్ధతి చెప్పబడింది. ఇక ఈ మూడో అధ్యాయం మహిమను తెలియజేసే ఈ అద్భుత కథను చదవండి.

పూర్వము జనస్థానమను పట్టణంలో జడుడు అనే బ్రాహ్మణుడుండేవాడు. అతడు బ్రాహ్మణత్వాన్ని పూర్తిగా మంటగలిపి, నిత్యనైమిత్తిక కర్మలను పూర్తిగా మానివేసి, విషయలోలుడై, దుర్వ్యసనపరుడై, చేయరాని పనులనెన్నో చేసాడు. తన దగ్గర ఉన్న ధనమంతా విచ్చలవిడిగా, వ్యర్థముగా ఖర్చుచేసి బికారిగా మారాడు.

తాను తిరిగి ఎలాగైనా ధనము సంపాదించాలని కృతనిశ్చయుడై, దూరదేశములకు పోయి కష్టించి కొంత ధనమును సంపాదించాడు. ఇక తాను కష్టించలేక, తాను సంపాదించిన ధనముతో తృప్తిచెంది, తిరిగి తాను జనస్థానానికి పోయి, ఆ ధనంతో తన జీవనాన్ని కొనసాగించాలని నిశ్చయించుకొని తిరుగు ప్రయాణమయ్యాడు. దారి మధ్యలో ఒక అడవిలో వృక్షము క్రింద విశ్రమించాడు. అంతలో కొందరు దొంగలు జడుని వద్ద ధనమున్న విషయాన్ని పసిగట్టి, ఆతనిని చుట్టుముట్టి వధించి, ఆతని సొమ్ము అంతా దోచుకుని వెళ్ళిపోయారు. అంతవరకు స్వార్థపూరితమైన కర్మలను మాత్రమే ఆచరించిన, నీచపు మరణము పొందిన జడుడు

పిశాచమయ్యాడు. ఎక్కడ తాను పిశాచ రూపాన్ని పొందాడో, ఆ చెట్టునే ఆశ్రయించుకుని ఉండిపోయాడు.

జడుని కుమారుడు ధర్మాత్ముడు, వేదవేదాంగ పారంగతుడు, నిత్య భగవద్గీతా పారాయణపరుడు. అతడు తన తండ్రిని గురించి అందరినీ అడగడం మొదలుపెట్టాడు. చివరికి తన తండ్రి దుర్మరణం గురించి తెలిసి చాలా దుఃఖించాడు. ఎలాగైనా తన తండ్రికి సద్గతులు కల్పించడానికి కాశీలో అంత్యేష్ఠి చేయాలని, కాశీకి ప్రయాణమై నాడు. అలా ఎనిమిది రోజుల ప్రయాణం పూర్తి చేసాడు.

తొమ్మిదవ రోజు ప్రయాణము చేస్తూ కాకతాళీయంగా తన తండ్రి ఆశ్రయించిన చెట్టు క్రిందనే సేద తీరడం కోసం ఆగాడు. ఎలాగూ ఆగాను కదా అని అక్కడే మాధ్యహ్నిక సంధ్యావందనం పూర్తిచేసుకుని భగవద్గీతలోని కర్మయోగమనే మూడవ అధ్యాయాన్ని భక్తితో పఠించాడు.

అప్పుడు ఆకాశంనుండి ఒక భయంకర శబ్దం విన వచ్చింది. తల ఎత్తి పైకి చూశాడు. ఆకాశంలో దివ్యకాంతులు కానవచ్చాయి. భయంకరాకారంతో తన తండ్రి ఆ ప్రక్కనే ఉన్న ఒక దివ్యవిమానంలోకి ఎక్కుతున్నాడు. తండ్రి యొక్క పిశాచరూపం ఆ విమానంలోకి ఎక్కగానే నశించింది. ఆతనికి ఒక దివ్యరూపం ప్రాప్తించి, పట్టు పీతాంబరాలతో దర్శన మిచ్చాడు.

అది చూచి కుమారుడు తండ్రికి నమస్కరించి, "తండ్రీ! మీకు ఈ పిశాచరూపము పోయి ఇలా ఉద్ధరింప బడడానికి కారణమేమిటి?" అని వినమ్రతతో పలకరించాడు. ఆ ప్రశ్నకు జడుడు ఇలా సమాధానం చెప్పాడు. "కుమారా ! నీవు భగవత్ ప్రేరణతో పఠించిన భగవద్గీతలోని మూడవ అధ్యాయమును వినడంవలన నాకిలాంటి సద్గతి లభించింది. నాపాపములన్నీ నశించాయి.నాయనా! నాకు సద్గతి లభించాలనే నీవు కాశీకి ప్రయాణమయ్యావు. నీ ఉద్దేశ్యం నెరవేరింది. నాకు సద్గతులు లభించాయి. నీవిక కాశీకి వెళ్లవలసిన అవసరంలేదు. ఇక నీవు ఇచ్చటి నుండి మరలి ఇంటికే వెళ్లు. కానీ, నాదొక ప్రార్థన. నీవు ఇంటికి వెళ్లిన తరువాత కూడా ఈ మూడవ అధ్యాయమును మళ్లీమళ్లీ చదువు. ఎందుకంటే నీ పితృదేవతలెందరో నాలానే నరకయాతనలు అనుభవిస్తున్నారు. ఈ పారాయణ చేయడం ద్వారా నీవు నీ పూర్వీకులందరికీ నరకలోకము నుండి విముక్తి కలిగింపగలవు."

ఆ మాటలు విన్న కుమారుడు చాలా సంతోషించాడు. అక్కడినుండి తిరిగి తన గృహానికి వెళ్లి భగవద్గీత మూడో అధ్యాయం క్రమం తప్పకుండా పితరులనుద్ధరించే సంకల్పంతో పారాయణ చెయ్యడం ఆరంభించాడు. ఆ పుణ్యఫలము వలన శ్రీమహావిష్ణువు దూతలను యమలోకానికి పంపి, ఆతని పూర్వీకులనందరిని విష్ణులోకానికి పంపివేయవలసిందని యముని ఆజ్ఞాపించాడు.

యమధర్మరాజు కూడా తనే స్వయంగా విష్ణులోకానికి వచ్చి ఆతని బంధువులందరినీ స్వామికి అప్పగించి, శ్రీమహావిష్ణువును స్తుతించి వెళ్లాడు. జడుని కుమారుడుకూడా తన జీవితాంతమున గీతాపారాయణ ఫలమువలన మోక్షపదవిని పొందాడు.

ఇలా లక్ష్మీదేవికి ప్రీతితో శ్రీమహావిష్ణువు చెప్పిన కథను, శంకరుడు పార్వతీదేవికి వినిపించాడు. పార్వతీదేవి గీతామహాత్య కథను విని అబ్బురపడిపోయింది. ఈ కథ ద్వారా మనం మరొకటి కూడా గ్రహించవచ్చు.

**"వైష్ణవో నః కులేజాతః స నః సంతారయిష్యతి"** అన్నట్లు విష్ణుభక్తి కలిగిన మహనీయుడు ఏ వంశంలో జన్మిస్తాడో ఆ వంశము, అతనితో సాహచార్యం చేసిన వారంతా తరిస్తారని మనకి స్పష్టమౌతోంది.

మనలను, మన పూర్వజులను కూడా యమధర్మరాజు నుండి తప్పించి, శ్రీమహావిష్ణువు పంచన చేర్చగలిగే ఈ కర్మ యోగమనే ఈ మూడవ అధ్యాయాన్ని క్రమంతప్పక మనందరము పారాయణ చేసి, శ్రీకృష్ణపరమాత్మ అనుగ్రహంతో కర్మలను యోగంగ మలచుకుని తరిద్దాం!

శ్రీమతే రామానుజాయ నమః

# కల నిజమగునా !

రమణీయమైన అరణ్యంలో ఒక వేదపాఠశాల. కొందరు విద్యార్థులు వేదాన్ని వల్లిస్తున్నారు. మరికొందరు వంట చెఱకు కోసం పయనమవుతున్నారు. హోమాలతో, జపాలతో పవిత్రతను పంచియిచ్చే దివ్యాలయము ఆశ్రమము. వారి అందరికీ వేదవిద్యలసతో పాటు, భగవత్తత్త్వాన్ని కూడా చక్కగా అందించే ఆచార్యులు నారాయణముని. మహా తేజస్సంపన్నులు. వారి సందర్శనమే సకలాభీష్టప్రదము. వారు మాటాడితే మదిలో భావాలకు సరైన సమాధానాలు. తత్త్వజిజ్ఞాసువులైన పెద్దలెందరో వీరిని ఆశ్రయించి సందేహాలను తీర్చుకుంటారట. నారాయణ ముని ఎక్కడ ఉంటే అక్కడ లక్ష్మి తాండవిస్తుంది. అందుకోసమే సామాన్యులనుండి మహానుభావులైన మారాజుల వరకు అందరూ వీరి శ్రీ చరణాలను ఆశ్రయిస్తారు.

ఎంతో గొప్ప తపస్వి. ఆయన జ్ఞానియే కాదు, గొప్ప కర్మిష్ఠి. ఏ కార్యాలు చేపట్టినా భగవత్సంకల్పముగా భావించి చేస్తారు. అందుకే ఆయన కార్యాలకు విఘ్నాలే లేవు. సత్య సంకల్పులు నారాయణ ముని. వీరివద్ద శాస్త్రాలను అధ్యయనం చేసిన విద్వత్ వరేణ్యులు ఎందరో ఉన్నారు.

ప్రతి వ్యక్తికి భగవంతుడు మేధను సమానంగానే ఇచ్చాడు. కొందరు దానిని వాడతారు. కొందరికి అది ఎలా వాడాలో పాపం తెలియదు! అది తెలియజేయటమే కద ఆచార్యుల కర్తవ్యం. ఆచార్య లక్షణాలకు పూర్ణోదాహరణ మన నారాయణమునులు.

ఒకరోజు ఆ అరణ్యంలో పశువుల వెంట సంచరించే ఒకముని కుమారుని చూశారు ఆచార్యులు. సంస్కార హీనుడైన వీడిని సంస్కరించాలని భావించారు. మట్టిలో దొరికే మాణిక్యాన్ని వన్నెపెడితే ప్రకాశిస్తుంది. కానీ రాయి రత్నమవ్వదు. కానీ! సిద్ధి కలవారు రాయిని పట్టినా అది రత్నమవుతుంది. జ్ఞానహీనుడైన ఆ పిల్లవానిపై వారిదృష్టి ప్రసరించి వానిని సుదర్శనునిగా మార్చింది. తత్త్వాన్ని తెలుసుకోవాలనిపించి పశువులను వదిలి గురుకులానికి బయలుదేరాడు. ఆచార్యుని శ్రీపాదాలను ఆశ్రయించాడు. శాస్త్రాలను అధ్యయనం చేశాడు.

ఒకనాటి రాత్రి గాఢ నిద్రలో ఉన్నాడు మునికుమారుడు. అంతలో ఒక భయంకరమైన కల. భయంతో గురువుగారూ! అంటూ సమీపించాడు శిష్యుడు.

**గురువు:** ఏమోయ్ ఏం జరిగింది ? ఎందుకు భయపడుతున్నావ్?

**శిష్యుడు:** నన్ను...... నన్ను బాగా బలిసిన ఇద్దరు వ్యక్తులు చంపడానికి వస్తున్నారు.

**గురువు:** నిన్నా...... నువ్వు ఏం చేశావని ?

**శిష్యుడు:** అదే అడిగా ! వాళ్ళు నాకు చెప్పలేదు.

**గురువు:** ఆహా....... అలాగా ! ఏరీ వాళ్ళు

**శిష్యుడు:** వాళ్ళిద్దరినీ చంపేశాగా.

**గురువు:** (గురువుగారికి అర్థమైంది వీడు కల కన్నాడని) ! సరి, సరి! ఇంకెందుకోయ్ నీకు భయము ?

**శిష్యుడు:** మళ్లీ వాళ్ళు బ్రతికారు, నాదగ్గరకు వస్తున్నారు.

**గురువు:** ఏరీ నాకు చూపించు?

**శిష్యుడు:** అదీ... అదీ... కలలో గురువుగారూ. స్వామీ ! కలలో వచ్చిన వారెవరూ? ఎందుకు నన్ను దండించాలను కుంటున్నారు? కల నిజమవుతుందా ? దయతో నాకు చెప్పండి.

**గురువు:** నాయనా! నీకల నిజమే, ఆ ఇద్దరూ బలవంతులు ఎవరో కాదు, కామక్రోధాలు. వాళ్ళని అణిచే కొద్దీ విజృంభిస్తారు.

**శిష్యుడు:** గురువుగారూ! ఎందుకని? ఇవి అందరినీ పట్టి పీడిస్తాయా?

**గురువు:** భగవద్గీత 3వ అధ్యాయంలో శ్రీకృష్ణుడు **కామఏషః క్రోధఏషః రజోగుణ సముద్భవః** అని అన్నాడు. ఈ కామక్రోధాలు రజోగుణం వల్ల ఏర్పడతాయి. కామానికి ఆకలి ఎక్కువ. ఎంత అనుభవించినా ఇంకా ఇంకా కావాలని పీడిస్తుంది. కామం తీరకపోతే వచ్చేదే క్రోధం. ఇది ఎంత పాపాన్నైనా చేయిస్తుంది. ఎలాంటి బలాఢ్యులైనా, యోగులైనా వీటికి దాసులే సుమా!

**శిష్యుడు:** మరి, వీనిని ఎలా జయించాలి?

**గురువు:** జయించాలని చూడకు, అది వెళ్ళే మార్గాన్ని మార్చు.

**శిష్యుడు:** ఎలా?

**గురువు:** బాహ్యామైన విషయాలను అవి కోరితే వీనికన్నా గొప్పదైన భగవంతుని కోరమను.

**శిష్యుడు:** అయితే కామక్రోధాలు చెడ్డవి కావా!

**గురువు:** భగవంతుడు సృజించినవి అన్నీ మంచివే!

**శిష్యుడు:** విషంకూడా మంచిదేనా గురువుగారూ?

**గురువు:** మంచిదే ! ప్రాణాపాయంనుంచి కాపాడడానికి వైద్యులు ఔషధంగా ఒక్కోసారి విషాన్నే వాడతారు.

**శిష్యుడు:** అవునా, నిజమే ! స్వామీ ! కామాన్ని మంచిదన్నారు. మరి కోపమో ?

**గురువు:** క్రోధం కూడా మంచిదే. పిల్లవాడు తప్పుచేస్తే వాడిని మంచి మార్గంలోపెట్టటానికి కోపం తెచ్చుకోవడం అవసరం. లేకపోతే వాళ్ళు ఏ పనికీ ఉపయోగ పడరు. దేశద్రోహులు అవుతారు.

**శిష్యుడు:** తెలిసింది స్వామీ ! నాకెందుకు ఇలా వచ్చింది ఈ**కల**

**గురువు:** తెల్లవారితే శ్రావణపౌర్ణమి. వేదాధ్యయనం చేసే విద్యార్థులను **కామోకార్షీత్ మన్యురకార్షీత్ నమో నమః** అంటూ జపించమనాలి.

గాయత్రీ మంత్రోచ్చారణతో సూర్యమండలంలో అంతర్యామిగా ఉన్న శ్రీమన్నారాయణుని ఉపాసించాలి. ఇలా చేస్తే వాడిని ఇవి బాధించవు.

ఈ మాటలు విన్న మునికుమారుడు ఆనందముతో ఆచార్యునికి సాష్టాంగము చేసి, తనకు వచ్చిన కలయొక్క అంతరార్థాన్ని గుర్తించాడు.

ఆచార్యులు కలవానికి ఎంత లాభమో మనకి తెలుస్తోంది. ఆచార్యుని ఆశ్రయించకముందు ఈ పిల్లవాడిని చూచి ' ఏమిరావీడు ' ! అన్నవారే, ఈతని అనుష్ఠానాన్ని చూచి 'అహో'! ఏమి ఆశ్చర్యము! అని కీర్తిస్తున్నారు. కారణం ఆచార్యులే. ఎందుకూ పనికి రాని రాళ్ళని రత్నంగా మార్చగలిగే సిద్ధికల ఆచార్యులే మనకు నాథులు (రక్షకులు).

# "ప్రజ్ఞ వర్క్‌షాప్"

ఆగస్టు 20,21 తేదీలలో సీతానగరంలో శ్రీశ్రీశ్రీ చిన్న జీయర్ స్వామివారి పర్యవేక్షణలో "వికాసతరంగిణి"-ప్రజ్ఞ" వర్క్‌షాపు జరిగింది. జూలై 17వ తేదీన జరిగిన వికాసతరంగిణి సర్వసభ్యసమావేశంలో కనీసం వేయి ప్రభుత్వ పాఠశాలల్లోని విద్యార్థులకు ఆరోగ్యపరమైన, నైతిక పరమైన అంశాలకు సంబంధించి సేవాకార్యక్రమాలను చేపట్టాలని నిర్ణయం జరిగింది.

ఆ నిర్ణయం మేరకు కార్యకర్తలను సన్నద్ధం చేయడంలో భాగంగా "వర్క్‌షాప్" రెండు రోజులపాటు జరిగింది. శ్రీ జీయరు స్వామివారు తమ మార్గదర్శక సందేశంలో "మనిషికి ఆరోగ్యం అవసరం. విజ్ఞానం కూడా అవసరం. సమాజంలో ఆరోగ్యం ఖరీదై పోయింది. విజ్ఞానం వెఱ్ఱితలలు వేస్తోంది. ఈ దుష్పరిణామాలనుగూర్చి దుఃఖించి ప్రయోజనం లేదు. ఎవరో పాడు చేస్తున్నారని నిందించి ఉపయోగం లేదు.

మనం చేయగలిగేది మనం చేయాలి. సమాజంలో మంచి మార్పు రావాలని కోరుకొనే వ్యక్తులను సమీకరించి, స్ఫూర్తినిచ్చి, ప్రభావ పూరితమైన కార్యక్రమాలను చేయడం మన బాధ్యత. అందుకే మన వికాసతరంగిణి ఈ సంవత్సరం రాష్ట్రస్థాయిలో విస్తృతంగా విద్యా సంబంధమైన, వైద్య సంబంధమైన సేవాకార్యక్రమాలను ప్రధానంగా ప్రభుత్వ పాఠశాలల్లో చేపట్టాలని నిర్ణయించింది.

మన వికాసతరంగిణి సంస్థలోని ప్రజ్ఞ, ఆరోగ్య వికాస్ విభాగాలకు చెందిన కార్యకర్తలు ఈ కార్యక్రమాన్ని సమన్వయ పూరితంగా నిర్వహించాల్సి ఉంటుంది. అందుకోసమే ఈ వర్క్‌షాప్‌ను ఏర్పాటు చేశాము" అని తెలియజేశారు.

వర్క్‌షాప్‌లో వివిధ ప్రాంతాలనుండి వచ్చిన ప్రజ్ఞ, ఆరోగ్య వికాస్ సమన్వయకర్తలు, ఉపాధ్యాయులు పాల్గొని "మాతృదేవో భవ!" "పితృదేవో భవ!" పుస్తకాలను గూర్చి విద్యార్థులకు అందజేయాల్సిన నైతిక విలువలను గూర్చి చర్చించారు.



విద్యార్థులకు పంటి, కంటి సంబంధమైన జాగ్రత్తలు, వైద్యసేవలు అందించే విధానాలను గూర్చి, నైతిక విలువలను అందించే విధానాన్ని గూర్చి శ్రీస్వామివారు కార్యకర్తలకు విలువైన సూచనలు అందజేశారు. వికాసతరంగిణి అధ్యక్షులు శ్రీ మహేందర్‌రెడ్డిగారు, కార్యదర్శి శ్రీ భవానీప్రసాద్‌గారు ప్రజ్ఞ సమన్వయ కర్త శ్రీ బుస్కీమాష్టారు ఆరోగ్య వికాస్ సమన్వకర్త శ్రీమతి పి. జ్యోతిగారు, వికాసతరంగిణి సెంట్రల్ కమిటీ సభ్యులు ఈ సదస్సులో పాల్గొని పర్యవేక్షించారు.

'ప్రజ్ఞ' ద్వారా మన వికాసతరంగిణి నిర్వహించనున్న ఈ సేవాకార్యక్రమాలలో పాల్గొనడానికి ఉత్సాహం కలిగినవారు సీతానగరం, జీవాలలోని కార్యాలయాన్ని కానీ, కార్యదర్శి కె. భవానీప్రసాద్-9492615691ను సంప్రదించ వచ్చును.



రాయల ఊహల పల్లకీ....

# ఆముక్తమాల్యద

*(గత సంచిక తరువాయి)*

ఆ ఊళ్ళో సస్యాలకు చక్కటి నీటివనరులున్నాయి. దాంతో పంట బాగుంటుంది. చేలచుట్టూ పంటకాలువలు, కాలువల్లో చెంగలువలు. పైరు కోతకొచ్చేక మళ్ళలో నీటిని పైకి వదులుతారు. దాంతో ఆ పైరులు బలసిన వెన్నుల బరువుకు ఒరిగి పక్కన ఉన్న ఉద్యానవనాల్లోంచి వీచే గాలులకు కాలవల్లోని చెంగలువలపై పడతాయి. అల్లా పడ్డప్పుడు వాటి తలలపై ఉన్న జుంజురుముళ్ళు ఇటూ అటూ రాసుకుంటూ ఉన్నాయి. ఆ దృశ్యం చమత్కారంగా ఉంది. ఎప్పుడూ నీళ్ళల్లోనే ఉండి ఒక్కమారు నీరు పోయేటప్పటికి ఆ చేలు దప్పికతో డస్సిపోయినట్టయ్యాయి. వెనక నీళ్ళు తాగడానికి ఉపకరిస్తూ నేలలో ఉండే వేళ్ళను ఇపుడు తలలపైకి తెచ్చుకొని వాటితో చెంగలువల జాలువారు మకరందాన్ని తాగుతున్నాయి. పైనున్న జుంజురులు-కిందివేళ్ళే అల్లా పైకి వచ్చినట్లుగా అనిపిస్తున్నాయి.

పెద్దపెద్ద వేరుపనసలు నేలలోనే పండి పగిలి వాటిలోంచి బైటికి వచ్చి తేనెతో నేలంతా బురదబురద అయి, ఇంకా తేనెలు ఉబుకుతూంటే దాన్ని జుర్రుకుందామని తుమ్మెదలు గుంపులుగా తోసుకుంటూ ముసురుకుంటున్నాయి. తేనెలూరుతున్న పనసలు మదం కారుతున్న వసంతుడి మదపుటేనుగుల్లా, తుమ్మెదలు వాటిని కట్టే ఇనుపగొలుసుల్లానూ అనిపిస్తున్నాయి.

విల్లిపుత్తూరులో సుగంధిక, కదళీవనాలున్నాయి. సుగంధి అని ఒకరకం అరటి. ఇది మంచిపరిమళాలు విరజిమ్ముతూంటుంది. ఈ తోటల్లో అరటిగెలలు పైనుండి నేలను తాకుతూంటాయి. పళ్ళు పక్వానికి వచ్చి పచ్చగా ఉన్నాయి. పచ్చటి ఈ అరటిపళ్ళగెలలు బొద్దుగా కట్టిన సంపెంగ తోమాల్లా ఉన్నాయి. పళ్ళచివరి నలుపు సంపెంగలపై వాలి మూర్ఛపోయిన తుమ్మెదల్లా అనిపిస్తోంది.

ఆ ఊళ్ళో చెరకుతోటల్లో పోకచెట్లు, తమలపుతీగెలు పెరుగుతున్నాయి. తమలపు తీగెలు పోకచెట్లను అల్లుకుని కొసదాకా పాకినయి. పోకమట్టలు పండి చెట్టుమీంచి జారి, చెరకుగడలమీద పడుతున్నాయి. అట్లా పోకమట్టలు ఎత్తుమీంచి పడేటప్పటికి చెరకుగడలు కాస్తా విరిగి వాటిలో ఉన్న ముత్యాలు చెదిరి దగ్గర్లో ఉన్న బెల్లంవండే పొయ్యిలోపడి సున్నం అవుతున్నాయి. పోకచెక్కలు, తమలపాకులు, సున్నం కలిస్తే ఎర్రదనమేర్పడుతుంది కదా! ఈ సన్నివేశం మంచిశృంగారాన్ని సూచిస్తోంది. తమలపు తీగె ప్రేమగల ఒక నాయిక. దాని ప్రియుడుపోక(చెట్టు). అది తన ప్రియుణ్ణి ప్రేమతో పెనవేసుకుని కావలించుకుని చెవిలో రహస్యంగా ఇదిగో ఈ చెరకుల్లోని ముత్యాల సున్నమే మనరాగాన్ని పెంచే మందుసుమా అని చెప్తే ఉత్సాహంతో పోక ఊగిపోయి బరువైన మట్టల్ని రాల్చి చెరకుగడల్ని విరిచి ముత్యాల్ని దగ్గరి పొయ్యిలోకి చిందించి సున్నం చేయిస్తున్నట్టుంది.

మామిడితోటల్లో నీటిగుంటలున్నాయి. ఎన్నాళ్ళ నుంచుంటున్నాయో తెలియనంత పాతవి ఆ నీటిగుంటలు. వాటిలో కలువలున్నాయి. అంతరదామర ఉండి (నేలకు వేరు తగలకుండా నీటిమీదే నిలిచి, నీటిమీదే తేలే ఒక ఆకుమొక్క, మనీప్లాంట్ లాంటిదన్నమాట అంతరదామరంటే.) బాగా పాచిపట్టి ఉన్నాయి. వీటన్నిటితోనూ కర్పూరపు తావులు చిమ్ముతున్నాయి. నీరు బాగా లోతుగా ఉందేమో, పెద్దపెద్ద వాలుగలు (చేపలు) లోపల పోరాడు కుంటూ ఉన్నాయి. పైన నీరుకోళ్ళు కొలకొలమంటూ మెడలు మాత్రం కనపడేటట్లు నీళ్ళల్లో మునుగుతూంటే చూడముచ్చటగా ఉంది. ఆ నీటిగుంటల మీద మామిడిపువ్వు రాలి దట్టంగా ఒక పొరలా ఏర్పడింది. ఎంత దట్టంగా ఉంది ఆ పూలపొర అంటే దానిమీంచి మనుషులు హాయిగా నడిచి వెళ్ళిపోవచ్చునన్నమాట.

విల్లిపుత్తూరులో మన్నారు కృష్ణుడి మందిరం ఉంది. అక్కడ సాయంవేళల భేరీ వాయిస్తారు. కాహళ ఊదుతారు. ఇంచుమించు అదేవేళకు క్రీడావనాల్లోని చెరువుల్లో పగలల్లా విహరించి హంసలు రెక్కలు టపటపలాడిస్తూ క్రేంకారాలు కావిస్తూ తమ గూళ్ళకు బయలుదేరుతాయి. ఈ పటపటలూ, క్రేకారాలు ఆ క్రీడావనాల పొదరిళ్ళలో ప్రతిధ్వనిస్తాయి. ఇవి విన్నవారు కోవెలలో మ్రోయిస్తున్న భేరీకాహళుల ప్రతిధ్వనులు కాబోలు అనుకుంటారు.

ఆ ఊళ్ళో మన్నారు కృష్ణస్వామి కోవెల ఉంది కదా! ఈ మన్నారు కృష్ణుణ్ణి ద్రవిడ భాషలో వరపెరుంగోయిలుడైయాన్ అంటారు. ఆ ఊళ్ళో గాలి విహారానికి బయలు దేరుతుంది. ముందుగా మన్నారుస్వామి మెడలోని తులసిమాలనుంచి జాలువారే మకరందబిందువుల్ని తాకి చల్లబడుతుంది. ఆ స్వామివారు ఆరగించిన పణ్యారాలను స్పృశించి పరిమళాలను మోసుకుంటూ బయలుదేరుతుంది. *(ఇంకాఉంది)*

# వేదసమ్మేళనము



శ్రీశ్రీశ్రీ చిన్న జీయరు స్వామివారి పర్యవేక్షణలో సీతానగరం వేదవిశ్వ విద్యాలయంలో ఆగస్టు 1వ తేదీ నుండి 7వ తేదీ వరకు "మైత్రాయణీ శాఖ వేదసదస్సు" జరిగింది.

లుప్తమవుతున్న వేదశాఖలలో మైత్రాయణీశాఖ ఒకటి. దీనిని అధ్యాపన చేసేవారు లేరు అనుకున్న సమయంలో మైత్రాయణీశాఖ అధ్యాపకులు త్ర్యంబక్ రామచంద్ర జోషిగారు నాసిక్ పంచవటివద్ద ఉన్నారని తెలిసి 1983వ సంవత్సరంలో చిదంబరానికి చెందిన బ్రహ్మశ్రీ జి. పరమేశ్వర దీక్షితర్, జె.కె. కళ్యాణరామన్ గార్లు అధ్యయనం చేశారు. తదనంతరం సుమారు 10 సం॥ అధ్యాపనం చేయటానికి శిష్యులు లేని సమయంలో శ్రీ స్వామివారు సీతానగరం ఆశ్రమం నుండి 1995వ సం॥లో కృష్ణయుర్వేదం మూలాంతం అధ్యయనం చేసిన నలుగురు విద్యార్థులను మైత్రాయణి శాఖను అధ్యయనం చేయటానికి తమిళనాడులోని చిదంబరం పంపించారు.

అధ్యయనానంతరం ఈ నలుగురు తిరిగివచ్చి 18మంది క్రొత్తవిద్యార్థులకు మైత్రాయణీశాఖ పాఠం చెప్పి సంహిత, ఆరణ్యకాలను పూర్తిచేశారు.

మరికొంతకాలం తరువాత చిదంబరక్షేత్రానికి మహారాష్ట్రనుండి మరో ఇద్దరు వచ్చి మైత్రాయణీశాఖను నేర్చి వారి ఊళ్ళలో, వారు మరో ఇద్దరికి నేర్పారు. తమిళనాడులోనే మరోఇద్దరు కూడ ఈ వేదాన్ని అధ్యయనం చేసారు.

మనజెట్ అధ్యాపకులు కృషిచేసి విద్యార్థులలకు సులభంగ అధ్యయనం చేయడానికి వీలుగ 'పంచాశత్పద్ధతిని' తయారు చేశారు. పైగా పుస్తకానికే పరిమితమై ఉన్న పదపాఠాన్ని వెలికితీసి మన విద్యార్థులకు నేర్పుతున్నారు. "ఇది ప్రస్తుతానికి మన ఆశ్రమంలో మాత్రమే అందుబాట్లో ఉన్నది."

ఇలా లుప్త ప్రాయమైన ఈ మైత్రాయణీశాఖ మన శ్రీస్వామివారి కృషితో బహుళ ప్రచారంలోకి వచ్చింది. అయినా ప్రాంతభేదంచేత పాఠభేదాలు ఏర్పడే అవకాశమున్నదని ముందుగానే గుర్తించి, శ్రీస్వామివారు, దీని సర్వతోముఖాభివృద్ధికై ఏర్పాటుచేసిన సదస్సు ఇది.

మైత్రాయణీశాఖకి సంబంధించిన స్వరాలు ఇతర శాఖల వలెనే ఉన్నా, ఆ స్వరాలను గుర్తించడానికి పూర్వులు చూపిన గుర్తులు మాత్రం ఈ శాఖకు ప్రత్యేకంగ ఉంటాయి.

సంహితకు ఏర్పడ్డ పదపాఠాన్ని మహారాష్ట్రలో ప్రాచీనుల ఇండ్లనుండి అతికష్టం మీద 9సం॥ల క్రితమే సేకరించారు. అది కూడా వ్రాతప్రతియే. అలాంటి వ్రాతప్రతులు ముగ్గురు వ్రాసినట్లు తెలుస్తోంది. అందులో రెండుప్రతులు దొరికితే, వారినుండి ఫొటో కాపీతీసి శ్రీ పరమేశ్వర్ దీక్షితర్‌గారు తెచ్చుకున్నారు. అవే కాపీలు మన వేదవిద్యాలయాధ్యాపకులైన వారి శిష్యులకు యిచ్చారు. వాటిని పరిశీలిస్తూ సంహితాగ్రంథాలను గమనిస్తూ ఎక్కడెక్కడ ఏ ఏ తేడాలున్నాయో, వాటిని సరిచూస్తూ ఏడు దినాలు ఈ సదస్సు జరిపారు. ఇంతవరకూ మనవద్ద తయారైన విద్యార్థుల పాఠమే సుష్టుగ ఉందని గ్రంథం చూడకుండా వీరే నిర్దుష్టంగ చదవగలుగుతున్నారని దీక్షితర్‌గారు, జానకిరాంగారే కాక మిగిలిన వారు కూడా సంతృప్తి చెందారు.

ఈ సదస్సుకి బ్రహ్మశ్రీ పరమేశ్వరదీక్షితర్ గారు అధ్యక్షులుగా వ్యవహరించారు. దీనిని దర్శించాలనే కుతూహలంతో బ్రహ్మశ్రీ జె.కె. కళ్యాణరామన్ కూడా విచ్చేసారు. హైదరాబాద్ నుండి శ్రీమాన్ జి. రంగనాథాచార్యులు, కుంభకోణం రాజావేదపాఠశాల నుండి వచ్చిన శ్రీమాన్ బాలాజి, మహారాష్ట్రనుండి సచిన్ వైద్యనాథ్, ముంబైనుండి చైతన్య మహస్కర్, షోలాపూర్ నుండి ప్రవీణ్ శర్మ, మయూర్ శర్మలు ఈ సమ్మేళనానికి విచ్చేశారు. ఈ సమ్మేళనంలో 25గురు పాల్గొన్నారు. వీరిలో 17మంది మన ఆశ్రమానికి చెందినవారే కావడం గర్వకారణం.

మన సంస్థలో వేదాధ్యయనం చేసి ప్రస్తుతం భద్రాది రాముడి సన్నిధిలో అథర్వవేద పండితులుగ ఉన్న శ్రీమాన్ జి. మురళీకృష్ణమార్యులు ఈ సభలో పాల్గొన్నారు. 1992లో ప్రయాగ క్షేత్రంలో జరిగిన వేదసమ్మేళనంలో శ్రీ పరమేశ్వర్ దీక్షితర్‌గారిని మన స్వామివారికి పరిచయం చేసినది శ్రీమాన్ మురళీగారే. అలానే మన విద్యార్థులు ఈ శాఖను అధ్యయనం చేయడానికి ప్రేరేపణ కూడా వీరి ద్వారానే జరిగింది.

ముగింపు సభలో శ్రీమాన్ మురళీగారు మాట్లాడుతూ "వైదికలోకమంతా ఈ మైత్రాయణీశాఖను ఉద్ధరించిన మన జెట్‌సంస్థకు, శ్రీస్వామివారికీ సదా ఋణపడి ఉండాలని, ఇక మిగలదేమో అనుకున్న ఈ శాఖను పునరుజ్జీవింపచేయడమే కాక, గ్రంథాల రూపంలో కూడా సుసంస్కృతముగ అందించిన మహోపకారం మన సంస్థ వేదానికి చేసిందని, శ్రీ చిన్న జీయరుస్వామివారు వేదపురుషునికి అర్పించిన అద్భుతమైన కానుకే ఇవి" అన్నారు.

బ్రహ్మశ్రీ పరమేశ్వర్ దీక్షితర్ మాట్లాడుతూ "ఈ శాఖను దేవుడి కోసమే పారాయణ చేయటం తప్ప నేర్చేవారు ఎవ్వరూ దొరకరని నిరాశ నిండి ఉన్న నా వద్దకు శ్రీస్వామివారు విద్యార్థులను పంపారు. నా గురువుగారు, నావద్ద నేర్చిన శిష్యులూ అందరూ పౌరోహిత్యంలో ఉండి పాఠం చెప్పే అవకాశం లభించలేదు. జెట్‌లో మాత్రమే చక్కగ ఈ పాఠ్యప్రక్రియ, పరిశోధన ప్రక్రియా, గ్రంథముద్రణ కూడా జరగడం నాకెంతో గర్వంగ ఉంది. నాకెన్ని బహుమానాలు ఇతర చోట్ల వచ్చినా "ఇంతకు మించిన బహుమానం మరేదీలేదు" అని నేను స్పష్టం చేస్తున్నానన్నారు.

సభని పరిపూర్ణంగావించిన వేదవిద్వాంసులను శ్రీవారు సత్కరించి మంగళాశాసనం చేశారు. జీయర్ ఎడ్యుకేషనల్ ట్రస్ట్ అధ్యక్షులు శ్రీ గంగరాజుగారు, వారి సతీమణి శ్రీమతి లైలాగంగరాజుగారు ముగింపు సభలో పాల్గొన్నారు.



పరమహంస పరివ్రాజకులు

# శ్రీశ్రీశ్రీ చిన్నజీయర్‌స్వామివారి ప్రచారవార్తలు



శ్రీశ్రీశ్రీ చిన్న జీయరు స్వామివారు సీతానగరంలో చాతుర్మాస్య దీక్ష చేస్తున్నారు. శ్రీ స్వామివారితో పాటు నేపాల్ నుండి వేంచేసిన దేవనాయక జీయర్ స్వామివారు కూడా చాతుర్మాస్యదీక్షలో ఉన్నారు.

ప్రతిరోజు జరిగే స్తోత్రరత్నం ప్రవచనం భక్తులకు ఎంతో మధురానుభూతిని కల్గిస్తోంది.

ఆగస్టు 2వ తేదీ శ్రీ ఆండాళ్ తిరునక్షత్ర సందర్భంగా గోదా వైభవాన్ని తెలిపి, పూజాకార్యక్రమాన్ని నిర్వహింపచేశారు. శ్రావణ శుక్రవారాలలో లక్ష్మీపూజలు భక్తులందరితో సామూహికంగా జరిపించారు.

శ్రావణపూర్ణిమ, వ్యాసపూర్ణిమ నాడు వేదవిద్యార్థులు, పాంచరాత్ర ఆగమ పాఠశాల విద్యార్థులు ఉపాకర్మను జరుపుకున్నారు. వేదవేద్యుడైన హయగ్రీవ పెరుమాళ్ళముందు విద్యార్థుల చేత వారు నేర్చే విద్యలను ఒక్కసారి పునః ప్రారంభింప చేయించారు కళాశాల అధ్యాపకులైన శ్రీమాన్ మధుసూదనాచార్యులు, వరప్రసాదాచార్యులు, వంశీధరాచార్యులు మొదలైనవారు.

ఉత్తరాభాద్ర నక్షత్రం శ్రీ పెద్ద జీయరుస్వామివారి 103వ తిరునక్షత్రం. ఈ సందర్భంగా 12వ తేదీనుండి నడిగడ్డపాలెం ఆశ్రమంలో ఇష్టి కార్యక్రమాలు, అభిషేకాలు, రథోత్సవం, పుష్పోత్సవం లాంటివి కనుల పండువగా నిర్వహింపచేశారు శ్రీమాన్ నరసింహాచార్యులుగారు, వారి పరివారం.

శ్రీస్వామివారు ఈ కార్యక్రమాలలో పాల్గొని శ్రీ పెద్ద స్వామివారిని సేవించుకున్నారు.

15వ తేదీ స్వాతంత్ర్య దినోత్సవం సందర్భంగా సీతానగరంలో శ్రీమాన్ గుదిమెళ్ళ వేణుగోపాలాచార్యస్వామి త్రివర్ణ పతాకావిష్కరణ జరిపారు. శ్రీస్వామివారు స్వాతంత్ర్యదినోత్సవ విశిష్టతని, శ్రీ పెద్దస్వామివారు స్వాతంత్రోద్యమంలో పాల్గొన్న విషయాలను తెలుపుతూ, లభించిన స్వాతంత్ర్యాన్ని కాపాడుకుంటూ, దానికి తగినట్లు ప్రవర్తించాలని సూచించారు.

17వ తేదీ శ్రీశ్రీశ్రీ పెద్ద జీయర్ స్వామివారి తిరునక్షత్ర మహోత్సవం సీతానగరం ఆశ్రమంలో శ్రీ పెద్దస్వామివారి తిరునక్షత్రాన్ని జరుపుకుని భక్తులతో సహా స్వామివారు 10గం॥ నడిగడ్డపాలెం ఆశ్రమానికి చేరుకున్నారు. అప్పటికే వివిధ గ్రామాలనుండి భక్తులు తెచ్చిన క్షీరకలశాలతో శ్రీస్వామివారికి రథోత్సవము అత్యద్భుతంగ జరిగింది. "క్షీరాలన్ని బృందావనం చేరగానే శ్రీచిన్న జీయరు స్వామివారు విచ్చేశారు.

బృందావనంలో వేంచేసి ఉన్న శ్రీ పెద్ద జీయర్ స్వామివారికి శ్రీ చిన్న స్వామివారే స్వయంగ క్షీరాభిషేకం నిర్వహించారు. వేలాదిమంది భక్తులు నడిగడ్డపాలెం ఆశ్రమానికి చేరుకుని వారి ఆచార్య నిష్ఠను చాటుకున్నారు. అలా శ్రీ పెద్దస్వామివారి తిరునక్షత్ర వేడుకలు ఎంతో వైభవోపేతంగా జరిగాయి.



23వ తేది శ్రీ జయంతి. శ్రీకృష్ణ జన్మాష్టమి సాయంత్రం 5.30గం॥ శ్రీ విష్ణు సహస్రనామ స్తోత్ర పారాయణతో ప్రారంభమైంది. అశేష భక్తజనులు సుదూర ప్రాంతాల నుండి వచ్చి పాల్గొన్నారు. రాత్రి 11.00 గంటల వరకూ జరిగినది. ఈ కార్యక్రమంలో పాల్గొన్న భక్తులందరికీ శ్రీస్వామివారే స్వయంగా తీర్థాన్ని అనుగ్రహించారు. తీర్థగోష్ఠి అనంతరం వరుణుడు కూడా పరమోత్సాహంతో (కార్యక్రమంలో) పాల్గొన్నాడు.

25వ తేదీనుండి సీతానగరం ఆశ్రమంలో శ్రీమాన్ కోటేశ్వరరావు గారి ప్రేరణతో శ్రీమాన్ ఆలపాటి రామారావుగారి నేతృత్వంలో 7రోజులపాటు రామనామ సప్తాహం జరిగింది. అలా అలా ఎన్నో కార్యక్రమాలను పూర్తి చేసుకుంటూ 60 రోజులు శ్రీస్వామివారు సీతానగరంలోనే ఉంటారు అనే ఆనందాన్ని భక్తులకు మిగల్చకుండా, కాలం ఎవరికీ తెలియకుండా, చాపక్రింద నీరులాగ చాతుర్మాస్యం 10 రోజులలోకి వచ్చేసింది. కనీసం ఈ 10 రోజులనైనా జాగ్రత్తగా ఉపయోగించుకునే శక్తి భగవంతుడు అనుగ్రహించాలని ఆశిస్తున్నాం.

ఇన్ని కార్యక్రమాల్ని ఎవరికి ఏది ఏ సమయంలో అవసరమైనా వాటిని ఏర్పాటు చేస్తూ, పగలనక రాత్రనక భక్తుల ఆనందమే తమ ఆనందంగా భావిస్తూ శ్రీమాన్ వేంకటాచార్యస్వామి సమర్థవంతంగా నిర్వహిస్తున్నారు.

బదరీనాథ్ : 4,5 తేదీలలో నరనారాయణ జయంతి ఉత్సవం చాలా వైభవంగా జరిగింది. 4వ తేదీన నరనారాయణులు మన అష్టాక్షరీ క్షేత్రానికి వేంచేశారు.

# మెదడుకి మేత!

భగవద్బంధువులారా! జిజ్ఞాసతో మీరంతా చదువుతూ ఆదరిస్తున్న 'భక్తినివేదన'లో మీకోసం ఈ శీర్షిక! **ఈ పత్రిక లోని వ్యాసాలనుండే మీకు ప్రశ్నలిస్తున్నాం!** అయినా మరొక్కసారి జ్ఞాపకం చేసుకోవడం మనస్సుకి ఆనందమని మెదడుకీ చిన్నమేత! అన్నీ సరిగా వ్రాస్తే ఆకర్షణీయ బహుమతులు! ప్రతినెల 20వ తేదీలోపు మాకందిన సమాధానాలని మాత్రమే పరిశీలిస్తాం! ఆ పై దాటివచ్చినవి పరిశీలింపబడవు. దీనిపై ఎలాంటి ఉత్తర ప్రత్యుత్తరాలు ఉండవు. శ్రద్ధతో మీరు పంపిన గత నెల సమాధానాలందాయి. విజేతల పేర్లు క్రింద ప్రకటించాము. బహుమతులు పంపిస్తాం!

| ప్రశ్నలు | సమాధానాలు |
|---|---|
| 1. బాగుపడకోరే మనుష్యులను ------------------ అంటారు. | |
| 2. శుక్రాచార్యుల ద్వారా వెలికి వచ్చిన విద్య ------------------ | |
| 4. వేదం సులభంగా అధ్యయనం చేసే పద్ధతి ------------------ | |
| 5. హంస అరుపుని ------------------ అంటాము | |
| 6. అనవస్థా దోషం అనగా ------------------ | |
| 7. దేవతల ఆచార్య పుత్రుడు ------------------ | |
| 8. ------------------ సాధనాల ద్వారా శరీరాన్ని ఇంద్రియాలను భగవంతుని వస్తువులుగా గుర్తించగలుగుతాము. | |
| 9. శాండిల్య, ఔపగాయన, మౌంజ్యాయన, కౌశిక భారద్వాజ ఋషులుగా అవతరించినవి ------------------ | |
| 10. శ్రీపాంచరాత్ర శబ్దాని నిర్వచించిన కొన్ని సంహితల పేర్లు ------------- | |
| 11. దర్శనములనగా ------------------ | |
| 12. బాహ్య సంపదలకు మూలం ------------------ | |
| 13. సుమతి ఆశ్రయించినది ------------------ | |
| 14. అండం అంటే ------------------ | |
| 15. ఏది మనకు రక్షకమని పరిపూర్ణంగా విశ్వసించాలి? ------------------ | |
| 16. భగవద్గీతలోని 3వ అధ్యాయంలోని మహిమ ------------------ | |
| 17. అశాంతికి కారణం ------------------ | |
| 18. తత్త్వ జిజ్ఞాసువులైన పెద్దలెందరో -------------- ఆశ్రయించి సందేహాలను తీర్చుకుంటారు. | |
| 19. జ్ఞానహీనులు సుదర్శనులుగా మారాలంటే ------------------ | |
| 20. 'మంజూష'మనగా ------------------ | |
| 21. ఆంగ్లేయులు మన దేశమునుండి భౌతిక సంపదలను కొల్లగొట్టడమే కాకుండా ------------------ చేశారు. | |
| 22. ప్రేమసీ ప్రియులను వారి మధ్య ఉండే అనురాగాన్ని వీటితో పోల్చారు మన పెద్దలు. | |
| 23. 'వర్షాతప వారణాదిభిః' పదాలు విడదీస్తే ------------------ | |
| 24. భారత కథ వింటే కలిగే ప్రయోజనాలు ------------------------ | |
| 25. మనలో ఉండే ------------------ శత్రువుని జయించాలి. | |
| 26. ఇంగితం మనగా ------------------ | |

**గత నెల విజేతలు:** శ్రీ ఏచూరి రంగాచార్యులు(తెలుగు పండిట్) - గర్గుల్, నిజామాబాద్, కోగంటి నిర్మల-మాచవరం,విజయవాడ, కె. పూర్ణచంద్రరావు(రిటైర్డ్ ఇంజినీర్) - రాజమహేంద్రి, సత్యవరపు వీరభద్రరరావు-రాజమహేంద్రి.

**సూచన:** సమాధానాలు ఈ పత్రంలోనే నింపి, 20వ తేదీలోపు అందేట్టు పంపగలరు.

**భక్తినివేదన** శ్రీరాంనగరం, ముచ్చింతల్, పాలమాకుల పోస్ట్ 509 325 శంషాబాద్, రంగారెడ్డి జిల్లా. ఆంధ్రప్రదేశ్.

శ్రీమతే నారాయణాయ నమః

శ్రీమతే రామానుజాయ నమః





64 సం॥ల నుండి అశేష భగవద్బంధువులు ఆదరిస్తున్న...

ఆధ్యాత్మికమాసపత్రిక

# భక్తినివేదన

శ్రీఖరనామ సంవత్సర ఆశ్వయుజమాసం


సంపుటి 64 అక్టోబర్

సంచిక 7 2011


## పండుగలు

**అక్టోబరు :**

6. విజయదశమి
7. తిరువేంగడత్తాన్ తిరు ॥ శ్రీవారి చక్రస్నానం వేదాంత దేశికర్ తిరు॥ సర్వేషాం ఏకాదశి
8. పద్మనాభ ద్వాదశి
11. శరత్ పూర్ణిమ, వాల్మీకి జయంతి, చిత్తకార్తె
12.. త్రిద్యుస్పృక్
16. పంచమి తిథి
17. శూన్యతిథి
18. తులా సంక్రమణము, షష్ఠి తిథి, మధురకవి యాళ్వార్ తిరు॥
20. తిథి ద్వయం
21. దశమి తిథి
23. సర్వేషాం ఏకాదశి
24. స్వాతికార్తె
25. మాస శివరాత్రి
26. తెల్లవారుజాము 4గం॥ నుండి మంగళహారతులు, దీపావళి, ధనలక్ష్మీపూజ, కేదారవ్రతం, పిండపితృ యజ్ఞము.
27. శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ చిన్న జీయరు స్వామివారి తిరునక్షత్రము
28. ధన్వంతరి చిత్రగుప్త జయంతి
30. నాగచతుర్థి, వల్మీకపూజ
31. మణవాళ మహాముునుల తిరు ॥

**నవంబరు :**

1. సేన మొదలియార్ (విష్వక్సేనులు) తిరు ॥
2. తిథి ద్వయం, యాజ్ఞవల్క్య జయంతి.
3. పొయిగైయాళ్వార్ తిరు॥, పిళ్ళైలోకాచార్యర్ తిరు ॥
4. పూదత్తాళ్వార్ తిరు ॥ తిరుమాలై యాండాన్ తిరు ॥
5. పేయాళ్వార్ తిరు ॥
6. సర్వేషాం ఏకాదశి

వ్యవస్థాపకులు

పరమహంస పరివ్రాజకాచార్య

**శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జీయరుస్వామివారు**

సంపాదకులు

**శ్రీఉ.వే.శ్రీమాన్ T.P. శ్రీరామచంద్రాచార్యులు**

## విషయ సూచిక




Printed & Published by H.H. Tridandi Chinna Srimannarayana Ramanuja Jeeyar Swamiji on behalf of **Jeeyar Educational Trust** and Printed at **Sriman Printers & Processors** C/o JET, Sitanagaram-522 501, Guntur Dist., Andhrapradesh. **Published at** C/o JET, Sitanagaram-522 501 Guntur Dist, Andhrapradesh, Editor: Sri **T.P.Sriramachandracharya** S/o. Sri Sitaramacharyulu, No: 5-74, Ayodhya, Visakhapatnam- Andhra Pradesh.



చందావివరాలు: సంవత్సరచందా రూ.225/-

విదేశాలకు సంవత్సరచందా $30/-

D.T.P. & Design by : పరిశోధనాలయమ్,

ముద్రణ : శ్రీమాన్ ప్రింటర్స్ & ప్రోసెసర్స్, సీతానగరం.



మీ సేవలో....

భక్తినివేదన సీతానగరం-522 501

గుంటూరు జిల్లా, ఆంధ్రప్రదేశ్,

ఫోన్: 08645 272929

E-mail : **jetsitanagaram@yahoo.com**

Internet : www.chinnajeeyar.org

# శ్రీశ్రీశ్రీ స్వామివారి సందేశం

**2011 చాతుర్మాస్య దీక్షలో అనుగ్రహించిన "స్తోత్రరత్నము" ప్రవచనం నుండి**

మానవులైన ప్రతీ ఒక్కరూ పొందవలసిన రత్నాలు మూడు. అవి *1. మంత్ర రత్నమైన ద్వయమంత్రం. 2. పురాణరత్నమైన శ్రీ విష్ణు పురాణం. 3. స్తోత్రరత్నం అయిన ఆళవందార్ స్తోత్రం.* ఆళవందారులంటే యామునాచార్యులవారు. వారు తమ స్తోత్రరత్నంలో పురాణరత్నకర్త అయిన పరాశరమహర్షికి నమస్కరిస్తూ ప్రారంభించారు. ఆ పరాశరమహర్షి వైభవాన్ని తెలుసుకుని మనమూ నమస్కరిద్దాం!

పురాణరత్నంగ ప్రసిద్ధి చెందిన శ్రీ విష్ణు పురాణాన్ని మనకందించిన మహానుభావుడు *పరాశర మహర్షి*. మననశీలురిలో చాలా గొప్పవాడు. బ్రహ్మ మానసపుత్రుడైన 'వశిష్ఠులవారి మనుమడు'. 'శక్తి' అనే మహర్షికి పుత్రుడు'. 'వేదవ్యాస భగవానునికి తండ్రి', 'శ్రీ శుకునకు తాతగారు'.

వేదమే ఆరణ్యకాలలో *సహోవాచ వ్యాసః పారాశర్యః* పరాశరుని కుమారుడైన వ్యాసుడు పలికెను అని వ్యాసుని తండ్రి సంబంధంతోటే తెలియజేస్తుంది. భగవద్రామానుజులు *పారాశర్య వచస్సుధాం* అని పరాశర మహర్షి పుత్రుడైన వ్యాసునియొక్క శ్రీసూక్తులనే మధురామృతమైన బ్రహ్మసూత్రాలకి వ్యాఖ్యానాన్ని వ్రాస్తున్నానంటూ ప్రారంభిస్తారు.

వేదాలను విభజించి అందించిన వ్యాసుల వారికి కూడా వారి తండ్రిగారి సంబంధంతోటే ఇంతటి గౌరవం దక్కింది అంటే ఆయనకుండే జ్ఞానం ఎంతటిదో కదా!

*వ్యాసుడు అంటే వేదవాఙ్మయాన్ని జాగ్రత్తగా సంరక్షించే వాడు* అని అర్థం. ఈ వ్యాస అనేది ఒక పదవిలాంటిది. దానిలో ఒకనాడు 'శక్తి' అనే ఆయన, తరువాత *పరాశరమహర్షి*, ఆ తరువాత మనకి తెలిసిన మన కలియుగానికి జ్ఞానాన్ని అందించిన మహానుభావుడు *కృష్ణద్వైపాయనుడు* ఆ పదవిలో ఉన్నారు. మనం *వ్యాసుడు* అని అనుకునే ఆయన పేరే *కృష్ణద్వైపాయన వ్యాసుడు*.

వీనికి తండ్రియైన పరాశర మహర్షి చాలా గొప్పవాడు. ఆయన ఆవిర్భావమే చాలా విలక్షణమైనది. తల్లిపేరు అదృశ్యంతి. తండ్రిపేరు శక్తి . పరాశరమహర్షి మాతృగర్భంలో ఉన్నప్పడే తండ్రి మరణించాడు. కల్మాష పాదుడనే రాక్షసుడు విశ్వామిత్రుని ప్రభావంతో శక్తిని, అతని సోదరులు 99మందిని తినేస్తాడు. 100మంది పుత్రులు మరణించడంతో వసిష్ఠులవారు అరుంధతి ఆ శోకాన్ని తట్టుకోలేకపోయారు. ఆ శోకంలో అంతటి మహానుభావుడూ, సాక్షాత్తు బ్రహ్మమానస పుత్రుడు అయిన ఆ వసిష్ఠుడు ఆత్మహత్య చేసుకొని ప్రాణాలు వదిలేద్దాం అనుకున్నాడు. ఆ ప్రయత్నంలో ఉండగా వారి కోడలు అదృశ్యంతి వారిని ఆ ప్రయత్నం నుండి విరమింపచేసింది.

ఓ మహానుభావా! మీరు మన వంశమంతా నాశనమయిపోయిందని అనుకుంటున్నారు. కాని, మన వంశాంకురం నా గర్భంలో ఉంది. నా భర్త ఎలాగూ నాకు మిగలలేదు. ఇక మీరు కూడా లేకుంటే నేనెలా జీవించాలి? నేనూ పోతే మన వంశమే నశించి పోతుంది కదా! అని ప్రార్థించింది. ఆ మాటలకు వసిష్ఠుడు పుత్రులు పోయిన శోకం ఉన్నా వంశాంకురాన్ని రక్షించుకోవాలన్న తపనతో జీవితాన్ని కొనసాగించారు.

"పోయే ప్రాణాలను తిరిగి రప్పించిన వాడు" కనుక ఆ పిల్లవానికి "*పరాశర*" అని నామకరణం చేసారు. అంటే "*పరాశు*" పరమైన అశువులను "*రై-ఆదానే*"అనే ధాతువును బట్టి తిరిగి రప్పించిన వాడు అని అర్థం. కనుక పరాశరుడైయ్యాడు. అంతే కాదు తనకున్న పట్టుదలతో పరులందరినీ అశ్రుణాతి భయపెట్టాడు కనుక ఆయన పేరు పరాశర. ఈ మహర్షి 12సం॥ గర్భవాసం చేశాడు. ఆయన గర్భంలో ఉండగానే వేదాలన్నింటినీ కూడా అధ్యయనం చేసేశాడు.

ఒకనాడు వసిష్ఠమహర్షి తన భార్య. కోడలితో కలసి దేశాంతరానికి వెళుతున్నారు. నడుస్తూ నడుస్తూ ఉన్న వసిష్ఠులవారు ఒక్కసారి వెనక్కి తిరిగి అంతా పరిశీలించారు. మళ్ళీ ముందుకు నడక ప్రారంభించారు. కొంతసేపయ్యాక మళ్ళీ వెనుతిరిగి అంతా పరిశీలనగా చూస్తున్నారు. అది గమనించిన అరుంధతి "దేని కోసం మీరు వెతుకుతున్నారు?" అని ప్రశ్నించింది. అప్పడు వశిష్ఠులవారు "నా వెనుకాల ఎవరో వేదం చదువుతున్నారు. ఆ స్వరం పూర్వం మన శక్తి చదివినట్లే అనిపిస్తోంది. కానీ, వెనుకాల ఎవరూ కనిపించటం లేదు. ఆ కనిపించక వేదానుసంధానం చేసే వ్యక్తి ఎవరై ఉంటారా అని చూస్తున్నా" అన్నారు.

అపుడు వారి కోడలు అదృశ్యంతి "అయ్యా! నా గర్భంలో ఉండే శిశువుకి ఎప్పడో 7సం॥లు దాటి పోయాయి. అతనికి నా గర్భంలో ఉండగానే వేదాలు ప్రకాశిస్తున్నాయి. నేను చాలా సార్లు ఇలా విన్నాను" అని తెలియజేసింది. అలా పరాశర మహర్షి పన్నెండు సం॥ గర్భవాసం చేసి, గర్భంలోనే వేదాధ్యయనం పూర్తిచేసి బయటకు వచ్చిన మహానుభావుడు. ఈ స్తోత్ర రత్నంలో యామునాచార్యులు

*తస్మై నమో మునివరాయ పరాశరాయ* అని ఆ పరాశర మహర్షికి నమస్కరించాలని మనకి నేర్పిస్తున్నారు.



# య ఏవం వేద...



శ్రీమాన్ గుదిమెళ్ళ మురళీకృష్ణమాచార్యస్వామి-భద్రాచలం

*గత సంచిక తరువాయి...*

**'ఆప్తవాక్యం ప్రమాణమ్'** అనేది శబ్దప్రమాణానికి సంబంధించిన సామాన్య నిర్వచనము. ఆప్తుడు అంటే ఉన్న విషయాన్ని ఉన్నట్లుగా చెప్పేవాడు. 'ఆప్తస్తు యథార్థవక్తా' అని ఆప్తశబ్దానికి తార్కికులు చెప్పిన వివరణము. తాను చూసిన విషయానికి చిలువలు పలువలు చేర్చకుండా, ఎదుటివ్యక్తిని మోసం చేయాలనే బుద్ధిలేకుండా, ఏదోచూచి మరేదోగా భ్రమపడి చెప్పే వాడు కాకుండా ఉన్న విషయాన్ని ఉన్నట్లుగా చెప్పేవాడే కదా! యథార్థవక్త అంటే. భాషాపాటవం, ఇంద్రియ పాటవం, విషయవిజ్ఞత, విశ్వసనీయత... ఇవన్నీ ఆప్తునియొక్క యథార్థ వక్తృత్వానికి సహకరిస్తాయి. మనం లోకవ్యవహారంలో ఎంతో మంది మాటలను ఆప్తవాక్యాలుగా పరిగణిస్తూంటాము... ప్రమాణీకరిస్తూంటాము కూడ. మనమే కాదు... శబ్ద ప్రమాణాన్ని అంగీకరించమని మొండికేసిన వారు కూడ ఇలాంటి ఆప్తవాక్యాలను ప్రమాణాలుగా పాటిస్తూనే ఉన్నారు.

ఒక ఆసుపత్రిలో శిశువును ప్రసవించి స్పృహ కోల్పోయిన తల్లికి స్పృహవచ్చిన తరువాత ఆ వైద్యుడు ఒక శిశువును చూపించి 'ఇతడే నీ బిడ్డ' అంటే ఆ తల్లి నమ్మితీరుతుంది. ఆమె తన భర్తకు 'ఇతడు మనబిడ్డ' అని ఏ శిశువును చూపిస్తే... ఆ శిశువునే తన బిడ్డగా విశ్వసించి పొంగిపోతాడు ఆ తండ్రి. ఆ సమయంలో 'ప్రత్యక్షం'గా చూడక పోయినా, 'అనుమానించే' అవకాశం ఏమాత్రం లేకపోయినా చెప్పిన వ్యక్తులయొక్క మాటమీది నమ్మకంతో ఆ విషయాన్ని ప్రమాణంగా స్వీకరించడం లోకంలో అనుభవసిద్ధమే! ఆ వైద్యుని మాటను ఆ కన్నతల్లి, ఆ తల్లిమాటను ఆమె భర్త విశ్వసించడాన్ని శబ్దప్రమాణంగానే పరిగణిస్తూంటాము.

మనం కొంచెం జాగ్రత్తగా పరిశీలిస్తే ఏ శబ్దప్రమాణాని కైనా ప్రత్యక్ష అనుమానాలతో ఏదో ఒకటి ఆధారమై యుంటుంది. సాధారణంగా శబ్దం అనేది అనువాదమే తప్ప స్వతంత్రం కాదు. అలాంటప్పుడు శబ్దమూలకమైన వేదం కూడ అనువాదమే అవుతుంది కదా! దానిని స్వతః ప్రమాణము అని ఎలా నిర్ణయించడం..? అనే సందేహం కలుగకమానదు.

ఏదైనా ఒక సాధుశబ్దమును వినగానే పద-పదార్థ- సంబంధ జ్ఞానం కలిగిన వానికి ఆ శబ్దంయొక్క అర్థం స్ఫురిస్తుంది. అలా అర్థాన్ని స్ఫురింపచేయడమే శబ్దప్రమాణానికి కారణమౌతుంది. ఈ నియమం వైదిక శబ్దాలకైనా ఒకటే... లౌకిక శబ్దాలకైనా ఒకటే. ఇలా అర్థస్ఫోరకంగా శబ్దప్రయోగమును చేసినవాడు ఆప్తుడా? ఆప్తుడు కాడా? అనే ప్రస్తావన కూడ అవసరం లేదు.

అనాప్తుడు కూడ అర్థస్ఫోరకత్వాన్ని కలిగించే విధంగా మాటలాడవచ్చును కదా! ఆప్తుడు ఉచ్చరిస్తేనే అది శబ్దము అనే నియమమూ లేదు కదా!! ఆప్తుడు కానివాడు పలికినా అది శబ్దమే అయితే ప్రమాణం కాకపోవచ్చుగాక! యథార్థవాది కానివాని మాటను మనం ఎలా విశ్వసించగలం?

యథార్థమును చెప్పేవాడైన ఆప్తుని మాటను మనం ప్రమాణంగా స్వీకరిస్తున్నాము. అయితే ఆప్తుడు అనేవాడు చూసిన విషయాన్ని మాత్రమే చెపుతాడు తప్ప అతీంద్రియములైన విషయాలను చెప్పలేడు. ఒకవేళ అతడే అతీంద్రియములైన వాటిని చెప్తే వాటిని యథార్థములుగా ఎలా పరిగణించగలము? ఏ ప్రమాణంతో వాటిని ప్రమాణములనో అప్రమాణములనో చెప్పగలము?

ఇంతకూ ఆప్తుడు అని మనం అనుకునే వ్యక్తియొక్క ఆప్తత్వాన్ని నిర్ణయించడానికి ప్రమాణం కావాలి. మళ్ళీ ఆ ప్రమాణం ప్రమాణమే అనడానికి ఇంకొక ప్రమాణంకావాలి. దానికి ఇంకొకటి ఆ దానికి మరొకటి ఇలా ప్రమాణాల పరంపరతో 'అనవస్థ' తప్పదు.

**స్వతస్సర్వ ప్రమాణానాం ప్రామాణ్యమితి గమ్యతే ।**
**నహి స్వతోఽసతీశక్తిః కర్తు మన్యేన శక్యతే ॥**

ప్రతి ప్రమాణానికి ఆ యా ప్రమేయమును బోధించేశక్తి స్వతస్సిద్ధముగా లేకపోతే కనక, మరొక ప్రమాణముచే కల్పించడం కుదరదు కనుక అన్ని ప్రమాణములు తనను బాధించే (అంటే అప్రమాణము అని నిరూపించే) కారణమును పొందేంతవరకు మాత్రమే ప్రమాణములు అవుతాయి. వాటిని బాధించే కారణం కలుగగానే అప్రమాణములు అయిపోతాయి.

మనం ప్రమాణంగా భావిస్తున్న విషయము అనాప్తుడు చెప్పిన మాట అని తెలియగానే దానిలోని అయథార్థమును తెలుసుకుని దానిని అప్రమాణముగా వదలడం అనేది మన వ్యవహారంలో ఉన్నదే కదా! అర్థాత్ నైయాయికులు చెప్పినట్లు ఆప్తవాక్యమే ప్రమాణము అని భావించడంకంటే అప్రామాణ్యములేని ప్రమాణమును గుర్తించుట మంచిది కదా!

అందుకే ప్రమాణవ్యవస్థ బాగా తెలిసిన ప్రమాణ మర్యాదాభిజ్ఞులైన పెద్దలంతా కలసి వేదమునందు అప్రామాణ్య కారణములు ఏమైనా ఉన్నాయా... అని బాగా పరీక్షించి వేదము నందు ఎలాంటి అప్రమాణకారణములు లేవని నిర్ధారించినారు.

వేదమును స్వతః ప్రమాణముగా ధ్రువీకరించినారు. మరొక ప్రమాణంతో ప్రమాణీకరించవలసిన అవసరం లేకుండా తనకు తానే ప్రమాణమై ఇతర ప్రమాణములనన్నింటికి ఏకైక ప్రమాణమై నిలిచే దానిని స్వతఃప్రమాణము అని వ్యవహరించాలి. అది వేదము తప్ప మరొకటి లేదు. దీని స్వతః ప్రమాణత్వమును నిర్ధారించు కోవడానికై కొన్ని కారణములను పరిశీలించవలసి యుంటుంది.

అబోధకత్వము, అనువాదకత్వము, బాధితార్థకత్వము, పురుష ప్రణీతత్వము అనే ముఖ్యమైన నాలుగు కారణాలను పరిశీలనం చేద్దాము. వీటిలో అబోధకత్వము మొదటిది. అబోధకత్వం అంటే అనుకున్న విషయాన్ని సమర్థవంతంగా బోధించలేకపోవడం... అక్షరములు, పదములు తప్పుగా ఉండడం, లేదా ప్రకృతి ప్రత్యయాదులను సరిగ్గా పాటించకపోవడం, తగిన క్రియా కారక ముల కూర్పులేకపోవడం ఇవన్నీ అబోధకత్వాన్ని తెలియజేస్తాయి.

ఉదాహరణకు రేముడు అయోధ్యచేత పుట్టినది అనే వాక్యం ఉందనుకోండి... దీనివల్ల మనకేదైనా విషయం అర్థమౌతోందా? లేదు. రాముడు అనవలసినచోట రేముడు అన్నామనుకోండి. దానిని ఏవిధంగా అర్థం చేసుకోగలుగుతాం. 'రాముడు' అయోధ్యలో పుట్టినాడు' అని చెప్పవలసిన విషయాన్ని అక్షరాలు తప్పుగా ప్రకృతి ప్రత్యయాలు తప్పుగా, క్రియాకార కాలు తప్పుగా ప్రయోగిస్తే దానికి బోధకత్వశక్తి ఏముంటుంది? ఇలా అబోధకత్వం వేదంలో మనకు ఎక్కడా కనిపించదు. వేదం, మనకు అనుభవంలో ఉన్న విషయాలను, అనుభవంలో లేని విషయాలను, మన అనుభవానికి అందని అతీంద్రియాలైన విషయాలను ఎంతో చక్కగా అర్థస్ఫోరకత్వం కలిగేలా బోధిస్తోంది కాబట్టి... వేదానికి అబోధకత్వం అనే దోషం లేదు.. కాబట్టి ఇది ప్రమాణమే. అబోధకత్వం వేదంలో ఉన్నది అని నిరూపించడానికై కొందరు చార్వాకులు వేదం మొత్తాన్ని వెదకి వెదకి కొన్ని మంత్రాలని పట్టుకున్నారు. వాటిలో ఇది ఒకటి.

మం॥ **సృణ్యేవ జర్భరీతుర్ఫరీతూ నైతో శేవతుర్ఫరీ పర్ఫరీకా।**
**ఉదన్యజే వజే మనామదేరూ తామే జరాయ్వజరం మరాయు॥**

ఇది ఋగ్వేదంలోని మంత్రము నిజానికి పదాలు చూస్తే పరాయిభాషేమో అనిపిస్తుంది. వ్యాకరణాది వేదాంగములలో ప్రవేశం లేని మనలాంటివారికి జుట్టుపీక్కున్నా అర్థంకాని పదవైచిత్రి ఈ మంత్రంలో కనిపిస్తోంది.

**నాయం స్థాణోరపరాధః యదేనమన్ధోన పశ్యతి** అనే న్యాయం ఒకటున్నది. ఒక గ్రుడ్డివాడు నడుస్తూ నడుస్తూ ఒకచెట్టును దభేలుమని ఢీకొట్టుకున్నాడు. క్రిందపడి లేచి నిల్చొని తననోటికి వచ్చినట్లు తిట్టడం ప్రారంభించాడుట. అది ఎవరితప్పు? గ్రుద్దుకున్న గుడ్డివానిదా? తన మానాన తాను బ్రతుకుతూ పది మందికీ చల్లని నీడనిచ్చే చెట్టుదా? చూడలేని గ్రుడ్డివానిదే తప్పు. కాని చెట్టు తప్పు ఎంతమాత్రమూ లేదు కదా? పై విషయం చూస్తే ఈ న్యాయం గుర్తుకు వస్తూ ఉంటుంది.

వేదార్థమును చూడలేని గ్రుడ్డితనం మనది. వేదము యొక్క స్వరూపం బాగా తెలియాలంటే వేదాంగముల జ్ఞానం కావాలి. శీక్షా, వ్యాకరణం, ఛందస్సు, నిరుక్తం, జ్యౌతిషం, కల్ప సూత్రము. ఈ ఆరింటిని షట్ అంగములు అని వ్యవహరిస్తారు. అంటముల జ్ఞానం సక్రమంగా లేనిదే అంగిని ఎలా గుర్తించగలము. అతని స్వరూపమిది అని ఎలా చెప్పగలము? వేదమునకు ఈ ఆరూ ప్రధానములైన అంగములు. వీటిలో ఛందస్సు అనే శాస్త్రం వేదములకు పాదములవంటిది. కల్పము అనే శాస్త్రం చేతులవంటిది. జ్యౌతిషశాస్త్రము వేదమునకు కన్నులవంటిది నిరుక్తము అనే శాస్త్రము చెవులవంటిది. వ్యాకరణం ముఖంవంటిది... శీక్షాశాస్త్రము వేదమునకు ప్రాణమువంటిది.

**ఛన్దః పాదౌతు వేదస్య** ఇత్యాదిగా కల పాణినీయ శిక్షలోని శ్లోకము వేదస్వరూపాన్ని షడంగసముదాయంగా పై విధంగా వర్ణించింది.

ఈ శాస్త్రములను బాగా అవగాహన చేసుకున్నవారికే వేద స్వరూపము సాక్షాత్కరిస్తుంది. ఈజ్ఞానం లేనివారు గ్రుడ్డివారి క్రిందే లెక్క. చెట్టును తిట్టడం, వేదమును దూషించడం ఈ రెండూ ఆయా వ్యక్తుల యొక్క దోషములేకాని వేద-వృక్షముల దోషం కాదు కదా!

వేదవేదాంగ విజ్ఞాన నిధులైన యాస్కుడు మొ॥ మహాత్ములు పై మంత్రమునకు సప్రమాణముగా అర్థమును విశదీకరించారు కూడ. ఈ మంత్రము అప్తోర్యామము అనుయాగములో అశ్వినీ దేవతలను స్తుతించు సందర్భంలో వినియోగము కలది.

ఓ అశ్వినీ దేవతలారా! మీరు అంకుశముచే సుశిక్షితులైన మత్తగజమువలె భారమును వహించగలరు. శత్రువులను చీల్చి చెండాడగలరు. మిమ్ము స్తుతించు భక్తుల అభీష్టములను తీర్చి కాపాడగలరు. నీటిలో పుట్టిన రత్నమువలె నిర్మలముగా ప్రకాశించు చున్నారు. బలాఢ్యులై జయశీలురైయున్నారు. అట్టి మీరు జరాయుజ మగుటచే మరణశీలమైన నా శరీరమును జరామరణ రహితమైన దానినిగా చేయుదురుగాక! ఇదీ... ఆ మంత్రముయొక్క భావము.

వేదమునకు అబోధకత్వం అనే దోషం అంటగట్టుట మహాపాపమే అవుతుంది. వేదము 'జ్యోతిష్టోమేన స్వర్గకామో యజేత' అని బోధించింది. ఈ వాక్యంలో అక్షర-పదస్ఖాలిత్యములు కాని, ప్రకృతి ప్రత్యయ వ్యత్యయాయాదులు కాని, లేకుండా తగిన క్రియాకారక పదసన్నివేశమై ఉండి జ్యోతిష్టోమయాగము-స్వర్గఫల సాధనము అనే అర్థమును బోధించుచున్నది. కాబట్టి వేదమునందు అబోధకత్వము అనే అప్రమాణకారణము లేనేలేదు.

పైమూడు అప్రమాణకారణముల అభావం గురించి వచ్చే నెలలో తెలుసుకునే ప్రయత్నం చేద్దాము!

అంతవరకూ జై శ్రీమన్నారాయణ!



# పిబత భాగవతం రసం... వివిధావతార ప్రశంసనమ్

శాస్త్రరత్నాకర, శాస్త్రవిద్వన్మణి డా॥ఉ.వే సముద్రాల వేంకట రంగరామానుజాచార్యస్వామివారు
డైరెక్టర్ - అకెడమిక్ కౌన్సిల్ 'జీవ' శ్రీరాంనగర్ (శంషాబాద్)

*(గత సంచిక తరువాయి)*

## శ్రీమద్భాగవతావిర్భావం-వైశిష్ట్యం

భగవదవతారరహస్యాన్ని విశదపరచాడు సూతుడు శౌనకాదులకు. ఇది ముగిసిన తరువాత, భాగవత కథావిర్భావానికి ఏర్పడిన సన్నివేశాన్ని చెప్పదలచి "భగవద్భక్తులు మాత్రమే భగవత్తత్త్వాన్ని ఎరుగగలుగుతారు. ఓ శౌనకాదులారా! మీరంతా భగవంతుని పట్ల మీ మనస్సునుంచి నన్ను ప్రశ్నించి ధన్యులైనారు. ఇలా పరమాత్మయందు ఐకాన్తిక భావాన్ని ఉంచిన వారికి దుఃఖ బహుళమైన ఈ సంసారంలో ప్రవృత్తి ఎంత మాత్రం కలుగదు" అంటూ తాను ఈ భగవత్కథను ఎలా వినగలిగినదీ, సన్నివేశ నిరూపణ పురస్సరంగా మునుల ముందుంచాడు సూతుడు.

**ఇదం భాగవతం నామ పురాణం బ్రహ్మసమ్మితమ్ ।**
**ఉత్తమ శ్లోకచరితం చకార భగవాన్ ఋషిః ॥**

ఇది వేదంతో సమానమైన భాగవతమని ప్రసిద్ధిచెందిన పురాణం– పురుషోత్తముని చరిత్రం. దీన్ని బాదరాయణ మహర్షి రచించాడు.

**తదిదం గ్రాహయామాస సుతమాత్మవతాం వరమ్ ।**
**సర్వవేదేతిహాసానాం సారం సారం సముద్ధృతమ్ ॥**

సర్వ వేదేతిహాస పరమసారాన్ని ఉద్ధరించి నిర్మించిన దీన్ని, నిగృహీతేంద్రియుడైన తన పుత్రుడు శుకునికి ఋషి ప్రతిబోధించాడు.

**సతుసంశ్రావయామాస మహారాజం పరీక్షితమ్ ।**
**ప్రాయోపవిష్టం గంగాయాం పరీతం పరమర్షిభిః ॥**

ఆ శుకుడు, గంగాతీరాన మహర్షులతో పరివేష్టితుడై ప్రాయోపవేశం చేసి కూర్చొని ఉన్న పరీక్షిన్మహారాజుకు ప్రతిబోధించాడు.

ఆ సమావేశంలో ఉన్న నేను మహర్షి అనుగ్రహంచేత భాగవతార్థాన్ని అధిగమించాను (పొందాను). ఇలా ఋషి ముఖంగా భాగవతాన్ని లభించిన నేను, నేను పొందిన రీతినే యథామతి మీకు వినిపిస్తాను అని సూతుడు శౌనకాదిమునులకు చెప్పి, భగవంతుడు తన అవతారాన్ని చాలించి పరమపదానికి వెళ్ళిన తరువాత, కలి ప్రభావంచే తత్త్వదర్శనాన్ని కోల్పోయిన వారికి ఈ పురాణసూర్యుడు ఇప్పుడు ఉదయించి దృగ్గోచరుడై నాడని...

**కృష్ణే స్వధామోపగతే ధర్మజ్ఞానాదిభిఃసహ ।**
**కలౌ నష్ట దృశామేష పురాణార్కోఽధునోదితః ॥**

అంటూ మునిమండలికి నివేదించాడు సూతుడు.

### భాగవతావిర్భావం (నాల్గవ అధ్యాయం)

సూతుడు శౌనకాది మహర్షులకు తాను భాగవతాన్ని విన్న వైనాన్ని సంగ్రహంగా చెప్పాడు. ఇలా చెప్పిన సూతునితో వృద్ధుడు, కులపతి, ఋగ్వేది అయిన శౌనకుడు ఇలా ప్రార్థించాడు. "ఓ సూతా! మహాభాగా! భగవానుడైన శుకుడు చెప్పిన భాగవతకథను మాకు చెప్పు.

ఈ కథ ఏ యుగంలో జరిగింది? ఏ స్థానంలో, ఏ నిమిత్తంగా ఏర్పడింది? ఈ భాగవత సంహితను, వ్యాసుడు ఏ విధంగా ప్రచోదితుడై నిర్మించాడు?

ఈ మహానుభావుని పుత్రుడైన శుకుడు మహాయోగి, నిర్వికల్పకుడు, సమ్యగ్దర్శి, ఏకాంతమతి, ఈ సాంసారిక మాయాశయనం నుండి మేల్కొని ఎవ్వరికి తెలియకుండా గూఢంగా, జడునిలా ఉండేవాడు.

ఎలా లోకులకు గోచరించాడు? కురుజాంగలాలకు ఎలా రాగలిగాడు? ఉన్మత్తులాగాను, మూగవానివలె, జడునిలా హస్తినాపురంలో తిరుగుతూ, నగ్నంగా ఉన్న శుకుని చూచి, ఆశ్చర్యం! అప్సరస్త్రీలు సహితం బట్టలు ధరించలేదు.

కాని, వస్త్రాలు ధరించి ఉన్న వ్యాసుని చూచి సిగ్గు పడ్డారట. దాన్ని చూచి, వ్యాసుడు కారణం అడుగగా, వారిలా

అన్నారట. "మహర్షీ! నీ పుత్రునికి స్త్రీ పురుషభేదం ఎంత మాత్రం తెలియదు. కాని, నీకు భేదజ్ఞానం ఉంది. కనుక నిన్ను చూచి సిగ్గుపడినా, నీ పుత్రుని చూచి సిగ్గు పడలేదని" సమాధానం చెప్పారట.

అటువంటి నిర్వికారుడైన నీ పుత్రునికి, రాజర్షియైన పరీక్షిత్తుకు, సంవాదం ఎలా ఏర్పడింది? ఆ సంవాదం ద్వారానే కదా ఈ **"సాత్త్వత సంహిత"** ఆవిర్భవించింది.

ఈ శుకుడు గృహస్థుల ఇండ్లలో కేవలం గోదోహనకాల మాత్రమే (పాలు పితికేందుకు పట్టే కాలం ఎంతో అంతసేపు మాత్రమే) నిలచి ప్రతీక్షిస్తాడట. ఇలా స్వసన్నిధి చేత ఆ గృహాలను పవిత్రీకరిస్తాడు.

అభిమన్యు పుత్రుడైన పరీక్షిత్తు పరమ భాగవతోత్తముడని అంటారు. ఆతని పుట్టుక ఎంతో ఆశ్చర్యజనకం, ఇక ఆయన కర్మలు (చేష్టితాలు) కూడా ఆశ్చర్యకరాలు. వాటిని వివరించు మహాభాగా! పాండువంశానికి గౌరవాన్ని కలిగించేవాడైన ఆ పరీక్షిన్మహారాజు, ఏ కారణంగా అధిరాజశ్రీని అనాదరించి గంగాతీరాన ప్రాయోపవిష్టుడైనాడు?

ఎవ్వని పాదాలను, తమకు క్షేమం కలగాలని శత్రువులు సహితం ధనాలను ఉపాయనాలుగా తెచ్చి సమర్పించి అర్చిస్తారో, అట్టి యువకుడు, వీరుడు, విడువరాని అపారైశ్వర్యాన్ని తన ప్రాణాలతో పాటుగా విడువడానికి ఎలా ఇష్టపడ్డాడు?

లోకమాంగల్యానికి, సమృద్ధికి, ఐశ్వర్యానికి, ఎవ్వరు ఉత్తమ శ్లోకుడైన భగవానుని పట్ల అనన్య ప్రీతి కలిగి ఉంటారో, వారు తమ కొఱకు తాము బ్రతకరు. ఇలా ఇతరులకు ఆశ్రయమైన దేహాన్ని నిర్వేదం చెంది ఎందుకు విడచిపెట్టాడు? ఇదంతా మాకు సమగ్రంగా విశదపరచు మహానుభావా! నీవు వేదాతిరిక్తమైన పురాణాది విషయంలో విశేషాభినివేశం కలవాడి వని నేను భావిస్తున్నాను" అని అన్నాడు శౌనకుడు.

సూతుడు దీనికి సమాధానం చెప్పాడు. తృతీయయుగ పరివర్తనం కలిగినప్పుడు ద్వాపరయుగం చివరలో పరాశర మహర్షి నుండి వాసవియందు (వసువీర్య సంజాత అయిన సత్యవతి యందు) శ్రీహరిఅంశతో ఆవిర్భవించాడు వ్యాసమహర్షి. *(సశేషం)*

# కలివైరిసూరి వైభవము

శ్రీ ఉ.వే.శ్రీమాన్ కె. టి. రామానుజాచార్యస్వామి-నెల్లూరు



గత సంచిక తరువాయి...

**తిరుమంగై ఆళ్వార్- పెరియ తిరుమొழ్ి 1-7-7**

7. మునైత్తశీత్తం విణ్శుడప్పోయ్ మూవులకుమ్ పిఱవుమ్
అనైత్తు మంజవాళరియాయ్ ఇరున్ద వమ్మాన తిడమ్ ।
కనైత్త తీయుమ్ కల్లుమల్లా విల్లుడై వేడరుమాయ్
త్తినైత్తనైయుం శెల్లవొణ్ణా చ్చింగవేழ్ కున్నమే॥

**ప్రతిపదార్థము:** **మునైత్త**=అధికమైన; **శీత్తం**=కోపము; **పోయ్**=పోయి; **విణ్**=ఆకాశమును; **శుడ**=కాల్చివేయగ; **మూవులకుమ్**=ముల్లోకములును; **పిఱవుం**=మిగిలిన లోకములును; **అనైత్తుం**=సకల లోకములును; **అంజు**=భయపడునట్లు; **ఆళ్ అరియాయ్**=నరసింహరూపియై; **ఇరున్ద**=వేంచేసియున్న; **అమ్మావతు**=స్వామియొక్క; **ఇడమ్**=స్థానము; **కనైత్త**=ధ్వనించుచున్న; **తీయుమ్**=అగ్నియు; **కల్లుమ్**=రాళ్ళును; **అల్లా**=ఇంతమాత్రమేకాక; **విల్లుడై**=ధనుర్ధారులగు; **వేడరుమాయ్**=బోయవారులను కలదై; **తినైత్తనైయుమ్**=కొంచమైనను; **శెల్లఒణ్ణా**=చేరుటకు వీలుకాని; **శింగవేழ్కున్నమే**=అహోబిలమనెడి క్షేత్రము.

**తాత్పర్యము:** ఉగ్రనరసింహుని మిక్కుటమగు కోపము ఆకాశమును సైతము దహించివేయుచున్నది. చరాచర జగత్తంతయు గడగడలాడినది. ఇటువంటి శ్రీనరసింహస్వామి అహోబిలక్షేత్రమున వేంచేసియున్నాడు. ఆ ప్రదేశమంతయు కణకణలాడు అగ్నితో, దానిలో కాలిన బండలతో నిండి యుండును. అంతేకాక క్రూరులైన బోయవారు విల్లంబులను ధరించి సంచరించుచుందురు. కావున ఆ క్షేత్రము ఏమాత్రమును సమీపింపసాధ్యము కాదు.

**విశేషార్థము:** శ్రీ అహోబిలేశుని కోపాతిశయమును ఆళ్వారులు వర్ణించుచున్నారు. శ్రీనరసింహుని కోపాగ్ని అంతరిక్షమును కాల్చివేయుచున

**మూవులకమిత్యాది:** శ్రీ నరసింహునిలోని మనుష్య సింహత్వములను చూచి బ్రహ్మాది దేవతలు వసించు లోకములే కాక ముల్లోకములు భయముతో గజగజలాడివి.

**కనైత్త**= అహోబిల పర్వతము నిప్పుల మంటలతో మండునపుడు ఏర్పడే "పటపట" ధ్వనులతోను, ఆ మంటలలో కాలిన రాళ్ళతోను నిండియున్నది. ఆ ప్రాంతమున సంచరించు వేటగాండ్రు బహుక్రూరులు. ఆ పర్వతాగ్నియందును, ఆ మంటలతో ఎఱ్ఱగా కాలిన రాళ్ళయందును అడుగిడవచ్చునేమో కాని అచ్చటి వేటగాండ్రులయొక్క తీక్షణములగు ముఖములను మాత్రము చూడలేము.

భగవద్విముఖములైనవారు అహోబిలక్షేత్రమున వేంచేసియున్న స్వామిని సమీపించి, సేవించి ఆ స్వామి వైభవాన్ని చూచి (శిశుపాలునివలె) అసూయ చెందవీలులేనిదని తిరుమంగై ఆళ్వారు అహోబిలక్షేత్ర వైభవాన్ని తెలియజేస్తున్నారు. *(ఇంకా ఉంది)*



# అహో! భారతమ్

శ్రీమతి డా॥టి.కె. చూడామణి-విజయవాడ

*(గత సంచిక తరువాయి..).*

రాక్షస కుమారులకి కచుడు బ్రతికి రావడం మరింత కక్షని కలిగించింది. ఈసారి ఏమయినా సరే వీడు బ్రతుకకూడదు. అలా ఉపాయం ఆలోచిద్దాం అనుకున్నారు. అవకాశం కోసం ఎదురు చూస్తున్నారు.

ఒకనాడు కచుడు పుష్పాలు తేవడానికి అడవికి వెళ్ళాడు. కాచి ఉన్న రాక్షసులు అతని మీద పడి చంపి-రూపం తెలియకుండా కాల్చేసి బూడిదచేసి, ఆ బూడిదను మద్యంలో కలిపి శుక్రాచార్యుల చేత త్రాగించారు. త్రాగుడు అలవాటుగా ఉన్న శుక్రాచార్యులవారు ఏమీ ఆలోచించక హాయిగా త్రాగేసి మత్తుగా పడుకున్నారు.

మళ్ళీ సాయంత్రం అయింది. కచుడేడీ? చూచీ చూచీ దేవయాని తండ్రి దగ్గరకి పరుగు పరుగున వెళ్ళి "నాన్నా... కచుడు రాలేదు" అంటూ విలపించింది.

చూశాడాయన, 'తల్లీ! ఏడ్పు ఎందుకు చెప్పు. మనవాళ్ళు మళ్ళీ చంపేశారేమో... వాళ్ళకి మృతసంజీవనీ విద్యను గూర్చి తెలియదులే! ఆ... పోతే పోనీ... ఉత్తమగతికి పోతాడు. దీనికి ఏడవడమెందుకు?' అన్నాడు చాలా స్థిమితంగా.

ఆ మాటలకి నిర్ఘాంతపోయింది దేవయాని. "నాన్నా! ఏమిటి మీరనేది? ఎవరిని గురించి అంటున్నావు? నీవు పరమ ధర్మజ్ఞుడవే! ఇలా ఎలా మాట్లాడగలుగుతున్నావు? ఆ కచుడు అంగీరసుడనే మునికి మునిమనుమడు. బృహస్పతి కుమారుడు. ముఖ్యంగా నీ శిష్యుడు. రూపవంతుడు, గుణవంతుడు. అకారణంగా అటువంటివాడు మరణిస్తే ఏడవ కుండా నేనెలా ఉండగలను చెప్పు? మీ శిష్యుడు చంపబడితే మీకే గదా చెడ్డపేరు. నాన్నా... అతడు కనిపిస్తేగాని నేను అన్నం తినను. నీళ్ళు త్రాగను" అంటూ మొండిపట్టు పట్టి కూర్చుంది.

కూతురి దుఃఖం చూడలేక శుక్రుడు దివ్యదృష్టితో చూశాడు. ఎక్కడా కనిపించలేదు కచుడు. చివరికి తెలుసుకున్నాడు బూడిద రూపంలో తన బొజ్జలో ఉన్నాడని. అయ్యయ్యో! నేను మద్యానికి దాసుడనవడం మూలంగా కదా ఏం జరిగిందో తెలుసుకొనలేక పోయాను! ఇవాళ అంతో ఇంతో జ్ఞానం ఉందీ అంటే పుణ్య ఫలంగా లభించినదే కదా! ఎన్ని జన్మలలో సంపాదించిన పుణ్యమో ఈ జ్ఞానాన్నిస్తే, మద్యపానం క్షణ కాలంలో ఆ జ్ఞానాన్ని నాశనం చేసేసిందే – ఔరా... దీని శక్తి ఎంత భయంకరమైనది. ఎంతటి వినాశానికి దారి తీసింది అంటూ సిగ్గుపడిపోయాడు. వెంటనే ఒకశాపం పెట్టాడు. ఏమని? "నేడు మొదలు ఎవరైనా సరే మద్యాన్ని త్రాగితే మహాపాపం పొంది దుర్గతి పాలౌతారు" ఇదే నా శాపం. అందరూ గ్రహించండి... అని.

""మద్యపానం మహాపాతకాలలో ఒకటి. జన్మజన్మల పుణ్యం చేత ఆర్జించిన జ్ఞానాన్ని తృటిలో నశింప చేస్తుంది. మద్యపానం చేసేవారు పతితులై అధోగతి పాలౌతారు."

శుక్రాచార్యులు మృతసంజీవని విద్యద్వారా తన కడుపులో ఉన్న కచుని బ్రతికించాడు. వెంటనే కచుడతనికి నమస్కరించి 'దేవా! నీ దయవలన పోయిన ప్రాణం, బలం వచ్చాయి. మరి నీకడుపులో నుండి బయటికి ఎలా రావడం? దయతో ఉపాయం చెప్పు'మని ప్రార్థించాడు.

విన్నాడు శుక్రుడు. నీవు నా కడుపు భేదించుకొని బయటికి రావాలి. అలా వస్తే నేను మరణిస్తాను. ఫరవాలేదు. దానికొక ఉపాయం చెప్తాను. నేను నీకు మృతసంజీవనీ విద్య నేర్పిస్తాను. నువ్వు నా ఉదరం భేదించుకొని బయటికి వచ్చెయ్. వెంటనే నన్ను ఆ విద్యతో బ్రతికించు అన్నాడు. వీనులవిందుగా విన్నాడు కచుడు. తాను బయలుదేరి వచ్చినదే ఆ దివ్యవిద్య కోసం. ఈనాడు తాను అడగకుండానే గురుదేవులు దానిని అనుగ్రహిస్తున్నారు. రాక్షసులు అపకారం చేద్దామనుకొంటే నాకు అది ఉపకారంగా మారిపోయింది. భగవదనుగ్రహం. ఇలా భావించి శుక్రుని పొట్టను భేదించుకొని బయటికి వచ్చి వెంటనే మృతసంజీవని విద్యద్వారా గురుదేవులను కూడా బ్రతికించాడు. లేచి కూర్చున్నాడు శుక్రుడు. చక్కటి ఉచ్చారణ సామర్థ్యం కలిగిన వానినోటితో పలుకబడిన మంత్రంలాగ ప్రకాశించాడు శుక్రుడు. భగవంతుని దయ కలిగితే ఇతరులు చేసే అపకారాలు మనకి ఉపకారాలుగా పరిణమిస్తాయి.

కొంతకాలం గడిచిన తరువాత ఆచార్యులవద్ద అనుజ్ఞ తీసికొని స్వర్గానికి బయలుదేరాడు కచుడు.

గురుపుత్రికకు కూడా చెప్పి వెళ్ళాలని వచ్చాడు. వెళ్ళి వస్తానన్నాడు. ఆశ్చర్యపోయింది దేవయాని. "ఏమిటీ అప్పుడే వెళ్ళిపోతావా! నాకు ఆ ఊహే రాలేదు! ఎందుకంత తొందర? చూడు. నువ్వా యువకునివి. అవివాహితుడివి. నేనా కన్యను. నీపై మరులుగొన్నాను. నా ప్రేమని గుర్తించు. మృతసంజీవనీ విద్యతోపాటు నన్ను గూడా స్వీకరించు. నీ మాటలలో, పనులలో ఉన్న ప్రేమను నేను గ్రహించాను. మానసికంగా ఇద్దరం పెళ్ళి చేసుకున్నాం. ఇప్పుడు మా నాన్న ఆశీస్సులు పొంది ఇద్దరం ఒక్కటౌదాం" అంది.

కచుడు ఆనందంగా అంగీకరిస్తాడని విశ్వసించింది. కానీ, కథ అడ్డం తిరిగింది. ఆమె మాటలు విని నివ్వెరపోయాడు కచుడు. ఒక్కసారి దుఃఖం ఉవ్వెత్తుగా లేచి మనసుని కలవరపరిచింది. "ఏమంటున్నావు దేవయానీ...! నువ్వెవరివి..? నా ఆచార్యుల పుత్రికవి. అంటే నాకు సోదరితో సమానురాలివి. ఇలాంటి మాట అనడానికి నోరెలా వచ్చిందో చెప్పు'' మందలింపుగా అన్నాడు.

కోపంతో బుస్సుమంది దేవయాని. ''ఏమిటీ నీకు సోదరినా...! భలే...! అందుకేనా అన్ని కబుర్లు చెప్పావు. పూలు పళ్ళు తెచ్చి యిచ్చావు. ఆనందంలో ఓలలాడించావు... అందుకా... ఓc... నాకు అర్థం కాలేదులే! నామాట వినవా...!" శపించబోయింది. నవ్వి తల అడ్డంగా తిప్పాడు కచుడు. "అయితే విను. నీకు మృతసంజీవనీ విద్య పని చేయకుండు గాక!" ఇంత అహంకారమా... ఇచ్చేసింది శాపం.

నిశ్చలంగా చూశాడు కచుడు. "నీ నిజరూపమిలాంటిదా... ఎంత కక్ష నీకు! పోనీలే...! నీ శాపం వలన నాకు ఆ విద్య పనిచేయకపోయినా, నాచేత ఉపదేశం పొందినవారికి పనిచేస్తుంది. పరవాలేదు. మరి నీమాటేమిటి? సోదరునివంటి నన్ను కామించావు. కాదంటే శపించావు. నిన్ను బ్రాహ్మణుడు పెళ్ళాడడు. ఇదే ప్రతిశాపం...." వడి వడిగా అడుగులు వేస్తూ కదలిపోయాడు కచుడు దేవలోకానికి.

ఉలిక్కిపడింది దేవయాని. "ఎంత మాటన్నాడు! అదీ శాపమే! బ్రాహ్మణుడు పెళ్ళాడకపోతే రాజులెవరయినా చేపడతారా? అయ్యో! ఎంత ఘోరం జరిగింది. సరే! ఏం చేస్తాం... భగవన్నిర్ణయం అలా ఉంది" అనుకుంటూ లేచి తండ్రి సేవలో మునిగిపోయింది.

శుక్రుడు సేవించే రాక్షసరాజు పేరు వృషపర్వుడు. ఆయనకి ఒక కూతురుంది. ఆవిడ పేరు శర్మిష్ఠ. ఆవిడా, దేవయాని స్నేహితుల్లాగే ఉంటారు. కలిసి తిరుగుతూ ఆటలాడుతూ, పాటలు పాడుతూంటారు. ఒకరోజు శర్మిష్ఠ వేలమంది కన్యలతో దేవయానితో కలసి ఉద్యానవనానికి బయలుదేరింది. ఆ తోటలో అందమైన కొలనొకటి ఉంది. అక్కడ స్నానానికని బట్టలు తీసికొని బయలుదేరారు. స్నానం చేయాలనే తొందర కలిగింది. ఎలాగూ అందుకే వచ్చారు. వారికి అడ్డేమిటి? వెంటనే తెచ్చుకున్న ఒట్టలు ఒడ్డుమీద పెట్టి జలాల్లోకి దిగారు.

ఇంక ఒకటే ఆటలు, పాటలు హలా హలా అంటూ. స్నానం చేస్తూండగా ఈదురు గాలులు వచ్చి బట్టలన్నీ చెల్లాచెదరై చుట్టుకొని పోయాయి. తొందరలో దేవయాని చీర శర్మిష్ఠ చేతికి వచ్చింది. హడావిడిలో ఆ చీరనే కట్టుకుంది. కాని, శుక్రుని పుత్రిమాత్రం తొందరపడలేదు. శర్మిష్ఠ వస్త్రాన్ని కట్టుకొనడానికి ఇష్టపడలేదు. పైగా, కోపంతో నేనెవరిననుకొంటున్నావు? అసాధారణ గురువైన శుక్రాచార్యుల కూతురిని. నీకు పూజనీయురాలిని. నీవస్త్రం నేనెలా కట్టుకుంటాను. చెప్పు.. ఆc... అంది.

శర్మిష్ఠకి కూడా పట్టుదల పెరిగింది. మీ నాన్న మా నాన్నగారిని ఆశ్రయించి ఉన్నాయన. ఏ గొప్పదనం చూసుకొని మాట్లాడుతున్నావు. ఇలా మాట్లాడడానికి సిగ్గులేదా–అంది. దేవయాని మాటలకి అభిమానం దెబ్బతిన్న శర్మిష్ఠ నా వస్త్రాలు కట్టుకోకూడదే–అంటూ దేవయానిని ప్రక్కనే ఉన్న నూతిలోకి ఒక్కతోపు తోసేసి వెయ్యిమంది స్నేహితురాళ్ళతో కలసి ఇంటికి వెళ్ళిపోయింది.

**పంతాలు పట్టుదలలు ఎంతటి పనినైనా చేయిస్తాయి. సంస్కారాలు ఆక్షణంలో లోపిస్తాయి.**

అంతలో ఒక విశేషం జరిగింది. *(ఇంకా ఉంది)*

# ఆగమ శాస్త్రము



శ్రీమాన్ మధుసూదనాచార్యులు
ప్రధానాచార్య, ఆగమపాఠశాల, జగ్గయ్యపేట

## శ్రీపాంచరాత్రాగమము

*(గత సంచిక తరువాయి...)*

**వాసుదేవ! జగన్నాథ! సంకర్షణ! జగత్ర్పభో! ।**
**ప్రద్యుమ్న! సుభగ శ్రీమన్ ! అనిరుద్ధాపరాజిత ! ॥**
**నారాయణ! దయామూర్తే! సర్వాంతర్యామిణే నమః ॥**

పరవ్యూహాది అయిదు రూపములలో వేంచేసియున్న భగవంతుడైన శ్రీమన్నారాయణునికి నమస్కారము చేసుకుంటూ శ్రీపాంచరాత్రాగమ ప్రభావాన్ని తెలుసుకునే ప్రయత్నం చేస్తున్నాం.

**పితా పుత్రాన్ హి లోకేషు శిక్షతే సాధుకర్మసు ।**
**త్వం ప్రవర్తయసేఽనింద్యే కార్యే సర్వాఃప్రజాః ఇమాః ॥**

తండ్రి తన సంతానాన్ని హితకరములు, శ్రేయోదాయకములు అయిన పనులలో సుశిక్షితులను చేసినట్లు భగవంతుడు తన సంతానమైన ఈ జనులందరిని లోకహితకరమైన, ఆత్మోజ్జీవనకరములు అయిన సత్కర్మలను ఆచరించుటకై ప్రేరేపించును. లోకనింద్యములైన పనులనుండి మరల్చు వాటిని తెలుపుటకు భగవంతుడు చేయు ఉపదేశములే శాస్త్రములు అయ్యాయి. అలాంటి శాస్త్రాలలో శ్రీపాంచరాత్రం అందరికి సులభంగ అర్థం చేసుకోతగినది, ఆచరించ తగినదిన్ను. ఆ శాస్త్రవిధానాల్ని వివరించుకునే ముందు ఆశాస్త్రాన్ని ఎన్ని పేర్లతో ఎలా ఎలా మన ఋషులు సంభావించారో చెప్పుకుంటున్నాము ఇంతవరకు. ఏకాయనము, శ్రీపాంచరాత్రము అనే పేర్ల గురించి కొంత తెలుసుకుందాం.

శ్రీపాంచరాత్రానికి మూలవేదము అనేది ఒక ప్రసిద్ధ నామము. వేదశాస్త్రమునకు మూలభూతమైనది శ్రీపాంచరాత్రము అని కాని, వేదమును మూలముగా కలిగిన శాస్త్రము అని కాని ఈ శబ్దమునకు రెండు రకాలుగా నిర్వచించవచ్చును. శ్రీపాంచరాత్రాగమ సంహితలు చాలా చోట్ల మొదటి నిర్వచనాన్ని సమర్థించాయి.

ఈశ్వర సంహితా 1 అ॥ 24 వ శ్లోకము

**మహతో వేదవృక్షస్య మూలభూతో మహానయం ।**
**స్కంధభూతా ఋగాద్యాస్తే శాఖాభూతాశ్చ యోగినః ॥**

వేదవాఙ్మయము ఒక గొప్పవృక్షము. దీనికి వ్రేళ్ళు శ్రీపాంచరాత్రం ఋక్, యజుస్సు, సామవంటి పేర్లతో ప్రసిద్ధములైన వేదములు ఆ వ్రేళ్ళ బలంతో పుష్టిగా పెరిగే దృఢమైన కాండములవంటిది. ఈ శాస్త్రములను అధ్యయనము చేసి వివిధ రూపాలలో అభ్యసిస్తూ వైదికవర్గమంతా ఈ వృక్షంలోని అందచందాలను విస్తరింపచేసే అందమైన కొమ్మల వంటివారు. కొమ్మల వల్లనే కదా పుష్పాలను, ఫలాలను మనము పొందగలుగుతాం. అలానే వేదవాఙ్మయాన్ని నేర్చి ఆచరించే సాధకులైన ఆరాధకుల ద్వారా సామాన్యులు మంచిగుణములను అలవరచుకుంటారు. అవి పుష్పాల్లాంటివి. సత్కర్మలను ఆచరిస్తూ ఉత్తమఫలాలను పొందుతూంటారు.

ఈ వైదిక వాఙ్మయాన్నంతటికీ పాంచరాత్రాన్ని "మూలము" అని చెప్పడం వల్ల పాంచరాత్రాన్ని అభ్యసించే స్థానములైన దివ్య దేవాలయములే అటు వేదాలకు కాని, ఇటు సదాచారమునకు కాని కేంద్రస్థానములు అని చెప్పినట్లయ్యింది. వేరు బాగుంటేనే కదా చెట్టు జీవం పోసుకునేది. అప్పుడప్పుడు ఏర్పడే భౌతికమైన ఉపద్రవాల ద్వారా వృక్షముల పై భాగము అంటే కొమ్మలు, ఆకులు వంటివి శుష్కించినా, మూలం బాగుంటే సమయం వచ్చినప్పుడు తిరిగి కాండం పెరుగుతుంది. కొమ్మలు నవనవలాడుతూ కొత్త చిగుళ్ళతో వికసిస్తాయి. వేరుకే ఉపద్రవం ఏర్పడితే కొమ్మలు, కాండము బాగున్నా వృక్షత్వాన్నే కోల్పోతాయి.

దీనిని బట్టి చూస్తే వేదపారాయణలు, యజ్ఞయాగాదులు, మంత్ర జపాలు, వైదికులు ఆచరించే ఆచారాలు, అలవాట్లన్నీ ఆలయాలను ఆశ్రయించుకొనే ఉంటాయి.

అందుకే సర్వప్రయత్నేన ఆలయాలను జాగ్రత్తగా చూసుకోవలసిన అవసరం ఉంది. ఆలయ వ్యవస్థే దెబ్బతింటే ఆ సమాజం తాత్కాలికంగా ఆకర్షణంగా ఉన్నా, వేదనింద్యము నాస్తికము అయిన సమాజంగానే మిగులుతుంది. పారమార్థిక చింతనను కోల్పోతుంది. ఉదాహరణకి మనదేశంలో పశ్చిమ సముద్రతీరాన ఉన్న 'గోవా' ప్రాంతాన్నే తీసుకోవచ్చు.

15వ శతాబ్దానికి పూర్వం ఆ ప్రాంతమంతా వేలాది ఆలయాలతో వేదధర్మానికి ఆయువుపట్టై విలసిల్లుతూ ఉండేదట. ఆలయాల వైదిక ధర్మాన్ని నశింపచేయడానికి ఆ ప్రాంతంలో నివసించే వేదధర్మాన్ని అవలంబించే అన్ని వర్గాలవారిపైన అత్యాచారాలు లెక్కకుమించి జరిగాయి. తురుష్కుల పాలనలో జరిగిన ఆ ప్రయత్నాలన్ని వైదికమతాన్ని నిర్మూలించలేక పోయాయి.

16వ శతాబ్దంలో ఆ ప్రాంతాన్ని ఆక్రమించిన ఫ్రెంచ్ వారు పైసూత్రాన్ని గమనించి అక్కడ ఆలయాలన్నింటిని నామరూపాలు లేకుండా తుడిచిపెట్టారు. ఇప్పుడు ఆ ప్రాంతమంతా వైదికమంటే ఏమిటో తెలియని వ్యసనపరులకి కేంద్రంగా, విలాసాలకు నిలయమైన యాత్రాస్థలంగా ప్రసిద్ధి చెందడం అందరకు తెలిసిందే.

దీనిని బట్టి ఆలయవ్యవస్థ చెడితే ఎదురయ్యే అనర్థాలను మనం ఊహించవచ్చు. దీనిని గుర్తింపచేసేదే పైన ఉదహరించిన సంహితావచనము. అదే సందర్భములో–

**జగన్మూలస్య వేదస్య వాసుదేవస్య ముఖ్యతః ।**
**ప్రతిపాదకతాసిద్ధా మూలవేదాఖ్యతా ద్విజాః ॥**

"ప్రపంచమంతా భగవానుని ఆధీనంలో ఉంటుంది. ఆ భగవానుడు వేదవేద్యుడై ఉంటాడు. ఆ వేదాలు వాస్తవ తత్త్వాలను తెలియచేసే సమర్థత కలవే అయిన అందరికోసం ఏర్పడ్డవి కావడంతో భగవదితరమైన అల్పదేవతా ప్రతిపాదకములుగా కూడా కనిపిస్తూ ఉంటాయి. వాటిసారం తెలియాలంటే ఏ భగవద్రామానుజుల వంటివారో అప్పుడప్పుడు అవతరిస్తూ ఉండవలసిందే!

శ్రీ పాంచరాత్రము అలాంటి సంశయాలకు తావివ్వదు. మూలతత్త్వాన్ని పరవాసుదేవుడని స్పష్టంగా ప్రతిపాదిస్తుంది. ఆరాధనా విధానాల్ని సులభతరంగా చేసి అందిస్తుంది. ఆ తత్త్వమే అర్చామూర్తి అయితే అతణ్ణి ఆరాధించి కోరదగిన, పొందదగిన విధానాలు, ఫలాలను కూడా ఆ సందర్భంగా సూటిగా స్పష్టపరుస్తుంది.

అందుకే ఈ శ్రీపాంచరాత్రం వేదాలకు కూడా మూల భూతమైనది" అని ఈశ్వర సంహిత 1వ అధ్యాయం 25వ శ్లోకం॥ ఇదే భావాన్ని పారమేశ్వర సంహిత కూడా ఇలానే ప్రకటించింది. ఈశ్వర సంహిత అదే అధ్యాయంలో మరొకచోట ఈ విషయాన్నే మరింత స్పష్టపరిచింది.

**అనుగ్రహార్థం వర్ణానాం యోగ్యతాపాదనాయ చ ।**
**తథా జనానాం సర్వేషాం అభీష్టఫల సిద్ధయే ॥**

**మూలవేదాను సారేణ ఛందసానుష్టుభేన చ ।**

**సాత్త్వతం పౌష్కరం చైవ జయాఖ్యేవ మాదికమ్ ॥ 50**
**ప్రవర్తయామాస భువి .... ॥ 51**

జయాఖ్యము, సాత్త్వతము, పౌష్కరములు అనేవి ఈ మూడు శ్రీపాంచరాత్రానికి రత్నత్రయంగా ప్రసిద్ధిచెందాయి. ఈ సంహితా గ్రంథాలన్నీ చాలావరకు అనుష్టుప్ ఛందస్‌లోనే ఉంటాయి.

భగవానుడే స్వయంగా తన అంశలైన సంకర్షణాదుల ద్వారా ఈ పాంచరాత్ర దివ్యశాస్త్రాన్ని అన్ని వర్గాలవారికి, అన్ని కులాలవారికి హితకారి అయ్యేట్టుగా ప్రవర్తింపచేసెను. దీన్ని అనుసరించే తర్వాతికాలంలో మనువు మొదలైనటువంటి మహర్షులందరు కూడా ధర్మశాస్త్రరచన చేసి నియమాలను ఏర్పరిచారు. చతుర్విధ పురుషార్థాలలో దేనిని కోరినా ఈ శ్రీపాంచరాత్రానుష్ఠానం ద్వారా సాధించవచ్చు గనుకనే దీనిని మూలవేదమంటారని పై సంహిత తెలిపింది. *(సశేషం)*

# మన దర్శనం 'సు' దర్శనం

పూర్వమీమాంస
వైశేషిక
న్యాయ
యోగం
సాంఖ్య

వైశారదీ

*(గత సంచిక తరువాయి...)*

మనచుట్టూ ఉండే ప్రకృతి, ఈ శరీరంలాంటివి, కంటికి కన్పించే వస్తువులే. కానీ మనస్సు, ఆత్మ, పరమాత్మ లాంటివి గోచరించే వస్తువుల్లాంటివి కావు. ఈ శరీరంలో ఇంద్రియాలు బయటివాటిని చూడటానికి ఏర్పడ్డాయి తప్ప లోపలి వాటిని చూడటానికి కాదు.

**"పరాంచి ఖాని వ్యతృణత్ స్వయం భూః తస్మాత్ పరాఙ్ పశ్యతి నాంతరాత్మన్"** అంటుంది కఠోపనిషత్తు.

ఇంద్రియాల ప్రయోజనం బయటివాటిని తెలుసుకోవడమే! లోపలివాటిని చూడగలిగే శక్తి వాటికి లేదు. వెలుపలి వాటి మాధుర్యం తెలుస్తున్న కొద్దీ ఇవన్నీ ప్రత్యక్షాలు కనుక 'వీటినే మరింత పెంచుకుందాం' అన్పిస్తుంది. శరీరం లోపలివి పరోక్షం కనుక వాటిని గురించి రుచి పుట్టడం కష్టమే! ఈ ఇంద్రియాలు తెరిచియుంచినంత వరకూ ఆంతరికమైన వాటి గురించి అనుభవం ఏర్పడటం కష్టం.

ప్రాపంచిక సుఖానుభవమే ఒక ప్రతిబంధకం కావడం వల్ల మనస్సు, లోపలి వాటిని చూసే శక్తి కోల్పోతుంది. అందుకే 'వస్తు యథార్థ స్థితిని దర్శించాలి' అనే జిజ్ఞాస అత్యధికంగా కలిగిన ఋషులు బాహ్యానుభవాలకు ఆవలగా తమ ఆశ్రమాలను నిర్మించుకున్నారు. మనసులో నిండియున్న అనాది వాసనా భారం తొలగి మనసు పరిశుద్ధం కావాలని కోరుకున్నారు. విశుద్ధమైన మనసుతో మాత్రమే వస్తు యాథార్థ్యాన్ని గుర్తించగలమని వారు గ్రహించారు. ఈ రకమైన కృషిలో ఏదో రకంగా సఫలీకృతులైన వాళ్ళుమాత్రమే దర్శనశాస్త్ర ప్రవర్తకులయ్యారు. దర్శనశాస్త్రమంటే?

**"ఇదం ఇత్థం..."** ఇది ఈ పదార్థం. ఈ స్వభావంతో కూడుకొని ఉంటుంది అంటూ తత్త్వాలను, వాటివాటి వాస్తవిక స్వరూప, స్వభావాలను నిర్ణయించేదే శాస్త్రం. కన్పించేదాన్ని, అసలు స్వభావంతో నిర్ణయిం చేయడం ఒక ఎత్తైతే, ప్రత్యక్షమైన వాటిని కంటితో చూస్తే ఎంత స్పష్టంగా చెప్తామో–పరోక్షంలో ఉండే వాటిని కూడా అంత స్పష్టంగ తెలుసుకోగలిగే జ్ఞానాన్ని **దర్శనం** అంటాం.

ఆ జ్ఞానం పొందినవాళ్ళు ప్రవర్తింపచేసిన సిద్ధాంతాన్ని **దర్శనాలు** అంటాం. ఆ జ్ఞానాన్ని అందించిన వాళ్ళని **దార్శనీకులు** అంటాం. జిజ్ఞాసువులకి తాత్త్వికజ్ఞానం కలిగించటానికి ద్రష్టలు చేసిన ప్రయత్నాలే దర్శనాలయ్యాయి.

ద్రష్టలువేరైనా, వారు వారు అవలంబించిన సాధనాలూ వేరువేరు అయినా, వాస్తవిక తత్త్వాలైతే ఎప్పుడూ మారవు కదా! ఒక్కొక్కరు ఒక్కో దృక్కోణం నుంచి దాన్ని ఆకళింపు చేసుకున్నారు.

తమకి తెలిసిందంతా తెలిసినట్టుగా చెప్పేయలేదు. తమని ప్రశ్నించిన జిజ్ఞాసువుల బుద్ధి నైశిత్యాన్ని బట్టి, వాళ్ళు వాళ్ళు కోరుకున్నంతవరకూ 'అందులోనూ చెప్పదగును' అనిపించి అంతవరకు మాత్రమే చెప్పారు. అందుకే ఋషులందరి దర్శనాలు ఒకేరకంగా ఉండవు. విభిన్న రకాలుగా ఒకే తత్త్వం ఎందుకు గోచరించాలి? అనే ప్రశ్న సామాన్యులకు కలుగుతూంటుంది.

సముద్రం దగ్గరికి జాలరి చేరితే సముద్రంలో మార్పు లేకపోయినా చేపల ఉనికిని మాత్రం గుర్తించ గలుగుతాడందులో. ఇంకా ఎన్నో సంపదలున్నా వాటి విషయం అతనికి అక్కరలేదు. పట్టించుకోడు. అదే ముత్యాల వ్యాపారి అన్నింటినీ వదిలి తనక్కావలసిన వాటిమీదే దృష్టి పెడతాడు. మరొకడు ఇవేం కోరకుండా కేవలం సౌందర్యాస్వాదన కోసం వెళ్ళొచ్చు. వాడన్నింటినీ చూస్తాడు. కానీ దేన్నీ కోరడు. సామూహిక సౌందర్యాన్ని మాత్రమే అనుభవించి ఆనందిస్తాడు. వాళ్ళవాళ్ళకి కావాల్సినవి తీసుకున్నంత మాత్రం చేత, వాళ్ళ దృష్టి అసమగ్రమనో, సముద్రంలో లోపమనో అనడం తెలివి తక్కువతనం.

అలాగే ఒక రమ్యమైన ఆరామాన్ని తీసుకుందాం! మకరందం నిండిన కుసుమాలపై భ్రమరం చేరుతుంది. తనకి కావల్సినది తేనె. గ్రోలినంత వరకు గ్రోలుతుంది. తన దారిన తాను పోతుంది. పుష్పసౌందర్యంతో, పళ్ళతో, ఆకులతో దానికేం సంబంధం ఉండదు. అంతమాత్రంచేత పుష్పానికి లోపం లేదు... భృంగరాజానికీ బెంగలేదు. దార్శనికుల విషయంలో కూడా అంతే! వాళ్ళవాళ్ళ అవసరాలకీ తగినట్లుగా తత్త్వదర్శనం చేసి మన తరాలకు అందించారు. ఎవరి దర్శనాన్నీ వేలెత్తి చూపించనక్కర్లేదు.

ఒక్కొక్క దర్శనానికి, అన్ని దర్శనాలతోటి సంబంధం ఉంది. అందులో మనకెంత అవసరమో, అంతవరకు తీసుకొని మన మనసులను సంస్కరించుకోవడం అవసరం. మన సంపదలు సంరక్షించుకోవడం అవసరం. ఏది ఏమైనా వాళ్ళ వాళ్ళ దర్శనాలలో ఒక సమగ్రతని సమకూర్చగలిగారు అంటే మానసికంగా ఎంతో పరిశ్రమ చేశారన్నమాట!

మనిషికి జ్ఞానం కలగాలంటే మనసుయొక్క సహకారం అవసరం. ఆ మనసు అంతరింద్రియం. కన్ను, ముక్కు, చెవి లాంటివి బాహ్యేంద్రియాలు. ఇవి బయటి విషయాలను గ్రహించినట్లే, అంతరింద్రియమైన మనసు కూడా ఆంతరికమైన వస్తువులను చూసేట్టుగా ఉండాలి.

మనసు రెండిళ్ళ పూజారి. బాహ్య, అంతర్విషయాలను రెంటినీ చూపెట్టగలదు, శాసించ గలదు. మంచివాడిని కూడా తప్పుదారి పట్టించి చెడ్డవాళ్ళలాగా ప్రాపంచిక రుచులు మరిగిన బాహ్య ఇంద్రియాలు మనసుని బయటికి లాగి, తమవెంట తిరిగేట్టు చేసుకుంటాయి. ఇంద్రియానుభవాలతో ముంచెత్తి లోపల ఉండే మంచిని చూడనే చూడనివ్వవు.

బయటి విషయాలన్నీ క్షణక్షణం మారేవని మనకూ తెలుసును. వాటిలో ఉండే రంగూ, రుచీ, వాసనలాంటి గుణాలన్నీ కూడా ఇప్పుడు చూసినట్లు మరికాసేపటికి ఉండటం లేదు. వాటిని అనుభవిస్తే కలిగే ఆనందం మాత్రం శాశ్వతం ఎలా అవుతుంది? ఈ విషయం ఇంద్రియానికి తెలీదు.

నిజానికి అద్భుతానందాన్ని ఇవ్వగలిగిన మంచి అంతా మనలోనే ఉంది. దాన్ని గుర్తించ గలిగింది. మనసొక్కటే. అదీ లోపలే ఉంది.

మనసు బాహ్యేంద్రియాలని నియమించాలి. అవి అందించే విషయాలలో తనకి పనికొచ్చేవి తీసుకొని మిగతా వాటిని వదలగలగాలి. తనవెంట బయటి ఇంద్రియాలు నడవాలి తప్ప తను వాటి వెంట నడవకూడదు. ఇలా మనసును స్వాధీనం చేసుకునే ప్రయత్నమే **చిత్తవృత్తి నిరోధం** అంటారు యోగశాస్త్రకారులు. ఈ చిత్తవృత్తిని నిరోధిస్తే బయట కనిపించే విషయ సౌందర్యాలకంటే అందమైన... ఇంతకంటే నిత్యమైన... ఇంతకంటే జ్ఞానవంతమైన... ఇంతకంటే పరమోన్నతమైన విషయాలను దర్శించగలం. కుళ్ళిన చెత్త దుర్వాసన చిమ్ము తున్నట్లే కోరికలు మరిగి మనిషి ప్రవృత్తి వికృత రూపాలు దాలుస్తోంది. దాంతో శాంతే కరువైంది.

అయితే, మనిషికి తానలా సతమతమౌతున్నానని చెప్పుకోవడం ఇష్టం లేదు. సుఖశాంతులతో హాయిగా బ్రతుకు తున్నట్టే నటిస్తాడు. ఇదెలా ఉంటుందంటే మురికిగుంటకి మూతవేసి పన్నీరు, అత్తర్లు పైనపోసి దుర్వాసన లేకుండా పరిమళింప చేద్దామనుకున్నట్లుంటుంది! చెత్తను అలాగే ఉంచి తెలీకుండా దాచాలనుకోవడం తప్పు. కుండీలో మురుగు తీసేస్తే సెంట్ పూయకపోయినా మరేం ఫర్వాలేదు. మనిషికూడా నటనమాని, చెత్తతో నిండి ఉండే మనసుని వాసనాదూరీకరణ ద్వారా నిర్మలం చేసుకోవాలి. దానిద్వారా మాత్రమే మనస్సు విశుద్ధమౌతుంది.

ఇంద్రియ అనుభవాలనుంచి దూరమైతేనే మనస్సు శుద్ధమౌతుందనుకుంటారు కొందరు. కానీ అది తప్పు. ఈ ప్రకృతిలో ఏ మూలకి వెళ్ళినా ఇంద్రియాలకి విషయానుభవం తప్పదు. ప్రకృతి నుంచి ఇంద్రియాలను దూరం చేయడం ఎవరికీ సాధ్యంకాదు. సాధించవలసిందల్లా మనస్సు వాటిలో మునిగి పోకుండా ఉండేట్టు చూసుకోవడమే!

ఇంద్రియార్థాలన్నీ నీళ్ళలాంటివైతే, మనస్సొక పడవ లాంటిది. పడవ నీటిలోనే పయనించాలి. నీళ్ళు లోపల నిండాయంటే ప్రమాదం. అంటే వాటియందు ఆసక్తి తగ్గించు కుంటూ శరీర కనీసపోషణకి అవసరమైనంతవరకు ఇంద్రియా లను అనుభవించనివ్వాలి. అవి ఏమీ తెలీని చిన్నపిల్లల్లాంటివి కనుక 'ఇంకా ఇంకా కావాలని' కోరినా, అవసరం కానప్పుడు వాటికి, అవసరమైన ఇంద్రియసుఖాలు అందకుండా ఉండేట్టు చూడాలి. ఇలా కొంతకాలం చేస్తే తప్ప మనస్సనే పడవ విశుద్ధమనే తీరాన్ని చేరలేదు. సంసారంలో నువ్వుండుకాని, నీలో సంసారాన్ని నిండనివ్వకు. అప్పుడే.. ఆ పరిశుద్ధమైన మనస్సుకే తత్త్వాలన్నీ కూడా యథాతథంగా గోచరిస్తాయి. అలాకృషిచేసి దర్శించిన వారే **తత్త్వద్రష్టలవుతారు.** (ఇంకా ఉంది.)

**జై శ్రీమన్నారాయణ!**

**హిమగిరి శిఖరాలలో బదరికావనంలోని అష్టాక్షరీ క్షేత్రంలో పూజలను అందుకోవాలని బదరికాశ్రమం చేరిన**
**శ్రీ, భూ, నీళా, గోదా సమేతుడైన శ్రీ కళ్యాణ వేంకటేశ్వరస్వామి తిరిగి ఈ నెల 22వ తేదీన ఋషీకేశ్‌లోని "శ్రీ జీయరు మఠానికి చేరాడు."**
**మన అష్టాక్షరీక్షేత్రం అక్టోబరు 22వ తేదీ వరకు భక్తులకు ఆతిథ్యాన్ని ఇవ్వడానికి తెరిచే ఉంటుంది.**



# సీతాఫలం రామార్పణమ్



**శ్రీమతి చెవుటూరి కుసుమకుమారి - హైదరాబాద్**

*గత సంచిక తరువాయి..*

అమిత సంతోషముతో ఆ బాలికను తన ధర్మపత్ని సుమేథాదేవీ చేతికిచ్చినాడు. ఆమె కూడా మిక్కిలిగా సంతసించి శుభప్రద అయిన ఆ బాలికను ఒకసువర్ణ ఆసనమున కూర్చుండబెట్టి, సుగంధ జలాలతో జలకమాడించి దివ్యపరిమళలేపనాలతో, రత్నభూషణాలతో, అలంకరించినది. పుష్పమాలాలంకృతము, శోభాయమానము అయిన తూగుటుయ్యాలయందు ఆసీనను చేసి స్త్రీలందరిచేతా జోలపాటలు పాడించి, తానుకూడా చిన్నారిసీతమ్మకు స్వయంగా జోలపాట పాడినది.

**"లాలిజో లాలిజో త్రిలోక వంధ్యకా శ్రితపారిజాతకు**
**సౌందర్య లహరికీ చిన్నారి తల్లికి లాలిజో... లాలిజో...**

**నీలోత్పలాలు మా తల్లి జానకి కనులు**
**నా తల్లి చరణాలు లేతమావిచిగుళ్ళు**
**మాముచ్చటలు తీర్చ మా ఇంట వెలసిన**
**మాసుకుమారి సీతకు లాలిజో"**

క్రమక్రమంగా సీత సఖురాండ్రతో అంతఃపురమంతా తిరిగి ఆటలాడుకునే వయసుకు పెరిగింది. ఒకనాడు సీత చెలియలతో బంతి ఆట ఆడుచుండగా ఆబంతి శివధనువుక్రిందకు వెళ్ళి నిలచినది.

దేవదానవ యుద్ధ సమయమున జనకవంశీయులవద్ద శివుని చేత ఉంచబడిన ధనువు అది. అంతటి మహాధనువును చెలికత్తెలు, భటులు కూడ కదిలించలేక మిన్నకున్నారు. అప్పుడు...

**మందహాసం ప్రకుర్వాణా సీతా పీతాంగనచ్ఛవిః ।**
**తద్ధను శ్చాలయిత్వా చ వామహస్తాగ్రత స్తతః ।**
**తత్కందుకం సమాదాయ వయస్యేభ్యో దదౌ ముదా ।**

మేలిమి బంగారు వన్నెల చిన్నారి సీతమ్మ చిరునవ్వు నవ్వి ఆ శివధనువును అవలీలగా ప్రక్కకు నెట్టి, బంతిని తెచ్చి సఖులకిచ్చినది. చెలికత్తెలు పరుగెత్తుకు వెళ్ళి ఆ సంగతిని తల్లి సుమేథాదేవికి చెప్పారు. కానీ, వారి మాటలను ఆమె నమ్మలేదు.

సీత బొమ్మల పెళ్ళిళ్లు చేయటం, వ్రతాలు, నోములు చేయటం వంటి ఆటలు చూచిన తల్లికి సీతచేత నిజముగానే కన్నె తులసి నోము చేయించవలెనని మనసైనది.

ఒక శుభతిథిన పుణ్యస్త్రీలందరినీ పిలచి, బంగరు బొమ్మ చిన్నారి సీతకు మంగళస్నానము చేయించి ఒక స్వర్ణపీఠమున ఆశీననుచేసి, కనుల కాటుకతీర్చి, కస్తూరితిలకము నుదుట తీర్చి దిద్ది, సమస్త రత్నాభరణ భూషితను చేసి మంగళహారతులు ఇచ్చారు.

తులసీ బృందావనమును రంగురంగుల రంగవల్లులతో, తోరణాలతో అలంకరించారు. వాద్య ఘోషలతో సీతమ్మను తులసీ బృందావనానికి తీసుకువెళ్ళారు.

**అరుంధత్యాది దేవ్యోఽపి సమాహూతా స్సమాగతాః**
**దృష్ట్వా వ్రతోద్యతాం సీతాం వీక్ష్యతాం విస్మయం యముః**

అక్కడికి అరుంధతి మొదలైన పుణ్యస్త్రీలు కూడా వచ్చి వ్రతదీక్షలో వున్న సీతను చూచి విస్మయం చెందారు. (అనగా ముల్లోకాలచేతా వ్రతదీక్షలో నియమ వ్రతాలతో కొలువబడే తల్లి చిన్నారిసీతగా వ్రతదీక్ష పూనుటా! అని)

అప్పుడు సుమేథాదేవి 'పుత్రీ! సీతా! వ్రతారంభమునకు ముందే నీవు అరుంధతీదేవికి నమస్కరించి, ఆమె ముఖమున కుంకుమ పెట్టి ఆమె ఆశీస్సులు పొందు'మని అటు తరువాత పుణ్యాంగనలందరికీ కూడా అట్లే చేయుమని చెప్పినది.

**ఇతిమాత్ర బోధితయా సీతయా వీతభీకయా ।**
**మధ్యమాంగుళ్యంచలేన త్వరుంధత్యా ముఖో దృఢమ్ ॥**

తల్లి మాటలననుసరించి సీత నిర్భయంగా అరుంధతీదేవి నుదుట బొట్టుపెట్టి, నడిమివేలి చివరతో ఆమె నుదుటిని గట్టిగానొక్కగా గోరుతగిలి అధికముగా రక్తము కారినది. అప్పుడు..

**శివేతి వీప్సయా తూక్త్వా సాంగకంపమరుంధతీ ।**
**భూమౌ పహత సీతాఽపి భీతా వేపథుమాపసా ॥**

అరుంధతి శివ! శివా! అని శరీరముతూలి నేలమీద పడి పోయినది. అది చూచి సీత భయముతో వణికిపోయినది.

సుమేథాదేవి క్షణకాలము నివ్వెరపోయి తేరుకొని తన చీరచెరగుతో అరుంధతీదేవి ముఖమున స్రవించు రక్తమును తుడిచి ఆమెను లేవతీసి సేదతీర్చినది.

సీతమీద అమితముగా కోపించిన అరుంధతీదేవి దుష్టబాలికా! యింతకు పూర్వము లక్ష్మి, సరస్వతి, గౌరి, శచి ఎంతోమంది బాల్యము గడిపిన వారున్నారు. కానీ, ఎవరూ ఎన్నడూ మాకు ఇటువంటి అకృత్యము చేసివుండలేదు.

**ధిగస్తు బాలే భవతీం త్వద్దుష్కృత వశాత్పునః ।**
**పూర్వజ్ఞాన విహీన స్సాత్త్వత్పతి శ్చిత్స్వరూప్యసి ।**
**ఇతి శాపం దదౌ క్రోధాదరుంధత్య విచారిణీ ॥**

"బాలికా! సీతా నీవు చేసిన ఈ దుష్కార్యమునకు నీభర్త జ్ఞానస్వరూపుడై కూడా పూర్వజ్ఞానము లేనివాడై దుఃఖపడును గాక! నీవు లోకనిందచేత చింతించెదవుగాక!" అని విచక్షణా రహితముగా శపించింది.

*(ఇంకా ఉంది.)*

# ముముక్షు రహస్యం

శ్రీమతి చక్రవర్తుల చూడామణి -ఖమ్మం

*(గతసంచికతరువాయి...)*

సుమతి, ఆమె భర్త వాళ్ళరాజ్యానికితిరిగి వెళ్ళడానికి నిశ్చయించుకొని తగిన సన్నాహాలు చేసుకున్నారు. వెళ్ళేముందు ఆచార్యులను సేవించి మరొకసారి ద్వయమంత్రం ఉపదేశం పొందింది. 'తమ గృహంలో తిరువారాధనకొరకు శ్రీమద్రామానుజుల పాదుకలు అనుగ్రహించమని ప్రార్థించింది. అప్పుడు ఆచార్యులు 'కొంగుపిరాట్టి' అనే దాసనామంతోపాటు తమ పాదుకలను కూడా ఇచ్చారు'.

'కొంగుపిరాట్టి' అంటే ఏమిటి?'

కొంగు- దేశం పేరు. పిరాట్టి అంటే అమ్మ. ఈవిడ కొంగు దేశపు స్త్రీ కదా! స్త్రీలను తల్లిగానే చూస్తారు కదా ఎవరైనా! అందుకే, కొంగుపిరాట్టి అన్నపేరు ఇచ్చారు. సరే ఈవిడ వాళ్ళ దేశం వెళ్ళిపోయింది.

కథ అయిపోయిందా! లేదు మొదలయింది.

ఆ తరువాత కొంతకాలానికి చోళదేశపురాజైన క్రిమికంఠ చోళుని మతితప్పిన చేష్టలవలన శ్రీమద్రామానుజులు మేల్‌కోటలో వేంచేసి యున్నారు. అక్కడ ఉన్నరోజులలో ఈ కొంగుపిరాట్టిగారి ఊరికి కూడా వెళ్ళటం జరిగింది. అప్పుడు ఆవిడ ఉడయవర్లుకు, వారితో ఉన్న మొదలి యాండాన్‌కు సత్కారం చేయాలనుకుంది.

అది చాలా గడ్డుకాలం శ్రీవైష్ణవ సాంప్రదాయానికి, శ్రీవైష్ణవులకు. అందువలన మొదలియాండాన్ 'ఎవరు పిలిస్తే వాళ్ళింటికి మేము రాము' అన్నారు.

కొంగుపిరాట్టి 'మాకూ ఉడయవర్ల శ్రీపాదసంబంధం ఉంది. మేము వారి శిష్యకోటిలోని వాళ్ళమే. వారి శ్రీచరణాల వలనే మేం ఈరోజు ఈస్థితిలో ఉన్నాం' అని చెప్పి వారి పాదుకలు చూపించి తమ భక్తిని చాటుకున్నారు. పాదుకలు చూసి సంతోషించిన మొదలియాండాన్ విషయమంతా ఆచార్యులకు విన్నవించి వారిని కొంగుపిరాట్టి ఇంటికి తీసుకు వెళ్ళారు. అదీ కథ.

ఆ పిరాట్టిలా అడిగి పాదుకలు పొందానా? అంటూ వాపోయింది తిరుక్కోళూర్ అమ్మాళ్.

"ఏమిటండీ! ఆయన వశిష్ఠులవారిలా "పంపండి పరవాలే!" దంటాడు. పిల్లవాడ్ని అంతదూరం పంపి ఉండటం ఎంత కష్టమో ఆయనకేం తెలుసు..."

నేనేం దశరథ మహారాజును కాను. మనకేం తవ్విపోసిన పాతరలు లేవు. నేర్చుకునే వయసులో నాలుగక్షరాలు నేర్చుకోకపోతే ఎలా?

"అక్కా! అమ్మా నాన్నా ఏమిటో వశిష్ఠుడు, దశరథుడంటూ కోపంగా మాట్లాడుతున్నారు. నాకేంటో గందరగోళంగా ఉంది...."

"నీ గందరగోళం నాకు తెలుసు. అమ్మానాన్నా మాట్లాడే విషయం నీకూ తెలుసు. మన వేంకటకృష్ణను హాస్టలుకు పంపడం గురించి... ఇప్పుడు చెప్పు నీసందేహం ఏమిటో?"

"సరే! దానికి వశిష్ఠులవారికీ సంబంధం ఏమిటి?"

"నీకు తెలుసుగా మనింట్లో పెద్దవాళ్ళందరికీ సంప్రదాయ విద్యలో ప్రవేశం ఉందని, మామూలు విషయాలకు కూడా అందులోంచే ఉదాహరణలు తీసుకుంటారు. ఒరేయ్! నీకో విషయం తెలుసా.... రహస్యం ... మనబామ్మవాళ్ళ అత్తగారు మహాగయ్యాళట. బామ్మని, తాతయ్యని మాట్లడుకోనిచ్చేది కాదట. ఇద్దరికీ ద్రావిడవేదం నాలుకమీదే కదా! ఆ పాశురాలతోనే పరస్పరం మాట్లాడుకునేవారట."

"అదెట్లా...?"

"ఒక విషయం చెప్పాలనుకో ఆ భావం ఉన్నపాశురం పాడేదట బామ్మ. దానికి జవాబు ఉండే పాశురం తాతయ్య పాడేవారట. ముసలమ్మ, విషయం అర్థమయినా ప్రబంధం పాడుకోవద్దని చెప్పడం తప్పని, మాట్లాడకుండా ఉండేదట".

"ఇంతకీ ఇప్పటి విషయం చెప్పు".

విశ్వామిత్రముని యజ్ఞ సంరక్షణకోసం దశరథమహారాజు దగ్గరికి వచ్చి శ్రీరాముడిని పంపమని అడిగారు కదా! దశరథుడేమో నాకొడుకు పసివాడు పంపలేను అన్నాడు. అప్పుడు వసిష్ఠుడు ఫరవాలేదు, పంపండి" అన్నారు. తిరుక్కోళూరమ్మ 'అనుప్పివైయుం ఎన్రెనో వశిష్ఠరైప్పోల' అన్నదికదా! ఆమాటే అమ్మ నాన్నతో అంటోంది తెలిసిందా"!

"ఇలా కట్టె, కొట్టె, తెచ్చె కాకపోతే కాస్త వివరంగా చెప్పరాదూ..."

"అహం వేద్మి ఎన్రెనో విశ్వామిత్రనైప్పోల" అంటే నాకు తెలుసు అన్నానా విశ్వామిత్రునిలాగా" అని అర్థం.

"ఏమిటి నాకు తెలుసు?"

"విశ్వామిత్రుడు ఎంతో తపస్సంపన్నుడు. సృష్టికి ప్రతిసృష్టి చేయగల జ్ఞానవంతుడు, ఎవరితోనైనా తలపడి గెలవగల ధీమంతుడు, ధైర్యశాలి. లెక్కలేనన్ని అస్త్రశస్త్ర ప్రయోగాలు తెలిసినవాడు. ముల్లోకాలలో ఆయనకు తెలియని అస్త్రం లేనేలేదు. ధర్మస్వరూపుడు. కుశికుని వంశంలో పుట్టినవాడు. రాజ్యాలేలిన క్షత్రియుడు. ఎంతోకాలం తపస్సు చేసి రాజఋషి అయ్యాడు. త్రిశంకువుకోసం "స్వర్గాన్ని" సృష్టించిన ధీమంతుడు. బ్రహ్మజ్ఞానంపొంది బ్రహ్మఋషి అయ్యాడు. అలాంటివాడు 16సం॥ బాలుడిని తనయజ్ఞం కాపాడమని అడగడానికి వస్తాడా?"

"రాడు"

"మరి, వచ్చాడు కదా! దశరథుడిని యజ్ఞసంరక్షణ కోసం పదిరోజులు శ్రీరాముడిని పంపమని అడిగాడు. దానికి దశరథుడు నా కొడుకు చిన్నవాడు ఇంకా అస్త్రశస్త్ర విద్యలలో ఆరితేరలేదు. ధనుర్బాణాలు సరిగా పట్టుకోలేడు. మీ యజ్ఞానికి ఆపద ఎవరు కలిగిస్తున్నారో చెప్పండి. నేను నా సైన్యం మొత్తాన్ని తీసుకువచ్చి యాగసంరక్షణ చేస్తాను!" అన్నాడు.

"మారీచ సుబాహులు కదా విశ్వామిత్రుడి యజ్ఞాన్ని పాడుచేసింది."

"వాళ్ళే! కాని వాళ్ళని ఇలా చేయమని పంపిందెవరు? రావణుడు. పౌలస్త్య వంశస్తుడు, విశ్రవసుడి కొడుకు, కుబేరుడి సోదరుడు, బ్రహ్మదగ్గర వరాలు పొందినవాడు. మనుషులు తనను ఎలాగూ చంపలేరన్న ధీమాతో నరులు తప్ప మిగిలిన ఎవ్వరి చేత చావకుండా బ్రహ్మదగ్గర వరం పొందాడు. మహా బలవంతుడు, పరాక్రముడు, మాయాయుద్ధం చేయ గలవాడు. ఈ మాట వినగానే దశరథుడు గడగడలాడి పోయాడు. అలాటి వాడితో తలపడడం నాకు సాధ్యం కాదు. రాముడివల్ల అసలే కాదు. నాకు అరవైవేల సం॥ల వయస్సు వచ్చాక ఎంతో కష్టానికోర్చి అశ్వమేధయాగం, పుత్రకామేష్టి చేశాక పుట్టినవాడు. నాకెంతో ప్రీతిపాత్రుడు. రాజీవనేత్రాల వాడు, చక్కనివాడు, ధర్మస్వరూపుడు అయిన నా పసివాడిని నేనెలా పంపగలను. ఆ రాక్షసులు యుద్ధంలో ఆరితేరినవాళ్ళు. మాయాయుద్ధం చేసేవాళ్ళు. వాళ్ళను సంహరించటం చాలా కష్టమైన పని" అని అనేకవిధాల విశ్వామిత్రుణ్ణి బతిమాలు తున్నాడు.

దశరథుని మాటలు విన్న విశ్వామిత్రుడు...

**అహం వేద్మి మహాత్మానం రామంసత్య పరాక్రమమ్।**
**వసిష్ఠోఽపి మహాతేజా యే చేయే తపసి స్థితాః ॥**

అన్నాడు. రాముడి పరాక్రమం గురించి నాకు తెలుసు. అంటే రాముడు అవతార పురుషుడు. పరాక్రమవంతుడు, శీలవంతుడు, సత్యవంతుడు. అన్నిటినీ మించి కారణజన్ముడు. రాక్షస సంహారం, రావణసంహారం కోసం అవతరించినవాడు.

అసలు విషయం ఆ రాముడికి విశ్వామిత్రుడు తనకు తెలిసిన విద్యలన్నీ నేర్పాలి. అలా నేర్చుకున్నది రాముడు ప్రయోగించి చూపాలి. అందుకోసమే యాగసంరక్షణ నెపంతో రాముడిని తీసుకు వెళ్ళాలని విశ్వామిత్రుడు వచ్చాడు. అది కులగురువైన వసిష్ఠులకూ తెలుసు. వామదేవులకూ తెలుసు అని విశ్వామిత్రుడు చెప్పాడు.

అయినా, దశరథుడు పుత్రవాత్సల్యంతో రాముడిని పంపడానికి వెనుకాడాడు. విశ్వామిత్రుడు కోపంతో లేచి "నీ దగ్గరికి వచ్చి ఉత్తచేతులతోనే పోతున్నాను. నీమాటే నెగ్గించుకో! నీ ఇష్టం చెల్లించుకో!' అని వెళ్ళబోతుంటే వశిష్ఠులవారడ్డుపడి దశరథుడికి నచ్చచెప్పారు. రాముని పరాక్రమం గురించ చెప్పి ఇప్పుడు విశ్వామిత్రుడితో వెళ్ళటం రాముడికి తప్పక లబ్ధి కలిగిస్తుంది. ఆయన రక్షణలో ఉన్నంత వరకు నీ కొడుకుకు ఎలాంటి హానీ జరుగదు. సందేహించక పంపమన్నారు. ఇంకొకమాట. విశ్వామిత్రుడు స్వయంగా ఆ రాక్షసులను చంప గలడు. నీకుమారుడికి మేలు చేయాలనే పంపమని అడుగు తున్నాడు. మనసులో అనవసర అనుమానాలు పెట్టుకోక పంప మన్నారు. తరువాత పంపడం... అవన్నీ నీకు తెలుసుగా....!"

"ఇంతకూ తిరుకోళూరమ్మాళ్ వార్త చెప్పలేదే!"

"ముందే చెప్పా కదా! రెండు వార్తలు ఈ ఒక్క సంఘటన లోనే ఇమిడి ఉన్నాయి.

**'1 అహం వేద్మి యెన్రేనో విశ్వామిత్రనైప్పోల'**

నాకు తెలుసు అన్నానా విశ్వామిత్రుడిలాగా

**2. అనుప్పివైయుం ఎన్రేనో వశిష్ఠరైప్పోల**

"పంపించండన్నానా వశిష్ఠులలాగా"

ఇహ ఇవాల్టికొదిలి పెట్టు. (సశేషం)

# మన ఆళ్వార్లు



(గత సంచిక తరువాయి) **పెరియాళ్వార్లు** వైశారదీ

### శ్రీ విష్ణుచిత్తుల కైంకర్యనిరతి :

తిరిగి శ్రీ విల్లిపుత్తూరు చేరారు పెరియాళ్వార్లు. తమతో పాటు అపార ధనరాశులు గూడావచ్చాయి. కానీ, వాటన్నింటినీ తామేంచేస్కొంటారు? తమకేమీ అవసరం లేదాయె! భగవత్సేవ కోసం కావలసినవన్నీ ఆలయంలోనే లభిస్తున్నాయి. ఇక దానిని ఆ వటపత్రశాయిసేవకే వినియోగించాలని, పెద్దస్వామికి తగినంత పెద్దగోపురం, నిర్మించారు.

అందుకే ఆ తర్వాతివారు 'మిన్నార్ తడమదిళ్ శూళ్ విల్లిపుత్తూర్ ఎన్నోరుకాల్ శొన్నార్ కళ్ఱర్కమలశూడినోం' అని కీర్తించారు – అంటే పెరియాళ్వార్ నిర్మించిన ప్రకాశించు పెద్ద విశాల ప్రాకారం గల విల్లిపుత్తూర్ అని ఒకసారి స్మరించిన వారి పాదపద్మాలను మేము శిరసాధరిస్తాం" అని అర్థం.

అప్పట్లో అదే పెద్ద ప్రాకారం. అదే పెద్ద గోపురమూనన్న మాట. తమిళనాడు ప్రభుత్వం ఆగోపురాన్నే ఇపుడు తమ రాజ చిహ్నంగా ధరిస్తోందంటే ఆ గోపురపు గొప్పదనాన్ని గుర్తించవచ్చు.

తరువాత దాన్ననుసరించి అంతకంటే పెద్దగోపురాలని నిర్మిద్దామని ఎందరో ప్రయత్నించి నిర్మించినవారూ ఉన్నారు. కానీ ఆనాటి ఆ గోపురపు అందమూ, హుందాతనమూ మరి దేనికీ లేనేలేదు. రానేరాదు.

### భగవంతుని కానుక గోదాదేవి:

పెరియాళ్వార్లు భగవద్గుణగానంతో తులసిమాలికలు అల్లుతూ ఆలయసేవానిరతులుగ 'భట్టనాథులు" అయ్యారు.

అలా కొంతకాలం గడుస్తూండగ సూర్యుడు కర్కాటక రాశిలో ఉండగా పూర్వఫల్గునీ నక్షత్ర శుభదినాన తులసివనంలో గొప్పులు తీస్తూండగా, ఆ తులసియే రూపుదాల్చి ఆవిర్భవించి సదా అన్నట్లు చిరునవ్వు లొలికించు చిన్నారి శిశువొకామె వీరికి దర్శనమిచ్చింది. 'కలయో, నిజమో తెలియలేదు. తమకన్నులను తామే నమ్మలేని ఆనందం. తను చేస్తూన్న సేవలకు సంప్రీతుడైన శ్రియఃపతి ప్రసాదించిన అపురూపమైన వరముల ఫలమిది అన్నట్టు, సంతాన రహితులైన విష్ణుచిత్తులా పాపను తీసుకున్నారు. తులసిమాలికల కోసం శ్రమించే తనకు లభించిన ఈమెగూడ ఓ మాలికనే అనుకుంటూ ఆమెను "కోతై" అంటే 'మాలిక' అని పిలిచారు. ఆ పేరే క్రమంగా "గోదా"గా మారింది.

### గోదా గొప్పదనం, తండ్రి శిక్షణ ప్రభావం :

తులసికి పుట్టినప్పటినుండి పరిమళం, మొక్కల్లో ప్రతీ భాగం పరిమళించినట్లు, గోదాగూడ బాల్యం నుండి తండ్రి గారితో భగవత్సేవ చేసుకోవడంలో అభిరుచి పెంచుకొంది. విష్ణుచిత్తులుగారు ఈమెకు చిన్నప్పటినుండి శ్రీకృష్ణలీలామృత రసాన్నే ఉగ్గుపాలుగా పోసి పెంచారు.

గోదాకి చిన్ననాటనే శ్రీకృష్ణుని చూడాలనే తపన, ఆతనితో కలసి ఆటలాడాలనే ఆర్తి ఆవిర్భవించాయి. శ్రీకృష్ణకథలు విననిదే నిదురించదు. ఆహారం తినదు గోదా. తండ్రిగారిని మరల మరల శ్రీకృష్ణచరితనే చెప్పమని మారాం చేసేది. ఆ చెప్పడంతో పాటు కథలను పాటలుగా పాడివినిపించనిదే తానే పనీ చేసేది కాదు. ఆమెను తృప్తిపరచడం కోసం పెరియాళ్వార్లు శ్రీకృష్ణలీలల నన్నింటినీ పాటలుగ పాడేవారు. అలా వారు పాడిన పాటలలో తమను యశోదగ, గోదాను శ్రీకృష్ణునిగ భావించినవి ఎన్నో పాశురాలున్నాయి.

నిదురించే కన్నయ్యను మేలుకొలుపడం, ఉగ్గుపెట్టడం, స్నానం చేయించడం, తలదువ్వడం, పూలు ముడవడం, బువ్వ తినిపించడం, రక్షపెట్టడం ఇలా ఒకటేమిటి చిన్నపిల్లలను ఎన్నోరకాలుగ తల్లి లాలిస్తూందో, మారాం చేసే పసివాళ్ళను మరిపించడానికి కాకమ్మను, దాయి దాయిని పిలవడం దగ్గరనుండి తిరిగి లాలిపాడుతూ నిదుర బుచ్చడం దాకా అసలు యశోద ఆనాటి కృష్ణయ్యవద్ద అన్నీ చేసిందో లేదో తెలియదు గానీ, శ్రీ పెరియాళ్వార్లు మాత్రం విల్లిపుత్తూర్ యశోదగ చేసిన ఉపచారాలకు లెక్కలేదు.

ఇలా వారు పాడిన పాటలన్నీ 473 పాటలు గల పెరియాళ్వార్ తిరుమొళ్ళిగ ప్రసిద్ధమైంది. (ఇంకా ఉంది.)

చిత్రకథ - 4

# రామానుజ చిత్రకథ




మరి నువ్వెవరు?
నేనొక చతుర్వేద పండితుణ్ణి.
మరైతే ఇలా ఎందుకు వచ్చావ్?
నేను చేసే యజ్ఞం మధ్యలో విఘ్నాలు వచ్చి ఆగిపోతే నాకీ బ్రహ్మరాక్షసి గతి పట్టింది.
అయితే మరి నువ్వెలా పోతావు?
నీవల్లకాదు నన్ను పంపటం.


కానీ...
ఏమిటి ఆ కానీ?
నీ శిష్యుడు రామానుజుడు.
ఆయన పాదం నా తలపై పెడితే పోతాను.
ఏమిటీ నా శిష్యుడి పాదం నీ తలపై పెడితే పోతావా?
ఔను!
హుష్....
స్వామీ మీ శిష్యుని పిలిపించండి. నా కుమార్తెను రక్షించండి.


ఓ స్వాములూ!
మీలో రామానుజులెవరు?
నేనే!
ఏం..! ఎందుకు?
నా ప్రణామములు. మీ గురువుగారు వెంటనే తీసుకురమ్మన్నారు. రాజాస్థానికి వెళ్ళాలి. దయచేసి రాగలరా!
అలానా! పదండి! తప్పక వస్తా!
దాసోహం గురువుగారూ!
స్వామీ! నాకుమార్తెకు పట్టిన బ్రహ్మరాక్షసుడు మీరు పొమ్మంటే పోతాడట. దయచేసి...
ఇంకా ఉంది..




# తిరుప్పల్లాండు

వైశారదీ

(గతసంచికతరువాయి...)

**తీయిన్ పొలిగిన్ద శెంశుదరాళ్ళి తిగళ్ళ్ తిరుచ్చక్కరత్తిన్**
**కోయిల్ పొఱియాలే యొత్తుండునిన్ఱు, కుడి కుడి యాట్చెయ్‌గిన్ఱోమ్।**
**మాయప్పొరుపడై వాణనై ఆయిరంతోళుం పొళ్ళికురిది**
**పాయ, శుళ్ళత్తియ వాళ్ళివల్లానుక్కు, పల్లాణ్డు కూఱుదమే॥** **7**

| | | |
|---|---|---|
| **తీయిల్** | = | అగ్ని(మొదలగు తేజఃపదార్థముల)కంటే |
| **పొలిగిన్ద** | = | మించిన |
| **శమ్** | = | ఎర్రని |
| **శుడర్** | = | కాంతి కలిగిన |
| **ఆళ్ళి** | = | గుండ్రముగా |
| **తిగళ్ళ్** | = | ప్రకాశించుచున్న |
| **తిరుచ్చక్కరత్తిన్** | = | సుదర్శనాయుధమునకు |
| **కోయిల్** | = | స్థానమైన |
| **పొఱియాలే** | = | చిహ్నముచేత |
| **ఒత్తుండు** | = | ముద్రనంది |
| **నిన్ఱు** | = | స్థిరముగానుండి |
| **కుడికుడి** | = | తరతరములుగా |
| **ఆళ్ శెయ్ గిన్ఱోమ్** | = | భగవత్సేవ చేయుచున్నాము |
| **మాయమ్** | = | మోసగించే |
| **పొరుపడై** | = | యుద్ధముచేయు సైన్యముకల |
| **వాణనై** | = | బాణాసురుని యొక్క |
| **ఆయిరం తోళుం** | = | వేయి భుజములూ |
| **పొళ్ళి కురితి** | = | ధారలుగా రక్తము |
| **పాయ** | = | కారునట్లు |
| **శుళ్ళత్తియ** | = | గిరగిర తిరిగే |
| **ఆళ్ళి వల్లానుక్కు** | = | సుదర్శనమును ప్రయోగించు సమర్థునికి |
| **పల్లాండు** | = | మంగళాశాసనము |
| **కూఱుదుమే** | = | పలికెదము. |

**తా:** శ్రీసుదర్శనము అన్ని తేజఃపదార్థములకంటే మించిన ఎర్రని కాంతికల దివ్యచక్రము. ఆ సుదర్శనుని, దానితోపాటు శ్రీ పాంచజన్య శంఖముయొక్క గుర్తులను తరతరములుగా మా భుజములపై ముద్రింపచేసుకొని చక్రాంకితులమైన వారము. అట్లే, పరంపరగా భగవంతునియొక్క సేవచేసుకొను భాగ్యము పొందినవారము. పూర్వము వేయి చేతులు కలిగిన బాణాసురుడనువాడు మాయ యుద్ధము చేయు తన సేనతో స్వామిపై దాడికి దిగెను. దయకల స్వామి, ఆతనిని చంపకుండ రెండుచేతులు మాత్రమే ఉంచి మిగిలిన వాటిని శ్రీసుదర్శన చక్రముతో నరికి వేసెను. ధారలై రక్తము కారుచుండగా ఆతడు లొంగిపోయెను. ఆనాటి స్వామియొక్క అలుపు తీరునట్లు చక్రధారికి మంగళము పాడుదాము.

**నెయ్యిడై నల్లదోర్ శోఱుం, నియతము మత్తాణి చ్చేవకముమ్,**
**కైయడైక్కాయుం కళ్ళుత్తుక్కు ప్పూణొడు, కాదుక్కు కుండలముమ్ ।**
**మెయ్యిడ నల్లదోర్ శాన్దమున్ తన్దు, ఎన్నై వెళ్ళుయి రాక్కవల్ల**
**పైయుడై నాక పగై క్కొడియానుక్కు, పల్లాండు కూఱువనే ॥ 8**

**నెయ్+ఇడై** = నెయ్యితో నిండిన
**నల్లదు** = మంచిభావముతో (ప్రతిఫలమాశించక) పెట్టిన
**ఓర్ శోఱుమ్** = గొప్పదైన అన్నమును,
**నియతముమ్** = సర్వకాలములయందు
**అత్తాణి** = ఆంతరంగికమగు
**శేవగముమ్** = సేవను
**కై** = చేతినిండుగ
**అడై కాయుం** = తాంబూలమును,
**కళ్ళుత్తుక్కు** = కంఠమునకు
**పూణ్ఒడు** = అలంకరించు ఆభరణములతో పాటు
**కాదుక్కు** = చెవులకు
**కుండలముమ్** = మకరకుండలములను
**మెయ్+ఇడ** = ఒంటికి పూయు
**నల్లదు** = పరిమళముగల
**ఓర్** = శ్రేష్ఠమైన
**శాన్దముమ్** = చందనమును
**తన్దు** = ఇచ్చి
**ఎన్నై** = ఏమీ కోరని
**వెళ్ ఉయిర్** = పరిశుద్ధస్వభావునిగా (అనన్య ప్రయోజనునిగ)
**ఆక్క వల్ల** = చేయగలిగిన
**పైయ్యుడై** = పడగలు గలిగిన
**నాగ** = సర్పములకు
**పగై** = శత్రువైన గరుత్మంతుని
**కొడియానుక్కు** = ధ్వజముగాగల స్వామికి
**పల్లాండు కూఱువనే** = మంగళము పలికెదను

**తా:** లౌకికమైన శరీరపోషణకు నేను పాటుపడే అవసరము లేకుండా భగవంతుడు చేసినాడు. నేతులూరు ప్రసాదములను అందించినాడు. శాశ్వతమైన ఆంతరంగికమైన సేవలొసంగినాడు. భోగ్యమగు చందన తాంబూలాలు ప్రసాదించినాడు. చెవులకు, కంఠమునకు, వంటినిండ ధరించు ఆభరణములను ఇచ్చినాడు. సుఖకరమైన జీవితముతో నాలోని రజస్తమస్సులు అణిగి, సత్త్వము పెరిగి నేను సాధుస్వభావుడను అయినాను. సర్పములను అణుచు గరుత్మంతుని ధ్వజముగా కలిగినవాడు మన స్వామి. కోరికలనే (సర్పాలను) అణచి స్వామిని సేవిస్తూ మంగళము పాడుదాము రండి. *(సశేషం)*

# పంచసంస్కార ప్రశస్తి

శ్రీమాన్ సముద్రాల శఠకోపాచార్యస్వామి-వరంగల్

**"పునరపి జననం పునరపి మరణం**

**పునరపి జననీ జఠరే శయనం"** అన్నట్లు కర్మవశులైన జీవులు జననమరణరూపమైన సంసారచక్రంలో పడి దుఃఖించు చుందురు. వారిని గూర్చి దయాసముద్రుడైన శ్రీమహావిష్ణువు నకు నిర్హేతుకముగనే దయకలుగుచుండును అని తెలియజెప్పే ప్రమాణశ్లోకమిదియే.

**"ఏవం సంసృతి చక్రస్థే భ్రామ్యమాణే స్వకర్మభిః ।**

**జీవే దుఃఖాకులే విష్ణోః కృపాకాప్యుపజాయతే ॥"**

"కృపాపరిపూర్ణుడైన పరమాత్మ మాతృగర్భమునుండి వెలువడుతున్న ఏ పురుషుని (శిశువుని) మధుసూదనుడు కటాక్షించునో అతడు సాత్త్వికుడగును. అతడు మోక్షాభిలాషియై ముక్తిమార్గ విచారము కలవాడగును" అని చెప్పబడినది.

**"జాయమానం పురుషం యం పశ్యేన్మధుసూదనః ।**

**సాత్త్విక స్స తు విజ్ఞేయః స వై మోక్షార్థచింతకః॥"**

భగవత్కటాక్షము అందరికీ అన్ని సమయాల్లో లభించదు. ఎవడినో ఒకడిని ఎప్పుడో ఒకప్పుడు చూడగలను. "ప్రేక్షే కంచిత్ కదాచన" అని భగవంతుడే పేర్కొన్నందున సుదుర్లభమైన భగవత్కటాక్షం కొందరికే కలుగుతుంది. భగవత్కటాక్ష ప్రభావమువలన అసారములు, అల్పసారములు, సారతర ములు అనువాటిపై ఆసక్తి ఏర్పడదు. సారతమమైన మోక్షేచ్ఛయే కలుగును. మోక్షప్రదుడైన పరమాత్మ తత్త్వాన్ని ఉద్బోధించే సదాచార్యుడు లభించును. అపుడు సదాచార్యుడు బద్ధజీవుణ్ణి పంచసంస్కారసంపన్నుడిగా తీర్చిదిద్దును.

ఉపనయన సంస్కారం వలన వేదాధ్యయమునకు, గాయత్రీ మంత్రోపదేశమునకు యోగ్యత సిద్ధించినట్లు, వివాహ సంస్కారము భర్తృభార్యా సంబంధమును దృఢపరచి పవిత్ర సంతానమునకు యోగత్యను కలిగించినట్లు, పంచసంస్కార సంపన్నత ప్రకృతిబంధమును తొలగించును. జీవాత్మ-పరమాత్మలకుగల నవవిధ సంబంధ జ్ఞానమును తెలియ జేయును. పరాత్పరుడైన శ్రీమన్నారాయణుని నిత్యసంబంధ జ్ఞానమును తెలియజేయును.

పరాత్పరుడైన శ్రీమన్నారాయణుని నిత్యనివాసమగు పరమపదాన్ని చేరే యోగ్యతను కలుగజేయును. పురుషోత్తము డైన శ్రీహరి సాయుజ్యాన్ని పొందగల అర్హతను లభింప జేయును. శ్రియఃపతికి సర్వవిధ కైంకర్యములను చేసే యోగ్యతను సిద్ధింపజేయును. పంచసంస్కార సంపన్నులకే శ్రీవైష్ణవత్వసిద్ధి కలుగుతుంది. భగవదారాధనకు, ప్రపత్త్యనుష్ఠానములకు యోగ్యత లభిస్తుంది. శ్రీ వైష్ణవత్వ సిద్ధిని పొందిన వ్యక్తియొక్క తల్లిదండ్రులు, తాతముత్తాతలు పరమానంద భరితులౌతారు. మనల్ని తరింపజేయువాడొకడు మనవంశంలో పుట్టినాడని ఆనందపారవశ్యంతో నృత్యం చేస్తారు...

**"ఆస్ఫోటయన్తి పితరః ప్రనృత్యన్తి పితామహాః ।**

**వైష్ణవో నః కులే జాతః స న స్సంతారయిష్యతి ॥"**

అని ప్రబోధించే శ్లోకం ద్వారా పంచసంస్కార ప్రశస్తి ప్రకటితమగుచున్నది.

పంచసంస్కారసంపన్నులైన విష్ణుభక్తుల వద్దకు వెళ్ళవద్దని తాను వైష్ణవేతరులకు మాత్రమే ప్రభువునని పాశహస్తుడైన యముడు తన సేవకులను రహస్యముగా హెచ్చరిస్తాడు.

**"స్వపురుషమభివీక్ష్య పాశహస్తః**

**వదతి యమః కిల! తస్య కర్ణమూలే ।**

**పరిహర మధుసూదన ప్రపన్నాన్**

**ప్రభు రహమన్య నృణాం న వైష్ణవానామ్ ॥"**

అను ప్రమాణ శ్లోకము ద్వారా యమపీడను దూరము చేసేవి పంచసంస్కారములని బోధపడుచున్నది.

పంచసంస్కారసంపన్నులైన భగవద్భక్తులు యమలోకానికి వెళ్ళనే వెళ్ళరని, వారిని చూచి యమభటులు భయంతో సుదూర ప్రాంతాలకు పారిపోతారని పంచసంస్కార సంపన్నులైన ప్రపన్నులు దేవయానమని వ్యవహరింపబడే అర్చిరాది మార్గముగా భగవత్సాయుజ్యాన్ని పొందుతారని -

**"నైవ భాగవతా యాంతి యమలోకం కదాచన ।**

**దృష్ట్వా చక్రాంకితం దూర మపసర్పంతి తద్భటాః ॥"**

**పంచ సంస్కార యుక్తానాం ప్రపన్నానాం చ యోగినామ్।**
**దేవయానాభిదో మార్గః భగవత్ప్రాప్తి సాధనమ్ ॥"**

అను ప్రమాణం ద్వారా తెలియుచున్నది. పంచసంస్కార సంపన్నులు మాత్రమే మోక్షసామ్రాజ్యలక్ష్మిని పొందుతారని స్పష్టమగుచున్నది. పంచసంస్కారపరులు కానివారు భగవత్సేవ చేయకూడదా అని సందేహం ఏర్పడడం సహజమే! భగవంతుని ఎవరైనా పూజించవచ్చు. అయితే రాజముద్రను, వేషమును ధరించని సేవకునికి రాజుగారి ఆంతరంగికమైన సేవలకు అనుమతి ఉండదు కదా! రాజాజ్ఞాపత్రము లేకపోతే రాజోద్యోగి కాడుగదా! అట్లే భగవంతుని పొందుటకు, భగవంతుడే ఉపాయము, ఉపేయము (ఫలము) అను నిశ్చయ విశ్వాసములను కలిగిన పరమైకాన్తి యగుటకు పంచసంస్కారములను పొందవలసినదే అని నిష్కర్షించే ప్రమాణమిదియే ...

**"తాపః పుండ్ర స్తథా నామ మంత్రో యాగశ్చ పంచమః।**
**అమీ హి పంచసంస్కారాః పరమైకాన్తి హేతవః ॥"**

నుదట కుంకుమబొట్టు, చేతులకు గాజులు, చెవులకు కమ్మలు, మెడలో మంగళసూత్రము, కాళ్ళకు మెట్టెలు వివాహ సంస్కారాన్ని పొందిన స్త్రీకి ఎట్లా గౌరవాన్ని కలిగిస్తాయో, అట్లే నుదట ఊర్ధ్వపుండ్రములు, భుజములందు అంకితములైన శంఖచక్రములు, దాస్యనామము మంత్రానుష్ఠాన యాగములు అనుపంచసంస్కారములను పొందిన శ్రీవైష్ణవులు విష్ణుప్రియులుగా విశేష గౌరవాన్ని పొందుతారు.

తులసీ, తామరపూసల మాలికలను ధరించునట్టి పరమపావనులైన పంచసంస్కారసంపన్నులైన వైష్ణవులు సంచరించే ప్రాంతములన్నీ పవిత్రములవుతాయని చెప్పబడింది.

**"యే కంఠలగ్న తులసీ నలినాక్షమాలాః**
**యే బాహుమూల పరిచిహ్నిత శంఖ చక్రాః**
**యే వా లలాటఫలకే లసదూర్ధ్వపుండ్రాః**
**తే వైష్ణవాః భువనమాశు పవిత్రయంతి ॥"**

దూదికుప్పలో పడిన అగ్నికణము దూదికుప్పనంతటిని భస్మం చేసినట్లు అనేక జన్మార్జిత పాపరాశిని భస్మం చేయు తాపము, పుండ్రము, నామము, మంత్రము, యాగము అను పంచసంస్కారముల ప్రాశస్త్యమును మన పెద్దలు వివరించినారు. *(ఇంకా ఉంది)*

## ముఖచిత్ర పరిచయము

## శరత్పూర్ణిమ

**శ్రీకృష్ణపరమాత్మ శృంగార రసాధిష్ఠానదేవతామూర్తి. శారద రాత్రులు భావోద్దీపకాలు, కామోద్దీపకాలు పౌర్ణమినాటి చంద్రుడు చల్లని, తెల్లని కిరణాలతో అమృతహస్తాలతో లోకాలను తాకి పారవశ్యం కల్గిస్తున్నాడు.**

**శ్రీకృష్ణచంద్రుడు వేణుగానంతో మధురనాదంతో లోకాలను పరవసింపచేస్తున్నాడు. ఈ నల్లచంద్రునిలో ఆచార్యుల గుణాలు నిండి ఉన్నాయి. చుట్టూ ఉన్నవారు గోపికలు, ఆశ్రితులు. అది వేణుగానము. అదే ప్రణవనాదం. "ఓంకారార్ణవ ముదీరయన్ విజయతే గోపాల చూడామణి" అంటారు లీలాశుకులు. ఆ దివ్య ప్రణవనాథమే లోకాలపై వెన్నెలలు ఆరబోసింది. ఒకవైపు రాసక్రీడ. విశ్వవ్యాపకుని శృంగార నర్తనం కందర్పకోటి లావణ్యమూర్తి శ్రీకృష్ణచంద్రుడు కామునిపై సాధించిన విజయమే రాసక్రీడగా అభివర్ణించారు.**

**ఒక్కడే నర్తకుడు నర్తకీమణులెందరో ఉన్నా నాట్యాన్ని హల్లీశాకం అంటారు. అదే గతి భేదంలో తాళభేదంతో చేస్తే రాసక్రీడ అవుతుంది.**

**ఇది స్వర్గవాసులకు కూడా తెలియని ఆనంద నాట్యం. బృందావనం దీనికి కేంద్రం. అసలు బృందావనం అంటే భగవంతుని విడిచి క్షణమైనా నిలువలేని భక్తబృందాన్ని రక్షించిన స్థలం అని, ఆ పవిత్ర స్థలంలో న బ్రహ్మచర్యం దీక్షిదే అని దేశికులు అన్నట్లు రాసక్రీడ మిషతో మన్మథుని ఓడించిన జితేంద్రియుని నాట్యలీల. దీనికి శరద్ఋతువును ఎన్నుకున్నారు స్వామి ఎందుకో!**

**వర్షాకాలంలో బురదతో నిండిన నీరు శరత్కాలానికి అతి స్వచ్ఛంగా మారుతుంది. దీనిని "సన్ మనుష్య మనో యథా" అంటారు వాల్మీకి భగవానులు.**

**బృందావనంలో శరత్కాలంలో 'కోజాగరి' అనే ఆటను ఆడతారు. ఆ ఆట చివరిలో ఆవుపాలను వెన్నెలలో కాచి, పక్వం కావించి స్వీకరించటంతో ఆట ముగిస్తారు. ఆ బృందావనం అంటే ప్రకృతిలో మండలంలో ఉండే భువనం. శతర్కాలపు చల్లని వెన్నెల ఆచార్యకృపకు ప్రతీక. గోవులు ఆచార్యస్వరూపము. వాటి క్షీరం జ్ఞానం. వాటిని కాచి సేవించడంతో ఆట ముగిస్తారు.**

**శ్రీకృష్ణ చంద్రుడు ఆచార్యుడై, జగదాచార్యుడై, మంత్రకాంతులను లోకంపై పరచిన శుభతరుణమిది. చంద్రుడు సూర్యతాపాన్ని పోగొడితే, శ్రీకృష్ణచంద్రుడు సంసార తాపాన్ని పోగొట్టి జ్ఞానజ్యోత్స్నని వెదజల్లే ఆచార్యుడు. శరత్పూర్ణిమ వైశిష్ట్యం ఆత్మోద్ధరణ ఔషధం.**

అయోధ్య కాండలో



# శ్రీరామాయణము



ఏ. ఉషశ్రీ- శ్రీరాంనగర్

## శుక-శారికలు

*(గత సంచికలో....*

శ్రీరామచంద్రుడు సీతా లక్ష్మణులతో కలసి గంగను దాటి అరణ్యంలో ప్రవేశించాడు. ఆ రాత్రికి వారు అక్కడనే విశ్రాంతికై గడ్డి, ఆకులతో పర్ణశయ్యను ఏర్పాటు చేసుకున్నారు. అంతగా నడక అలవాటు లేని సీతమ్మ అలసటవల్ల ముందుగానే విశ్రమించింది.

తన తల్లి కౌసల్య పట్ల ఉన్న ప్రేమతో ఆమెను ఒంటరిగా వదలివచ్చినందుకు శ్రీరామునికి నిద్రపట్టలేదు. లక్ష్మణుడితో ఇలా చెప్పడం ప్రారంభించాడు. "అరవైవేల సంవత్సరాల తర్వాత కౌసల్యమ్మకు సంతానం కలిగింది. అంతవరకూ సంతానం లేదే అని బాధ. ఆ సమయంలో పెద్ద భార్య అయిన తనకు సంతానంకలగలేదనే ఆ తర్వాత దశరథుడు సుమిత్రాదులను పరిణయమాడాడు. ఆ రకంగ భర్త ఉదాసీనతకు పాత్రురాలనైనానని ఆమె బాధపడుతూండేది. రాజుగారికి కైకమ్మ మీద ప్రీతి అధికం. సుమిత్రాదేవికి ఇవేమీ పట్టవు. ఆమె సహజంగ విరాగిణి కనుక ఏ పట్టింపూ లేకుండా గడపగలిగేది. తన భర్త తనని పట్టించుకోడు. పట్టపురాణి అనే పేరే తప్ప, ఆ వైభోగమేమీ లేదు. కైకతో కొంత సమయం గడపడానికీ వీలులేదు. ఏదో కొంతసేపు సుమిత్రతో మాత్రం కాలక్షేపమౌతూ ఉండేది కౌసల్యాదేవికి.

ఇలా, సంతానం కలగడానికి ముందూ ఆమెకు సుఖం లేదు. కలిగాక ఏదో కొద్దికాలంపాటు పిల్లలమైన మనతో సంతృప్తిగ కాలం గడిపి ఉంటుంది. 12వ సం॥ వచ్చేవరకూ విద్యాభ్యాసంతో గడిచింది. ఆపై విశ్వామిత్రునితో వెళ్ళడం, సీతమ్మతో వివాహం, ఆపై రాచకార్యాలు వీటితో మరింత సమయం గడిచినా, మనం, కనీసం అమ్మ చూపులలో ఉన్నాం కనుక, ఆమెకు సంతృప్తి కలుగుతూ ఉండేది. 'నా కుమారుడు రాజు అవుతాడు. నేను రాజమాతనౌతా'ననే ఆశతో ఆమె కాలం గడిపేది. అనుకున్నట్లే తండ్రిగారు పట్టాభిషేకాన్నీ ప్రకటించారు.

దైవం కలిసిరాక పోవడంతో అంతా తారుమారై చివరికి 'మూలిగే నక్కపై తాటిపండు పడ్డట్టు', కైకమ్మ బలవంతంతో మనం వనాలపాలు కావలసి వచ్చింది. ఇది మన అమ్మకు తట్టుకోలేని ఆఘాతం. ఇప్పుడు ఆమెకు ఓదార్పు కావాలి. అది అందించే వారెవ్వరూ లేరు కద!

తండ్రీ కైకమ్మకు భయపడుతూ మన అమ్మ దాపులకే రాలేడు. అంటే, భర్త నుండి ఓదార్పు రాదు. సవతుల నుంచి ఈసడింపులు, సూటిపోటి మాటలూ ఇక ఎక్కువౌతాయి. నేనా వనానికి వచ్చేశాను. పోనీ శ్రద్ధగ చూసుకోగలిగే సీతమ్మ నాతోనే వచ్చేసింది. సుమిత్రమ్మ, విరాగిణి కనుక, ఏదో అప్పుడప్పుడు తోడుంటుందే తప్ప పూర్తిగ చూచుకోలేదు. పోనీ, ఏ రకమైన సేవైనా చేయగలిగే నీవైనా ఉంటే, నేను లేనిలోటు అమ్మకు తీరడానికి అవకాశం ఉంది. నువ్వూ నాతోనే బయలుదేరావు కద. తల్లి ఆజ్ఞను జవదాటలేని భరతుడూ, ఆతణ్ణే అనువర్తించి ఉండే శత్రుఘ్నుడూ మాత్రం మన అమ్మను పట్టించుకుంటారని ఎలా అనుకోగలం చెప్పు! ఇలా, అవసరమొచ్చి ఓదార్చవలసిన సమయంలో మన అమ్మ కౌసల్యను పట్టించుకొనే వారే లేకుండా అయిపోయిందే! ఇందరము ఉండీ కూడా ఆమె అనాథగ విలపించవలసి వస్తున్నదే! లక్ష్మణా! ఇదే నా హృదయాన్ని తొలిచివేస్తోంది" అన్నాడు.

కౌసల్యమ్మను తాను ఏమాత్రము ఆనందపరచలేకపోయినందుకు శ్రీరాముడు బాధపడుతూ లక్ష్మణునితో "లక్ష్మణా! మన అమ్మ అంతఃపురములో చిలుకా, గోరువంకలను పెంచింది గుర్తుందా! ఒకనాడు అమ్మ భగవంతునికి నివేదనకని పాయసాన్ని పెట్టి లోపలికి వెళ్ళింది. ఇంతలో ఒక పెంపుడు పిల్లి ఆ పాయసాన్ని తినడానికి అక్కడికి వచ్చింది. అది చూచిన గోరువంక **"శుక! పాద మరేః దశ"** అని అంది".

**"మన్యే ప్రీతి విశిష్టా సా మత్తో లక్ష్మణ! శారికా ।**
**యస్యాః తచ్ఛ్రూయతే వాక్యం 'శుక! పాద మరే ర్దశ ॥"**

'ఓ చిలుకా! అమ్మ పెట్టిన ప్రసాదాన్ని అపహరించ వచ్చిన, మన శత్రువైన, ఈ పిల్లి పాదాన్ని కొరికేయ్!' అంటూ అమ్మకు కలిగే కష్టాన్ని చూడలేక, అమ్మను సంతోష పెట్టడానికి తన

వంతుగ ఏదో చేయాలనే తపన కలిగిన ఆ గోరువంకే నాకంటే చాల నయం. అమ్మ మీద దానికుండే ప్రేమయే అధికమని, లక్ష్మణా! నేను భావిస్తున్నాను' అన్నాడు శ్రీరాముడు. ఇక్కడ శ్రీరాముడు గోరింకే తనకంటే గొప్పదని దానిమాటలను బట్టి భావించాడు. ఇది మనకి కథాభాగంలో కనిపించే అంశం.

శ్రీరామాయణమంతా పైకి ఒక కుటుంబ కథ. లోపలికి ప్రవేశిస్తే మనకథ. అంటే జీవుడికథ దానిలో ఇమిడి ఉంది.

చిలుకలు, గోరువంకలు పక్షిజాతికి చెందిన వేరు వేరు పక్షులు. చిలుక గోరువంకలు కలిసి కాపురం చేస్తున్నట్లు మనకి ఎక్కడా కనిపించదు. కాని కొంతమందిని భార్యాభర్తలను, క్రొత్తదంపతులను చూసినప్పుడు 'చిలుక గోరువంకలలాగ ఉన్నా'రని అనడం, 'చిలుక గోరువంకలలాగ నూరేళ్ళు అన్యోన్యంగా జీవించండి! "శతమానం భవతి" అంటూ దీవించడం మనం వింటూ ఉంటాం. దీనిలో ఉండే ఆంతర్య మేమిటి? చిలుక గోరువంకలు దేనిని సూచిస్తాయి? ఈ రెంటికి గల పోలికలేమిటి?

చిలుక, గోరువంకలు రెండూ మాటలను నేర్పితే నేర్చుకొని అలానే చక్కగ పలుకగలిగే పక్షులు. మిగిలిన పక్షులకు అది నేర్పినా వృధాయే! అందుకే కాబోలు అవి వేరు వేరు జాతిపక్షులు అయినా కలిపి చెప్తూ ఉంటారు.

మాటలాడే పక్షులు రెండు. ఒకటి జీవుడనే పక్షి. మరొకటి దేవుడనే పక్షి. "ఇద్దరికీ జ్ఞానం సహజంగానే ఉంది. ఇద్దరికీ విడదీయరాని సంబంధం ఉంది." ఇద్దరికీ సమానమైన గుణాలు ఉన్నాయి. బంగారంలాంటి రెక్కలు రెంటికీ ఉన్నాయి. "ఇవి రెండూ ఒకేచోట చేరి ఉన్నాయి. వీటిల్లో ఒక మాట్లాడే పక్షి చిలుక, శుకము. రంగును బట్టి, రూపాన్నిబట్టి, చక్కని మాటలను పలికే తీరును బట్టి దేవుడితో దీనిని పోలుస్తారు. దేవుడెప్పుడూ ఉత్తమగుణాలతో పూర్ణుడై కళకళలాడుతూ పచ్చని పసిమి కలిగే ఉంటాడు.

ఆయన ఏ రూపంలో ఉన్నా చూడముచ్చటగానే ఉంటాడు. ఆయన మన బాగు కోరి శాస్త్రాలసారాన్ని ఎన్నో రీతులలో, ఎట్టని నోటితో, అంటే, అనురాగపూర్ణమైన ఉపదేశాలుగ పలుకుతూ ఉంటాడు **"శ్రుతిః స్మృతిః మమైవాజ్ఞా", "మగ్నాన్ ఉద్ధరతే లోకాన్ కారుణ్యాత్ శాస్త్రపాణినా"** అంటూ కారుణ్యపూర్ణమైన హృదయంతో శాస్త్రార్థాలను తన ఆజ్ఞలుగ, సంసారంలో మునిగిన మనల్ని ఉద్ధరించడానికి ఆయా అవతారాలలో చరమశ్లోకాలుగానో, భగవద్గీతాదులుగానో, ఆచార్యరూపాన్ని ధరించో పలుకుతూ ఉంటాడు.

రెండో మాట్లాడే పక్షి గోరింక, శారికా. పైశ్లోక ప్రకరణాన్ని బట్టి ఇది ఆచార్యులకి, జ్ఞానులకీ ప్రతీక, ఈ ఆచార్యులు, తమ పెద్దల ద్వారా అందుకొన్న ఉపదేశాలను మననం చేసుకొంటూ ఉంటారు. పిల్లిలాంటి ప్రకృతి ప్రభావంలో పడి, స్వరూపనాశం పొందడానికి సిద్ధంగా ఉన్న వెన్నలాంటివాళ్ళం మనం.

జ్ఞానులు, ఆచార్యులూ సదా భగవంతుణ్ణి హెచ్చరిస్తారు. ప్రకృతిమాయలో జారిపోకుండా మనల్ని పట్టించుకోమని, ప్రకృతి అనే పిల్లియొక్క పాదంవంటి అహంకారాన్ని త్రుంచు. "జహి శత్రుం మహాబాహో!" అంటూ భగవద్గీతలో అర్జునుణ్ణి భగవంతుడు హెచ్చరించినట్లు మనరక్షణకోసం **పాద మరేః దశ!** మాశిష్యుణ్ణి అహంకారం బారిన పడకుండా కాపాడవయ్యా! అంటూ ఇక్కడ భగవంతుణ్ణి ఆచార్యులు హెచ్చరిస్తారు.

భగవంతుడు జీవ సామాన్యానికి ఉపదేశిస్తూంటాడు. భగవంతుడికి ఆచార్యులూ ఉపదేశిస్తూ ఉంటారు. కనుక, వీరిరువురూ పరస్పరం మాట్లాడుకొనే పక్షులయ్యారు. ఇద్దరూ పరస్పరం సంబంధజ్ఞానం కలవారే కనుక చిలుకా గోరింకల్లాంటి వాళ్ళు. *(సశేషం)*

---

**జై శ్రీమన్నారాయణ!**

**భక్తుల కోరికననుసరించి సెప్టెంబరు నెల "మెదడకు మేత"**

**సమాధానములు**

1. పంచరులు
2. మృతసంజీవని విద్య
4. పంచాశత్
5. క్రే కారం
6. అపర్యవసిత ప్రామాణిక ప్రవాహ ప్రసక్తిః
7. కచుడు
8. మానసయోగం, సాత్త్విక త్యాగం
9. పంచాయుధములు
10. విశ్వామిత్ర సంహిత, కపింజర సంహిత, విష్ణు సంహిత, ఈశ్వర సంహిత, సన్కుమార సంహిత, విహగేంద్ర సంహిత
11. ఋషులు అనేకులు అంతర్ బాహ్య ప్రపంచాలను తమ తమ పరిధిలో దర్శించి మనదాకా అందేట్టుగా చేసిన నిర్ణయాలు.
12. ఆధ్యాత్మిక సంపద
13. భగవద్రామానుజులను
14. 'భుః', 'భువః' అంటూ మొదలయ్యే 14 లోకాలు.
15. భగవంతుని నిర్హేతుక కృప.
16. పారాయణ చేసిన వారిని, వారి పరివారం పాపాలను నశింప చేసి, సద్గతిని కలిగించేది.
17. తృప్తి లేకపోవటం.
18. నారాయణమునిని.
19. సిద్ధికల ఆచార్యులదృష్టి వారి మీద ప్రసరించాలి.
20. పెట్టె.
21. మన ఆధ్యాత్మిక విశ్వాసాన్ని కూకటివేళ్ళతో పెకలించారు.
22. తమలపుతీగ ప్రేమగల నాయకి, ప్రియుడు పోకచెట్టు, చెరకు లోని ముత్యాల సున్నం.
23. వర్ష +ఆతప +వారణ+ ఆదిభిః
24. ఆయుష్షు, శ్రేయస్సు, సుఖము, ఆచారవ్యవహారాలు తెలుస్తాయి.
25. కామము
26. మనసులోని మాట నోటితో చెప్పకుండా తెలుసుకొని ప్రవర్తించడం.

శ్రీమన్నారాయణ రామానుజ యతిభ్యో నమః

# యతిరాజవింశతి

శ్రీశ్రీశ్రీ అహోబిల రామానుజ జీయరు స్వామివారు

ఈ విశ్వంలోని ప్రతి అణువులోను భగవంతుడు నిండి ఉన్నాడని శాస్త్రాలు మనకు తెలుపుతున్నాయి. ఆ తత్త్వాన్ని మనకు అందించే మహనీయులనే ఆచార్యులు అని అంటారు. భగవంతుని వైభవాన్ని తెలియజేసే ఆచార్యులను భగవంతుని కంటే ఎక్కువగా ఆరాధిస్తాము. 'భగవద్వందనం కార్యం గురువందన పూర్వకం' అన్నట్లు భగవంతుని ఆరాధన కంటే ముందు ఆచార్యుని స్మరించి, అర్చనాదులు సమర్పించవలెనని శాస్త్రము. శ్రీ వచనభూషణమను గ్రంథములో లోకాచార్య స్వామి **జప్తవ్యం గురుపరంపరయుం ద్వయముం** అని వివరించారు. అనగా భగవన్మంత్రాన్ని జపించుటకుముందు ఆచార్య పరంపరను అనుసంధించవలెనని నియమము. దీనిని అనుసరించి యతిరాజ వింశతిని స్మరించుటకు ముందు ఎఱుంబియప్పా (దేవరాజులు) వారి ఆచార్యులైన మణవాళ మామునులను ఈ విధంగా స్మరిస్తున్నారు.

**యస్తుతిం యతిపతి ప్రసాదినీం**
**వ్యాజహార యతిరాజ వింశతిం ।**
**తంప్రపన్న జనచాత కామ్బుదం**
**నౌమిసౌమ్య వరయోగి పుంగవమ్ ॥**

అనగా రామానుజుల అనుగ్రహాన్ని అందించే యతిరాజ వింశతిని కృపచేసిన మణవాళమామునులు ప్రపన్నజనులు అనే చాతకములకు దాహార్తిని తీర్చు మేఘసదృశులని అలాంటి మామునులను నమస్కరించుచున్నాను అని స్తుతించారు. ఈ శ్లోకంలో ఎంతోగొప్ప అర్థము దాగియున్నది.

మామునులు అంటే మునులకే ముని కనుక మహాముని అని అర్థము. వీరి ప్రవచన వైభవాన్ని ఆస్వాదించిన పెద్దలు వీరిని **'విశదవాక్శిఖామణి'** అని సంబోధించేవారు. మామును లను వరవరముని అని కూడా పిలుస్తారు. **'వరాణాం వరః'** జ్ఞానవైరాగ్యాలచే శ్రేష్ఠులైనవారిలో శ్రేష్ఠులు అంతేకాక **వరైఃవ్రియతే ఇతి వరవరః** జ్ఞానవైరాగ్యాలచే శ్రేష్ఠులైనవారిచే వరింపదగినవారు కనుక వరవరమునులు.

మామునుల ఆచార్యులు తిరువాయ్‌మొళ్ళిప్పిళ్ళ గారు (శ్రీశైలేశులు). వీరు ఆళ్వార్ తిరునగరిలో శ్రీరామానుజుల వారి మందిర నిర్మాణం చేసారు. ఆ సన్నిధి ఆరాధనా బాధ్యతలు మామునులకు అప్పగించారు. వారి ఆదేశానుసారము యతిరాజులైన రామానుజులయందు అత్యంత ప్రావణ్యముతో సేవలు చేయసాగారు. ఆనాటినుండి మామునులను **యతీంద్ర ప్రవణులు** అని సంబోధించేవారు. వీరి శ్రద్ధను గమనించిన శ్రీశైలేశులు శ్రీరామానుజుల విషయంలో స్తోత్రము చేయమని ఆజ్ఞాపించారు. ఆచార్య ఆదేశానుసారము రామానుజుల వారి వైభవాన్ని "**యతిరాజ వింశతి**" అను స్తోత్రంగా మనకు అందించారు.

**ద్రాక్షా మధిక్షిపతి నిందతి మకరందధారాం**
**సుధారసఝరీం అధరీకరోతి ।**
**యత్సంప్రణీతమతులం యతిసార్వభౌమ స్తోత్రమ్**
**సమే వరవరమునిః వితనోతు భద్రమ్ ॥**

యతిసార్వభౌములైన రామానుజుల వైభవాన్ని వర్ణించిన **"యతిరాజవింశతి"** స్తోత్రమును ఆస్వాదించిన వారు భోగ్యవస్తువులైన ద్రాక్షరసమును, మకరందమును (తేనెను), దేవతలకు యిష్టమైన సుధారసమును (అమృతమును) నిందిస్తారు. వీటి అన్నింటికంటే భోగ్యమైనది "యతిరాజ వింశతి". అటువంటి గొప్పదైన ఈ స్తోత్రాన్ని అందించిన వరవరమునులు మాకు క్షేమములను కలిగించుగాక అని "ప్రతివాది భయంకరం అణ్ణన్ స్వామి" వరవరముని శతకంలో అందించారు. ఈ స్తోత్రం వల్ల మనకు కలిగే ఫలము యతీశ్వరులైన రామానుజుల అనుగ్రహమే. యత్యాశ్రమమును స్వీకరించినవారలు ఇంద్రియములకు వశులు కానట్లుగా చేసి, వారిని నియమించి సన్మార్గములో నడుపు సమర్థులు కనుక రామానుజులను ''యతిపతి'' యని "యతిరాజులు" అని వ్యవహరిస్తారు. ఆ రోజులలోనే 700 మంది జీయర్లను తయారుచేసి భగవత్తత్త్వాన్ని లోకానికి చాటిన యతి సార్వభౌములు మన రామానుజులు.

ఆచార్యులను ఆశ్రయించక నేరుగా భగవంతుణ్ణి ఆశ్రయించడం అంత శ్రేయస్కరం కాదు. ఎందుకంటే భగవంతుడు సర్వస్వతంత్రుడు. మనమా దోషగుణపూర్ణులము. ఎన్నో దోషాలు చేసే మనము భగవంతుణ్ణి ఆశ్రయిస్తే మనల్ని చూచి "క్షిపామి" శిక్షిస్తాను. "న క్షమామి" ఎన్ని నమస్కారాలు నాకు పెట్టినా క్షమించనుకాక క్షమించను అంటాడు. మరి మనగతి ఏమి ? అందులకే స్వతంత్రుడైన భగవంతుణ్ణి ఆశ్రయించడంకన్నా కృపాపూర్ణులైన ఆచార్యులను ఆశ్రయించడం మిన్న. అలాంటి స్వతంత్రుడైన పరమాత్మ ఈ యతిరాజ వింశతి స్తోత్రాన్ని అనుసంధించిన వారలను అనుగ్రహిస్తాడట. ఆ సర్వేశ్వరునకు రామానుజాచార్యులంటే ఎంత ప్రేమో తెలుస్తోంది. జ్ఞానులైన

పెద్దలు కూడా ఆచార్యులను ఆశ్రయించడంలో మక్కువను ఎక్కువగా చూపుతారు.

**"న గురోః అపరస్త్రాతా"** గురువు కంటే రక్షకులు ఎవరూ లేరని అనేక ప్రామాణిక గ్రంథాల ద్వారా తెలుస్తోంది. పరమాత్మ యందే పరిపూర్ణ విశ్వాసము, భక్తి కలవారు "ప్రథమపర్వ నిష్ఠులు" అని, ఆచార్యుని యందే భక్తి కలవారు "చరమపర్వ నిష్ఠులు" అని అంటారు. చరమ పర్వ నిష్ఠ కలవారు ఆచార్యాభిమానమే తమకు ధారకమని భావిస్తారు. వారినే "**ప్రపన్నులు**" అని పిలుస్తారు. చాతక పక్షి నీటికై మేఘమును ఆశ్రయించినట్లు, భగవదనుగ్రహాన్ని పొందగోరు ప్రపన్నులను చాతకములకు మామునులు "మేఘము" వంటి వారని ఎఱుంబియప్పా పై శ్లోకంలో **"ప్రపన్న జనచాతకామ్బుదం"** అని ఆచార్యులను కీర్తించారు. మేఘము సముద్రజలాన్ని త్రాగి దానిలోని ఉప్పదనాన్ని పోగొట్టి, తీయని తీర్థంగా సర్వ మానవాళికి వర్షరూపంగా అందిస్తుంది. అలాగే రామానుజు లనే సరస్సు నుండి మామునులనే మేఘము భగవత్కరుణా రసమను తీర్థాన్ని స్వీకరించి తామనుభవించి, అవ్యాజమైన కృపతో ఉపదేశ రూపంగా లోకానికి అందించినది. ఆర్తిని తీర్చడమే మేఘానికి, ఆచార్యునికి ఉన్న సామ్యము. అంతేకాదు చాతకము తన దాహమును తీర్చుకోవడానికి మేఘాన్ని తప్ప మరొకదాన్ని ఆశ్రయించదు. ఇదియే అనన్యనిష్ఠ. ఇట్టి అనన్యనిష్ఠ కలవారు ప్రపన్నులు అని, చాతకసామ్యముచే తెలుస్తోంది.

సంసారులమైన మన దుర్గతిని చూడలేక, మనందరినీ తరింపచేసిన ఉదారులు మామునులు. లోక క్షేమంకై అవతరించిన మహనీయులు. అందరి యోగ క్షేమాలకై రామానుజులను (ఆచార్యులను), పెరుమాళ్ళను ప్రార్థించు మన మణవాళమామునులను పుంగవులు (శ్రేష్ఠులు) అని ఎఱుంబియప్పా పై శ్లోకంలో స్తుతిస్తున్నారు. (సశేషం)

# నేర్చుకుందామా - 3

మన గ్రంథాలు మనకెన్నో మంచి మంచి ధర్మాలను ప్రబోధిస్తున్నాయి. ఏ పనులు చెయ్యాలి, ఏ పనులు చేయకూడదు అనే మీమాంసలో కూడా మన సందేహాలు తీర్చేవి మన ఉత్తమ గ్రంథాలే!

సత్యవాక్యం పలకడం ధర్మాలలోకెల్లా అత్యుత్తమ ధర్మం. అది ఎంత గొప్పదో మనకి వివరిస్తుంది మహాభారతంలోని ఒక పద్యం. ఆ పద్యం నేర్చుకుందామా! ఆదికవి, వాగమ శాసనుడు అయిన నన్నయ భట్టారకుడు శకుంతాలా దుష్యంతుల కథలో ఈ సత్యవాక్పాలన మహిమను అతి ప్రసన్నంగా అందించాడు. ఆ పద్యం ఇదిగో!

చంపకమాల:

**నుతజల పూరితంబులకు నూతులు నూటికంటె సూనృత**
**వ్రత యొక బావిమేలు, మరి బావులు నూటింటికంటె నొక్క స**
**త్క్రతు పదిమేలు, తత్క్రతు శతంబునకంటె సుతుండు మేలు, త**
**త్సుత శతకంబుకంటె నొక సూనృతవాక్యము మేలు చూడగన్.**
**ఈ పద్యంపేరు చంపకమాల**

**న జ భ జ జ ర అనే గణాలు ఉంటాయి.**

శకుంతల ను దుష్యంతుడు గాంధర్వవివాహం చేసు కున్నాడు. కుమారునితో తన వద్దకు వచ్చినపుడు నీవెవరివో నాకు తెలియదన్నాడు ప్రజలేంటారో అనే భయంతో. అపుడు శకుంతల చేసిన ధర్మప్రభోధమిది.

సత్యం మాట్లాడడమే వ్రతంగల రాజువి కదా! ఎందికిలా అంటున్నావు? లోకంలో మంచినీటితో నిండిన చేదుడు బావులు నూరు త్రవ్వించిన పుణ్యంకంటే ఒక దిగుడుబావి త్రవ్వించిన పుణ్యం గొప్పది. రెక్కలు నొప్పిపుట్టేలా నీరు తోడుకోనవసరం లేకుండా హాయిగా మెట్లు దిగి మంచినీరు తెచ్చుకోవచ్చు గదా! అలాంటివి నూరు బావులు కట్టించిన పుణ్యంకంటె ఒక యజ్ఞం చేస్తే వచ్చే పుణ్యం గొప్పది. యజ్ఞం చెయ్యడం ఎంత కష్టం! కానీ అలాంటి వంద యజ్ఞాలవల్ల వచ్చిన పుణ్యంకంటె ఒక కొడుకు కల్గిన పుణ్యం గొప్పది. మరి నూరుమంది కొడుకులను కన్నపుణ్యంకంటె ఒక్కసత్యవాక్యం పలకడం ఎంతో పుణ్యానిస్తుంది. చూడండి! ధర్మకార్యాలను నన్నయ్య ఎంత అందంగా అందించారో! ఒకదానిని మంచిన ధర్మం ఒకటి అని ధర్మాన్ని చాటుతూ వాటన్నింటికంటె ఒక సత్యం పలకడం అనేది ఎంత శ్రేష్ఠమై నదో చాటి చెప్పాడు. విశ్వానికి శ్రేయస్సును కూర్చేదే కావ్యం. అది ఇలాంటి ధర్మాలను రుచిరార్థసూక్తిగా ఎంత బాగా అందించింది! మనమేమీ నూతులు, బావులు తవ్వించనక్కర లేదు. అయ్యో కొడుకులు లేరే అనే బెంగ అసలే అక్కరలేదు. నిజం... నిజం... నిజాన్ని పలకండి. పుణ్యాన్ని మూటకట్టు కోండి. మరెందుకాలస్యం.

అందరం సత్యమే పలుకుదాం! ధర్మాన్ని ఆచరిద్దాం!!

జై శ్రీమన్నారాయణ!

# "ప్రపన్న"

శ్రీమతి కరి తిరువేంగళమ్మ - విజయనగరం

ఈ రోజంతా మనస్సు చికాగ్గా ఉంది. ఆఫీసులో ఏవేవో సమస్యలు. చిన్నచిన్నవే అయినా, పరిష్కారం దిశగా అడుగు వేయడం జటిలమయిపోతోంది. ఇంటికి వెళ్ళి ఒక్కసారి ప్రపన్న ఒడిలో తలపెట్టుకొని పడుకుంటే మనసుకు ఏదో ఆక్సిజన్ అందినట్లు అవుతుంది. అది ఆమెలో ఉన్న శక్తా, లేక నేను ఆమెపై పెంచుకున్న మక్కువా అర్థం కావడం లేదు.

కాలింగ్‌బెల్లు మ్రోగగానే తలుపు తీసింది ప్రపన్న. ముఖాన మెరిసే చిరునవ్వు, శారీరక రుగ్మతలను పోగొట్టి, మనసుకు అంటిన దుమ్ము దులిపేస్తుందా అన్నట్లుంది. ముఖాన మెరిసే నిలువుబొట్టు విజ్ఞానాన్ని అందిస్తుందా అన్నట్లుగా ఉన్నది. అబ్బురంగా అపురూపంగా చూసుకున్నాను ప్రపన్నని.

"ఏమిటండీ ఏదో వింత విషయం, ఇప్పుడే తెలుసు కున్నట్లు ముఖం పెట్టేరు" అంటోంది ప్రపన్న కళ్ళింత చేసుకొని. ఏమిటో ఈ ప్రపన్న నాకసలర్థమవడంలేదు. తానూ ఒక బాధ్యతాయుతమైన ఉద్యోగం చేస్తోంది. గృహిణిగా తనవంతు కర్తవ్యాన్ని చక్కగా నిర్వహిస్తోంది. ఎప్పుడూ ఎవరో తనవెంట ఉండి దిశానిర్దేశం చేస్తున్నట్లు ప్రశాంతంగా ఉంటుంది.

"సరే కాని ప్రపన్నా ఒక రహస్యం నాకు చెప్పాలి. నువ్విన్ని బాధ్యతలూ నిర్వర్తిస్తూ ఇంత ప్రశాంతంగా ఎలా ఉంటావు? ఎప్పుడూ నీలో 'ఆదుర్దా'కాని, 'అసంతృప్తి'గాని నీలో కనపడదు. ఎప్పుడైనా నేను కసురుకున్నా, అమ్మ చికాకు పడ్డా నీముఖంలో ఏమాత్రం మార్పు కనిపించదు. నీకా తృప్తి కలగడానికి కారణం ఏమిటి?' అంటున్న నా వైపు మురిపెంగా చూస్తూ, 'రండి! రండి!! కాస్త కాఫీ త్రాగి రిలాక్స్ అయ్యాక బోలెడు కబుర్లు చెప్పుకోవచ్చు!' అంటూ ఇంట్లోకి నడిచింది ప్రపన్న. ఎప్పటికప్పుడు ఆ అమ్మాయి చిరునవ్వుతో మాట మార్చేసినా అదే సందేహం నా మనసును ఆక్రమించుకొనే ఉంది.

''అమ్మాయ్ ప్రపన్నా! నీ పతిదేవునితోపాటు ఈ సహోదరుని కూడా కాస్త ఉష్ణపానీయంతో తృప్తి పరచరా దటమ్మా!' అంటూ వడివడిగా అడుగులు వేస్తూ వచ్చాడు మాగోపి. వచ్చినంత వేగంగానూ ఏదో ఉద్బోధ మొదలు పెట్టేడు కాఫీ త్రాగుతూ. ఒరేయ్ వివేక్! నీ గురించి నాకర్థమవడం లేదురా! నువ్వు నాస్తికుడివా అంటే కాదు, ఏ దేవుడి కోవెల కనపడ్డా కాస్త తల ఎగరేసి దణ్ణం పెడతావు. మరి ఆస్తికుడివా అంటే, ఏవైనా దైవలీలలు చెబితే, అదే 'వినాయకుడు పాలు త్రాగేడు' అంటే హేళన చేస్తావు. అసలు నీ పద్ధతేమిటో నాకర్థమవడం లేదు. సరేలే, నీ పద్ధతికేమి కాని, ఈ వూళ్ళో ఆభాసానందస్వామివారు, వారం రోజులు అభిభాషణం చేస్తారట. వింటే నీకు శాంతి కలుగుతుంది, నేను బయలు దేరుతున్నాను. 'అమ్మా ప్రపన్నా! నువ్వుకూడా రారాదుటమ్మా!' అంటున్న గోపి మాటలకు అడ్డుపడుతూ, లేదన్నయ్యగారూ, ఇంకా పనిమనిషి రాలేదు. వంటకూడా పూర్తవలేదు. మరొకసారి వస్తాలెండి, మీరు వెళ్ళిరండి! అంటూ తన అనంగీకారాన్ని సున్నితంగా తెలియచేసింది ప్రపన్న.

సరే ఏమీ తోచడం లేదు కదా! అని గోపితో బయలు దేరేను. నాకు తెలుసు ప్రపన్న రాదని, ఒక్క 'శ్రీకాంతజీయర్' ప్రవచనానికి అయితేనే వెళ్తుంది. వారిని చూడగానే ఆమె ముఖంలో అనిర్వచనీయమైన ఆనందం తొణికిసలాడుతుంది. వేరెవరినీ విమర్శించదు. ఎవరిలోనూ లోపాలు నెంచదు. అందరినీ గౌరవిస్తుంది. కాని, ఆమె మనసు పురివిప్పిన నెమలి అవ్వాలి అంటే శ్రీకాంత జీయరు పదసన్నిధే ఉండాలి.

విశాలమైన మైదానంలో 'ఆభాసానందస్వామి' ప్రవచనం ప్రారంభమవబోతోంది. బహుపరాకులు, స్తోత్ర పాఠాలు, జరిగేక స్వామివారి ప్రవచనం ప్రారంభించారు. నామ సంకీర్తనము సర్వఫలప్రదం అంటూ అందరిచేత నామం చేయించారు. ''నారాయణ, గోవింద, వాసుదేవ, విష్ణో, మధుసూదన, దామోదర, హరే, మురారే" అంటూ భగవన్నామా లన్నింటినీ చెప్పి చెప్పించేరు.

ధ్యానం చేయండి, స్వామిని ధ్యానించండి అంటూ ఉద్బోధించారు. ప్రవచనం కాసేపు సాగేక, పరమాత్మ తత్త్వానికి, ఒక ఆకారం లేదు, ఒకపేరు లేదు, జ్ఞాన స్వరూపమంత! ఏదో వ్యవహారం సాగడానికే ఈ నామరూపాలు.

విగ్రహారాధన ప్రారంభదశలో ఉన్నవారు చేసేది అంటూ వివరణ ప్రారంభించారు. ఏమిటో నాకు బుర్రంతా బ్లాంక్ అయిపోయింది. వారు చేస్తున్నది వేరు, చెబుతున్నది వేరు. మనం ఏం చేయాలి? అర్థమవడంలేదు. అసలే నాకా విషయా లలో జ్ఞానం లేదు. నాలాంటి వారికి అయోమయాన్ని కలిగిస్తోంది ఉపన్యాసం. ఇంటికొచ్చేసరికి, అర్థ నిమీలిత నేత్రాలతో, రెండు చేతులలో రెండు చెక్కిళ్ళను ఆనించి, ఏదో ఒక అలౌకిక భావనలో ఉన్నట్లు టి.వి. వైపు చూస్తోంది ప్రపన్న.

ఒక్కసారి టి.వి. వైపు చూశాను. శ్రీకాంత జీయర్ వారి ప్రవచనం చివరికి వచ్చినట్లుంది.

"మనందరం భారతీయులం కదా! మనం వేదం చెప్పిన దానినే విశ్వసించాలి. వేదంలో ఒకభాగంలో చెప్పిన దానిని విశ్వసిస్తూ వేరొక భాగంలో చెప్పినది అబద్ధం అనకూడదు. పరస్పర విరుద్ధంగా మనకు కనబడ్డాయి అంటే ఏదో సమయంలో ఎక్కడో దీనికి సమన్వయం కనిపిస్తుంది. వాటి నన్నింటిని మనం పరిశోధన చేయలేకపోతే, పెద్దలు చెప్పిన మాటలను విశ్వసించి మూల తత్త్వమయిన శ్రీమన్నారాయణుని సేవిద్దాం, ధ్యానిద్దాం. రండి! ఇతర దైవాలనీ ఆదరిద్దాం! ఎవరిపైనా ద్వేషంవద్దు. మోక్షప్రదుడైన నారాయణుని ఆరాదిద్దాం. సర్వసుఖాలనూ స్వంతం చేసుకుందాం!" అంటూ ముగించారు.

ఎప్పుడూ ప్రవచనాలు వినని నాకు, ఏదో స్పష్టంగా తెలిసినట్లు అనిపించింది. ఆ స్వామిని చూస్తూ ఉంటే చిన్నప్పుడు శ్రీరామనవమికి, మా ఊరికోవెలలో వేం దర్శించే శ్రీరామచంద్రుని విగ్రహం ప్రాణం వచ్చి కదలి వచ్చిందా! అనిపించింది. ఆ స్వామి కన్నులలో ఉన్న కాంతి, ఈయన చెప్పినది తప్పక నమ్మాలి అనిపించేలా చేస్తోంది. ఏమిటో, అప్పుడప్పుడు టి.విలో ఈ స్వామివారు కనిపిస్తున్నారు కాని, ఎప్పుడూ ఇంత పరిశీలనగా చూడలేదు. ప్రపన్నకున్న లక్షణమేదో నాకు సంక్రమిస్తోందా! అనిపిస్తోంది.

ఆ రోజు స్కూలు నుండి వస్తూనే వడలిపోయి వచ్చాడు మా అబ్బాయి ఆనంద్. చూస్తే ఒళ్ళు కాలిపోతోంది. అదేమి జ్వరమో పదిరోజులైనా మార్పులేదు. స్కానింగ్‌లు, రకరకాలైన పరీక్షలు, చేస్తూనే ఉన్నారు. మందులు వాడుతూనే ఉన్నాం. పరిస్థితి మారడంలేదు. నాకు కంగారు ఎక్కువయి పోతోంది.

ప్రపన్న పరిస్థితి విచిత్రంగా ఉన్నది. చేయవలసిన సేవలన్నీ చేస్తోంది. మందులు శ్రద్ధగా వేస్తోంది. మళ్ళీ నవ్వుతూ నవ్విస్తూ గడుపుతోంది. ఒకసారి చిన్నికృష్ణుని విగ్రహంవైపూ, ఒకసారి స్వామివారి ఫొటో వైపు కళ్ళు విచ్చి చూచి ఏదో పెదవులు కదిలిస్తుంది. అంతే, ఎంతో ధైర్యంగా తిరుగుతోంది.

నాకు పిచ్చికోపం వస్తోంది ఈ ప్రపన్నను చూస్తే. ఏమిటో గొప్ప! పెద్ద జ్ఞానిలా ఫోజు పెడుతోంది. అనిపించింది. "ఏయ్ ప్రపన్నా! ఏమిటసలు నీ పద్ధతి?" అంటూ నిలదీసానారోజు. అబ్బాయి గురించి నీకు బాధ్యత ఉందా లేదా? అంటూ గట్టిగా ప్రశ్నించాను. ఒక విచిత్రమైన నవ్వు నవ్వింది. "ఉంది, కాని మనం చేయగలిగింది బాగా తక్కువ కదా!, నిజం తెలిసాక మరి బెంగపెట్టుకొని ఏం ప్రయోజనం?

మనం స్వామివారిని నమ్మి ఉన్నాం కనుక మనకు అన్యాయం జరగదు. కంగారు పడకండి! అంటూ ధైర్యాన్ని నూరిపోస్తోంది.

నిద్రలో నుండి లేచిన బాబు! 'అమ్మా! ఆకలి' అన్నాడు. అమ్మయ్య ఎన్నిరోజులకు ఆకలి తెలిసింది నా చిట్టితండ్రికి, లేడిలా లేచి ఆరెంజ్‌జ్యూస్ అందించింది ప్రపన్న.

అబ్బ కొంచెం మనసు దిటవు అయిందేమో మాటలు మొదలుపెట్టేను. "ఎన్నాళ్ళుగానో నాలో నిక్షిప్తమై ఉన్న సందేహాన్ని నివృత్తి చేసుకోవాలనుకున్నాను. ప్రపన్నా ఆ రోజు మన పెళ్ళిచూపులు. బంగారురంగుచీరలో చూడచక్కని సౌందర్యంతో మెరిసిపోతున్నావు. నీగొంతు వినాలని మా అమ్మ చేసిన ప్రయత్నం. "నీ పేరేమిటమ్మా?" అనే ప్రశ్న. వీణావాదనం చెవిలో మారుమ్రోగింది. "ప్రపన్న" అన్నమూడక్షరాలు మురిపెంగా వినిపించాయి. "ప్రసన్న" అయి ఉంటుంది. నేను పొరపాటుగా విన్నానేమో అనుకున్నాను. కాని తరువాత మీవాళ్ళందరూ "ప్రపన్నా, ప్రపన్నా" అని పిలుస్తూంటే అదే నీపేరు అనుకున్నాను. కాని ఇప్పటికీ నా సందేహం తీరనే లేదు. "ప్రపన్న " అనే పదానికి అర్థమున్నదా? ఉంటే ఏమిటో చెప్పు" అన్నాను ప్రశాంతంగా.

మందహాసంతో చెప్పడం మొదలు పెట్టింది ప్రపన్న. మా అమ్మ నెలలు నిండి ఉన్నప్పుడు మా ఊరికి శ్రీకాంత జీయరుస్వామి వేంచేసారట. అప్పుడు మా నాన్నగారు వెళ్ళి సేవించినపుడు వారు శరణాగతి గొప్పతనాన్ని ఉపదేశించారట. ఈకలు రాని పక్షులు ఎలాగైతే తల్లిపైనే ఆధారపడి ఉంటాయో, ఆ విధంగానే భగవంతునిపైనే మన భారాన్ని ఉంచి నిలువ గలిగితే అదే శరణాగతి, దానినే ప్రపత్తి అంటారు. ప్రపత్తి చేసినవారు ప్రపన్నుడు. ఆఖరి పిల్లవానిపై తల్లికి ఉండే ప్రేమ ఈ ప్రపన్నునిపై భగవానుని కుంటుంది" అని చెప్పారు. మా నాన్నగారు ప్రభావితులై ఆ స్వామివారి వద్ద మంత్రోపదేశాన్ని పొందారు. ఆ మధురఘట్టానికి గుర్తుగా నాకు "ప్రపన్న" అని పేరు పెట్టుకున్నారట" అంటూ తృప్తిగా చెప్పింది ప్రపన్న. ఘంటశాలగాత్రంతో దేశంలో మారుమ్రోగిన భగవద్గీత ప్రక్క వారింటిలో నుండి వినిపిస్తోంది.

**'సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ ।**
**అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచః ॥**

నవ్వుతూ నావైపు చూచి, చేతులు చాపుతున్న అబ్బాయి చేతులు ప్రపన్న చేతులు కలిపి ఒక్కసారి నమస్కరిస్తూ బయటకే అనేసాను **'మాశుచః'** 'ఏడవ వద్దు' అన్నాడు కృష్ణుడు. మరి ఏడుపే వద్దు, ఆనంద సంద్రంలో ఓలలాడుదాం అంటూ...!

నారాయణముని కథలు - 2

# దానమహిమ

- శ్రీశ్రీశ్రీ అహోబిల రామానుజ జీయర్ స్వామివారు

ఆచార్యులంటే ఆచరించి చూపువారని అర్థము. సకల వేదసారమైన ఆ నారాయణుడు ఈ విశ్వమంతా వ్యాపించిన వాడని దర్శించగలిగే మహానుభావులే ఆచార్యులు. తాము పెద్దల ద్వారా సంపాదించిన జ్ఞానసంపదను అందరికీ అందించే ఉదారులు. వారికి లౌకికమైన సంపదలపై ఆశయేమి కనుక. అటువంటి మహిమాన్వితుల ఔదార్యాన్ని తెలుసుకుందాం!

అదుగో జ్ఞానభాస్కరుడు నారాయణముని! లోకంలోని సూర్యుడు బయటి చీకట్లని పారద్రోలితే, ఈ జ్ఞానభాస్కరుడు లోపల బయట అలముకున్న చీకట్లను తొలగించు అద్వితీయ తేజోరాశి. వీరివద్ద జ్ఞానాన్ని పొందుతున్న శిష్యులు ఆచార్య సేవగా తాము భిక్షాటన చేసిన ద్రవ్యాన్ని రోజూలాగానే ఆచార్యుని సన్నిధిలో సమర్పించారు. నారాయణముని ఆ భిక్షను భగవంతునికి చూపి, దానిని రెండు భాగాలుగా చేసారు. ఒక భాగాన్ని అడవిలో ఉండే గిరిజనులకు, పక్షులకు, జంతువులకు అనుగ్రహించారు. రెండవ భాగాన్ని శిష్యులందరికీ పంచారు. ప్రతిరోజు శిష్యులు భిక్షను తీసుకురావడం, దానిని గురువుగారు ఈ విధంగా అందించడం ఆశ్చర్యం కలిగించింది ముని కుమారుడికి. దీనిని గమనించిన నారాయణముని 'ఏమోయ్ ఏమి నీ సందేహం?' అని అడిగారు.

**మునికుమారుడు:** ఏమీలేదు ఆచార్య ! కష్టపడి ఇందరం శిష్యులం ఈ అడవిలో తిరిగితెచ్చిన కందమూలఫలాలను మనం ఆరగించి సుఖంగా ఉండక ఈ గిరిజనులకు, పశుపక్ష్యాదులకు ఎందుకు దానం చేస్తున్నారా?...అని.

**నారాయణముని:** నవ్వుతూ! నిన్నొక ప్రశ్న అడుగుతా చెప్పవోయ్! కొందరికి భగవంతుడు అవసరానికన్నా ఎక్కువ సంపదలు ఎందుకు ఇస్తాడు?

**మునికుమారుడు:** (తడుముకోకుండా) ఇంకెందుకు? దాచుకోవడానికే..

**నారాయణముని:** కాదు నాయనా ! భగవంతుడు ఏమి చేసినా ఆకార్యంలో ఒక ఆంతర్యం ఉంటుంది. ఇందులోనూ అంతే! అది ఎవరు గుర్తిస్తారో వారికే మరిన్ని సంపదలు– గుర్తించనివాడికి మరి అవకాశంలేదు, సంపదను ఆర్జించడానికి.

అవసరానికి మించి శక్తిఉంటే బలహీనులకై వాడాలి. అలాగే అవసరానికి మించి సంపద ఉంటే ఆసంపదలు లేనివారికి చేయూత నివ్వాలి. అలా చేసిన వారిని సకల సంపదలు వరిస్తాయి. అలా సద్వినియోగం చేయకపోతే అవి వాడిని వీడి అదృశ్యమౌతాయి.

**మునికుమారుడు:** ఆచార్యా! దానం చేస్తూపోతే కొండలు కూడా కరుగుతాయంటారు కదా! ఆ దానాల వల్ల మనకేం ప్రయోజనం?

**నారాయణముని:** సరే, మీ అందరికీ ఒక కథ చెబుతాను వినండి. *(శిష్యులందరూ గురువుగారి చుట్టూచేరారు)*

అనగనగా ఒక పెద్దరాజ్యం. ఆ దేశపురాజు విష్ణువర్మ. ఆ రాజు ప్రజలందరినీ కన్నబిడ్డలవలె పరిపాలిస్తున్నాడు. ఆ రాజుకు అన్ని సౌఖ్యాలు ఉన్నాయి. కానీ, సంతానమే లేదు. 'పుణ్యంకొద్దీ పురుషుడు, దానంకొద్దీ బిడ్డ' అన్నట్లు ఆరాజు సంతానం కోసం ఎన్నో దాన, ధర్మాలు చేసాడు. ఇలా ఉండగా ఒక తపస్సంపన్నుడైన మహర్షి శరీర పోషణకై మక్కువచూపక తనకు లభించిన ఆహారాన్ని పశుపక్ష్యాదులకు సమర్పించి, కొంతమాత్రం తను స్వీకరించేవాడు. అరణ్యంలో నివసించే ఆ మహర్షి, ఆ దేశపు రాజైన విష్ణువర్మ యోగక్షేమాలు తెలుసు కోవడానికి పయనమయ్యాడు.

ఆనాటి రాత్రి దారితెలియని చీకట్లో పయనం. ఆ అరణ్యంలో ఒక కిరాతుడు ఈ మహర్షిని చూచి.. 'ఓ బాపనా! ఈ దారిలో ఈ సమయంలో నడక అంత మంచిదికాదు. ఈ చెట్టుపై నా నివాసము నీకు అభ్యంతరం లేకపోతే ఆ మంచెపై విశ్రాంతి తీసుకో!'మ్మని అతిథిగా వచ్చిన మహర్షికి ఫలాదులు సమర్పించాడు.

'నీమంచె నాకిస్తే నువ్వెక్కడ విశ్రాంతి తీసుకుంటావ్?' అని మహర్షి అడగగా, 'అయ్యో బాపనా! నేను పడుకుంటే రేపటికి నాకు బువ్వ ఎవడిస్తాడు! నాపని నాదే' అన్నాడు. ఆ మహర్షి ఆ మంచెపై విశ్రాంతి తీసుకుని తెల్లవారుఝామున లేచిచూడగా కిరాతుడు కనిపించలేదు.

అక్కడినుండి ఆ మహర్షి కొంతదూరం ప్రయాణించి ఒక సరస్సున స్నాన సంధ్యాదులు ఆచరించి, ఒక విశాలమైన పెద్దవృక్షం నీడన కూర్చుని సేదతీరాడు. ఆవృక్షం మహర్షి సన్నిధిలో ఒక ఫలాన్ని జారవిడచింది. దాన్ని చూచిన మహర్షి **"రిక్తహస్తేన నోపేయాత్"** అన్నట్లు రాజు, బ్రాహ్మణుడు, రోగి ఇలాంటి వారి వద్దకు ఉత్తచేతులతో వెళ్ళకూడదని ఈ వృక్షం నాకు ఫలాన్ని సమర్పించింది అని సంతోషంతో రాజసభకు వేంచేసాడు.

విచ్చేసిన మహర్షిని రాజు సాదరంగా ఆహ్వానించి సత్కరించాడు. రాజుయొక్క ధర్మనిష్ఠకు సంతసించిన మహర్షి

రాజుగారి అభీష్టాన్ని తెలుసుకుని "ఓ రాజా! మీ దంపతులకు సంతానము కలుగుగాక" అని బ్రహ్మవాక్కుతో ఆశీర్వదించి ఫలాన్ని మహారాణికి అందించారు. సంతోషించిన రాజు "ఓ మహర్షి! మాకు సంతానము కలిగే సమయానికి మీరు తప్పక విచ్చేయ వలెనని ప్రార్థించాడు". మహర్షి అనుగ్రహించిన ఆ ఫలప్రభావముచే ఆ రాణి గర్భవతి అయినది. పదవమాసమున బ్రహ్మతేజస్సుతో విరాజిల్లే శిశువు జన్మించాడు. వారి ఆనందానికి అవధులు లేవు. ఇంతలో రానేవచ్చారు ఆ మహర్షి. విష్ణువర్మ కుమారుని ఆశీర్వదించడానికి ఊయల వద్దకు సమీపించారు మహర్షి. ఆ పిల్లవాడిని చూచాడు. ఇంతలో ఒక విచిత్రం. అందరూ చూస్తూండగా ఆ శిశువు "ఓ మహర్షే అభివాదములు" అని మాట్లాడటం ఆరంభించాడు. మహర్షి ఆశ్చరముతో ! 'ఔరా.... ఎవరవురా బుడతా నీవు?' అని ప్రశ్నించారు.

'హే! మహర్షీ! నన్ను గుర్తించలేదా! ఒకనాడు అరణ్యంలో నీకు వసతినిచ్చిన కిరాతుడను. ఆ రోజు మీకు ఫలములనిచ్చి సంతోష పెట్టాను. అది పుణ్యమని భావించక, తెలియక చేసిన ఆ **దానము** నాకు కిరాత జన్మనుండి విముక్తి కలిగించింది. విష్ణుభక్తుడు, భాగవతోత్తముడైన విష్ణువర్మ మహారాజు కుమారునిగా ఉత్తమజన్మ లభించింది. ఇదంతా మీవంటి సత్పురుషుల సాంగత్య ప్రభావమే. నన్ను అనుగ్రహించండి' అని ప్రార్థించాడు. సత్పురుషుల సందర్శనం వలన, సకల తీర్థాలలో స్నానమాడిన ఫలం లభిస్తుంది.

'ఆనాటి ఉదయం నువ్వు నాకు కనపడకుండా ఎటు వెళ్ళావు? ఇది ఎలా జరిగింది?' అని మహర్షి ప్రశ్నించాడు ఆ శిశువును. 'ఓ మహర్షి! ఆనాటివరకే బ్రహ్మ నాకురాసిన ఆయుష్షు. ఘోరనరకములలో ప్రవేశించవలసిన నాకు అనుకోకుండా మీ సందర్శనభాగ్యం కలిగింది. మీయెడల తెలియక చేసిన ఆ ఉపచారము ఇదివరలో నేను చేసిన నా అపచారములను కాల్చి బూడిద చేసినది. ఆరోజు జంతువులకై కాపు కాచిన నేను ఒక పులిబారిన పడ్డాను.

ఆ తరువాత ఈ దానమహిమ వలన యమదూతలు నన్ను నరకానికి తీసుకుపోక పోయిరి. నేను మీకు చేసిన ఆతిథ్యానికి సంతసించిన భగవంతుడు ఈ జన్మను అనుగ్రహిస్తు న్నాడని దేవతలంతా అనుకొనగా విన్నాను. దానమువల్ల కలిగే మాహాత్మ్యాన్ని గుర్తించాను. ఓ మహానుభావా! ఇదంతా మీ అనుగ్రహమే!' ఈ సంవాదము విన్న సభలోనివారందరూ ఓహో! దానమునకు ఇంత మహిమా! ఎంత విలువ! అని ఆనందించి ధార్మికులైయ్యారు.

ఆ కథ విన్న మునికుమారుడు "ఆచార్యా! ఆ కిరాతుడు తనవద్దనున్న ఫలాలను దానం చేస్తే అంత గొప్ప రాజకుమారుడుగా ఎలా పుట్టాడు?"

**నారాయణముని:** చక్కని ప్రశ్నవేశావు. నైపుణ్యం కలవానికే కదా! ప్రభువులు ఉన్నత అధికారాలను ఇచ్చేది. అలాగే తనకు ఉన్నంతలో దానం చేసాడు ఆ కిరాతుడు. అందులోను విశేషించి మహర్షికి చేసాడు. ఏ మాత్రం దయలేనివాడు ఆ కిరాతుడు. నెత్తురు త్రాగేవాడు. అంత చెడ్డస్వభావం కలవాడైనా, మహర్షి సందర్శన ప్రభావం చేత వీనికి దానం చేయాలనే మంచిబుద్ధి పుట్టింది. వీడి ధర్మనిరతికి మెచ్చాడు భగవంతుడు. తనకోసం దాచుకున్న ఫలములనే దానం చేసాడంటే, ఇంతకంటే గొప్పజన్మను కలిగించి మహదైశ్వర్యాన్ని కలిగిస్తే ఇంకా ఇంకా దానాలు చేసి తద్వారా తనని పొందుతాడని భగవంతుని ఆశ. లభించిన ఐశ్వర్యాన్ని సద్వినియోగం చేసుకుంటే తరిస్తాము. ఉన్నవాడిని చూచి ఓర్వలేక దుఃఖించుట కన్నా ఉన్నంతలో దానం చెయ్యాలి. పత్రం, పుష్పం, ఫలం, తోయం ఏదైనా సరే మనశక్త్యానుసారం తోటిప్రాణికై ప్రేమతో సేవచేయాలి. కేవలం మానవులనే కాదు మాధవసేవగా సర్వప్రాణి సేవగా మనవంతు సేవను అందించాలి. ఇదే మనలక్ష్యం కావాలి.

**మునికుమారుడు:** ఔను స్వామీ! దానంచేస్తే మంచి గుర్తింపు వస్తుంది. అబ్బో ఎందరు మెచ్చుకుంటారో!

**నారాయణముని:** నాయనా అది పొరపాటు. మనం దానం అని అనకూడదు. సేవ అనాలి. ఎవడో ఒకడు చెట్టుకొమ్మను కొట్టి అలసిపోయి, భోజనం చేసి విశ్రాంతికై ఆచెట్టుక్రిందనే చేరాడు. నాకొమ్మలు నరికావు కనక నీకు నీడను ఇవ్వను అనదు ఆచెట్టు.

నిద్రించినవాడు లేచాక తనని నరకుతాడని తెలిసినా, వాడు నిద్రించే సమయంలో, తనపై పూచిన పుష్పాల సువాసనలతో సుఖమారుతాన్ని వాడికి అందిస్తుంది. ఏమి ఆ క్షమాగుణము! ఏమి ఆ దాతృత్వము! ఇన్ని ఉపకారాలను చేస్తూ ఎన్నో ఫలాలని అందిస్తూ పేరు ప్రఖ్యాతలు కోరదే ఆ వృక్షము.

ఒక వృక్షమే కాదు, ఈ ప్రకృతి మననుండి ఏ ప్రతిఫలాన్నీ ఆశించకుండా ఎన్నోరకాల సేవలను మనకందిస్తుంది. కేవలం మనస్సు ఉన్న ఈ మానవుడే ప్రతిఫలాన్ని ఆశిస్తాడు.

**మునికుమారుడు -** గురువర్యా! చాలా చక్కగా మాకు బుద్ధి చెప్పారు. మా తప్పు తెలుసుకున్నాము. మమ్మల్ని క్షమించండి. **దానము** వెనుక ఇంత మహిమ ఉన్నదని ఇప్పుడే మాకు తెలిసింది. ఇకనుండి మాధవసేవగా సర్వప్రాణిసేవ మేమూ చేస్తామంటూ శిష్యులందరూ ఆనందంతో ఆచార్యుల శ్రీపాదా లను సేవించి **శంనోమిత్రశ్శం వరుణః** అంటూ తమ వేదాధ్యయనం ప్రారంభించారు.

గీతా మహాత్మ్య కథలు-4

# అప్సరసలు

నోలేటి రామకృష్ణమాచార్యులు

గతనెల మూడవ అధ్యాయంలో కర్మయోగ ప్రాశస్త్యాన్ని **కాలక్షేపం** అనే కథ మనకి వివరించింది. జీవులు కర్మ చేయకుండా ఒక్క క్షణం కూడా ఈలోకంలో జీవించలేరు. కాని, అదే కర్మను భగవంతుడు చెప్పిన మార్గంలో కనుక చేసినట్లయితే అది మానవుడు ఉజ్జీవించడానికి తోడ్పడుతుంది.

భగవద్గీత నాల్గవ అధ్యాయం **జ్ఞానయోగం.** ఇది ఒక అద్భుతమైన అధ్యాయం. భగవంతుడు తన స్వరూపాన్ని బహిర్గతం చేసింది ఈ అధ్యాయం నుండే.

ఈ అధ్యాయంలో తన అవతార రహస్య జ్ఞానమును వివరముగా తెలియజేయుట వలన ఈ అధ్యాయానికి జ్ఞానయోగమన్న పేరు సార్థకమయ్యింది. కర్మయోగమనే అధ్యాయానికి తరువాత ఈ అధ్యాయం ఉండటంవలన, కర్మలన్నీ భక్తి ఆధారముగా చేసుకొనవలసినదేనన్న జ్ఞానము యొక్క బీజాంకురం ఈ అధ్యాయంలోనే పడింది.

అజ్ఞానంతో చేసే కామ్యకర్మలు జీవుడిని ఈ ప్రకృతిలో బంధిస్తూండగా, ఫలాపేక్ష రహితముగా చేసే కర్మలు జీవునికి ఎట్టి బంధమును కలిగించుట లేదని నొక్కి చెప్పిన అధ్యాయము ఇదే. జ్ఞానముతో కూడి చేసే కర్మలు మోక్షసాధనాలు అవడం వలన, జ్ఞానము యొక్క చరమ బిందువు పరమాత్మే అని సాధకునికి అర్థం అయ్యేది ఇక్కడే. ఈ జ్ఞానయోగమనే అధ్యాయంలోనే శ్రీకృష్ణభగవానుడు తాను సనాతనుడనన్న విషయాన్ని చెప్పి అర్జునుణ్ణి ఆశ్చర్యచకితుణ్ణి చేశాడు.

అన్నింటికన్న ముఖ్యంగా ఎన్ని రకాలైన యజ్ఞాలతో పరమాత్మను అర్చించవచ్చో చెప్పి, కర్మలేవైనా అవి భగవత్పరంగా చేస్తూపోతే అన్నీ యజ్ఞాలే అన్న రహస్యం ఈ అధ్యాయంలో చెప్ప బడింది. జ్ఞానులైన ఆచార్యులను ఆశ్రయించనిదే జ్ఞానసముపార్జనను సాధించలేమని కూడా ఈ అధ్యాయములో చెప్పబడింది. ఈ అధ్యాయంలో జనాన్ని నౌకయని, అగ్నియని, ఖడ్గమని అనేక ఉపమానములతో ఉత్కృష్టముగా చెప్పబడినది.

ఈ జ్ఞానయోగానికి సంబంధించిన గీతామహాత్మ్య కథలలో భరతుడను మహనీయుడు కలడు. ఆతని యొక్క గొప్పతనమును ఈ క్రింది శ్లోకములో వివరింపబడింది.

**నిత్యమాత్మరతస్తుర్యం, జపత్యధ్యాయ మాదరాత్ ।**
**తదభ్యాసాద దుష్టాత్మా, నద్వంద్వై రభిభూయతే ॥**

జ్ఞానయోగి నిత్యము ప్రీతితో మంత్రాన్ని జపిస్తూ ఉంటాడు. సాధన అనుష్ఠానాలతో తన స్వభావానికి ఏ దోషము అంటకుండా చూసుకుంటాడు. ఎటువంటి సుఖ–దుఃఖ, రాగ–ద్వేషాది ద్వంద్వాలకూ లొంగడు.

అటువంటి మహానుభావుడు భరతుడు. ఈతడు కాశీనగరవాసి. నిత్య ఆత్మచింతనా తత్పరుడు. అనునిత్యం భగవద్గీత చతుర్థాధ్యాయ పారాయణారతుడు. అందువలన ఆతని అంతరంగమంతా శుద్ధమై పరమ పవిత్రుడైనాడు. ఆతడు సుఖ దుఃఖ, శీతోష్ణ, రాగద్వేషాది ద్వంద్వాలకు అతీతుడైనాడు.

ఒకనాడు ఆతనికి దివ్యమునుల సందర్శనం చేయాలని కోరికతో హిమాలయాలకు పయనమయ్యాడు. ప్రయాణ బడలికతో ఉన్న అతనికి మార్గమధ్యంలో రెండు బదరికా వృక్షములు (రేగిచెట్లు) కనబడ్డాయి. ఆ రెండుచెట్ల మధ్య ఉన్న నీడలో కాసేపు పడుకుని సేదతీరాడు. కాసేపటికి లేచి తన మాధ్యాహ్నిక సంధ్యావందనాదులు ముగించుకుని, తన అలవాటు ప్రకారము, భక్తితో భగవద్గీతలోని నాల్గవ అధ్యాయాన్ని పారాయణ చేసి వెళ్లిపోయాడు.

ఆ తర్వాత కొద్ది రోజులకు ఆ రెండు బదరికా వృక్షాలు ఎండిపోయి, మరణించాయి. ఆ రెండు వృక్షములలోని జీవులు, ఇద్దరు చక్కని బాలికలుగా ఉద్ధరింపబడి, ఒక బ్రాహ్మణ కుటుంబంలో జన్మించడమే కాక వారు తమ పూర్వజ్ఞానాన్ని కూడా కలిగియున్నారు. ఆ బాలికలకు ఏడు సంవత్సరాలు నిండిన పిదప కొన్నిరోజులకు ఆ గ్రామానికి వచ్చిన ఆ భరతమునిని వారిద్దరు గుర్తించారు. ఆ బాలికలిద్దరూ పరమ వినమ్రులై ఆ మహానుభావునికి నమస్కరించి "మహాత్మా ! మేము

మీ దయవలన మా బదరికావృక్ష రూపాలను పోగొట్టుకొని, నేటికి మానవజన్మను పొందగలిగాం. మీకు మేము సర్వదా కృతజ్ఞులం" అన్నారు.

భరతముని ఆశ్చర్యపడ్డాడు. 'నా వల్లా? ఎలా?' అన్నాడు.

ఆ బాలికలిద్దరూ ఇలా చెప్పడం మొదలుపెట్టారు.

మహాత్మా! పూర్వము గోదావరీనదీతీరంలో సత్యతపుడనే మునీశ్వరుడు ఘోరంగా తపస్సు చేసేవాడు. ఆతడు తన తీరిక వేళలలో చేసే శాస్త్ర వ్యాఖ్యానాలు వినడానికి, సాక్షాత్తు బ్రహ్మదేవుడే వచ్చి వినేవాడట. అంత ఈ మహానుభావుడైన సత్యతపుణ్ణి చూసి ఇంద్రుడు భయపడ్డాడు. ఆతని తపోభంగం చేయ్యమని అప్సరసల మైన మా ఇద్దరినీ ఆజ్ఞాపించాడు. అక్కడికి వెళ్లి ఆ మహానుభావుణ్ణి మామార్గంలోకి త్రిప్పడానికి మృదంగ ధ్వనులలో, వేణుగానాలతో, నృత్యభంగిమలతో, పరమ వయ్యారంగా అనేక కామవికారపు చేష్టలతో నృత్యం చేస్తూ మావిశ్వప్రయత్నంచేశాం. కాని నిర్వికారచిత్తుడైన ఆ మహాముని ఏమాత్రం చలించక, "మీరు నేటినుండి బదరికావృక్షములై పడియుండండి" అని శపించాడు. మేము ఆ స్వామి చరణాలపై వ్రాలి అతిదీనంగా "స్వామీ! ఇది ఇంద్రాజ్ఞచే కర్తవ్యమను భావనతో చేసినది కాని, ఇందు మా కర్తృత్వమేమియు లేదు. రక్షించండి. లేదా కనీసం శాపవిమోచనం అనుగ్రహించండి" అని ప్రాథేయపడ్డాం. అందుకు ఆ మునీశ్వరుడు కరుణాంత రంగుడై "సరే! కొంతకాలానికి మీ వృక్షాల క్రిందనీడలో భరతుడనే ముని సేదతీరతారు. ఆ తరువాత మీరు బ్రాహ్మణ బాలికలై జన్మిస్తారు. ఆ సమయంనుండి మీకు పూర్వజన్మల జ్ఞానాన్ని కలిగి యుంటారు" అని శాపవిమోచననమును చెప్పారు. "అందు వలన మహాత్మా మీవలన మాశాపవిమోచనం అయ్యింది" అని తెలియజేశారు. ఆ మాటలువిని భరతుడు సంతోషించి, వారిద్దరినీ దీవించి, భగవద్గీతలోని నాలుగవ అధ్యాయాన్ని ఉపదేశించి వెళ్ళిపోయాడు.

ఆ తరువాత ఆ బ్రాహ్మణ కన్యలిద్దరు ఆమహానుభావుని అనుగ్రహంతో భగవద్గీతలోని నాల్గవ అధ్యాయమును నిత్యము భక్తితో పఠించి మోక్షాన్ని పొందారు.

శ్రీవిష్ణుమూర్తి లక్ష్మీదేవికి చెప్పిన పద్మపురాణాంతర్గతమైన ఈకథను పార్వతీదేవికి శంకరుడు వివరించాడు. ఈ అధ్యాయాన్ని ప్రతినిత్యం అధ్యయన, పారాయణ చేసినవారు మోక్షాన్ని పొందుతారు.

## శ్రీశ్రీశ్రీ స్వామివారి పర్యటన వివరములు

**OCTOBER**

| Date | Place | Program | Contact | Phone |
|---|---|---|---|---|
| 3rd | Plain field | Sri Ramayatra | Terbenie Ghooray | 317-839-6455 |
| | Louisville, | Sri Ramayatra | Padma Lellapalli | 502-644-4922 |
| 4th | Louisville, | ThirthaGoshti | | |
| | Nashville | Rahasyas from Sriramayana | Janaki-Ashok | 615-365-3018 |
| | | | Prasanthi | 615-216-1459 |
| | | | Madhavi | 931-446-0325 |
| 5th | Birmingham | Srinivasa pooja | Dr. Rao/Saraswathi Vallabhaneni | 205-356-7170 |
| | | | | 205-944-0870 |
| 6-9th | Atlanta | Vijayadasami Celebrations | Prapoorna, Ravi Gourisetti | 678-559-6592 |
| | | Prajna Orientation | | |
| 11th | Seattle | Aradhana&Thirthagoshti | Srikanth Boinapally | 425-463-8370 |
| | | | Mala Polisetty | 571-249-7526 |
| | | Discourse on Sriramayana&Sriramapuja | Krishnakanth | 972-935-8955 |
| | | | Arvind Swamy | 571-249-7256 |
| 12th | Seattle | Aradhana&Thirthagoshti | | |
| | Portland (Evening) | Discourse on Sriramayana&Sriramapuja | Sirisha Dr. Ram Madhavarapu | 503-213-4621 |
| 13th | Portland (Morning) | Sudarshana Homam, Aradhana&Thirthagoshti | | |
| | Sanfrancisco (Evening) | Volunteer Meeting, Prajna Orientation | Vamsi Mudumba | 408-506-1303 |
| 19th | Morning Sanfrancisco | | | |
| | Evening Los Angeles | Sriramayana, Sriramapooja | Prasad Putta | 818-422-4329 |
| | | | Jagannadhacharya Swami | 720-431-9627 |
| | | | Narasimhacharya Swami | 494-679-7836 |
| 21st | Evening | Phoenix Volunteer Meeting, | Ram Mohan Kanuganti | 201-658-7005 |
| 23th | Evening | Houston | Astalakshmi Temple | 281-498-2344 |

**Oct 23rd to Nov 2nd** Houston
26th to 31st **DEEPAVALI CELEBRATIONS**
Thirunakshetram, Jeeyar Award & Sahasra Kalasabhishekam



# దివ్యసాకేతంలో.........

శ్రీమాన్ రఘుదత్తాచార్యులు - ప్రధానార్చకులు

**జై శ్రీమన్నారాయణ !**

సాధారణంగా లోకంలో భగవంతుడిని సేవించవలెనన్న మనకు సౌలభ్యమైన ఆలయాలయందు దర్శిస్తూ ఆనదిస్తాం. కాని దేశకాల, వ్యక్తియొక్క స్థితిగతులను బట్టి అందరికీ అన్ని వేళల యందు భగవద్దర్శనమును పొందలేరు. మరి అట్టి వారికి పరమపురుషుని దర్శన కాంక్ష తీరవలెనన్న మార్గం ఏమిటి? అంటే దీనికి పాంచరాత్ర ఆగమ సంహితలు చక్కని ఉపాయాన్ని చెబుతున్నాయి. ఆలయంలో ఉండే మూలమూర్తితో పాటుగా మరో మూడుస్థానాలు సాక్షాత్ భగవత్స్వరూపములై విరాజిల్లు తుంటాయి.

**ప్రతిమాచైవ తత్పారం ప్రాసాదోగర్భమందిరమ్ ।**
**విగ్రహో దేవదేవస్య చతుష్టయమిదం సమమ్ ॥**
**సమోభవేత్తేషు శక్తిః సమాధిశ్చ సమోభవేత్ ॥**

1) మూలమూర్తితో పాటు ఉండే కర్మార్చ, ఉత్సవ, స్నాన, బలి, యాత్రా, శయనార్చ అనబడు 6 బేరములు, 2) వాటికి గల యోగపీఠములు 3) విమానము, శిఖర ప్రాకారములు. 4) స్వామికి ఆవాసమగు గర్భగృహము. ఇవి 4 భగవంతునివలె సమాన శక్తి, వైభవం కలిగి ఉంటాయి. అందుకే మన దివ్యదేశములయందు పెరుమాళ్ళకే కాక విమానములు కూడా తిరునామములు, తిరువారాధనలు కలిగి ఉంటాయి.

సాక్షాత్ భగవన్మయములు కాబట్టే ప్రతిష్ఠాదుల యందు విగ్రహములతో పాటుగా ఆలయ విమానశిఖరములకు కూడా ఛాయాధివాసములు, మరమ్మత్తులు జరపవలసి వస్తే ప్రాయశ్చిత్తములను శాస్త్రరీతిగా జరుపుతుంటారు. ఈ సంగతి తెలియనివారే మూర్ఖత్వంతో భగవంతుని యొక్కప్రాసాదాలను, మండపాలను తొలగిస్తూ భగవదపచారాన్ని చేస్తుంటారు. ఇట్టి వైభవము కలిగినవి కాబట్టే పురాణేతిహాసాలు ఆయా క్షేత్ర మందిరములను అత్యంతాతిశయాన వేనోళ్ళ కీర్తిస్తుంటాయి.

ఈ విధమైన సౌలభ్యపరిపూర్ణమైన భగవంతుని సేవించటానికి ఎన్నో మంత్రములున్నప్పటికీ అన్ని పరిపూర్ణమైనవి కాక కేవల పరిమిత సుఖములను స్వర్గాది భోగములను మాత్రమే ఇచ్చును. అలాకాక ఏమంత్రము విశ్వాసాన మననం చేసిన వారికి ఇహమందు అపరిమిత సుఖములను, పరమందు తిరిగి ఈ సంసారమను దుఃఖాంబుధిలో పడక శాశ్వతానంద దాయకమైన పదమును అందించునో ఆ మంత్రము అష్టాక్షరీ మహామంత్రమే తప్ప మరొకటి ఏదియు కాదు. అక్షరమక్షరమూ అక్షయ్యమై అనంతుని పదారవిందముల గొలుచు వేదమును తనయందు నింపుకుని ఉన్న మహామంత్రరాజము అష్టాక్షరీ మహామంత్రము.

ఇట్టి మంత్రమును అణువు అణువున నింపుకొని సాక్షాత్ అష్టాక్షరీ స్వరూపమై విలసిల్లున్నదే మన దివ్యసాకేత అష్టాంగవిమానము. ప్రధాన విమాన శిఖరమునకు దిగువన 2తలములలో కలిగిన 8ఉపశిఖరములయందు అష్టాక్షరిలోని ప్రతి అక్షరమును నిక్షిప్తం చేసి ప్రధాన శిఖరమందు మంత్ర దైవతాన్ని, తన తేజములతోడ జూపి అచ్యుత పదార విందముల నందించు అనంత దక్షిణ కరభూషణ విలసితమగు సుదర్శనుడ నుంచి ప్రతిష్ఠించినది ఈ అష్టాంగవిమానము.

ఇట్టి విమానమును దర్శించిన సేవించిన చాలును జన్మతరించును.

అక్షరమునకు 8ప్రదక్షిణల చొప్పున మొత్తం 8అక్షరముల మంత్రమునకు 64ప్రదక్షిణలు చేసి ఉపాసించిన చాలును. మనసున కలిగిన కోర్కెలు సంపూరితమై స్వామి అనుగ్రహ వైభవాతిశయాన తరించగలము.

**ఓం నమోనారాయణాయేతి మంత్రోపాసకః ।**
**వైకుంఠ భువనలోకం గమిష్యతి ॥**
ఇది ఉపనిషద్వచనము.



రాయల ఊహల పల్లకి....

# ఆముక్తమాల్యద

*(గత సంచిక తరువాయి)*

మన్నారు కృష్ణునిస్వామిసన్నిధిలో నాట్యం చెయ్యడం కోసం అలంకరించుకొంటున్న దేవదాసీల కొప్పులనుండి కాస్త ఒరిగిన చెంగలువపూలను వరసగా తాకి కాస్త మెల్లని గతిని సాగుతోంది గాలి. దీనితో గాలికుండాల్సిన శైత్య సౌరభ మాంద్యాలు అనే మూడు గుణాలూ ఆ ఊరి గాలులకు అబ్బినై. ఇల్లా గుణత్రయం కలది కావడం చేత జనుల తాపత్రయాన్ని మీటిపారేస్తుంది ఆ గాలి.

రాత్రులు మలయమారుతం మెల్లగా వీచి మన్నారు కృష్ణుని ఆలయ ధ్వజస్తంభం మీద ఉన్న బంగరు మువ్వల గుంపును ఘల్లుమని చప్పుడు చేసేట్టు కదలిస్తుంది. ఆ మువ్వల సవ్వడికి ఆలయప్రాకారపు అంచులమీద వాలిన సంపెంగ కొమ్మల్లో నిద్రిస్తున్న పక్షులు భయంతో మేలుకొని రొదచేస్తాయి. ఆ పక్షుల కలకలలను విని పక్షులు రొదచేస్తున్నాయి తెల్లవారి పోతోంది అనుకొని అందాకా ప్రణయకలహాలతో ఎడపెడలుగా ఉన్న దంపతులు అలకలు మాని అన్యోన్యంగా అల్లుకుపోతారు.

ఇళ్ళముందు ధాన్యం ఆరబోసి వాటిని ఏవీ తినకుండా బాలికలు కాస్తున్నారు. దేవాలయంలో తిరుగాడే దుప్పిపిల్ల ఒకటి మాటిమాటికీ వచ్చి ఆ ధాన్యాన్ని బొక్కిపోతోంది. సరిగ్గా అదే వేళకు కొండెలపై చుట్టుకోవడానికి కట్టిన చెంగలువ పూదండలను పేపగంపల్లో పెట్టుకుని పక్కనున్న పల్లెలనుంచి పడుచులు అమ్మడానికి తెస్తే ఈ పిల్లలు ఆ చెంగల్వదండలతో ఆ దుప్పిపిల్లను తోలుతారు. తోలుతారే తప్ప కొట్టరు. అదీ మరోదాంతో మరోదాంతో కాదు, చెంగల్వపూదండతో.

ఆ విల్లిపుత్తూరులోని భాగవతులు భగవద్భక్తులైన వారిని ఆదరించే అలవాటు కలవారు. భాగవతులు వస్తున్నారని తెలియగానే తామే ఎదురుగా వెళ్ళి సాష్టాంగ నమస్కారం కావించి ఇంటికి వెంటబెట్టుకుని వచ్చి కాళ్ళు కడుక్కోడానికి తీర్థం ఇస్తారు. కొబ్బరాకుల చాపలు వేసి వాటిపై వారిని కూర్చుండజేసి వారు స్నాన-అనుష్ఠానాలు నిర్వహించుకున్నాక భోజనాల ఏర్పాటు చేస్తారు. విశాలమైన అరిటాకులు వేసి పోకపొత్తుల దొన్నెలు పెట్టి, రాజనపు అన్నం, పప్పు, మూడు నాలుగు కూరలు, పాలు, పెరుగు, నెయ్యి, పిండివంటలు సమృద్ధిగా వడ్డించి భోజనాలు పెడతారు. భోజనాలు చేసి, ఆచమించి వారు కూచున్నాక భక్తితో వారి కాళ్ళొత్తుతారు, తాంబూలం ఇస్తారు. అప్పుడు 'ఎక్కణ్ణించి వస్తున్నారు, ఎక్కడకు వెళుతున్నారు, మీ కుటుంబ వివరాలేమిటి?' అంటూ కుశల ప్రశ్నలు వేస్తారు.

'అయ్యా, సెలవు వెళ్ళివస్తాము' అని వారు లేవగా తమ తాహతుకు తగిన సత్కారం గావించి కొంతదూరం సాగనంపి అయ్యో, ఇట్టాంటి అతిథులు వెళ్ళి పోతున్నారే మళ్ళీ భాగవత సేవనం ఎన్నటికో అని మనస్సులో ఖేదపడుతూ ఇళ్ళకు తిరిగివస్తారు. ఇదీ - విల్లిపుత్తూరులోని భాగవతుల దినచర్య.

ఇల్లాంటి విల్లిపుత్తూరులో విష్ణుచిత్తులని సార్థకనాములు ఒకాయన ఉన్నారు. విష్ణువు ఎప్పుడూ ఆయన చిత్తంలో ఉంటాడని విష్ణువు మీదే ఎప్పుడూ ఆయన చిత్తం ఉంటుందనీ జనం ఆయనను విష్ణుచిత్తులు అంటారు. ఆయన అనుక్షణం ద్వయమంత్రాన్ని జపిస్తూనే ఉంటారు. నిరంతర ధ్యానం అనే గొలుసుతో విష్ణువనే ఏనుగును కట్టేసుకున్నవారు. సుఖదుః ఖాది ద్వంద్వాలకు లొంగనివారు. వేదవేదాంతాలు చదవ కుండానే వాటివల్ల కలగాల్సిన జ్ఞానం ఆయనకు కలిగింది. జీవుణ్ణిగూర్చి పరమాత్మనుగూర్చి విశదమైన జ్ఞానం కలవారు. మంచిసదాచార సంపత్తితో ఆ ఊళ్ళో ఉంటున్నారు.

భగవంతుడి అనుగ్రహం ఆయనమీద ఉంది. ఎన్నో జన్మల పుణ్యఫలంగా ఆచార్యకృప కూడా ఆయనకు లభించింది. దీనివల్ల వెనుకటి జన్మలో చేసుకున్న గుప్తదానం ఈ జన్మలో నిక్షేపాన్ని కనబరచినట్టు ఆయనకు మంచిజ్ఞానం కలిగింది. అచేతనమైన ప్రకృతి చేతనులైన జీవులు కూడా సర్వేశ్వరుడికి శరీరాలే అని, ఇటు ప్రకృతి, అటు జీవులూ కూడా ఆయనకే చెందినవారని విష్ణుచిత్తులు తెలుసుకున్నారు. సర్వానికీ ప్రభువు పరమాత్మే అని, అంతా అందరూ ఆయనకు మాత్రమే చెందినవారనీ, ఆయన శేషి అని మిగిలినదంతా ఆయనకే శేషం అంటే 'చెందినది' అనీ తెలుసుకున్నారు.

ఇట్లా తనకూ ఆయనకూ అంటే - శేషానికీ, శేషికీ ఉన్న సంబంధం ఈనాటిది కాదు. అదీ అనాదిగా వస్తున్నది అని కూడా ఆయనకు ఎరుక ఏర్పడింది. ఈజ్ఞానం కలిగే అఖండమైన సుఖంతో ఉన్నవాడు నిజంగా యోగి అని అల్లాంటి యోగికి బుద్ధిక్లేశాన్ని కలిగించే లౌకికాలైన చదువులవల్ల ప్రయోజనమేమిటి, అనీ తెలుసుకున్నారాయన. *(ఇంకాఉంది)*

-శ్రీరామచంద్రాచార్య



పరమహంస పరివ్రాజకులు

# శ్రీశ్రీశ్రీ చిన్నజీయర్‌స్వామివారి ప్రచారవార్తలు



యతిరాజులు ఆచరించే చాతుర్మాస్య దీక్షను పూర్తిచేసుకొని శ్రీశ్రీశ్రీ స్వామివారు 12వ తేదీ సాయంత్రం విజయవాడ వాస్తవ్యులైన శ్రీమాన్ లక్ష్మి కిశోర్ గార్ల ఆహ్వానం మేరకు వారి గృహాన్ని పావనం చేశారు.

13వ తేదీ సాయంత్రం నలందా విద్యాసంస్థల అధినేత అయిన శ్రీమాన్ విజయ్‌బాబుగారి ఆహ్వానం మేరకు నలందా విద్యాలయాన్ని దర్శించి, విద్యార్థులకు అనుగ్రహభాషణం కృపచేశారు.

14వ తేదీ రాత్రికి శంషాబాద్ శ్రీరామనగర్‌లోని దివ్యసాకేతానికి విచ్చేశారు.

15వతేదీ “ఇందిరాగాంధీ నేషనల్ ఓపెన్ యూనివర్శిటీ” (IGNOU) చే గుర్తింపు పొందిన కమ్యూనిటీ కాలేజ్‌లో విశిష్టాద్వైత వైశిష్ట్యం, ఆలయ ఆరాధనా విధానాలు ఆగమ పద్ధతులు అనే కాంటాక్ట్ తరగతులను శ్రీశ్రీశ్రీ స్వామివారు ప్రారంభించారు.

ఈ తరగతులను జీవా అకాడమీ కౌన్సిల్ డైరెక్టర్ అయిన శ్రీ ఉ.వే. శ్రీమాన్ సముద్రాల వేంకట రంగరామానుజాచార్య స్వామివారు, శ్రీశ్రీశ్రీ త్రిదండి అహోబిల రామానుజ జీయరు స్వామివారు, సభ్యులైన ప్రొఫెసర్ పురుషోత్తమరావుగారు, శ్రీమాన్ టి.ఎస్.కృష్ణమాచార్యస్వామి (కంప్యూటర్ కృష్ణగారు), ఆగమపాఠశాల ప్రిన్సిపల్ అయిన శ్రీమాన్ ముడుంబై మధుసూదనాచార్యస్వామి, శ్రీమాన్ వోలేటి కృష్ణమాచార్య స్వామి తదితరులు 22వ తేదీ వరకు నిర్వహించారు.

శ్రీమాన్ సంధ్యాపూర్ణచంద్రరావు, శ్రీమతి సునీతా హరినాథ్, శ్రీమతి పావనిరఘురామ్ (జర్మనీ), శ్రీమతి మాధవీరామకృష్ణ కాంచ(జర్మనీ), శ్రీమతి రమ్యచక్రవర్తి(జర్మనీ) తదితరులు నేత్రవిద్యాలయ విద్యార్థులకొరకు టు టైర్ మంచాలను సమర్పించారు. వారికి శ్రీస్వామివారు మంగళా శాసనాలు చేశారు.

17వ తేదీ సుబేదార్ శ్రీమాన్ ఎ.వి. కృష్ణారెడ్డిగారి నేతృత్వంలో మిలటరీవారి కంటోన్మెంట్ ఏరియాలో 1800 ఎకరాలలో తయారు చేయబడిన ‘ల్యాండ్‌స్కేటింగ్’, ‘సన్ డైల్’, వాటర్ హార్వెస్టింగ్‌ను సందర్శించారు. అక్కడ ఉన్న వృక్షసంపద, అంతరించిపోయే ఆయుర్వేద వృక్షాలను చూచి, అంత శ్రద్ధగా వాటిని కాపాడుతున్న జవానులందరికీ మంగళాశాసనాలను చేశారు.

మన జీవాప్రాంగణంలో కూడా వృక్షసంరక్షణా కార్యాన్ని నిర్వహిస్తున్న శ్రీమాన్ సుధాకర్‌రావుగారికి కూడా మంగళా శాసనాలను చేశారు.

18వ తేదీ శ్రీస్వామివారి ప్రత్యక్ష పర్యవేక్షణలో ప్రజ్ఞవేదిక నిర్వహింపబడింది. మనిషికి అవసరమైనవి ఆరోగ్యం, విజ్ఞానం, నైతిక విలువలు. ఈ మూడింటి సమన్వయంతో ముందుకు నడిచినట్లయితే ఈ సమాజం ఒక నందనవనం అవుతుంది. కానీ, ఈరోజు సమాజంలో వీటికిలోటు ఏర్పడింది.

తిరిగి వాటిని సమాజంలో నెలకొల్పవలసిన బాధ్యత కూడా మనదే. కనుక వాటిని విద్యార్థిలోకానికి అందించాలని శ్రీస్వామివారు సూచించారు. కనీసం ఈ విద్యాసంవత్సరంలో 2లక్షలమంది విద్యార్థులకు ముఖ్యంగా ప్రభుత్వపాఠశాలలో విద్యా వైద్య సంబంధసేవలను అందజేయాలని, ప్రతి ఒక్కరూ ఈ కార్యక్రమానికి నడుం బిగించాలని శ్రీస్వామివారు సూచించారు.

19వ తేదీ సాయంత్రం సుదూరప్రాంతాలలో ఉంటూ కూడా మన సంప్రదాయాలను కాపాడుతూ, భారతీయ సంస్కృతిని రక్షిస్తూ, యాంత్రికజీవనాన్ని సాగిస్తూ ఆచార్య కృపావృష్టికై ఎదురుచూచే “చకోరపక్షుల తాపార్తిని తొలగించే స్వాతిచినుకై” అమెరికాకు ప్రయాణమయ్యారు.

# మెదడుకి మేత!

భగవద్బంధువులారా! జిజ్ఞాసతో మీరంతా చదువుతూ ఆదరిస్తున్న 'భక్తినివేదన'లో మీకోసం ఈ శీర్షిక! **ఈ పత్రిక లోని వ్యాసాలనుండే మీకు ప్రశ్నలిస్తున్నాం!** అయినా మరొక్కసారి జ్ఞాపకం చేసుకోవడం మనస్సుకి ఆనందమని మెదడుకీ చిన్నమేత! అన్నీ సరిగా వ్రాస్తే ఆకర్షణీయ బహుమతులు! ప్రతినెల 20వ తేదీలోపు మాకందిన సమాధానాలని మాత్రమే పరిశీలిస్తాం! ఆ పై దాటివచ్చినవి పరిశీలింపబడవు. దీనిపై ఎలాంటి ఉత్తర ప్రత్యుత్తరాలు ఉండవు. శ్రద్ధతో మీరు పంపిన గత నెల సమాధానాలందాయి. విజేతల పేర్లు క్రింద ప్రకటించాము. బహుమతులు పంపిస్తాం!

| ప్రశ్నలు | సమాధానాలు |
|---|---|
| 1. విష్ణుచిత్తులు నిరంతరం ----- అనే గొలుసుతో ----- అనే ఏనుగును కట్టేసుకున్నారు. | |
| 2. తప్తశంఖ, చక్రములను ముద్రించుటవలన -------------- | |
| 3. రాక్షసగురువు పెట్టిన శాపం -------------- | |
| 4. జనకమహారాజుగారి భార్యపేరు -------------- | |
| 5. గోదాదేవి ఉగ్గుపాలు ఏవి? -------------- | |
| 6. భగవంతుని దయ కలిగితే -------------- | |
| 7. 'శుక పాద మరేద్దశ' అనే వాక్యం ద్వారా ఏం తెలుస్తున్నది? | |
| 8. 'గురువు కంటే రక్షకులు లేరు' అనేదాన్ని సంస్కృతంలో ఇలా అంటాం. | |
| 9. ------------------తో మాత్రమే వస్తు యథార్థ స్థితిని తెలుసుకోగలం. | |
| 10. విశ్వామిత్రుని వంశం పేరు -------------- | |
| 11. శ్రీకృష్ణునితో యుద్ధం చేసి 998 చేతులు పోగొట్టుకున్నవాడు. | |
| 12. వ్యాసుడు అంటే.... | |
| 13. చంపకమాలలోని గణాలు -------------- | |
| 14. శ్రీ శుకుడు గృహస్థుల ఇండ్లను పవిత్రీకరించడానికి వారి ఇళ్ళవద్ద ఎంత సమయం ప్రతీక్షించేవాడు. | |
| 15. విష్ణుచిత్తులవారు పాడిన పాటలు గల ప్రబంధం ఏది ------------- | |
| 16. హల్లీశాకం అంటే -------------- | |
| 17. అద్భుతానందాన్ని ఇవ్వగలిగిన, మంచిని గుర్తించగలిగినది ఏది? ------ | |
| 18. "చిత్త వృత్తి నిరోధం" అంటే ఏమిటి? --------------- | |
| 19. "మంత్రోపదేశము" ఎటువంటిదంటే -------------- | |
| 20. గాలికి ఉండాల్సిన మూడు గుణాలు ఏవి? | |
| 21. ఉపనయన సంస్కారము వలన కలిగే యోగ్యతలేవి? | |
| 22. మూలతత్త్వము, మోక్షప్రదుదెవ్వరు? | |
| 23. శరణాగతిని ఏమంటారు? శరణాగతి చేసినవారిని ఏమంటారు? | |
| 24. పరాశర విడదీసి అర్థం చెప్తే..... | |
| 25. తమిళనాడు ప్రభుత్వపు రాజచిహ్నం ..... | |
| 26. అప్పుడు అంటే..... | |

**గత నెల విజేతలు:** ఎస్. పుష్పలత కమలాకరరావు–కరీంనగర్; శ్రీ దాచేపల్లి శ్రీవల్లి–విజయనగరం; కె. సౌదామిని– అనంతపూర్; డా॥ ఎ. రామచంద్రారెడ్డి–హన్మకొండ; గుడివాడ మురళీకృష్ణ–గుంటూరు; ఎమ్. పద్మ–హైదరాబాద్.

**సూచన:** సమాధానాలు ఈ పత్రంలోనే నింపి, 20వ తేదీలోపు అందేట్టు పంపగలరు.

భక్తినివేదన శ్రీరాంనగరం, ముచ్చింతల్, పాలమాకుల పోస్ట్ 509 325 శంషాబాద్, రంగారెడ్డి జిల్లా. ఆంధ్రప్రదేశ్.

శ్రీమతే నారాయణాయ నమః

శ్రీమతే రామానుజాయ నమః



64 సం॥ల నుండి అశేష భగవద్బంధువులు ఆదరిస్తున్న...

ఆధ్యాత్మికమాసపత్రిక

# భక్తినివేదన



శ్రీఖరనామ సంవత్సర కార్తీకమాసము


సంపుటి 64 నవంబరు

సంచిక 8 2011


## పండుగలు

**నవంబరు**

5. పేయాళ్వార్ తిరు॥
6. సర్వేషాం ఏకాదశి
7. విశాఖకార్తె, చిలుకు ద్వాదశి, క్షీరాబ్దిపూజ, తులసీ వివాహం, చాతుర్మాస్య వ్రత సమాప్తి
9. వైకుంఠ చతుర్దశి
10. కార్తీక పూర్ణిమ, ధాత్రీ నారాయణపూజ, ఆమలక స్నానం
17. వృశ్చిక సంక్రమణము
20. అనూరాధ కార్తె
21. సర్వేషాం ఏకాదశి
23. మాసశివరాత్రి
24. పిండ పితృయజ్ఞము, తిథి ద్వయం
25. అమావాస్య
28. అవమతిథి
30. సుబ్రహ్మణ్య షష్ఠి

**డిసెంబరు**

3. జ్యేష్ఠకార్తె, త్రిద్యుస్పృక్
6. సర్వేషామేకాదశి, గీతా జయంతి
7. మత్స్య వాసుదేవ ద్వాదశి
8. హనుమత్ వ్రతం


వ్యవస్థాపకులు

పరమహంస పరివ్రాజకాచార్య

**శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జీయరుస్వామివారు**

సంపాదకులు

శ్రీఉ.వే.శ్రీమాన్ **T.P. శ్రీరామచంద్రాచార్యులు**


## విషయ సూచిక




Printed & Published by H.H. Tridandi Chinna Srimannarayana Ramanuja Jeeyar Swamiji on behalf of **Jeeyar Educational Trust** and Printed at **Sriman Printers & Processors** C/o JET, Sitanagaram-522 501, Guntur Dist., Andhrapradesh. **Published at** C/o JET, Sitanagaram-522 501 Guntur Dist, Andhrapradesh, Editor: Sri **T.P.Sriramachandracharya** S/o. Sri Sitaramacharyulu, No: 5-74, Ayodhya, Visakhapatnam- Andhra Pradesh.


చందావివరాలు :- సంవత్సరచందా రూ.225/-

విదేశాలకు సంవత్సరచందా $30/-




మీ సేవలో....

భక్తినివేదన, సీతానగరం - 522 501,

గుంటూరు జిల్లా, ఆంధ్రప్రదేశ్. 08645 272929.



D.T.P. & Design by : పరిశోధనాలయమ్,

ముద్రణ : శ్రీమాన్ ప్రింటర్స్ & ప్రోసెసర్స్, సీతానగరం



E-mail : **jetsitanagaram@yahoo.com**

Internet : www.chinnajeeyar.org



# య ఏవం వేద...

శ్రీమాన్ గుదిమెళ్ళ మురళీకృష్ణమాచార్యస్వామి-భద్రాచలం



*గత సంచిక తరువాయి...*

శ్రీమద్వేదమార్గ ప్రతిష్ఠాపనాచార్య సార్వభౌములుగా ప్రసిద్ధిని పొందినవారు భగవద్రామానుజులు. ఇతర ఆచార్యులవలె కాక వేదముయొక్క ప్రత్యక్షర ప్రమాణాన్ని స్థిరీకరించి, ఆ వేదమార్గంలో పరమవైదికమైన శ్రీ వైష్ణవ సంప్రదాయాన్ని ప్రవర్తింపజేసిన సకల జీవ సంజీవన భూతులు వారు.

అందుకే వారి తిరునక్షత్ర మహోత్సవాన్ని పురస్కరించుకుని గత మే నెలనుండి 'య ఏవం వేద' అనే పేరిట ఈ వేదవ్యాసాలను పునఃప్రారంభించుకున్నాము.

మూడేళ్ళక్రితం వేదవ్యాసమహర్షియొక్క దివ్యజయంతిని పురస్కరించుకుని 'య ఏవం వేద' గానే ప్రారంభమైన ఈ వేదవ్యాసాలు రెండేళ్ళపాటు వేదవేద్యుని శ్రీపదార్చనగా సాగాయి. వేదాధ్యయనానికి ఉపక్రమించే ప్రతీవ్యక్తి కూడ 'హరిః ఓమ్' అనే ధ్యానంతోనే ప్రారంభిస్తారు. అలా 'హరిః ఓం అంటూనే వేదాన్ని ఎందుకు ఉపక్రమిస్తారో; అధ్యయనం యొక్క ముగింపులో కూడ హరిఃఓమ్ అంటూనే ఎందుకు ఉపసంహృతి చేస్తారో...!, ఆద్యంతాలలో ఉచ్చరించే ఆ హరిఃఓమ్ మంత్రంలో స్వరభేదానికి కారణమేమిటో, హరి:- ఓమ్ అని రెండు పదాలుగా కనిపించే వాటి తాదాత్మ్యమేమిటో, ఆ రెండు పదములకు విడివిడిగా వాటి ఉత్పత్తి-వ్యుత్పత్తుల విశేషాలను విస్తృతంగా చర్చిస్తూ తొమ్మిది నెలలపాటు 'హరిఃఓమ్' అనే పేరిట వ్యాసలహరిని ఈ య ఏవం వేద అనే శీర్షిక ద్వారానే భక్తితో నివేదించుకోవడం జరిగింది. ఆపై ఆరునెలలపాటు మన శీర్షికలో రెండవ వ్యాసలహరిగా ప్రారంభమైన 'యజ్ఞోవైవిష్ణుః' యజ్ఞ స్వరూపాన్ని, యజ్ఞాత్మకమైన భగవత్స్వరూపాన్ని, యజ్ఞవైలక్షణ్యాన్ని తమ తమ యోగ్యతానుసారంగా అందరూ అవశ్యం ఆచరించ తగిన పంచమహాయజ్ఞముల స్వరూప స్వభావాలను వివరించిన విషయం... మన భక్తినివేదన పాఠకులకు తెలిసినదే!

మళ్ళీ మనస్వామివారి మంగళాశాసనముల బలంతో ఈ య ఏవం వేద పునఃప్రారంభమై అర్ధసంవత్సరమైంది. లక్ష్యసిద్ధిని పొందే విషయంలో మరింత ఉత్సాహాన్ని-ఉత్తేజాన్ని పెంపొందించడానికై చేసే సింహావలోకనం పద్ధతిలో ఈ ప్రస్తావన చేయడం జరుగుతోంది.

ఈ ఆరునెలలుగా మనం వేదము అనే శబ్దముయొక్క అర్థములను, వాటి నిర్వచనాలను, వేదముయొక్క ప్రమాణ మూర్ధన్యతను తెలుసుకునే ప్రయత్నం చేస్తున్నాము.

వేదం స్వతః ప్రమాణము అనే శాస్త్రవచనాన్ని తీసుకుని ప్రమాణవ్యవస్థను గూర్చి మనం పర్యాలోచనం చేసుకుంటున్నాము. శిష్టజన పరిగృహీతమైన ప్రమాణత్రయంలో వేదం శబ్దప్రమాణముగా గుర్తించడం జరిగింది. ఆప్తవాక్యమే శబ్దము, అదే ప్రమాణము అని మాత్రమే కనుక మనం శబ్ద ప్రమాణలక్షణాన్ని చెపితే అపౌరుషేయమైన వేదమును పౌరుషేయంగా చెప్పవలసి వస్తుంది. అందుకే యతీంద్రమత దీపికాకారులు శబ్దప్రమాణ లక్షణాన్ని ఈ క్రింది విధంగా సూత్రీకరించారు.

'అనాప్తానుక్త వాక్యజనిత విజ్ఞానం యత్-తత్కరణం శబ్దప్రమాణమ్' ఆప్తులు కానివారిచే పలుకబడని వాక్యము వలన కలిగిన అర్థజ్ఞానమే శబ్దప్రమాణము అని పైవాక్యంయొక్క తాత్పర్యము. అనాప్త అనుక్తం ఆప్తులు కానివారిచే పలుకబడనిది అనేకంటే చక్కగా ఆప్తోక్తం ఆప్తునిచే పలుకబడినది అని అనవచ్చునుకదా! అనిపించడం సహజం. అలా చెపితే శాస్త్రమర్యాదలను బట్టి కొన్ని ఇబ్బందులు ఎదురయ్యే

ప్రమాదమున్నది. ఆప్తత్వలక్షణం గురించి ఆ ఆప్తుని ఆప్తత్వప్రమాణం గురించి ఆ ప్రమాణంయొక్క ప్రామాణ్యం గురించి... ఇలా అనవస్థాత్మకమైన ఇబ్బందులతో పాటు వేదముయొక్క అపౌరుషేయత్వానికి కూడ భంగపాటు కలిగే ఇబ్బంది ఎదురౌతుంది. వేదమును ఆప్తుడు చెప్పలేదు, అనాప్తుడు చెప్పలేదు కాబట్టి పై అనాప్తానుక్తం అనే లక్షణ వాక్యమువలన శబ్దప్రమాణానికి ఏ బాధకమూ లేదు. వేదాపౌరుషేయత్వానికి కూడ ఏ భంగమూ లేదు.

ఇలా శబ్దప్రమాణానికి బాధకాలైన అప్రమాణ కారణములు ప్రధానంగా నాలుగు ఉన్నాయని గత సంచికలో తెలుసుకున్నాము. వాటిలో అబోధకత్వం అనే దోషము వేదమునకు ఎంతమాత్రమూ వర్తించదని యథావకాశం వివరించుకున్నాము కూడ. ఇంక తక్కిన మూడు కారణాలలో రెండవది అనువాదకత్వము అనే దోషం.

అనువాదకత్వము అంటే ఎవరో ఒకరు పలికిన విషయాన్ని, లేదా తెలిసిన విషయాన్ని మరింత స్పష్టం అయ్యేలా భాషాంతరంగానో భంగ్యంతరంగానో మూలా విరుద్ధంగా ప్రకటించడం అన్నమాట. 'వద' అనే పదానికి 'పలకడం' అనీ, 'అను' అనే పదానికి 'అనుసరించి' అనీ అర్థం. అర్థాత్ అనుసరించి పలుకుటయే అనువాదము. అను సృత్యవదతీతి అనువాదః అని విగ్రహవాక్యము. అనుసరించి అంటే అంతకుముందున్న విషయాన్ని అనుసరించి చెప్పడం అనే కదా 'ఉద్దేశ్యం' పూర్వస్థితి విషయానుబోధనం అని కదా పెద్దల శ్రీసూక్తి!? అంతకు ముందున్న మాటనే మళ్ళీ మనం అనువదిస్తే మనమాటను స్వతంత్రం అనకూడదు. మనం ఏ మాటను అనుసరించామో దానినే ప్రధాన ప్రమాణం అనాలి తప్ప మనమాట కానేరదు. మనమాట ప్రమాణానువాదవే అవుతుంది. ఇలా అనువాదకత్వం అనే దోషం వేదానికి ఉంటే మరి అది స్వతః ప్రమాణం కాదుకదా!?

అపూర్వములైన విషయములను బోధించగలిగినప్పుడే ఆ గ్రంథానికి అనువాదకత్వమనే మాట ఉండదు. అలాంటి అపూర్వ విషయాలను ఎవరు చెప్పగలరు? ఒకవేళ ఎవరైనా సాహసించి ఏమైనా చెప్తే అవి పిచ్చివాని మాటలనో, పొంతనలేని పిట్టలదొర మాటలనో అంటారు తప్ప, ఎవరు వాటిని ప్రమాణంగా చూపే సాహసం చేయగలరు? ఆ మాటలకు ఆధారాలు ఏమిటి? అని విజ్ఞులు నిలదీయకుండా ఎందుకుంటారు? కాబట్టి అద్భుతమైన ఆనుపూర్వితో, అపూర్వమైన విషయాలను బోధించగలిగే శక్తి, ప్రాచీనతకు సాహిత్యమైన వేదము బోధించే ఆ విషయాలు వేటికి అనువాదములో చెప్పలేని పరిస్థితి వేదమునకు మాత్రమే ఉంది కాబట్టి అనువాదకత్వం అనే దోషం వేదానికి అంటుకునే అవకాశమే లేదు.

మనకు కనిపించే ప్రాచీనమైన భారతీయ వాఙ్మయ మంతా వేదమునే పరమప్రమాణంగా స్వీకరించి ఏర్పడినట్లు ప్రకటించడం వలన, వేదమనేది ఎవరి కర్తృకమూ కానందువల్ల, ఎవరి కర్తృకమో ఎవరూ తేల్చలేక పోవడం వల్ల, వేదకాల నిర్ణయం చేయాలనే ఉత్సాహంతో ఎంతో ప్రయత్నించిన దేశ-విదేశీయ మేధావుల నిర్ణయాలన్నీ భిన్న భిన్నవాదాలు కావడం వలన, వీటన్నింటినీ ప్రక్కనబెట్టి అనాదిగా, అనూచానంగా తరతరాల మన పూర్వులంతా వేదమును దైవదత్తంగాను, అపౌరుషేయంగాను విశ్వసిస్తూ ఆరాధిస్తూండడం వలన వేదము చెప్పిన విషయాలన్నీ అపూర్వాలే... వేదము బోధించిన విశేషాలన్నీ అద్భుతాలే. కాబట్టి వేదమునకు అనువాదకత్వం అనే దోషము అంటనే అంటదు.

అయినా వేదమునకు అనువాదకత్వము లేదని చెప్పడానికి స్థాలీపులాకన్యాయపద్ధతిలో ఒక మంత్రవాక్యాన్ని పరిశీలిద్దాము.

మనం గతంలో 'అబోదకత్వానికి' ఉదాహరణగా తీసుకన్న మంత్రాన్నే పునఃపరిశీలించుకుందాము. 'జ్యోతిష్టోమేన 'స్వర్గకామోయజేత' స్వర్గ లోకమును పొందాలనే కోరిక కలవాడు జ్యోతిష్టోమము అనే యాగమును చేయవలెను అని మంత్రార్థము. దీనిలో మూడు అంశములు ప్రధానంగా కనిపిస్తున్నాము. ఒకటి జ్యోతిష్టోమమనే ఒక యాగము, రెండు స్వర్గము అనే సుఖప్రదమైన ఒక లోకము, మూడు ఆ స్వర్గమును

పొందుటకు జ్యోతిష్టోమమనే ఒక సాధనము... ఈ మూడింటి సమాహారమే కదా! పై మంత్రార్థము.

ఒక లోకంలో ఉండేవాడు వేరే మరొక లోకాన్ని ఆశిస్తున్నాడంటే.. ఈ లోకంకంటే ఆ లోకము ఎంతో సౌఖ్యప్రదమనే కదా! ఆశయము మనిషియొక్క నైజం అభ్యుదయాన్ని కోరుకోవడమే కాబట్టి ఆ స్వర్గము-సుఖప్రదమైనదే అయి ఉండాలి. అలాంటి లోకం ఒకటి ఉందని ఎవరు ఊహించగలరు. ఆ లోకంలో నిశ్చింతగా, నిశ్చితంగా సుఖపరంపరలుంటాయని ఎవరు బోధించగలరు? ఇది అపూర్వమైన విషయం. అనూహ్యమైన విషయం కూడ. వేదము చెప్పడానికంటే ముందు ఈ విషయమును బోధించినారనో దానినే వేదము మళ్ళీ చెప్పినది (అనువదించినది) అనో అనే అవకాశము ఎంత మాత్రమూలేదు. వేదమే కనుక ఈ విషయమును బోధించకపోతే మనకు జ్యోతిష్టోమమనే యాగమూ తెలియదు. స్వర్గమనే సుఖదమైన లోకమూ తెలియదు. స్వర్గ-యాగములకు కల సాధ్యసాధన భావము అంతకంటే తెలియదు. ఇది మన విజ్ఞానానికి అందని విషయమే కదా!! కాబట్టి వేదమునకు అనువాదకత్వము అనే అప్రమాణకారణమును చూపించుట కుదరదు.

అయితే నృమేధశ్చ పరిశ్ఛేపశ్చ బ్రహ్మావద్యమవదేతా మస్మిన్ దారా వార్ద్రేగ్నింజనయావ యతరౌనౌ బ్రహ్మీయానితి నృమేధోవదత్ సధూమమజనయత్ పరూచ్ఛేపో(భ్యవదత్ సోఽగ్నిమజనయాత్... ఇత్యాదిగా ఒక ఉపాఖ్యానం కనిపిస్తుంది. దీనిని అర్థం ఏమిటంటే నృమేధుడు, పరుచ్ఛేపుడు అనే వారిద్దరూ బ్రహ్మవాదానికి సంబంధించిన ఒక సందర్భంలో మన ఇద్దరిలో ఎవరు బ్రహ్మవేత్తయో తెలియాలంటే ఈ తడికట్టెయందు ఎవరు అగ్నిని పుట్టించగలరో వారే బ్రహ్మవేత్త అని ముందుగా నృమేధుడు బ్రహ్మవాదాన్ని చేయగా ఆ తడికట్టెలో పొగపుట్టింది. ఆ తరువాత పరిచ్ఛేపుడు అనేవాడు బ్రహ్మవాదమును చేయగా అగ్ని పుట్టినది... అని ఆ మంత్రమునకు భావము.

దీనిని బట్టి నృమేధ పరుచ్ఛేపులిరువురి కథను వేదమును అనువదించినట్లే కదా! అనే సందేహము కలుగక మానదు. అంతేగాక దేవాసురస్సంయత్తా ఆసన్ (దేవతలు అసురులు యుద్ధమునకు సన్నద్ధులైరి) వాగ్వై దేవేభ్యో(పాక్రామత్ (వాక్కు అనేది దేవతల వద్దకు వెళ్ళినది.) అనే ఇలాంటి ఎన్నో ఉపాఖ్యానాలు, యద్ధి మనసాధ్యాయతి తద్వాచావదతి (ఏది మనస్సుతో ధ్యానిస్తామో దానినే వాక్కుతో పలుకుతున్నాము) భవిష్యద్ధి భూయో భూతాత్ (జరిగిన కాలం కంటే జరుగవలసిన కాలం చాలా ఉన్నది) ఇత్యాది చాలా వాక్యములు గత విషయాలను స్పృశించేవే కాబట్టి అనువాద సరణికి కారణాలు అయ్యే అవకాశమున్నది కదా! అనే సందేహాలు కలగడం సహజమే. ఒక విషయంపై ప్రశ్న ఉదయిస్తోందీ అంటే ఆ విషయంపై అవగాహన పెరుగుతోందని అర్థం. ప్రశ్నవేసి సమాధానాన్ని పొందే పద్ధతినే జిజ్ఞాసా పద్ధతి అని అంటారు. వేదంయొక్క అపూర్వ బోధకత్వం గురించి తెలియాలంటే.. ఈ అనువాదకత్వ శృంఖలాలు తెగిపోవలసినదే... ఆ ప్రశ్నలకు సమాధానాలను వచ్చే సంచికలో తెలుసుకునే ప్రయత్నం చేద్దాం!



# పిబత భాగవతం రసం... వివిధావతార ప్రశంసనమ్

శాస్త్రరత్నాకర, శాస్త్రవిద్వన్మణి డా॥ఉ.వే సముద్రాల వేంకట రంగరామానుజాచార్యస్వామివారు
డైరెక్టర్ - అకెడమిక్ కౌన్సిల్ 'జీవ' శ్రీరాంనగర్ (శంషాబాద్)

*(గత సంచిక తరువాయి)*

## వ్యాస నారద సంవాదం (పంచమాధ్యాయం)

భగవదవతార వైభవం, భాగవతావిర్భావం వర్ణించి, శ్రీమద్భాగవతంలోని ప్రథమ స్కంధ పంచమాధ్యాయం, సర్వధర్మాలకంటే హరికీర్తనం పరమధర్మమని ప్రతిబోధించి, నారదుడు, వ్యాసునికి చిత్తప్రశాంతిని కలిగించడాన్ని విశదపరచింది. నారదుడు ఇలా అన్నాడు.

ఓ వ్యాసమహర్షీ! నీ శరీరాంతర్వర్తియైన ఆత్మ, శరీరంచే పరితృప్తి చెందుతున్నదా? నీ మనోభిమాని అయిన ఆత్మ మనస్సుతో పరితృప్తి చెందుతున్నదా? అని ప్రశ్నించాడు. నీ శరీరము, మనస్సు స్వస్థంగా ఉన్నవా? అని, ప్రశ్నించడంలోని తాత్పర్యం, శరీరము, మనస్సు స్వస్థంగా ఉన్నప్పుడే కదా, తత్త్వచింతనం సాగేది? నీవు విచారించగోరిన తత్త్వాన్ని విచారించావా? మహాద్భుతమైన మహాభారతాన్ని నీవు రచించావు. అది సర్వవిషయ పరివృద్ధం కదా! నీవు సనాతనమైన బ్రహ్మతత్త్వాన్ని విచారించగోరి, వేదాన్ని అధ్యయనం చేశావు. బ్రహ్మజిజ్ఞాస కూడా చేశావు. అయినా, కృతకృత్యత కలుగని వానిలాగా ఇంకా శోకిస్తూనే ఉన్నావు. దీనికి కారణం ఏమిటని ప్రశ్నించాడు.

వ్యాసుడు దీనికి తన హృదయ పరితాపాన్ని సమాధానంగా ఆవిష్కరించాడు. ఓ మహర్షీ ! నీవు చెప్పినట్లు నాకంతా ఉంది. అయినా నాకు పరితృప్తి లేదు. కనుక, ఈ అపరితుష్టి తొలగడానికి మూలమైన అవ్యక్తమై అతిగంభీరమై చతుర్ముఖుని ద్వారా ఆవిర్భవించిన వివేకాన్ని నీ నుండి తెలియగోరుతున్నాను.

పరమగుహ్యమైన ఆ వివేకాన్ని నీవెరుగుదువు కదా! ఏ పురాణ పురుషుడు, పరావరేశుడు, స్వసంకల్ప మాత్రంచే సమస్త జగత్తునూ సృజించి రక్షించి లయింపగలడో, అయినా గుణసంగరహితుడో ఆయనను నీవుపాసించినావు కదా! నీవు ఈ ముల్లోకాలకు లోన సంచరిస్తూ వాయువులా ఆత్మసాక్షివై సర్వప్రాణి బుద్ధి వృత్తులను నీ యోగ ప్రభావంచే ఎరుగుదువు కనుక, వేదస్నాతుడనైన నాకు నీవు దర్శించిన పరావర తత్త్వాన్ని ఎరిగింపగలవు. కనుక అనుగ్రహించు అని ప్రహ్వాభావంతో ప్రార్థించాడు.

అప్పుడు వ్యాసునిచే ప్రార్థింపబడి నారదుడు ఇలా అన్నాడు. ఓ వ్యాసా ! నీవు భగవద్గుణవైభవాన్ని ఇంచుమించుగా అసలు వర్ణింపనే లేదు. కేవలం కొన్ని ధర్మాది పురుషార్థాలను గురించి నిరూపించావు. వీటిని వర్ణించినంతగా వాసుదేవమహిమను వర్ణించలేదు.

**నయద్వచః చిత్రపదం హరేర్యశో**
**జగత్పవిత్రం ప్రగృణీత కర్హిచిత్ ।**
**తద్వాయసంతీర్థముశంతి మానసా**
**నయత్రహంసా విరమంత్యుశిక్షయాః ॥**

శ్రీ హరికి చెందిన లోకపావనమైన యశస్సును, నిరూపించని మాటలు ఎంత చిత్ర విచిత్రంగా ఉన్నా, వాటిని బ్రహ్మనిష్ఠులైన పరమహంసలు సమ్మతించరు. వీటిపట్ల ప్రీతిగొనరు. ఇలాంటి భగవద్గుణానుభవదూరాలైన వాక్కులు, కాకులు చేరే నీటి మడుగులే తప్ప పవిత్ర తీర్థాలవంటివి కావు.

**తద్వాగ్విసర్గః జనతాఘవిప్లవో**
**యస్మిన్ ప్రతిశ్లోకమబద్ధవత్యపి ।**

**సామాన్యనన్తస్యయశోంకితాని యద్**

**శృణ్వన్తి గాయన్తి గృణన్తి సంతః ॥**

ఏ వాక్సృష్టి లోకానికి పట్టిన మహా పాపాన్ని నశింపచేయగలదో, అది ఛందోబద్ధం కాకపోయినా అదే నిజమైన వాక్సృష్టి. అనంతుని కీర్తి వైభవాన్ని ఆవిష్కరించే నామాలనే సజ్జనులు నిరంతరం వింటారు, గానం చేస్తారు, కీర్తిస్తారు.

**నైష్కర్మ్యమప్యచ్యుతభావ వర్జితం**

**నశోభతే జ్ఞానమలం నిరంజనమ్ ।**

**కుతః పునః శశ్వద భద్రమీశ్వరే**

**నచార్పితం కర్మ యదప్య కారణమ్ ॥**

శ్రీ హరి పట్ల పరిపూర్ణ ప్రీతితో కూడి చేసిన ఏ ఉపాసనలైనా సఫలాలౌతాయి తప్ప, అది (శ్రీహరి ప్రీతి) లేనప్పుడు అవి వ్యర్థాలే. ఫలాభిసంధి రహితంగా చేసే కర్మ అయినా, నిర్దుష్టమైన తత్త్వజ్ఞానమైనా, శ్రీహరి ప్రీతితో కూడి ఉండకపోతే కామ్య కర్మైనా, అకామ్య కర్మైనా ఈశ్వరునికి అర్పించినా, అది బాహ్యమైన క్రియాకలాపమే తప్ప, సత్త్వ సంశోధకమై ఆత్మోజ్జీవనానికి ఉపకరించేది ఎంతమాత్రం కాదు కదా !

**అతో మహాభాగ! భవాన్ అమోఘదృక్**

**శుచిశ్రవాః సత్యరతో ధృతవ్రతః ।**

**ఉరుక్రమస్య అఖిలబంధ ముక్తయే,**

**సమాధినానుస్మర యద్విచేష్టితమ్ ॥**

కనుక ఓ మహాభాగా నీవు అమోఘమైన దర్శనం కలవాడవు. విశుభ్రమైన కీర్తి కలవాడవు. దృఢ వ్రతుడవు కనుక, ఉరుక్రముడైన భగవానుని అద్భుత చేష్టితాలు అవతారదశలోనివి, నీ తపస్సమాధిచే సాక్షాత్కరించి వర్ణించు. అవియే ఈ సంసార బంధానికి విమోచకాలు కనుక, ఏదో ఒక విషయాన్ని, (భగవద్గుణానువర్ణనం కంటే వేరైన దానిని) వర్ణించడానికి ఉద్యమించి, తదనుకూల నామరూపాదులపట్ల మనస్సును లగించినా, నీ బుద్ధికి స్థైర్యం ఎంతమాత్రం కలుగదు. గాలిచే కొట్టబడిన నౌకలా అది అవ్యవస్థిత స్థితినే పొందుతుంది తప్ప నిలకడను పొందజాలదు కదా !

**జుగుప్సితం ధర్మకృతేఽనుశాసతః**

**స్వభావరక్తస్య మహాన్ వ్యతిక్రమః ।**

**యద్వాక్యతో ధర్మ ఇతీతరః స్థితో**

**నమన్యతే తస్య నివారణంజనః ॥**

ఓ మహర్షీ ! ఇంతవరకు నీవు చేసిన పని చాలా విపరీతమైంది. ఇక్కడ ధర్మవ్యతిక్రమం చాలా ఉంది. ఎందువల్లనంటే, సహజంగానే రాగాంధుడైన మానవునికి కామ్యకర్మాదులను బోధించడం ద్వారా, నీవు ఆ కర్మలనే ధర్మాలుగా శాసించడం ధర్మ విరుద్ధమే తప్ప ధర్మం ఎంతమాత్రం కాదు. ఇది శాస్త్రోల్లంఘనమే అవుతుంది. సహజంగా కోరికలపట్ల, కోరికలు సాధించే కర్మలపట్ల, ప్రీతికల ఈ మానవులకు పనికట్టుకొని దాన్నే ధర్మంగా బోధించి అనుశాసనం చేయడం కంటే శాస్త్రోల్లంఘనం ఇంకే ముంటుంది ? నీ మాటలవల్ల ఇదే ముఖ్య ధర్మమనేబుద్ధి, సామాన్యులకు కలుగుతుంది కదా! ఇక ముందు ముందు దీన్ని నీవే నివారించినా దాన్ని గుర్తించే వాడెవ్వడు? దీన్నే యథార్థం అని తెలుసుకోలేడు కదా! వైరాగ్యమూలమైన (నివృత్తి మూలమైన) సుఖాన్ని గుర్తించే వాడెవ్వడు? ఆత్మనిగ్రహంలేనివాడై గుణప్రవాహంలోపడి ప్రవృత్తిమార్గాన కొట్టుకుపోయే వానికి, సరియైన దృష్టికలిగేలా భగవద్గుణ చేష్టితాలనే వర్ణించు. అప్పుడే ఈ లోకం సమ్యగ్దృష్టి కలిగి ఉంటుంది అని నారదుడు వ్యాసునికి ప్రతిబోధించాడు.

(సశేషం)

# కలివైరిసూరి వైభవము



శ్రీ ఉ.వే.శ్రీమాన్ కె. టి. రామానుజాచార్యస్వామి-నెల్లూరు

గత సంచిక తరువాయి...

**తిరుమంగై ఆళ్వార్- పెరియ తిరుమొழி 1-7-8**

**8.** నాత్తழும్బు నాన్ముకను మీశనుమాయ్ ముఱైయా
లేత్త అంగోరాళరియాయిరున్ద వమ్మానతిడమ్ ।
కాయ్త్తవాగై నెత్తవిప్పక్కల్లతర్ వేయ్జ్గழైపోయ్
తేయ్త్త తీయాళ్ విణ్ శివక్కుమ్ శింగవేழకున్నమే ॥

ప్రతిపదార్ధము: నాత్తழும்బు=నాలుక కాయకాచునట్లు; నాన్ముకనుమ్=చతుర్ముఖుడగు బ్రహ్మదేవుడును; ఈశనుమాయ్ = శివుడును కలసి; ముఱైయాళ్=క్రమముగ; ఏత్త=స్తుతించగ; అంగు=అచ్చట; ఓర్‌ఆళ్ అరియాయ్=సాటిలేని నరసింహమై; ఇరున్ద=వేంచేసియున్న; అమ్మానతు=స్వామికి చెందిన; ఇడమ్= స్థానము; కాయ్త్త=కాచిన; వాకై=శిరిసెపు చెట్లయొక్క; నెత్త= ఎండినకాయలు; బలిష్ట=శబ్దింపగ; కల్లతర్=రాళ్ళమధ్యలో నున్న; వేయ్జ్గళై=వెదురు బొంగులు; పోయ్=పోయి; తేయ్త్త= రాపిడివలన కలిగిన; తీయాల్=నిప్పులతో; విణ్=ఆకాశమును; శివక్కుమ్=ఎఱ్ఱగాచేసెడి; శింగవేழకున్నమే=శింగవేழకున్న మనెడి క్షేత్రము.

తాత్పర్యము: నాలుగుముఖములుగల బ్రహ్మదేవుడును పరమశివుడును క్రమము తప్పక స్తోత్రము చేయునట్లు విలక్షణమగు నరసింహరూపమును దాల్చి భగవంతుడు వేంచేసియుండు స్థలము అహోబిలక్షేత్రము. దీనినే శింగవేழ కున్న మందురు. ఇచ్చట శిరీష (దిరిశెన)వృక్షములు మెండుగా గలవు. ఈ చెట్లయందలి ఎండిపోయిన కాయలు గాలికి శబ్దించుచుండును. రాళ్ళమధ్యనుండి మొలచిన వెదుళ్ళు ఆకాశము ఎత్తునకు ఎదిగి ఉన్నవి. వాని రాపిడిచే ఏర్పడిన అగ్నిజ్వాలలు ఆకాశమునంత ఎఱ్ఱగా చేయుచున్నవి.

విశేషార్థము: ప్రహ్లాదుని బాధించిన హిరణ్యకశిపుని సంహరించిన విధమును పూర్వపు పాశురమున అనుసంధించిన శ్రీ కలివైరిసూరి ఆ స్వామిని బ్రహ్మాది దేవతలు స్తుతించిన విధమును ఈ పాశురమున అనుభవించుచున్నారు.

నావిత్యాది: ఒకప్పుడు హిరణ్యకశిపునకు భయపడి మనుష్య రూపమును దాల్చి తిరిగిన బ్రహ్మాది దేవతలు, ఆ అసురుడు వధింపబడగనే ఈ క్షేత్రమునకు వచ్చి తమ దేవత్వమునకు తగునట్లు నాలుకలు కాయలు కాచునట్లు శ్రీనరసింహుని స్తోత్రము చేయుచుందురు. దేవతల స్తుతులను అందుకొనుచున్న అద్భుతమగు ఆ నరహరి వేంచేసియున్న స్థలము శ్రీ అహోబిలక్షేత్రము.

కాయ్త్త ఇత్యాది: బాగుగ కాచిన దిరిసినపు చెట్లలోని ఎండిన కాయలు గాలికి శబ్దించుచుండును. రాళ్ళ మధ్యనుండి మొలచిన వెదుళ్ళు ఆకాశావకాశము ఎదిగి ఒరుసుకొను చుండును. ఆ రాపిడి వలన ఏర్పడిన అగ్నితో ఆ వెదుళ్ళు తగలపడుచు ఆ మంటలు ఆకాశమునకంటు చుండును. మేఘావృతమగు ఆకాశము నల్లబారినట్లు ఈ మంటల కాంతులతో ఆకాశమంతయు ఎఱ్ఱబారియుండును. అహోబిల క్షేత్రముయొక్క లోపల భాగము బ్రహ్మాదులు చేయు స్తోత్ర ధ్వానములతోను, వెలుపల భాగము అడవిచెట్లలోని ఎండి పోయిన కాయల శబ్దములతోను కూడియుండును. వృక్షములు కూడ శ్రీనరసింహుని స్తుతించుచున్నవా అనునట్లు ఈ ఎండిపోయిన కాయల శబ్దము వినవచ్చుచుండును. (సశేషం)



# అహో! భారతమ్

(గత సంచిక తరువాయి)

శ్రీమతి టి.కె. చూడామణి-విజయవాడ

అంతలో ఒక విశేషం జరిగింది. యయాతి అనే మహారాజు నహుషుని పుత్రుడు. వేట అంటే మహా ఇష్టం. అడవిలో వేటాడి తిరిగి తిరిగి సరిగ్గా ఆ నూతిగట్టు దగ్గరకి వచ్చాడు. దాహం తీర్చుకోవాలని నీరుందేమోనని లోపలికి తొంగిచూశాడు. లోపల ఒక లతను పట్టుకొని కన్నీరు మున్నీరుగా శోకిస్తున్న దేవయాని కన్పించింది. వరుణుని భార్య భర్తపై కోపించి నీళ్ళు విడిచి భూమిపైకి పోతా అన్నట్లు బెదిరించి వస్తోందా...! అనిపించేలా ఉంది ఆ దృశ్యం. అయ్యో! ఇదేమిటి నువ్వెవరివి? ఇలా పడిపోయావేమిటి బావిలో.. అడిగాడామెను.

కళ్ళుపైకెత్తి చూసింది దేవయాని. ఓ ఈయన యయాతి మహారాజు గదా! అప్పుడప్పుడు నాన్నగారి దగ్గరకి వస్తూపోతూ ఉంటాడు, ఔను. గుర్తుకు వచ్చింది. అనుకుంది. 'ఓ సుందరాంగా! దేవతలకీ రాక్షసులకీ జరిగే యుద్ధంలో మరణించిన రాక్షసులని తన మృతసంజీవనీ విద్యచేత తిరిగి బ్రతికించే శుక్రాచార్యులవారి అమ్మాయిని. నా పేరు దేవయాని. పొరపాటున ఈ నూతిలో పడ్డాను. నన్ను పైకి తీసి రక్షించు అంది. అయ్యో పాపం! అనుకొంటూ తన పొడవైన చేతిని చాపి పద్మంలాంటి ఆవిడచేయి పట్టుకొని పైకి లాగి రక్షించాడు యయాతి. వెంటనే తన నగరానికి వెళ్ళిపోయాడు.

అంతలో ఘూర్ణిక అనే పరిచారిక దేవయానిని వెతుక్కుంటూ వచ్చింది. అమ్మా! రండి పోదాం అంది. ఆ మాట లకి దేవయాని కదలలేదు. కోపంగా నేను ఆ వృషపర్వుని పట్టణంలో అడుగు పెట్టను. శర్మిష్ఠ ఎంత అవమానం జేసిందో చూడు. మా నాన్నగారికి జరిగిన సంగతంతా చెప్పు అంటూ వివరంగా చెప్పి పంపించేసింది. తండ్రి పరుగు పరుగున వచ్చాడు కూతురు దగ్గరకి.

తల్లీ! జరిగినదంతా విన్నాను. దానికి నీకింత కోపం పనికిరాదు.

"వేలయజ్ఞాలు చేసినవారికంటే కోపాన్ని జయించిన వారే గొప్పవారు. జరిగిన అవమానాలను తలవకుండా ఉండ గలిగినవారే ధర్మజ్ఞులు."

కోపాన్ని విడిచి పెట్టు. ఆ శర్మిష్ఠ నీకంటే చిన్నదికదా! దాని చేతలు పట్టించుకోకమ్మా! దా..! ఇంటికి పోదాం అన్నాడు. ఖస్సుమంది దేవయాని. నాన్న... జ్ఞానం లేనివాళ్ళదగ్గర ఉండడమా. ఛీ... ఒక్కక్షణం కూడా ఉండను. నేను రానుగాక రాను". శుక్రాచార్యుడు కూతుర్ని ఒప్పించలేకపోయాడు. సరే, అయితే నీతో నేనూ వస్తాను పద అంటూ ఓదారుస్తున్నాడు.

ఈ విషయమంతా వేగులద్వారా తెలుసుకున్నాడు రాజు. వెంటనే వచ్చేశాడు గురువు దగ్గరకి. స్వామీ! నీ మృతసంజీవనీ విద్యే నాకు నావారికి బ్రతుకులనిచ్చింది. నువ్వు లేకపోతే.. ఏమయ్యేవారం...! మేం నీ దాసులం. మీవారం. మీ అమ్మాయికి ఏం కావాలంటే అదిస్తాను. అమ్మా...! అడుగు తల్లీ అన్నాడు. ఇంతముఖం అయింది దేవయానికి. రాజా నీ మాటే నిజమయితే నీ కూతురు శర్మిష్ఠ వేయిమంది కన్యకలతో సహా నాకు దాసి కావాలి. ఇదే నా కోరిక అంది. వెంటనే శర్మిష్ఠను పిలిపించాడు రాజు. స్నేహితులతో కలిపి ఈ క్షణం నుండి వీరంతా నీ దాసులే! అన్నాడు. తండ్రి ఆజ్ఞకి తలవంచుకుంది శర్మిష్ఠ. ఆనందంతో తలఎత్తింది దేవయాని. అందరూ ఊరిలో ప్రవేశించారు.

ఒకనాడు దేవయాని శర్మిష్ఠతో చెలులతో అదే వనానికి వెళ్ళి విహరిస్తోంది. అందరూ ఆనందంగా ఆడుకుంటున్నారు. అంతలో వచ్చాడు యయాతి మహారాజు. దేవయానిని చూచి గుర్తించాడు. ప్రక్కన ఉన్న శర్మిష్ఠ, స్నేహితులు ఎవరో అతనికి తెలియక మీరంతా ఎవరు? అని ప్రశ్నించాడు.

వెంటనే దేవయాని శర్మిష్ఠను చూపించి ఈవిడ నా దాసి. వీళ్ళంతా కూడా. ఈవిడ రాక్షసరాజు కూతురు. నా సేవచేస్తూ ఉంటుంది.

ఆనాడు నువ్వు సూర్యుని సాక్షిగా నూతినుండి నన్ను బైటికి తీసినపుడు నా చేయి పట్టి పాణిగ్రహణం చేశావు. ఆ విషయం మరిచిపోయావా? ధర్మాన్ని మరిచిపోవడం న్యాయమా! నహుషపుత్రుడివి. ఆనాడు పట్టిన నాచేతిని, పెళ్ళి అనే బంధం ద్వారా మరింత గట్టిగా పట్టి, ఈ శర్మిష్ఠ, దాసీలతో సేవలు స్వీకరించు అంటూ ఒక ధర్మపాశం అతనిపై విసిరి బంధించింది. అదిరిపోయాడు యయాతి. ఏమిటి నీ మాటలు. బ్రాహ్మణులు

క్షత్రియకన్యకలను పెళ్ళి చేసుకోవచ్చుగానీ, క్షత్రియుడు బ్రాహ్మణ కన్యలను పెళ్ళాడరాదు కదా! ధర్మ విరుద్ధంగా పలుకకు. ధర్మాన్ని రక్షించవలసిన నేను అధర్మాన్ని ఆచరిస్తే ఎలా అన్నాడు. మా నాన్న ధర్మజ్ఞుడు. ఆయన ఆజ్ఞాపిస్తే నన్ను పెళ్ళి చేసుకుంటావా...?' ఆ... అటువంటి మహనీయుడు అధర్మాన్ని చెప్పడుగా–అలాగే అన్నాడు యయాతి.

శుక్రాచార్యులకు కబురు చేశాడు. ఆయన రాగానే అందరూ లేచి వందనం చేశారు. దేవయాని ముందుకు వచ్చి నాన్నా ఈ రాజు ఇంతకు పూర్వమే నాపాణిగ్రహణం చేశాడు. నీవు సరేనంటే పెళ్ళాడతానంటున్నాడు. ఆ పని వలన ధర్మం లోపించకుండా అనుగ్రహించు తండ్రీ అంటూ ఏం చెయ్యాలో ప్రార్థనా పూర్వకంగా సూచించింది. వెంటనే శుక్రుడు నీకు జరిగే పెళ్ళిలో అధర్మదోషం రాదు అని వరమిచ్చాడు. వారిద్దరికీ పెళ్ళి జరిపించాడు. శర్మిష్ఠను చూపించి 'ఈవిడ జీవితం ఆనందంగా సాగడానికి అన్ని సౌకర్యాలు కల్పించు. జీవితంలో మాత్రం చోటీయకు' అని శాసించాడు. కూతురిని, అల్లుడినీ శర్మిష్ఠతో, దాసదాసీజనంతో ఆనందంగా పంపించాడు.

యయాతి ఆయన ఆజ్ఞ తలదాల్చి పట్టణం చేరి అందమైన భవంతిలో దేవయానికి వాసం కల్పించాడు. అశోకవృక్షాల వనంలో ఒక ఇంట్లో శర్మిష్ఠని–దాసీగణాన్ని ఉంచాడు. దేవయానితో సుఖంగా గడిపాడు. కొంతకాలానికి వారిద్దరికీ యదువు, తుర్వసుడు అనే ఇద్దరు కొడుకులు పుట్టారు. ఇలా కొంతకాలం సాగింది.

*****

శర్మిష్ఠ తనదురదృష్టాన్ని తలచుకొని తలచుకొని దుఃఖించింది. ఆ దేవయాని ఎంత అదృష్టవంతురాలు! యయాతిలాంటి అందగాణ్ణి భర్తగా సంపాదించుకొంది. అతని వలన సంతానాన్ని పొంది ఇటు తన యౌవనానికి సార్థక్యాన్ని పొందుతూ అటు మాతృత్వపు మధురిమలను చవిచూసింది. నా కంతటి భాగ్యం లేదే...!

ఆ శుక్రాచార్యుడెంత కఠినుడు. భోజనం.. పానీయం.. అలంకారం.. లేపనాదులు.. అన్ని సౌఖ్యాలు రాజు నాకు సమకూర్చవచ్చుట. శయన విషయంలో మాత్రం నన్ను దూరంగా ఉంచాలట. రాజుని ఎలా ఆజ్ఞాపించాడు...! నా మనస్సెప్పుడు ఆ యయాతి రాజునే కోరుకుంటూ అక్కడే చిక్కుకుపోయి ఉంటోంది. ఆయన నాకేసి చూసే చూపుల్లో దయ కాదు కాదు ప్రేమే స్పష్టంగా తెలుస్తోంది. అందుకే ఎలాగయినా సరే నేను కూడా ఆ యయాతినే ఒప్పించి భర్తగా చేసికొంటాను. అప్పుడుగాని నా మనస్సుకి శాంతిలేదు. ఆనందం లేదు. ఈ జీవితానికి సార్థక్యం లేదు.

ఆహా... ఆ యయాతి.. ఎంత అందగాడు. ఆ చూపులు నా మనస్సులో గ్రుచ్చుకొని.. అరె.. అవిగో అవే చూపులు.. నా దగ్గరగా వచ్చేశాయేమిటి..!? అదుగో యయాతి.. స్వామీ... గబగబా అడుగులు వేస్తూ అతని దగ్గరగా అడుగులు వేసింది శర్మిష్ఠ.

యయాతి అశోకవనాన్ని చూసే నెపంతో శర్మిష్ఠను కూడా చూడవచ్చనే కుతూహలంతో ఒంటరిగా ఉన్న ఆవిడవైపు వచ్చాడు. తన మనసులో స్వామి కన్నులముందు ప్రత్యక్ష మయ్యేటప్పటికి సిగ్గులమొగ్గ అయ్యింది శర్మిష్ఠ. నోటమాట రాలేదు. ఎలాగో నమస్కరించింది. తననే నిలువెల్లా చూస్తున్న రాజుతో నెమ్మదిగా మాటలు కలిపింది.

'రాజా! మీరు దేవయానిని పెళ్ళి చేసుకొన్నప్పుడే ఆమె దాసీలమైన మేమంతా నీవాళ్ళం అయిపోయాము. అలా నేనూ నీకు భార్యనే. నాయందు దయచూపు. ఋతుకాలానికి తగిన సంగమాన్ని నీతో కోరుకొంటున్నాను. దయతో నాకోర్కె తీర్చు. నువ్వే నా ప్రాణప్రియుడివి. నా మాట త్రోసిపుచ్చకు' అంటూ తన మనసులోని కోరిక బయటపెట్టింది.

ఒక్కక్షణం మౌనం దాల్చాడు యయాతి. 'బాహ్యమైన భోజన పానీయాది సౌకర్యాలన్నీ కల్పించు. శయన సుఖము తప్ప' అన్న శుక్రాచార్యుని మాటలు ఒక్కసారి గుర్తుకు వచ్చాయి. ఆమెతో ఆ మాటే చెప్పాడు. ఇచ్చిన మాట కాదని అసత్యమెలా చెప్పను అని తన అనుమానాన్ని ప్రకటించాడు.

చిన్నగా నవ్వింది శర్మిష్ఠ. 'రాజా... ధర్మాధర్మాలు నేనా మీకు చెప్పగలిగిన దాన్ని!? ప్రాణాలు పోయే ఆపదలో, ధనం పోగొట్టుకొనే వేళలో, బ్రాహ్మణరక్షణవేళలో, స్త్రీజన సమాగమ సమయంలో, పెళ్ళి కూర్చే సమయంలో అసత్యాలు చెప్ప వచ్చుననే ధర్మం మీకు తెలియనిదా..! ఇపుడు స్త్రీజన సమాగమ విషయంలో ఇంత ఆలోచన ఎందుకు? చెప్పు!'

శర్మిష్ఠ మాటలు యయాతిని లొంగదీశాయి. సహజం గానే ఆమెపై కోరికగల తనకి ఈమాటలు మరింత సహకరించాయి. అతనిలో ఆమెతోడి సంగమకాంక్ష ఒక్కసారి పదిరెట్లుగా పెరిగింది. పైగా ధర్మవిచార చర్చ. భార్య ఆస్తి భర్తకి చెందదా.. దేవయాని దాసి తనకీ చెందుతుంది. తప్పేమీ లేదు.. అందుకే.. యయాతి శర్మిష్ఠలు ఒక్కటయ్యారు. శర్మిష్ఠ గర్భవతి అయ్యి ఒక బాలునికి జన్మనిచ్చింది. *(తరువాయి సంచికలో)*

# మన దర్శనం 'సు' దర్శనం

పూర్వమీమాంస
వైశేషిక
న్యాయ
యోగం
సాంఖ్య

వైశారదీ

*(గత సంచిక తరువాయి...)*

పూర్వకాలంలో పెద్దల సలహాలననుసరించి పరిశోధనలు సాగించడమే మంచిపద్ధతి అనుకునేవాళ్ళు. ఇప్పటిలాగా తమకు తోచినట్లుగా విశృంఖలమైన ఆలోచనలు చేసేవాళ్ళు కాదు. అంటే ఒక పరిశోధకుడు చేసిన పరిశీలను గమనించి దానిలో అవసరమైన మార్పులు, చేర్పులతో వైజ్ఞానికులు క్రొత్త, క్రొత్త పరికరాలు కనిపెడుతున్నట్లే ఋషులు కూడా పూర్వ పరిశోధన లను అర్థం చేసుకుని, తమ పరిశోధనలు కొనసాగించే వాళ్ళు.

**ఇతి శుశ్రుమ పూర్వేషాం... యేనస్తత్ వ్యా చ చక్షిరే...,** "మా పూర్వులు చెప్తే ఇలా విన్నాం" అంటారని ఉపనిషత్తులలో కన్పిస్తుంది. ఆ పెద్దల దగ్గర వినేటప్పుడు కూడా ఎంతో వినయ, విధేయతలు కల్గి ఉండేవాళ్ళు ఆనాటి తత్త్వ జిజ్ఞాసువులు. స్వయంకృషితో మనస్సుని శుద్ధి పరిచేకంటే పెద్దల సహాయం కూడా తీసుకుంటే... ఈ పని సులభతరం అవుతుంది అని ఈ మనస్సుని పెద్దల ముందు వంచడం అలవాటు చేసారు. మనస్సుని వంచితే అది తిరగబడి 'నమస్స'వుతుంది. అంటే 'వంగడ'మన్నమాట.

నమస్కారమంటే అహంకారం లేకుండా 'పెద్దలముందు వంగుట' అని అర్థం. నిరహంకారస్థితిలో పెద్దల సహకారంతో స్వయంకృషిని జోడించి స్వచ్ఛమైన మనఃస్థితిని సాధించి తత్త్వ దర్శనానికి ప్రయత్నించారు మహానుభావులైన ఋషులు. ఊళ్ళల్లో ఉంటే తమ సాధన దుర్లభమని – ఊళ్ళోకి దూరంగా జనావాసాలకి దూరంగా ప్రశాంతవనాల్లోకి తపశ్చర్యకై చేరేవాళ్ళు.

అయితే వనాలలో నివసించినంత మాత్రం చేత మనసులో వాసనలన్నీ పోవు. అలానే పట్నాలలో నివసించినంత మాత్రంచేత మనో నైర్మల్యం ఉండదు అనీ అనలేం. అటుదిటు కూడా అవుతూండవచ్చు సామాన్యంగా.

కించిత్ వైరాగ్యమే తత్త్వచింతనకు శ్రీకారం

మన తత్త్వద్రష్టల విషయానికొస్తే లోకానికి విషయాలు నేర్పడం కోసం వాళ్ళకవసరం లేకపోయినా ఆదర్శవంతమైన సూత్రాలను పాటించేవాళ్ళు. ఊళ్ళల్లో ఉండటంచేత తాత్త్విక చింతన దృష్ట్యా ఆటంకాలు ఎక్కువ ఉన్నాయి కనుక సాధకుడికి 'నిష్ప్రమాదకరమైనచోటు, నిర్భయమైనచోటు సాధనకి మొదటి అవసరాలు' అని చెప్పటం కోసం తాము ముందు ఆచరించి చూపాలని ఆంతరముగా విషయసుఖాలని దూరంగా ఉంచి బాహ్యంగా కూడా తమ తాత్త్విక చింతన వంటి భావన లేనివాళ్ళ నుంచి తమని దూరం చేసుకున్నారు.

ఎప్పుడు కించిత్ వైరాగ్యం కలిగితే అప్పుడు తత్త్వ చింతన అనే తపస్సును ఆరంభించమన్నారు. దానికి నీ ఇల్లే ప్రథమసోపానం. విలాసాలు తగ్గించుకోవడం కూడా అవసరం. అవకాశం, సామర్థ్యం ఉండగానే తగ్గించుకోవాలి. ఈమూడూ లేనపుడు వాటిని పొందమన్నా పొందలేడు కదా! దాన్ని 'తపస్సు' అనరు. అవకాశం ఉండీ వదిలిన వాడిని 'త్యాగి' అంటారేకాని... దొరకనపుడూ చేతకానివాడూ త్యాగం చేయడమేమిటి!?

విషయ సుఖాలు దగ్గర్లో ఉన్నట్లయితే ఎప్పటికైనా అవి తమ వైపు మనలను మరల్చుకోవచ్చు... అంకురించే సాధనని ఆరంభంలోనే అంతం చేసేయవచ్చు కూడా! ఇదే ఋషుల తపస్సుకి మొదటి మెట్టు. దీన్ని కొద్దో, గొప్పో గుర్తించి, విషయ సుఖాలను దూరంగ పెట్టారు. సాధనను సంరక్షించుకొనే కృషిని ప్రారంభించారు. తామిందులో నిలకడ పొందడం ప్రారంభం కాగానే, ఇదే విధానాన్ని మిగిలినవారిని కూడా అలవరచు కోమని వారుపదేశించారు. అంటే ఉదాహరణకి పూర్ణభోజనం చేసేవాడు పక్షానికి ఒక్కరోజైనా మానివేయగలిగితే... కనీసం తగ్గించగల్గితే – అదికూడా ఒక తపస్సే అన్నారు. ఇలాగే తానునుభవించే విలాసాలలో ఏకాస్త వ్యర్థ భోగాలను తగ్గించు కోగలిగినా అది కూడా 'తపస్సే' అంటూ నిరాడంబరమైన జీవితం వైపు మన మనస్సులని తిప్పే ప్రయత్నం చేశారు.

తపోవనాలలో ప్రశాంతంగా జీవిస్తూ దర్శించదలచిన సత్యతత్త్వం మీద, ప్రేమ, విశ్వాసం పెంచుకున్నారు. ఇలా, వన్యజీవనం అపేక్షించడంలో బహుశా రెండుద్దేశ్యాలు వాళ్ళలో ఉండి ఉండవచ్చు. ఒకటి మనిషి మనిషిని మాత్రమే కాక ఇతర ప్రాణికోటిని కూడా తనవలెనే ఆదరించగలగాలి.

కారణాంతరాల చేత శరీర నిర్మాణంలో తేడాలున్నా, జీవన పద్ధతుల్లో మార్పులున్నా, జంతువులు, పక్షులేమి.. వృక్షాలు... లతలేమి! అవన్నీ కూడా ప్రాణులే! తాను కొంత అధికశక్తి కలిగియున్నా, అవి క్షుద్ర ప్రాణులైనా జీవించడమనేది అందరికీ సమానమే కదా!

జన్మని సార్థక పరచుకోవడం కూడా అన్ని జాతులకీ అవసరమే! ఇదీవాళ్ళ ఆలోచనా ధోరణి. "తాను తెలుసు కున్నందువల్ల చేసే సాధనని, తెలివిలేనందున చేయలేక పోతున్నాయే

అవి" అని మిగతా జంతువుల మీద జాలిగుండె కలిగి ఉండేవాళ్ళు. అంతేకాదు అజ్ఞానంతో పరస్పరం హింసించుకునే క్రూరమృగాల మీద కూడా తమ కరుణార్ద్రదృక్కులని మన ఋషులు ప్రసరించారు. ఈ ప్రేమ ప్రభావంవల్ల ఆయా ఋషుల ఆశ్రమ ప్రాంతాల్లోకి చేరితే పులి, మేక, ఏనుగు, సింహంలాంటి జన్మవైరం కల్గిన ప్రాణులు కూడా "తత్సన్నిధౌ వైరత్యాగః" అని యోగసూత్రం చెప్పినట్లు అవి పరస్పరం వైరాన్ని మరచిపోయేవి. సాధుజంతువుల్లా కలిసి తిరుగుతూండేవట! ఇలాంటి రాగద్వేషాలకు అతీతమైన స్థితి మనం సాధించి మన వాళ్ళకందించాలి అని వాళ్ళు ఆచరణద్వారా నిరూపించారు. ఇదీ ప్రయోజనం.

వనం కూడా బాహ్యప్రపంచంలో భాగమే అయినా అక్కడ నివసించే ప్రాణికోటి అయిన జంతువులు, వృక్షాలు కూడా నిష్కారణంగా ఎవర్నీ బాధించవు. మిగిలిన మనుషులు అలాకాదు కదా! ఆదరించినా ప్రమాదమే! అనాదరించినా ప్రమాదమే! ... నిర్బంధాలు.. డిమాండ్లు... కసరడం.... తిట్టడం... ద్వేషించడం... అసూయపడటం... కలతలు... కక్షలు... కావేషాలు... కార్పణ్యాలు... ఓహ్! .... ఒకటేమిటి? కొల్లేటి చాంతాడులా ఎన్నెన్ని చెప్పగలం!? చెడంతా ఇక్కడ్నించే వస్తుంది.

జంతువులు, చెట్లు అయితే పెడితే తింటాయి. లేకపోతే ఊరుకుంటాయి. డిమాండ్ చేయవు. ఎప్పుడో పెట్టిందైనా జ్ఞాపకం పెట్టుకొని విశ్వాసంతో ఉపకరిస్తాయి. పాపం అమాయక ప్రాణులు! అందుకే అలాంటి వాటితో కలసి జీవిస్తూ సమదర్శనం కలిగియుంటే, ముందు మనస్సు శుద్ధం అవుతుంది. అపుడు వస్తువులయొక్క తాత్త్వికస్థితి గోచరిస్తుంది. ద్రష్టలంతా అలా గోచరింపచేసుకున్నవాళ్ళే! తమకు, తమకు కల్గిన సాక్షాత్కారాన్ని తమకి నచ్చినరీతిలో లోకానికందించారు.

దర్శనాలు విభిన్నాలుగా కన్పించినా పరస్పరం విద్వేషాలు మాత్రం ఎవ్వరికీ లేవు.

# నేర్చుకుందామా - 4

**నీ పద్యావళులాలకించి చెవులున్ నిన్నాడు వాక్యంబులున్**
**నీపేరంబనిసేయు హస్తయుగముల్ నీమూర్తిపై జూపులున్**
**నీ పాదంబుల పొంత మ్రొక్కు శిరముల్ నీసేవపై చిత్తముల్**
**నీపై బుద్ధులు మాకు నిమ్ము కరుణన్ నీరేజ పత్రేక్షణా ॥** *ఆంధ్ర మహాభాగవతం దశమస్కంధం*

నల్లనయ్య అల్లరి భరించలేని యశోదమ్మ తాటితో రోటికి కట్టినపుడు, రెండు మద్దిచెట్లమధ్యగా రోటిని ఈడ్చుకొనిపోయి వాటి శాపం తీర్చాడు స్వామి. నలకూబరుడు, మణిగ్రీవుడు శాపవిముక్తులై స్వామిని స్తుతించిన శార్దూల పద్యమిది. మ స జ స త త గ అనే గణాలుంటాయి.

కమల పత్రములవంటి నేత్రములు గల స్వామీ! మా ప్రార్థన నాలకించి మాకు మంచి దేహాన్ని, జీవితాన్ని ప్రసాదించు. మా ఇంద్రియాలన్నీ నీ సేవలోనే చరితార్థం కావాలి. ఎలాగంటే –

మాచెవులు ఎప్పుడూ నిన్ను గురించిన స్తోత్రాలనే వింటూ ఉండాలి. మా నాలుక పలికే మాటలన్నీ నీ చరిత్రనే పలికే మాటలు కావాలి. మా చేతులు నీసేవలు చేయడంలోనే నిమగ్నం కావాలి. మా చూపులు నీ దివ్యమంగళ విగ్రహసౌందర్యాన్నే ఆస్వాదిస్తూ ఉండాలి. మా తలలు నీ పాదారవిందములకే నమస్కరిస్తూ ఉండాలి. అసలు మా మనస్సే నీ సేవకి అంకితం కావాలి. మా ఆలోచనలన్నీ నీ చుట్టూనే తిరుగుతూ ఉండాలి. అలా దయతో మమ్మల్ని అనుగ్రహించు స్వామీ... అని

ఈ ప్రార్థన ప్రతినిత్యం మనమందరం చేయవలసిన ప్రార్థన. ఈ సంసార సాగరంలో కొట్టుమిట్టాడే మనం మన జీవితాన్ని, మన శరీరాన్ని, మన ఇంద్రియాలన్నింటిని భగవత్ సేవకే అంకితం చెయ్యాలి. విచిత్రాదేహ సంపత్తిః ఈశ్వరాయ నివేదితుమ్ – అన్నమాట ప్రతిక్షణం గుర్తుకు తెచ్చుకుంటూ భగవత్ సేవకే ఈ జీవితాన్ని అంకితం చేద్దాం. ఆ సేవలో తరిద్దాం! పద్యాన్ని వెంటనే కంఠస్థం చేద్దాం.



# సీతాఫలం రామార్పణమ్



శ్రీమతి చెవుటూరి కుసుమకుమారి - హైదరాబాద్

*గత సంచిక తరువాయి..*

ఆ విధంగా సూతమహర్షిచే చెప్పబడిన అరుంధతీ శాప వృత్తాంతమును విన్న నైమిశారణ్య ఋషులు 'సూతమహర్షీ! సీత బాలికకదా! అకృత్యము చేసినదే అనుకున్ననూ అరుంధతి ముందెప్పుడో రానున్న ఆమె భర్తను శపించుట తగునా? ఇట్టి వింత ఎక్కడైనా వున్నదా?' అని అడిగినారు.

**పతిపుణ్యార్థ భాజ్నాదీ నహిపత్స్యఘ భాగభాగభాక్ ।**
**నపత్నీ పుణ్య భాగ్భర్తా భవేత్ పాపార్థ భాగ్భవేత్ ॥**

"మహర్షులారా! భార్యకు భర్తపుణ్యములో సగపాలు లభించును. కాని, భర్త పాపములో మాత్రము భాగములేదు. కాని భార్యపుణ్యములో భర్తకు భాగములేదు. భార్యచేసిన పాపములో భాగమున్నది. కనుక, సీతాపతికి సీతచేసిన దుష్కృతమువలన పూర్వజ్ఞాన విహీనత తప్పదు' అని ధర్మసూక్ష్మమును వివరించి అనంతర కథా విశేషమును చెప్ప సాగాడు. (అందుకే కాబోలు వాల్మీకి రామాయణమున చివరివరకు శ్రీరాముడు **విద్ధిమాం దశరథాత్మజం** అంటూ వున్నాడు. విధాత తానుగా నీవే మహావిష్ణువు అని చెప్పేవరకు తానెవరో తెలియనట్లు అనిపించును కదా!) ఆవిధంగా అరుంధతీసాధ్వి సీతకిచ్చిన శాపములను విన్న జనక మహారాజు పరుగు పరుగున వచ్చి అరుంధతికి నమస్కరించి

**బాలయా లీలయా కార్యేకృతే క్రోధే నయుజ్యతే ।**
**క్షీరకంధ్యేచ సీతాయై శాపదానం న తే క్షమమ్ ॥**

అమ్మా అరుంధతీదేవీ! చిన్నతనమున ఆటకారితనముగా సీత చేసిన తప్పిదమునకు నీవింత ఆగ్రహించుట యుక్తము కాదు. ముక్కుపచ్చలారని బాలికను శపించుట నీవంటి సాధ్వికి తగిన పనికాదు అని ప్రార్థించాడు.

జనకుని మాటలకు అరుంధతీదేవి

**అహో రాజా! త్వవ సుతా బాలా వాऽకృత్యకారిణీ ।**
**దీపోऽల్పోపి మహాంతం చ చుబుకం దాహయేన్నవా ॥**

"జనకమహారాజా! అంతటి అకార్యము చేసిన నీ పుత్రిక బాలిక అనా నీ ఉద్దేశ్యము? 'దీపమును చిన్నది కదా! అని ముద్దుపెట్టు కొనిన-పెద్దవాడు కదా అని కాల్చక మానునా?' ఇది కూడ అటువంటి చేష్టయే సుమా! రాజా నీకుమార్తె చేసిన పనులు నీకు ఆనందము కావచ్చును. కానీ, నాకు బాధాకరము. ప్రమాదకరము కదా! తాను సర్వేశ్వరినినీ, నాకెవ్వరూ ఇక్కడ దిక్కులేరనీ, పనిచేసిననూ అడ్డుకొనువారు లేరనీ అహంకారముతో అవిధేయురాలై ఈ విధముగా ప్రవర్తించినది కానీ, వేరుకాదు" అని ఆగ్రహముతో పలికినది అరుంధతీదేవి.

ఆ మాటలకు జనకమహారాజు "అరుంధతీదేవీ! నా కుమార్తె చేసిన తప్పును మన్నించు. అమ్మా! పిచ్చుకమీద బ్రహ్మాస్త్రమన్నట్లు నీవీ పసిపిల్లమీద ఆగ్రహించకు. ఆమెకిచ్చిన శాపమును ఉపశమింప చేయుము" అని ప్రార్థించాడు.

అప్పుడా అరుంధతీదేవి తన దగ్గరలో నిలబడి వున్న సీతను పిలిచి "సీతా! నీవు ఆటలాడు కొనుచోట ఒక శివధనస్సు వున్నది కదా! ఒకసారి దానిని ఈ బృందావనానికి తీసుకొనిరా" అని పలికినది.

చెప్పినదే తడవుగా సీత పరుగెత్తివెళ్ళి ఆ మహోన్నత శివధనువును తనరెండుచేతులతో పట్టుకొని తెచ్చి అరుంధతి ముందు పెట్టినది. ఆ దృశ్యమును కనులారా! చూచిన జనక మహారాజు, అంతఃపుర స్త్రీలు నిశ్చేష్టులై చూస్తూ వుండి పోయినారు. విస్మయంతో మెదలకున్న జనకమహారాజుతో

**"రాజం తవ సుతా బాలా ప్రౌఢా! వా దేవతా వద"**

"రాజా! ఇప్పుడు చెప్పు నీ కుమార్తె బాలికా? ప్రౌఢా? లేక దేవతా? నీవే యోచించి చెప్పు" అనిన అరుంధతితో మహాశ్చర్య బలసంపన్న అయిన ఈ మహోత్తమ బాలిక ఎవరో? సత్యము ఏమిటో మహావ్రతురాలవైన నీవే చెప్పుమని కోరినాడు.

**ఇదం దేవరహస్యం తు జానీహి త్వం నృపోత్తమా! ।**
**యత్రేయం సంస్థితా కన్యా తత్ర శ్రీస్యా నృపోత్తమా!**

జనకమహారాజా! నీవు అడిగిన సంగతి దేవరహస్యము. కనుక చెప్పతగినది కాదు. కానీ ,ఈమె ఎక్కడ వున్న అక్కడ సిరి వున్నదని గ్రహించుము. రాజా! ఈ భూమిసుతకు నేనొక వరాన్ని స్తాను. ఇతరులు ఎవరైనా స్తోత్రము చేసినప్పుడే ఈ సీతాపతికి పూర్వజ్ఞానము కలుగును. జనకరాజా! నీపూర్వ పుణ్యఫలముగా నీకు ఈమె కుమార్తెగా ప్రాప్తించినది" అనెను.

**"అనర్హాయ సుతాం దాతుః పితుర్నాస్త పరోరిపుః"**

రాజా! అర్హుడుకానివానికి కూతురిని యిచ్చిన తండ్రికంటే శత్రువు మరొకరు లేరని గ్రహించు. కనుక తగిన వరునికే ఈమెను యిమ్ము అని చెప్పినది. అంతట జనకుడు అమ్మా! అరుంధతీ నీకు

తెలియని రాజపుత్రులు వుండరు కనుక సీతకు తగిన మహా వీర్యవంతుడైన రాజపుత్రుని ఒకనిని తెలియజేయుమని ప్రార్థించాడు.

అపుడు అరుంధతి 'జనకరాజా! నీకుమార్తెకు తగిన వరుని తెలియజేయుటకు బ్రహ్మకూడా సమర్థుడు కాదు. యింక నేనెంత దానను! అయిననూ నీ పుత్రికకు తగిన వరుని తెచ్చుటకు తగిన ఉపాయమును మాత్రము తెలియజేయగలను.

**నిటలాక్షేణ సాక్షాద్దిపురాధృత మిదం ధనుః ।**
**లీలయోః పాణిభ్యామానీతం సుతయాతవ ॥**

జనకమహారాజా! పూర్వమెన్నడో సనాతనుడైన శంకరుడు ధరించిన ధనస్సును అవలీలగా నీసుత తన చేతులతో పట్టి తెచ్చినది కనుక

**ధనురారోపణం యస్తు కరిష్యతి నృపాత్మజః ।**
**తస్మై కన్యా మిమాం దేహి తత్ సుతార్వో వరశ్చసః ॥**

ఈ ధనువును ఎక్కుపెట్టిన వానికే నీకుమార్తెను ఇమ్ము. అతడే ఈమెకు తగిన భర్త అని చెప్పినది. మహామహిమాన్విత మైన అరుంధతీదేవి మాటలను విన్న జనకమహారాజు ఈ శివధనస్సును ఎవడెక్కుపెట్టునో, వానికే నా కుమార్తె సీత నిచ్చెదనని ప్రమాణపూర్వకముగా పలికినాడు.

సీతాదేవి కూడా కన్నె తులసినోమును యథావిధిగా పూర్తి చేసి, అరుంధతి మొదలైన పుణ్యాంగనలను యథోచితంగా సమ్మానించినది. అందరూ సీతను ఆశీర్వదించి ఎవరిళ్ళకు వారు వెళ్ళినారు.

మహర్షులారా! భూమిసుత, విదేహరాజపుత్రి సీతాజనన విచిత్ర లీలాచరిత్రను విన్నారు కదా! విన్నవారికి మరు జన్మలేని శ్రీరామకథను పూర్వాపర సహితముగా చెప్పెదను వినుడు. అని సూతమహర్షి రామకథను కొనసాగించినాడు.

### శ్రీరాముని తీర్థయాత్రలు - యోగచింతన

నైమిశారణ్యమునులు సూతమహర్షీ! శ్రీరాముని విద్యాభ్యాసము తరువాతి కథను మాకు తెలుపుమని కోరారు. వారి అభ్యర్థనకు సంతసించి చెప్పటం ఆరంభించినాడు. మహర్షులారా! శ్రీరాముడు గురుకులవాసములో బ్రహ్మచర్యోచిత సమస్త విద్యలను నేర్చి గురుకుల వాసమును పూర్తి చేసుకుని, తలిదండ్రులతో బంధుపరివారముతో అయోధ్యలో నివసిస్తూ వుండగా, శ్రీరాముని మనస్సు తీర్థయాత్రలవైపు మళ్ళినది.

**రాఘవ శ్చింతయిత్వైవ మువాచ పితరం ప్రతి ।**
**తీర్థాని దేవసద్మాని వనా న్యాయతనానిచ ॥**
**ద్రష్టుముత్కంఠితం తాత మమేదం నాథ మానసమ్ ॥**

తండ్రి దశరథునివద్దకు వెళ్ళి తండ్రీ! పుణ్యతీర్థయాత్రలు చేయవలెనని నామనస్సున అమితమైన కోరిక నిలువనీయ కున్నది. కనుక నాకు అనుజ్ఞనిమ్మని అడిగినాడు. వెంటనే దశరథుడు కులగురువు వసిష్ఠునితో సంప్రదించి శ్రీరాముని తీర్థయాత్రలకు అనుమతించినాడు.

సోదరులతోను, వసిష్ఠునిచేత పంపబడిన పండితగణము తోనూ కలసి బయలుదేరి కోసల రాజ్యాన్ని దాటినాడు. అక్కడి నుండి అనేక పవిత్రనదీతీరాలను వనాలను దాటి చంద్రకాంతిసన్నిభ గంగాతీరానికి చేరాడు. అక్కడి నుండి నల్లకలువవంటి యమునను, సరస్వతి, శతద్రూ, విపాశ, చంద్రభాగ, ఐరావతి, కృష్ణవేణి, నిర్వింధ్య, చరణ్వతి, వితస్త, విపాశ, సరయూ, బాహుదా నదులను స్నానదానాదులు ఆచరిస్తూ దాటినాడు. ప్రయాగ, నైమిశారణ్య ధర్మారణ్య, గయ, కాశీ, శ్రీశైలము, కేదారము, పుష్కరక్షేత్రము, అగ్నితీర్థము, మహాతీర్థము, ఇంద్రద్రుమ్నతీర్థములను అనేక పవిత్ర దేవ బ్రాహ్మణ ఆశ్రమములను ఆరునెలలలో యథావిధిగా దర్శించినాడు. ఆవిధంగా సమస్త భూమండలాలన్నీ దర్శించి శ్రీరామచంద్రుడు అయోధ్యకు తిరిగి వచ్చి తండ్రికి గురువులకు, తల్లులకు, బ్రాహ్మణులకు, కులవృద్ధులకు నమస్కరించాడు. తీర్థయాత్రా విశేషాలను స్మరిస్తూ కొంతకాలము గడిచినది.

**కృతాయాం తీర్థయాత్రాయాం రామో నిజగృహే ।**
**జగామానుదినం కార్శ్యం శరదీవామలం సరః ॥**

తీర్థయాత్రనుండి వచ్చిన రాముడు ఇంటియందే వుండి శరత్కాలనీరెండి కృశించిన సరస్సులా కృశించిపోతున్నాడని తండ్రి దశరథ మహారాజునకు అనిపించింది. ఎందుచేతనో నేత్రాలతో విశాలఫాలంతో కూడిన శ్రీరామచంద్రుని ముఖబింబము వెలవెల పోతున్నది. శరీరం కృశిస్తున్నది. ఎవరితోనూ మాటలాడక చిత్తరువువలే మిన్నకున్నాడు. సేవకులు ఎంత ప్రాధేయపడిననూ నిత్యకృత్యములను తగిన సమయమున చేయుటలేదు.

పుత్రా! నీకెందుకీ విచారమని మృదువుగా అడిగిననూ చెప్పక తండ్రీ! నేను బాగుగనే ఉన్నానని అనునుగానీ, మనసులోని మాట చెప్పడాయెను. చేరదీసిననూ దగ్గర కూర్చొనునేగాని ఒక్కమాటైననూ పలుకడయ్యె! ప్రియపుత్రుని ఆవిధంగా చూడలేని దశరథుడు వసిష్ఠునివద్దకు వెళ్ళి ఇట్లు జరుగుటకు కారణమేమని అడిగినాడు. కొంతసేపు యోచించిన వసిష్ఠుడు రాజా! నీవు విచారించకు. అట్లు చింతించుటకు తగిన కారణమున్నదని ఈవిధంగా చెప్ప సాగాడు. (సశేషం)

# ముముక్షు రహస్యం

శ్రీమతి చక్రవర్తుల చూడామణి -ఖమ్మం

(గతసంచికతరువాయి...)

"ప్రతిభక్కా.. ఆనవాలు చెప్పటమంటే ఏమిటి?" గోదా అడిగింది .

"నీకిప్పుడు ఆనవాలుతో అవసరమేం వచ్చింది తల్లీ!"

"పెద్దమామ్మ ఆనవాలు చెప్పానా కబంధుడిలాగా" అని గొణుక్కొంటోంది."

"మరి మామ్మనే అడగలేకపోయావా!"

"మామ్మ చెపితే అర్థంకాదు. ఏవన్నా మధ్యన అడిగామో కోపం వస్తుంది. నువ్వంటే మంచిదానవు. ఎంచక్కా అర్థమయ్యేట్టు చెపుతావు...!

"అబ్బో... గోదా... పని కావాలంటే ఎదుటివాళ్ళకు ఐస్ పెట్టడం నేర్చావే...!"

"కబంధుడెవరు? ఆనవాలు ఏం చెప్పాడు? ఎవరికి చెప్పాడు? ఎప్పుడు చెప్పాడు?"

"శ్రీరామాయణంలో సీతను రావణుడు అపహరించుకు పోయాక ఆమెను వెతుకుతూ రామలక్ష్మణులు క్రౌంచారణ్యం లోకి వచ్చారు. అక్కడ వాళ్ళకు కబంధుడనే దానవుడు తారసపడ్డాడు."

"దానవులంటే ఎవరక్కా?" వేంకట కృష్ణ అడిగాడు.

"నువ్వెప్పుడొచ్చావు? పిల్లిలా వెనుక కూర్చున్నావేం? ముందుకురా...! దనువంశస్థులను దానవులంటారు. ఆ వంశంలో "శ్రీ" అనే రాజుకొడుకు ఈ కబంధుడు. స్వతహాగా అందగాడే. కాని, వాళ్ళకున్న కామరూపశక్తితో వికృతరూపంలో ఆ అరణ్యంలో ఉన్న తాపసులను భయపెట్టేవాడు."

"అలా ఎందుకు చేశాడు? అనవసరంగా ఇతరులను భయపెట్టడం తప్పుకదా!"

"అందుకే తగిన శిక్ష అనుభవించాడు. ఒకసారి స్థూల శిరుడనే మహర్షి వనంలో కందమూలాలు ఏరుకుంటుంటే భయంగొలిపే వికృతరూపంలో వెళ్ళి ఆయనను భయపెట్టాడు. ఆ ముని నిజం తెలుసుకొని కోపంతో... "ఈ రూపంతోనే శాశ్వతంగా ఉండి లోకుల నిందలకు గురవుతావు" అని శపించాడు.

అప్పుడు ఈ కబంధుడికి బుద్ధొచ్చి పశ్చాత్తాపంతో ముని కాళ్ళమీదపడి శాపవిమోచనం కోసం ప్రార్థించాడు. ఒకసారి శాపమిచ్చాక వెనక్కి తీసుకోవటం కుదరదు కాబట్టి అనుభవించక తప్పదన్నాడు. ఆ తరువాత కబంధుడు బ్రహ్మకోసం చాలాకాలం తపస్సు చేసి దీర్ఘాయుష్షు కావాలని అడిగాడు. బ్రహ్మకూడా అనుగ్రహించాడు."

"ఆ వికృతరూపంతోనా దీర్ఘాయుష్షు? ఈ జన్మ త్వరగా ముగించి ఇంకోజన్మలో మంచిరూపంతో దీర్ఘాయుష్షు అడిగి ఉండొచ్చుగా..." కృష్ణ.

"నీ అంత తెలివి అతనికి లేదులే..." వేద.

"నిజమేరా! వాడు మందబుద్ధి కాబట్టే ఈ రూపంతో దీర్ఘాయువువరం పొందాడు. అంతటితో ఆగాడా! వరగర్వంతో ఇంద్రుడితో యుద్ధానికి దిగాడు. ఇంద్రుడు వజ్రాయుధం ప్రయోగించాడు. అది శత్రుసంహారం చెయ్యగలిగి ఉండి కూడా బ్రహ్మవరం పొందినవాడు కాబట్టి కబంధుడిని చంపలేక పోయింది.

"భలే...! భలే...!" చిన్నా.

"కాని వజ్రాయుధం ఏం చేసిందో తెలుసా? తొడలను పొట్టలోకి, తలను గుండెలోకి నెట్టివేసింది..."

"అమ్మో! ఎంత భయంకరం! ఉత్తమొండం దానికి పొట్టలో కాళ్ళు, గుండెల్లో తలా... ఊహించకుంటేనే భయంగా, జుగుప్సగా ఉంది."

"అప్పుడు వాడు ఇంద్రుడిని ప్రార్థించాడు. ఆ పొట్టనుంచే ఒక యోజనదూరం పొడవు ఉండే రెండు చేతులు, పొట్టలోకి పోయిన తలకి, ఎర్రగా చింతనిప్పులా ఉండే కన్నొక్కటి, కోరపళ్ళు ఉండేట్టు సంకల్పించాడు. అలాంటి రూపం కలిగింది కాబట్టి కబంధుడని పేరు వచ్చింది. పొట్టలోనే అన్ని అవయవాలు ఉండటమన్నమాట. వాడు అప్పట్నుంచి ఆ క్రౌంచారణ్యంలో ఉంటూ యోజనం పొడవున్న తన చేతులను చాపి వాటికందిన జంతువులను, మనుషులను తింటూ కాలం గడుపుతున్నాడు.

"మరి రామలక్ష్మణులకు కబంధుడికి ఏమిటి సంబంధం?"

"జనస్థానం నుంచి సీతను వెతుకుతూ క్రౌంచారణ్యానికి వచ్చారు రామలక్ష్మణులు. అలా అక్కడికి వచ్చినప్పుడు ఈ కబంధుడి చేతికి చిక్కారు. వెంటనే కబంధుడు వాళ్ళను ఆహారం చేసుకోవాలని ప్రయత్నించాడు. దానికంటే ముందే రామలక్ష్మణులు వాడి రెండు చేతులను నరికేశారు. ఆ బాధతో అప్పుడు అరచిన అరుపులకు ఆ అడవంతా దద్దరిల్లింది. అప్పుడు దేవేంద్రుడు ఈ చేతులిచ్చేటప్పుడు చెప్పిన మాటలు గుర్తొచ్చాయి. "భగవదవతారమైన రామలక్ష్మణులు ఇక్కడికి వస్తారు. వాళ్ళు నీ చేతులను నరికేస్తారు. అప్పుడు నీ శాపవిమోచనం కలుగుతుందని" చెప్పాడు ఇంద్రుడు. కాబట్టి వీళ్ళు రామలక్ష్మణులే కావొచ్చని ఊహించాడు. అయినా సందేహ నివృత్తికోసం అడిగాడు. లక్ష్మణుడు తమకథ అంతా చెప్పి తన వదినగారైన సీతాదేవిని వెతుకుతూ తాము ఈ అడవికి వచ్చినట్టు చెప్పాడు.

"నా ఊహ నిజమయింది. నాకు త్వరగా అగ్నిసంస్కారం చేయండి. అప్పుడు నేను నా పూర్వస్వరూపంతోపాటు జ్ఞానాన్ని పొందుతాను. మీకు సీతాన్వేషణకు సహకరించే మిత్రుడిని చూపిస్తాను" అన్నాడు.

"కాలిస్తే చచ్చిపోతాడు కాని కొత్తరూపం ఎలా వస్తుంది?"

"అగ్నికి మలినాలను దహించివేసే శక్తి ఉంది కదా! ఈ రాక్షసుడిలోని వికృతరూపాన్ని, వికృత ఆలోచనలను అగ్ని దహించి వేస్తుంది. పరిశుద్ధమైన ఆత్మ దాని నుంచి బయటకు వస్తుంది. దైవాంశ సంభూతులు కాబట్టి రామలక్ష్మణులు ఆ ఆత్మను చూడగలుగుతారు. సామాన్యులకు సాధ్యం కాదు. ఈ కాలంలో అసలే కాదు."

"అక్కా చిన్నా ఏదైనా ప్రయోగం చెసినాచేస్తాడు"

"ఏరా చిన్నా చేస్తావా! చెయ్యకూడదు. అది త్రేతాయుగం. ఇది కలియుగం. కాలాన్ని బట్టి గుణాలు, ధర్మాలు మారతాయి. సరే కబంధుడిని రామలక్ష్మణులు ఆ అడవిలో దొరికిన ఎండుకట్టెలు పేర్చి కాల్చేశారు. దానిలోంచి వచ్చిన సుందర రూపుడైన కబంధుడు రామలక్ష్మణులు సీతాన్వేషణలో ఎటు వెళ్ళాలో, ఎవరి స్నేహం చేయాలో చెప్పాడు.

"సుగ్రీవుడితో స్నేహమేగా...!"

"సుగ్రీవుడు సూర్యుడి ఔరసపుత్రుడు. ప్రస్తుతం పంపానది తీరంలోని ఋష్యమూక పర్వతంమీద తన సన్నిహితులతో ఉంటున్నాడు. తన అన్న వాలివలన రాజ్యం పోగొట్టుకోవటమే కాక రాజ్యం నుంచి తరిమివేయబడ్డాడు. అతడు చాలా గుణవంతుడు. అతని సహాయంతో సీతాన్వేషణ చేయండి" అని చెప్పాడు.

"అంతకంటే ముందు మతంగముని ఆశ్రమంలో మీరాక కోసం వేయికళ్ళతో ఎదురుచూస్తున్న పరమభక్తురాలైన శబరి ఆతిథ్యం పొంది పంపాతీరానికి చేరి ఆ సరస్సులో స్నానం చేసి సుగ్రీవునితో స్నేహానికి వెళితే మీకు శుభం కలుతుంద"ని చెప్పి స్వర్గానికి వెళ్ళాడు కబంధుడు.

"కబంధుడు సీతాన్వేషణకు సుగ్రీవుడిని కలమని, అలా సుగ్రీవుడిని కలవాడానికి వెళ్ళాల్సినమార్గం గురించి ఆనవాలు చెప్పి స్వామి కార్యంలో తాను పాలుపంచుకొని ఎంతో పుణ్యం చేసుకున్నాడు కదా! నాకంతటి భాగ్యం అబ్బలేదే అని తిరుక్కోళూరమ్మాళ్ వాపోయింది."

"ఇంక లేవండి."

"అక్కా! ప్లీజ్ శ్రీరామాయణంలోంచి ఇంకొక ఘట్టం చెప్పవా!"

"ఏమిట్రోయ్ ఇవాళ గాలి రామాయణం మీదికి మళ్ళింది. సరే! త్రిజట గురించి తిరుక్కోళూరమ్మాళ్ ఏమన్నదో తెలుసా?"

"నాకు తెలుసు. "అంతరంగం శొన్నేనో త్రిజటయైప్పోల."

"మరి అర్థం తెలుసా?"

తెలియకేగా నిన్ను చెప్పమన్నది. ఇవంటే పెద్దమామ్మ ఎప్పుడూ గొణుగుతూ, పాడుతూ ఉంటుందిగా. విని విని నోటికొచ్చేశాయి."

"ఇంటిపని పూర్తి చేశాక మళ్ళీ చెప్పుకుందాం!"

(సశేషం)

# మన ఆళ్వార్లు



(గత సంచిక తరువాయి)

## పెరియాళ్వార్లు

వైశారదీ

### దివ్యదేశయాత్ర :

ఇవన్నీ వింటూ, అనుభవించే గోదాకు పెరిగే వయస్సుతోపాటు కన్నయ్యను చూడాలనే తపనగూడ పెరిగి తండ్రిని, 'తనను గోకులానికి తీసుకువెళ్లమని నిర్బంధించడంతో, ఏమి చేయాలో తోచని పెరియాళ్వార్లు ఆ గోదాదేవిని తీస్కొని అర్చామూర్తిగ స్వామి వేంచేసి ఉండే దివ్యదేశాలు సేవింప చేయడం ప్రారంభించారు.

మొట్టమొదటనే తమ ఆచార్యస్థానమైన తిరుక్కోట్టియూర్ తీసుకువెళ్ళారు. 'ఇదే కన్నయ్యను కన్నవూరు. గొల్లపిల్లలంతా ఆనందోత్సాహాలతో కేరింతలు కొడుతూ వెన్నలు జల్లుకుంటూ ఘట నృత్యాలు చేసినదిక్కడే. నందోత్సవాలు జరిగిందిక్కడే అంటూ వివరిస్తే గోదాదేవి కానందం పట్టలేదు. అలా ఎన్నో దివ్యదేశాలు సేవించింది గోదా. అక్కడి పెరుమాళ్ళను తనివితీరా దర్శించి తృప్తి చెందింది. కాని మాటలాడాలనే కోరిక తీరలేదు.

భగవతత్త్వాన్ని మరింత తెలుసుకోవడం కోసం తండ్రిగారిని కోరి శ్రీమద్భాగవతకథనంతనూ వింది. మాధవునిమీద మక్కువమరింత పెరిగింది. తాను సేవించిన దివ్యక్షేత్రాలలో శ్రీరంగనాథుని దివ్యమంగళ విగ్రహం తన మనస్సంతా నిండిపోయింది.

### ధనుర్మాస వ్రతానికి నాంది :

గతంలో గోపికలు శ్రీకృష్ణునితో సాక్షాత్తు ఆటలాడి ఆనందించినట్టు తానూ చేయదలచింది కానీ ఈకాలానికి అలా వీలుకాదని, అర్చామూర్తిగనే భగవంతుని సేవించవీలవుతుందని తండ్రిగారు చేసిన ఉపదేశం ఆవేళలో మరింత త్వరాతిశయాన్నే పెంచింది. భగవంతుని తప్ప మానవులను వివాహమాడననే గోదా మాటలు తండ్రిగారికి బెంగను పెంచసాగాయి. అసలింతకీ తానాతనకి తగుదునా అని పరిశీలించుకో దలచింది. తండ్రిగారు అల్లి పెట్టిన మాలికలను తాను ముందుగనే ధరించి, తులసివనం ప్రక్కన కల నూతిలో తన అందం స్వామికి తగునా అని చూచుకొనేది. ఆ మాలికలను బుట్టలలో యథాతథంగ పెట్టివేసేది. ఇది తగదని తాను ధరించి ఎంగిలి చేసిన మాలికలను భగవంతునికి అలంకరించరాదని గూడ తెలియని వయస్సు. ఒకనాడిలా గోదా అలంకరించుకోవడం చూచిన పెరియాళ్వారు 'ఇది తప్పని తగదని' ఆమెను మందలించి, ఆ మాలికలను ఆలయానికి పంపలేదు. గోదాదేవి చాల బాధపడింది, తెలియక తాను చేసిన దోషానికి.

### శ్రీరంగనాథుని అంగీకారం :

అయితే ఆరాత్రి ఇటు పెరియాళ్వార్లకు, అటు ఆలయార్చకులకూ గూడ వటపత్రశాయి స్వప్నంలో దర్శనమిచ్చి, 'మామగారూ!' అంటూ పెరియాళ్వార్లను సంబోధించాడు. 'గోదా దాల్చిన మాలలే నాకెంతో ఇష్టం. అవే అసలు పరిమళం కలవి. అట్లు కానివి తనకవరం లేద'ని స్పష్టం చేశాడు. మరునాటి ఉదయం వాస్తవం గుర్తించిన పెరియాళ్వార్లు, గోదాను పిలిచి "మమ్ము కాపాడటానికి అవతరించిన తల్లివి నీవు. సామాన్యురాలివి కావు. ఆండాళ్!" అంటూ కీర్తించనారంభించారు. ఆమె దాల్చిన మాలికలే వటదళధామానికి అలంకరించే ఆచారం ఆరంభమైంది కనుక ఆమెను 'శూడికొడుత్తనాచ్చియార్' 'ఆముక్తమాల్యదా' అంటూ స్తుతించింది లోకమంతా. ఆండాళ్‌ను భగవంతుడు అంగీకరించాడనే ధైర్యం శ్రీ పెరియాళ్వార్లకు కలిగింది. కానీ ఈమెను ఎట్లా వివాహం చేసేదీ తెలియలేదు. అయినా మార్గం

తానే చూపుతాడనే విశ్వాసం మాత్రం వారికుంది.

**ధనుర్మాస వ్రతాచరణ :**

ఇది ఇలా ఉండగా శ్రీకృష్ణ సమాగం కోరి గోపికలంతా ఆనాడు కాత్యాయినీవ్రతం చేసిన వైనం విన్న ఆండాళ్ తానూ అలానే వ్రతాన్ని చేసి అయినా భగవంతుని పొందాలనుకుంది. తాను గోకులానికి పోలేదు. కాలమూ కలియుగము. దేశమూ, కాలమూ గూడ దూరమైనాయి. ఇక అనుకరించి అయినా తానావ్రతం చేయాలని తానే ఓ గోపికయై, తన ఊరంతా 'ఆమ్ప్పాడి' అంటే గోకులమని తలచింది. తన చెలియలందరూ గోపికలైనారు. వటపత్రశాయి కోయిలే నందుని దివ్యభవనమని, అందున్న వటపత్రశాయినే శ్రీకృష్ణ భగవానునిగా భావించి 30 దినాలు వ్రతమాచరించింది.

రోజుకొక పాశురాన్ని స్వామికి కైంకర్యంగా అర్పిస్తూ 30 పాశురాల తిరుప్పావై తానే పాడింది. తన కోరిక తీరిస్తే అక్కారు వడిశిలో అర్పించి, పైగా నిత్యకైంకర్యం గూడ చేస్తానని మదురై ప్రక్కనగల అఴకల్ కోయిల్ 'తిరుమాలిరుంశోలై' అనే దివ్యదేశంలో సుందరబాహుస్వామి వద్ద మ్రొక్కింది. వామదేవుని ప్రార్థించింది.

స్వామితో పరిణయమాడినట్లు కలగని 'వారణమాయిరం' పాడింది. తాను పాడిన తిరుప్పావైతోపాటు 143 పాశురాలుగల నాచ్చియార్ తిరుమొఴిలో ఈవన్నీ ఉన్నాయి.

**గోదాపరిణయం లోకకళ్యాణం:**

గోదా ఆర్తిని తీర్చడానికి శ్రీరంగనాథుడు నిర్ణయించుకొని తన అర్చక పరివారాన్ని శ్రీ విల్లిపుత్తూరు పంపి గోదాను శ్రీరంగం రప్పించుకున్నాడు. పెరియాళ్వార్లు, వల్లభదేవునికి కబురంపగ రాచమర్యాదలతో తన ఆచార్యుల కుమారితెను తోడ్కొని శ్రీరంగం తీసుకొని వెళ్ళాడు. రంగరాజునికి వల్లభదేవరాజు తగిన రీతిలో వివాహ ఏర్పాట్లు చేయించాడు. లోకానికంతకూ ఆశ్చర్యం. అబ్బురం. శ్రీరంగని అర్చామూర్తి నంబెరుమాళ్, గోదాదేవిని, మానవకన్యకను పరిణయమాడుటమేమిటో చిత్రమని అంతా తండోపతండాలుగ చేరారు శ్రీరంగం.

ఆలయం ముందున్న రంగవిలాసమండపంలో స్వామి చేరి ఉన్నాడు. గోదాదేవి అక్కడికి చేరగనే తమ పురోహితులైన శ్రీ భట్టరువారి ద్వారా కళ్యాణ కార్యాన్ని జరిపించుకొన్నాడు. వివాహానంతరం స్వామితోపాటు రంగనాథుని వెంట నడచిన గోదా గర్భాలయం చేరి, లోపల ప్రవేశించి, శ్రీరంగని పాదాల చెంత చేరిపోయింది. పెరియాళ్వార్లు దుఃఖాన్ని భరించలేక పోయారు. జరిగినదేమిటో వారికి గోచరించటంలేదు.

ఇంతలో భగవంతుడు పెరియాళ్వార్లను సంబోధిస్తూ వారిని విల్లిపుత్తూరుకు వేంచేయమని తాము గోదా సమేతులై గరుడుని అధిరోహించి అక్కడికి చేరగలమని, అక్కడనే నిత్య నివాసంగ ఉండగలమని, ఇక విచారించ తగదని ఓదార్చి, వారికి మర్యాద చేసి సాగనంపారు.

**విష్ణుచిత్తులవారికి ఓదార్పు :**

దుఃఖాన్ని దిగమ్రింగుకున్న పెరియాళ్వార్, లోకులచే పూజలందుకున్నారు. సాక్షాత్తు భగవంతునికి మామగారైయ్యే భాగ్యం కల్గినందుకు ప్రశంసించారు. వారు పెంచిన ఆండాళ్ సాక్షాత్తు లక్ష్మీదేవి అవతారమని కీర్తించారు. ఆనాటి సీతమ్మవలే ఈమె అయోనిజ కావడం విశేషమన్నారు. ఆమెకంటే ఈమె కీర్తి ఘనమైనదని పెరియాళ్వార్లను ఓదార్చారు. క్షేత్రాన్ని దున్నితే లభించింది సీతమ్మ.

పవిత్ర తులసివనంలో లభించింది ఆండాళ్. సామాన్య క్షేత్రములో ఆమె అవతారం. భగవంతుని తులసివనంలో గోదా అవతారం. సీత ఆచరించింది కాని ఏమీ ఎవ్వరికీ చెప్పలేదు. కాని ఆండాళ్ ఆచరించి తిరుప్పావై పాడి వ్రతాన్నొకదాన్ని గూడ అందించి ఘనత సాధించింది. పైగా రాముని పాణిగ్రహణం చేసింది సీతమ్మ. ఆ రాముదారాధించిన రంగనాథుని పట్టపురాణియై సీతారాములకిరువురకూ ఆరాధ్యదైవమైంది ఆండాళ్. విభవాన్ని వరించిన సీతమ్మకంటే అర్చామూర్తిని అందుకొన్న ఆండాళ్ వైభవమద్భుతము. ఇలా పలురకాలుగా లోకులంతా కీర్తిస్తూంటే ఆనందమతిశయించినా ఆమెను గతంలోలాగ చూడలేకపోయిన లోటు దుఃఖాన్ని పెంచుతోంది. అయినా భగవదాజ్ఞ అతిక్రమించవీలులేనిది కనుక విల్లిపుత్తూరు

తిరిగి వచ్చేశారు పెరియాళ్వార్.

అప్పటికే పెరుమాళ్ పరివారంతో అక్కడికి చేరిపోయాడు. గోదారంగ మన్నారులు ప్రక్కన చేతులు కట్టుకు నిలిచిన గరుడాళ్వాన్‌తో దర్శనమిచ్చారు. ఆనందంతో పొంగిపోయారు పెరియాళ్వార్. గోదాదేవి లక్ష్మీస్వరూపిణిగ ఇప్పటికీ అక్కడ ఆలయంలో వెలసి ఉన్నందున, మనల నాలకించి స్వామి అనుగ్రహాన్ని అందించగలది కనుక ఆమెను 'శ్రీ' అంటూ, ఆ ఊరిని "శ్రీవిల్లిపుత్తూర్"గ సంభావించారు పెద్దలంతా. ఆ స్వామి గోదా సమేత రాజగోపాల స్వామిగ స్తుతించారు. శ్రీ పెరియాళ్వారులు భగవదవతారాలనన్నింటిని తమ హృదయాలలో నింపుకున్న మహనీయులు. దానివల్లనే వారు నివసించే శ్రీ విల్లిపుత్తూర్ సృష్టికంతకూ కేంద్రమూ, అలంకారభూతమూ అయింది. దానినా విధంగ ఘనతకెక్కించి, నిరంతర భగవద్భాగవత సేవాకైంకర్య నిరతులైన శ్రీ పెరియాళ్వార్ల వల్లనే ఆవూరికి గొప్పదనం కనుకనే వారిని గోదాదేవి **'అశిపుతులై పైంకమలతణ్ తెరియల్ పట్టర్‌పిరాన్'** అంటూ కీర్తించుకొంది.

**శ్రీ విష్ణుచిత్తుల దివ్యనామాలు :**

శ్రీ పెరియాళ్వార్ క్రోధన నామ సంవత్సరం, జ్యేష్ఠ మాసంలో శుక్లపక్షం ఏకాదశీ తిథినాడు స్వాతి నక్షత్రయుక్త ఆదివారమునాడు వీరు అవతరించారు. వీరు పాడిన భగవద్రక్షాస్తోత్రం 'తిరుప్పల్లాండు' అనే పేర ప్రసిద్ధి చెందింది.

వేదాన్ని పఠించేవారు మంత్రాలకు ముందు చివర గూడ ఓంకారాన్ని పఠిస్తారు. అలా పలుకనిచో దోషమంటారు. ముందు పలుకనిచో వేదం ప్రకాశించదని, చివర పలకనిచో ఆ వ్యక్తివద్ద వేదం నిలువక, చిల్లుకుండలో పోసిన నీరులా స్రవించిపోతుందని శాస్త్రం. ఆ ఓంకారాన్ని వేదానికి ప్రధానమని ఆదరించినట్లే శ్రీ పెరియాళ్వార్ల తిరుప్పల్లాండును ద్రావిడ వేదప్రబంధానికి మొదలు చివరగూడ పఠిస్తారు పెద్దలంతా ఈనాటికిన్ని ఓంకారంవంటి ప్రబంధం పాడారు కనుక వీరిని సాక్షాత్తు వేదస్వరూపులని, గరుడాళ్వార్ అంశ అని భావిస్తారు. వీరిని పెరియాళ్వార్ పట్టర్‌పిరాన్, శ్రీవిల్లిపుత్తూర్‌కోన్, కికియరుత్తాన్, పుతువైక్కోన్ శ్రీ విష్ణుచిత్తులు మొదలైన పేర్లతో ఆరాధిస్తారు.

**వంశగౌరవం :** తల్లి తండ్రులు ముకుందభట్టర్, పద్మవల్లీదంపతులు, వీరు పురశ్చాదులు. అంటే వీరికి శిఖ తలకు వెనుక భాగంలో కాక తలపై భాగంలో వుంటుంది.

వీరు తాము పాడిన 473 పాశురాల ప్రబంధంలో శ్రీరంగం, తిరువెళ్ళరై, తిరుప్పేర్‌నగర్, కుంభకోణం, తిరుక్కణ్ణపురం, తిరుచ్చిత్రకూటం, తిరుమాలిరుంజోలై, తిరుక్కోట్టియూర్, శ్రీవిల్లిపుత్తూర్, తిరుక్కురుంగుడి, తిరువేంగడం (తిరుమల), అయోధ్య, సాలగ్రామక్షేత్రం, బదరికాశ్రమం, దేవప్రయాగ, ద్వారక్, ఉత్తర మధుర, నందవ్రజం (ఆయప్పాడి), తిరుప్పార్కడల్ (క్షీరసాగరం), పరమపదం మొదలైన 20 దివ్యదేశాలను మంగళాశాసనం చేశారు.

వారు పాడిన పాశురాలను పూర్వాచార్యుల వ్యాఖ్యానాలతో పాటు కలిపి శ్రవణం చేస్తే, వారి భగవదనుభ వైలక్షణ్యం ఎంత గహనమైనదో, వారి భక్తి ఎంత వాత్సల్యపూర్ణమైనదో తెలుస్తుంది.

**వారి సందేశం :**

కేవలం భగవంతునికేకాక, భగవత్సంబంధం ఈ లోకానికంతకూ ఉంది కనుక. లోకులలోని లోపాలు తీరి అందరూ కలసి ఒకే భగవత్కుటుంబంగా, భగవద్బంధువులుగా ఉండాలని వీరు పాడిన మంగళాశాసనం, రక్ష లోకరక్ష! వారి సంబంధం తమకు ఉత్తారకమగునన్న జీవులంతా ధన్యులు.




# తిరుప్పల్లాండు

వైశారదీ

*(గతసంచికతరువాయి...)*

**నెయ్యిడై నల్లదోర్ శోఱుం, నియతము మత్తాణి చ్చేవకముమ్,**
**కైయడైక్కాయుం కÖత్తుక్కు ప్పూణొడు, కాదుక్కు కుండలముమ్ ।**
**మెయ్యిడ నల్లదోర్ శాన్దమున్ తన్దు, ఎన్నై వెళ్ళుయి రాక్కవల్ల**
**పైయుడై నాక పగై క్కొడియానుక్కు, పల్లాండు కూఱువనే ॥ 8**

| | | |
|---|---|---|
| నెయ్+ఇడై | = | నెయ్యితో నిండిన |
| నల్లదు | = | మంచిభావముతో (ప్రతిఫలమాశించక) పెట్టిన |
| ఓర్ శోఱుమ్ | = | గొప్పదైన అన్నమును, |
| నియతముమ్ | = | సర్వకాలములయందు |
| అత్తాణి | = | ఆంతరంగికమగు |
| శేవగముమ్ | = | సేవను |
| కై అడై కాయుం | = | చేతినిండుగ తాంబూలమును, |
| కÖత్తుక్కు | = | కంఠమునకు |
| పూణ్ఒడు | = | అలంకరించు ఆభరణములతో పాటు |
| కాదుక్కు | = | చెవులకు |
| కుండలముమ్ | = | మకరకుండలములను |
| మెయ్+ఇడ | = | ఒంటికి పూయు |
| నల్లదు | = | పరిమళముగల |
| ఓర్ శాన్దముమ్ | = | శ్రేష్ఠమైన చందనమును |
| తన్దు | = | ఇచ్చి |
| ఎన్నై | = | ఏమీ కోరని |
| వెళ్ ఉయిర్ | = | పరిశుద్ధస్వభావునిగా (అనన్య ప్రయోజనునిగ) |
| ఆక్క వల్ల | = | చేయగలిగిన |
| పైయ్యుడై | = | పడగలు గలిగిన |
| నాగ | = | సర్పములకు |
| పగై | = | శత్రువైన గరత్మంతుని |
| కొడియానుక్కు | = | ధ్వజముగాగల స్వామికి |
| పల్లాండు కూఱువనే | = | మంగళము పలికెదను |

**తా:** లౌకికమైన శరీరపోషణకు నేను పాటుపడే అవసరము లేకుండా భగవంతుడు చేసినాడు. నేతులూరు ప్రసాదములను అందించినాడు. శాశ్వతమైన ఆంతరంగికమైన సేవలొసంగినాడు. భోగ్యమగు చందన తాంబూలాలు ప్రసాదించినాడు. చెవులకు, కంఠమునకు, అనగ, వంటినిండ ధరించు ఆభరణములను ఇచ్చినాడు. సుఖకరమైన జీవితముతో నాలోని రజస్తమస్సులు అణగి, సత్త్వము పెరిగి నేను సాధుస్వభావుడను అయినాను. సర్పములను అణుచు గరుత్మంతుని ధ్వజముగా కలిగినవాడు మన స్వామి. కోరికలనే సర్పాలను అణచే స్వామిని సేవిస్తూ మంగళము పాడుదాము రండి.

**ఉడుత్త క్కళైన్ద నిన్ పీదగవాడై, యుడుత్తు, క్కలత్తదుండు,**
**తొడుత్త తుళాయ్‌మలర్ శూడిక్కళైన్దన, శూడు మిత్తొండర్ కళోమ్ ।**
**విడుత్త దిశై క్కరుమం తిరుత్తి, తిరువోణ త్తిరువిళవిల్**
**పడుత్త పైన్నాగణై పళ్ళికొణ్డానుక్కు, పల్లాండు కూరుదుమే ॥ 9**

| | | |
|---|---|---|
| ఉడుత్తు | = | ధరించి |
| కళైన్ద | = | విడిచిన |
| నిన్ | = | నీ యొక్క |
| పీదగ వాడై | = | పీతాంబరము అనే శేషవస్త్రమును |
| ఉడుత్తు | = | ధరించియును |
| కలత్తదు | = | నీవు ఆరగించగా మిగిలిన శేషప్రసాదమును |
| ఉణ్డు | = | భుజించియు |
| తొడుత్త | = | మాలగ గ్రుచ్చిన |
| తుళాయ్ మలర్ | = | తులసీపుష్పములను |
| శూడి | = | నీవు ధరించి |
| కళైన్దన | = | విడచిన నిర్మాల్యమును |
| శూడుమ్ | = | ధరించెడివారము |
| ఇత్తొణ్డర్‌గళోమ్ | = | ఈ దాసులము |
| విడుత్త | = | ఆజ్ఞాపించిన |
| దిశై | = | ఆయా దిక్కులయందున్న |
| కరుమమ్ | = | కార్యములను |
| తిరుత్తి | = | నెరవేర్చి |
| తిరువోణ | = | శ్రవణానక్షత్రమునకు చెందిన |
| తిరువిళవిల్ | = | మహోత్సవమునందు |
| పడుత్త | = | పడకగా ఏర్పడిన |
| పైన్నాగణై(పై+నాగు+అణై) | = | విశాల ఫణములుగల శేష పాన్పుపై |
| పళ్ళి కొండానుక్కు | = | శయనించిన స్వామికి |
| పల్లాండు కురుదుమే | = | మంగళాశాసనము చేసెదము. |

**తా:** ఈ దాసులమందరమూ స్వామికి చెందినవారము. స్వామి ధరించి ఇచ్చిన శేషవస్త్రములనే ధరింతుము. స్వామి ఆరగించిన శేషప్రసాదమునే భుజింతుము. స్వామి కర్పించి విసర్జించిన నిర్మాల్యములనే అలంకరణముగా ధరింతుము. స్వామి సేవలో నానాప్రాంతములు చేరి, అక్కడి వారిని స్వామి సేవకులుగా తీర్చి దిద్దుట మొదలైన అవసరమైన కైంకర్యములను చేయుదుము. వికసిత ఫణములు కల ఆదిశేషుని రక్షణలో ఆతనిపై పవళించిన స్వామికి ఈ శ్రవణా తిరునక్షత్రాన మంగళము పాడెదము.

# పంచసంస్కార ప్రశస్తి

శ్రీమాన్ సముద్రాల శఠకోపాచార్యస్వామి-వరంగల్

**1) తాపము :** ఆచార్యులు మంత్రపూతమైన అగ్నిలో శ్రీమన్నారాయణుని ఆయుధములలో ప్రధానములైన శంఖచక్రములను తపింపజేసి కుడిభుజముపై చక్రమును, ఎడమ భుజముపై శంఖమును ముద్రింపజేయుదురు. సువర్ణాది లోహములు అగ్ని సంస్పర్శముచే పవిత్రములైనట్లు సదాచార్యులు పరిపూర్ణానుగ్రహముతో తప్తశంఖ చక్రములను ముద్రించుట ద్వారా సంసారిచేతనుల పాపములు తొలగి వారి దేహములు పవిత్రములగును.

**2) పుండ్రము :** తిరుమణి (శ్వేతమృత్తిక) రేఖలు పెరుమాళ్ళ పాదచిహ్నములని, శ్రీచూర్ణము లక్ష్మీస్వరూపమని, వాటి క్రింది రేఖ లక్ష్మీపాదస్థానము అను భావనతో "నాసికాగ్రాది కేశపర్యంతం ఊర్ధ్వపుండ్రం లలాటే ధారయేత్" అను ప్రమాణమును అనుసరించి నాసాగ్రము నుండి కేశముల వరకు నుదుట పుండ్రమును ధరించుదురు. భగవత్ పాదద్వయాకృతి రూపముగా రెండురేఖలను, లక్ష్మీస్థాన సూచకంగా ఎరుపురంగుగల శ్రీచూర్ణమును మధ్యలో, ఈ మూడు ఊర్ధ్వరేఖలకును క్రింద నాసాగ్రమున సపాద పీఠకముగా ఒకరేఖను ఉంచుకొనవలెను. కేశవాది ద్వాదశ నామాలను ఉచ్చరించుచూ ద్వాదశ స్థానములలో పుండ్రమును ధరించవలెను-

**"కేశవాదీని నామాని క్రమాత్ ద్వాదశ దేశికః ।**
**లలాటే కుక్షిమధ్యే చ హృదయే కంఠదేశకే ॥**
**కుక్షౌ దక్షిణతః పశ్చాత్ బాహుమూలే చ దక్షిణే ।**
**కంఠే పార్శ్వే తథా వామకుక్షౌ తద్బాహుమధ్యతః ॥**
**కంఠే చ పృష్ఠదేశే చ బ్రహ్మరంధ్ర సమీపతః ।**
**క్రమాత్ ద్వాదశపుండ్రాణి ధారయేత్ శాస్త్రవర్త్మనా ॥"**

అను సంహితా వాక్యములను అనుసరించి నుదుట, నాభిపై వక్షఃస్థలముపై, కంఠమధ్యమున, నాభికుడిప్రక్కన, కుడిభుజముపై, కంఠమునకు ఎడమభాగమున, మెడవెనుక, వీపు (వెన్నెముక) చివర, బ్రహ్మరంధ్రమునకు దగ్గరలో తిరుమణి శ్రీచూర్ణరేఖలను ధరించవలెను.

**3) నామము :** తమ సంతానముయొక్క శ్రేయోభిలాషులైన తల్లిదండ్రులు తమ పిల్లలకు భగవంతుని, భగవద్భక్తుల పేర్లను సామాన్యముగా పెడతారు. అట్లు కాకపోయినా 11వ రోజునో లేక 21వ రోజునో పెట్టిన లోకసామాన్య మైన వ్యవహార నామం కంటె భిన్నంగా దాస్యనామమును 'నారాయణదాసుడని లేదా గోవిందదాసుడని, రామానుజ దాసుడని' ఆచార్యులు నామకరణం చేయుదురు. స్త్రీలకు శ్రీ-భూ-నీళా-గోదాది దేవిమారుల, రామనుజుల పేరు చివరన దాసి అని జోడించి 'నీళాదాసి, గోదాదాసి, రామానుజదాసి' అని నామకరణము చేయుదురు.

4. **మంత్రము :** మంత్రోపదేశము నాలుగవ సంస్కారము. ఇది అతి ప్రధానమైనది. ఇనుపముక్కను బంగారముగా మార్చుట వంటిది. శిష్యునియొక్క ఆర్తిని, విశ్వాసాన్ని, యోగ్యతను పరీక్షించి జ్ఞానానుష్ఠాన సంపన్నులైన ఆచార్యులు మంత్ర గౌరవాన్ని కాపాడుతూ శిష్యజనోజ్జీవనమునకై మూడవ వ్యక్తి వినకుండా, శిష్యుని తన పాదసన్నిధిలో చేర్చుకొని అతని కుడిచెవిలో గురుపరంపరానుసంధాన పూర్వకముగా మూడుసార్లు అష్టాక్షరీ, ద్వయ, చరమశ్లోక మంత్రములను తాము ఉపదేశిస్తూ శిష్యునితో ఉచ్చరింపజేయుదురు.

5. **యాగము :** ఆచార్యుడు శిష్యునికి నిత్యారాధనకై ఒక భగవన్మూర్తిని మరియు తమ పాదముద్రలు గల వస్త్రమును (తిరువడిగళ్) కూడా అనుగ్రహింతురు. భగవన్మూర్తికి, షోడశోపచారములతో నిత్యారాధన పూర్తిచేసి భగవంతునికి ఆచార్య పాదములకు నైవేద్యమును సమర్పించి ఆ తర్వాతనే నివేదిత పదార్థములను భుజింపవలెనని ఆదేశించుదురు. అంతేగాక యథావకాశము తదీయారాధనమని పేర్కొనబడే భగవద్భక్తులకు భోజన సత్కారములను జరుపవలెనని కూడా ఉపదేశింతురు.

పితృవంశాన్ని త్యజించి భర్తృసంబంధాన్ని స్థిర మొనరించుకున్న స్త్రీ ఈమె, అని ఆమె ధరించిన మెట్టెలు, మంగళసూత్రములవల్లనే తెలియునట్లు, నరకాది బాధలనుండి, సంసారబంధమునుండి విముక్తులను గావించి, పరమైకాన్తులైన

శ్రీహరి పదాశ్రితులు వీరని తెలిపే తప్తశంఖచక్రాది పంచ సంస్కారము లను సకల చేతనులు ధరించవలసినదే. అట్లు ధరించుటవల్ల కలుగు విశేష ప్రయోజనమును 9 హేతువులతో తెలిపే భగవదాదేశరూపమైన శ్లోకమిది.

**"లక్ష్మత్వాదాత్మభర్తుః ప్రకృతిపరిణతి**
**గ్రన్థి దాహాత్మకత్వాత్**
**కర్మాంగత్వాద్ధి తత్వాత్తను తనుశయినో**
**స్సంస్కృతిత్వాత్ ప్రియత్వాత్ ।**
**హేతుత్వాత్ సద్గృహీతేరితర పరిహృతే**
**ర్ద్రావణాత్ కింకరాదేః**
**ధార్యం చక్రాది చిహ్నం కృతిభిరకృతిభి**
**ర్భూతయే ముక్తయే చ॥"**

స్త్రీ ప్రాయమైన సర్వజగత్తునకు భర్తయై పోషణకృత్యము నొనరించు భగవంతుని అసాధారణ చిహ్నములైన శంఖచక్రము లను అగ్నిస్పర్శానంతరం సదాచార్య శ్రీహస్తముల ద్వారా సంసారచేతనులు పొందడం, వివాహం తర్వాత స్త్రీ, భర్త ద్వారా మట్టెలు, మంగళసూత్రములను పొందడం వంటిదే!

తాము శ్రీమన్నారాయణుని పాదారవిందములను ఆశ్రయించినట్టి అనన్య భక్తులమనే గుర్తును తెలుపుటకొరకే! పంచసంస్కారాలు పుణ్యాపాప ఫలములైన సుఖదుఃఖానుభవము లకు సాధనమైన శరీర సంబంధము మరల ఏర్పడకుండా దహింపజేయునట్టివి. పంచసంస్కార సంపన్నులు కానివారికి వైదికకర్మలను ఆచరించుటకు అధికారం లేదని శ్రుతులు, స్మృతులు ఉద్ఘోషించుచున్నవి.

పంచసంస్కార సంపన్నత దుఃఖగంధ రహితమైన మోక్షమును ప్రసాదించుట ద్వారా ఆత్మోద్ధారకము అను హితమును, సర్వాధికుడైన సర్వేశ్వరునితో వదిలించుకోవడానికి వీలులేని నవవిధ సంబంధము అను ప్రియమును సమ కూర్చును.

పంచసంస్కార సంపన్నత బాహ్యమైన శారీరక దోషము లను, ఆంతరమైన మానసదోషాలను పరిహరించి పరమ పదప్రాప్తికి యోగ్యమైన వానినిగా చేయును. పంచసంస్కార పరులను పెద్దలు తమ గోష్ఠిలో చేర్చుకొని, తమ ఆప్త ఆత్మీయ బంధువువలె ఆదరింతురు.

మంగళసూత్రమును కంఠమునందు ధరించియున్న స్త్రీమూర్తిని ఇతరులు తమ భార్యగా గ్రహించుటకు ఎట్లు ఆశ పడరో, అట్లే పంచసంస్కార సంపన్నులై అష్టాక్షరీ మహా మంత్రమును అనుష్ఠానము చేయువారిని ఇతర దేవతలు గౌరవిస్తారు. అంతేగాని తమ సేవకులుగా భావించే సాహసం కూడా చేయరు.

పంచసంస్కారపరులైన శ్రీవైష్ణవులను చూచి దేవతలు నమస్కరిస్తారు, అసుర శక్తులు, దుష్టులు, రాక్షసులు దూరమవు తారు. యమకింకరులు, శత్రువులు పారిపోతారు–

**"ద్రవంతి దైత్యాః ప్రణమంతి దేవతాః ।**
**నశ్యంతి రక్షాంస్యపయాన్తి చారయః॥"**

ఈ విధంగా ఐహికములైన ఆపదలను తొలగించి సంపదలను కలిగించే, పరమపురుషార్థమైన ముక్తిఫలాన్ని సాధించిపెట్టే సుప్రశస్తమైన పంచసంస్కార సంపదను పొందుటకు ప్రయత్నిద్దాం. ఈ మానవజన్మకు సార్థకతను చేకూర్చుకుందాం!

అయోధ్య కాండలో



# శ్రీరామాయణము



ఎ. ఉషశ్రీ- శ్రీరాంనగర్

## శుక-శారికలు

(గత సంచిక నుండి)...

భగవంతుడు విశ్వానికీ, చేతనవర్గానికంతంటికీ పాలకుడు. **"పతిం విశ్వస్య"** అని వేదమే చెప్పింది. ఆతని పాలకత్వాన్ని గుర్తించిన వారు ఆచార్యులు కనుక తమను భార్యస్థానములో, ఆతణ్ణి భర్తృస్థానములోను భావిస్తారు. ఇలా వీరిరువురిని చిలుకా గోరువంకగ వ్యవహరిస్తారు. ఇక వీరు నూరు సంవత్సరాలూ కలిసి ఉండడమనేదాంట్లో "నూరు' అనేది ఓ మంచి సంకేతం. నూరులో 1,0,0 ఉంటాయి కద!

'1' పరమాత్మకు గుర్తు. '0' జీవుడు, మరో '0' ప్రకృతి. ఇవి రెండూ ఒక్కటికి తర్వాత చేరితే వాటికి విలువ పెరుగుతుంది. ఒకటిని విడదీస్తే వాటికంటూ ప్రత్యేకమైన విలువ ఏమీ ఉండదు. ఒకటికి మాత్రం తన విలువ ఏదో దానికి ఉండనే ఉంటుంది. ఒకటికి ముందు చేరినా విలువ ఉండదు. విడిచినా విలువ ఉండదు. జీవప్రకృతులు భగవంతునికి శేషమై ఆయనకి చెంది ఉంటే అవి కూడ భగవంతుని అంత పవిత్రమై ఆరాధ్యమై వెలుగొందుతాయి. ఆయన్ని విడిచినా, ఆయనకంటే తాము గొప్పవని తలచినా అవి విలువలేనివే అవుతాయి.

ఈ విషయాన్ని గుర్తించినవారు, గుర్తింపచేసి ఇతరులను ఉద్ధరించేవారూ ఆచార్యులు, జ్ఞానులు కద! అందుచేత వీరు వందలో చేరిన '0'లాగ మనకు ఆరాధించ తగినవారై, తాము పూర్ణజ్ఞానం కల్గి ఉంటారు. పూర్ణజ్ఞానమంటే భగవంతునికి, జీవునికి ఉండే '9' విధాల సంబంధజ్ఞానం.

పితాచ .... ఆద్యమనూదితః'

**పితా :-** భగవంతుడు తండ్రివలె చేతనులకు కారణమైన వాడు.

**రక్షకః :-** భగవంతుడు రక్షకుడు. ఇష్టములనిస్తాడు. అనిష్టాలను తొలగిస్తాడు.

**శేషి :-** భగవంతుడు జీవులనందరినీ తనవిగా కలిగి ఉంటాడు.

**భర్తా :-** భగవంతుడు జీవులనందరినీ భరించువాడు.

**జ్ఞేయః :-** భగవంతుడు జీవులందరిచే తెలుసుకో దగినవాడు.

**స్వామీ :-** భగవంతుడు జీవులందరినీ తన వస్తువులుగ కలిగి వాటి బాగోగులు చూచుకొను వాడు.

**ఆధారః :-** భగవంతుడు జీవులందరికీ ఆధారము.

**ఆత్మా :-** భగవంతుడు జీవులందరినీ, శరీరమును ఆత్మవలె నిలబెట్టువాడు.

**భోక్తా :-** భగవంతుడు జీవులందరు చేసే పనుల ఫలితము లనూ లోపలుండి అనుభవించు వాడు.

సాధారణంగా మన పెద్దలు రంగునుబట్టి, రూపాన్నిబట్టి, మాటతీరును బట్టి చిలుకను భగవంతునితోను, గోరువంకను జ్ఞానులు, ఆచార్యులతోనూ పోలుస్తూ ఉంటారు. భగవంతునికి, జ్ఞానికి విడదీయరాని సంబంధం ఉంటుంది కనుక చిలుక గోరువంకలను కలిపి చెప్తూ ఉండవచ్చు.

ఈ విధమైన జ్ఞానం కలిగిన జీవుడు పురుషోత్తమునితో కలిస్తే 99+1=100 అవుతుంది. ఒక తొమ్మిది ఆయనకే చెందిన ప్రకృతి మరో తొమ్మిది, ఆయనలో అంతర్భవించి నపుడు శతమానం భవతి. ఆయన"ఒకటి", ఒకటిగానే మిగిలి 9, మరో 9కూడా పూర్ణ సంఖ్యలు అయిపోతాయి.

భగవంతుడు జీవులను తరింపచేయటానికి కూడా ఈ జ్ఞానం కలిగిన ఆచార్యులనే మధ్యవర్తులుగా చేసుకుంటాడు. వారి ద్వారా వచ్చిన జీవులనే దోషరహితులను చేసి స్వీకరిస్తాడు. ఇది తెలిసేటట్లుగానే అలాంటి ఆచార్యస్థానంలో ఉండే శారికను రామచంద్రుడు గొప్పదిగా భావించినట్లు మనకు పైశ్లోకం చెప్తుంది.

ఇందులో జీవుల దోషాలను తొలగించవలసినది భగవంతుడే! అంటే శుకము. దానికి తగ్గట్లు పురుషకారం చేసేవాడు ఆచార్యుడు. అంటే శారిక. భగవంతుణ్ణి చేరడానికి అడ్డుగా ఉండే అహంకారవర్ధకమైన ప్రకృతి అనే పిల్లిని ఇక్కడ శత్రువుగా స్మరించాడు రాముడు.

పిల్లి ప్రకృతి, దాని పాదం అహంకారం. జీవులలోని అహంకారాన్ని తొలగించి, జీవులను బాగుచేసి తరింప చేయమని ఆచార్యులు భగవంతుని ప్రార్థిస్తున్నట్లు మనకు **"శుక పాద మరేద్దశ"** అనే వాక్యం ద్వారా తెలుస్తోంది. ఈ పక్షుల ప్రస్తావన ఈ రహస్యాన్ని అయోధ్యకాండలో తెలిపిందని మన పూర్వాచార్యులు విస్తరంగ తెలియచేశారు.

## అరణ్యకాండ - జటాయువు

దశరథ మహారాజుకు నలుగురు కుమారులు. వారిని మంచి సమర్థవంతులుగా, విద్యావంతులుగా, వినయ సంపన్నులుగా, విజ్ఞానవంతులుగా, సంస్కారవంతులుగా, వారికి వారే సాటి అనేట్లుగాను తీర్చిదిద్దాడు దశరథుడు. వారు నలుగురు కూడా ఒకరికి ఒకరు తీసిపోరు. అంత బాగా వారిని తయారుచేసీ కూడా కొడుకులవల్ల పొందవలసిన ప్రధానమైన ప్రయోజనాన్ని పొందలేకపోయాడు అంతటి దశరథ మహారాజూను.

ప్రతివారు చివరి సమయంలో తమ సంతానం తమ దగ్గరే ఉండాలని కోరుకుంటారు. కాని, దశరథునికి నలుగురు పుత్రులున్నా చివరి సమయంలో ఒక్కరినీ చూసుకోలేక పోయాడు. రాముణ్ణి అడవికి తనే నిర్బంధంగా పంపించవలసి వచ్చింది. లక్ష్మణుడు నీడలాగా రాముణ్ణి అనుసరించాడు. అంతకు ముందే భరతుడు తన మేనమామ అయిన యుధాజిత్ ఇంటికి వెళ్ళిపోయాడు. శత్రుఘ్నుడు భరతుని అనుసరించాడు. చివరకు పుత్రశోకంతో ఆక్రోశిస్తూ ప్రాణం వదిలాడు దశరథ చక్రవర్తి.

సామాన్యంగా పెద్దకొడుకుతో అంతిమ సంస్కారాలు చేయించుకోవాలని తండ్రి అనుకుంటాడు. తండ్రికి మొదటి సంతానం మీద, తల్లికి చివరిసంతానం మీద ప్రేమ అధికంగా ఉంటుందని అంటూంటారు. దశరథుడు అడవికిపోయిన తన పెద్దకొడుకునే తలుస్తూ ప్రాణం వదిలాడు.

సాధారణంగా ఎవరైనా దేహం వదిలాక వారి సంతానం దూరంగా ఉంటే, ఆ విషయం తెలిపితే ఆ సంతానం వచ్చి సంస్కారాలు చేస్తూ ఉంటారు. కాని అలాంటి అదృష్టానికి కూడా నోచుకోలేదు దశరథుడు.

ఇక అంతిమ సంస్కారాలు భరతుడు చేయాలి. కైకమీద కోపంతో, 'భరతుడు సంస్కారాలు చేసినా అది నాకు చెందవ'ని దశరథుడు శాపం పెట్టాడు. చివరికి ఎవరిని తాను తిరస్కరించాడో అతనితోనే సంస్కారాలను చేయించుకోవలసి వచ్చింది. కోరుకున్న రాముడితో కాదు. ఇది మహారాజైన దశరథునికి ఏర్పడిన గతి.

రామాయణంలో ముగ్గురిని 'మహారాజ'శబ్దంతో పిలుస్తారు. 1) దశరథుడు, 2) సుగ్రీవుడు, 3) జటాయువు.

రాముని కన్నతండ్రిగ రాజ్యాన్ని రామునికందించాలనుకున్నవాడు దశరథుడు. ఇతనికి రాజరికం వంశపరంపరగ వచ్చింది కనుక మహారాజయ్యాడు. సుగ్రీవుడొక వానరమే అయినా కిష్కింథకు రాజుగ పట్టాభిషిక్తుడవ్వడం ద్వారా, రాముడు ఇతణ్ణి తన సంరక్షకుడని తలవడం ద్వారాను అతడికి 'మహారాజ' బిరుదు వచ్చింది. ఒక సామాన్యమైన పక్షి కదా జటాయువు. దాన్ని కూడా 'జటాయు మహరాజు' అని సంబోధిస్తారు. దశరథ చక్రవర్తికిచ్చే బిరుదాన్ని ఒక పక్షికి ఇచ్చి దానిని సత్కరించారు విజ్ఞాన ఘనులైన పెద్దలు. ఎందుకు?

60వేల సంవత్సరాల తరువాత అపురూపంగా పొందిన కొడుకు శ్రీరాముడు. అయినప్పటికీ దశరథమహారాజు చేయించుకోలేకపోయిన చరమసంస్కారాన్ని రాముడిద్వారా జటాయువు చేయించుకోగలిగాడు. ఆ చేయించుకోవడంకూడా ఏదో అనాధ ప్రేత సంస్కారంలా కాకుండా శాస్త్రీయమైనరీతిలో, ఏ క్రియా కలాపానికి లోటు చేయకుండా రాముని ద్వారా, అన్ని చరమ సంస్కారాలను జటాయువు చేయించుకోగలిగాడు.

కొడుకులు చేసిన సంస్కారాలవల్ల వారి తల్లిదండ్రులు 'పుత్' అనే పేరుగల నరకం నుండి తరిస్తారని అంటారు. "పున్నామ నరకాత్ త్రాయతే ఇతి పుత్రః" అని పుత్ర శబ్దానికి నిర్వచనం చెప్తారు. చేసే వ్యక్తి సవ్యంగా చేస్తే తండ్రిగా ఉండిపోయిన జీవి నరకం నుండి తరించవచ్చు. ఆ చేసేది సరిగ్గా లేకపోతే ఇతర ఫలితాలు కలగవచ్చు. ఎందుకంటే, ఆ క్రియాకలాపాన్ని అంతటినీ వేదం మీద ఉండే శ్రద్ధతోటి, విశ్వాసంతోటి చేయాలి. మొక్కుబడిగా కాదు. శ్రద్ధతో చేసేది కనుకనే పితృసంస్కారానికి 'శ్రాద్ధము' అని పేరు పెట్టారు. ఇంత చేసినా ఆ జీవుడు నరకం నుండి బయట పడవచ్చు, లేదా, ఏదో ఒక లోకానికి పోవచ్చు. ఆ జీవుడు తిరిగి పుట్టడు అనడానికి వీలు లేదు. బ్రహ్మలోకం దాకా ఉండే లోకాల లోపల ఎక్కడికి వెళ్ళినా "ఆ బ్రహ్మ భువనాత్ లోకాః పునరావర్తినోర్జున!" అని శ్రీకృష్ణ భగవానుడు చెప్పినట్లు, తిరిగి కర్మ కృత

శరీరాలలోకి రాక తప్పదు. అలా ఆ జీవుడు కర్మబంధంలోనికి తిరిగిరాకుండా ఉండాలంటే దానికి ఆ చరమసంస్కారం చేసే వ్యక్తి యోగ్యుడు, ఉత్తమ వైష్ణవుడు అయి ఉండాలి. అపరకర్మలన్నీ పూర్తైన తరువాత మోక్షోత్సవంలాంటివి చేయాలి. అప్పుడే ఆ జీవి తిరిగిరాని లోకాలకు వెళ్ళే స్థితి ఏర్పడుతుందని శాస్త్రాలు చెప్తున్నాయి. ఎంతమంది తండ్రులకు ఆ స్థితి కల్గుతుందో మనకు తెలీదు. మర్యాదాపురుషోత్తముడైన రాముడు ఓ సామాన్యపక్షి జటాయువుకి సంస్కారం వైదికంగా చేయడం మాత్రమే కాకుండా "తిరిగి రాకుండా ఉండే మోక్షాన్ని నేను నీకు ఇస్తున్నా వెళ్ళు!" అని ఆధికారికంగా ఆ పక్షిని మోక్షానికి పంపినట్లు అరణ్యకాండలో శ్రీరామాయణం చెప్తోంది. ఆ ఉదార పరాక్రమశాలి జటాయువును ఈసారి స్మరిద్దాం!

శ్రీరామచంద్రుడు దండకారణ్యంలోకి ప్రవేశించి, అప్పటికి సుమారు 10 సం॥ గడిచింది. అడవిలో ప్రవేశించినప్పటినుండి సీతా రామ లక్ష్మణులకు విశ్రాంతిలేదు. తిరిగిన ఆశ్రమాలకు తిరగకుండా, వెళ్ళినచోటికి వెళ్ళకుండా ఒకపూట, అరపూట, ఒకరోజు, 5రోజులు ఇలా అక్కడక్కడ ఉండే ఋషిసమూహాలను సేవిస్తూ అవకాశాన్ని, అవసరాన్ని బట్టి యాత్ర చేస్తున్నారు. అంటే, ఆ రోజులలో దండకారణ్యంలో ఎన్నివేల ఆశ్రమాలు ఉండేవో, ఎందరు ఋషులు వానిలో తపోధనులై లోకక్షేమాన్ని కాంక్షిస్తూ తమ తాపసయాత్రను గడుపుతూ ఉండేవారో మనం ఊహించవచ్చు.

చివరికి అగస్త్య మహాముని ఆశ్రమానికి వెళ్ళి వారి ఆశీస్సులు అందుకున్నాడు శ్రీరాముడు. వారి ఆజ్ఞతోనే పంచవటి వద్ద మిగిలినకాలం గడపాలని ఆవైపు బయలుదేరాడు. అక్కడికి చేరేముందే జటాయువు యొక్క ప్రథమ పరిచయం ఏర్పడింది.

ఎక్కడికైనా వెళ్ళేటప్పుడు శకునాలను చూస్తూ ఉంటాం.

**"రాసభస్య రవః శ్రేష్ఠః శృగాలస్యతు దర్శనం,**
**గృధ్యస్య చ ఉభయం త్యాజ్యం.... "** అని అంటారు పెద్దలు.

ఏ కార్యానికైనా వెళ్ళేటప్పుడు గాడిద అరుపు వినిపిస్తే మంచిది, నక్క దర్శనం మంచిది. గ్రద్ద అరుపూ వినకూడదు, ఎదురూ పడకూడదు.

శ్రీరాముడు పంచవటికి వెళ్ళేటప్పుడు గ్రద్ద దర్శనం అయ్యింది. గ్రద్దయొక్క దర్శనం శుభశకునం కాదు. దానిని దర్శించాడు. దాని ఆకారం, ప్రవృత్తి చూచి ఎవడైనా రాక్షసుడై ఉంటాడేమోనని మొదట భ్రమపడ్డాడు. కాని, దానితో పరిచయం కలిగాక అది తన తండ్రియొక్క ప్రియసఖుడని తెలుసుకొని వారు చాలా సంతోషించారు. విశ్వాసం కలగడానికి జటాయువు తన వంశవృక్షాన్నంతా వివరించాడు. ఇలా...

(సశేషం)

శ్రీమన్నారాయణ రామానుజ యతిభ్యో నమః

# యతిరాజవింశతి

శ్రీశ్రీశ్రీ అహోబిల రామానుజ జీయరు స్వామివారు

సంసార సాగరాన్ని దాటలేక అనేక కష్టాలు అనుభవిస్తున్న మనలాంటి వారిని ఉద్ధరించటానికి మణవాళమామునులు మనకొక అలౌకికమైన ఔషధాన్ని అందించారు. లౌకికమైన ఔషధాలను సేవించినవారికి శారీరక రోగము నయమగును. కానీ పట్టిన జీవులందరికి ఉన్న సాధారణమైన రోగము భవరోగము. లౌకికమైన ఔషధములకు లొంగనిది ఈ రోగము. ఔషధముగ నింపి యజవింశతి అనే స్తోత్రంగ పరమకారుణికులైన శ్రీమణవాళ మహామునులు అందించారు. ఈ స్తోత్రాన్ని పఠించిన చాలు యతిరాజులైన భగవద్రామానుజుల అనుగ్రహంతో మన దోషాలు తొలగి తరగని సంపద లభిస్తుంది.

సంపద అనగా భగవంతుని కైంకర్యము. లౌకికమైన సంపద ఒకనాడు ఉండి తర్వాత తొలగిపోవచ్చు. కానీ కైంకర్యమనే సంపద ఆత్మ ఉన్నంతవరకు ఉంటూనే ఉంటుంది. ధనధాన్యాదులు లేకపోతే 'అయ్యో'! 'లేదే' అని దుఃఖము ఉంటే, ఎలా రక్షించుకోవాలో తెలియక దుఃఖము, భగవత్ భాగవత ఆచార్య సేవ అనే సంపద వలన ఎప్పటికీ ఆనందమే తప్ప, దుఃఖము ఒకింత కూడా ఉండదు. అలాంటి అపూర్వ సంపదను అనుగ్రహించు స్తోత్రరాజము "యతిరాజవింశతి". మామునులు ఈ స్తోత్రాన్ని ప్రారంభిస్తూ దీనికి ఎలాంటి విఘ్నాలు కలగకూడదని యతిరాజులను ప్రార్థిస్తూ, ముందుగ వారి వైభవాన్ని తెలియ చేస్తున్నారు.

**శ్రీమాధవాంఘ్రి జలజద్వయ నిత్యసేవా**
**ప్రేమా విలాశయ పరాంకుశ పాదభక్తం ।**
**కామాది దోషహరం ఆత్మ పదాశ్రితానాం**
**రామానుజం యతిపతిం ప్రణమామి మూర్ధ్నా ॥**

"లక్ష్మీతో కూడిన నారాయణుని పాదపద్మములను నిత్యము సేవించుటచే కలిగిన ప్రేమ చేత, పరవశించిన మనస్సుకల వారు నమ్మాళ్వార్లు. వీరి శ్రీపాదములయందు భక్తిచే వారే రక్షకమని ఆశ్రయించిన వారు రామానుజులు. ఇటువంటి రామానుజులు తమను ఆశ్రయించు కొన్న వారి దోషాలను తొలగించువారు. యతిపతులైన రామానుజులను శిరస్సుతో నమస్కరిస్తున్నాను" అని మామునులు ఈ శ్లోకంలో తెలియచేస్తున్నారు.

రామానుజులు నమ్మాళ్వార్ల శ్రీపాదముల యందు ప్రావణ్యము కలవారని **'పరాంకుశ పాదభక్తం'** అని మామునులు పై శ్లోకంలో తెలిపారు.

రామానుజుల ఆచార్యులైన పెరియనంబిగారు వీరికి మంత్రోపదేశమును శ్రీరంగమన చేయాలా? లేక కాంచీపురమున చేయాలా అనే సందేహములో ఉండగా రామానుజులు, నమ్మాళ్వార్లు ఉపదేశించిన 'మిన్నిన్నిలై ఇల మన్ను ఇరాక్కైగళ్' అను పాశురాన్ని స్మరించారు. ఈ పాశురంలో ఆకాశంలో మెరిసె మెరుపును చూచి ఆ కాన్తిలో పనులు చేస్తామని అనుకోవడము ఎంత అవివేకమో, భగవంతుని స్మరించుటకు ఆరాధించుటకు ఇంకా వయస్సు ఎంతో ఉంది. రేపు చేస్తాననో? లేక, దివ్య క్షేత్రాలనో వాయిదాలు వేస్తాము. జీవితము క్షణ భంగురము. కాసేపటికి ఏమైవుతుందో ఎవరికి తెలియదు. అందుకే వెంటనే భగవంతుని స్మరించండి. మీది, మీరు (నాది, నేను) అనుదానిని విడవండి అని ఉపదేశించారు నమ్మాళ్వార్. వారి వాక్కును శిరోధార్యముగా స్వీకరించిన రామానుజులు మంత్రోపదేశమునకు శ్రీరంగము, కాంచీపురము వెళ్ళక మధురాంతకమున ఏరికాత్త పెరుమాళ్ సన్నిధిలోనే ఆచార్యునిద్వారా మంత్రాన్ని పొందారు.

ఈ ఘట్టాన్ని అనుసరించి రామానుజులకు నమ్మాళ్వార్‌ల యందు ఎంత ప్రావణ్యమో తెలుస్తోంది. (రామానుజలశిష్యులు) అముదనార్ అనువారు కూడా "మాఱన్ అడిపణిన్దు ఉయ్‌న్దవన్" అని రామానుజులకు నమ్మాళ్వారుల శ్రీపాదముల యందు ఉన్న భక్తిని కొనియాడారు. నమ్మాళ్వారులను పరాంకుశులు అని వ్యవహరిస్తారు. ఇంతకు పరులు అనగా ఏమి?

సకల కల్యాణ గుణాకరుడైన భగవంతునికి గుణములు లేవని నిర్గుణుడని, రూపము లేదు కనుక నిరాకారుడని, అసలు పరమాత్మయే లేడు అసత్యమని వాదించు కుదృష్టి కలవారు పరులు. ఇలాంటి వ్యర్థ వాదాలు చేసేవారికి అంకుశము వంటివారు మన ఆళ్వారులు. అందుకే వీరు పరాంకుశులు. అంతేకాదు మదించిన ఏనుగును లొంగదీయుటకు అంకుశము ఎలా సాధనమో, అలా పరుడైన పరమాత్మను లొంగదీయు జ్ఞాన, భక్తి, వైరాగ్యములను అంకుశముకల నమ్మాళ్వార్ పరాంకుశులు. "మయర్వఱ – మదినలం అరుళినన్ యవనవన్" అన్నట్లు అజ్ఞానము ఏ మాత్రము లేని భక్తిరూపాపన్న జ్ఞానాన్ని ప్రసాదించిన సర్వేశ్వరుడు సకల కల్యాణ గుణాకరుడని, విగ్రహ విశుష్టుడని తమ ప్రబంధాలలో పాడి, పరుల వాదాలను ఖండించి పరమాత్మను తమ వశము చేసుకున్న మహనీయులు మన పరాంకుశులు.

మావటి వాడు అంకుశముతో ఏనుగును వశపరుచుకొని తను చెప్పినట్లు చేయిస్తూ, అందరినీ ఏనుగుపై ఎక్కిస్తుంటాడు. అలాగే

మన ఆళ్వార్ పరమాత్మను తమ జ్ఞానానుష్ఠానములచే వశపరుచుకొని ఎన్నోదోషాలు చేసిన మనందరిని అనుగ్రహింప చేస్తున్నారు. జీవుని స్వామితో చేర్చుటయే ఆచార్యుని కర్తవ్యము. అందుకే మన ఆళ్వార్ పరమాచార్యులు, వీరి విషయములో రామానుజులకు విశేషమైన భక్తి. ఆ కారణము చేతనే ఆళ్వార్ పాడిన తిరువాయ్ మొళి ప్రబంధానికి పేరుతో వ్యాఖ్యానాలను రచింపజేసి వాటిని సంరక్షించిన ఉదారులు మన రామానుజులు. **"ఈన్తముదల్‌తాయ్ శఠగోపన్, మొయ్‌మ్బాల్ వళర్త ఇదత్తాయ్ ఇరామానుశన్"** అన్నట్లు తిరువాయ్ మొళి ప్రబంధానికి కన్నతల్లి శఠగోపులు. పెంచి పోషించిన తల్లి రామానుజులు అంటారు. అందువలన మాములు "పరాంకుశ పాదభక్తం" అని కీర్తించారు రామానుజులను. అదీకాక నమ్మాళ్వారుల పాదస్థానీయులు రామానుజులు అని మన పెద్దల నిర్వాహము. నమ్మాళ్వార్ **"శ్రీమాధవాంఘ్రి జలజద్వయ నిత్యసేవా ప్రేమా విలాశయులు"** అని మామునులు వివరించారు.

ఆళ్వార్ ఎల్లప్పుడూ సర్వేశ్వరుని పాదపద్మాలయందు కైంకర్య భావన కల్గినవారు. ఆ కైంకర్యము ఒకనాడు కాదట ఎల్లప్పుడూ (నిత్యము) సాగాలని పరాంకుశుల కోరిక. అందుకే ఆళ్వార్ "ఒళివిల్ కాలమెల్లాం ఉడనాయ్ మన్ని" అనే పాశురములో భూత, భవిష్యత్, వర్తమానాలలో ఆస్వామి సేవ చేయాలి అని సమయాన్ని అర్థించారు. అందులోను " అడిమై శెయ్యువేండుంనాం" అంటూ స్వామి శ్రీపాద సన్నిధి యందు దాస్యమును చేయవలెను అని తెలియపరిచారు.

ఆళ్వార్ కైంకర్యము చేయు సర్వేశ్వరుడు అమ్మతో కూడినవాడై ఉండాలి. అందుకే " శ్రీమాధవాంఘ్రి" అని కీర్తించారు. మాధవ అనగా, లక్ష్మీదేవికి భర్త అని. మాధవ అను పదానికి ముందు "శ్రీ" అనేది స్వామికి విశేషణము. కనుక "శ్రీ" అని వ్యవహరిస్తారు. లోకంలో ప్రతివాడు లక్ష్మిని పొందాలనుకుంటారు. కానీ ఆలక్ష్మి స్వామిని పొందాలనుకుంటుంది. మన పెద్దలు "కః శ్రీః శ్రియః" లక్ష్మికే లక్ష్మి అయినవాడు అని స్వామిని కీర్తిస్తారు.

సర్వ స్వతంత్రుడైన స్వామి దోషులైన మనలను "క్షిపామి" శిక్షిస్తాననే ఆయనతో లక్ష్మీదేవి కలసి ఉండుట వలన "దదామి" రక్షిస్తానంటూ దోషాలను కూడా భోగ్యముగా స్వీకరించగలిగే వాత్సల్యము, సౌలభ్యము, సౌశీల్యాది గుణాలు కలవాడు అవుతాడట. అందుకే అమ్మను కల్గిన స్వామి మాధవుడు. గుణాలు కలవాడు కనుక, శ్రీ మాధవుడని పెద్దలు వివరిస్తారు.

వాత్సల్యాది గుణాలుకల శ్రీ మాధవుని పాదములను పద్మాల యందు నిత్యము కైంకర్యము చేయాలనే ప్రేమచేత నమ్మాళ్వారుల మనస్సు కలతచెందినది. అందుకే మామునులు నమ్మాళ్వారులను 'ప్రేమావిలాశయాలు' విశ్వాసముతో ఉండుట.

ఆవిలాశయులు– "ఆశయ" అనగా సర్వేశ్వరుడే నాకు ఉపాయము, ఫలము అనే అధ్యవసాయము (నిశ్చయము) కల్గిఉండుట.

"ఆవిల"–అనగా భగవంతుడే నాకు ప్రాప్యమని ఆయనను పొందుటలో ఉపాయమైన స్వామిని వదలి స్వప్రయత్నము చేయుట.

ప్రియురాలిని పొందాలనే కోరికతో నదిని దాటబోవువానికి పడవ బదులు శవాన్నే తెప్ప అని, సర్పాన్ని త్రాడు అను కొన్నట్లు, మన ఆళ్వార్ పరమాత్మను పొందాలనే త్వర చేత మడల్ గ్రహణం చేస్తానంటారు. ప్రియుడు ప్రియురాలిని చేపట్టకపోతే, ఒక తాటి మట్టను ఆమె రెండుకాళ్ళ మధ్య పెట్టుకొని, జడ విరబోసుకొని, కన్నీళ్లు కారుస్తూ ఎదురుగా ప్రియుని చిత్రపటాన్ని పెట్టుకొని వీధులలో అతని గూర్చి యాగీ చేయుటయే "మడల్" అంటే ఇది పూర్వం దక్షిణ దేశంలో ఆచారమట. ఆళ్వార్ కూడా స్వామి విరహాన్ని భరించలేక ఈ క్రమంలో 'మడల్' చేస్తానంటూ బెదిరిస్తారు పరమాత్మని. లేక పోతే నోములునోస్తానంటారు. కర్మవశంగా వచ్చిన కలత విడిచి పెట్టాలి కానీ, భగవంతుని పొందాలనే ప్రేమచేత వచ్చిన కలత దోషము కాదు. ఇది ఉండదగిన లక్షణమే.

"అతిస్నేహః పాపశంకీ" అన్నట్లు ప్రేమ ఎక్కువగా ఉన్న అది కీడునే శంకించును. చతుర్భుజుడైన నారాయణునికి దృష్టిదోషము తగలకూడదని పల్లాండు అంటూ పాడారు పెరియాళ్వారు. తాము ప్రేమించిన స్వామి అడుగులు వేస్తే కందినదని "పోత్తి" అంటూ మంగళము పాడినది గోదాదేవి.

శ్రీగుణరత్నకోశమున "పాదారుం తుదమేవ పంకజరజః" అంటూ భట్టరువారు లక్ష్మీదేవిని కీర్తించారు. అమ్మా లక్ష్మీ! నీవు నిల్చిన పద్మమునందలి పరాగములు నీకాలిలో ముల్లులవలె గ్రుచ్చుకొనుచున్నవని, నీకు పరిచర్యలు చేయు చెలికత్తెలు నీ సౌందర్యానికి ముగ్ధులై, అలాగే చూచిన శరీరము కందిపోవు చున్నదియు, నీవు ధరించిన పద్మము కూడా నీకు భారము అగుచున్నదని స్తుతించారు.

ప్రేమాధిక్యముచే మన నమ్మాళ్వార్లు మనస్సు కలత చెందినది. ఇది దోషము కాదు. ఇలాంటి పరభక్తి, పరజ్ఞాన, పరమాభక్తులు కల నమ్మాళ్వార్లను ఆచార్యులుగా భావించి వారి శ్రీపాదాలయందు నిష్ఠకలవారైనారు మన రామానుజులు.

ఇక శ్రీరామానుజులను ఆశ్రయించినవారికి కలిగే ప్రయోజనాన్ని 'కామాదిదోషహరం' అంటూ మామునులు వివరిస్తున్నారు. దానిని పై సంచికలో తెలుసుకుందాం.

(ఇంకా ఉన్నది)

గీతా మహాత్మ్య కథలు-5

# వటుడు

వోలేటి రామకృష్ణమాచార్యులు

భగవద్గీతలోని నాలుగు అధ్యాయాలకి ఎటువంటి మహిమ ఉందో తెలుసుకున్నాం. కర్తవ్యబుద్ధితో చేసినా, చేసిన పని తప్పుడు పని అయితే శిక్ష అనుభవించక తప్పదని గతనెలలో **"అప్సరసల"** కథ వివరించింది. ఎట్టి శిక్ష అయినా భగవద్గీతా శ్రవణమే ఉద్ధారకమని తెలుసుకున్నాం.

ఇక ఐదవ అధ్యాయం గురించిన పురాణాంతర్గతమైన కథను గురించి తెలుసుకుందాం. భగవద్గీతలోని ఐదవ అధ్యాయాన్ని ''కర్మ సన్న్యాస యోగము'' అంటారు. "కర్మసన్న్యాస"మంటే కర్మలను వదిలేసి ఏ కర్మలు చేయకుండా ఓ మూల కూర్చోవడంకాదు. కర్మలను ఆచరిస్తూనే "ఈ కర్మ నాదికాదు పరమాత్మది, ఈ కర్మఫలమూ ఆ భగవానునిదే, ఈ కర్మ నాచే చేయించుకునేది కూడా ఈ శ్రీకృష్ణుడే అని సర్వము ఆ పరమాత్మకే వదిలి, జీవుడు కేవల నిమిత్త మాత్రుడుగా ఉండగలగడ"మని కర్మసన్న్యాసయోగం బోధిస్తోంది. అలా చేసే కర్మలు జీవుణ్ణి బంధింపవు. ఇదే జ్ఞాన మార్గము. ఇదే కర్మలు మనలను బంధించకుండా ఉండేట్లు చేయదగిన మెళకువ. ఇది సాధించాలంటే ఆ శ్రీకృష్ణ పరమాత్మపై అనన్యభక్తి కలిగి, భగవద్గీతపై అచంచల విశ్వాసము కలిగి ఉండడం అత్యావశ్యకం.

ఇంతవరకూ మనం తెలుసుకున్న కర్మయోగ, జ్ఞానయోగాలు రెండూ ఆత్మ సాక్షాత్కార సాధనాలే అయినా, కర్మ యోగమే శీఘ్రంగా ఫలితాన్నిస్తుందని శ్రీకృష్ణపరమాత్మ తేల్చి చెప్పిన అధ్యాయం ఇది. కర్మయోగము, జ్ఞానయోగము వేరువేరని అనుకోవడం అవివేకం. సర్వప్రాణి సమానత్వాన్ని ప్రబోధించింది ఈ అధ్యాయంలోనే.

**శ్లో॥ విద్యా వినయసంపన్నే బ్రాహ్మణే గవి హస్తిని ।**
**శునిచైవ శ్వపాకే చ పండితా సమదర్శినః ॥**

విద్యా, వినయ సంపన్నతతో అధికుడైన మానవుని, వర్ణ వ్యవస్థలో అధికుడైన బ్రాహ్మణుని, పవిత్రతలో ఉచ్చస్థితిలోనున్న ఆవును, ఆకారంలో ఉన్నతమైన ఏనుగులను చూచినా లేదా మానవుల యందు నీచమైన చండాలుని లేదా జంతువుల యందు నీచమైన కుక్కను చూచినా బ్రహ్మవేత్త లేదా ఆత్మసాక్షాత్కారమైన పండితుడు అన్నింటిని సమదృష్టితోనే చూస్తాడు. అంటే అవి అన్నియు వివిధములైన శరీరములు, వివిధములైన జ్ఞానసంపత్తి, ఐశ్వర్యములు కలిగి యుండిన పరమాత్మ స్వరూపములని భావిస్తాడు. ఈ జ్ఞానమే మనకు పంచమాధ్యాయము యొక్క పారాయణ ఫలము. ఈ అధ్యాయంలో జ్ఞాన,కర్మలను రెండింటిని మేళవించి సాధనచేసే పద్ధతి తెలియజేయడం వలన, ఈ అధ్యాయానికి కర్మసన్న్యాస యోగమనే నామము.

ఇక ఈ గీతాధ్యాయ పారాయణ ఫలమేమిటో తెలుసుకుందాం. భగవద్గీతను పారాయణం చెయ్యడం ఉత్తమం. ఆ భగవద్గీతను పారాయణ చేసే భాగవతుడితో కలిసియుండడం ఉత్తమోత్తమం. మనకి అలా చెయ్యడం సాధ్యం కాకపోతే అలాంటి భాగవతుని చరమదేహాన్ని ఎప్పుడు దర్శించినా, ఎన్నేళ్ళ తరవాత స్పృశించినా మోక్షమే అంటోంది పద్మపురాణం.

**శ్లో॥ గీతానాం పంచమాధ్యాయ మావర్తయతి సర్వదా ।**
**తేన పుణ్యేన పూతాత్మా యయౌ బ్రహ్మసనాతనమ్॥**

భగవద్గీత ఐదవ అధ్యాయమును సర్వదా పారాయణము చేయు పుణ్యాత్ముని పుణ్యమువలన, పాపాత్ములు కూడా పుణ్యాత్ములై సనాతనమైన బ్రహ్మమునే పొందిరి అని పైన చెప్పిన శ్లోకం బోధిస్తోంది. ఇది కేవలం మానవులను మాత్రమే ఉద్ధరించే శాస్త్రం కాదు. ఇది అజ్ఞాన పూరితములైన

పశుపక్ష్యాది జీవములను సహితము తరింపజేస్తుంది. ఆ పురాణ గాథను చదవిండి. ఆ గీతాపారాయణ ఫలితాన్ని తెలుసుకుని మీరు ఆ పార్వతీదేవిలా అవాక్కవ్వండి.

మద్రదేశంలో పురుకుత్సమనే ఒక పట్టణం ఉండేది. ఆ పట్టణంలో పింగళుడనే బ్రాహ్మణుడుండేవాడు. అతడు శ్రోత్రియమైన బ్రాహ్మణ వర్ణానికి చెందినవాడైనప్పటికి, ఆతడికి లేని దుర్లక్షణాలు లేవు. ఆతడు నాట్యము, సంగీతము, మృదంగవాదనలో మంచి పేరు సంపాదించుకుని, ఆకీర్తి ప్రతిష్టలతో పరస్త్రీలను ఆకర్షించి విలాసవంతమైన జీవనాన్ని గడిపేవాడు. అతనికి లేని దుర్వ్యసనము లేదు. నిత్య మద్యమాంసాది సేవనము, జూదాది వ్యసనము ఆతని దినచర్యలో ప్రముఖ స్థానాన్ని ఆక్రమించాయి.

అతని భార్య అరుణ, ఒక నీచకుల స్త్రీ. ఆ భర్తకు తగిన ఇల్లాలు. అందరు పురుషులను ఆకర్షించే తత్త్వంగల జారిణి. ఆమెకు తన భర్త అయిన పింగళుడంటే మొహంమొత్తి, అతనితో అచ్చిక బుచ్చికలాడి, ఆతని ఆస్తినంతా అపహరించి, చివరకు అతనినే హత్యచేసింది. ఆ శవాన్ని తన ఇంటిలోనే పాతిపెట్టి, యధేచ్ఛగా కామకలాపాలలో విహరించడం మొదలుపెట్టింది. కొంత కాలానికి ఆమెకూడా సుఖవ్యాధులకులోనై మరణించింది.

ఇలా మరణించిన పింగళుడు, అరుణ ఇద్దరూ నరకలోకంలో పడవలసిన శిక్షలన్నీ అనుభవించి, మళ్లీ భూలోకంలో ఒకే అడవిలో రెండు పక్షులుగా జన్మించారు. పింగళుడు ఒక గ్రద్దగా జన్మించాడు. అరుణ ఒక చిలుక అయి జన్మించింది. ఇద్దరికీ పూర్వజన్మ విరోధముంది.

అలా కొన్ని రోజులు గడచిన తరువాత చిలుకగా పుట్టిన అరుణ, గ్రద్దగా పుట్టిన పింగళుని కంటపడింది. ఆ పూర్వజన్మ వాసనలవలన గ్రద్ద చిలుక వెంటబడి ముక్కుతో పొడవ నారంభించింది. చిలుక పారిపోయి ప్రాణావశిష్టయై నేలకూలింది. ఆ పడడం ఒక మానవ కపాలంలో పడింది. ఆ కపాలంలో కొంత వర్షపు నీరుంది. గ్రద్ద ఆ కపాలంపై కూర్చుని చిలుకను పొడిచి చంపేసింది. అంతలో ఒక బోయవాడు గ్రద్దను బాణంతో కొట్టాడు. ఆ గ్రద్ద కూడా కపాలంపై పడి మరణించింది.

వారిరువురిని యమభటులు మళ్లీ నరకలోకానికి తీసుకెళ్లి, యముడిముందు నుంచోపెట్టి వారి పాప రాశిని గురించి వివరించారు. పింగళకుడు, అరుణ ఆ పాపాల చిట్టా విని హడలిపోయారు. కాని యముడు వారి పూర్వాపరాలన్నీ గమనించి, "మీకు ఇక్కడ ఏశిక్షలు లేవు. వీరిద్దరిని వైకుంఠానికి తీసుకెళ్లి విడిచిరండి" అని ఆజ్ఞాపించాడు. దానికి ఆశ్చర్యపడిన ఆ దంపతులిద్దరూ "సమవర్తీ ! పరమపాపులమైన మేము ఇలా ఉద్ధరించబడడానికి కారణమేమిటి? అని అడిగారు.

అప్పుడు యమధర్మరాజు ఇలా చెప్పాడు. పూర్వం గంగాతీరంలో వటుడనే బ్రాహ్మణుడుండే వాడు అతడు పరమ నిష్ఠాగరిష్ఠుడు, బ్రహ్మవేత్త. అతడు ప్రతిదినము భగవద్గీతలోని పంచమాధ్యాయం మాత్రం నిష్ఠగా పఠించేవాడు. ఆ పారాయణ ప్రభావం వలన ఆతడు తాను దేహాంతమున పరమ పదాన్ని చేరుకున్నాడు. ఆతని పుర్రెలో నీరుచేరి, ఆ నీరు మీపై చిలకరించబడిన తరువాత మీరిద్దరూ మరణించారు. ఆ మహానుభావుని పుణ్యవిశేషంచేత మీ ఇద్దరి పాపాలు భస్మమై పోయాయి. ఆ కపాలాన్ని ఒకసారి తాకి నందు వలన మీరిద్దరూ ఎంత పాపాత్ములయినా పవిత్రులైపోయారు. వెళ్లండి, హాయిగా పరమపదంలో ఆనందాన్ని అనుభవించండి అని ఆశీర్వదించాడు యమధర్మరాజు. అంతలో విష్ణుకింకరులు ప్రత్యక్షమయ్యారు వారిని తమ లోకానికి తీసుకుని వెళ్లడానికి. ఈ కథను శ్రీమన్నారాయణుడు శ్రీమహాలక్ష్మికి చెప్పాడని, శ్రీమహాలక్ష్మి హర్షపులకాంకితురాలు అయ్యిందని శంకరుడు పార్వతీదేవికి చెప్పాడు. పార్వతీదేవి కళ్లు ఆనందంతో చెమర్చాయి.

ఆహా! భగవద్గీత మహిమ ఎంతటి అపారమైనది! అది పక్షులను కూడా తరింపజేస్తోంది. మరి మనవంటి ముముక్షువులు పారాయణ చేస్తే ఆ ఫలితాన్ని చెప్పడం మన తరమా! కాబట్టి మనమూ ఆ భగవద్గీత ఐదో అధ్యాయాన్ని పారాయణ చేద్దామా!



# దివ్యసాకేతంలో.........

**శ్రీమాన్ రఘుదత్తాచార్యులు - ప్రధానార్చకులు**

భక్తజనుల ఆర్తిని తీర్చడానికి స్వామి 5స్వరూపాలలో నిలిచి ఉంటాడట ఎప్పుడు! జగన్నియామకుడై ముక్తులైన వారితో, నిత్యపురుషులతో సదా శ్రియఃపతిగా దివ్యలోకంలో సేవింపబడుట ఇది పరము కేవలం నిర్మలభక్తి తత్పరతో జీవించిన వారిని తప్ప అన్యులకు స్మరణమాత్ర దుర్లభం. రెండవది వ్యూహము పేరుకు తగినట్టుగానే ఈ చిత్రవిచిత్రమైన సృష్టిని జరపటానికి అనేకానేక వ్యూహాలను తయారు చేస్తూ అలసినట్లుగా పాలకడలిపై మన అమ్మ లక్ష్మీదేవి చేసే సేవలతో ఊరడిల్లుతుంటాడు పాపం. ఇక్కడ బ్రహ్మరుద్రాదులైన ముఖ్య దేవతలకు మాత్రమే అప్పుడప్పుడు దర్శనమిస్తాడట. మూడవది ఆపన్నులైన వారిని ఆదుకొనుటకు దయతో తనను తాను వివిధ రూపాలలో అవతరింపజేసుకొంటాడు. ఇది విభవం ఆయా కాలదులలో ఉన్న వారికి తప్ప ఇతరులకు దర్శన దుర్లభము స్మరణ మాత్ర పాననకరము. **"అణోరణీయన మహతో మహీమాన్"** అని వేదం కీర్తిస్తున్నట్లు అణువులో అణువుగా మహత్య మందు మహత్యంగా నిలుస్తూ ప్రతి జీవుని యందు నిలిచి వారిని అస్తికులుగా నిలుపుట అంతర్యామి తత్త్వం.

ఇవన్నీ మహానుభవులైన వారు ధ్యానమందు దర్శించుటకు, ఆనందించుటకు తప్ప, సామాన్యులైన అల్ప బుద్ధికలవారిని పరమ దుర్లభమైనవి మరి భగవతత్త్వమును సులభంగా అందుకోవాలంటే మార్గం, ఆస్వామి సౌందర్యాన్ని కనులారా సేవించాలంటే కావలసిన ఉపాయం, పురాణ కథాపఠన శ్రవణాదులను చేయలేని పామరజనులకు కూడా అతి సులభంగా స్వామి మనకు దొరికే దారి ఏమిటి అని అనుకుంటే అది ఒకే ఒకస్థానం. దానిని శ్రీమన్నారాయణుడే స్వయంగా తెలియజేస్తూ

**అర్చారూపం పాంచరాత్రం విధినా సర్వకామదం ।**
**మంత్రమూర్తిం ప్రతిష్ఠాప్య మందిరాన్తర్గతం హరిం ॥** (శ్రీప్రశ్నసం)

**గృహేష్వపి ప్రతిష్ఠాప్య నిత్యం పూజయతే యది ।**
**అహం తద్బింబమావిశ్య భక్తానామిష్టసాధకః ॥**
**త్వయా సహ భవిష్యామి నాత్ర సందేహ అస్తుతే ॥** (శ్రీప్రశ్నసం)

దేవదేవుడైన శ్రీమన్నారాయణుని అత్యంత సులభంగా పొందుటకు ఆస్వామి యొక్క సౌలభ్య సౌశీల్యదయార్ద్రాది పరమగుణములను అనుభవించి ఆనందించుటకు రాజమార్గం అర్చాస్వరూపమనుట నిస్సంశమము. అటువంటి స్వామి విగ్రహమును పాంచరాత్ర విధిగా మందిరముల యందు గృహముల యందు కూడా ఉంచుకొని పూజించి నట్లైతే నేను ఆ బింబములను ఆవేశించి ఉంటు భక్తులయొక్క ఇష్టసాధన మవుతాను. ఎల్లవేలలా ఆవిగ్రహ మందు ఉంటే నిన్ను విడవక కలిసి ఉందును. ఈ విషయమందు ఎట్టి సందేహమవసరం లేదు అంటూ స్వామి గొప్ప ప్రతిజ్ఞను చేస్తాడు. అటువంటి అర్చామూర్తిని వారివారి రుచులననుసరించి ఆయా స్వరూపములలో రామకృష్ణాది విభవ అవతారాలలో సేవిస్తుండచ్చు. ఏ స్వరూపంలో ఆరాధించినప్పటికి ఆ మూర్తులకు కొన్ని ముఖ్య లక్షణాలు అత్యావశ్యకములు.

**సురూపాం ప్రతిమాం విష్ణోః ప్రసన్న వదవేక్షణాం ।**
**కృత్వాత్మనః ప్రీతికరీం సువర్ణ రజతాభిః ॥**
**తామర్చయేత్ తాం ప్రణమేత్ తామేవ వరచిన్తయేత్ ॥**

స్వామియొక్క మూర్తి చక్కని అవయవ సౌష్ఠవం కలిగి ముఖమందు వేలచంద్రుల వెన్నెలలు బోలు చల్లని చూపులు కలిగి అమృతధారలు కురియు నవ్వులు విరిసి, బుగ్గలు చిదమ పాలుకురియునటుల చెక్కిలి సంపదతో అష్టమీ చంద్రుని బోలు నుదురుతో, మన శ్రమలను శ్రవణం చేయుటకనినట్టు చక్కటి చెవులతో, మనకు తృప్తికలుగు రూపమందు బంగారు, వెండి మొదలైన శ్రేష్ఠలోహములతో నిర్మించుకొని దానిని ఆరాధించ వలెను, దానికే నమస్కరించవలెను, దానినే స్మరిస్తుండవలెను. అదిగో అలా అద్భుతమైన స్వరూప లావణ్యాదులతో కూడిన స్వామిని చూడగనే మనలో నిండుకొని ఉన్న చెడువాసనలు, చెడుబుద్ధి తొలగి మనతో సేవింపబడాలి. అట్టి స్వరూపం ఒకటికాదు, రెండుకాదు మూడు విధములైన రూపములతో దివ్యసాకేతమందు అలరారుతున్నాడు ఆ నారాయణుడు. చల్లని నవ్వులతో ఆకట్టుకొని రారమ్మని ఒక చేయిన పిలుస్తూ ఈ పాదమునాశ్రయించమని పాదము జాసి పద్మాశ్రిత కరముతో శ్రీభూ, నీళా సమేతుడై, స్మరణ ధ్యాన దుర్లభమగు పరస్వరూపము సపరివారంగా సాలోక్యంగా దర్శింపజేయు పరమ పదనాథసన్నిధి ఒక్కటైతే, దాని క్రింది తలమున సమస్త లోకస్రష్టయైన బ్రహ్మను నాభికమలమందు ధరించి సర్వలోక దేవతాకోటి సమూహమంతా సేవిస్తుండగా పువ్వులు తాకిన కందు ఎర్రని పాదములు కమలాశ్రితమై, పద్మోద్భవి అగు అమ్మలిరువురూ కుసుమాతిశయకోనుల పాదముల నొత్తుచుండ శేషశయనముపై భోగశయనుడై దర్శనమిచ్చు వ్యూహ స్వరూపమే రంగనాథుడు. సుధామూర్తిగా దర్శనమిస్తే ప్రకృతిలోని సౌందర్యమంతా పోటిపడినా చిరునవ్వులోని అణువుకు కూడా సరితూగలేని చిద్విలాసముతో నీకోసమే నేను నిలిచి ఉన్నాను రావోయి నాచెంతకనునటుల సీతాలక్ష్మణులతో, ఆళ్వారాచార్యాది గణసేవితమై అంజలి బద్ధుడైన హనుమచే సంసేవితుడై, కోదండపాణియై శ్రీరామ నగరాధిపతిగా జగత్పతిగా నిలచిన సాకేతరాముని దివ్యస్వరూపం సేవిస్తే తప్ప వర్ణించలేని దివ్యమూర్తి వైభవం మన దివ్యసాకేతంలో కొలువు దీరింది! కోటి జన్మల పుణ్యఫలమైతే తప్ప సేవించలేని పుణ్యధామం దివ్యసాకేతం రండి సేవిద్దాం!

**శ్రీరామ నగర దివ్యసాకేత భూవిరాజతే ।**
**సీతాలక్ష్మణ సంస్రీత చేతసే నిత్యమంగళమ్ ॥**

జై శ్రీమన్నారాయణ !



రాయల ఊహల పల్లకి....

# ఆముక్తమాల్యద

ఈ వివేకం లేనప్పుడు ఎన్ని చదివినా అవి వ్యర్థాలే! వాడు చేసే హేతువాదం ధాతువాదంలాంటిది. ఇతర లోహాల్ని బంగారంగా మార్చే విద్యని 'ధాతువాదం' అంటారు. ఊరివారికి బంగారం చేసి పెడతాననంటాడు ఈ ధాతువాది. అల్లా చేసుకోగలిగితే తానే బంగారాన్ని పండించుకొని భాగ్యవంతుడు కావచ్చు కదా! నిజానికి వీడేం చెయ్యలేడు. జనాన్ని మోసగించి వాళ్ళదగ్గిర ఉన్నది కాస్తా ఊడదీసుకుపోతాడు.

పైవాడికోసం ఏవేవో లేనిపోని కారణాలు చూపెట్టి వాదం కోసం వాదించడం. దానివల్ల ప్రయోజనం లేదు, లోకవంచన తప్ప. తనను గూర్చి భగవంతుణ్ణి గూర్చి తమ ఇద్దరి బంధాన్ని గూర్చి ఒక అవగాహన ఏర్పడ్డాక ఈ ధాతువాదంలాంటి వంచనలు, వాదాలూ అనవసరమనుకొన్నారాయన.

ఈ తెలివిలేనివాడికి కాణాదం ప్రాణాదమే అంటారు విష్ణుచిత్తులు. కాణాదమంటే వైశేషికం ప్రాణాదమంటే ప్రాణాలు తీసుకుతింటుంది అని.

అల్లాగే కాపిలం చాపలం అంటారు. కాపిలమంటే సాంఖ్యం. స్థిరంగా ఒకే నిశ్చయంమీద నిలబడేది కాదు. మీమాంస హింస అంటారు. పూర్వమీమాంసాశాస్త్రం యజ్ఞాల్ని, పశుహింసని బోధిస్తుంది. పరమేశ్వరుణ్ణిగూర్చి వాస్తవమైన జ్ఞానం కలిగేక ఈ హింసలకు ఒడిగట్టుకోవడం ఎందుకని ఆయన అభిప్రాయం. వ్యాకరణం అశకరణం అంటారు. వ్యాకరణశాస్త్రం శరణిచ్చి కాపాడేది కాదు. "నహి నహి రక్షతి డుకృఙ్ కరుణే" భగవంతుడొక్కడే శరణు పొందదగినవాడుకాని, వ్యాకరణం మొదలైన శాస్త్రాలు కావని వారి తలపు.

అట్లా కాదని ఈ శాస్త్రాలనన్నింటినీ చదవాలని మొదలెట్టినా ఎంతకాలమూ చాలదు–వాటిని చదవడానికి, విఘ్నాలూ అన్నీ ఇన్నీ కావు. చదువుకోవడానికి అవకాశాలూ చాలా తక్కువ. ఎల్లాగో తిప్పలుపడి కాస్త నాలుగక్షరం ముక్కలు ముక్కున పట్టేటప్పటికి వాడిక్కలిగే మదం ఇంతా అంతా కాదు. చచ్చిచెడి చివరిదాకా చదివి విజ్ఞానం పొందేడే అనుకోండి – ఈ విజ్ఞానం భగవంతుణ్ణి గురించి తెలుసుకోడానికి ఒక సాధనమే తప్ప, ఇది మనిషిని ఒడ్డున చేర్చేది కాదు.

భగవంతుని గురించి ఒక అవగాహన అంటూ కలిగేక ఈ లౌకిక విద్యలనన్నింటినీ విడిచి పెట్టాల్సిందే! ధాన్యం తెచ్చుకున్నవాడు గింజల్లేని గడ్డిని, పట్టులోంచి తేనె తీసుకున్నవాడు మైనాన్నీ వదిలేసినట్టు భగవంతుణ్ణి గూర్చి స్పష్టమైన అవగాహన కలిగేక సత్త్వరజస్తమోగుణ సంబంధమైన ఈ లౌకికజ్ఞానాన్నీ విడిచిపెట్టాల్సిందే! అల్లాంటప్పుడు ఇంద్రియ నిగ్రహంతో విరక్తితో విష్ణువుని ఆరాధించే నాకు ముందువి నేర్చుకోవడమెందుకు, తరవాత వదిలిపెట్టడం ఎందుకు, వాదుల్ని జయిస్తూ, రాజుల్ని మెప్పిస్తూ మళ్ళీ మళ్ళీ పుట్టడానికి విసుగులేనివాళ్ళకి అవన్నీ కానీ, నాకెందుకు? నాలాంటివాళ్ళకు ఆ చదువులవల్ల వచ్చే ఖ్యాతి ఈతిబాధలాంటిది.

సమ్మానాది లాభాలవల్ల మరింత మనస్సుకు క్షోభ. వారి పూజనం భయాన్ని కలిగిస్తుంది. అని ఇట్లా ఆలోచించి ఆ చదువులజోలికి వారు పోకుండా వెనుక వెనక రహూగణుడుకి ఆచార్యత్వం అంగీకరించి తత్త్వాన్ని ఉపదేశించి మోక్షాన్ని లభింపచేసిన జడభరతుడిలా గొప్పజ్ఞానంతో ఉన్నారు. పరమపదంలో కూడా భాగవతులు దివ్యమంగళ విగ్రహాలతో భగవత్ పరిచర్య చేయడమే గొప్పగా భావిస్తారని అదే మనిషన్నవాడు పొందాల్సిన ఉత్తమ పురుషార్థమనీ ఎరిగి, ఆ ఊళ్ళో ఉన్న వటపత్రశాయికి మాలాసమర్పణకైంకర్యం తమ కర్తవ్యంగా భావించి పరమానందంతో ఆ కైంకర్యంలో నిమగ్నులై ఉంటున్నారు.

హిమవత్పర్వతం నుండి మలయాచలం వరకూ ఉన్న సకల పుణ్యతీర్థాలకూ యాత్రలు చేస్తూ దారిలో విల్లిపుత్తూరు వచ్చే భాగవతులకు న్యాయమార్గాన సంపాదించిన డబ్బుతో భోజనాలు పెట్టేవారాయన.

ఏదో పెట్టేమంటే పెట్టేమని కాకుండా ఏకాలానికి తగిన భోజనం ఆ కాలంలో పెట్టించడం ఆయన ప్రత్యేకత.



పరమహంస పరివ్రాజకులు

# శ్రీశ్రీశ్రీ చిన్నజీయర్‌స్వామివారి ప్రచారవార్తలు



**సర్వదేశ దశాకాలేషు అవ్యాహత పరాక్రమా ।**
**రామానుజార్య దివ్యాజ్ఞా వర్ధతా మభివర్ధతామ్ ॥**

అన్నట్లుగ మన భగవద్రామానుజ సంప్రదాయ వైభవాన్ని మన దేశంలోనే కాక, ఖండాంతరాలలో కూడ వ్యాప్తిచేస్తున్న మహానుభావులు జగదాచార్యులు, మన ఆచార్యులైన శ్రీశ్రీశ్రీ చిన్నజీయర్ స్వామివారు. శ్రీవారి ప్రవచనామృతాన్ని గ్రోలిన ఎందరో ప్రేరితులై సన్మార్గంలోకి మరలుతున్నారు. విశేషించి అమెరికాలోని మన భగవద్బంధువులెందరో సాంప్రదాయిక ఆహారవిహారపు అలవాట్లను అలవరచుకుంటున్నారు. మన వైదిక సంప్రదాయాన్ని పెద్దలకే కాక, భవిష్యత్తరాలకి కూడ అందించాలని శ్రీవారు 'ప్రజ్ఞ' తరగతులను నిర్వహింపచేస్తున్నారు.

సుమారు 2000పైగ చిన్నారులు ఈ తరగతులలో మన వైదిక జీవనవిధానాన్ని, నైతికవిలువలను నేర్చుకుంటున్నారు. మొదట "ప్రజ్ఞ" తరగతుల నిర్వహణకై మన ప్రచారకులను పంపినా, నిరంతరం పెరుగుతున్న అవసరాల దృష్ట్యా ప్రజ్ఞ కేంద్రాలలో సేవలందించే టీచర్స్‌కోసం అక్కడి ప్రవాసాంధ్రులకి శిక్షణను ఇవ్వాలని సంకల్పించారు శ్రీవారు. దానికి ప్రతిస్పందించి ఎందరో తల్లిదండ్రులు పిల్లలకి మన విలువలను నేర్పడానికి ప్రజ్ఞ ఉపాధ్యాయులుగ శిక్షణ పొందడానికి ముందుకు వచ్చారు.

వివిధకేంద్రాలలోని ప్రజ్ఞ ఉపాధ్యాయుల శిక్షణ నిమిత్తమే శ్రీవారు ఈ సంవత్సరం రెండవసారి అమెరికా పయనమయ్యారు.

గతంలో NATS వారి ఆహ్వానంమేరకు అమెరికా వేంచేసినా 4వారాల పర్యటన పూర్తిచేసుకొని చాతుర్మాస్య దీక్షకై భారతదేశం వేంచేసారు. ప్రజ్ఞ శిక్షణ తరగతుల నిమిత్తమే శ్రీవారు వేంచేస్తున్న విషయం తెలిసి మన JET USA సభ్యులంతా శ్రీవారిని తిరునక్షత్ర మహోత్సవము కూడ ఇక్కడే జరపాలని ప్రార్థించారు. గత 2,3 సంవత్సరాలుగ జె.ట్.యు.ఎస్.ఎ వారు అభ్యర్థిస్తున్నా, ఈ సంవత్సరం శ్రీవారు అనుగ్రహించడం విశేషం. గత సంవత్సరం తూర్పు అమెరికాలోని న్యూజెర్సీ ఆశ్రమంలో శ్రీయాగం వైభవంగ జరిగిన విషయం మనందరికీ తెలిసినదే. ఈసారి శ్రీవారి తిరునక్షత్రోత్సవం మాకు కావాలని టెక్సాస్ రాష్ట్రంలో మన జెట్-హూస్టన్ విభాగంగ ప్రకాశిస్తున్న అష్టలక్ష్మీ ఆలయ నిర్వాహకులు ప్రార్థించగ శ్రీవారు అంగీకరించారు.

సెపెంబర్ 19వ తేదీన హైదరాబాద్‌లో బయలుదేరి 20వ తేదీ ఉదయానికి న్యూయార్క్ నగరం చేరారు. విమానాశ్రయంలో మన న్యూజెర్సీ జీయర్ఆశ్రమ భక్తబృంద మంతా శ్రీవారికి ఆనందతరంగిత హృదయాలతో ఘనస్వాగతం పలికారు. అక్కడినుండి నేరుగ మన జెట్ ట్రెజరర్, న్యూజెర్సీ ఆశ్రమనిర్వాహకులైన శ్రీమాన్ శర్మవిజయ అల్లక్కీ దంపతుల గృహానికి వేంచేసారు. భక్తుల ప్రార్థనపై 20,21,22 తేదీలలో మన ఆశ్రమంలో శ్రీవిష్ణుపురాణంపై ప్రవచనాన్ని అనుగ్రహించారు. 23,24 తేదీలలో భగవద్గీత 3వ అధ్యాయాన్ని ప్రవచించారు.

22వ తేదీ న్యూయార్క్ మెట్రోపోలిటన్ ఆఫ్ ఆర్ట్ మ్యూజియమ్‌లో "విష్ణు ది బ్లూ స్కిన్డ్ సేవియర్" అనే Exhibition సందర్శించారు. అక్కడ మన భారతదేశం నుండి తెచ్చిన వివిధరూపాలలో ఉన్న శ్రీమహావిష్ణువుకి సంబంధించిన శిల్పాలు, చిత్రపటాలు ప్రదర్శించారు. కేశవాది వివిధవ్యూహ స్వరూపాల మూర్తులు ఇందులో ఉండటం విశేషం.

అమెరికావారు విష్ణువుని నీలివర్ణంగల రక్షకుడు Vishnu the blue skinned savior అని గుర్తించడం ఆనందంగ అనిపించింది. అక్కడ అమెరికన్స్ వచ్చి శ్రీస్వామివారిని ప్రశ్నించి, ఆ మూర్తుల విశేషాలు తెలుసుకున్నారు.

24,25 తేదీలలో ఉదయంనుండి సాయంత్రం వరకు జరిగిన ప్రజ్ఞ శిక్షణతరగతులలో న్యూజెర్సీ, న్యూ ఇంగ్లండ్, కెనటికట్, న్యూయార్క్, వాషింగ్‌టన్ డిసీ, మేరీల్యాండ్ వంటి ప్రాంతాలనుండి 80మందిదాకా టీచర్స్ పాల్గొన్నారు. ప్రజ్ఞ తరగతులలో పిల్లలకి నేర్పవలసిన వివిధ అంశాలపై సరియైన అవగాహన అవసరమని శ్రీవారు స్పష్టం చేసారు. వేదాల రహస్యాలు, వైదిక వాఙ్మయ విలువలూ, చారిత్రక గ్రంథాలు బోధించే పలురకాల కథలలో దాగిఉన్న నీతిబోధకాంశాలు, వీటితోపాటు శ్లోకాలను నేర్చేవిధానము, దానివల్ల కలిగే ప్రయోజనాలు- వీటిని ఆచరణలో పెట్టుకోవడం ద్వారా జీవితాన్ని ఉన్నతమైన మార్గంలో గడపడం వంటి విషయాలు ఇందులో పొందుపరచారు. 4సం॥ వయసులో 'ప్రజ్ఞ' లో చేరిన పిల్లలకి ఒక 12మాడ్యూల్స్ పూర్తయ్యే లోపు తెలియవలసిన ధార్మిక నైతిక అంశాలన్నీ నేర్పించే విధంగా 'సిలబస్' ని తయారుచేసి అనుగ్రహించారు.

యుక్తవయసు వచ్చేసరికి ఇక్కడి పిల్లలకి ఉండే స్వేచ్ఛని దుర్వినియోగ పరచుకోకుండా సరైన జీవన విధానాన్ని ఎంచుకోగలిగేలా తగిన జ్ఞానాన్ని అందించి తీర్చిదిద్దడమే 'ప్రజ్ఞ' లక్ష్యమని తెలియజేసారు శ్రీవారు. నేటి చిన్నారులే భావి పౌరులుగా 'ప్రజ్ఞ' ద్వారా సుశిక్షితులు కావాలన్నారు. ఇక్కడి పిల్లలకి సేవాభావం పాఠశాల స్థాయి నుండి అలవడుతుంది గనుక, VT Seva కార్యకర్తలుగా వీరిని తీర్చిదిద్దుకోవాలని సూచించారు. ఇక ప్రజ్ఞ తరగతుల శిక్షణకి శ్లోక పఠనవిధానం, ఉచ్చారణ

విధానం వివరించారు. మన పురాణేతిహాసాలు నుండి తయారు చేసిన కథలలోని విలువలను ఆచరణాత్మకమయ్యేట్లు పిల్లల హృదయాలకి హత్తుకునేట్లు చెప్పడమెలాగో వివరించారు. పిల్లలకి నేర్పించాల్సిన యోగాసనాలలో కూడా శిక్షణనిచ్చారు.

పరిసమాపన సమయంలో న్యూజెర్సీ భక్తబృందము, ప్రజ్ఞ పిల్లలు శ్రీవారి తిరునక్షత్రోత్సవ సంబరాలు మన ఆశ్రమంలో చిన్నస్థాయిలో ప్రారంభించారు. ప్రజ్ఞ మ్యూజిక్ విద్యార్థులు ఆచార్యవైభవంపై పాటలు పాడారు. స్థానిక గురువాయురప్పన్ ఆలయం నుండి, శ్రీవెంకటేశ్వరుని సన్నిధి నుండి మర్యాదలను సమర్పించారు. శ్రీవారికిదొక Surprise. చిన్నారుల ఆత్మీయతకి స్పందించి శ్రీవారు మంగళాశాసనాలు అనుగ్రంచించారు. 26 ఉదయం ఆరాధనాంతరం పిట్స్‌బర్గ్ శ్రీమాన్ వేంకటాచార్యస్వామివారి గృహానికి వేంచేశారు. సాయంత్రం ఆరాధనానంతరం అమెరికాలోనే ప్రజ్ఞ విద్యార్థులకి, వారికి ఉపాధ్యాయులైన శ్రీమాన్ శ్రీనివాసరాఘవ దంపతులకి మంగళాశాసనాలుచేసి, అమెరికాలో ప్రప్రథమ ఆలయమైన శ్రీవేంకటేశ్వరుని సన్నిధిని సందర్శించారు. అప్పటికే అక్కడచేరి ఉన్న భక్తులకోరికపై శ్రీవిష్ణుసహస్రనామ వైభవాన్ని అనుగ్రహించారు. గతంలో శ్రీవారు ఈ ఆలయానికి వేంచేంసినప్పుడు ఇచ్చిన సూచనమేరకు స్థానిక భక్తబృంద మంతా తాయార్లకై బంగారు కవచాలని సమర్పించారు. ఆవిషయాన్ని శ్రీవారికి తెలియజేసారు. శ్రీవారు ఈసారి మరల వేంచేసేసరికి బంగారు వాకిలిపూర్తిచేయాలని మంగళా శాసనాలు అనుగ్రహించారు. అనంతరం ఆలయనిర్వాహకులు శ్రీస్వామివారిని సత్కరించారు. శ్రీవేంకటేశ్వరుని ఏకాంతసేవ దర్శించి ఆపై కొందరు స్థానిక భక్తుల గృహాలని సందర్శించారు.

27 వ తేది ఉదయం ఆరాధనానంతరం డా॥ ఆనంద్ గారి గృహానికి వేంచేసి అక్కడ ప్రజ్ఞ తరగతులు ప్రారంభించ డానికి మంగళాశాసనాలు చేసి సాయంత్రానికి Ft wayne శ్రీమాన్ చిలకమర్రి విజయదంపతుల గృహానికి చేరారు. ఆనాటి స్రాయంత్రం స్థానిక చర్చిలో ఏర్పాటుచేసిన కార్యక్రమంలో What is Life? అనే అంశాన్ని అద్భుతంగా అనుగ్రహించారు. 28 ఉదయం ఆరాధనానంతరం రామకృష్ణారెడ్డిగారి బంధువుల గృహాన్ని సందర్శించి Milwalkee లో శ్రీమాన్ వేంకట్ కొడాలిగారి గృహంచేరారు. సాయంత్రం Hindu Temple లో 'శ్రీవిష్ణు సహస్రనామ వైభవాన్ని' ప్రవచించారు.

29 ఉదయం ఆరాధనాంతరం బయలుదేరారు. మార్గమధ్యంలో ఇద్దరు VT Seva Volinteer గృహాలని సందర్శించి ప్రజ్ఞ తరగతులని ప్రారంభించడానికి మంగళాశాసనాలు కావించారు. సాయంత్రానికి శ్రీమాన్ జ్యోతి, కరుణాకర్ చీకోటి గృహానికి వేంచేసారు. 30 ఉదయం ఆరాధనానంతరం ILలోని మన JET USA Secretary శ్రీమాన్ రఘుముడుంబై గృహానికి వేంచేంసారు. వీరిసోదరి శ్రీమతి రాధ చక్కటి స్వాగతంపలికారు. Metea Valley High School లో శ్రీవిష్ణు సహస్రనామాన్ని ఉపదేశాత్మకంగా అనుగ్రహించారు. సుమారు రెండువేలమంది పాల్గొన్న ఈకార్యక్రమం అత్యంతవైభవంగా భక్తుల శ్రద్ధోత్సాహాలమధ్య సాగింది. కార్యక్రమానికి ముందు శ్రీమతి సరస్వతి రంగనాథన్ బృందం చక్కటి వాద్యసంగీతాన్ని అందించి అలరించారు. చివరలో ఉషా రంగనాథన్ (నాట్యం), హేమ యద్దనపూడి (లాస్యం స్కూల్), అరుణ చంద్ర (స్పందన) వారి నృత్యప్రదర్శన అనంతరం శ్రీవారు కళాకారులందరికి మంగళాశాసనాలు కావించారు.

1వ తేదీ ఉదయం శ్రీమాన్ రఘుగారి గృహంలో ఆశ్రితులకు మంత్రోపదేశం కావించారు. 1,2 తేదీలలో అదే స్కూల్లో ప్రజ్ఞ శిక్షణ శిబిరం జరిగింది. 2వ తేదీ సాయంత్రం మన జెట్ యు.ఎస్.ఎ సలహాదారైన శ్రీమతి చిత్రామాధవన్‌గారి అభ్యర్థనమేరకు ఐసిలో ఉన్న వారి మాతృమూర్తిని చూసి మంగళాశాసనాలు అనుగ్రహించారు.

3వ తేదీ Plainfieldలో ఉన్న శ్రీమాన్ గూరేదంపతుల గృహానికి వేంచేసి వారికి మంగళాశాసనాలు కావించి రాత్రి Louisville లోని కార్యక్రమానికి వేంచేసారు. అక్కడి St. Thomas Episcopoal చర్చిలో శ్రీమతి పద్మలెల్లపల్లిగారు ఏర్పాటుచేసిన కార్యక్రమంలో ప్రవచించి, డా॥ యమున కాసరనేని దంపతుల గృహాన్ని సందర్శించి డా॥రామాచారి వింధ్య దంపతుల ఇంటికి వేంచేసారు.

4వతేది ఉదయం ఆరాధనానంతరం ఇంటివారికి మంగళా శాసనాలు చేసి, Nashville మన ప్రజ్ఞ టీచర్ శ్రీమతి జానకి అశోక్ దంపతుల గృహానికి వేంచేసారు. సాయంత్రం స్థానిక హిందూ టెంపుల్‌లో శ్రీరామపూజను సామూహికంగా జరిపించారు. రామునివైభవంతో పాటు పూజావిధానాన్ని శ్రీస్వామివారి నుండి విన్న భక్తులు శ్రద్ధతో శ్రీరాముని పూజించి ఆనందించారు.

ఉదయం భక్తుల ప్రార్థనపై మంత్రోపదేశం కావించి సాయంత్రానికి Birmingham శ్రీమతి సరస్వతీరావు వల్లభనేని దంపతుల గృహానికి వేంచేసారు. అనుకోని రీతిలో కాలిపై వ్రణంతో హాస్పిటల్‌లో చేరిన శ్రీమాన్ రావుగారిని చూసి మంగళాశాసనాలు కావించి, డా॥ మాదంపాటి శ్రీనివాస్ వినత దంపతుల గృహాన్ని సందర్శించారు. రాత్రికి స్థానిక వేంకటేశ్వ రాలయంలో శ్రీరామునికి శాంతికళ్యాణాన్ని జరిపించి, విజయ దశమికై Atlanta శ్రీమతి ప్రపూర్ణరవి గౌరిశెట్టి దంపతుల గృహానికి చేరారు.

6వ తేది విజయదశమి, శ్రీవేంకటేశ్వర తిరునక్షత్ర పూర్వక మంగళాశాసనాలు భక్తులందరికీ కావించారు. సాయంత్రం స్థానిక విద్యాలయంలో శమీపూజా కార్యక్రమాన్ని నిర్వహించారు. 7,8 తేదీలలో అదే స్కూల్లో ప్రజ్ఞ తరగతులు నిర్వహించారు. సాయంత్రం సామూహిక

లక్ష్మీనారాయణ పూజా కార్యక్రమం శ్రీవారి నేతృత్వంలో జరిగింది.

10వ తేది ఉదయం ఆరాధనానంతరం Seattle ప్రత్యేక విమానంలో శ్రీవారు పరివారంతో వేంచేసారు. అట్లాంటానుండి సియాటిన్ చాల దూరప్రయాణం కావడంతో స్థానిక విమానాలలో ప్రయాణంలో ఉండే ఇబ్బందులదృష్ట్యా, ప్రత్యేకవిమాన ప్రయాణం అవసరమైంది. మన భక్తుల కోరికమేరకు మన స్వామివారి శ్రీచరణ సంబంధి శ్రీమతి పద్మ రామలింగరాజు దీని ఏర్పాట్లు చేసిపెట్టారు. ఈమె మన జెట్ అధ్యక్షులైన శ్రీమాన్ జి. గంగరాజుగారి కుమార్తె. అక్కడ సియాటిన్‌లో శ్రీమతి శ్రీమాన్ వర్ధని శ్రీకాంత్ మేళ్ళచెర్వువారి గృహంలో బసచేసారు. అక్కడే రాత్రికి విష్ణుసహస్రనామ పారాయణానంతరం ప్రజ్ఞ ప్రారంభానికి మంగళాశాసనం చేసారు.

11వ తేదీ ఉదయం ఆరాధనానంతరం భక్తుల గృహాలకు వేంచేసి మంగళాశాసనాలు గావించారు. సాయంత్రం స్థానిక ఇస్కాన్ ఆలయంలో శ్రీరామవైభవంతోపాటు శ్రీరామపూజను సామూహికంగ అనుగ్రహించారు. వీక్‌డే అయినప్పటికీ సుమారు వందలసంఖ్యలో భక్తులు పాల్గొనడం అక్కడివారి శ్రద్ధను తెలిపింది. అభయప్రద సేవాసంస్థవారు, మన స్వామివారు నిర్వహించే 'విటి సేవ' వివరాలను తెలుసుకొని, తాముకూడ కలసి శ్రీస్వామివారి నేతృత్వంలో సేవలను అందిస్తామన్నారు. శ్రీమాన్ అరవింద్, శ్రీమాన్ కృష్ణకాంత్ తమ మిత్రబృందంతో కలసి ఈ ప్రాంతలోని కార్యక్రమాలనీ నిర్వహిస్తున్నారు.

12 ఉదయం ఆరాధనానంతరం బయలుదేరి సాయంత్రానికి మన ప్రజ్ఞ టీచర్ శ్రీమతి మైథిలీ శ్రీనివాస్ దంపతుల గృహానికి వేంచేసారు. ఆ రాత్రి స్థానిక శ్రీవేంకటేశ్వర ఆలయ సమీపంలోని హాలులో శ్రీరామపూజను సామూహికంగ జరిపించారు. శ్రీస్వామివారి సుమధుర వాణిలో శ్రీరామ వైభవాన్ని విన్న భక్తులు అత్యంత శ్రద్ధాసక్తులతో, ప్రేమతో శ్రీరాముని పూజించారు.

మైథిలీ దంపతులు శ్రీస్వామివారిని వేంచేపుచేసుకోవడం కోసమే నూతనంగ గృహాన్ని సిద్ధపరచారు. వారి కోరికపై 13 ఉదయం సుదర్శనహోమాన్ని జరిపించి, ఆశ్రితులకు మంత్రోపదేశం గావించారు. వారి చిరంజీవికి అక్షరాభ్యాసం కావించి, ఆ కుటుంబాన్నంతటికీ మంగళాశాసనాలు కృపచేసారు శ్రీవారు. ఈ కార్యక్రమాన్ని శ్రీమాన్ కృష్ణకాంత్, శ్రీమాన్ శ్రీకాంత్, శ్రీమాన్ అరవిందలు పర్యవేక్షించారు.

అనంతరం Sfo బయలుదేరి మార్గమధ్యలో మన న్యూజెర్సీకి చెందిన రవీంద్ర తోట దంపతులు నూతనంగ కొన్న Theatre సముదాయానికి మంగళాశాసనాలు గావించి, తెల్లవారుఝాముకి Sanjose లోని శ్రీమాన్ శ్రీధర్ పద్మ కతారు దంపతుల గృహానికి వేంచేసారు.

14వ తేదీ శ్రీమాన్ శ్రీధర్‌గారి గృహంలోనే ప్రజ్ఞ శిక్షణను అనుగ్రహించారు. సాయంత్రం ప్రజ్ఞ విద్యార్థులు, VT Seva వాలెంటరీస్ సాంస్కృతిక కార్యక్రమాలు నిర్వహించారు. 15వ తేదీ సాయంత్రం Malpitis లోని శ్రీసత్యనారాయణస్వామి ఆలయంలో శ్రీరామపూజ నిర్వహించారు. దాదాపు 500మంది ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు. ప్రజ్ఞ శిక్షణ అనంతరం 16వ తేదీ సాయంత్రం JET CA President శ్రీమాన్ వంశీ ఇంటికి వేంచేసారు. Windmere స్కూల్‌లో Secrets of Ramayana అనే అంశంపై Interactive sessionలో పాల్గొన్నారు.

17వ తేది సాయంత్రం Meet and Greet వంశీగారి నివాసంలోనే జరిగింది. 18 ఉదయం ఆశ్రితులకు మంత్రోపదేశం గావించారు.

19 ఉదయం LA బయలుదేరి మార్గమధ్యంలో శ్రీమాన్ శ్రీధర్ కతారుగారి Almond Gardens సందర్శించి, మంగళాశాసనాలు గావించారు. సాయంత్రం LAలోని IRVINEలో నూతనంగ ప్రారంభిస్తున్న ఆలయంలో శ్రీరాముని పరిపూర్ణ మానవతని గురించి అనుగ్రహించారు. తరువాత శ్రీమాన్ అనిల్‌గారి గృహానికి వేంచేసి ప్రజ్ఞ తరగతుల ప్రారంభానికి మంగళాశాసనాలు గావించారు. రాత్రికి శ్రీమతి విజయలక్ష్మి దంపతుల గృహానికి వేంచేసారు. 20 సాయంత్రం 'ఆలయలక్ష్యం జ్ఞాన సంప్రదాయాల వితరణమని' ఆలయ ప్రాముఖ్యాన్ని ప్రవచించారు.

21 ఉదయం ఆశ్రితులకు మంత్రోపదేశం గావించి, రాత్రికి Phoenix చేరారు. 22 ఉదయం ఆరాధనానంతరం Volunteers మరియు Prajna Parents Meet జరిగాయి. సాయంత్రం University Hallలో ప్రవచనం జరిగింది. 23 ఉదయం తీర్థగోష్ఠి అనంతరం School లో శ్రీరామపూజ నిర్వహించి, శ్రీమతి పద్మరాజుగారే ఏర్పరచిన ప్రత్యేక విమానంలోనే హ్యూస్టన్ చేరారు. 23వ తేదీనుండి 31వ తేదీదాకా ఇక్కడే శ్రీస్వామివారి తిరునక్షత్ర మహోత్సవాన్ని జరిపే సందర్భంగ శ్రీవారు వాటిలో పాల్గొనడానికి విచ్చేసారు.

## ఆచార్య తిరునక్షత్ర మహోత్సవాలు

### JET - USA, HOUSTON

శుక్రవారం 21వ తేదీ సాయంకాలం 8:30 గంటలకు Houston Hobby విమానాశ్రయములో JET Houston సభ్యులు పూలమాలలతో ఆచార్య తిరునక్షత్రంలో పాల్గొనటానికి భారతదేశం నుంచి విచ్చేసిన శ్రీశ్రీశ్రీ త్రిదండి అహోబిల రామానుజ జీయర్ స్వామివారికి, వారి పరివారానికి, శ్రీమాన్ డా॥సముద్రాల రంగరామానుజాచార్య స్వామివారికి సాదరంగా స్వాగతం పలికారు. శ్రీ అష్టలక్ష్మి ఆలయ ప్రాంగణంలో జీయర్ స్వామివారికి ఆలయ అర్చకులు శ్రీమాన్ హనుమాన్ స్వామి, శ్రీమాన్ అనిల్,శ్రీమాన్ యుగంధర్ పూర్ణకుంభ స్వాగతం పలికారు.

శనివారం 22వ తేదీన అహోబిల రామానుజ జీయర్ స్వామివారు దీపావళి మరియు ఆచార్య తిరునక్షత్ర పండుగ ఏర్పాట్లను పర్యవేక్షించారు.

ఆదివారం 23వ తేదీన సాయంకాలం 8:30 Houston JET ,VT Seva మరియు శ్రీ అష్టలక్ష్మి దేవాలయ ట్రస్టు సభ్యులు Sugar Land Regional Airportలో పుష్పగుచ్ఛాలతో శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ చిన్న జీయర్ స్వామివారిని సాదరంగా ఆహ్వానించారు. Houston ప్రజ్ఞ బాలురు స్వామివారికి ఆదర పురస్సరంగా స్వాగతం పలుకుతూ ఈశావాస్యోపనిషత్ నుండి శ్లోకాలను చదివారు. స్వామివారిని ఆలయ ప్రాంగణంలో పూర్ణకుంభం మరియు వేదఘోషతో అహోబిల రామానుజ జీయర్ స్వామివారు ముందు నడువగా, 40మంది ఋత్విక్కులు వెనుక నడువగా, వారి వెనుక దీపాలను పట్టుకుని భక్త మహిళలు, వారి వెనుక బాలబాలికలు నడువగా ఘనంగా స్వాగతించారు.

జీయర్‌స్వామివారు ఆలయంలో వేంచేసి శ్రీలక్ష్మీ నారాయణులకు మంగళాశాసనం చేశారు. సమావేశమైన వారందరినీ ఉద్దేశించి స్వామివారు కార్యక్రమాన్ని ప్రారంభిస్తున్నామని పలికారు. శ్రీమాన్ తమిరిశ శ్రీనివాసాచారి గారు స్వామివారి తల్లిగారిని ఆదరపురస్సరంగా సభకు పరిచయం చేసారు.

సోమవారం 24వ తేదీన ఉదయాన జరిగిన సేవాకాలం, తీర్థగోష్ఠిలో భక్తులు అసంఖ్యాకంగా పాల్గొన్నారు. తరువాత స్వామివారు ఉత్సవం కోసం చేసిన ఏర్పాట్లను స్వయంగా పర్యవేక్షించారు. ఆనాటి మధ్యాహ్నం స్వామివారు Houston కి వివిధ ప్రదేశాల నుంచి వచ్చినవారికి ఆతిథ్యం ఇస్తున్న భక్తుల ఇండ్లను సందర్శించి మంగళాశాసనం కావించారు. సాయంకాలం Woodlands హిందూ దేవాలయాన్ని దర్శించి అక్కడ భక్తులను ఉద్దేశించి ప్రవచనం చేసారు. శ్రీ రంగరామానుజాచార్య స్వామివారు కూడా ప్రసంగించారు. స్వామివారు, ఆలయాలు విద్యా విజ్ఞాన కేంద్రాలుగా విలసిల్లాలని సందేశమిచ్చారు. ఆ తరువాత శ్రీ శ్రీనివాస్ వేదాల గారింట్లో సత్సంగం జరిగినది. స్వామివారు వారింట్లో పెరుమాళ్ళకు సాయంకాల ఆరాధన, మంగళాశాసనం చేసారు.

మంగళవారం 25వ తేదీన ఉదయాన్నే జరిగిన తీర్థగోష్ఠిలో భక్తులు అసంఖ్యాకంగా పాల్గొన్నారు. ఆనాటి మధ్యాహ్నం శ్రీస్వామివారు హ్యూస్టన్ భక్తుల ఇండ్లలో సత్సంగం జరిపారు. సాయంకాలం BAPS స్వామినారాయణ్ మందిరాన్ని శ్రీస్వామివారు సందర్శించారు. BAPS ఆలయార్చకులు, సంతులు శ్రీస్వామివారిని ఎంతో ఆదరపూర్వకంగా ఆహ్వానించి శ్రీస్వామివారికి, వారితో పాటుగా వేంచేసిన ఋత్విక్కులకి ఆలయ విశేషాలను చూపించారు. అక్కడ జరిగిన హారతిలో శ్రీస్వామివారు పాల్గొన్నారు. BAPS సంతులు శ్రీస్వామివారి వైభవాన్ని స్తుతిస్తూ తాము కూడా రామానుజ సంప్రదాయంలోని వారమేనన్నారు. స్వామివారు వారి ఆచార్య నిష్ఠను, వారి కార్యశీలతను, పిల్లలకు వారు విజ్ఞానాన్ని అందిస్తున్న విధానాన్ని ప్రశంసించారు.

రాత్రి 8:30 కు శ్రీ అష్టలక్ష్మి దేవాలయంలో స్వామివారు సమావేశమైన భక్తులను ఉద్దేశించి నరక చతుర్దశి ప్రాముఖ్యమును వివరిస్తూ ప్రవచనం చేశారు. అటు పిమ్మట కార్యకర్తల సమావేశం జరిగింది. స్వామివారు ఏర్పాట్ల విషయంలో కొన్ని సూచనలు చేసిన తరువాత సమావేశం ముగిసినది.

బుధవారం 26వ తేదీ ఎంతో శోభాయమానంగా తెల్లవారు ఝామున 4గం॥లకు శాస్త్రోక్తరీతిన పెరుమాళ్ళకు తైలాభిషేకంతో మొదలయ్యింది. విచ్చేసిన భక్తులందరికీ ఆ తైలాన్ని వితరణ చేశారు. నరకాసురుడి గడ్డిబొమ్మను చిహ్నరూపకంగా దహనం చేసి నరక చతుర్దశికి, దీపావళికి శ్రీకారం చుట్టారు.

ఆంతరంగిక అభిషేకం పూర్తి చేసుకున్న తరువాత 9 గంటలకు శ్రీస్వామివారు తీర్థాన్ని అనుగ్రహించారు. అనంతరం స్వామివారు దీపావళిని గూర్చి ప్రవచనం చేశారు. నాటి మధ్యాహ్నం ప్రజ మీటింగు జరిగినది. స్వామివారు ప్రజ్ఞ తరగతుల ద్వారా చిన్నారుల శిక్షణ ఉజ్జ్వల భవిష్యత్తుకి సోపానమన్నారు. సాయంకాలం 6గం॥లకు శ్రీవిష్ణుసహస్రనామ పారాయణ జరిగినది. తరువాత జరిగినది ధనలక్ష్మి పూజలో 1750 పై చిలుకు భక్తులు విశేషంగా పాల్గొన్నారు.

గురువారం 27వ తేదీన తెల్లవారుఝామున స్వామివారికి వారి తల్లిగారు ఆశీర్వాదపూర్వకంగా మంగళహారతి ఇవ్వడంతో ఆ రోజు భక్తులందరికీ శ్రీస్వామివారి తిరునక్షత్ర శోభోదయం మహోత్సవమైన భాసించింది. యథాప్రకారం 9 గంటలకు జరిగిన తీర్థగోష్ఠిలో Houston వాసుతే కాక దేశం నలుమూలల నుచి, భారతదేశం నుంచి విచ్చేసిన శిష్యకోటి అంతా పాల్గొన్నారు. తరువాత స్వామివారు అరణిమథనం గురించి వివరించారు. ఋత్విక్కులు వేదఘోష చేస్తూండగా అరణిమథనం మొదలయ్యింది. ఉపస్థితులైన ఇరువురు జీయర్‌స్వామివార్ల సంకల్పబలం చేత అగ్ని మూడు నిముషాల కాలంలోనే ఆవిర్భవించినది. ఆ పవిత్ర అగ్నితో శ్రీరామక్రతువుని ప్రారంభించారు. అనంతరం ధ్వజారోహణం ఎంతో శోభాయమానంగా జరిగినది. అటుపైన నరసింహ ఇష్టి కూడ జరిగినది. ఆ సందర్భంగా శ్రీస్వామివారి కటాక్షం తమపై ప్రసరించి, తమ జీవితాన్ని ప్రభావితం చేసిన వైనాలను భక్తులు అందరితో పంచుకున్నారు.

సాయంకాలం 6 గంటలకు శ్రీస్వామివారి నేతృత్వంలో శ్రీవిష్ణుసహస్రనామ పారాయణలో అంతా పాల్గొన్నారు. భారతదేశం నుంచి ఆచార్య తిరునక్షత్రంలో పాల్గొనడానికి వచ్చిన JET Society

అధ్యక్షులు శ్రీమాన్ రామచంద్రారెడ్డి, వికాసతరంగిణి సలహాదారు శ్రీమాన్ ఇ. రామారావు, జీవా కమ్యూనిటీకాలేజీ కౌన్సిలరు శ్రీమాన్ పి.పురుషోత్తమరావు, వికాసతరంగిణి సెంట్రల్ కమిటీ సభ్యులు శ్రీమతి వనజా భాస్కరరావు శ్రీస్వామివారు తమకు ప్రేరణ కలిగించిన విధానాన్ని అందరితో పంచుకున్నారు. శ్రీస్వామివారు వారికి మంగళాశాసనాలను అందించారు. 7 గంటలకు తిరునక్షత్ర మహోత్సవంలో ప్రధాన ఘట్టమైన జీయర్ పురస్కార సభ ఆరంభమైనది. మైత్రాయణీశాఖ అంతరించిపోకుండా కృషి చేసి, తరువాతి తరానికి అందించిన చతుర్వేది, బ్రహ్మశ్రీ జి. పరమేశ్వర దీక్షితార్ (చిదంబరం) వారిని జీయర్ పురస్కారంతో సమ్మానించారు. దీక్షితార్ గారిని శ్రీమాన్ డా॥ రంగరామానుజా చార్య స్వామివారు సభకు పరిచయం చేశారు. తరువాత జీయర్ స్వామివారు మాట్లాడుతూ వేదపురుష వైభవాన్ని, వేదపండితుల వైభవాన్ని ఆవిష్కరిస్తూ వేదపండితులు నడచిన చోట ప్రకృతి పులకరిస్తుందనీ, ఆ దేశం సుభిక్షమౌతుందని అనుగ్రహించారు. వేదాభిమానులైన తమ ఆచార్యుల కైంకర్యాన్నే తాము కొనసాగిస్తూ జీయర్ పురస్కారంతో ప్రతి ఏడూ వేదసంరక్షణ చేస్తున్న పండితులను సంభావిస్తున్నామని తెలిపారు. తరువాత ఋత్విక్కుల వేదఘోష నడుమ పరమేశ్వర దీక్షితర్ దంపతులకు శ్రీమాన్ తమిరిస శ్రీనివాసాచారిగారు, వారి భార్య రేణుగారు శాస్త్రోక్తంగా సత్కరించారు. జీయర్‌పురస్కారాన్ని శ్రీస్వామివారు తమ శ్రీహస్తాలతో బహుకరించారు. శ్రీస్వామివారి మంగళాశాసనాల తరువాత శ్రీపరమేశ్వర దీక్షితర్ గారు సభనుద్దేశించి మాట్లాడారు. వారి ప్రసంగంలో "శ్రీస్వామివారి పట్ల వారికున్న అపారప్రేమ, అకుంఠితనిష్ఠ, ఆదరభావము, ద్యోతకమైనవి. తమ ఆరాధ్యదైవమే శ్రీస్వామివారి రూపాన తమకు ప్రత్యక్షమైనదని తాము భావిస్తున్నామని" వారెంతో భావావేశంతో చెప్పారు. "చిన్న జీయరు లోని 'చిన్న' అంటే తమిళభాషలో 'చిహ్నము' అనే అర్థంలో చెప్తారు. ఒక జీయర్ ఎలా ఉండాలో అన్నదానికి వీరు పరమచిహ్నమని, అందుకే వీరిపేరులో చిన్న ఉండుట సమంజసమే అని" దీక్షితర్ గారు వివరించారు. దీక్షితర్ గారి భావావేశాన్ని భక్తులంతా అనుభవించి ఆనందించారు. పరమేశ్వరదీక్షితకమ గారి ప్రసంగాన్ని వారి శిష్యులైన పంచాపకేశం గారు ఇంగ్లీషులోకి అనువదించారు. ఎంతో అందమైన ఆ సాయంకాలం శ్రీస్వామివారి మంగళాశాసనాలతో ముగిసింది. ఆ రాత్రి శ్రీమతి రాధగారి ప్రేరణతో శిష్యులంతా కలసి దీపాలంకరణతో వేదికనలంకరించి విలక్షణమైన రీతిలో శ్రీస్వామివారి పాదపూజ చేసుకున్నారు. శ్రీ పాదతీర్థ వితరణతో ఎంతో శోభాయమానంగా, ఆనందభరితంగా ఆచార్య తిరునక్షత్రం సంపూర్ణమయ్యింది. అమెరికా వాసుల సుకృతమెంతో కదా!

శుక్రవారం 28వ తేది ఉదయం 9గం॥లకు శ్రీరామనామ లేఖనం, సేవాకాలం, తీర్థగోష్ఠి జరిగాయి. తరువాత శ్రీరామక్రతువు రెండవరోజు ప్రారంభమైనది. లక్ష్మీనారాయణ ఇష్టిలో భక్తులు విశేషంగా పాల్గొన్నారు. తరువాత వి.టి. సేవా మీటింగ్ జరిగినది. వివిధ ప్రదేశాల నుంచి వచ్చిన కార్యకర్తలతో శ్రీస్వామివారు సమావేశమయి, వివిధ అంశాల గురించి ముచ్చటించారు. 6గం॥లకు శ్రీ విష్ణుసహస్రనామ స్తోత్ర పారాయణతో సాయంకాలపు విద్వద్గోష్ఠి ప్రారంభమైనది. శ్రీరంగరామానుజాచార్య స్వామివారు, శ్రీశ్రీశ్రీ అహోబిల రామానుజ జీయరు స్వామివారి ప్రవచనలముల తరువాత శ్రీస్వామివారు ప్రచనం చేశారు. రాత్రి 9గం॥లకు సాంస్కృతిక కార్యక్రమం కన్నుల పండువుగా జరిగినది. వేదాంతం రాఘవగారి శిష్యబృందం రామాయణ సంబంధమైన అంశాలను కూచిపూడి నృత్య రూపకాలుగా ప్రదర్శించారు. చిన్నారులకు శ్రీస్వామివారు మంగళాశాసనములు కృపచేశారు.

శనివారం 29వ తేది ఉదయం సేవాకాలం, శ్రీరామనామ లేఖనంతో ప్రారంభమైనది. వందలాది భక్తులు స్వామివారి ఆధ్వర్యవంలో సంక్షేపరామాయణాన్ని పారాయణ చేశారు. తీర్థగోష్ఠి తరువాత శ్రీరామక్రతువు మూడవ రోజు యాగం మొదలైనది. ఈ రోజున హయగ్రీవ ఇష్టి మరియు వైనతేయ ఇష్టి కూడా జరిగినది. పూర్ణాహుతి తరువాత యజ్ఞరక్ష, ప్రసాద వితరణ జరిగాయి. తరువాత ఆశ్రితులకు శ్రీస్వామివారు మంత్రోపదేశం అనుగ్రహించారు. తరువాత వైభవోపేతంగా జరిగిన శ్రీసీతారామకళ్యాణంలో 2వేలమంది భక్తులు పాల్గొన్నారు. సాయంకాలం 6గం॥లకు శ్రీవిష్ణుసహస్రనామస్తోత్ర పారాయణ జరిగింది. తరువాత హ్యూస్టన్ 'ప్రజ్ఞ' విద్యార్థులు శ్రీరామజయం అను నాటికను చూడముచ్చటగా ప్రదర్శించారు. తరువాత జరిగిన "శ్రీవిష్ణుసహస్రనామ అవధాన ప్రక్రియ" సంభ్రమాశ్చర్యాలలో ముంచివేసింది. ఈ ప్రజ్ఞ విద్యార్థులు– కాలిఫోర్నియా, కనపరిచిన వైదుష్యం, ధారణ, పాటవం, అద్వితీయం. ఈ కార్యక్రమం ఈ రోజుకే మకుటాయమానంగా నిలిచింది.

ఆదివారం 30వ తేది ఎంతో ముఖ్యమైనరోజు. ఉదయమే సేవాకాలం, శ్రీరామనామలేఖనం మరియు సంక్షేపరామాయణ పారాయణం జరిగాయి. తీర్థగోష్ఠి పూర్తైన తరువాత శ్రీరామక్రతువు నాల్గవరోజు యాగం ప్రారంభమైనది.

జెట్ యు.ఎస్.ఎ కార్యదర్శి శ్రీమాన్ ముడుంబైరఘుగారి నిర్వహణలో అమెరికాలోని అన్ని వి.టి, ప్రజ్ఞ మరియు మిగిలిన భక్తబృందాలకు శ్రీవేంకటాచల ఇతిహాసమాల మరియు శ్రీవేంకటాచల మహాత్మ్యాలపై "ది హిస్టరి ఆఫ్ తిరుమల" అనే

శీర్షికలపై 1000 మందికి పోటీని నిర్వహించారు. ఈ వెయ్యి మందిలోంచి ఎంపిక చేసిన 5గురికి శ్రీఅష్టలక్ష్మీ దేవాలయ ప్రాంగణంలో శ్రీస్వామివారి సమక్షంలో ఫైనల్ పరీక్షను నిర్వహించారు. ఈ ఫైనల్ పోటీలో హ్యూస్టన్‌కి చెందిన ఇమ్మడి శ్రీలక్ష్మిగారు ప్రథమస్థానంలో, హ్యూస్టన్‌కు చెందిన చిన్నారి మహారాజ్ఞి రెండవస్థానంలో శ్రీస్వామివారి శ్రీహస్తాలతో బహుమతులను అందుకున్నారు.

తరువాత ప్రేక్షకుల కోరికమీద "శ్రీవిష్ణు సహస్రనామ అవధానం'' తిరిగి ప్రదర్శింపబడింది. పాల్గొన్న ఐదుగురి చిన్నారులకు జెట్ నుంచేకాక ప్రేక్షక భక్తుల నుంచి కూడా ప్రశంశాపూర్వకమైన కానుకలు అందాయి.

సహస్ర కలశాభిషేకం గురించి శ్రీస్వామివారు ప్రవచనం చేస్తూ, తమ నిత్య ఆరాధ్యమూర్తులు ఆశ్రమం నుంచి చోరులవల్ల మాయమైన వైనం, ఎస్.ఐ. కోటేశ్వరరావుగారు దొంగలను పట్టుకుని పెరుమాళ్ళను ఆశ్రమానికి చేర్చిన వైనము వివరిస్తూంటే సభలో చెమర్చని కన్నులేదు, అలనాడు రాముడు అయోధ్యను విడిచి వనవాసానికి వెళ్ళినప్పుడు అయోధ్యవాసులకు ఎలా ఉందో వాల్మీకి కవివర్ణనలో చదివామే కానీ, అనుభవించిన వారము కాము. ఈరోజున శ్రీవారు అలనాటి ఆశ్రమవాసుల పరిస్థితిని వర్ణిస్తూంటే ఆ దుఃఖభారము అనుభవంలోకొచ్చింది.

తరువాత శ్రీస్వామివారు, శ్రీమాన్ కోటేశ్వరరావుగారిని సన్మానించి వారిని రెండు మాటలు మాట్లాడమని ఆదేశించారు. కోటేశ్వరరావుగారు వారి మాటల్లో అదే సంఘటనని వర్ణించి 'శ్రీస్వామివారి సన్మానం తనకు దొరికిన భాగ్యమే కానీ, తన ప్రతిభ కదన్నారు'. తరువాత అత్యంత వైభవోపేతంగా, శాస్త్రోక్తంగా శ్రీవారి ఆరాధ్యదైవమైన శ్రీరామచంద్రమూర్తికి సహస్ర కలశాభిషేకం జరిగినది.

అభిషేకానంతరం సర్వాలంకాలశోభితుడై మన శ్రీరామచంద్రుడు సపరివారముగా రాత్రి 8గం॥లకు మరల భక్తులకు దర్శనమిచ్చాడు. శ్రీస్వామివారు భక్తులందరికీ తీర్థాన్ని అనుగ్రహించారు. అటుతరువాత మోహినీ అవతారంలో అలంకృతుడైన అష్టలక్ష్మీ ఆలయంలోని పెరుమాళ్ళ తిరువీధి ఉత్సవము వైభవముగా జరిగింది.

శ్రీరామక్రతువు, సహస్రకలశాభిషేకమును శాస్త్రోక్తంగ జరిపిన మన ఆగమకళాశాల ప్రిన్సిపల్ శ్రీమాన్ ముదుంబై మధుసూదనాచార్యులు, శ్రీమాన్ సముద్రాల శ్రీనివాసాచార్యస్వామి, వారి పరివారానికి, మంచి పిండివంటలతో పెరుమాళ్ళకు, భక్తులకు ప్రసాదాలను అందించిన శ్రీమాన్ రంగరాజన్ పరివారానికి శ్రీవారు మంగళాశాసనాలు చేసారు. ఈ సందర్భంగ హ్యూస్టన్ కార్యకర్తలకు సహకరించి పూజాద్రవ్యాలను, ప్రజ్ఞ పుస్తకాలను అందించుటలో కృషిచేసిన శ్రీమాన్ పురాణం వేంకటాచార్యస్వామి, శ్రీమాన్ గుదిమెళ్ళ రఘునాథ్ స్వాములకు పెరుమాళ్ళ శేషమాలను శ్రీవారు అనుగ్రహించారు. శ్రీశ్రీశ్రీ పెద్దజీయర్‌స్వామివారి శిష్యులు శ్రీమాన్ రామదూత గుదిమెళ్ళ వేణుగోపాలాచార్యస్వామి మన శ్రీస్వామివారు ఆశ్రమస్వీకారంనుండి ఇతవరకూ చేసిన సేవలను శ్రీవారు స్మరించి, పెరుమాళ్ళ శేషవస్త్రంతో సత్కరించారు.

సహస్ర కలశాభిషేకాన్ని, ఉత్సవాలను వైభవంగ జరిపించిన జెట్ యు.ఎస్.ఎ ప్రసిడెంట్ శ్రీమాన్ బంగారురెడ్డి, అష్టలక్ష్మీ ఆలయ ప్రెసిడెంట్ శ్రీమాన్ విజయనరసింహయ్య, శ్రీఅష్టలక్ష్మీ ఆలయ ఫౌండర్ శ్రీమాన్ తమిరస శ్రీనివాసాచార్యులకు, విటి సేవా కార్యకర్తలకు శ్రీస్వామివారు ప్రత్యేక మంగళాశాసనాలు కృపచేసారు.

31వ తేది ఉదయం ఆరాధన, తీర్థగోష్ఠి, అనంతరం సామూహికంగ సంక్షేపరామాయణ పారాయణను, శ్రీరామనామ లేఖనం శ్రీవారు చేయించారు. శ్రీస్వామివారు శ్రీరామనామ వైభవాన్ని వివరిస్తూ "శ్రీపెద్దజీయర్‌స్వామివారు రాజమహేంద్రి సెంట్రల్ జైల్లో రామనామస్థూపాన్ని ఏర్పాటుచేసిన వైనాని, రామనామ ప్రభావాన్ని" అందరికీ అందించారు.

అనంతరం మహాపూర్ణాహుతి కార్యక్రమం వైభవంగ జరిగింది. శ్రీవారు తిరునక్షత్రోత్సవాలలో పాల్గొనడానికి అమెరికాలోని వివిధరాష్ట్రాలనుండి విచ్చేసిన భక్తులందరికీ శ్రీవారు మంగళాశాసనాలు అందించారు.

శ్రీవారి తిరునక్షత్ర ఉత్సవాలను, శ్రీరామక్రతువును జరుపుటకు భారత్‌నుండి 50మంది వేదాగమ పండితులు పాల్గొని కార్యక్రమానికి శోభను కలిగించారు.

తిరునక్షత్ర కార్యక్రమాలను అమెరికాలోని వివిధరాష్ట్రాలలో ప్రచారంచేసిన శ్రీప్రపన్నవైశారది, శ్రీమాన్ భరత్‌స్వామి, శ్రీమాన్ అమర్, శ్రీమాన్ అరవింద్, అష్టలక్ష్మీ ఆలయ అర్చకులు- శ్రీమాన్ హనుమాన్ స్వామి, శ్రీమాన్ అనిల్‌స్వామి, శ్రీమాన్ యుగంధర్ స్వాములకు శ్రీవారు మంగళాశాసనాలు అనుగ్రహించారు.

VT Seva వారు శ్రీస్వామివారి తిరునక్షత్ర సందర్భంగ Star of Hope అనే సంస ఆవాసంలేనివారికి వసతి, భోజనాలని కల్పిస్తూంటుంది. ఆ సంస్థకి 10వేల డాలర్లను అందజేసారు.

శ్రీమతే నారాయణాయ నమః

శ్రీమతే రామానుజాయ నమః





64 సం॥ల నుండి అశేష భగవద్బంధువులు ఆదరిస్తున్న...

ఆధ్యాత్మికమాసపత్రిక

# భక్తినివేదన

శ్రీ ఖరనామ సంవత్సరం మార్గశిరమాసం


సంపుటి 64 డిసెంబరు

సంచిక 9 2011


## పండుగలు

**డిసెంబరు**

3. జ్యేష్ఠకార్తె, త్రిద్యుస్పృక్
6. సర్వేషామేకాదశి, గీతా జయంతి.
7. మత్స్య వాసుదేవ ద్వాదశి
8. హనుమత్ వ్రతం
9. తిరుమంగై ఆళ్వారు తిరు, నంబిళ్ళైతిరు, శ్రీవైష్ణవ దేవాలయములయందు కృత్తికా దీపోత్సవం, ప్రబంధ నిగమనం.
10. తిరుప్పాణియాళ్వార్ తిరు ॥ శ్రీ వైష్ణవ గృహములయందు ప్రబంధ నిగమనం, కేతుగ్రస్త సంపూర్ణ చంద్రగ్రహణం.
16. మూలకార్తె, ధనుస్సంక్రమణము రాత్రి గం.10ల నుండి ప్రథమ పాశురసేవనం.
18. తిథి ద్వయం
21. అవమతిథి, సర్వేషామేకాదశి.
24. తొండరడిప్పొడియాళ్వార్ తిరు ॥ మాసశివరాత్రి, పిండపితృయజ్ఞము.
25. పూర్వాషాఢకార్తె

**జనవరి:**

1. నూతన ఆంగ్ల వత్సరాది
4. త్రిద్యుస్పృక్, స్మార్త ఉపవాస ద్వయం.
5. సర్వేషామేకాదశి, ముక్కోటి ఏకాదశి శ్రీరంగాది సమస్త శ్రీ వైష్ణవ క్షేత్రములయందు వైకుంఠ ద్వార దర్శనోత్సవము.
6. కూర్మద్వాదశి, శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ పెద్ద జీయరు స్వామివారి పరమపదోత్సవము.


వ్యవస్థాపకులు

పరమహంస పరివ్రాజకాచార్య

**శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జీయరుస్వామివారు**

సంపాదకులు

శ్రీఉ.వే.శ్రీమాన్ T.P. **శ్రీరామచంద్రాచార్యులు**


## విషయ సూచిక




Printed & Published by H.H. Tridandi Chinna Srimannarayana Ramanuja Jeeyar Swamiji on behalf of **Jeeyar Educational Trust** and Printed at **Sriman Printers & Processors** C/o JET, Sitanagaram-522 501, Guntur Dist., Andhrapradesh. **Published at** C/o JET, Sitanagaram-522 501 Guntur Dist, Andhrapradesh, Editor: Sri **T.P.Sriramachandracharya** S/o. Sri Sitaramacharyulu, No: 5-74, Ayodhya, Visakhapatnam- Andhra Pradesh.

చందావివరాలు :- సంవత్సరచందా రూ.225/-

విదేశాలకు సంవత్సరచందా $30/-

D.T.P. & Design by : పరిశోధనాలయమ్,

ముద్రణ : శ్రీమాన్ ప్రింటర్స్ & ప్రోసెసర్స్, సీతానగరం

మీ సేవలో....

భక్తినివేదన, సీతానగరం - 522 501,

గుంటూరు జిల్లా, ఆంధ్రప్రదేశ్. 08645 272929.

E-mail : **jetsitanagaram@yahoo.com**

Internet : www.chinnajeeyar.org

ఈ నెల 16వ తేదీ నుండి ధనుర్మాసం, శ్రీ వేంకటేశ శరణాగతి దీక్షల ప్రారంభ సందర్భంగా

# శ్రీశ్రీశ్రీ స్వామివారి సందేశం

(2008 ప్రవచనము నుండి)

*ప్రియ భగవత్‌బంధువులారా!*

భగవంతుణ్ణి కోరుకొని, ఆతణ్ణి పొందడానికై తీవ్రతపస్సులు చేసి తరించిన వారు 'ఋషులు' అయ్యారు.

భగవంతుడే కోరుకొని, వీరిని నేను పొందాలని తపించి తపించి, వీరంగీకరించాక "హమ్మయ్య" ఇక తరించాను అనుకొనేట్టు, తయారైనవారు "ఆళ్వార్లు" అయ్యారు. వీరిద్వారా లోకులందరినీ బాగుచేయాలని భగవంతుడే తయారుచేసుకొన్న మహనీయులు, ప్రేమమూర్తులూ ఆళ్వారులు. అసలు 'ఆళ్వార్' అని అంటేనే భగవత్ప్రేమలో మునిగితేలినవారు, తమను చేరినవారినీ ఆ అనుభవములో తేలియాడించగలవారున్నూ. వీరు ఓ పన్నెండు మంది ఉన్నారు. అందులో ఆండాళ్ ఒక్కతే స్త్రీ మూర్తి.

ఆమె ఆళ్వార్లందరికీ ఏకైక సంతానంగా, వారి భక్తి సంపదంతటకీ ఏకైక వారసురాలిగ ప్రసిద్ధిచెందినది. అయితే భగవదనుభవంలో వారందరికన్న మిన్నయై, ఈ ఆళ్వారులందరికీ శిరోభూషణముగ నిలచినది మన ఆండాళ్‌తల్లి. గోదా, శూడికొడుత్త నాచ్చియార్, ఆముక్తమాల్యదా... వంటి అనేక పేర్లను తన మహిమవల్ల పొందింది ఆండాళ్. ఆండాళ్ అంటే ఏలిక. అటు భగవంతుణ్ణి, ఇటు ఈ జీవుల నందరినీ ఎలా మెలగాలో శాసించగల జ్ఞానం, ప్రేమ నిండినదీ ఆండాళ్ కనుక, ఆమెకు అందరినీ ఏలుకొనే మాతృత్వలక్షణమున్నదని, భగవంతుణ్ణి వశపరచుకొనే వాల్లభ్యమున్నదని ఈమెకీపేరు పెట్టారు.

కలియుగం ఆరంభమయ్యాక, 93వ సం॥ 'నళ' అనే పేరుగల సం॥లో గోదాదేవి ఈ భూమ్మీద అవతరించి ధనుర్మాస వ్రతమనే మంచివ్రతాన్ని ఆచరించి, మీరూ ఆచరించండి, ఇహలోక సంపదలతో పాటు నిరతిశయానంద ప్రాప్తిని ఇది మనందరికీ కలిగిస్తుంది అని చెప్పింది. సూర్యుడు ధనూరాశిలో ప్రవేశించడాన్ని ధనుస్సంక్రమణం అంటారు. ఆనాటి నుండి మళ్ళీ మకరరాశిలో ప్రవేశించేవరకు ఉండే కాలాన్ని ధనుర్మాసము అని అంటాం! ఈ మాసము చాలా పవిత్రమైనది, సాత్త్వికమైనదీను.

ఎలా అంటే! ఒకరోజులో రాత్రిగడచి పగలు రావడానికి ముందు భాగాన్ని బ్రహ్మముహూర్తం అని అంటాం. ఇది చాలా 'సాత్త్వికమైన కాలం'. ఆ సమయంలో ఆలోచనలు మంచివి వస్తాయి. ఈ సమయంలో మనం చేసే అధ్యయనాదులు, జప, తపాదులు చక్కగా నిరాటంకంగ కొనసాగి సత్ఫలితాలనిస్తాయి. మన కాలమానం ప్రకారం ఒక ఏడాది, దేవతలకి ఒక రోజు మాత్రమే. అంటే మన కాలమానంలో 6 నెలలు దక్షిణాయనం దేవతలకి రాత్రి, ఉత్తరాయణం ఆరు నెలలు పగలు అన్నమాట. అందుకని ఈ ధనుర్మాసము నెలరోజులు దేవతలకి బ్రహ్మ ముహూర్తంలాంటిది. పరమసాత్త్వికమైనది.

అటువంటి మంచి ముహూర్తాన్ని భగవద్భావనతో గడపాలని ధనుర్మాస వ్రతాన్ని మనకందించింది ఆండాళ్ తల్లి. ఈ ధనుర్మాసవ్రతం కృష్ణ అనుగ్రహం కోసం చేసేవ్రతం. "కృష్ణ" అంటే "మంచి ఆనందం" అని అర్థం. అందరికీ ఆనందం కావాలని కోరిక ఉంటుంది. దానిని పొందడానికి ఎన్నో పనులను చేస్తారు. అయితే లోకంలోని ఆనందాలన్నీ ఏదో ఒకనాడు మళ్ళీ దుఃఖంగా పరిణమించేవే! అందుకే ఆండాళ్ నిరతిశయ ఆనందస్వరూపుడు, ఆనందప్రదుడూ అయిన ఆస్వామినే కోరి ఈ వ్రతాన్ని చేసింది. సాక్షాత్తు భగవంతుణ్ణే కోరింది! పొందింది కూడా!

భగవంతుడు నిజానికి ఎలాఉంటాడో మనకెవరికీ తెలీదు. ఆ భగవంతుడు ఎక్కడ ఉంటాడు? భగవంతుణ్ణి మనం ఈ కళ్ళతోటి చూడగలమా? పొందగలమా? అని మనకెన్నో సందేహాలు. కాని, ఆ భగవంతుడే లేకపోతే మనమెవ్వరం ఉండం. గాలి ఎలా ఉంటుందో ఎవరికైనా తెలుసునా? గాలి ఎప్పుడైనా కనిపించిందా? కాని అదిలేకపోతే ఒక్క నిమిషం కూడా మనమెవ్వరం బ్రతకలేము. ఎలా మన శ్వాస, నిశ్వాసలద్వారా గాలి ఉందని అనుకుంటున్నామో, అలానే మనమందరం ఒక పేరు, ఆకృతి కలిగి ఉన్నాం, తింటున్నాం, తిరుగుతున్నాం, ఆలోచిస్తున్నాం, పనిచేస్తున్నాం అంటే వీటన్నింటికి వెనకాల ఉండి నడిపించే కారణతత్త్వానికే భగవంతుడు అని పేరు. గాలి కనిపించనట్లే ఆయన కూడా కనిపించనక్కర్లేదు. విగ్రహరూపంలో మనం ఆయనను పొందవచ్చు. ఆ భగవంతుడు విగ్రహరూపంలో ఉన్నా సర్వశక్తిమంతుడైయ్యే ఉంటాడు. ఆ భగవంతుణ్ణి విశ్వసించి ఏమి కావాలంటే అది అడగండి.

అది ఎలా తగునో అట్లా తాను ఇస్తాడు. ఈ విశ్వాసాన్ని మనలో కల్గించింది గోదా. భగవంతుడు ఎప్పుడూ ఒక్కడే ఉంటాడు. వేలకొద్ది, కోట్లకొద్ది భగవంతులుండరు. భగవంతుడు ఒక్కడే అనేక రూపాల్లో మనల్ని అలరిస్తుంటాడు. ఆ భగవంతుడే మనఇంట్లోనే ఒక చిన్నవిగ్రహరూపంలో ఆరాధనలు అందుకొంటున్నాడు. మనల్ని అనుగ్రహిస్తాడు. అందుకే గోదాదేవి ధనుర్మాసవ్రతాన్ని చేసినప్పుడు వటపత్రశాయి దగ్గర తను ఆచరించింది, శ్రీరంగంలో స్వామిని కోరింది, సుందరబాహుస్వామిని మ్రొక్కింది, వేంకటాచలపతితో చేర్చమంది. అన్ని రూపాలలో ఉన్నవాడు అతనేననే విశ్వాసం మనకి కల్గించడం కోసం తాను అలా చేసి చూపింది.

ఎవరు ఎలా పిలిచినా అంతటా అందరికీ ఆధారమై ఉండే ఆదినారాయణుడైన ఆ శ్రియఃపతి కలియుగ ఆరాధ్యదైవమై, శ్రీనివాసుడై ఏడుకొండలపై నిలచి ఉన్నాడు లక్ష్మీసమేతుడై మనకోసం. ఇది గుర్తింపచేయడానికే మన ఆండాళ్ తల్లి ఆ వేంకటేశుని సన్నిధిలో కైంకర్యం చేసుకునేట్లు చేయమని ప్రార్థించింది. అందుకే ఈ ధనుర్మాసాన్ని చేసేటప్పుడే "శరణాగతి దీక్ష"ని కూడా మనం చేస్తున్నాం. కలియుగ దైవంగా పేరుపొందిన ఆ ఏడుకొండలవాడి సేవలో పరికరమయ్యే శక్తిని మాకు ప్రసాదించమని అమ్మ చేసిన ప్రార్థననే చేస్తూ మనం ఈ "వేంకటేశ శరణాగతి దీక్ష"ని ప్రారంభిస్తాం.

వేంకటేశుని అందరూ విశ్వసిస్తారు. మ్రొక్కుతూ ఉంటారు. ఆ మ్రొక్కేది ఏవో ప్రయోజనాలు ఆశించి కాకూడదు. వాటికి అంతం ఎక్కడిది. నూతిలో నీరు ఊరుతున్నట్లే మన మనస్సుకూడా కోరికలకు ఊటబావి. ఒకదాని తరువాత మరొకటి కోరికలు వస్తూనే ఉంటాయి. వాటికి అంతమే లేదు.

ఒక కటికపేదవానికి ఒకబాతు దొరికిందట. అది రోజూ ఒక బంగారు గుడ్డుని పెడుతోందిట. కొన్నిరోజులకి ఆ పేదవాని దరిద్రమే పోయింది. కానీ, తృప్తి కలగలేదు. అత్యాశ మొదలైంది. ఇలా రోజుకొక బంగారు గుడ్డుపొందేకన్నా అన్నీ ఒక్కసారే పొందితే బాగుండు అనిపించింది. వెంటనే ఆ బాతుని చంపి ఆ గుడ్లన్నీ పొందేద్దామనే దురాలోచన వచ్చింది...

అలానే మనంకూడా రకరకాల కోరికలతో కొట్టుకుపోతున్నాం. వాటి గమ్యం ఆనందమే కదా! ఆ ఆనందమే అపరిమితమై ఉండాలి. దానిని మనకందించడానికే ఈ లోకంలోకి దిగివచ్చాడు స్వామి. **"రమయా సహ మోదతే స్వామి పుష్కరిణీ తీరే"** అని స్వామి పుష్కరిణిని ఆధారంగా చేసుకొని ఈ భూలోకంలోకి వచ్చి, అమ్మని విడిగా ఉంచితే మనలని రక్షించడంలో ఆలస్యం అవుతుందేమోనని తన వక్షఃస్థలంలోనే నిత్యనివాసం చేసుకొని ఆ కొండపై నిలబడే ఉన్నాడు. ఆయనను సవ్యంగా వాడుకోవడం మన బాధ్యత. ఈ ధనుర్మాసం నెల రోజులు ఈ దీక్షనీ మనం చేస్తాం.

దీక్షా సమయంలో ముందుగా మనం ఆస్వామి దేనిని ఆధారంగా చేసుకుని ఈ భూమి మీద అవతరించాడో, ఆ కొండ ఏం చేస్తుంది? ఎక్కడిది? ఎలా ఉండేది? ఇక్కడికి ఎలా వచ్చింది? దాని వైభవం ఏమిటి? అనే విషయాలు తెలుసుకుంటాం మొదటి రోజు. అంతేకాకుండా స్వామి పుష్కరిణికి ఆపేరు ఎలా వచ్చింది? ఎక్కడనుండి వచ్చింది ఈ పుష్కరిణి అనేది కూడా తెలుసుకుంటాం.

రెండవ రోజు ఆ కొండకి వచ్చిన స్వామి ఎవరెవరికోసం ఎప్పుడెప్పుడు ఎలాఎలా ఈ భూమి మీదకి వచ్చాడో? ఆ వచ్చేటప్పుడు ఉపయోగించిన విమాన వైభవాన్ని తెలుసుకునే ప్రయత్నం చేస్తాం.

మూడవ రోజు ఇక్కడికి వచ్చిన స్వామి విగ్రహరూపం ఎందుకు ధరించ వలసివచ్చింది? అనే విషయాన్ని తెలుసుకుంటాం.

నాలుగవ రోజు స్వామి కలియుగారంభంలో వచ్చినా, శిలారూపంలో ఉన్నా మనమూ ఆయన అనుగ్రహాన్ని పొందగలిగేటట్లు చేసిన పెరియ తిరుమలనంబి, ఆళువందారువంటి వారి చరిత్రలను తెలుసుకుంటూ, వారు చేసిన సేవలను స్వామి ఎలా స్వీకరించాడో, ఆ కాలంలో వారితో ఎలా గడిపాడో తెలుసుకుంటాం!

ఐదవరోజు 11వ శతాబ్దానికి సంబంధించిన ఆ స్వామిసేవ బాగా జరగాలని కోరికతో రామానుజులవారు, తమ శిష్యులను ఆ కొండపై ఉంచి, కొన్ని సేవలను చేయిస్తూ తామూ అక్కడ ఉండి మరికొన్ని సేవలు చేస్తూ స్వామికి చక్కటి కైంకర్య వ్యవస్థను ఏర్పాటు చేశారు. రామానుజులవారు ఏ ఏ సేవలు, ఎలా ఎలా చేశారో తెలుసుకుంటాం!

ఆరవరోజు శ్రీ వేంకటేశ్వరస్వామి వైభవంతో సమానమైన వైభవం కలిగిన గోవిందరాజస్వామికి ఆలయ నిర్మాణాన్ని జరిపి ఆయనకూ వేంకటేశ్వరునికి కొన్ని కొన్ని గుర్తులను పెట్టారు రామానుజులవారు. ఆ గుర్తులు ఏమిటో? ఎందుకు పెట్టారో తెలుసుకుంటాం!

ఏడవరోజు తిరుమలలో వేంకటేశునికన్నా రామానుజులవారు ఉన్నతాసనంపై వేంచేసి ఉండుటకు కారణమేమిటో తెలుసుకుంటాం!

ఇలా ఏడు వారాలుకానీ, ఏడురోజులు కానీ ఈ దీక్షని ధనుర్మాసంలో ఆచరిద్దాం! దివ్యానందాన్ని పొందుదాం!!



# పిబత భాగవతం రసం... వివిధావతార ప్రశంసనమ్

శాస్త్రరత్నాకర, శాస్త్రవిద్వన్మణి డా॥ఉ.వే సముద్రాల వేంకట రంగరామానుజాచార్యస్వామి
డైరెక్టర్ - అకెడమిక్ కౌన్సిల్ 'జీవ' శ్రీరాంనగర్ (శంషాబాద్)

*జులై సంచిక తరువాయి...*

## (వ్యాసనారద సంవాదం - ప్ర.స్కం. 5 వ అధ్యాయం)

**స్వధర్మానుష్ఠానం అపరిహార్యం**

నారదుడు వ్యాసునితో ఇలా అంటున్నాడు. ఇంతవరకూ ప్రవృత్తిమార్గం లేదా, కర్మప్రవణమై హరిభక్తి దూరమైన మార్గాన్ని ఉపదేశించడం వల్ల లోకానికి కలిగే అనర్థం ఎలాంటిదో గమనించావు కదా! కనుక హరిభక్తిని ప్రతిబోధించడమే శ్రేయోదాయకం.

అయితే ఇక్కడ ఒక శంక కలగవచ్చు. కర్మానుష్ఠానం అనేది శాస్త్రంచే ఉపదేశింపబడినప్పుడు అది స్వధర్మం అవుతున్నది. ఇలాంటి స్వధర్మానుష్ఠానం వల్లనే అంతఃకరణ పరిశుద్ధి కలిగి, హరిభక్తి బుద్ధిలో స్థిరంగా కుదురుకుంటుంది. కనుక నివృత్తి మార్గానికి ప్రవృత్తి రూపమైన కర్మ స్వధర్మంగా ఆచరించడం అవసరమే కదా! అని. నిజమే. హరిభక్తి లేని కేవల కర్మానుష్ఠానం వ్యర్థం. ఒక వేళ కర్మానుష్ఠానం లేకుండానే హరిభక్తిని ఆశ్రయించినా వచ్చిన నష్టం ఏమీ లేదు? కేవలం హరిభక్తినే ఆశ్రయించినవానికి ఎప్పుడైనా అమంగళం కలిగిందా? స్వధర్మాన్ని ఆచరించినందువల్ల ఏమైనా విశేష పరమార్థం లభించిందా?

**శ్లో॥ త్యక్త్వా స్వధర్మం చరణామ్బుజం హరేః**
**భజన్ అపక్వోఽథ పతేత్తతో యది ।**
**యత్రక్వ వా భద్రమభూదముష్య కిం**
**కోఽర్థ ఆప్తో భజతాం స్వధర్మతః ॥**

ఓ వ్యాసమహర్షీ! శ్రీహరి చరణామ్బుజాన్నే భజిస్తూ స్వధర్మాన్ని త్యజించినప్పుడు, మనఃపరిపాకం లేనందు వల్ల ఒక వేళ స్వధర్మాన్ని విడిచినవాడు పతితుడౌతాడని అంటే, అలా అభద్రస్థితిని పొందినవాడెవ్వడైనా ఉన్నాడా? స్వధర్మాన్నే ఆచరిస్తూ దాని వల్లనే (హరిభక్తి లేకుండా) ఏ పరమార్థాన్నైనా పొందిన వాడెవ్వడైనా ఉన్నాడా? అని నారదుడు వ్యాసుని ప్రశ్నించాడు.

ఇక్కడ ఒక విషయాన్ని గమనించాలి. స్వధర్మత్యాగాన్ని ప్రతిబోధించడం నారదుని తాత్పర్యమా? అని అంటే, భగవద్భక్తి వర్జితమైన కేవల స్వధర్మం నిష్ఫలం, గజస్నానమేకనుక, ఇలాంటి శుష్కమైన కర్మాచరణ ప్రవృత్తి, కేవల ప్రవృత్తి మార్గం కనుక ఇది సరియైనది కాదని చెప్పడమే భాగవత తాత్పర్యం. కర్మాచరణం హరి భక్తికి దోహదకారి అయినప్పుడు అది అపరిహార్యం అవుతుంది.

కనుకనే భగవద్రామానుజులు కర్మలు భగవదారాధనా వేషం కలిగి ఉండాలని అప్పుడు అవి ఉపాసనారూపంగా పరిణమిస్తాయని వేదార్థసంగ్రహ గ్రంథంలో అన్నారు. అయితే, ఒకవేళ పరిపూర్ణ వైరాగ్యం కలిగిన వాడు ఈ లౌకిక కర్మలు గాని, లేక నిత్య నైమిత్తిక కామ్య కర్మలు కాని, త్యజించినా ఆతడు నిర్భరమైన హరిభక్తి కలవాడైనప్పుడు ఆతనికి కలిగే అనర్థం ఎంత మాత్రం లేదని, కనుక లౌకిక ధర్మాలకంటే భగవద్ధర్మమే పరమ ధర్మమని చెప్పడమే భాగవత తాత్పర్యం. ఈ విషయాన్నే మరొక శ్లోకంలో నారదుడు స్పష్ట పరుస్తున్నాడు–

**శ్లో॥ తస్యైవ హేతోః ప్రయతేత కోవిదః**
**న లభ్యతే యద్భ్రమతా ముపర్యథః ।**
**తల్లభ్యతే దుఃఖ వదన్యతః సుఖం**
**కాలేన సర్వత్ర గభీరరంహసః ॥**

ఈ సంసార చక్రంలో పై లోకాలకు, క్రింద అధోలోకాలకు నిత్యం పరిభ్రమించే ఈ జీవుడు, శాశ్వత సుఖం కొరకు మాత్రమే ప్రయత్నంచేయాలి. ఇది సాధారణంగా లభించేది కాదు. ఇక విషయ సుఖం లేక భోగ సుఖం అనేది మన ప్రయత్నం అక్కర లేకుండానే సులభంగా ప్రాప్తిస్తుంది దుఃఖంలాగా. ఎలాగైతే దుఃఖం లభించడానికి విశేష ప్రయత్నం అవసరం లేదో, అలాగే విషయ సుఖం కూడా దుఃఖంలాగా అనాయాసంగానే లభిస్తుంది. ఇది లభించడానికి పూర్వకృతమైన కర్మ ఒక్కటి ఉంటే చాలు. ఇక హరిభక్తి మూలమైన సుఖం అనేది ఎంతో

క్లేశపడితే తప్ప లభించదు. ఒకసారి లభించిన తరువాత అది అతనిని విడువదు.

ముకుంద పాదాంబుజాన్ని ఆశ్రయించిన వాడు, ఇతర జనులా సంసార చక్రంలో తగుల్కొనడు, ఒక్కసారి ముకుంద పాద సమాలింగన మహాసుఖాన్ని పొందిన రసగ్రహణ పారీణుడైన నరుడు, దాన్ని విడవడానికి ఎప్పుడూ ఇష్టపడడు, ఎందువల్లనంటే ఇక్కడ ముకుందపాదాలింగన జన్యమైన సుఖం శ్రుతిప్రతిపాదిత రసమే తప్ప వేరుకాదు. దాని పట్ల ఆసక్తి గొన్న వాడు ఆశాశ్వతానంద వైభవాన్ని కోలుపోవడానికి ఎప్పటికీ సిద్ధపడడు అంటాడు నారదుడు–

**స వై జనో జాతు కథంచ నాౕవ్రజేత్**
**ముకుంద సేవ్యన్యవదంగ సంసృతిమ్ ।**
**స్మరన్ ముకుందాంఘ్ర్యుపగూహనం పునర్**
**విహాతు మిచ్ఛే న్న రసగ్రహో జనః ॥** అని,

ఈ సమస్త జగత్తూ పరమాత్మయే. ఆయనకంటే వేరు కాదు. ఆయన నుండి వేరుచేయరానిది. శ్రుతి దీన్నే– **సర్వం ఖల్విదం బ్రహ్మ తజ్జలాన్ ఇతి శాంత ఉపాసీత** అంటుంది– ఇది ఆ పరమాత్మ నుండే పుట్టి ఆయనలో లయించి, ఆయన వల్లనే బ్రతుకుతున్నది (తజ్జలాన్–తత్ జ–ల–అన్ అని విభాగం. తజ్జ– ఆయన వల్లపుట్టి, తల్ల– ఆయనలో లయించి, తదన్–ఆయన వల్లనే మనుగడ సాగిస్తున్నది ఈ జగత్తు.) కనుక "ఇదంతా బ్రహ్మమే" అన్న శ్రుతి తాత్పర్యమే ఇక్కడ క్రింది శ్లోకంలో చెప్పబడింది.

**ఇదం చ విశ్వం భగవానివేతరో**
**యతో జగత్ స్థాన నిరోధ సంభవాః ।**
**తద్ధి స్వయం వేద భవాంస్త థాపి మే**
**ప్రాదేశమాత్రం భవతః ప్రదర్శితమ్ ॥**

**ఇదంచ విశ్వం భగవాన్**– ఈ సమస్త విశ్వమూ భగవానుడే, **ఇతర ఇవ**– వేరైనవానిలా ఉన్న జీవుడు కూడా భగవానుడే, **యతః**– ఎవని వల్ల, **జగత్స్థాన నిరోధ సంభవాః జగత్**– జగత్తు యొక్క **స్థాన**–ఉనికి, **నిరోధ**– లయము, **సంభవాః**– పుట్టుకలు అనేవి ఏర్పడుతున్నవో, ఆపరమాత్మ చేతనాచేతనాత్మక జగన్మయుడు అని అభిప్రాయం.

ఈ భాగములోని తాత్పర్యాన్నే పూర్వం నిర్దేశించిన 'సర్వం ఖల్విదం' ఇత్యాది శ్రుతి చెప్పింది. నారదుడు ఈ విషయాన్ని వ్యాసునికి చెప్పి ఇలా అంటున్నాడు. "నీవు దీన్నంతా ఎఱిగినవాడవే అయినా, నీవు నిరూపించిన తత్త్వం ఏకదేశం మాత్రమే తప్ప సమగ్రం కాదు. ఎందువల్లనంటే, ఓ వ్యాసా! నీవు భగవదవతారానివి! కనుక అన్ని ఎఱిగినవాడవే. నీ స్థితిగతులన్ని నీవే ఎఱుగుదువు. అమోఘదృష్టివి. పరమ పురుషుడైన నారాయణుని అంశభూతుడవు నీవు. కనుక, నీ గురించి నీకు తెలియజేయవలసిన అగత్యం ఏమి లేదు.

**త్వ మాత్మ నాత్మాన మవే హ్యమోఘదృక్**
**పరస్యపుంసః పరమాత్మనః కలామ్ ।**
**అజం ప్రజాతం జగతః శివాయ తన్–**
**మహానుభావాభ్యుదయోఽ ధిగణ్యతామ్ ॥**

"ఓ వ్యాసా! మహానుభావుల ఆవిర్భావం నిష్కారణం కాదు. కేవలం లోకమంగళం కోసమేనని నీవు గణించు." అన్నాడు నారదుడు.

**ఇదం హి పుంస స్తపస శ్రుతస్య చ**
**స్విష్టస్య పూర్తస్య సుసూక్తదత్తయోః ।**
**అవిచ్యుతోఽ ర్థః కవిభి ర్నిరూపితో**
**యదుత్తమశ్లోకగుణానువర్ణనమ్ ॥**

మానవుడు పరమాత్మకు చెందిన కల్యాణగుణాలను వర్ణించడం అనేదే నిదిధ్యాసనరూపమైన తపస్సుకు, అగ్నిష్టోమాద్యనుష్ఠానరూపమైన వైదికకర్మకు (స్విష్టస్య) తటాకాది ప్రతిష్ఠారూపమైన పూర్తానికి మహాదానాదిరూపమైన ధర్మానికి శాశ్వతపురుషార్థమని విద్వాంసులు నిరూపించారు. లోకంలో తపః ప్రభృతి ధర్మాలకు పురుషార్థం, పరమార్థం వేరువేరుగా చెప్పబడుతుంది. భావింపబడుతుంది. కాని వాస్తవానికి ఏ ధర్మానికీ భగవద్గుణ వర్ణనాన్ని మించిన పరమపురుషార్థం మరొకటి లేదు. అంటే ఈ ధర్మాలను ఆచరంచినందువలన కలిగే పురుషార్థం– పరమార్థమైన భగవద్గుణవర్ణనమే తప్ప వేరేమి కాదని తాత్పర్యం. మహాభారతంలో వ్యాసనిరూపణప్రక్రియ ఇలా సాగలేదని, కనుక అది పరమార్థం కాదని వ్యాసునికి నారదుడు ప్రతిబోధిస్తున్నాడు.

# కలివైరిసూరి వైభవము

గత సంచిక తరువాయి...

శ్రీ ఉ.వే.శ్రీమాన్ కె. టి. రామానుజాచార్యస్వామి-నెల్లూరు



**తిరుమంగై ఆళ్వార్- పెరియ తిరుమొழி 1-7-7**

పా॥ నల్లైనెంజే నామ్ తొழுతుమ్ నమ్ముడైయ నమ్బెరుమాన్
అల్లిమాతర్‌పుల్‌కనిన్న ఆయిరమ్ తోళనిడమ్ ।
నెల్లిమల్‌కి క్కల్లుడైప్ప పుల్లిలైయార్తతర్‌వాయ్
శిల్లిశిల్లెన్నొల్లఱాత శింగవేழ்కున్నమే ॥

*ప్రతిపదార్థము:* **నమ్ముడై**=మనయొక్క; **నమ్‌పెరుమాన్**=స్వామియును; **అల్లిమాతర్**=కమలవాసినియగు లక్ష్మీదేవి; **పుల్గ**=ఆలింగనము చేసికొను విధముగ; **నిన్న**=వేంచేసియున్నవాడును; **ఆయిరమ్‌తోళన్**=వేయిభుజములు గల వాడును అయిన స్వామియొక్క; **ఇడమ్**=స్థానమైన; **నెల్లి**=ఉసిరికట్లు; **మల్గి**=అధికమై; **కళ్ ఉడైప్ప**=రాళ్ళను బ్రద్దలు చేయగ; **పుల్లిలై**=వెదురాకులు; **ఆర్తు**=శబ్దముచేసి; **అతర్‌వాయ్**=మార్గములందు; **శిల్లి**=శిల్లి అను పక్షులయొక్క; **శిల్లెన్ను**=శిల్లుమని; **బల్**=ధ్వని; **అఱాత**=ఆగని; **శింగవేழ்కున్నమే**=అహోబిలక్షేత్రమును; **నల్లైనెంజే**=మంచిమనసా; **నామ్**=మనము; **తొழுతుమ్**=సేవింతుము.

***తాత్పర్యము:*** ఓ మనసా! నీవు చాల మంచిదానవు. కమలవాసినియగు లక్ష్మీదేవి కౌగిలించుకొనునట్లు సహస్ర బాహుడగు మన స్వామి అహోబిలక్షేత్రమున వేంచేసియున్నాడు. మనము ఆ దివ్యక్షేత్రమునే సేవింతుము. అచ్చట ఉసిరిక చెట్లవేరులు దట్టముగ వ్యాపించుటచే కొండబండలు సైతము పగుళ్ళు తీసియుండును. వెదుళ్ళ ఆకులు (తాటియాకులు) గాలికి శబ్దించుచుండును. ఆ అడవిమార్గములో అడవి పురుగులు "జిల్ జిల్" మనెడి శబ్దములు ఎడతెగక వినవచ్చు చుండును.

**విశేషార్థము:** చతుర్ముఖుడగు బ్రహ్మదేవుడు పరమ శివుడు మున్నగువారు నుతించినను శమింపని శ్రీనరసింహ స్వామియొక్క ఆగ్రహము లక్ష్మీదేవియొక్క ఆలింగనానంతరము ఉపశమించిన విధమును తిరుమంగై ఆళ్వారులు ఈ పాశురమున మనకనుగ్రహించుచున్నారు.

**నల్లైనెంజే:** నాకు భవ్యమగు మనసా! నీవు నాకు భవ్య ముగనుండబట్టియే "మనస్సు మంచిది" అను పేరుపొందితివి.

**నామ్ తొழுతుమ్ :** మనము ఆశ్రయించి ఉజ్జీవించె దము. **నమ్ముడై నంబెరుమాన్:** పరమపదవాసులగు నిత్యసూరులకు భవ్యుడైన విధముగ, మనమిప్పుడు ఆశ్రయించుటకు వీలుగ అహోబిలక్షేత్రమున వేంచేసియున్న సర్వేశ్వరుడు నంబెరుమాన్ =(మనస్వామి) అనినంత మాత్రమున సరిపోవు చుండగ తిరుమంగై ఆళ్వారులు "నమ్ముడై"అని విశేషించి తెలుపుటచేత ఆ స్వామి తమకు అత్యంతము భవ్యుడైన విధమును తెలుపుచున్నారు.

**అల్లి యిత్యాది:** శ్రీమహావిష్ణువు శ్రీనరసింహమూర్తియై అవతరించినపుడు బ్రహ్మాది దేవతలు ఆ స్వామిని ఆశ్రయించిరి. ఆ స్వామియొక్క ఉగ్రరూపమును సందర్శించి దేవతలు తొట్రుపాటుతో పరువులిడసాగిరి. శత్రుసంహారమునకై పరిగ్రహించిన అరివీర భయంకరమగు ఈ రూపము అనుకూలురైన భక్తులకును భీతిని కలిగించుచున్నదే అని తలచి లక్ష్మీదేవి ఆ స్వామియొక్క కోపమును ఉపశమింప చేయుటకై ఆ శ్రీ ఉగ్రనరసింహుని గాఢముగ ఆలింగనము చేసికొనినది.

**ఆయిరంతోళ్:** ఈ లక్ష్మీదేవిని సంశ్లేషించుటకే శ్రీనరసింహస్వామి సహస్రబాహుడాయెను.

***నెల్లి యిత్యాది:*** అహోబిలపర్వతమున కొండబండలను బ్రద్దలు చేసికొని ఏర్పడిన ఉసిరికచెట్లు అధికముగ నుండును.

**పుల్లిలై యిత్యాది:** వెదుళ్ళయాకులు తాటియాకులు ఎప్పుడు ధ్వనించుచుండును. శిల్ అనునది పక్షివిశేషము. ఆ పక్షులు అచ్చట సదా ధ్వనించుచుండును. ఆ కొండప్రాంత మంతయు ఆకు చప్పుడులతోను, పక్షుల అరపులతోను కూడియుండును.

(ఇంకా ఉంది)



# అహో! భారతమ్

**శ్రీమతి డా॥టి.కె. చూడామణి-విజయవాడ**

గత సంచిక తరువాయి...

దేవయాని శర్మిష్ఠ ఒడిలో పాపణ్ణి చూసింది. ఆ... ఇదేమిటి? ఇదెలా సంభవం? తెలుసుకోవాలని వెంటనే శర్మిష్ఠను చేరి... సుందరీ! ఇలా.. ఎలా..!? నీకు కొడుకా!? ఎలా చెప్పు... అంటూ నిలదీసింది.

శర్మిష్ఠ జంకలేదు. సిగ్గు పడుతూ... మరి ఒక గొప్పముని ఒకాయన వచ్చాడు. వేదవేదాంగాలు తెలిసిన పండితుడు. ఋతుమతిని అయిన నన్ను ఆయనే అనుగ్రహించాడు. పుత్రుణ్ణి ప్రసాదించాడు. అంటూ ధైర్యంగా చెప్పేసింది. అసత్యమైనా అందంగా చెప్పడం విశేషం. తల ఊపి ఆలోచిస్తూ వెళ్ళిపోయింది దేవయాని. కాలం పరుగులు తీస్తూంటే శర్మిష్ఠ యయాతి వలన ద్రుహ్యుడు, అనువు, పూరుడు అనే ముగ్గురు కొడుకులకి జన్మనిచ్చింది. త్రేతాగ్నులలాగ ఆ ముగ్గురూ ప్రకాశిస్తూ పెరుగుతున్నారు. యయాతి పోలికలు ఆ పిల్లల్లో స్పష్టంగా చోటుచేసికొన్నాయి. గుర్తించింది దేవయాని. అనుకోకుండా ఒకరోజు ఆ ముగ్గురు శర్మిష్ఠ – దేవయాని – రాజు... అందరూ ఒకచోట కలిశారు. దేవయానికి ఏదో తెలియని అనుమానం. లోపల దాగడం లేదు. రాజా! ఈ పిల్లలు ఎవరు...? అంటూ అడిగింది. ఆయన వినిపించనట్లు పట్టించుకోలేదు. లాభం లేదు. ఆ పిల్లల్నే అడుగుదాం అనుకొని వారిని దగ్గరగా పిలచి నాన్నా మీ అమ్మా నాన్నా ఎవరమ్మా అంటూ లాలనగా అడిగింది. వాళ్ళు ముద్దు ముద్దుగా చిట్టి చిట్టి చూపుడ వేళ్ళు చాచి... అదిగో అమ్మ... అంటూ శర్మిష్ఠను చూపారు. మరి నాన్నా... అడుగో అంటూ యయాతిని చూపించారు.

భగ్గుమంది మనస్సు. అసూయతో నిండిపోయింది. హృదయం... చరచరా ... ఆ చోటనుండి పరుగు పెట్టింది దేవయాని ఎంత నాటకం! నాకు... నాకు తెలియకుండా ఎంత కథ నడిపించాడు భర్త. తనకెంత అవమానం. శర్మిష్ఠ తనపై ఎలాంటి విజయాన్ని సాధించింది. పట్టమహిషి అయిన తనకి ద్దరే కొడుకులు. మరి ఆ రాక్షసస్త్రీకి ముగ్గురు... ముగ్గురు కొడుకులా... ఎంత అవమానం. పైగా నా తండ్రి శుక్రాచార్యునికిచ్చిన మాటను తప్పి ఇంత పని చేస్తాడా! ఎంత అహంకారం! ఆ తండ్రికే చెప్తాను జరిగిన కథంతా.. పరుగులు తీసింది దేవయాని. ఆవిడ వెనుకాలే తానూ పరుగుపెట్టాడు యయాతి. నాన్నా... అంటూ శుక్రాచార్యుని పాదాలపై పడి కన్నీటితో పాదాలు కడిగింది దేవయాని. తల్లీ! ఏమైందమ్మా! లే... ఏమైంది? ఏడుపు ఆపు. ఏం జరిగిందో చెప్పు... లాలనగా దగ్గరకి తీసుకున్నాడు తండ్రి. ఈ రాజు... ఈ రాజు మాట తప్పాడు నాన్నా. శర్మిష్ఠ కోరిక తీర్చాడు. ముగ్గురు కొడుకుల్ని ఆవిడకిచ్చాడు. నన్నే అవమాన పరిచాడు వెక్కుతూ చెప్పింది దేవయాని.

ఆఁ... ఇచ్చిన మాట తప్పాడాః శర్మిష్ఠను కూడాడా! యౌవన గర్వంతో రాగాంధుడయ్యాడా? నా చిట్టితల్లికి ఇష్టం లేని పని చేశాడా! అధర్మసంబంధంతో గృహస్థధర్మాన్నే కించపరిచి అసురునిలా ప్రవర్తిస్తావా? వయస్సుని చూసుకొని గర్వించావు కాబట్టి ఆ వయస్సు మాయమై ముసలితనం నీకు వెంటనే వచ్చుగాక! అంటూ శపించేశాడు. అబ్బ ఈ కోపం వెంటనే శాపం.... ముందు వెనుకలు ఆలోచించనీయని అవివేకం.

యయాతి శాపం విన్నాడు. యజమానురాలు భార్య అయితే ఆమె సేవకురాలు భార్యకాదా... పైగా శయ్యాసుఖం కోరానా... ఋతుమతికి సంతానాన్ని ఇచ్చాను. అంతే అలా కోరిక తీర్చకపోతే గర్భస్థ శిశువును చంపిన పాపం వస్తుందని పెద్దలు చెప్పారు గదా! భ్రూణహత్యకి భయపడి పుత్రదానం చేశాను. దానికింత కోపమా! నాకు దేవయానితో ఇంద్రియ భోగాలనుభవించడంలో తృప్తి కలుగలేదు. మీ అమ్మాయిని సుఖపెట్టలేని శాపం వల్ల నష్టం మీ అమ్మాయికి రాదా! ఆచార్యా! ఈ ముసలితనం భరించలేను. మీరే శాపవిమోచన మార్గం చూపించండి అని ప్రార్థించాడు.

శుక్రునికి పొరపాటు తెలిసివచ్చింది. నిజమే నా శాపం

వల్ల మా అమ్మాయే కదా బాధపడుతుంది. అయ్యో ఇలా శపించానేమిటి?... కూతురి ముఖం చూశాడు. ఆవిడ నోట మాటరాక ఇలాంటి ప్రమాదమొచ్చిందేమిటి అని దిక్కులు చూస్తోంది. ఖిన్నుడయ్యాడు తండ్రి. వెంటనే మెత్తపడి రాజా! ఒకపని చెయ్యి. నీవింకా తృప్తి పడకపోతే నీ ముసలితనాన్ని నీ కొడుకుల్లో ఒకరికిచ్చేసి వాళ్ళ యౌవనం తీసుకో! మరి కొంతకాలం భోగాలనుభవించు. తృప్తిపడ్డాక నీ ముసలితనం నువ్వే తీసుకో. కొడుకు యౌవనాన్ని కొడుక్కి ఇచ్చెయ్. ఎవరు నీ ముదుసలితనం తీసుకుంటారో వారికే రాజ్యపాలన అధికారాన్నియ్యి. వంశోద్ధారకునిగా ప్రకటించు అంటూ ఏదో ఒక మార్గం చూపించి వెళ్ళిపోయాడు శుక్రుడు.

ముసలితనం ఆవహించేసింది యయాతిని. చూస్తూండ గానే ఎంత మార్పు! ఎంత మార్పు!! తల ఇలా వణికి పోతోందేమిటి? ఇంద్రియబలం అణిగిపోయింది. కాళ్ళు చేతులు, ఇంద్రియాలు.. సడలిపోయాయి. ఒళ్ళు.. అరె... ముడుతలు.. అబ్బ వేలాడిపోతున్నాయి. ఈ దగ్గేమిటి? ఆయాసం ఏమిటి? అస్థిమితత్త్వం ఏమిటి... ఓ వార్ధక్యమా... నీకు నమస్కారం... కాళ్ళీడ్చుకుంటూ... అట్లు రాజ్యం చేరాడు రాజు. తానూహించని శాపం... తన దురదృష్టం తలుచుకుంటూ దేవయాని భర్తను అనుసరించింది. అసూయ-అహంకారాల ఫలితం ఇలా ఉంటుందా!?

కొడుకులందర్నీ వెంటనే పిలిపించాడు యయాతి. ఐదుగురూ వచ్చారు. నా..య..న..లా..రా.....! చూ..శా..రా.. న..న్ను. నాకు ఇంద్రియభోగకాంక్ష తీరకుండానే ఈ వార్ధక్యం వచ్చి పడింది. మీలో ఒకరు నా ముసలితనాన్ని తీసికొని మీ యౌవనాన్ని నాకివ్వండి అన్నాడు.

ఆహా! కొడుకులతో తండ్రి పలుకవలసిన మాటలేనా ఇవి! విషయ సుఖాలు ఎంత నీచస్థితిని కల్గిస్తాయి. విన్నారు కొడుకులు.

నాన్నా! ముసలితనం, రోగం, ఖర్మకొద్దీ వచ్చి మీదపడితే అనుభవించక తప్పదు గాని కోరి కోరి ఎవరైనా ఎంత బుద్ధిహీనులైనా వీటిని ఆహ్వానిస్తారా చెప్పు! వాడు మన్మథుడైనా కుబేరుడైనా వయసుపోతే ఎలా భరిస్తారు? ఎలా అడుగు తున్నావు? ఇలాగ.... ఇంకా వారి మాటలు పూర్తి కాలేదు. మండిపడ్డాడు యయాతి. యదువుని చూశాడు. నా కోరికని కాదంటావా... నీ వంశానికి రాజ్యపరిపాలన అర్హత లేకుండుగాక! తుర్వసూ... ఎంత అహంకారివిరా నువ్వు. అందుకే ఆటవికులకు రాజౌదువుగాని... నీ వంశం వారికి ధర్మాధర్మ జ్ఞానం లేకుండుగాక! ద్రుహ్యుడు చూస్తున్నాడు తండ్రిని. నిన్ను వదులుతానా! మీ వంశం జలమయములై తెప్పల సాయంతో దాటే దేశాలకి రాజులౌతారు. అనూ.... ముసలితనాన్ని నిందిస్తావా! నీ వంశానికి చెందినవారు ముసలి వారయ్యేంతవరకు బ్రతకనే బ్రతకరు. యౌవనంలోనే మరణిస్తారు... అంటూ శాపోక్తులతో ఊగిపోయాడు.

దూరంగా నిలచి చూస్తూ వింటున్నాడు శర్మిష్ఠ ఆఖరి కొడుకు పూరుడు. నాన్నా... ఇలా రా.. పిలిచాడు తండ్రి. తండ్రీ... నీ కోరిక నేను తీరుస్తాను. నా వయస్సు నువ్వు తీసుకో! నీ ముసలితనాన్ని నాకియ్యి. చేతులు చాపి అర్థించాడు పూరుడు. ఆనందించాడు తండ్రి. కొడుకు యౌవనాన్ని గ్రహించాడు. నవయౌవన కాంతులతో మెరిసిపోయాడు. వేయి సంవత్సరాలు భోగాలు అనుభవించాడు. తృప్తి చెందాడు. పూరుని పిలిచి అతని వయస్సు మళ్ళీ అతనికిచ్చేశాడు. తన ముదుసలితనాన్ని తానే స్వీకరించాడు. కుమారుని ఔదార్యానికి మురిసిపోయాడు. నా తండ్రీ! అకాలంలో వచ్చిన ఈ వార్ధక్యబాధల్ని నాకోసం ఎంత సహనంగా అనుభవించావురా నాన్నా! అంటూ ఆనంద భాష్పాలు రాల్చాడు. నాల్గు సముద్రాలు హద్దులుగా ఉన్న భూమండలంలోని మహనీయులందరిని రప్పించి మంత్రి, పురోహిత, సామంతుల సమక్షంలో పూరుని అభిషేకించాడు. పురజనులు 'అయ్యా! పెద్దకొడుకు యదువు ఉండగా... చిన్నవానికి చేయడం ఎంతవరకు న్యాయం అంటూ సాహసించి ప్రశ్నించారు. మీరన్నట్లు జ్యేష్ఠుడు యదువును కాదననుగాని నామాట కాదని నన్ను అవమానించాడు కదా! తండ్రిమాట విననివాడు ఆస్తికి వారసుడౌతాడా - కాదు చిన్నవాడైనా పూరుని పితృభక్తి చూశారు గదా! నా భారం వహించాడు. రాజ్యభారానికి అర్హుడయ్యాడు అని వారిని ఒప్పించాడు. మిగిలిన పుత్రులకి ఆయా రాజ్యాలు అప్పగించాడు. భారం తీర్చుకొని తపోవనం చేరాడు. ఎన్నో కఠిన నియమాలు పాటిస్తూ వెయ్యేళ్ళు తపస్సు చేశాడు. ముప్పైఏళ్ళు నిరాహారిగా గడిపాడు. ఒక ఏడు గాలినే ఆహారంగా గైకొన్నాడు. పంచాగ్నిమధ్యలో నిలిచాడు. ఒంటికాలిపై తపస్సు చేశాడు. ఫలితంగా స్వర్గలోకానికి చేరాడు. దేవర్షులు పూజించి బ్రహ్మలోకానికి పంపారు. బ్రహ్మర్షులు పూజించారు. ఎన్నో కల్పాలు అక్కడ గడిపాడు. ఇంద్రలోకానికి

వచ్చాడు. అపుడు ఇంద్రుడు అయ్యా! నువ్వు మీ పూరుడికి ఏం బోధచేశావు అని అడిగాడు. తాను కొడుక్కి చెప్పిన నీతులు వివరించాడు యయాతి.

పెద్దల చరిత్రలు చదవాలి. సజ్జనుల గోష్ఠిలో ధర్మం తెలుసుకోవాలి. తెలిసిన దానిని మరచిపోకూడదు. మంచిని ఆచరించాలి. దానం చేయాలి. ధర్మబద్ధమైన మాటలనే పలకాలి. అరిషట్ వర్గాలని జయించాలి. మొ॥ ఎన్నో ధర్మాలు చెప్పాను. నిజానికి పూరునికి నేను చెప్పనవసరమే లేదు కదా అన్నాడు. ఇంద్రుడు అయ్యా! ఇన్నివందల ఏళ్ళు స్వర్గసుఖాలు అనుభవించడానికి నువ్వేం తపస్సు చేశావు అన్నాడు. పాపం మామూలుగా అడిగాడు కదా అని దేవతలు, మునులు మొ॥ గొప్పవారంతా చేసే తపస్సు నా తపస్సుతో సమానం కాదు కదా! అన్నాడు. గర్వం తలెత్తిన ఈ మాట అతని పతనానికి మూలం అయింది. ఇంద్రుడు కోపించి నీ ఆత్మప్రశంస నీపతనం. పో నీ పుణ్యం క్షీణించింది. అథోలోకాలకి పో.. అన్నాడు. అయ్యో... ఎంత పాపం మానవలోకానికి పోలేను. ఆకాశంలో నక్షత్రలోకంలో ఉంటానన్నాడు యయాతి. సరే అన్నాడు ఇంద్రుడు.

యయాతి వస్తూంటే ఆ దివ్యకాంతిని చూచి నక్షత్ర మండలం ఆశ్చర్యపోయింది. ఆ నక్షత్రాలలో యయాతి కూతురి పిల్లలున్నారు. వారు అష్టకుడు, ప్రతర్దనుడు, వసుమంతుడు, శిబి మొ॥ వారు. వారంతా యయాతిని పూజించి అతని వివరాలు అడిగాడు.

నేను నహుషుని కొడుకుని పూరుని తండ్రిని. నాపేరు యయాతి. ఇంద్రుని ప్రశ్నకి, నా తపస్సుతో ఎవరి తపస్సు సమానం కాదు అని చెప్పి గర్వంగా పలికాను. గర్వం తపః ఫలాన్ని నాశనం చేసింది. ఇది నిజం. ఇంద్రుని శాపంలో అన్యాయం లేదు. ఆ ఫలితంగా ఇలా వచ్చాను అన్నాడు. వారంతా యయాతి తమ మాతామహులని (అమ్మ నాన్నగారు) తెలుసుకొని పరమానందం పొందారు. ధర్మాలన్నీ అడిగారు. యయాతి వారికి దయని గూర్చి, సత్యవాక్పాలనము గూర్చి, వేదవిశ్వాసాన్ని గూర్చి చక్కని నీతులెన్నో చెప్పాడు. పిండోత్పత్తి- పుట్టుక- ధర్మాచరణ, ఆశ్రమాలు మొ॥ విశేషాలెన్నో వివరించాడు. ఆ ధర్మాత్మునికి మ్రొక్కి మాకు పుణ్యలోకాలు వస్తాయా అని అడిగారు వారు. ఆ తప్పక వస్తాయి అన్నాడు యయాతి. వారంతా యయాతికి పుణ్యలోకగతి కల్పించారు. మనుమలతో ఉత్తమ సంసర్గముచేత యయాతి కూడా పుణ్యలోకాలకి చేరాడు.

ఈ మహారాజు కథ మనకెన్నో నీతులు నేర్పింది. మిగిలిన నీతులన్నీ ఒకఎత్తు. మనిషి తనను తాను పొగడుకొనడం ఎంత పాపమో తెలుపడం ఒకఎత్తు.

మహనీయుల చరిత్రను తెలిసికొంటూ వారుపదేశించిన ధర్మమార్గంలో నడవాలే గాని వారు నాముందెంత వారు అనే గర్వాన్ని తలఎత్తనీయకూడదు. గర్వం ఏనాడు బయలుదేరిందో పతనం ఆనాడే మొదలౌతుంది. గర్వం లేని వానిని సమాజం పూజిస్తుంది. పెద్దలు ఆశీర్వదిస్తారు. మంచినడత మంచి జీవితాన్ని ప్రసాదిస్తుంది. ఇలాంటి గొప్పనీతులెన్నో ఈ యయాతి చరిత్రలో మనకి కనిపిస్తాయి. అందుకే అహంకారం దరిచేరని ఉత్తమస్థితిలో జీవనయానం సాగించాలి. (సశేషం)



# సీతాఫలం రామార్పణమ్



శ్రీమతి చెవుటూరి కుసుమకుమారి - హైదరాబాద్

(గతసంచిక తరువాయి) వసిష్ఠమహర్షి రాజా! నీవు విచారించకు. అట్లు చింతించుటకు తగిన కారణమున్నది. అని ఈ విధంగా చెప్పసాగాడు.

మహారాజా! పృథివీ మొదలైన పంచభూతాలు, సృష్టి, సంహారము అనే పరిణామం లేకున్న ఎడల వృద్ధి క్షయాలు లేకుండా స్తబ్దుగా వుండునో అట్లే చిన్న చిన్న కారణాలకు సత్పురుషులు హర్షోద్వేగాలను వ్యక్తం చేయరు. కనుకనే వారు నిశ్చల మనస్కులై వుంటారు. కనుక శ్రీరాముని చింతకు గొప్ప కారణమే ఉండి తీరును.

**శ్రుణు తత్కారణం రాజన్! తీర్థసేవావశా త్పునః**
**విరక్త్యా లబ్ధయా రామో నివృత్తి పథమాశ్రితః**
**యథా ప్రవృత్తి స్స్యాత్తస్య తథా యత్నం కురు ద్రుతమ్ ॥**

రాజా! ఆకారణమును చెప్పెదను వినుము. రామచంద్ర మూర్తి తీర్థయాత్రలు చేయుట చేత కలిగిన వైరాగ్యము చేత నివృత్తి మార్గమును (తన సహజమార్గమునుండి మరలుట) అనగా వైరాగ్యపథమును ఎంచుకొనినాడు. కనుక ఎటులైననూ కర్మయోగముచేత (తనవిధులను తాను శ్రుతిపూర్వకంగ నిర్వర్తించుట) ప్రవృత్తి మార్గమునందు అభిరుచి కలిగించ వలెను. రాజా! అందులకై నీవు శీఘ్రమే ప్రయత్నించవలెను. అని చెప్పినాడు. వసిష్ఠ మహర్షి ఆ విధంగా చెప్పగానే

**ఇత్యుక్తో మునినా రాజా! లోకవృత్తే నిజం సుతం**
**ప్రవర్తయితు కామేన సభాయాం మంత్రిభి స్సహ**
**కరోత్యాలోచనం రామవివాహ విషయే పునః ॥**

తన పుత్రునికి లోక విషయాసక్తిని కలిగింప చేయవలెనని తలంపుతో సభాస్థలికి మంత్రులను పిలిపించి శ్రీరాముని వివాహ విషయమును ప్రస్తావించినాడు. సరిగ్గా అదే సమయమున విశ్వామిత్ర మహర్షి దశరథుని చూచుటకు సాకేతపురికి విచ్చేసినాడు.

(ఊరకరారు మహాత్ములు అనేమాట నానుడిగా అంటూ వింటూ వుంటాం, పెద్దలు శ్రేయోభిలాషులు వచ్చినపుడు. సమస్త కళ్యాణ గుణాభిరాముడైన శ్రీరాముని పెళ్ళి ప్రస్తావన రాగానే కౌశికముని అరుదెంచెననగా అభీష్టసిద్ధి కలుగునని సూచన. ఏ కార్యమునైననూ తానుగా నిర్వహింప సమర్థుడు విశ్వామిత్రమహర్షి!

సాక్షాత్తూ శ్రీ మహావిష్ణువే శ్రీరామచంద్రుడిగా దశరథసుతుడై పుట్టి తీర్థయాత్రా కుతూహలుడై అనంతరము నివృత్తి (వైరాగ్య) మార్గములో పడి చింతాక్రాంతుడగుటయా! మరల దుష్టశిక్షణకై ప్రభవించిన రఘువీరుని వివాహ ప్రసక్తి రాగానే తాను నిర్వర్తించవలసిన కార్యమునకు నాంది పలుకుటకై దశరథుని రాముని కొరకై యాచించుట అను నెపముతో విశ్వామిత్రుడు అయోధ్యలో ప్రత్యక్షమగుటయా! ఇదంతయూ నిమిత్త మాత్రమని అనిపించుట లేదా! పృథివిన జన్మించిన చాలు పరిణామము తప్పదు కదా! కనుకనే ప్రకృతి పరిణామ పేశలమనునది నిత్యసత్యము. మూలప్రకృతి సీతతో పురుషోత్తముడైన శ్రీరాముని కలుపుటయే విశ్వామిత్రుని లక్ష్యము. అదే ఆయన సిద్ధాశ్రమమున ఆరంభించబోవు యాగము. అవతార లక్ష్యసిద్ధికి నాందీ ప్రస్తావనే శ్రీరామ వైవాహిక ప్రస్తావన అందుకే రఘువంశ రాజుల కాల ప్రబోధాన్ని గురించి కాళిదాస మహాకవి

**శైశవేభ్యస్త విద్యానాం యౌవ్వనే విషయైషిణాం ।**
**వార్ధకే ముని వృత్తీనాం యోగేనాంతే తనుత్యజామ్ ॥**

రఘువంశరాజులు శైశవంలో విద్యాభ్యాసం, యవ్వనంలో విషయవాంఛలు, వార్ధకంలో మునివృత్తి చివరకు యోగంలో తనువును త్యజించటం అనే కాలప్రబోధానికి తాను ఉత్తేజితుడనై రఘువంశ కావ్యాన్ని వ్రాస్తున్నాను అని చెప్పుకున్నాడు.

విశ్వామిత్రమహర్షిరాకను తెలుసుకున్న దశరథ మహీపతి మహర్షీ! మావంటివారి గృహములకు మీవంటి మహాత్ములు ఊరకరారు. నీవంటి మహాత్ముడు మాగృహమునకు వచ్చుట సర్వసంపదలకు, సమస్త సన్మంగళములకు హేతువను భావన. మహర్షీ! నీ అభీష్టమును చెప్పుటయే నన్ను అనుగ్రహించుట అని సవినయంగా ప్రార్థించాడు.

'రాజా! మహాగర్వి అయిన పులిపరాక్రమంవంటి పరాక్రమం కలిగినవాడు, దేవేంద్ర సమాన వీరుడు రాక్షస మారకుడు అయిన నీ జ్యేష్ఠకుమారుడు శ్రీరాముని నా యాగరక్షణకై నాకిమ్ము' అని కోరినాడు విశ్వామిత్రమహర్షి.

మొదట పుత్రమమకారంచేత దుఃఖించినా వసిష్ఠ వామదేవాది

మహర్షులు చెప్పగా అంగీకరించి రామచంద్రుని సభకు పిలిపించి తనవద్ద కూర్చుండమని ప్రేమతో పిలిచినాడు.

కానీ, రాముడు నేలమీద ఒక రత్నకంబళము మీద కూర్చున్నాడు. అది చూచిన దశరథమహారాజు 'రామా! వివేకివి, సమస్త శుభాలను, భోగములను పొందవలసినవాడవు అయి వుండి కూడా నీకెందుకీ దైన్యము' అని వాపోయినాడు. కానీ శ్రీరాముడు మాటాడలేదు.

అంతట వసిష్ఠమహర్షి "పరంపరాగత జడత్వము చేత మోహసముద్రంలో మునిగిపోయిన అజ్ఞానివలే నీవెందుకీ దైన్యంలో మునిగిపోతున్నావు?" అని ప్రశ్నించాడు. కానీ శ్రీరాముని నుండి మౌనమే సమాధానం అయినది. తండ్రికి గురువు వసిష్ఠునికీ కూడా బదులు చెప్పకుండుటను చూచిన కౌశికముని

**యథాభిమత మాశుత్వం బ్రూహి ప్రాప్స్యసి చానఘ ।**
**సర్వమేవ పునర్యేన భేత్స్యంతే త్వాంతు నాధయః ॥**

"రామా! నీమనోవ్యధకు కారణముకాని, నీ అభిమతము ఏదో దానిని, చెప్పిన ఎడల నీ మనోవ్యాధి తగ్గి, నీ అభీష్టము నెరవేరుతుంది. కనుక శ్రీరామా! నీ మనసు విప్పి మాటలాడు' అని అడిగినాడు.

అప్పుడు శ్రీరాముడు మహాత్మా! నేను తీర్థయాత్రలకై భూమినంతనూ తిరిగినాను. ఆ సమయమున తత్త్వవిచారణ చేసినాను. ఎడారిలోని బాటసారికి వలే నాకు విషయ భోగముల మీద అభిరుచి నశించినది. ఈ సంసార (ప్రపంచ) రూపమైన దుఃఖము ఎట్లు నివృత్తి అగునని పరితపిస్తున్నాను.

**జాయతే మృతయే లోకో మ్రియతే జననాయ చ ।**
**కిం నామేదం బత సుఖం యేయం సంసార సంతతిః ॥**

మహానుభావా! ఈ సంసారములో సుఖము నిజముగా వున్నదా! అది ఎంత మాత్రము నిజముకాదని నా మనసు చెప్పుచున్నదే! పుట్టినవాడు చచ్చితీరును. చచ్చినవాడు పుట్టితీరును. కనుక రెండునూ దుఃఖమే కదా! మహాత్మా ఈ మనసునూ సంపదల భ్రమలో పడిపోవుచున్నది. ఆ భ్రమలో గుణములు నశించి పోవుచున్నవి. కనుక ఈ మోసకారి సంపదలను నమ్మరాదని తెలియుచున్నది.

**ఉన్మత్త ఇవ సంత్యజ్య యాత్య కాండే శరీరకమ్ ।**
**ఆయుః పల్లవ కోణాగ్ర లంబాంబు క్షణభంగురమ్ ॥**

సంపదలే కాదు ఆయువు వలన కూడా సుఖము లేదనిపించును. ఎట్లన చిగురుటాకు చివరనున్న మంచు బిందువు వలే ఆయువుకూడా స్థిరమైనది కాదు. పిచ్చివాడు దేనికైననూ తటాలున క్రింద పడవేసినట్లు లోపలి ఆయువు (ప్రాణము) హఠాత్తుగా శరీరమును విడిచి పోవుచున్నది.

అహంకారము అన్ని అనర్థములకు, కష్టములకు మూల కారణము. అహంకారము వలననే సమస్త రాగద్వేషములు తలెత్తును. ఇదే మనస్సులోని రోగము. అహంకారము వలెనే చిత్తము కూడా దోషహేతువే కనుక అదీ దుఃఖకారణమే అని కదా చెప్పబడినది.

కౌశిక మునీంద్రా! అగ్నిభక్షణముకన్నా, సముద్రపానము కన్నా మనోనిగ్రహము బహుకష్టతరము. మహర్షీ! చూచువారికి ఆనందము కలిగించని ఆశవదలని వృద్ధనర్తకి నృత్యమువలే నర్తించుచున్నదీ ప్రపంచము.

**అశక్తి ఆపదస్తృష్ణామూకతా మూఢబుద్ధితా ।**
**గృధ్నుతా లోలతా దైన్యం సర్వం బాల్యే ప్రతిష్ఠితమ్ ॥**

పోనిందు బాల్యమందుమా! బాలారిష్టములు, ఆపదలు, ఆకలి దప్పికలచేత అవస్థలు. తన బాధలు చెప్పుకోలేని మూగతనము. ఈగలు మొదలైన వానిని తోలుకొనలేని అసహాయత. హితాహిత వివేకములేని మూఢత చూచిన ప్రతివస్తువునందూ అభిలాష, దైన్యము, చంచలత యివన్నీ కలసి బాల్యమూ దుఃఖభాజనమే.

**వినయ భూషిత మార్యజనాస్పందం**
**కరుణ యోజ్వల మావరితం గుణైః ।**
**ఇహహి దుర్లభ మంగసు యౌవనం**
**జగతి కానన మంబరజం యథా ॥**

కరుణతో ప్రకాశిస్తూ, వినయభూషితుడై, సద్గుణపూర్ణమై పెద్దల మెప్పుపొందిన యవ్వనము ఆకాశంలోని అడవివలే దుర్లభము. (అనగా యవ్వనమున ఈ లక్షణములు వుండవు అని)

అసలు జన్మ అంటేనే సంసారము. అదొక చిన్నకొలను. ఆ కొలనులో చిత్తమనే బురదలో తిరుగాడే పురుషులు (జీవులు) అదే మత్స్యములకు మురికి పట్టిన గాలప్రత్రాళీ బంధహేతువులు. ఆ గాలపుకొనలకు గ్రుచ్చబడిన మాంసపు ముక్కలే స్త్రీలు. (మత్స్యములు మాంసపుముక్కలకై గాలమున చిక్కినట్లు పురుషులు వనితల వలలో చిక్కుకుందురని భావము) *(ఇంకా ఉంది.)*

## పరమపదవార్త



శ్రీ ఉ.వే. శ్రీమాన్ శ్రీభాష్యం అప్పలాచార్య స్వామి వారి ధర్మపత్ని **శ్రీభాష్యం తిరువెంగమ్మ** గారు ది. **9.9.2011**న ఆచార్య తిరువడి చేరినారు. వీరికి శ్రీశ్రీశ్రీ స్వామివారు ఉత్తమ గతులు లభించాలని మంగళాశాసనం చేశారు.

# ముముక్షు రహస్యం

(గతసంచికతరువాయి...)

శ్రీమతి చక్రవర్తుల చూడామణి -ఖమ్మం

త్రిజట గురించి తిరుక్కోళూరమ్మాళ్... "అంతరంగం శొన్నేనో త్రిజటయైప్పోల అన్నది."

సరే వినండి మరి... "అంతరంగం చెప్పానా త్రిజటలాగా" అని అర్థం. అలా ఎందుకు చెప్పిందంటే రాక్షస స్త్రీ అయిన త్రిజట సీతాదేవి అశోకవనంలో ఉన్నప్పుడు ఆమె మనసు తెలిసి నడుచుకోవటమేకాక ఓదార్పుగా నాలుగు మాటలు చెప్పి సీతమ్మగుండె చెదరకుండా చూసుకుందట. అందుకనే అంతరంగం చెప్పానా త్రిజటలాగా అని తిరుక్కోళూరుమ్మాళ్ అంటారు.

"అంత మంచిగా ఏం చెప్పింది? అయినా ఆమె రాక్షసి కదా! సీతమ్మకు మంచి ఎందుకు చేస్తుంది?

"రాక్షసులలోను మంచివాళ్ళుంటారు కదా! విభీషణుడు, ఆయన భార్య సరమ..." అలాగే త్రిజట విభీషణుని కూతురు కాబట్టి రాక్షసస్త్రీలలో మంచిదన్నమాట. అశోకవనంలో ఉన్న తక్కిన రాక్షసులంతా రావణుని ఆజ్ఞమేరకు సీతమ్మను వాళ్ళ మాటలతో రకరకాలుగా బాధపెట్టేవాళ్ళు. మధ్య మధ్య రావణాసురుడు వచ్చి ప్రగల్భాలు పలికి ఎప్పటికప్పుడు సీతమ్మను మనసు మార్చుకొని తనకు లొంగిపొమ్మని గడువు పెట్టేవాడు.

"పాపం కదక్కా సీతమ్మ. తన వాళ్ళెవ్వరూ లేని లంకలో ఒంటరిగా... పైగా రామలక్ష్మణుల గురించి ఆమెకు తెలియదు. ఆమె గురించి వాళ్ళకు తెలియదు. తెలుసుకునే దారీ కనపడదు. ఎంచక్కా ఈ సెల్‌ఫోన్లు అప్పుడుంటే బాగుండేది కదా!" గోద.

"ఇప్పుడు సెల్‌ఫోన్లుంటే అన్యాయాలు జరగట్లేదా... ఊరికే కథకు అడ్డురాకుండా కూర్చో...." చిన్నా.

"ఒరేయ్... మీరు గొడవ మొదలు పెడితే నేను చెప్పడం ఆపేస్తా...." ప్రతిభ.

"లేదులే... చెప్పు..."

"మన గోద చెప్పినట్లు సీతమ్మ దిక్కుతోచక అల్లాడి పోయిన సమయంలో త్రిజట ధైర్యం చెప్పేది. "వాడి మాటలు పట్టించుకోకు. శ్రీరాముడు తప్పక వచ్చి నిన్ను తీసుకుపోతాడు" అని ధైర్యం చెప్పేది. అలా అలా రావణాసురుడు సీతను లంకకు తీసుకువచ్చి పదినెలలు గడిచి పోయాయి. ఋతువులు మారిపోయాయి. రాముడి జాడ తెలియట్లేదు. ఇక్కడ చూస్తే రావణాసురుని బాధ అంతకంతకు పెరిగిపోతోంది. ఎంతటి సాధ్వి అయినా ఆ పరిస్థితులు తట్టుకోలేక గుండెచెదరి 'ఇక ఆత్మహత్యే శరణ్యం' అనుకొని తన పొడవాటి కురులనే తాడుగా చేసుకొని చెట్టుకు ఉరిపెట్టుకోవాలని ప్రయత్నించబోయింది.

అప్పుడు త్రిజట "అమ్మా అమ్మా... అంత సాహసం చేయకు. ఈవేళ నాకో కల వచ్చింది. అది వింటే నువ్వు మురిసిపోతావు..." అని తన కల చెప్పటం మొదలు పెట్టింది. 'ఏనుగు దంతంతో చేసిన వేయి హంసలు పూన్చిన ఒక దివ్యమైన పల్లకి ఆకాశంలో ఇటుగా వచ్చింది. దాంట్లో తెల్లని బట్టలు కట్టుకున్న రామలక్ష్మణులు, తెల్లని పూలమాలలు వేసుకొని కూర్చొని ఉన్నారు. సీతమ్మకూడా తెల్లని వస్త్రాలే కట్టుకొని ఉంది. తరువాత చూస్తే వాళ్ళిద్దరూ ఏనుగుమీద కనపడ్డారు. సీతను కూడా ఆ ఏనుగు మీదికెక్కించుకొని ఊరేగింపుగా రావటం నేను చూశాను."

"అబ్బ ఎంచక్కా ఏనుగుమీద ఎక్కి తిరుగుతుంటే ఎంత బాగుంటుందో!" చిన్నా.

"అక్కడ రావణుడు లేడా" గోద.

"రావణుడు నూనెలో ముంచిన ఎర్రని బట్టలు కట్టుకొని కిందపడి చుట్టూ పిచ్చి చూపులు చూస్తున్నాడు. కాసేపటికి లేచి నిద్రలో నడుస్తున్నట్లు నడిచి గాడిద మీద ఎక్కి దక్షిణం వైపుకు పోతున్నాడు. కాబట్టి రామలక్ష్మణులు వచ్చి రావణుని గెలిచి సీతను తీసుకు వెళ్ళటం తప్పక జరుగుతుంది" అని త్రిజట చెప్పగానే సీత సంతోషించి తన ఆత్మహత్యా ప్రయత్నం విరమించింది.

తరువాత హనుమంతుడు రావటం, చూడామణిని ఇవ్వటం, వానరసైన్యాన్ని తీసుకొని రాముడు వచ్చి సేతువుకట్టి లంక మీద దండయాత్ర చేశాడు. యుద్ధం మొదలయింది. లంకలో రావణుని హితవు కోరేవాళ్ళు ఎందరో సీతమ్మను శ్రీరాముడి కప్పచెప్పమని"ని సలహా ఇచ్చారు. వాడికి వినాశ

కాలం దగ్గర పడితే మంచిమాటలు వింటాడా! విపరీత బుద్ధి పుట్టింది. ఇంద్రజిత్తు మాయాయుద్ధంచేశాడు. రామలక్ష్మణులు మూర్ఛవచ్చి పడిపోయారు. ఇంద్రజిత్తు "నేనే గెలిచాను. మహావీరులు నాముందు ఓడిపోయారని చెప్పుకున్నాడు. రావణుడు సీతను యుద్ధరంగానికి తీసుకెళ్ళి మరణించిన రామలక్ష్మణులను సీతకు చూపించమని రాక్షసస్త్రీలకు చెప్పాడు. అప్పుడు సీతతో త్రిజట పుష్పక విమానంలో యుద్ధరంగానికి వచ్చింది. రామలక్ష్మణుల స్థితిని చూసి బాధపడుతున్న సీతను ఓదారుస్తూ "వారు నిర్జీవులు కారు. మూర్ఛితులు. ఈ రాక్షసులు మాయావులు. వీళ్ళమాటలు, చేష్టలు నమ్మకు. నేను ఎన్నో ఆధారాలతో, శుభసూచకాలతో చెపుతున్నాను. నీ దుఃఖం తాత్కాలికం. ఇప్పుడు మూర్ఛిల్లిన వీరే రేపు రావణుని సంహరించి నిన్ను ఈ చెరనుంచి తీసుకు వెళతారు. నామాట నమ్ము" అని చెప్పింది. చీకటి లాంటి లంకలో చిరుదివ్వెలా ఈ త్రిజట సీతమ్మకు ఎప్పటికప్పుడు ఊరట కలిగించి ఈమె హృదయంలో స్థానం పొందింది. అందుకే ఆమెలా అంతరంగం చెప్పానా నేను అని తిరుక్కోళూరమ్మాళ్ వాపోయింది."

"అక్కా రావణుడి భార్య ఎవరు? చిన్నా అడిగాడు.

"గోదా నువ్వు చెప్పు చూద్దాం"

"అవన్ దైవ మెన్రేనో మండోదరియైపోప్పేల?" అనలేదా అమ్మాళ్?" గోదా.

"నేనడిగిందేమిటి? నువ్వు చెప్పిందేమిటి?" చిన్నా.

"రెండూ ఒకటే! గోదా! అమ్మాళ్ వాక్యంలోనే నీ ప్రశ్నకు జవాబు ఇమిడి ఉంది...

"పిచ్చికన్నా... అలా తెల్లమొహం వేస్తావేం మండోదరి రావణుడి భార్య. అర్థమయిందా! ఈ కథను వచ్చే సంచికలో చెప్పుకుందాం!" *(ఇంకా ఉంది)*

# నేర్చుకుందామా - 5

శ్రీమతి డా॥టి.కె. చూడామణి-విజయవాడ

**గత జన్మంబుల నేమి నోచితిమొ? యాగశ్రేణులేమేమి సే**
**సితిమో? యెవ్వరి కేమి పెట్టితిమొ? యే చింతారతిం బ్రొద్దుపు**
**చ్చితిమో? సత్యము లేమి పల్కితిమొ? యే సిద్ధ ప్రదేశంబు ద్రొ**
**క్కితిమో? యిప్పుడు సూడ గంటి మిచటం గృష్ణార్భకున్ నిర్భయున్.** *ఆంధ్ర మహాభాగవతం దశమస్కంధం278*

చిన్నారి కృష్ణుని సుడిగాలి రాక్షసుడెత్తుకొని పోయిన పుడు విలవిలలాడిన గోపకాంతలు, ఆ రాక్షసుని చంపి చిరునవ్వులు చిందిస్తున్న నల్లనయ్యని కళ్ళారా చూసినపుడు ఆనందంతో అన్నమాటలివి.

భగవంతునికాని, ఆచార్యుని కాని, సేవించుకొన్నప్పుడు, ఆనందాతిరేకంతో మనమంతా కూడా చదువుకోవలసిన పద్యం కదా! ఈనాడు మన ఆచార్యుని సేవింపగలుగుతున్నాము అంటే మనంకూడా

... పూర్వజన్మలలో ఏ నోములు నోచుకున్నామో కదా! ఏ యే దానాలు ఎన్నెన్ని చేసిన పుణ్యఫలమో ఇది మరి. ఏ దివ్యకథలు వింటూ, పారాయణలు చేస్తూ కాలం గడిపామో! నిర్భయంగా సత్యవాక్యాలు ఎన్ని పలికామో – అంతేకాదు. ఏ యే పుణ్యతీర్థాలు సేవించామో! వాటన్నిటి ఫలంగా ఈనాడు ఈ భగవద్దర్శనం, భాగవతోత్తమదర్శనం, ఆచార్య సందర్శనం మనకి లభించింది.

నిజమే! మహనీయులను దర్శించడం, పరాత్పరుని సేవించడం, అనేక జన్మల పుణ్యఫలం. ఆరోజే నిజంగా సార్థకమైనరోజు. అక్రూరుడు శ్రీకృష్ణపరమాత్మని సందర్శించు రోజే జన్మసాఫల్యాన్ని కల్గించు రోజు అనుకున్నాడట. అందుకే ప్రతినిత్యం దైవాన్ని, ఆ దైవాన్ని సందర్శింప చేసే ఆచార్యుని స్మరిస్తూ, సందర్శిస్తూ ఉత్తమ జీవితాన్ని అందించిన ఆ స్వామికి కృతజ్ఞతలు చాటుకుంటూ జీవనయానం సాగిద్దాం! పద్యం నోటికి వచ్చేసింది కదూ!

జై శ్రీమన్నారాయణ!




# తిరుప్పల్లాండు

వైశారదీ

(గతసంచికతరువాయి...)

**తీయిల్ పొలిగిన్ట శెంశుదరాళ్లి తిగళ్ తిరుచ్చక్కరత్తిన్**
**కోయిల్ పొఱియాలే యొత్తుండునిన్టు, కుడి కుడి యాట్చెయ్‌గిన్టోమ్।**
**మాయప్పొరుపడై వాణనై ఆయిరంతోళుం పొళ్లికురిది**
**పాయ, శుళ్లత్తియ వాళ్లివల్లానుక్కు, పల్లాణ్డు కూరుదమే॥ 7**

| | | |
|---|---|---|
| తీయిల్ | = | అగ్ని(మొదలగు తేజఃపదార్ధముల)కంటే |
| పొలిగిన్ట | = | మించిన |
| శమ్ శుదర్ | = | ఎఱ్ఱని కాంతి కలిగిన |
| ఆళ్లి | = | గుండ్రముగా |
| తిగళ్ | = | ప్రకాశించుచున్న |
| తిరుచ్చక్కరత్తిన్ | = | సుదర్శనాయుధమునకు |
| కోయిల్ | = | స్థానమైన |
| పొఱియాలే | = | చిహ్నముచేత |
| ఒత్తుండు | = | ముద్రనంది |
| నిన్టు | = | స్థిరముగానుండి |
| కుడికుడి | = | తరతరములుగా |
| ఆళ్ శెయ్ గిన్టోమ్ | = | భగవత్సేవ చేయుచున్నాము |
| మాయమ్ | = | మోసగించే |
| పొరుపడై | = | యుద్ధముచేయు సైన్యముకల |
| వాణనై | = | బాణాసురుని యొక్క |
| ఆయిరం తోళుం | = | వేయి భుజములూ |
| పొళ్లి కురితి | = | ధారలుగా రక్తము |
| పాయ | = | కారునట్లు |
| శుళ్లత్తియ | = | గిరగిర తిరిగే |
| ఆళ్లి వల్లానుక్కు | = | సుదర్శనమును ప్రయోగించు సమర్థునికి |
| పల్లాండు | = | మంగళాశాసనము |
| కూరుదుమే | = | పలికెదము. |

**తా:** శ్రీసుదర్శనము అన్ని తేజఃపదార్థములకంటే మించిన ఎఱ్ఱని కాంతికల దివ్యచక్రము. ఆ సుదర్శనుని, దానితోపాటు శ్రీ పాంచజన్య శంఖముయొక్క గుర్తులను తరతరములుగా మా భుజములపై ముద్రింపచేసుకొని చక్రాంకితులమైన వారము. అట్లే, పరంపరగా భగవంతునియొక్క సేవచేసుకొను భాగ్యము పొందినవారము. పూర్వము వేయి చేతులు కలిగిన బాణాసురుడనువాడు మాయ యుద్ధము చేయు తన సేనతో స్వామిపై దాడికి దిగెను. దయకల స్వామి, ఆతనిని చంపకుండ రెండుచేతులు మాత్రమే ఉంచి మిగిలిన వాటిని శ్రీసుదర్శన చక్రముతో నరికి వేసెను. ధారలై రక్తము కారుచుండగా ఆతడు లొంగిపోయెను. ఆనాటి స్వామియొక్క అలుపు తీరునట్లు చక్రధారికి మంగళము పాడుదాము.

నెయ్యిడై నల్లదోర్ శోఱుం, నియతము మత్తాణి చ్చేవకముమ్,
కైయడైక్కాయుం కళ్ళత్తుక్కు ప్పూణొడు, కాదుక్కు కుండలముమ్ ।
మెయ్యిడ నల్లదోర్ శాన్దముమ్ తన్దు, ఎన్నై వెళ్ళుయి రాక్కవల్ల
పైయుడై నాక పగై క్కొడియానుక్కు, పల్లాండు కూఱువనే ॥ 8

| | | |
|---|---|---|
| నెయ్+ఇడై | = | నెయ్యితో నిండిన |
| నల్లదు | = | మంచిభావముతో (ప్రతిఫలమాశించక) పెట్టిన |
| ఓర్ శోఱుమ్ | = | గొప్పదైన అన్నమును, |
| నియతముమ్ | = | సర్వకాలములయందు |
| అత్తాణి | = | ఆంతరంగికమగు |
| శేవగముమ్ | = | సేవను |
| కై | = | చేతినిండుగ |
| అడై కాయుం | = | తాంబూలమును, |
| కళ్ళత్తుక్కు | = | కంఠమునకు |
| పూణ్ఒడు | = | అలంకరించు ఆభరణములతో పాటు |
| కాదుక్కు | = | చెవులకు |
| కుండలముమ్ | = | మకరకుండలములను |
| మెయ్+ఇడ | = | ఒంటికి పూయు |
| నల్లదు | = | పరిమళముగల |
| ఓర్ | = | శ్రేష్ఠమైన |
| శాన్దముమ్ | = | చందనమును |
| తన్దు | = | ఇచ్చి |
| ఎన్నై | = | ఏమీ కోరని |
| వెళ్ ఉయిర్ | = | పరిశుద్ధస్వభావునిగా (అనన్య ప్రయోజనునిగ) |
| ఆక్క వల్ల | = | చేయగలిగిన |
| పైయ్యుడై | = | పడగలు గలిగిన |
| నాగ పగై | = | సర్పములకు శత్రువైన గరుత్మంతుని |
| కొడియానుక్కు | = | ధ్వజముగాగల స్వామికి |
| పల్లాండు కూఱువనే | = | మంగళము పలికెదను |

**తా:** లౌకికమైన శరీరపోషణకు నేను పాటుపడే అవసరము లేకుండా భగవంతుడు చేసినాడు. నేతులూరు ప్రసాదములను అందించినాడు. శాశ్వతమైన ఆంతరంగికమైన సేవలొసంగినాడు. భోగ్యమగు చందన తాంబూలాలు ప్రసాదించినాడు. చెవులకు, కంఠమునకు, అర్థాత్, వంటినిండ ధరించు ఆభరణములను ఇచ్చినాడు. సుఖకరమైన జీవితముతో నాలోని రజస్తమస్సులు అణిగి, సత్త్వము పెరిగి నేను సాధుస్వభావుడను అయినాను. సర్పములను అణచు గరుత్మంతుని ధ్వజముగా కలిగినవాడు మనస్వామి. (కోరికలనే సర్పాలను అణచే) స్వామిని సేవిస్తూ మంగళము పాడుదాము రండి. *(ఇంకా ఉంది.)*

# విష్ణు (దయా) పోతము

శ్రీమాన్ సముద్రాల శఠకోపాచార్యస్వామి-వరంగల్

జన్మపరంపరను పొందుతున్న తనకు **"మానుష్యం పుణ్య సంచయాత్"** అను శాస్త్రోక్తి ననుసరించి పూర్వజన్మ సుకృతం వల్ల యుక్తాయుక్త విచారణ చేయగలిగే మానవజన్మ లభించినందుకు జీవుడు సంతసించును. స్వస్వకర్మానుసారంగా సంసారచక్రంలో పడి తిరుగుతూ దుఃఖించే జీవునిపై పరమాత్మ యైన శ్రీమన్నారాయణుని దయ ఆకస్మికంగా ప్రసరించును.

**ఏవం సంసృతి చక్రస్థే భ్రామ్యమాణే స్వకర్మభిః ।**
**జీవే దుఃఖాకులే విష్ణోః కృపా కాప్యుపజాయతే ॥**

అను విషయాన్ని గుర్తించి ప్రకృతి మాయకు లోబడి ఇంద్రియాలకు వశమై వివేకజ్ఞానము కొరవడి, పారమార్థిక చింతనకు దూరమై, దుర్భరమైన, దుఃఖాస్పదమైన యాంత్రిక జీవనాన్ని కొనసాగిస్తున్న వ్యక్తి ఓ పరమాత్మా! దయామయా! దయనీయమైన నా స్థితిని చూడుము. నిర్హేతుక జాయమాన కృపాకటాక్షమును నాపై ప్రసరింపజేసి నన్ను కాపాడుము. సంసార చక్రబంధం నుండి నన్ను విముక్తుణ్ణి చేయుము.

**ఏవం మాం భవచక్రేఽస్మిన్**
**భ్రమంతం బహుదుఃఖితమ్ ।**
**కృపయా కేవలం శ్రీమన్**
**రక్ష నాథ! కటాక్షతః ॥** అని శ్రీమన్నారాయణుని వేడుకొనును. ఆతని కృపకు పాత్రుడగును.

భగవానుని నిర్హేతుక దయకు పాత్రులైన వారెందరు అని లెక్కించలేము. ఆయన దయ ఎవరిపై ప్రసరించబోవునో ఊహించలేము. నిశ్చయించనూ లేము. వివేకాన్ని కోల్పోతూ, శాస్త్ర జ్ఞాన సంబంధమును నిర్లక్ష్యం చేస్తూ, కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యాదులతో స్నేహం చేస్తూ, లెక్కకు మించిన పాపాలను, అకృత్యములనాచరించే దోషకరుణ్ణి వాస్తవానికి నిగ్రహానుగ్రహ సమర్థుడైన పరమాత్మ ఆగ్రహంతో శిక్షించాలి. సకల కళ్యాణగుణాకరుడైన, ఆశ్రితవత్సలుడైన పరమాత్మ తన పట్ల వైముఖ్యాన్ని ప్రదర్శించే వారిపట్ల పరమాత్మ ఉదాసీనంగా ఉండాలి. కాని, దయామయుడైన ఆ పరమాత్మ తనను ఆరాధించేవారిని, దూషించేవారిని కూడా ఆదరిస్తాడు. అజ్ఞానంవల్ల కర్తవ్యాన్ని గుర్తించలేక పోతున్నారని భావించి సంసార సాగరమగ్నులైన వారిని ఒడ్డుకు చేరుస్తాడు. అందుకే కులశేఖరాళ్వార్లు ముకుందమాలలో...

సంసారమనే మహాసముద్రంలో పడి శీతోష్ణములు, సుఖదుఃఖములు అను గాలితాకిళ్ళకు లోనవుతూ, కొడుకు, కూతురు, భార్య మొదలగు వారందరినీ రక్షించాలనే బరువుతో బాధపడుతూ ఒడిదుడుకులుగా ఉండే విషయములు అనే నీటిలో మునిగిపోతూ, ఒడ్డుకు చేరే మార్గం తెలియక, తెప్పలాంటి ఏ సహాయం లేక దిక్కుతోచని స్థితిలోనున్న నరులకు సంసార మహాసముద్రం నుండి ఒడ్డుకు చేర్చే విష్ణువనే ఓడ ఒక్కటే శరణము.

**"భవజలధిగతానాం ద్వంద్వ వాతాహతానాం**
**సుతదుహితృ కళత్రత్రాణ భారార్థితానామ్ ।**
**విషమ విషయతోయే మజ్జతామప్లవానాం**
**భవతు శరణమేకో విష్ణుపోతో నరాణామ్ ॥"**

అని తెలిపినారు.

ఆదిశంకరాచార్యులవారు కూడా పరమాత్మయగు శ్రీమన్నారాయణుని ఒక నౌకగా పేర్కొన్నారు. దయాసముద్రుడ వైన ఓ భగవానుడా! సంసారమనే సముద్రాన్ని దాటడానికి నీవు ఒక నౌకవు. జ్ఞానులు ఈ నావనెక్కియే (నిన్ను ఆశ్రయించియే) అనాయాసంగా సంసారసముద్రాన్ని దాటి సురక్షితంగా ఒడ్డుకు చేరుకోగలిగారు. ముక్తిని సాధించారు.

**భగవన్ కరుణాసింధో! భవసింధోర్భవాంస్తరిః ।**
**యమాశ్రిత్యాశ్రమేణైవ పరంపారంగతా బుధాః ॥**

అని శంకర భగవత్పాదులు స్తుతించారు.

**"భూమౌ స్ఖలిత పాదానాం భూమిరేవావలంబనమ్"**
భూమి మీద నడుస్తూ ఉండగా నడకలో పట్టుతప్పి పడిపోతు న్నప్పుడు భూమియే ఆలంబనమైనట్లు సంసార మహా సముద్రంలో పడినవానికి దయాసముద్రుడైన శ్రీమన్నారాయణుడే అవలీలగా ఒడ్డుకు చేర్చే నౌకయని శంకర భగవత్పాదులు వివరించారు.

శతాధిక గ్రంథకర్త 'కవితార్కిక' బిరుదాంకితులైన శ్రీవేదాంతదేశికులు పరమాత్మ (శ్రీనివాసుని) దయాగుణాన్ని

సంసారసముద్రంలో మునిగినవారిని ఒడ్డుకు చేర్చే 'నావ'గా వర్ణించారు.

ఓ దయాదేవీ! సంసారమనెడు మహాసముద్రంలో మునిగి, బయటపడే మార్గం తెలియక కొట్టుమిట్టాడుతున్న జనులను క్షేమంగా తీరానికి చేర్చే నీవు ఒకనౌకవు. నీవు పరమాత్మయొక్క దయాగుణానివి. కాబట్టి నీవు ఎప్పుడు ఎక్కడ ఎలా ప్రసరిస్తావో ఆ రీతులన్నీ ఎరిగిన ఆచార్యులు అనే సుశిక్షితులైన నావికులు (నౌకను నడుపువారు) సముద్ర మార్గాలను, దిక్కులను, లోతుగా బాగా తెలిసినట్టివారు. కావున నావను చక్కగా నడుపుతూ సంసారసాగరమగ్నులనే ప్రయాణికులను దరి(పరమాత్మ సన్నిధికి) చేరుస్తారు. నౌక నావికుని సహాయంతో ప్రయాణికులను గట్టుకు చేర్చునట్లు ఓ దయాదేవీ! నీవు నిన్ను ఆశ్రయించినవారిని ఆచార్యుని సహాయంతో గుట్టలపైనున్న శ్రీనివాసుని సన్నిధికి చేరుస్తావు.

**దిశి దిశి గతివిద్భిః దేశికైః నీయమానా**
**స్థిరతరమనుకంపే! స్త్యానలగ్నా గుణైస్త్వమ్ ।**
**పరిగతం వృషశైలం పారమారోపయన్తీ**
**భవజలధిగతానాం పోతపాత్రీ భవిత్రీ ॥**(దయాశతకం-38)

అని దయాశతకంలో వేదాంతదేశికులు పరమాత్మ దయాగుణాన్ని నౌకగా చిత్రీకరించారు. ఈ వేదాంతదేశికులే దయాశతకంలో సంసార్ణవ మగ్నులను ఉద్ధరించే పరమాత్మ యొక్క దయాగుణ ప్రాధాన్యాన్ని వివరిస్తూ శ్రీనివాస ప్రభో! నీలో దయాగుణమే కనుక లేకపోతే జ్ఞానబలైశ్వర్యాది షడ్గుణములు, అనంతకోటి కల్యాణగుణములు అన్నీ దోషాలుగా పరిణమించే వీలున్నది.

**వృషగిరి గృహమేధిగుణాః**
**బోధ బలైశ్వర్య వీర్య శక్తిముఖాః**
**దోషా భవేయురేతే యది**
**నామ దయే! త్వయా వినా భూతాః॥** (దయాశతకం-15)

అని పేర్కొన్నారు.

సంసార సముద్రంలో పడిన మనము కూడా ఆచార్య శ్రీకరావలంబనముతో విష్ణు (దయా)పోతమును శరణు వేదుదాము. ఈ మానవ జన్మను సార్థకం చేసుకునే ప్రయత్నం చేద్దాము!

# నమ్మినవారికి....

రాళ్ళబండి నీలిమ-హైదరాబాద్

అది భగవద్రామానుజుల కాలం. ఆయన దేశసంచారం చేస్తూ తిరుపతి చేరుకున్నారు. కొండకిందిభాగం అలిపిరి దగ్గర కొద్దిరోజుల మకాం. భిక్షాటనం చేసేవారు శిష్యులు. ఒక గొల్ల పడుచు. పేరు "కొండి". పెరుగు పోసింది ఓ రోజు. ఆచార్యుల వారిని చూసింది. ఎందుకో ఉచితంగా పెరుగు పోయాలనుకుంది. అలా రోజూ వచ్చేది. రామానుజల దర్శనం చేసుకునేది.

ఆరోజు అందరూ ప్రయాణ సన్నాహాల్లో వున్నారు. అప్పుడు వచ్చింది ఆమె. చూశారు శిష్యులు. పెరుగుకు డబ్బెంతయిందో చెప్పు. ఇచ్చేస్తాం అన్నాడొక శిష్యుడు. విషాదవీచికలు ఆమె ముఖంలో పారాడినాయి. కళ్ళు చెమ్మగిల్లాయి. "డబ్బెంతయిందో చెప్తే ఇచ్చేస్తారా!" అడిగింది. ఊఁ! చెప్పు! అన్నాడు శిష్యుడు.

"నాకు సంసారబంధం తెగిపోవాలి. మోక్షం కావాలి. మీరు ఇవ్వదలిస్తే నేను కోరింది ఇవ్వండి లేకుంటే...." అని అన్నది.

రామానుజులు మందహాసం చేశారు. కళ్ళలో కరుణ. గొంతుకలో మార్దవం. 'నేనివ్వలేని మోక్షం. కొండమీదున్న వాడినడుగు' అన్నారు ఆచార్యులవారు.

'కొండమీద స్వామి పలుకడు, ఉలకడు. నాకు జాబు రాసివ్వు, దాన్ని వెంకన్నకు చూపిస్తా!' ఆమె ముఖంలో అమాయకత్వం తొంగి చూస్తోంది.

విశ్వాసం గొప్పది. ఆర్ద్రమయింది ఆచార్యుల హృదయం. ఆమె వినతి అంగీకరించారాయన. జాబురాసిచ్చారు. కొండెక్కింది కొండి. పుష్కరిణిలో స్నానమాడింది. గోవింద నామ స్మరణతో ఆలయం చేరింది తడిబట్టలతో. దివ్యమంగళ విగ్రహం ముందు నిల్చుంది. విషయం చెప్పింది అర్చకులకి. చీటి ఇచ్చింది. అందుకున్నారు వాళ్ళు. ఏం చేయాలో తోచక పెరుమాళ్ళవైపు చూశారు.

ఉత్తరక్షణంలో చేయిచాపి తీసుకున్నాడు ఏడుకొండల వాడు. ఆ చీటి రాసింది తన ఆచార్యులు. ఆచార్యుల ఆజ్ఞను ఉల్లంఘించటమా? తీసుకోక తప్పింది కాదు స్వామికి.

'మోక్షం ఇచ్చాను' మాట వినపడింది. విమానం వచ్చింది. కొండి ఎక్కి కూర్చుంది. విమానం వెళ్ళిపోయింది.

అంతా రెప్పపాటు కాలంలో జరిగిపోయింది. సంభ్రమాశ్చర్య భరితులయ్యారు అర్చకులు.

ఒకరిది మూఢ భక్తి. వేరొకరిది పరభక్తి. పరజ్ఞాన పరమభక్తి. ఇద్దరి మధ్య ఉన్నవాడు జ్ఞాన, బల, ఐశ్వర్య, వీర్య, తేజస్సంపన్నుడు. కొండంత కరుణ గుండెలో నిండినవాడు. శరణాగత వత్సలుడు. నమ్మినవారికి నాశనం లేదని నిగ్గు తేల్చిన వాడు వేంకట రమణుడు.

'కొండి' ధన్య చరిత. పుణ్యచరిత.

చిత్రకథ - 5

# రామానుజ చిత్రకథ

అక్టోబరు సంచిక తరువాయి...




చెప్పమ్మా ఎవరు నువ్వు? నీ బాధేంటి? నన్నేం చేయమంటావు?
ఆ పిల్లమీద బ్రహ్మరాక్షసి ఆవహించింది. నీపాదం ఆమె తలపై పెడితే వెళ్ళిపోతుందట.
ఏమిటీ! నాపాదం ఆమె తలమీద పెట్టాలా?
మహానుభావా! నేను శాస్త్రాలు చదివాను. యాగాలు చేశాను. వేదసారాన్నెరిగిన పండితుణ్ణి. అదంతా ఒకనాటి మాట.
నా యజ్ఞం మధ్యలో విఘ్నమైంది. ఈ ఘోరరాక్షస జన్మ ఎదురైంది. అల్పజ్ఞులైన వేరెవరూ నా బాధ తీర్చలేరు. దైవానుగ్రహంకల నీ పాదస్పర్శ మాత్రమే నా పాపాలను పటాపంచలు చేస్తుంది. నే తరిస్తాను. నా తండ్రీ! నీ పాదధూళి నా శిరస్సున ధరించే భాగ్యం ప్రసాదించు. నన్ననుగ్రహించు. నేను వెళ్ళిపోతాను.


నువ్వెళ్ళావని నాకెలా తెలుస్తుంది?
నేను వెళ్ళిన వెంటనే ఆ రావిచెట్టు విరిగిపోతుంది.
ఊఁ...! పాదం ఆమె శిరస్సున పెట్టవయ్యా! చూద్దాం!


ఫెళ్...
ఫెళ్...
ఫెళ్...
ఫెళ్...
అమ్మా! తల్లీ!
ఏమిటిలా మూలుగుతోంది. చెమటలు పట్టి ఒళ్ళంతా ఇలా తడిసిపోతోంది.
కాస్త గాలి వీచండి.
నీళ్ళు ముఖాన చల్లండి.
అమ్మా...! నాన్నగారూ...!
నా తల్లీ... బంగారు తల్లీ....!
మా అమ్మాయికి పునర్జన్మనిచ్చావయ్యా! నా కుమార్తెను కాపాడావు. ఈ ఉపకారం ఈ జన్మలో మరువను మహానుభావా!
(ఇంకా ఉంది.)

# ఇంటిపోరు ఈశ్వరుడే తీర్చాలి

శ్రీమతి కరి తిరువేంగళమ్మ-విజయనగరం.

అబ్బబ్బ ఉన్నవాళ్ళు ఐదుగురే కాని ఒక్కసారి కూడా పడదు. ఎప్పుడూ దెబ్బలాటలే! పోనీ వీళ్ళని ఎలాగో సర్దుబాటు చేద్దామన్నా, అదిగో వీళ్ళకన్నా పెద్దవాడున్నాడా వాడు కూడా వచ్చి తగువులు మొదలు పెడుతున్నాడు. అబ్బబ్బ ఇల్లే పెద్ద రణరంగమయి పోయింది అంటూ పిల్లలమీద కేకలేస్తున్నారు, పక్కింటి అత్తయ్యగారు.

ఎందుకో నా మనస్సులో విషాదం అలుముకున్నది. ఈ రణరంగం ప్రతినిత్యం నాలోనూ జరుగుతున్నదనిపించింది. అలసటగా అలా సోఫాలో చాగిలపడి కనులు మూసేను అంతే ఏదో కలకలం.

**"సుప్రభాతా చ మే నిశా"** అనే సుప్రభాతం రావాలని వెంకటేశ్వర సుప్రభాతం చదుతున్నాను. శ్రీజిహ్వ (నాలుక) మంచిపిల్లే పాపం లోపల నుండి బయటకు సాగి, కాస్త నలుగురి దగ్గర మంచి  బాగానే సంపాదించుకుంటుంది. (ఒక్కొక్కప్పుడు 'నోరా-వీపుకి తేకే' అని విలపించే పరిస్థితి కల్పిస్తుందని కిట్టని వాళ్ళంటారు.)

బయటనుంచి వచ్చే వాటినన్నింటిని లోనికి సరఫరా చేసినా ఆరోగ్యాన్ని పెంపొందింప చేస్తుంది కూడా. చెడుపదార్థాలని లోనికి పంపి అవసరం లేనప్పుడు తన జిహ్వ చాపల్యంతో ఆహారాన్ని, లోనికి తోసేసి నన్నిబ్బంది కూడా పెడుతుంది. శ్రీ జిహ్వ అలిగిందంటే నాకు ఆరోజు పస్తే! శ్రీజిహ్వ బుద్ధిగానే ఉండి, నాకు సహకరిస్తోంది.

ఇంతలో పాణి! పాణి! (చేతులు) ఇద్దరూ పరుగుపరుగున వచ్చేరు. ఇద్దరూ కవలపిల్లలు ఒక్కలాగే ఉన్నారని ఒకేపేరు పెట్టుకున్నాం. ఒక్కక్షణం కూడా కదలకుండా ఉండరు. ఏదో ఒక అల్లరిపని చేస్తూనే ఉంటారు. సరే సుప్రభాతపఠనం అవుతూనే ఉన్నది. పిల్లలు ఒకలా ఉండడం లేదు. ప్రక్కనే ఉన్న అలమరలో ఏవేవో సర్దుతున్నారు. నాకూ వాళ్ళు చేస్తున్న పనివైపే ఆలోచన వెళుతోంది. ఇల్లుని ఎలా శుభ్రంగా ఉంచుకోవాలో ఇంట్లో అందరికీ ఒక క్లాసు తీసుకోవాలని నిర్ణయించుకున్నాను.

ఈలోపున శ్రీ జిహ్వ శ్రీశేషశైల వరకు చదువుకు వెళ్ళి పోయింది. అయ్యో ఇంతసేపూ నా చదువు ఆగిపోయిందే అని అప్పుడు గుర్తొచ్చింది. మళ్ళీ కళ్ళు మూసుకొని, మఠం వేసేను. 'సేవాపరాః' అంటూ మొదలు పెట్టేను.

శ్రీపాద 1, శ్రీపాద 2 (కాళ్ళు) బయటికి వచ్చేరు. పాణిద్వంద్వమే నయం కూర్చున్నచోటే ఉండి అల్లరి చేస్తున్నారు. వీళ్ళలాకాదే. లేచి నించొని కాస్త పెరటి వైపు తిరిగి, స్టూలెక్కి నుంచున్నారు. బాగా వంగుతున్నారు, లేస్తున్నారు. సరే నా సుప్రభాత పఠనం మళ్ళీ ఆగిపోయింది.

ఈసారి శ్రీజిహ్వ కూడా ఆగిపోయింది. ప్రక్కనే ఉన్న బాదంపప్పు నేను చూడకుండా నోట్లో వేసేసుకుంటోంది. అందరినీ మందలించాను. మళ్ళీ కూర్చొని శ్రీజిహ్వను లాగి, 'కందర్ప దర్పహర' అంటూ ప్రారంభించేను.

మన్మథమన్మథుని (శ్రీకృష్ణుడు) సౌందర్యాన్ని ఉపాసించాలి. అదే నా ధ్యేయమవ్వాలి. మనసులో ఆ సుందరాంగుడు కదలాడు తున్నాడు. ఏదో మధురానుభూతి మనసును పరవసింపచేస్తోంది. అసలైన హాయిని అందుకోబోతున్నాను... ఇంతలో అబ్బే శ్రీజిహ్వకూడా సహకరించడం మానేసింది. మాట తరువాత మాట రావడంలేదు. పోనీలే ఇవన్నీ ఇలా ఉన్నా పెద్దబ్బాయి 'మానస్' నా మాట బానే వింటున్నాడే! అనుకున్నా.

కానీ,ఇంతలో మానస్ (మనస్సు) కదలడం ప్రారంభించేడు. 'నాన్నా నాన్నా' 'శేష' అంటే గుర్తొచ్చింది. ప్రక్కవీధిలో శేషాద్రి మాస్టారున్నారు కదా! వాళ్ళ కుక్కపిల్ల తప్పిపోయింది నాన్నా' అంటూ ప్రారంభించాడు. అయ్యో మరి సుప్రభాతం కొనసాగలేదు.

సోఫాలో వాలి పడుకున్నానేమో మెడ ప్రక్కకు వాలి నొప్పి తెలిసింది. తెలివి వచ్చింది. అబ్బ, ఇదంతా కలా!

అబ్బబ్బ ఎన్ని అడ్డంకులు, అలాంటి సంతానం ఉంటే కష్టమే ననిపించింది. కాదు, కాదు, నేను రోజూ అనుభవించే క్షోభను భగవానుడు పిక్చరైజ్ చేసి చూపించాడు అనుకున్నాను.

నాలో ఒక నిస్సత్తువ ఆవరించింది. ఇంక నా మనసులో భగవదావిర్భావం జరుగనే జరుగదా! నాకు భగవదనుగ్రహం కలుగనే కలుగదా! ఇంతేనా **'క్షిపామి'** అని క్రిందక్రిందకు తోసేస్తాడా! ఇలా తలుచుకుంటూ కళ్ళనీళ్ళు పెట్టుకొని లోలోన కుమిలిపోతూ కూర్చున్నాను. జీవితం నిస్సారంగా అనిపిస్తోంది. ఇందిరాగాంధీని అంగరక్షకుడే అంతం చేసినట్లు నా ఇంద్రియాలు, నా మనస్సే నన్ను బాధిస్తూ ఉంటే ఇంకెవరు నన్ను రక్షిస్తారు?

అయ్యో! భగవానుడు, ఇంద్రియాలు, బుద్ధి, శాస్త్రాలను ఇచ్చాడు. అయినా ఏం లాభం? వాటిని పొందకుండా ఇలా తింటూ తిరుగుతూ బ్రతికెయ్యడమేనా? ఈ జన్మపరంపరా వలయానికి ఫుల్‌స్టాప్ పెట్టే అదృష్టం మరి నాకు లేదా! కన్నీరు ఆగడం లేదు. ఇంతలో ఎక్కడ నుండో ఒకవాక్కు వినపించింది. "ఉన్నది ఉన్నది, హృషీకేశుడు, హృషీకేశుడు" అంటూ మా చిన్నపాప పరిగెట్టు కుంటూ వచ్చింది. ఏమిటమ్మా హడావిడి, అంటూ మురిపెంగా అడుగుతోంది వాళ్ళమ్మ.

పదాలతో, 'అంత్యాక్షరి' ఆడుతున్నానమ్మా'. "ఊహూ" అనే పదం చెప్పింది సరళ 'హ'తో ఏముంటాయి, చిట్టి ఓడిపోయిందోచ్ అంటూ అందరూ చప్పట్లు కొట్టారు. కాని, నాకు నాన్నగారు చదివే నామం గుర్తొచ్చింది. 'హృషీకేశుడ'ని అబ్బబ్బ నేను గెలిచేసాను. అంటూ పరుగులు తీసింది.

ఒక్కసారి నాలో ఒక వెలుగువెలిగింది. నిజమే హృషీకేశుడే నా సమస్యను పరిష్కరించేవాడు. నా ఇంద్రియాలు వినవు. కాని ఆ ఇంద్రియాలకు అధిపతి అయిన హృషీకేశుడే నా ఇంద్రియాలనూ నియంత్రించాలి. ఎలా? పిచ్చిపిచ్చిగా ఉంది. సరే శరీరానికి గాలి, మనసుకు హాయి కలుగుతుందని ఒక లక్ష్యం లేకుండా బయటకు బయలుదేరేను.

అయోధ్యామైదానం, జనసమ్మిశ్రితమై ఉన్నది. మైకులో సుకుమార గళావిర్భావధ్వని తరంగాలు నాచెవిని సోకాయి. అసంకల్పంగా లోనికి నడిచాను. సీట్లన్నీ నిండిపోయి, వెనుక నించొని కొందరు వింటున్నారు. వారిని తోసుకుంటూ వాళ్ళ బుర్రలు మధ్యనుండి తొంగి స్టేజిమీదకు దృష్టిసారించాను. ఒక తేజోమూర్తి దర్శనమయింది. ప్రక్కవారిని అడిగేను ఆస్వామివారు ఎవరని, వాళ్ళు నన్నో వెర్రివాడిని చూసినట్లు చూశారు. అయ్యో రామ! శ్రీకాంత జీయరుస్వామివారిని ఎరుగవా? ఆయనెవరను కున్నావు 'దేవుడు' తెలుసా అంటున్నారు. సరేలే! ఎవరి నమ్మకాలు వారివి. కాని ఆ స్వామి ఏమి చెబుతున్నారో విందామని చెవులు సారించేను. ఆశ్చర్యంగా నా మానసిక మధనానికి సమాధానం చెబుతున్నారు.

"భగవానుడు భగవద్గీతలో చెప్పేడు **'మమ మాయా దురత్యయా'** నా మాయదాటలేనిది. అని మాయ అంటే ప్రకృతి. ఈ ప్రకృతి సంసర్గం వలన మన ఇంద్రియాలు కూడా మనమాట వినవు. పరిష్కారం కూడా ఆయనే చెప్పేడు. **'మామేవ యే ప్రపద్యన్తే మాయామేతాం తరన్తి తే'** నన్నే ఆశ్రయించి, ఆ మాయను అధిగమించు. కొందరు ధనవంతులు ఇళ్ళల్లో ఖరీదైన కుక్కలు ఉంటాయి. వాటి నుండి మనని మనం కాపాడుకోలేం. ఆ ఇంట్లోకి వెళ్ళాలంటే ఆ ఇంటాయననే కేకేసి బాబ్బాబు, మీ కుక్కను కాస్త అదుపు చేయవయ్యా! అని ప్రార్థించాలి.

అలాగే, ఈ ప్రకృతి ఆ స్వామిది. ప్రకృతి సంబంధం వలన వచ్చిన ఇంద్రియాల దౌష్ట్యాన్ని మనం పోగొట్టుకోలేం. ఆ హృషీకేశుడే తొలగించాలి. అయితే ఆ స్వామి మన ఇంద్రియాలను, ఎందుకు కంట్రోలు చేయాలి? అనుకుంటున్నారా మీరు ఓంకారాన్ని జపిస్తారు కదా! అ,ఉ,మ, అనే మూడక్షరాలు కలసి ఓం అవుతుంది. 'అ' అంటే నారాయణుడు. 'మ'అంటే జీవుడు. 'ఉ'అంటే వానికి చెందిన వాడు అని అర్థం. అందువలన జీవుడు పరమాత్మ సొత్తు. ఆయన యజమాని. ఎవరి ఆస్తిని వారు బాగు చేసుకోరా! ఆ విధంగానే స్వామి మనను బాగు చేసుకుంటాడు. మన ఇంద్రియాలను నియంత్రిస్తాడు. మీరు చేయవలసిన పనల్లా ఒక్కటే 'స్వామీ నేను నీ వాడనయ్యా! నన్ను బాగుచేసుకొనే పూచీ నీదే అని భారాన్ని స్వామిపై పెట్టడమే" ఇలా ఇంకా చెపుతున్నారు...

నా ప్రశ్నకు శ్రీకాంతజీయరు ఇంత చక్కగా సమాధానం ఎలా చెప్పేరు! సరిగ్గా నేను వచ్చేసరికి, ఆ టాపిక్ చెప్పడం, కాకతాళీయమా, దివ్యశక్తా! ఇలా ఆలోచిస్తున్నాను. ఇంతలో ఒకరిద్దరి మాటలు నా చెవులను తాకాయి!! ఏ విషయంలోనైనా నాకు సందేహమొస్తే చాలు, మరెలా తెలుస్తుందో ఏమో, స్వామివారు, టి.వి. ప్రవచనంలో సమాధానం చెబుతారు. తెలుసా అంటోంది ముద్దబంతిపువ్వులాంటి ఒక అమ్మాయి.

నక్కపుట్టి మూడాదివారాలయిందని, నీకేం తెలుసులేమ్మా! ప్రతివాళ్ళు అలాగే భావిస్తున్నారు. అందరి ప్రశ్నలకు సమాధానాలు ఆ ప్రాతఃకాలంలో టి.వి.లో నుండి స్వామి ఇస్తూనే ఉంటారని నీకు తెలియక వింతగా చెబుతున్నావు! అంటోంది ఒక ప్రౌఢ.

వారి ప్రవచనాన్నే మనసులో స్మరిస్తూ నిశ్చింతగా ఇంటికి చేరుకున్నాను. అప్రయత్నంగా...

**జిహ్వే కీర్తయ కేశవం మురరిపుం చేతో భజ శ్రీధరం**
**పాణి ద్వంద్వ సమర్చయాచ్యుత కథాః శ్రోత్రద్వయత్వం శృణు**
**కృష్ణం లోకయ లోచనద్వయ హరే ర్గచ్ఛాంఘ్రియు గ్మాలయం**
**జిఘ్రఘ్రాణ ముకున్ద పాదతులసీం మూర్ధన్ నమాధోక్షజమ్**

అంటూ నా పెదవులు ఉచ్చరిస్తున్నాయి.

e

# గీతాజయంతి

f

**ఈ నెల 6వ తేదీన విజయనగరంలో జరుగుతున్న సదర్భంగా**

ఈ కలియుగానికి ముందు గడిచిన ద్వాపర యుగం చివరలో జరిగిన ఉపదేశమే ఈ భగవద్గీత. అర్జునుణ్ణి వ్యాజంగా పెట్టుకొని శ్రీకృష్ణుడు లోకాని కంతటికి అందించిన మహోపదేశం ఈ భగవద్గీత.

నిత్యజీవన సమరంలో ఏపని చేయాలో, ఏదిమానాలో నిర్ణయించుకోలేని సందిగ్ధస్థితి ఏర్పడినప్పుడు, విషాదంలోపడి కర్తవ్యాన్ని గుర్తించలేని మనిషికి, విశ్వసించి ఆశ్రయిస్తే కర్తవ్యాన్ని ఆదేశించి, దిశానిర్దేశం చేసి విజయపథంలో నడపగలిగే ఉత్తమోత్తమమైన ఉపదేశం ఈ గీత.



"తింటే గారెలు తినాలి-వింటే భారతమే వినాలి" ఆ మహాభారతమే సుమారు 5000 సం॥లకు పూర్వం జరిగిన చరిత్ర కథ. కౌరవులకు పాండవులకు మధ్య జరిగిన యుద్ధానికి పేరు మహాభారత యుద్ధం. ఈ యుద్ధంలో 18 అక్షౌహిణీల సైన్యం పాల్గొన్నది.

**1 అక్షౌహిణీ అనగా:** సుమారు 21,870 రథాలు, 21,870 ఏనుగులు, 65,610 అశ్వాలు, 1,09,350 పదాతి దళం.

అంటే ప్రతీరథంలో ఇద్దరు మనుషులు, ప్రతీ ఏనుగుపైన ఇద్దరు, ప్రతీ అశ్వంపైన ఒకవీరుడుంటాడు. సుమారు 27,55,620 మంది మనుషులు+జంతువులు ఒక్క అక్షౌహిణి. ఇలాంటివి 18 అక్షౌహిణీలన్న మాట.

ఈ యుద్ధానికి ముందే వేదవ్యాస మహర్షిద్వారా ధృతరాష్ట్రుడు యుద్ధక్షేత్రంలో జరిగేది జరిగినట్లు వినటానికి సంజయునికి దివ్యదృష్టిని ఇప్పించాడు.

యుద్ధరంగంలో ఇరుపక్షాలలో చేరియున్న బంధువులను చూచి అర్జునునికి మనస్సుమారి యుద్ధం వద్దనిపించింది. ఆ అర్జునుని కార్యోన్ముఖుని చేయడానికి శ్రీకృష్ణుడు చేసిన ఉపదేశమే భగవద్గీత. ఇది చేసినది "మార్గశీర్ష శుక్లపాడ్యమి" రోజు.

యుద్ధం ప్రారంభమైన 11వ రోజు భీష్మాచార్యులు యుద్ధరంగంలో కుప్పకూలిపోయారు అనే సమాచారం చేరింది ధృతరాష్ట్రునికి.

సాక్షాత్తు శ్రీకృష్ణుని కూడా నిలబెట్టగలిగే శక్తి కలిగినవారు భీష్మాచార్యులు. అటువంటి భీష్మాచార్యులు నేలకూలిపోయారనే వార్త విని ధృతరాష్ట్రుడు కృంగిపోయాడు. పాండవులకి, కౌరవులకి ఆయనంటే ఇష్టమే కదా! ఇద్దరిలో ఎవరూ వారిని కొట్టాలనుకోరు కదా! ఏం జరిగి ఉంటుందా! అని సంజయుణ్ణి పిలిపించాడు ధృతరాష్ట్రుడు.

"అసలేం జరిగిందయ్యా! మావాళ్ళకి, పాండవులకీ కూడా భీష్ముడంటే అపరిమిత మైన గౌరవం ఉంది కదా! మరి వీళ్ళంతా ఉండగా ఆయనెల పడిపోయారు? ఏం చేస్తున్నారు వీళ్ళంతా – 'కిమ కుర్వత' అని ప్రశ్నించాడు ధృతరాష్ట్రుడు.

ఆ ప్రశ్నకి సమాధానంగా సంజయుడు యుద్ధ ప్రారంభానికి ముందు శ్రీకృష్ణుడు చేసిన గీతోపాదేశాన్ని, యుద్ధరంగంలో జరిగిన విషయాన్ని వివరించాడు. ఆనాడే మన దాక గీత అందింది. అదే **"మార్గశిర్ష శుక్ల ఏకాదశి."**

శ్రీకృష్ణుడు యుద్ధరంగంలోనే గీతోపదేశం చేసినా, అక్కడ 18 అక్షౌహిణీల సైన్యం ఉన్నా, ఒక్క అర్జునుడు తప్ప అక్కడ జరిగే సన్నివేశాన్ని వినగలిగే స్థితిలో ఎవ్వరూ లేరు. కారణమేమిటంటే అందరి ఇంద్రియాలను తన ఆధీనంలో ఉంచుకున్నవాడు శ్రీకృష్ణుడు, ఆయన హృషీకేశుడు కనుక. (హృషీకములు అనగా ఆనందించునవి, ఆనందింపచేయునవి. ఈశుడు వాటిని తన ఆధీనంలో ఉంచువాడు.) అందుకే ఆయన ప్రభావంచేత ఉపదేశం చేసినంతసేపు యుద్ధక్షేత్రంలోనివారంతా నిశ్చలంగా ఉండి పోయారు. అందుకే ఎటువంటి ఆటంకములు లేకుండా ఒక్కఅర్జునుడు మాత్రమే శ్రీకృష్ణుని ఉపదేశం వినగలిగాడు.

ఈ నెల, డిసెంబరు 6వ తేదీ "గీతా జయంతి". కనుక మనమందరం ఆ గీతను చదువుతూ భగవంతుని అర్చించి, భగవద్గీతను ఆదరించి తరిద్దాం.



# శ్రీరామాయణము



ఎ. ఉషశ్రీ- శ్రీరాంనగర్

*(గత సంచికలో....)*

కాశ్యప ప్రజాపతి వంశానికి చెందిన వినతకు ఇద్దరు సంతానం. గరుడుడు, అరుణుడు. అరుణునికి శ్యేని వలన పుట్టిన వారం మేం ఇద్దరం సోదరులం. సంపాతి అనే మరోపక్షి నా అన్నగారు. రామా! నన్ను జటాయువు అంటారు.

**ఇదం దుర్గం హి కాంతారం మృగరాక్షస సేవితం ।**
**సీతాం చ తాత! రక్షిష్యే త్వయి యాతే సలక్ష్మణే ॥**

క్రూరమృగాలతో, రాక్షసులతో నిండిన ఈవనం చాలా నిబిడమైనది. ఎప్పుడైనా నీవు, లక్ష్మణుడూ ఒంటరిగా సీతని వదిలి అడవిలో సంచరించవలసి వస్తే ఆ సమయంలో సీతమ్మను నేను కాపాడుతూ ఉంటా" అని ధైర్యం చెప్పింది.

రామునికి జటాయువు మాటలు వినగానే తండ్రిని చూసినంత ఆనందం కలిగింది. జటాయువును కౌగలించుకొని అతడిచ్చిన ధైర్యానికి కృతజ్ఞతను అర్పించుకున్నాడు.

అడవిలో తిరిగిన యిన్నిరోజులలో సీతను ఎప్పుడూ ఒంటరిగా వదలి వారు ఉండలేదు. ఇద్దరిలో ఒకరు రక్షిస్తూ ఉండేవారు. కానీ, ఈవేళ జటాయువు అన్నమాటను నిలబెట్టాలంటే తాము ఇరువురూ సీతను వదిలి వెళ్ళే పరిస్థితి కల్పించుకోవాలి. చూడండి! మనం కోరే సేవలు ఎంత అందంగ ఉంటాయో సీతమ్మకు అలాంటి ఒంటరితనం కల్పిస్తే తప్ప జటాయువుకి సేవచేసే అవకాశం రాదు. అలా అవకాశం కల్పిద్దామని ఓ సన్నివేశం తయారు చేసేసరికి పదినెలల కాలం నానా అగచాట్లు వారందరూ పడవలసి వచ్చింది. సరి.

పంచవటి దగ్గర సుమారు రెండున్నర సం॥ శ్రీరాముడు నివసించాడు. ఆ తరువాత శూర్పణఖ రావడం, ఖరదూషణ వధ జరగడం, శూర్పణఖ రావణాసురుని దగ్గరకు వెళ్ళి ప్రేరేపించడం, మారీచుడి సహాయాన్ని తీసుకొని రావణుడు పంచవటి చేరడం, మాయలేడి మోహంలో పడ్డ సీత, లేడికోసం, రాముణ్ణి పంపడం, రాముడి బాణపు దెబ్బతిన్న మారీచుడు పిలిచిన పిలుపులకి మోసపోయి లక్ష్మణున్ని కఠినోక్తులతో సీతమ్మ నిందించి రామునికోసం పంపడం, ఇంతలో రావణాసురుడు భిక్షురూపంలో సీతమ్మ దగ్గరకు చేరడం, మాటలతో సీతమ్మను భయపెట్టి తనరథంలో బలవంతగా పారవేసి ఆకాశంలోకి ఎగరడం... ఇవన్నీ జరిగిపోయాయి. లక్ష్మణున్ని రాముని అన్వేషణకి పంపడం తప్పయిందని సీతమ్మ గ్రహించేసరికే జరగవలసినదంతా జరిగిపోయింది. కనిపించిన వాటినల్లా 'శ్రీరామునితో రావణుడు తనను ఎత్తుకు పోతున్నాడని చెప్పమని' ప్రార్థన చేసింది. కానీ, అప్పటికే రథం ఆకాశంలో ముందుకు సాగిపోతోంది. ఇంతలో కునికిపాట్లు పడుతున్న జటాయువు ఓ చెట్టుకొమ్మపై కనిపించింది.

**జటాయో! పశ్య మామార్య! హ్రియమాణా మనాథవత్ ।**
**అనేన రాక్షసేంద్రేణ కరుణం పాపకర్మణా॥** *(అరణ్య 39-49)*

'హే పూజ్యుడా! జటాయో! పాపాత్ముడైన ఈ ఘోరరక్కసి రావణుడు నన్ను అనాధను చేసి లాక్కుపోతున్నాడు!'

అంటూ కేకలు వేసింది సీతమ్మ. వయోభారంతో కునికిపాట్లు పడుతున్న జటాయువు హఠాత్తుగా మేల్కొన్నాడు. రావణుడిని మంచిమాటలతో సీతాపహరణ ప్రయత్నం నుండి మాన్పిద్దాం అనుకున్నాడు. తన పరిచయం చేసుకున్నాడు. రాముని పరిచయం చేశాడు. 'నీవు రాజువై ఉండి ఇలాంటి పాడుపనులు చేయడం తగద'ని చెప్పాడు. కామం కళ్ళు కప్పిన రావణాసురునికి జటాయువు చెప్పిన హితవాక్యాలు చెవికెక్కలేదు. ఇతను ఇలా మెత్తని మాటలతో మానడని గుర్తించిన జటాయువు, 'నేను వృద్ధుడిని. నీవు యువకుడివి. పైగా వాహనంపై ఆయుధాలు, కవచాన్ని ధరించి ఉన్నావు. అయినా నీవు సీతను తీసుకొని, నేను చూస్తూ ఉండగా, పోలేవు జాగ్రత్త! చేతనైతే యుద్ధం చెయ్యి. నిన్ను మట్టిపాలు చేస్తా జాగ్రత్త! అని జటాయువు ఎన్ని రకాలుగా చెప్పినా రావణుడు వినేరకం అయితే కదా!

ఆ వయస్సులో జటాయువు రావణునితో శక్తికి మించి యుద్ధం చేసింది. రావణుని బాణాలను ఆకాశంలో ఎగుర కొట్టింది. తన గోళ్ళతో, కాళ్ళతో ఒళ్ళంతా తూట్లు పొడిచింది. రావణుడు వదిలే నిశితము, అతిక్రూరమైన బాణాలను ఏమాత్రము లెక్కచేయలేదు. సీతమ్మ శోకాన్ని తగ్గించాలనేదే జటాయువు లక్ష్యం.

ఒక్కసారి రావణునిపై దూకి ధనస్సుని విరుగగొట్టింది. బాణాలను ఎగురగొట్టింది. మరో ధనస్సు తీస్తే దానికీ అదే గతి పట్టించింది. రథం మీదికి దూకి రథాన్ని నడిపే పిశాచ ముఖాలు కలిగిన కంచరగాడిదలను చంపి పారవేసింది. రథాన్ని కూడా చివరకు ముక్కలు ముక్కలు చేసేసింది. ఛత్రాన్ని, చామరాలను

కూలద్రోసింది. వాటిని పట్టుకున్న రాక్షసులను, సారథిని చీల్చి పారవేసింది. అంత గొప్ప రావణుడూ చేతకాని వాడయ్యాడు. ఆకాశంలో నివసించే పక్షులన్నీ జటాయువుని ఎంతో శ్లాఘించాయి. జటాయువు ఒక్క నిమిషంలో తేరుకునే లోపే విరిగిపోయిన రథంలో నుండి సీతమ్మను తన భుజంపై వేసుకొని రావణుడు ఒక్కసారి ఆకాశంలోకి ఎగిరిపోయాడు. తన మాయాబలంతో పారిపోవాలనుకున్నాడు.

మళ్ళీ జటాయువు రావణాసురునికి హితం చెప్పి చూసింది. "మృత్యువుని కౌగలించుకొని పారిపోయే పిరికివాడా! చేతనైతే యుద్ధం చెయ్యి" అంటూ పారిపోయే రావణాసురుని వెంటపడి తన కాళ్ళతో వాడి వీపుని గట్టిగా అదిమిపట్టింది. చివరకు కాళ్ళతో తన్నుతూ ఉంటే, ఇక ఏమి చేయాలో తోచని రావణుడు మాయాశక్తిని ఆశ్రయించాల్సి వచ్చింది. తన కత్తితో ఆ పక్షి రెక్కలను తెగనరికి సీతను తీసుకొని పారిపోయాడు.

మారీచ సంహారం తరువాత లక్ష్మణుడితో పాటు తిరిగి వచ్చాడు రాముడు తన కుటీరానికి. కానీ, ఆశ్రమంలో జరిగినదేమిటో రామునికి అర్థం కాలేదు. ఇది రాక్షసమాయ అని మాత్రం తెలిసింది. సీతని వెతుక్కుంటూ రామలక్ష్మణు లిద్దరూ కుటీరాన్ని వదిలేసి అడవిలోకి బయలు దేరారు. వెతకని చోటులేదు. సృష్టిని నాశనం చేసేద్దామన్నంత కోపం వచ్చింది రామునికి. లక్ష్మణుని ప్రార్థనతో ఎలాగో కోపాన్ని ఆపుకుని ధనస్సుని సంధించి సీతాన్వేషణలో ముందుకుసాగాడు. ఇంతలో, రక్తసిక్తమైన జటాయువు వారికి కనిపించింది.ఎవరో రాక్షసుడు ఈ వేషంలో సీతను మ్రింగి ఉంటాడని రాముడు భావించాడు. దానిమీదకి బాణాన్ని సంధించాడు కూడా. పాపం! జటాయువు మాటరాని స్థితిలో పడి ఉంది. నోటి నుండి రక్తంతోపాటు నురుగలు కక్కుతోంది. అయినా, తనని చంప నుద్యమించిన రాముణ్ణిచూచి జాలివేసింది. 'పాపం! ఇతను సీతాశోకంలో కృత్యాకృత్య వివేకాన్ని కోల్పోయాడు. సీత దొరకేవరకు ఇతణ్ణి ఆయుష్మంతునిగా ఉంచడం పెద్దవానిగా నా బాధ్యత. ఇతనికి తప్పకుండా మంగళాశాసనం చేయాలి' అనుకున్నాడు. రాముడు తనని పితృసఖుడిగా గౌరవించి నందుకు తండ్రిలాగ రాముడికి హితాన్ని కల్గించడం నా బాధ్యత అనుకున్నాడు జటాయువు.

**యా మోషధిమి వాఽయుష్మన్! అన్వేషసి మహావనే ।**
**సా దేవీ మమ చ ప్రాణా రావణేనోభయం హృతమ్ ॥**
**... ... ... ...**
**రక్షసా నిహంత పూర్వం న మాం హంతుం త్వమర్హసి॥**

'ప్రాణంతో కుదురులేని ఓ రామా! నీవు కుదుట పడటానికి సీత అనే ఔషధం కావాలి. దానికోసం నీవు వెదుకుతున్నావు. నా ప్రాణాలను, ఆ సీతను రావణాసురుడు తీసుకుపోయాడయ్యా! వాడిని అడ్డగించి నేను యుద్ధం చేశా! వాడిని చికాకు పరచిన నన్ను రెక్కలు కోసి, పారిపోయాడు. నేను విరక్కొట్టిన వాడి రథం ఇదిగో! ముక్కలు చేసిన ధనస్సు, చీల్చిపారవేసిన సారథి, వాడి గుఱ్ఱాలు చూడక్కడ! వాడి ఛత్రం, చామరం అవిగో! ఇంతవరకే నేను చేయగలిగా! ఈ స్థితికి దిగజారా! చావడానికి సిద్ధంగా ఉండే నన్ను ఇంకేమి చంపుతావయ్యా!' అన్నాడు. తన తొందరపాటు తనానికి సిగ్గుతో ముడుచుకుపోయాడు రాముడు. బాణం అవతల పారవేసి జటాయువును అమాంతం కౌగలించుకున్నాడు. జరిగినది విని భోరుమన్నాడు. 'నా దౌర్భాగ్యం నిప్పును కూడా కాల్చి పారవేస్తుంది' అన్నాడు.

'రాజ్యం పోయి, అడవి పాలై, సీతను పోగొట్టుకొని, చివరకు నమ్ముకున్న పితృసమానుడైన ఈ జటాయువుని కూడా దూరం చేసుకుంటున్నానే. ఛీ! ఎందుకు బ్రతికి? సముద్రంలో ప్రాణం తీసుకుందామని దూకినా, నా దౌర్భాగ్యానికి, ఆ సముద్రంకూడా ఎండిపోతుంది' అంటూ గిలగిల లాడిపోయాడు.

దుఃఖంలోనుండి కొంతసేపటికి తేరుకున్న రాముడు, జటాయువు చూపిన సాహసాన్ని గురించి హృదయం పిండివేసే శోకంతో లక్ష్మణునితో చెప్పుకున్నాడు. రాముడు జటాయువును నిమిరి, 'ఎందుకు ఆ రాక్షసుడు సీతను ఎత్తుకు పోవలసి వచ్చింది? ఎవడు వాడు? చెప్పవా!' అని అడిగాడు. కృశించి పోయే స్వరంతో, 'రావణుడు సీతను దక్షిణదిశగా ఎత్తుకుని పారిపోయాడు. అలసిపోయి ఉన్న నా రెక్కలను మాయోపాయంతో తెగకోశాడు. ప్రాణాలు పోతున్నాయి. కళ్ళు తిరుగుతున్నాయి. చెట్లన్నీ బంగారంలా కనిపిస్తున్నాయి. కానీ, రామా! ఒక్క విషయం, రావణుడు సీతను తీసుకువెళ్ళిన ముహూర్తం "విందా" అనేది. ఈ ముహూర్తంలో ఏ వస్తువునైనా కోల్పోతే దాని యజమాని ఆ వస్తువుని తిరిగి పొందుతాడు. అంచేత సీతను నువ్వు తప్పకుండా పొందుతావయ్యా! బుద్ధిమాలిన రావణుడు ఆ ముహూర్తాన్ని గమనించలేదు, కనుక వాడు తప్పకుండా నశిస్తాడు. సీతను గురించి నీవు బెంగ పెట్టుకోకు. తప్పకుండా ఆమెను పొందుతావు' అంటూండగానే నోట్లోనుండి మరింత రక్తాన్ని కక్కుకున్నాడు. రామా "కుబేరుడి సోదరుడు, విశ్రవసుడి కొడుకు ఈ రావణుడు"... అంతే, జటాయువు తల వాలిపోయింది. కాళ్ళు చాపి నేలమీద వాలిపోయాడు. తనకోసం ప్రాణాలొదిలిన జటాయువుని తలచు కుంటూ రాముడు పొందిన శోకం వర్ణనాతీతం. సీతాపహరణం కంటే జటాయువు మరణమే రాముణ్ణి బాగా కృంగదీసింది. *(ఇంకా ఉంది)*

నారాయణముని కథలు - 3

# తనువొకచోట - మనస్సొకచోట

- శ్రీశ్రీశ్రీ అహోబిలరామానుజ జీయర్ స్వామివారు

మధువును త్రాగాలనే కోరిక గల తుమ్మెద పుష్పాలు ఉండే చోటుకు ప్రవేశించి, ఆ పుష్పాలనే ఆశ్రయిస్తుంది. అలాగే బ్రహ్మ విద్యను పొందగోరిన వారు గురుకులానికి వెళ్ళి ఆచార్యులను ఆశ్రయిస్తారు. పుష్పంలో తేనె పరిమితంగా ఉంటుంది. తుమ్మెదకు కావలసిన మధువు ఒక పుష్పం వద్ద లభించదు. అందువల్లే అది అనేక పుష్పాలను ఆశ్రయిస్తుంది. సద్గురువు వద్ద మనకు లభించే జ్ఞానము అపారము. ఆ జ్ఞానాన్ని ధరించే శక్తి మనకి ఉండాలి తప్ప, ఆచార్యుని వద్ద జ్ఞానము అనే మధువు తరగటమనేది లేదు. అలాంటి సద్గురువు మన నారాయణ ముని, వారి వద్ద ఎందరో విద్యను అభ్యసిస్తున్నారు. కేవలము వారికి బ్రహ్మ విద్యను ఉపదేశించటమేకాక, వారు ఎంతవరకు ఆ విద్యను ధరించారో వారి మనస్థితిని గ్రహించగలిగే త్రికాలవేత్త మన నారాయణముని.

నారాయణముని వివరించే రహస్యాలను శ్రద్ధతో వినేవారు విద్యార్థులు. విన్నదానిని అందరూ స్మరించేవారు. అటు తరువాత ఆతత్త్వాన్ని ధ్యాన నిష్ఠులై దర్శించేవారు. ఒకరోజు ఆ పవిత్రమైన ఆశ్రమంలో ఒక్కొక్క విద్యార్థి ఒక్కొక్క చెట్టు క్రింద కూర్చొని ధ్యానమును చేస్తున్నారు. ధ్యానమును ముగించుకొని విద్యార్థులు సాయంత్రము నారాయణముని సమీపానికి చేరుకున్నారు. సర్వజ్ఞులైన ఆచార్యులు అందరినీ ఒకసారి చూచి మునికుమారుని ప్రశ్నించారు.

**నారాయణముని:** ఏమి! నాయనా నీ ధ్యానము బాగా సాగినదా!

**మునికుమారుడు:** ఓ! చాలా బాగా.

**నారాయణముని:** నిజంగానే, సరిగ్గా గుర్తుచేసుకో!

**మునికుమారుడు:** నేను మంత్రాన్ని జపిస్తూనే ఉన్నా! ఆచార్యా!

**నారాయణముని:** నీవు మంత్రము చెపుతున్నా ! నీ మనస్సు తెలుసుకోవాల్సిన పరమాత్మపై లేదు.

**మునికుమారుడు:** అదీ... నేను ధ్యానము చేస్తుంటే మన గోపాలుడు కూర్చొన్న చెట్టు క్రింద ఏదో శబ్దం వినపడితే అటు ఇటు చూసా ! అప్పటినుండీ ఏమిటా శబ్దం అంటూ చూసా! అంతే! స్వామి.

**నారాయణముని:** అది చాలు నాయనా! మనం భ్రష్టులం కావటానికి! "మనఏవ మనుష్యాణాం కారణం బంధమోక్షయో" అన్నట్లు మనం చిక్కులలో చిక్కుకోవటానికి, మన బంధాలు తొలగటానికీ మనస్సే కారణము. ఎంతటి విద్యావంతుడైన ఈ మనస్సు వలననే అనర్థాలను పొందుచున్నాడు.

**మునికుమారుడు:** మనస్సువలన ఎలా ఆచార్యా! కాస్త వివరింగా చెప్పరా!

**నారాయణముని:** అయితే మీ అందరికీ అర్థమయ్యేలా ఒక కథ చెపుతాను, వినండి!

అది ఉజ్జయినీ రాజ్యము. ఆరాజ్యములో ఎందరో పండితులున్నారు. వారందరిలోకి వేద విద్యను అభ్యసించిన విశ్వనాథుడు అను విప్రుడు చాలాగొప్ప పండితుడిగా ఉండేవాడు. అతని ధర్మనిరతికి అందరూ దాసోహమయ్యేవారు. ప్రతిరోజు నిత్యాగ్ని హోత్రాన్ని చేసేవాడు. ఈ స్వామి ఇంటి ముందే ఒక వేశ్య నివాసము. అది తెలిసిన ఈ విప్రుడు ఆమెవంక కన్నెత్తి అయినా చూసేవాడు కాదు సరికదా చాలా అసహ్యించుకునేవాడు. కొంత కాలము గడిచాక ఒక రోజు ప్రమాద వశమున ఆ వీధిలోని ఇండ్లు అగ్నికి ఆహుతి అయి అందరూ శరీరాన్ని విడచిపెట్టారు.

యమభటులు ఈవిప్రుని నరకానికి తీసుకు పోతున్నారు. దేవతలు వేశ్యను స్వర్గానికి తీసుకు వెళ్తున్నారు. చూచాడు విప్రుడు. ఒక్కసారి మండిపడ్డాడు యమభటులపై. 'ఏమయ్యా! నిరంతరం వేదాన్ని అధ్యయనం చేసే నన్ను కాదని దేవతలు ఆ వేశ్యను స్వర్గానికి ఎందుకు తీసుకుపోతున్నారో నాకు చెప్పండి' అని నిలదీశాడు విప్రుడు? స్వామీ మీరు పూజ్యులే. అందులో ఏమీ సందేహం లేదు. కానీ, మీరు చేసిన నేరము మీకు తెలియనిది కాదు. మీరు రోజు వేదాధ్యయనము చేసేవారే, కానీ వేదం ద్వారా పరమాత్మ తత్త్వాన్ని తెలుసుకోక ఆ వేశ్య గృహానికి ఎవరెవరు వస్తున్నారో అంటూ మీ మనస్సంతా అక్కడే లగ్నమయినది. అందుకే ఆ వేశ్యాస్త్రీ చేసిన పాప ఫలాన్ని నీవు అనుభవించాల్సి వస్తున్నది అని సమాధానాన్ని ఇచ్చారు యమ భటులు. సరే నా మనస్సు చేసే పనియందు లేదు. మరి ఆ వేశ్య చేసినది తప్పుగాదా! తాను చేసే తప్పులకు నాకన్నా ఘోరమైన నరకం రావాలి కదా ! ఎందుకు ఆమెకు నరకము రాలేదు అని ప్రశ్నించాడు విప్రుడు. ఆమె శరీరంతో చేసినది తప్పే, కానీ ప్రతిరోజూ నీవు చదివే వేదమంత్రాలను శ్రద్ధతో వినేది. అంతే కాదు నీలాంటి మహనీయుని గృహముముందు

ఉండే అవకాశము భగవంతుడు లభింపచేసాడని, నియమనిష్ఠలు కల నిన్ను దర్శిస్తే చాలు సకలపాప నిర్మూలమని ప్రతిరోజు నీకు నమస్కారము సమర్పించేది, చేసే కార్యము నీచమైనదైన తనమనస్సు మంచియందు, అందున భగవద్విషయమందు లగ్నం చేసినది. దాన్నే భావించినది. సంతోషించిన భగవంతుడు ఆమె పాపరాశిని తొలగించి, నీవు సంపాదించిన పుణ్యంతో దేవలోకాన్ని ఆమెకు బహుకరించాడు. ఉత్తమమైన భగవద్ స్మరణ చేస్తూ నీమనస్సు చెడు కార్యముల యందు ప్రవర్తించినది. అందుకే నీకు ఈ నరక సందర్శనము, నరకలోక ప్రాప్తి అని చెప్పారు యమ భటులు.

నారాయణముని బాగా విన్నారు కదా! పిల్లలు అందుకే భగవంతుని ధ్యాన, అర్చనాదులు చేయటమే కాదు, దాని యందు మనస్సు లగ్నం చేయాలి. అలా చేసిన వారినే మోక్షసామ్రాజ్యలక్ష్మి వరిస్తుంది. అలా కాక తనువు ఒక చోట మనస్సు ఒకచోట ఉన్నవారికి అనర్థములు, అపవాదులు తప్పవు అని పిల్లలకు ఉపదేశించాడు. ముని కుమారుడు తన తప్పును తెలుసుకున్నాడు. ఎక్కడో అరణ్యంలో తను చేసిన తప్పులను గుర్తించగల్గిన ఆచార్యుని జ్ఞాన సంపదకు ఆనందించాడు. ఇతని ద్వారా మిగిలిన విద్యార్థులకు కూడా జ్ఞానోదయం కల్గినది. ఆచార్యునికి అందరూ ప్రణమిల్లి సాయం సంధ్యానుష్ఠానములకు బయలుదేరారు.

## మెదడుకి మేత! సమాధానములు

1. ధ్యానమనే గొలుసుతో విష్ణువు అనే ఏనుగును
2. నిర్భరమైన హరిభక్తి
3. ఎవరైనా మద్యాన్ని సేవిస్తే మహాపాపం పొంది దుర్గతి పాలౌతారు.
4. సుమేధాదేవి
5. శ్రీకృష్ణ లీలామృతరసం.
6. ఇతరులు చేసే అపకారాలు మనకు ఉపకారాలుగా పరిణమిస్తాయి.
7. జీవులలోని అహంకారాన్ని తొలగించి, బాగుచేసి తరింప చేయమని ఆచార్యులు భగవంతుని ప్రార్థిస్తున్నట్లు
8. న గురోః అపర స్త్రోతా (యతిరాజ వింశతి)
9. విశుద్ధమైన మనస్సు.
10. కుశిక
11. బాణాసురుడు
12. వేదవాఙ్మయాన్ని జాగ్రత్తగ సంరక్షించేవాడు.
13. న జ భ జ జ జ ర
14. గోదోహన కాలం (ఒక్కసారి పాలుపితికేందుకు పట్టేకాలం)
15. పెరియాళ్వార్ తిరుమొజి
16. ఒకే నర్తకుడు అనేకమంది నర్తకీమణులతో నృత్యం చేయటం.
17. మనస్సు
18. ఇంద్రియాలవెంట మనస్సు వెళ్ళకుండా మనస్సు చెప్పినట్లుగా ఇంద్రియ ప్రవృత్తి ఉండేలా మనస్సుని చేసుకోవడమే!
19. ఇనుపముక్కను బంగారముగా మార్చుటవంటిది.
20. శైత్య, సౌరభ, మాంద్యాలు.
21. 1) వేదాధ్యయనమునకు, 2) గాయత్రీమంత్రోపదేశమునకు
22. శ్రీమన్నారాయణుడు
23. ప్రపత్తి, ప్రపన్నులు
24. 'పరాశు' పరమైన అశువులను 'రై ఆదానే' అనే ధాతువునుబట్టి తిరిగి రప్పించినవాడు. అది పరాశర.
25. శ్రీ విల్లిపుత్తూరు వటపత్రశాయి ఆలయగోపురం గుర్తు.
26. ఉన్న విషయాన్ని ఉన్నట్లుగా చెప్పేవాడు.

## భక్తినివేదన ప్రోత్సాహకులు

| | | | |
|---|---|---|---|
| 1. | ఆర్. శ్రీనివాసరావు | - హైదరాబాద్ | 10,116/- |
| 2. | డి.పి. సుబ్బారెడ్డి | - ప్రొద్దుటూరు | 10,116/- |
| 3. | వి. మహలక్ష్మి | - విజయవాడ | 10,000/- |
| 4. | చెరుకూరి మైత్రేయి | - విజయవాడ | 9,016/- |
| 5. | ఎస్. సుబ్రహ్మణ్యం | - రాజమహేంద్రి | 5,116/- |
| 6. | కె. యాదగిరాచార్యులు | - హైదరాబాద్ | 5,116/- |
| 7. | ఎన్.సిహెచ్.రామానుజం | - సికింద్రాబాద్ | 5,116/- |
| 8. | పిడికిటి సుగుణ | - విజయవాడ | 5,116/- |
| 9. | రఘుపతిరెడ్డి | - వెంకాయపల్లి | 5,100/- |
| 10. | పి.వి.కృష్ణారెడ్డి | - హైదరాబాద్ | 5,100/- |
| 11. | బి. కామేశ్వరి | - హైదరాబాద్ | 5,001/- |
| 12. | వి.వి.ఆర్.కె. శాస్త్రి | - గన్నవరం | 5,001/- |
| 13. | టి.వి.నరసింహాచార్యులు | - హైదరాబాద్ | 5,000/- |
| 14. | ఐ. సూర్యకళ | - పార్వతీపురం | 5,000/- |
| 15. | మేడా నరసింహులు | - హైదరాబాద్ | 5,000/- |
| 16.. | టి.ఎస్. లక్ష్మీబాయి | - హైదరాబాద్ | 5,000/- |

**వీరికి శ్రీస్వామివారు మంగళాశాసనములు చేశారు.**

# మన దర్శనం 'సు' దర్శనం

పూర్వమీమాంస
వైశేషిక
న్యాయ
యోగం
సాంఖ్య

వైశారదీ

*(గత సంచిక తరువాయి...)*

మన భారతజాతి వైభవానికి కారణం మన వైదిక సంపద. నేడు ప్రపంచం నలుమూలల నుండి అనేక వేలమంది జిజ్ఞాసువులు మనదేశం వైపు దృష్టి సారించడానికి కారణం మనకున్న ఆధ్యాత్మిక విద్య. మన ఇంద్రియాలకు అందని ఆత్మ, పరమాత్మ తత్త్వాలని గురించి తెలిపేదే ఆధ్యాత్మిక విద్య.

ప్రతి ప్రాణి హృదయ గుహలోనే ఉండే, ఈ రెండు తత్త్వాలూ కూడా బాహ్యేంద్రియాలకి అందేవి కానే కావు. మనకున్న ఐదు కర్మేంద్రియాలను, ఐదు జ్ఞానేంద్రియాలని కలిపి బాహ్యేంద్రియాలు అంటాం! ఎందుకంటే అవి ఎంతసేపు బాహ్యమైన ప్రవృత్తినే కలిగి ఉండి, బయటి వస్తువులనే అందుకో గలుగుతాయి తప్ప మన హృదయపు లోతులని తరచి చూడ లేవు. కారణం, నిర్మాణం(built in mechanism) లో లోపము. అది వాటి తప్పు కాదు, అంటుంది ఉపనిషత్.

భగవంతుడు కేవలము వాటిని బాహ్యానుభవం కలిగించడం కోసమే సృష్టించాడు. మన చుట్టూ ఉండే విషయానుభవం కలిగించడమే వాటి పని. పది ఇంద్రియాలు పది రకాల విషయాలవైపు ఒక్కసారే పరుగులు పెడుతూ ఉంటే మన గతి ఏం కావాలి?

అందుకే దయామయుడైన పరమాత్మ వీటితో పాటు వీటికి నాయకత్వం వహించి దగ్గరుండి సయోధ్యతో పని చేసేట్లు చూసేందుకు మరొక ఇంద్రియాన్ని కూడా అనుగ్రహించాడు. అదే మన మనస్సు. ఇది చాలా శక్తివంతమైనది. పది ఇంద్రియాలవెంట తానుంటూ, వాటికి సహకరిస్తూ, వాటి చేత చకచకా పనిచేయిస్తూంటుంది. ఈ మనస్సహకారం కనుక ఒక్కక్షణమైనా ఆగిపోయిందా పది ఇంద్రియాలూ నిలిచి పోవల్సిందే. వాటంతటవి ఒక్క విషయానుభవం కూడా పొందలేవు.

ఇంకా పరమాత్మ ఈ మనస్సుకిచ్చిన మరొక గొప్పశక్తి ఏమిటంటే ఇది ఆంతర ప్రపంచంలో కూడా పనిచేయగలదు. అందుకనే దీనిని **అంతరింద్రియము** అని దానికున్న ప్రత్యేకతని బట్టి పిలుస్తున్నాము. కేవలము అంతరింద్రియమైన మనసుకి మాత్రమే ఆత్మ, పరమాత్మలని గురించి తెలుసుకునే అవకాశం ఉంది. అది కూడా **"విశుద్ధ మనసా ఏవ గ్రాహ్యః"** అంటుంది వేదం. పరిశుద్ధమైన, మనసు చేత మాత్రమే గ్రహింపబడేవి ఈ ఆత్మతత్త్వము, పరమాత్మతత్త్వమూను.

అయితే పది బాహ్యేంద్రియాలకి నాయకత్వం వహించాల్సిన ఈ మనసుకి కూడా బాహ్య ప్రవృత్తి తప్ప ఆంతర ప్రపంచం వైపు తిరిగిచూసే తీరిక ఏది? మనస్సు ఏ ఇంద్రియంతో చేరి ఉంటే ఆ ఇంద్రియం మాత్రమే పని చేయ గలుగుతుంది. మనం చూడడం, వినడం, రుచి చూడడం వంటి పనులన్నీ ఏకకాలంలోనే చేసేయ గలుగుతున్నాం అని అనుకుంటాం కదా! కానీ అది నిజం కాదు.

మనస్సు కన్నుతో చేరి టి.వి చూస్తున్నప్పుడు, రసనేంద్రియంతో చేరి ఉండదు కనుక, రుచిని మనం గుర్తించనే గుర్తించలేము. అయితే ఈ మనస్సు వాయువు కన్నా వేగంతో మనం గుర్తించలేనంత వేగంగా ఆయా ఇంద్రియాలమధ్య పరుగుపెడుతూ ఉంటుంది కనుక, అన్ని పనులూ ఏక కాలంలో చేయగలుగుతున్నాం అని భ్రమ పడుతున్నాం!

ఇలా ఆంతరమైన ఆత్మ, పరమాత్మ తత్త్వాలని గుర్తించగలిగే అవకాశం ఉన్నా ఈ మనస్సు, పది ఇంద్రియాలూ, పదివైపులా, పదివిషయాలవైపు పరుగులు పెడుతూంటే, వాటికంటే వేగంగా అన్నిటినీ ఒక్క సెకనులోనే చుట్ట బెడుతూ, పనిచేయిస్తూ ఉంటుంది.

దానికి క్షణమైనా తీరిక ఉంటుందా పాపం! బయటి ఇంద్రియాలు అలసిపోయి నిద్రిస్తే తప్ప, మనసుకి తీరిక ఏది? ఆ నిద్రా సమయంలో కూడా మళ్ళీ వాటన్నిటినీ జాగ్రత్తగ తీసుకువెళ్ళి ఆత్మతోచేర్చి, శక్తివంతం చేయవల్సిందీ ఈ మనస్సేనని ఉపనిషత్ చెప్తోంది. లేస్తూనే మళ్ళీ బాహ్య విషయాలవైపు ఉరుకులు పరుగులు. లోపలి ప్రపంచం వైపు తొంగి చూసేదెప్పుడూ!?

అయితే మన ఋషులు, భగవంతుడిచ్చిన అద్భుత పరికరమైన ఈ మనస్సుకి ఉన్న అసాధారణ శక్తిని పూర్తి స్థాయిలో వినియోగించుకోవడం ద్వారా ఆత్మ, పరమాత్మలని దర్శించగలమని గుర్తించారు. చుట్టూ ఉండే విషయాలు తగ్గితే తప్ప ఇంద్రియాలు పరుగులు మానవని అరణ్యాలలో నివసించారు.

ఆంతర తత్త్వదర్శనానికై వీతరాగులై, జపతపాలతో మనస్సుని శుద్ధం చేసుకున్నారు. ప్రగాఢమైన వైరాగ్య భావనతో మనసుని తమ అధీనంలో ఉండేట్టుగ భగవంతుని ప్రార్థించారు. వేదాధ్యయనం చేశారు.

**"కారణం తు ధ్యేయః"** అని ఆ వేదం చెప్పినట్లుగ కారణ తత్త్వాన్ని గురించి పరిశోధించారు. "ఈ సకల చరాచర జగత్తుకి సృష్టి ప్రళయాలు ఏర్పడటానికి కారణం ఎవరు? జీవులకి నామ రూపాలు కల్పిస్తున్నదెవరు? ఏ ప్రయోజనాన్ని ఆశించి అలా చేస్తున్నారు? జీవులకి మేలు కలిగించడం కోసమా?, స్వార్థంతోనా? జీవులకి ఈ దేహంలో సుఖదుఃఖాది అనుభవా లకి కారణం ఏమిటి? జీవుడు దేహంతో ఉంటేనే సుఖమా? దేహబంధం తొలగితే సుఖమా? అసలు ఈ దేహం వదిలాక ఎక్కడ ఉంటాడు? ఎలా ఉంటాడు? వంటి అనేక ప్రశ్నలకి సమాధానాలని అన్వేషిస్తూ.. అనేక వేలసంవత్సరాల శోధన, పరిశోధనలతో **'తత్త్వ'**దర్శనం కావించారు. ఆ పై ధ్యానించారు.

తాము చేసిన సాధనలని, తత్ఫలితాలని పరస్పరము చర్చించుకున్నారు. ఆనాటి ఋషులలో ఏ ఇద్దరు కలిసినా చర్చించుకునే వారట. అందరూ కలిసి నేటి 'సెమినారులు వంటివి జరిపి ఆలోచించి నిర్ణయించేవారట. ఆ పరిశోధనా పూర్వక చర్చల సారాన్ని 'దర్శనాలు'గ అందించారు. 'దర్శనము' అంటే చూడడము అని అర్థం.

ప్రత్యక్షంగా అందని ఆత్మ, పరమాత్మ తత్త్వాలని కూడా వేదం ప్రతిపాదించిన విధంగా పరిశీలించి దర్శించారు. కనుకనే వారిని ఋషులు అంటాం! వారందించిన జ్ఞానాన్ని 'దర్శనము' అని వ్యవహరిస్తున్నాం! 'ఋషి' అంటే 'క్రాంతదర్శి' అని కూడా కదా అర్థం! రాబోయే తరాలవారికి ఉండే అల్ప ప్రజ్ఞ శక్తి సామర్థ్యాలని దృష్టిలో పెట్టుకుని, మన మీద వాత్సల్యంతో వారు దర్శించిన జ్ఞానాన్ని మనదాకా అందించే ప్రయత్నం చేశారు.

ఒక్కొక్కరు దర్శించిన విధానమును నిరంతరము విని, మననము చేసి ధ్యానించగలిగితే, మనకూ ఆత్మదర్శనము కలుగవచ్చును. పరమాత్మ దర్శనమూ లభించవచ్చు. "శ్రోతవ్యః శ్రుతి వాక్యేభ్యః, మన్తవ్యశ్చ ఉపపత్తిభిః, మత్వా తు సతతం ధ్యేయః ఏతే దర్శన హేతవః" – ఆ కారణతత్త్వాన్ని గురించి వేదము చెప్పినదానిని వినాలి, విన్న దానిని మననం చేయాలి, మననం చేసిన దానిని ధ్యానించాలి అని దార్శనికులందరూ ఏకగ్రీవంగా నిర్ణయించారు.

ఇలా వేద ప్రామాణ్యాన్ని అంగీకరించి వేదానుగుణమైన తర్కంతో నిర్ణయించిన విషయాలు ఓ ఆరు దర్శనాల రూపంలో మనకి అందాయి. అవి 1) న్యాయ 2) వైశేషిక 3) సాంఖ్య 4) యోగ 5) పూర్వమీమాంస 6) ఉత్తర మీమాంస దర్శనములు. ఈ ఆరింటినే వైదిక దర్శనాలని, ఆస్తికదర్శనాలని అంటారు. ఈ ఆరు దర్శనాలలోనూ పైపైన చూసినట్లయితే పరస్పరము తేడా ఉన్నట్లుగా కన్పిస్తాయి కాని, లోతుగ పరిశీలించినట్లయితే ప్రతిపాదించిన తత్త్వములో తేడా ఉండదు. ప్రతిపాదించే విధానములోనే తప్ప ప్రతిపాద్యవిషయములో తేడా లేదని గమనించవచ్చును.

పరస్పర విరోధము లేదు కనుక వీటన్నింటినీ ఒకే దర్శనంగ భావించవచ్చు. అందుకే **"శ్రుతిశ్చ భిన్నాః, స్మృతయశ్చ భిన్నాః, నైకో ఋషిః యస్య మతం ప్రమాణం"** అన్నట్లు శ్రుతులు వేరైనట్లుగానే, స్మృతులు వేరైనట్లుగానే, దర్శనాలలో కూడా ఆంతరిక భేదాలు కన్పిస్తాయి. కానీ, అవి ఆవిష్కరించే తత్త్వాలు మాత్రము మూడు అని అన్ని దర్శనాలు పేర్కొన్నాయి. ఆ తత్త్వాలు ప్రధానంగ మూడు. అవి 1) ప్రకృతి, 2) జీవ 3)ఈశ్వర తత్త్వములు ఇది అందరు వైదిక దర్శనకారులు అంగీకరించారు. వీటి యొక్క ఉనికి, కూర్పులకి సంబంధించి మాత్రము ఒక్కొక్కరు ఒక్కొక్క విధంగ ఊహించారు. అయితే ఆ ఊహలని కూడా ఎంత గొప్పవైనా వేదం అందించిన జ్ఞానానికి లోబడే చేశారు కొందరు. వారందించినవి ఆస్తికదర్శనాలైనాయి. వాటిని అధ్యయనం చేయడం ద్వారా వేద ప్రతిపాద్య కారణ తత్త్వాన్ని ఎలా దర్శించవచ్చునో, ఈ సృష్టి రహస్యాలని ఛేదించ వచ్చునో ఋషులు చూపిన మార్గంలో కొంచెం కొంచెం తెలుసుకుందాం!

గీతా మాహాత్మ్యకథలు-6

# జానశ్రుతి

శ్రీమాన్ వోలేటి రామకృష్ణమాచార్యులు - హైదరాబాద్

అయిదవ అధ్యాయానికి గల మహిమను "వటుడు" అనే పద్మ పురాణాంతర్గతమైన కథ ద్వారా గతనెలలో తెలుసుకున్నాం... ఒక వ్యక్తి పునీతమయ్యాడంటే ఆ పవిత్రత ఆ వ్యక్తిలోనే(ఆత్మలోనే) కాక శరీరమంతటా, అందులో ఉన్న రక్తమాంసాదులలోను, అస్థిపంజరంలో కూడా నిండి ఉంటుంది. అది ఆ వ్యక్తి మరణించిన తరువాత కూడా తన మాహాత్మ్యాన్ని కోల్పోక, తన దరిచేరిన వారినందరిని పవిత్రులను చెయ్యడమేకాక వారికి మోక్షమార్గాలను తెరుస్తుందని గతనెల సంచికలో "వటుడు" అనే కథ ద్వారా తెలుసుకున్నాము. అయితే, అలా పునీతమవడానికి మనమెంత కష్టపడాలో అని కలవరపడకండి. భక్తితో శ్రీమద్భగవద్గీతా గ్రంథాన్ని పారాయణం చెయ్యడం అనే అలవాటు చేసుకుంటే సరి. అంతకన్నా చెయ్యవలసిందింకేమీ లేదు.

ఇక ఈ నెల భగవద్గీత ఆరవ అధ్యాయం యొక్క మహిమను తెలుసుకునే ప్రయత్నం చేద్దాం. ఈ ఆరవ అధ్యాయాన్ని 'ఆత్మసంయమయోగ'మని, 'ధ్యానయోగ'మని కూడా పిలుస్తారు. 'ఆత్మ' అనే పదానికి శరీరము, ఇంద్రియములు, మనస్సు, బుద్ధి అని అనేక అర్థాలున్నాయి. వీటన్నింటిని ఎలా నిగ్రహించుకోవాలో చెప్పే అధ్యాయం కనుకనే దీనికి 'ఆత్మసంయమ యోగ'మని పేరు వచ్చింది. ఇంతకు ముందున్న ఐదో అధ్యాయంలో చివరలో కొద్దిగా ధ్యానయోగం ప్రస్థావన ఉన్నప్పటికి ఆ ధ్యానయోగం యొక్క సమగ్ర స్వరూపం మనకి ఈ అధ్యాయంలోనే చెప్పబడింది. ఈ అధ్యాయంలో ధ్యానయోగికి ఉండవలసిన లక్షణములు, యోగవిధానము, దానికి కావలసిన సాధనముల గురించి వివరింపబడింది.

ఈ ధ్యానయోగము ఆరంభించి పూర్తి చేయగలిగిన వారెందరుంటారు? మధ్యలో ఆగిపోతే భ్రష్టులౌతారే! మరి ఆ భ్రష్ట యోగి గతి ఏమౌతుంది? ఆతడు ఈ లోకంలోని సుఖాలకు, పరలోకపు ఆనందాలకు రెండింటికి వంచితుడవుతాడా? అంటే అలాంటి నష్టమేమి ఉండదని చెప్పాడు శ్రీకృష్ణుడు. మంచి పని చేసే వాళ్లకి చెడు ఎలా జరుగుతుంది. చేసుకున్న వారికి చేసుకున్నంత. మనం ఆధ్యాత్మిక మార్గంలో, ధ్యానయోగంలో ఎంత ముందుకు వెళితే, ఆ పని మళ్లీ జన్మలు కలిగినా ఆ జ్ఞానం వలన కలిగే దివ్య చైతన్యాన్ని తిరిగి పొంది, సంపూర్ణ విజయంకోసం ఆయా జన్మలలో ప్రయత్నిస్తాం, అని చెప్పి శ్రీకృష్ణుడు అందరికి స్వాంతన కలిగించిన అధ్యాయం కూడా ఇదే. మరి ఈ అధ్యాయం మహిమను తెలుసుకునే ప్రయత్నం చేద్దామా!

గోదావరీ తీరంలో గల ప్రతిష్ఠానపురమనే నగరానికి రాజు జానశ్రుతి మహారాజు. ఆయన గొప్ప ధర్మనిరతుడు, పరాక్రమశాలి. తన దేశ ప్రజలను కన్నబిడ్డల వలే పాలించేవాడు. అతడు ఎన్ని యజ్ఞాలు చేసాడో లెక్కలేదు. ఆయన యజ్ఞంలో చేసే పురోడాశం స్వీకరించడానికి దేవతలు ఆయన రాజ్యాన్ని వదిలి వెళ్లేవారు కాదట. **ఆయన చేసే యజ్ఞాల వలన వానజలధారలు రాజ్యమంతా కాలువలుగా పారేది.** ఆయన చేసిన యజ్ఞాల నుండి వెలువడిన పొగలకు కల్పవృక్షం నలుపెక్కిందట. యజ్ఞాలు విరివిగా జరపడం వలన దేవతలు అందరు ఆయనకు అనుకూలంగా ఉండేవారు. మేఘాలు సరియైన సమయంలో వర్షించేవి. దేశంలో ఈతిబాధలు, ఉపద్రవాలు ఉండేవి కావు. జనులు ధర్మం తప్పేవారు కారు.

ఇలా ఆ జానశ్రుతి మహారాజు యజ్ఞదానతపశ్శాలియై వెలుగొందుతున్న రోజుల్లో దేవతలకు ఈ రాజుకు ఏదైనా సాయం చేస్తే బాగుండుననిపించింది. వెంటనే వారు శ్వేతహంసల రూపంలో ఎగురుతూ ప్రతిష్ఠానపురం చేరుకున్నారు. అందులో భద్రాశ్వుడనే దేవత నాయకత్వంలో కొన్ని హంసలు ముందున్నాయి. వారు జానశ్రుతి మహారాజు భవనం సమీపించగా, వాటిని జానశ్రుతి పరికిస్తున్నాడు. వెనుకనున్న హంసలు ముందున్న హంసలకు హెచ్చరిక చేస్తున్నాయి.

"ఆగండి! భద్రాశ్వా, మిత్రులారా ఆగండి. వేగాన్ని కొంత తగ్గించండి. జాగ్రత్తగా వెళ్లండి. ఆ పైన జానశ్రుతి మహారాజు భవంతి ఉంది. అక్కడ త్వరపడితే ఆ జానశ్రుతి మహారాజు తేజస్సులో పడి భస్మమైపోగలరు. ఆతడు చేసిన సత్కర్మలను లెక్కించడం ఎవరితరం?" అన్నాయి. ఆ మాటలకి ముందున్న హంసలు అపహాస్యంగా నవ్వి ఇలా అన్నాయి. "అబ్బో బడాయి!

ఏమి ఆ జానశ్రుతి మహారాజు యొక్క తేజస్సు, రైక్వుని బ్రహ్మ తేజస్సుకన్నా గొప్పదా? చాలు చాలు... మీ మాటలు చాలించండి. ఇంకా చాలా దూరం వెళ్లాలి తొందరగా రండి" అని పిలిచాయి.

మేడమీద ఉన్న జానశ్రుతి మహారాజుకు పక్షుల భాష తెలుసును. ఆ హంసల సంభాషణవిని ఆ బ్రహ్మ తేజస్సు గల రైక్వుని ఊహించుకొని ఆశ్చర్యపడిపోయాడు. వెంటనే తన రథసారధిని పిలిచి వెంటనే దేశం నలుమూలలా గాలించి ఆ రైక్వుడను బ్రహ్మజ్ఞాని ఎక్కడ ఉన్నాడో తెలుసుకుని చెప్పమని పంపించాడు.

ఆ సారథి ఎన్నో గ్రామాలకు, నగరాలకు వెళ్లి గాలించాడు. కాశీ,గయ, మధుర వంటి నగరాలన్నీ చూసుకుంటూ కాశ్మీర పట్టణం చేరుకున్నాడు. అక్కడ ఉన్న పుణ్యస్థలాలన్నీ దర్శించుకుంటూ చివరకు ఒక దేవాలయంలోంచి బయటకు వస్తూ అక్కడ ఒక బండి మీద కూర్చుని ఉన్న బ్రహ్మ తేజస్సు గల వ్యక్తిని చూచి ఈతడే రైక్వుడేమోనన్న అనుమానంతో ఆయనను భక్తి వినయాలతో సమీపించాడు ఆ సారథి. "మహాత్మా" తామెవ్వరు? తమ నామధేయం ఏమిటి? మీరు ఇక్కడ ఉండడానికి కారణమేంటి? మీరు ఇక్కడి నుండి ఎక్కడికి వెళ్లాలనుకుంటున్నారు?" అని ప్రశ్నించాడు. ఆతని వినయానికి సంతసించి ఆతడు "నాపేరు రైక్వుడు. మేము పూర్ణమనోరధులం. మేం ఇక్కడే ఉంటాం. ఇప్పుడు ఏ వూరూ వెళ్లాలనుకోవడం లేదు" అన్నాడు. దానికి సారథి తృప్తిచెంది రైక్వునికి సాష్టాంగ ప్రణామం చేసి తిరుగు ప్రయాణమయ్యాడు.

అక్కడి నుండి తిన్నగా జానశ్రుతి మహారాజు వద్దకు వెళ్లి రైక్వుని జాడ తెలిపాడు. జానశ్రుతి మహారాజు పరమానంద భరితుడై వేలకొలది గోవులను, పట్టు వస్త్రములను, మణి మాణిక్యములను, ముత్యములను తీసుకుని రైక్వుని దగ్గరకు వెళ్లి "స్వామీ! ఈ చిరుకానుకలు స్వీకరించి నన్ను ధన్యుణ్ణి చేయండి" అని ప్రార్థించాడు.

రైక్వుడు ఆ మాటలకు ప్రవర్తనకు కోపగించి "బ్రహ్మజ్ఞానమునకు మణి మాణిక్యములతో పనేమిటి? వీటన్నింటిని తీసుకొని వెనుతిరిగి వెళ్లిపో'' అని ఛీత్కరించుకున్నాడు. జానశ్రుతి మహారాజు ఆయన పాదములపై పడి క్షమింపమని వేడుకున్నాడు. రైక్వుడు కరుణాంతరంగుడై శాంతపడి, "ఈ సంపదనంతా వెనుకకు పంపవేసి, దానినంతటిని దాన ధర్మాలకై వినియోగించండి" అని ఆజ్ఞాపించాడు.

'అలాగే' అని వాటన్నింటిని వెనక్కి పంపివేసి రైక్వుని శుశ్రూష చేస్తూ అక్కడే ఉండిపోయాడు. ఒకరోజు ఆ మహారాజు రైక్వుని సమీపించి "మహాత్మా మీకు ఇంతటి తేజస్సు, జ్ఞానము ఎలా కలిగింది? వివరించవలసినది" అని ప్రార్థించాడు. దానికి రైక్వుడు ఇట్లు చెప్పెను.

**శ్లో ॥ గీతానాం షష్ఠమాధ్యాయం జపామ ప్రత్యహం నృప ।**
**తేనైవ తేజో రాశిర్మే సురాణామపి దుస్సహః ॥**

తా॥ ఓ రాజా! భగవద్గీత యొక్క ఆరవ అధ్యాయమును ప్రతిరోజు పారాయణ చేయుట వలననే నాకీ బ్రహ్మజ్ఞానము, తద్వారా తేజస్సు సంభవించింది. ఇట్టిది దేవతలకు కూడా దుర్లభం అని చెప్పాడు.

జానశ్రుతి మహారాజు ఆ మాటలకు సంతుష్టాంత రంగుడై, రైక్వుని మరికొద్ది కాలము అచ్చటనే సేవించి, తిరిగి తన రాజ్యానికి వచ్చాడు. ఆనాటి నుండి జానశ్రుతి మహారాజు భగవద్గీతలోని ఆరవ అధ్యాయాన్ని పారాయణ చేస్తూ ముక్తిని పొందాడు.

ఈ విధంగా శ్రీమన్నారాయణుడు లక్ష్మీదేవికి చెప్పిన ఈ కథను శంకరుడు పార్వతీదేవికి వినిపించాడు. భగవద్గీతా పారాయణ పరమార్థాన్ని గ్రహించిన పార్వతీదేవి ఆనంద వీచికలలో ఓలలాడింది. **"తే వైష్ణవాః భువన మాశు పవిత్రయంతి"** ఇట్టి వైష్ణవుడే ఈ లోకాన్ని పవిత్రం చెయ్యగల సమర్థులు అనుకుంది ఆ ఆనందంలో.

# శ్రీశ్రీశ్రీ చిన్న జీయర్ స్వామివారి పర్యటన వివరములు

| డిసెంబరు | | కార్యక్రమాలు | |
|---|---|---|---|
| 1 | ఒంగోలు జిల్లా, చీమకుర్తి | మన స్వామి జరిపించే యాగ పూర్ణాహుతిలో పాల్గొంటారు. | రాత్రికి గుంటూరు జిల్లా, పెద వడ్లపూడి చేరుతారు. |
| 2 | పెద వడ్లపూడిలో | సహస్ర తులసీ శ్రీనివాసం కార్యక్రమం | |
| 3 | పెద వడ్లపూడిలో ఉదయం | సహస్రనామార్చనతో కార్యక్రమం ముగింపు | రాత్రికి ఒంగోలులో మకాం. |
| 4 | ఒంగోలులో | ధార్మిక కార్యక్రమాలు | |
| 5 | ఒంగోలులో | సహస్ర తులసీ శ్రీనివాస పూజ. | రాత్రికి విజయనగరం ప్రయాణం |
| 6 | విజయనగరంలో | గీతాజయంతి పారాయణ | |
| 7 | విజయనగరంలో | సహస్ర తులసీ శ్రీనివాస కార్యక్రమాలు | |
| 8 | విజయనగరంలో | తులసీ అర్చన | రాత్రికి బొబ్బిలి చేరతారు. |
| 9 | బొబ్బిలి | ధార్మిక కార్యక్రమాలు | |
| 10 | బొబ్బిలి | సహస్ర తులసీ అర్చనానంతరం | హైదరాబాద్ ప్రయాణం |
| 11 | ఢిల్లీలో | ధార్మిక సదస్సులో పాల్గొంటారు. | రాత్రికి హైదరాబాద్ |
| 12 | శ్రీకాకుళం చేరతారు. | శోభాయాత్ర, సహస్ర తులసీ శ్రీనివాసం | |
| 13 | | సహస్ర తులసీ అర్చనానంతరం విశాఖపట్నం చేరతారు. | |
| 14 | విశాఖలో | ధార్మిక సదస్సు, శోభాయాత్ర | |
| 15. | విశాఖలో | సహస్ర తులసీ అర్చన | రాత్రికి "తుని" చేరతారు. |
| 16. | "తుని" (తూ.గో.) | శోభాయాత్ర, రాత్రి ధనుర్మాసారంభం | |
| 17 | తునిలో | సహస్ర తులసి అర్చన | రాత్రికి కాకినాడ చేరతారు. |
| 18 | కాకినాడ | సహస్ర తులసి శ్రీనివాసం కార్యక్రమంలో పాల్గొంటారు. | |
| 19 | కాకినాడ | సహస్ర తులసి అర్చనానంతరం | రాత్రికి ఏలూరు చేరుతారు |
| 20 | ప. గో. జిల్లా ఏలూరులో | ధార్మిక కార్యక్రమాలలో పాల్గొంటారు. | |
| 21 | ఏలూరులో | సహస్ర తులసీ అర్చన | రాత్రికి సీతానగరం |
| 22 | సీతానగరం | | |
| 23 | సీతానగరంలో | "సమాశ్రయణములు" | రాత్రికి నల్గొండ చేరుతారు |
| 24 | నల్గొండలో | ధార్మిక కార్యక్రమాలలో పాల్గొంటారు. | |
| 25. | నల్గొండలో | సహస్ర తులసీ అర్చననానంతరం | రాత్రికి ఖమ్మం చేరుతారు |
| 26 | ఖమ్మంలో | సహస్ర తులసీ శ్రీనివాసం ముగించి | రాత్రికి జీవా చేరుతారు |
| 27 | హైదరాబాద్, సంతోష నగర్ చేరుతారు | | |
| 28 | సంతోషనగర్, | సహస్ర తులసీ శ్రీనివాసం ముగించి | రాత్రికి జహీరాబాద్ చేరుతారు |
| 29 | జహీరాబాద్ - | ధార్మిక కార్యక్రమాలు | |
| 30 | జహీరాబాద్ - | సహస్ర తులసీ శ్రీనివాసం ముగించి | రాత్రికి జీవా |
| 31 జనవరి 1 | జీవాలో వేంచేసి ఉంటారు. | | |
| 2 | హైదరాబాద్, అలకాపురీ | సహస్ర తులసీ శ్రీనివాసంలో పాల్గొంటారు. | |
| 3 | మహబూబ్ నగర్ జిలా, గద్వాల్‌లో సహస్ర తులసీ శ్రీనివాసంలో పాల్గొంటారు. | | |
| 4 | గద్వాల్‌లో | సహస్ర తులసి అర్చనానంతరం | రాత్రి రాజమహేంద్రి |
| 5 | "ముక్కోటి ఏకాదశి రాజమహేంద్రిలో" వేంచేసి ఉంటారు. | | |
| 6 | రాజమహేంద్రిలో | శ్రీశ్రీశ్రీ పెద్ద జీయరు స్వామివారి పరమపదోత్సవం | రాత్రికి హైదరాబాద్ రామాంతపూర్ చేరతారు. |
| 7 | రామాంతరపూర్ | సహస్ర తులసీ శ్రీనివాసం జరిపించి మంచిర్యాల ప్రయాణం | |
| 8 | ఆదిలాబాద్ జిల్లా, మంచిర్యాలలో | సహస్ర తులసీ శ్రీనివాసం-వివిధ కార్యక్రమాలు | |
| 9 | మంచిర్యాలలో | తీర్థగోష్ఠి, సాయంత్రం సిద్ధిపేట | |
| 10 | సిద్ధిపేట | గోదా కళ్యాణం | రాత్రికి సీతానగరం |
| 11 | విజయవాడలో | గోదా కళ్యాణం | |
| 12 | ప్రకాశం జిల్లాలో వినుకొండలో గోదా కళ్యాణం | | |
| 14 | శంషాబాద్ జీవా ప్రాంగణంలో భోగి, గోదాకళ్యాణం. | | |



## రాయల ఊహల పల్లకి....
# ఆముక్తమాల్యద

*(గత సంచిక తరువాయి)*

ఆకాశం నీటిబుగ్గలా ముసురుపట్టి జోరున వర్షాలు కురిసే రోజుల్లో కూడా విష్ణుచిత్తులవారింట్లో పై ప్రాంతాల నుంచి వచ్చిన భాగవతులకు ఆ కాలానికి సరిపడిన భోజనం లభించేది. వంట చెరకు తడిస్తే సరిగ్గా మండక పొగవచ్చి పదార్థాలు పొగజూరిపోతాయని, వండే భార్యకు ఆ పొగవల్ల కళ్ళు దెబ్బతింటాయని ఎంతో ముందుజాగ్రత్తతో వర్షాకాలం కోసం ఎంతో ముందుగానే కొబ్బరి డొక్కలు బాగా ఎండబెట్టి నిలవచేసేవారాయన. కొబ్బరి ఉపయోగాలు బాగ తెలిసిన మనిషి విష్ణుచిత్తులవారు. కొబ్బరిచిప్పలు నున్నగా అరగదీసి చక్కగా నిగనిగలాడుతూ వడ్డనకు ఉపయోగపడే పాత్రలుగా తయారుచేసేవారు. జడిముసుళ్ళలో కూడా ఆయన భార్య కంట్లోకి ఇంట్లోకీ పొగరానంత జాగ్రత్తగా వంటచేసేది. రాజనపు బియ్యపు అన్నం. చాయపప్పు, నాలుగో ఐదో ఇగురు కూరలూ చేసేది. వర్షాకాలంలో ఉపయోగపడతాయని ముందుగానే జాగ్రత్తచేసిన వడియాలు, వరుగులూ వేయించేది. చేతినిండా బొట్టుగా కాకుండా ధారగా నెయ్యి, మంచి మీగడ పెరుగు, కొబ్బరి గరిటెలతో వడ్డన – ఇదీ విష్ణుచిత్తులవారింట్లో వర్షకాల భోజనం.

ఇహ వేసవికాలంలో తెల్లగా నులివెచ్చగానున్న అన్నం. తియ్యగా బెల్లం వేసిన రెండుమూడు రకాల చారులు, తిమ్మనాలు, పలుచగా ఉండే అంబళ్ళు – సరే సరి రకరకాల పిండివంటలు, చెఱకు పానకం, దాహానికి లేతకొబ్బరిబొండాల నీళ్ళు, సువాసనలు చిమ్మే చల్లటి మంచితీర్థం. ఊరవేసిన మామిడి పిందెలు, ఉసిరికాయలు, పలుచటి మజ్జిగ– సరే భోజనానికిముందు చల్లదనానికి ఒంటికి పూసుకుందుకు మంచిగంధం.

ఇహ శీతకాలంలో పునుగువాసనలు చిమ్మే రాజనపు వరి అన్నం. శైత్యానికి విరుడుగా మిరియప్పొడి, తాలింపుల ఘుమఘుమలు ముక్కులకు పట్టి ఓహ్ అనిపింపచేసే – అప్పటికప్పుడు పొయ్యిమీంచి దించిన కూరలు. ఇట్టాంటి కూరలు కనీసం మూడు నాలుగైనా ఉండాల్సిందే! వాసనలు ముక్కునకు పట్టిన పడిసెపుభారాన్ని వదలగొట్టి ముక్కు మందులుగా చెప్పుకోదగ్గ చుర్రుమనిపించే ఆవపచ్చళ్ళు. పాయసం, ఊరగాయలు, చెయ్యి చురుక్కుమనే నేతిధార, చివరగా చక్కగా కాచిన పాలు. ఇల్లా ఉండేది వారింట్లో శీతకాల భోజనం.

విష్ణుచిత్తులవారింటికి దేశదేశాలనుంచీ ఎందరెందరో వైష్ణవస్వాములు వస్తూంటారు. వీరిలో కొందరు దారిన పోతూ వచ్చినవారు, కొందరు విష్ణుచిత్తులవారిని సేవించుకోవాలని వచ్చినవారు. మరికొందరు విల్లిపుత్తూరు దివ్యదేశం కదా! సేవించుకు వెడదామని వచ్చి వీరి యింట ఆతిథ్యానికి ఆగినవారూనూ.

వచ్చినవారంతా శనివారాలు అభ్యంగస్నానాలు చేయాల్సిందే! ఒళ్ళు నలుచుకొందుకు చేతినిండా ఇప్పపిండి పెట్టుకొని దానిమీద కుదురుగా అరటిపువ్వు దొప్పపెట్టి దానిలో నూనె పోయించుకొనేవారు ఒంటికి రాసుకోవడానికి. స్నానాలకు వెళ్ళేముందు వాకిట కట్టిన తాడుమీద బట్టలుతికి ఆరవేసుకుంటారు. దగ్గర్లో ఉన్న నదికి వెళ్ళి, తలకు ఒంటికీ బాగా నూనె పట్టించుకొని, అది ఆరిన తరువాత ఇప్పపిండితో రుద్దుకొని ఆ నదీజలాల్లో తీర్థమాడుకుంటారు. స్నానాలయ్యేక ఇంటికి వచ్చి ఆ తాడుమీద ఇందాక ఆరేసిన మడిబట్టను కట్టుకుంటారు. ప్రతిశనివారం ఇల్లా జరగడం వారింట్లో రివాజు. ఎందరు వచ్చినా ఈ అభ్యంగస్నానాలు జరగాల్సిందే!

ఆ నిష్ఠాగరిష్ఠులైన విష్ణుచిత్తులవారింటి పరిసరాల్లో పగలు కాదు, అర్ధరాత్రి విన్నా విష్ణుకథలు వినబడుతూనే ఉంటాయి. ఆళ్వార్లు పాడిన దివ్యప్రబంధ పారాయణము చెవుల సోకుతూనే ఉంటుంది. అంతేనా **'నాస్తి శాక బహుధా'** అయ్యా కూరలు ఎక్కువగా సమకూర్చలేకపోయాము. **'నాస్తి ఉష్ణతా'** ఏవిటో పదార్థాలు చల్లారిపోయినట్టున్నాయి. **'నాస్తి అపూపః'** పిండివంటలు తగినన్ని చేయించలేకపోయాము. **'నాస్తి ఓదన సౌష్ఠవం చ'** అన్నం కూడా సరిగా మీకు అనువుగా ఉన్నట్టులేదు. **'కృపయా భోక్తవ్యం'** ఏదో ఈ దాసుడిపై దయ ఉంచి ఎల్లాగో సరిపెట్టుకొని పెద్దమనసుతో మీరు భోజనం చెయ్యాలి అన్న మాటలు వినబడుతూ ఉంటాయి. *(ఇంకాఉంది)*



పరమహంస పరివ్రాజకులు

# శ్రీశ్రీశ్రీ చిన్నజీయర్‌స్వామివారి ప్రచారవార్తలు



నవంబరు 1వ తేదీ శ్రీమాన్ డా॥ వెంకట్ మరియు ప్రీతి సురకంటి ఆహ్వానంపై శ్రీస్వామివారు హ్యూస్టన్, టెక్సాస్ నుండి బయలుదేరి **బేటన్‌రూజ్** చేరి సామూహిక లక్ష్మీనారాయణ పూజ జరిపారు.

2వ తేదీ తీర్థగోష్ఠి అనంతరము 'జాక్సన్ చేరుకున్నారు.

3వ తేదీ శ్రీమాన్ డా॥ P. రాజా నర్సింగరావు ప్రార్థన మేరకు **'పనామా సిటి'**లోని వారి గృహానికి వేంచేసి సత్సంగాన్ని జరిపారు.

4వ తేదీ ఫ్లోరిడా రాష్ట్రంలోని **'టాంపా'** నగరంలో ప్రజ్ఞా చిన్నారుల కార్యక్రమాలను తిలకించి ఆ చిన్నారులకు వారిని ప్రోత్సహిస్తున్న తల్లిదండ్రులకు మంగళాశాసనం చేశారు.

5వ తేదీ ఉదయం **'టాంపా'**లో సామూహిక శ్రీవేంకటేశ్వర కళ్యాణం శ్రీస్వామివారి ప్రత్యక్ష పర్యవేక్షణలో వైభవంగా జరిగింది. నిర్వాహకులు శ్రీమాన్ N. సుబ్రహ్మణ్యం, శ్రీమాన్ చక్రధర్ స్వామి వారి టీమ్‌లో కార్యక్రమాన్ని చక్కగా నిర్వహించారు. సాయంత్రం **'బ్రాడెన్‌టన్'**లోని యూనిటీచర్చిలో శ్రీవారు ప్రవచనం చేశారు. ఈ కార్యక్రమంలో అమెరికన్స్ చాలా విశేషంగా పాల్గొన్నారు. శ్రీమాన్ ముదుంబై గోపీచారి దంపతులు మరియు కరీంనగర్ లీలావతి కుమారుడు శ్రీమాన్ శ్రీధర్ కార్యక్రమాన్ని నిర్వహించారు.

మన JET INDIA అధ్యక్షులు శ్రీమాన్ గంగరాజు,లైలగారి కుమార్తె-అల్లుడు శ్రీమతి శ్రీమాన్ M. పద్మ-రామలింగరాజు ఆహ్వానించగా ఆ రాత్రి **'జూపిటర్, ఫ్లోరిడా'**లోని వారి స్వగృహానికి వేంచేశారు.

6వ తేదీ శ్రీమాన్ పద్మ రామలింగరాజు (మంతెన) గృహంలో ఉదయం తీర్థగోష్ఠి నిర్వహించి, భక్తులతో ఇష్టాగోష్ఠి జరిపారు. శ్రీ స్వామివారికి **'అట్లాంటా'** నుండి **'సియాటిల్'** వరకు మొదటిసారి, **'ఫినిక్స్'** నుండి **'హ్యూస్టన్'** వరకు రెండవసారి వారి సొంత విమానాన్ని ఏర్పాటు చేశారు.

మన JET, VT సంస్థల ద్వారా జరిగే సేవా కార్యక్రమాలకు అనేక విధాలుగా కైంకర్యములను సమర్పించు ఉదారులు వీరు. వీరికి శ్రీస్వామివారు అనేక మంగళాశాసనములు కృపచేశారు. సాయంత్రం శ్రీమాన్ తిరుమల మోహన్ ఆహ్వానించగా **'ఫోర్ట్ లాండర్‌డేల్'** వేంచేశారు. శ్రీమతి శాంతిరాజు గారి గృహాన్ని సందర్శించి, శ్రీ వేంకటేశ్వరాలయంలో శ్రీమాన్ రామానుజ అయ్యంగార్ మొదలైనవారి నిర్వహణలో సామూహిక శ్రీరామపూజా కార్యక్రమములు విశేషంగా జరిపి రాత్రికి మోహన్‌గారి గృహానికి చేరారు.

7వ తేది ఉదయం ఆరాధన పూర్తి చేసుకొని **'జాక్సన్‌విల్'**లోని శ్రీమాన్ తిరుమల కృష్ణగారి ఆహ్వానంపై వేంచేసి ప్రజ్ఞా పిల్లల కార్యక్రమాలను వీక్షించి, మంగళాశాసనములు కృపచేశారు.

8వ తేది షార్లెట్‌లోని డా॥ P. వినతా సర్వోత్తమ్‌రెడ్డి (VT Seva ప్రెసిడెంట్) గారి గృహాన్ని సందర్శించారు. వీరి గృహంలో VT Seva సమావేశం జరిగింది. ఆ సమావేశంలో శ్రీమతి వినత గారు శ్రీమాన్ సిరికొండ పూర్ణచంద్రరావు గారికి VT Seva ప్రెసిడెంట్ బాధ్యతలు అప్పగించారు. ప్రెసిడెంట్ బాధ్యతలనుండి విశ్రాంతులైన శ్రీమతి వినతగారిని VT Seva సలహాదారుగా శ్రీస్వామివారు నిర్ణయించారు. షార్లెట్‌లో ప్రజ్ఞా కార్యక్రమలు శ్రీమాన్ వేంకట కృష్ణ, కల్పన దంపతులు, ఇతర వాలంటీర్ల తోడ్పాటుతో నిర్వహించే ప్రజ్ఞా తరగతుల కార్యక్రమాల్ని శ్రీస్వామివారు సమీక్షించారు. శ్రీరామపూజను నిర్వహించారు.

9వ తేదీ 'కేరీ, NC'లో వేంకటేశ్వరాలయంలో ప్రవచన కార్యక్రమం జరిగినది. ఆలయ అధ్యక్షులు శ్రీమాన్ చిట్టినేని శ్రీనివాస్‌గారు వారి బృందంతో కార్యక్రమాన్ని చక్కగా నిర్వహించారు.

10వ తేదీ శ్రీమాన్ చిట్టినేని శ్రీనివాస్‌గారి గృహంలో సమాశ్రయణములు నిర్వహించి సాయంత్రానికి 'వర్జీనియా' చేరారు. ఇక్కడికి జూలైలో శ్రీస్వామివారు విచ్చేసినప్పుడు మన కార్యక్రమాలన్ని జరగటానికి ఒక భవనాన్ని అద్దెకు తీసుకున్నారు. దాంట్లోనే ప్రజ్ఞ, VT Seva చిన్నారులతో కార్యక్రమాన్ని ఏర్పాటు చేశారు.

VT Seva అధ్యక్షురాలుగా ప్రస్తుతం బాధ్యతలు నిర్వహిస్తున్న పవిత్ర దాట్ల, JET-W.D.C. అధ్యక్షురాలైన డా॥ రీనా బొమ్మసాని కలిసి ఇక్కడ కార్యక్రమాలన్ని చక్కగా నిర్వహించారు. ఇదే సందర్భంలో VT Seva యువ కార్యకర్తలు సుమారు 30 మంది నేత్ర విద్యాలయ విద్యార్థుల పోషణ బాధ్యతలని స్వీకరిస్తామని వాగ్దానము చేయడము విశేషము. ఇక్కడి విద్యార్థులకు సాంస్కృతిక కార్యక్రమాలు నేర్పే బాధ్యతను స్వీకరించిన శ్రీమతి లక్ష్మీ రాపర్ల గారు తమ విద్యార్థులతో చక్కటి నృత్య ప్రదర్శన చేయించి శ్రీస్వామివారికి తిరునక్షత్ర కానుకగా సమర్పించి శ్రీవారి మంగళాశాసనాలు అందుకున్నారు. శ్రీస్వామివారు

స్థానిక కోశాధికారిగా ఉన్న శ్రీమాన్ గుండేరావు-విద్యగారి గృహంలో అనుష్ఠానము పూర్తి చేసుకొని అదే రాత్రి బయల్దేరి తెల్లవారే సమయంలో న్యూజెర్సీలోని జీయర్ ఆశ్రమం చేరుకున్నారు.

11వ తేదీ కార్యక్రమాలన్ని వీక్షించి రాత్రి భారతదేశానికి ప్రయాణమయ్యారు.

12వ తేదీ రాత్రి తెల్లవారితే 13వ తేదీ శ్రీస్వామివారు **శ్రీరామనగరం** చేరుకున్నారు. శ్రీస్వామివారికి మన JIVA విద్యార్థులు, భక్తులందరూ కలసి ఘన స్వాగతం పలికారు.

ఉదయం తీర్థగోష్ఠి అనంతరం జీవా కార్యక్రమాలు పర్యవేక్షించారు. రాత్రి మన జెట్ ఛైర్మన్ శ్రీమాన్ రామేశ్వరరావుగారు వారి 4వ కుమారుడు చి॥ శ్యామ్, ఐశ్వర్యల వివాహ కార్యక్రమానికి శ్రీవారిని, శ్రీ అహోబిల జీయర్ స్వామివారిని తోడ్కొని వెళ్ళారు.

ఈ సందర్భంగా శ్రీవారు మంగళాశాసనం చేస్తూ "వివాహ కార్యక్రమాన్ని శ్రీమాన్ రామేశ్వరరావుగారు పరమ సాత్త్వికంగా నిర్వహించారు. ఆహారంలో కానీ ఇతర ఏర్పాట్లలో కానీ సాత్త్వికతకు లోపంలేని వ్యవస్థను ఏర్పాటు చేశారు. ఈనాడు సమాజంలో వివాహాలు జరుపుకునే వారికి ఇది ఆదర్శంగా ఉందనీ" శ్రీస్వామివారు కొనియాడారు. అంతే కాక ఇంతకు పూర్వం రామేశ్వరరావుగారి ముగ్గురు కుమారుల వివాహం ఇదే రీతిలో సంప్రదాయ క్రమంలో జరగటం విశేషము.

14వ తేదీ సాయంత్రం మన JIVA విద్యార్థుల కోసం తయారైన క్రీడాంగణాన్ని శ్రీవారు ఆరంభించారు.

15వ తేదీ ఉదయం శ్రీవారి పర్యవేక్షణలో శ్రీమాన్ రామేశ్వరరావుగారి 4వ కుమారుడు శ్రీమాన్ శ్యామ్-ఐశ్వర్య దంపతులచే దివ్యసాకేతంలో శ్రీరామచంద్రుని కళ్యాణం జరిగింది.

16వ తేదీ సాయంత్రం నల్గొండజిల్లా **కొండ మల్లేపల్లి** గ్రామంలో శ్రీనివాసుని ఆలయ ప్రతిష్ఠాకార్యక్రమానికి వేంచేశారు.

17వ తేదీ ఉదయం మల్లేపల్లిలో శ్రీస్వామివారు శ్రీనివాసుని ఆలయ ప్రతిష్ఠ జరిపి, మధ్యాహ్నం గం1.00కు T. ఎంజాల్ (Hyd), శ్రీమాన్ అశోక్ కుమార్ గౌడ్ నిర్వహణలో జరిగే వేంకటేశుని ఆలయ పుష్కర ఉత్సవాలలో పాల్గొని సాయంత్రం కూకట్‌పల్లిలో శ్రీమాన్ వడ్డేపల్లి నరసింగరావు గృహంలో ఆరాధనాదులు జరిపారు.

18వ తేదీ **కూకట్‌పల్లి**లో సహస్ర తులసీ శ్రీనివాస కార్యక్రమంలో భాగంగా ఉదయం ధార్మిక సమ్మేళనం, సాయంత్రం గం.4 నుండి శోభాయాత్ర జరిగింది. రాత్రి గం॥7ల నుండి వేదికపై శ్రీస్వామివారు అనుగ్రహ భాషణ చేశారు.

19వ తేదీ తీర్థగోష్ఠి అనంతరం సహస్ర తులసీ శ్రీనివాస కార్యక్రమము వైభవముగా జరిగింది. ఈ కార్యక్రమాలను నిర్వహించిన శ్రీమాన్ కూకట్‌పల్లి రామారావు, శ్రీమాన్ వి. నరసింహారెడ్డి, వి.టి సభ్యులకు శ్రీవారు మంగళాశాసనం చేసారు. అదేరోజు కూకట్‌పల్లిలో శ్రీమాన్ వడ్డేపల్లి నరసింగరావుచే నిర్మింపబడిన కళ్యాణ మండపాన్ని శ్రీస్వామివారు ఆరంభించారు. రాత్రికి శ్రీరాంనగర్ చేరుకున్నారు.

20వ తేదీ ఉదయం శ్రీరాంనగర్‌లో సమాశ్రయణాలు జరిగాయి. సాయంత్రం గం. 7లకు Hyd, ECIL, క్రాస్‌రోడ్ **కుషాయ్‌గూడా**లో 300 పడకలు గల 'తులసీ హాస్పిటల్'ను శ్రీస్వామివారు ఆరంభించారు. తులసీ హాస్పిటల్ ఛైర్మన్ శ్రీమాన్ జయరాంరెడ్డిగారికి శ్రీవారు మంగళాశాసనము చేశారు. అక్కడ నుండి రాత్రి 12 గం॥లకు మెదక్ జిల్లాలోని **'కుకునూర్ పల్లి'** వేంచేశారు.

21వ తేదీ ఉదయం గం.9.50లకు శ్రీమాన్ కె. మధుసూదనరావు సంకల్పానుసారం ఏకశిలతో నిర్మితమైన 24 అడుగులుగల ఆంజనేయస్వామి విగ్రహ ప్రతిష్ఠా కార్యక్రమాన్ని శ్రీస్వామివారు నిర్వహించి, రామదాసుడైన హనుమ వైభవాన్ని భక్తులకు అనుగ్రహించారు. మధ్యాహ్నం శ్రీమాన్ శౌరిరాజ పెరుమాళ్, వి.టిసభ్యులు ఆహ్వానించగా శ్రీస్వామివారు సిద్ధిపేటలో స్థానిక వికాసతరంగిణి స్థలాన్ని సందర్శించి, రాత్రికి కరీంనగర్ చేరారు.

22వ తేదీ **కరీంనగర్** వేదభవనంలో ఉదయం ప్రజ్ఞా అధ్యాపకులు 150మందితో సమావేశం జరిగింది. ఈ కార్యక్రమంలో జిల్లా విద్యాశాఖాధికారి(DEO) గారు పాల్గొని శ్రీవారు జరిపే ప్రజ్ఞా కార్యక్రమాన్ని ప్రోత్సహించారు. అనంతరం మన వికాసతరంగిణి సెంట్రల్ కమిటీ వైస్ ప్రెసిడెంట్ శ్రీమాన్ లక్ష్మీనరసింహారావు ఆహ్వానంపై కరీంనగర్ జిల్లాలోని కొత్తపల్లి గ్రామంలో కేన్సర్ అవగాహనలో శ్రీవారు పాల్గొన్నారు. అటునుండి మధ్యాహ్నం 2.30 గం॥లకు కరీంనగర్ సర్కస్‌గ్రౌండ్‌లో జరిగే ధార్మిక సమ్మేళనంలో పాల్గొన్నారు. సాయంత్రం గం.4.30లకు శోభాయాత్ర జరిగింది.

ఈ కార్యక్రమంలో వేలాది భక్తులు పాల్గొని నృత్యాలతో, కోలాటాలతో, భజన బృందాలతో సుమారు 7 కి.మీ. అన్వయించారు. రాత్రి గం.8.00లకు శ్రీ స్వామివారి ప్రవచనగోష్ఠి జరిగింది.

23వ తేదీ **సహస్ర తులసీ శ్రీనివాసం** వైభవంగా జరిగింది. ఈ కార్యక్రమాన్ని నిర్వహించిన కరీంనగర్ జిల్లా వికాసతరంగిణి

అధ్యక్షులు శ్రీమాన్ వీర్ల ప్రభాకరరావుగారు, అలాగే వి.టి. సభ్యులందరికీ శ్రీస్వామివారు మంగళాశాసనం చేసి, రాత్రికి వరంగల్లులోని డా॥ కమలాకరరావుగారి గృహానికి విచ్చేశారు. అక్కడ వరంగల్ జిల్లా ప్రజ్ఞా ఉపాధ్యాయులు 150 మందితో సమావేశం జరిపి అందరికీ మంగళాశాసనములు అనుగ్రహించారు.

24వ తేదీ ఉదయం గోష్ఠి అనంతరం శ్రీమాన్ సిరికొండ నర్సింహారావు గృహంలో జరిగే సుదర్శన హోమ పూర్ణాహుతిలో పాల్గొన్నారు. అనంతరం మహేశ్వరీ గార్డెన్స్‌కు అన్ని గ్రామాలనుండి ధార్మిక సమ్మేళనమునకు విచ్చేసిన భక్తుల అనుభవాలను తెలుసుకొని అనుగ్రహ భాషణం చేశారు. సాయంత్రం శోభాయాత్ర విశేషంగా జరిగింది.

25వ తేదీ సహస్ర తులసీ శ్రీనివాసం అర్చన జరిపి, నిర్వాహకులు వరంగల్ జిల్లా వికాసతరంగిణి అధ్యక్షురాలు శ్రీమతి డా॥ జ్యోతిగారు, రాష్ట్ర వి.టి. అధ్యక్షులు శ్రీమాన్ మహేందర్ రెడ్డి గారు, శ్రీమాన్ బచ్చు రాధాకృష్ణ ప్రభృతులకు శ్రీవారు మంగళాశాసనం చేశారు.

సాయంత్రం నల్లగొండ వి.టి సభ్యులు, శ్రీరామగిరి ఆలయకమిటీవారి ఆహ్వానంపై శ్రీసీతారామ ఆండాళ్ సన్నిధి దర్శించి, నూతనంగ నిర్మించిన శ్రీమన్నారాయణ కుటీరాన్ని ఆరంభించారు. అక్కడనుండి శ్రీమాన్ నల్లగొండ విద్యాసాగర్‌రెడ్డి గారి కుమార్తె-అల్లుడు శ్రీమాన్ వీనీల విజయమోహన్‌రెడ్డి దంపతులు ఆహ్వానించగ, వారి హుండాయ్ మోటర్ కంపెనీ మరొక బ్రాంచ్ నిర్మాణానికి మంగళాశాసనం చేసారు. రాత్రి సూర్యాపేటలో నూతనంగ నిర్మాణమైన చందన విద్యాసంస్థలలో బసచేసారు.

26 ఉదయం తీర్థగోష్ఠి అనంతరం సూర్యాపేటలోని స్వయంవ్యక్త వేంకటేశ్వరస్వామి ఆలయ శిఖరప్రతిష్ఠ, సంప్రోక్షణా దులను శ్రీవారు నిర్వహించారు. ఈ సందర్భంగ ఆలయంలో ఆర్చ్‌గేట్ నిర్మాణానికి భూమిపూజ జరిపి, ఆప్రాంగణంలో ఆంజనేయస్వామి ముఖమండప నిర్మాణానికి మంగళాశాసనం చేసారు. ఆలయ చైర్మెన్ శ్రీమాన్ పి. వెంకటేశ్వర్లు, ఈ.ఓ. వాసుదేవ రావులు ఈ కార్యక్రమాన్ని చక్కగ నిర్వహించారు.

అటునుండి శ్రీమాన్ టి. దేవేందర్‌రెడ్డి ఆహ్వానంమేరకు శ్రీవేంకటేశ్వర డిగ్రీకళాశాలను శ్రీవారు ప్రారంభించారు. ఈ కార్యక్రమంలో మంత్రి శ్రీమాన్ జానారెడ్డి, మంత్రి శ్రీమాన్ గుత్తా సుఖేందర్‌రెడ్డి, M.L.A శ్రీమాన్ రాంరెడ్డి దామోదర్‌రెడ్డి ప్రభృతులు పాల్గొన్నారు. మధ్యాహ్నం 1గం॥కు స్థానిక శ్రీవేంకటేశ్వరస్వామి ఆలయ ప్రాంగణంలో అన్ని ప్రాంతాలనుండి వేయి కలశాలతో వచ్చిన భక్తులతో ధార్మిక సదస్సు జరిగినది. రాష్ట్రవికాసతరంగిణి అధ్యక్షులు శ్రీమాన్ మహేందర్‌రెడ్డి, నల్లగొండజిల్లా విటి సమన్వయకర్త శ్రీమతి జ్యోతిరెడ్డి సదస్సులో పాల్గొన్నారు.

అనంతరం 5వేలమంది విద్యార్థులు, 400మంది అధ్యాపకులతో ప్రజ్ఞ సమావేశం జరిగింది. 4గం॥నుండి శోభాయాత్ర ఆరంభమైంది. వేలాదిమంది భక్తులు ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు. చిన్నారులు వివిధ దేవతా ప్రతిరూపాలతో అలంకరించుకొని భక్తుల మన్ననలను పొందారు. కోలాటాలు, భజన బృందాలు, డప్పువాద్యాలు, కొమ్ముబూరలు, బాణసంచాలు కార్యక్రమానికి మరింత శోభను చేకూర్చాయి. ఈ శోభాయాత్రలో టి.టి.డి బోర్డ్‌మెంబర్ శ్రీమాన్ ముత్యం రెడ్డి పాల్గొన్నారు. స్థానిక శ్రీవేంకటేశ్వరస్వామి ఆలయంనుండి శ్రీభూసమేత శ్రీనివాసుని రథోత్సవంకూడ జరగడం శోభాయాత్రకే శోభను చేకూర్చింది. కనీవిని ఎరుగనిరీతిలో ఎటుచూసినా భక్తులతో ఆ వీధులన్నీ నిండి ఉండడం ఆశ్చర్యాన్ని కలిగించింది. అనంతరం శ్రీస్వామివారు వేదిపై అనుగ్రహభాషణాన్ని అనుగ్రహించారు.

ఈకార్యక్రమంలో మంత్రి శ్రీమాన్ రామిరెడ్డి వెంకటరెడ్డిగారు పాల్గొని, తమ అనుభవాన్ని అందరితో పంచుకున్నారు.

27వ తేదీ ఉదయం తీర్థగోష్ఠి అనంతరం సహస్రతులసీ శ్రీనివాసం కార్యక్రమం వైభవంగ జరిగింది. పూజా సమయంలో దేవాదాయ శాఖామాత్యులు శ్రీమాన్ పొన్నాల లక్ష్మయ్య పాల్గొని, కార్యక్రమ వైభవాన్ని కొనియాడారు. సూర్యాపేటలో ఈ కార్యక్రమము M.L.A శ్రీమాన్ రామిరెడ్డి దామోదర్‌రెడ్డి సారథ్యంలో విటి. సభ్యుల ఆధ్వర్యవంలో శ్రీమాన్ ఎన్.సి హెచ్ వేణుగోపాలాచార్యులు (వేణుస్వామి) సమన్వయంలో విశేషంగ జరిగింది. చందన విద్యాసంస్థల అధినేత శ్రీమాన్ గోపగాని వెంకట నారాయణ గౌడ్, స్వాములు వేంచేసి ఉండడానికి నూతనంగ నిర్మించిన తమ కాలేజీని వినియోగించారు.

సూర్యాపేట విటి. ప్రసిడెంట్ టి.ఎస్.వి. సత్యనారాయణ, విటి సభ్యులతో చక్కనిసేవను అందించారు. కలశాలు స్వీకరించిన భక్తులు వారివారి గ్రామాల నుండి రావడానికి 10 బస్సులను M.L.A శ్రీమాన్ రామిరెడ్డి దామోదర్‌రెడ్డి ఏర్పాటుచేసారు. వీరందరికీ శ్రీస్వామివారు మంగళాశాసనంచేసి, శ్రీమాన్ టి.రమేశ్‌గుప్తాగారి ఆహ్వానం మేరకు విజయవాడలో 'సృష్టి' షాపింగ్ సెంటర్‌ను ప్రారంభించి, రాత్రికి గుడివాడ చేరుకున్నారు.

# పరమపదము



కృష్ణాజిల్లా, వేకనూరు గ్రామవాస్తవ్యులు **శ్రీమాన్ అంజయ్య** ది. **12-9-2011** పరమపదం చేరినారు. వీరు గత 45 సం॥లుగా శ్రీశ్రీశ్రీ పెద్దజీయరు స్వామివారి సన్నిధిలో, తరువాత చిన్న జీయరు స్వామివారి సన్నిధిలో ఉంటూ సేవచేశారు. సుమారు 10 సం॥లు 6 నెలలు పాటు బదరికాశ్రమంలో ఉంటూ సాధువులకు తదీయారాధన సేవాకార్యక్రమంలో పాల్గొనేవారు. మిగిలిన 6 నెలలు శ్రీస్వామివారి ప్రచార కార్యక్రమంలో పాల్గొనేవారు. శ్రీమాన్ అంజయ్య భాద్రపద పౌర్ణమిరోజున బ్రహ్మ ముహూర్తమున ఆచార్యతిరువడి చేరటం వారికుండే ఆచార్యనిష్ఠకు నిదర్శనం.



కృష్ణాజిల్లా, విజయవాడ వాస్తవ్యురాలు **శ్రీమతి లావు కళావతి**గారు ది. **7.4.2011**న పరమపదం చేరినారు. వీరికి పరమాత్మ పదసన్నిధిలో శాశ్వత కైంకర్యం లభించాలని శ్రీస్వామివారు మంగళాశాసనము చేశారు.



కృష్ణాజిల్లా, జగ్గయ్యపేట వాస్తవ్యులు **శ్రీమాన్ బొల్లినేని వెంకట రమణ**గారు ది. **19.5.2011**న పరమపదం చేరినారు. వీరికి పరమాత్మ పద సన్నిధిలో శాశ్వత కైంకర్యం లభించాలని శ్రీస్వామివారు మంగళాశాసనము చేశారు.



గుంటూరు జిల్లా, లింగాయపాలెం వాస్తవ్యులు **శ్రీమతి పొన్నం నాగేంద్రమ్మ** గారు ది. **30.6.2011**న పరమపదం చేరినారు. వీరికి పరమాత్మ పదసన్నిధిలో శాశ్వత కైంకర్యం లభించా లని శ్రీస్వామివారు మంగళాశాసనము చేశారు.



కృష్ణా జిల్లా, విజయవాడ వాస్తవ్యులు **శ్రీమతి శ్రీకాకుళపు పుల్లమ్మ**గారు ది. **17.7.2011**న పరమ పదం చేరినారు. వీరికి పరమాత్మ పదసన్నిధిలో శాశ్వత కైంకర్యం లభించాలని శ్రీస్వామివారు మంగళాశాసనము చేశారు.



గుంటూరు వాస్తవ్యులు **శ్రీమాన్ తాడివాక వెంకట రామయ్య**గారు ది. **30.7.2011**న పరమపదం చేరినారు. వీరికి పరమాత్మ పదసన్నిధిలో శాశ్వత కైంకర్యం లభించాలని శ్రీస్వామివారు మంగళాశాసనము చేశారు.



తూర్పు గోదావరి జిల్లా, గొల్లల మామిడాడ వాస్తవ్యులు **శ్రీమాన్ రేజేటి శ్రీనివాసాచార్యులు** గారు ది. **1.8.2011**న పరమపదం చేరినారు. వీరికి పరమాత్మ పదసన్నిధిలో శాశ్వత కైంకర్యం లభించాలని శ్రీస్వామివారు మంగళాశాసనము చేశారు.



కరీంనగర్ జిల్లా, సిరిసిల్ల వాస్తవ్యులు, సుప్రసిద్ధ ద్రావిడవేద ప్రబంధ అధ్యాపకులు **శ్రీమాన్ తిరునగరి శ్రీమన్నారాయణస్వామి** గారు ది. **2.8.2011**న పరమపదం చేరినారు. వీరికి పరమాత్మ పదసన్నిధిలో శాశ్వత కైంకర్యం లభించాలని శ్రీస్వామివారు మంగళాశాసనము చేశారు.



తూర్పు గోదావరి జిల్లా, కాకినాడ వాస్తవ్యురాలు **శ్రీమతి గ్రంథి సూర్యకాంతమ్మ**గారు ది. **1.8.2011**న పరమపదం చేరినారు. వీరికి పరమాత్మ పదసన్నిధిలో శాశ్వత కైంకర్యం లభించాలని శ్రీస్వామివారు మంగళాశాసనము చేశారు.



కృష్ణా జిల్లా, విజయవాడ, ముత్యాలంపాడు వాస్తవ్యులు **శ్రీమాన్ ఉప్పలపాటి సూర్యనారాయణ రాజు**గారు ది. **22.8.2011**న పరమపదం చేరినారు. వీరికి పరమాత్మ పదసన్నిధిలో శాశ్వత కైంకర్యం లభించాలని శ్రీస్వామివారు మంగళాశాసనము చేశారు.



సూర్యాపేట వాస్తవ్యురాలు **శ్రీమతి ఈర్లపాటి అలువాల రంగనాయకమ్మ** గారు ది **15.4.2011**న పరమపదం చేరినారు. వీరికి పరమాత్మ పదసన్నిధిలో శాశ్వత కైంకర్యం లభించాలని శ్రీస్వామివారు మంగళాశాసనము చేశారు.



హైదరాబాద్ వాస్తవ్యురాలు **శ్రీమతి ఆండాళమ్మ** గారి సంవత్సరీకం సందర్భంగా వారి కుటుంబ సభ్యులు భక్తినివేదనకు కైంకర్యం సమర్పించారు.

# మెదడుకి మేత!

భగవద్బంధువులారా! జిజ్ఞాసతో మీరంతా చదువుతూ ఆదరిస్తున్న 'భక్తినివేదన'లో మీకోసం ఈ శీర్షిక! **ఈ పత్రిక లోని వ్యాసాలనుండే మీకు ప్రశ్నలిస్తున్నాం!** అయినా మరొక్కసారి జ్ఞాపకం చేసుకోవడం మనస్సుకి ఆనందమని మెదడుకీ చిన్నమేత! అన్నీ సరిగా వ్రాస్తే ఆకర్షణీయ బహుమతులు! ప్రతినెల 20వ తేదీలోపు మాకందిన సమాధానాలని మాత్రమే పరిశీలిస్తాం! ఆ పై దాటివచ్చినవి పరిశీలింపబడవు. దీనిపై ఎలాంటి ఉత్తర ప్రత్యుత్తరాలు ఉండవు. శ్రద్ధతో మీరు పంపిన అక్టోబరు నెల సమాధానాలందాయి. విజేతల పేర్లు క్రింద ప్రకటించాము. బహుమతులు పంపిస్తాం! అనివార్య కారణాలవలన నవంబరు నెలలో ఈ శీర్షికను ప్రచురించలేకపోయినాము.

| ప్రశ్నలు | సమాధానాలు |
|---|---|
| 1 ఓదనమంటే-------- | |
| 2 నిత్యనైమిత్తిక కామ్య కర్మలు త్యజించినా -------- గలవాడైతే అనర్హుడు కాడు. | |
| 3 పక్షుల ప్రేరణతో జానశ్రుతి ఆశ్రయించినది---- | |
| 4 ఇంద్రియాలు లోపలి తత్త్వాల్ని గుర్తించని కారణం------ | |
| 5 నిప్పునైనా మింగగలం కానీ---------కష్టతరం. | |
| 6 రఘువంశరాజుల కాలప్రబోధానికి ఆకర్షితుడైనాడు--- | |
| 7 స్వామిలోని ---- గుణం ----- అనే ప్రయాణ సాధనం. | |
| 8 అందరి ఇంద్రియాలకి అధిపతి---- | |
| 9 పూర్తములంటే---- | |
| 10 అర్చారూపంలో స్వామిఅనుగ్రహాన్ని పొందిన యామున శిష్యులు------- | |
| 11 కృష్ణుని వంశానికి పరిపాలన లేదని శపించినది---- | |
| 12 రికమెండేషన్ లెటర్‌తో ముక్తి విమానం ఎక్కినది---- | |
| 13 శమ్ శుడర్ అనగా---- | |
| 14 ఈసమయంలో పోగొట్టుకున్నది తిరిగి వచ్చేస్తుంది---- | |
| 15 ఊరకరాని మహానుభావుల రాక ---- కి సూచన. | |
| 16 మనలోని ఊటబావి-------. ఊరేవి ------- | |
| 17 యయాతి కథ పరనిందలానే----ఎంత ప్రమాదమోతెలుపుతోంది. | |
| 18 తజ్జలాన్ అనగా? | |
| 19 ------- దోషాలే. భగవంతునిలో ------- లేకపోతే? | |
| 20 కర్మలు ఉపాసనయ్యే చిట్కా--------- | |
| 21 విష్ణుచిత్తులు వాడిన బయోడిగ్రేడబుల్ సర్వింగ్ స్పూన్స్------ | |
| 22 గోదా ఆవిర్భవించిన వత్సరం---- | |
| 23 మనసుకి మాత్రమే ఉన్న అసాధారణత---- | |
| 24 లంకలో సీతమ్మకి ఊరట ఈమే ------- | |
| 25 అక్రూరుని జన్మసఫలమైన రోజు-----------. | |

**గత నెల విజేతలు:** శ్రీమతి మద్దుల సరసవల్లి తాయారు– పశ్చిమగోదావరి జిల్లా, ఏలూరు. శ్రీమతి కె. వెంకట శేషమ్మ–దొడ్డిపట్ల, పశ్చిమ గోదావరి, లక్ష్మీ సుప్రజ–చిలకలూరిపేట, గుంటూరు.

**సూచన:** సమాధానాలు ఈ పత్రంలోనే నింపి, 20వ తేదీలోపు అందేట్టు పంపగలరు.
భక్తినివేదన శ్రీరాంనగరం, ముచ్చింతల్, పాలమాకుల పోస్ట్ 509 325 శంషాబాద్, రంగారెడ్డి జిల్లా. ఆంధ్రప్రదేశ్.